


# అయ్యంకి వేంకటరమణయ్యగారి
# సన్మాన సంచిక



డాక్టర్ సర్ కట్టమంచి రామలింగారెడ్డి

కె. టి. ఎం. ఏ., (కేంటబ్) డి. లిట్., ఎం. ఎల్ సి. గారిచే

**13-12-42** తేదీన గుంటూరునందు

ఆంధ్రదేశ గ్రంథాలయ సేవక చతుర్థ మహాసభయందు సమర్పింపబడినది.

వ్యాసములు - సందేశములు గల 700 పుటల సంపూర్ణగ్రంథముయొక్క విలువ రు. 20 లు

**సరస్వతీ సామ్రాజ్యమ్, దివ్యజ్ఞాన సమాజ భవనములు,**

**విజయవాడ - 2.**

# అయ్యంకి వేంకటరమణయ్యగారి
# సన్మానసంచిక

---

## సంపాదకీయవర్గము

సంపాదకులు:

మామిడిపూడి వేంకటరంగయ్య, ఎం. ఏ.,
ప్రొఫెసరు, ఆంధ్ర విశ్వ విద్యాలయము

సహాయసంపాదకులు

మల్లంపల్లి సోమశేఖరశర్మ,
పండితులు, ఆంధ్ర విశ్వ విద్యాలయము

బెల్లంకొండ రాఘవరావు



కార్యదర్శులు:

పి. కొండారెడ్డి, డిప్. లైబ్రరీ.
సహాయ గ్రంథ భాండాగారి, ఆంధ్ర విశ్వ విద్యాలయము, కార్యదర్శి, విశాఖపట్టణ గ్రంథాలయ

మండలపర్తి ఉపేంద్రశర్మ, ఎం. ఏ.,
లెక్చరర్, హిందూకాలేజి, అధ్యక్షులు, గుంటూరు తా॥ గ్రంథాలయ సంఘము

ప్రకాశకులు:

పేకుమళ్ల రామచంద్రరావు, ఎం. ఏ., బి. యల్.,
కార్యదర్శి ఆంధ్రమహాసభ; కార్యదర్శి ఆంధ్రదేశ గ్రంథాలయ సేవక సంఘము

సరస్వతీ సామ్రాజ్యము, దివ్యజ్ఞాన సమాజ భవనములు, విజయవా

# సరస్వతీ సామ్రాజ్యమ్

## శ్రీ అయ్యంకి వేంకటరమణయ్యగారి

## సన్మానసంచిక

ఆంధ్ర విశ్వవిద్యాలయ ప్రోఛాన్సలరు, జయపురం మహారాజ

శ్రీ విక్రమదేవవర్మగారు

ప్రారంభకులుగ

ఆంధ్రభోజులు

శ్రీ బెజవాడ రామచంద్రారెడ్డిగారి

అధ్యక్షత క్రింద

1942 సం॥ డిశంబరు నెల 13 వ తేదీన గుంటూరు పట్టణమున జరిగిన

**ఆంధ్రదేశ గ్రంథాలయ సేవక మహాసభయందు**

ఆంధ్ర విశ్వవిద్యాలయ వైస్ ఛాన్సలరు

సర్ డాక్టరు కట్టమంచి రామలింగారెడ్డి

కె. టి. ఎం. ఏ., (కేంటబ్) డి. లిట్., ఎం. ఎల్.సి గారిచే

సమర్పింపబడినది.

# శ్రీ అయ్యంకి వేంకటరమణయ్యగారి సన్మాన సంచిక

## విషయసూచిక


ఉపోద్ఘాతము : మామిడిపూడి వేంకటరంగయ్యగారు ఎం. ఏ.
జీవిత చరిత్ర : శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారు ఎం. ఏ., ఎల్. ఎల్. బి.,
నాల్గవ ఆంధ్రదేశ గ్రంథాలయ సేవక మహాసభ
ఉ ప క్ర మ ము
ఊ రే గి ౦ పు
జెండా ప్రతిష్ఠాపన : శ్రీ ఉయ్యూరు కుమారరాజాగారు
ప్రదర్శనము : శ్రీమతి బొడ్డపాటి శీతాబాయమ్మగారు
ఆహ్వాన సంఘాధ్యక్షుల ఉపన్యాసము : రావుబహద్దరు తెల్లాకుల జాలయ్య శ్రేష్ఠిగారు
సభా ప్రారంభోపన్యాసము : శ్రీ శ్రీ శ్రీ విక్రమదేవవర్మగారు
అధ్యక్షోపన్యాసము : శ్రీ బెజవాడ రామచంద్రారెడ్డిగారు
సందేశములు చదువుట : శ్రీ పి. కొండారెడ్డిగారు
సన్మాన సంచికల ప్రదానము : శ్రీ డాక్టరు కట్టమంచి రామలింగారెడ్డిగారు

ఇతర ఉపన్యాసములు :

మారేపల్లి రామచంద్రశాస్త్రిగారు
బొడ్డపాటి శీతాబాయమ్మగారు
బొడ్డుపల్లి బాలాత్రిపుర సుందరమ్మగారు
చెరుకువాడ వెంకటనరసింహంగారు
ఈదర వెంకట్రావుగారు
యస్. బి. సచ్చిదానందంగారు
ఏ. యస్. ముద్దుకృష్ణయ్యగారు
పుచ్చా వెంకట్రామయ్యగారు
చెన్నుభొట్ల భానుమూర్తిగారు
మామిడిపూడి వేంకటరంగయ్యగారు

అయ్యంకి వేంకటరమణయ్యగారి ప్రత్యుత్తరము
రెండవదిన కార్యక్రమము
వినోదములు
సందేశములు
సందేశముల విషయసూచిక
వ్యాసముల విషయసూచిక




# శ్రీ అయ్యంకి వేంకట రమణయ్య సన్మాన సంచిక

## ఉపోద్ఘాతము

నవభారత నిర్మాణమునకు జరుగు ప్రయత్నములలో గ్రంథాలయోద్యమమును, వయోజన విద్యాప్రచారమును ప్రధానస్థానము నాక్రమించుచున్నవి. నూటికి తొంబదిమంది నిరక్షరాస్యులుగా నున్న మనదేశములో అక్షరాస్యత విస్తరించిన దేశములలోవలె గ్రంథాలయములకు సమాన ప్రాముఖ్యము లభించదనుమాట వాస్తవమే. కాని ఈ పరిస్థితి తాత్కాలికముగనే నిలిచి యుండ గలదని మనము ఆశించుచున్నాము. అక్షరాస్యత క్రమక్రమముగా మనదేశమందును విస్త రింపక తప్పదు. తత్ఫలితముగా గ్రంథాలయముల ప్రయోజనమును విస్తరింపక తప్పదు. అంతియే కాదు. ప్రస్తుత స్థితియందును అక్షరాస్యులగువారు తిరిగి నిరక్షరకుక్షులు కాకుండ నివారించగలిగినవి గ్రంథాలయములే.

వయోజన విద్యాప్రచారమునకును, గ్రంథాలయోద్యమమునకును అవినాభావ సంబంధము కలదు. బాలురయందుకన్న వయోజనులయందు నూతన విజ్ఞానమును, నూతన భావములను విస్తరింప జేయుట సులభసాధ్యమని అనుభవ పూర్వకముగా వ్యక్తమగుచున్నది. దాని ఫలితము గూడ సద్యోలబ్ధమనియు, సుస్థిరమనియు తేలుచున్నది. ఈ రెండు ఉద్యమముల ప్రయో జనమును గ్రహింపబడుటచే కొలది కాలమునుండి మన దేశమున వివిధ ప్రాంతములలో గ్రంథాలయములును, వయోజన విద్యాసంస్థలును, విరివిగా ప్రతిష్ఠింపబడుచున్నవి.

ఈ ఉభయ కార్యరంగములందును ఆంధ్రదేశము మార్గదర్శకముగా కృషి సాగించు చున్నది. వీనిని నడపదగిన మూలవిధానములగూడ ఆంధ్రదేశమే సూచించినది. ఈ యుద్యమములను ఆంధ్రదేశమున విస్తరింపజేయుటకు కంకణము గట్టుకొన్న వారిలో శ్రీ అయ్యంకి వేంకట రమణయ్యగారు ప్రముఖులు - వారి గౌరవార్థమై ఈ సన్మాన సంచిక ప్రచురింపబడుట ముదావహము - వారుకావించిన, కావించుచున్న కృషికి గర్వించని ఆంధ్రుడు ఉండడని చెప్పవచ్చును.

గత మూడుదశాబ్దములనుండి వారు ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమముతో సన్నిహిత సంబంధ మును నెలకొల్పికొని యున్నారు. ప్రధానముగా వారి కృషివల్లనే ఆంధ్రదేశ గ్రంథా లయ సంఘము 1914 లో స్థాపింపబడినది. ఆంధ్రదేశ గ్రంథాలయసంఘ పక్షమున వెలువడు

గ్రంథాలయ సర్వస్వమునకును, అఖిలభారత గ్రంథాలయసంఘపక్షమున వెలువడు "ఇండియన్ లైబ్రరీ జర్నలు"కును వారు సంపాదకులుగను, ప్రచురణకర్తలుగను చేయుచున్న కృషి జగమెఱిగినదే- "గ్రంథాలయ యాత్రాదళము"లను నడపి గ్రంథాలయోద్యమ ప్రచారమునకు నవ్య విధానములను కల్పించిన కీర్తి వీరికే దక్కినది. ఈ యాత్రాదళములకును, మనకు సాంప్రదాయకములైన "రామదండు దళముల"కును విశేష సామ్యముకలదు. ప్రస్తుత పరిస్థితులకు విహితముగా రామదండుదళములకు చేకూర్చబడిన నవ్యరూప కల్పనమే గ్రంథాలయ యాత్రాదళములు.

సౌష్ఠవమైన గ్రంథాలయ శాసన నిర్మాణమునకు ప్రభుత్వదృష్టిని మరల్చుటయందును అందుకు ప్రోద్బలముగా ప్రజాభిప్రాయమును కూడగట్టుటయందును వారు తీవ్రకృషి గావించిరి. గ్రంథాలయ విద్యాప్రచారమునకై వారు వేసవి పాఠశాలలనునెలకొల్పి పెక్కురకు గ్రంథాలయ విద్యను, సమగ్రశిక్షణను సమకూర్చిరి. వయోజన విద్యాప్రచారమునందును వారికృషి సమానముగా ప్రశంసకు తగియున్నది.

వారు బహుకార్యనిమగ్నులనియు, వివిధాభిరుచులు గలవారనియు వేరుగ చెప్పనక్కరలేదు. బాల భటోద్యమమందును, ప్రకృతివిద్యాప్రచారమునందును, దివ్యజ్ఞానప్రచారము నందును వారు చేసిన, చేయుచున్న కృషియే అందుకు ప్రత్యక్ష ప్రమాణము.

ఆంధ్రదేశ గ్రంథాలయ సేవక సంఘ పక్షమున ప్రచురింపబడుచున్న ఈ సన్మానసంచిక వారి యెడల ప్రజానీకమునకుగల అత్యధిక గౌరవ ప్రపత్తులకు ఒక వినయపూర్వక చిహ్నముగా గ్రహింపవచ్చును. మన దేశమున వేర్వేరు జీవిత పథములకు చెందిన ప్రజ్ఞానిధులు ఈ సంపుటమునకు తమ అమూల్య రచనలను సంతోషపూర్వకముగ పంపుటయు, శుభసందేశముల నందించుటయు, శ్రీ వేంకట రమణయ్యపంతులుగారి యెడల దేశమునందు గల సర్వతోముఖ గౌరవ సౌహార్దములను వేనోళ్ల చాటుచున్నది. రచయితల హృదయపూర్వక సహకారమునకు సంపాదక సంఘ పక్షమున నా కృతజ్ఞతాభివందనముల నర్పించుచున్నాను.

ఆంధ్ర విశ్వవిద్యాలయము,<br>గుంటూరు, 15-10-1943.

మామిడిపూడి వేంకట రంగయ్య, (యం. ఏ.)

గ్రంథాలయ శాస్త్ర విశారద, గ్రంథాలయ పితామహ

# అయ్యంకి వేంకటరమణయ్యగారి జీవితము

(శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారు, ఎం. ఏ., ఎల్. ఎల్. బి.)

## ఆదర్శ జీవి

" ద్యుమణి పద్మాకరము వికచముగఁజేయు
గుముద హర్షంబుఁ గావించు నమృత సూతి
అర్థితుఁడు గాక జలమిచ్చు నంబుధరుడు
సజ్జనులు దారె పరహితాచరణమతులు "

"దేవతయై పుట్టుటకంటె మనుష్యుడై పుట్టుట మేలు" భాగవతమున శుకు డిట్లు వాకొనెను. ఇది గంభీరార్థసంభరితమైన వాక్యము. నిష్కామకర్మను నిర్వహించియు, ఈశ్వరుని యెడలను, ఈశ్వర సృష్టియెడలను నిస్స్వార్థప్రీతిని జూపియు సమ్యక్ దృష్టిని అలవఱచుకొని, సమ్యక్ జ్ఞానము నంది సమాహిత చిత్తమును పడసియు పూతభావసందీపితజీవితమును గడపి ముక్తిని ముంజేతికంకణ మొనరించుకొను భాగ్యము మానవునకు కలదు. మనుజుడై, సాధకుడై ఆత్మజీవనమును నవనవాటిక గావించుకొని మోక్షము నందును.

మనుష్యజీవితము స్వతస్సిద్ధముగ మహిమోపేతమైనదని జిజ్ఞాసువు తొలుత గుర్తింపవలెను. ఆత్మజ్ఞానమువలన ఆత్మవిశ్వాసము చేకూరును. మానవునిచే ముందంజవేయించుశక్తి వీనికి కలదు. కాని మనుష్యుని జీవితక్షేత్రము కురుక్షేత్రము. ఈశ్వరకటాక్షము నంది దీని నాతడు ధర్మక్షేత్రము చేసికొనవలెను. ఇట్లొనరింప నిశ్చయించుకొనువారే సాధకులు. నాలుగు ఆశ్రమములలోనివారు సాధకులు కావచ్చును తమ తమ శక్తులను గుర్తించి, నైసర్గిక ప్రతిభకు అనుకూలమైన కర్తవ్యమును మోహరహితబుద్ధితో, కౌశలముతో ఆత్మార్పితబుద్ధితో యీశ్వరార్పిత చిత్తముతో సాధన మార్గమున ముందంజవేయుచు, దైనందిన జీవితమున ఆనందానుభూతి నందుచు కాల క్రమమున వారు ముక్తిని ముంజేతికంకణ మొనరించుకొనజాలుదురు. వీరు మహాభక్తులు కావచ్చును; జ్ఞానులు కావచ్చును; కర్మవీరులు కావచ్చును; త్రిగుణాతీతులు కావచ్చును; జితేంద్రియులు కావచ్చును; యోగారూఢులు కావచ్చును; స్థితప్రజ్ఞనందిన మహనీయులు కావచ్చును; జీవన్ముక్తినందినవారే కావచ్చును – వీరిలో వ్యత్యాసములు లేవు. సామాన్యులట్లు గోచరించువారియందుసయితము సంయమీంద్రులకు దీసిపోని మహాత్ములున్నారు. వీరు కావిశాటు వులు కట్టనక్కరలేదు. నేరిమితో నిష్కామకర్తవ్యమును నెఱపువారు కర్మవీరులు. వీరి కర్తవ్యము యోగ మనబరగును. యజ్ఞమని దీనిని పేర్కొనజెల్లును.

ప్రపంచ చరిత్రలను పరిశీలించినపుడు ధీరోదాత్తులైన యిట్టి కర్మవీరుల జీవితోదంతము లగపడును. తమ తమ దేశములందలి అక్కరనూహించి, తోడిజీవుల సర్వతోముఖాభివృద్ధికై వీరు కృషి సలుపుచుందురు. ఆంధ్రసీమయందు నిట్టి కర్మవీరులు కొందరున్నారు. అట్టివారిలో శ్రీ అయ్యంకి వేంకట రమణయ్యపంతులుగారొకరు.

## గ్రంథాలయోద్యమావతరణము

ఆంధ్రదేశమునందలి పల్లీ పత్తనములలో విజ్ఞానబీజములను వెదజల్లి జాతీయ చైతన్యమును, జాగృతిని ప్రప్రథమముగ వ్యాప్తిగావించినది ఆంధ్ర గ్రంథాలయోద్యమము. ఆ యుద్యమమునకు తొలుదొలుతగ బీజావాపన గావించి తెలుగునేల నలుమూలలకే గాక యావద్భారతమునకు విస్తరింపజేసిన ప్రజాహితైకజీవి శ్రీ అయ్యంకి వేంకట రమణయ్యపంతులుగారు. శ్రీవారి నిరంతర కార్యదీక్షాఫలితముగ విస్తరిల్లిన బహుళ గ్రంథాలయసంస్థలే, అనంతముగ వర్ధిల్లిన ఆంధ్రోద్యమమునకును, మహాత్ముని అసహాయోద్యమమునకును సమర్పితులైన పెక్కురు సేవావ్రతులకును, త్యాగమూర్తులకును పూర్వ శిక్షణకేంద్రములై పరిఢవిల్లినవి.

తూర్పు గోదావరిజిల్లా రామచంద్రపురం తాలూకా కొంకుదురు గ్రామమున 1889 సంవత్సరమున వీరు జననమందిరి. వయస్సు వచ్చినకొలది సముచిత విద్యాభ్యాసము జేయుచుండిరి. తోడ్తోడనే దేశమందలి రాజకీయ, సాంఘిక, వైజ్ఞానిక మహోద్యమములపై మనసు నిలుపుచుండిరి.

## తొలివెలుగులు

ఈ శతాబ్దారంభమున భారతీయ యువకుల హృదయమున అపూర్వ చైతన్యలహరి ప్రవహించెను. కర్జన్ ప్రభువు కాలమున బ్రిటిష్‌సింహము భయంకరముగ గర్జించెను. వంగసీమ హృదయమును చీల్చుటకై ఆతడు సమకట్టెను. ఈ యత్నము భారతీయుల హృదయమున అపూర్వ సంచలనమును బుట్టించెను. దేశమందలి వక్తలును, రచయితలును, త్యాగులును నూతన జీవితసందేశము లొసగుచు యువకులకు జ్ఞానభిక్ష బెట్టిరి. తమ తమ మణికట్టులకు దీక్షాసూత్రములను కట్టుకొని యువకులు యజ్ఞవాటికయందు బ్రవేశించిరి. దేశమాతసేవకై సర్వశక్తులను వినియోగింప వీరు కృతనిశ్చయులైరి. విద్యార్థులు తమ చదువులకు స్వస్తిచెప్పి దాస్య శృంఖలములను తెంపివైచి, దేశమాతకు నిష్కృతిని ప్రసాదించుటకై ముందంజవేసిరి. అట్టి వీరులలో మన వేంకట రమణయ్యగారొకరు.

లాల్ – బాల్ – పాల్ (లాలా లజపతిరాయి, బాలగంగాధర తిలకు, బిపినచంద్రపాల్) మహాశయుల గంభీరభాషణములకు వీనులొగ్గియు, అరవింద ప్రభృతుల రచనలందలి భావబ్రహ్మాండముల నవలోకించియు, వీరపూజ తమ నైసర్గికగుణమగుటచే శ్రీ వేంకటరమణయ్యగారు భారతవీరుల సముజ్జ్వల జీవితములను మేలుబంతులొనరించుకొని, భాస్వదాశయజ్యోతిర్లీలకు జేజేలు పాడనారంభించిరి.

ఆకాలమున బందరునగరము వీరి యుదారాశయములకు నాటపందిరియాయెను. ఇంచుమించుగ రాజమహేంద్రవరమునకు ఆంధ్రవసుంధరలో సజీవియైన విజ్ఞానకేంద్రము మచిలీపట్టణము. శ్రీ రఘుపతి వేంకటరత్నం నాయుడుగారు అచట ఆచార్యులై యుండెను. వేంకటరత్నం నాయుడు విజ్ఞానఖని; నిర్మల చరిత్రుడు, పరార్థజీవి, మహావక్త. ఆయన యంతేవాసులును సన్నిహితులును మహాపురుషులైరి. భోగరాజు పట్టాభిసీతారామయ్యగారు, ముట్నూరి కృష్ణారావుగారు, కోపల్లె హనుమంతరావుగారు, వల్లూరి సూర్యనారాయణ ప్రభృతులు తమ దివిటీలను రఘుపతి గుండెలోని ప్రదీపముచెంగట నిలిచియే వెలిగించుకొనిరి. శ్రీ వేంకట రమణయ్యగారు ఉదారాశయములకై తమ హృదయ కవాటమును తెఱచుకొని, జ్యోతిర్మయమైన పూర్వోక్త సన్నివేశమున నారాధకుడై గోచరించినపుడు ఆ లోకపూరము అవిరతముగ నంతరంగమున ప్రవేశించి, అందలి భావరాజీవములను ప్రఫుల్లమొనరించెను. 1909 లో "ఆంధ్ర భారతి"యను మాసపత్రికను బందరులో వారు ప్రచురింప దొడంగిరి. పద్మాకరముపై మక్కువకో ్రాలు రాయంచలవలె జిజ్ఞాసువుల చిత్తములు భావప్రభాకలిత సాహితీసుమములపై ్రాలుచుగదా! వారపత్రికలును, మాసపత్రికలును గుప్పున నారిపోవు దీపపుంజములు కావు; వానియందలిది మతాబా వెలుగే కాదు. సాహితీవ్రతమండపమున చేరజాలు ప్రదీపకళిక లందు మహితభావతైలము నాస్వాదించుచు తేజరిల్లుచుండును. "ఆంధ్ర భారతీ" మందిరమున పరిఢవిల్లిన తెలుగు వెలుగులు వాఙ్మయవీథులందు నూతనయత్నములకు తేజస్సు ప్రసాదించినవి.

## సాధనా ప్రారంభము

పత్రికామందిరమునుండి శ్రీ వేంకట రమణయ్యగారి యూహలు గ్రంథాలయములోనికి ప్రసరించినవి. గ్రంథాలయము వారికి దేవాలయ మాయెను. ప్రధానముగ తమ జీవితాశయము లందు ప్రస్ఫుటించవలెనని వారు నిశ్చయించుకొనిరి. గ్రంథాలయోద్యమ స్యందనమున సారథులై వారధివసించిరి. సర్వశక్తులను వినియోగించి తమ చేతుపై వారు గెలుపు సిడెము నెత్తిరి.

1911 సం. న శ్రీ వేంకట రమణయ్యగారు బెజవాడ పట్టణమును కేంద్ర మొనరించుకొని క్రొన యూపిరితో యున్న శ్రీ రామమోహన గ్రంథాలయమును చేపట్టి కార్యదర్శియైరి. పదునేను సంవత్సరము లాపదవి నలంకరించి ఆ సంస్థకు ఘనతరమైన భావశబలతను చేకూర్చిరి. వారి కృషి ఫలితముగ నీ సంస్థకును అందలి స్త్రీ శాఖకును ప్రత్యేక భవనముల నిర్మాణములు కలిగినవి. వారు చేసిన ప్రారంభమే క్రమాభివృద్ధినొంది నేడు రామమోహన గ్రంథాలయము ఆంధ్ర ధాత్రిలోని అగ్రశేణి గ్రంథాలయమై విలసిల్లినది.

## సాధనా విస్తృతి

ప్రపంచ మందలి మహోన్నత గ్రంథాలయముల చరిత్రలను పరిశీలించి, భారతావనిలోని యన్యరాష్ట్రములందు ప్రధానముగ శాయాజీ ప్రభువు బరోడా సంస్థానమున విస్తృత మొనరించిన

ఉద్యమ ప్రాంగణమున కాలుంచి బహుళ వైజ్ఞాని కాంశములను హృదయంగమ మొనరించు కొని, స్వరాష్ట్రమందు విశేషకృషి సల్పిరి. నాడాది వీరి పూనికయందు క్రొత్త పూవులు శోభిల్లినవి. 1914 సం॥లో ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమమును ప్రారంభించి, ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘమును స్థాపించి, దానికి ఇరువది యైదు సంవత్సరములు కార్యదర్శిగ పనిజేసి – ఆ యుద్యమమును మహోన్నత దశకు తేగలిగిరి. వీరు నెలకొలిపిన ఆంధ్ర గ్రంథాలయసంఘము నవనవోన్మేషమై వెలసినది. వీరి గ్రంథాలయోద్యమము తెలుగు యెల్లలను దాటినది.

1919 సంవత్సరమున ప్రథమ అఖిల భారత గ్రంథాలయ మహాసభను మద్రాసునందు సమావేశపరచి, అఖిల భారత గ్రంథాలయ సంఘమును స్థాపించి, ఆ సంఘమునకు కార్యదర్శిగ పదునైదు సంవత్సరములు పనిజేసి, యావద్భారతవర్షమునను సార్వజనిక గ్రంథాలయోద్యమమందు ఆసక్తిని ప్రకోపింపజేసిరి. ఆ కాలముననే అఖిల భారత గ్రామ గ్రంథాలయ మహాసభనుకూడ సమావేశపరచి, దేశాభ్యుదయమునకు గ్రామసేవ మూలకందమను సూత్రమును నిర్వచించిరి. దక్షిణ భారత గ్రంథాలయ మహాసభలను సమావేశపరచి, దక్షిణ భారత గ్రంథాలయోద్యమమును గూడ ప్రారంభించిరి.

గ్రంథాలయోద్యమమందు పురాణములు – హరికథలు – జంగమకథలు – బుర్రకథలు – తోలు బొమ్మలు – మొదలగు ప్రాచీన సాంప్రదాయ సంస్థలను పునరుద్ధరించుటయే గాక గ్రంథాలయోద్యమ వ్యాప్తికై వారు కొన్ని క్రొత్తపద్ధతులను గనిపెట్టిరి. గ్రంథాలయ యాత్రలను క్రొత్త సాంప్రదాయమును లేవనెత్తి ఈ యుద్యమమందొక నూతన చైతన్యమును గలుగజేసిరి. భజనపార్టీలు – నావలలోను బండ్లలోను గ్రంథాలయముల నేర్పరచి గ్రంథసేవజేయుట-మొదలగు పద్ధతులు వారి స్వకపోల కల్పితము లేను. గ్రంథాలయ శిక్షణ తరగతుల నేర్పరచి శాస్త్రీయ పరిజ్ఞానమును గ్రంథాలయ సేవకుల కందజేసిరి. గ్రంథాలయములకు ప్రభుత్వ గ్రాంటుల నేర్పాటుజేయుట వారి కృషి ఫలితమే.

ఆ కాలమున తలయెత్తిన అద్భుతచైతన్యము బహుళ వైజ్ఞానికోద్యమములకు జనయిత్రి యాయెను. ఆంధ్రోద్యమ, అసహాయోద్యమ యజ్ఞవాటికలందు దీక్షావస్త్రములు ధరించిన ఉపాసకులకు నూతన ధృతిని ప్రసాదించినది పూర్వోక్త మహోద్యమమే.

### ప త్రి కా ప్ర చు ర ణ ము

శ్రీ పంతులుగారిచే ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమ వ్యాప్తికి 1914 సం॥లో సృజింపబడిన "గ్రంథాలయ సర్వస్వ" మను పత్రిక, అఖిల భారత గ్రంథాలయోద్యమ వ్యాప్తికి 1920 సం॥లో సృష్టియైన "ఇండియన్ లైబ్రరీ జర్నలు"ను వీరివిఖ్యాతిని దశదిశలందును విస్తరింపజేసినవి.

### ఆ ధ్యా త్మి క వి క స న ము

శ్రీ వేంకటరమణయ్యగారి జీవితమునకు మఱింత ప్రభావమును చేకూర్చినది డాక్టరు ఆనిబెసెంటు గారి మహోజ్వల దృష్టాంతము. ప్రపంచ మహావ్యక్తులలో మహావక్తలలో ఆ విదుషీమణి యొక

స్తుక. భారతీయ సాంస్కృతిక పీయూషమును గ్రోలి భారతాంబ నామాక్షరములను పురశ్చరణ మొనరించుచు ఆమె 1893 సం॥న మనదేశమున ప్రవేశించెను. దైహిక మానసిక నైతిక ఆధ్యాత్మిక శక్తులు వృద్ధియైనపుడే మనుష్యత్వము చరితార్థత నందునని ప్లేటోమహాశయుడు తెలిపిన మహావాక్కులను మహామంత్ర మొనరించుకొని, మానవసేవను జపమాల కావించుకొనిన సీమంతినీ చూడామణి డాక్టరు ఆనిబెసెంటు. ఆమె యనుచరులలో శ్రీ వేంకటరమణయ్యగా రొకరైరి. ఆమె ననుసరించి బాలభటోద్యమమున అనల్పమైన కృషిసలిపిరి. 1919 సంవత్సరమున ఆని బెసెంటుసతి అఖిలభారత బాలభటోద్యమమును ప్రారంభించినపుడే శ్రీ పంతులుగారు దానికి తమ భుజము నొడ్డిరి. ఆంధ్రదేశము నంతకును బాలభటసేవా సేనానాయకులైరి. ఉద్యమ నిర్వహణమున కొత్తదారులు త్రొక్కి భారతవర్షము నంతకును మార్గదర్శకులైరి. ప్రపంచమున కంతకును ఈ యుద్యమమున ప్రధాననాయకులైన సర్ రాబర్టు బెడెన్ పవెల్ గారిచే స్వయముగ పతకము నొకదానిని బహుమతిగా బడసి ప్రశస్తినందిరి.

## కార్య దీక్ష

బాలభటోద్యమమున సంజ్ఞల మూలమున దూరప్రదేశములకు వార్తలుపంపు (Signalling) విధానమందు ఆంగ్లేయ భాషనేగాక తెలుగుభాషనుగూడ ఉపయోగించు పధకము నేర్పరచిరి. కవాతు ఆజ్ఞలను ఆంగ్లేయ భాషకుబదులు హిందీభాషను ఉపయోగించి మార్గదర్శకులైరి. చివరకు దుస్తులందుగూడ మన క్షత్రియులు వెనుకకు పంచె విరిచికట్టు పద్ధతిని ఒక బాలభట పటాలమును తయారుచేసి, భటోద్యమమందు ప్రపంచ నాయకులగు సర్ రాబర్టు బేడెను పవెలుగారికి స్వయముగా అందుగల విశిష్టతనుజూపి వారి మన్ననలను బడసిరి.

ప్రపంచ ప్రఖ్యాతిని బడసి సర్వమానవ సోదరత్వ సిద్ధికై కృషి సలుపుచున్న దివ్యజ్ఞాన సమాజము శ్రీ పంతులుగారి దృష్టి నాకర్షించి, అందు 1918 సం॥న సభ్యులుగా జేరి. ఆ నాడే వీరి జీవితమున మఱియొక అద్భుత ఘట్టము గోచరించినది. స్రవంతులన్నియు సముద్రమున గలియునట్లు, సమస్త ధార్మిక సూత్రములును సారస్వత సిద్ధాంతములును ఈ సమాజ సృష్టి యందు జేరినవి. ఆంధ్రదేశమున ఈ యుద్యమ నాయకులలో నొకరై, శ్రీ పంతులుగారు 1930 సం॥నుండి సమాజ ప్రచార కార్యదర్శిగా కృషిసలుప నారంభించిరి. "దివ్యజ్ఞాన దీపిక"యను పత్రికను పెక్కు సంవత్సరములు నిర్వహించిరి. దివ్యజ్ఞాన గ్రంథములు చిన్నవి పెద్దవి కలిపి 40 దింటినేగాక, పెక్కు కరపత్రములను గూడ ప్రకటించిరి. బహుళాబ్దములు బెజవాడ దివ్యజ్ఞాన సమాజమునకు అధ్యక్షులుగ నుండిరి. దివ్యజ్ఞాన వ్యాప్తికై పల్లెలందును పట్టణములందును ప్రచార ప్రబోధములు కావింపసాగిరి.

ప్రకృతి ధర్మ ప్రవృత్తి వలన సాత్వికాహారావలంబనము వలన- సముచిత జీవన నిర్వహణము ధర్మ ప్రవృత్తియు సుసాధ్యమని యెఱిగి, ప్రకృతి చికిత్సను ప్రజలందు వెలయింప ప్రకృతి శిబిరములను నడపి, ప్రకృతి ధర్మపరిషత్తును స్థాపించిరి. 1933 సం॥నుండి ప్రకృతి కార్యాలయ ట్రస్టునకు కార్యదర్శిగానుండి, అఖిలభారత ప్రకృతి ధర్మప్రచార సంఘమునకు సహాయకులుగానుండి,

ప్రకృతి పత్రికను - ఇండియన్ నేచరోపతిక్ జర్నలును ప్రచురించిరి; ఆ చికిత్సా విధానమునందు విశేష పరిశోధనలను జేయుచు ప్రకృతి ధర్మ ప్రచారమును జేయుచున్నారు.

ఆంధ్ర సహకార సమ్మేళన కార్యనిర్వహణమునందును శ్రీ పంతులుగారి చేయికలదు. కొంతకాలము "సహకార" పత్రికను నడపిరి. విజయవాడలో గాంధి కో-ఆపరేటివు అర్బన్ బ్యాంకును స్థాపించి దానికి పదేండ్లు అధ్యక్షులుగా నుండి, దానికి విశేష పురోభివృద్ధిని చేకూర్చిరి. కలవారు లేనివారను భేదములేకుండ ఎల్లరకు సహకారోద్యమ మెట్లు తోడ్పడునో క్రియారూపమున వీరు విదిత మొనరించిరి.

ఏ యుద్యమమును చేపట్టినను దానిని యథాతథముగ పోనీయక దాని అభివృద్ధికై నూతన పరిశోధనలను చేయుటయందు, మెరుగులు దిద్దుటయందు, నూతన దృక్పథమును వెలయించుటయందు శ్రీ వేంకటరమణయ్యగారు నిపుణత్వమును జూపిరి.

అర్థార్థులెందరు వారి గుప్తదానములను స్వీకరించి కృతార్థులైరో లెక్కింపజాలము. ఆ నాడు వారి యండను వర్థిల్లిన గండుగోయిల లెన్నియో తెనుగుతోటలను తమ తేనెపాటలలో ముంచితేల్చుట జగమెరిగిన విషయము.

## జీవిత పరమార్థము - సందేశము

ప్రప్రథమమునుండియు శ్రీ వేంకటరమణయ్యగారి భావనాజగత్తు నావేశించి వారిని నిరంతర కార్యదీక్షకు బురికొల్పినది గ్రంథాలయోద్యమమే. సర్వతోముఖముగను సార్వజనీనముగను సరస్వతీ వైభవమును విస్తరింప జేయుటయే ఆ యుద్యమమున కేకైక లక్ష్యము. విశ్వోద్గతికిని, విశ్వస్థితికిని, విశ్వకల్యాణమునకును మూలకందమైనది సరస్వతీ వైభవమే. శబ్దబ్రహ్మమని ప్రాచ్య సంస్కృతియందును. "లోగస్" అని ప్రతీచీ సంస్కృతియందును పేర్కొనబడు మహాశక్తియే సరస్వతి. సరస్వతీ దేవతానుగ్రహమునకు పాత్రముకాని మానవ సమాజము చతుర్విధపురుషార్థ సాధనయందు కృతకృత్యము కానేరదు.

సరస్వతీ వైభవము మనకు విశ్వవాఙ్మయ స్వరూపమున సాక్షాత్కరించుచున్నది. సరస్వతీదేవ్యాలయమగు గ్రంథభాండాగారమును యథాధికారముగ వినియోగించుకొని కృతార్థులగుటకు న్యూనాధిక భేదము లేకుండ సర్వజనులకు సావకాశ ముండవలెను; అనగా గ్రంథభాండాగారములు సార్వజనిక సేవ్యములు కావలెను.

ఈ మహాప్రయోజనమును శ్రీ వేంకట రమణయ్యగారు తమ యచంచలకృషిచేత సాధించినటు నిర్వివాదాంశము శివ జటాజూటమునుండి దివ్యగంగను భూతలమునకు దింపి యెల్లరకు నందుబాటులోనికి తెచ్చిన భగీరథునివలె ఆయన సహస్రాధికగ్రంథభాండాగార ప్రతిష్ఠాపనకు హేతుభూతులై ఆధునికయుగమున "సరస్వతీసామ్రాజ్య ప్రతిష్ఠాపనాచార్య" బిరుదమునకు సర్వవిధముల నర్హతను సంపాదించుకొనిరి.

---

# ఆంధ్రదేశ గ్రంథాలయ సేవక సంఘ చతుర్థ సమావేశము

## గుంటూరు, 13 - 14 డిశంబరు 1942.



ప్రతినిధులలో కొందరు:

కుర్చీలమీదివారు :— 1. పి. కొండారెడ్డి [ప్రధాన కార్యదర్శి], 2. శ్రీ రాజా వాసిరెడ్డి హరిహరప్రసాదుబహద్దరు [చింతపల్లిరాజా], 3. తలిశెట్టి రామారావు [జయపూరుదివాను], 4. గాడిచెర్ల హరిసర్వోత్తమరావు [ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘాధ్యక్షులు], 5. తెల్లాకుల జాలయ్యశ్రేష్ఠి [ఆహ్వాన సంఘాధ్యక్షులు], 6. శ్రీ రాజా రంగయ్యప్పారావు బహద్దరు [వుయ్యూరు యువరాజా, ప్రదర్శనమును తెరచిరి], 7. శ్రీ శ్రీ విక్రమదేవవర్మ [జయపూరు మహారాజా, సభా ప్రారంభకులు], 8. బెజవాడ రామచంద్రారెడ్డి, సి. బి. ఇ. [సభాధ్యక్షులు], 9. శ్రీ అయ్యంకి వేంకట రమణయ్య [సన్మానమును పొందినవారు], 10. దేశిరాజు హనుమంతరావుపంతులు, 11. శ్రీ యన్. బి. సచ్చిదానంద [విశ్వవిద్యాలయ గ్రంథభాండాగారి], 12. శ్రీ మామిడిపూడి వెంకట రంగయ్య [ప్రొఫెసర్, విశ్వవిద్యాలయము], 13. మందలపర్తి ఉపేంద్రశర్మ [కార్యదర్శి], 14. ఈదర వెంకట్రావుపంతులు [వెంకట్రామా అండు కో., ప్రొప్రయిటరు].

నేలమీద కూర్చున్నవారు :— 1. హేమాద్రి కొండలరావుశర్మ, 2. నిడదవోలు వెంకట్రావు, 3. బుద్ధ విశ్వనాథం,

వెనుక నిలుచున్నవారు :— 1. కోన వెంకటరాయశర్మ, 2. గుంటుపల్లి జ్వాలానరసింహారావు, 3. మారేపల్లి రామచంద్రరావు, 4. డాక్టరు మారేమండ రామారావు, 5. యలమంచిలి వేంకటేశ్వరరావు, 6. కోగంటి రాఘవయ్య, 7. అడుసుమిల్లి శ్రీనివాసరావు, 8. జి. యస్. కె. ఆర్య, 9. గొఱ్ఱెపాటి వెంకటసుబ్బయ్య, 10. మల్లెల శ్రీరామమూర్తి, 11. వద్దూరు వెంకటప్పయ్య, 12. బి. హనుమంతరావు, 13. ఎ. లక్ష్మీపతి, 14. వారణాసి రామమూర్తి, 15. రంగావఝ్ఝుల రాధాకృష్ణమూర్తి, 16. డాక్టరు పుచ్చా వెంకట్రామయ్య, 17. జి. పుల్లారావు, బి. ఎ., 18. జూబూరు అప్పయ్యపంతులు.

**బెంచీలమీద నిలుచున్నవారు :— 1. అంజటి కుటుంబరావు, 2. పాతూరి నాగభూషణం, 3. జేకుమళ్ళ రామచంద్రరావు, ఎం.ఏ., బి.యల్., 4. పుణ్యమూర్తుల రాజశేఖరం, బి.ఏ., బి.ఇడి., 5. ఊటుకూరు జయరాందాసు, 6. టి. రామలింగేశ్వరరావు [రామా అండు కో], 7. యన్. నరసింహారావు [వెంకట్రామ అండు కో], 8. యన్ శేషగిరిరావు [మున్సిపల్ లైబ్రేరియన్, గుంటూరు.]**

# ఆంధ్రదేశ గ్రంథాలయ సేవక మహాసభ

## చతుర్థ సమావేశము, గుంటూరు 1942 సం॥ డిశంబరు 13, 14 తేదీలు

# శ్రీ అయ్యంకి వేంకటరమణయ్యగారికి

## సన్మాన సంచికా ప్రదానము

ఈ మహాసభ చరిత్రయందు ఈ నాల్గవసమావేశము సువర్ణాక్షరములతో లిఖింపదగినది. గ్రంథాలయ సేవకుని గౌరవించుటకు బూనుకొనుట కిదియే ప్రథమము.

శ్రీ అయ్యంకి వేంకటరమణయ్యగారికి విజయనగరము నందలి శ్రీ భారతీతీర్థము (The Andhra Research University) వారు ఇదివరకే "గ్రంథాలయశాస్త్ర విశారద" యను బిరుదమునిచ్చి గౌరవించిరి. కాకినాడయందు జరిగిన 16 వ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభవారు వారికి "గ్రంథాలయోద్ధారక" యను బిరుదునిచ్చి మన్నించిరి.

శ్రీ వేంకట రమణయ్యగారు గ్రంథాలయ ప్రపంచమునకు చేసిన సేవకు వారిని గౌరవించ వలెనని కొందరు గ్రంథాలయ సేవకులు – అందు ముఖ్యముగా ఆంధ్రవిశ్వవిద్యాలయ గ్రంథభాండాగారికు లగు శ్రీ పి. కొండా రెడ్డిగారు తలపెట్టి పనిచేయ దొడంగిరి. వారి సత్సంకల్పమును మెచ్చుకొనుచు శ్రీ మందలపర్తి ఉపేంద్రశర్మగారు, ఆంధ్రదేశ గ్రంథాలయ సేవకమహాసభ కార్యదర్శి టేకుమళ్ళ రామచంద్రరావు పంతులుగారు మున్నగు పలువురు గ్రంథాలయోద్యమ సేవకులు తోడ్పడిరి.

చినికి చినికి వానయైనట్లు ఈ ప్రయత్నముయొక్క ఫలితముగ శ్రీ వేంకట రమణయ్యగారికి ఆంధ్రమున ఆంగ్లమున రెండు సన్మాన సంపుటములు బహూకరించుటకై నిశ్చయింపబడెను.

ఈ ప్రయత్నము కార్యరూపము దాల్చుటకై గుంటూరు పట్టణమునందు ప్రముఖులుచేరి ఆహ్వాన సంఘముగా నేర్పడిరి. ఆ సంఘమునకు మునిసిపలు చైరుమనుగారగు శ్రీ తెల్లాకుల జాలయ్య శ్రేష్ఠిగారు అధ్యక్షులుగను శ్రీ పి. కొండారెడ్డి, మందలపర్తి ఉపేంద్రశర్మగార్లు కార్యదర్శులుగాను ఎన్నుకొనబడిరి. ఈ సన్మానము ఆంధ్రదేశ గ్రంథాలయ సేవక మహాసభయందు చేయుటకు తీర్మానింపబడినది.

ఆ ప్రకారము ఆ సభ 1942 సం॥ డిశంబరు నెల 13-14 తేదీలందు గుంటూరు పట్టణమున మునిసిపల్ గ్రంథాలయ భవన ఆవరణమున జయప్రదముగ జరిగినది.

## ఊ రే గిం పు

13 వ తేదీ ఉదయము సభాప్రారంభకులగు శ్రీ విక్రమదేవ వర్మగారిని, సభాధ్యక్షులగు బెజవాడ రామచంద్రారెడ్డిగారిని, అయ్యంకి వేంకటరమణయ్యగారిని, ప్రతినిధులు వెంబడిరాగా, మంగళ వాద్యములతో పురవీధులయం దూరేగించి సభా మంటపమునకు తోడి తెచ్చిరి.

మునిసిపలు గ్రంథాలయ ఆవరణమంతయు పందిరి వేయబడి, ఆకు జొంపములచేతను, తోరణముల తోడను అలంకరింప బడినది. సభామందిరమంతయు రెండు వేలమంది ప్రతినిధుల చేతను ప్రేక్షకుల చేతను కిటకిట లాడుచుండెను.

## జెం డా ప్ర తి ష్ఠా ప న

ఉయ్యూరు కుమారరాజాగారు ఆంధ్ర విశ్వవిద్యాలయ సెనేటు సభ్యులు అగు,

**శ్రీ యం. ఆర్. అప్పారావు బహద్దరు** యం. ఏ., **గారు**

గ్రం థా ల య జెం డా ను ప్ర తి ష్టిం చి రి.

## ప్ర ద ర్శ న ము

మునిసిపలు గ్రంథాలయ భవనమునందు చక్కని గ్రంథాలయ ప్రదర్శనము ఏర్పాటు చేయబడినది.

గ్రం థా ల య సే వ యం దు ఆ రి తే రి న

**శ్రీ మ తి బొ డ్డ పా టి సీ తా బా య మ్మ గా రు**

( ఆ న ర రీ మే జ స్ట్రే టు )

గ్రంథాలయ ప్రదర్శనమును తెరచిరి. భారతవర్షమందు సుప్రసిద్ధ గ్రంథాలయములయొక్క పటములు—విదేశములయందు గ్రంథాలయ పద్ధతులను తెలుపు పటములు ప్రదర్శింపబడినవి.

డోర్నకల్లు నుండి విచ్చేసిన శ్రీ సుందరంగారు వయోజన విద్యను గూర్చిన పటములు పెక్కింటిని ప్రదర్శించిరి.

ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘ కార్యదర్శి శ్రీ పాతూరి నాగభూషణంగారు, పుదుక్కోట సంస్థానం నుండి విచ్చేసిన ఏ. యస్. ముద్దుకృష్ణయ్యగారును గ్రంథాలయోద్యమమును గూర్చిన పటములను ప్రదర్శించిరి.

ఆంధ్రదేశమునందలి పలు ప్రదేశముల నుండి గ్రంథ ప్రకాశకులు తమ గ్రంథములను ప్రదర్శించిరి. అందు ముఖ్యముగా వెంకట్రామా అండుకో వారియొక్క, రామా అండుకో వారియొక్కయు ప్రదర్శనములు పేర్కొనదగినవి.

మునిసిపలు గ్రంథాలయముయొక్క భాండాగారి యస్. శేషగిరిరావుగారు ప్రదర్శనమును మిక్కిలి ఆకర్షవంతముగ అమర్చిరి.

ఆ హ్వా న సం ఘా ధ్య క్షు లు

## శ్రీ రావుబహద్దరు తెల్లాకుల జాలయ్యశ్రేష్ఠిగారు

(పురపాలక సంఘాధ్యక్షులు, గుంటూరు)

శ్రీ జాలయ్య శ్రేష్ఠిగారు ప్రతినిధుల నాహ్వానించుచు ఇట్లు జెప్పిరి :-

ఆంధ్రదేశమును చైతన్యవంతముగ జేసిన పేరెన్నికగన్న ఉద్యమములలోకెల్ల గ్రంథాలయోద్యమము ప్రప్రథమున పేర్కొన దగినది. ఈ యుద్యమమునకు పితామహులు శ్రీ వేంకటరమయ్యాపంతులు గారు. వారి కార్యదీక్ష ఉత్సాహముల వలన ఈ యుద్యమము ఆంధ్రదేశముయొక్క నలుమూలల వ్యాప్తి జెందినది. అట్టి మహనీయుని సన్మాన మహోత్సవము, ఈ సంఘ వార్షికోత్సవము మా గుంటూరు పట్టణములో జరుగుట మా భాగ్యము. ఇట్టి సదవకాశమును గలుగజేసినందులకు గ్రంథాలయ సేవక సంఘము వారికి మా కృతజ్ఞతను తెలియజేయు చున్నాను.

గుంటూరు పట్టణము అనాదినుండియు వివిధములగు రాజకీయ, సాంఘిక, సాంస్కృతి కోద్యమము లను ప్రభవింప జేయుట యందును, ప్రోత్సహించుట యందును, పోషించుటయందును ప్రముఖ పాత్ర వహించినది. నేడీ సాంస్కృతికోద్యమ సంబంధులైన మహాసభ లీ పురమున జరుగుట ఎంతయు ఉచితమని మనవి జేయుచున్నాను. తమరందరకు మా హృదయపూర్వక స్వాగతము.

స భా ప్రా రం భో ప న్యా స ము

## శ్రీ శ్రీ శ్రీ విక్రమదేవవర్మ గారు

సాహిత్య సామ్రాట్టులు - జయపురాధీశ్వరులు - ఆంధ్ర విశ్వవిద్యాలయ ప్రోఛాన్సలరు

స భ ను ప్రా రం భిం చు చు యి ట్లు జె ప్పి రి :

"నేను చిరకాలముగ ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమము నందు సేవకుడనుగా నున్న కారణ మున తమరీ గౌరవమును ఇప్పుడు నాకు కల్పించిరనుకొనుచున్నాను. ప్రారంభకులుగా నన్ను నియమించిన మీకు నేను కృతజ్ఞుడను. సమస్త మానవులకు అభ్యుదయపరంపర సమకూడవలెనను భావమునకు భారతీయ సంస్కృతియందు, నాగరికతయందు, ప్రముఖ స్థానము కలదు. జాతీయ సారస్వతాభివృద్ధికి ప్రాచీనులైన మహారాజులు, ఋషులు, ఉపదేష్టలు నిరంతర కృషిచేసి విజ్ఞా నము నంతను మనకొరకై గ్రంథస్తము జేసిరి; దేవాలయములందును, బౌద్ధ విహారములందును ఇతర గోష్ఠీ స్థానములందును, గ్రంథాలయములను నెలకొల్పి - ఎన్నో శ్రమలకోర్చి వానినందు భద్రపరచిరి. నలంద, తక్షశిల, అమరావతీ, విశ్వవిద్యాలయములందు సుప్రసిద్ధ గ్రంథాలయములు వేలకొలది అపూర్వ గ్రంథములతోను, సుశిక్షితులైన గ్రంథ భాండాగారులతోను, విలసిల్లుచుండె ననుట ప్రసిద్ధ విషయమే కదా! అట్టి గ్రంథ భాండాగారులు సర్వవిషయములను కరతలామలక ముగ తెలిసిన వేత్తలై, తమ దగ్గరకు వచ్చిన పండితోత్తములతో గూడ వివిధ విషయములను

చర్చింప సమర్థులై యుండెడివారు. వారిని సరస్వతీ పీఠములని చెప్పనొప్పును. అట్టి చర్చలను వెలయించు సంస్థయే పూరీ జగన్నాథమునందలి ముక్తిమంటపము. మధ్యయుగములందు మన గ్రంథ సంపత్తి నాశనము గాకుండ గాపాడబడుటకు హేతువు చైనా, టిబెట్టు, మొదలగు దేశములందలి గోష్ఠీ సంస్థలే.

పూర్వము గ్రంథ భాండాగారముల నుపయోగించుకొని ప్రసిద్ధిగాంచిన విదుషీమణు లెందరోగలరు. కాని స్త్రీ విద్యావిజ్ఞానములపట్ల నేటి మన నాగరిక సంఘము చూపు అలసత్వమును పోల్చిచూచిన విచారమగు చున్నది. మనదేశమున విజ్ఞాన వ్యాప్తికి గ్రంథాలయములకంటె ఉత్తమములగు సాధనములు లేవు.

ఆంధ్రదేశమున పరిశోధనకు వసతికల్పించు గ్రంథభాండాగారము లెన్నియైన వెలయవలసియున్నది. రాజమహేంద్రవరమునందలి గౌతమీగ్రంథాలయమును, విజయవాడ యందలి రామమోహన గ్రంథాలయమును వేటపాలెమునందలి సరస్వతీ గ్రంథాలయమును, బరంపురమునందలి ఆంధ్ర గ్రంథాలయమును, హైద్రాబాదునందలి రాజరాజ నరేంద్ర గ్రంథాలయమును, విశాఖపట్నమునందలి హిందూరీడింగురూము గ్రంథాలయమును, వాల్తేరునందలి విశ్వవిద్యాలయ గ్రంథాలయమును, మరియు ఇట్టి మహాసంస్థలయందలి తదితరగ్రంథాలయములను పరిశోధనాగారములుగ పెంపొందింపవలసిన బాధ్యత సంపన్నులదైయున్నదని మనవి చేయుచున్నాను.

మనదేశమునందు శ్రీ అయ్యంకి వేంకటరమణయ్య పంతులుగారి శ్రద్ధవలనను, అసాధారణ పరిశ్రమ వలనను గ్రంథాలయములు దినదిన ప్రవర్థమానములై జ్ఞానజ్యోతిని నలుదిశల వ్యాప్తిని జేయుచున్నవి. వారు గ్రంథాలయ ప్రచారమును ఒక వ్రతముగ బూని కడచిన ముప్పదిసంవత్సరముల నుండి తదేక దీక్షతో కృషిని సలుపుచున్నారని చెప్పుటకు నేనెంతయు ఆనందించుచున్నాను. శ్రీ వారి నాయకత్వమున దేశసేవానురక్తులగు దీక్షితు లెందరో బయలుదేరి, వివిధ రంగములందు నాయకత్వమును వహించి స్వాతంత్ర్య సమరమున విజయము గావించిరి.

అట్టి మహోదారులగు ధన్యజీవిని గౌరవించుటకై సమకూర్చిన ఈ సభతో నాకు సంబంధమును కలుగజేసిన విజ్ఞులకు నా కృతజ్ఞతాభి వందనములు"

## అ ధ్య క్ష కో ప న్యా స ము

### ఆం ధ్ర భో జు లు

# శ్రీ బెజవాడ రామచంద్రారెడ్డిగారు

సభాధ్యక్షత వహించి ఇట్లు జెప్పిరి :

"కడచిన మూడు దశాబ్దములుగ ఏకదీక్షతో ఆంధ్రగ్రంథాలయోద్యమమునకు సేవయొనర్చి, ఆశాఖయందు ఆదర్శప్రాయమైన జీవితమును గడపుచున్న శ్రీయుత అయ్యంకి వేంకటరమణయ్య

పంతులుగారికి ఆంధ్రులెల్లరు నిరంతరము కృతజ్ఞులైయుండగలరు. వారు నిర్వహించిన గ్రంథాలయ సభలేని, ప్రదర్శనములేమి, పత్రికలేమి, ప్రభుత్వ విరాళములను సంపాదించుటకు చేసిన కృషియేమి, గ్రంథాలయ చట్టనిర్మాణమునకు వారొనర్చిన ప్రయత్నములేమి, గ్రంథాలయ శాస్త్రాభ్యాసమునకు వారు కలుగజేసిన యుత్సాహమేమి, చిరస్మరణీయములు.

ఆధ్యాత్మిక, రాజకీయ, సాంఘికములగు వివిధోద్యమములందును, ఆంధ్రేతరు లెవరో మార్గదర్శకులగుటయు వారి ననుసరించుటయు మనకు చిరకాలముగ వచ్చుచున్న సంప్రదాయము. ఆంధ్రుడై జన్మించి, ఒకనొక ప్రజాహితోద్యమమున సర్వభారత దేశమునకును ఉపదేష్టయై ప్రఖ్యాతి వహించినది శ్రీ వేంకటరమణయ్య పంతులుగారేనని ఘంటాపథముగ జెప్పవచ్చును. పంజాబు గ్రంథాలయ సంఘపక్షమున వెలువడు "మోడరన్ లైబ్రేరియను" పత్రికా సంపాదకులు వ్యక్తీకరించిన ఈ క్రింది వాక్యములే ఇందుకు ప్రమాణములు :- "శ్రీ వేంకటరమయ్యగారే మా రాష్ట్రములో గ్రంథాలయోద్యమ స్థాపకులు-మార్గదర్శి-యనుట ఎంతమాత్ర మతిశయోక్తి కానేరదు" మరియు వారు ఈ యుద్యమమును ఎట్టి ఉన్నత స్థాయికి తెచ్చినదియు అమెరికాయందు ప్రచురింపబడు చున్న ప్రముఖ గ్రంథాలయ పత్రికయగు 'న్యూయార్కు లైబ్రరీ జర్నలు' వ్రాసిన ఈ క్రింది వాక్యములే తార్కాణములు :- "గుంటూరునందు జరిగిన ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభయందు ఇయ్యబడిన ఉపన్యాసములు - అట్టి సభలు అమెరికా దేశమునందు జరిగినప్పుడు ఇచ్చే ఉపన్యాసముల ధోరణిలోనే యున్నవి. మరియు అట్టి ఉపన్యాసములు ఇండియా దేశీయులచే చేయబడి యుండుట ఇంకను గొప్ప విశేషము" ఇట్టి ప్రముఖాభిప్రాయముల వలన శ్రీ వేంకటరమణయ్యగారు ఆంధ్రదేశమునకేగాక యావద్భారత దేశమునందును గ్రంథాలయోద్యమ వ్యాప్తికై గావించిన అమోఘసేవ ఎంత అమూల్యమైనదో తేటతెల్లమగుచున్నది. ఇట్టి మహాపురుషుని ఆంధ్రలోకము తగిన విధముగ సన్మానింపదలచుకొని నాకీ అగ్రాసనాధిపత్యగౌరవము నాపాదించిన మీ సంఘమువారి కెంతయు కృతజ్ఞుడను.

అంతటితో 13 వ తేదీ ఉదయము సభ ముగిసెను.

## సందేశములు

సాయంకాలము సమావేశము తిరిగి 5 గంటలకు జరిగెను. శ్రీ సర్. యస్. రాధాకృష్ణన్, శ్రీ రామానందచటర్జీ (మోడరన్ రివ్యూ సంపాదకులు), కుమార మనీంద్రదేవు మహాశయ (బాన్సుబారీ జమీందారు), టి. సి. దత్తా (వంగదేశ గ్రంథాలయోద్యమ నాయకులు), శ్రీ ఉదయ శంకర్ (ప్రసిద్ధ నాట్యాచార్యులు), శ్రీ గోపీనాథ్, సర్. సి. వి. రామన్, సి. ఆర్. రాజగోపాలాచారి, యస్. ఆర్. రంగనాథన్, డాక్టరు జి. యస్. అరండేలు (దివ్యజ్ఞాన సమాజాధ్యక్షులు) భోగరాజు పట్టాభి శీతారామయ్య, వి. టి. కృష్ణమాచారి (బరోడా దివాను), చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి, శాంతారాం భటేయా, మున్నగు ప్రముఖులు శ్రీ పంతులుగారిని, గ్రంథాలయోద్యమమును ప్రశంశించుచు పంపిన సందేశములను, ఆహ్వాన సంఘ కార్యదర్శి శ్రీ పి. కొండారెడ్డిగారు చదివిరి.

సన్మాన సంచికా ప్రదానము చేసిన, ఆంధ్రవిశ్వవిద్యాలయ "వైస్‌ఛాన్సలరు"

# శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారు

ఆంధ్ర, ఆంగ్ల సన్మానసంచికలను

# శ్రీ అయ్యంకి వేంకటరమణయ్యగారికి

సమర్పించుచు ఇట్లు చెప్పిరి :

"నేడు ఈ సన్మాన మహోత్సవమందు పాల్గొను సదవకాశము లభించినందులకు నే నెంతయు సంతసించుచున్నాను. శ్రీ వేంకట రమణయ్యగారు భారత గ్రంథాలయోద్యమమునకు వారి సర్వస్వమును ధారవోసిన సేవావ్రతి. ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘము వారి ప్రయత్నముయొక్క ఫలితముగ 1914 సంవత్సరముననే స్థాపింపబడినది. అప్పటినుండియు శ్రీ పంతులుగారు నిరంతర కార్యదీక్షాపరులై ఆ సంఘ కార్యదర్శిత్వమును ఇరువదియైదు సంవత్సరముల కాలము నిర్వహించిరి. ఆంధ్రగ్రంథాలయోద్యమమును యావద్భారత దేశమున కాదర్శప్రాయముగ జేసిరి.

ఇంతేగాదు. పంజాబు, బెంగాలు, మహారాష్ట్రము, మద్రాసు, పుదుకోట, కేరళ రాష్ట్రములందు గ్రంథాలయ సంఘములను స్థాపించుటకు కారణభూతులైరి. ఆయా రాష్ట్రములందు గ్రంథాలయోద్యమ వ్యాప్తికై తోడ్పడిరి. దీనినిబట్టి గ్రంథాలయోద్యమమున వారు ప్రదర్శించిన విశ్వరూపము నాకు పరమాశ్చర్యమును కలిగించినది.

నేడు భారతదేశపు వివిధ ప్రాంతములనుండి సుప్రసిద్ధులగు పెక్కురు నాయకులు శ్రీ వెంకటరమణయ్యగారినిగూర్చి పంపిన ప్రశంసాత్మకములగు సందేశములే శ్రీ పంతులుగారి ప్రతిష్ఠను వేనోళ్ళ జాటుచున్నవి. అటు ఉత్తరహిందూస్థానమునుండి, మహారాష్ట్రము, మధ్యరాష్ట్రము, పంజాబు, బెంగాలునుండి—ఇటుదక్షిణాపథము నుండియు, ఇంకా అనేక ఇతర ప్రాంతములనుండియు సందేశము లరుదెంచుటయే శ్రీ వేంకటరమణయ్యగారి ప్రఖ్యాతికి ప్రబలతార్కాణము.

వీరి గ్రంథాలయసేవ అసమాన్యమైనది. వీరి గ్రంథాలయసేవ ఆంధ్రదేశమునందలి పల్లెపట్టణములకే గాక అఖిలభారతమునందును ప్రచారమై జనసామాన్యమునందు గ్రంథ పఠనాభిలాషను పెంపొందింప జేసినది. పూర్వము ఎంత యుత్కృష్ట గ్రంథమయిన ఒక వంద ప్రతులు అమ్ముడు బోవుట కష్టముగ నుండెడిది. రచయితలకు చాల నిరుత్సాహ జనకముగ నుండెడిది. కాని గ్రంథాలయోద్యమ ప్రచారము ప్రబలిన కొలదిని ప్రజలలో ఉత్సాహ మినుమడించి విద్యా సముపార్జనాభిలాషయు వృద్ధియైనది. శ్రీ వేంకటరమణయ్యగారు చిన్ననాటి నుండియు గ్రంథాలయ సేవయందే నిమగ్నులై, వారి జీవితమంతయు దానికే ధారవోసిరి. వారి కిది వెన్నతోబెట్టిన విద్యయే. వారి కెంత సన్మానము చేసినను మనము వారి ఋణమును చెల్లించుకొనలేము. ఇం దతిశయోక్తి ఏమియు లేదు. వారు నిజముగ గ్రంథాలయోద్యమ పితామహ బిరుదమున కెంతయు తగియున్నారు.

భారతదేశమున విద్యావిహీనత ప్రబలియున్నదని సామాన్య ప్రజాభిప్రాయము. అందులకు నేను ఎంత మాత్రమును అంగీకరింపజాలను. చదువురానంత మాత్రమున విద్యా విహీనులనుట పొరబాటు. మనదేశములోని స్త్రీలకు చదువు రాకపోయినను, భారత భాగవతాది మహా గ్రంథములలోని కథలు గాథలు వారికి సుపరిచితములేను. అంతియేగాక, వారు శ్రుత పాండిత్యమును గలిగి లోకజ్ఞానమును చాటుచుందురు.

అంతమాత్రముచేత చదువనవసరమని నా అభిప్రాయముగాదు. మన దేశములో గ్రంథ పఠనము-శ్రవణముల వలననే విద్యాప్రచారము బాగుగా జరిగినది. శ్రుతులు గూడ శ్రుతి ప్రధానముగనే పరంపరగా నిల్చినవి. ఈ కాలమున కూడ వ్యక్తులు గ్రంథములను ఎక్కువగా కొన్నను కొనక పోయినను, గ్రంథాలయములు వానిని తెప్పించుటయు, ఎవరో యొకరవి చదువుచుండుట, మిగిలిన వారు వానిని వినుచుండుట అనేక ప్రదేశములలో జరుగుచున్నది. అనగా గ్రంథాలయోద్యమ ప్రచారమువలన గ్రంథముల విక్రయము, తద్వారా గ్రంథ పఠనాభిలాష - విద్యాసముపార్జనాభిలాష ఇనుమడించినవని నొక్కి చెప్పవచ్చును.

దీని కంతకు కారణము ఈ వేంకటరమయ్యగారు. వీరు మొదటినుండియుఁ డిగ్రీలు - బిరుదులు - మొదలైన వానిమీద వ్యామోహపడక నిరంతర మవ్యాజమైనసేవ గ్రంథాలయోద్యమ మూలమునజేసి మన కృతజ్ఞతకు పాత్రులైరి.

ఇట్టి మహామహుని సన్మానించుటకు గ్రంథాలయోద్యమముతో నేమియు సంబంధములేని నన్ను నిమిత్త మాత్రముగ నియమించుట నా యదృష్టము.

ఈ భాగ్యము నాకు కలుగుటవల్ల నేను వారికిచేయు గౌరవముకంటె నా గౌరవము ఇనుమడించె నని భావించుచున్నాను.

ఈ సర్వాంగ సుందరములగు సన్మాన సంపుటములను ఆంధ్ర ఆంగ్ల భాషల నలరారు వానిని - సుప్రసిద్ధ కవుల, పండితుల, పరిశోధకుల రచనలచే నొప్పారు వానిని - ఈ గ్రంథాల యోద్ధారకునకు సమర్పించు సదవకాశమున కెంతయు హృష్టుడనగుచు మీ పరమున వారికి సమర్పించుకొనుచున్నాను."

అంతట శ్రీ అయ్యంకి వేంకట రమణయ్యగారికి పూలహారముతో శ్రీ రెడ్డిగారు ఆంధ్ర - ఆంగ్ల సన్మాన సంచికలను సమర్పించిరి.

# ఇతర ఉపన్యాసములు

## శ్రీ మారేపల్లి రామచంద్రశాస్త్రిగారు

అటు పిమ్మట శ్రీ మారేపల్లి రామచంద్రశాస్త్రిగారు కరతాళధ్వనులు చెలరేగుచుండ నిలబడి శ్రీ వేంకట రమణయ్యగారిని గురించి గంభీర వాక్కుల నిట్లువన్యసించిరి:-

"తెలుగు వారిలో ఒకరిగుణమును మరియొకరు మెచ్చుకొని, వారిలో వారిని పైకితీసికొనివచ్చుట అరుదు. అట్టి సందర్భమున నేడు శ్రీ వేంకట రమణయ్యగారికి మనమందరమును ఏకాభిప్రాయులమై సన్మానము చేయుట గ్రంథాలయోద్యమ చరిత్రలో సువర్ణాక్షరములతో వ్రాయదగిన సుదినము. ఆంధ్ర దేశమున గ్రంథాలయోద్యమము రెండుభాగములుగా విభజింపవచ్చును. ఒకటి వ్యక్తి ప్రధానమైన గ్రంథాలయోద్యమము - రెండు సంఘ ప్రధానమైన గ్రంథాలయోద్యమము. వ్యక్తి ప్రధానమైన గ్రంథాలయోద్యమమునకు కీర్తిశేషులు మంతెన నారాయణమూర్తి పంతులుగారు (విశాఖపట్నం) ముఖ్యులు. సంఘప్రధానమైన గ్రంథాలయోద్యమమునకు శ్రీ అయ్యంకి వేంకట రమణయ్య పంతులుగారు పితామహులు. శ్రీవారి కృషిఫలితముగనే ఆంధ్ర దేశమున రెండు వేలకు పైగా గ్రంథాలయములు వెలసినవి. వీరిసేవా ఫలితముగనే, వారికంటె వయస్సుచే మేమందరము పెద్దవారమయినప్పటికిని, పంతులుగారిని గ్రంథాలయోద్యమ నాయకులుగ అంగీకరించినాము. వారు విశ్వవిద్యాలయమున పట్టభద్రులు గాక పోయినను గ్రంథాలయోద్యమ సేవాసామ్రాజ్య పట్టభద్రులు. ఇట్టి ఘనులగు వారిని సన్మానించుటెంతయు తగియున్నది. ఇకముందుగూడ ఇతోధికముగ గ్రంథాలయ సేవచేయు నిమిత్తము భగవంతుడు శ్రీవారికి ఆయురారోగ్య ఐశ్వర్యములను ప్రసాదించుగాత.

## బొడ్డపాటి శీతాబాయమ్మగారు

తరువాత శ్రీమతి బొడ్డపాటి శీతాబాయమ్మగారు శ్రీ వేంకట రమణయ్యగారు స్త్రీలయెడ జ్ఞానాభివృద్ధికై ఎట్లు పాటుపడిరో తెల్పుచు, "వారికీ మహోత్సవము జరుగుట నా కెంతేయు ముదావహమైన విషయమని"యు స్త్రీలందరి తరఫున వారికి అభినందనములను తెల్పుచున్నాననియు శెలవిచ్చిరి.

## బొడ్డుపల్లి బాలాత్రిపుర సుందరమ్మగారు

గ్రంథాలయోద్యమమునకై శ్రీవారు నిరంతరముగా చేసిన సేవాధురంధరత్వమునుగూర్చి వర్ణించిరి.

## చెరుకువాడ వేంకటనరసింహంగారు

పిమ్మట శ్రీ చెరుకువాడ వేంకటనరసింహంగారు ప్రసంగించుచు "శ్రీ వేంకటరమణయ్యగారు విశ్వ విద్యాలయంవారు శ్రద్ధ వహించి ప్రచారం చేయవలసిన యుద్యమమును చేపట్టి, కడు ప్రశంస

నీయముగ బనిచేసిరి. శ్రీవారికి డిగ్రీలమీద వ్యామోహము లేదు – ఉద్యోగములమీద మోహము లేదు. నిష్కలంకమైనసేవ – నిరాడంబరమైన జీవనము – నిశ్చలమైన మనోధైర్యము – కార్య దీక్ష – వీరికి బెట్టని సొమ్ములు – నేటికి వారి సేవను ప్రజలు గుర్తించి ఆంధ్రదేశీయులేగాక ఆంధ్రే తరులుగూడ సందేశములను బంపి గౌరవించుట ఎంతయు ముదావహనీయమైన విషయము. కాని వీరి సేవోత్కృష్ట్యమును ఆంధ్ర విశ్వవిద్యాలయము వారు గుర్తించి వీరికేదేని బిరుదమును సమ ర్పించి – వారు గౌరవమును దెచ్చుకొనుట ఉచితము; ఈ బిరుదు నిచ్చుటచే శ్రీ వేంకటరమ ణయ్యగారి గౌరవ మర్యాదలు ఇనుమడించవు; కాని విశ్వవిద్యాలయమువారే గౌరవమును గడించు కొన్న వారగుదురు; వారి విధ్యుక్త ధర్మమును నెరవేర్చిన వారగుదు. అట్టి మహాసేవకులను సన్మానించినచో యువకులకు ఉత్సాహజనకముగనుండి సత్కార్యాచరణకు గడంగుటకు వీలుగా నుండును” అని చెప్పిరి.

## ఈదర వెంకటారావుగారు

వెంకట్రామ అండుకో ప్రొప్రైటరుగారగు శ్రీ ఈదర వెంకట్రావు పంతులుగారు మాట్లాడుచు వారికిని శ్రీ పంతులుగారికిని గత ఇరువదియైదు సంవత్సరములనుండియు పరిచయమున్నను పంతులు గారు యింతసేవచేయుచున్నట్లు నాకు తెలియనే తెలియదనియు, నేడు దేశముయొక్క నలుమూలల నుండి ఇన్ని సందేశములు – ఇన్ని ప్రసంశా వాక్యములు – వినగానే నేను ఆశ్చర్యపడి ఆనంద సాగరమున ఓలలాడితిననియు శ్రీ పంతులుగారు మిక్కిలి ధన్యాత్ములనియు – వాక్రుచ్చిరి.

## యస్. బి. సచ్చిదానందంగారు

తరువాత ఆంధ్ర విశ్వవిద్యాలయ గ్రంధభాండాగారి యస్. బి. సచ్చిదానందంగారు మాట్లాడుచు, దేశమునందు విజ్ఞాభివృద్ధిని వ్యాపింపజేయుటయందును, సభ్యతను వెలయింపజేయుట యందును శ్రీ వేంకటరమణయ్యగారు దోహదమును కల్పించిరని జెప్పిరి. వీరిసేవ కేవల మాంధ్రదేశము నందేగాక అఖిలభారతమునను గుర్తింపబడి గౌరవింపబడినది. వీరు మన యాంధ్రులలో బుట్టుట ఆంధ్రుల యదృష్టము అనియు నుడివిరి.

## ఏ. యస్. ముద్దుకృష్ణయ్యగారు

పిమ్మట పుదుక్కోట గ్రంథాలయ సంఘ కార్యదర్శి శ్రీ ముద్దుకృష్ణయ్యగారు మాట్లాడిరి. శ్రీ వేంకటరమణయ్యగారిని గౌరవించిన మహోత్సవ సమయమున తానీ సభలో పాల్గొనుట తన కత్యంతాహ్లాదకరమైన విషయమనియు, శ్రీ వేంకట రమణయ్యగారికిని వారికిని ఇరువదియైదు సంవత్సరములనుండి పరిచయ మున్నదనియు, శ్రీవారి కార్యదీక్ష, అనన్య సామాన్యమైనదనియు నుడివి, వారిసేవ నుగ్గడించిరి. 1927 సంవత్సరమున మద్రాసునగరమున అఖిలభారత గ్రంథాలయ సభను సమావేశపరచవలసిందిగా తాము మద్రాసు విశ్వవిద్యాలయ గ్రంథ భాండాగారి ఎస్. ఆర్. రంగనాధంగారికి ఉత్తరం వ్రాయగా, తాము సమావేశపరుపజాలమని ప్రత్యుత్తర మొసంగిరనియు – శ్రీ రంగనాధంగారు సమావేశపరుపజాలని సభను శ్రీ వేంకటరమణయ్యగారు నెల దినములు

ముందుగా వచ్చి మద్రాసునందు తిష్టవేసికొని కూర్చుండి, సాధించి దిగ్విజయముగా జరిపించిరనియు, ఆ సభ ఫలితముగ శ్రీ వేంకటరమణయ్యగారు మద్రాసు గ్రంథాలయ సంఘమును స్థాపించి, కె. వి. కృష్ణస్వామి అయ్యరుగారు, రంగనాథంగారు మున్నగువారు గ్రంథాలయోద్యమ నాయకులుగా తయారగుటకు కారకులైరనియు శలవిచ్చిరి.

## పుచ్చా వేంకటరామయ్యగారు

ప్రకృతి, ఇండియన్ నాచురోపాత్ పత్రికల సంపాదకులు శ్రీ పుచ్చా వెంకట్రామయ్యగారు మాట్లాడుచూ, శ్రీ వెంకటరమణయ్యగారి కార్యదీక్ష ఎంతయు మెచ్చుకొనదగినదనియు, ఏ పనినైన మొదలుపెట్టి, దానిని తుదముట్టునట్లొనర్చి కృతకృత్యులగుటయందు శ్రీవారికి అసమానమైన ప్రజ్ఞ కలదనియు, ఒకవేళ కార్యసాఫల్యము నొందకపోయినను, మనో వ్యథను జెందక సహజ ధైర్యమును వీడక, ధర్మనిర్వహణమునందే దీక్ష వహించు ఆదర్శంపు వ్యక్తియనియు, నుడివిరి. వీరికి అనాథ స్త్రీలన్నను, విద్యావిహీనులగు స్త్రీలన్నను ఎక్కువ జాలియనియు, అట్టి స్త్రీలనేకులను వీరు స్వయముగ పోషించి విద్యాదానముజేసి పైకి తెచ్చిరనియు శలవిచ్చిరి.

## చెన్నుభొట్ల భానుమూర్తిగారు

పిమ్మట శ్రీ చెన్నుభొట్ల భానుమూర్తి బి. ఏ. ఎల్. టి. గారు ప్రశంసించుచు, బాల్యమునుండియు ఎన్ని అడ్డంకులు వచ్చినను రమణయ్యగారు పత్రికా పఠనమును గ్రంథాలయ స్థాపనమునందును కడు దీక్ష వహించిరనియు, చిన్ననాడు కుర్రవాని కే విద్యయం దభిరుచి యుండునట్లు పొడసూపునేని దానినే యభివృద్ధిపరచునట్లు గురువులను తల్లిదండ్రులను ప్రోత్సాహపరుపవలెననియు అపుడే వేయిమంది వెంకట రమణయ్యలు బయలుదేరి స్వాతంత్ర్యేచ్ఛతో దేశసేవా బద్ధకంకణు లయ్యెదరనియు నుడివిరి.

## మామిడిపూడి వేంకటరంగయ్యగారు

తదుపరి శ్రీ మామిడిపూడి వేంకటరంగయ్యగారు పంతులుగారి అఖండసేవా దీక్షనుగురించి మరీ మరీ ప్రశంసించుచు గ్రంథాలయోద్యమ సామ్రాట్ అను బిరుదము నిచ్చిరి.

గొర్రెపాటి వేంకటసుబ్బయ్యగారు, అబ్బరాజు వేంకట హనుమంతరావుగారు, విన్నకోట వేంకటరత్నశర్మగారు, దంటు శ్రీనివాసశర్మగారు, తంగిరాల రాధాకృష్ణమూర్తిగారు మొదలగువారందరు శ్రీ పంతులుగారి గ్రంథాలయోద్యమ సేవావ్రతమునుగూర్చి శ్లాఘించిరి. అటుపిమ్మట గ్రంథాలయోద్ధారక గ్రంథాలయ శాస్త్రవిశారద శ్రీ అయ్యంకి వేంకట రమణయ్యగారు సభలో కరతాళ ధ్వనులు చెలరేగుచుండగా లేచి వినయ వినమ్రభావములతో ఇట్లు విన్నవించిరి.

సన్మాన సంపుటముల నందుకొన్న పిమ్మట
గ్రంథాలయోద్ధారక, గ్రంథాలయ పితామహ, గ్రంథాలయ శాస్త్ర విశారద

# శ్రీ అ య్యం కి వేం క ట ర మ ణ య్య గా రు

ఇ ట్లు చె ప్పి రి :-

ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమమునకు, బీజములను నాటి పెంచి పోషించినట్టి అసంఖ్యాకులగు గ్రంథాలయోద్యమ సేవకు లందరి పక్షమున ఈ సన్మాన సంచికల నందుకొనుచున్నాను.

తాము బాగై తమ తోడివారలను బాగుచేయవలెనను మనుష్య స్వభావమున నాటియున్న తీవ్రమగు వాంఛయే గ్రంథాలయోద్యమమునకు ప్రేరణము. ఈ యుద్యమ ప్రచారకులు కోరుఫలము తమకును తమ తోడి వారికిని జ్ఞానాభివృద్ధివలన పొందెడు ఆనందమేను. ఈ యుద్యమమును పురికొల్పు మహాశక్తి ప్రపంచాభివృద్ధికొఱకు అప్పుడప్పుడు ఆవిర్భవించు మహోద్యమములను పాదుకొలిపి వారికి జీవసత్వములను గల్పించు ఈశ్వర ప్రేరిత శక్తియే. ఈ యుద్యమ ప్రచారకులు తాము ఈశ్వర ప్రేరితులమనియు, ఈశ్వరోద్దిష్ట కార్యములను తాము నెరవేర్చుచున్నామనియును దృఢతర భక్తిపూరితులై యున్నారు. ఈ యుద్యమము ఇతర ఉద్యమములవలె మూడునాళ్ళ ముచ్చటతో బోవునది గాదు. ఇది నాయకుల యధీనమందున్న యుద్యమమును గాదు. గ్రంథాలయములు తాత్కాలికముగ ప్రారంభించి, స్వల్పకాలము జరిపి, తిరిగి మూయబడునవి గావు. వానియందు సంవత్సరము పొడుగునను పని జరుగు చుండును. నవోత్సాహ పూరితులైన యువకులే ఈ యుద్యమమునకు మూలకారకులై యున్నారు.

గ్రంథాలయోద్యమము నలంకరించిన వేలకొలది సేవకులలో నే నొక పరమాణువును. అట్టి నాకు ఈ మహత్తరమయిన సన్మానమును జేసినందులకు మిక్కిలి కృతజ్ఞుడను. ఇంకను ఎక్కువ సేవ జేయు భాగ్యమబ్బునటుల పరమేశ్వరు డనుగ్రహించుగావుత."

అంతటితో 13 వ తేదీ సాయంత్రత కార్యక్రమము ముగిసినది.

## రెం డ వ ది న ము

14 వ తేదీ ఉదయముననూ, మధ్యాహ్నముననూ గ్రంథాలయ సేవక మహాసమావేశము సాగింపబడినది. అధ్యక్షులు రాజాలకపోవుటచే ఆంధ్ర విశ్వవిద్యాలయ గ్రంథ భాండాగారి శ్రీ ఎస్. బి. సచ్చిదానందం బి. ఏ. గారు అధ్యక్షతవహించిరి. ఈ రోజు కార్యక్రమమందు గ్రంథాలయోద్యమ శాస్త్ర విశారదులగు పెక్కుమంది వ్యాసములను జదివి చర్చలను జరిపిరి.

చదివిన వ్యాసములందు కొన్ని ఈ క్రింద వివరింపబడినవి :

1. గ్రంథాలయ పాలనమునందలి లోపములు – వానిని నివారించు మార్గములు
   శ్రీ వి. లక్ష్మీనారాయణగారు యం. ఏ.

2. చదువరులలో గల తరగతులు – వారికి సహాయము చేయదగు మార్గములు
శ్రీ యస్. శేషగిరిరావుగారు, బి. యస్ సి., డిప్. యల్. యస్.

3. ఆంధ్రదేశమున గల గ్రామ గ్రంథాలయములు
శ్రీ ఏకుమళ్ళ రామచంద్రరావుగారు, ఎం. ఏ. బి. ఎల్

4. గ్రంథాలయోద్యమమందలి వివిధ విషయములను గూర్చి ఈ క్రిందివారు ఉపన్యసించిరి:
పాతూరి నాగభూషణంగారు
పి. కొండారెడ్డిగారు, బి. ఏ.
వేదాంతకవిగారు
వి. వెంకటరత్నంగారు
మందలపర్తి ఉపేంద్రశర్మగారు యం. ఏ.
వావిలాల గోపాలకృష్ణయ్యగారు

డోర్నకల్లునుండి విచ్చేసిన రెవరెండు కె. జె. జి. సుందరంగారు వయోజనవిద్యనుగూర్చి పటములతో ఉత్తేజకరమైన ఉపన్యాసముల నిచ్చిరి.

గ్రంథాలయోద్యమము – వయోజనవిద్యలనుగూర్చి శ్రీ గాడిచెర్ల హరిసర్వోత్తమరావుగారు మ్యాజిక్కు లాంతరు ఉపన్యాసముల నిచ్చిరి. ప్రొఫెసరు యం. వేంకటరంగయ్యగారు అధ్యక్షత వహించిరి.

## వి నో ద ము లు

12–13 తేదీ రాత్రులయందు ప్రతినిధులకును, ప్రేక్షకులకును వినోదార్థము టవునుహాలునందు సంగీత కచ్చేరీలు, నాటికా ప్రదర్శనములు జరిగెను. మొదటి దినమున జయపుర సంస్థానాధీశ్వరులు శ్రీ విక్రమదేవవర్మగారును, రెండవ దినమున కె. వి. గోపాలస్వామిగారు (విశ్వవిద్యాలయ రిజిష్ట్రారు)ను అధ్యక్షత వహించిరి. హిందూకాలేజిలో ఇంటరు తరగతి విద్యార్థిని శ్రీమతి టి. సరోజినీదేవిగారి గానము అందరిచేతను మెప్పువడసినది.

వందన సమర్పణతో రెండవ దిన కార్యక్రమముగూడ ముగిసినది.



# అయ్యంకి వేంకట రమణయ్యగారికి

## సన్మాన సంపుట ప్రదాన మహోత్సవమునకు

## పంపిన సందేశములు

సభ జయప్రదముగ జరుగుగాక యని ఆకాంక్షించుచు పంపబడిన సందేశములలో కొన్నింటిని ఈ క్రింద వివరించుచున్నాము :

### మా రాజ్యమున గ్రంథాలయోద్యమ ప్రతిష్ఠాపకులు

పంజాబు రాష్ట్రమున గ్రంథాలయోద్యమ ప్రతిష్ఠాపకులుగను, మార్గదర్శకులుగను శ్రీ అయ్యంకి వేంకట రమణయ్యగారు పంజాబునందు పరిచయులైరన్నచో అందు అత్యుక్తి ఎంతమాత్రమును లేదు. 1929 సంవత్సరం క్రిస్టమసు దినములలో డాక్టరు పి. సి. రే గారి అధ్యక్షతక్రింద సమావేశమైన సప్తమ అఖిల భారత గ్రంథాలయ సభను లాహోరు నగరమున సమకూర్చుటకు వారు బెజవాడనుండి వచ్చిరి. ఆ సభయును, ప్రదర్శనమును జయప్రదముగా జరుగుటకు శ్రీ వేంకటరమణయ్యగారి కార్యదీక్షయే ముఖ్యకారణము. అందుకు పంజాబు దేశస్థులమైన మేము వారియెడల మిక్కిలి కృతజ్ఞులము. భారతదేశమున గ్రంథాలయోద్యమ సేవకులుగా వారికి అగ్రస్థానము కలదని గుర్తించుటకు మేము ఎన్నడును వెనుదీయము. నామట్టుకు నేను నిజమైన గ్రంథాలయ భావమును వారియందు సర్వదా దర్శించుచుంటిని. సుప్రసిద్ధ గ్రంథాలయ సేవకులుగను, అఖిల భారత గ్రంథాలయ సంఘ ప్రధాన కార్యదర్శిగను నూతన భావములతో నూతనోద్యమమునకు నిత్యసంసిద్ధులుగను వారిని ఎవ్వరును విస్మరింపజాలరు. అట్టి "రమణయ్య"లు ప్రతి రాష్ట్రమునకు లభింపవలయునని నేను దైవమును ప్రార్థింతును.

లాహోర్.

శాంతారాం భాటియా,

సంపాదకులు : "మాడరన్ లైబ్రేరియన్"

(పంజాబురాష్ట్ర గ్రంథాలయసంఘ పక్షమున ప్రకటింపబడు పత్రిక)

### సహజమైన ప్రవృద్ధి

"ఆంధ్రదేశము నందలి గ్రామములలో సహజముగా వృద్ధిపొందుచున్న గ్రంథాలయోద్యమము - దీర్ఘకాలముగా వచ్చు సామాజిక జీవితమును నిలబెట్టుటకును, జాతీయ భావములను పునరుద్దీప్తము గావించుటకును ఉద్దేశింపబడినదని నిస్సందేహముగా చెప్పవచ్చును."

భోగరాజు పట్టాభి సీతారామయ్య

### "వృత్తిగాగలవారిని లజ్జితులనుగా జేయును"

"వృత్తిగా గ్రంథాలయములతో సంబంధంగలవారిని గూడ లజ్జితుల గావింపగల వ్యక్తి శ్రీ వేంకట రమణయ్యగారు - వృత్తిలో నుండువారికది భుక్తిసాధనమగుటచే గాబోలు - ఆయనకుగల వుత్సాహంలో కొంచెమైన మనము ప్రదర్శింపలేకబోవుట ? అట్టి మనబోంట్లకు వారి సహచర్యము అత్యంతావశ్యకమని చెప్పనక్కరలేదు."

యం. ఓ. థామస్,

లైబ్రేరియన్, మద్రాసు యూనివర్సిటీ లైబ్రరీ.

## పనికిముందు : పదవులకు వెనుక

1914 వ సం॥లో విజయవాడలో శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహ కవిగారి యాజమాన్యమున గ్రంథాలయ సభ జరిగింది. ఆలమూరునుండి "సరస్వతీపుస్తక భాండాగారము" తరఫున నేను ఆ సభకు ప్రతినిధిగా వెళ్ళినాను. అప్పుడే అయ్యంకి వేంకటరమణయ్యగారితో నాకు ప్రథమ పరిచయము. అప్పటికే అయ్యంకివారు గ్రంథాలయోద్యమమున అధ్వర్యమువహించి ఆరితేరిన దిట్ట...... నేనప్పటికి స్కూలుఫైనలు చదువుచున్న విద్యార్థిని. ఇదివరకెన్నడును ఉపన్యాసవేదిక నెక్కని నన్ను ఆనాటి సభలో ప్రోత్సహించి మాట్లాడవలసిన విషయము, ప్రసంగింపవలసిన విధము, ఈ అంశములు ముందుగా తెలియజెప్పి యుపన్యాసమునకై గద్దె నెక్కించి భయము తీర్చినారు. నావలెనే ఎంతమందియో విద్యార్థులను అయ్యంకివారు గ్రథాలయోద్యమమున గద్దెనెక్కించి, భయముతీరిచి, యుద్యమాభిమానులుగా తయారుచేసినారు............ముందుకొచ్చి నా కపదవి కావాలని ఎన్నడూ ప్రాకులాడు గోరికలేదు. ఎక్కడచూచినా, తనపని మందహాసముతో చేసికొనిపోవడమే గాని, అధికార పదవులకోసము దేవుళ్ళాడుట లేదు. పనికిముందు, పదవులకు వెనుక – వీరి జీవితములో నా యనుభవము. ఆంధ్రదేశములో గ్రథాలయోద్యమము పల్లెలలోకూడ ప్రాకుటకు ముఖ్యహేతువు "నా బొందియేయని" రాత్రింబవళ్ళు జోలి చంకనువేసికొని "రమణయ్య"గారి వంటి నిరాడంబర సేవకుడొకడున్నాడు కనుకనే, జానపదములలోగూడ, ఊరూరా గ్రంథాలయములే వెలసినవి. అయ్యంకివారు సంచార గ్రంథాలయమేను.

ఆలమూరు,

నరసింహదేవర సత్యనారాయణ,<br>
ప్రెసిడెంటు, ఆలమూరు కో-ఆపరేటివ్ రూరల్ బ్యాంక్ లిమిటెడ్.

## క ర్మ యో గి

శ్రీ అయ్యంకి వేంకటరమణయ్యపంతులుగారిని వారి బాల్యమునుంచీ ఎరుగుదును. వారు నిజమైన కర్మయోగి... వేంకట రమణయ్యపంతులుగారు కేవలముత్సాహపరులు మాత్రమేగాక కార్యదీక్ష, సమర్థత, వారికమరి యుండుటచేతనే గ్రంథాలయోద్యమము దేశములో విజయము గాంచినది. వారు స్వయముగ కార్యముల నిర్వహించుటేగాక ఇతరులను కార్యములకు ప్రేరేపించుశక్తి కూడ వారికి మెండు. వారి చురుకుదనము, చిరునవ్వు, వారి సహచరుల మాంద్యమునకు మందయి కార్యకారులనుగా జేయును. ఇది నాయకుల ముఖ్యలక్షణములలో నొకటి.

గుంటూరు,

వున్నవ లక్ష్మీనారాయణ పంతులు,

## శ క పు రు షు లు

అయ్యంకి వేంకట రమణయ్య పంతులవారితో నాకు సుమారు పావు శతాబ్దమునుండియు పరిచయము కలదు. భారతవర్షము నందుండిన ప్రాచీన పుస్తక భాండాగారములను గురించిన కథలుగూడ మాసిపోయిన బహు సంవత్సరములకు తరువాత, భారతీయులు గ్రంథాలయ శబ్దార్థమునుగూడ మరచిన కాలమున, మరల గ్రంథాలయ శకమును ఆంధ్రదేశమున నారంభించిన 'శకపురుషుల'ని వీరిని చెప్పనొప్పును.

గుంటూరు,

కాశీ కృష్ణాచార్యులు, శతావధాని

## స్థాపకులు : నిర్వాహక శిరోమణులు

"......" వారి స్నేహపాత్రత, సహజోత్సాహము, కార్యదీక్ష, విజ్ఞాననిరతి, నన్నత్యంతము నాకర్షించినవి. ఒక యుద్యమమును చిరకాలము సాగించు భాగ్యముగూడ బొందగల్గుట లోకములో నరుదు.

శ్రీ వేంకట రమణయ్యగారు ఆంధ్రదేశములోని గ్రంథాలయోద్యమమునకు స్థాపకులు మాత్రమేగాక, నిర్వాహక నాయక శిరోమణులుగూడనైయున్నారు. ఈ నాడాంధ్ర దేశమున నన్ని గ్రంథాలయములు వెలయుటకును ఈరీతి నుద్యమము వృద్ధిపొందుటకును వారే ముఖ్యకారణమని చెప్పక తప్పదు. ఇట్టి దేశారాధకుల సేవను గుర్తించుట దేశీయులవిధి.

కొవ్వూరు,

జటావల్లభుల పురుషోత్తము, ఎం. ఏ.

## ఇది కవిత్వంకాదు నిజము

"విద్యావిహీనులంటే ఆయన హృదయం ఎంతో కరిగిపోతుంది. అట్టివారి విద్యకై ఆయన యెంతో శ్రద్ధ తీసికొని శ్రమపడతాడు. డబ్బు ఎంతఇస్తాడో రెండోకంటివాడికి తెలియదు. నేనుగూడా డబ్బుఇవ్వటం చూడలేదు. విద్యసంపాదించి స్వతంత్రులైనవారు చూపే కృతజ్ఞతవల్ల మాత్రమే ఊహిస్తాను.

ఏ పుస్తకమన్నా అచ్చుకాకుండా మానిపోవటం ఆయనకు ఇష్టములేదు. అది ఆయనకు వ్యసనము. మంచి వ్యసనమే అనుకోండి. ఈ వ్యసనములో ఆయన ఎంతోడబ్బును ఖర్చుచేసినాడని నాకుతెలుసు. అభివృద్ధిపొందదగినవారిని ఆయన పసిపట్టి తెలుసుకుంటాడు. ఆయనచేసే ప్రోత్సాహమువలన రాళ్ళు, సానలు తీరినజాతి రత్నాలు అవుతవి. ఇది కవిత్వంకాదు. నిజము.

వారి ఇల్లు ఒక సరస్వతీమందిరము. దినములు, నెలలు, ఆ పుస్తకాలుచూస్తూ, చదువుతూ గడుపుకోవచ్చును. అచ్చట అన్నిరకాల పుస్తకాలు వుంటవి. ఆయనకి సరస్వతీపూజ అంటే ఏమిటో బాగా తెలుసునట్లేవుంది.

పుచ్చా వెంకట్రామయ్య-
ఎడిటర్ "ప్రకృతి" "ఇండియన్ నేచురోపాత్"
ధంతలూరు అగ్రహారం.

## "ప్రజానీకంలో విశ్వాసమును కల్పించును"

"గ్రంథాలయోద్యమమునకు ఉత్పత్తి స్థానమైన బెజవాడ పట్టణమే భవిష్యత్తులో ఇతరులకు ప్రోత్సాహమొసగుటకును" ప్రజానీకంలో విశ్వాసమును కల్పించుటకును వుపకరించగలదు.

ఆర్. జనార్దననాయుడు
లైబ్రేరియన్, కనిమరా గ్రంథాలయం, మద్రాసు.

## "శాశ్వత జ్ఞాపక చిహ్నము"

"ఆయన కావించిన కృషి శాశ్వతమైన జ్ఞాపక చిహ్నమును నిర్మించుటకు తగినది."

సర్ సి. వి. రామన్.

## ఉదాత్త ఫలప్రదము

ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమము కార్య నిర్వాహకుల ఉత్సాహ శ్రద్ధల ఫలితముగా, సాంఘిక జీవితమునకు గ్రంథాలయమును కేంద్రముగావించు విధానమును మనకు ప్రదర్శించినది. సంస్కృతికిని సౌహార్దమునకు గ్రంథాలయమే కేంద్రము. సహకార కృషివలన ప్రజలకు సమకూరు ప్రయోజనములను చూపి గ్రంథాలయ సంస్థమాన్యతను గడించినది. ప్రభుత్వ సహాయములేకుండను, బైటనుండి విజ్ఞులను ఆహ్వానించకుండను స్థానిక కార్య నిర్వాహకుల కృషివల్లనే గ్రంథాలయోద్యమము ఉదాత్త ఫలప్రదమైనది.

యస్. యన్. ఫెర్వాని ఏం. ఏ.
(సోషియాలజీ ప్రొఫెసర్, బొంబే విశ్వవిద్యాలయం)

## గ్రంథాలయోద్యమ మూలకందము

ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమమునకు బెజవాడ మూలకందముగా నున్నది.

మద్రాసు కె. వేంకట రమణి, బి. ఏ. బి. యల్.

## అఖిల భారతమునకు బెజవాడయే ఆదర్శము

గ్రంథాలయోద్యమమునకు ఉద్దీప్తి నొసగు కేంద్రముగా అఖిలభారతము బెజవాడ దిక్కు చూడక తప్పదు. గ్రంథాలయోద్యమ ప్రయోజనము బెజవాడ యందే కొంతవరకు సాధింపబడినది.

రైట్ ఆన. శ్రీనివాసశాస్త్రి.

## ఆరితేరిన సేవకుడు

చిరకాలమునుండి గ్రంథాలయోద్యమమున ఆరితేరిన సేవకుడు శ్రీ రమణయ్యగారు.

సర్ టి. వి. కృష్ణమాచారి,
(దివాన్ - బరోడా సంస్థానము)

## రెండు నదులు

కొంతకాలముక్రితము నేను మైసూరు సంస్థానమున నందికొండలలో పర్యటించితిని. అక్కడ రెండు నంది విగ్రహములు కలవు - ప్రతి విగ్రహము నుండియు రెండు నదులు ప్రవహించుచుండునని స్థలజ్ఞులు చెప్పిరి. అందొకటి ఆంధ్రదేశమునందును, మరియొకటి తమిళదేశమునందును ప్రవహించుచున్న ఉభయ పినాకినులని వారివలన తెలిసికొంటిని. ఆనంది ద్వయము ఏకమైనట్లు ఊహించిన, ఆ రూపమే శ్రీ అయ్యంకి వేంకటరమణయ్యగారి గ్రంథాలయ సేవకా స్వరూపముగా భావించవచ్చును.

మద్రాసు, రావుసాహెబ్ యస్. ఆర్. రంగనాథన్,
(లైబ్రేరియన్, మద్రాసు యూనివర్సిటీ లైబ్రరీ)

## విసుగెఱుగని సేవకుడు

శ్రీ అయ్యంకి వేంకట రమణయ్యగారివంటి విసుగెఱుగని సేవకుడు మనకు లభించుట మన మహాదృష్టము. 1914 లో ఆంధ్రదేశ గ్రంథాలయసంఘము నిర్మితమగుటకు వారే కారకులు. కార్యరూపకమైన వారి ఆదర్శమును గ్రహించి గ్రంథాలయోద్యమమున కృషిచేయుటయే మనవలన వారు వాంఛించునది. ఉదాత్తములగు ఆదర్శములే విజ్ఞాన జ్యోతుల వెలిగింప జాలినవి.

నూజివీడు యం. ఆర్. అప్పారావు బహదూర్, ఎం. ఏ,.
ఉయ్యూరు కుమార జమీందారు.

## ఉద్యమమున ఆంధ్రదేశమే విశేషముగా పురోగమించినది

గ్రంథాలయోద్యమమున ఆంధ్రదేశము అధికముగా పురోగమించి తక్కువంగల ప్రాంతములకు మార్గదర్శకమగుట ప్రశంసనీయముగానున్నది. ఉత్తమ దేశభక్తుల అవిరళకృషి మూలముగనే ఆంధ్రదేశమున గ్రంథాలయోద్యమము జయప్రదముగా విస్తరించుచున్నది. ఉద్యమ సత్ఫలితములు ప్రత్యక్షగోచరము లగుచున్నవి. దేశభాషాభివృద్ధికి మిక్కిలి దోహదము కలిగినది. ఆంధ్రరాష్ట్ర ప్రాప్తికిని, స్వరాజ్యమునకును ఆంధ్రులు తమఅర్హతను గ్రంథాలయోద్యమ ముఖమున నిదర్శనపూర్వకముగా రుజువుగావించిరి.

మద్రాసు రావుబహదూరు కె. వి. కృష్ణస్వామి అయ్యరు,
మద్రాసు లైబ్రరీ అసోసియేషన్-ప్రెసిడెంటు

## గ్రంథాలయోద్యమమునకును, వయోజన విద్యాప్రచారమందును శ్రీ రమణయ్యగారే మార్గదర్శకులు

ఆరంభమునుండియు ఆయన కార్యపరజీవిగా నున్నారు. రెండు దశాబ్దములనుండి వారితో నాకు పరిచయము కలదు. గ్రంథాలయోద్యమమున నేను ఏమాత్రము కృషిచేసినను దానికి ప్రబోధ మొసగినది వారి అవిరళ కార్యదీక్షా పరత్వమే. అఖిలభారత గ్రంథాలయ సంఘ స్థాపనము వారి కృషిఫలితమే. వారితో పరిచయభాగ్యము లభించిన ప్రతి వ్యక్తిని ఆకర్షింపగల ఉత్తమ గుణ గరిష్ఠులు వారు.

డి. డబ్ల్యు. జోషి, బి. ఏ., బి. టి.,
బొంబాయి — మహారాష్ట్ర గ్రంథాలయసంఘ గౌరవ కార్యదర్శి.

## నాకు మిక్కిలి గౌరవాదరములు కలవు

ఆంధ్రదేశమున గ్రంథాలయోద్యమము విస్తరించుటకు, తద్వారా దేశమంతటను ప్రాకుటకును మూలకారకులగు శ్రీ రమణయ్యగారియెడల నాకు ఎంతేని గౌరవమును, భక్తియు గలవు. గ్రామీణ గ్రంథాలయములద్వారా వయోజన విద్యను విస్తరింప జేయుటయే వారు జీవితపరమార్థముగా నిర్వహించుచున్నారు.

లక్నో, — వి. శివరాం, ఎం. ఏ, పి. హెచ్. డి.,
రాజ్యాంగశాస్త్ర పండితులు, లక్నో యూనివర్శిటీ.

## వారి పేరు గృహములలోనికి ప్రాకినది

గ్రంథాలయముల ద్వారా వయోజన విద్యావ్యాప్తిని గావించు కృషిపట్ల వారు ప్రదర్శించుచున్న కార్యోత్సాహమును, కార్యదీక్షయు జగమెఱిగిన విషయములు- ఉద్యమ నిర్వాహకులలో వారిది అగ్రస్థానమని చెప్పకతప్పదు. పెక్కురు యువక కార్యకర్తలకు వారు ఆదర్శప్రాయులుగా నున్నారు. వారి పేరు ప్రతి గృహమునకును ప్రాకినదని చెప్పవచ్చును. వారి కృషిఫలితముగా ఆంధ్రదేశమున ప్రభుత్వసహాయ మపేక్షింపకుండ దేవాలయ గ్రంథాలయములు స్థాపితములగుట ఒక విశేషము.

డి. సుబ్రహ్మణ్యం, ఎం. ఎ.,
కాశీ, — లైబ్రేరియన్, కాశీ హిందూ విశ్వవిద్యాలయము.

## గ్రంథాలయోద్యమమున "శ్రీఅయ్యంకి" స్థానము సుప్రతిష్ఠితము

శ్రీ వేంకటరమణయ్యగారు తమ జీవితమున అపజయమన్నది ఎరుగరు. ఆ పదము వారి నిఘంటువున లేదని చెప్పవచ్చును. వారు ఉత్సాహపరులగుటయే కాక ప్రక్కవారికి ఉత్సాహము నెక్కించుటకు వారు సర్వదా యత్నింతురు. అనగా వారికి కార్యవిఘ్నము లెన్నడును కలుగవని కాదు. అపజయమును నిరాకరించు వారి చిత్తవృత్తినే నేను పాటింతును. శ్రీ "అయ్యంకి" అపజయమునకు విరుగుడు మందు. ఆ శుభ లక్షణమే వారికి ఉద్యమమునందు జయ పరంపరలను సమకూర్చినది. పెక్కు అవరోధములను అధిగమించుటకు తోడ్పడినది. ఉద్యమ నిర్వహణమునందు వారి ప్రతిభ నవనవోన్మేషముగా అభివ్యక్త మగుచుండును. నిష్కామ కర్మయే వారి ఏకైక లక్ష్యము. ఆంగ్లమున ప్రచురింప బడు గ్రంథాలయ పత్రిక ద్వారా వారు సార్వదేశికమైన సంబంధములను నెలకొల్పుకొన గల్గిరి. గ్రంథాలయ యాత్రాదళములు వారి ప్రతిభా ఫలితముగా ఉద్యమమునకు సమకూరిన అపూర్వ సృష్టియని చెప్పదగును. అవి గ్రంథాలయోద్యమమునకు "దండి"యాత్ర వంటివి.

గాడిచెర్ల హరిసర్వోత్తమరావు.
మద్రాసు — ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘాధ్యక్షులు.

## మార్గదర్శకులు

గ్రంథాలయోద్యమమునకు మార్గదర్శకులగు శ్రీ అయ్యంకి వేంకటరమణయ్యగారి యెడల కృతజ్ఞత చూపుట మన ధర్మము. వారి కృషికి సర్వతోముఖ విజయము నాకాంక్షింతును.

మద్రాసు — సి. రాజగోపాలాచార్యులు.

## శ్రీ రమణయ్యగారివంటి నాయకుడు లభించుట ఆంధ్రజాతి అదృష్టము

అఖిలభారత గ్రంథాలయ మహాసభలో వారిని ప్రప్రథమముగా కలిసికొంటిని. ఉత్సాహపూరితమైన వారి వ్యక్తిత్వము నన్ను మిగుల ఆకర్షించినది. వారియందు ప్రచారక దీక్ష యుట్టిపడుచుండినది. వారిని గూర్చి నేను చదివిన దానిని బట్టియు, తెలిసిన దానిని బట్టియు ఆంధ్రజాతి అదృష్టమువల్లనే అట్టి నాయకుడు లభించినట్లు నిస్సందేహముగా చెప్పగలను.

నాగపూరు

వై. యం. ములే,
నాగపూరు యూనివర్శిటీ గ్రంథాలయము లైబ్రేరియన్.

## భారతమున ఆంధ్రమే అగ్రగామి

గ్రామీణ గ్రంథాలయములద్వారా ప్రజానీకమున సంస్కృతి విజ్ఞానములను విస్తరింపజేయుటలో భారతమున ఆంధ్రమే అగ్రగామి.

మద్రాసు

యస్. యస్. రాజగోపాలన్, ఎం. ఏ., యల్. యల్. బి.,

మీ "ఇండియన్ లైబ్రరీ జర్నలు" బహు ప్రయోజనకారిగా నున్నది. వారికి నా ధన్యవాదములు.

నాన్‌కింగ్-చైనా

హూ - చాంగ్ - చూన్.
డైరెక్టర్, నేషనల్ సెంట్రల్ లైబ్రరీ - చైనా.

ఆంధ్ర దేశమున గ్రంథాలయోద్యమము బహు ప్రయోజనకరముగను, సమర్థవంతముగను నిర్వహింపబడుచున్నట్లు నా పర్యటన కాలమున గ్రహించితిని. ఆంధ్రులు తమ దేశమున గ్రంథాలయమును ఒకసంస్థగా సరిదిద్దుకొనిరి.

బాబు రాజేంద్రప్రసాద్,
భారత రాష్ట్రపతి

గ్రంథాలయోద్యమవ్యాప్తికై తమ ప్రాంతములో వారు కావించినకృషి నాకు తెలియును. మన రాష్ట్రమునకూడ ఉద్యమవ్యాప్తికి వారు విశేషదోహదము గావించిరి. బరోడాసంస్థాన గ్రంథాలయ మహాసభకు వారు స్వయముగా హాజరైరి.

బరోడా

జి. హెచ్. జోషి,
బరోడా గ్రంథాలయ సంఘాధ్యక్షులు.

శ్రీ అయ్యంకి వేంకట రమణయ్యగారితో దాదాపు వారు గ్రంథాలయోద్యమము ప్రారంభించిన నాటి నుండి పెక్కుసంవత్సరములుగా నాకు మైత్రి కలిగినది. వారియెడల నాకెంతేని గౌరవ సౌహార్దములు కలవు. వారి ప్రతిష్ఠకు తగురీతిని ఈ యుత్సవ కార్యక్రమమును నిర్వాహకులు జయప్రదము గావింపగలరని నమ్ముచున్నాము.

పి. స్వామి బాబు,

శ్రీ అయ్యంకి వేంకట రమణయ్యగారికి చిరాయుష్యమును, సౌఖ్యమును కలుగవలెననియు, ఉత్సవములు జయప్రదముగా జరుగవలెననియు ఆకాంక్షించుచున్నాను.

మద్రాసు

పి. యస్. కుమారస్వామిరాజా.

"సర్వస్వమనెడి పత్రిక, ధూర్వహుడై నడపె నితడు తొల్లి లవంబున్
గర్వంబెఱుగం డీతని, శర్వుడు రక్షించుగాక సకల విధములన్."

విజయవాడ

చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి, శతావధాని.

# అభినందనములకు విషయసూచిక




| | |
|---|---|
| ఆశిషమ్ : ఆదిభట్ల నారాయణదాసు | ౩ |
| పంచరత్నాని : చర్ల భాష్యకారశాస్త్రి | ౪ |
| "శకపురుషులు" : కాశీ కృష్ణాచార్యులు (శతావధాని) | ౫ |
| "స్థాపకులు - నిర్వాహక శిరోమణులు" : జటావల్లభుల పురుషోత్తము, ఎం. ఏ. | ,, |
| విజయుడు : జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి, ఎం. ఏ., బి. యల్. | ౬ |
| పరిచయవాక్యములు : శ్రీ గోపరాజు బ్రహ్మానందం | ౮ |
| గ్రంథాలయ విధాత : దేశపాండ్య సుబ్బారావు | ౧౦ |
| మంత్రి సన్మానము : అబ్బరాజు హనుమంతరాయశర్మ పాకయాజి | ౧౪ |
| పరితోషము : మంగిపూడి పురుషోత్తమశర్మ | ౧౫ |
| మనుజునకు పసిపాపడు జనకుడగును : శే. వేం. రాఘవ అయ్యంగారు, ఎం. ఏ. బి. ఇడి. | ౨౨ |
| ఆశీర్వచనము : చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి, శతావధాని | ౨౩ |
| అభివందనములు : ఉమర్ ఆలీషా | ,, |
| కులాబ్ధి చందిరుడు : పండిత దంటు సుబ్బావధాని | ౨౪ |
| నా పరిచయము : చెన్నుభొట్ల భానుమూర్తి, బి ఏ; ఎల్. టి. ఎన్. డి. | ౨౮ |
| ప్రశంసా పద్యములు : శ్రీ శేషాద్రి రమణకవులు | ౩౦ |
| సన్మాన ప్రశంస : కవిరాజ, కవిరత్న చింతపల్లి రామకృష్ణశాస్త్రి | ౩౧ |
| చంద్రకళ : ఆచంట రామలింగేశ్వరరావు, బి. ఏ., బి. ఇడి. | ౩౩ |
| అయ్యంకివారి చిన్నవాడు : వి. యల్. శాస్త్రి | ౩౪ |
| నా పరిచయము : పుచ్చా వెంకట్రామయ్య | ౩౬ |
| పరిచయవాక్యములు : నరసింహదేవర సత్యనారాయణ | ౩౭ |
| ప్రశంస : కవిరత్న, శ్రీరామ్ వీరబ్రహ్మకవి | ౩౮ |
| పరిచయవాక్యములు : చట్టి నరసింహారావు | ౪౪ |
| పరిచయసంపద : తుర్లపాటి గోవర్ధనరావు | ౪౮ |
| గ్రంథాలయోద్యమ భీష్ముడు : డా. గోనెళ్ళ వెంకటేశ్వర్లు, ఏ. ఆర్. ఏ. సి. | ౪౯ |
| అసమానసేవ : తిత్తి బలరామయ్య | ౫౨ |
| దేశసేవావ్రతి : కామరాజు హనుమంతరావు | ౫౧ |
| ప్రశంస : శ్రీరామ పుస్తక భాండాగారము, తణుకు | ౫౩ |
| గ్రంథాలయోద్యమము - దివ్యజ్ఞానసమాజము : శ్రీ గోపరాజు వెంకటానందము | ,, |
| మేధాదాత : అట్లూరి వెంకటసీతమ్మ | ౫౬ |
| ధన్యజీవి : దుర్భాక కృష్ణయ్య | ౫౭ |
| స్వతంత్రజీవి : విద్వాన్ కవితావిశారద సత్యనారాయణరాజు | ౫౮ |
| వీరపూజ : పామర్తి వేంకట రమణారావు | ౬౧ |
| "తత్కర్మ, తదస్మి" : కాకరపర్తి సత్యనారాయణ | ౬౨ |
| ప్రశంస : శతావధాని, భాషాప్రవీణ బూరాడ గున్నేశ్వరశాస్త్రి | ౬౩ |
| కిరీటం : వేదాంతకవి | ౬౪ |

మాపొత్తు : మారేపల్లి రామచంద్ర కవి ౬౫
అయ్యంకివారు : కోటమర్తి చినరఘుపతి ౭౧
గురుపీఠము : ఒక మిత్రుడు ౭౨
"గురువు శిష్యుడాయె, శిష్యుడు గురువాయె" : వారణాసి వేంకట సుబ్బారావు ౭౩
స్వాగతము : జాలిపర్తి సీతారామారావు ౭౪
పంచరత్నములు : శ్రీ జి. గోపాలరావు ౭౫
పంచరత్నములు : డాక్టర్ ఆ. సీతారామస్వామి ౭౬
సార్థకజీవి : భమిడిపాటి అయ్యప్పశాస్త్రి ౭౭
ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమముయొక్క ప్రథమ సంవత్సరములు : అయ్యదేవర కాళేశ్వరరావుపంతులు ౮౧
కర్మయోగి : వున్నవ లక్ష్మీనారాయణ పంతులు ౮౬
ఆశీస్సు : చిలకమర్తి లక్ష్మీనరసింహం ౮౭
సందేశము : బెజవాడ రామచంద్రారెడ్డి ,,
అభినందనము : కందుకూరి రామభద్రరావు ౮౮
ప్రశంస : వేగేశన సూర్యనారాయణరాజు ,,
మా మిత్రుడు : శ్రీ పరమహంస వాసుదేవానంద సరస్వతీస్వామి ౯౦
పరిచయ వాక్యములు : పెద్దప్రోలు సూర్యనారాయణ ౯౨
పరిచయము : కో. వెం. రా. లా. సా. శర్మ ౯౩
గ్రంథాలయాల జాన్ ది బాప్టిస్టు : ఆవటపల్లి నారాయణరావు ౯౪
పురుషోత్తముడు : కవయిత్రీమణి గుడిపూడి ఇందుమతీదేవి ౯౯
గ్రంథాలయోద్ధారక : నిడదవోలు వేంకట్రావు ౧౦౦
మేలు బంతి : మంగిపూడి వేంకటశర్మ ౧౧౦
"భావస్థిరాణి జననాంతర సౌహృదాని" : రాయప్రోలు సుబ్బారావు ౧౧౧
సారస్వతోపాసకుడు : వెల్లంకి కృష్ణమూర్తి ౧౨౩
ప్రశంస : నందిరాజు చలపతిరావు ౧౨౭
అభినందన పత్రిక : ౧౩౧
ఆశీర్వచన పద్యపంచకము : ౧౩౪

# ఆశీషమ్

శ్లో. అయ్యంకి వేఙ్కట్రమణః

సత్యవా క్పండితాగ్రణీః

వదాన్యః సద్గ్రంథగోప్తా

జీయా దాచంద్రతారకమ్.

ఆదిభట్ల నారాయణదాస్

[illegible]

A. Narayanadas.

ఆ॥ నారాయణదాసు

# పంచరత్నాని

శ్లో. అయ్యంక్యన్వయదుగ్ధవారిధిశరద్రాకాసుధాదీధితి
శ్రీమద్వేంకటశబ్దపూర్వరమణారాయ శ్చిరం జీవతాత్
నానాదేశవిదేశపత్తనమహాపల్లీ ప్రచారావహో
తద్గ్రంథాలయసేవనే కృషి రపి ప్రోజ్జృంభతాం సర్వదా.

శ్లో. గ్రంథానాం నిలయా స్సమస్తవిధయా లోకస్థితే ర్హేతవో
విజ్ఞాతం తదిదం సమస్తమనుజై ర్భూమీతలస్థాయిభిః
తస్మాత్సర్వజనై స్తదర్థ మధికం కార్యః ప్రయత్న స్సదా
నోచే ద్దీపవిహీనమందిరసమం విజ్ఞాయతాం భూతలమ్.

శ్లో. తస్మాదేవ పురాతనా విభువరా ఆనీయ విద్వత్కవీన్
తేభ్యః ప్రాప్య కృతీ ర్బహూ ర్బహువిధా గ్రంథాలయా స్థాపితాః
తస్మాదేవ సమస్తలోకవితతే స్తే చోపయుక్తా స్సదా
నోచే ద్భూతలవాసినః కథ మమీ విజ్ఞానయుక్తా జనాః.

శ్లో. యుక్తాయుక్త వివేకజాతకలనే గ్రంథాః ప్రధానం సదా
తస్మాదేవ సమస్తమర్త్యనివహా స్తద్గ్రంథసంపాదనే
సోత్సాహా నితరాం భవంతి భువనే ద్రవ్యవ్యయే నాధికం
గ్రంథానాం నిలయా స్తతోధికతమం సంస్థాపనీయా భువి.

శ్లో. సూర్యప్రకాశరహితం దివసం యథా స్యాత్
చంద్రప్రభావిరహితం గగనం యథా స్యాత్
సద్దీపకాంతిరహితం సదనం యథా స్యాత్
గ్రంథాలయై ర్విరహితం భువనం తథా స్యాత్.

కాకరపట్టు.

చర్ల భాష్యకార శాస్త్రీ.

## "శకపురుషులు"

మ. రా. శ్రీ. అయ్యంకి వేంకటరమణయ్య పంతులవారితో నాకు సుమారు 1/4 శతాబ్దము నుండియుఁ బరిచయము కలదు. భారతవర్షమునందుండిన ప్రాచీన పుస్తక భాండాగారములను గుఱించిన కథలుగూడ మాసిపోయిన బహుసంవత్సరములకుఁ దరువాత, భారతీయులు గ్రంథాలయ శబ్దార్థమును గూడ మఱచిన కాలమున, మఱల గ్రంథాలయ శకమును ఆంధ్రదేశమున నారంభించిన శకపురుషులని వీరిని చెప్పనొప్పును. పాశ్చాత్యభాషయందు దారి తేరిన వీరు పాశ్చాత్యదేశములందుఁ గలిగిన గ్రంథాలయ ఫలితములను జక్కఁగ ననుభవమునకుఁ దెచ్చికొని మన దేశమునఁ గూడ గ్రంథాలయములను నెలకొల్పి మన దేశస్థులను బహువిధవిజ్ఞానధనుల నొనర్చిన మహామహులు, నే నెఱిఁగినంతలో శ్రీ అయ్యంకి వేంకటరమణయ్య పంతులవారని, నే దృఢముగఁ జెప్పఁగలను. ఇట్టివారు మన కృష్ణామండలమున నవతరించి మన సమానకాలికులై దేశసేవ నొనర్చుచుంట మన కెంతయుఁ బ్రమోదావహ మనుట కెంతమాత్ర మనుమానము లేదు. వీరి కింకను జిరకాల మాయు రారోగ్యభాగ్యముల నొసఁగి పరమేశ్వరుఁడు వీరిచే దేశసేవఁ జేయించుచుండు గాత!

గుంటూరు.

కాశీ కృష్ణాచార్యులు,
శతావధాని.

Δ

## "స్థాపకులు - నిర్వాహక శిరోమణులు"

శ్రీ అయ్యంకి వేంకటరమణయ్య పంతులుగారితో నాకు తొమ్మిది సంవత్సరముల నుండి పరిచయమున్నది. వారి స్నేహపాత్రత, సహజోత్సాహము, కార్యదీక్ష, విజ్ఞాననిరతి, నన్నత్యంతము నాకర్షించినవి.

ఒక యుద్యమమును ప్రారంభించు నదృష్టము గల్గి, యా యుద్యమమును జిరకాలము సాగించు భాగ్యమును గూడఁ బొందఁ గల్గుట లోకములో నరుదు. శ్రీ వేంకటరమణయ్యగారు ఆంధ్రదేశములోని గ్రంథాలయోద్యమమునకు స్థాపకులు మాత్రమే కాక నిర్వాహకనాయక శిరోమణులుగూడనై యున్నారు. ఈ నాఁ డాంధ్రదేశమున నిన్ని గ్రంథాలయములు వెలయుటకును ఈ రీతిని నుద్యమము వృద్ధిపొందుటకును వారే ముఖ్యకారణ మని చెప్పక తప్పదు.

శ్రీ వేంకటరమణయ్యగారికిఁ బ్రజాహితాభివృద్ధులకుఁ దోడ్పడు సమస్తోద్యమములును హృదయసన్నిహితములే. ప్రకృతిచికిత్స, దివ్యజ్ఞానసమాజములలో వారి శ్రద్ధ మిక్కుటము. ఇట్టి దేశారాధకుల సేవను గుర్తించుట దేశీయుల విధి.

సంస్కృత కళాశాల, కొవ్వూరు.

ఊటావల్లభుల పురుషోత్తము, ఎం. ఏ.,

# 'విజయుడు'

శ్రీ వేంకటరమణయ్యపంతులుగారు ఆంధ్రలోకమునకు చిరపరిచితులు. సుమారు మూడు దశాబ్దుల నుండి ఆంధ్రవైజ్ఞానికాంగణమున వారు ముందంజ వేయుచున్నారు. గ్రంథాలయ మహోద్యమ స్యందనమున సారథియై, ధర్మక్షేత్రమైన మన సారస్వతక్షేత్రమున పాంచజన్యమును పూరించుచు వారు తమ తేరును నడపుచున్నారు. రథియై వెలయువాడు ఆంధ్ర జిజ్ఞాసువు. కపి ధ్వజముపై మనసుంచి దేవదత్తమును పూరించుచు నీతడు విజయుడై విలసిల్లుచున్నాడు.

ఉద్యమ విజయమునకు మార్గదర్శకులు శ్రీ వేంకట రమణయ్య పంతులుగారు.* యుగమర్యాద ననుసరించి శంఖమును పూరించు విధానములు మారుచుండును. స్థలకాలావధులు నేడు సంకుచితములైనవి. వసుంధర వివిధాగారవిలసితసదనమైనది. జాతులును, భాషలును, ఉద్దేశములును సన్నిహితములైనవి. విలియమ్ కేక్స్టన్ యొక్క యంత్రాలయము తలసూపనినాడు వాఙ్మయము విశేషించి కంఠస్థమై యుండెను, తరువాత నది గ్రంథస్థము కాజాలినది. గ్రంథాలయము విద్యాలయమైనది. అది వాణీమందిరమే కదా!

గ్రంథాలయములు నెలకొనిన మంగళముహూర్తమందే ఆధునికయుగదిశావలయమున భాస్కరమండలము వలె భావోద్యమ ముదయించె నని ప్రపంచసారస్వతచరిత్రలు తెలుపుచున్నవి. వివిధదేశములందు గ్రంథాలయోద్యమములు క్రమాభివృద్ధి నందినవిధమును సింహావలోకన మొనరించుట కిందు తావు లేదు. ఆంధ్రదేశమున గ్రంథాలయోద్యమచరిత్రమందలి వివిధ ఘట్టములను పరిశీలించుటకైన నిందు చోటు లేదు. శ్రీ వేంకటరమణయ్యపంతులుగారి జీవితచరిత్ర లోని వివిధాంశము లీ ఘట్టములందు మధురగంధబంధురములై ప్రస్ఫుటించిన వని కంఠ మెత్తి వచింతును. వారి జీవితచరిత్ర గ్రంథాలయచరిత్రకు పర్యాయపదము కదా !

ఉద్యమవిజయమునకై వా రొనరించిన ప్రయత్నములు బహుళములు. నవయుగ సంప్రదాయమున కనుకూలముగా నివి నడచినవి. పత్రికాప్రచురణములవలనను, బహువిధప్రచారములవలనను, ఉద్యమోద్దేశ్యములను అసంఖ్యాకుల హృదయకేదారములందు వారు వెదజల్లిరి. అందవి మొలకలెత్తి, పెంపొంది, రంగారు బంగారుపైరై ఆంధ్రజనయిత్రికి కనులపండు వొనరించుచున్నవి.

పాలకులు శ్రీ వేంకటరమణయ్యగారి విజయోత్సాహమును గని ఉద్యమమునకు♦ చేయూత నీయ గడంగిరి. ప్రజలు పూలమాలల జేకొని పరమపరితోషముతో నేడు వారిని సన్మానించుచుండుట చూచి తనకు జరగు సపర్యయే యని యూహించి కాబోలు ఆంధ్రవాణి మురియుచున్నది.

---

* దివ్యజ్ఞాన సమాజము వారి యుద్యమమునకు గూడ పెక్కేండ్లనుండి వీరు చేయూత నొసంగుచున్నారు.

♦ ప్రకృతి యుద్యమము కూడ వీరి కృషిఫలితమును బడసినది.

కొలదిసంవత్సరములకు మున్ను గ్రంథాలయ యాత్రలందు యాత్రికుడనై, శ్రీ పంతులుగారి ననుసరించి ఆంధ్రమండలమందు సంచరించుభాగ్యము నాకు గలిగెను. భారతదేశమందలి ఇతర రాష్ట్రములందు ఈదృశయాత్రలందు పాల్గొను తరుణములు బహుళముగా నాకు లభించెను. ఆంధ్రదేశగ్రంథాలయోద్యమము అన్యరాష్ట్రమహోద్యమములకంటె ముందజ వేసినదని గ్రహించితిని. ఆంధ్రగ్రంథాలయ యాత్రలందు నాయకులై సంచరించినవారు శ్రీ వేంకటరమణయ్య పంతులుగారు. ఉత్సాహపూరితహృదయులైన యువకులు వల్వూరు వారి మేలిదృష్టాంతమును మేలుబంతి జేసికొని పెక్కుకష్టములను నెట్టివేయుచు, సంయుక్తబలముతో ఉద్యమరథరజ్జువును లాగుచున్నారు. వీరి కృషి ఫలితముగ పల్లెహృదయము నవనవోన్మేషశాలినియై వెలయజాలు నని విశ్వసించుచున్నాను.

గ్రంథాలయోద్యమము వైజ్ఞానికోద్యమ మనియే నా యభిప్రాయము. దీని ననుసరించియే తక్కిన యుద్యమములు (రాజకీయ మత సాంఘికోద్యమములు) నడచునని ప్రపంచచరిత్రములనుండి దృష్టాంతముల నుల్లేఖించుచు దెలుపుచుందును. దేశనాయకు లీ యంశమును గమనించి, పూర్వోక్తమందిరమున ప్రవేశించి, వాగ్దేవి నారాధించి (భవానిని సేవించి స్వీయకురుక్షేత్రమున లంఘించిన శివాజివలె) తమతమ కర్మక్షేత్రములందు ముందంజ వేసి రేని విజయధ్వజమును చేబట్టగలరు.

ఆంధ్రగ్రంథాలయోద్యమనాయకులైన శ్రీ వేంకటరమణయ్య పంతులుగారిని సన్మానించు సహృదయులకు నేను ధన్యవాదములు సమర్పించుచున్నాను. విశాలదృష్టిగలవారును, విజ్ఞానదృష్టి గలవారును మాత్రమే యిట్టి సన్మానోత్సవములను నెఱపజాలుదురు. ఇట్టివారివలన దేశాభ్యుదయము సన్నిహిత మగును.

శ్రీ పంతులుగారి సంకల్పశక్తి అనిర్వచనీయమైనది, వారి కార్యకౌశలము అద్భుతమైనది. గురుగుణసమన్వితులై మహిమోపేతమైన వ్రతమున వారు బద్ధదీక్షితులై యున్నారు. మందిరమందలి భాషాసీమంతిని ఈ యుపాసకుని జూచి మురియుచున్న దంటిని. ఉపాసకునిపై నేడు పడు పూవు చెండు తాత్త్వికసంప్రదాయము ననుసరించి దేవీమస్తకముపై కూడ పడుట నిక్కము. తోడ్తోడనే ఆ తల్లి చేతులనుండి శుభాక్షతలు ఉపాసకుని ఉత్తమాంగముపై రాలుచుండుట ప్రేక్షకులు విలోకింపగలరు. అక్షతలసంఖ్య వత్సరసంఖ్యయై ఉపాసకుని ఆయుష్కాలమును సూచించును సుడీ! అవి నూటికి మించి యుండునని జోస్యము చెప్పుచుంటిని. శ్రీ వేంకటరమణయ్యపంతులుగారు దీర్ఘాయువుతో వర్ధిల్లగల రని పరమప్రమోదముతో పలుకుచున్నాను.

మద్రాసు

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి, ఎం. ఏ., బి. యల్.

# పరిచయ వాక్యములు

## శ్రీ గోపరాజు బ్రహ్మానందంగారు

ముప్ఫై యేండ్లనాటి మాట. రామమోహనధర్మ గ్రంథాలయం అను పేరుతో చిన్న ఆల్మయిరా పుస్తకాలు నెలకు రు 3-0-0 లు అద్దె కూడా చెల్లింపలేని స్థితిలో ఒక చిన్న గదియం దుంచబడినది. ఆనాటి సాయింత్రం మినుకు మినుకు మని చిన్న వెలుతు రిచ్చుచున్న లాంతరు దీపంయెదుట కూర్చుని 'రేపటినుంచి హిందూపత్రిక తెప్పించడం మానేస్తాం-డబ్బేమీ లేదు' అనుకొంటూన్నాం. అంతకు పూర్వమే చేతిలో మేగజైనులు న్యూసుపేపర్లు చేతపట్టుకొని పొడుగుపాటి ఆకారంతో వచ్చి నుంచున్న యెర్రటి యువకుడు ఈ మాటలు విని 'హిందూపత్రిక మానితే యెల్లాగండీ!' అని అన్నాడు. 'డబ్బో?' అని మా శంకర వేంకటరామయ్య మాభండారం బయటపెట్టాడు. అప్పుడాయన 'డబ్బుకేం లెండి. నే నీనెల కిస్తాను. ఇదిగో తీసుకోండి' అంటూ హిందూ పత్రిక చందా యిస్తూ నే నీ వూళ్లో ఉంటానని కూడా అన్నాడు. వేంకటరామయ్య వెంటనే ఆయనగారికి సెక్రటరీ హోదా కట్టిపెట్టాడు. ఆయనే అయ్యంకి వేంకటరమణయ్యగారు. ఆరోజు రామమోహన గ్రంథాలయమునకే గాక గ్రంథాలయోద్యమమునకు సుదినం.

వేంకటరమణయ్యగారికి అప్పటికి 20 యేండ్లు ఉండునో - ఉండవో. అప్పటికే ఆయన ఊహలు ఆకాశం అంటుతూన్నాయి. అప్పటికీ - ఇప్పటికీ కూడా అంతే. దానితోపాటు ఆవటపల్లి నారాయణరావు, కోన సీతారామారావు, డా. పట్టాభిసీతారామయ్య, కోపల్లి హనుమంతరావు, ముట్నూరి కృష్ణారావుగార్ల పరిచయభాగ్యమున వేంకటరమణయ్యగారికి జాతీయాశయములు బాగా నాటుకొని విస్తరించినాయి. అప్పటికే ఆంధ్రదేశంలో మొట్టమొదటి ప్రయత్నంగా సచిత్రమాసపత్రికను 1909 సం॥లో ఆంధ్రభారతి యను పేరుతో ప్రారంభించి, కొన్నాళ్లు సాగించారు. వేంకటరమణయ్యగారు, మంగిపూడి వేంకటశర్మ, రాయప్రోలు సుబ్బారావు, ముట్నూరి సుబ్బారాయుడు మున్నగు యువకులకు ప్రోత్సాహ మొసంగుచుండిరి. మంచి కలిమిగల తల్లిదండ్రులకు ఏకైకపుత్రు డగుటచే ఎక్కువ గారాబంతో పెంచబడియు, దేశసేవకుడుగా అనుభవించవలసిన కష్టనిష్ఠురములకు తయారైనాడు. రామమోహన లైబ్రరీలో వేంకటరమణయ్యగారు అడుగు పెట్టిననాడే నూతనశకం ప్రారంభం అయింది. గ్రంథాలయం నిండా అనేక పత్రికలను తెప్పించి యుంచడం మొదలుపెట్టారు. అనేక పుస్తకాలను చేర్చారు. గ్రంథాలయమునకు దమ్మిడీ లేనిస్థితిలో ప్రస్తుతపు గ్రంథాలయమున్న స్థలము వేలమవుతూండగా రు 4000/- లకు పాడాము. సూరి నరసింహశాస్త్రిగారు, అయ్యదేవర కాళేశ్వరరావుగారు, బొడ్డపాటి వేంకటప్పయ్యగారు, పెద్దిభొట్ల వీరయ్యగారు మొదలగు బెజవాడ పెద్దలు వేంకటరమణయ్యగారి ఉత్సాహాని కచ్చెరువొంది వారివారిశక్తి ననుసరించి గ్రంథాలయాభివృద్ధికి తోడ్పడ్డారు. వేంకటరమణయ్యగారు రోజంతయు గ్రంథాలయమునందు పుస్తకముల నమర్చుటలోను, కేటలాగు

వ్రాయుటలోను, మరి యితరపనులలోను తన కాలమంతయు వినియోగించుచుండేవారు. వేంకట రమణయ్యగారే గ్రంథాలయము - గ్రంథాలయమే వేంకటరమణయ్యగారు అన్నట్లు పని జరిగి పోతూండేది. స్వంతం దమ్మిడీ లేకుండా వేనకువేలు పెట్టి కొనడం, దానిలో మూడంతస్థుల మేడను నిర్మించుటకు తగిన పునాదులు వేయించడం, భవననిర్మాణమునకు కావలసిన ద్రవ్యమునకు ప్రయత్నించడం మున్నగు పనులన్నియు వేంకటరమణయ్యగారి యుత్సాహంవల్లనే జరిగెననుట నిక్కవము. వేంకటరమణయ్యగారు గ్రంథాలయమునకు చాలా ధనము నిచ్చియుండిరి.

కేవలం ఈ యొక్క గ్రంథాలయంతోనే వేంకటరమణయ్యగారు తృప్తిపడి యుండలేదు. మూల మూల గ్రామాదులలోకూడా గ్రంథాలయాలు స్థాపించి జాతీయజీవనమును వికసింప జేయవలెనని ఆయన సంకల్పము. 1914 సం॥లో ఆంధ్రమహాసభ బెజవాడలో జరిగినప్పుడు ఆంధ్రదేశ ప్రథమ గ్రంథాలయ సభను శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహంగారి అధ్యక్షతను ఇచ్చటనే సమావేశపరచిరి. దానితో ఆంధ్రదేశమునందు గ్రంథాలయోద్యమముపట్ల నూతనోత్సాహము బయలుదేరినది. మండల గ్రంథాలయసభలు, తాలూకా గ్రంథాలయసభలు, మున్నగువాని ననేకము జరుపున ట్లేర్పాటుచేసి గ్రంథాలయోద్యమమును ఆంధ్రదేశమునం దన్నిదిక్కుల వ్యాపింపజేసిరి.

ఈ గ్రంథాలయవ్యాప్తికి సభలమూలముననేగాక 'గ్రంథాలయ సర్వస్వము'అను మాస పత్రికను స్థాపించి ప్రచారము చేయసాగిరి. ఆంధ్రదేశమునందే గ్రంథాలయోద్యమమును వ్యాపింప జేయుటతో తృప్తి జెందక భారతదేశమునం దంతటను గ్రంథాలయోద్యమమును వ్యాపింప జేయుటకై అఖిలభారత గ్రంథాలయసభలను జరిపించిరి. "అఖిలభారత గ్రంథాలయ సర్వస్వము"ను ఆంగ్లేయభాషలో ప్రచురించిరి. వేంకరమణయ్యగారు ఏ సమావేశమునకు వెళ్లినా గ్రంథాల యోద్యమమునుగూర్చి ముచ్చటించుటయే వారి విధిగా నెంచుకొని అటుల చేయుచుండిరి.

1920 సం॥లో నుండి బయలుదేరిన మహాత్ముని యుద్యమమునందు పాల్గొనిన వారిలో చాలామంది గ్రంథాలయోద్యమునందు పాల్గొనినవారే. దీనినిబట్టి గ్రంథాలయముద్వారా జాతీయ జీవన మెట్లు వ్యాపించినదియు దెలిసికొనవచ్చును. వేంకట రమణయ్యగారు గ్రంథాలయోద్యమము నకై తనసొమ్మును విశేషముగ ఖర్చుపెట్టిరి. భార్యావియోగము, శరీరమునందలి రుగ్మత, ఇక ననేకకష్టములు వచ్చినను లక్ష్యముచేయక గ్రంథాలయోద్యమమును వ్యాపింపజేయుటలో తన శక్తినంతయు వినియోగించి జాతీయ పునర్నిర్మాణమునకు ప్రథమసోపానము కట్టిన అయ్యంకి వేంకటరమణయ్యగారి జన్మ ధన్యమైనది.

వేంకటరమణయ్యగారు తమ స్వంతపనులకు అంతరాయము గలిగినను లక్ష్యముచేయక గ్రంథాల యోద్యమసంబంధ మగు పనియన్న ముం దడుగువేయుట వారి స్వభావమైపోయినది. ఒకనాడు వేంకటరమణయ్యగారు బందరునుంచి బయలుదేరి రైలుమీద బెజవాడ వచ్చుచుండిరి. తరిగొప్పుల రైలుస్టేషనుకు వచ్చేటప్పటికి తెన్నేరు కాపురస్థులు — తెన్నేటి చలపతిరావుగారు అని జ్ఞాపకం — తమ గ్రామములోని గ్రంథాలయ వార్షికోత్సవమునకు అధ్యక్షుడు కావలసి రైలంతయు గాలించు

చుండగా మన వేంకట రమణయ్యగారు వారి కంటబడిరి. ఇంకేమి! వేంకట రమణయ్యగారిని దిగ దిగుమని బలవంతముచేసి దింపివేసి తమ వార్షికోత్సవమును పూర్తిచేసుకొనిరి.

ఇంకొకసారి తెనాలితాలూకానుండి ఒక గ్రంథాలయ సోదరుడు వార్షికోత్సవమునకు అధ్యక్షత వహించవలసినదని కోరుటకై రాత్రి 10 గంటలకు వేంకటరమణయ్యగారి యింటియొద్దకు దిగినాడు. వార్షికోత్సవము మరునాడే. ఆ తెల్లవారుగట్ల నాలుగు గంటలకే బయలుదేరి వెళ్ళవలెను. అప్పటికి వేంకట రమణయ్యగారి రెండవ కుమారుని వయస్సు 12 మాసములని జ్ఞాపకం. ఆ బాలుని గడ్డంక్రింద కురుపులేచి తాటికాయ అంత ప్రమాణంగా పెరిగి పోయినది. మరునాడు ఉదయానే ఆపరేషను చేయిస్తేనే గాని వీలులేనంత (అప్పటికి వేంకట రమణయ్యగారి కింత ప్రకృతివైద్యం లేదు) ప్రమాద స్థితిలో నున్నది. ఆయన్ని తల్లిగారు అట్టి స్థితిలో వెళ్లుటకు వీలులేదని చెప్పిరి. దానికి వేంకటరమణయ్యగారు చెప్పిన దేమంటే, నేను వెళ్ళేది మంచి కార్యం కొరకు. అందుచే భగవంతుడు మనకు మంచినే కలుగ జేయును. ఉదయముననే డాక్టరుకు కబురుచేయుము' అనిచెప్పి నాటి తెల్లవారు ఝాముననే వార్షికోత్సవనిర్వాహణమునకు గ్రంథాలయసోదరునితో గూడ వెళ్ళిపోయారు. పిల్లవానికి ఆపరేషను జరిగినది. వారు వచ్చేటప్పటికి సుఖముగా నున్నది. వేంకట రమణయ్యగారు నిర్వహించుచూ వచ్చిన గ్రంథాలయమహోద్యమమునందు వారికి గల పట్టుదల అట్టిది. వారిని భగవంతుడు ఆయురారోగ్యైశ్వర్యముల నొసంగి ఇంకను ఇట్టి ఘనకార్యములను చేయుటకు తగిన అవకాశము నొసంగు గాత మని నా ప్రార్థన.

Δ

## "గ్రంథాలయ విధాత"

అయ్యంకి వేంకటరమణయ్యగారు గ్రంథాలయసేవ ప్రారంభించిన నాటినుండియు వారి పరిచయ భాగ్యము నా కుండినది. వారి ఉత్సాహము, కార్యదీక్ష నావంటివానికి కూడ ఉద్యమప్రాశస్త్యము తెలుసుకొను నవకాశ మిచ్చుచు నంద్యాలపురంబున నొక భాండాగారమును నెలకొల్పుటకు ప్రోత్సహించెను.

అనేకసంస్థల అభ్యుదయమునకు ప్రచారము మూలము. అడ్వర్టైజుమెంటుతో చాలా ఉద్యమములు తలెత్తి 'పుబ్బలో పుట్టి హస్తలో గిట్టె' నన్నట్టు కాక, షుమారు ముప్పది సంవత్సరములు ఈ యుద్యమమును తన జీవితాశయముగా భావించుకొని తమ తపఃఫలితమునకు కొంతవరకు సిద్ధి బడసినారు.

హిందూదేశములో పుస్తకభాండాగారములు పూర్వము లేవని కాదు. ఇట్టి ఉద్యమములు మాత్రము చాలా తక్కువ. అందులో ఆంధ్రావనిలో వీరు ప్రారంభించకముందు ఇట్టి ప్రచారము లేదనియే చెప్పవచ్చును.

ఎమర్సను (Emerson) మహాశయుడు ఇట్టి అవతార పురుషుల జన్మకారణము చెప్పుచూ రేఖలు

(lines) తపస్సుచేయుట కారణముగా యూక్లిడ్డు (Euclid) పుట్టెననియు, చెట్లమొక్కల(plants) ఆదర్శము లిన్నియస్సు (Linneus) లో పొడచూపె ననియు నుడివియున్నాడు. ఆంధ్రరాష్ట్రోద్యమ పునాది వీరి మూలమున లైబ్రరీలద్వారా గట్టిగా వేయబడిన దనుట రూఢి. వీరి అవతారమే రాష్ట్ర ప్రాప్తికి కారణ మని భావిచరిత్రకారులు తప్పక లిఖింతురని నా నమ్మిక.

గ్రంథాలయములు వయోజనవిద్యకు ఎట్టి సహకార మిచ్చు చున్నవో నేడు చెప్ప నవసరము లేదు. పాశ్చాత్యదేశములలో అందులో ముఖ్యపట్టణములలో గ్రంథాలయములు విరివిగా వెదచల్లబడి యుంటున్నవి. కార్మిక సంఘమువారు తాము ప్రత్యేకముగా గ్రంథాలయములు ఏర్పరుచుకొని యున్నారు. గ్రంథాలయములే వయోజనవిద్యాప్రచారమునకు, విద్యాభ్యుదయమునకు దోహద మిచ్చుచున్నవి. అవి లేకున్న సుళువైన మార్గ మింకొకటి లేదు. అందులో శ్రీసంపత్తి లేని ఆంధ్రపాటకజనమునకు విద్య గరుపుటకే ఆస్కార ముండదు. మన ఆంధ్ర దేశములో సామాన్యజన మన నేల, ఇంగ్లీషు విద్య నభ్యసించిన ప్రముఖుల గృహములలో కూడ ఆంధ్రములోని పుస్తకములు చాలా కొరత యని చెప్పిన అతిశయోక్తి కాదు. ఇక తెలుగు పుస్తక భాండాగారములు 1915 సం॥ మందు బహుస్వల్పమనియే చెప్పవచ్చును. ఆంధ్రపుస్తక భాండాగారములకు జీవకళ నిచ్చిన "అయ్యంకి" ని 'ఆంధ్రగ్రంథాలయవిధాత' అని చెప్పనొప్పు. నూటికి 95 మంది విద్య లేనివారే యుండగా,అందులో చదువగల్గి పుస్తకము లుపయోగించువారు ఏ ఒక రిద్దరో. వీరిలో పుస్తకములు చదువుటకు అవకాశము గలవారు ఇంకా కొద్ది. అవకాశమున్నను పుస్తకములు శ్రమపడి తెచ్చుకొనువారు మరీతక్కువ. జనాభా ప్రకారము 25 మిలియనుల జనులలో ఒక్కమిలియను అక్షరాస్యు లుండ, వీరిలో ఒకలక్ష (దస్కము) చదివి అర్థము చేసుకొనువా రున్నారా? అను సందేహము ఎవ్వరికైన కలుగును. ఆంగ్లేయవిద్యాభిమానులు "తెలుగు లెస్స" అను నుడిని మఱచిరి. ఆంధ్రపత్రిక కొన్ని గ్రామములలో కఱవు అని వ్రాయుటకు సాహసించెదను. గ్రామాదులలో ఏ ప్రముఖుల యిండ్లలోనో తప్ప భారతరామాయణాది గ్రంథములు దొరుకుట కూడ దుర్లభము. ఇట్టి విషమపరిస్థితులలో ఆంధ్రగ్రంథాలయోద్యమసేవ చేసి దానికి మార్గదర్శియైన "అయ్యంకి విరాట్టు"కు ఎట్టి సన్మానము చేసిన అది కొరతయే. ఆంధ్ర రాష్ట్ర ప్రచారమునకు, ఇట్టి ఆదర్శము ప్రజల సమ్ముఖమునకు తేగల్గిన ఆంధ్రపుస్తకభాండాగారోద్యమము ఎట్టి సహకారియో కొంచెము స్మరించిన 'అయ్యంకి'గారికి చేయు సన్మానము 'నూలు పోగువంటిది' అని తెలియగలదు.

పాతిక సంవత్సరముల నుండి ఆంధ్రరాష్ట్రోద్యమమును ఆంధ్రులు విస్మరించినను 'అయ్యంకి' గారు మాత్రము దానిని ఎన్ని విఘ్నములు వచ్చినను పరిత్యజింపక 'ధృత్యున్నతోత్సాహుతై' 'ప్రారబ్ధార్థమును' ఫలపుష్పభరితముగా చేసిరి. ఆంధ్రరాష్ట్రమును సాధించు ఈ మార్గదర్శిని ఆంధ్రులు కృతజ్ఞతతో సన్మానించుట వారి విధి. నా కీ యవకాశ మిచ్చినందులకు సన్మానసంఘమువారికి నా వందనము లర్పించుచున్నాను.

నంద్యాల.

దేశపాండ్య సుబ్బారావు

# శ్రీ అయ్యంకి వేంకటరమణ మంత్రి సన్మానము

శ్లో. శ్రీ మంగమాంబా నయనాబ్జమిత్రః శేషాభిరామాసనతల్పగాత్రః
శ్రీ వేంకటాద్రి రమణార్యవర్యః పాయాత్తదీయాఖ్యవిశేషణాఢ్యమ్.

ఉ. శ్రీ నగుమోము నోము సిరి జిందెడు చిందము గావి మోవిపై
జానగులాగు గూర్చి కనుసన్నల గొల్లతలెల్లఁ బేర్మిఁ బై
కో, నగుబాటు కోర్చి, తనుఁ గూడఁగఁ బాఱఁగ నూది వారు రా
గా, నగు చిన్ని వెన్నుఁడెదఁ గ్రాలుత వేంకటరత్నసూతికిన్.

సీ. గ్రంథాలయోద్యమక్రముఁ డెవ్వఁ డన నీతఁ,డని చూపుటకు గుఱియైనవాఁడు
ప్రకృతి, గ్రంథాలయ, పరుఁ డెవ్వఁ డన నీతఁ,డని పల్కుటకుఁ బాత్రమైనవాఁడు
బాలభటోద్యమపతి యెవ్వఁడన నీతఁ,డను శబ్దమున కర్థమైనవాఁడు
వినుతదివ్యజ్ఞానధనుఁ డెవ్వఁడన నీతఁ,డను నాలుకకు భూషయైనవాఁడు
తే. గీ. ఆంధ్రగ్రంథాలయ ప్రెస్సు నరసినాడు, నవ్యగ్రంథాలయంబుల నడపినాడు
విపుల గ్రంథాలయముల స్థాపించినాడు, ఘనతరుండు నయ్యంకి వేంకటరమణుఁడు.

సీ. వేంకటరమణుండు వీక్షించిననుగదా, దేశభాషలు నూత్నదీప్తిఁ గాంచు
వేంకటరమణుండు వేడ్కఁజూచినఁగదా ప్రకృతిప్రయత్నముల్ ప్రతిభఁ గాంచు
వేంకటరమణుండు విధిగఁ బూనినను గ్రం,థాలయసంఘంబు వ్యాప్తిఁగాంచు
వేంకటరమణుండు విత్తినసే కదా, విజ్ఞానబీజంబు వృద్ధిఁగాంచు
తే. గీ. ననుచు బుధులెన్నఁ గీర్తిచే నలరినట్టి, యనఘు నయ్యంకివంశాంబుజాకరార్కు
వేంకటరమణు గుణమణివిసరభరణుఁ, బొగడఁగా రాదె సత్కవిపుంగవులకు.

సీ. గ్రంథాలయప్రెస్సుఁ గల్పించుటెంచినఁ, దత్పత్రికల నిల్పఁ దలఁచియొక్కొ?
ప్రకృతిజీవనకృతిం బ్రకటించుటెంచినఁ దత్త్వగీతల నిల్పఁ దలచియొక్కొ?
జ్ఞానసంపన్నుఁడై చరియించుటెంచ దివ్యజ్ఞానపత్రిక నరయనొక్కొ!
కృతికన్యకలఁ బ్రీతి మతిఁ బెంచుటెంచినఁ, గీర్తికన్యాకేళిఁ గెరలనొక్కొ?
తే. గీ. బళిర! యీ యూహ లేరికిఁ బట్టియిచ్చుఁ?, బట్టియిచ్చినఁ జలుపఁగా నెట్టువచ్చుఁ?
చలుపఁజూచినఁ గొనసాగు సరణి యెట్లు? పరుల విషయంబులోఁ బోల్పఁ బడుటయెట్లు?

## నిరోష్ఠ్యము - చిత్రకవిత్వము

సీ. ఆకారసదృశసత్యజ్ఞానశక్తి నార్జించినాఁ డరిని నిర్జించినాఁడ?
జ్ఞానసంకాశకల్యాణ కళాళి గ,డించినాఁ డర్థి నడ్గించినాఁడ?

తత్కలాసదృశ నిత్యక్రియాశక్తి న,ర్థించినాఁ డద్ది హెచ్చించినాఁడ ?
తత్క్రియాశక్తికిఁ దగినట్టి సిద్ధి నా,శించినాఁ డద్దానిఁ గాంచినాఁడ ?

తే. అని సకల ధీరతతి యెన్న నలరినట్టి, ఘనతరాయ్యంకి గృహచిహ్నఁ గల్గినట్టి
కాంత శేషాంక నేలఁగాఁ గలిగినట్టి, కీర్తిశాలిని నన్నుంగఁ గీర్తి కాదె?

సీ. త్రాగెనే? జలధి యా తరణి త్యజించఁగా, క్షితిని జారిన నీటిఁ జేరెఁ డేని ?
కాంచెనే? ధరణి కష్టించి యార్జించిన గరిసెల గింజల గరిటెఁ డేని?
ఆనెనే? సరఘు లాహార నిద్రల నెట్టి, చేర్చిన తేనియ చిన్క కాని ?
తినియెనే? చెట్లెల్లఁ దీండ్రఁగాఁ గాచిన, తియ్యని కాయ లందించె గాని ?

తే. అని జగచ్ఛ్రియసాంకిత మైన యట్టి, కృతిని నలరించి నట్టి సత్కృతిని ధృతిని
నహహా ! యెన్నంగఁ దాతకే నరిది యన్నఁ, దక్కినట్టిరు నంతగాఁ దలఁచనేల ?

గ ర్భ క వి త్వ ము

చ. నరహరిభక్తి భక్తజన, నవ్యరసోల్బణరక్తి జ్ఞానబం
ధుర మతినేన్ మహోన్నత మనోహర కార్యవిచార శక్తినేన్
స్మరహర సేవనానురతి, సంసరణోద్ధరణప్రశస్త చా
తురిఁ, గనఁడే ప్రశస్తి మహితుం డన వేంకటరత్నపుత్రుడే.

గ ర్భ కం ద ము .

క. హరిభక్తి, భక్తజన న, వ్యరసోల్బణరక్తి జ్ఞానబంధురమతినేన్
హరసేవనానురతి సం,సరణోద్ధరణప్రశస్తచాతురిఁ గనఁడే?

శై ల బం ధ ము - కం ద ము, ద్వ్య ర్థి

| | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | | | | | అ | | | | | | |
| | | | | | దీ | ర | క్క | | | | | |
| | | | | ర్పఁ | గ | మ | సు | గ | | | | |
| | | | మై | గ | పఁ | ణ | క్క | చి | ఢ | | | |
| | | త్రిఁ | బెం | ప | క్షే | మం | బ | ర | యం | బె | | |
| | డు | క్కు | యె | ల | ప్పు | త్రి | ని | లో | గు | ల | క్కు | |
| పఁ | గ | నె | ప్పు | డుం | బ్రి | కృ | తి | ర | మ | ణుఁ | డ | పో. |

కం. అక్కఱల దీర్పఁగ, మనుగడ, చిక్కణపఁగ, మైత్రిఁ బెంప, క్షేమం బరయన్,
బెక్కులగు లోనిదిబ్బల, మెక్కుడుపఁగ, నెప్పుడుం బ్రకృతి రమణుఁడహో ;

అచ్చ తెలుఁగు

సీ. క్రొమ్మించు వగలాడి కూర్మిసంగడికాఁడు, ఆకసం బను రచ్చ నట్టె తీర్పఁ
దమ్మికొమ్మలఁగూడి కెమ్మోవి పానకం, బాను తుమ్మెద సుతి తానవేయఁ
గ్రొంబూవుఁ దేనియల్ గ్రుమ్మరింపఁగ గాణ, కోయిలల్ చెవి కింపుఁ గూర్చి పాడఁ
జిన్నారి పొన్నారి చిలుక బోగముసాను, లందమ్ముమై కడు హాయినాడఁ

తే. గీ. గండచక్కెర పాకమ్ముకంటెఁ, జెఱకు, పానకమ్మునకంటెను, బలుచవు లిడు
కబ్బములఁ గైత కూర్పరుల్ కైనిడంగ, సాక్షి వేంకటరమణుండు సంతసిల్లు.

సీ. దూరశ్రవణ దృష్టి దుస్తరయంత్రముల్, ప్రత్యక్ష సమ్మోద భాగ్య మీయ;
ఛాయాగ్రహణయంత్ర శబ్దగ్రహణయంత్ర, పటలిదృక్కర్ణ పర్వమ్ము సేయ,
వైమానిక తురంగ వారణారోహక, సమర మత్స్యద్భుతభ్రమణ మీయఁ
బూర్వపశ్చిమదేశభూతప్రవృత్తముల్, దేశవిప్లవములఁ దెలుపు సేయ,

తే. గీ. రత్నసముదాయమధ్య సూత్రమ్ముభాతి, జంగమస్థావరాంతర స్థానవర్తి
లలితసృష్టిస్థితిమహాప్రళయ విహారి, సాక్షి వేంకటరమణుండు సంతసిల్లు.

సీ. శ్రౌతమో ? స్మార్తమో ? ప్రాఁత కూఁతలవేల ? పఱచు కోయిల ! క్రొత్తపాటఁబాడు
పూతమో ? ఖ్యాతమో ? ముదుకవేసములేల ? రాచిల్క ! నవసుందరమ్ముఁ జూపు
స్వీయమో ? యన్యమో ? స్వేచ్ఛ లేనిద దేల ? రాయంచ ! నూత్నమార్గమ్ముఁ ద్రొక్కు
పూజ్యమో ? త్యాజ్యమో ? భోగింపని దదేల ? తుమ్మెదా ! పూబోంట్లతోడఁ గూడు

తే. గీ. మనెడు కాలంబులో నర్థ మంత వ్యర్థ, ముగను వెచ్చించు నీ దినములను బ్రజలు
ఆంధ్రదేశస్థ గ్రంథాలయంపు సేవఁ, జేయుచుండంగ నెన్నఁగాఁ జెల్లదొక్క ?

అవధాని, శ్రోత్రియకవి,
అబ్బరాజు హనుమంతరాయశర్మ పాకయాజి,
భగవద్గీతోత్తర గీతాదికృతికర్త,
సంతగుడిపాడు, గుంటూరుజిల్లా.

మకాం,
బెజవాడ, గవర్నరుపేట.

# పరితోషం

మంగిపూడి పురుషోత్తమశర్మగారు

మిత్రులు శ్రీ వేంకటరమణయ్య గారికి త్వరలోనే ఆంధ్రదేశం తరఫున సన్మానం జరగబోతుందంటే నాకెంతో సంతోషమైంది. ఏ దేశం కాని, ఏ సంఘంకాని తన అభ్యుదయకారకులైన మహాపురుషుల్ని యోగ్యవిధానంలో గౌరవించినప్పుడే పురోవృద్ధికి అర్హతను సంపాదించుకొంటుంది. మన ఆంధ్రులుకూడా యిటీవల తమ సేవలో ఎముకలు పొడిచేసికొని రక్తమాంసాలు అరగదీసి యిచ్చిన దేశసేవకులను, భాషాసేవకులను యథోచితంగా గౌరవింప పూనుకోవడం చాలా సంతుష్టికరమైన సంగతి. స్వతంత్రదేశాలలో ఇట్టి పని చాలావరకు ప్రభుత్వమే నెరవేరుస్తుంది. కాని మనవంటి పరాధీనదేశాల్లో ఈ బాధ్యత విశేషంగా ప్రజల మీదనే పడుతుంది. ఇట్టి సత్కారంవల్ల ప్రభుత్వంనుంచి కాని, ఇతరసామంతుల నుంచికాని యెట్టి ప్రతిఫలము అపేక్షింపక దేశసేవయందే తమ తనువును వెళ్లబుచ్చుకొన్న పెద్దలకు కొంత సంతృప్తి, పిన్నలకు కొంత ప్రోత్సాహం లభించి లోకారాధనరథం నిరంతరాయంగా సాగిపోగలుగుతుంది.

*　　　*　　　*　　　*　　　*

ఈ నడుమ ఎందరో ఆంధ్రప్రముఖులు- శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులుగారు, శ్రీ నాగేశ్వరరావు పంతులుగారు, శ్రీ రామలింగారెడ్డిగారు, శ్రీ డాక్టరు పట్టాభిసీతారామయ్యగారు, శ్రీ నాళం కృష్ణారావుగారు మున్నగు తెలుగువెలుగులు వివిధరంగాలలో తాము కావించిన అమూల్యసేవకు ఆంధ్రుల హస్తాలనుంచి ఆదర బహుమానాలు అందుకోగలిగారు. వయస్సున వీరంతా షష్టిపూర్తియైనవారే. కాని శ్రీ వెంకటరమణయ్యగారింకా అరశతాబ్ది దాటి ఆవల గట్టిగా అడుగుపెట్టినవారు కారు. ఈయనపొద్దు ఇంకా నడి ఆకాశంలోనే వెలుగుతోంది. తలమట్టుకు కొంచెం నెరిసినా ఒడలి బింకం కించిత్తైనా సడలనేలేదు. సేవాసక్తిలోగాని, కార్యశక్తిలోగాని ఈయన అణుమాత్రమైనా కుంటువడినట్లు కాన్పించదు. ఇంత నడివయసులోనే ఈయన తన ఆంధ్రసోదరుల ప్రత్యేక మన్ననలకు పాత్రుడు కావడం నిజంగా గమనింపతగ్గ విశేషం. జీవిత పరిమాణం ఎప్పుడూ "ఆయువుచేతఁగాక చేసిన ఘనకార్యసంచయముచేత గణింపగజెల్లు" నన్న సుభాషితం ఈయనయందు చక్కగా సార్థకమౌతోంది.

*　　　*　　　*　　　*　　　*

ఒకప్పుడు విద్యార్థులను ఉద్బోధిస్తూ శ్రీ కోపల్లె హనుమంతరావుపంతులుగారిట్లా సెలవిచ్చారు. "మీలో కొందఱు సూక్ష్మగ్రాహులు కావచ్చును, కొందఱు స్థూలబుద్ధులు కావచ్చును; కొందఱు చదువుసాముల్లో గడిదేరవచ్చు, కొందరు కొరగాకపోవచ్చు. కాని అందరికీ దేశసేవలో సరిసమానమైన హక్కూ, స్థానమూ ఉన్నాయి. అందరూ సేవాపరత్వంలో అధిక గౌరవం గడించి ఆదర్శప్రాయులు కావచ్చు. శ్రీ వెంకటరమణయ్యగారి సేవాజీవితం పై వాక్యరత్నాలకు వ్యాఖ్యారాజమౌతుంది.

*　　　*　　　*　　　*　　　*

నిజం చెప్పాలంటే రమణయ్యగారు సహజపాండిత్య శేముషీ ధురంధరుడేకాని అంతగా చదువరికాడు. ఈయన బడిచదువు నర్సాపురం మైలరు హైస్కూలు ఆవరణను దాటిపోలేదు. తెలుగులోగాని, యింగ్లీషులోగాని వ్యవహారయోగ్యమైన భాషా సంస్కారం అలవడ్డదే కాని ఏ సారస్వతంలోను తలమున్కలుగా ఈదులాడిన పారదర్శి కాడు. ఏ శాస్త్రంలోను, కళలోను లోతులు తరచి చూచిన నిష్ణాతుడు కాడు. మామూలుగా మిత్రబృందంతోడి సాయిలా పాయిలా గోష్ఠిలోనే నట్టుతూ, నములుతూ, మింగుతూ సంభాషించే నెరవాది. ఇంక సభావేదికలపైనుంచి యే 'సుప్రసిద్ధ దేశభక్తుని'లాగో గుక్క తిప్పకుండా కుంభవృష్టిగా ఉపన్యాసాలు కురిపించి జనవశీకరం చేసుకొనే ప్రజ్ఞాపాటవం ఎక్కడ? అయితే రమణయ్యగారిలోని ఘనత యేఘట్టంలోనా అని నిదానించి చూస్తే అది నిస్సంశయముగా ఆయన 'నిరతిశయ సేవాపరాయణత్వం'లోనే అని పొడ గట్టక మానదు.

*  *  *  *  *

ఈ విశిష్టలక్షణం ఈయనలో చిన్ననాడే ముకుళితమైయుండి, కాలక్రమేణ రంగురేకులు విచ్చి నలుదిక్కులా తావులు గుబాళించుకుంది. ఇంకా క్రిందిఫారాల్లో కూర్చుండే రోజుల్లోనే ఈ శుభ చిహ్నం ఈయనలో ఉబికి తొణికిసలాడు తోండేది. ఏ నలుగురు తోడి బాలురనో ఒకగదిలో చేర్చేది, పఠనమందిరం అని పేరుపెట్టేది, స్వంత పైకం చెల్లించి పత్రికలు, పుస్తకాలు, పెద్ద పెద్ద బొమ్మల కేటలాగులు తెప్పించేది, అందరినీ హెచ్చరించి చదివించేది- ఇదే ఈయనకు బడిల్లో చదువు, బడివెలుపల ఆట, పాట. ఇదే ఈయన సంతతధ్యాన, తపస్సు. 'పానీయంబులు త్రావుచుం గుడుచుచున్ ...' అన్నట్లు ఈయన చిత్తవృత్తులు, చేష్టలు అన్నీ యీ లేతప్రాయంలోనే విద్యా పీఠనిర్మాణశిల్పంలో ఏకాగ్రత పొందాయి. అలనాటి యీచిరుతపఠనాలయస్థాపకుడే కాలక్ర మంలో నేటినిఖిలాంధ్ర విద్యామందిరప్రధానార్చకుడుగా పరిణతి చెందాడంటే ఆశ్చర్యమేముంది?

*  *  *  *

రమణయ్య ఏ తొలి పుణ్యావశంగానో మంచి సంపన్నకుటుంబంలో జనన మొందాడు. ఆ కాలంలో ప్రభుత్వశాఖ లన్నిటిలోను ఎక్కుడు రాబడికి ప్రఖ్యాతి కెక్కిన పి. డబ్లియు శాఖలో సూప రెంటుగా ఉన్న వెంకటరత్నం పంతులుగారి యేకైకసంతానం. ఈ గారాలకూచికి డబ్బుకేం కొదవ? నాటి శ్రీమంతుల బిడ్డలంతా దుస్తులకని, వస్తువులకని, వినోదాలకని, విలాసాలకని విచ్చలవిడిగా పైకం వెచ్చపెట్టుకొనే యీడున రమణయ్య తండ్రి యిచ్చినది గాక తల్లివద్ద నుండి బెల్లించి తెచ్చుకొనే దోసిళ్లాది రూపాయిలను పత్రికలకోసం, పుస్తకాలకోసం వినియోగపర్చే వాడు. చిన్నతనంలోనే ఈయన స్కూలు పుస్తకాల నడుమ దేశోపకారి, సత్యవాదిని, ఆర్యమత బోధిని, కల్పలత, బాలసరస్వతి, సెంట్రలు హిందూకాలేజి మ్యాగజైను, డాన్ మొదలైన పత్రికలు నిరంతరము నలుగుతూండేవి. ఒక చిత్రమేమంటే ఆయనకు వాటి అధ్యయనంలో కంటె అధ్యాపనంలోనే ఆసక్తి మెండు, సరదా జాస్తీ.

*  *  *  *  *

ఈ బాల్యంలోకూడా ఈయన కరస్పాండెన్సుకు మేర ఉండేదికాదు. ఏ స్వదేశీనో, స్వరాజ్యాన్నో, సంస్కరణాన్నో పురస్కరించుకొని వృద్ధపితామహులైన దివాన్‌బహదూరు రఘునాథరావుగారి వలెనే తన మిడిమిడి జ్ఞానంతోటి తెలుగుపత్రికల్లో స్వాభిప్రాయాలు ప్రకటించడం ఈయన కొక ఖులాసా. కనుపించిన చిరునామా కెల్ల కార్డో కవరో తగిలిపించి రకరకాలబొమ్మల కేటలాగులు రప్పించడం ఈయనకో ఖుషీ. ఏదైనా కొత్తపత్రిక పేరు వినడమో, కనడమో తడవుగా కాలణా ఖర్చుపెట్టి శాంపిలు తెప్పించడం ఒక బులుపు. సెలవుదినాల్లో ఈయన ఏ వూళ్ళోఉంటే అక్కడ పోస్టురన్నర్ల కర్మం కాలిందన్నమాటే, రోజురోజూ రమణయ్యపేర వచ్చిపడే బంగీల బరువుతో బాధపడలేక. ఏ గ్రామంలో ఉన్నాసరే నిత్యమూ తపాలాఫీసుకు తలవంచుకుని చేతులూచుకొంటూ సరసరా నడచిపోయి, తన పెద్ద తపాలకట్ట చేత పట్టుకొని ఒక్కొక్క కవరే, కేటలాగే, పత్రికే సంతృప్తితో విప్పి చూసుకుంటూ, విప్పారిన మొగంతో చిన్నిపత్రికాప్రదర్శనశాలలాగు వీథి వెంబడి సాగిపోతూంటే ఆ వడి, ఆ హడావడి, ఆ ఆనందం, ఆ ఆర్భాటం చూపరకు అదో చోద్యంగా అగుపించేది. ఈ యాడంబరలాలసుడైన బుడుత పత్రికాప్రేమికుడే భావికాలంలో విధాతచేతి దివ్యోపకరణమై ఒక అఖండజాతీయ విద్యాప్రచారోద్యమానికి సూత్రధారి కాగల్గు తాడని ఆ రోజుల్లో యే దైవజ్ఞుడైనా ఊహించియుంటాడా?

* * * * *

దేశాభిమానంలోను, కార్యోత్సాహంలోను అట్టహాసంతో కొట్టుకుపోయే బాల రమణయ్య మనస్సును బడి చదువులోనే నిబంధించవలె నని సంరక్షకులు చేసిన ఒత్తిడి ఫలితంగా ఈయన త్వరలోనే విద్యాభ్యాసానికి విడాకు లివ్వవలసి వచ్చింది. ఈయనకు ఉన్నత విద్యే లభించి యుంటే బహుశా ఆంధ్రదేశం గ్రంథాలయోద్యమంలో ఇంతగా ముందంజ వేయకుండేదేమో! ఏదైతేనేమి ఇందువల్ల దేశానికి మట్టుకు మేలే చేకూరింది. ఈయన పన్నెండేండ్ల బాలప్రాయంనుండీ భాషా సేవకులైన శ్రీ మంగిపూడి వేంకటశర్మగారి పరిచయలాభం గడించి తద్వారా తన మాతృభాషాభిరుచినీ, దేశసేవాభిలాషను బలపర్చుకున్నారు. క్రమశః ఈయనకు పత్రికా ప్రచురణయందు అభిరతి కలిగి 1909 లో బందరునుండి శ్రీముట్నూరి కృష్ణారావుగారు, శ్రీ పట్టాభి సీతారామయ్యగారు మున్నగు విద్యాధికుల సహాయంతో ఆంధ్రభారతిని ఆరంభించారు. తరువాత దీన్ని వదలి 1911 లో బెజవాడయందు ప్రవేశించి అక్కడ శ్రీరామమోహనగ్రంథాలయస్థాపకులతోడి మైత్రిని సంపాదించుకొన్నారు.

* * * * *

అసలు పుట్టుకయందే ఈయన జీవనయంత్రం ఏ యుత్కృష్టకార్యసాధనకై ప్రత్యేకంగా ఉద్దిష్టమై వెలసిందో అట్టి స్వభావసిద్ధమైన కర్మక్షేత్రంలోకి వీరు విధిప్రేరితులై ఎట్టకేలకు కొట్టుకొని వచ్చారు. వసంతునికి మలయపవనుని సమాగమలాభం సమకూడినట్లు అదివరలో రామమోహనుని పేరిట గ్రంథాలయం నెలకొల్పి తండులాభావంచే తగినన్ని పత్రికలు, పుస్తకాలు లేక, నిలవడానికి స్థిరమైన నీడలేక, తంటాలు పడుతున్న శ్రీ నూరి నరసింహశాస్త్రి ప్రభృతులకు వీరి

ఆగమనం బ్రహ్మానంద కారణమైంది. దేశభక్తి, యౌవనోత్సాహం, సేవాసక్తి, దేహబలం, అన్నిటికన్న మిన్నగా దేవుడిచ్చిన ధనసంపత్తి, ఇన్ని శక్తులతో కూడి అంజనావరపుత్రునివలె సేవావ్రతుడై సాక్షాత్కరించిన యీ తరుణమిత్రునికి వారు రెండుచేతులతోటి, నిండుహృదయంతోటి స్వాగత మిచ్చారు. అది నిశ్చయంగా నవాంధ్రోదయచరిత్రలో ఒక భాగ్యదినం! రమణయ్యగారి జీవితం బంగారు మారాకు తొడిగిన ధన్యదినం!

* * * * *

నాటినుంచే అంతదాక ఆయనలో అంతర్నిహితమైయున్న నిర్మాణశక్తులన్నీ పుంఖానుపుంఖంగా బయల్పడ దొడగాయి. అనతికాలంలోనే ఆయన వారి ప్రోత్సాహంచే రామమోహన గ్రంథాలయానికి కార్యదర్శియైనారు. ఈయన పరివీక్షణలో గ్రంథాలయాన్ని ఇంతవరకు పట్టుకొని పీడిస్తూన్న యీతిబాధలన్నీ క్రమంగా వదలిపోసాగాయి. కొలది కాలంలోనే వివిధపత్రికలు, పుస్తకాలు, కుర్చీలు, బల్లలు, కడకు స్వంతంగా దివ్యభవనం, అన్నీ యేర్పడి రామమోహన గ్రంథాలయం ఆంధ్రదేశాని కంతకూ సర్వాంగశోభితమైన, ఆదర్శప్రాయమైన కేంద్రగ్రంథాలయంగా విస్తరిల్లింది. ఈ కృషిలో ఎందఱో మిత్రులు వీరికి చేదోడు వాదోడైనారు. కాని శ్రీ రమణయ్యగారి అహోరాత్రసేవాదీక్షా, త్యాగమూనే ఈ యుత్తమసంస్థకు పునాది యని చెప్పడానికి సందియం లేదు.

* * * *

కేంద్రగ్రంథాలయాన్ని ప్రతిష్ఠించగానే ఈయన దృష్టి విశాలాంధ్రసీమపైకి ప్రసరింపసాగింది. ఆ కాలంలో నగరాల్లోను, గ్రామాల్లోను కూడా గ్రంథాగారాలు చాలా అపురూపం. రాజమహేంద్రవరంలో శ్రీ వీరేశలింగ భాండాగారం, హైదరాబాదులో శ్రీకృష్ణదేవరాయ గ్రంథనిలయం, ఏలూరులో యువజన గ్రంథాలయం, పల్లెపట్టుల కుముదవల్లి గ్రంథాలయం, ఇల్లాంటి వెలుగు ఇండ్లు సంధ్యాగగనంలో తారల్లాగ అక్కడక్కడ ద్యోతకమై వేళ్ళపై మాత్రం లెక్కకు వచ్చేవి. తెలుగునాడులో ధనముకు కొదువ లేదు; ఉత్సాహానికీ వెలితిలేదు; ఏ మాత్రం గిల్లినా త్యాగం రేగుతుంది. కాని వీని నన్నింటిని ఒక్క కాడికి చేర్చి కృషి సాగించి ఫలితం తీయగల కార్యశూరుని అమోఘహస్తంకోసం ఆంధ్రభూమి యెదురుతెన్నులు చూస్తోంది. శ్రీ రమణయ్యగారు తనకు దేవుడిచ్చిన ఉత్సాహం, తెలివి, బలము, ద్రవ్యము, కార్యకౌశలము, ఈ వరా లన్నింటితోటి నడుము కట్టుకొని ముందుకు వచ్చి నిలిచి తన గ్రంథాలయసందేశం శృంగధ్వని చేసేసరికి తెలుగు దేశమండలి వివిధ పట్టణాల్లోను, పల్లెల్లోను యువజనులు తండోపతండాలుగా తమ నిద్దర ముసుగుల్లోనుంచి దద్దరిల్లిలేచారు. వీరి కేకారవం చెవుల్లో జొరగానే, ఇంతవరకూ ఏదో అవ్యక్త సేవోత్సాహంతో ఆవేదనపడుతూ, అవకాశంకోసం వేచియున్న ఉద్యోగులు, వకీళ్ళు, వర్తకులు, రైతులు, విద్యార్థులు, డాక్టర్లు, ఉపాధ్యాయులు, వీరు వారనక యువజనబృందమంతా యీ నూతనోద్యమంలోకి ఆకృష్టులై, ఆయనకు అండదండల నిలిచి అపూర్వో

త్సాహంతో సంరంభం సాగించారు. ముఖ్యంగా పల్లెటూళ్లలో కొంత డొక్కశుద్ధికలిగి, జీవనో పాధికి లోటులేక, చేసే పనిపాటులు లేక, చేతినిండా రూకలుండి, కునికిపాటుల్లోనో, చీట్లాట ల్లోనో, లేక యే శుష్కబాతాఖానీలోనో అమూల్యమైన తమ ఆయువును ఖూనీచేసుకొనే వడుచు వారికి ఈయన పిలుపు సమ్మోహనగీతమై, కేవలం తారకమంత్రమే అయింది. వారంతా, బ్రానింగుకవి "బూరాపాటకుని" చుట్టూ ప్రోగైకోటివలె, ఈ గ్రంథాలయదూత జెండాక్రింద నవనవోత్సాహజ్వాలతో, సరదాతో, సంబరంతో కిలకిలలాడుతూ మూగి మహాసంచలనం మొదలుపెట్టారు. ఓ! ఇంక అవి సభలే కావు, యాత్రలే కావు, పత్రికలే కావు, కరపత్రాలే కావు, భజనలే కావు, వినోదాలే కావు, ఉత్సవాలే కావు, ఊరేగింపులే కావు, సప్తాహాలే కావు, సమారాధనలేకావు, చూసి తీరవలసిందే ఆ యెడతెరపిలేని కోలాహలం కొన్నియేండ్లపాటు! ఫలితం? తెలంగాణంలో ఏనాడూ యెవ్వరూ కనీ వినని మాదిరిని శారదాదేవి దివ్యతాండవం ప్రవర్తిల్లింది. అది మెఱుపు సోకినట్లే, వెదగాలి వీచినట్లే, సరిగా మంత్రించినట్లే. గంజాంనుంచి చెన్నపురి వరకూ, అనంతపురినుండి హైదరాబాదావరకూ జీర్ణావస్థలో నిద్రపోతూన్న పాతభాండారాలన్నీ ఒక్కమారుగా తిరిగి బూజులు వదలడమే కాక, నూతన గ్రంథాలయాలు లెక్కకు మిక్కిలిగా, కొలనులో తామరపువ్వులలాగు ఉదయించి దేశాన్ని నూతన చైతన్యంతోటి, శోభతోటి నింపి వేశాయి. మునుపు ఏ ప్రజాహితోద్యమానికైనా పిలిస్తే పలికే నాథులు లేని మారుమూలల్లో సైతం నేడు అంతా స్వాగతవాచకులే, వ్యగ్రోత్సాహులే, అంతా సేవాపరాయణులే, కార్యసాధకులే. అది విద్యావ్యాపనమే కానీ, రాజకీయమే కానీ, మతం, సాంఘికం, గ్రామోద్ధరణం, ఐచ్ఛికసేవ, మఱి జాతీయోజ్జీవానికి ఉపకరించే ఏ సదుద్యమమైనా కానీ, సంతోషంతో, సానుభూతితో, సాహసంతో ముందుకు దూకి రెండుచేతులా సాయపడే దేశారాధకబృందం ఒకటి, ప్రభుత్వానికి పెర్మనెంటు సివిలు సర్వీసులాగున, జీతబత్తేలతో నిమిత్తం లేకుండానే తెలుగుదేశమంతటా కనులపండువుగా వెలసింది. కాలక్రమంలో ఇదే ఆంధ్రుల ఉత్క్రాంతి కంతకూ మూలాధారమైన ముక్తిదళంగా వికసిల్లింది ఈ విధంగా ఈ సేవాధురంధరుని ఉత్సాహ వేడిమిచే, శివతాండవప్రభావంచే లెక్కకు మించిన సేవావ్రతులు, కార్యశూరులు, దేశోద్ధారకులు ఊరూరా అవతరించి తమ త్యాగసాధనలచే భారతవర్షంలో తెలుగుసీమకు వన్నెవాసులు కొనితెచ్చారు. రమణయ్యగారు సమర్పించిన ఈ సేవోపహార మొక్కటే చాలును, ఆయనకు ఆంధ్ర మాతృమందిరంలో శాశ్వతమైన ఆళ్వారుస్థానం ఒకటి కల్పించడానికి.

* * * * *

రమణయ్యగారి సంతతపరిశ్రమ, జాగరణ, కృచ్ఛ్రచాంద్రాయణాల ఫలితంగా ఆంధ్రదేశంలో గ్రంథాలయోద్యమం వేళ్లూని అన్నివైపులా అల్లుకొని సాగింది. ఈయన 1941 లో ప్రథమాంధ్ర గ్రంథాలయ మహాసభను సమావేశపరచి ఉద్యమానికి బాగా దోహదం చేశారు. ఈయన కృషి వల్ల అనతికాలంలోనే ఆంధ్రజనపదంలో రమారమి వేయి శారదామందిరాలు వెలసి ఆంధ్రుల్లో విజ్ఞాన దీప్తిని, నేడు లోకాన్ని ఊగిసలాడించే నవజీవనభావబీజాలను వెదచల్ల సాగాయి. తెలుగు

వారును నానాట వీటి విలువను, ప్రయోజనాన్ని బాగా గుర్తించి ఆదరింప నేర్చారు. క్రమంగా గ్రంథాలయంకూడా దేవాలయంవలెనే గ్రామాని కొక అలంకారం, పుణ్యస్థలం అయింది. ఎన్ని ఉన్నా గ్రంథాలయ మనేది ఒకటి ఉంటేనే ఊరికి గౌరవం; లేకుంటే గొప్ప లోపం, కలంకంగా ఏర్పడింది. ఒక్క మాటలో, తెలుగుసీమలో 'గ్రంథాలయ చిత్తవృత్తి' ఒకటి గాటంగా నాటుకు పోయింది. ఎందరో వదాన్యులు తాము కష్టించి కూడబెట్టిన సొమ్ముతో వీటికి మందిరాలు కట్టించి యిచ్చారు. ఎందఱో సుపుత్రులు తమ తల్లిదండ్రుల పేరిట స్మారకచిహ్నాలుగా వీటికి ఆలయాలను ప్రతిష్ఠించారు. ఎందఱో సేవాపరులు 'భిక్షాందేహి' యని ఊరూరా తిరిపమెత్తి వీటికై భవనాలు కట్టించి కృతార్థులైనారు. ప్రభుత్వాలంబనం అంతమాత్రమే అయినా, కేవలం ప్రజల స్వయం సహాయం మీదనే ఆధారపడి, స్థిరరూపం దాల్చి ఈ యుద్యమం నేడు ఆంధ్రుల నిర్మాణశక్తికి నిదర్శనంగా నిలిచి తెలుగువారికి గర్వహేతువుగా వెలుగుతోంది.

* * * * *

తెలుగు కోటలో గ్రంథాలయ జెండా దృఢంగా పాదుకొల్పడంతో రమణయ్యగారి మనస్సుకు సంతుష్టి కలుగలేదు. తన ఉద్యమాన్ని అఖిలభారతోద్యమంగా పెంచి, భారత దేశానికంతకూ ఒక ఆచార్యపీఠంగా తయారుచేసి ఆంధ్రులకు కట్టిపెట్టాలని ఆయనకు చిరకాలంనుంచి ఒక పేరాస. ఈ స్వప్నం కూడా పంజాబు దొరతనంయొక్క పుణ్యామా అని త్వరలోనే ఫలించింది. 1918 లో పంజాబు ప్రభుత్వంవారి ఆధ్వర్యంక్రింద లాహోరులో అఖిలభారత గ్రంథాలయ సభ జరిగినపుడు అందులో ఆంధ్ర ప్రతినిధులకు అవకాశం లేకుండా చేశారు. జాతీయాభిమానధనుడైన వెంకట రమణయ్యగారు ఈ అవమానం వ్యక్తిగతంగా గాక ఆంధ్రులకు, ఆంధ్రమహోద్యమానికి జరిగిన పరాభవంగా పరిగణించి వెంటనే 1919 లో చెన్నపురిలో ప్రభుత్వసంబంధం లేని, స్వతంత్రమైన అఖిలభారత గ్రంథాలయ మహాసభ ఒకటి ఆహ్వానించి అఖండవిజయంతో నిర్వహించారు. ఆ వేదిక నుండి యీయన తన గ్రంథాలయడిండిమం మ్రోగించి తన సందేశాన్ని యావద్భారత వర్షానికి అందజేశారు. ఈ సమయంలోనే అఖిలభారతగ్రంథాలయసంఘం కూడా ఒకటి స్థాపించి దానికి ఈయన ప్రధానకార్యదర్శియైనారు. త్వరలోనే వీరి ప్రోత్సాహవశంగా మద్రాసు బెంగాలు, పంజాబులలో గూడ రాష్ట్రీయసంఘాలు ఏర్పడి పని చేయసాగాయి. ఈ విధంగా క్రమేణ ఈ యుద్యమం అఖిలభారతోద్యమంగా విజృంభించి, ఇంగ్లాండు, అమెరికా మున్నగు దేశాంతరాలలోని విద్యాప్రచారకులదృష్టి నాకర్షించి వారి ప్రశంసలను బడయగల్గింది. రమణయ్యగారి మహాశయం, చిరంతనస్వప్నం ఈ రీతిగా చివరకు అద్భుతంగా ఫలించి తీరింది. బ్రహ్మసమాజం, ఆర్యసమాజం, ప్రార్థనసమాజం, దివ్యజ్ఞానసమాజం మొదలైన సకలోద్యమాలలోను ఆంధ్రులు అనుకరణమాత్రపటీయసులే అన్న అపవాదుకు గుఱియై విన్నబోయే ఆంధ్రజాతికి శ్రీ రమణయ్యగారి చలవవల్ల ఒక అఖిలభారత గౌరవపీఠం దక్కింది.

* * * *

ఇంత జరిగినా సేవాకంకణుడైన రమణయ్య చిత్తానికి సంతుష్టి లేదు. ఆయన దృష్టిలో ఇప్పటికి తాను చేయజాలిన దంతా నాందీ ప్రస్తావనలు మట్టుకే. "సూర్యరశ్మి, నీరు, గాలి అందరికీ అందు బాటులో ఉన్నట్లే విజ్ఞానంకూడా అందుబాటులోకి రావలెను" అని ఆయన ఆదినుండి పెట్టు కొన్న లక్ష్యం ఆకాశమంత ఉన్నత మైనది. ఇది లోకంలో 'అభివృద్ధి' అనే దొకటి ఉండేవరకు ధగధగలాడే లక్ష్యం. నేడు భారతభూమిలో మూకలు కట్టిన చీకటు లన్నింటిని చెల్లాచెదరు చేసి దేశాన్ని ఒక నాగరకరాజ్యంగా పునరుద్ధరించాలంటే భారతీయు లందరినీ, స్త్రీ పురుషులు, పిన్న పెద్దలు, పేదసాదలు అనే తారతమ్యం లేకుండా యెల్లరినీ విజ్ఞానవంతులుగా చేసి, బ్రతుకు తెరువులు తెలిసినవారినిగా దిద్దడం కంటె వేరు సాధనం లేదు. విజ్ఞానమే ధనము, విజ్ఞానమే శక్తి, విజ్ఞానమే అభ్యుదయం, విజ్ఞానమే జీవితంలో విజయం. ఇది సర్వకాలసర్వావస్థల్లోను శ్రేయస్సాధక మైన దివ్యాస్త్రం. అందుచే దీనిగడనలో విశ్రాంతి కూడదు; విరామం పనికిరాదు. ఈపరమార్థం గుర్తించి ఆంధ్రులు ఇంత దాకా చేసిన దానితో తనివి చెందక "జరయు మృతియు లేని" జాతి వలె విజ్ఞానోపార్జనలోను, వ్యాపనంలోను ఈ యుద్యమ నిర్మాతకు ఇక ముందుకూడా తోడ్పడి తమ జాతిని ఉద్ధరించుకుంటే అదే ఆయనకు పదివేలు! ఆంధ్రజాతికల్యాణంకంటె ఆయనకు కావలసిన దేమున్నది?

*  *  *  *  *

శ్రీ రమణయ్యగారి క్రియాశక్తి యింకా దివ్యజ్ఞానం, ప్రకృతివైద్యం, బాలభటోద్యమం ఇత్యాది బహుముఖాలుగా ప్రవహించినా ఆంధ్రులు ఆబాలగోపాలమూ నిర్వివాదంగా వీరిని ప్రియంతో, ఆప్యాయంతో, కృతజ్ఞతతో స్మరించేది వీరు గ్రంథాలయరంగంలో కావించిన ఉత్కృష్ట సేవవల్లనే. నేడు తెలుగుదేశంలో ఎక్కడ అడుగుబెట్టినా వీరి ప్రఖ్యాతనామం గ్రంథాలయంతో జతగా, అవినాభావంగా వినబడుతూంటుంది. తెలుగుచదువరుల గోష్ఠులలో వీరిపేరు తరుచు గ్రంథాల యానికి పర్యాయవాచకంగా కూడా వాడబడుతుందంటే అత్యుక్తి లేదు! ఇట్టి అనన్యసేవకుని విశ్వాసపూర్ణులైన ఆంధ్రులు ప్రేమింపక, ఆదరింపక, బహూకరింపక చిరకాలం ఎట్లూరుకోగలరు! ఈ శుభావసరంలో ఆంధ్రజనయిత్రి తన అనుగుబిడ్డ రమణయ్యను ఆరోగ్యైశ్వర్యాలతో ఇంకా పదికాలాలపాటు తన సేవయందు వర్ధిల్లుమని దీవిస్తూ పరితోషాశ్రువులతో పసుపునేసలు చల్లుతోంది.

# 'మనుజునకు పసిపాపడు జనకు డగును'

## "The Child is Father to the Man"

—*Wordsworth.*

మనము చిరుతప్రాయమునాడే యీ కవివర్యుని పద్యపాదమును 4-వ ఫారముననో లేక 5-వ ఫారమునందో చదువుదుము కాని దీని భావమును వయసుమీరిన తరువాతగాని సమన్వయ మొనరించు కొనజాలము. ఆ రీతినే మన బాల్యకాలమునాటి సహాధ్యాయుల గుణగణముల గుర్తెరుంగజాలము. ఇట్టి సందర్భమే నాకు శ్రీ అయ్యంకి వేంకటరమణయ్యగారి విషయమున సంభవించెను. శ్రీ సైలరు హైస్కూలునందు 1905,1906 సంవత్సరములలో 4,5 ఫారములలో జదువునపుడు శ్రీ వేంకటరమణయ్యగారికి సహాధ్యాయుడనై యుండు భాగ్యము లభించెను. ఆ తరువాత 'ఎవరికి వారే యమునాతీరే' అను నటుల, వారు మమ్ముల విడచి వేరొకచో విద్య నభ్యసింప జనిరి. నేము పాఠశాలలో చదువునప్పుడే 'పువ్వు పుట్టగనే పరిమళి' మన్నట్లు, వేంకటరమణయ్యగారు, నయముననను, భయముననను తనతోడి బాలుర నెల్ల నొక్కొక్క పుస్తకము చొప్పున కొనిపించి, ఒక చిన్న గ్రంథాలయమును నెలకొల్పి, కొన్ని పత్రికల దెప్పించి, స్కూలులేని సమయముల నచ్చట గుమిగూడి విద్యాలాభమును బొందునటుల జేసెడివారు. ఇటుల వారు తనతోటి బాలురకెల్ల మార్గదర్శకులుగ నుండిరి.

తరువాత పదిసంవత్సరములు గడచిన వెనుక నేను వీరిని విజయవాడలో సందర్శించుట గలిగెను. చూతును గదా, వారి భాషాసేవ! ఎలఁబ్రాయమునందు వారి హృదయాలవాలమున నంకురించిన కోర్కెదీవ, కాలక్రమమున నలుదెసల నల్లుకొని, చిగిరించి, పూలు పూచి, శ్రీరామమోహన గ్రంథాలయము పేరిట విజయవాటికయందు ఫలించెను. ఇంతియేగాదు. వీరు పట్టణవాసులతో పాటు, గ్రామస్థులకును గ్రంథాలయప్రాశస్త్యమును బోధించుటయే గాక, గ్రంథాలయ సర్వస్వమను పత్రిక నొకదాని ప్రచురించి, భాషాసేవమూలమున దేశసేవ నాచరింపజొచ్చిరి. దీని నంతయు నెరింగిన పిదప పై నుదహరించిన పద్యపాదభావము నాకు గోచరించెను.

ఆ పూర్వోక్త కవితిలకుని ఆశయమే వీరికి లభించునటుల పరమేశ్వరుని ప్రార్థించుచు, నా పరిచయ వాక్యముల ముగింతును.

"బాల్య మంతయు వీరి కే పగిది నడచె
యౌవనముగూడ నీరీతి పోవుచుండె
వార్ధకముగూడ నిటుల సొంపారుగాత
మనుజునకు పసిపాపడు జనకు డగును.

బెజవాడ

శే. వేం. రాఘవ అయ్యంగారు, ఎమ్. ఏ., బి, యిడి.,

# ఆశీర్వచనము

క. శ్రీమంతుని వేంకట రమ,ణామాత్యు నయ్యంకికులజు నాయుర్భాగ్య
శ్రీమంతుఁ జేసి ప్రోచుత, గామితఫలదాత్రి దుర్గ కరుణాన్వితయై.

క. భగవద్గీత కృతిం గొనె, భగవద్భక్తుఁడు కుటుంబి బహుపోషకుఁడీ
సుగుణుండు బాలభటులం,దుఁ గడుఁ బేరొందె నెందు ధూర్వహుఁ డగుచున్.

క. సర్వస్వ మనెడి పత్రిక, ధూర్వహుఁడై నడపె నితఁడు తొల్లి; లవంబున్
గర్వం బెఱుఁగం డితని, శర్వుఁడు రక్షించుఁగాక సకల విధములన్.

బెజవాడ, చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి, శతావధాని

# శ్రీ అయ్యంకి వేంకటరమణార్యాభివందనములు

అయ్యంకి వేంకటరమ,ణయ్యా నూరేండ్లు నాయురారోగ్యంబుల్
వెయ్యారులు నీ కీశ్వరుఁ, డియ్యన్ సన్మానము ప్రజ లియ్యవలె నయా.

గ్రంథాలయములఁ బెట్టియు, నాంధ్రావని నిద్రలేపి యాదర్శములం
దంధత్వ ముడిపితివి, పూ,ర్ణేందునిభా వెంకట రమణేంద్రా! సాంద్రా.

నీ వంటి తెలుఁగు బ్రాహ్మణుఁ,డే వీట జనించునచట యేకత్వము వి
ద్యా విభవము భ్రాతృత్వము, శ్రీ విలసిల్లును శుభంబు సేమము లలరున్.

గ్రంథాలయోద్యమక్రమమును సాధించి, తెలుగుబాసకు కీర్తి దెచ్చినావు
ఆదర్శకంబు గ్రంథాలయసర్వస్వ, పత్రిక నెలకొల్పి ప్రబలినావు
జిజ్ఞాసువునిగ దివ్యజ్ఞాన సభను, సాధనఁ జేసి సద్భక్తిఁ దనరినావు
బాలభటోద్యమ ప్రారంభములఁ బ్రోత్సహించి విక్రమము చూపించినావు
మించి దేశసేవను ప్రబోధించినావు, మంచివారందరిని గౌరవించినావు
వినయమే శీలమని నిరూపించినావు, ప్రథిత "అయ్యంకి వేంకట రమణయార్య."

తెలుఁగు చరిత్ర వ్రాయునెడ దివ్యముగా భవదీయ సత్కథా
కనలము గూర్చవచ్చు గుణగణ్యులు నీవు నిజంబుగా మన
స్సులు పులకింపఁ బొత్తముల సొంపులు నింపుచు వన్నెఁ బెట్టి త
న్నిలయములన్ సరస్వతిని నిల్పితి 'వేంకటరమణ' సత్కవీ.

పిఠాపురం ఉమర్ అలీషా.

# "అతఁ డయ్యంకి కులాబ్ధి చందిరుఁడు"

మ. అతఁ డయ్యంకికులాబ్ధిచందిరుఁ డమాత్యశ్రేష్ఠుఁ డాంధ్రాళికిన్
హితుఁ డత్యంతము మాకు నాప్తుఁడు సదోన్నిద్రుండు సన్మిత్రసం
గతుఁ డార్యుండు వదాన్యుఁ డుత్తముఁడు దీక్షావంతు డాఢ్యుండు సం
తత సంతోషి సుకర్మనిష్ఠుఁడు శతాబ్దంబుల్ సుఖం బుండెడున్.

శా. ఆవేశం బెఱుఁగండు చేనయినకార్యం బాస్థతోఁ జేయు సం
భావించున్ భరతావనిం గలుగు విద్వద్వర్యులన్ ధుర్యులన్
దేవున్ దేశముఁ బెద్దలన్ గళల బ్రీతిం గొల్చు నయ్యంకి వం
శావిఖ్యాతుఁడు భీతివర్జితుఁడు విఖ్యాతుండు సుజ్ఞాతుఁడున్.

ఉ. పోఁడు విహంగమార్గమునఁ బొంగఁడు క్రుంగఁడు దేశభక్తులన్
గూడిఁ బిపీలికాధ్వమునఁ గొంకకనిల్చు నదేరి కాపదల్
దేఁడు సరస్వతి న్నిలుప దేవళముల్ నెలకొల్పు నెల్లెడన్
వాడని వేడ్కతోడ బెజవాడ మొదల్గల వాడవాడలన్.

ఉ. వందలు వేలు లక్షలు ప్రబంధము లెట్టుల బీరువాలలో
నందముగాఁగఁ బెట్టి నిమిషార్ధములోఁ దనుగోరు పుస్తకం
బుం దెమలించి తెచ్చు విధముల్ బుధుఁ డీతఁడు శాస్త్రరీతిగా
నంద తెఱుంగ నాంధ్రమునయందునఁ దెల్పె వినూత్నపద్ధతుల్.

శా. భద్రాకారములౌ ప్రబంధములు సద్భావంబులున్ బత్రికల్
ముద్రించున్ దన యంత్రరాజమున సమ్మోదింపఁగా సజ్జనుల్
నిద్రన్ మేల్కొనఁ బామరుల్ తనసుతుల్ నిర్వాహకుల్ గాఁగ నం
విద్రూపున్ భగవంతుఁ గొల్చు నెట నే విఘ్నంబు లేకుండఁగన్.

క. ఎట నున్నవార లీ వేం
కటరమణునిఁ బొగడుచుంద్రు గ్రంథాలయ సం
ఘటనాకార్యములందున
నిటు లుండంబోలు యశ మదే పనిసేయున్.

బెజవాడ.

పండితరాజ దంటు సుబ్బావధాని.

# నా పరిచయము

శ్రీ చెన్నుభొట్ల భానుమూర్తి, బి. ఎ., ఎల్. టి., ఎ౽. డి.

స్వల్పారంభముగా నుండే చిన్న కొండవాగు పోను పోను పెద్దదై కొండలను గూడా బ్రద్దలు చేసు కొని బయటపడి తాను ప్రవహించునంత మేరా సస్యశ్యామలము చేసినట్లే నాలుగు గోడలమధ్యా యిమిడియున్న బడిగదిని బుద్ధిపూర్వకముగా వదలివేసి, విశాలవిశ్వాన్ని తన పాఠశాల చేసుకొని తాను విద్యావంతు డగుటయేగాక, తనతో సంబంధముగల ప్రతిపురుషుని స్త్రీని గూడా సరస్వతీ రూపాన్ని చేసే గ్రంథాలయోద్యమాన్ని చేబట్టి, ప్రచండవేగముతో ప్రవహించే నదివలె నిర్నిద్ర శ్రద్ధతో తెలుగుదేశాన్ని విద్యావంతము చేయుటకు అహోరాత్రములు పనిచేసిన వారిలో వెంకట రమణయ్య ఒకడు.

మన మాయనతో ఎంత క్లిష్టమైన పనినిగురించి చెప్పినా ఆయన కా పని చాలా తేలికగా కనుపడు తుంది. అసాధ్యమైన పని యెక్కడా లేదనీ, తగినంత శ్రద్ధా దీక్షా ఉంటే ప్రతిపనీ సాధ్యమే అవు తుందనీ ఆయన నమ్మకము. సంశయముతో ప్రారంభించిన కష్టపుపను లనేకము ఆయన విశ్వాస బలమువలన సులభసాధ్య మగుట నా నిత్యఅనుభవములోని విషయము. అట్టివానిలో ప్రకృతిశిబిరము ఒకటి. ఒక నెలదినములు, అనేకప్రకృతులు గల స్త్రీలు, పురుషులు, పిల్లలు, ఒకచోట చెట్లనీడన నేలపై పవ్వళించి వండని పదార్థములు తిని జీవించుట సాధ్యమని గ్రహించి ఆ దృశ్యాన్ని ముందుగానే మనఃఫలకములో చూచి నడపుట సామాన్యకార్యము కాదు. దానికి కావలసిన విశ్వాసబలాన్ని మా కిచ్చినవాడు వెంకటరమణయ్యే. ఈ సాహసవిశ్వాసములకు నెపోలియనుకు, ఈయనను పోల్చవచ్చును.

రవీంద్రనాథ టాగూరు స్కూలును జయిలు అన్నాడు. అందువల్లనే టాగూరు స్కూళ్లు కాలేజీలలో చదువటాని కిష్టపడలేదు. టాగూరు స్థాపించిన విశ్వభారతికి జెయిలు వాసన లేదు. అక్కడ స్వేచ్ఛ ఉంది. విద్యార్థులు తోడేలుదగ్గిర మేకపిల్లలవలె గాక అధ్యాపకులతో స్నేహితులవలె ప్రవర్తిస్తారు. వెంకటరమణయ్యగారు చిన్నప్పుడు రుస్తుంబాదాలో అయ్యగారి వెంకటరమణయ్యగారి యింట్లో ఉండి చదువుకొనేవారు. అప్పుడు స్కూలు పాఠాలతోపాటు పత్రికలు గూడా చదువుతూ ఉండే వాడు. నేను గూడా నర్సాపురం స్కూల్లో హయ్యరుక్లాసులలో చదివేవాడను. ఆయన ఒకటి, రెండు ఫారాలలో ఉండేవాడు. పత్రికలు చదువుట అయ్యగారి వెంకటరమణయ్యగారి దృష్టిలో చాలా తప్పుపని. చదువుకునే పిల్లలు పత్రికలు చదివితే చెడిపోతారని ఆయనకు భయము. అందు వల్ల మన వెంకటరమణయ్యను పత్రికలు చదువుకోనిచ్చేవాడు కాడు. తండ్రితో చెప్పి మందలింపించే వాడు. అందువల్ల వెంకటరమణయ్య పత్రికలు దొంగతనంగా చదువవలసివచ్చేది. శనివారముగూడా బడి ఉన్నదని యింటివద్ద చెప్పి రుస్తుంబాదా నుండి నర్సాపురం వెళ్ళేవాడు. అక్కడికి ఒక స్నేహి తుడి పేరుతో పత్రికలు తెప్పించేవాడు. ఆ పత్రికలు తనివితీరా దొంగతనంగా చదివి యింటికి తిరిగి వచ్చేవాడు. ఆరోజులలో నర్సాపురంలో గ్రంథాలయాలు గాని, ఉచితపత్రికాపఠనమందిరాలు గాని లేవు. నర్సాపురం స్కూలు గ్రంథాలయములోని పుస్తకాలు, పత్రికలు విద్యార్థులకు మాత్రం

యిచ్చేవారు కారు. విద్యావ్యాసంగముమీద ఆయనకు చిన్నప్పటినుండి ఎంత దాహం ఉండేదో దీనిని బట్టే గ్రహింపవచ్చును. ఇప్పటికీ ఆయన దోవన పోతూ ఎన్నో పత్రికలు కొని చదువుతూ ఉంటాడు. ఆ చిన్నతనములో పత్రికలు చదివే ఆ దొంగతనముగూడా యెన్నోనాళ్లు దాగలేదు. అయ్యగారి వేంకటరమణయ్యగారు ఆ దొంగతనాన్ని పట్టుకొని తండ్రికి వప్పగింత పెట్టినాడు. వెంకటరమణయ్య ఎదురు తిరిగాడు. రుస్తుంబాదాలో అయ్యగారి వెంకటరమణయ్య వత్తిడి పడలేనన్నాడు. చదువుకు స్వస్తిచెప్పినాడు. విశాలవిశ్వమే పాఠశాలగా లోకానుభవమే పాఠములుగా చదువుకొన్నాడు. ఆయన యిల్లు ఒక సరస్వతీమందిరము. ఎన్నోతరగతులకు చెందిన గ్రంథ సంపుటము లతనివద్ద నున్నవి. ఆయనకు విద్యావిషయములో ఉన్న ఆకలి బ్రహ్మరాక్షసి ఆకలి వంటిది. ఎప్పటికీ తీరేది కాదు.

బడిలో పిల్లకాయలకు చదువు రావడం, జయిలులో నేరస్తులు మంచి మనుష్యులు కావటంవలెనే అసాధ్యమైన పని యని వెంకట రమణయ్య నమ్మకం. అందువల్లనే ఆయన 15, 20 సం॥ల వయస్సు మధ్యనే గ్రంథాలయోద్యమాన్ని ఆరంభించినాడు. చదువుటలో ఎంత స్వేచ్ఛ ఉంటే మనుష్యులు అంత స్వేచ్ఛ గలవారు అవుతారని ఆయన నమ్మిక. అదీగాక చిన్నతనములో ఏ దురదృష్ట వశాన్నో చదువు కోని వా రంతా జీవితాంతమూ విద్యావిహీనులుగా ఉండ నగత్యము లేదనీ, గ్రంథాలయాలద్వారా ప్రతివారు ఏ వయసునుండి అయినా గూడా చదివి విద్యావంతులు కావచ్చుననీ ఆయన నమ్మకము. తెలుగు దేశములో ఆయన తిరుగని గ్రామముగాని, చివరకో తాలూకాగాని లేదని చెప్పవచ్చును. ఏమాత్రమూ విసుగులేకుండా గ్రంథాలయనిర్వహణములో వివిధగ్రంథాలయనిర్వాహకులకు సలహా లివ్వడము ఆయన కత్యంతసంతోషదాయకమైన విషయము. ఆయన ఎన్ని గ్రంథాలయవార్షికోత్సవాలకు అధ్యక్షులైనాడో, యెన్ని వార్షికోత్సవాలలో ఉపన్యసించాడో, ఎన్ని తాలూకా, మండల, ఆంధ్రదేశ, అఖిల భారత గ్రంథాలయ మహాసభలు జరిపించాడో లెక్కవేయటానికి సాధ్యముకాని పని.

గ్రంథాలయ సర్వస్వము ఒక అమూల్యప్రకటన. మొదటి 2, 3, 4 సంపుటములు ఆయన స్వంత ద్రవ్యాన్ని హవిర్భాగముగా చేసి ప్రచురించినాడు. తరువాతగూడా మొన్న మొన్నటి వరకూ ఆయన యెన్నో సంపుటాలు చాలా కష్టనష్టాలకు లోనై ప్రచురించినాడు. గ్రంథాలయ సర్వస్వములో గ్రంథాలయ శాస్త్రమే గాకుండా సాహిత్యవిషయాలచర్చ గూడా ఉండేది. అందులో పూర్వ సాంప్రదాయకుల కవిత్వమే గాక ఆధునికుల కవిత్వము గూడా ప్రచురింప బడుతుంది. ఆయనకు పూర్వఆధునికభేదము ఇసుమంతా లేదల్లే ఉన్నది. ఆయన దృష్టిలో విశ్వవిద్యాలయ మంటే గ్రంథాలయమే. అందువల్లనే ఆయన కా ఉద్యమంలో అంత శ్రద్ధ. వెంకటరమణయ్య గ్రంథాలయోద్యమానికి ప్రాధాన్య మొసంగి, ప్రారంభవిద్యను నిర్బంధము చేసిన గయక్వారు మహారాజు శాయాజీరావు బహద్దరు వారి షష్టిపూర్తి ఉత్సవానికి స్వయముగా వెళ్ళి మహారాజా వారికి సన్మానపత్రసమర్పణము చేసి వారిచేత గౌరవింపబడి, సంస్థానఅతిథిగా నుండి తిరిగి వచ్చిరి.

శివాజీ మహారాజును మనము బొమ్మలలో గుఱ్ఱముమీద స్వారిచేస్తున్నట్లు చూచినాము. అవసర ఆంధ్ర మహాసభలు, బెజవాడలో 1933 సంవత్సరములో జరిగినవి. నీలి దుస్తులలో వెంకట రమణయ్య గుఱ్ఱముమీద సవారీచేస్తూ సేవకదళాన్ని నిర్వహించే దృశ్యాన్ని జ్ఞాపకం తెచ్చుకుంటే యిప్పటికీ ఒడలు జలదరిస్తోంది.

బాలభటఉద్యమము ఆంధ్రదేశానికి మొదట తెచ్చినవాడు వెంకటరమణయ్య. కాకినాడ కాంగ్రెసు జరిగినప్పుడు వెంకటరమణయ్య భటోపదళాధిపతిగా ఉండి, నిర్వహించినాడు. అది అంతా కూడా ఆయన హిందూస్థాన్ స్కౌటుకమిషనర్ గా ఉండి, పొందిన తరిబియతుయొక్క ఫలితము. సర్ రాబర్టు బేడెన్ పవెల్ మద్రాసు వచ్చి "స్కౌటు గ్రామా"న్ని దర్శించినప్పుడు, 'నిక్కరు' ధరించకుండా క్షత్రియులవలె పంచె వెనుకకు విరచికట్టిన భట పటాలమును (జగ్గయ్యపేట, సాధు రామకృష్ణయ్యగారి పటాలము) తీసికొని వెళ్ళిచూపిరి. బేడెన్ పవెలుగారు ఆ పటాలమును వారి దుస్తుల విశేషమును, వారు చేయు పనులవిశేషమును జూచుచు అరగంట గడపిరి. మరియు బేడెను పవెలుగారు వెంకటరమణయ్యగారికి ఒక పతకము (Badge) ను కూడ బహుమతి చేసిరి. మహానందియందు 'ఆల్ యిండియా స్కౌటురాలీ'ని రావించి ఆంధ్రులప్రతిభావిశేషములను అఖిలభారత మంతా చాటినాడు. స్వయముగా స్కౌటు శిబిరములు జరుపుటయే గాక స్కౌటు తరిబియతుకు సంబంధించిన అనేకగ్రంథములను ఆయన తెలుగులో ప్రచురించినాడు. ఆ పుస్తకాలే యిప్పటికీ స్కౌటు శాస్త్రమునకు అథారిటీగా ఉన్నవి.

ఆయన యింటి పనులు ఎప్పుడూ స్వంతముగా చూచుకోనడు. తల్లి మంగయ్యమ్మగారు బ్రతికి ఉన్నప్పుడు ఆయన యింటి పనులలో 'పాపాయియే'. ఇప్పుడు కోడలూ కొడుకు చూచుకొనుట చేత ఇప్పుడూ 'పాపాయే'. ఆయన కున్న తెలివి ఏమంటే, సమర్థుల నాపనికి ఏర్పఱచి తాను నిశ్చింతగా నుండుటయే.

ఆయనకు పని ఎంత ఎక్కువగా నుండిన అంత తీరుబడి. దీనికి ఒక సాదృశ్యము జెప్పిన జాలును. కాకినాడలో కాంగ్రెసు జరగినప్పుడు ఆయన కాంగ్రెసు వాలంటీరు దళానికి ఉపసేనానిగా ఉండిరి. ఆ కాంగ్రెసు దినముల యందే ఆయన అఖిలభారత గ్రంథాలయ మహాసభను, అఖిలభారత వాలంటీరు మహాసభను నిర్వహించిరి. బాధ్యతతో కూడిన మూడు ముఖ్యమగు పనులను ఎట్టుల నిర్వహింప గలిగిరి? వాలంటీరు ఉపసేనాని పనుల నిర్వహణకు ఒక మంత్రి (మాచిరాజు రామచంద్రమూర్తి) (Private secretary); గ్రంథాలయ సభాకార్యనిర్వహణమునకు ఒక మంత్రి (టి.పి. ఆళ్వారు); వాలంటీరు మహాసభాకార్యనిర్వహణమునకు ఒక మంత్రి (వల్లూరి వారి అబ్బాయి). ఇటుల ముగ్గురు మంత్రులతో వేంకట రమణయ్య "రాజులుంగారు" ఎప్పటి కార్యముల నప్పుడు విచారించుచు, ఏ పనియు కుంటుపడకుండ అతిసామర్థ్యముతో నిర్వహించిరి. ఒకరోజున గ్రంథాలయ సభకు సొమ్ము కావలెననిరి. వెంటనే చెలికాని ధర్మారావుగారిదగ్గరనుండి ఉత్తరం తీసికొని, లక్ష్మీనరసాపురం జమీందారిణిగారి యొద్దకు బోయి మూడు వందల రూపాయలను దెచ్చి

ఆశాఖామంత్రి కిచ్చిరి. వేరొకరోజున వాలంటీరుసభకు సొమ్ము లేకపోయినది. వెంటనే ఆ సభకు ఆహ్వాన సంఘాధ్యక్షులగు శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారికి టెలిగ్రామిచ్చి నూరు రూపాయలు తెప్పించి యిచ్చిరి. ఈరీతిగా ఒకసారి, ఈ మూడుసభలకు సంబంధించిన కార్యము లను లోటుపాట్లు లేకుండ నిర్వహించుట సామాన్యకార్యము గాదు.

భార్యావియోగమువలన కలిగిన దుఃఖాన్ని దిగమ్రింగి, అందువలన హృదయములో కలిగిన వ్యథను ప్రజాహితకార్యములలో మఱచినాడు. బ్రహ్మచర్యమువలన చేకూరిన శక్తిని గూడా ప్రజాహితకార్యములకే జమకట్టినాడు. స్వవిషయాల్లో యెంత నిశ్చింతో, ప్రజాహితకార్యాల్లో అంత నిమగ్నత.

ప్రతికార్యము తప్పక నెరవేరుతుందనే ఆయన నమ్మిక. అపజయముచే ఆయన యెప్పుడూ నిరుత్సాహము చెందడు. తిరిగి తిరిగీ ప్రయత్నించి జయము గాంచుటే ఆయన స్వభావము. తప్పక నెర వేఱుననే విశ్వాసముండుటవలన ఆయనకు ఆందోళన, విచారము లేను. అందువల్లనే ఆయన యెన్ని ఉద్యమాలలో పనిచేసినను, ఆరోగ్యాన్ని, బలాన్ని, పెంపొందించుకోగలుగుతున్నాడు. ఎంత క్లిష్ట పరిస్థితులను గూడా ఆయన ధైర్యంగా ఎదుర్కొంటాడు. అపజయాలను ఆయన అనుభవాలుగా తీసికొని జయము పొందేటందుకు అపజయాన్ని సోపానాలుగా వాడుతాడు. అందువలననే అతనికి అట్టి శుభదృష్టి (Optimism) ఉన్నది.

ప్రకృతి ఉద్యమానికి ఆయన చేసిన సేవ అపారమైనది. "ఇండియన్ నాచురోపాత్" (The Indian Naturopath) వల్ల వచ్చే నష్టమంతా యిప్పటికీ ఆయన ఖాతాకే జమకట్టుతున్నారు. డాక్టరు బాబిట్, యం.డి., ఎల్. ఎల్. డీ గారి, సంపాదింప నసాధ్యముగా నున్న అపూర్వమైన "హ్యూమన్ కల్చర్ అండ్ క్యూర్" అనే సూర్యకిరణ చికిత్సావిషయిక గ్రంథము మనము ఇంగ్లీషులో ప్రచు రింపగలుగుటకు ఆయన యొక్క అచంచలమగు దీక్షయే కారణము.

ప్రకృతికార్యాలయ ట్రస్టు నిర్వహణములో వీరు చూపుచున్న అకుంఠితదీక్ష ఆశ్చర్యకరమైనది. బెజవాడలో వెంటనే ప్రకృతివైద్య కళాశాలను స్థాపింపవలె ననియు, కేంద్ర ప్రకృతి చికిత్సాల యము స్థాపింపవలె ననియు వారు సంకల్పించి యున్నారు. ఆ పనులు వారు తప్పక నిర్వహింపగల రనియే వారి స్వభావము నెరిగిన నేను నమ్ముచున్నాను.

కవులు, పండితులు, పెద్దమనుష్యులు, ధనికులు, పేదవారు, సనాతనులు, సంస్కారప్రియులు, అనాథ యువతులు, విద్యావతులు, మొదలగు వివిధ తరగతులకు చెందిన వారెందఱో వెంకట రమణయ్య మిత్రబృందములో నున్నారు.

ఇన్ని ఉద్యమముల్లోనూ పని చేయుచున్నట్టి యీ ప్రతిభాశాలి వెంకటరమణయ్య దైవానుగ్ర హామువలన చిరకాలము జీవించి తాను ప్రారంభించిన ఉద్యమముల నన్నిటిని ఇతోధికముగా ఫల ప్రదములు జేయుగాత మని భగవంతుని ప్రార్థించుచున్నాను.

* * *

కవులకుఁ గొంగుబంగరు రీతిగాఁ దన, ర్చిన నీ యుదార సౌశీల్య మెంచి
పరిశోధకులకుఁ దోడ్పడి యాంధ్రజగతికి, రక్తిఁగూర్చిన కళారతి గ్రహించి
గ్రంథాలయోద్యమకార్యంబులందు నీ, యసమానమగు నట్టి కృషి నుతించి
వాఙ్మయసేవకై పరుగువారెడి నీదు, భాషాభిమానతత్పరత తలచి
ఆంధ్రు లిప్పటి కర్ఘ్యపాద్యములతోడ, నిన్నుఁ బూజింప వచ్చి యుండిరి సుమయ్య
అందుకొనుమయ్య! శ్రీ మదయ్యంకివంశ్య! రసికనుతచర్య, వేంకటరమణయార్య!

ఊరూరన్ బ్రతిభాప్రదర్శకములై యొప్పారుచున్ గ్రంథభాం
డారంబుల్ నెలకొల్పగాఁబడుట, యాంధ్రక్షోణికిన్ తేజమున్
చేరం బెంపు దలిర్చుచుండుట, భవద్విఖ్యాత సేవాఫలం
బై రాజిల్లెను నీదు జీవితమునం దయ్యంకి వంశాగ్రణీ!

జనసామాన్యము శూన్యదృష్టి మెయి భాషన్ జూచు కాలాన నీ
వనవద్యంబుగ భారతీచరణయుగ్మాధీనబుద్ధిన్ దనూ
ధనసర్వస్వము ధారపోసితివి స్వాతంత్ర్యాంకురంబుల్ జగ
జ్జనచిత్తంబుల నాఁటినాఁడవు నినున్ శ్లాఘింపగాఁ జెల్లదే.

ప్రతిఫలవాంఛ లేక బహుభంగుల దేశహితంబు గూర్చుచే
జతనముగా చరించితివి సర్వవిధంబుల నాంధ్రదేశ ము
న్నతి గడియించె నీదు కతనన్ చరితంబులలోన నీదు శా
శ్వతకృషి మెచ్చుకోగలరు భావికవిప్రభువుల్ కృతజ్ఞులై.

ఆంధ్రదేశమున గ్రంథాలయోద్యమము నీ, కతమున బెంపొందగల్గె ననుచు
ఆంధ్రభారతికి నీ యభ్యుదయంబుచే, క్రొత్త తేజంబు చేకూరె నంచు
ఆంధ్రులకార్యదీక్షాదికంబులకు నీ, కృషిచేత పేరు దక్కెన దటంచు
ఆంధ్రోద్యమంబున కన్ని విధముల నీ, యుత్సాహ శక్తి మే లొసఁగె నంచు
నీ యశోగీతి బాడుచుండెను జగంబు, మనసు దీరంగ నాలించి మాతృసేవ
కాయితము గమ్ము నీకుఁ గల్యాణసిద్ధి, అమరు నయ్యంకి వేంకటరమణ మంత్రి!

శ్రీ శేషాద్రి రమణ కవులు.

# సన్మానప్రశంసా పద్యములు

క. శ్రీదయితుఁడు నిత్యంబు మ,హాదరమున శుభచిరాయురారోగ్యైశ్వ
ర్యాదు లొసఁగి యయ్యంకి కు,లోదయు వేంకటరమణుని నొగి రక్షించుఁ.

సీ. విజ్ఞానబీజముల్ పెంప "గ్రంథాలయో, ద్యమ పితామహు" లయి తనరినారు
"గ్రంథాలయోద్ధారకత" వన్నెఁ గాంచ గ్రం,థాలయంబుల నిల్పి యలరినారు
అసమానసేవ "గ్రంథాలయశాస్త్ర వి,శారదు" లనుపేర మీఱినారు
గ్రంథాలయోదయకార్యంబుల నమూల్య, విఖ్యాతి గడియించి వెలసినారు
తే. ప్రీతిని బరోపకారపారీణు లగుచుఁ, బ్రథితగౌరవ మెంతయుఁ బడసినారు
అసదృశప్రతిభాఢ్యులై యెసఁగినారు, ప్రచురసుస్థేమ! వేంకట రమణనామ!

సీ. ఆంధ్రలోకంబునకా చిరపరిచితు,లై యసామాన్యగణ్యత గడించి
అల్ల గ్రంథాలయోద్యమమున కెంతయు, దనదు సర్వస్వమ్ము ధారపోసి
తత్ప్రయత్నము ఫలితమ్ముగా నాంధ్రదే,శమ్మున స్థాపించి సంఘ మొకటి
సంతతకార్యదీక్షాపరతంత్రులై, కార్యదర్శిత్వమ్ముఁ గాంచి మిగుల
తే. నతినిరంకుశముగ నిర్వహణ మొనర్చి, యాంధ్రదేశంబునకు, నిండియాకు నెల్ల
నంచితాదర్శముగఁ జేసి యల విదేశ,దృష్టు లెల్ల నాకర్షించి దీమసమున
వరలు మిమ్ములఁ బొగడంగఁ దరమె? మాకు.

సీ. ఉద్యమం బభివృద్ధి నొంద సభల్ ప్రద,ర్శనముల స్వపరరాష్ట్రముల జరిపి
తత్ప్రచారమునకై స్థాపించి 'లైబ్రరీ, సర్వస్వపత్రిక' స్వయము గాఁగ
భూయిష్ఠమైన యపూర్వవిధానమ్ము, కార్యరూపమ్ముగా గడలుకొలిపి
ఆకర్షకము నూత్నమౌ పద్ధతులతోడ, సత్తు దుద్యమమును సాగఁజేసి
తే. శ్లాఘ్యమౌ ప్రజామోదమ్ము సంఘటించి, అందఱికిని బ్రోత్సాహమ్ము నావహించి
యెల్లరీతుల నుపకార మొనయఁజేసి, వరలు మిమ్ములఁ బొగడంగఁ దరమె? మాకు.

సీ. అలరు గ్రంథాలయోద్యమ ముచ్చదశయందు, వర్ధిల్లునట్లుగా వరలఁ జేసి
పరమ "దివ్యజ్ఞానపత్రికఁ" స్థాపించి, యత్యుత్తమస్థాన మాక్రమించి
"ప్రకృతి" వైద్యమునకు బహుసహాయము జేసి, శ్రద్ధమై మార్గదర్శకులు నగుచు
అల "భగవద్గీత" నాదృతిఁ గృతి నంది, "బాలభటోద్యమ" ప్రతిభ నెరపి
తే. ఘనతసారస్వతమ్మును, గళ, చరిత్ర, నాట్య విద్యాదులెల్ల ననారతమ్ము
తగ యథాశక్తిమై సముద్ధరణ చేసి, వరలు మిమ్ములఁ బొగడంగఁ దరమె? మాకు.

## మత్తేభవిక్రీడిత కంద గర్భసీసము

సీ. వితతసౌశీల్యసువేద్య సద్గుణమణీ!, దాతృత్వ సంశోభితా! ద్విజేశ!
విహితసమ్మాన్య! వివేకయుక్తమతి! సాహిత్యప్రభావాంచితాత్యుపకృతి!
సుకృతిసందీప్త యశోధనోర్జిత! శ్రితా, ర్తిత్రాణపారీణ ధీవిశాల!
వినుతదాక్షిణ్య! సువిశుద్ధప్రథ! కళా, నూనాభిమానోన్నతా! నిరూఢ!

తే. యాచకజనాభిహిత! ప్రథితాచరితసు, వేదసమ్యగాచార! బుధాదృతిపర!
శ్రీచణ! ప్రసన్నహృదయ! శుభోచితమహా, నీయవర్తనోదార ఖనీ! సుధీర!

## గీత కందగర్భ చంపకమాల

చ. వరసుగుణాంచితా! యమల వంశగరీయ! యుదారకీర్తి సం
భరితదిశా! సదాసుజనమాన్యవిశేష! విశుద్ధభావ! భూ
సుర! జగదున్నతా! సకలసూరిగణస్తుత! సౌమ్యతేజ! శ్రీ
కరచరితా! సుధీ! సుకృతి గౌరవభాజన! శోభితాంగణా!

చ. పలుకువెలందియత్త యెడబాయక మీ నెలవందు నిల్చుతన్
గలుములచేడెకోడలు సుకంబుగ మీదగు నాల్కఁ బొల్చుతన్
వలమురితాల్పు నల్వ మినువాకతలం గల మేటి యెప్డు క
ల్మలు బలుపాడిపంట నెఱపున్నెము కోర్కె లొసంగి ప్రోచుతన్.

చ. కడిమియుఁ దేజు శీవియు మగంటిమి చాగము తాల్మి తెల్వియున్
దొడరగ, నెయ్యమున్ దనరఁ దోరపురాచతనమ్ము మీటఁ, బొ
పడరగఁ, దొంటిపెద్దగడల యందము పొందుగ నిల్పి, మేటివై
కడు నెల ప్రొద్దు చుక్కలును గల్గిననాళ్లు నసమ్ము పొందుమా!

కవిరాజ: కవిరత్న : చింతపల్లి రామకృష్ణమూర్తిశాస్త్రి.

గవర్నరుపేట – బెజవాడ. శ్రీకృష్ణభగవద్గీత, ఋతుసంహార, రసమంజరి, సనత్సుజాతీయ, ప్రముఖగ్రంథకర్త.

# చంద్రకళ

ముసలోనీ తొమ్మిది సంవత్సరముల ప్రాయమున నొంటరిగా గదిలో తలుపువేసికొని నిలువుటద్దము ఎదుట నిలబడి గంభీరముగ ఉపన్యాసకునివలె మాట్లాడుచుండెను. తల్లి వాని మాటలధోరణి విని, తలుపు తట్టి, 'బెనిటో, నీ కేమయిన పిచ్చియెత్తినదా' అని కేకలువేయ, బెనిటో తక్షణము తలుపు తెఱచి, 'అమ్మా! నేను పెద్దవాడ నైనతరువాత మన 'అభినవ ఇటలీ' దేశమునకు నా సేవ అవసరము. దానికి నేను ఇప్పుడు గంభీరముగా మాట్లాడుట అభ్యసించుచుంటి' నని తల్లికి బదులు చెప్పెను.

ఇట్టి గుణసూచనలు లేఁబ్రాయముననే మహాపురుషుల జీవితములలో పొడగట్టును, కాని భావి కాలములో నొక వ్యక్తిచే నీశ్వరుఁ డేమి చేయించ నుండేది బాల్యమునందే వాని యందు నిబిడీకృతమై యుండును. సాధారణపురుషులయందు వారి చిరుతప్రాయమున పొడకట్టు గొప్పసూచనలను మనము శ్రద్ధతో పరిశీలించి, కనిపెట్టము. పువ్వు బాగా వికసించి దాని సౌరభము నలుదెసలకు వెదజల్లినప్పుడు గమనించి, 'ఆహా! ఆహా!' అని ఎంతో వర్ణింతుము. యోధులలోను, రాజకీయవేత్తలలోను, వీరులలోను, ప్రవక్తలలోను చరిత్రకారులలోను, కవులలోను, ప్రఖ్యాతపురుషులను దేశీయులు, అఖండమైన గౌరవము చేయుట వారి విధి కృత్యములు నెరవేర్చడమగును.

వాస్తవముగ 25 సంవత్సరములకు పూర్వము, మన ఆంధ్రదేశములో గ్రంథాలయోద్యమము చాలా కొరతపడి యుండె ననవచ్చును. ఈ యుద్యమమునకుఁ గడుంగడు శ్రమపడి గ్రామగ్రామములు దిరిగి, సభలు గావించి, భాండాగారములు స్థాపించి, వానియందు అభిరుచి కల్పించి, వాని అమూల్యమగు విలువను గుర్తెరుంగునట్లు తీవ్రమగు ప్రచారము శ్రీయుత వెంకటరమణయ్య పంతులుగారు గావించి రనిన అందఱు నామోదించక మానరు.

శ్రీ అయ్యంకి వేంకటరమణయ్యగారు ఆంధ్రదేశములో నల్లుకొనిన యన్ని యుద్యమములలోను, తనశక్తి వంచన లేకుండ పాల్గొని, అపారమగు స్వచ్ఛందసేవ దేశమునకు చేసియుండిరి. అన్నింట అగ్రస్థానము వహించి రనవచ్చును. అందు గ్రంథాలయోద్యమము అగ్రస్థానము వహించెను వీరు విద్యార్థిదశలో నున్నప్పటినుండి, వీరికి వార్తాపత్రికలు, పుస్తకములు చదువుటన్న కడుశ్రద్ధ. వీరు అత్తిలిలో మా తండ్రిగారి పాఠశాలయందు ఒకటవ ఫారము చదువుచున్న రోజులలో నేను బహుశః నాల్గవతరగతి చదువుచుంటిని. మా తండ్రిగారు వార్తాపత్రికలు తెప్పించుచుండిరి రమణయ్యగారికి నేను వార్తాపత్రికలు పుస్తకములు చదువుమని యిచ్చుచుండెడివాడను. ఆ చిరుతప్రాయముననే, ఆ రోజులలో ఆయన వీనియం దభిరుచి కలిగి యుండెడివారు. ఆ పత్రికలలోని విషయములు, పుస్తకములలోని మంచికథలు నా కప్పుడప్పుడు చెప్పుచుండెడివారు. పాఠ్యపుస్తకములలోని సంగతులకన్న వార్తాపత్రికలమూలముననే, ఇతర పుస్తకములు చదువుటవలనను మనము పెక్కు విషయములు తెలిసికొన గలుగుదు మని, నాతో చెప్పు

చుండెడివారు. కాని నాల్గవతరగతిలో నుండుటచే, ఆయన వాక్యములు నే నంతగా గ్రహించ లేక పోతిని. నాటినుండి నేటివరకు నన్ను ఒక బాల్యమిత్రునిగ పరిగణించుచుండిరి. తరువాత నీ గ్రంథాలయోద్యమములో వారు ప్రచారముచేయు తఱి, వారు నేను కలియు సందర్భమున, తక్కిన మిత్రుల యెదుట చిన్న నాడీతడు నాకు పుస్తకములు, వార్తాపత్రికలు చదువు మని తెచ్చి యిచ్చి చేసెడి ప్రోత్సాహమే న న్నింతగా జేసె ననెడివారు. ఈయనయందు చిన్ననాడు పొడ చూపిన విజ్ఞానచంద్రికళ క్రమక్రమముగా నభివృద్ధి పొంది వెన్నెల వెదజల్లుచుండెను.

గ్రంథాలయోద్యమోద్ధరణ బీజము చిన్నతనమందే వీరియందు పాదుకొని యున్నట్లు మనము పూర్వచరిత్ర బట్టి గ్రహింపగలము. మొదట లీలగా ప్రారంభమై, నేడు సంపూర్ణత నొంది భాసిలుచుండెను. నే డీ రోజున శ్రీ రమణయ్యపంతులుగారు చేసిన అమూల్య మగు భాషాసేవను గుర్తించి ఆంధ్రదేశము వీరి నీ విధముగ గౌరవించుట చాల ప్రశంసనీయము.

ఆచంట రామలింగేశ్వరరావు,
బి. ఏ., బి. ఇ. డి.

నిడదవోలు.

Δ

# 'అయ్యంకివారి చిన్నవాడు'

ఆంధ్రదేశములోని గ్రంథాలయ ఉద్యమము ఏవిధముగా ఆరంభమైనది, అభివృద్ధి నొందినది, ఇప్పుడు ఏవిధముగా వ్యాప్తి జెందుచున్నది, ఇవి అక్షరాస్యులైన యాంధ్రు లందరునూ ఎరిగిన విషయాలు. ఈ రోజున ఆంధ్రదేశములోని అన్ని జిల్లాలయొక్క పట్నములలోను పల్లెటూళ్ళలోను గ్రంథాలయోద్యమము ప్రబల మవుతున్నది. శ్రీ అయ్యంకి వెంకటరమణయ్యగారు పితామహు లనడములో అతిశయోక్తి లేదు.

తనకు వల్లనైనంత శక్తిని శారీరకంగాను మానసికంగాను సంపాదించి, అట్టి గొప్పశక్తిని దేశకైంకర్యానికై మూడుదశలుగా వినియోగిస్తూవున్న మహానుభావుడు వెంకట రమణయ్యపంతులు. ఈతడు శాశ్వతయువకుడు. చురుకు దనముగల వ్యక్తి. వీరిని నేడు ఆంధ్రులు డిసెంబరు మాసములో గుంటూరు మహాపట్నములో బహూకరిస్తారని విని చాలా సంతోషించి నా సంకల్పపుష్పమును ఆ యుత్సవమునకు పంపిస్తున్నాను.

మన తెలుగువారికి విదేశములయొక్క గాని, ఇతరరాష్ట్రముల యొక్కగాని వ్యక్తులన్నా ఉద్యమాలన్నా గౌరవము మెండు. అది మంచిదే కావచ్చు. ఆంధ్రులంటే గాని ఆంధ్ర దేశములో బైలుదేరిన అనేక దేశాభిమానయుతములు, సంఘోద్ధరణకారణములు, ప్రజాసేవను పురిగొల్పే ఉద్యమాలు అంటే, మన దేశ ప్రజలకు ఉండవలసినంత గౌరవము, నా స్వల్పదృష్టికి విశేషముగా

కనపడడం లేదు. నాయకులయొక్క గాని, ప్రజలయొక్కగాని, ఏ రుభయుల యొక్కగాని కార్య దీక్షాధురంధరత్వలోపమే ఇట్టి దుస్థితికి కారణమై యుండవచ్చును. ఈ లోపమును తక్షణం సవరణ చేసుకోవలసిన సమయము వచ్చినది. సోదరులు మేలుకుంటున్నారు.

ఆనిబిసెంటమ్మ హోమ్‌రూల్ ఉద్యమములోను, బాలభటోద్యమములోను, దివ్యజ్ఞానసమాజోద్యమములోను, ప్రకృతి వైద్యఉద్యమములోను, ఆంధ్రమహాసభకు సంబంధించిన ఉద్యమములోను, ఎప్పటి కప్పుడు దీక్షతో యథాశక్తిని పాల్గొని దేశసేవ చేసిన కార్యశూరుడు మన వీరుడు.

ఘనమైన కాంగ్రెసు యజ్ఞములో వీరికి తగినంత భాగము ముట్టలేదని కొందరియభిప్రాయము. అట్లు మన మభిప్రాయము పడ్డట్లైతే దేశములో పనులన్నీ సక్రమంగాజరగనేరవు. కాంగ్రెసుకొరకు దేశము కొరకు త్యాగంచేసిన వ్యక్తులను దేశ మారాధిస్తున్నది. వారు మన గౌరవమునకు సంపూర్ణముగా పాత్రులు. ఆఉద్యమముగాక దేశక్షేమానికి మరెన్నో ఉద్యమాలు అత్యావసరములై యున్నవి. ఎందరో మహానుభావులు వీటినన్నిటిని నడుపవలసియున్నది. "లోకో భిన్నరుచిః" అన్నారు పెద్దలు. బహుముఖాలతో ఇన్నికార్యాలు నడపడానికి సంకల్పించుకుని, దీక్షవహించి, జయప్రదముగా నడిపిస్తూవున్న అయ్యంకివారిచిన్నవానికి నా యభినందనములు. ఉత్సాహము వారికి పుట్టినిల్లు, కార్యదీక్ష వారి నాడి యొక్క నడక! కలుపుగోరుతనము వారికి సహజస్వభావము. అసూయ, సోమరితనము మంద బుద్ధి మొదలైన లోపములు వారి కెప్పుడును ఆవరించవు. కొద్దికాలమైనా జయప్రదముగా నడచి నాయకులకు సరియైన దృష్టి నిచ్చిన "కొరడా" పత్రిక యేమి, ఇంగ్లీషులోను తెలుగులోను విధివిరామము లేక ప్రచుర మవుతూవున్న "గ్రంథాలయసర్వస్వ" పత్రిక లేమి, ఈ రెండుభాషలలోను సామాన్యు లందరకు సేవచేస్తూవున్న "ప్రకృతి" పత్రిక లేమి, పంతులుగారి యభిమానమతమును వ్యాప్తిచేస్తూవున్న దివ్యజ్ఞానసమాజపత్రిక లేమి, ఇవన్నీ, వెంకటరమణయ్యగారి ప్రతిభకు, శక్తికి, పూనికకు తార్కాణములు.

> "లే దని యెవ్వని నడుగను, రాదని చింతింప పరులు రప్పించినచో
> కాదని యెద్దియు మానను, ఖేదము మోదమును లేక క్రీడింతు మదిన్."

అని ప్రహ్లాదుని కుపదేశించిన అజగరమహర్షి తత్త్వమును తన జీవితానికి ప్రధానసూత్రముగా పెట్టుకున్న వాడు మనపంతులు- ఈశ్వరుడు వారికి దీర్ఘాయుర్దాయము, సకలైశ్వర్యములు నిచ్చుగాక.——

మకాం—కలకత్తా

వి. యర్. శాస్త్రి

# నా పరిచయము

నా జీవితము గ్రంథాలయములో ఆరంభమైనది. అందువల్ల వెంకటరమణయ్యగారితో నా పరిచయమున్నూ దాదాపు అప్పుడే ఆరంభమైనది. 1915 సంవత్సరములో కాకినాడ ఆంధ్రసభలలో కలసితిమి. "గ్రంథాలయాలు పల్లెలోని సామాన్యజనంతో ఆరంభము కావలెనుగాని, బస్తీలోని వారు వచ్చి వేసంగిలో చేసి పోయే తమాషాగా ఉండగూడ'దన్నాను నేను. 'ఏ తమాషో జరుగనీ, తరువాత పల్లెటూరువారు దానినే స్వీకరించి పోషిస్తారు' అన్నారాయన. ఇప్పటికీ అవే అభిప్రాయాలు. ప్రకృతి కార్యాలయమువార ఫలసంతర్పణలలోనూ, సభలలోనూ నేనూ ఆయనా కలిసి పనిచేసేవారము. ఇప్పుడు కార్యాలయ ట్రస్టు సంబంధమువలన మా సంబంధము విడదీయటానికి వీలుకానిదగా యేర్పడింది.

వేంకటరమణయ్య సహజంగా కోపధారిగా వుండి, క్రమంగా సామరస్యము, సహనమూ నేర్చుకొంటున్నట్లున్నాడు. అప్పుడప్పుడాయనకు కోపము వచ్చిందీ అంటే అగ్నిపర్వత మవుతాడు. వెంటనే ఎంతో నిగ్రహముతో ఆ కుద్ధవ్యక్తిని స్వాధీనపరచుకొని సవ్వారీచేస్తాడు.

నాగేశ్వరరావు పంతులుగారు ఇప్పుడు సనాతనులసభలో ప్రారంభోపన్యాసముచేసి సభికులను భోజనాదులచే సత్కరించేవారు. సాయంత్రం సంఘసంస్కరణసభలో ప్రారంభోపన్యాసము చేసేవారు. వారి హృదయానికి ఆ రెండు సంస్థలూ ఒకటిగానే కాన్పించేవి కాబోలును. వేంకటరమణయ్య గూడా అలాగే ప్రవర్తింపగలడు. ఇట్టి సమన్వయస్వభావము గలిగినవాడగుటవలన థియాసఫీలో చేరాడో, థియాసఫీలో చేరుటవలన ఈ గుణం కలిగిందో ఆయన నడిగి తెలుసుకోవలసిందే.

విద్యావిహీనులంటే ఆయన హృదయం ఎంతో కరిగిపోతుంది. అట్టివారి విద్యకై ఆయన యెంతో శ్రద్ధతీసుకొని శ్రమపడతాడు. డబ్బు యెంత యిస్తాడో రెండోకంటివాడికి తెలియదు. నేనుగూడా డబ్బు యివ్వటం చూడలేదు. విద్య సంపాదించి స్వతంత్రులైన వారు చూపే కృతజ్ఞతవల్ల మాత్రమే ఊహిస్తాను.

ఏ పుస్తకమన్నా అచ్చుకాకుండా మాసిపోవటం ఆయనకు ఇష్టములేదు. అది ఆయనకు ఒక వ్యసనము. మంచి వ్యసనమే అనుకోండి. ఈ వ్యసనములో ఆయనకొంత డబ్బు పోగొట్టుకున్నాడని నాకు తెలుసు.

అభివృద్ధిపొందదగినవారిని ఆయన పసిపట్టి తెలుసుకుంటాడు. ఆయన చేసే ప్రోత్సాహము వలన, రాళ్ళు, సానలు దీరినజాతి రత్నాలు అవుతవి. ఇది కవిత్వం కాదు. నిజము.

మా మంగమ్మపిన్నిగారు జీవించి ఉండగా వారియిల్లు ఒక చిన్న సత్రం. ఇప్పుడు వారి కోడలు హయాములోనూ అది సత్రమే. ఇది వెంకటరమణయ్యగారి ఔదార్యం లేకుండా జరుగుతుందా? వారిది ఒక సరస్వతీమందిరము. దినములు, నెలలు ఆ పుస్తకాలు చూస్తూ, చదువుతూ గడుపుకోవచ్చును. అచ్చట అన్ని రకాల పుస్తకాలు ఉంటవి. ఆయనకు సరస్వతీపూజ అంటే యేమిటో బాగా తెలుసు ల్లే ఉంది.

దంతలూరు అగ్రహారం.

పుచ్చా వెంకటాద్రియ్య

# పరిచయవాక్యములు

1914 లో విజయవాడలో శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహ కవిగారి యాజమాన్యమున గ్రంథాలయసభ జరిగినది. ఆలమూరునుండి సరస్వతీపుస్తకభాండాగారము తరఫున నేను ఆసభకు ప్రతినిధిగా వెళ్లినాను. అప్పుడే అయ్యంకి వేంకటరమణయ్యగారితో నాకు ప్రథమపరిచయము. అప్పటికే అయ్యంకివారు గ్రంథాలయోద్యమమున ఆధ్వర్యము వహించి ఆరి తేరినదిట్ట. ఆ సభలో వీరు తీర్మానములు ప్రవేశపెట్టుటలోనేమి, ఒక్కొక్క విషయమై ఉద్యమపురోభివృద్ధికై కావించిన యుపన్యాసములోనేమి వీరు కనపరచిన ఆవేశము, అభిమానము అఖండముగ ద్యోతకమై సభల నాకర్షించినది. నే నప్పటికి స్కూలుఫైనలు చదువుచున్న విద్యార్థిని. ఆనాటి సభలో వీరితో కలిగిన పరిచయము వలననే నేను గ్రంథాలయోద్యమమున ఎక్కువ శ్రద్ధకలిగి నాటనుండి నేటివరకూ కూడా ఆ యుద్యమమున విడువక కృషిసలుపుచుండుటకు హేతువైనది. ఇదివర కెన్నడు ఉపన్యాసవేదిక నెక్కని నన్ను ఆనాటిసభలో ప్రోత్సాహించి మాట్లాడవలసిన విషయము, ప్రసంగింపవలసినవిధము, ఈ హంశములు ముందుగా తెలియజెప్పి యుపన్యాసమునకై గద్దె నెక్కించి భయము తీర్చినారు. నావలెనే యెంతమందియో విద్యార్థులను అయ్యంకివారు గ్రంథాలయోద్యమమున గద్దె నెక్కించి, భయము తీరిచి, యుద్యమాభిమానులుగా తయారుచేసినారు. ఒకసారి వీరి పరిచయము కలిగినదిదా వీరిని మరచుట సాధ్యము కాదు. మారుమూల నున్నవారిని కూడా విస్మృతి చెందకుండా కరపత్రములు పంపియు, లేఖలు వ్రాసియు, ఉద్యమమున నేవియో గౌరవోద్యోగములు కల్పించియు ఏదో విధముగా గ్రంథాలయోద్యమాభిమానులుగ జేయుటయే అహర్నిశలు వీరి తపస్సు.

ఈ ఆకర్షణశక్తియే వీరి నందరికి ప్రేమభాజనులుగా చేయుచున్నది. 1914 సంవత్సరములో వీరికి, నాకు, ప్రథమపరిచయమే యయ్యెను, వీరి వాత్సల్యము, సోదరప్రేమ, అభిమానము నన్నెక్కువ ఆకర్షించినవి. మే మెన్నియో గ్రంథాలయసభలలో నాటనుండి నేటివరకు కలుసుకుంటున్నాము. ఒక్కతీరుగానే యున్నారువీరు. ఏమీ మార్పులేదు. పరుషవాక్యములు ఎన్నడు నోటినుండి వినలేదు. ఎంత భేదాభిప్రాయ మున్నను చిరునగవుతో మాట్లాడమే కాని సౌహార్దత ఎన్నడు విడిచినట్లు నా కనుభవములేదు. అపక్వాహార సమావేశములలోను, సహకార సభలలోను, స్కౌటు సభలలోను, దివ్యజ్ఞానమందిరములలోను, వీరిని ఈ నలుబది సంవత్సరములనుంచి కలుసుకుంటునే యున్నాము. ముందు కొచ్చి నాకీ పదవి కావాలని ఎన్నడూ ప్రాకులాడే కోరిక లేదు. ఎక్కడ చూచినా, తన పని మందహాసముతో చేసుకొని పోవడమేగాని, అధికారపదవులకోసము దేవుళ్ళాడుట లేదు. పనికిముందు, పదవులకు వెనక, వీరి జీవితములో నా అనుభవము. ఆంధ్రదేశములో గ్రంథాలయోద్యమము పల్లెలలోకూడ ప్రాకుటకు ముఖ్యహేతువు నాబోందియే యని రాత్రింబవళ్ళు జోలి చంకనువేసుకొని "రమణయ్య"గారి వంటి నిరాడంబరసేవకు డొక డున్నాడు కనుకనే, జానపదములగూడ, ఊరూరా గ్రంథాలయములు వెలసినవి. "అయ్యంకి" వారు సంచార గ్రంథాలయమేను. భగవంతుడు వీరికి చిరాయువిచ్చి గ్రంథాలయసేవ యింకను నుత్సాహముతో ఆంధ్రావనియందు వ్యాప్తిచేయుటకు జవసత్వముల నిచ్చుగాక! — నరసింహదేవర సత్యనారాయణ.

# ప్రశంస

## కవిరత్న: శ్రీ రామ్ వీరబ్రహ్మకవి

క. పంకజనేత్రుఁడు దయ న,
య్యంకి కులాంబుధిశశాంకు నమలగుణాంకున్
వేంకటరమణాఖ్యుని ని,
శ్శంకఁ జిరాయువు నొసఁగి సతతముఁ బ్రోచున్.

చ. ఘటము ఘటిల్లినందుల కఖండజనాదరణీయసత్క్రియో
త్కట మొనరించి పండితవితానప్రశంసల నందుచుండు చే
యిట నటఁ గీర్తిముక్తులకు హేతు వఁటంచును వారిలోన వేం
కటరమణయ్యపంతులు నొకండని సంస్తుతి సేతు రెల్లరున్.

పుట్టువుం దొట్టి యెట్టి ప్రయత్న మొనరించినను దమ పొట్టకును బట్టకును ననియెడి స్వార్థపరత్వంబున ధన మార్జించుచు, నట్టి ధనమును స్వీయమునకును, నిజదార సుతోదరపోషణమునకును వినియోగించుచు, బరులకుఁ గాసిదియు, నూకను బేసను లేనిదియు నగు వ్యర్థజీవితమును గడపు గొందఱవలెఁ గాక, పరోపకారార్థ మిదంశరీర మను ధర్మసూత్రంబును సంస్మరింపుచు, నోపిన వట్టు పరోపకృతి కేగతిఁ బ్రవర్తిల్లనగునో యని మార్గాంతరము లన్వేషించు వారిలో శ్రీయుత యయ్యంకి వేంకటరమణయ్య పంతులుగా రొకరు.

ప్రపంచమునే నిజాలయముగ నిర్మించుకొని యందు నిరంతరమును స్వేచ్ఛావిహార మొనరించి కొనుచు నుండు శ్రీ పరమేశ్వరునకుఁ దిరిగి తా మొక సుందరమందిరమును నెలకొల్పి, వాని నందు బంధించు భక్తబృందంబును, బధికశ్రమాపనోదనధర్మక్రియాపరతంత్రులై సత్రశాలలను స్థాపించి, ప్రజానీకమున కొకించుక విశ్రాంతి లభింపఁజేయుచు సంతసిలు ధర్మమూర్తులును, వాపీకూపతటాకాదిసంస్థల స్థాపించి తనియువారు గొందఱున్నై, యేతాదృశ సత్క్రియావళు లెల్ల లోక కల్యాణమునకే మూలములని హర్షచిత్తులగువారును గలరు. ఇది సత్యమే యగుఁగాక. కాని మానవసముదాయమునకు జ్ఞానదాయక మగునది విద్య గదా! అట్టి విద్యానేత్రము గలవా రుచితానుచితంబులను గుర్తెఱింగి, యుచిత మనుష్ఠించుటకును, ననుచితమును ద్యజించుటకును, స్వతంత్రు లగుదురు. అట్టి స్వతంత్రశక్తి యలవడుటకు విద్య యవసరము. ఆ విద్య పూర్వకాలమున గురు కృపాపీయూషపానోద్భవం బయ్యెను, ప్రస్తుత కాలంబున నవ్యసుందర గ్రంథ బంధురం బగుటచేత గ్రంథసాహాయ్యముననే తద్విద్యాధనము జనసామాన్యమునకును సుసాధ్యముగాఁ దగి

యున్నది. కావున నెల్లరకును వివిధగ్రంథము లందుబాటులో నుండుటకు గ్రంథాలయముల యవసర మెంతేని గలదు.

శ్రీయుత వేంకటరమణయ్య పంతులుగారీ విషయమును ముప్పది సంవత్సరములకుఁ బూర్వమే గుర్తించిరి. కృష్ణాజిల్లాలోని దివి తాలూకాయందలిదియై, శ్రీ చల్లపల్లి సంస్థానాధీశపరిపాలితంబును, నిజపితృపితామహనివాసస్థానంబును నైన యయ్యంకి గ్రామమందుఁ దమతండ్రి తాతలచే స్థాపింపబడిన సత్రశాలయును, చంద్రమౌళీశ్వర స్వామివారి పేరిట దగు దేవాలయమును నా గ్రామవాస్తవ్యులకును, తత్పరిసరగ్రామవాసులకును నుపయోగకరముగ నుండిన నుండవచ్చును గాని, యశేషాంధ్రావనిఁగల సోదరబృందమునకు జ్ఞానప్రదాయినియై మహోపకృతి గావింపఁ గలుగునది గ్రంథాలయస్థాపనోద్యమమే యని యెంచి, యిందునందు ననక, దేశమందలి యన్ని కడలను గ్రంథాలయములు వెడలునట్లు నిరంతరకృషి గావించి, కృతకృత్యు లగుటలో శ్రీ వేంకటరమణయ్య పంతులుగారు దీసికొనిన శ్రమ మపారము. ఈ గ్రంథాలయస్థాపనమునఁ దత్పరిపాలనమున నెంతటిచతురత కార్యదక్షత యవసరమో గ్రహించుట కష్టతరవిషయము.

పాఠకుల నాకర్షింపఁదగిన స్థలావకాశము, మనోజ్ఞములైన గ్రంథరాజములు, ఓర్పుగల పాలకవర్గము మున్నగు సౌకర్యములు గలిగి నడిపింపఁబడుచుండు గ్రంథాలయములే వన్నె గాంచి, తత్ప్రతిష్ఠాపకుల కీర్తిని నినుమడింపఁజేయును. పాఠకులకు నుత్సాహమును రేకెత్తించి తత్స్థాపనోద్దేశము సార్థక మైనదగును.

ఇట్టి యాదర్శప్రాయ గ్రంథాలయములు వేలకొలదిగ నీ యాంధ్రావని నూరూర నెలకొనుటకు వ్యయప్రయాసలను గమనింపక, యాంధ్రావని నలుమూలలకుఁ బర్యటన మొనరించుచు, బ్రోత్సహింపఁ దగినవారిని బ్రోత్సహించుచు, నుత్తమ గ్రంథముల సంపాదింపఁ జేయుచు, గ్రంథాలయోద్యమప్రాశస్త్యమును నుపన్యాసముల మూలమున నుద్బోధించుచు శ్రీ పంతులుగారు దీసికొనిన నిరంతర కార్యదీక్షయే కారణ మనఁ జెల్లును. మఱియు 1914 వ సం॥న "ఆంధ్రదేశ గ్రంథాలయసంఘ" మనుసంస్థ నొండు స్థాపించి,యద్దానికిఁ దాము కార్యదర్శకులుగ నుండి భారతావని కెల్ల నాదర్శప్రాయ మైనదిగఁ జేయుటయ గాక విదేశీయుల దృష్టిని గూడ నాకర్షింపఁ జేయఁ గలిగిన శ్రీ పంతులుగారి కార్యచతురత వర్ణనీయము. అంతియగాక యార్థికముగఁ జాల వెనుకబడియున్న యీ యుద్యమమునకు బ్రభుత్వసాహాయ్యము గూడ లభించునదృష్టము శ్రీ పంతులుగారి పరిశ్రమఫలితమే యనఁదగును.

ఈ యుద్యమవ్యాప్తికై శ్రీ వేంకటరమణయ్యపంతులుగారు సమకూర్చిన గ్రంథాలయ సభలు తత్ప్రదర్శనములు, మన యాంధ్రరాష్ట్రమునసే గాక రాష్ట్రేతరమునందును పెక్కులు గలవు. సభానిర్వాహణమునకు సూత్రధారులుగను, లేక యధ్యక్షులుగను నుండి యపారమైన సేవసేసిరి. మఱియు స్వయముగ "గ్రంథాలయ సర్వస్వ" మను సచిత్రమాస పత్రికను దెనుగున నాంధ్రదేశ గ్రంథాలయ సంఘపక్షమున గొంతకాలము నడిపిరి. అఖిలభారత గ్రంథాలయ సంఘపక్షమున

"ఇండియన్ లైబ్రరీ జర్నల్" అను సచిత్రాంగ్ల మాసపత్రికను సమర్థతతో నిర్వహించిరి. అంతియగాక యీ యుద్యమ వ్యాప్తికై వీరు గ్రామగ్రంథాలయయాత్రలను నొక క్రొత్తవింత ప్రచారమును నాచరణకు దెచ్చిరి. గ్రంథాలయయాత్రలు భజనకత్యలు మున్నగువాని నడిపించుచు గ్రంథాలయములు లేని కుగ్రామములందు సైతము గ్రంథప్రచార మగున ట్లొనర్చిరి. అనఁగా నావలలోను నెద్దులబండ్లలోను బ్రస్తుతకాలాభిరుచ్యములైన గ్రంథములను గొంపోయి నిర్ణీత కాలమున మఱలఁ జదివి యిచ్చునట్టి పద్ధతిమీద గ్రంథముల నొసంగుచు, విద్యాభిరుచి గలిగించుట కెన్ని మార్గములు గలవో యన్ని మార్గములను నన్వేషించి ప్రచారమునకుఁ దెచ్చిరి. ఇందుల కెంత పర్యటన మొనరింప వలెనో! యెంత ధనవ్యయ మొనరింపవలెనో? యన్నిటి కన్నను శరీరపరిశ్రమ మెంత యొనర్పవలెనో తెలియుట సాధ్యముగాని పని.

ప్రజామోదము నందిన గ్రంథాలయ శాసన (చట్టము) నిర్మాణమునకు వీరమోఘమైన సేవచేసిరి. గ్రంథాలయ పరిపాలక వర్గమునకు వలయు శిక్షణము నొసఁగఁ దీరిక గల వేసవిసెలవు లందును విసువక శాస్త్రాభ్యసన మొనరింపఁ జేసిరి. ఇట్టి వీరి యుద్యమపారిశ్రమ్యమే రాష్ట్రేతరవాసుల నుత్సాహపూరితులఁ జేసి యచ్చటి గ్రంథాలయోద్యమాంకురమునకు దోహదమై మార్గదర్శక మయ్యె ననుట యతిశయోక్తి గాఁజాలదు. 'అఖలభారత సార్వజనిక గ్రంథాలయ సంఘము' (All India Public Library Association)నకును వీరు చిరకాలము కార్యదర్శిగ నుండిరి. వేయేల! వీరి జీవితమునే గ్రంథాలయోద్యమమున కంకిత మొనరించిరి.

ఇట్టి వీరి వీడని పట్టుదలయు, నిరుపమాన కార్యదక్షతయును, వైదుష్యమును గమనించి విజయనగరమునఁ గల "ఆంధ్ర భారతీతీర్థ" సంస్థాపకులు, వీరికి "గ్రంథాలయోద్ధారక" "గ్రంథాలయశాస్త్ర విశారద" యను బిరుదము లొసంగి గౌరవించిరి. గ్రంథాలయోద్యమమునకు పితామహు లనఁదగినవారు శ్రీ వేంకటరమణయ్య పంతులుగారు.

ఆ కాలమున బెజవాడ నగరముననే గాక యావదాంధ్రదేశమునను నగ్రస్థానము వహించి సుందరతరమైన పనితనము నందును నెన్నిపుటలగ్రంథమునైనను నచ్చుకూర్చి (Proofs) దిద్దు బాట్లకొఱకై పొరుగూళ్ళకు సైతము పంపగలుగుటయందు వలసినంత పరికరముల సామర్థ్యము గల వాణీముద్రాక్షరశాలకు ఆంధ్రగ్రంథాలయ ముద్రణాలయము పోటికి నిల్చుట కష్టతరముగ నుండెను. కాని నేఁడు పంతులుగారి సర్వాధిపత్యమున ప్రశంసాపాత్రముగ నడచుచు నయ్యది ఆంధ్రదేశమున అద్వితీయముగ వెలుగొందుచున్నది.

అట్లయ్యును వీరు యజమానశీవిని బ్రదర్శింపక చిరకాలమునుండి యందేయుండి విశేషానుభవమును గడించి నిర్దుష్టవర్తనమును, బ్రజాకర్షణశక్తిని కార్మికజనసానుభూతిని బడసియున్న శ్రీయుత కుందా నరసింహమూర్తి నామక మహాశయుని యాజమాన్యమునఁ దమ సంస్థను నడిపింప సాగిరి. పనివార లోర్పు నేర్పుమెయి పాటుపడసాగిరి. గ్రంథకర్తలును బ్రచురణకర్తలును దదితరులును నేనే

జరు గారి యాకర్షణ శక్తికి ముగ్ధులై తమప్రాతమనస్సంకటములను నెప్పటికప్పుడు విస్మరించుచునే యనురాగబద్ధు లగుచుండిరి. కాలము గడచి పోవుచున్నది. ఆంధ్రరాష్ట్రమున నేగాక, రాష్ట్రేతరమునందును నీయాంధ్రగ్రంథాలయముద్రణాలయ మద్వితీయమై యగ్రస్థాన మలంకరింపఁ గలిగెను. ఇట్టి యభివృద్ధి కెంతయు శ్రీ వేంకటరమణయ్య పంతులుగారి యమోఘసంకల్పబలమే కారణము. శ్రీపంతులుగారి దయార్ద్రభావమే నేఁ డిట్లుభయతారకమై, యనఁగా సొంతదారులకును బనివారలకును బుష్కలలాభభృతిదాయకమగునది యగుటయగాక, సరస్వతీదేవి కమూల్య సుందరతర గ్రంథాలంకరణములచే నలంకరించునదిగ నలరారుచున్నది. కాని యీ సంస్థ వేంకటరమణయ్య పంతులుగారి దే యని యే కొలఁదిమందికి మాత్రమో తెలియును. అప్పుడప్పుడే దేనొక కార్యార్థమై పలువురతోఁబాటు వచ్చుచుఁ బోవుచుందురేగాని, వీరే దీని సర్వాధికారులని తెలిసికొనఁదగిన యధికారాడంబర మింతయు వీరికడ గానఁబడదు. తా మితరులఁ బలుకరించునపుడును నితరులు దమ్ముఁ బలుకరింపబోవునపుడును వీరి ముఖపద్మమునఁ దొలుదొల్తఁ దొలుకాడునది మందహాసమే. ప్రసన్నతయే వీరిముఖమండలమున నిండుకొనియుండును. తమ కారణమున నెందఱెందఱో యానందహృదయులై తనియుచున్నారని వినఁ గలుగుటయే వీరి కానందము. ఆ దినమె వీరికిఁ బర్వదినము.

ఇట్లాంధ్రగ్రంథాలయసంఘము, ఆంధ్రగ్రంథాలయముద్రణాలయము లనువానినేగాక గ్రంథాలయ సర్వస్వాది పత్రికారాజములనేగాక, ప్రజోపయోగకరసంస్థల నింక నెన్నిటియందో పాల్గొని విశ్రాంతి యనునది యెఱుంగక నిరంతర ప్రజాసేవాతత్పరులై వర్తిల్లుచున్నారు. బెజవాడ నగరమునకు సమీపమునఁగల పడమటలంక యను నొక గ్రామమున స్థాపింపబడిన ప్రకృతి విద్యాలయమునకు శ్రీ పంతులుగారితోడ్పాటు మిక్కుటమైనది. ఈ సంస్థ దినదినాభివృద్ధి గాంచి యిప్పుడు రమారమి నలువదివేల రూప్యముల పెట్టుబడితో నలరారుచున్నది. దీనిగుఱించి 'ప్రాకృతజీవన విధాన'మను పేరిట శ్రీయుత శీరిపి ఆంజనేయులుగా రొక గ్రంథమును రచించి యద్దానిని మనపంతులుగారి యంకితమునఁ బ్రకటించి రన శ్రీపంతులుగారా సంస్థపట్ల నెట్టి గాఢాభిమానముతోఁ బ్రవర్తిలుచున్నారో విశదముగాఁగలదు. ఈ వైద్యవిధానము ననుసరించి నెల కొకసారిగ ప్రకటింపఁబడు 'ప్రకృతి' పత్రికయు వీరి యాశయఫలితమే. ఇద్దానికి వీరు సంపాదకులుగఁ జిరకాలముండిరి. సారస్వత సేవయందు వీరి తల్లిదండ్రులకును గల యభిమాన మిట్టిదని వర్ణించుటకంటె, రామమోహనపుస్తక భాండాగారమున కొక సహస్రరూప్యముల విరాళము నొసఁగియుండి రని వినువారి యెవరి మేనఁ బులకాంకురములు పొడసూపకుండును! ఈ విషయ మీ క్రిందిపద్య మిట్లు నుడువుచున్నది.

క. శస్తమతి రామమోహన, పుస్తక భాండారమునకు బుధహర్షముగా
విస్తర రూప్యసహస్రముఁ, బ్రస్తుతిహేతువుగ నొసఁగెఁ బరగతిఁ గన నాఁ.

(శ్రీ హనుమద్భగవద్గీత)

ఈవిధముగ శ్రీయుత వేంకటరమణయ్యగారికి సారస్వతసేవ యుగ్గుబాలతోడనే యలవడినదనదగును. సారస్వతసేవయగాక వీరి తండ్రితాతలు పెక్కు సత్కార్యములను గావించినట్లు,

సీ. కట్టించె నయ్యంకిగ్రామాన నే మంత్రి, చంద్రమౌళీశ్వరస్వామి గుడిని
పెట్టించె నేమంత్రి పృథులాన్నసత్రంబు, తత్ప్రతిష్ఠం జేయఁదగినయపుడు
ఇప్పించె నేమంత్రి యీశ్వరభక్తిమై, మాన్యంబు లెల్ల వదాన్యు లెన్న
మెప్పించె నే సూరి మిత్రమండలివారి, దీపితోద్యోగంబుఁ దీర్చునాఁడు

తే. సప్తసంతానముల దీర్పఁజాలినాఁడు, హరిహరార్చనలను బ్రోద్దుఁ జరిపినాఁడు
బ్రాహ్మణారాధనంబులఁ బ్రబలినాఁడు, రసికజనమైత్రి వేంకటరత్నమంత్రి.

(శ్రీ హనుమద్భగవద్గీత)

అను పద్యము నుడువుచున్నది. ఈ పై పద్యమునఁ బేర్కొనఁబడినవారి కుమారులే మన వెంకటరమణయ్యగారు. ఆలయ సత్రస్థాపనలను వీరి తలిదండ్రు లొనరింపఁగా సప్తసంతానములలోఁ బ్రశస్తిగాంచిన కృతిసంతానమును వీరు వెలయించు తలంపున, బహుళగ్రంథకర్తయు, నవధానియుఁ, గవిశేఖర బిరుదాంచితుఁడును మద్బాల్యమిత్రుఁడును నైన శ్రీయుత అబ్బరాజు హనుమంతరాయశర్మ పాకయాజిగారిచే రచింపఁబడిన 'శ్రీ హనుమద్భగవద్గీత' యను నొక పవిత్రగ్రంథమునకుఁ గృతిపతులై, యద్దానిని ప్రకటింపఁ జేసిరి. శ్రీ వేంకటరమణయ్య పంతులుగారు, తమ తృతీయ పుత్రుని పాణిగ్రహణ మహోత్సవ సమయమునఁ దామును గృతికన్యాగ్రహణ మహోత్సవము నెఱపించికొని సంతసించిరి. ఆనాఁడు సుప్రసిద్ధ కవిపుంగవులే గాక, కవయిత్రులలో కవితిలక, కవితావిశారద, విద్వాన్ బిరుదములను గాంచి క్వీన్ మేరీ కళాశాలలో నుపాధ్యాయయై నిరంతర భక్తితత్పరతను బవిత్రజీవయాత్ర గడుపుచున్న కాంచనపల్లి కనకాంబ గారును, లలిత కవితా ధురీణయైన శ్రీమతి గుడిపూడి యిందుమతీదేవిగారును బ్రశంసాపద్యములను జదివిరి. ఈ గ్రంథమునకు శ్రీ తిరుమల శ్రీనివాస త్రిలింగ మహా విద్యాపీఠాధిపతులైన పండితరాజ బిరుదాంచిత దంటు సుబ్బావధానిగారు సుదీర్ఘమగు నుపోద్ఘాతమును రచించిరి. గ్రంథమే భగవద్గీత యగుటచేతఁ దత్ప్రశస్త్యము వేఱ వర్ణింపఁబనిలేదుగదా! ఇట్టి యుత్తమగ్రంథమునకుఁ గృతిపతులై శ్రీయుత వేంకటరమణయ్య పంతులుగారు ధన్యులైరి.

ఇటుల భాషాసేవయేగాక మానవసేవయందును నప్రమత్తులై తొలుదొల్త మన భారతదేశమున డా. అనిబిసెంటుగారిచే బాలభటోద్యమము ప్రవేశపెట్టఁబడినపుడు శ్రీపంతులుగారా యాదర్శములను గైకొని, యత్యుత్సాహమున నఖిలాంధ్రమునందును దదుద్యమవ్యాప్తి కెక్కుడుగఁ బాటుపడి దేశసేవ నేసిరి. దివ్యజ్ఞానసమాజమున సభ్యులై చిరకాలమునుండి పరిచార మొనరించువారిలో నగ్రస్థానము వహించినవారును మన పంతులుగారే.

ఇట్లు సారస్వతసేవ,యాధ్యాత్మికచింతనమునసే గాక ప్రజాసేవ కవకాశమొసఁగగల యే యుద్యమమునందైనఁ బ్రవేశింప నుత్సుకులై శ్రీ వేంకటరమణయ్యగారు శ్రద్ధతోఁ బాల్గొనుచుండువా

రగుటచేత కొంతకాలము విజయవాడ పురపాలక సంఘమున సభ్యులై పురక్షేమమును బెంపొందింపఁ జేయఁ గలిగిరి. "శ్రీ గాంధి కోఆపరేటివ్ అర్బన్ బ్యాంకు'' అను సంస్థయొక్క సంస్థాపక గౌరవమును మన పంతులుగారికే యొసఁగఁదగి యున్నది. ఆ బ్యాంకువలన ద్రవ్యసహాయమును బడసిన గృహస్థు లెందఱో గలరు. బెజవాడ సమీపమున నేర్పడిన 'సత్యనారాయణపురము' శోభావంతమై విరివిగాంచుట కీ బ్యాంకు ముఖ్యహేతువు నైన దందురు.

శ్రీయుత వెంకటరమణయ్య పంతులుగా రనవరత మేదే నొక సదుద్యమమున నిమగ్నులై, తన్నిర్వాహణార్థ మెందెందులకో పర్యటన మొనరించుచునే యుందురు. వ్యయముమాట దలపెట్టరు. దృఢకాయులు, సదారోగ్యభాగ్యకలితులు నగుటచేతఁ బ్రయాస మంతకుమున్నే తలంపునకు రాదు. ఇంకఁ గుమారు లన్ననో పితృభక్తిపరులు, వినయనయశీలురు నగుటచేఁ దండ్రిగారిపోకడల కడ్డురారు. మఱియు వీరు విద్యావివేకధనులు, కార్యదక్షులు నగుటచే గృహవ్యవహారనిర్వహణభారమును మన పంతులుగారి కంతగా నంటదు. భగవద్విలాసముచే గృహస్థాశ్రమధర్మములకును వీరు నళినీదళగతనీరంబు పోల్కి నున్నవా రగుటచేతను, దివ్యజ్ఞానబోధామృతపానతుందిలహృదయు లగుటచేతను దమకుఁగల కాలావకాశ మెల్లఁ బరోపకారార్థమే వినియోగించుచు, పవిత్రజీవితమును గడుపుచున్న శ్రీమదయ్యంకి వేంకట రమణయ్యపంతులుగారు ధన్యజీవులు. ఇట్టి వీరికి జంద్రున కొక నూలుపోగనురీతిఁ జేయు నీ సత్కారమున కెంతయు వారర్హులు. వారును నీ సత్కారమును మహాగౌరవచిహ్నముగ స్వీకరింతురుగాక. ఇట్లే నిరంతర దేశభాషాసేవాపరులయి పరగ వీరికి శ్రీ పరమేశ్వరుఁ డితోధికాయురారోగ్యైశ్వర్యము లొసంగి సదా సంరక్షించుఁగాక.

చ. నవనటరాజు నా భరతనాట్యకళావిభవాభిరాముఁడౌ
యువకుఁ డొకండు, భోగి యయి యున్నది లేదను జింతలేని భా
గ్యవిలసితుం డొకండు, చతురాంచిత భవ్యసరస్వతీ కృపా
లవపరిభూషితైక సదలంకృతుఁ డొక్కఁ డిటుల్ త్రిమూర్తులే
మువురు కుమారు లట్లలరఁ బోడిమి గాంచితి వెంత ధన్యమూ
ర్తివో? సముదారహృజ్జలజ! శ్రీయుత వేంకటరత్నయాత్మజా!

క. శంకరుఁ డోముత మిము నకలంకయశశ్శ్రీనిధాన! లలితగుణా! య
య్యంకికులాంబుధిసోమా!, వేంకటరమణాభిధేయ! విబుధవిధేయా!

# పరిచయవాక్యములు

మన ఆశయము లెల్ల నెట్లు నెరవేర్చగలుగుదము? రాజకీయ స్వాతంత్ర్యము బడయగలిగితిమేని మన ఆశయములు నెరవేరునని కొందరు. మన సంఘదురాచారముల జక్కపరుచుటయందే మన జాతీయాశయములు ఫలించునని కొందరు, నానాటికి మనలో శారీరక, నైతిక బలము తగ్గుచున్నందున మన జాతి అభివృద్ధి చెందుట లేదని కొందరు, ఇట్లు పలువిధము లగు భావములతో నుండి, ఆంధ్రులలోనే గాక భారతీయులలో చీలికలు కలిగి, తల కొక యుద్యమము నడుపుచున్నతటి, శక్తి నంతను కేంద్రీకరించుటకు, గ్రామ గ్రామాదులలో "గ్రంథాలయముల" నెలకొల్పు టావశ్యక మని యెంచి, ఆంధ్రదేశంబున తొలుదొల్త సం. 1900 న గుంటూరు పురంబున యువకులు కొందరు "యువజన సాహితీ సంఘము" అను పేరట నొక గ్రంథాలయమును స్థాపించియుండిరి. తదాది ఆంధ్రదేశంబున నచ్చటచ్చట గ్రంథాలయములు నెలకొల్ప బడెను. రాజకీయ సాంఘికాది వివిధవిషయములలో పనిచేసినవారును, దేశోద్ధరణమునకు మూలాంకూరము గ్రంథాలయములే అని ప్రబోధ గావించినవారును మా "యువజన సాహితి సంఘము" వారే! ఆంధ్రోద్యమలత మున్ముందు గుంటూరు వారిచే నాటబడి, తక్కిన జిల్లాలవారిచే పోషింపబడి, నానాటికి శాఖోపశాఖలుగా వ్యాపించి, వృదిచెంది, ఫలోన్ముఖమునకు రానున్న తటి, దేశంబున రాజకీయ వాతావరణ మెక్కువైనందున, గ్రంథాలయోద్యమ మొక్కింత వెనుకబడి యుండెను.

భారతదేశము రాజకీయోద్యమావృతమైయున్న ఆ రోజులలో గ్రంథాలయములు కొలదిగ నుండుటచే, గ్రంథాలయోద్యమవ్యాప్తికై పట్టిన పట్టు విడువక మిక్కిలి పాటుపడిన వారలలో శ్రీ అయ్యంకి వెంకట రమణయ్య పంతులుగారు అగ్రగణ్యులని చెప్పుటకు సాహసించి నందులకు ఆంధ్రులు మన్నించ కర్తలు! పంతులుగారితో నాకు ముప్పది సంవత్సరముల నుండి పరిచయము స్నేహము కలుగుటయే కాక వారితో నేను సహకారిగ నుండి పనిచేసినవాడ నగుటచే, వారి శక్తి సామర్థ్యంబుల విషయమై నా అభిప్రాయమును ఆంధ్రలోకమునకు వెల్లడించుట నా విధియని యెంచి వ్రాయుచున్నందులకు మన్నించ కర్తలు! రమణయ్యపంతులు మున్ముందు బెజవాడ పురంబున "రామ మోహన గ్రంథాలయము"నకు పునాది వేసి, ఆరంభించి పురప్రముఖుల సహాయంబున పెద్దభవన నిర్మాణము గావించి, పెక్కు గ్రంథంబుల సమకూర్చి, మంచిదశకు తెచ్చి, ఆంధ్రదేశంబున కేంద్రగ్రంథాలయమునకు తగిన గ్రంథాలయ మియ్యదియే యని చూపరుల కాశ్చర్యము కలిగించు నంతటి యేర్పాటులు చేసి కృతకృత్యుడై ఆంధ్రుల మన్ననల నందెను.

ఆయన గ్రంథాలయ సేవయే తనజీవిత పరమావధి యని యెంచి,తన సర్వస్వమును ధారబోసి, ఆంధ్ర దేశపర్యటన మొనర్చి, యెచ్చటెచ్చట గ్రంథాలయములు లేవో, అచ్చటచ్చట ప్రజలను పురికొల్పి గ్రంథాలయముల నెలకొల్పి, జీర్ణించినవాటిని పునరుద్ధరణ చేయించుటలో నిమగ్నులై, గ్రంథాలయోద్యమమున నింతవరకు తమ జీవితమును గడుపుచు, "గ్రంథాలయప్రెస్సు" పెట్టి, "గ్రంథాలయసర్వ

స్వము" అను మాసపత్రికను స్థాపించి తద్ద్వారా గ్రంథాలయోద్యమమును నిర్విఘ్నముగ నేటివరకును సాగించుచునేయున్నారు. దేశములో నేయుద్యమమైనను, ధనలోపముచే నప్పుడప్పుడు, వెనుకబడియుండినను, పంతులుగారి వంటి తదేకదీక్షాపరులుండిన యెడల, ఆయుద్యమము కొనసాగుచునే యుండును. తాము తలపెట్టిన కార్యమునకు మధ్య నెన్ని ఆటంకములు కలుగుచున్నను, వాని నన్నింటిని దాటి, శ్రీ పంతులుగారు గ్రంథాలయోద్యమమే, దేశకళ్యాణమునకు మార్గమని ఋజువుచేయుచు తమ జీవితమునంతను గ్రంథాలయోద్యమాభివృద్ధికి ధారపోసియున్నారు. తొలుత వా రెయ్యది 'దేశముక్తికి సాధన'మని యెంచి ప్రారంభించియుండిరో, ఆ గ్రంథాలయోద్యమమునే సాగించుచు నేటివరకును ఆ గ్రంథాలయసేవ చేయుచునే యున్నారు. ఇయ్యదియే, వీరియందుండెడి గొప్ప నీతి. వీరి ఏకైక కార్యదీక్షాపరతంత్రత, మార్గదర్శకము. గ్రంథాలయములు సర్వశక్తి మందిరములని (Power houses) లోకమునకు బోధించుటయే వారి విధి యని యెంచి, కాలమునంతను గ్రంథాలయోద్యమమునకు వినియోగించిన దేశభక్తుడు, ధీరుడు. "గ్రంథాలయములు విజ్ఞానమందిరములు, సర్వవిధములగు జ్ఞానము గలుగజేసి, అభివృద్ధిచెందించు' సరస్వతీమందిరములు; రాజకీయ, సాంఘిక, మత, నైతిక, వ్యవసాయక, వాణిజ్యాది వివిధ విషయజ్ఞానము నిచ్చుచు, ప్రజలలో ఐకమత్య మొనగూర్చుటకు తగిన పుణ్యక్షేత్రములు; గ్రామోద్ధరణమునకు మూలబీజములు గ్రంథాలయములు; గ్రామాదులలో శాంతి నెలకొల్పు శాంతిమందిరములు గ్రంథాలయములు; సాంఘికపు చిక్కులసడలించి భేదబుద్ధి మానవులలో రూపుమాపి మానవులందరు సమానులే యని బోధించి సోదరభావము నెలకొల్పి, దివ్యజ్ఞానము ప్రజలలో వెదజల్లు మంగళ మందిరములు గ్రంథాలయములు" అని ప్రబోధించుచు తమ జీవితమును దేశోద్ధరణమునకును మానవాభివృద్ధికిని వినియోగించిన మన రమణయ్య పంతులు సామాన్యుడే?

## నూతన విధానములు

గ్రంథాలయోద్యమవ్యాప్తికే శ్రీ పంతులుగారు, నూతన ఫక్కీల నెన్నియో కనిపెట్టి యుద్యమ ప్రచారమునకు గడంగిరి. గ్రంథవిస్తరభీతిచే అన్నింటి నిందు చర్చించుట మానితిని. వారు చేసిన గ్రంథాలయసేవ అసమానము. అద్వితీయము 1914 సం॥లో ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘమును స్థాపించిరి. తదాది వారే కార్యదర్శిగ నుండి, ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమమును యావద్భారత దేశమునకు ఆదర్శప్రాయముగ జేసి, అఖిలభారత గ్రంథాలయోద్యమమందు అత్యుత్తమ స్థానము నాక్రమించి యావద్భారతదేశంబున "సార్వజనిక గ్రంథాలయోద్యమసంఘమును వీరే ప్రథమమున స్థాపించి పేరెన్నిక గని భారతీయుల మన్ననలకు పాత్రులై మార్గదర్శకులైరి! ఆంధ్రదేశంబున ననేక ప్రదేశంబుల గ్రంథాలయ శిక్షాశిబిరముల నెలకొల్పి పెక్కండ్ర సేవకులను తరిబీతు చేసి వారిమూలమున ఆంధ్రగ్రంథాలయోద్యమము వ్యాప్తి చేయించిరి.

అమెరికా మున్నగు విదేశముల నుండి ఆ యా దేశగ్రంథాలయముల చరిత్రల దెప్పించి, ఆ పద్ధతుల నారసి మన ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమమునకు తగిన పద్ధతుల స్వీకరించి గ్రంథాలయ

ముల పురోవృద్ధికి పాటుపడి యుండిరి! శ్రీ పంతులువారు చేసిన సేవ అనుకరణీయము! శ్రీ రమణయ్య పంతులుగారితో కొంతవరకు "గ్రంథాలయ నౌక"లో ప్రయాణముజేసి, నడిమధ్యంబున రాజకీయవాతావరణంబున బడి కొట్టుకొని పోయియున్నందున, నేను పంతులుగారితో సొంతముగా పనిచేయలేకపోయినందులకు చింతిల్లుచున్నాను. కాని అవసరమగునప్పు డెల్ల శ్రీ పంతులుగారితో సహకారము చేయుచునే యుంటిని శ్రీ రమణయ్యపంతులుగారికి ఆంధ్రులెల్లరు సన్మానముచేయు సందర్భములో వారితో నాకు గల పరిచయము వ్రాయుటకు నాకీ సమయము దొరికినందులకు మిక్కిలి సంతసించుచు వారికి నా ధన్యవాదము లర్పించుచున్నాను.

గుంటూరు

చట్టి నరసింహారావు.

Δ

# ప్రశంస

## అద్దేపల్లి నాగగోపాలరావు

అవ్యాజాంధ్ర సరస్వతీ చరణ సేవాసక్త చిత్తాంబుజా!  
నవ్యాంధ్రాఖిలకావ్య ముద్రణ కళానైపుణ్య పుణ్యోదయా!  
దివ్యజ్ఞాన సమాజసభ్య! హనుమద్గీతాకృతి శ్రీపతీ!  
దీవ్యత్కీర్తిమయాఖ! నీకు గలుగున్ దీర్ఘాయురైశ్వర్యముల్.

నడపుచుంటివి తెలుగు గ్రంథాలయోద్య  
మమును, చెదరని దీక్ష నబ్దముల నుండి  
అదిర! భవదీయ దేశసేవానురక్తి  
నిరుపమానమ్ము గావుట నిక్కువమ్ము.

మధురహాసమ్ము విబుధసమ్మతము నైన  
చతురవచనమ్ము నీకు నైజమ్ము లగుట  
సంతతము నిన్ను జనులు మన్నింతు రింత  
విమలగుణధామ! వేంకటరమణ నామ!

తెలుగులోకమ్ము నీకు భక్తియు ప్రియమ్ము  
గదుర గావించు నేటి సత్కారకలన  
ద్విగుణితోత్సాహపరుడవై తెలుగుతల్లి  
విమలమతిఁ గొల్వు మింక భవిష్యమందు !

# పరిచయ సంపద

నరయు మీాసల నవ్వు దొంతరలఁజిక్కి
ఒరయు పల్కున గీత మాధురికిఁ జొక్కి,
తెనుఁగు చిన్నది మురిసి పోయెను గదన్న;
ప్రస్తుతు లివేల? వేంకటరమణ మంత్రి.

పలికిన పలికించిన న
వ్వు లొలుకు ముఖసీమయందు; పున్నెం బేమో;
కలిత కవిత్వాభిజ్ఞుఁడ;
విల నేలవె? మన్మసిద్ధు లేలిక లున్నన్.

తనిపితి వాత్మలోపల ముదంపడు దివ్యకళార్థకాంక్ష గీ
తను తనివార ద్రాక్షరసధార; కవిత్వపు గోష్ఠులందు నీ
మనము విలీనమా; ప్రకృతి మార్గము బట్టితి; గ్రంథ ముద్రణ
మ్మున కొక వన్నెఁ బెట్టితివి. పోకల పోకడ లున్నె యెన్నగన్.

ఏలిరి; ఏలించిరి; భూ
పాలక మణులై, అమాత్యవరులై, కవులై,
పాలిత భూమిని: కవితా
పాలిత భూమిని నవీన పద్ధతు లేవీ?

మంగమాంబిక చల్లని మంచివేళ
కాంచి పెంచికొన్నది కీర్తిఁ గాంచుకొమరు;
ఆపె యాశీర్వలమ్మున నలరి తీవు;
కృతివి భక్తి నిధివి; ఎవ్వ రీడు నేఁడు.

నిను లేనట్టి గుణోక్తుల న్దగిలి వర్ణింపంగ నేలా? సుహృ
జ్జనబంధువ్రజ మన్న ముచ్చటల కాసంజెంది మిన్నంది ప
ల్కిన స్వాభావికరీతులం దతిశయశ్లేషాదు లెట్లుండు? నీ
జని ధన్యం బన కాదటందురె; కవీట్సంతానసంతానమా.

వసుధామర రమణుని కా
వ్య సుధారసరంజితునిగ వలపింపఁగ నీ
రసవాక్కెక్కునె రసనకు?
కసిమసగునో ధారణాదికమ్ములు? వినవే.

నీ సారస్యమ్మది యేమి శ్రోవలను గానీ, ఇంటఁగానీ, మతే
యే సామీప్యమ్ములఁగాని తిందు; వడియేమీ! పిల్లవానిన్బలెన్
నీ సంతోసము లన్ని యెన్నఁగలమా! నెక్కొన్న భావమ్మెలే
వో సాగించెడి నాల్గుముక్కలు; నిజంబున్ దిండి బాపండవే!

కాదు; నిజోక్తి వేయు, రసికాగ్రణీ, షడ్రుచు లెంతదీఁపి; కా
వ్యాదుల నెంతదీఁపి గలదంచు కనుంగొను నీప్సితమ్మొగా!
కాదు; విశుష్కతావయవకాండము ముక్తికిఁ జేర్పదన్న శా
స్త్రోదని పల్కు నీయెడలఁ దోఁచె, విరాగివి రాగసంపదన్.

చెల్వలరు నిన్నుఁ గాంచ నృసింహసూరి
యున్న నేఁ డెంతగా పొంగునో గదన్న
అర్ధభాగస్థుఁ డీపంట కతఁడు; పూర్తి
కోసికొందువా? నీ కట్టి యాస లేదు.

పొమ్మనలేదు సత్కవుల; పొమ్మన లేదు బుధాళి; లేదు పో
పొమ్మన లేదు యాచకుల; పొమ్మను శబ్దములేదు శబ్దకో
శమ్మునఁ జూడ నీతఁడు; రసౌచితి నెన్నెడి; ఈషణత్రయిన్
బొమ్మను; పంచపాపములఁ బొమ్మను; శాత్రవపాళిఁ బొమ్మనున్.

కవితాలంకృతి సాజమైనది; అసత్కావ్యమ్మునం దద్ది శో
భ వెలార్పం జననీదు; నీదు చరిత ల్వర్ధిల్లు ప్రత్యూషపుం
బవనాంకూరపుఁ దీపి గొట్టుచు కవిత్వామోదభావోదయా
ర్థవశత్వంబునఁ ద్రోచి; ధీసచివ, నీప్రాగ్భార మేమో కదా.

కళలం దేరు శశాంకుఁ డే మొగముతోఁ గన్పించు నీ నవ్వు వె
న్నలకుం; బుల్విరి మూసికోగలడొ? నిందం జెందుటం దీసికో
గలడో? ఏ యమరాళిఁ జూడఁగల సంకల్పించి నీతో సరిం
దులఁ దూపంగ; విశుద్ధవర్తనము యెందుం బెద్దగా ముద్దగున్.

దాఁగుకొనిన తలంపులఁ దలఁచి కొంచు
నల్లనేమి? నిన్నెఱుఁగు భాగ్యమ్ముఁ గలుగ
కలఁగనేమి? కైత, తనంత కరఁగు గాదె
మంత్రిపుంగవ, కొనుమ సమ్మాన విధిగా.

తుర్లపాటి గోవర్ధనరావు.
“తెనుఁగుతోఁట”

బెజవాడ.

## 'గ్రంథాలయోద్యమ భీష్ముడు'

శ్రీపంతులుగారిని ఆంధ్రులలో ఎరుగని వా రెవరును ఉండరు. వీరు షుమారు 30 సం॥ ల నుండీ ప్రజాహితోద్యమము లన్నిటిలోను పాల్గొనుచూ, సర్వతోముఖ దేశపురోభివృద్ధికై తమ సర్వ స్వమును ధారపోసి అహర్నిశములును పాటుబడు చున్నారు.

శ్రీవారు, కొంతకాలము బెజవాడ పురపాలక సంఘసభ్యులుగా వుండి, విద్య, పారిశుద్ధ్యము మున్నగు విషయములలో అత్యంత శ్రద్ధవహించి, పనిచేసియున్నారు. మరియు, శ్రీ పంతులుగారు బాలభటోద్యమము, దివ్యజ్ఞానసమాజము, ప్రకృతి వైద్యోద్యమము మున్నగు వాటియందుకూడా ప్రత్యేకశ్రద్ధ చూపి వాటి అభ్యున్నతికి కారణభూతు లయినారు.

వీరు, అన్ని ప్రజాహితోద్యమములయందు పాల్గొనుచున్నను ప్రధానముగా "గంథాలయోద్య మము" నందు విశేషశ్రద్ధచూపి, దేశమునం దంతటను సంచారముచేసి, గ్రంథాలయముల ఆవశ్యక తను, ప్రయోజనమును ప్రజలకు బోధించి, ప్రతి గ్రామమునందునుకూడా గ్రంథాలయములను స్థాపించునట్లుగా చేసి, నిరక్షరాస్యతను, నిర్మూలించి విజ్ఞానమును పెంపొందింప చేసియున్నారు.

"గ్రంథాలయోద్యమము" అను మాటను వినినవెంటనే, శ్రీపంతులుగారి పేరు స్ఫురణకు వచ్చును. పెక్కుమాటలు వ్రాయుటకంటే, "గ్రంథాలయోద్యమము" నకును శ్రీవారికిని, అవినాభావ సంబంధము గలదనుట అతిశయోక్తి కాజాలదు. "గ్రంథాలయోద్యమమును ఇతోధికముగా నభి వృద్ధి నొందించుటకై నిరంతరకృషి సల్పుటకు శ్రీయుత "గ్రంథాలయోద్యమ భీష్మ" అయ్యంకి వెంకటరమణయ్య పంతులుగారికి సంపూర్ణాయురారోగ్యైశ్వర్యములు ప్రసాదించుగాక యని శ్రీ ధన్వంతరి భగవానుని ప్రార్థించుచున్నాను.

బెజవాడ. డా. గోనెళ్ళ వెంకటేశ్వర్లు, ఏ. ఆర్. ఏ. సి.

△

## అసమాన సేవ

గ్రంథాలయాలంటే నా కెంతో ప్రేమ. ఎంచేతనంటారా? గ్రంథాలయం అంటే సర్వజనవిజ్ఞాన దాయకం అయిన విషయంగాని చిన్నమాట కాదు. చూడండీ, మనుష్యునికి బుద్ధయితేనేం, జ్ఞానం అయితేనేం, అధికారం అయితేనేం, ధనం అయితేనేం— ఏం ఐనా గొప్పతనం సంపాదించాలీ అంటే గ్రంథసహాయం అవసరం.

మూలం గ్రంథం, గ్రంథాలకి మూలం గ్రంథాలయం. అల్లాంటి గ్రంథాలయం ఉన్న ఊళ్లో మరి రెండు రోజులెక్కువగా ఉండేవాణ్ణి. స్వర్గం స్వర్గం అనే దెక్కడో ఉందంటారు మనవాళ్లు. కానీ నా ఉద్దేశంలో ఏ వూళ్లో గ్రంథాలయం ఉంటుందో, అదే స్వర్గం, అదేస్వర్గసుఖాలకీ మూట. అయితే యీ సంగతి అందరికీ తెలియదుగదండీ. అంచేత ఆ విషయాన్ని ముందుగా తెలుసు

కాని ఏ విధంగానైనా లోకాన్ని అభివృద్ధిలోకి తీసుకురావాలంటే గ్రంథసేవ ఉండవలసిందే అన్న విషయం బాగా అమల్లోకి తీసుకురావడంలో ప్రప్రథమమున నడుం బిగించి కార్యరంగంలోకి దిగిన వారూ, మిత్రులూ శ్రీ వేంకట రమణయ్యగారంటే అందరూ నమ్మితీరాలి. ఎందుకంటారా? ఏపాటి చదు వొచ్చినా గ్రంథాలయం లోకి వెళ్ళడం తటస్థిస్తుంది.

ఆ గ్రంథాలయం పుట్టుకకి బహుశా మన వెంకటరమణయ్యగారే మూలకారకులై యుంటారు. చిన్నచిన్న గ్రంథాలయాలమాట అటుంచండి. అఖిలాంధ్ర గ్రంథాలయ సేవంటే మొట్టమొదటి దన్నమాటగదండీ. ఆ సేవలో ఫేమ్ను సంపాదించినవారు మన పంతులుగారంటే మనం ఎంతో గర్వింపవలసిన విషయం. దానికి 1914 లో ఆంధ్ర దేశ గ్రంథాలయ సంఘం స్థాపించారు. మన ఆంధ్రి దేశంలో అప్పటినించీ కంకణం కట్టినవారు మన పంతులుగారే. పట్నాల్లో గ్రింథాలయాలుండడం సహజం, కాని పల్లెటూళ్ళలో జ్ఞానాభివృద్ధికోసం శ్రీపంతులుగారు గ్రామ గ్రంథాలయయాత్రి చేసి అమల్లోకి తీసికొచ్చారు. గ్రింథాలయాలకి సంబంధించిన అన్ని విధాలా సేవ చేసి లోకాన్ని వుద్ధరించారు. మా బారువలో నున్న మా గ్రింథాలయ తృతీయ వార్షికోత్సవానికి శ్రీపంతులుగారు దయచేసి గ్రంథాలయసేవ గురించి మహాగంభీరంగా, ఆనందదాయకంగా జనోపయోగంగా ఉపన్యసించారు. చతుర్థ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభయున్ను, ప్రిథమ గ్రింథాలయ ప్రదర్శనమున్ను, బారువలో దిగ్విజయముగా జరిపించుటకు పంతులుగా రెంతయో మాకు దోడ్పడిరి. చాలా కష్టపడి గ్రంథాలయాల్ని పునఃప్రతిష్ఠ చెయ్యడంలో నైతేనేం, గ్రంథాలయ తరగతుల్ని నియమించడంలో నైతేనేం, నావల్లో గ్రంథాలయాల్ని స్థాపించడంలో నైతేనేం, బండ్లలోను గ్రంథాల్ని చదివింపజెయ్యడంలో నైతేనేం, యావద్భారత గ్రంథాలయోద్యమ ప్రిచారకులలో ఉచ్ఛస్థానం వహించడంలో నైతేనేం, పంతులుగారికి వారేసాటిగాని, మరెవ్వరూ లేరు అని ఢంకామీదకొట్టి కూడా చెప్తాను. నిజమైన సన్మానం వీరికి చెయ్యడం మనఆంధ్రుల విధి. వీరే నిజముగా సన్మానింపదగినవారని నా అభిప్రాయం.

ఇంకా చూశారా? ఈయన ఉపన్యాసంలో చెప్పిన విషయాలు కార్యక్రమంలో దేశంలో వాటి నాచరణలో పెట్టేందుకు ప్రయత్నించి సఫలం పొందేవారు. అందుచేత వీరు ఆంధ్రుల కత్యంత పూజ్యులు.

నేను కారణాంతరాలచేత సన్మానసభకు రాలేకపోయినందుకు విచారం. కానీ నా హృదయం వారి సాన్నిధ్యంలోనే ఉంటుంది.

ఇంకా గ్రంథాలయాలగురించి అనన్యసేవ జేసి ఆంధ్రుల్ని అధికోత్సాహపరులుగా చేయడానికి తగిన మహాశక్తి భగవంతుడు వీరి కింకా ప్రిసాదింపవలెనని దేవుని ప్రార్థిస్తూ వారికి నా హృదయపూర్వక కృతాంజలి సమర్పిస్తున్నాను.

బారువ.

తిత్తి బలరామయ్య.

# దేశసేవా వ్రతి

నాకు శ్రీ అయ్యంకి వెంకటరమణయ్యగారితో చిరకాలపరిచయము కలదు. సుమారు ౩౫ సంవత్సరములనుండి వారిని అప్పుడప్పుడు కలసికొనుచుండుట, వారు నిర్వహించుచుండిన వివిధకార్యములను గురించి తరచు వినుచుండుట, వారి యాజమాన్యమున ప్రకటింపబడు పత్రికలు, పుస్తకములు చదువుచుండుట మున్నగువిధముల కొంతవరకు నేను వారి జీవితవిశేషమును తెలిసికొని యానందించుచుంటిని.

వంగదేశవిభజనానంతరము 1906వ సంవత్సరములో బయలుదేరిన జాతీయోద్యమము హిందూదేశమునం దన్నివైపుల వ్యాపించినది. ఆంధ్రదేశములోకూడ నది బందరుపురమును కేంద్రముగ జేసికొని యంతట విస్తరించినది. శ్రీయుతులు ముట్నూరి కృష్ణారావు, కోపల్లె హనుమంతరావు, భోగరాజు పట్టాభి సీతారామయ్యగార్లు నాటి యుద్యమానికి బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులవలె ముఖ్యపురుషులై యుండెడివారు. వీరిని స్వయముగ చూచినవారు, చూడనివారు ప్రబోధము గ్రహించుచు పలువురు దేశాభిమానపూరితు లగుచుండిరి. కొందరు యువకులు వీరి యడుగుజాడల నడచుటకును బద్ధకంకణు లైరి. అట్లు దేశసేవావ్రతము పూనినవారిలో శ్రీ అయ్యంకి వెంకటరమణయ్యగా రొకరని చెప్పవచ్చును.

వెంకటరమణయ్యగారు ఆంగ్లవిద్య నభ్యసించిరి. గౌరవకుటుంబమునకు జెంది ఒక మోస్తరుగ మంచి పితార్జితము గలిగి యుండిరి. ఆ సందర్భములను బట్టి లౌకికముగ బాగుగ వృద్ధిలోనికి రావలసినవారు. కాని 'దేశసేవ' పిచ్చపట్టిన తరువాత వారి కది యెట్లు సాధ్య మవును? సబ్బుఫ్యాక్టరీకొరకు, పత్రిక నిమిత్తము ముద్రాలయమునకై నష్టముమీద నష్టము వచ్చుచున్నను సొమ్మును ధారాళముగ వెచ్చించు చుండిన శ్రీ ముట్నూరి కృష్ణారావుగారు ఆదర్శపురుషుడుగ నుండిరి. ఈ మహనీయుని సాంగత్యము సలహా కూడ మన వెంకటరమణయ్య గారికి సంప్రాప్త మయినవి. కృష్ణారావుగారి దగ్గర ఆర్భాటము లేవియు నుండవు. వారు దేనికిని అంటీ అంటనట్టు కనబడు చుందురు. సామాన్యముగ నిజస్థానము కదలరు, కాని తమచుట్టును చేరినవారికి మాటలద్వారా, దూరప్రాంతములలో నుండువారికి పత్రికావ్యాసముల ద్వారా హృదయసంచలనము కలిగించి దేశభక్తి పురిగొల్పగల ప్రజ్ఞావంతులు. ఇక వెంకటరమణయ్యగారి జీవితపరివర్తనము అందులకు భిన్నముగ నెట్లుండ గలదు? కృష్ణారావుగారివలె తాము ఒక పత్రిక నడపవలె నని వెంకటరమణయ్యగారికి మొదట బుద్ధి పుట్టినది. ఆ కాలములో చక్కని మాసపత్రికలు అసలు లేవు. ఆ కొరత తీర్చవలె నని వెంకటరమణయ్యగారు సంకల్పించినారు. 'ఆంధ్రభూమి' అను మాసపత్రిక ప్రకటింప మొదలిడినారు. కొంత కాలము డబ్బు పెట్టుబడి పెట్టుచు నడిపినారు. ఇప్పటికిని వాఙ్మయమునకు ప్రోత్సాహములేని ఆంధ్రదేశములో వారి నాటి ప్రయత్నము జయము గాంచుట యెట్లు సాధ్యము?

విశేషనష్టము వచ్చుటతో వా రా పత్రికా ప్రచురణము విరమింపవలసి వచ్చెను. వారి దేశసేవ ఆ తీరున ప్రారంభమయ్యెను.

కాని వారి యుత్సాహముమాత్రము నష్టములతోను కష్టములతోను ఆగిపోవునది కాదు. ప్రతి ఘటనలమూలముగ వారి కార్యదీక్ష మరింత వృద్ధినొందుచువచ్చెను, 'గ్రంథాలయసర్వస్వము' అనుపత్రిక నొకటి మరల స్థాపించినారు. ముద్రాలయమును కూడ నెలకొల్పినారు. "గ్రంథాలయ సర్వస్వము''నే గాక, "ప్రకృతి" "దివ్యజ్ఞానదీపిక'' అను పత్రికలు, వివిధములయిన గ్రంథములు తమ యాజమాన్యమున ప్రకటించుచున్నారు. మరియు ఆంధ్రదేశములో కొన్ని యితరోద్యమములను సయితము చేపట్టి వానికి వృద్ధిస్థైర్యముల చేకూర్చినారు. వానిలో మొదట పేర్కొనవలసినది గ్రంథాలయోద్యమము. దానికి వారే ప్రధాన పురుషులు; నిరంతరకృషి సలిపినవారు; దానివ్యాప్తియే వారి యద్భుతసేవకు నిదర్శనము. ప్రకృతి చికిత్స విషయములోను, దివ్యజ్ఞాన సమాజ విషయములోను వారు సలిపిన సేవ ప్రశంస గాంచినది. బాలభటోద్యమమునకు కూడ వారు పూనుకొనిరి. "స్వదేశీ" వ్రతమునకు చేయూత నొసంగిరి. రాజకీయరంగములోను కనబడుచుందురు. కనుక మతసాంఘికరాజకీయవాఙ్మయాది వివిధకార్యములందును పాల్గొనుచు వారు భిన్నమతముల పాటుపడుచున్నారు.

వారినిగురించి ఒక సంగతి ముఖ్యముగ జెప్పవలసి యున్నది. వారు కార్యసాధకులు. వారు ప్రసంగములు, ఉపన్యాసములు చేయుచు ప్రసిద్ధిజెందలేదు. ఏదో పని సంబంధముననే ఎక్కడికైనను పోయెడువారు. పదిమందితో మాటాడెడివారు. తలపెట్టినది సాధించుకొనెడువారు. వేంకటరమణయ్యగారు చేసినసేవ విశేషముగా నున్నను, వారి పేరు అంతగా పైకి రాక పోవుటకు వారి స్వభావమే కారణము. ఇటువంటి కార్యదీక్షాపరులసంఖ్య మన ఆంధ్రదేశములో చాల తక్కువ. భారతవర్షములో ఆంధ్రదేశము కార్యసాధనయందు వెనుకబడుచున్నది. వేంకటరమణయ్యగారివలె పలువు రాంధ్రులు దేవసేవకు గడంగి యితరప్రాంతీయులతో సమానముగ భారతవర్ష స్వాతంత్ర్యమునకై పాటుపడుదురుగాక యని వెంకటరమణయ్యగారి సన్మానోత్సవ సందర్భమున నభిలషింపవలసిన యాశయము.

రాజమండ్రి

కామరాజు హనుమంతరావు.

# ప్రశంస

## (తణుకు శ్రీరామపుస్తక భాండాగారము తరఫున)

౧

"ఆత డయ్యంకి వంశసంభూతయశుడు, ఆత డఖిలాంధ్రగ్రంథ భాండారకుండు
విశ్వభారతవిజ్ఞాన వేది యతడు, ఎతడు! రమణయ్య, లైబ్రరీపతి గదయ్య"
అనుచు నాంధ్రులు ఇండియా యఖిల జనులు, సంస్తవము సేయ చాలులే జన్మ కింక
సరిపడిన సేవ జేసి యశస్సు గొంటి, వాంధ్రపుత్రుడ వాదర్శ మైతివిగద!

౨

టీ. సి. దత్తతోడ తెలుగు జిల్లాలెల్ల, సంచరించినావు శ్రమలకోర్చి
గడిపితీవు బళిర! గ్రంథాలయపుయాత్ర, సర్వతీర్థయాత్ర సరణి రమణ!

రచన:— **పామర్తి వేంకటరమణరావు,**

**30-10-42** మాజీ తణుకుతాలూకా గ్రంథాలయ కార్యదర్శి.

△

# గ్రంథాలయోద్యమము - దివ్యజ్ఞానసమాజము

మన దేశంలో ఏ ఉద్యమము ప్రారంభమైనా దానిలో ఆంధ్రదేశము నేనుకూడా ఉన్నానంటూ తలయెత్తుతూ ఉంటుంది. కాని మొదట్లోవచ్చిన ఆ వేడిలో వొళ్ళు తెలియకుండా పనిచేసి తుదకు ఆయాసపడి చల్లబడిపోతూవుండడం కూడా అలవాటు. ఈ ఆంధ్రుల ఆరంభశూరత్వంమూలంగా నాటికీ నేటికీకూడా మా దేశంలో ఈ పరిశ్రమ జయప్రదంగా కొనసాగించగల్గుచున్నాము. ఈ ఉద్యమం మా ఆంధ్రదేశంలో శాఖశాఖలుగా విజృంభించగలిగింది, అని చెప్పుకోతగ్గది ఒక్కటీ లేదు. చివరకు ఆంధ్రరాష్ట్రోద్యమముకూడా ప్రతిసంవత్సరము వరుస తప్పకుండా సభలుచేసి, ఆ వేడిలో అనేక తీర్మానాలుచేసి అరవలపై ఆంధ్రులకున్న కక్ష తీర్చుకోవడమేగాని, తర్వాత దాని ప్రసక్తే ఉండదు. కాని గ్రంథాలయోద్యమం ఆ విధంగా గాకుండా, పట్టణము మొదలు పల్లె వరకు బ్రిటిషుప్రభుత్వము ఏవిధంగా ఆక్రమించిందో ఆ విధంగానే మారుమూల నున్న పల్లెవరకు పాకి జయప్రదము గాంచగల్గింది. దీని కంతకు కారణము శ్రీ అయ్యంకి వెంకట రమణయ్యగారి కృషియే యని చెప్పాలి.

ప్రపంచంలోకల్లా మన దేశంలో అవిద్య ఎక్కువగా బ్రబలిపోయి యుంది. ఈ అవిద్యానిర్మూలనానికి అనేకమంది అనేకమార్గాలు వెదకజొచ్చారు. అట్టి సమయంలో అయ్యంకివారు పునాది వేసిన గ్రంథాలయోద్యమము ప్రజలను కన్నుపొర విప్పినట్లుగా చేసిందనుటకు సందేహమేమీ

లేదు. పుబ్బకుపుట్టి, మఖకు మాడిపోయినట్లు కొన్ని గ్రామాలలో కొంతమంది యువకులు బయలు దేరి ప్రజలను ప్రోత్సహించి పుస్తకాలు, పత్రికలు చందాలు వసూలుచేసి, గ్రంథాలయము స్థాపించ డము, అది అర్ధ సంవత్సరమో లేక సంవత్సరమో నడవడం, తర్వాత దానిపై శ్రద్ధతగ్గి పుస్తకా లకు పట్టిన బూజుకూడా దులిపేవారు యెవరూ లేకపోవడం జరుగుతోంది. అసలు నిజం చెప్పవలసి వస్తే మనదేశంలో ప్రారంభింపబడిన ప్రజా ఉద్యమం ప్రతిదానికి, ప్రభుత్వమువారి ప్రోత్సాహం తక్కువ. ఆ విధంగానే ఈ గ్రంథాలయాలకు కూడా ప్రభుత్వమువారు గాని, స్థానిక సంస్థలుగాని తగినంత సహాయము చేసినయెడల ఇంకను ఇతోధికముగ పని జరిగియుండెడిది. రాజపోషణ ప్రతి ప్రజాసంస్థకు తప్పక అవసరం.

ఇటువంటి సమయంలో 1937 లో గ్రంథాలయోద్యమమువారు ఆంధ్రదేశంలో క్రొత్త కార్య క్రమాన్నొకదానిని ప్రవేశపెట్టారు. అదే గ్రంథాలయయాత్ర. ప్రతి గ్రామంలోను ఈ గ్రంథాలయ యాత్ర జయప్రదంగా కొనసాగింది. తీర్థయాత్రలు చేసినట్లుగా ప్రజలు అనేకమంది వచ్చి ఈ గ్రంథాలయ యాత్రలలో పాల్గొనిరి. ఈ యాత్రలు మన ఆంధ్రదేశంలోని నిద్ర పోతూ యున్న గ్రంథాలయాలను, పడుకొన్న మనిషిని తట్టి లేపినట్లుగా లేపాయి. ఈ యాత్రలలో అనేక క్రొత్త గ్రంథాలయాలకు కూడా ప్రారంభోత్సవాలు జరిగాయి.

ఈ ఆంధ్రగ్రంథాలయోద్యమానికంతకు మూలపురుషుడు అయ్యంకి పంతులే. వీధి వెంబడి అయ్యంకి వెంకటరమణయ్యగారు నడుస్తూంటే ఒక గ్రంథాలయం నడుస్తున్నట్లుంటుంది. ఆయన ఎక్కడవుంటే అక్కడ గ్రంథాలయోద్యమము విజృంభిస్తున్న ట్లుంటుంది. కాంగ్రెసుపేరు చెప్ప గానే గాంధీగారు ఏవిధంగా జ్ఞప్తికి వస్తారో, ఆవిధంగానే గ్రంథాలయం మాట చెప్పగానే అయ్యంకి ఆయన, గ్రంథాలయ సర్వస్వము ప్రత్యక్ష మౌతాయి.

శ్రీ అయ్యంకి వెంకటరమణయ్య గారిని ఆంధ్రదేశం గ్రంథాలయోద్యమంలోనే బాగా ఎరుగును. ఆయన దివ్యజ్ఞానసమాజసభ్యుడని కొద్దిమందికే తెలియును. దివ్యజ్ఞానసమాజ మనగానే ఇది పాశ్చాత్య సంపర్కము గల హిందూమతమని భారతీయులలో కొందరి అభిప్రాయం. నా అభి ప్రాయంకూడా ఇంతేగాని తరచి చూస్తేనేగాని తెలియదన్నట్లు ఈ సమాజసభ్యులను చూచిన మొదట్లో, ఈ సమాజసభ్యులంతా స్వార్థపరులైన మహామేధావులనియు, ఇదొక చిన్న "బూర్జువా" సంస్థయనీ, దీనిలో మతమునందు అభిమానముగల సామాన్యప్రజకు స్థానం లేదనే తీర్మానానికి వచ్చాను. సామాన్య ప్రజలలో కూడా ఈ అభిప్రాయమే పాకిపోయిందనడానికి సందేహమేమీ లేదు. దీనికి కారణము ఈ దివ్యజ్ఞాన సమాజ స్థాపకులు పాశ్చాత్యులగుటచేతను, ముఖ్యంగా దీనికి సంబంధించిన వాఙ్మయమంతా ఆంగ్లభాషయందుండుట వల్లను, పాఠకజనానికి సరియైన అందుబాటులో లేక పోయింది. ఇంగ్లీషు రాని చాలామంది ఈ మతాన్ని గురించి తెలుసుకుందామన్నను, దీనికి సంబంధించిన ప్రతి పుస్తకము, ప్రతి పత్రిక, చివరకు ప్రతి

చిన్న కాగితముకూడా, అందమైన టైపులో ఆంగ్లభాషలో ప్రచురణ జరుగుతూ వుంటాయి. తెలుగు భాషలో ఏ ఒకటి రెండు పుస్తకాలు మాత్రమే యుండేవి.

కాని మన అయ్యంకి పంతులు ధర్మమంటూ ఇప్పుడిప్పుడు సుమారు 3 సంవత్సరములనుండి ఆంధ్ర సర్కారుల దివ్యజ్ఞానసమాజ ఫెడరేషను తరఫున, దివ్యజ్ఞానచంద్రిక లను పేరుతో ఆంధ్రులకు సులభంగా అందుబాటులో యుండేలాగున, చక్కని అచ్చులో, అందమైన గెటప్‌లో, తక్కువ ధరలో, ఇమిడికగా, ఆంధ్ర గ్రంథాలయ ప్రెస్‌లో ఆంధ్రానువాదాలు జరిగి వెలువడు తున్నాయి. ఇంతవరకు అట్టివి 28 చంద్రికలు వెలువడినాయి. ఈ దివ్యజ్ఞాన చంద్రికలు చిన్నచిన్న కరపత్రాలుగా నున్నా ప్రజలలో దివ్యజ్ఞానసమాజాన్ని గురించి చక్కని అభిప్రాయాన్ని తీసుకొని వస్తున్నాయి. దివ్యజ్ఞానసమాజంతరఫున జరుగుతూవున్న మిగిలిన ప్రచార మొక ఎత్తున్నూ, మహాత్ముల గ్రంథాలకు ఆంధ్రానువాదాలైన ఈ దివ్యజ్ఞాన చంద్రికలు ఒక ఎత్తున్నూ. ఈ తెలుగు ప్రచురణములు వచ్చినప్పటి నుండియు ప్రజలలో ఈసమాజాన్ని గురించియున్న తప్పుడు అభిప్రాయాలు చాలా భాగము తొలిగాయి.

వీటికి తోడు దివ్యజ్ఞాన దీపిక అను ఒక మాస పత్రికకూడా ఈ గ్రంథాలయ ప్రెస్ నుండే అయ్యంకి వారి ఆధ్వర్యము క్రింద వెలువడుతోంది. ఈ పత్రిక మన అయ్యంకివారిచేతిలో పడకపూర్వము దీని రూపమే వేరొకవిధంగా వుండేది. ఇప్పుడు పత్రిక ఎంతో ఆకర్షణీయంగా పూర్వంకన్న పెద్ద సైజులో వెలువడుతోంది. దీనికి కారణము ప్రచారంలో మన అయ్యంకివారు ఆరితేరిన చేయి కాబట్టి. అందుకే ఈయన ఆంధ్రసర్కారుల దివ్యజ్ఞాన సమాజ ప్రచార కార్యదర్శి అని పిలువ బడుతూ యున్నారు.

ఈ విధంగా సంఘసేవలో తమ జీవితమును అంకితముచేసిన శ్రీ అయ్యంకి వెంకటరమణయ్యగారెంతయు పూజ్యులు.

నిడదవోలు.

శ్రీ గోపరాజు వెంకటానందము.

# మేధాదాత

1905 సం॥రం నుండి మన యాంధ్రదేశమున గ్రంథాలయోద్యమము బయలుదేరినసంగతి దేశీయులందఱికిని దెలిసినవిషయమే. అప్పటి రోజులలో గ్రంథాలయోద్యమమందు ప్రధానపురుషులై, యుత్సాహావేశపూర్ణులై, ముందంజ వేసినవారిలో శ్రీ పంతులుగా రొక్కరు. యువకులై పరిభుమంత్రోత్సాహ శక్తి యుక్తులై, నిరంతరోత్సాహపూరితులై, యా యుద్యమమును బ్రారంభించి యందు కృతకృత్యు లగుట కెంతో పాటుపడిరి. అప్పటికి మన యాంధ్రదేశమందు స్త్రీ పురుషులకు విద్య కడు శూన్యముగా నుండెను. పలుతావులందు జనులకు విద్య యననేమో; విద్యావసర మెట్టిదో కూడ తెలియదయ్యెను. అట్టిచో పుస్తకభాండాగారము లననేమో విద్యావశ్యక మెట్టిదో పరిజలకు బోధించి సరస్వతీనిలయముల గ్రామగ్రామమందు నెలకొల్పుట కెట్టి శ్రమ, యోర్పు, వాక్చాతుర్యము నుండవలెను? ఎన్ని యవాంతరములనుండి తప్పుకొనవలయును? మూర్ఖులగు ప్రజల యర్థములేని ప్రశ్నపరంపరల కెట్టి యుక్తవచనము లివ్వవలెను? ప్రజల నీ యుద్యమమునకు సుముఖులనుగా నెట్లు జేసికొనవలెను?

ఎట్లైననేమి శ్రీ పంతులుగారు తాను పూనుకొనిన కార్యమును సాధించుటకొఱ కెన్నియో కష్టనిష్ఠురముల సహించి, చేపట్టిన కార్యమును, చెడనాడక, ధీరబుద్ధితో, గంభీరముగ, ధైర్యస్థైర్యముల వహించి, సుమారు నలుబదియేండ్లనుండి తమ జీవితమును సాధించిరి. నేడాంధ్రభూమి నూరూర గ్రంథాలయములు వెలసియున్నచో నయ్యది శ్రీ పంతులుగారి కృషిఫలితమే. సంచార గ్రంథాలయముల నేర్పఱచి గ్రంథాలయయాత్రలు సాగించి గ్రంథాలయసర్వస్వ మను పత్రికను సాగించి యిట్లెన్నివిధములనో వీరు తమ జీవితమును ధారపోసియున్నారు. కనుక ఇట్టి పంతులుగారి సేవాఫలితమును ప్రతి యాంధ్రుడు ననుభవించుచుండుటచేత వారి కెంతయు కృతజ్ఞత చూపవలసియున్నది. నేటి యాంధ్రులలో నున్నతవిద్య నభ్యసింపకయు, విజ్ఞానశక్తి సంపాదించి ప్రసిద్ధికెక్కినవా రందఱికి, పంతులుగారి దయావాత్సల్యములవలన గలిగిన మేధాశక్తియే యాధారము కనుక వారిని సన్మానించుటయు, వారిని నిరంతరము స్మరించుటయు మఱువరానివిషయము.

ఇక శ్రీ పంతులుగారిని నేను 1912 సం॥రం నుండియు నెఱుగుదును. వారి నిరంతరకృషివలన నా వంటి సామాన్య బాలికకును, నాటి కాలమందు గ్రంథాలయమును స్థాపించుబుద్ధిని గల్గించినది. వారి ప్రోత్సాహమువలననే ప్రసిద్ధ గ్రంథాలయములు వెలసినవి. అంగలూరులో బాలసరస్వతీ గ్రంథాలయముకూడ నక్కాలమందే బయలుదేరినది. శ్రీ పంతులుగారితో ననేక గ్రంథాలయ సభలలో ప్రసంగించు నవకాశము నాకు గలిగియున్నది. వారికి గ్రంథాలయాభివృద్ధికరము లగు నెన్నియో విషయములు తెలిసియున్నవి. అట్టి పంతులుగా రింకను గ్రంథాలయోద్యమమున ప్రజలకు తోడ్పడుచు, చిరకాలము జీవింతురుగాక! వారి కృషి యింకను సర్వతోముఖముగ వ్యాపించుగాక. శ్రీ పంతులుగారి కీశ్వరు డాయురారోగ్యముల నిచ్చుగాక.

అ॥ వెంకటసీతమ్మ

# ధన్య జీవి

ఆ. కాలగతుల బట్టి కష్టంబు గలిగిన, తల్లడిల్లబోడు ధైర్యశాలి
ప్రబలమారుతములు పైబడి వీచిన, గొండ యించుకైన బెండువడునె?

(విశ్వవీధి)

మానవులను సర్వసామాన్యముగ త్రివిధములుగ విభజింప వచ్చును. సముద్రములోని తరంగముల వలె పుట్టి గిట్టునట్టివా రొక తరగతి. ఎవరికి వారే యనువారు రెండవ వర్గము. విశ్వమానవ ప్రాణికోటి సౌఖ్యమునకై తమ ప్రాణములను నిరంతరము ధైర్యోత్సాహములతో ధారవోయు నట్టివా రుత్తమజాతికి చేరినవారు. వారినే మనము ధన్యజీవు లనియు నిత్యజీవు లనియు జెప్పెదము. ఈ తరగతికి చేరినవారు గాంధీజీవలెనే శ్రీ అయ్యంకి వేంకట రమణయ్య పంతులుగారు. 'మానవ సేవయే మాధవసేవ'యను సూత్రి యజ్ఞమును నిరంతర మొనరించు చుండువారు శ్రీ పంతులుగారు. కీర్తిశేషులైన దేశోద్ధారక, విశ్వదాత శ్రీ నాగేశ్వరరావు పంతులుగారితో సర్వవిధముల పోల్పదగినవారు మన వేంకట రమణయ్యపంతులుగారు. జ్ఞానదానమునకన్న గొప్ప దానము కలదా యను దివ్యవచనమును యమృతతుల్య మొనర్చి తోడిమానవుల యజ్ఞాననివృత్తికై కంకణముగట్టి ముప్పది సంవత్సరములుగ గ్రంథాలయోద్యమమును నిరంతర కృషిచే వివిధమార్గముల ప్రచార మొనరించుచుండు పుణ్యపురుషు డితడు. అందువలననే,

గీ. ద్యుమణి పద్మాకరము వికచముగఁ జేయుఁ, గుముదహర్షంబు గావించు నమృతసూతి
అర్థితుఁడు గాక జల మిచ్చు నంబుధరుఁడు, సజ్జనులుగారె పరహితాచరణమతులు!

అని ముక్తకంఠమున భర్తృహరి కోకిలవలె దివ్యగాన మొనర్చెను.

మేఘాచ్ఛాదితమై యంధకారబంధురమై మార్గ మగోచరముగ నున్నను దైవమునందే భార మిడి ఆశ యను నూతగోలను చే ధరించి ధైర్యకవచముతో కష్టములను సరకు గొనక విజయలక్ష్మిని వరించుటకునై ముందునకే నడచు పురుషోత్తము డితడు!

గ్రంథాలయోద్యమము మనరాజధానిలో సుమారు పదునైదు వత్సరములనుండి "The Madras Library Association" పేరిట బరగుచున్నది గాని, యాంధ్రావనిలో గ్రంథాలయోద్యమము వీరి నిరంతరకృషిచే ముప్పది సంవత్సరములుగ పోషింపబడి గ్రంథాలయకన్య ప్రౌఢయై తన దివ్యకళలను దశదిశల వ్యాపింపజేసి విశ్వవిహారము విహంగమువలె నొనర్చుచు నుద్యమ జనకులగు శ్రీ వారి ఆశీస్సులను గోరుచున్నది. భాషాయోషామణి జూపు దివ్యదీప్తులును, శ్రీ పంతులవారి చిఱునవ్వును, ఆంధ్రమాత వీరి నాశీర్వదించు దృశ్యము, తమ మనఃఫలకముల జిత్రింపబడుటలేదా!

ఆంధ్రమాతను నిరంతరము సేవింప శ్రీ పంతులవారికి పరిపూర్ణాయురారోగ్యభాగ్యంబు లొసగ శ్రీ వేంకటరమణుని హృదయపూర్వకముగ బ్రార్థించుచు కరములను జోడించుచున్నాను.

హిందూపురము

దుర్భాక కృష్ణయ్య.

౫౬

# స్వతంత్రజీవి

విద్వాన్, కవితావిశారద, పండిత సత్యనారాయణరాజు

ఇంచుమించుగా నిరువదియేండ్లనుండి నాకు శ్రీ అయ్యంకి వేంకట రమణయ్యగారితోఁ బరిచయము గలదు. మా తణుకులో ఆంధ్ర సాహిత్య పరిషత్తు యొక్క వార్షికసభ జరిగినప్పుడు వా రచ్చటికి విజయము చేసిరి. సభావృత్తాంతముల నతిప్రశాంత మగు చిత్తముతో ఆలించుచు నడుమ నడుమ 'ఛలోక్తి'గా ఆయా ఉపన్యాసకులకు ఉల్లాసము కలిగించుచు అకుంఠిత దీక్షతో రాట్నముపై నూలు తీయుచుండెడి దీక్షితుండు - ఆనాఁడు, ఈశ్వరుఁ డెట్లు నిత్యశుద్ధ ముక్తబుద్ధ స్వరూపుఁడై యున్నాఁడో వారును అట్లే స్వతంత్రులై ముక్తులగు స్వభావము కలిగియుండెడివారు. ఈశ్వర ప్రసాదితమైన స్వాధీనత వారి జన్మహక్కుగా నుండెను. దైవము నిత్యముక్త స్వతంత్రుఁడై నట్లు వారును స్వతంత్రులే. రాజు - రైతు, బ్రాహ్మణుఁడు- పంచముఁడు, పురుషుఁడు - స్త్రీ, హైందవుఁడు- మహమ్మదీయుఁడు, బౌద్ధుఁడు- క్రిష్టియను, పేద- భాగ్యవంతుఁడు, విద్యాహీనుఁడు- విద్యాధికుఁడు అను భేదభావము లేక భోజనవేళలయందు నెల్లవర్ణముల వారితోడను గలిసి భుజించు సంస్కర్త యాయన.

స్వాతంత్ర్య మనఁగా స్వయంనిగ్రహము, స్వయంనియంతృత్వము, స్వయంమనోనిశ్చయము, అను సిద్ధాంతము వేంకటరమణయ్యగారి యందు మూర్తీభవించి ప్రత్యక్షమగుచుండును. విచారభావ మెన్నఁడును వారి ముఖమునఁ గాంచఁబోము. వారు శరీరమునందువలెనే భావంబులందుఁ గూడ గురుస్వరూపులు.

అజ్ఞానాంధకారపూరితమై, దారిద్ర్యభూయిష్ఠమై, ఐకమత్యవిహీనమై, ఆత్మగౌరవశూన్యమై, స్వేచ్ఛారహితమై అధోగతియందున్న ఆంధ్రదేశమున విద్య వ్యాప్తి చెందుటకు గ్రంథాలయములే ముఖ్యసాధనము లని వారి తలంపు.

సద్గ్రంథ మొక మిత్రరత్నము. ఎక్కువ ఓర్పును గనపఱచుచు, ఎక్కువ ఉల్లాసమును గలుగఁ జేయుచు, సుఖదుఃఖములందును, కలిమి లేములయందును, సర్వకాలసర్వావస్థలయందును, ఏకరీతిగ సమానప్రేమమును వ్యక్తీకరించుచుండును. కావుటంజేసియే గ్రంథాలయము సన్మిత్రాలయము అని వారి బోధ.

గ్రంథములు మహాపురుషుల చిరకాలానుభవములు. మహోన్నతచిత్తుల విజ్ఞానముల మూర్తులు. మనుష్యులకు గ్రంథముల వంటి మిత్రము లుండుట యరిది. అవి మనుజు నెడఁబాయని మిత్రములు, క్షేమముగోరు మిత్రములు, సదాచారములనే యాచరింపఁజేయు మిత్రములు సన్మార్గమందే నడపించు మిత్రములు, తప్పులు దెల్పు మిత్రములు, ముఖస్తుతి చేయని మిత్రములు, ధన మిమ్మని పీడింపని చుట్టములు, తల్లికంటె దండ్రికంటె సోదరులకంటె ఆప్తులు. మానవమానస క్షేత్రములమీఁద ఈ కాల మా కాల మనక గర్జాడంబరము లేక పిడుగుల

భయము గలిగింపక జ్ఞానవర్షము గురియు మేఘరాజములు గ్రంథము లని తెలుగునాఁట పల్లెపల్లెను వాడవాడను చాటిన మేటిమేధావి వేంకటరమణయ్యగారు.

మహానుభావులు తమ యుదారభావములను, ఉన్నతాదర్శములను గ్రంథములందు వ్రాసియుంచిరి. జ్ఞానము వ్యాపించుటకు ముఖ్యాధారము గతలోకానుభవము. గతలోకానుభవము వర్తమాన లోకానుభవమునకును, వర్తమానలోకానుభవము భావి కాలజ్ఞానసంపదకును సాధనములు. ఇట్టి జ్ఞానసంపదయంతయు గ్రంథములయం దిమిడియుండును. కావున గ్రంథకాలక్షేపము చేయుటకు ఆలయములు ఊరనూర వెలయవలయు నని కాలినడకను బ్రతిగ్రామమున కేఁగి చాటుచు శ్రమ యెఱుగని పాటుపడు కష్టజీవి వేంకటరమణయ్యగారు.

ఇక్కాలమున అన్నాతురులవలెనే జ్ఞానాతురులును అధికముగాఁ గలరు. అన్నదానఫలముకంటె జ్ఞానదానఫల మధికము. ఒక్క జాములో నఱిగిపోవునట్టి యన్నదానము చేసినందులకే యమేయ ఫలము కలుగుచుండఁగా మానవుల మనంబుల శాశ్వతంబుగా నిలిచియుండి యితరుల కిచ్చినను నెంతమాత్రము తఱిగిపోక దినదినప్రవర్ధమానమగు జ్ఞానము దానముచేయుటవలన నెట్టి ఫలము గలుగునో వర్ణింప నలవికాదు. సకల కళలకు విద్యలకు నధిష్ఠానదేవతయైన మహాదేవికి సరస్వతికి ఆలయంబులు లేకపోవుట మిక్కిలి శోచనీయము, గ్రంథాలయములే సరస్వత్యాలయములు. ఇందు సరస్వతీవిగ్రహము శిలారూపమున నుండక గ్రంథరూపమున నుండును. భాండాగార కార్యదర్శియే అర్చకుఁడు. గ్రంథపఠనమునకై నిత్య మరుగుదెంచు జనులే భక్తులు. జ్ఞాన సంపాదనమే ఫలము. "ఈ యాలయ మెన్నఁడును మైలపడక, సంప్రోక్షణములు గోరక, నిత్య పవిత్రమై యెల్లవారిచే సేవింపఁ బడునదియై యుండును" అను తత్త్వబోధ చేసి తరించినజ్ఞాని, మన వేంకటరమణయ్యగారు. వారిదీక్షకు ఫలముగా 'వాయు వెల్లవారికి స్వాధీనమై యున్నట్లు, ఉదక మెల్ల వారికి పానయోగ్యమై యున్నట్లు, సూర్యచంద్రుల తేజస్సు ఎల్లవారికి సౌఖ్యప్రదమై' యున్నట్లు నేఁడు జ్ఞానము అందఱకు స్వాధీనమై సేవ్యమై సౌఖ్యప్రదమై వెలయుచున్నది.

ప్రజాసామాన్యముయొక్క మనస్సును వికసింపఁజేసి వారిహృదయములను నూతనాదర్శములతోడను నవీనాశయములతోడను రంజింపఁజేయుటకు వక్తృత్వ మావశ్యకము. కాని యది ముఖ్యలక్షణము కాదు. భావనాశక్తి ముఖ్యలక్షణము. అట్టి భావనాశక్తి కలవారే మన వేంకట రమణయ్యగారు. ప్రస్తుత ప్రయోజనముల నపేక్షించి ప్రయత్నించుట యాయనమతము గాదు. దివ్యజ్ఞాన ప్రచారము చేయుట యాయనమతము.

నిష్కపటమగు దేశాభిమానమును, చరిత్రజ్ఞానముచేఁ గలుగు దూరదృష్టియు, ఆదర్శమునం దుండవలసిన భక్తివిశ్వాసములును భావనాశక్తిమూలబీజము లగుట వారియందుఁ గానవగును. ప్రజాభిప్రాయనిరసనము, ప్రస్తుతఫలాపేక్ష వారియందు మందున కేని లేవు.

నూతనభావము లెచ్చట యుత్పత్తియయినను వానిని స్వీకరించుటకు వలయు నాసక్తి వారికి వెన్నతోడఁ బెట్టబడినది.

విద్యయందును, లోకానుభవమందును, రాజకీయవ్యవహార జ్ఞానమందును హీనులుగా నున్న తోడి మానవులు జ్ఞానసంపన్నులై నాయకుల యాదేశములను శిరసావహించువారు కావలయునన్న బహుగ్రంథపఠనాలయములద్వారమున వయోజనవిద్యావ్యాప్తి కావలయునని వారి యాశయము. తనబుద్ధిబలముచేతను, తనదూరదృష్టిచేతను, తనయుక్తాయుక్త విచక్షణతచేతను, తన సమన్వయ శక్తిచేతను, ప్రజల యజ్ఞానమును, ప్రస్తుతధనాపేక్షను, రోషావేశములను, పరస్పరవైషమ్యములను, రూపుమాపి యేకభావ సూత్రబద్ధులను గావించుటకు గ్రంథాలయములే ముఖ్యసాధనములని జన సామాన్యములో రాజకీయోత్సాహము జాతీయభావము రేకెత్తించుటకై పట్టణ పట్టణము పల్లె పల్లె సంచారము సాగించిన ధీరుఁడు వెంకటరమణయ్యగారు.

ప్రజలను సమీపించి వారి గ్రామాలకుఁ బోయి, వారి భాషలలో నుపన్యసించి, వారి యందు గర్భితమైన శక్తి నుద్దీపింపఁ జేసిన విశ్వాసపాత్రుఁడు వెంకటరమణయ్యగారు.

ఎంతకాలము నాయకుల దృష్టి జనసామాన్యముపైఁ బ్రసరింపదో, ఎంతకాలము తమ నాయ కత్వము ప్రజాశక్తియందుఁ బ్రతిష్ఠింపఁ బడదో, ఎంతకాలము ఆంగ్లభాష నేర్చిన నాగరికులకును తక్కిన దేశీయులకును భేదంబు తొలఁగింపఁ బడదో, రాజ్యాంగమునకుఁ బ్రజామోదమే మూల భిత్తి యని గుర్తింపఁ బడదో, ఎంతకాలము జాతీయోత్సవముల మూలమున రాజకీయాదర్శములు జనమండలిలో వ్యాపింపవో, ఎంతకాలము సభలలోఁ జర్చింపఁబడు ప్రతి విషయము పల్లెలలోఁ దేశభాషలయందుఁ బ్రకటింపఁబడవో అంతవఱకును సర్వసంఘములవారిని నేకీభవింపఁ జేసి, వాగ్విహీనమైన జనసామాన్యమునకు వాక్కు నిచ్చి, చీలిపోయిన సంఘముల నేక స్థానములకుఁ దెచ్చి, ప్రాతినిధ్యములేని ప్రజలకు బ్రాతినిధ్యాధికారము నొసంగి, నిస్సారమును అరుచికరమును నగు రాజ్యాంగమును సారవంతముగను, జాతీయసమస్యగను జేసి, ప్రజాశక్తిని ప్రతిష్ఠింపఁజాలదని గ్రహించి గ్రంథాలయోద్యమప్రచారమూలమున ఆంధ్రదేశ జనసామా న్యము హృదయములందు మత మెంత పవిత్రమైనదో మనుష్యత్వ మెంత యుత్కృష్టమైనదో రాజ్యాంగము కూడ నంతపవిత్రమైనది. అంతయుత్కృష్టమైనది, అనుభావము కలిగించిన వారు మన వేంకటరమణయ్యగారు.

విద్యాధికుల వేషభాషలయెడలను ధనికుల భోగలాలన యెడలను, దేశనాయకుల స్వార్థపరాయ ణత్వము నెడలను, విముఖత్వముచూపి నీచముగా భావింపఁ బడుచున్న అశేష జన మును, బంధువర్గముగఁ జేసికొని, వారి కష్టసుఖములలోను, వారిభక్తివిశ్వాసములలోను, వారి యజ్ఞాన దారిద్ర్యములయందును లీనమై వారి హితమే దేశహిత మనియు వారి యుద్ధరణమే దేశో ద్ధరణ మనియు వారి వేషభాషలే పవిత్రము లైన వనియుఁ బ్రబోధించు మహాత్ముని ప్రతిబింబమే మన వేంకటరమణయ్యగారు.

ఇట్టి నూతన కార్యోత్సాహము నుండి ఆత్మవిశ్వాసమును, తీవ్రనిశ్చయమును, దృఢపఱచు దేశాను రాగమును, స్వావలంబనమును నిర్ణయించు రాజకీయాభినివేశమును నూతగాఁ దాము సాగించిన

గ్రంథాలయోద్యమము ప్రజలపాలిట కల్పవృక్షమై ఫలపుష్పసమన్వితమై ఫలప్రదమై విరాజిల్లు నట్లు చేసిన ధన్యజీవి వేంకటరమణయ్యగారు.

దేశీయులకు స్వరాజ్యము వచ్చినను రాకపోయినను, ఉత్తమ సైన్యాధికారము దేశీయుల హస్త గతమైనను కాకపోయినను, శాసన నిర్మాణసభ యథార్థ ప్రతినిధి సభగ మారినను మారకున్నను ప్రజల దారిద్ర్యము తగ్గి ఆరోగ్యము హెచ్చి విద్యవృద్ధి చెందుటకు హేతుభూతమైన తన గ్రంథాలయోద్యమము తామరతంపరగా ఆంధ్రభూభాగమందు వెలయింపఁజేసిన సంకల్పసిద్ధుఁడు, వేంకట రమణయ్యగారు. అట్టివాని సమ్మానించుటకుఁ బూనుకొన్న యాంధ్రదేశము ధన్యము, ఆంధ్రులు ధన్యులు.

Δ

# వీ ర పూ జ

నేను మూడుసంవత్సరాలు తణుకు తాలూకా గ్రంథాలయ సంఘ కార్యదర్శిగా పనిచేశాను. ఆరోజుల్లో శ్రీ వేంకటరమణయ్యగారు గ్రంథాలయోద్యమము చాలా పట్టుగా నడిపించి దీక్షతో సాగించారు. వారి ఆధ్వర్యాన్నే మొట్టమొదట తాలూకా గ్రంథాలయ సంఘం మా తాలూకాలో తేతలిగ్రామంలో స్థాపించబడింది. తరువాత కూడా వారి ఉత్తర్వులు సలహాలు అనుసరించే మేము పనిచేస్తూవచ్చాము. వారు పంపిన డైరీలు చాలా శ్లాఘించతగ్గవి. గ్రంథాలయ సేవకులకృషి అందులో కనబడుతూవచ్చేది. వీరు స్థాపించిన గ్రంథాలయసర్వస్వ మనే పత్రిక ద్వారా ఈ ఉద్యమము చాలా అభివృద్ధిలోనికి వచ్చింది.

వీరు అఖిలభారతగ్రంథాలయకార్యదర్శులు. హరా గ్రంథాలయాధ్యక్షులు అగు శ్రీయుత టి. సి. దత్తాగారు వారి సతీమణితో మన తెలుగుజిల్లాలు పర్యటన మొనర్చినపుడు వారితో కూడా వీరు రాత్రింబవళ్ళు శ్రమతీసికొని అనేకగ్రంథాలయములకు వెళ్ళి దర్శించియున్నారు.

మా తాలూకాలో గల రేలంగి, తణుకు, తేతలి, దువ్వ మొదలగు ముఖ్యపట్టణములలోని గ్రంథాలయములను జూచుటకై వారితో స్వయముగ పర్యటనముచేయు భాగ్యము లభించినది. ఆనాటి రాత్రి 1 గంటవరకును గ్రంథాలయములు చూచుచునే యున్నాము. ప్రజలుకూడ ఉత్సాహముతో ఉద్యమములో పనిచేసిరి. ప్రతిచోట శ్రీ వేంకటరమణయ్యగారు దత్తాగారి ఉపన్యాసముల తర్జుమా చేసి తమ అమూల్యసలహాలు ఒసగి గ్రంథాలయములకు హెచ్చరింపులు చేసియున్నారు.

కాలక్రమమున వయోజనవిద్యకు గ్రంథాలయోద్యమమునకు ప్రభుత్వాదరణ చాలనందున ప్రస్తుతము ఉద్యమము శోషిల్లినను అనతికాలములో తిరిగి గ్రంథాలయములు పునరుద్ధరింప బడ గలవని ఆశిస్తున్నాను. నాడే గ్రంథాలయోద్యమము అన్ని యుద్యమములకు వెన్నెముకగా నుండి ఆదర్శప్రాయమై అలరారుతుంది. శ్రీ వేంకటరమణయ్యగారికి భగవంతుడు సర్వాభీష్టముల నొసగు గాక. వీరపూజ దశదిశల తేజరిల్లుగాక.

త ణు కు .

పామర్తి వేంకట రమణరావు.

# "తత్కర్మ, తదస్మి."

వీరు దివ్యజ్ఞానసమాజమున 25 సంవత్సరములక్రిందట ప్రవేశించినారు. నాటినుండియు వారికి సమాజమునం దాదరము దినదినప్రవర్ధమానముగ నున్నది. వీరు కృష్ణాజిల్లా కార్యదర్శిగ చాల కాలము పనిచేసినారు. వీరికి కాన్ఫరెన్సులు (మహాసభలు) జరుపుట యన మంచినీళ్ళప్రాయము. అనేకసభలు చేయించినారు. 1928 సంవత్సరమున కృష్ణాజీగారు బెజవాడ దర్శించినపుడు వీరు చేయించిన సభ పెద్ద కాంగ్రెసుసభవంటిది. జిల్లాసభలు, ఫెడరేషను సభలు, అనేకము జరిగించిరి. ఫెడరేష నంతటను సంచారము గావించినారు. ఇపుడు వారు ఆంధ్ర సర్కారు మండల దివ్యజ్ఞాన సమాజమునకు ప్రచారకార్యదర్శిగ పనిచేయుచున్నారు. ఇప్పటికి 27 చిన్న పుస్తకముల నచ్చొత్తించి ప్రచారములో పెట్టినారు. దివ్యజ్ఞానదీపిక యను మాసపత్రికకు కార్యదర్శియయి దాని నసమాన ప్రజ్ఞతో నడుపుచున్నారు. దానిని బాగుగా వృద్ధిచేసినారు. వ్యయ ప్రయాసల కోర్చి ఈ రెండు కార్యములను తదేకదీక్షతో నడపుచున్నారు. సంచారము విశేషముగ జేయుచున్నారు. మా సమాజనాయకులలో నొకరగు శ్రీ జినరాజదాసుగారు దివ్యజ్ఞానదీక్ష యెట్లుండవలయునో చెప్పుచు, "తద్బ్రహ్మ, తదస్మి" యను నుపనిషద్వాక్యమును మార్చి, 'తత్కర్మ, తదస్మి' అను సూత్రమును సామాజికుడు సదా జపించవలె ననిరి. ఈ సూత్రమును గట్టి తీవ్రనిష్ఠతో జరిపించుచున్నా రీయన. ఈయన మనస్సులో 'కర్మ' యనునదిగాక వేరొక దానికి స్థానము లేనట్లుగా గాన్పించుచున్నది. ఈ విషయమున నీయన యనేకుల కాదర్శప్రాయుడు. బెజవాడ దివ్యజ్ఞానశాఖకు అధ్యక్షులుగ నుండి దానికి సేవ యొనర్చుచున్నారు. సమాజమందిరమును చక్కబరచినారు. సేవయన్నచో వీరికి శ్రమగాన్పించదు. వ్యయమున వెనుకకు జంకరు. ఇట్టి శ్రద్ధతోనే యితర సంస్థలకును సేవచేయుచున్నారు. జనకాదులవలె కర్మయోగముచే ముక్తిని సాధింపవలెనని సమకట్టినట్లు కాన్పించును. భవిష్యత్తున చరిత్రకారు లీయన నొక యవతారపూరుషునిగ వర్ణింపకమానరు. యువకులేమి, పెద్దలేమి, యీయన దీక్ష ననుకరించి సాధనచేయవలసియున్నది. పరమేశ్వరుని కృపచే యీయన చిరంజీవియయి లోకసేవ చేయుచు దానిఫలితమును జూచి సంతోషింప కలుగుదురుగాక యని భగవంతుని ప్రార్థింతము.

కాకరపర్తి సత్యనారాయణ.

# ప్రశంస

శతావధాని, భాషాప్రవీణ, బూరాడ గున్నేశ్వరశాస్త్రి.

శ్రీవిలసత్ప్రభాకలిత సీవ్యదుదీర్ణ కలానుభూతికిం
దావలమైన భవ్యకవితారస ముప్పతిలంగ సత్కృపా
భావిత చంచరీక జయపావన దృక్కుల నేలుగావుతన్
శ్రీపరుఁ డార్తరక్షణు డశేషవిశేషగుణుండు మిమ్ములన్.

శ్రీ లలితానురాగపరిశీలనమై వెలుఁగొందుచున్న స
త్కాలవిలోల భవ్యకవితాదయితా కరుణార్ద్రదృష్టిగ్రం
థాలయసేవకోసమె సదా వినియోగము సేయు జీవితం
బేల ఫలింప కుండు? వెలయించెడి తావకభాగ్య మయ్యరో.

మీ దరహాసచంద్రికలు మీదగు గ్రంథసుధానులిప్తసా
ధాదరసీమలో పడినదాది విశేషయశోనుభూతియే
సోదరసోదరీమణుల శోభలుగాఁ గళలన్ వెలార్పవే
మోదబలమ్ములై విరుల ముందరి తేంట్ల రసగ్రహమ్ములై.

జీవిత మెంతపాటి యని సృష్టిజనావళి లేయెడందలం
దావిలమైన దుర్మతిజలాశయముం బ్రళయంపు బారికిం
గేవల మాత్మసేవఁ బరికింపని త్వాదృశపుస్తకప్రభా
భావమె పో ప్రశాంతి యను భావము గుండె నమర్చి పెంపదే.

ఔదార్యమునకు మీ యాధిపత్యమె సాక్షి, వరదానమునకు మీ కరుణ సాక్షి
విద్యాధికతకు మీ విధివిధానమె సాక్షి, రాజఠీవికి మీ కరమ్మె సాక్షి
సద్గుణమ్ములకు మీ సాన్నిధ్యమే సాక్షి, సంతోషమునకు మీ శాంతి సాక్షి
దాతృత్వమునకు మీ తత్త్వచింతయె సాక్షి, దైవభక్తికి మీ పథమ్మె సాక్షి
మీరు మీకు సాక్షి మీరు మీకే సాటి, యనఁగ జెప్పనొప్పు నవని జనుల
కరయ సద్గుణాంశ నయ్యంకి వేంకట,రమణవర్య ! కార్యరాజిధుర్య !

# కిరీటం

చిగురుకొమ్మల చిన్నిచిరునవ్వు కోయిల
తియ్య తియ్యనిపాట తీసినపుడు
చల్లని కెరటాల పిల్లతెమ్మెరగాఁడు
ఘుమఘుమ లెన్నియో కొట్టినపుడు
ఇంపైన రతనాల శంపాలతాతన్వి
యిన్నివరదలు పట్టించినపుడు
పచ్చ పచ్చని పైరుపట్టుకుచ్చులతల్లి
తెనుఁగుల పడగలెత్తించినపుడు
జిడ్డువట్టి పేర్వడ్డ యీగడ్డమీద
మేలినగిషీలుపడిన నీ కాలిజాడ
త్రోవఁ జూపినది ప్రపంచజీవకళకు
పెట్టెద కిరీట మాంధ్రసామ్రాట్టు నీకు.

ఇది టోపీ యనుకొందువేమొ, పౌరపాటే మాత్ర మీ ధాత్రిపై
పెదవిం దాటగనీని నీ కెవఁడు టోపీపెట్ట దక్షుండు? న
వ్యదశానంత దిగంత దివ్యకవితావజ్రాంగి క్రొత్తావి చ
క్కదనా లొల్కు కిరీట మిద్ది రమణా! గ్రంథాలయోద్ధారణా.

నీ జయభేరి మ్రోగుటకు నీ సుకుమారకళాప్రపంచ నీ
రాజ నిరంకుశప్రభలు రాజిలుచున్న సమస్తలేఖినీ
పూజిత గ్రంథహర్మ్యములముందు మహాకవిరాజు లింత భ
ట్రాజులువోలె మూగిరి వరాలసుధీరమణా యశోధనా.

తేలనివాని మాయ కిక తేలక తేలిన యీ ప్రపంచగ్రం
థాలయమందు దిద్దబడు హద్దులు దాటని పెద్ద పెద్ద బీ
ర్వాలను లేపి దుల్పి, నలువైపులవారికి పక్కివచ్చు ప్రా
ణాలను బోయు మాంధ్రరమణా! నవజీవనకార్యసాధనా!

సాహిత్యవనం
బెజవాడ.

వేదాంతకవి.

మే లో!

# మా పొత్తు

పొత్తు పెక్కు తెఱంగులు. ఒక కంచమున తినుటవలన ఏర్పడిన పొత్తు కంచపుపొత్తు. ఒక మంచమున పండుకొనుటవలని పొత్తు మంచపు పొత్తు. ఇట్లే తక్కిన పనులవలన సైతము పొత్తేర్పడును. వానిలో ఒకటి కొలువుపొత్తు; అదియు పలు తెఱంగులు. శ్రీ అయ్యంకి వేంకట రమణయ్యపంతులుగారికిని, నాకును కలిగిన పొత్తు పొత్తపుగుడి కొలువుపొత్తు; అది బెజవాడలో ఉండెడి ఆయనకును విశాఖపట్టణమున ఉండెడి నాకును, అడవి ఉసిరికకాయకు - కడలి ఉప్పుతో వలె చేకూరినది. ఆలుబిడ్డలు మొదలగువారితోడి పొత్తు తొలిపుట్టుకలలోని పొత్తునుబట్టి వచ్చునందురు. మా పొత్తుసైత మట్టి దనియే అననగు.

౧౯౧౪ లో బెజవాడలో రెండవ ఆంధ్రమహాసభ జరిగె; దానికి నేను విశాఖపట్టణము నుండి ప్రతినిధిగా వచ్చితిని. అప్పుడే ఆంధ్రదేశ-గ్రంథాలయసంఘము వేంకట రమణయ్యపంతులుగారేర్పఱిచిరి; అందు నేను సభ్యుఁడను, ఆయన కార్యదర్శి. కాన, మాకు పరిచయ మయ్యె; అదే మా పొత్తు విత్తనము. అపు డాయన నిండుజవ్వనపుటగ్గలి పొంగి పొరలుచుండె; మేనిసొరును దానితో తులఁదూఁగుచుండె. అవి రెండును ఎవరి యెడఁద, కనుఁగవలను తివియనోపవు? అందు రెండవది నా కనుఁగవను తివిచెనో లేదో ఇపుడు తెలుపఁజాల. కాని, మొదటిదగు అగ్గలిక - ఉత్సాహము- నా మానసమును తనవైపు తివిచి, తా నందు నాటుకొని దానిని కరఁగింపఁగలిగె ననవచ్చు. అట్టిచో మా పొత్తువిత్తనము పదనుకొనె నని వేఱే నుడువనేల?

పిదప, పంతులుగారు గ్రంథాలయసర్వస్వము ప్రకటింప మొదలిడి నాకొక సంచిక పంపుచుండిరి. అపుడు మాకు ఉత్తరప్రత్యుత్తరములు జరుగఁ దొడఁగినవి. ఆయన కోర, ఒకటి రెండు వ్యాసములు వ్రాసి పంపితి. అందుచే పదనుకొనిన మా పొత్తువిత్తనము మొలకెత్తి నానాఁటికి పెంపొందె.

౧౯౧౬ లో నా మిత్రులగు మహారాజశ్రీ భూపతిరాజుగారు మద్రాసు శాసనసభకు భూస్వాముల పక్షమున అభ్యర్థిగా ఉండిరి. ఆయనకు ప్రత్యభ్యర్థి కీ. శే. కాటమురెడ్డి ఆదినారాయణరెడ్డిగారు, ఆయన నెల్లూరుజిల్లాలోని అల్లూరివారు. కాన, రాజుగారి విజయముకొఱకు పనిచేయ నేను నెల్లూరిలో మకాముచేసికొని యుంటిని. అపుడు పంతులుగారు మూఁడవ ఆంధ్రదేశగ్రంథాలయ మహాసభ అచట జరిపింప వచ్చిరి. అందువలన మే మిరువురమును ఒకచోట జేరి మాటలాడుకొనుటకు వీలు కలిగె. అపుడు నేను గ్రంథాలయోద్యమములో శ్రద్ధవహించి పనిచేయుచున్నందులకు ఆయనను అభినందించి, అంతటితో ఊరకుండక, "కాయకష్ట మెంతేని పడుఁడు; దీనికొఱకు డబ్బు మాత్రము హెచ్చుగా వెచ్చింపవలదు. ఏమందు రేని, హెచ్చుడబ్బు వెచ్చించుటవలన ఒకప్పుడు చేతిలో డబ్బులేకపోవచ్చును; అప్పుడు మీకు ఉద్యమమునందు విముఖత కలుగవచ్చును." అని హితోపదేశ మొనరించితిని. కాని, ఆయన దాని ననుసరించి నడచినటు

కానరాదు. అయినను, ఆయనకు ఉద్యమమందు విముఖత ఎంతమాత్రము కలుగదయ్యె. అది దైవానుగ్రహబల మనక తప్పదు. నా హితోపదేశము వినునపుడు ఆయన మొగము చిఱునగవు వెన్నెలవెలుఁగుతో వెలయుచుండె. ఆ వెలుఁగే నోటిమాటలకంటె వేయిరెట్లు హెచ్చుగా ఆయన కార్యదీక్షను చాటించి నా డెందమును అలరించి కడుంగడు కరఁగించె ననవచ్చు. అందువలన అప్పటికి పెంపొందుచున్న మా పొత్తుయొక్క బాగుగా వేరుతన్నె ననుటకు వెనుదీయ నక్కఱలేదు. దానికి తార్కాణముగా మహాసభలో ఏదో విషయమును గూర్చి చర్చ జరిగినపుడు నే నాయన చెప్పినదానిని సమర్థించుచు మాటలాడితి నని జ్ఞాపకము.

పిమ్మట ౧౯౧౭ లో విశాఖపట్టణమున ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభ జరుప పంతులుగారు ప్రోత్సహింప నే నియ్యకొంటిని. దానంజేసి మే మిరువురము కలసి పనిచేయుట తటస్థించె. దాని వలన మా పొత్తుయొక్క మ్రానుకట్టి, తొలికాపు కాచినది. అపుడు మా మతు లెట్టు లలరినవో, మా కొండొరులయెడ గౌరవభావ మెంత హెచ్చినదో చదువరులే గుర్తింప నగు.

౧౯౨౦ లో పంతులుగారు హెచ్చరిక చేయఁగా నా విశాఖపట్టణముజిల్లా గ్రంథాలయోద్యమాభిమానులును, నేనును కడంగి విశాఖపట్టణముజిల్లా గ్రంథాలయసంఘ మేర్పఱిచితిమి. హెచ్చరిక చేయుటలో పంతులుగారికిఁ గల నేర్పును, విసుగుదల లేమియు మెప్పునకు అందరాని పండ్లు.

ఇట్లు ౧౯౧౪ లో దైవికముగా పడిన మా పొత్తువిత్తనము తొలుతనే సరిగా పదనుకొని నానాఁటికి మొలకెత్తి పెరిఁగి, ౧౯౨౦ నాఁటికి మెలఁకువతో పెంపఁగా మ్రానై ఫలింపఁ దొడఁగె. ఆ యేఁడు డిసెంబరులో నాగపురమున కాంగ్రెసు జరిగిన పిదప నేను విశాఖపట్టణముజిల్లా కాంగ్రెసు పనిలో హెచ్చుగా మునిఁగియున్నను, వీలగునపుడు గ్రంథాలయోద్యమపు పనిచేయుచునే ఉంటిని. పంతులుగారు తమ గ్రంథాలయ సర్వస్వము నాకు పంపుచునే ఉండిరి. అందుచే మా పొత్తు మ్రానై నిలిచియుండె. తగినంత దోహదము లభింపమిచే సరిగా ఫలింపకపోయె.

౧౯౩౪ లో మాతండ్రిగారికి జబ్బుచేసినపుడు నే నాయనను చూడ కనకవల్లికి వచ్చి, తిరిగి ఎలమంచిలికి వెళ్లుచు బెజవాడలో ఆగితిని. అపుడు పంతులుగారు కనఁబడిరి. మాటలాడుటలో ఆయన నన్ను ఆంధ్రదేశగ్రంథాలయ సంఘమునకు అధ్యక్షునిగా ఎన్నుకొనఁజేయు తలంపు తెలుప, నేను బెజవాడలో ఉండినఁగాని, ఆ పదవి కైకొనుట కీయకొనఁజాలనని తెలిపితిని. ఆయన కా తలం పేలకలిగెనో కాని, మాపొత్తుకూడ దానికి కారణము కాకపోదు.

౧౯౩౬ లో జరగిన ఆంధ్రదేశగ్రంథాలయ మహాసభకు నేను వెళ్ళఁజాలకపోయినను, అందు పంతులుగారు నాకు కొంతపెద్దఱికమిప్పించిరి. ఆ సంవత్సరము జూనులో నేను ఖద్దరు సంస్థానము వారి ఆహ్వానము ననుసరించి బెజవాడలో ఉండి వారికికొంత సాయము చేయుచు, వృద్ధులగు మాతండ్రిగారి సేవచేయుటకు కుటుంబముతో వచ్చితిని. కాన, పంతులుగారును నేనును పలుమాఱు మాటలాడుకొన వీలుచేకూరె. ఆయన ఆగస్టులో ఆంధ్రదేశ గ్రంథాలయసంఘ కార్యనిర్వాహకవర్గమునకు నన్ను అధ్యక్షునిగా ఎన్నుకొనఁజేసిరి. అప్పటికి గ్రంథాలయసర్వస్వమునకు పైసంఘా

ధ్యక్ష కార్యదక్షులగు శ్రీగాడిచెర్ల హరిసర్వోత్తమరావుగారును, పంతులుగారును సంపాదకులుగా ఉండిరి. వారితోపాటు నన్నుకూడ సంపాదకునిగా చేర్చుకొనిరి. మేము కొన్ని నెలలా పత్రికపని జరిపితిమి. అదిగాక, భీమవరము తాలూకాలో రెండుసార్లును, తాడేపల్లిగూడెం తాలూకాలో ఒకసారియు గ్రంథాలయయాత్రలు జేసితిమి. గ్రామగ్రంథాలయ వార్షికోత్సవములలోను, తాలూకా జిల్లా గ్రంథాలయ మహాసభలలోను, పంతులుగారును నేనును పాల్గొంటిమి. అందు వలన మా పొత్తుతీయమామిడిచెట్టు బాగుగా బలిసి, పూచి, కాసి, వాసికాంచె. అపుడు పంతులు గారి ధీరత్వము - దాతృత్వము - ఉచితజ్ఞత - ప్రియవక్తృత్వము మొదలగు సుగుణములు తేట తెల్లములయ్యె.

౧౯౩౬ జూన్ నుండి ౧౯౩౭ జూలై వఱకును నేను బెజవాడలో ఉంటిని. నానాటికి పంతులు గారికి తక్కిన పనులతొందర హెచ్చుగుటచే గ్రంథాలయోద్యమ పనిచేయుటకు అవకాశము తగ్గి నది. అందుచే సుమారు ౨౫ ఏండ్లు ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘమునకు కార్యదర్శిగా ఉండి - నిరంతరసేవజేసిన పంతులుగారికి విశ్రాంతి ఆవశ్యక మనియు, గ్రంథాలయోద్యమాభిమాని అగు ఒక యువకుని కార్యదర్శిగా ఎన్నుకొనుట మంచి దనియు నాకు తట్టినది. ఆ విషయమునుగూర్చి నేమిరువురమును మాటలాడుకొంటిమి. నా అభిప్రాయమున కాయన అంగీకరించిరి. దానినిబట్టి మా పొత్తెట్టిదో తెలిసికొనవచ్చును. మా యిద్దఱయిష్టముమీఁదనే శ్రీపాతూరి నాగభూషణము గారిని కార్యదర్శిగా ఎన్నుకొంటిమి.

౧౯౩౮ లో మా తండ్రిగారి సేవ ముగిసె. ౧౯౩౯ జూనులో నేను బెజవాడనుండి విశాఖపట్ట ణము జిల్లాకు మఱల వెడలిపోతిని.

౧౯౪౦ లో పంతులుగారు తమ మూఁడవ కుమారుని వివాహమునకు టెలిగ్రామిచ్చి రప్పించిరి. అందు తాము కృతిపతి అగుటకు జరపిన సభకు నన్నధ్యక్షునిగా చేసి, నాకు నూతనవస్త్రము లొసంగి, బహూకరించి, నేనే తమ శ్రేయస్సు హెచ్చుగా కోరువాఁడ నని తెలిపిరి. దీనినిబట్టి మాది ఎట్టి గట్టిపొత్తో వెల్లడి అగును.

౧౯౪౧ జనవరిలో శ్రీనాళము కృష్ణారావుగారి షష్టిపూర్తిమహోత్సవసమయమున రాజమహేంద్ర వరములో ఆంధ్రదేశ గ్రంథాలయ సభ జరుప నిశ్చయమయ్యె. దానికి నన్నే అధ్యక్షునిగా ఎన్ను కొనునట్లు చేయుసంకల్పము పంతులుగారికి కలిగిన దఁట. శ్రీనాగభూషణముగారు కోరిన యిరు వురును తాము రాజాల మనుటచే పంతులుగారి సంకల్పమే నెఱవేఱినది. ఇది మా యిద్దఱపొత్తు పస వేనోళ్ల చాటుటలేదా? దానికి తార్కాణ ఇంతకంటె మఱేమికావలె.

నవంబరులో ఆంధ్రమహాసభకు ప్రతినిధిగావచ్చి, సన్మానసంఘకార్యదర్శిగా ఉండిన నాకు, కొంత వఱకు తోడ్పడిరి. నియమావళిచర్యలో మే మిరువురమును పాల్గొంటిమి. ఇపుడుకూడ మేము ఆంధ్రమహాసభ పని కలసిచేయుచున్నాము. ఇదియు మా పొత్తుబలిమిని తెలుపుచునే ఉన్నది. ఈపట్టున పంతులుగారాంధ్రమహాసభోద్ధారకులలో ఒకరని తెలుపనగు.

౧౯౪౨ లో కొన్ని నెలలకిందట గ్రంథాలయప్రెస్సులో మేమిద్దఱము మాటలాడుకొనుటలో పంతులుగారు నన్ను బెజవాడలో దింపఁగోర, నేనిచట అద్దెయింట నుండఁజాలననియు, విశాఖపట్టణముజిల్లా బొత్తిగా వదల వీలుకాదనియు తెలిపితి. దానిమీఁద ఆయన నాకు తాత్కాలికముగా బస ఏర్పాటు చేయునట్లును, పిదప సొంత యిల్లేర్పఱుచుటకుకూడ ప్రయత్నించునట్లును తెలిపిరి. నాయం దిట్టిసద్భావము పంతులుగారికి కలిగించినది మా పొత్తుబలిమియే అని తలంచుట తప్పుకానేరదు. ఇది ఆయనకున్న పరోపకారపరాయణత్వ గుణమునుకూడ వెల్లడించును.

ది 13-12-42 తేదిని జరుగఁబోవు ఆంధ్రదేశగ్రంథాలయ సేవకమహాసభలో పంతులుగారు గ్రంథాలయోద్యమమున కొనర్చిన అమూల్యసేవను గుర్తించి, గౌరవచిహ్నముగ ఆయనకు సన్మానవ్యాససంపుటములను ఆంగ్లమున ఒకటియు, ఆంధ్రమున ఒకటియు సమర్పింప తీర్మానించుటచే నన్నొకవ్యాసము వ్రాయవలెనని సంపాదకసంఘకార్యదర్శి అగు శ్రీ మందలపర్తి ఉపేంద్రశర్మగారు కోరిరి. వ్యాసమేకాక మా పొత్తునుగూర్చికూడ వ్రాయనగు ననుకొంటి కాని అట్టి కోరిక నాకు వచ్చిన జాబులో లేమింజేసి, మా పొత్తునుగూర్చి వ్రాయ మొదలిడియు మానివేసితిని. అయినను దైవికముగా ది 24-10-42 తేదిని వ్రాసిన జాబులో శర్మగారు పరిచయవాక్యములుకూడ వ్రాయఁగోరిరి. అదిచూచి నా సంకల్పము వ్యర్థము కాలేదని సంతసించి, 'మా పొత్తు' వ్రాసితి. గట్టితలంపు గొడ్డుపోదనుటకు ఇది మంచి తార్కాణ.

పైని మా పొత్తునుగూర్చి తెలుపుటలో పంతులుగారి సుగుణములు - ఉత్సాహము - కార్యదీక్ష మొదలగునవి- తెలుపవలసివచ్చె. సుగుణములు గౌరవకారణములు. అయినను, సుగుణవంతులకందఱకును గొప్ప సన్మానములు జరుగవు. వానికి అర్హులు మహాపురుషులే. మహాపురుషులకు అదృష్టము దైవానుగ్రహమువలన కలుగవలె; అది మఱొకతెఱంగున లభింపదు. ఎల్లప్పేఁడు ఒక్కొక గొప్ప పనిచేయుటకు ఒక్కొకరిని తన పనిముట్టుగా కైకొను. కాన, వారేగొప్పపనులు చేయఁగలరు? పైవారు చేయఁజాలరు గొప్పపనులు చేయువారినే మహాపురుషు లందురు. వారు తాము చేయ పూనుకొనిన పనికొఱకు స్వార్థత్యాగము చేయుటకుఁగాని, ఎట్టిపాట్లయినను పడుటకుఁగాని జంకరు. బాలగంగాధరతిలకు, గోఖలే, అధ్యక్ష పటేలు, గాంధి, నెహ్రూ, అజదు మొదలగువారు స్వరాజ్యోద్యమముకొఱకు స్వార్థత్యాగ మొనర్చి, పలుపాట్లుపడి, మహాపురుషు లయిరి. వారికి ఏవో లోపము లున్నను వారుచేసిన గొప్ప దేశసేవనుబట్టి వానిని లెక్కింపరు.

మనది బానిసదేశ మగుటచే స్వరాజ్యోద్యమము మనకు ముఖ్యమైనది. స్వతంత్రదేశములలో గ్రంథాలయోద్యమము, మాతృభాషోద్యమము మొదలగునవి ముఖ్యములు. భరతఖండము గొప్ప దేశ మగుటచే ఇచట రాష్ట్రోద్యమముకూడ ముఖ్యమే. ఒక్కొక ఉద్యమమునకు ఒక్కొకరు నాయకు లగుట తప్పదు.

ఆంధ్రదేశమున గ్రంథాలయోద్యమము ఆంధ్రోద్యమమునకు ముందే బయలుదేఱినది. అది మొదట వ్యక్తిప్రధానముగానుండి పిదప సంఘప్రధాన మయ్యె. వ్యక్తిప్రధాన గ్రంథాలయో

ద్యమములో పితామహ బిరుదమునకు కీ. శే. మంతిన ఆదినారాయణమూర్తి పంతులుగారు పాత్రులైరి. సంఘప్రధాన గ్రంథాలయోద్యమములో పితామహ బిరుదమునకు శ్రీ అయ్యంకి వేంకటరమణయ్య పంతులుగారు పాత్రులైరి. ఆయన విశ్వకళాపరిషత్పట్టభద్రులు గాకున్నను, గ్రంథాలయోద్యమ మహాసేవా సామ్రాజ్య పట్టభద్రులు కాఁజాలిరి. గ్రంథాలయసేవలో ఆంధ్రదేశముననే కాక బ్రిటిషిండియాలోకూడ పంతులుగారే ప్రథమగణ్యులు. పంతులుగారి గొప్పసేవను గుర్తించియే ఆంధ్రలోకము "గ్రంథాలయశాస్త్ర విశారద", "గ్రంథాలయోద్ధారక" బిరుదము లొసంగి ఆయనను గౌరవించినది. ఇపుడు ఆంధ్రదేశ గ్రంథాలయసేవక సంఘము వారు పంతులుగారు చేసిన అమూల్యసేవను గుర్తించి, ఆయనకు సన్మానవ్యాససంపుటము తమ మహాసభలో సమర్పించి, తమ ధర్మ మాచరించి, తమ నాయకుని సన్మానించి, ధన్యులగుచున్నారు. నా నెయ్యురగు శ్రీ అయ్యంకి వేంకట రమణయ్య పంతులుగారికి ఆయురారోగ్యైశ్వర్యము లొసంగి, ఆయనచే ఆంధ్రోద్యమ గ్రంథాలయోద్యమాదులందు హెచ్చుసేవ చేయించి, ఆయనకు ఇప్పటి కంటె హెచ్చుసన్మానము పొందుపాత్రత అనుగ్రహించి, ఆయనను సర్వేశ్వరుఁడు సర్వదా ప్రోచి, కాచుఁగాక !

మారేపల్లి రామచంద్రశాస్త్రి.
తోడి గ్రంథాలయ సేవకుడు.

శ్రీ

# అయ్యంకి వారు

అయ్యంకి వారనిన చాలును. వేంకట రమణయ్యపేరు వేరుగ వ్రాయనక్కరలేదు. వ్యక్తినిబట్టి యింటిపేరునకే ఘనత, ఎఱ్ఱాప్రగ్గడ; అల్లసాని చేమకూరవలె; ఇట్లే అయ్యంకి కూడా వేంకట రమణయ్యనుబట్టి అయ్యంకి అమృతమయములైన అక్షరములైనవి. అయ్యంకి ధన్యజీవుడు.

అయ్యంకి పెద్ద చదువరికాడు. విశేషధనవంతుడుకాడు. క్రిందుమీదు చేయగల చతురుడుగాడు. కవిగాని శిల్పిగాని కాడు. గంభీరోపన్యాసకుడుకాడు. కావెళ్లకొంది గ్రంథముల రచించిన యుత్కృష్ట గ్రంథకర్తకాడు. అయిన ... ... ...

అయ్యంకి నిరాడంబరజీవి. ఉత్సాహపూరితుడు. పట్టుదల కార్యదీక్ష నిరుపమానములు. సేవాపరాయణత్వమే జీవితాదర్శము. గీతారహస్యమెరిగిన నిష్కామ కర్మయోగి. వివిధ మార్గములలో వివిధ విషయములలో చేసినసేవ అతీతము, అపారము, గ్రంథాలయోద్యమము వయోజనవిద్య ప్రకృతి చికిత్సా విధానము బాలభటోద్యమము ఇతని పట్టుగొమ్మలు. ఈ యుద్యమములబట్టి అయ్యంకికో అయ్యంకినిబట్టి యీ యుద్యమములకో ఘనతవచ్చినది. అయ్యంకి యీ యుద్యమములకు అవినాభావ సంబంధ మేర్పడినది.

గ్రంథాలయోద్యమ ప్రచారం అయ్యంకికి తెలిసినట్లు ఇతరులకు తెలియదు. అతని ప్రోత్సాహ ముపార మెరుగదు. అనాహుతుడయ్యు అభ్యాగతుడై గ్రంథాలయ సభకు జయము చేకూర్చెడు వాడు. రాజకీయ; మత; సాంఘిక; చారిత్రాత్మక; సభలలో నుపాంగముగా గ్రంథాలయసభ

నేర్పాటుగావించి తుదకు దిగ్విజయము గ్రంథాలయసభకే ఆర్జించెడువాడు. ఈ యుద్యమమునకై విశేషధనమును వెచ్చించి ముద్రణాలయమును బెట్టి పేదలకు నిరుద్యోగులకు జీవితాధారమును నేర్పాటుగావించి; తన్మూలమున భాషాసేవ, గ్రంథాలయోద్యమసేవ, చేయుచుండెడివాడు. తన యుద్యమ వ్యాప్తికై యితరుల నాశ్రయింప నక్కరలేకుండ తన గ్రంథాలయ ప్రెస్సునందు గ్రంథాలయ సర్వస్వము అను పేరిట నొక చక్కని మాసపత్రికను వెలువఱచి తద్వారమున వివిధ దేశములలోని గ్రంథాలయములెట్టి యభివృద్ధిలో నున్నవో, ఆంధ్రదేశమున నే మారుమూల నే గ్రంథాలయము స్థాపింపబడినదో, దానికి కార్యనిర్వాహకవర్గ మెవరో మొదలగు గ్రంథాలయ విషయములన్నియు చక్కగ ముద్రింపించి ప్రచురించుచుండెడివాడు.

చేయిజాపుట యెరుగని గ్రంథాలయ ప్రచారకుల సంభావన బ్రాహ్మణులుగ తారుమారు జేసినది అయ్యంకియే. పూజాపునస్కారము లెరుగక బూజెక్కిన జీర్ణాలయముల గ్రంథాలయములుగ తారుమారుచేసినది అయ్యంకియే. అశక్తత అహంకారములతో నిబిడీకృతులైన పల్లెటూరి వారికి శక్తి సేవాపరాయణత్వముల నలవఱచి గ్రంథాలయ స్థాపకులుగ తారుమారుజేసినది అయ్యంకియే ప్రతిగ్రామము నుండియు నొక్క యువకుని బయటకులాగి వానిచే గ్రంథాలయసేవ చేయించి వానినే దేశసేవకునిగ తారుమారు చేయింప గలిగినది అయ్యంకియే. సత్యాగ్రహోద్యమములో చెరసాలల కరిగి త్యాగశీలురైనవారు ఒక్కనాడు ఏ గ్రంథాలయమునకో కార్యదర్శియై ప్రజా సేవ చేయుట యలవఱచుకొనినవారే నూటికి తొంబదివంతులు. ఆంధ్రదేశములో స్వీయమును మఱపించు సేవచేయింపించినది ఒక్క అయ్యంకి అని చెప్పక తప్పదు.

రామాలయము లేని గ్రామ మున్నది గాని గ్రంథాలయము లేని గ్రామము లేదనిపించినవాడు అయ్యంకి. సభ యన నేమో తెలియనివారిచే గ్రంథాలయసభల స్థాపింపజేసినవాడు అయ్యంకి. బొడ్డున మూటగట్టుటే గాని విప్పుట యెరుగని పరమలుబ్ధాగ్రేసర చక్రవర్తుల నుండి గ్రంథాలయములకు నిధిని వసూలుచేయగలిగినది అయ్యంకియే. అక్షరాస్యునకు ప్రయోజనవిద్యావిధానమున చదువరిగ చేసినవాడు అయ్యంకి. పదచలన మెరుగనివారిచే సంచారగ్రంథాలయముల నెలకొల్పి వారిని గ్రామగ్రామములకు త్రిప్పగలిగినవాడు అయ్యంకి. పూర్వపు జైత్రయాత్రల వలె గ్రంథాలయ యాత్రల గల్పించినవాడు కూడ ఒక్క అయ్యంకియే. "గ్రంథాలయవార" మను నొక వారమును గల్పించి ఆ దినములలో ఒక సంఘమును నేర్పాటు గావించి వారి నందరను గ్రామ గ్రామములకు ద్రిప్పి త్రిప్పినచోట్ల నెల్ల గ్రంథాలయముల స్థాపించి గ్రంథాలయవారమును జయప్రదముగ కొనసాగింపజేయగల్గినవాడు అయ్యంకియే.

పశ్చిమగోదావరిజిల్లాలో నేర్పాటు గావింపబడిన నొక గ్రంథాలయ జైత్రయాత్రా ప్రారంభోత్సవమునకు నన్నధ్యక్షునిగ రావించి సూర్యాస్తమయము లోపున నాల్గు గ్రామములకు త్రిప్పి ఉపన్యాసముల గావింపించి రాత్రి వృథపోవుట యెందులకని మ్యాజికులాంతరు ఉపన్యాసముల నేర్పాటు గావించి గ్రంథాలయోద్యమ ప్రచారకులకు విరామము లేకుండ పని గల్పించగలిగినవాడు ఒక్క అయ్యంకియే.

ఊలపాటలు - జోలపాటలు - ఎంకిపాటలు మొదలగుపాటలతో బొబ్బిలి - బాలనాగమ్మ వంటి పదములతో గొల్లకలాపము - భామకలాపము తోలుబొమ్మలు మొదలగు వీధినాటకములతో - ప్రహసనములు - ప్రబంధములు రూపకములే గాక సినీమాలు నాటకములు మొదలగు వివిధ వాఙ్మయాదులచే గ్రంథాలయోద్యమాభివృద్ధిని చేయవలెనని బహువిధ అభ్యుదయమార్గముల సూచించి బోధించినది అయ్యంకియే.

వివిధగ్రామములనుండి గ్రంథాలయసేవకుల రావించి గ్రామగ్రామములకు త్రిప్పి మహోప న్యాసముల గావింపించి వెంటనే గ్రామమందలి జీర్ణగ్రంథముల నుద్ధరించి నిధి నేర్పాటుగావించి కార్యనిర్వాహక వర్గమును సమకూర్పజేసి గ్రంథాలయమును వెంటనే స్థాపింపజేయగలిగినవాడు అయ్యంకియే. అట్టివాడు అయ్యంకి. అందుచేత ... వివిధ కుగ్రామములలో చదువువారు వ్రాయు వారు లేక యక్షరజ్ఞానశూన్యులై విద్యాగంధమెరుగని జనసామాన్యమునకు వయోజన విద్యావిధాన మున అక్షరముల నేర్పించి; పత్రికాపఠనమునందాస గొల్పించి చదువరులుగజేసిన అయ్యంకి పెద్ద చదువరి కాకపోయినను లోపము లేదు.

భరతఖండములోని వివిధరాష్ట్రములలో గావింపబడిన గ్రంథాలయ మహాసభలకెల్ల పరధన సహాయమునకై యాశింపక పోయివచ్చి యచ్చటివిశేషములనెల్ల తన గ్రంథాలయ సర్వస్వము ద్వారముగా నాంధ్రలోకమునకు విరామము లేకుండగ నందజేయుటకై నొకపెద్ద ముద్రణాలయ మునే నెలకొల్పి దేశసేవచేయుచున్న అయ్యంకి విశేషధనవంతుడు కాకపోయినను లోపము లేదు. జీవితమునందు ముప్పదిసంవత్సరము లేకకార్యనిర్వహణ దీక్షాదక్షతగల్గి నిగ్రహించి సేవాపరాయ ణత్వమే జీవితాదర్శమని నిరూపింపగలిగిన అయ్యంకి క్రిందుమీదుచేయగల చతురుడు కాకపోయి నను లోపము లేదు.

అయ్యంకికి గ్రంథాలయోద్యమము గ్రంథాలయోద్యమమునకు అయ్యంకి వంటి సేవకుడును దొర కుట ఆంధ్రుల అదృష్టము. ఇది గుర్తించిరి ఆంధ్రులు అభినందించిరి. ఆశీర్వదించిరి. ఇతనికి అమ రత్వముకోఱకు అయ్యంకిని అభినందించు అదృష్టము ఆంధ్రులకే లభించుటకూడ నొక వింతయందు రేమో అదికాదు.

భరతఖండములోని వివిధరాష్ట్రములకు నాయకుడొక్కడు తదితరులు అనుచరులే. ఆంధ్రరాష్ట్ర మున కది వ్యతిరేకము. ఇట్లు అందరు నాయకులే. వారి కనుచరులుమాత్రము లేరు. ఇదే ఆంధ్ర రాష్ట్ర సమస్య. నాయకులకు అనుచరులకు భేదమెరుగనిదే ఆంధ్రరాష్ట్రమని నిర్వచనము. అయ్యంకి అట్టి నాయకుడుకాడు. గత ముప్పది సంవత్సరములనుండియు నొకేరీతి సపార సేవచేసి యీ యుద్యమమును జయప్రదముగ నడపగలిగినవాడు ఒక్క అయ్యంకియే. అందులకే యాతడేకైకనాయకుడైనాడు. మిగిలినవారెల్ల తదనుచరులు ప్రోత్సాహకర్తలునై యుండిరి. ఆంధ్రదేశ మీనాయకుని విషయములో తన ఆంధ్రత్వమును మఱచి యుండవచ్చును.

కోటమర్తి చిన రఘుపతి, కాకినాడ

# గురుపీఠము

## (అష్టదళ సమర్పణము)

1. ఆతఁడొక శకపురుషుఁడు:—

ఆంధ్రదేశ గ్రంథాలయ శకమునకు మూలవిరాట్టయి, ప్రాచీనభారతవర్ష సాంప్రదాయముల కొరిపిడిరాయియై, గ్రంథాలయ సారూప్యసంసిద్ధికి ఆచార్యస్థానమును హావణించుకొని, రాణిల్లు శకపూరుషుఁడైనవాడు.

2. ఆతఁడొక నిర్వాహక శిరోమణి:—

సహజనవోత్సాహపటిమ, సమధిక కార్యదీక్షా సంరంభము, విశ్వవిజ్ఞాన నిరతి, కరడు కట్టుకొని తెనుగుగడ్డకు దొడ్డకీర్తుల నార్జించి కన్నతల్లి ఋణవిముక్తికై దారితెన్ను లెన్నుకొనిన నిర్వాహక శిరోమణియైనవాడు.

3. ఆతఁడొక విజయుఁడు:—

ఆంధ్రగ్రంథాలయ మహోద్యమస్యందనమునకు సారథియై, సారస్వతక్షేత్రమున బాంచజన్యమును బూరించుచు, ఆంధ్రవైజ్ఞానికాంబరమునకు వేగుచుక్కయి, ధర్మక్షేత్రమగు విజయవాడ కొడయుఁడై, చిడిముడిపాటెఱుంగని జీవితమాధుర్యమును ఇవతాళించుకొనుచు కీర్తిచంద్రికలను బుక్కిలింతలిడి కమ్రనాదమున దేవదత్తమును బూరించు విజయుఁడైనవాఁడు.

4. ఆతఁడొక గ్రంథాలయవిధాత:—

ఆ అనిర్వచనీయ సంకల్పసిద్ధి, ఆ అత్యద్భుత కార్యకౌశలము, ఆ గురుగుణసమన్విత మహామహిమోపేతమా బద్ధదీక్ష, ఆ నిరుపమాన సారస్వతోపాసనాసంసిద్ధి, అగణిత గ్రంథ సంహితలకు శుభప్రారంభము లొనగూర్చుటతో ఆంధ్రగ్రంథాలయ విధాతయైనవాడు.

5. ఆతఁడొక గ్రంథాలయోద్యమ భీష్ముఁడు:—

నిరంతర భాషాపరిశ్రమ, కార్యదీక్షాదక్షత్వము - జాగరణ - సేవాపరాయణత, శివ తాండవకేళియొనరించి, జాతీయోజ్జీవిత సమస్యకు మేలుబంతియై, అఖిలభారత గ్రంథాలయ పీఠమునకు, ఆంధ్రనిర్మాణశక్తిని అంగరక్షగ సేకూరిచి భారతావనికి గురుపీఠమును ప్రసాదించిన అభినవభీష్మాచార్యుఁడైనవాడు.

6. ఆతఁడొక దేశసేవావ్రతి:—

ఆబాల్యప్రవర్ధమానముగ తనలో దొలకరించిన భాషాపులకాంకురములకు నర్థసంపదల బొదలు బోదులు త్రవ్వి, భావములకిమ్మగు పాదుల బాదుకొనదికి, పదను సెడి శయ్యాబిరుసువారకుండ రసవృష్టుల బుష్టి యొనరించి భాషామతల్లిని సాక్షాత్కరింపజేసికొనిన సారస్వతోపాసకుడు భాషాసేవతోపాటు దేశసేవను లగించి కార్యదీక్షతో బిగియించి కార్యసాధకుడైన శిస్తుగల

ప్రశస్తపథమునం దవిరతముగ సంచరించు సచ్ఛరిత్రము గలవాడు. అసమాన తేజో విరాజితుడు.

7 అతడొక స్థితప్రజ్ఞుడు–

సంసార వలయమందును సమాజ వలయమందును నైమిత్తికముగ సంప్రాప్తములగు సుఖదుఃఖములను కష్టనిష్ఠురములను సమభావముతో స్వీకరించుచు నిష్కామ కర్మయోగము యొక్క పరాకోటిని స్పృశించిన ధీశాలి యతడు–

8 అతడచ్చమైన యాంధ్రపుత్రుడు–

భారతచరిత్ర పుటలందే కాదు – ప్రపంచచరిత్ర పుటలందును – సువర్ణాక్షరములతో లిఖింప దగిన నామ మతనిది. ఒక మహాదర్శమునకు తనయావజ్జీవితము నంకితముగావించి యనవరతకార్య దీక్షా తత్పరుడై సిద్ధసంకల్పుడై యువకలోకమున కొక ధ్రువ తారగ నిలిచియుండు ప్రతిభాశాలి యతడు.

ఒక మిత్రుడు.

---

# "గురువు శిష్యుడాయె, శిష్యుడు గురువాయె"

అన్నట్లు అయింది నాకును మారమణయ్యగారికిని సంబంధం. బాలభటోద్యమంలో శిష్యుడుగా పాల్గొనవచ్చిన వ్యక్తి; నిదముగా తరువాత నాకు గురువుగా పరిణమించి వారివద్ద నెన్నియో నేర్చుకొన గల్గుదునని నాకు కలలోనైనతోచియుండ లేదు. ఇట్టియదృష్టము కొంతమందికిలభించినదో.

...... సం॥లో బెజవాడవద్ద వల్లూరుపాలెంలో ప్రథమ ఆంధ్ర బాలభటోపాధ్యాయ శిక్షణ శిబిరము నేర్పరచినపుడు వీరితో నాకుగలిగిన పరిచయము నేటివఱకు నిలిచియుండుటే గాక అతిగాఢమై నాకుగల సోదరబృందమున నగ్రగణ్యులుగ వీరిని గన్పరచినది. అట్టి నిజమిత్రులసంఖ్య బహుస్వల్పమనియే చెప్పవచ్చును. ఇట్టి భావము శ్రీ రమణయ్యగారికిని నాయందుకలదని నమ్ముటకు నాకనేకనిదర్శనములు అనుభవమున గలవు. వాటిని పేర్కొనుట గ్రంథ విస్తరణమేగాక చంద్రుని నద్దమున జూపునట్లే యగును.

పేరుప్రతిష్ఠల నాశించక అనామకునివలె సామాన్య వేషముతో సంచరించుచు దేశమునకు సేవచేయు నాయకులలో వీరొకరని నుడివిన నతిశయోక్తి గానేరదు. అందువలననే గావచ్చు మనయాంధ్ర ప్రముఖు లనేకుల జీవితచరిత్రలుండ శ్రీ వేంకటరమణయ్య పంతులుగారి Commemoration Volume ప్రకటించు ప్రయత్నము సఫలమగుటయే నిందులకు దార్కాణము. ఇది దేశసేవకులందరకు నొక గొప్పగుణపాఠము నేర్పినది. పనియుద్యమములందు చేయిపెట్టి ఏదియు పూర్తిగా నడుపక నామప్రతిష్ఠలే యెక్కుడుగ నెంచువారి శ్రమ వృధాయనియు దైవము తనకొసంగిన శక్తిసామర్థ్యములతో నేదోయొక కార్యమునందు లగ్నులై "ఉడుతాభక్తిగ" నొనరించు కృషియే తుదకు రాణించునని వీరిజీవితము చాటుచున్నది. శ్రీ రమణయ్యగారు నాయకులుగగాని ఉద్యోగులుగగాని సభ్యులుగ గానియున్న ఉద్యమము లన్నిటినిట పేర్కొనుట నాపనికాదు. అట్టి సామర్థ్యము

గాని స్వానుభవముగాని నాకు లేదు. ప్రపంచమున నెల్ల బాలుర యభివృద్ధికొఱకు నేటివఱకు నడుప బడుచున్న యుద్యమములలో సాటిలేనియీ Scout Movement నందు వారుచేసినసేవ ప్రశంసించు టయే నాప్రథమవిధి. "Once-a Scout, always a Scout" అనుసామెత ప్రకారము "Be Prepared" అను మా ఆదర్శానుసారము వారాంధ్రదేశములో సలిపిన కృషియే వారిని శాశ్వతజీవులుగ జేసె నది. మనమెన్ని విషయములలో మనకు సాటిలేరని దురభిప్రాయ పడినను మనకు శిష్యులుగ వచ్చు వారిలోగూడ మనగురువు లుందురని కనుగొనుటయే నేను వీరియందు నేర్చుకొన్న గుణపాఠము.

నిరాడంబరులును సంతోషముఖులును విడువక చేపట్టిన కార్యమును సఫలీకృతమొనర్ప యత్నించువారు నగు నీశాశ్వతయువకుని నెరుంగుట కొక్క నిమిష సంభాషణమే చాలు. వీరిఆదర్శ గుణముల నెన్నియో నేనేగాక నాభార్యయు నితర మిత్రులును స్వానుభవముగ జూచియున్నాము. అట్టి దేశసేవకుని నామము శాశ్వతపరచుటకు, మిత్రులుచేయుయత్నము లెంతయు సఫలీకృతములయి వారిని మనయాంధ్ర దేశసేవకు చిరకాలము నుండునటుల యాయు రారోగ్య ఐశ్వర్యముల నిచ్చి కాపాడుమని భగవంతుని ప్రార్థించుచున్నాను.

శ్రీ వారణాసి వేంకట సుబ్బారావు.
(దక్షిణ) హైదరాబాదు

---

"గ్రంథాలయ శాస్త్రవిశారదులు"

శ్రీ అయ్యంకి వేంకటరమణయ్య పంతులుగారికి

## స్వాగతము

విమలశశధరచన్ద్రికావిభలయందు పూవుపూవునజేరి నత్తావిగ్రోలి
హాయిగాఁ బాడు మధుపంబునగుచు నేడు, పాడుచుంటిని నీకిదే స్వాగతమ్ము.

2

లలితటాకుల చెంగావి వలువగట్టి లలితమంజుల నూత్నపల్లవముబోలు
పాణియుగ్మమునెత్తి పుష్పాంజలిడి తన విపంచికాశ్రుతులలోన నిదినిలిపి
స్వాగతము స్వాగతమ్మని పాడుచుండె ఆంధ్రవీథుల నెల్లెడ ఆంధ్రవాణి.

3

శ్రీకరు డార్తపోషణుడు చిన్మయు డాశ్రితవత్సలుండు సు
శ్లోకు డనంతు డీశ్వరుడు శోభనరూపుడు ముక్తిదాయి ప్రే
మైకమయాత్మకుండు మునిమానస పద్మహితుండు భక్త పూ
జాకరు డీ విశారదున కాయువు భోగము లిచ్చి ప్రోవుతన్.

శ్రీ దాలిపర్తి సీతారామారావు.

శ్రీ అయ్యంకి వేంకట రమణయ్యగారికి సమర్పింపబడిన

# పద్యరత్నములు

ఉ. వాతెర విచ్చినన్ మధురవాక్కుల వర్షము, చూపులందు ని
ర్హేతుకమైన ప్రేమ, నగురింపుల నవ్వు, హితాను గుణ్యముల్
బూతపసిండి వన్నె, పొలుపుంబ్రసరించు ముఖారవిందవి
స్ఫీత వినిశ్చితాత్మయును వేంకటరణ్ణయ! చెల్లు మీకిలన్

నీచూపులందు కానాదియై రాణించు కరుణారసంబు నాకలతమాన్పు
నీనోటనుం బ్రయాణించు వాగమృతంబు నాగుండె చల్లదనంబు సేయు
నీచిత్తమందు దోబూచులాడెడి తెంపు నావంకకే చెంగనాలు దీయు
నీచేతియందు బంధితమైన ధనలక్ష్మి నను బుజ్జగించి మన్ననయు జేయు

నాకునై నాదు కావ్యకన్యక ముఖాన వెలువరింపగ బూనితి విని యొకింత
గాచిరక్షింప గదవయ్య కరుణ సాంద్ర! రమ్యగుణ ధుర్య! వేంకట రమణవర్య!

అతిదారిద్ర్య దవాగ్నితప్తులకు నవ్యాజానురాగ ప్రభా
మతి బొంగించి కటాక్ష శేవధిని సంభావించి యెన్నెన్నియో
జితరత్నాల నొసంగి పేర్గొనిన నీ శ్రేయంపు హస్తాలలో
అతి నిర్భాగ్య కవీశు భావిఫల భాగ్యం బెట్లు వర్తించునో?

ధనమే మూలమటంచు లోభులు యథార్థం బింతవోనాడి కీ
ర్తిని గీగ్రంటను చూచుచుందురు, జగద్దేశ ప్రభాభాసజీ
వన మీ రెండిట నేదిశాశ్వతముగా వర్ధిల్లునో; గొంతయో
చనచే నాకృతినందు; మోగుణవతంసా! రణ్ణభూపాలకా!

శ్రీ. జి. గోపాలరావు.

"గ్రంథాలయోద్ధారక" "గ్రంథాలయ శాస్త్రవిశారద"

## శ్రీ అయ్యంకి వేంకటరమణయ్య పంతులుగారి

సన్మానసమయమున సమర్పింపఁబడిన

# పంచరత్నములు

విశ్వగ్రంథమహార్థసారము యే విశ్వేశి తత్కచ్ఛపీ
శశ్వత్తంత్రుల సర్వవేదకలాసంగీతముల్ మ్రోయుచున్
స్వైశ్వర్యంబునఁ బొల్చు; నజ్జనని విశ్వప్రేమ దివ్యాంగి ని
త్యశ్వశ్రేయసముల్ ఘటించుత మహాయ్యంకిన్వయోత్తంసునిన్.

తొలి వేదమాత మంజుల పాదమంజీర ఘల్లులారవముతోఁ గదలి వచ్చి
విశ్వపాలన కలావేదులౌ పరమదివ్యజ్ఞానగురువచఃప్రతతి నిండి
నానామతైక్య సంధాన వైశారద్య విశ్వవైశాల్యసంవిత్తు నెఱపి
యపర ద్వాత్రింశన్మహాంధ్రరాణ్మంత్రి సత్తమమతిప్రతిభావిభాతి యగుచు
పలుక 'శాపాదపిచ శరాదపి' యటన్న వీరముని పరశ్వథధార వెలుగుచూపు
నట్టి బ్రాహ్మంబు క్షాత్రంబునైన తత్త్వమలమి వేంకటరమణుని దేల్చుఁగాక!

సృష్టికి రూపయుగ్మ మనఁ జెల్వగు నీయుభయమ్ము బరంబునన్
గష్ట మటం చొకానొకటి కాదని వీడదు రెల్లలోకులున్
దృష్ట మదృష్టమౌ పరమధీకృతి రెంటినిఁ గూడఁగట్టి సం
స్పృష్టపరాపరప్రకృతి వెల్గుచు నుందురు కర్మయోగులున్.

ఏవంవిధగుణ మణిగణ
శేవధి కయ్యంకివంశ శీతద్యుతికిన్
శ్రీవిశ్వమానవోద్ధుర
సేవానిపుణునకుఁ గార్యశిక్షారతికిన్.

అభ్యుదయోస్తటంచు గగనాంగణచారి తథాస్తు దేవతా
సభ్యవచోనుషంగమున సర్వజగంబులు మ్రోగుగావుతన్
అభ్యనసూయమౌ జగమునంతట నిండిన కీర్తివల్లి దే
వేభ్యవిలాస నందనమహీరుహపాళిని బ్రాకుఁ గావుతన్.

పామర్రు,
తూర్పు గోదావరి జిల్లా.

డాక్టర్ ఆ. సీతారామస్వామి,
రూరల్ మెడికల్ ప్రాక్టీషనర్.

# సార్థక జీవి

"సార్థక జీవీ – త్యార్యావదతి; యస్య జీవితం లోకహితాయ."

వీరిని నేను ముప్పది సంవత్సరములకుఁ బూర్వమునుండియును, దెలిసికొని యున్నవాఁడను. అప్పటికిని ఇప్పటికిని ఒక్కింతయేని మార్పుచెందినవాఁడుకాఁడు. నిండుకుండ. తనలోని విచారమును గాని, విలాసమునుగాని యొరుల కందఁజేయు స్వభావ మేమాత్రమును లేదు. తన చేతనైనంతవఱకును, ఇతరులకుఁ జేయూఁతనొసంగి పైకిఁ దీసికొనవచ్చువారలలో నీయనకే యగ్రస్థానము కలదు. వయఃపరిస్థితినిబట్టి యాకృతిలో నిసుమంత భేదము కానవచ్చినను ధైర్యమునం దేమాత్రము భేదమును గానరాదు. కార్యశూరుఁడు గాని ఖడ్గవాదిగాదు. మన్నుమిన్ను నొకటైనను నవేచరించుచున్నను దానుమాత్రము పట్టినపట్టు మానుట కొప్పుకొనఁబోవఁడు. మేమిద్దరమును ఇంచుమించు నొకపడిలోనివారలమే యగుటంబట్టి వీరిచరిత్రాంశమును సహజభావమును కన్నులను గట్టియున్నట్టులే యున్నయవి. అప్పటినుండియు నిప్పటికిని నెన్నోమార్పులనో పొందియున్నది కాలచక్రము. స్వరాజ్యకాంక్షకుఁ బ్రారంభ మారోజులు. మూసినకన్ను లొక్కయింత తెఱచుచున్న దీ హిందూదేశము. "భరతఖండంబు మంచిదా పాడియావు" దినము లయ్యెవి. సానాతనిక మార్గము బలవత్తరముగాఁ బాదుకొనిన దానాఁడు. నూత్నపంథ తలయెత్తుచున్న దప్పుడప్పుడే. చిన్నతనమునుండియును ముసలితనమువఱకును బ్రతివ్యక్తికిని మనఃప్రవృత్తులును, భావప్రపత్తులును, క్రమక్రమముగాఁ బరివర్తనమునందు మార్పుల నొందుచుండును. ఈ పుణ్యవ్యక్తికి మార్పులేని తీర్పు పుట్టినతోడనే యలవాటుపడియే వెన్నతోఁబెట్టి నిలువ తొక్కుకొనియున్నయది. గాంధీమహాత్ముని కనికరము మొదలింటినుండియును బ్రతియణువును పుణికరించుకొని యన్నింటను మేలుకొని యుత్తేజమునందినవారిలో నీమహానీయుఁ డొకఁడు. తల్లిదండ్రులను లెక్కచేయక, పూర్వాచారమును పరిగణింపక ధర్మమార్గమునందే మనస్సును నియమించుకొని లోకకళ్యాణమునకై శారీరిక పరిశ్రమములకు వెనుదీయక యన్నింటిని విడచి ప్రజలయొక్క మేలుకొఱకు మాత్ర మన్వేషించి యేదియోయొక త్రోవనెంచి, దానిలోని సులువు బలువులను గమనించి యంతకుమించు మఱియొకదారి మానసికము ముందు నలరారినచో నందలి యున్నతానందమార్గము నవలంబించుచు "సహసా విదధీత నక్రియాం అవివేకః పరమాపదాం పదమ్" అను సూక్తిని సమాలోచనము చేయక ముందంజవేయు స్వాంతమును పరిగ్రహింపక "వృణుతేహి విమృశ్యకారిణం గుణలుబ్ధా స్స్వయమేవ సంపదః" అనునట్లు చక్కఁగఁదెలిసికొని ప్రతిపనిని మొదలిడి ఫలమునందుచుండువాఁడు. సత్యాగ్రహమునందు ముందునడక, సంస్కృతి పరివర్తనమునందు మొదటిసంచి, కల పుణ్యమూర్తి. "త్యాగభోగ విహీనేన ధనేన ధనినోయది, త్యాగభోగ విహీనేన మేరుణా ధనినో వయమ్" ధనముకలిగి యున్నందుకు ఫలము తాననుభవించుట. ఒరుల కుపకరింపఁజేయుట. ఈ రెండును లేనిచోఁ బ్రపంచకమందు మేరుసంపర్కముచే నెల్లవారును ధనికులే యయియున్నవారు. ఈ ఘనుని ధనము స్వానుభవమునకును పరోపకారమునకును నిరంతరమును వినియోగమునందు

చుండును గాని బూజుపట్టి పాడువడి కొట్లలో నిద్రించుచుండఁబోదు. ఒకమేకను ముందుగాఁ జిన్నబోదెను దాటించినచో, మిగిలిన వన్నియును దాముగా దాటి యవతలకుఁ బోవు చుండును. నంతవఱకును గుమిగూడి తట్టుమిట్టాడుచుఁ దిరుగుచునేయుండును. "వర్త్మ కర్షతు పురః పరమేకః తద్గతానుగతికో న మహార్ఘః" ప్రతి విషయము నందును ముందునడచువాఁ డుండిననే గాని లోకము క్రొత్తక్రొత్త త్రోవను బోవ బూను కొనదు. ఈ మార్గదర్శకుఁడు దా మునుమున్న నెట్టి యుత్కృష్ట కార్యములందైనను మిక్కిలి సాహసముతో మంచి చొరవతో మేలు మెలకువలతో వెనుకన్ను లేకపోవుచుండుటం బట్టియే తక్కిన వారలు మంచి యుత్సాహముతో నుప్పొంగుచుఁ బని పూనుకొని చేయుచుండువారు. తనకన్న పెద్దలకు మంచియాలోచనము సూచనము చేయుచుఁ దనకంటెఁ జిన్నలకుఁ దగిన సలహాల నొసంగుచుఁ, దన యీడు జోడు వారికిఁ దన వడవడి మిక్కిలి నెఱపుచుఁ, దన ప్రౌఢిమను వెదచల్లు చుండువాఁడు. "పుట్టుటలో భేదము లేదనియును వర్తనమునందే సకల భేదములు సముత్పన్నములగు చున్న వనియును నొక ప్రవాదమున్నది." అది యాధారము చేసికొనియెనేమో యను రీతిని జాతులను మతములను పరిగణింపక నీతిమార్గమునే యవలంబించుచుండువాఁడు. "కనఁగఁ గనంగఁ బెక్కులుగఁ గన్పడుచుండు మతంబు లన్నిటన్, బనిగొనిచూడ నీతిగలవాఁడె సుఖంపడునట్టులుండఁగా" అను నెన్నుడి వీని నుడికారమును వికసింపఁజేయు చున్నయది. "మందార మకరంద మాధుర్యమును గ్రోలు మధుపంబువోవునే మదనములకు" అనిపూర్వుఁ గట్టుబడి. ఈమధుపము మాత్రము అన్నిగడ్డు రోగ ములందును అతిప్రజ్ఞతోఁ బనిచేయుట కుపకరించునట్టి యుమ్మెత్తల సారస్యమును పరిగ్రహించును చుండుటయును జవిచూచుచుండెను.

"నానానూనవితానవాసనల నానందించు సారంగ మేలా నన్నొల్లదటంచు గంధఫలి"

అనుటంబట్టి యన్ని మంచిపూవుల మకరందమును గ్రోలునట్టి తుమ్మెద సంపెంగపూవు నందలి పరిమళమును మాత్రము స్వీకరింపనట్లు కొందరు మహనీయులు వారుతలంచిన వేగాని మఱి యొండు ఘనకార్యములు పరిగణింపఁబోరు. ఈ దిట్ట యటులుగాక యే యే సముచితసమంచిత కార్యము లున్నను వాని నన్నిటిలోను దనమనమును బ్రవేశింపఁజేసి యా యుపతెలంగులు పరి కించి మొదలిడుచుండు చిత్తము కలవాఁడు. ప్రజాహితకార్యములందు ముందు వీని సముచిత యోజనము కలుగక పోదు. ప్రభునిమిత్తసత్కార్యములందు వీని యారంభము తప్పక యుండియే తీరును. దేశములోని యన్ని యువక జనసంఘములయందును సమావేశము నొందిన దీయనయే. ఎల్ల వారలకును మంచిపొందిక సలహాలనిచ్చుచుండువాఁడు గాని శేషమునకుమాత్రము మనమును జొరనిచ్చు నలవాటు లేనివాఁడు. పెద్దపులివంటి గడ్డుపనికి జడియఁడు. ఎదుర్కొని, నిలబడి, పోరి, పటాపంచలుచేసి సాధించి జయము కైకొనుచుండువాఁడు. నిమ్మకు నీరుపోసినచందమున నీతనిపని యొయ్యారపు నడకలు నడచి గంగాప్రవాహమువోలె నిరంతర జీవకారుణ్యమై యమృతప్రాయంబై సర్వసంఘములకు మూడుకాలములయందును నుపకరించునదియై చెన్నలరారుచుండును.

"కాకి చిరకాలమున్న నేకార్యమగును!" అల్పమతులు చిరకాలము జీవించియున్నను లోకశ్రేయస్సుగలుగఁ బోదు. నేను వీరేశలింగము పంతులు చేయు సంస్కారమును రాజమహేంద్రివరమున నాన్నాఁడు కని సంతసించితిని. జయంతి రామయ్య పంతులు నడపు భాషా సంస్కారమును విని సంతోషించితిని. యుక్తమగు రీతిని దేశకాలపాత్రలనుబట్టి మతములును జాతులును భాషలును ఆచారములును తప్పక మారిననే సముచితసంస్కారముల నందిననే లోకమునందు శ్రేయ మభివృద్ధికరముయియుండును. "చండాలోఽస్తు మద్విజోఽస్తు" అను పరిపక్వదశను గమనించవలయును. ఈ యోధ, సానాతనిక ధర్మమార్గమందగ్రగణ్యమగు శ్రీ కనకదుర్గా దేవాలయమునందు సమర్థ్యాత్మపదంబునందు సముచితానందము కలిగించినవాఁడు కాకపోలేదు. మతసామరస్యము ఉగ్గుపెట్టిన బోనము. "ఇంటగెల్చి రచ్చగెల్వవలె" అను రీతిని ఇంటియందే జయముగాంచనేరనివారు ప్రపంచకమున మంచి పేరు పొందుట కెట్లు శక్తులై యుందురు! ఈ భరతఖండమందు నెల్లెడలను నీమహనీయుని నామము సముచ్చరింపఁ బడుచుండుటయేగాక ఖండాంతరములందును బహుమతముల వారిచేఁ బేర్కొనఁబడుచున్నయది బహుకార్య సాధనమునకు ధనము ముఖ్యాధారము ధనము విద్యాసాధకము. విద్య గ్రంథాధారము. గ్రంథములు గ్రంథాలయావాసములు. అట్టి గ్రంథములకు దారి చూపి దేశములందన్ని ప్రదేశములయందును గ్రంథాలయములు స్థాపించుటకు మార్గదర్శియై సంతృప్తినిమాత్రము కైకొనక యింకను నవనవోత్పత్తికై యన్వేషించుచుండు శ్రీ వేంకటరమణయ్యగారి పవిత్రనామము ప్రతిస్థలమునందును విరాజిల్లుచుండును. ప్రతి గ్రంథాలయమునందును గ్రంథస్వరూపదైవమ్మై ప్రతిఫలించుచుండును. వీరి యింటిపేరు అయ్యంకి. నా పేరు అయ్యప్పశాస్త్రి. మొదటి రెండక్షరములు సమానములుగావున మే ముభయులము మిక్కిలి యనుబంధము గల సన్నిహితబంధువులము. నేనును ఒక కొన్ని విషయములందు వీని సహాయము సహాయోపముల నందియుంటిని. సలహాలు బోధించుపట్ల నీయన కీయనయే సాటి: తనచెంతనున్నవారిని నెట్టకేలకో తనయంతకుఁ దీసికొనివచ్చుటకే యత్నించుచుండునుగాని విడనాడుటకు సుంతయేని మనమ్మొనను జొరనీఁడు. జ్ఞానము అనఁ జీకటినుండి వెలుతురులోనికిఁ దెచ్చుట. దివ్యజ్ఞానము అనఁగాఁ దెలిసికొనవలసిన యన్ని యంశములయందును సమాధారమగు విషయమును సంగ్రహించుట. మూఢనమ్మకముగాక సూక్ష్మజ్ఞానముచే ధర్మరహస్యము లుసంస్కరించి త్రికాల పరిజ్ఞానమును, జీవితపద్ధతులును, జీవనపరిస్థితులును, జీవియొక్క యాగమనమును, గమనముల కదలికలు అన్నియు స్వయంభావమునఁ దెలిసికొనుట. ఇట్టిపనియందును నీఘనుఁడగ్రగణ్యుఁడు. ప్రకృతి పరిజ్ఞానము అనఁగా జీవులుగాని వస్తువులుగాని కాలపరిమాణమున స్వపరిణామము పొందుచుండుట కదా! అట్టి యుద్యమమునందును నీతనిదే ప్రారంభ ప్రవేశము. తనకడుపు ఒరులకడుపు కనిపెట్టి జీవించిజీవింపఁజేయుమాతృస్వరూపపోషకమూర్తి. సంస్కృతపరిభాషయందును ప్రవేశపరితోషములు కలిగినవాఁడు. ఆంధ్రమునందుఁ దుదిగన్న గండడు. హూణమునంగల మెలుగులన్నియును జవిచూచినవాఁడు. విజ్ఞాని. "వినఁదగు వెండియుఁ బొత్తముగనఁదగు బుధజనుల నడుగఁ గాఁదగు" అనునుడి

శ్రీ అయ్యంకి వే
ప్రాకారము తా
పనిని జేయుచుం
వ్రాయఁబూనిన
ములో నతికొ
కాధారముచేసి
జీవి” జన్మము,
స్వర్ణాక్షరములు
సీ.

గీ.

సీ.

గీ

గీ

గీ

బెజవాడ

తా

తెలిసిన వారలచేఁ దెలియునట్లు చేసికొని
కార్యదర్శి కాడు. ఈయనను గుఱించి
దిరువ్రులాడుచుండును. ఈయన విషయ
మును తనజీవితమును బహు ప్రజల
జేసికొన్న ధన్యులలో నీచిరజీవిది “సార్థక
యేయుండురః. వీనిపేరు భారతమాత
రారుచుండునుగాఁత.

ంచుచుండెడి పుణ్యమూర్తి
తెల్లము చేయు ధీవరుండు
తెలిపెడి నీతిశాలి
లంబుగాఁజేయు వినుతిగుణుడు
లె భాసించు సద్గుణుఁడు బుధుఁడు
ప్తతారమై వికసించు ననవరతము.
ాంతరంగంబుు యఃరుటరుదె?
ణముల వెఃయుటసదె?
ప్రపాదులచే మించుటరుదె?
మ్మము చెలగుటసదె?
ితాధారమూర్తియై యమరుచుండె
మై యెల్లెడఁ బ్రభవహించు.
స్వరుమూర్తులు పుట్టినట్లు
కారంబు లందురీతి
ణములు మెట్టినటుల
పోయు భావముల్ నిలుచుతీరు
ఁ బిమ్మటఁ దాండవ కృష్ణమూర్తి
రర్మిలి వారితనయులగుచు.
తాన మ్మనంతముగను
కలచే వెలయుచిండు
వంబు తేజరిల్లు
ల మేల్మి యతిశయిల్లు
మైక్యంబు సతతమగును
సంపదల్ చెన్నుగాంచు.

విద్వాన్, శతావధాని:
శ్రీ భమిడిపాటి అయ్యప్పశాస్త్రి

# ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమము యొక్క ప్రథమ సంవత్సరములు

నాకు సరిగా ముప్పదియేళ్ళనుంచి శ్రీ అయ్యంకి వేంకటరమణయ్యగారితో ఎడతెగని పరిచయము కలదు. 1913 సంవత్సరములో బెజవాడలోని రామమోహనరాయ గ్రంథాలయము యొక్క కార్యదర్శిగా ఆయన పనిచేయుచు నన్నుకలసికొని దానియొక్క భవననిర్మాణమునకై స్థల సంపాదన నిమిత్తము నా తోడ్పాటునుగూడ కోరెను. దానికప్పుడు కీ॥ శే॥ నూరి వేంకట నరసింహ శాస్త్రిగారు అధ్యక్షులు. అప్పటినుంచియు 1920 సం॥రం॥ వరకును వారి యుభయులతో నేనుకూడ కలసి రామమోహనగ్రంథాలయ అభివృద్ధి కొఱకును ఆంధ్రదేశములో గ్రంథాలయోద్యమ వ్యాపకము కొఱకును జరిగిన పనిలో పాల్గొన్నవాడనే. నాకు ప్రథమమునుంచియు రాజకీయోద్యమము ప్రధానముగాను సంఘసంస్కరణ గ్రంథాలయోద్యమములు రెండవపిగానుండెను. వారియుభయులకు గ్రంథాలయోద్యమము ప్రధానముగాను, రాజకీయోద్యమము రెండవదిగా నుండెను. ఈ ముప్పది సంవత్సరముల కాలములో ఎప్పుడు నెట్టి యభిప్రాయ భేదములు లేకుండ శ్రీ వేంకటరమణయ్యగారు నాకు ముఖ్యమైన మిత్రులలో నొకడుగ నుండెను. స్వరాజ్యోద్యమమునకు తరువాత ఆంధ్రదేశములో జనసామాన్యములో విజ్ఞానమును జాతీయభావమును కలుగజేయుటకు తోడ్పడిన యుద్యమము గ్రంథాలయోద్యమేనని చెప్పుటలో నతిశయోక్తిలేదు. గ్రంథాలయములు స్థాపింపబడినచోట్లనెల్ల దేశాభిమానము, సంఘసంస్కరణము, హరిజనసేవ మొదలైన దేశోపయోగకార్యములు బాగుగా విజృంభించినవి. స్త్రీల వికాసమునకు, విజ్ఞానమునకు, స్వతంత్రమునకు గూడ తోడ్పాటు కలిగినది. ఇట్టి మహోద్యమమునందు తదేకదీక్షతో విడవకుండ ముప్పయిసంవత్సరములనుంచి ప్రధానపురుషులుగా పనిచేసి,దీనిని అఖిలభారత ఉద్యమముగాకూడ వ్యాపింపజేసిన శ్రీ అయ్యంకి వేంకటరమణయ్యగారిని ఆంధ్రప్రముఖులు, మహాజనులు సన్మానించుట మిగులసమంజసముగా నున్నది. హిందూదేశములో బరోడా సంస్థానమునందు గ్రంథాలయోద్యమము బాగుగా పరిఢవిల్లినది. అందుకు కారణము ఆ సంస్థానాధీశులయొక్క ఆదరణ, పోషణలై యున్నవి. ఆంధ్రదేశములోని గ్రంథాలయోద్యమము కొంచెమించుమించుగా బరోడా యుద్యమముతోబాటు పనిచేసినది. ఇచట ప్రభుత్వముయొక్కగాని, ప్రభువులయొక్కగాని సహాయము ఏమాత్రము లేకుండనే ఇది స్థాపింపబడి అభివృద్ధిజెందినది. ఇది కేవలము ప్రజలయుద్యమముగా విలసిల్లినది. దీనికి నూరి నరసింహశాస్త్రిగారి యొక్కయు, అయ్యంకి వేంకటరమణయ్యగారి యొక్కయు నిరంతరకృషియు, ఇతరప్రజాసేవకులయొక్క సహాయమును, పల్లెగ్రామములలోని ఉత్సాహవంతులైన యువకుల యొక్క కార్యదీక్షయు ఆధారములై యున్నవి. గ్రంథాలయోద్యమమునందు ఆంధ్రదేశము హిందూదేశములోని ఇతర రాష్ట్రములన్నిటికిని మార్గదర్శిగా నెంచబడుచున్నది.

వేంకటరమణయ్యగారు మిగుల నుత్సాహవంతుడు, కార్యదీక్షాపరుడు. బహు స్నేహపాత్రుడు. ఎట్టి కష్టములలోను దిగక సరసముగా తన కార్యమును సాధించుకొనగల శాంతము

కలవాడు. తగినంత ఆర్థికస్థితి యుండుటవలన తన స్వంతకర్చుమీద నిరంతరము ప్రయాణము చేయుచు ఈ యుద్యమములో పని చేసినవాడు. దీనిని తన జీవిత పరమావధిగా పెట్టుకొన్నవాడు. ఏ యూరిలో క్రొత్తగ్రంథాలయము స్థాపింపబడినను, ఏ పాతగ్రంథాలయముయొక్క సంవత్సరోత్సవము జరిగినను, ఎచట గ్రంథాలయసభలు జరిగినను ఈయన హాజరుకానిది సలహా సహాయములు చేయనిది యుండదు. ముందుగా బెజవాడలోని రామమోహన గ్రంథాలయమునకు భవన నిర్మాణము గావింపజేసి, పుస్తకసముదాయమును సమకూర్చి, దానిని కేంద్ర గ్రంథాలయముగా జేసి, అచటనుండి అన్నివైపులకు గ్రంథాలయోద్యమ వ్యాప్తిచేయబడినది. 1913 సం॥రం॥ మొదలు 1920 సం॥రం వఱకు ఈయుద్యమము ఆంధ్రదేశములో ప్రవృద్ధిజెంది సుమారు 7-8 వందల గ్రామములలో గ్రంథాలయములు స్థాపింపబడినవి. రామమోహన లైబ్రరీయొక్క కార్యనిర్వాహకులలో నేను గూడ చాల సంవత్సరములుంటిని. దాని భవననిర్మాణముకొఱకై సూరి నరసింహ శాస్త్రి, వేంకటరమణయ్యగార్లతోపాటు నేనుకూడ కృషి సల్పినభాగ్యము నాకు కలిగినది. కీ॥ శే॥ గొడ్డపాటి వెంకటప్పయ్య పంతులుగారు దాని అభివృద్ధికి తోడ్పడిన వారిలో ముఖ్యులు. ఆ గ్రంథాలయముయొక్క సంవత్సరోత్సవములు ఏటేట కడు వైభవముతో జరుపుచుంటిమి. ఆంధ్రదేశములోని ప్రధాన ప్రముఖులు వాటిపై నధ్యక్షతను వహించుచుండిరి. ప్రప్రథమమున ఆంధ్రదేశములో గొప్పభావకవిగా శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారి పేరు ప్రతిష్ఠలను పొందినది ఆ గ్రంథాలయముయొక్క ఒకానొక సంవత్సరోత్సవములోనై యున్నది. వారు ప్రథమమున రచించిన ఆంధ్రమాతయొక్క స్తుతిపద్యములు చరిత్రాత్మకమై నేటికిని ఆంధ్రవాఙ్మయమునందు ప్రాముఖ్యముగ నున్నవి. రాయప్రోలువారు పిమ్మట రచించిన హృదయాకర్షకములగు కవితలను గూర్చి ఇచట వివరించుట, అప్రస్తుతము. ఒకసారి నైజాంరాష్ట్రములోని సుప్రసిద్ధ ఆంధ్రనాయకుడు, దేశాభిమాని, నిగర్వచూడామణి, గొప్ప స్థితిగలవాడు అయిన శ్రీ పింగళి వెంకటరామరెడ్డిగారి గృహమునకు వరంగలు వద్దనున్న వడ్డేపల్లికి సూరి నరసింహ శాస్త్రి, అయ్యంకి వేంకటరమణయ్య, కోవెలమూడి గోపాలకృష్ణయ్య నేను వెళ్లితిమి. రెండు మూడు రోజులు వారి కతిథులముగా నుంటిమి. వారు మమ్ముల నాదరించి వరంగల్లులోని కాకతీయ రాజుల శిథిలావశేషముల నన్నిటిని స్వయముగా జూపించిరి. వారు మాకోరికపైన పిమ్మట కొలది రోజులకు రామమోహన గ్రంథాలయ భవనమును దెరచుటయేగాక గొప్ప విరాళముగూడ దయచేసిరి. ఇటుల నైజాం ఆంధ్రులతోగూడ స్నేహ సంబంధములను స్థాపించుకొంటిమి. రామమోహన గ్రంథాలయ పక్షమున నొక హరిజన రాత్రి పాఠశాలను స్థాపించితిమి. అది కొన్ని సంవత్సరములు బాగుగా పనిచేసెను. జాతీయ పండుగలను, మహాపురుషుల వర్ధంతులను, గ్రంథాలయ పక్షమున జరుపవలెననియు, హరిజన పాఠశాలలను నెలకొలపవలెననియు, అన్నిగ్రంథాలయములకు సలహాయివ్వబడెను. అనేక గ్రంథాలయములలో నీ పని జరుగుచుండెను. కొన్ని

సంవత్సరములు ఇతర మహాపురుషుల వర్ధంతులతోబాటు రామమోహన గ్రంథాలయముక్రింద మహమ్మదు ప్రవక్తయొక్క వర్ధంతి తప్పకుండ జరుపబడెను. దానికి బెజవాడ బస్తీలోని హిందువులు, మసలమానులు ఉత్సాహముతో వచ్చుచుండిరి. మహమ్మదు ప్రవక్తయొక్క జీవితమును జదివి ప్రతివర్ధంతిలోను ప్రధానోపన్యాసకులుగా నుండుపని నా మీదబెట్టిరి. నే నాపనిని జయప్రదముగానే నిర్వర్తించితిని. అప్పటినుండియే మహమ్మదీయ దేశములయొక్క చరిత్రయందు నాకు అభిరుచి గట్టిగా గలిగెను. ఇస్లాము మతము, ఇస్లాము నాగరికత యెంత గొప్పవో నాకు బాగుగా గోచరించెను. పిమ్మట కొన్ని సంవత్సరములలో సూరి నరసింహశాస్త్రిగారికి మేనల్లుడును, ఆంగ్లాయుర్వేద విశారదుడును, తెలుగునందును, సంస్కృతమునందును మంచి పండితుడును, మంచి కవియు, వక్తయునైన కీ. శే. డాక్టరు దంటు సుబ్బావధానిగారు మా బృందమునజేరి గ్రంథాలయోద్యమ వ్యాప్తియందు బాగుగా దోడ్పడిరి. మాంటాగ్యూగారు విచారణ నిమిత్తము 1917 సం॥రం నవంబరు నెలలో బెజవాడలో జరిగిన ప్రత్యేకాంధ్రమహాసభకు నే నాహ్వానసంఘాధ్యక్షుడుగను, వేంకటరమణయ్యగారు ప్రధాన కార్యదర్శిగను ఉండుట తటస్థించెను. దానికి కీ॥ శే॥ చింతలపాటి నరసింహరాజుగారు అధ్యక్షత వహించిరి. ఆసభలో దంటు సుబ్బావధానిగారు రచించి బహుశ్రావ్యముగా జదివిన పద్యములు నేటికిని మరపు రాకున్నవి. ఆసభలోనే శ్రీ భోగరాజు పట్టాభిసీతారామయ్యగారు ప్రతిపాదనపైన బ్రాహ్మణేతరులకు ప్రత్యేకప్రాతినిధ్య మంగీకరింపబడినది. కాంగ్రెసు-లీగుస్కీముకూడ సభవారిచే ప్యాసుచేయబడినది. అప్పటికి ఆంధ్రదేశములోని బ్రాహ్మణేతరప్రముఖులు కాంగ్రెసునుండి వీడిపోయి జస్టిస్‌పార్టీలో చేరలేదు. అదియే అందరముకలసి జయప్రదముగా జేసిన ఆఖరుమహాసభ. పిమ్మట కొలదికాలమునకే కీ॥ శే॥ కూర్మా వేంకటరెడ్డినాయుడుగారు, కోవెలమూడి గోపాలకృష్ణయ్య పాత్రోగార్లు జస్టిస్‌పార్టీలో జేరిపోయిరి. పిమ్మట నొకటిరెండువారములకే బెజవాడలో జరిగిన ప్రథమ ఆదిఆంధ్రమహాసభను జయప్రదముగా నిర్వర్తించుటకు మాబృందమువారము సహాయపడితిమి. ఆసభలోనే మొట్టమొదటిదఫా ఆదిఆంధ్ర యను పేరును అస్పృశ్యులకు ఉపయోగించుటకు తీర్మానించబడినది. ఆయుద్యమమునకు శ్రీ గూడూరు రామచంద్రరావుగారు ప్రధానపురుషులని చెప్పనక్కరలేదు. ఆ మహాసభకు కీ॥ శే॥ భాగ్యరెడ్డివర్మగారు అధ్యక్షత వహించిరి. 1916 సం॥రంలో కృష్ణానదికి గొప్ప వరదలువచ్చి కుడివైపుగట్టు తెగి గుంటూరుజిల్లాలోని పెక్కు గ్రామములకును, ఆ సమయముననే కొల్లేరు వరదలవల్ల కైకలూరు తాలూకాలోని పలుగ్రామములకును గొప్ప నష్టము సంభవించి అనేకవేలమంది హరిజనులు మొదలగు పేదవారు గుడిసెలను, ఆస్తులను గోల్పోయి నిరాధారులైరి. వారికి సహాయము చేయుటకు బెజవాడలో నొక కమిటీ స్థాపించితిమి. దానికి నన్నధ్యక్షునిగ జేసిరి. బెజవాడ పౌరులు చాల ధనమును, ధాన్యమును, వస్త్రముల నిచ్చిరి. పిఠాపురము మహారాజావారు రు 3000-0-0 లు విరాళమును బంపిరి. ఈ సహాయము నచటి పేదలకు అందజేయుటకు ఏర్పడిన ఐచ్ఛిక సేవాదళమునకు అయ్యంకి వేంకటరమణయ్యగారు నాయకుడుగా

నుండెను. ఆయనకు ప్రధాన సహాయకుడుగా శ్రీ నోరి వేంకటేశ్వర్లుగారుండెను. వీరందరును జట్లుగా నీళ్ళను, బురదను, ముళ్ళను లక్ష్యపెట్టక ఆ ప్రాంతముల కన్నిటికిని పోయి అచటి ప్రజలకు గృహోపకరణములను, ఆహారపదార్థములను, వస్త్రములను పంచిపెట్టి వచ్చిరి. ఆంధ్రపత్రిక వారు పంపిన ప్రత్యేకవిలేఖరి అచటి ప్రజలయొక్క బాధలను మన వైద్యభటులు చేసిన సేవను వర్ణించుచు ప్రతిదినము ఆంధ్రపత్రికకు పెద్దపెద్ద వ్యాసములు వ్రాయుచుండెను. ఈపనియావత్తు నిర్వర్తించుటకు రామమోహన గ్రంథాలయమునే కేంద్రముగా నుపయోగించితిమి. అచటికనేకులు హరిజనులు మొదలగు పేదవారు వచ్చి సహాయమును పొంది పోవుచుండిరి. అప్పటికి బెజవాడలో రెండు హరిజన పాఠశాలలుండెను. ఒకటి నాఅధ్యక్షత క్రిందనున్నది. రెండవది రామమోహన లైబ్రరీక్రింద జరుపబడుచున్నది. ఆ సంవత్సరము మాపాఠశాలయొక్క వార్షికోత్సవమును రామమోహన గ్రంథాలయమునందు జరిపినందుకు శ్రీ పెద్దిభొట్ల వీరయ్యగారు గొప్ప యాక్షేపణను లేవదీసిరి. రామమోహన గ్రంథాలయములోనికి అస్పృశ్యులను దెచ్చి దానిని మైలచేయకూడదనిరి. మేము గ్రంథాలయము అన్నిజాతులవారికి సమానముగా నుపయోగపడవలెనని పట్టుబట్టితిమి. కమిటీలో భేదాభిప్రాయములు కలిగెను. వేంకటరమణయ్యగారు నాతోనే నిలువబడిరి. అప్పటి పత్రికలగు హిందూ, న్యూఇండియా, ఆంధ్రపత్రికలు వీరయ్యగారిని ఖండించుచు సంపాదకీయము వ్రాసినవి. కమిటీలో మేము గెలిచినచో తాము విడిపోయి శంకర గ్రంథాలయమును స్థాపింతుమని వీరయ్యపార్టీ వారు బెదిరించిరి. మే మోడిపోయినచో రామమోహన గ్రంథాలయమును వేరుగ స్థాపింతుమని చెప్పితిమి. కొన్నినెల లాందోళన జరిగెను. తుదకు మేమే గెలిచితిమి. గ్రంథాలయము క్రిందనున్న హరిజన పాఠశాలయొక్క వార్షికోత్సవము కీ॥ శే॥ యస్ శ్రీనివాసయ్యగారి అధ్యక్షతక్రింద గ్రంథాలయ భవనమునందే వైభవముగా జరిగెను.

అప్పటి నుండియు హరిజనులుకూడ ధారాళముగా గ్రంథాలయములోనికివచ్చి అన్ని హక్కులను ఉపయోగించుకొనుచున్నారు. కాని శంకర గ్రంథాలయము స్థాపింపబడ లేదు.

ఆ యేడెనిమిది సంవత్సరములలోను నూరి నరసింహశాస్త్రి, వేంకట రమణయ్య, దంటు సుబ్బావధానులుగారలతో కలిసి నేనుకూడపోయి ఎన్నిచోట్ల నూతన గ్రంథాలయములను స్థాపించితిమో, ఎన్ని వార్షికోత్సవములలో పాల్గొంటిమో ఇట వివరించి కాలహరణము చేయదలచుకొనలేదు. వారితో సాంగత్యము చేసినందుకు అధ్యక్షపదవో, ఉపన్యాసకుని యుద్యోగమో, గ్రంథాలయమును దెరచు గౌరవమో నాకుగూడ గలుగుచుండెను. వెళ్ళినచోటనెల్ల పుష్కలముగా భోజన మర్యాదలు కలుగుచుండెను. ఒకసారి శ్రీమతి పొణకా కనకమ్మగారి సంస్థానమైన పొట్లపూడికి వెళ్లితిమి. అప్పుడు వారిస్థితి ఉచ్చదశలో నుండెను. కనకమ్మగారును, పట్టాభి రామిరెడ్డిగారును మంచి గ్రంథాలయమును నడుపుచుండిరి. ఆ గ్రంథాలయ వార్షికోత్సవమునకు కొన్ని వేలమంది జనులు వచ్చిరి. మరియొకసారి భీమవరములోని నన్నయ గ్రంథాలయమును నాచే తెరిపించిరి. మే మందరము కలిసి రెండు మూడు రోజులు కాలవలో పడవమీద భీమవరమునుండి

ప్రయాణము చేసితిమి. కాలవప్రక్కనున్న గ్రామములలోని గ్రంథాలయములను దర్శించి వచ్చితిమి. చిన కాకినాడలోని జానకి రామరాజుగారు గొప్ప పామ్ముమంత్రిగా డని తెలుసుకొంటిమి. ఇంకొకసారి అనంతవరములోని గ్రంథాలయ వార్షికోత్సవమునకు వెళ్ళితిమి. మామిత్రుడు కీ॥ శే॥ కుప్పా శ్రీరామశర్మగారు దానిని ఉత్సాహముతో నిర్వహించుచుండెను. దానికి సమీపముననే యున్న అమృతలూరులో శ్రీ శరణు రామస్వామి చౌదరీగారు మొదలైన యువకులు చదువుకొనుచున్న సంస్కృత పాఠశాలను దర్శించితిమి. తిరిగి వచ్చుటలో కృష్ణానదిలో అందరము కలసి బహుఆనందముగా సాయంత్రము చల్లనివేళ నడచివచ్చుట ఇప్పటికిని బాగుగా జ్ఞాపక మున్నది, ఇటుల ఎన్నిచోట్లకో పోతిమి.

1921 వ సంవత్సరము నుండియు నేను తీవ్రమైన రాజకీయోద్యమములో మగ్నుడైపోయి నందున గ్రంథాలయోద్యమముతో సంబంధము నాకు బహుతక్కువ యైనది. రాజకీయోద్యమ విజృంభణములో గ్రంథాలయోద్యమము కొన్ని సంవత్సరములవరకు మందగతిని దాల్చినది. ఇటీవల కొన్ని సంవత్సరముల నుండియు మరల గ్రంథాలయోద్యమమును లేవదీసి, మరల చురుకుగా పనిచేయుచున్నారు. ప్రభుత్వపు గ్రాంటులకై గ్రంథాలయము లాశించుటవల్ల అవి స్వతంత్రమును గోల్పోయెనేమోనని నేను చాల సందేహించుచున్నాను. గ్రంథాలయ నిర్వాహకులు కాంగ్రెసువాదులైనను, గ్రంథాలయములలోని పుస్తకములు దేశసేవయందాసక్తి కలిగించునవిగ నున్నను సర్కారు యుద్యోగస్థులు గ్రాంటుల నియ్యకుండ నడ్డుతగిలిన కేసు లనేకములుగ నున్నవి. అయినను ప్రజాప్రభుత్వము యేర్పడగనే ఇట్టి చెడుస్థితి తొలగిపోవునని విశ్వసించుచున్నాను. మన వేంకటరమణయ్యగారు ఇతరు లెంతమంది ఈ యుద్యమములో పనిచేసినను, దానిని విడిచి పోయినను, తాను మాత్రము ఏకదీక్షగా దానియొక్క యుచ్చస్థితియందును, మందస్థితియందును, మరల గలిగిన విజృంభణమునందును ఒకేవిధమగు నుత్సాహముతో పనిచేయుచు ఆంధ్రప్రజలయొక్క జ్ఞానాభివృద్ధికి దోడ్పడుచు తన జీవితమును ధన్యముగ జేసుకొనుచున్నాడు. దీని నఖిలభారతోద్యమముగా గూడ గావింపగలిగినాడు. వేంకటరమణయ్యగారు చిరంజీవిగ నుందురుగాక. గ్రంథాలయోద్యమము నింక నెక్కుడుగా వర్ధిల్లి ప్రజలకు మహోపకారము చేయునుగాక.

శ్రీ అయ్యంకి వేంకటరమణయ్యగారు మొదలగువారి కృషివలన బెజవాడ నగరమునందు గ్రంథాలయాసక్తి పెరిగి ఆరు గ్రంథాలయములు స్థాపింపబడిన వని చెప్పుటకు సంతసించుచున్నాను. (1) రామమోహన గ్రంథాలయము. ఇది ఆంధ్రదేశ కేంద్రగ్రంథాలయము; (2) శ్రీ భ్రమరాంబా మల్లేశ్వర గ్రంథాలయము. ఇది వర్తక వ్యాపారములు జరుగు ప్రదేశములోనుండి వర్తకులచే పోషింపబడుచు నభివృద్ధిలో నున్నది; (3) కార్మిక గ్రంథాలయము. ఇది కీ॥ శే॥ కోడి రామమూర్తిగారిచే తెరవబడినది. కార్మికసంఘములో మంచి పనిచేయుచున్నది: (4) ముసలమాను యువజన గ్రంథాలయము. ముసలమాను యువకుల నాకర్షించుచున్నది. (5) రామచంద్ర

రాయ గ్రంథాలయము. డా॥ ధన్వాడ రామచంద్రరావుగారి పేర మ్యునిసిపాలిటీవారిచేత నెల కొల్పబడి మంచిస్థితిలో నున్నది. గాంధీపార్కులో నున్నది. (6) వెలిదండ్ల హనుమంతరాయ గ్రంథాలయము – ఇది దేశముకొరకు ప్రాణము లర్పించిన వెలిదండ్ల హనుమంతరావుగారి పేర నెలకొల్పబడినది. దీనికి గాంధీనగరములో నొక శాఖకూడ నేర్పడి చురుకుగా పనిచేయుచున్నది. ఇన్నిగ్రంథాలయములు బహుశః మన రాజధానిలో నింకొక నగరమున లేవు.

శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు పంతులు.

---

# కర్మయోగి

శ్రీ అయ్యంకి వేంకటరమణయ్య పంతులుగారిని వారి బాల్యమునుంచీ ఎరుగుదును. వారు నిజమైన కర్మయోగి. ఆంధ్రజాత్యుద్ధరణకు సంబంధించిన నూతనోద్యమము లన్నిటితోను వారికి సంబంధము కలదు. కాని ముఖ్యముగా వారిజీవితము నంతయు అర్పించినది గ్రంథాలయోద్యమమునకు. ప్రభుత్వాదరణక్రింద గ్రంథాలయోద్యమము బహుముఖముల వ్యాపించియున్నది బరోడారాజ్యములో. అట్టి ఆదరణ లేకున్నను బరోడారాజ్యములో వలెనే ఆంధ్రదేశమునందు గూడ విస్తరించుటకు గారణము శ్రీ అయ్యంకి వేంకటరమణయ్య పంతులుగారియొక్కయు వారి మిత్రులయొక్కయు కార్యోత్సాహమని చెప్పకతప్పదు.

వేంకటరమణయ్య పంతులుగారు కేవల ముత్సాహపరులు మాత్రమేగాక కార్యదీక్ష, సమర్థత వారి కమరియుండుటచేతనే గ్రంథాలయోద్యమము దేశములో విజయము గాంచినది. వారు స్వయముగ కార్యముల నిర్వహించుటయేగాక ఇతరులను కార్యములకు ప్రేరేపించు శక్తికూడ వారికి మెండు. వారిచురుకుదనము, చిరునవ్వు, వారిసహచరుల మాంద్యమునకు మందయి కార్య కరులనుగా జేయును. ఇది నాయకుల ముఖ్యలక్షణములలో నొకటి.

ప్రకృతివైద్యము, వర్ణచికిత్స మొదలగు చిన్నయుద్యమము లెన్నో వారి యాదరణకు పాత్రమైనవి. పలుకార్యములలో సంబంధ ముంచుకొనువారు ఏ కార్యమును బాగుగా నిర్వ హింపలేకపోవుట సామాన్యమేయైనను వారివిషయమున నది వర్తింపదు. దేని కది వారి ముఖ్య సేవగనే ఆదరమును బొందుచుండును. ముఖ్యసేవగ నెంచుకొనినవారికంటెను వా రవలంబించిన పలుకార్యములయందును విశేషసేవనే యొనర్చియున్నారు.

వా రిప్పు డరువదియవ పడిలో నున్నప్పటికిని యువకునివలె వారిసేవయొక్క ఫలితము లను వారేచూచుకొనుభాగ్యమువారికి గలిగినది. ఫలవంతమగు వారిజీవితము వేదములు మానవు లందరకును ప్రసాదించిన శతవత్సరపరిమితిని మించి వర్ధిల్లుగాక యని ఆశీర్వదించుచున్నాను.

శ్రీ వున్నవ లక్ష్మీనారాయణ పంతులు.

# ఆశీస్సు

శ్రీ అయ్యంకి వేంకటరమణయ్య గారిని నేను చాలాకాలమునుండి యెరుగుదును. గ్రంథాలయోద్యమమునందు వారి కత్యంతాభిమానము కలదు. 1914 సం॥న ఆంధ్రమహాసభ బెజవాడలో శ్రీ న్యాపతి సుబ్బారావు పంతులుగారి అధ్యక్షతక్రింద జరిగెను. ఆ సందర్భమున అయ్యంకి వేంకటరమణయ్యగారు; ప్రథమాంధ్ర గ్రంథాలయ మహాసభ బెజవాడలో జరిపించిరి. అప్పుడు నే నధ్యక్షుడ నైతిని. వెంకటరమణయ్య గారికి గ్రంథాలయోద్యమమున గల అభిమానము వర్ణనాతీతము. ఈ యుద్యమమును వృద్ధిపరచుటకై వారు చేసిన కృషి అపారము. కొంతకాల మీయన భీమవరం తాలూకాలోను, మరికొన్నిచోట్లను ప్రతిగ్రామమునకు వెళ్లి గ్రంథాలయముల యొక్క యుపయోగమును గురించి ఉపన్యాసములిచ్చి చాలచోట్ల గ్రంథాలయములు స్థాపించిరి. ఆవిషయమై వీరు చేసిన కృషి మిక్కిలి ప్రశంసనీయము. గ్రంథాలయరూపమున వీరు చేసిన మహోపకారమును తలంచి ఆంధ్రులు తమకృతజ్ఞతను తెలుపుటకై గొప్ప సన్మానమును జేసిరి. ఆసన్మానమునకు వీరు సర్వవిధముల నర్హులని చెప్పుటకు సందేహము లేదు. వీరుచేసిన కృషి శ్లాఘాపాత్రమగుటచేత సన్మానము జరిగినప్పుడు మన ఆంధ్రమండలము నుండియేగాక ఇతర మండలముల నుండిగూడ సందేశములు పెక్కులు వచ్చెను. కొందరాంగ్లేయ భాషలోను, కొందరు తెలుగుభాషలోను ప్రశంసాపూర్వకములైన ఉపన్యాసములను వ్రాసి పంపిరి. అందుచేత వేంకటరమణయ్యగారినిగూర్చి ఆంధ్రదేశ మెంతయు గర్వపడవలసి యున్నది. గ్రంథాలయ సర్వస్వమను మాసపత్రికను చాల కాలము నడిపిరి. శ్రీ వేంకటరమణయ్యగారికి పరమేశ్వరుడు దీర్ఘాయురారోగ్యము లిచ్చి గ్రంథాలయోద్యమమును గూర్చి ఇతోధికముగా బనిచేయునట్లనుగ్రహించుగాక.

కాకరపర్రు
9-7-1943.

చిలకమర్తి లక్ష్మీనరసింహం.

---

# సందేశము

శ్రీ అయ్యంకి వేంకటరమణయ్యగారు ఆంధ్రదేశమున గ్రంథాలయోద్యమమున కొనర్చిన సేవ అమోఘము. వారిని సమ్మానించుట కొనర్చబడు ప్రయత్నములకు నా సంపూర్ణ సానుభూతి కలదు.

13—11—42

బె. రామచంద్రారెడ్డి.

# అభినందనము

శ్రీ అయ్యంకి వేంకటరమణయ్యగారిని సఖిలాంధ్రదేశము నేడు సన్మానించుచున్నందు కెంతయు సంతసమగుచున్నది. ఆంధ్రదేశగ్రంథాలయోద్యమమునకు శ్రీ వేంకటరమణయ్యగారొనర్చిన సేవ యపారము. తెలుగునాడున ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమమును, అయ్యంకి వేంకటరమణయ్యయును పర్యాయపదములుగా వాడుకొనబడుచున్నవి. గ్రంథాలయోద్యమము తలపునకు వచ్చిన శ్రీ వేంకటరమణయ్యగారు మనసులో ప్రత్యక్షమగుదురు. అందుచే నిక వారీపనిచేసి రాపనిచేసిరని కొనియాడవలసిన పనియే లేదు.

గ్రంథాలయసేవ నిరాడంబరమైనది. గౌరవార్థములకు తావులేనిది. ఎంత ఓపిక, దీక్ష కలవారికైనను నిరుత్సాహము నిచ్చునది. అట్టి సేవను చేపట్టి తదేకదీక్షతో శ్రీ వేంకటరమణయ్యగారు తపస్సు గావించి సిద్ధిపొందిరి. దానికి నేడాంధ్రలోక మొనర్చు మహాసన్మానమే తార్కాణము. ఆడంబరములతోను, ఆవేశములతోను, గూడిన యితర ఉద్యమములలోని సన్మానములకంటె నీ సన్మానమునకు మఱింత విలువగలదని వేఱుగ నుడువనక్కఱ లేదు.

శ్రీ వేంకటరమణయ్యగారితో నాకు కొన్ని సంవత్సరముల పరిచయభాగ్యమున్నది. వారు శాంతస్వభావులు. కార్యసాధకులు. దీక్షాపరులు. క్లిష్ట సమస్యలను నిదానముగ, నిబ్బరముగ పరిష్కరింప దక్షులు. లోకము నిదురించునపుడు మహాపురుషులగు వారు ప్రాకుదురని ఒక ఆంగ్ల తత్త్వవేత్త పలికినాడు. అట్టి మహాపురుషులలో శ్రీ వేంకటరమణయ్యగారొకరు.

ఇంక ననేక సంవత్సరములు శ్రీవారి సేవాభాగ్య మాంధ్రలోక మందుకొనుగాక.

— శ్రీ కందుకూరి రామభద్రరావు.

---

# ప్రశంస

ప్రాచీన భారతదేశము శిల్ప, చిత్రలేఖన, సాము, సంగీత, సాహిత్య, అస్త్ర, శస్త్ర, కవిత్వ, భరతనాట్య, కళలు గల విద్యాలయములలో తయారైన జగజెట్టిలు వీర నారీమణులతోను, మానవ జీవితావసర సమస్తపరికరములు సమస్తసాధన సంపత్తి స్వయంపోషకముగా యంత్రసహాయములేక చేతిపరిశ్రమలతో నిర్మాణము చేసికొనుచు సమస్త ఐశ్వర్యము లనుభవించుచు ప్రాచ్య ఖండములకు సహితము ఎగుమతి చేయుచు ఐకమత్యము కలిగి వృత్తిపోటీ లేక సహావభావము కలిగి అనేక విజ్ఞానసంస్థల కాలవాలమై సంపూర్ణ వికాసముతో భారతావని ప్రపంచమునకెల్ల అగ్రస్థానము వహించి ప్రకాశింపుచు తత్కాంతిప్రసారములను తదితర ఖండములకు సహితము ప్రసరింపజేయుచు రత్నగర్భయని పేరుగాంచిన హిందూదేశము నేడు నిస్తేజమై నిర్వీర్యమై అజ్ఞాన అనారోగ్య దరిద్రదేవతల కాలవాలమై కృంగి కృశించిపోవుచున్న జాతిని కాలమును తిలకించి మాన

పాభ్యుదయమునకు ప్రధానమైనది జ్ఞానము. అట్టిజ్ఞానమును అభివృద్ధిపరచుటకు ప్రస్తుత పాశ్చాత్య ప్రభుత్వము ఎన్నియో నిరోధములు కల్పించి నిరక్షరాస్యులుగా చేయు పన్నాగమును గ్రహించి గ్రంథాలయోద్ధారక శ్రీ అయ్యంకి వేంకటరమణయ్యగారు నిరక్షరాస్యతను బాపుటకు గ్రంథాలయములే ప్రధానమైనవని తెలుసుకొని 1915 సంవత్సరమున ఆంధ్రదేశ గ్రంథాలయసంఘమును స్థాపించి నాటినుండి ఈ సంఘమునకు కార్యదర్శిగానుండి నిరంతరము గ్రంథాలయప్రచారము జేయుచు జిల్లా, తాలూకా, గ్రామ సంఘములను ఈ సంఘమునకు అనుబంధముగా చేర్పించి క్రమశిక్షణతో గ్రంథాలయోద్యమమును నడిపించుచు గ్రంథాలయ సర్వస్వ మను మాసపత్రికను స్థాపించి దానికి సంపాదకులుగా నుండి సంఘములను, వ్యక్తులను ప్రోత్సహించుచు యింకను ఎన్నియో నూతన మార్గము లారయుచు గ్రంథాలయయాత్ర యనుపేరున కొంతమంది ప్రచారకులను వెంటబెట్టుకుని గ్రామగ్రామములు తిరుగుచు, భజనపార్టీలు, మ్యాజిక్కు లాంతర్లు, గ్రంథాలయ ప్రదర్శనములగు సాధనలతో నిద్రాళులైయున్న గ్రామీణులను మేల్కొల్పి గ్రామగ్రామముల గ్రంథాలయములనెలకొల్పి ప్రజలలో నూతనచైతన్యము కలుగజేసిన ప్రథమప్రముఖులేగాక నాటినుండినేటివఱకు గ్రంథాలయోద్యమమే నా సర్వస్వమని ఎంచి నిష్కామకర్మతో చేసిన సేవాఫలితముగా సంఘ నిర్మాణావశ్యకతను గ్రహించి తరించుటకై గ్రంథాలయోద్ధారక యను బిరుదును కృతజ్ఞతతో సమర్పించుకొనిరి. ఇట్టి గ్రంథాలయోద్యమాభిమానులు జిల్లాకొకరు బయలుదేరిన ఆంధ్రదేశమున నిప్పటికే నూటికి 50 మంది అక్షరాస్యతను కలిగియుండెడివారు. వారిసేవ వలన ఆంధ్రదేశమునకేగాక అఖిలభారత గ్రంథాలయ సంఘమునకు కార్యదర్శిగా ఎన్నుకొబడి ఆంధ్రదేశమునకు వన్నె దెచ్చిరి. వారు మా పశ్చిమ గోదావరిజిల్లాలో చేసిన ప్రచారఫలితముగా 270 గ్రంథాలయములు నెలకొల్పబడి సుమారు 700 గ్రామములలోను వారిని ఎరుగనివారు లేరనిన అతిశయోక్తి ఎంతమాత్రము లేదు. మన భారతదేశము పూర్వపు ఔన్నత్యములతో తులతూగవలెనన్న ప్రతిగ్రామమందును గ్రంథాలయములు నెలకొల్పి, తద్వారా ప్రతిపౌరునిచేతను దేశచరిత్రలను పత్రికలను విధిగా చదివేటట్టు చేయవలెననెడి పంతులుగారి ఆశయము నెరవేరునట్లు ప్రతిజిల్లాలోను జిల్లా-తాలూకా గ్రంథాలయ సంఘములను వెంటనే స్థాపించి తద్వారా గ్రామగ్రంథాలయములను స్థాపించునట్లు నిరంతరకృషి జరుపవలసినదని గ్రంథాలయోద్యమాభిమానులందరిని ప్రార్థించుచున్నాను. గ్రంథాలయోద్ధారక శ్రీ అయ్యంకి వేంకటరమణయ్య పంతులుగారికి ఆయురారోగ్య ఐశ్వర్యము లొసంగవలసినదనియు వారి ఆశీర్వాదఫలితముగా ప్రతిగ్రామమునందు గ్రంథాలయములు నెలకొల్పుటకు గల శక్తిని వివేకమును ప్రసాదించవలసినదనియు సర్వేశ్వరుని ప్రార్థించుచున్నాను.

శ్రీ వేగేశన సూరపరాజు

శ్రీరామ సుబ్బరాజేంద్ర గ్రంథాలయ కార్యదర్శి, పాందువ్వ.

---

ఓమ్

# మా మిత్రుడు

ఉన్న గుణాలను దాచడం, లేని గుణాల నాపాదించి శ్లాఘించడం రెండూ మా కయిష్టమే - మేమెఱిగిన వాటిలో గొన్నిటిని మాత్రమే యిందు ప్రస్తావిస్తున్నాం.

ఇతను గ్రంథాలయోద్యమంలో బ్రవేశించి, ఆంధ్రదేశ గ్రంథాలయసంఘం స్థాపించిన పిమ్మట, తదారభ్య మాకు పరిచయం - మాకు సన్నిహిత సంబంధం అంతగా లేకపోయినా - ఉత్తరప్రత్యుత్తరాలు, పత్రికాసంబంధం, అప్పుడప్పుడు కలుసుకోవడం లేకపోలేదు

రమణయ్యపంతులులో మొదట ఉన్న స్వభావగుణా లేవో అవే యిప్పుడూను. అయితే వయస్సుతోబాటే అవి కూడా క్రమాభివృద్ధిని పొందుతూనే యున్నాయి. ఎప్పుడూ విచారమునకు లొంగిపోవని, కలకలనవ్వుతూ ఉండే ఆ నవ్వుమొగము, ఆ చతురోక్తులు, ఆ కలిసి కట్టుతనం, ఆ ప్రేమ, ఆ నిగర్వం, ఆ కార్యసాధనోపాయాలు, ఆ నిర్భయత్వం, ఆ సాహసౌదార్యాలు గల ఆ వ్యక్తి యీ పంక్తులు వ్రాసేటప్పుడు మా కళ్ళయెదుట ఉన్నట్టే ఉంది.

ఇతను పెద్దస్థితిపరుడు గాకపోయినా, నిరంతర పరోపకారజీవి. పరుల ఆనందమె తన ఆనందం, ఎవరేది కావలెనని కోరినా, ఎవరే సాహాయ్యమును వాంఛించినా, శక్తికొలది, చేయడమేగాని "లేదు" అనే రెండక్షరాలు అతని నోటినుండి రావడం, మేము వినలేదు. అన్నదానమంటే మహాప్రీతి. నిత్యము అతనిపంక్తిని ఎవరో యొకరు యుండితీరవలసినదే - అతని భార్య అతిథి అభ్యాగతులు లేని దినము దుర్దినముగా తలచేది అని చెప్పగా వింటిమి. ఇప్పు డితని కోడళ్ళకు గూడ ఈ వాసనే పట్టుకుంది. మహాత్మాగాంధి, మొదటిసారి బెజవాడ వచ్చినప్పుడు, మేము కూడ, మా మిత్రుని యింటనే బస. ఆ రోజులలో అతని యిల్లు చూచితీరాలి. అది యొక మహాసత్రం అయిపోయింది. అతని భార్య నిజముగా అన్నపూర్ణామహాదేవియే. ఆతల్లి మహానందముతో అతిథిసేవ బాగా చేసేది. ఉదయం లగాయతు, రాత్రి ఒంటిగంట రెండుగంటలవఱకును, వేసే విస్తళ్ళకు తీసే విస్తళ్ళకు తెరపియేలేదు. ఆ రెండు, మూడురోజులూ సంతర్పణ జరుగుతూనే యుంది - ఎంత వ్యయమైనదో ?

పిసినారితనం అంటే ఏమిటో యిప్పటివరకూ యితనికి తెలియదు. డబ్బును లెక్కచూచి ఖర్చుపెట్టడం, అతనికి అలవాటులేదు. అవసరమైన ఖర్చులు చేసుకుంటూ ముందుకు పోతూవుండడమే అభ్యాసం - అట్లా అని దూబరా ఖర్చు చేసేవాడుకాడు. ఎంతమంది స్నేహితులువచ్చినా, బంధువులు వచ్చినా, ఆశ్రితులు వచ్చినా, అన్నవస్త్రాలక్రిందనే ఖర్చు - వ్యయపరచే, ప్రతీ పైసా, పరోపకారము కోసమే - ప్రతివానిని నిముషంలో స్నేహం చేస్తాడు. చేస్తాడేమిటి - ఆ విగ్రహాన్ని

చూడగానే, ప్రతివానికి స్నేహం చేయవలెననే బుద్ధి కలుగుతుంది – మిత్రుడుగా ఉన్నవాడెవడును మళ్ళీవిడచిపెట్టలేడు. అతనికి విరోధిఅంటూ ఎవడైన ఉంటే వాడు స్వార్థపరుడూ, నాస్తికుడూ– దేశద్రోహి – పరవంచకుడు అయియుండాలి. ప్రతివాని ప్రేమలోను అతను కలిసిపోతూ ఉంటాడు. ఈసందర్భంలో మా “ఒక పద్యం జ్ఞాపకం వస్తోంది,

తే॥ గీ॥ అఘమువలన మఱల్చు హితార్థకలితు
జేయు గోప్యంబు డాచు బోషించు గుణము
విడువ డాపన్ను లేవడివేళ నిచ్చు
మిత్రు డీలక్షణమ్ముల మెలగుచుండు ”॥

ఈ లక్షణాలన్నీ మామిత్రునియందు గలవనియే మావిశ్వాసం. మా వేంకటరమణయ్య యే కార్యం తలపెట్టినా, మధ్యమధ్య విడిచిపెట్టే స్వభావం గలవాడుకాడు. ఎంతవఱకు చేసి తీరాలని సంకల్పిస్తాడో, అంతవఱకును చేసి తీరవలసినదే – ఈ లోపున నిద్రపోడు. ధనవ్యయమునకు వెనుక తీసే గుణం స్వభావములోనే లేదయ్యె – శరీర శ్రమను లెక్కజేసే, దుర్బలుడుగాడు – ప్రజాసేవ విషయములో ఎప్పుడూ ముందడుగు వేస్తునేయుంటాడు.

ఆంధ్రదేశంలో, గ్రంథాలయములందు అభిరుచి కలగడానికి, లేనిచోట్ల నెలకొల్పడానికి, ఉన్నవాటిని పోషించడానికి, దేశప్రజలకు ఆసక్తిని నూతనోత్సాహమును గలిగించినవాడు మన రమణయ్య అంటే, యెవరును అసూయ జెందరనుకుంటాను. గ్రంథాలయము పేరుచెపితే యితను జ్ఞాపకము రాకపోడు. గ్రంథాలయోద్యమమే, రమణయ్య. రమణయ్యఅంటేనే గ్రంథాలయోద్యమం అనిచెప్పాలి.

వేంకటరమణయ్య దేవ, సజ్జన, సాధు, బ్రాహ్మణ, ప్రియుడు. దీనజనసేవాసక్తుడు. దేశారాధకుడు. భాషాసేవకుడు. సత్కవిమిత్రుడు. సనాతన మతాభిలాషి. ఇట్లని, కాలానుసరణంబులగు సంస్కారములు గోరువాడు కాకపోలేదు. అతనికిగల ఆస్తిక్యతాబుద్ధికి, దివ్యజ్ఞాన సేవయే నిదర్శనము. రెండవది, భగవద్గీతా కృతిక ర్తృత్వము.

అనంతశక్తి పరుడు. ఆద్యంత శూన్యుడు. సర్వవ్యాపకుడు. సర్వనియంత యగు నా పరమాత్మ మా వేంకటరమణయ్యకు సదా ఆయు రారోగ్యభాగ్యములను సత్కార్యోత్సాహశక్తిని దివ్యజ్ఞానమును ప్రసాదించును గాక!

ఓమ్ తత్ సత్

శ్రీ పరామహంస వాసుదేవానంద సరస్వతీస్వామి

———

# పరిచయ వాక్యములు

లోక కల్యాణమును, దీన జనోద్ధరణమును పరమావధిగ నిడుకొని యీశ్వరసేవయు, దేశసేవయు గ్రంథాలయ సేవక రూపమున గడచిన ముప్పది సంవత్సరములనుండి తమ సర్వస్వమును ధారబోసి ఆంధ్రదేశమున గ్రంథాలయోద్యమము నింత అభ్యున్నత స్థితికి తెచ్చి తెలుగునాడికి విజ్ఞానభిక్ష పెట్టిన శ్రీ అయ్యంకి వేంకటరమణయ్య పంతులుగారి నెరుగని తెలుగు సోదరులుండరు.

కర్ణ పార్శ్వములనుండి భుజములతో నెకసక్కెములాడుచూ రెక్కవ నెరసిన గుంగురులవంటి వారి తలవెండ్రుకలును, జాతీయ నిత్యశ్వేత వస్త్రధారణయు, మీసముల సందునుండి తొంగి తొంగిచూచు వారి చిఱునవ్వుతో గూడిన శీతలదృష్టిగల గంభీరమగు ముఖమండలము తెలుగు (వారి) కీవిని, పంతులుగారియొక్క గొప్పతనమును, సౌజన్యమును, సభ్యతను, గుణసంపదను, పెద్దమనిషితరహాను ధృవపరచుటతో నెవ్వరి నాకర్షింప కుండును?

నాడు 25-10-37 తేదీన మూడేనుగులతో అశ్వదళముతో ప్రత్యేక మోటారు కారుల బారులతో వాహన భటాదు లరుదెంచుచుండ అసంఖ్యాకులగు ప్రేక్షక ప్రతినిధులు జయ జయ ధ్వానములతో ఇరువదియవ ఆంధ్ర మహాసభను పురవీధు లూరేగించునాడు ఐచ్ఛిక సేవాదళ ప్రధానాధ్యక్షుడుగ నియమిత దుస్తుల ధారుడై, శ్వేతాశ్వారూఢుడై ఆంధ్రపతాకము చేబూనిన నాటి శ్రీవారి దృశ్యమును చూచిన ఆంధ్రసామ్రాజ్య లక్ష్మి నప్పుడే దిగ్విజయయాత్రలో గెలుపొంది తెచ్చిన వీరపుంగవునివలె గన్పట్టిన వీరి ఆంధ్రాభిమానము నెవరు శంకింపగలరు?

ఇరువది సంవత్సరముల కాలమునుండి వీరి ప్రజాసేవక కార్యము నేనెరుగుదును. నేను జస్టిసువాదిని. వీరు జాతీయవాది. కాని రాజకీయసంస్థలలో సాంఘిక సంస్థలలో సంస్కరణ భాగములలో, ఆంధ్రసభలలో, హిందూసభలలో, సారస్వతసభలలో, పౌరరక్షణ సభలలో, వివిధ విద్యాగోష్ఠులలో, యువజన, యువతీజన, చిత్రలేఖన, వ్యాయామ, గాన, లలితాకళాదిలౌకిక ఆధ్యాత్మికములగు నన్ని ప్రజాభ్యుదయములగు సంస్థలలో పంతులుగారి ప్రవేశము, సేవ, ధన సహాయము, లేనిది లేవనిచెప్పుట, ఉత్ప్రేక్షణము కాని యథార్థమునకు దూరముగాని కాదు.

పంతులుగారు ఆంధ్రమహాసభ స్టాండింగు కమిటీ సభ్యులు. ఆంధ్రరాష్ట్ర హిందూ మహాసభ కార్యనిర్వాహక వర్గసభ్యులు. ఆంధ్ర ఆంగ్లపత్రికా వ్యవస్థాపకులు.

ఐతే యిందు ప్రధానసేవకభాగము గ్రంథాలయసేవ. ఇట్టి మహాకార్యముల నిర్వహించుట యందు నిమగ్నులై విశ్రాంతిలేక పెక్కు పర్యాయములు తమ ఆరోగ్యమును కోల్పోవుటయు నే నెరుగుదును.

గనుక నిన్నివిధముల నాంధ్రులకు విజ్ఞాన భిక్షపెట్టిన పంతులుగారి నీ శుభసమయమున "గ్రంథాలయ విజ్ఞానసర్వస్వము" యని ప్రేమపూర్వకముగ సంబోధించుటకు మరియని వా రెవరుందు రని విజ్ఞప్తి చేయుచున్నాను, నమస్తే.

శ్రీ పెదప్రోలు సూర్యనారాయణ
ప్రధాన కార్యదర్శి,
ఆంధ్రరాష్ట్ర హిందూమహాసభ.

---

# పరిచయము

నేను గ్రంథాలయోద్యమమున సేవచేయ నారంభించినది మొదలు శ్రీయుత అయ్యంకి వేంకటరమణయ్యగారి పరిచయము గలదు. వారి పరిచయమునకు ముందు వారి గ్రంథాలయోద్యమ వ్యాసములు, నిర్మాణపద్ధతులు, కార్యవిధానము నాకు మార్గదర్శకములయ్యె ననుట సత్యదూరము గాదు. నే నీమన్నెపు ప్రాంతములందు గ్రంథాలయ స్థాపనజేయుచు గావించిన ప్రబోధముల గాంచి వీరును, ఆంధ్రగ్రంథాలయోద్యమ పితామహులగు బ్రహ్మశ్రీ సూరి వేంకట నరసింహ శాస్త్రిగారును ఎంతయో సానుభూతి నెరింగించుచు ప్రోత్సహించుచుండెడివారు. ఈమనూరు నందు నేను స్థాపించిన శ్రీ దేశోద్ధారక ఆంధ్రభాషానిలయ సర్వస్వము పరశురామప్రీతి కాగా వీ రుభయులు చేసిన గ్రంథసహాయము మరుపునకు రానిది దేశీయుల సహాయార్థము విజ్ఞప్తుల ప్రకటించిరి. చాలకాలము గ్రంథాలయ సర్వస్వమను పత్రిక నుచితముగా నొసంగిరి. ఆంధ్రదేశమున, కేంద్ర గ్రంథాలయ సంఘమునకు ఏకధాటిగ 25 సంవత్సరములు కార్యదర్శిత్వము వహించి వీరే ఉద్యమవ్యాప్తికి జీవితమును ధారవోసిరి. ఇక నిజాంరాష్ట్రమున ఆంధ్రజన కేంద్రసంఘమునకు శ్రీయుత మాడపాటి హనుమంతరావుగారే కార్యదర్శిగ నుండి ఆంధ్రోద్యమ వ్యాప్తికి పాటుబడిరి. ఇంతకాల మిటుల సంస్థల నడిపినవారు లేరనవచ్చును. అందువలననే వారి సేవలు పూజనీయములై, వారి కార్యవిధానములు మార్గదర్శకములై, వారి యడుగుజాడల పురస్కరించుకొని ఈనాడు మన మెన్నయో సంస్థలను కొనసాగించుచున్నారమనుట అతిశయోక్తి గాదు. శ్రీ వేంకటరమణయ్యగారు కార్యశూరుడుగాని, వాగాడంబరుడు కాడు. సేవకుడుగా నుండ నెంచునుగాని, నాయకుడని భావించడు. కార్యనిర్వహణమునం దాసక్తి జూపునేగాని అగ్రాసనాధిపత్యముల కాశించడు. వీరి నిరాడం

బరమైన గ్రంథాలయసేవ అఖిలభారత గ్రంథాలయోద్యమమునకు పట్టుకొమ్మయైనది. ప్రారంభ దశలో ఎందరో కవులు వీరి యాదరణవల్ల పేరు ప్రతిష్ఠల గడించిరి ఎందరెందరో ఉన్నత పదవుల నహించిరి. ఎందరెందరివో అచ్చొత్తించుకొనలేని వారి గ్రంథముల ప్రకటించి సాయపడిరి. నిజముగా ఎక్కడ గ్రంథాలయమేర్పడిన, ఎక్కడ వార్షికోత్సవమున్న అక్కడ వీరు ప్రత్యక్షదేవుడు. గ్రంథాలయమూర్తి తాండవించును. ఇట్టి సేవాధురంధరుని, మనదేశమున గ్రంథాలయోద్యమమునకు మూలపురుషులైన శ్రీ వేంకటరమణయ్యగారిని సన్మానించుట, కృతజ్ఞతాపూర్వకముగ సన్మాన సంపుటములను సమర్పించుట చిరస్మరణీయమును, చరిత్రాత్మకమును కాగలదు. మా ప్రయత్నములపట్ల అనేకవిధముల సహాయసానుభూతుల నొసంగి ప్రోత్సహించుచు వచ్చిన వీరి నీసందర్భమున మా సంస్థాన గ్రంథాలయ సంస్థల పక్షమున అభినందించుచున్నాను. వీరి జీవితకాలముననే ఆంధ్రదేశమునకు కేంద్ర గ్రంథాలయ నిర్మాణమగునట్లు పరమేశ్వరు డనుగ్రహించుగాక!

పాల్వంచ,
నైజాం,
1—12—42.

సాహిత్యవిశారద,
శ్రీ కో. వెం. రా. లా. నా. శర్మ.
ఆంధ్ర వాఙ్మయసేవాసమితి కార్యదర్శి.

---

# గ్రంథాలయాల జాగ్ది బాప్టిస్టు

దేశీయ వస్తుప్రోత్సాహపు రోజులు అవి. కొందరు యువకులు గ్రామాలకు వెళ్ళి ఆ సందేశాన్ని యిస్తూవచ్చారు. ఒకనాడు వీరు పెనుగంచిప్రోలు కాలువలో స్నానాలు చేసి ఒడ్డున నిలబడ్డారు. "మీరంతా మాగ్రామానికి వచ్చినందుకు మాయువకులంతా మీకు కృతజ్ఞులు. మనగ్రామాల అభివృద్ధికై పనిచేయాలి అని నామనస్సు కొట్టుకుంటోంది అయితే, నాకు తగినంత తరిఫీతు లేదు. చదువు మానుకొన్నాను. దేశపు స్థితిగతులను గ్రహించేదానికి మీకు తెలిసిన మంచిపుస్తకాలు ఏవైనావుంటే చెప్పండి" అని అంటూ వీరి మొగాలవంక చూస్తూ నిలుచున్నాడు ఒకయువకుడు. ఈయనకు పదహారు, పదిహేడు సంవత్సరాలకంటె హెచ్చు వుండవు. చెప్పతగిన ఆకర్షణ యేమీ లేదు. కాని, సేవాభిలాషతో వుబులుకుతూ వుండీనహృదయం ఆయనది.

*   *   *   *   *

రెండుమూడు సంవత్సరాలు గడచినాయి. ఈయనసంగతి మళ్ళీ తెలియనేలేదు. ఒకరోజున బందరులోని కృష్ణాపత్రిక ఆఫీసు కీయువకుడే వచ్చి కృష్ణారావుగారి కెదురుగా కూచుండి "ఏదైనా వారపత్రికను స్థాపించి దానిద్వారా మనప్రజకు సేవచేయాలి అనివుంది, మీసహాయం, అభిమానం వుంటే యీపనికి సాహసిస్తాను. తరువాత మీదయ" అని కృష్ణారావుగారి జవాబుకు

నిరీక్షిస్తూ వున్నారు. ఈయనయెవరో కృష్ణారావుగారికి తెలియదు. పేరైనా విన లేదు. ఏమిచెప్ప తారో చూదాం అని మేమంతా అనుకొంటూవుంటే "చూడండి అక్కడ కలకత్తాలో మోడరన్ రివ్యూ వుంది. ఇక్కడ చెన్నపట్నంలో ఇండియన్ రివ్యూవుంది. అవతల అలహాబాదులో హిందు స్థాన్ రివ్యూ వుంది. ఆలాగే మన తెలుగులో ఒక చక్కని మాసపత్రికను ప్రకటించే దానికై మీరు ప్రయత్నిస్తే బాగా వుంటుంది. అయితే యేదో లాభం వస్తుందనిగాని పేరువస్తుందనిగాని యీపనిలో దిగవద్దు" అని కానే పాగి "మా ఆఫీసులో అచ్చువేయించి యివ్వమంటే యిస్తాను. అయితే క్రొత్త టయిపులు, మంచికాగితం, బ్లాకులు తెప్పించాలి. వ్రాయగలవాళ్ళను ఆశ్రయించాలి" అని మేము యెవరము అనుకోని పద్ధతిని జంబిచ్చారు. ఆంధ్రదేశంలో పేరుప్రతిష్ఠలు సంపాదించుకొని యిప్పుడు ఏప్రాంతానికివెళ్ళినా నగారా ధ్వనిలాగ పేరువినబడుతూ అక్కడ పెనుమంట్రలోనూ యిక్కడ బందరులోనూ కనుపించిన యువకుడే మన అయ్యంకి వేంకటరమణయ్యగారు.

*  *  *  *  *

పత్రికకు కావలసిన సామగ్రి యావత్తూవచ్చింది. గొడుగుపేటలో కాబోలు ప్రత్యేకంగా కార్యస్థానాన్ని నెలకొల్పారు. మంగిపూడివారు, రాయప్రోలువారు, గాడిచర్లవారు, మొదలయిన హేమాహేమీలను రప్పించారు రమణయ్యగారు. కొమర్రాజు లక్ష్మణరావుగారు, పానుగంటి రామారాయణంగారు, మొక్కపాటి సుబ్బారాయుడుగారు మొదలయిన సుప్రసిద్ధ లేఖకుల తోడ్పాటును కూడా సంపాదించారు. రోజూ దర్బారు లే "పయిడి" *పకోడీ లే. క్రొత్తమెరుగులతో విద్యార్థుల వ్యాసాలతో కృష్ణారావుగారి చిన్న వ్యాఖ్యలతో, నెల్లూరుఆవుల చిత్తరువులతో "ఆంధ్రభారతి" బయలుదేరింది. ఆంధ్రపత్రికల్లో యిది క్రొత్తదారిని త్రొక్కటమే కాదు. ప్రముఖుల దృష్టిని ఆకర్షించింది. విద్యావంతుల అభిమానాన్నిన్ని భాషాభిమానులగు శ్రీ శ్రీ పిఠాపురం మహారాజా వారి ఆదరాన్ని సంపాదించింది. ఒక వెలుగు వెలిగింది.

*  *  *  *  *

ఆరోజుల్లో దేశహితైకాభిలాషులగు యువకులకు వీరేశలింగం పంతులుగారి వితంతూ ద్వాహోద్యమం, వేంకటరత్నం నాయుడుగారి బ్రహ్మసమాజోద్యమం, జేడెన్ పవల్ గారి బాయిస్కౌటు వుద్యమం, బరోడావారి గ్రంథాలయోద్యమం, వీటికిమించి ఉద్యమాలేవీ లేవు పనిచేయడానికి అయ్యంకివారికన్ను బాలభటోద్యమంమీద పడింది. ఆంధ్రదేశానికి కమిష్నరనరో, డిప్యూటీ కమిష్నరనరో, జ్ఞాపకంలేదు. మెడకు బిగులు వ్రేలాడవేసుకొని కాకీయూనీఫారంధరించి రయిలు బండిలో యెక్కేటప్పుడు, దిగేటప్పుడు, స్కౌటుల సలూటు పుచ్చికొనేరోజుల్లో అయ్యంకివారి ఠీవి. దర్పం, నిరాయి నడక, దండును నడిపించేశక్తి, దీక్షగల మనస్సు – వీటినిజూచి హర్షింపనివారు లేరు.

---

* "పయిడి" అనునతడు బందరులో ఆరోజులలో బాగా ప్రసిద్ధికెక్కిన పకోడీలు తయారుచేసే వర్తకుడు.

ఆ పెద్దకొండల, అడవుల, నదుల, దగ్గర తమ దండుతో మకాం వేసి, అగ్నిహోత్రాలు రగిల్చి, ప్రత్యేకపు అగపులు వేయించి కవాతు చేయిస్తూవుంటే ఒక వుద్రేకం, వుత్సాహం, ఆపుకోజాలని సంతోషం, వెల్లగిలి "ఛీర్సు టు అయ్యంకి" అని హెచ్చరించటం సామాన్యమయింది. దర్పంగా కనిపించటంలో, దీక్షతో పనిచేయటంలో, యెవరికిన్ని మన ఆంధ్రభటులు తీసిపోరనే కీర్తి మోగిపోయింది అంతటాను. చివరకు బేడెన్ పవల్ గారు బాలభట సమూహాన్ని పరీక్షిస్తూ 'దేశరక్షణకు ప్రజాసేవకు శిక్షణ పొందుతూవున్న భావివీరవర్గం సుమా వీరంతా' అని అయ్యంకివారి నాయకత్వాన్ని, మనబాలుర నేర్పరితనాన్ని ప్రశంసించారు. కాకినాడలో జరిగిన దేశీయ మహాసభయందు వీరిసేవ ఫలించింది.

* * * * *

ఆరోజుల్లో యెక్కడ పట్టినా "బరోడా-భాండాగారోద్యమం" అనే మాటలే. ఈ వుద్యమంలో అయ్యంకి వేంకటరమణయ్య, సూరి నరసింహశాస్త్రి, గోపరాజు బ్రహ్మానందం, వేలమూరి గోపాలకృష్ణయ్యగార్లు, "దుష్టచతుష్టయం" అనే బిరుదును సంపాదించుకొన్నా వేంకటరమణయ్యగారికి ఆంధ్రదేశ భాండాగారోద్యమకృషిలో "జాన్ దీ బాప్టిస్టు" స్థానాన్ని యివ్వాల్సివుంటుంది. ఊరూరా తిరిగాడు. సభలుచేశాడు. పత్రికద్వారా తనసందేశాన్ని చాటాడు. దేశమంతటా పుస్తకాలను చిమ్మివేసాడు. కుగ్రామాల్లో పుస్తక నిలయాలను పెట్టించాడు. అందుబాటులో లేని పల్లెలకు పుస్తకాలను పెట్టెలలో పెట్టించి సంచారం చేయించాడు. ఇంతేనా ? రావణుడు భూమిని చాపనుచుట్టినట్టు "యీదుష్ట చతుష్టయం" గ్రామజీవనంయొక్క ఆయువుపట్లను పుస్తక భాండాగార మందిరాల్లోకి లాక్కొని వస్తామని భగీరథ ప్రయత్నం చేశారు.

* * * * *

ఉత్సాహపూరితుడైన వేంకటరమణయ్యగారి నిరంతరకృషిని, సేవను, దేశం మరువ లేదు. ఆదరణచూపుతూ వచ్చింది. వెల్లింగుడన్ ప్రభువుయొక్క ఆదరణకు పాత్రమై చెన్నపట్నంలో జరిగిన అఖిలభారత గ్రంథాలయోద్యమ మహాసభలో వేంకటరమణయ్యగారి కృషికి హర్షిస్తూ ఒక బంగారపు పతకంతో బహూకరించవలసిందని అమెరికానుంచి క్రొత్తగా దిగిన నేను ప్రతిపాదించినపుడు "అయ్యంకివారి చిన్నవాడు" క్రొత్తగా అత్తవారింటికి వెళ్ళే ఆడుపిల్లలాగ వెక్కివెక్కి యేడ్చిన రంగం యిప్పటికిన్ని నా మరుపుకు రాలేదు. ఏదో గౌరవపూర్వకంగా చేసే సన్మానానికి యిక్కడ అయ్యంకివారు కన్నీరుకారిస్తే అక్కడ ఆంధ్రకృష్ణాపత్రికాధిపతుల సన్మానసందర్భంలో సుప్రసిద్ధులగు న్యాపతి సుబ్బారావు పంతులుగారు కన్నీరు నింపారు. అయినా, టంగుటూరి ప్రకాశం పంతులుగారి పుణ్యాన నేను సూచించిన బంగారపు గుడిబండకు బదులు ఆంధ్రగ్రంథాలయ పెన్సునను తగిలించారు. వేంకటరమణయ్యగారు దేశానికి తమ సేవను సమర్పిస్తే, వారికి ఆంధ్రగ్రంథాలయ పెన్సునను సమర్పించింది దేశం.

* * * * *

వేంకట రమణయ్యగారు మొదటినుంచిన్నీ "మన గ్రామస్థుల జ్ఞానాన్ని వృద్ధిచేయటం యెట్లా ?" అనే ధ్యాసతో కొట్టుకున్నవ్యక్తి. "ఆంధ్రభారతి" ఆయనలో బయలుదేరిన తీవ్రమైన వేడిని తగ్గింపలేక పోయింది. బాలభటోద్యమం బాహుళ్యమైన వారి వుత్సాహాన్ని తృప్తిపరచలేక పోయింది. ఇంతలో బరోడావారి గ్రంథాలయోద్యమం సజీవిపృతంలాగ యెదురుపడ్డది. అప్పటికీ యిప్పటికీ గ్రంథాలయోద్యమం నాలుకకూ, చేతికి పని కల్పించటమే కాదు. ఆయన ప్రకృతికిన్నీ, సేవాభిలాషకున్నూ, గ్రామోద్ధరణకున్నూ అనుకూలమైన రంగాన్ని సమకూర్చింది. బెజవాడలోని రామమోహన గ్రంథాలయం న్యాయార్కులోని స్వాతంత్ర్యజ్యోతిలాగ వేంకటరమణయ్యగారి కృషిని, సేవను, వెలుపెట్టి మనకే కాదు, మన తరువాతి వారికిన్నీ చూపుతూ వుంటుంది.

*    *    *    *    *

అయ్యంకి వారు సంపన్న గృహస్థు. వ్యవహర్త. దూషించినా నవ్వుతాడు. భూషించినా నవ్వుతాడు. అతివ్యయాన్ని యెరుగని కార్యోత్సాహి. మితసంభాషి. జ్ఞానమాంబతో కానీయండి, సోమనాథరావుతో కానీయండి, చయనులుతో కానీయండి. పాకయాజితో కానీయండి, యెవరైనాసరే, ఏ అభిప్రాయాలు కలవారితోనైనాసరే; కలిసి, మెలసి, చనువుగా, కులాసాగా, వ్యవహరింపగల సమరసుడు. స్నేహితుడు. ఆ ప్తుడు.

ఆవటపల్లి నారాయణరావు.

---

# పురుషోత్తముడు

శా॥ శ్రీరామ ప్రభువర్య పావనసుచారిత్రామృతాంబు స్మృతం
బారం జింతనజేసి పాడుచు తదీయాచారధర్మంబు లిం
పార స్నేరిచి సంచరింప గడు ధన్యాత్ముల్గదే! పూరుషుల్
వారిన్మెచ్చవె ముజ్జగంబులు? సుర ల్వర్షింపరే నూనముల్?. 1

సీ॥ కరుణారసాఽమృత స్ఫురితలోచనములే
పుండరీకములను బోలి వెలయు
నిరతప్రసన్నసన్నిహితాననంబె రా
కాచంద్రమండలఘనత మించు
మహితస్వార్థత్యాగ మాన్యవర్తనమె స
త్కవిజనవాగ్గరిమ గాంచు

పరసతీసోదర భావోన్నతత్వమే
పురుషమోహనమూర్తి వరలఁజేయు
లలితదయాసత్య కలితజీవనమె స
ర్వజన సౌభ్రాతృత్వపటిమ నెఱపు
బహిరంతరస్థిత పావనశీలమే
సాధుమానవలోకసన్నుతి గను
దీనజనావన దీక్షయే యిహపర
శాశ్వతసుఖభాగ్యసరణి జూపు
నిశితాంతరాత్మసునిశ్చితాజ్ఞానుసం
చరణమే భవముక్తిసాధన మగు

గీ॥ నిష్కపటవృత్తి, యింద్రియ నియతశక్తి,
దైవగురుభక్తి, వేదోక్త ధర్మరక్తి,
గలుగు శుద్ధుండు ధీరుండు లలితకీర్తి
కాడె? కోసలకన్యకా గర్భవార్ధి.

గీ॥ చంద్రుడై యొప్పు శ్రీరామచంద్రమూర్తి
వలెనె శాశ్వతమూర్తియై వరలునతడె
పూరుషోత్తమ విఖ్యాతి బొదలు నతడె
యఖిలభూతహితుండునై యలరునతడె ॥ 2

గీ॥ లోకమెవ్వాని గాంచి భయాకులతను
గనదొ; యెవ్వడులోకము గాంచి భీతి
నందడో; యెప్పుడును దృప్తు డగునెవండొ;
యతడెపో సర్వలోకస్తుతార్హుడగును. 3

గీ॥ అట్టి సుగుణ గరిష్ఠుడై నట్టి పురుష
వరుడు కృతినాయకుండౌట వల్మికోద్భ
వుని పురాకృత ఘనతర పుణ్యపాక
గరిమనేకాదె! యొరులకు గలుగు నెటులు?

# పురుషోత్తముడు

గీ॥ మహిత నవరస సాహిత్య మధురగరిమ
విమల గానసుధాంభోధి వీచికలను
గలిపి జగదీశు మదిలోన నిలిపి కొలిచి
సచ్చిదానంద మగ్నుడౌ జనుడె ఘనుడు. 5

చ॥ తన కులధర్మపద్ధతి యుదారమనస్థ్సితి సాధుసత్కృతిం
దన వరజాతి విద్యయు సదా తన భావను బ్రోచు దీక్షయున్
ఘనతర దేశభక్తియును గల్గి మెలంగుచు దీనసజ్జనా
వనరతి నొప్పు నప్పురుష వర్యుడె సార్థక జన్ముడారయన్. 6

చ॥ పరసతి గాంచి తల్లియని భావనసేయుట, ధర్మసూక్ష్మముం,
గురుతర సత్యదీక్షయు, నకుంఠిత భూతహితానురక్తియున్,
వరలి యసూయ లేక మృదుభావముచే జరియించు ధీరు డా
పురుషుడు రామచంద్రుసరి బోలడె కీర్తిసభంబు గాంచడే ? 7

చ॥ దయయు ఋతంబు శౌచమును దామది నెన్నని వా రొనర్చు నా
గయ దరి పిండదానములు గ్రంథ సమీక్షణ భోగభాగ్యముల్
నయతర వేదశాస్త్ర పఠనంబును చక్కెరపోత పల్కు ల
న్నియు వృథయౌనుగాదె ధరణిన్ మెఱమెచ్చులు మేలు చేందునే? 8

గీ॥ చెవికి చేదైన హితమును చేరిచెప్పు
గడుసు, లేమి వేళలనైన విడకగొలుచు,
తనకు లాభంబు సుంతైన తలపకుండు,
నాపదల సాయమొనరించు నతడె హితుడు॥ 9

కవయిత్రీమణి,
గుడిపూడి ఇందుమతీదేవి.

# గ్రంథాలయోద్ధారక

# శ్రీ అయ్యంకి వేంకటరమణయ్యగారు

అది నడివానాకాలం. ఆయేడు కాలానికి అతివృష్టిదోషంకూడా పట్టినట్లు జ్ఞాపకం. ఆ యింటిమీది కాకి యీ యింటిమీద వాలకుండా వానలు కురుస్తూండేవి. ఒకనాటి సాయంత్రం ఆకస్మికంగా కొండ దట్టంగా మొయిలు కట్టి, కళ్ళు మిరుమిట్లు గొలిపేటట్లు మెరుపులు మెరుస్తూ, గుండెలు తల్లడిల్లేటట్లు మేఘాలు గర్జిస్తూ, కొండ చిల్లులు పడినట్లు వాన కురియడం ప్రారంభించింది. అంతలో గాలి ప్రభంజనరూపం దాల్చి చెట్లు చేమలనూ, ఇళ్ళకప్పులనూ ఊపడం మొదలు పెట్టింది. ఈ స్థితిని గమనించి మా పంతుళ్ళు బడి వదలిపెట్టి యెవరళ్ళ యిళ్ళకు వాళ్లను జాగ్రత్తగా పొమ్మన్నారు. నియమితకాలానికి ముందుగా మమ్మల్ని బడి ఖైదునుండి విడుదల చేయడంచేత సంతోషం పట్టజాలక, గావుకేకలు వేసుకుంటూ, ఈలలు కొట్టుకుంటూ, తడిసిపోతామనే యోచనకూడా లేకుండా పలకలను, పుస్తకాల బొత్తులను తలమీద పెట్టుకొని వీధులవెంట పారుతూన్న వాననీటికాలువలను దున్నుకుంటూ ఇళ్లముఖం పట్టాము. ఎంతవాన కురిసినా ఎలాగో ఊళ్లోపిల్లలం యిళ్లు చేరగలుగుతాం. ఇంక పొరుగూళ్లనుండి వస్తూ, చదువుకొని పోతూండే వాళ్లగతేమిటి? మా బడిపిల్లలలో ఎవరికి స్నేహానుబంధం గల పొరుగూళ్ల పిల్లలను వారు తమ యిండ్లకు తీసుకొని వెళ్లారు.

పచ్చని సలాకువంటి శరీరం, తలమీది నుండి వీపుపొడుగునా వ్రేలాడుతూండే జడ, చేతులకు బల్లమురుగులు, కురంగ శాబకములాగున అమాయకపు బెదురు చూపులు, వినయము, మితభాషణము, ఆ ముఖలక్షణం, నడక, నడవడిక చూస్తే అతి గారాబంతో పెంచబడుతూన్న ఒక యుద్యోగస్థుని ముద్దుబిడ్డ డని వానిని చూచిన ప్రతివారూ గ్రహిస్తారు.

"ఒరే, రమణయ్యా! ఈ గాలివానలో మీ ఊరెల్లాగున వెళ్లగలవు? చీకటికూడా దట్టమవుతూన్నది. ఈరాత్రి మాయింట్లో తిని పండుకొని, రేపు ప్రొద్దున్నే మీయింటికి వెళ్లవచ్చును" అన్నాను. రాక విధిలేక నాతో వచ్చినా; వానిదృష్టి, మనస్సు మాత్రం వానిఅమ్మమీద, నాన్నమీద ఉండటంచేతను, ఆతడు తనతల్లిదండ్రులకు ఒక్కడే ముద్దుబిడ్డడవడంవల్ల, అమ్మ అన్నంకలిపి తినిపిస్తూంటే మారాంచేస్తూ, ఇటు అటు గంతులు వేస్తూ, చిక్కులు పెడుతూండడమునకు అలవాటుపడినవాడవడంచేతనూ, ఏలాగో కసివాట్లుగ తిని లేచేసరికి "మాఅమ్మ మిద్దెలో పక్క వేసింది, మనమిద్దరం ఆమంచంమీద కబుర్లు చెప్పుకుంటూ పడుకుందాం" అన్నాను. అప్పటికింకా ఆకాశం దట్టముగా మబ్బుకప్పి యుండడమువల్ల చీకటి మరింత గాఢమైంది. ఆ నిశీథంలోనుండి, వింతవింత రంగులతో మెరుపులు మెరుస్తూ, ఆ వెంటనే ఫెళఫెళమంటూ ఉరుములు ఉరుముతూ, వానఅప్పుడప్పుడు ఆగుతూ, సాగుతూ, జల్లులక్రింద పడుతూనే యుంది. గాలియొక్క తీవ్రతమాత్రం కొంతవరకు తగ్గింది.

## అన్నం తినరు, నిద్రపోరు

అట్టి బీభత్ససమయంలో ముగ్గురు బంట్రోతులు, రెండు లాంతర్లు పట్టుకొని, తాటి యాకుల గొడుగులతో సహా అబ్బాయిగారిని వెదుక్కుంటూ మా యింటికిరాగా వాళ్లను చూసే సరికి మా రమణయ్యముఖంలో వికాసమూ, నాకు ఆశాభంగమూ ఒకేసారి కలిగాయి. “ఈగాలి వానలో అయ్యగారు, అమ్మగారు అబ్బాయిగారెక్కడ నున్నారో, ఏమైనారో; యని తల్లడిల్లి పోతూన్నారు తక్షణం నిడదవోలు నావ తీసుకుని వెళ్ళి, దానిమీద మిమ్మలిని తీసుకొని రమ్మన్నారు. సెట్టిపేటనుండి ఇక్కడివరకూ కాలవగట్టు పొడుగునా దారికి అడ్డంగా పెద్దపెద్ద నిద్రగన్నేరు చెట్లు గాలివానకు విరిగి పడియుండడంచేత, ఆత్రోవను వెళ్లడానికి వీలులేక నావను తోసుకొని వచ్చాం. మిమ్మలిని వెంటనే తీసుకొనివెళ్ళి వారికళ్లయెదుట పెట్టితేనేగాని వారు అన్నం తినరు. నిద్రపోరు. నీలాటిరేవులో నావను నిలకట్టి వచ్చాం. బయలుదేరండి. వెడదాం” అన్నారు.

## సే వా భి లా షి కి అ వ కా శా లు

వాళ్లు అన్నదే తడవుగా అతి ఆతురతతో వాళ్లకంటె ముందుగానే దారితీశాడు. ఇప్పటికి దాదాపుగా నలభై రెండు నలభైమూడు సంవత్సరాలక్రిందట వేంకటరమణయ్య తండ్రిగారు నిడదవోలుకు మైలున్నరదూరంలో నున్న సెట్టిపేట పి. డబ్ల్యు. డి. డిపార్టుమెంటులో డెల్టా సూపరెంటెండెంటుగా నున్నకాలంలో ఆనాటిరాత్రి అంగరక్షకులుగా వచ్చిన బంట్రోతుల సహాయంతో మైలున్నర దూరంలోనున్న గ్రామానికి చేర్చబడిన బాలుడే; తరువాత, కొన్ని యేండ్లక్రిందట కృష్ణ పొంగి, వరదలు వచ్చి, ఆవలియొడ్డుననున్న గ్రామాలు కొట్టుకొనిపోయి వేలకొలది ప్రజలు నిరాహారులు, నిర్వాశ్రయులు అయియున్న సమయంలో కర్మవీరుడై, నిర్భయంగా తన ఐచ్ఛికభట దళంతో గూడ పడవలమీద నదిను త్తరించుకొని, ఆదురదృష్టవంతులకు అన్నవస్త్రాదులను తీసుకొని వెళ్ళి రక్షిస్తూ, అసంఖ్యాకులను ప్రాణాపాయమునుండి కాపాడుతూ మహోత్కృష్టమైన సేవ చేయగలిగాడు. ఆరోజులలో ఆంధ్రపత్రికా కార్యస్థానమువారు పంపించిన ప్రత్యేక విలేఖరి (శ్రీ గంటి నరసింహంగారు అనుకుంటాను) కృష్ణవరదలవల్ల అక్కడి గ్రామాదులవారికి, సంభవించిన హృదయవిదారణకరములైన కష్టనష్టాలనూ, ఆ సందర్భంలో దురదృష్టవంతులగు ఆప్రజలకు తన అనుచరవర్గంతో శ్రీ వేంకట రమణయ్యగారు చేస్తూన్న నిరుపమానమగు, అమూల్యమగు, అకలంకమగు సేవను ఏరోజు కారోజు వివరములతో వ్రాసగుచ్చినట్లు వర్ణిస్తూన్న విషయాలను చదువుతూన్నప్పుడు సేవాభిలాషియగు మానవునికి జీవితకాలంలో నెట్టి యెట్టి సేవావకాశాలు కలుగుతూంటాయో, ఎట్టి పరిణామావస్థలు సంభవమవుతూంటాయో ఆశ్చర్యం కలుగుతూండేది.

## న ది, నా య కు డు

జీవనప్రవాహంయొక్క, జలప్రవాహంయొక్క ఉత్పత్తి, గమన, గమ్యస్థానాలు విచిత్రంగా ఉంటూంటాయి. రెండింటి గమనిక ఒకేవిధంగా నుండడమువల్లనే అనుకుంటాను జలానికి

జీవనం అనేపేరుకూడా కలిగింది. నది పుట్టినచోట నామమాత్రంగా బయలుదేరుతూ, రానురాను నడుమనడుమ ఉపనదులు దానితో కలుస్తూండడమువల్ల ఒక మహానదిగా పరిణమిస్తున్నట్లే, మానవుని జీవితముకూడా ఒక యుద్దేశంతో ఒక అర్థంతో ప్రారంభమవుతూ, కాలానుగుణ్యంగా పొందుతూండు ఉత్సాహప్రోత్సాహాలను, సాధనవిధానాలను, సంఘటనలను బట్టి పూర్ణత్వం పొందడానికి అవకాశం కలుగుతూంటుంది. ప్రపంచంలో నుత్పన్నములయ్యే మహోద్యమాల చరిత్రలను మనం పరిశీలిస్తూంటే ఈవిధంగానే కనబడుతూంటుంది. ఒకవ్యక్తిమెదడులోనుండి బయలుదేరుతూండే మహదుద్దేశములే ఆవిషయపవిత్రతను, ఉపయోగమునుబట్టి దేశవ్యాప్తములే గాక విశ్వవ్యాప్తములగు మహోద్యమాలుగా పరిఢవిల్లుతూంటాయి. ఎక్కడనో, ఏమారు రాష్ట్రములలోని కొండచరియలలోనో పుట్టుతూండే శుష్కజలప్రవాహములు గతానుగతికముగా మహానదులుగా పరిణమించి, పరివ్యాప్తములైన ప్రాంతీయరాష్ట్రాలలోనికి కూడా ప్రవహిస్తూ, తమ తోయములను ఊసరక్షేత్రాలలోనికి కూడా పంపి వాటిని సస్యశ్యామలములగు దివ్యకేదారములు గాను, ఫలపుష్పభరితములగు మహోద్యానవనములుగాను మార్చివేస్తూండడము మనము గమనిస్తూనే యున్నాము. అదేవిధంగా ఒక యుత్తమపురుషుని ఊహాప్రపంచంలో ప్రభవించే మహదుద్దేశాలే బహుజనామోదమును పొందుతూ, విశ్వవ్యాప్తములగు మహోద్యమాలుగా మారి, లోకకల్యాణమునకు కారణభూతము లవుతూంటాయి. ప్రపంచంలో ప్రచలితము లయ్యే మత, సాంఘిక, రాజకీయ, వైజ్ఞానిక ఉద్యమాల కన్నిటికీ మూలపురుషు డెవ్వడో యొకడు వుంటూనే వుంటాడు. ఇందుకు నిదర్శనంగా మన భారతదేశంలో నుత్పన్నములైన ప్రజామోదము బడసిన యుద్యమాలలో ప్రధానమైనదిగ గ్రంథాలయోద్యమమును, దానికి ప్రధాన పురుషునిగ వేంకటరమణయ్యను ప్రమాణములుగా తీసుకోవచ్చును. వేంకటరమణయ్య కళ్ళుతెరచి, కార్యక్షేత్రంలో కాలుపెట్టేటప్పటికి మన దేశంలో నక్కడక్కడ కొందరువ్యక్తులు స్వతంత్రంగా సకృతుగా గ్రంథాలయాలను నెలకొల్పిన నెలకొల్పియుండవచ్చును. కాని దానికొక యుద్యమ స్వరూపాన్ని కల్పించి స్వరాజ్య, స్వాతంత్ర్యోద్యమాలవలెనే దీనికొక స్వతంత్రమగు ప్రజోద్యమంగా జేయగలిగినశక్తి, సమర్థత, ఉత్సాహము, పూనిక ఈతనిలో అంతర్హితములై యుండి సాధింపగలిగాడు గనుకనే ఆంధ్రదేశనాయక శ్రేణిలో ప్రధానగౌరవ స్థానమును పొంది, దేశమునందలి మహోద్యమములలోని యొకయుద్యమమునకు ప్రధానపురుషుడుగ బరిగణింపబడుతున్నాడు.

## సిద్ధహస్తుడు.

ఒక మహాకావ్యంలోని ఉపాఖ్యానాలవలె వేంకటరమణయ్య చేపట్టిన యుద్యమాలలో గ్రంథాలయోద్యమము ప్రాముఖ్యం వహించినప్పటికీ; బాలభట, ప్రకృతిచికిత్స, దివ్యజ్ఞానసమాజ పత్రికా సంపాదకత్వములు కూడ ఉపాంగములుగా నుండి ఈతని నాయకత్వమును అంగీకరించి యాతనివల్ల సహాయ సంపత్తులను పొందాయని మనమంగీకరింపక తప్పదు.

ఆంధ్రదేశ గ్రంథాలయచరిత్ర వేంకటరమణయ్య జీవితచరిత్ర యని నిర్వచించడంలో నతిశయోక్తి యెంతమాత్రం లేదు. అరవిందంలోని మృదుత్వాన్ని, వెలుగులోని తేజస్సునూ, జీవంలోని చైతన్యాన్ని ఏలాగున వేరు చేయలేమో; వేంకటరమణయ్య జీవితచరిత్రనుండి గ్రంథాలయోద్యమచరిత్రను వేరుపరుపలేము. ఇంతటి విశాలవ్యాప్తములగు అఖిలభారత, ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమాలకు మూలపురుషుడు, నాయకుడు, కర్త యెవ్వరని మనం నిష్పక్షపాత బుద్ధితో యోచిస్తే మందహాసవదనంతో, మంజుల భాషణంతో, మహితమగు సేవాభిరతితో, మహనీయసంకల్పసాధనవిధానాలతో; జాగృతియందునూ, నిద్రావస్థయందునూ మన కండ్లయెదుట ప్రత్యక్షమయ్యేవ్యక్తి వేంకటరమణయ్య గాక మరెవ్వరు? ఆతడు సిద్ధహస్తుడు. స్థిరసంకల్పుడూనూ. ఆతడు తలపెట్టిన గ్రంథాలయోద్యమమునం దాతడు కార్యనిర్వహణమునకు గడంగగానే కీ॥ శే॥ సూరి నరసింహశాస్త్రి, శ్రీ మారేపల్లి రామచంద్రశాస్త్రి, శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావు, శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు, శ్రీ గోపరాజు బ్రహ్మానందం మొదలైన సేవాపరాయణు లనేకులు ఈ యుద్యమంవల్ల ఆకర్షింపబడడమే కాకుండా, వేంకటరమణయ్యకు సహకారులుగా నుండి ద్విగుణీకృతోత్సాహముతో పనిచేయుటకు పూనుకున్నారు. వీరివలెనే ఆంధ్రదేశములోని, నాగరికులలోని, గ్రామీయులలోని ఉత్సాహవంతులగు యువకు లనేకులు బయలుదేరి, మత సాంఘిక రాజకీయ పక్షభేదాలను మరచి, ఈ యుద్యమంలో ప్రవేశించి, పల్లెలలోను, పట్టణములలోనూ గ్రంథాలయాలను, పఠనమందిరాలను నెలకొల్ప దొడగారు. ఈయుద్యమఫలితంగా నెక్కడెక్కడ గ్రంథాలయాలు నెలకొల్పబడ్డాయో; అక్కడక్కడ మన గ్రంథాలయోద్ధారకుని సిద్ధహస్తము మంగళాశీర్వచనముతో చాపబడుతూంటుంది.

ఆతడు కర్మవీరుడు — వేంకటరమణయ్య తన యుద్యమసాధనలో అగర్భశ్రీమంతుడు, సుకుమారి అయినప్పటికీ ఆహారనిద్రాదులను పాటింపక, సుఖము నపేక్షింపక ఒక్కొకప్పుడు మండు వేసవిలోనూ, మరియొకప్పుడు హోరున కురుస్తూండే వర్షపాతములోనూ ఉత్సాహవంతులగు యువకులను వెంటపెట్టుకొని యేళ్ళను, వాళ్ళను, గుంతలను, వాంతలను దాటుతూ గ్రంథాలయ యాత్రలను సాగిస్తూ, తన అనుచరులకు ధైర్యస్థైర్యాలను కలిగిస్తూ, కార్యసాధకులుగా జేస్తూ, మారుమూలలలోగూడ నెన్నియో గ్రంథాలయాలను నెలకొల్పగలిగాడు. ఆతని సంచార కార్యక్రమంలో పాదచారియై నడుస్తూన్నప్పుడు అడుగులో నొక ప్రబలమగు నిశ్చయము, మనస్సునందు దృఢమైన విశ్వాసము, ముఖంలో అకలంకమగు కార్యోత్సాహము ద్యోతకము లౌతూ, తోడివారికి నూతనోత్సాహమును కల్పిస్తూ కార్యోన్ముఖులుగా మార్చివేస్తూండును.

ఆతడు జగత్కుటుంబి — లోకంలో ప్రతివ్యక్తినీ తాను చేపట్టిన యుద్యమాలనుబట్టి ఆతని మనఃప్రవృత్తులను తెలుసుకోగలుగుతాం. వేంకటరమణయ్య చేపట్టిన ఉద్యమములు నాలుగును జాతి మత కుల రాజకీయ విభేదాల కతీతములు. విశ్వవ్యాప్తములు. బహుజనాదరణీయములు.

అవలంబనీయములును. ఆతడు ఉదారహృదయుడగు జగత్కుటుంబి గనుకనే ఈ యుద్యమములకు నాయకత్వము వహించి, కర్తయై, భోక్తయై, స్రష్టయై సాధింపగలిగాడు.

## అభినవకృష్ణుడు

మానవులు స్వార్థపరులు గాకుండ సర్వ జీవకోటికిని ఆపత్సమయములయందును, అవసర సమయములయందును ప్రతిఫలరహితమైన సేవ చేయడమే మానవజన్మగ్రహణమునకు పరమార్థమనే ధర్మతత్వమును జాతీయ బాలభటోద్యమం ద్వారా ఆంధ్ర యువకలోకానికి బోధామృతాన్ని కురియించిన అభినవ కృష్ణుడాతడు. వేంకటరమణయ్య ఆంధ్రరాష్ట్ర జాతీయ బాలభట సంఘమునకు సేనానాయకుడై; మహాపుష్కర సమయములయందును, మహాసభా సమావేశముల యందును, వరదల సమయములలోను తన బాలభట దళముద్వారా అపారమగు సేవచేసి కృతార్థుడైనాడు.

అతని గ్రంథాలయోద్యమము ఒక ఆంధ్రదేశమునకు మాత్రమే సంబంధించినదికాదు. ఈతడు దూరరాష్ట్రములగు పంజాబు, బంగాళము, బీహారు, చెన్నరాష్ట్రము, మరి అనేక యితర రాష్ట్రములకుకూడా తన స్వంతధనమును ఖర్చుచేసుకొని వెడుతూ,ఆయా రాష్ట్రాలలో గ్రంథాలయ సభలు సమావేశపరుస్తూ, ఆయా రాష్ట్రవాసులలో గ్రంథాలయోద్యమాభిమానాన్ని పురికొల్పాడు. మన హిందూదేశంలో ప్రథమ అఖిలభారత గ్రంథాలయమహాసభను సమావేశము చేసిన కీర్తిగౌరవాలు మన తెలుగునాయకుడగు వేంకటరమణయ్యకు దక్కినందులకు, ఆతడు ఆంధ్ర గ్రంథాలయ సర్వస్వము అను తెలుగు మాసపత్రికను, 'ది ఇండియన్ లైబ్రరీ జర్నల్' అను మాసపత్రికకు సంపాదకుడుగా నుండి గ్రంథాలయోద్యమవ్యాప్తికి ఆతడు చేసిన సేవకు మన మెల్లరము కృతజ్ఞత చూపవలసియున్నారము. గ్రంథాలయోద్యమ వ్యాప్తినిగూర్చి పంజాబులో నాతడు చేసిన సేవను గూర్చి పంజాబు లైబ్రరీ అసోసియేషన్ పక్షాన ప్రచురింపబడుతూన్న 'ది మాడరన్ లైబ్రేరియన్' పత్రికా సంపాదకులగు 'శ్రీ శాంతారాం భాటియాగా' రీలాగున వ్రాస్తూన్నారు.

"హిందూదేశమునందలి గ్రంథభాండాగారోద్యమవ్యాపకమునకు శ్రీ అయ్యంకి వేంకటరమణయ్యగారు చేసిన కృషి, త్యాగము గ్రంథ భాండాగారోద్యమ చరిత్రలో నిరుపమానాలు. హిందూ దేశ గ్రంథాలయోద్యమచరిత్రలో ఆయనకు గౌరవస్థాన మున్నది".ఆయన మా పంజాబు రాష్ట్ర గ్రంథాలయోద్యమమునకు మూలపురుషు డని చెప్పుటలో నతిశయోక్తి ఎంతమాత్రమును లేదు. డా. పి. సి. రే గారి అధ్యక్షతక్రింద సమావేశము చేయబడిన 7 వ అఖిలభారత గ్రంథాలయ మహాసభను ఏర్పాటు చేయుటకు వేంకటరమణయ్యగారు అంతదూరమున నున్న బెజవాడనుండి తమ స్వంతఖర్చులమీద నిక్కడకు వచ్చియుండిరి. ఇక్కడి మహాసభయు, భాండాగారప్రదర్శనమును విజయవంతముగా జరుపుటకు శ్రీ వేంకటరమణయ్యగారి పరిశ్రమ, పట్టుదలయే కారణములు, పంచ

నదులచే పవిత్రీభూత మగుచున్న మా రాష్ట్రి మెప్పునను ఆయనకు కృతజ్ఞత చూపుచుండును. అని పంజాబు రాష్ట్ర గ్రంథాలయ సంఘ కార్యదర్శియు, "మోడరన్ లైబ్రరీ జర్నలు" సంపాదకులు నగు శ్రీ శాంతారాం భటియాగారు వ్రాసియున్నారు. ఈ విధంగానే పలురాష్ట్రాలనుండి, సంస్థానముల నుండి అనేకులు నాయకులు వేంకటరమణయ్య గ్రంథాలయోద్యమము సందర్భంలో తమతమ రాష్ట్రములలో చేసిన సేవకు కొనియాడుకూ, తమవిశ్వాసమును వెలిబుచ్చుతూన్నారు.

ఔషధసేవతో నవసరం లేకుండా మానవులు ప్రకృతిచికిత్సావిధానంతో స్వాభావికము లైన దైహిక మానసిక సౌందర్యాలను, సౌఖ్యములను పొందుతూ, తన్మూలమున మానవసేవ చేయడానికీ, సుఖసంసారం నడుపుకోవడానికీ అనుకూలపడే ఈ వైద్యపద్ధతి ఈతని సాధనచతుష్ట యంలో ఒకటిమాత్రమేగాక ప్రధానప్రచార సాధనంగా కూడా పరిణమిస్తూ, అసంఖ్యాకులగు రోగులను ఆరోగ్యవంతులుగా జేయగలుతూన్నది.

## హృదయమే భాండాగారం

సర్వమత సహిష్ణుత, సకలమత సామరస్యము; సర్వమానవ సౌభ్రాతృత్వములను బోధిస్తూ విశ్వవ్యాప్తమైయున్న దివ్యజ్ఞాన సమాజమునందలి ఆంధ్రశాఖకు ఆతడు ప్రచారక కార్యదర్శిగా నుండి, ఆ సమాజపక్షమున సుగమములైన అనేకకరపత్రాలనూ, ఆంధ్రగ్రంథాలనూ ప్రచురిస్తూ ఆ సమాజ వ్యాపకంకోసం పాటుపడుతూంటాడు. 'దివ్యజ్ఞానదీపిక' అనే మాసపత్రిక కూడా ఈతని ఆధ్వర్యానే ప్రచురింపబడుతూంటుంది. ఆతడు సన్మిత్రుడు. తాను ప్రేమిస్తూండే మిత్రులను తెర మరుగులేని అకలంకమగు ప్రేమతో ప్రేమిస్తూ, వారి కష్టాలలో తాను లీనమగుతూ, వారిసుఖా లకు ఆనందిస్తూ, తనకు సాధ్యమైనంతవఱకు సహాయసంపత్తులను సమకూరుస్తూంటాడు. ఆతని హృదయమే ఒక గొప్ప భాండాగారము. అమృతంతో నిండియుండే భాండాగారము.

నిరుద్యోగ నిరుత్సాహ నిస్పృహాలతో శుష్క-జీవితపు ఎడారిలో అగమ్యమార్గాన ప్రయా ణాలను సాగిస్తూన్న ఆంధ్ర యువక గణమునకు నవరసాలవాలములైన పుస్తకాగారకాసారములను సృష్టించి వారి జ్ఞానతృష్ణను సంతృప్తిపరుస్తూ, వారి హృదయసీమలలో ఆశాజ్యోతిని రగిలిస్తూ, నూత నోత్సాహమునూ, నవజీవనమును కలుగజేయగలిగాడు. వేంకటరమణయ్య సాగిస్తూవచ్చిన గ్రంథాల యోద్యమము మూలమున వేలకొలదిపతితలు బయలుదేరి పత్రికాపఠనము, గ్రంథపరిశీలనము గావిస్తూ పురాతనాధునాతన సభ్యతా సంప్రదాయాలను, ప్రాచ్య పాశ్చాత్యరాజ్యాంగ విధానాలను గ్రహిస్తూ మాతృదేశము నుద్ధరించుట కవసరములగు పలువిధములైన మార్గాలను అన్వేషించుటకు ఆతురతను, ఆవేగమును జూపనొడగారు. ఈ యుద్యమ ఫలితంగా గ్రంథకర్తలకు ప్రోత్సాహం కలిగి నవభావో పేతములైన రచనలను అసంఖ్యాకములుగా వెలయింపనొడగారు. పలురకములైన పత్రికలు ప్రచురణ భాగ్యం పొందుతూ వచ్చాయి. కళాప్రపంచం నవ్యకళోపేతంగా విరాజిల్ల దొడగింది. గ్రంథాల యాలు నెలకొల్పబడిన ప్రదేశములలోని ప్రజానీకము లోకవృత్తమును బాగుగా నవగతము చేసుకొని,

కార్యసాధనోన్ముఖము కాదొడగింది. జాతీయజీవనమందును, కావ్య రచనలయందూ, కళలయందును ప్రతిభయూ, ప్రాభవమూ వృద్ధికాదొడగాయి. వేంకటరమణయ్య విశ్రాంతియెరుగని తన గ్రంథాలయోద్యమ నిరంతరకృషివల్ల మహేంద్రజాలకునివలె దేశస్వరూప స్వభావాదులను జాలవఱకు మార్పు జెందించి, మానవ మనోవికాసానికి క్రొత్తశోభను, గౌరవమును దేగలిగాడు.

కాలపరిస్థితులనుబట్టి మనదేశ మనేకపరివర్తనాలకు లోనైనను, సభ్యతలు తారుమారైనను వేంకటరమణయ్య తనచతుర్విధోద్యమముల మూలంగా ఈ చతుర్విధ పురుషార్థములను సాధించడంలో అతడు చేసిన అమూల్య సేవాఫలితంగా ఆతని అమరకీర్తిని మనఆంధ్రదేశం తరతరాల వఱకును గానం చేస్తూండునని, అతడు ప్రధాన నాయక శ్రేణిలో మాత్రమేగాక, సారప్రపంచమునందలి నవయుగ నిర్మాతలలో నొక పురుషుడుగా ఆరాధింపబడుచు "ప్రకృతి" "విజ్ఞానము" "సభ్యత", "సేవ" "సౌభ్రాతృత్వము" అనుపదములు మనదేశ వాఙ్మయంలో నున్నంతకాలమూ ఆంధ్ర ప్రజాహృదయంలో అతడు స్థిరనివాస మేర్పరచుకొనునని నామనవి.

వేంకటరమణయ్య సన్మానసభ కధ్యక్షత వహించిన ఆంధ్రవిశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులగు డా॥ సి. ఆర్. రెడ్డిగారు సన్మాన సంచికలను ఆతనికి సమర్పిస్తూ యిలా సెలవిచ్చారు. "అయ్యంకి వేంకటరమణయ్య గారు ఆంధ్రదేశ గ్రంథాల యోద్యమమునకును, అఖిలభారత గ్రంథాలయోద్యమమునకును చేసినసేవ అమూల్యము. ఆంధ్రదేశ మెంతయు ఆయనకు ఋణపడి యున్నది. ఈ సన్మానసభకు నే నధ్యక్షత వహించుటచే ఆయనకు చేయు గౌరవముకంటె ఆయనను గౌరవించుటవలన నాకే గౌరవము కలిగినదని తలచుచున్నాను"

—నిడదవోలు వేంకటరావు.

---

## మేలుబంతి

శ్రీ వేంకటరమణయ్యగారి తండ్రిగారు డెల్టానూపరెంటు హోదాలో మాగ్రామంలో కొన్నియేళ్ళు నివాసంచేశారు. అప్పుడు రమణయ్యగారికి బాల్యదశ. ఆయన నర్సాపురంలో చదువుకుంటూ వస్తూ పోతూ వుండేవాడు. ఆరోజుల్లోనే మొదట మాకిద్దరికీ పరిచయమేర్పడింది. ఆయన కలవారి యింటబిడ్డ. పైగా ఆతల్లి కడుపున ఒక్కటే పంట పండింది. మగబిడ్డయినా, ఆడబిడ్డయినా ఈతడొక్కడే కనుక తల్లిదండ్రులు మొదటినుంచీ చాలా గారాబంతో పెంచేవారు. ఫస్టుఫారం చదివే రోజుల్లోనే ఈతడు పత్రికలు చదవడం ఎలాగో అలవర్చుకున్నాడు. బడిచదువులో ఎట్టిలోపం చెయ్యకపోయినా పత్రికలు తరుచు చదువుతూంటాడని ఇంటివద్ద తరుచు మందలిస్తూండేవారు. కాని తండ్రి, బంధుగులు ఎంతచెప్పినా ఈయన పత్రికలుమట్టుకు వదలిపెట్టలేదు. ఈపట్టుదలవల్లనే తుదకు బడిచదువు విరమించుకోవలసిన స్థితి యేర్పడింది. చదువు మాని ఇంటికివచ్చాక ఈయనికి కాలక్షేపం యెల్లాగ? నాతోటిమాత్రమే ఆయనకు పరిచయం. మాయింటికి యెప్పుడూ తాను వచ్చేవాడు. వారి యింటికి నన్నుపిల్చుకొని పోయేవాడు. మాయింటివద్ద ఎక్కువగా పత్రికలతోటే పొద్దు గడచేది. ఆపత్రికాపఠనంవల్ల లోకజ్ఞానం కలగడం ఆరంభమయింది. పత్రికల్లో ప్రకటనచేసే పుస్తకాలు తెప్పించడం,

కనపడ్డ కేటలాగల్లా తెప్పించడం, ఆయనికి సరదా. మాది సామాన్యమైన గ్రామం అవడంచేత మామూలు చిరునామా యిస్తే కొన్ని కంపెనీలు పెద్ద కేటలాగులు పంపించేవాళ్ళు కారు. అయితే అదృష్టవశాత్తు మావూళ్ళో పోస్టాఫీసు ఉండటంచేత రమణయ్యగారు ఒక తమాషా యెత్తు వేశే వాడు. పేటలులేని కారణంచేత రావిచెట్టుస్ట్రీటు అనీ టెంపిల్ స్ట్రీటు అనీ డోరు నెంబరుతో చిరునామా యిచ్చేవాడు. ఆ డాబుతో కొంతమంది పెద్దపెద్ద కేటలాగులు పంపేవాళ్ళు. రమణయ్యకు వయస్సుతోపాటు సరదాకూడా పెరుగుతోంది. లండనుకు కూడా వ్రాసి పుస్తకాల కేటలాగులు, వస్తువులబొమ్మ కేటలాగులూ తెప్పించేవాడు. ఒకప్పుడు పంపకపోతే ఆకంపెనీ వాళ్ళకి విసుగెత్తే దాకా కేట్లాగుఖరీదుకంటె మూడునాలుగు రెట్లు అయినా పోస్టేజిక్రింద ఖర్చుపెట్టి పంతం నెగ్గించుకొని ఆనందపడేవాడు. ఆ చిన్నతనంలోనే ఈయనకు నెలకు అయిదారురూపాయలు పోస్టేజిక్రింద వెచ్చమయ్యేది. ఒకప్పుడు పది రూపాయిలదాకా అయేదంటే నమ్మాలి. టపా వచ్చేటప్పటికల్లా పక్షితీర్థంలో పక్షిలాగు రమణయ్య పోస్టాఫీసులో ప్రత్యక్షమయేవాడు. ఇతనికి ప్రతిరోజూ కట్టలు కట్టలుగా ఉత్తరాలూ, క్యాటలాగులూ వచ్చిపడేవి. ఒకచిత్రం: రమణయ్య ఇంటిగుమ్మంలో నుంచుని ఒక్కసారి వీధికేసి పారజూచేవాడు. ఆపట్టున తలవంచి లైటింజనులాగు గబగబా పోస్టాఫీసు గుమ్మంలో అడుగుపెట్టి తలపైకెత్తి చూచేవాడు. దారిలో ఎవరైనా పలకరిస్తే కొత్తగా కాపరాని కొచ్చిన సిగ్గరి కోడల్లాగు తలయెత్తకుండానే మళ్లీ లైటింజను అయేవాడు. మాబోటి మిత్రులతో కలిసి షికారు వెళ్ళేటప్పుడు కూడాతలెత్తి పక్కలు చూడటం లేదు. ఎప్పుడూ పెళ్ళినడకలే నడిచేవాడు.

రమణయ్య చిన్ననాటినుంచీ సంతోష పురుషుడు. ఎప్పుడు చూచినా ఆతని ముఖం కలకల లాడుతూ నవ్వుతో నిండి ఉంటుంది. అందరితోను కలిసికట్టుగనంగా వుంటాడు. ఒక్కసారి పరిచయమైతే యెవ్వరుగాని మరి ఆతణ్ణి వదలిపెట్టలేరు. అందరికీ చనువిస్తాడు. మరియాదలు జరుపుతాడు. సరదాగా కాలక్షేపం చేస్తాడు. రమణయ్యకు స్నేహితులంటే బహు ఇష్టం – స్నేహితులు పేదలైతే మరీ ఆదరిస్తాడు. మావూరిదగ్గర గణపవరంలో రాజయ్య అనే కంసాలి కుర్రవాడు ఉండేవాడు. ఇద్దరూ చదువులో సహాధ్యాయులు. రాజయ్య నిర్ధనుడవుటచే ఆతనికి రమణయ్య పుస్తకా లిచ్చేవాడు. తనకు కుట్టించిన మంచి మంచి దుస్తు లిచ్చేవాడు తనడబ్బులోనుంచి జీతం కూడా కట్టేవాడు. కావలసిన ఇతరసహాయంకూడా చేసేవాడు. రాజయ్యకూడా మంచివాడు. చిన్నవాడైనా పెద్దమనిషి. ఇద్దరు చిలకా గోరింకల్లాగు కలిసిమెలిసి యెప్పుడూ ఉండేవారు. నడుమ నడుమ యిద్దరూ కలిసి షికార్లు కొట్టుతూఉండేవారుకూడాను. వీరిది సాటిలేనిస్నేహం. అందుచేతనో యేమో పాపము విధి వీరిమైత్రిని సహించలేదు. రమణయ్యకు త్వరలోనే మిత్రవియోగం సంభవించింది. ఇందుచే తీరని పరితాపం పొందాడు. తరువాత రమణయ్యకు వందలకొలది గొప్ప స్నేహితులు లభించినా రాజయ్యవంటి నమ్మకమైన, నిష్కల్మషమైన స్నేహితుడు మట్టుకు దొరికి వుండడనే నాఅభిప్రాయం.

రమణయ్య బాగా కన్నులు తెరిచాడు. తెలుగుపత్రికలు కన్పించినవన్నీ తెగచదువుతున్నాడు. అర్థమయినా, కాకపోయినా యింగ్లీషుపత్రికలు కూడా తెప్పించి చదివేవాడు. దేశాభిమానంకూడా ముదిరింది క్రమంగాపత్రికాపఠనంచేత. కొన్నాళ్ళకు తానుకూడా ఒకపత్రిక ప్రకటించి సేవచెయ్యాలనుకున్నాడు. ఈసంగతిమెల్లగా నాతో చెప్పాడు. రమణయ్య చిన్నవాడు. పత్రికా ప్రచురణమనేది పెద్దపని. డబ్బు విశేషంగాకావాలి. తల్లిదండ్రులు పదులూ, పాతికలూయిస్తారు కాని వందలూవేలు యిస్తారా? ఇతడు చిన్నతనంచే సొమ్ము పాడుచేస్తాడనే భయంవుంటుంది వారికి. ఇదినరవేరే కార్యంకాదు. కొంత కాలం ఆగి స్వతంత్రుడవైన తర్వాత ప్రకటింపవచ్చును. అనినేను సలహాయిచ్చాను. కాని రమణయ్యకి నాబోధ తలకెక్కలేదు. అతనిపట్టుదల గొప్పది. మాటంటే మరి తిరగడం రివాజు లేదు. ఆరు మూడైన మూడారైన అనుకున్నపని జరిగితీరవలసిందే తుదకు చనువుగలతావు కనుక తల్లితో తనసంకల్పం చల్లగా, వూదాడు. ఆమె "చిన్నవాడవు; నీకది తగనిపని; యిప్పుడుకాదు నాయనా పెద్దవాడవై అంతవాడవైతే అప్పుడు పత్రికలు అలాగే ప్రకటింతువుగాని; ప్రస్తుతం ఈప్రయత్నం మానుకో" అని నయాన మందలించింది ఆయిల్లాలు. కాని తల్లిమాటలు తలలో దూరనేలేదు. పట్టినపట్టు విడవలేదు. అయిదువందలిస్తేనే కాని అన్నం ముట్టనన్నాడు రమణయ్య. తల్లిదగ్గర సత్యాగ్రహం! కన్నకడుపు. ఏమిచేస్తుంది పాపం? బతిమాలింది. బామాలింది. ఏడిచింది చేసేదిలేక. తానుకూడా కొడుకుతో పాటు సాపాటు చాలించింది. మెల్లిగా నాకు కబురు పంపి రమణయ్యతో చెప్పి యీ ప్రయత్నం మానిపించగోరింది. నాకూ అతనికి జరిగిన సంగతంతా చెప్పి నామాటలవల్ల లాభంకలగలేదని చెప్పాను. రమణయ్యకంటె నేను పెద్దవాణ్ణి అవడంచేత నేనే అతని కిట్టి బుద్ధిపుట్టించానని ఆమె నమ్మకం. రమణయ్య స్థితి భర్తతో చెప్పింది ఆయమ్మ. ఆయన చీకాకు పడ్డాడు. కొడుకుమీద కోపపడి కొట్టేటంత గందరగోళంచేసి భయపెట్టాడు. కాని ఎట్లాకొట్టగలడు? పాపం, ఒక్కడేబిడ్డగా. పైగా తల్లి రెక్కలతో పొదుగుకొని కాపాడుతుందాయెను. ఆయనకూడా దీనికంతకు నేనే కారకుణ్ణని అనుమానం పడ్డాడు. ఒకరిద్దరితో 'శర్మగారు మాకుర్రవాణ్ణి పాడుచేస్తున్నాడు' మామాటలు వినకుండా చేస్తున్నాడు;అని అల్లరి ప్రారంభించారు. చివరికి పట్టలేక నాతోనే ఒకసారి"మావాణ్ణి మీయింటికి రానియ్యకండి. అతడుచెడ్డవాడు. అతని సావాసం మీరుచెయ్యకండి" అని గడుసుతనంగా చెప్పారు. జరిగినసంగతంతా ఆయనకు పూసగుచ్చినట్లు చెప్పాను. కాని తల్లి నమ్మినట్టే తండ్రీని. అసలు తనబిడ్డ మంచివాడే అనిన్నీ, నా సహవాసంవల్లనే యిట్టి దుర్బుద్ధి ఆ అమాయికపు మెదడులో దూరిందనీ ఆయనకుకూడా గట్టినమ్మకం "మీరు నమ్మిన నమ్మకున్నా నాకేమీ నష్టంలేదు. ఈబుద్ధి మీవాడి తలలోనే స్వయంగా ఉత్పత్తి అయింది. ఇది నీకు తలకుమించిన గడ్డుపని అని యెన్నివిధాలో చెప్పాను. కాని నామాట వినలేదు. ఎవరేమిచెప్పినా మాననూ? పత్రిక ప్రకటించి తీరుతానన్నాడు. మీరు నామాటలునమ్మక నామీద నిందలు విసరడం న్యాయం కాదు. మీరు నాస్వభావం తెల్సుకోలేకున్నారు_కడుపుతీపి కొడుకు తప్పును, ఇతరులనెత్తిపై వేయిస్తోంది. నిజం నిలకడ మీదైనా, తెలియకపోదు." అనిచెప్పి గిరుక్కున తిరిగి వచ్చాను. ఎంత

గారాబమైనా చిన్నవాడైన కొడుక్కి, వచ్చీ రాని జ్ఞానంగల కొడుక్కి ఐదువందల రూకలివ్వడమంటే ఆసామిక్కి చూస్తూ చూస్తూ ఏట్లో పారబొయ్యడం కాదూ? అయిదారు, వారం రోజులు గడచాయి. తండ్రిగారికీ రమణయ్యకీ మాటలు లేవు. ఇంట్లోవున్న ముగ్గురు జీవులూ నిద్రాహారాలు సరిగ్గా లేక, గందరగోళంతో, శాంతి అనేది యెరక్కుండా అవస్థపడుతున్నారు. స్నేహితులచేతా, సాహుకార్లచేతా, ఇతరత్రురానా మనుష్యులచేతా చెప్పించి చూచారు. కాని రమణయ్య భీష్మించాడు. పత్రికమాత్రం మానేది లేదని స్పష్టంగా చెప్పేశాడు. వెంకటరత్నంగారు అసాధ్యుడు, "అయిదువందలు కావాలా? నా ఆస్తి కావాలా? ఇదంతా నా స్వార్జితం" నీకు దానిలో చిల్లిగవ్వైనా యివ్వను. ఆలోచించుకో," అని ఖండితంగా చెప్పాడు. "అయితే న్యాయంగా నాకు రావలసిన ఆస్తి పంచివెయ్యండి, నాయిష్టం వచ్చినచోటికి పోయి నాయిష్టప్రకారం బ్రతుకుతాను," అని తెగించి పలికాడు రమణయ్య. వెంకటరత్నంగారు కూడా అంతకంటె తెంపరి. కొడుకు వాటా పంచిపెట్టాడు. అయిదువందలూ రొఖ్ఖం యిచ్చాడు. దస్తావేజు రిజిస్ట్రీకూడా చేసి యిచ్చాడు. దానితో యీ వార్త చుట్టుపట్ల ఊళ్ళల్లో మోగిపోయింది. వెంకటరత్నంగారి అబ్బాయిని వెంకటశర్మగారు దుర్బోధించి పాడుచేస్తున్నాడట. తండ్రీకొడుకుల నడుమ పోరుపులు పుట్టించి పంపుళ్లు పెట్టించాడట; అనే అల్లరీ, అపనిందా నా నెత్తిపైని అకారణంగా పడింది. నాకు చాలా సిగ్గేసి రమణయ్యగారియింటికి వెళ్ళడం మానేశాను. వెడితే వారు రావద్దనే వుందురు కూడాను. రమణయ్యమాత్రం నావద్దకు రా మాన లేదు. ఆతడు మామూలులాగే ముసిముసినవ్వులతో వచ్చాడు. నాకుమట్టుకు సంతోషం లేదు. నామనస్సు చీకాకు పడిపోయింది. "రమణయ్యా నువ్వు మాయింటికి ఇంక రాకు బాబూ, జరిగిందేమో చాలును". అన్నాను. రమణయ్య నవ్వుతూ "జరిగిందేమిటి? ఏమీ ప్రమాదం లేదు. మనం బందరు వెడదాం. ప్రయాణమవండి లెండి" అన్నాడు. "నా కీఅల్లరే చాలు. నేనువద్దంటున్నా విన లేదని చెప్పినమాట నేను నీతో బయలుదేరడంతోటే అబద్ధమయిపోతుంది. ఈకథ కంతకూ నేనే కారకుడనని లోకులు విశ్వసిస్తారు. నేనుమాత్రం రాను. నీతల్లిదండ్రులకి నువ్వెల్లాగా మంచివాడవే అవుతావు. నాకువచ్చిన అపవాదు పుట్టుకు ఈజన్మానికి మాసిపోదు. నన్ను ఇంతతో వదలిపెట్టు. నేను మున్ముందికి రాను" అన్నాను. "మిమ్మల్ని నమ్ముకునే నేను యిందులోదిగాను. మీరే రాకపోతే యెల్లాగా? మీరు రాకతప్పదు మాతల్లిదండ్రులకి మీపైని అలక వస్తే మీ కేంకొదవ? ఇల్లాంటి అల్లరికి వెరచి దేశసేవ మానుతారా? మీరు రాకుండా నేనుకదలను. మిమ్మల్ని నెల్లాగయినా తీసుకువెళ్తాను. రాయప్రోలు సుబ్బారావుగారికికూడా ఉత్తరం వ్రాశాను. మనం వెళ్ళేసరికి ఆయనా బందరువస్తారు. ఇవన్నీ లెక్క చెయ్యకండి. లెండి. ప్రయాణం కండి" అని నిర్బంధించాడు. దేశసేవ అని రమణయ్య ప్రబోధించేసరికి మాను మాటాడ లేకపోయాను. బందరు వెళ్ళాము. లోకమంతా, నే ననుకొన్నట్లే, రమణయ్యను ఈ వ్యాపారంలో నేనే దింపానని నమ్మకపోయేదెట్లా? నమ్మనే నమ్మారు. లోకులు కాకులని నేను లెక్కచెయ్య లేదు. ముట్నూరి కృష్ణారావుగారిని కలుసుకుని జరిగినదంతా చెప్పాము. రాయప్రోలు వచ్చాడు. "ఆంధ్రభారతి" అనే పేరుతో పత్రిక వెలువడింది. బందరు విద్యాపీఠం కదా.

గోపల్లె హనుమంతరావు, పట్టాభి, కృష్ణారావు, చిట్టా సుందరరామయ్య, వల్లూరి సూర్యనారాయణ రావు, సూరిశాస్త్రి, శ్రీనివాసరావు వంటి దిగ్గజాలు పూనుకున్నారు. ఇంక వ్యాసాలకేం కొదవ! పత్రిక ఒకటి రెండు సంచికలతోటే పేరు మోగింది. మరికొన్ని నెలలు నడిచింది. రమణయ్య చేతిలోని బెల్లం కాస్తా అయిపోయింది. పత్రిక కట్టిపెట్టడం ఎవరికీ యిష్టం లేదు. పట్టాభిగారు కాగితం యివ్వడానికి, కృష్ణారావుగారు ముద్రణభారం వహించడానికీ నిశ్చయమయింది. ఎట్లాగో అప్పటికి గండం గడిచింది. పట్టాభిగారు (ధన్వంతరి)–ప్రాణం పోసి నిలబెట్టారు. రాయప్రోలు, నేనూ కొంతకాలమండి స్వస్థలాలు చేరుకున్నాము. రమణయ్య కూడా కొన్నాళ్ళ తర్వాత దానితో యావత్తుసంబంధమూ వదులుకొన్నాడు. ఆంధ్రభారతి మోడరన్‌రివ్యూ లోని వ్యాసాలవంటి చక్కని వ్యాసాలను, మంచి చిత్రాలను ప్రకటిస్తూ ఘనత కాంచింది. కాని చందాదారులు, పోషకులుమాత్రం శూన్యమైనందున ఎన్నో తెలుగు పత్రికల్లాగ యిది కూడా అకాలంలోనే తనువు చాలించవలసివచ్చింది

రమణయ్యకు చిన్నప్పుడే పట్టుబడిన దేశాభిమానం చీము నెత్తురులలో జీర్ణించి పోయింది. దేశసంబంధమైన పని లేకపోతే అతనికి తోచదు. కొందరు మహనీయులకు దేశాభిమానం ఒక లాభసాటి వ్యాపారమయింది. కాని రమణయ్యకది యొక ఆటా, విలాసమూను. ఈయన క్రీడావిలాసవిహారాలవల్ల ఆయన కేమైనా కాని దేశానికి మట్టుకు విశేషంగా మేలే కలిగింది. రమణయ్య లేని దేశాభ్యుదయకరమైన ఉద్యమం లేదు. కాంగ్రెసు కాన్ఫరెన్సుల్లో, బాలభటోద్యమంలో, దివ్యజ్ఞాన సభల్లో, ప్రకృతి వైద్యప్రచారంలో, బ్రాహ్మణ సభల్లో, పంచమ సమావేశాల్లో, ముఖ్యంగా గ్రంథాలయ సమ్మేళనాల్లో, అందుకు సంబంధించిన పత్రికా ప్రకటనలో, ఇదీ అదీ అననేల, తెలుగు దేశంలో ప్రచారంలోఉన్న ప్రతీఉద్యమంలోను రమణయ్య అప్రతిహతంగా సాక్షాత్కరిస్తాడు. ప్రకృతి భోజనాలతోపాటు వన సంతర్పణల్లోను, కాఫీహోటళ్లలోను సైతం తప్పకుండా సిద్ధమౌతాడు. మిత్రుల విందుల్లోను ఎప్పుడూ వెనుకబడడు. ఉప్పిండిని, చప్పిడిని, హల్వాను, ఆవకాయను నిష్పక్షపాతంగా సమదృష్టితో ఆదరిస్తాడు.

వెంకటరమణయ్య ఉదారుడు. పండితుల్ని సత్కరిస్తాడు. స్నేహితుల్ని గౌరవిస్తాడు. అర్థులను ఆదరిస్తాడు. దీనులను దయతో ముంచెత్తుతాడు. పరోపకార మనేది యితనికి లీల. దేశాభిమానం ఇతని కో క్రీడ. అందులో స్వార్థం లేదు. కక్షీ లేదు. ఈ క్రీడవల్ల దేశానికి ఎన్నడూ ఆవంతైనా హాని లేదు. అంతా లాభమే. శ్రేయస్సే తప్ప. అన్నిసదుద్యమాలకీ అతనివల్ల అప్పటికీ యిప్పటికీ, అంతో యింతో అవలంబమే కలుగుతోంది. ఇటువంటి లీలామానుషవిగ్రహం మన తెలుగుదేశంలో మరొకటి లేదు. ఇటువంటివాళ్లు ఇంకో పదిమంది ఉంటే ఆంధ్రాభ్యుదయగాథ వేరుగా వుండేది – గగనమార్గంలో కాంతిల్లేది.

రమణయ్య శుభచరిత్ర ముఖ్యంగా మన దేశంలో అదృష్టవంతులై, జరుగుబాటుగల శ్రీమంతుల బిడ్డలకు మేలుబంతిగా ఉండగలదని ఘంటాపథంగా చెప్పగలము. ఈతనికి భగవానుడు చిరాయు రున్నతులు ప్రసాదించి కాపాడునుగాక.

— శ్రీ. మంగిపూడి వేంకటశర్మ.

ఓమ్

# 'భావస్థిరాణి జననాంతర సౌహృదాని'

ఇది ముప్పది మూడేండ్లనాటి ముచ్చట. ఇందులో చాలాభాగం విస్మృతి వీధిలో విముక్త నిక్షేపంగా నిలిచిపోయింది. దాని నిప్పుడు సంగ్రహించడానికి స్మరణయోగంతప్ప గత్యంతరము కానరాలేదు. ఈ దీర్ఘవాన పర్యటనంలో తడవగా తగిలిన కథాకలాపాన్ని లిఖితముఖం చేస్తున్నాను. కాబట్టి ఈ గతకథనం ముక్తాముక్తంగా శిథిలా శిథిలంగా ఉండకతప్పదు. దానికి రాచికులు క్షమించాలె.

*  *  *  *  *

అవి సంక్రాంతి దినాలని అనుకొంటాను. ఎందుకంటే అల్పానల్పముకాని ఆంధ్రదేశ శీతపాతంలోనే ప్రయాణం చేసినట్లు ఊహిస్తాను. అదిగాక ఆరాత్రి తిన్న చిక్కుడుకాయ కూర కూడా జ్ఞాపకమున్నది. మేము ముగ్గురము. మాఇద్దరినీ చదువరులు సులభంగానే తెలుసుకొంటారు. మూడవ మూర్తికూడా అప్పటికే ప్రసిద్ధుడైన యువకవి, వాఙ్మయరచనలో కరుణాతికరుణంగా బాల మృణాల మృదులంగా, విశంతు విలాపాన్ని వినిపించాడు. నల్లని చాయ వామనకాయము. పలువరుస కదిపితే గోదావరి యూపతోపాటు కుందకుట్మల ధావళ్యం, మందస్మిత మాధుర్యం కూడా కుప్పలు పడుతుండేది. బెజవాడనుంచి బందరు ప్రయాణం. రాత్రి పది పదకొండు గంటల వేళ దిగాము. ఒంటెద్దుబండి ఎక్కగానే 'ఓకోరి బండివాడా! ఒంటెద్దుబండివాడా' అనే తెలుగుపదం పులకరిస్తూ వచ్చింది నాకు. 'ఆహా! ఏం పదమండీ' అన్నారు మంగపూడివారు. ఆ వాణిలో కొంచెం 'కాకు' ఉన్నది. శృంగారమంతా అవినీతికి ఆలవాలమనీ, వ్యభిచారానికి అభిజనమనీ వారి అభిప్రాయము. అప్పటకి శర్మగారిమీద బ్రహ్మసమాజ ప్రభావం బ్రహ్మాండంగా ఉండేదని మఱచిపోగూడదు ఐతే నే నూరుకున్నానా? ఇందులో ప్రస్తుతం అప్రస్తుతాన్ని సూచిస్తున్నదన్నాను. ఒంటెద్దుబండివాడంటే సూర్యుడని ధ్వని. నీబండి ఆపు, అస్తమింపకు పద్మినీదేవి నీవియోగము సహింపలేదు. ఇంకా...ఏమో......ఏమో అంటూ నేను పట్టుకొన్నాను. గోపాలకృష్ణుని దగ్గర రసదోహనోపదేశ మయినప్పటినుంచీ నా కీపిచ్చి ఉండేదే. శర్మగారి ముక్కుపోగు మెఱుస్తుంది. కాని ముఖాన నల్లి ముందు వెనుక లాడుతుంది. వేంకటరమణయ్యగారు మాత్రం అహ్హా అహ్హా అంటూ ఉవ్విళ్లూరేవాడు. ఇంతలో బండి నిలిచింది. వేంకటరమణయ్యగారు వెంటనే దిగి 'ఇదుగో! తలుపు తలుపు' అని తట్టారు. కంఠస్వరంతోటే కవాటం తెఱచింది. మేము భోంచేసి రాలేదంటూ తూచినట్లు ఒక్కమాటని మాకు చిరుచాపలు వేశారు.

*  *  *  *  *

లాంతరు బాగా వెలుగుతున్నది. ప్రక్కన రెండు దిండ్లు. కొన్ని పుస్తకాలు, పత్రికలు కంటపడ్డవి. వానిలో అరవిందుని కర్మయోగినీపత్రిక, డాక్ మేగజీను, మోడర్న్ రివ్యూ, వేదిక్ మేగజీను నన్ను ఆకర్షించినవి. మోడర్న్ రివ్యూ పత్రిక తీశాను. అందులో ముఖచిత్రంగా హిమాలయస్వరూపం బింబోపన్యస్తమై ఉండెను. అది చూడగానే.

యశ్చాప్సరో విభ్రమమండనానామ్
సంపాదయిత్రీం శిఖరై ర్బిభ ర్తి
వలాహకచ్ఛేదవిభ క్తరాగామ్
అకాలసంధ్యా మివ ధాతుమత్తామ్.

అనే శ్లోకం చెంపదెబ్బకొట్టినట్లు స్మృతిలో మేలుకొన్నది. అయితే మా శర్మగారు పత్రిక తీసుకొని బాగా నిగాపెట్టి చూచి మహోమాటు చూడమన్నారు. మంచు మబ్బులు తూగాడుతుంటే దూరదూరంగా సితాసితంగా శిఖరోపరిశిఖరాలతో శీతాచలం స్థూలదర్శన మిస్తున్నది. ప్రలంబమాన పలితకేశ జటాజాలంతో మీసాలు గడ్డాలు మెఱుగులు పాఱుతూ ఉంటే ఉష్ణాంగే ముఖవర్చస్సును ఉల్లంఘించి ప్రవహించే దృగంచదీప్తి వేణికలతో ఒక మహా రూపంగూడా పొడకట్టుతున్నది. పిచ్చిపిచ్చిగా అరాళకరాళంగా గీచినగీతలలో పూసినరంగులలో ఇలాటి దివ్యరూపకల్పనం కై సేయడమే బెంగాలీ చిత్రవిన్యాసం అనుకొంటూ సంభాషించుకుంటూ ఉండగా వేంకటరమణయ్యగారు "మనం భోంచేతాం లెండీ" అన్నారు. చలికి చొక్కాలు తీసామో లేదో చెప్పలేను. పచ్చని అరటాకుల్లో వెలక్కాయపెరుగుపచ్చడీ చిక్కుడువిత్తుల పప్పావులూను, అప్పడాలు వడియాలతో అయిన ఆలస్యం కానే అయిందని ఆరగించాము

చలికి జంక లేదు. క్రొత్తవారని బిడియపడ లేదు. పుట్టింటివారికి పెట్టినట్లు మా ఆకిగి మళ్ళీ వచ్చి వడ్డించింది ఆ సంపన్న గృహస్థురాలు

"వండ నలయదు. వేవురు వచ్చిరేని
అతిథు లేతేర నడికి రేయైన బెట్టు"

అన్న పెద్దన్నగారి ప్రియసూక్తం పదేపదే కంఠంలో కదిలికదిలి కారాడింది. ఆ సాధ్వి మన వెంకటరమణయ్యగారి భార్య. స్వర్గస్థురాలయింది. భర్తృసేవా సౌభాగ్యం అనుభవిస్తూ ఉండాలె.

* * * * *

మఱునాటి ఉదయం బందరు బావుల్లో లవణోదకస్నానం చేశాము. పత్రికలు తిప్పుతూ ఉండేలోపల వేంకటరమణయ్యగారు తెల్లని తాటాకుల బుట్టలో పండ్లూ కూరలూ పట్టించుకొని వచ్చారు. అతసీకుసుమచ్ఛాయలను అవఘళించే కోమలవార్తాకవ్రాతంలో పసుపార్చిన పెయ్యకొమ్ములవంటి అరటిపండ్లగుత్తులను చూస్తూ భూదేవి పొదుగులో ఉన్న వివిధ సువర్ణచ్ఛాయా కలాపం ఏలా దర్శన మిస్తున్న దాయని తలపోతలలో తల మున్కలవుతున్నాను. ఇంతలో చక్రి

కేళీల గుత్తులు రెండు తెచ్చి కానీయండి అన్నాడు మిత్రుడు. ఒక డజను పండ్లతో ప్రాతఃకాలఫలహారం పూర్తిఅయింది. నానాఫలరసనవనీతంలాగా ఆచక్రకేళీస్వాదిమ లోపలికి జారినకొలదీ బందరు వారి అదృష్టభోగరుచులు చూచాయగా స్ఫురింపసాగినవి. ఆలంకారికులంతా కాశ్మీరపండితులు. వారికి ద్రాక్షాపాకం బాగా తెలుసును. కదళీపాకం మనదే నన్నాను. 'మీ ద్రాక్షారామం ఏం చేస్తా' రన్నాడు శర్మగారు. అది ఆంధ్రగంధర్వాప్సరసలకు అరణమిచ్చింది భాషాదేవి అంటూ ముగ్గు రమూ కృష్ణాలయానికి బయలుదేరాము. "న గచ్ఛేద్బ్రాహ్మణత్రయం" అనే నిషేధవాక్యం ఉపస్థితిలో లేదో లేక కృష్ణసందర్శనానికి సవ్యాపసవ్యములు లేవనుకొన్నామో?

*          *          *          *          *

బందరంటే నాకు భయమూ భక్తీ రెండూ ఉండేవి. కాని మా గుంటూరివారు బందరు బడాయి అని పెదవి విఱిచేవారు. పత్రికల కంఠస్వరం ప్రకర్షకంగా ఉండేది. అయినా భారతధర్మ దర్శనం చేసిన తర్వాత చేవ చావని జీవమూలములు అక్కడనే దక్కి ఉన్నవని భక్తి కుదిరింది. అమ్మకానికై అప్పుడప్పుడే వస్తూ ఉన్న పెరుగుకడవలు, కూరగాయల గంపలు, తమలపాకుల కావళ్లూ ఎదురుపడుతూ ఉండగా, చల్లపల్లివారి దివాణం దాటి, చౌకుచుట్టుకొని, కృష్ణారావుగారి గృహం చేరాము వసారాలోకి పోగానే కొట్టవచ్చిన ట్లొకచిత్రపటం ప్రత్యక్షమయింది. రంగులు గాఢంగా ఉన్నవి. ఆకారరేఖలు కూడా అతినిరూఢంగానే అగపడుతున్నవి. రంగులో రేకలో గట్టిగా రమ్మన్నట్లు లాగివేసినవి. సమీపించి చూచేసరికి.

'తపోనిధిం వేత్సి న మా ముపస్థితమ్' అన్న శాకుంతల వాక్యం వినిపిస్తున్నట్లు స్మృతికి తగిలింది. ఇంతలో కృష్ణారావుగారు లోపలినుంచి వచ్చారు. వారి రాకకు మునుముందుగానే వారి చూపుల చుక్కాని త్రిప్పింది కాబోలు. మేము కదలకుండా కదలినట్లయినాము. వెంకట రమణయ్యగారు నన్ను ఎఱిగించారు. అభివాదనం చేసాను. వారి కన్నులలో నా కన్నులు కలుపుకోవాలెనని వాంఛ కలిగింది. కాని ఆ సంయోగసాధన యోగసాధనవలె అసాధ్యమై ఆవలికి పోయింది. వసారా మూలనున్న బుద్ధప్రతిమను తాకి నా చూపు ఆ హస్తముద్రలో ముడుచుకొని పోయినది. 'ఎప్పుడు వచ్చారు' అన్నారు. ఏమేమో సంభాషించాము. దాదాపు తొమ్మిదిన్నఅ అవుతుంది. ఇంతలో నా దృష్టిమాత్రం బుద్ధుని ధ్యానస్తిమితవలయంలోనుంచి ఇవతల పడి, తిరిగి బెంగాలీచిత్రములో చిక్కుకొన్నది. కృష్ణారావుగారు కనిపెట్టారు. ఏమి చూస్తున్నారని నవ్వుతూ 'సత్త్వస్నేహం రాజసదీపం వెలుగుతుండటం ముందున్న ముగ్ధాసువర్ణలత' అని ఏమో వ్యాఖ్యానం చేసారు. ఆ చిత్రం దుర్వాసశాపరూపకల్పనమని తేల్చారు. నేను అనుకొన్నది 'రైటే' అని అంతస్సులో అహంకరించాను. కాని అది తత్క్షణమే అణిగిపోయింది. గ్రంథాలను గారెముక్కల వలె కొఱికితిన్నా, కోశాలు కంఠ ఘురట్ట ఘిఘట్టితాలైనా తాత్పర్యం తలలో తళుక్కొత్తడానికి తరుణం చాలా కావాలెనని తెలిసింది.

*          *          *          *          *

చామనచాయదేహం నడివయస్సు, తెల్లనిచొక్కా, అంతకన్న తెల్లనిధోవతి, చల్లని చూపులతో ఒకవ్యక్తి ప్రవేశించాడు. వారిని చూచి అందఱూ ఆదరవినయాలు జరిపారు. కృష్ణారావుగారు నన్ను ఎఱిగించారు. కాని వారెవరో పరిచయం చేయడం మఱిచారు. కాదు కాదు జగమెఱిగిన బ్రాహ్మణుడికి జందెమెందు కనుకొన్నారు. చిత్రమేమంటే అక్కడ లోకాభిరామాయణ కాలక్షేపం అంతగా జరగలేదు. పౌరపంచాయతీ భారతంకూడా విశేషం ప్రసంగానికి రాలేదు. ప్రసక్తాప్రసక్తంగా వారిరువురూ పదినిమిషాలలో ప్రాక్తన అధునాతన కళామీమాంసలోకి దిగిపోయినారు. బ్రహ్మాండ బృంహితమైన చైతన్యం – దానిలో మానవ చైతన్యాని కబ్బిన వైశిష్ట్యం – తన్నిసర్గమైన చింతన – అది అవ్యక్తంగా ఉండడం – అంతఃకరణ ప్రచారం రక్తితో అంకురించడం – భావనలో భాసించే స్వరూపం–అది వ్యక్తమై దృశ్యంగా పరిణమించేటప్పుడు కలిగే రూపానుసంధానం – ఇంకా ఈలాటి అగాధవిషయాలు పూర్వపక్ష సిద్ధాంతాలతో సంభాషించుకొన్నారు. వచ్చినవ్యక్తి ధారాళంగా ఆంగ్లభాషలో అనతిప్రగల్భమైన శైలిలో ప్రసంగించాడు. కృష్ణారావుగారు మాత్రం తెనుగులో కించిదక్లిష్టమైన వ్యాఖ్యాతృవైఖరిలో సంవాదం నడిపారు. ఆ శిష్టుల ఇష్టాగోష్ఠి ముగిసింది. వారా కథాకలాపాన్ని చిలికి చిలికి వదిలివేసారు. ఉద్బుద్ధబుద్బుదాలతోను నురుగులు నిండిన దధిభాండంలాగా నిలిచిపోయింది. కాని నవనీతాన్ని ముద్దలుచేయడం మఱిచి పోయి ఉంటారు.

ఇంతలో వేంకటరమణయ్యగారు అందుకొన్నారు. 'ఏమండీ! హనుమంతరావుగారూ, మఱి మాపత్రిక సంగతి – ఏమి చేయమన్నారు' అని ప్రసక్తిలోకి దింపారు. ఇంతవఱకూ మేము సంభాషించిందంతా అదేవిషయం కాదూ అంటూ కొంత సాకల్యంగా కొంత సూచ్యార్థసూచకంగా ఏమేమో ఉపదేశించారు. అదంతా జ్ఞాపకం లేదు. ఘృతప్రాయంగా సర్వాంగీణప్రసారం చేసి నాలో విలీనమైన బిందువు ఇది.

> "సారస్వత ప్రతిష్ఠితమైన సంపత్ప్రతిపత్తులే జాతికి అక్షయమయిన ఐశ్వర్యము. దానిని కళావంతంగా నిరూపించుకొని నిలుపుకోవడంలోనే జాతుల ఉత్తరోత్తర ప్రగమనం గోచరిస్తుంది. సారస్వతం సాధనా అవుతుంది. సిద్ధీ అవుతుంది. ఇది ప్రాచ్యులు ప్రతిపాదించిన గోప్యసూత్రం"

'ఆంధ్రభారతి' అనే శుభనామంతో పత్రిక బయలుదేరడం నిశ్చితమయింది. తొలిసంచికకు 'ధ్యానిబుద్ధుని' మీద పద్యాలు వ్రాయవలసినదని కృష్ణారావుగారు నన్ను ఆజ్ఞాపించారు. అందఱమూ లేచి నిర్గమించాము. ఇంత జరిగినా ఆ వసారాలో ధ్యానస్థిమితమైన ప్రసన్నోపాసనాప్రభావం తొణికినట్టు లేదు.

ఆంధ్రభారతి తెనుగువాడలో తీయనివాకిండ్లు చాలా తీసినమాట వాస్తవము. మును ముందుగా మహాకవులకావ్యాలలో సంవృతంగా సూచనామాత్రంగా ఉన్న సౌందర్యసంపద్వికాసాన్ని ప్రకాశింపచేయడం ఒకముఖ్యాంశంగా అంగీకరించి యత్నించింది. వేంకటరమణయ్యగారు

నూతనప్రియుడు. ఒకమారు కాకినాడ కాబోలు పోయి వచ్చారు. అక్కడ షేక్సిపియరు నాటకాల మీద ప్రచండమైన చర్చ జరిగినదట. వెంకటరత్నంనాయుడుగారికాలమది. ఇక షేక్సిపియరు వాఙ్మయాన్ని గురించి సమంత వ్యాఖ్యానాలు ఏల జరుగవు? అందులో ఆంగ్లమహాకవి ఊహించి ఉజ్జీవింపచేసిన నాయికలనుగూర్చి చర్చించారట. అది విని వచ్చారు అల్లా మనకావ్యనాయికలను గురించి చర్చించి సౌందర్యసారస్యాలను ప్రకటించాలని నా వెంటపడ్డారు. మొట్టమొదట నేనుకూడా బడాయికో లేక ఆంధ్రత్వం క్రిందుచేయ కాకూడదను అహంకారము మీదనో హుంకరించినమాట నిజం. మనమహాకవులు చిత్రించిన నాయికలు ఏ భాషలోనూ వీస మెత్త తీసిపోరని ధారాళంగా అనేసాను. కాని వేంకటరమణయ్యగారు ఊరక వదలేవారుకారు. ఆ అందచందాలు బైటపెట్టండి, దానితో మనపడుచువారికి ఆంధ్రకావ్యాలమీద అభిమానము అనురక్తి హెచ్చుతుందని గట్టిగా పట్టుకొన్నారు. వదిలించుకోవడం సాధ్యంకా లేదు. వ్రాయడానికి కలం సాగదు. ఊహకూడా మనసులో కదులుతుంది కాని చక్కగా కన్నులు విప్పి వికసించదు.

*  *  *  *  *

ఇంతలో బందరు వెళ్ళివస్తూ దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు బెజవాడలో దివ్యాదేశంలాగా దిగారు. సాయంత్రం రామమోహన లైబ్రరీలో శేమణీ తీరి కూర్చున్నాము. ఆర్య సమాజంవారి వైదికమాగజీను ఆనాడే వచ్చింది. అందులో ఏదో వ్యాఖ్యానాన్ని పట్టుకొని ముక్క ముక్కలుగా ఖండించేసారు. మంచి పులకలో ఉన్నది తత్వం ఆనాడు. అటు హాస్యరస పరామర్శ, ఇటు లాస్యంలో ఇమిడిఉండే పరమయోగ రహస్యం – ఒకటేమిటి తారామండల గణితశాస్త్రం మొదలు పాతాళోదరపదార్థ విజ్ఞానంవరకూ – ఆనకట్టమీద పారిలిపోయే మహాప్రవాహ తరంగతండంవలె దూకిపోతున్నది ప్రసంగం. అది ఆగేది ఎక్కడనో తెలియలేదు. ఇంతలో బ్రహ్మానందస్వర్గ కొంచెము తగిలింది 'అదంతా సరేనండీ! వేంకట రమణయ్యగారి ప్రశ్న అలాగే నిలిచిపోయింది. మనము శాఖాచంక్రమణము చేస్తున్నాము. తెనుగు కావ్యాలలో కళకళలాడే నాయికాజీవిత మేదైనా వ్యాసముఖంగా రావాలె. మీరేమైనా సూచన లీయండి. సుబ్బారావుగారు దీర్ఘాలోచనలో ఉన్నారు' అని నాతినర్మంగా ఎత్తి విడిచారు గోపరాజువారు. తిక్కన దిద్దిన ద్రౌపది వ్రాయరాదటోయి అన్నారు గోపాలకృష్ణయ్యగారు. నేను నీళ్లు నములుతూ నిష్పందంగా ఊరుకున్నాను. 'తిక్కన నిర్వహణానికి చక్కని పూర్వరంగం భారవిలో ఉన్నది చూడవోయి' అని మరొక సూచన విసిరారు. 'సుబ్బారావుగారికి మనుచరిత్రమీద మమకారం మెండు. అందులో అందకత్తె నెవరినైనా ఎత్తుకోరాదూ' అన్నారు. తిరిగి బ్రహ్మానందంగారు. 'భేష్ భేష్' అన్నారు వేంకట రమణయ్యగారు. వారి కప్పటికే శృంగారనాయికా భావనతో ఉల్లాసం ఉబ్బిపోతున్నది. ఆ నాటి ఆ ప్రకోపక సంభాషణాఫలితంగా 'వరూధిని' అనే వ్యాసానికి గ్రంథాలయ సర్వస్వంలో జాతకచక్రం స్ఫుటమయింది. ఇలా అందలి అనేక వ్యాసాలకు నూతన చర్చాప్రతిపాదనకు ఆధారములయిన గాథలు ఉన్నవి.

# II

సుప్తంగా ఉన్న స్మృతిసరస్సులో స్మరణోపలశకలం విసిరాము. జీవనం కదిలింది. బయలుదేరిన చిన్నకెరటము తిన్నగా వలయం కట్టింది. ఉత్తరోత్తరవిశాలంగా విస్తరిస్తున్నది. ఒక కెరటం మఱొక కెరటానికి పుట్టుతున్నది. వేఱొకదానికి జనకమగుతున్నది. దీనికి అంతు కన్పించదు. అందుకనే దార్శనికులు 'తత్ జన్యజనమైశ్వర్యం' అన్నారేమో ? అయితే, చూడడానికి పృథక్పరిమాణం తాల్చుచున్నా, అనంతంగా ఆవృత్తములవుతున్నా, ఇవన్నీ ఏకాశ్రయబద్ధములే. అడవి కూరకూ సముద్రలవణానికి పాకసంబంధం ఎలా కుదిరిందో, ఎవరు కుదిర్చారో ఊహింపలేము. కాని పర్యవసానంలో రుచి సిద్ధించింది. అలాగే, జీవనయాత్రాప్రవాహంలో మేము ఎక్కిననావకు బెజవాడరేవున లంగరు పడ్డది. ఈ మహాతీర్థసన్నిధిలో కించిదూనంగా అయిదాఱేండ్లు గడచినవి. ఇందులో అధికభాగం బ్రహ్మానందసమ్మితం కావడం విశేషము. అయ్యంకివారిది సంపన్నసంప్రదాయము. జనకుడు ప్రయోజకుడు. ఉద్యోగి. ప్రాచీనులకు సహజమయిన కళాకౌశలయందు ప్రీత్యయంగల గృహస్థుడు. అయినా ఏకపుత్రవిషయపారవశ్యంలో పడిపోక తప్పిందికాదు. కళకు టంకశం ఒత్తులున్నా, కనకకంఠహారాలతో తులికే కరికలభం నిరంకుశప్రాయంగానే నడుస్తుంది. అసలు ఆయనది గాలిపడగతత్త్వం. అంతా ఉత్తుంగయానము.

బ్రహ్మానందం ప్రగాఢగంభీరుడు. అసలు గోపరాజువారు ఆంధ్రదేశానికి ఆదాయసూత్రాలు అడంగులు పుటలు పెట్టి, ప్రమాణాలు పరిగణించి ముళ్ళువేసిన మంత్రిశిఖామణులు. గోలకొండ నబాబులకాలంలో వారు ఇతరుల కిప్పించిన ఈనాము లెన్నో చెప్పలేము. కాని సొంతపట్టాలు పెట్టుకొన్నవిమాత్రం స్వల్పం. ఆనాటి ఉద్యోగవృత్తం అటువంటిది.

బందరులో బ్రహ్మోపదేశం. విజయవాడలో క్రియాకలాపం. అవి సంక్రాంతినెలలు. చలిదినాలు. అయినా బెజవాడలో శీతం అంతగా బాధించేదికాదు. రాత్రిభోజనానికి వెళ్ళాము. ఇల్లు కుశలంగా కనపడ్డది. లోపలికి వెళ్ళేసరికి రెండు జర్మనులాంతర్లు వెలుగుతున్నవి. ప్రకాశిస్తున్న దీపజ్వాలలు ఎంత సమస్థిమితములుగా ఉన్నవో తుడిచిపెట్టిన గాజుచిమ్నీలు కూడా అంత నిర్మలంగా మెఱుస్తున్నవి. వెదికిపట్టుకుందామన్నా చిన్నమంత మచ్చగాని మకిలిగాని కానరాలేదు. ఎక్కడివస్తువక్కడ చక్కగా సర్ది సవరించి అమర్చినట్లు పొడకట్టుతున్నది.

పాదప్రక్షాళనాదులకు వేడినీళ్ళు - మడికట్టుకోవడానికి తడికొల్లాయీలు - పీటలమీద కుచ్చెళ్ళుపోసిన మడిగుడ్డలు - అంతా శుద్ధ ఆహితాగ్నిగృహంలాగా తయారయింది-అయ్యంకివారి చిన్నవాడు అఱనిమిషమయినా ఊరుకోలేదు. రామమోహనలైబ్రరీ విషయం ఏదో ద్రుతవాక్కుతో దొర్లిస్తూ, మధ్యమధ్య నవ్వుతూనే ఉన్నాడు. అందఱం కూర్చున్నాము. పచ్చని ప్రవిమలదేహం - విశాలమైన ముఖాన పండువంటి కుంకుమబొట్టు - విప్పారిన కండ్లనిండా

మెఱుస్తున్న కాటుక రేఖా - కాసెపోసి కట్టిన కావిచీరతో - ఒడ్డూపొడుగూ గల ఆ మంగళవిగ్రహాన్ని చూచేటప్పటికి చప్పున మా మేనత్త మనస్సులో ప్రతిఫలించినట్లుయింది. కమ్మదనాలు చిమ్మే కందిపచ్చడి, వంకాయ వేపుడుకూర, కర్పూరంవంటినెయ్యి, తియ్యని గడ్డపెరుగు, పుష్కలంగా చేతికొద్దీ వడ్డించింది. క్రొత్తపరిచయమైనా పాతచుట్టరికంలాగా నడిచింది. ఆసుమంగలి బ్రహ్మానందంగారి అర్ధాంగి. భర్తృసేవ భద్రంగా పవిత్రంగా జరిపి పుత్రపాలనావ్రతానికి ఉద్యాపనం కాకుండానే మధ్యేమార్గంలో స్వఃస్థురాలయింది. బ్రహ్మానంద పరిణామం బ్రహ్మచర్యంలోనే పర్యవసిస్తుందేమో?

*　　*　　*　　*　　*

దర్భంగామహారాజుగారు దక్షిణాపథతీర్థయాత్రలు చేసికొని కృష్ణాస్నానమునకై బెజవాడలో దిగుతున్నాడని వార్త విన్నాము. రామమోహన లైబ్రరీ అప్పటికి ప్రథమావరణా ప్రతిష్ఠితమయింది. మహారాజాగారికి స్వాగతమియ్యాలనే సంకల్పము ఎవరికి తగిలిందో సరిగా జ్ఞప్తిలో లేదు. కాని అభిలాష అంటుకొన్నది జీడీలాగా. ఒక్కసాయంత్రం లైబ్రరీలో ముగ్గురూ కలిసికొన్నారు. నేనుకూడా ఉన్నాను. మహాత్ముడు తొలిసారి శాంతినికేతనానికి వేంచేసినప్పుడు కులపతి రవీంద్రుడు ఆశ్రమవాసులతో సమాయత్తము చేసిన స్వాగతసంవిధానమంతా అప్పుడు నా దృష్టిపథంలో ముద్రించిన చిత్రపటంలాగా ప్రజ్వలిస్తూఉన్నది. ఆస్వాగత విధానమంతా ఒక్కొక్కవిషయమే వివరించడం మొదలుపెట్టాను. రమణయ్యగారు 'ఆ అది ఉండాలెనంటారు.' ఇది అవశ్యమంటారు. చివరకు ఏదిలోపించినా ముక్కకోసేసినట్లుంటుందంటారు. ఇలా అన్నీ అమర్చాలసినవే. ఆంధ్రుల అందచందాలు, అభిరుచివిశేషాలు, ఈదెబ్బతో ఉత్తరహిందూస్థానీయులకు బోధపడితీరాలెనంటాడు. అలంకరణమంతా అప్పుడు అవుతున్నట్లే పులకరించిన దేహంతో నవ్వులలో కొంతా మాటలలో కొంతా ఆగీ ఆగకుండా ఉత్సాహం ఉబికి పోతున్నది. ఆయనకు రెండవవ్యక్తి ప్రతి ప్రతిపాదనలో ఉండే ఘటనాప్రయాసమో, వ్యయభారమో సూచిస్తూ పరుగులు పోయే పడవను మందగిస్తాడు. ఇక మూడవమూర్తి పదిమాటలకు ఒకమాట విడుస్తూ 'డబ్బుమాటమాచుకోవచ్చులే? ఆ - ఆపుకాకపోతుందీ - ఈ కార్యము ఆగుతుందీ. అంటూ నూటిగా చుక్కాని త్రిప్పుతాడు. పలుకులో మెత్తదనం ఉన్నా పటిమ జాఱదు. ఆలోచనలో అతుకులు కన్పించవు. సంభాషణలో ఇతరవాదం అంగీకరిస్తున్నాడో, అపాకరిస్తున్నాడో తోచదు. కండ్లలో కౌతుకం తొణికిసలాడుతున్నా, రక్తరేఖలకు వాడుదలగాని వక్రతగాని తగులదు. చూపులు స్నిగ్ధంగా సూళ్ళుపోతుంటవి. కాని నాసికాగ్రంమీదినుంచి లలాటానికి తిరిగి స్థిమితములవుతూ ఉంటవి. వేడుకను ఎంత విశృంఖలము గాకుండా నడపగలడో వేదననుగూడా అంత వివృతము గాకుండా సంయమింపగలడు. బ్రహ్మానందం అసలు కొండిఫిటి మంచినీళ్ళబావి. అంటే లోతు ఎంతఉన్నా మధురోదకమయమూ, ద్వాదశ వత్సర క్షామానికికూడా ఎండిపోనిదీ అని తెలుసుకోవాలె. వాదానికి జిజ్ఞాస లక్షణం. నిర్ణీకరణంలక్ష్యము. వివాదంలో ప్రకోపం జడలు విప్పుతుంది. ఆవేశంతో

పర్యవసానం చెందుతుంది. ఉన్న మాధుర్యమూ మజా అంతా సంవాదంలోనే అనుభూతికి వస్తుంది. నాటి సంవాదంలో మూడువ్యక్తుల అంతఃకరణాదర్శాలు స్ఫుటంగా బయలుపడ్డవి. ఏతత్ప్రతిఫలంగా స్వాగతం శోభాయమానంగా జరపడం నిశ్చితమయింది.

*          *          *          *          *

రాత్రి అంతా దీపాల వెలుతురులో పని జరిగింది. కళకళమని పొద్దుపొడిచే సరికి రామమోహన గ్రంథాలయ ముఖరంగము ఒక మహామంగళ మంటపంలాగా సిద్ధమయింది. నిలువెత్తు కదళీస్తంభాలకు పచ్చికొబ్బరాకులు అల్లిబిల్లిగా చుట్టి తీర్చారు. వానిమీద పసుపు బంతిపూలదండలు ముప్పేటగా సవరించి జారవిడిచారు. వాటిని చూస్తే ఏలా ఉన్నదన్నాడు బ్రహ్మానందం. కుమారగిరిరెడ్డికాలంలో కొండవీటి నిండు కొలువులో ఆడవచ్చిన అప్సరసలలాగా ఉన్నారన్నాను. లోపల ఎంత ఆనందించాడో కాని బయటికిమాత్రం తొణకలేదు. ‘ఆ మంగళహారతి అయిందాకా ఏమరకండి’ అన్నాడు. రమణయ్యగారి రసికహృదయం దాగిందిగాదు నోరూరుతున్న నూత్నవయస్కునిలాగా నవ్వేశాడు. ఆదర్శనం ఆయనను ఏ స్మృతిలోకి లాగిందో? ఆ ఉషస్సునే అడగాలి!

చతుష్పథమంతా ఎఱ్ఱమట్టితో అలికించారు. ఎఱుపు, తెలుపు, పసుపు రంగులలో పిండిముగ్గులు పెట్టించారు. అష్టదళపద్మాలు, పరమపదసోపానాలు, గంగాఘట్టాలు, సీతాకోకగళ్ళు, ఏమేమో తీరుతీరుల రంగవల్లికలు తొలిచినట్లు, అచ్చులు కూర్చినట్లు నానావిధాల తీర్చారు. ఈ అలంకరణాలు అమర్చినవారందఱూ చదువుసందెలురాని నగరాలవంటి నారీమణులు. ఎంత నాగరికం వీరిలో తరతరాలు జీర్ణించి ఉన్నదో నాకు స్ఫురించింది. ఇందుకే వీరికి నగరాలనే పేరు నిలిచిపోయిందేమో స్థిరంగా!

ప్రవేశపదానికి ఉభయ పార్శ్వములలో పూర్ణకుంభాలు పెట్టారు. ఆ్రొమ్ముల మెత్తు రాగిగంగాళాలు, నాగవల్లి బానలు, నిర్మల కృష్ణాపూరంతో నింపిపెట్టారు. చిగురాకు మండలతో తోమిన తామ్రచ్ఛాయలు, పూసిన సుధాధావళ్యమూ శోభలు చిమ్ముతూ అవి మహోత్సవ మాహాత్మ్యమును సూచిస్తున్నవి. వాటునకు అఱపనికొత్తగంపలకు పసుపుపూసి వెండిపూలవంటి పేలాలతో నింపి మూడుచోట్ల పెట్టారు. ముఖరంగంలో కామధేనువులవంటి రెండు సవత్స పీనోధ్నీ మతల్లులను కట్టివేసారు. వాటుకకండ్లలో నీలైకశృంగారం, ముఖాలంకృత కుంకుమ రక్తతిలకాలలో ముగ్ధమాంగల్య మహత్తు, పసుపుబారాణి రాణిస్తున్న పాదాలలో ప్రపంచకల్యాణ సంపూర్ణ సుధాభాండమవలెనున్న పొదుగులో అమృతానందమోహాం కురదళిస్తుంటే కండ్లు గోంగించిననాడు ఆ ఆంధ్రదేశ గోజీవసౌందర్యం చూడడానికి గ్రంథాలయవ్యాయమునకు ఈవలావల పెద్దపెద్ద స్తమ్మాలకు తమలపాకుల మాలలు చుట్టి దీపాలు వెలిగించారు. ఐదుగురు కన్యలు, నూతన వస్త్రాభరణాలతో ఆపాద చుంబిత కంఠ కుసుమమాలలతో పూజపళ్లెం పెత్తుకొని నిలిచారు. సున్నితంగా సన్నాయి మేళం మ్రోగుతున్నది. కృష్ణకాలువ తరంగాలు లయ వేస్తున్నవి. కలానీల కంఠ స్వరాలాపం అలసా

లసంగా శ్రుతి కలుపుతున్నది. సూరి నరసింహ శాస్త్రిగారు భస్మధారణం చేసి కుంకుమ తిలకం ధరించి శుక్లకూర్పాసం, వకీలు తలపాగాతో పట్టెంజలు చెక్కిన పట్టంచు ధోవతి కట్టి ఎఱ్ఱంచు ఉప్పాడ ఉత్తరీయం వేసి, ఉత్సాహ సామ్యతలు పరస్పర సంరంభం పొందుతూ ఉండగా వచ్చారు. ఒకమాటు బ్రహ్మానందాన్ని మఱొకసారి వేంకటరమణయ్యనూ కలిసికోవడం, ఏదో విచారించడం, చర్చించడము జరుగుతూ ఉన్నది. రమణయ్యగారికి అసలు లోకమే కనబడడంలేదు— బ్రహ్మానందం 'ఒకరికేదో చీటీ వ్రాసి ఇవ్వడం, ఇంకొకరికేదోచెప్పి పంపడం, అన్నీ సరిగా ఉన్నవా అని నన్ను ప్రశ్నించడం, ఈ పందిలి రోడ్డుదాకా పెంచివేస్తే బాగుండేదేమో యని మెల్లగా పల్లు కదలకుండా లోపశేషములు ప్రస్తావించడం' — ఈలాటి కార్యభారగ్రస్తావస్థలో ఆనందమో, ఆందోళనమో తెలియరాని స్థితిలో ఉన్నాడు. మొత్తానికి అందఱికీ ఏదో చిత్తవిస్ఫారం హత్తుకొన్నది బెజవాడ ఉపలక్షకంగా, కృష్ణాతీర విషయం సాధర్మ్యంగా 'ఏనాడో ఏ అమరావతిలోనో ఏవృద్ధ కులపతులకో నాటి విద్యాలయముల ముందు ప్రవర్తిల్లిన సుస్వాగత శోభ సాక్షాత్కార మయింది' అప్పటికే చూడవచ్చిన పౌరజనం, వేలకు మించింది - సర్వమూ సమాయత్త మయింది.

కృష్ణాస్నానములు సలిపి, ప్రాగుదితుడగుచున్న సూర్యభగవానునికి అర్ఘ్యములెత్తి, తీర్థవాసాదికములైన భూరిదక్షిణలిచ్చి, దర్భాంగా మహారాజుగారూ వారి పరివారమూ గుఱ్ఱపు బండ్లలో వేంచేసారు. జయజయధ్వానములు మిన్నుముట్టినవి. వాద్యములు మ్రోగినవి. బ్రాహ్మణ స్వస్తివాచనం బ్రహ్మానందజనకంగా ప్రారంభమయింది.

వచ్చినపెద్దలు పురపాలకులు తోడ రాగా సూరి నరసింహశాస్త్రిగారు, వేంకటరమణయ్యగారు వారి సమీపించి బండ్లలోనుంచి కరగ్రహణంచేసి దింపారు. మహారాజు దిగ్భ్రాంతి చెందాడు. "What is this! Andhras—Artists—Beautiful"— అని సచివోత్తములతో ముక్తాముక్త మయిన సంభాషణము చేస్తూ దిగాడు. విస్మయ వివశమయిన ఉత్తుంగ చిత్తవృత్తి అంతా ఆయన విశాల నేత్రాలలో విస్ఫారింది.

సంప్రదాయోక్తంగా అర్ఘ్యం, పాద్యం మున్నగు విశిష్టాచారాలూ లాంఛనలూ జరిగినవి. గోముఖిలో కావలోకనం చేస్తూ పూర్ణకుంభములను చూస్తూ లాజలు వర్షిస్తూండగా, బ్రాహ్మణ దీవనాక్షతలు రాలుచుండగా, రంగవల్లీ మంగళమయమైన గ్రంథాలయ ముఖపథాన అడుగులో అడుగుపెట్టుచూ నడిచారు. ద్వారందగ్గరనున్న కన్యలు కంకణాలు తాళంవేయగా కంఠాలు కలస్వర గీతామృతమును చవిచూపగా మహారాజుకు కుంకుమతిలకం తీర్చి, హారతులెత్తి స్వాగతాభివందనం సలిపారు సుప్రవేశమూ సుఖాసనకలాపమూ జరిగింది. వాద్యాలు ఆగినవి. మహా సంకల్పం పఠిస్తున్న ఆంధ్రబ్రాహ్మణ కంఠాలలో ఆద్యంత పర్యుత్సుకమయిన వైదికస్వర వాలభ్యం ఉదాత్తంగా ఊర్ధ్వముఖమై, అనుదాత్తంగా పరిసర పర్యాప్తమై బ్రహ్మానంద సమానాధికరణాన్ని సాధిస్తున్నది.

*  *  *  *  *

పత్రికలూ పత్రికా నిర్వహణమూ ఆ రోజుల్లో చాలా అధికంగా ఆకర్షించి ఆవేశమెత్తించిన మాట నిజం. మోడర్న్ రివ్యూలమీద ఉండే మోజు ఇంతింతకాదు. అది ఎప్పుడు వస్తుందా అని పోస్టు ఎదురుచూస్తూ ఉండేవాళ్ళు. ఆ పత్రికా వ్యాసాలు అక్షరాక్షర విచక్షణతో చదవడం సంధ్యావందనంవంటి కర్తవ్యం. అందులో ముఖపత్ర చిత్రాలను అవలోకించి ఆకళింపు చేసుకోవడం నాగరక లక్షణంగా ఉండేది. కొన్ని బొమ్మలు కంటికింపుగా ఉండేవి. మఱికొన్ని విపరీతరేఖా విన్యస్తంగా కనబడేవి. వాటిమీద ఏవో వ్యాఖ్యలు వ్రాసేవారు సంపాదకులు. బెంగాలీవారంటే జాతీయోద్ధారకులనే అభిప్రాయం వేళ్ళుపాతింది. కాబట్టి ఉన్నా లేకపోయినా ఆ విచిత్ర చిత్రాల అంతరార్థ రామణీయకం అగమ్యగోచరమయినప్పటికి అనుభూతికి వచ్చినట్లు విద్యాధికులు నటిస్తూ ఉండేవారు.

రమణయ్యగారి ఆంధ్రభారతి మొత్తంమీద ఒక నవ్యాగమనాన్ని ప్రవేశపెట్టింది. ఆ రచన కొంత క్రొత్తత్రోవలో తుళ్ళింతలాడేది. రచయితలలో రాపిడి పడుతున్న భావాలు, అంతూ పొంతూ అగపడని అభిలాషలు, నేల నాలుగుచెఱగులను చుట్టివత్తామని కట్టిన మనోరథాలు, జాతిని ఏదో అవ్యక్తమైన ఒకానొక ఆవేదనలో ఆరాటంలో ఉడికించి వేసినవి. అయితే గుఱ్ఱాలు లేకుండా అశ్వశాల లెందుకు? పాడి లేనిఇంట్లో పాత్రలు సేకరించి పెట్టడమెందుకు? బియ్యం చూడకుండా ఎసరు కాగపెట్టి ఏమిఫలం? సంచీ షాహుకారిదైతే దానిలోని ద్రవ్యాన్ని గుఱించి తర్కించిన ప్రయోజనమేమి? పాతగోడలను పడగొట్టాలనేగాని పూతవేసి పులిమి పుచ్చడంవల్ల లాభమున్నదా? ఇత్యాది రాద్ధాంతం, ఆక్షేపణ, అనుదినం అనంతంగా జరుగుతూనే ఉండేది. కాని రమణయ్యగారి చిత్తవృత్తి చాలా చిత్రమైనది. చీటికి మాటికి చెదిరేదికాదు. కోడెదూడకు కొమ్ములు వచ్చేటప్పుడు ఎలాటి కండూత్కర్ష తలకెక్కుతుందో అలాటి పడుచుపొంగు ఆయనలో ఉండేది అన్ని జబ్బులకూ ఆనందభైరవి అన్నట్లు ఎక్కడ పట్టుకున్నాడో 'సంశయాత్మా వినశ్యతి' అనేవాడు. బ్రహ్మానందం బ్రహ్మవిద్యలాగానే అనుభవంమీద ఆధారపడి మాట్లాడే మంత్రిశాఖీయుడు. 'కట్టలు గట్టిగా లేవని కృష్ణాప్రవాహం పొంగకుండా ఎండిపోతుందా ఏమిటి?' అని వివాదసమాప్తి చేసేవాడు. ఈ పూర్వరంగం మనసులో పెట్టుకుంటే నాటి పత్రికా ప్రచారానికి బెజవాడలో జరిగిన ప్రధానసేవ అర్థమౌతుంది. ఆనాడు ఆంధ్రదేశంలో అంకురించిన ఆవేశాభిలాషలకు బెంగాలీ ప్రచలనమే మూలకారణమనేవారు చాలామంది ఉన్నారు. నేను పూర్తిగా ఆకోటిలోని వాడనుగాను. అయితే మన ఉద్యమాలు చాలావఱకు బెంగాలీ వైఖరిని అనుకరించిన వన్నమాట సత్యం. ఆంధ్రులకు జీవయాత్రలో నిసర్గమైన ఒక విలక్షణ వర్చస్సూ వాసనా ఉన్నవి. వాని స్వరూపస్వభావాల అసలు నిగ్గును తేల్చడానికి - సూర్యతేజస్సునువలె - పరమాణుస్థితికి మార్చి విభాగింపకలిగితే, అందులో అభిమతావరణంకన్న అభిరుచి వలయం అధికాధికంగా దర్శనమౌతుందని నా విశ్వాసము. వీరేశలింగంవంటి వీరసంస్కర్త హృదయం 'చాక్షుషక్రతు' వని కవియే చెప్పుకొన్న కాళిదాసకాంతరూపకాలమీదికి వ్రాలక తీఱిందికాదు. ప్రౌఢ గణితశాస్త్ర

ప్రవిష్టులైన భానుమూర్తిగారి భావనా వీధిలో 'భారతధర్మదర్శనం' ప్రత్యూషమువలె పరవశ నృత్యం చేసింది. రమణయ్యగారి ఆంధ్రభారతీ పురాణ సంపుటాలను ఒక్కమాఱు తిరగవేయుమని నా మనవి. గ్రంథాలయ సర్వస్వాల ప్రాతసంచికలను సరదా కోసమైనా విప్పి చూడండి. మరుగువడి మరిచిపోయిన ఆంధ్రుల మాధుర్యానుశీలనం తిరిగి చిగిర్చే చైత్ర చిహ్నాలు గోచరింపకపోవు. నాటి ఈ క్రొత్తరాగము సుప్తంగా ఉన్న సహృదయచక్రాన్ని చక్కిలిగింతలుపెట్టి వేసిందంటే నేను అతిశయోక్తు లాడడం లేదని నమ్ముతున్నాను. గురుజాడవారు ముత్యాల సరాలు తయారు చేసి తమంతటతాము పంపారంటే, కొమఱ్ఱాజువారు అలంకార చర్చతో భూషించారంటే, ఆనాటి ఆ పత్రికావ్యవసాయవిశేషమూ అది ఆకర్షించిన ప్రాజ్ఞజనాదరమూ అవగతమౌతుంది. గురుజాడవారు మహారాజ మిత్రుడు. ఆంగ్లసాహిత్యాభిరుచులకు ముగ్ధుడైన నవనాగరకవి దగ్ధుడు. సౌందర్య సారస్య భావములే శుష్కించి, ముష్కరమైన మూర్ఖాచార జాడ్యంలో మూలుగుతున్నట్లు కన్పించింది ఆయనకు మన ఆంధ్ర సంఘం. దుష్టాంగం ఖండిస్తేనే గాని శేషాంగ శ్రేణికి కావలసిన సుఖం కలగదని వారి విశ్వాసం. అందుచేతనే వీరేశలింగంగారికి వలెనే గురుజాడ వారికి కూడా సాహిత్యం శస్త్రసాధనగా అవలంబనమయింది. ప్రారంభములో కానీ కవికుల వసంతం అభినవంగా తెర తీసేసరికి కాంతాసమ్మితమైన స్వాదూపదేశ విన్యాసమే భాసించింది రంగం ముందు. కొమఱ్ఱాజువారు కోవిదులు. పరిశోధనాతంత్రములో అభిమానం అయినా వాదంకోసము అబద్ధ సంధానం ఆయనకు సుతరాం గిట్టేదికాదు. విజ్ఞానాన్ని విలువకట్టడానికి చరిత్రజ్ఞానము అవశ్యమని వారిమతం. ఆయన 'వాదంకోసం యుక్తికోసం నేను తర్కం చసువుకోలేద'నేవాడు. అనంతరాన్వేషణకు అవకాశం ఉన్నాటేనే శంకకు చోటున్నది కాని అది కేవలం లక్షణం అనుకోవడం ప్రమాదమని నమ్మిన నైయాయికుడు. పగిలీ పగలని ఱాతిబండలమీద చిలుము తినగా చిల్లులు పడ్డ రాగిరేకులలోనూ తగుల్కొన్నవి ఆయన ప్రజ్ఞాపాటవాలు. అటువంటి మీమాంసకుణ్ణికూడా ఆంధ్రభారతి తన అలంకారశాఖాఛాయల క్రిందికి లాగింది. ఇది చాలదా? గ్రంథాలయ సర్వస్వము భాషాబంధముఖంగా యావదాంధ్రమహోదయమునే దృష్టియందుంచుకొన్నది. అందువల్లనే దేశాంతర రాష్ట్రాంతర దూరసామీప్యములను పాటింపక, ఆంధ్రుల పూర్వజాతీయ వైలక్షణ్యానికి నమోవాకము చెప్పింది. ఉత్తరాది ఆంధ్రులు తెలంగాణమును విస్మరించిరని ఇటీవల గోలపెట్టేవారి వ్రాతలకు నవ్వు వస్తుంది. గ్రంథాలయ సర్వస్వానికి ముఖబింబంగా ఓరుగల్లు కోటవాకిలి చిత్రము ముద్రితమై దాదాపు ముప్పదియేండ్లయింది. వేంకటరమణయ్యగారు గురురాజారావుగారిని వెదకి వారిచే తెలంగాణ కథాపరిశోధనం ప్రారంభింపజేసికూడా అంతికాలమయింది. 'లోకమంతకు కాకపెట్టిన కాకతీయుల కదన పాండితినీ పారాయణచేసి ఓరుగల్లువసూర గౌరవాంకితముగా బలుశస్త్రశాలలు నిలుపునాటి' తెలంగాణాదీప్తిని అభినవాంధ్ర కవితావిపంచిలో వినిపించియును ముప్పది యేండ్లు నిండినవి. పంచాంగాలు చినిగిపోయినా నక్షత్రాలు నశించవుగదా? పింగళి వెంకట్రామారెడ్డి దేశముఖుగారిని మొట్టమొదట పిలిచి అధ్యక్షపీఠగౌరవ మిచ్చుటకుగూడ బెజవాడే ముందంజ వేసింది.

అయితే గ్రంథాలయ సర్వస్వము ప్రధానంగా గ్రంథాలయోద్యమ ప్రచారానికీ, గ్రంథాలయ జీవమయిన సారస్వతవికాసాన్ని విస్తరించడానికి కంకణం కట్టుకొన్న పత్రిక సమకాల సముత్సాహంవల్ల పొడసూపిన ఇతిహాసవిమర్శనాది రచనలకుకూడా కొంతతావిచ్చి సహకారమయింది. అయితే గ్రంథాలయోద్యమము అప్పటి కింకా బాల్యావస్థలోనే ఉన్నది. రామమోహన లైబ్రరీ భవనం కొంత తయారయింది. కాని దాని సంపూర్ణరూపం మాత్రం 'త్రిమూర్తుల' చిత్తభిత్తికల మీదనే చిత్రాకారంగా నిలిచిఉన్నది. ఈకట్టడంకోసంవారు ధనం సంపాదించిన విధానములన్నీ బ్రహ్మానందంగారే చెప్పనర్హులు. పత్రికాప్రచారంమీదికి రమణయ్యగారి ఉత్సాహం బాగా మొగ్గింది. జాతీయోద్యమమూ గ్రంథాలయోద్యమముకూడా వ్యక్తుల స్వార్థ ప్రయోజనం కొఱకు వినియోగించు కొనే అవస్థ వచ్చింది. దీనిని అరికట్టాలన్నారు బ్రహ్మానందంగారు. ఆలోచనలు సాగినవి. పన్నాగం వేయగలవాడు బ్రహ్మానందమే.

మొత్తానికి సంప్రతింపుల గడువు గడిచింది. నిశ్చయానికి వచ్చారు. పత్రికను ఫస్టుక్లాసు స్కైలులో నడపాలెనని సంకల్పించారు. అయితే సంపాదకుని పేరు ఎవరిది పెట్టాలెనని మీమాంస వచ్చింది. ఈకాలంలో ఇది గౌరవం కావచ్చు. ఆకాలంలో అది చాలా అపాయంతో ఉండేది. అసలు అధిక్షేపం నడపడం కష్టం. అధిక్షేప పత్రికలకు మానసష్టపు దావాల భయం ఒకటి. సర్కారు శాసనాల బంధం మఱొకటి. ఇందుకుకూడా సిద్ధమైన మనిషి దొరకక పోలేదు. నోరి వేంకటేశ్వర్లు చేత డిక్లరేషన్ ఇప్పించడానికి ఒప్పించారు. దృఢిష్ఠుడు బలిష్ఠుడు అయిన యువకుడు అతడు. మిన్ను విరిగి మీదపడుతున్నదంటే ఆవేశానికి భూమికి చాలాదూరం ఉన్నదిలే అనే స్వభావం. తొణికే వాడు కాడు. ఎంత త్రొక్కుడులోనైనా, ఇక పత్రికకు పేరు కావాలి. అది తేలదు. పగళ్లు రేలు గడిచినవి. ఏపేరూ నిలువదు. కొసకు "కొరడా" అనే నామకరణం నిర్ధారణ అయింది. డిక్లరేషన్ దరఖాస్తు ఇచ్చారు. బ్రహ్మానందంగారు స్వయంగా సాయంత్రం వెళ్ళి మేజస్ట్రీటుగారితో ఏమి మంతనం చేసారో వారం రోజులలో మంజూర్ వచ్చింది.

అందులో ప్రథమ పత్రికలో స్వవిమయం వ్రాయాలే. పత్రికపేరు 'కొరడా' అది ఎందుకు ఉపయోగిస్తుందో? ఏమని వ్రాయాలెనో తేలిందికాదు. తిట్టినా తియ్యగా ఉండాలె కుట్టినా కోమలంగా ఉండాలె. వేపలతీపి — కాకుల కలకంఠాలూ ఇవి ఎలా కుదురుతవి? తుదకు 'ఎవరో' వ్రాసారు. రామమోహన లైబ్రరీలో వసారాలో తూర్పువైపుగదిలో భల్లున తెల్లవారుచుండగా వ్యాసం ముగిసింది. బ్రహ్మానందం గంభీరంగా మందహాసం చేసాడు. రమణయ్యగారు ఎగిరి గంతులు వేసారు.

'కొరడా' పత్రిక బయటపడ్డది. నాటి నాయకలోకమంతా ఉలికిపడ్డది. కొరడాలో తొలి వ్యాసం ఎవరు వ్రాసారనేది అప్పటికీ ఇప్పటికీ తేలలేదు. స్వర్గీయ ఆంధ్రరత్నం దానికి కర్త అని చాలామంది అనుకొన్నారు. కానీ ఆయన హస్తస్పర్శ అందులో లేదేమో? ఆరహస్యం రమణయ్యగారికి బ్రహ్మానందంగారికే తెలుసును.

ఆనాటి కథాకలాపాన్ని తలుచుకుంటే పునర్భాసితమైన విస్మృత విజయవాటి కావ్యాసంగం యథాస్మృతంగా ఆత్మసాక్షికంగా ఇలా అనుఘటితమయింది. సెలవు !

మైత్రినిపోలిన ధర్మపు
సూత్రము వేఱొండు లేదు నూ మనుజులకున్
ధాత్రిన్ దానిని నడిపిన
పాత్రత నిహపరసుఖము లవశ్యము కలుగున్.

శ్రీ రాయప్రోలు సుబ్బారావు.

---

## సారస్వతోపాసకుడు

ముప్పది అయిదు సంవత్సరముల ఆంధ్రజాతీయోద్యమ జీవితమున నేటికిని వెనుకటి కాలమునకును చాలా వ్యత్యాసము కనబడక మానదు. ప్రాచీనఘట్టములు పోయి ఎన్నియో నూతన ఘట్టములు వాటిస్థానమున వచ్చినవి. కొన్ని సజాతీయముగాను మరికొన్ని విజాతీయముగా నున్నవి. కొన్ని ధ్వనిని యెక్కువ జేయుటయే ప్రధాన లక్ష్యముగా కనబడుచున్నది. పైకి ప్రదర్శనమునకు డాబునకు నలుగురితో పేరుకొరకు పెనగులాడేవి కొన్ని. నిలుకడ, కంజాయింపు, కట్టుదిట్టము, ఉన్నతాదర్శములు ప్రతి యుద్యమమునకును ఆయువుపట్టులు. బుద్బుదప్రాయముగా క్షణక్షణమునకును లేచుచు అంతరించుచుండుట నేటి యుద్యమములలో మనకు ప్రత్యక్షమగు ప్రధానలక్షణము. ఆధునిక కాలములో సేవజేయు అనేకమంది సామాన్యులకును ప్రముఖులకును గూడ స్వలాభాపేక్ష దృష్టితో తళతళ మెరయుచుండును. సేవకులలో ఏకత్వముకంటె భిన్నత్వము మూర్తీభవించి యున్నది. త్యాగశీలములుగాని, యున్నతాదర్శములుగాని, నిష్కామసేవగాని అనేకులలో మృగ్యము. నేడు ప్రతియుద్యమము విద్యావంతులు, వినయశీలురు, దృఢసంకల్పులు, నైతికమార్గ ప్రవర్తకులు, నిష్కల్మష దేశసేవాపరాయణుల హస్తములలోనుంచి జారిపోయి అల్పుల హస్తగతమగుచున్నది. అందుచేతనే నేడు ఆర్భాటము హెచ్చు. ప్రశాంతము అతిస్వల్పము. మనజాతి ముందుకు నడచుచున్నదను మనభ్రమకంటె మనము దీర్ఘముగా యోచించిన నలుముఖముల ప్రజ్వరిల్లుచున్న కుల ద్వేష విషజ్వాలలోబడి ఆహుతియగుచున్నదనిన అతిశయోక్తిగాదు. పదవులకు, గౌరవములకు, పత్రికలలోను ప్లాటుఫారాలమీదను ప్రకటించుకునే వ్యసనమునకు పూలదండలు, ఫలాహారవిందులు, సన్మానపత్రాల ఆర్భాటాలతో జాతీయకార్యరంగము బలియగుచున్నది. ఆవగింజంత యుంటే మేరు పర్వతమంత ప్రదర్శనము.

కార్మికోద్యమము, కర్షకోద్యమము, పారిశ్రామికోద్యమము, హరిజనోద్యమము, కిసానోద్యమము లంటూ ఇంకను ఎన్నో నేల యీనినట్లు నలువైపులా తెగాఒకటి వెలసినవి. వీటినిగాని

ఈ సేవకులనుగాని గర్హించను. ఎవరికివారే యమునాతీరే. తలా ఒకదారి. ప్రతిపెద్దమనిషీ ఒక ఇష్టు. సోషలిష్టు, కమ్యూనిష్టు, కాంగ్రెసిష్టు, బ్లాషవిష్టు, ఇంకా ఇష్టు లున్నవి. ఒకరు ఏటికిలాగిన మరియొకరు కోటికి లాగడం మొదలిడుతారు. అందరికి తలాఒకరకం ఝండా. వేరువేరురకం పాటలతో యుద్యమాలు సాగించుతుంటారు. పిన్నపెద్ద తారతమ్యాలు ఈకాలంలో అవుసరం లేదు. చదువు, విజ్ఞానం, సేవానుభవం అసలే పనికిరావు. ఈలక్షణములు నవయుగపరివర్తనమంటారా? లేక జాతీయపరివర్తన మనెదరా ?

మన జాతీయ జీవిత చరిత్రలో ఒకపాతిక సంవత్సరములు వెనుకకు దృష్టి మరలించి చూచిన ఇట్టి అవ్యక్తలక్షణములు నాడు కనుపించవు. అర్ధశతాబ్దమునుంచి నిర్విఘ్నముగా కొనసాగుటయేగాక ఆంధ్రజాతీయాభివృద్ధికి నిరుపమాన త్యాగశీలముతో ప్రథమసోపానములను నిర్మించి సేవజేసిన ఆ ధీరుల అడుగుజాడలను గుర్తించిన నాటికిని నేటికిని గల వ్యత్యాసము స్ఫుటముగా గాన్పించక మానదు.

సంఘసంస్కరణ, బ్రాహ్మసమాజ, ఆదియాంధ్ర, వందేమాతర, గ్రంథాలయాది మహోద్యమములను ఒక్కొక్కటే పరిశీలింపుడు. విజ్ఞానచంద్రిక, ఆంధ్రభాషాభివర్ధనీ, గ్రంథ మండలులను నెలకొల్పి విజ్ఞానామృతమును నలుదెసల వెదచల్లిన ధీమంతులను తెలిసికొనుడు. మానవసౌభ్రాతృత్వమును దేశములో నెలకొల్పి ఏకజాతికి పునాదివేయుటకు ఆ జన్మాంతము, తరతరములవఱకును బంధుమిత్రాదులకు, సంఘమునకు, కులమునకు దూరులయిన సంఘసంస్కర్తలను, బ్రాహ్మసమాజకులను అనుసరించువారేరి ? వాడవాడలలో పల్లెపల్లెలలో రాత్రి దినపాఠశాలలు నెలకొల్పి కార్మికులకు కర్షకులకు జీతబత్తెములు లేకుండా విద్యాదానము, విజ్ఞాన ప్రచారము చేసిన నిస్వార్థసేవకులకు నేడు ఎచ్చటనైన గౌరవస్థానము గలదా ? కులమునకు దూరులై ఆదియాంధ్రులను హృదయపూర్వకముగా నాలింగనము చేసికొని ఆదియాంధ్రోద్యమమును సర్వ విధముల నిర్విఘ్నముగా కొనసాగించి ప్రతిఫలాపేక్ష రహితముగా సేవజేసి పాటుబడిన సేవకులను బోలువారు నేడు కార్యరంగమున ఎందరు గలరు ? వందేమాతర కాలమునుంచి ఈమధ్య యుగము వఱకు ప్రజల నఱ్ఱూతలూగించిన కవులు, దేశనాయకులు, గ్రంథకర్తలు, దేశసేవకులు, వీరందరు ఏకలక్ష్యముతో స్వరాజ్యసిద్ధికయి పాటుపడ లేదా ?

ఈకాలములో రకరకాల చిత్రములతోను, వికారరూపమగు నగ్నరూపములతోను, మనపత్రికలలో కొన్ని కాలక్షేపము చేయుచున్నవి. సోద్రవార్తలు, నవప్రాచీనకవిత్వాలు, పిట్టకథలు, ప్రియలేఖలతో కొన్ని కాలక్షేపం జేయుచున్నవి. నేడు మనకు కావలసినది ఆకాశవీధులలో అంతఃపురములు, నడిసముద్రములో రాజమహలులు నిర్మించేకవులా? వెనుకటి జాతీయ యుద్యమము లో బయలుదేరిన కవుల, పత్రికాధిపతుల, జాతీయ సేవకుల ధోరణి వేరు, ప్రస్తుతకాలమున నడచే నడక ఇంకొకటి. కొందరు బుద్ధిమంతులు ఈ కాలమునగూడను లేకపోలేదు. అంతా సర్వశూన్య

మని నాయభిప్రాయముగాదు. కొద్దో గొప్పోయున్నది గనుకనే నాడి మందముగా అంతమాత్రమైనా కొట్టుకొనుచున్నది. దేశసేవలో హెచ్చుభాగము బేరసారములకు గురిఅయినది. వెనుకటి కాల మట్లుగాదు. భారత సామ్రాజ్యలక్ష్మిని బంధవిముక్తురాలను జేయుటకు అందరును ఏకలక్ష్యముతో పాటుపడిన కాల మది.

ఆంధ్రులకు ప్రథమమున విజ్ఞాన భిక్ష పెట్టినది గ్రంథాలయోద్యమము. మహనీయులు, సర్వవిధముల నుత్తములు నగు శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులు, చిలకమర్తి లక్ష్మీనరసింహా కవి, మంగిపూడి వేంకటశర్మ కవిగారల వ్రాతలు ఆంధ్రులకు జ్ఞానభిక్ష పెట్టినవి. పిమ్మట విజ్ఞాన చంద్రిక, ఆంధ్రభాషాభివర్ధనీ గ్రంథమాలలు దారి తీసినవి. ఆపైన గ్రంథాలయోద్యమము వీటెపు చేయూతగా దీసికొని తనపని సాగించినది. విజ్ఞానమును నలుముఖముల వెదచల్లినది. అంతటను సరస్వతీ ఆలయములు వెలసినవి. వాటిని అర్హులగు పూజారులపరము జేసినది. ఆంధ్రదేశములో ఒక్క గ్రంథాలయోద్యమమునకే సజీవమగు స్థిరమైన అఖిలాంధ్రస్వరూపము గల దనిన అతిశయోక్తి గాజాలదు. గ్రంథాలయ సర్వస్వమను పత్రికారాజము, గ్రామ, పట్టణ, జిల్లాసభలు, సమావేశాలు, అఖిలభారతదేశముతో ఈ చుట్టరికము, గ్రంథాలయయాత్రలు ఇవన్నియు యుద్యమ స్వరూపములు. రాజమహేంద్రవరములోని గౌతమీ గ్రంథాలయము, ఏలూరునందలి హిందూ యువజన గ్రంథాలయము, విజయవాడలోని రామమోహన గ్రంథాలయము ఇవి ఈ యుద్యమమునకు పెట్టనికోటలు. ఇంకా చిన్న పెద్ద ఖిల్లాలు అనేకచోట్ల లేకపోలేదు. ఈ విజ్ఞానబీజములే నేడు మహావృక్షములై ఆంధ్రులను, గాఢనిద్రనుండి మేల్కొలిపినవి.

ఈ మహోద్యమమును ఇట్టి యుత్కృష్టస్థితికి దెచ్చుటకు ముప్పది అయిదు సంవత్సరముల నుంచి ఏకధాటిగా సేవజేసి కృతార్థుడైన ధీరుడు వేంకటరమణయ్య పంతులు. తాను నిర్మించుకొనిన స్థానమును వదలక, రణరంగమందలి వీరునివలె ఉద్యమమును నిర్విఘ్నముగా కొనసాగించినాడు. విజ్ఞానోపాసనను జేసి అయ్యంకివారు తమ జన్మమును సార్థకపరచుకొన్నారు. పుట్టుట గిట్టుట ప్రతిమానవునకును సహజము. కుటుంబపోషణకయి ధనమార్జించుకొనుట, అందు పేరు ప్రతిష్ఠలు సంపాదించుకొనుట సామాన్యము గాని వేంకటరమణయ్య పంతులు ఇందుల కతీతుడు. మాతృదేశసేవకయి ఇంతకాలము ఏకధాటిగా అచంచలభక్తి విశ్వాసములతో యోధునివలె పాటుపడెడి అదృష్టము అందరకును దక్కదు.

వేంకటరమణయ్య పంతులను దాదాపు ముప్పది అయిదు సంవత్సరములనుంచి నేను బాగుగా నెరుగుదును. మా యుభయుల మధ్యను దోస్తి మెండుగా గలదు. మాగ్రామం వచ్చినపుడు ఆయన నాతో బసచేసెడి అదృష్టము నాకు తరుచుగా కలిగినది. ఈ యుద్యమములో ఆయనంత ఏకాగ్రతతో గాకున్నను తృణమో ఫణమో వారితో కొంతవఱకు భుజమేసితిని.

సంఘసంస్కరణమంటే ఆయనకు యిష్టము లేకపోలేదు. రాజకీయమన్నా బెదరు కనబడదు. ఇతరయుద్యమములలో ఆయనకు సానుభూతి లేకగాదు. అందరితోను సహవాసంచేస్తాడు. పిన్న పెద్దలను ప్రేమించే స్వభావ మున్నది. అన్నిసభలకు హాజరయ్యే అలవాటున్నది. గాని అన్నిటికి అగ్రతాంబూలం నాదే అంటూ ప్రతియుద్యమాన్ని పూసుకొని తుదకు ఏది చేయజాలని వ్యసనము ఆయనలో లేకపోవుటవలననే ఒక మహాయుద్యమానికి పేరుప్రతిష్ఠలు తెగలిగిన సేవకుడైనాడు. స్త్రీల విశ్వకళాపరిషత్తు, పూనా వితంతుశరణాలయములకు జనకుడగు ప్రొఫెసరు కార్వేవలే, లాహోరులోని దయానంద ఆంగ్లోవేదకళాశాల ప్రధానాచార్యుడు మహాత్మా హంసరాజువలె, కాంగ్రిగురుకులస్థాపకుడు స్వామీ శ్రద్ధానందులవలె తన జీవితమును ఈయన విజ్ఞానోపాసనకు అర్పించినాడు.

ఈయనలో ఆర్భాటాలు, అట్టహాసాలు కనుపించవు. పంజాబీ పైల్వానులాగ దిట్టంగా తింటాడు. ఒకరికి పెడుతాడు. కాలుకొద్దీ తిరుగుతాడు. ఓపిక హెచ్చు. నలుగురికి అందుబాటులోని మనిషి. ఏయుద్యమములో ఎంతవఱకు అడుగువేయవలయునో ఈయనకు బాగుగా తెలియును. ముందు వెనుకలు బాగుగా గుర్తెరిగి సేవజేయు వివేకి. ఒకరిని విమర్శింపబూనడు. మిత్రులను, సేవకులను ఆకర్షించగల శక్తి ఈయనలో నున్నది. ప్రశాంతవదనము, నిండుకుండ. పాతికసంవత్సరములనాడు ఈయనయు, నేనును కొల్లేటి గ్రామములో మరికొందరు మిత్రులతో ఒక సుప్రసిద్ధ క్రైస్తవకుటుంబమును శుద్ధిసంస్కారము చేసి హిందూధర్మము స్వీకరింప జేయుటకు ఇరువదిమైళ్ళు బండిమీద ప్రయాణం చేసిననాటి యుత్సాహమునకును నేటికిని వ్యత్యాసము కనబడదు. అనేక సంఘసంస్కరణ వివాహాలకు , ఆది ఆంధ్రమహాసభలకు, బ్రహ్మసమాజ సమావేశాలకు వందేమాతర యుద్యమ సభలకు మాతో ఈయన హాజరగుచు తన యుత్సాహమును ప్రకటించేవాడు. గ్రంథాలయ సభలకు ఈయన వసిష్ఠు అని వేరే చెప్పనవసరములేదు.

పేరునకు పెక్కండ్రున్నారు. గాని ఇట్టి ఆదర్శసేవకులకు నేడు మన ఆంధ్రదేశము కరవయిపోయినది. ముప్పది అయిదు సంవత్సరములు గ్రంథాలయోద్యమమునకు త్రికరణశుద్ధిగా తన జీవితమును అర్పించి విజ్ఞానోపాసన జేసిన ఆదర్శసేవకుడు అయ్యంకి వేంకటరమణయ్య పంతులునకు ఈజూబ్లీ సమయమున నాహృదయ పూర్వక వందన సహస్రము లర్పించుచున్నాను. సర్వేశ్వరుడీయనకు ఆయురారోగ్యైశ్వర్యములు ప్రసాదించి ఇంకను దేశసేవ జేయుటకు తగిన యుత్సాహమును ప్రసాదించుగాక.

శ్రీ వెల్లంకి కృష్ణమూర్తి.

---

# ప్రశంస

మేధాశక్తి, వినయము, దేశాభిమానము, ఆత్మవిశ్వాసము, ప్రశాంతచిత్తము, మనోనిగ్రహము, నిత్యోల్లాసము, కార్యదీక్ష, ధైర్యము, స్థైర్యము, సహనము, నూతనభావ స్వీకరణశక్తి, వాక్చాతుర్యము, భూతదయ, భావనాశక్తి, సమన్వయశక్తి, స్వయంనియంతృత్వము, స్వార్థత్యాగము, పరోపకారశీలత మున్నగు వానిని ప్రకాశింప జేయదగును. నవాంతర గుణములను రాశీభూత మొనర్చి వాని వినియోగమునకు దగిన ఒకస్థూల విగ్రహమును నీ నవీనయుగమున సృష్టించి విలుప్తమగుచున్న నొకానొక ధర్మసంస్థాపనమును పునరుద్ధరించుటకు బ్రహ్మ సంకల్పము గావించుకొనెను. సంకల్పసిద్ధుడగు స్రష్ట దలంచినంతనే కించిత్ప్రారబ్ధావశిష్టమును జీవన్ముక్తి కాంక్షించు నొక మహాజీవి గోచరమాయెను జన్మమోక్షమునకు భూలోక ధర్మమార్గ సంచరణమునకంటె సులభోపాయము లేదుగదా !

ఆ మహాజీవి కుపాదాన కారణమైన పుణ్యదంపతుల ఆంధ్రదేశమునం దయ్యంకి గ్రామమున అయ్యంకి నామవంశీయులు శ్రీ మంగమాంబా వేంకటరత్నామాత్యులు పూర్వోదాహృత గుణవినియోగమునకు దగినట్లు జనాకర్షక దర్శనీయ శిశువొండు ఆంధ్రదేశాభ్యుదయమునకు శుక్రదశ నొసంగు గ్రహకూటలగ్నమున జననమయ్యెను. ఆత డెదిగి యెదిగి ఆకర్ణాంత విశాలనేత్రుడు, దీర్ఘబాహుడు, మకరాంక శశాంక మనోజ్ఞమూర్తి, నవనవోన్మేష భావశబలుడు, పరోపకార వినియమదృష్టితో వెలుంగు నొక పసిమిబంగారు బొమ్మగా జనాకర్షణీయుడాయెను.

చెప్పమఱచితిని. బ్రహ్మ యీతని సృష్టించినప్పుడే యాతని లలాటపట్టికమీద నీత డొనర్పవలసిన కార్యములను ముబ్బంతుల లిఖించెను. ఆ బ్రహ్మలిపి, బర్నల్సు ఫేలియోగ్రాఫికిగాని, తదనుయాయి సోమశేఖరునికిగాని తెలియునదిగాదు; నే డా మూడుపంక్తులను గూర్చి విచారించగా, నవి ప్రాయశః గ్రంథాలయముల ద్వారమున విద్యాప్రతిష్ఠాపన, ప్రకృత్యాహార ప్రబోధమున ఋషిసంప్రదాయ పునరుత్థానము, బాలభటోద్యమమున భారతదేశ స్వతంత్రతా సముపార్జనాదికములై యుండనోపునని యూహించుట కనువగుచున్నది. నాయూహకు తగిన యాధారము లాతని చరిత్రపరిశోధలకును, తన్మూలమునకు ప్రపంచమునకు వెల్లడియగుచున్నవి.

ఇది దైవసంకల్పమే గాకున్న ఆగర్భశ్రీమంతుడై, మాతాపితల కేకపుత్రుడై, వివేకియైన నత డీపాటికి, యేడిప్యూటీ కలెక్టరుగానో యుండి, పింఛను బుచ్చుకొని నీ యుద్ధప్రచారమున మరల నుద్యోగియై, ధనసముపార్జనము, ధనపిపాస చేయువాడుగా నుండక, చిన్ననాటనే, ప్రహ్లాదునివలె తోడిబాలురను కొందఱిని జేర్చి పత్రికాపఠనము, గ్రంథపఠనముల కేల దొరకొనును ?

కొందఱిలోని అంతర్హిత సేవాశక్తి, కౌమార వార్ధక దశలలో వెలువడునుగాని శ్రీ వేంకటరమణ కారణజన్ముని కది, బాల్యావస్థలోనే పైకుబికెను.

*    *    *    *    *

నా మిత్రుడు శ్రీ రాజా భుజంగరావు బహద్దరు జమీందారు, 1898 సంవత్సరమున తన పట్టాభిషేక సమయమున చేయదగిన సత్కృత్యములలో "శారదావిలాస"మను గ్రంథభాండారము నేర్పరచెను; బహుశః ఆంధ్రదేశమున నీ ప్రాంతముల నదియే ప్రథమ గ్రంథాలయమై యుండనోపును. అందు 500 ల సంస్కృతాంధ్ర గ్రంథము లుండెను. ఒక లైబ్రేరియను, పాఠకులకు గ్రంథముల జదువ నిచ్చుచుండెను;

* * * *

తరువాత కొన్నియేండ్లకు, 30 యేండ్లయి యుండవచ్చును. తాము రామమోహన లైబ్రరీ స్థాపించితిమనియు, నన్నొకసారి వచ్చిచూడమని రమణయ్యగారు కోరిరి. అదివఱకే అయ్యంకి వారిపేరు పత్రికలలో పడుచుండెను. నే నొకనాడుపోయి చూచునప్పటికి యిప్పటి రామమోహన గ్రంథాలయ మొక చిన్నభవనమున నుండెను. కొన్ని బీరువాలలో పుస్తకములుండెను. వానిని శ్రీ నూరి వేంకటనరసింహశాస్త్రి, గోపరాజు బ్రహ్మానందము, శ్రీ వేంకటరమణయ్యగారును గ్రంథములను వివిధవిధభాగములుగా విడదీయుచుండిరి. తాపీ మేస్త్రీలు కడపరాళ్ళను సున్నముతో నొకవైపున బిగించుచుండిరి.

నేడా రామమోహన గ్రంథాలయము రెండంతస్థుల విద్యాసౌధరాజమై, 10 వేల వివిధవిధ గ్రంథరాజములతో, కావలయునన్న గ్రంథమును సులువుగా దీసియిచ్చు మార్గమున నలంకరింపబడి ఆంధ్రదేశమునకు కేంద్రగ్రంథాలయమై ఆసేతు శీతనగపర్యంత దేశకీర్తనమై తనరారుటకు శ్రీ వేంకటరమణయ్యయే ప్రాతిపదికముగదా!

దేశపర్యటనమునకు వలయు శరీర దార్ఢ్యత, తద్వ్యయమును భరించగల యార్థికసంపద, కార్యదీక్షకు కావలసిన మానసికశక్తి, సంపన్నగృహమేధియయ్యు సంసృతినిస్పృహత, కార్యనిర్వాహకమునకు వలయు నీసంపత్తి, మహోద్యమములను నెలకొల్పు అసాధారణమేధావిలసితులకుగాక, సామాన్యుల కలవడుటపడుట దుర్లభము.

నేడాంధ్రదేశమున తండోపతండములుగా వెలయుచున్న గ్రంథాలయములన్నియు గ్రంథాలయ పితామహుడగు వేంకటరమణమూర్తి ప్రోద్బలమున నుద్ఘాటింపబడిన వనుట సత్యదూరముకాదు. ఒక్క ఆంధ్రదేశముననే కాదు. ఎక్కడి బరోడా! ఎక్కడి బెజవాడ ఈగ్రంథాలయవిధాత! గయక్వారు మహారాజా శాయాజీ రావుబహద్దరు, షష్టిపూర్తి మహోత్సవమున కాహూతుడై యేగి, తత్ప్రభువర్యేణున కతిథియై భారతదేశపు గ్రంథాలయ సంస్థాపనమునకు ప్రథమభిక్షపెట్టినట్టియు అచటి గ్రంథాలయ సంస్థాపనాదిమార్గముల నన్వేషించి, యా పద్ధతుల నిట నెలకొల్పిన ధన్యజీవి మన వేంకటరమణమూర్తి సంచారగ్రంథాలయముల సంస్థాపనమచటి సాంప్రదాయమే. స్త్రీలకు, పురుషుల గృహములకు గ్రంథముల బంపుటకు మార్గదర్శియు నీతడే. పంజాబుదేశమునకును, పుదుక్కోటకు నీత డాహ్వానింపబడి, అచట గ్రంథాలయ నిర్మాణ

మార్గము జూపిన దీతడే యని పత్రికలలో ప్రకటింపబడినవు డాంధ్రదేశ మిూమహానీయునివలన బహూకరింపబడినదని యుప్పొంగుట కీతని కార్యదీక్షయే కారణము.

“పుష్కరమునకు పండాల ఆగమనమువలె” గ్రంథాలయ సంస్థాపనమునకుగాని, తద్విషయిక ప్రదర్శనములకు గాని వేంకటరమణమూర్తి ఆగమన మనివార్యము. లోకారాధన తత్పరతకును, దేశసేవకును, లోకులందఱికి హక్కున్నను, 30 యేండ్లనుండి, గ్రంథాలయ సంస్థాపనములలోని హక్కును వేంకటరమణయ్యయే భుక్తపరచుకొన్నాడనుట అతిశయోక్తి కాదు. గ్రంథాలయ స్థాపనములకు నిత్యప్రోత్సాహము గలిగించుటకై గ్రంథాలయ సర్వస్వమను, సర్వాంగసుందరమగు మాసపత్రికను స్వధనముతో బ్రకటించి గావించినసేవ అమూల్యము.

ఈ పత్రిక సకాలమునకు వాణీప్రెస్సువా రందించకపోవుటచే, నొకనాడు నాకడకు వచ్చి, గ్రంథాలయసర్వస్వమును నిర్వ్యాఘాతముగా కొనసాగించుట కొక ముద్రాక్షరశాలను కొనవలెనని యున్నదని సంప్రదించెను. అదివఱకు మంజువాణీ పత్రికకై, మంజువాణీప్రెస్సును బెట్టి, స్వంతముద్రాక్షరశాలావ్యయభరమునకై, మంజువాణీమాసపత్రికను మానవలసివచ్చినట్లే; స్వంతముద్రణాలయ వ్యయభారనిర్వహణము ప్రధానముగా, గ్రంథాలయ పత్రికా ప్రకటన మప్రధానముగా నేర్పడి పత్రికాప్రకటనమే యాగిపోవచ్చునని చెప్పిన నామాటల యాథార్థ్యమును, ప్రెస్సు స్థాపించిన ఒకటి రెండు సంవత్సరములలో యొక ప్రస్తావనలో వేంకటరమణయ్యగారు అట్లే యైనదని వచించిరి.

దేశమునకు సంపూర్ణ స్వాతంత్ర్య మలవాటుపడిననేగాని, దేశోద్ధారక కార్యక్రమమునకు త్రేదము గలుగజాల దను సాహిత్యపరులవలెగాక, చేతనైనంతవఱకు దేశసేవ గావింపవలెనను సిద్ధాంతము నూతగా గొని వేంకటరమణయ్య గావించిన సేవాఫలితము, ప్రభుదృష్టి నాకర్షించి గ్రంథాలయశాసన పరికల్పితమునకు దారి జూపి, ప్రభుత్వపు లైబ్రరీగ్రాంటుల కాకరమయినదని చెప్పవచ్చును.

కవులు, పండితులు, దేశభక్తులు, తాత్వికులు, వేదాంతులు వారు వీ రననేల! దేశసేవారతు లెవ్వరువచ్చినను, యెదురుగా నేగి వారి కాతిథ్యమొసంగి, సభ నేర్పాటుచేసి, వారి వచోఽమృతమును ప్రజలకు వినిపించి, పత్రికాప్రకటనమున వారి సందేశములు దేశమున వ్యాపించు కార్యనిబద్ధయందు వేంకటరమణయ్యగారికి, ఆయనయే సాటి.

రమణయ్యగారే “సంచార గ్రంథాలయ”మని పలువు రనుచుండుటయు గలదు.

ఆంధ్రదేశమున ప్రిక్రృతి యొసంగు నపక్వాహార పూర్వర్షి సాంప్రదాయమును నెలకొల్పి, వ్యాపింపజేయుటకు వేంకటరమణయ్యగారే ప్రధాన పురుషులు. బాలభటోద్యమ ప్రచారమున కేమి, దివ్యజ్ఞాన సమాజ వ్యాప్తికేమి, తదితర సాంఘికోద్యమములకేమి, వలయునట్టి, వాఙ్మయ మును సృష్టించుటలో వేంకటరమణయ్యగారు తమ గ్రంథాలయ ముద్రాక్షరశాలద్వారమున గావించిన సేవయు, ధనవ్యయము నమూల్యములు.

"శ్రీ వేంకటరమణయ్య"గారు నడపిన "ఆంధ్రభారతి", "గ్రంథాలయ సర్వస్వము", "ప్రకృతి", "దివ్యజ్ఞానదీపిక", "అఖిల భారత గ్రంథాలయ సర్వస్వము (ఇంగ్లీషు)" మున్నగు పత్రికల సంస్థాపనమునను, గ్రంథాలయ సంస్థాపనమునను, రామమోహన లైబ్రరీ భవనము, దేశారా ధకుల ప్రచారమున కర్తృస్థానముగా నొనర్పుటవలనను, ఆంధ్రదేశమందు గలిగించిన దేశసేవాను రక్తియొక్క సత్ఫలమే 1920 సంవత్సరపు గాంధీమహాత్ముని భారతదేశ స్వాతంత్ర్య ప్రయత్నము నకును, అస్పృశ్యతా నివారణమునకును, నిమ్నజాత్యుద్ధరణమునకును, ఏకవిధముగ సాహాయ్య కములైనవని దేశచారిత్రకుల అభిప్రాయము.

శ్రీ వేంకటరమణయ్యగారు దేశములో జరుపబడిన సకలాంధ్రోద్యమములలో పాల్గొనుచు, నాయానమయములలో నెల్ల గ్రంథాలయాభివృద్ధికై సభలు జరుపుచు తమజీవితము సేవిమయమై ధారపోయుచున్నారు.

ఈమందహాస సుందర వదనారవిందుడు ప్రజాకర్షకముగు మృదుమధుర వాగ్గుంభనలతో నిట్లె ప్రజాసేవయొనరించుచు దేశోన్నతిని సమకూర్పుటకు భగవంతు డాయురారోగ్యైశ్వర్యముల నొసంగి రక్షించుగాక!

శ్రీ నందిరాజు చలపతిరావు.

# అభినందన పత్రిక

శ్లో॥ పద్మాకరం దినకరో వికచం కరోతి
చంద్రో వికాసయతి కైరవ చక్రవాళం
నాభ్యర్థితో జలధరోపి జలం దదాతి
సన్తః స్వయం పరహితే విహితాభియోగాః॥

భర్తృహరి... ... ...

అను నార్యోక్తి ననుసరించి లోకములో సత్పురుషులు కోరఁబడకయే ఫలాపేక్ష లేకయే పరులకు మేలొనర్పఁ బాటుపడుచుందురు. మేఘుఁడు సకాలమున భూమిపై వర్షించి సస్యసమృద్ధికిఁ బోషణమునకుఁ దోడ్పడుటలో నతని కెట్టి వాంఛయును లేదు. పవనుడు మండు వేసవిలో మలయానిల సంస్పర్శ నొసఁగి పాంథుల యాన శ్రమమును బోఁగొట్టుటలో నతని కెట్టి యపేక్షయును లేదు. చల్లని నీడనిచ్చు తరువుల స్వార్థశూన్యమైన పరసేవ సర్వజన విదితమే.

అదేవిధముగ మహానుభావులగు సత్పురుషులు సర్వదా నిరపేక్షులై దేశహితకార్యాచరణ తత్పరులై పరోపకారము నొనర్చుచుఁ గీర్తిభాజను లగుచున్నారు. "ఏతే సత్పురుషాః పరార్థఘటకాః స్వార్థాన్పరిత్యజ్య యే" అనునట్లు స్వలాభమును వదలుకొనియైన పరులకు హితమును సంఘటింపఁ బాటుబడుచుందురు. 'పూవు పుట్టగనే పరిమళించు'నన్నట్లు వారి పరోపకార భావనా పరంపర లనే సుగంధ తరంగములు బాల్యమునుండియు ప్రకటితము లగుచుండును.

పైనఁ జెప్పఁబడిన మహాపురుషులలో నొకరుగఁ బరిగణింపఁబడదగిన గొప్పవ్యక్తి శ్రీయుత అయ్యంకి వేంకట రమణయ్య పంతులుగారు. వారి గంభీరమైన మూర్తిమంతము కడు ప్రశంసనీయము. తేజోవంతమై శాంతభావమును వెదచల్లుచున్న యా ముఖముతీరు, సూక్ష్మబుద్ధిని, దూరదర్శిత్వము, మేధాసంపత్తిని సూచించు విశాలలోచనముల సొరు, ఆ యాజానుబాహువుల వైఖరి, జన్మదేశాభిమానము, బాహ్యాభ్యంతరములయం దాపాదమస్తకము నిండియుండె ననుటకు నిదర్శనమువలెనున్న యా వడుకునూలు వస్త్రాలంకార విధానము ప్రాజ్ఞులైనవారి హృదయాకర్షణముఁ గావించుటచే నతఁడొక మహాపురుషుఁ డనుట కంద రంగీకరింపవలసినదే. ఇందుల కెట్టి సంశయమును లేదు.

"ఆకార సదృశః ప్రజ్ఞః" అనునట్లు రూపమునకుఁ దగిన ప్రజ్ఞావిశేషము కల శ్రీ పంతులుగారు, 'సూర్యుని వ్రేలితో జూపించినట్లు' లోకవిదితమై యావ దాంధ్రదేశమందలి గ్రామ గ్రామములలో వ్యాపించిన యా పురుషశ్రేష్ఠుని కార్యదీక్ష, సేవావ్రతము, భాషాసేవ, గ్రంథాలయ నిర్మాణ చాతురి మొదలగు వానిం గూర్చి ననుబోలు సామాన్యవ్యక్తి వ్రాయ నెంచుట యున "ప్రాంశు లభ్యే ఫలే లోభా దుద్బాహు రివ వామనః" యను కాళిదాసోక్తి ననుసరించి హాస్యాస్పదమే యగును.

అయినను పంతులుగారి యెడల నాకుఁగల గౌరవభావము కారణముగ శ్రీ పంతులుగారితో నాకు బరిచయము ప్రారంభమైనది మొదలు నేను గుర్తింపఁగలిగిన విషయములను క్లుప్తముగ నుదహరింప నుద్యుక్తుఁడనై యందులకుఁ బాఠకులు మన్నింతురుగాక.

సుమారు పదునెన్మిది వత్సరముల ప్రాయమునుండియు శ్రీ వేంకటరమణయ్య పంతులుగారు దేశాభ్యుదయకార్యనిర్వహణమం దత్యుత్సాహముం జూపుచుండెడివారు. తెలుఁగు గడ్డపై తెలుగుబాసం బెంపుచేయవలెనన్న నాంధ్రగ్రంథాలయము లేర్పడు టత్యంతావశ్యకమని గ్రహించి పుస్తక భాండాగారములన నెట్లుండవలయునో వానిని నెలకొల్పు విధానమెట్లో లోకమునకుఁ జాట నారంభించుటయేగాక గ్రంథాలయోద్యమవ్రతమునకు గణేశపూజఁ గావించి కార్యారంభమునకు గడంగిరి. సుమారు 1906 వ సంవత్సరములో "వందే మాతరం" అనే జాతీయోద్యమము విజృంభించు సమయమున శ్రీ పంతులుగారు బృందావన పురంబుననే యుండి బిపినచంద్రపాల్ లజపత్రాయ్ మున్నగు ప్రముఖుల యుపన్యాస సారాంశముల నవగాహన మొనర్చుకొని కీర్తిశేషులైన శ్రీయుత కోపల్లె హనుమంతురావుగారు, ఆచార్య, ముట్నూరి కృష్ణారావుగార్లతో కలసిమెలసి తిరుగుచుఁ దమ ప్రధానసంకల్పమగు భాషాసేవ కుదాహరణముగ మచిలీపట్టణములో తొలుత వెలువడిన తెలుగు మాసపత్రికయైన "ఆంధ్రభారతికి" సంపాదకులై యనేక విషయములను గురించి వ్యాసములను వ్రాసి ప్రకటింపసాగిరి. ఆంధ్రభారతి మూలముననే నవ్యసాహిత్య ప్రవీణ, అభ్యుదయరచనా విశారద మ. రా. శ్రీ గురజాడ అప్పారావుగారి "ముత్యాలసరములు" మున్నగు నవ్య కవితా విధాన మాంధ్రదేశమున వెల్లడియయ్యె.

దేశీయులకెల్లరకు పరస్పరభావ గ్రహణశక్తి, సమానబుద్ధి కలుగవలయునన్న భాషయే ప్రధాన సాధనము గాన నగరములయందును గ్రామములయందును గ్రంథాలయములనునిర్మింపజేయవలయు నను సిద్ధాంతమును లక్ష్యముం దుంచుకొని యీమహాపురుషుఁడు తన ప్రయత్నమునకుఁ బ్రారంభోత్సవ మొనర్చెను. తదుపరి 1910 వ సంవత్సరములో విజయవాడకు వచ్చి యట ప్రారంభస్థితిలోనున్న రామమోహనగ్రంథాలయ సంఘమునకుఁ గార్యదర్శియై దాని నెంతయు వృద్ధిగాం గొనివచ్చెను. దేశమున నలుదెసల నీమహోద్యమము వ్యాప్తము కావలయునన్న బహుజన సహాయ మపేక్షణీయ మగుటచే 1914 వ సంవత్సరములో నాంధ్రదేశ గ్రంథాలయ నిర్మాణసంఘము నేర్పాటుచేసి యావద్భారత దేశమున కాదర్శప్రాయమగునట్లు "ఆంధ్రదేశ గ్రంథాలయమహాసభ" నేర్పాటొనర్చి తమపూనికను సర్వతోముఖముగ విజయవంతమగునట్లు చేసియుండిరి.

పిమ్మట 1915 వ సంవత్సరములో పుస్తకభాండాగారములయొక్క ప్రచారమునకుగా "గ్రంథాలయసర్వస్వము" అను మాసపత్రికను ప్రారంభించి నడిపించుటవలన నీయుద్యమము తెలుంగుసీమలోఁ బ్రతిగ్రామమునకు వ్యాపించి తత్ఫలితముగ గ్రంథాలయము లేర్పడసాగెను. 'బాలభటసంఘ' నిర్మాణ సందర్భమున వీరిచ్చిన హెచ్చరికలు ప్రబోధములు ప్రశంసనీయములు.

# అభినందనపత్రిక

అది మొదలు ప్రతియేట గ్రంథాలయమహాసభలు, తెలుఁగురచనల ప్రదర్శనములు నగరములలో జరుపుచు సంచారగ్రంథాలయ మను నూతనవిధానము నమలులోనికిఁ గొనివచ్చి పెక్కు గ్రామములలో సంచారముచేసి తద్వారా అనఁగా "గ్రామగ్రంథాలయయాత్ర" మూలమున విశేష ప్రబోధమును గల్గించిరి. ఈమహాకార్యమునకొక ముద్రణాలయ ముండు టవసరమని గ్రహించి పెక్కుమంది ధనాఢ్యవ్యక్తులచే వాటాలు వేయించి "ఆంధ్రగ్రంథాలయ ముద్రాక్షర శాల లిమిటెడ్) స్థాపనఁ జేయించి పెక్కుమంది కార్మికులకు జీవనోపాధిని కలిగించిరి. తరువాత దానినడకలో గొన్ని యొడుదుడుకులు సంభవించుటచే తమబుద్ధి సూక్ష్మతవలన వానిం దొలగించి యాభారమునంతయును స్వయము గవహించి ముద్రణాలయ కార్యభారమును నేఁటివరకును దిగ్విజయముగ నడుపుచున్నారు.

స్వాభావిక జీవితమును గడుపుటయందు వీరొనర్చినకృషి, ఆధ్యాత్మిక జ్ఞానచర్చలయందు వీరికిఁ గల మహోత్సాహము, అందుకూర్చి చేయఁబడిన ప్రచారము, కరము మోదాకరము. శ్రీయుత వేంకటరమణయ్య పంతులుగారి జీవితములోని విలువగల విశేషములను వ్రాయవలయునన్న నెంతయో గలదు. పెద్దలు పండితులు రసజ్ఞులు మొదలగువారి కందరి కావిషయములు తెలిసినవే. వ్యాసవిస్తరభీతిచే 'స్థాలీపులాక' న్యాయముగ నిట వ్రాయసాహసించితిని. ఇంక నాలుగుమాటలతో ముగించుచున్నాను.

ఇట్టి యసాధారణ ప్రతిభాశాలి, మనీషాసంపన్నుఁడు, ఆంధ్రదేశగ్రంథాలయ నిర్మాణభేరీ వాద్యమును తెలుఁగు నేలలోని ప్రతిపల్లెటూరునకును వినఁబడునట్లు మ్రోగించి పెక్కు కార్యనిర్వాహక సంఘములను నిర్మించి భాండాగారముల నిలువఁబెట్టించి పూనికలో దిగ్విజయమును గాంచి జీవితమును ధన్యముఁ గావించుకొనిన శ్రీ అయ్యంకి వేంకటరమణయ్య పంతులుగారు యావదాంధ్ర దేశవాసులకు సన్మాననార్హులనుట నిర్వివాదాంశము.

రానున్న ఆగస్టు 21 వ తేదీతో శ్రీపంతులుగారి కరువదవ వత్సరము కడచి యనువది యొకటవ సంవత్సరము ప్రారంభ మగుచున్నది. తత్సందర్భమున జరుపబడుచున్న షష్టిపూర్తి మహోత్సవాహూతులై యరుదెంచెడి పండిత జనబృందమును విజయవాటికాపురవాస్తవ్యులును శ్రీ పంతులువారితో నధిక గౌరవయశస్సుల నార్జించి దీర్ఘాయుష్మంతులై ఆదర్శపురుషులై పెక్కుమందికి జీవనాధారములఁ గల్పించుచు ఆంధ్రభాషకు, గ్రంథాలయవ్యాప్తికి శాశ్వతపోషకులై శ్రీ పరాశక్తియైన కనకదుర్గాదేవ్యనుగ్రహభాజనులై వృద్ధినందునట్లు దీవింపవలయునని కోరువాఁడను. మఱియును దెలుఁగుదేశములోని గ్రంథాలయమున్న ప్రతిగ్రామములోను శ్రీపంతుల గారి యుద్యమ జ్ఞాపకార్థము, వారిషష్టిపూర్త్యుత్సవముల నాంధ్రసోదరులెల్లరు జరుపవలయు హెచ్చరించుచుంటిని. భగవానుఁడైన శ్రీరామచంద్రమూర్తి శ్రీయుత అయ్యంకి వేంకటరమ పంతులుగారిని నిరంతరము శాశ్వతాయురారోగ్యైశ్వర్యాభివృద్ధితోఁ గాచుచు సదా ప్రజ తత్పరునిఁ జేయుగాత.

హరిః ఓమ్ తత్సత్ - శ్రీ. శ్రీ. శ్రీ.

## ఆశీర్వచన పద్యపంచకము.

గీ. శ్రీ ధరాకుమారీ చిత్త శీతకరుఁడు
దాసజనహృదయాభీష్ట దాయకుండు
శ్రీ రఘూత్తముఁడవని రక్షించుగాక
విమలు నయ్యంకి వేంకటరమణు నెపుడు.

కం. పంకజదళ సమనేత్రుఁడు
సంకటహారణుండు భద్రి సంధాయకుఁ డ
య్యంకి కులాంబుధి చంద్రుని
వేంకటరమణుఁడు కాచు వేంకటరమణున్.

మ. జనతాజ్ఞాన విజృంభణంబునకుగా సద్గ్రంథ సామగ్రిచే
ఘనమౌ సాధనమౌట నాంధ్రభువిలో గ్రంథాలయ స్థాపనం
బునకుం మార్గముఁజూపి గౌరవ యశంబుల్ లోకపూజ్యత్వమం
దిన పుణ్యుండవు నీవు వేంకటవిభూ! నిత్యానుకంపానిధీ!

సీ. నిలిపినాడవు పండితులు శెభాసనఁగ నాం
ధ్రావని గ్రంథాలయ ధ్వజంబు
సలిపినాడవు కడు సంతసంబున నాంధ్ర
భాషామతల్లి సేవావ్రతంబు
వ్రాసినాడవు పెక్కు వ్యాసమ్ములను దెల్గు
వారికిఁ జైతన్య భావమెసఁగ
కల్పించినాడవు కార్మికులకుఁ బెక్కు
జీవనోపాధులఁ జిత్తమలర

గీ. కర్మవీరులలోఁ బేరుగాంచినావు
దైవభక్తి తత్పరుఁడవై నావు నీవు
పరమ గుణ సాంద్ర! అయ్యంకి వంశ చంద్ర!
వేంకట రమణ యాఖ్య! యో విమలచరిత!

గీ. అఖిల మునిమాన సాబ్జ విహారియైన
రామచంద్రుఁడు నీదు కార్యక్రమమును
విజయవంతముగాఁ జేయు వెలయుమయ్యా!
ఆయురారోగ్య భోగభాగ్యములతోడ.

శ్రీ కేతవరపు రామకృష్ణశాస్త్రి.

# వ్యాసములకు విషయసూచిక


౧ శివనతి : పద్యములు : చిరంజీవి ౧
౨ ఆంధ్రభాష - గ్రాంథిక వ్యావహారికములు : శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు ౨
౩ లలితకళలు - కవిత్వము - విమర్శనము : శ్రీ శెట్టలూరి వేంకట రాఘవఅయ్యంగారు ౭
౪ విభ్రాంతామరుకము : శ్రీ పిలకా గణపతిశాస్త్రి ౨౩
౫ వాఙ్మయ విశేషములు : శ్రీ నిడుదవోలు వేంకటరావు ౨౫
౬ నాటకము - నాట్యము : జమ్మలమడక మాధవరామశర్మ ౩౪
౭ శ్రీదాసు శ్రీరామ మహాకవి : శ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి, శతావధాని ౪౮
౮ కర్మవీరుడు : శ్రీ విశ్వనాథ వెంకటేశ్వరులు ౬౨
౯ తిక్కన : వీరరసము; అభిమన్యు పాత్రపోషణము : శ్రీ బులుసు వేంకటేశ్వర్లు ౭౬
౧౦ కావ్యసృష్టి : శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి ఎం. ఏ., బి. యల్., ౮౨
౧౧ దౌత్యము (పద్యములు) : శ్రీ ధూళిపాళ శ్రీరామమూర్తి ౮౮
౧౨ శ్రీ గోస్వామి తులసీదాసు : శ్రీ వారణాసి రామమూర్తి ౯౦
౧౩ అజ్ఞాతసుందరి (పద్యములు) : శ్రీ ఊటుకూరు సత్యనారాయణరావు ౧౧౨
౧౪ సత్యసౌందర్యము : శకుంతల - సీత శ్రీ కాకర్ల వేంకటరామ నరసింహము ౧౧౮
౧౫ రాసలీల (సంకీర్ణ నాట్యము) : తల్లావఝ్ఝుల కృత్తివాస తీర్థులు ౧౨౯
౧౬ నాట్యశాస్త్రము - రూపకములు : పండిత చిదిరెమఠము వీరభద్రశర్మ ౧౪౨
౧౭ కళాపూర్ణోదయము - పాత్రనామ కల్పనము : శ్రీ దువ్వూరి వేంకటరమణశాస్త్రి ౧౫౦
౧౮ కళాప్రపంచము (పద్యములు) : శ్రీ విన్నకోట వేంకటరత్నశర్మ ౧౫౯
౧౯ ఉపనిషత్తులు : శ్రీమాన్ మేడేపల్లి వేంకట రమణాచార్యులు ౧౬౦
౨౦ శివతాండవం (పద్యములు) : శ్రీ బొడ్డు బాపిరాజు ౧౬౪
౨౧ ఎల్లనార్యుని రాధామాధవము : శ్రీ పిల్లలమఱ్ఱి వేంకట హనుమంతరావు ౧౬౯
౨౨ మార్గదేశీ వస్తు కవిత్వములు : శ్రీ దివాకర్ల వేంకటావధాని ౧౭౧
౨౩ చిరంజీవి కళాధర చక్రవర్తి (పద్యములు) : శ్రీ కర్లపాలెం కృష్ణరావు ౧౭౭
౨౪ శతకాది బహుళ సాహిత్యము : శ్రీ కవికొండల వేంకటరావు ౧౮౨
౨౫ దూతప్రచారము : శ్రీ శే. వేం. రాఘవ అయ్యంగారు ౧౮౫
౨౬ నవ్యసాహిత్యము : రొమాంటిసిజము - శ్రీ నండూరి వేంకట రామకృష్ణమాచార్యులు ౧౯౩
౨౭ నైచికి (పద్యములు) : శ్రీ పెనమకూరు వేంకట సుబ్బరాయశర్మ ౨౦౧
౨౮ ప్రాచీనాంధ్రులు - వారి పరిశ్రమలు - గుణశీలములు : శ్రీ కురుగంటి సీతారామయ్య ౨౦౩
౨౯ పూర్వశాతవాహనులు - ఆంధ్రదేశము : డాక్టరు మారేమండ రామారావు ౨౧౯
౩౦ శ్రీనాథుని కనకాభిషేక కాలము : శ్రీ బండారు తమ్మయ్య ౨౨౮
౩౧ ప్రాచీన హిందూదేశమందలి వైద్యులు - ఆతురాలయములు: డాక్టరు ఆచంట లక్ష్మీపతి ౨౩౭
౩౨ ఐనవోలు మైలారుదేవుడు : శ్రీ దూపాటి సుందర వరదాచార్యులు ౨౪౩
౩౩ చాకిరేవు (ఏకాంక నాటకము) : శ్రీ వింజమూరి శివరామారావు ౨౪౭
౩౪ రసానుభూతి (పద్యములు) : శ్రీ కర్లపాలెం కృష్ణారావు ౨౫౭
౩౫ దివ్యజ్ఞానము : శ్రీ గుంటూరు వెంకటసుబ్బారావు ౨౫౮
౩౬ పరావిద్యలేవి ? : శ్రీ కామరాజు హనుమంతరావు ౨౬౨

౩౭ నా తెలుగుభూమి (మనసాగేయము) : శ్రీ సాదలి రామస్వామి ౨౬౪
౩౮ ఆంధ్రులు - సంగీత నాట్యములు : శ్రీ వావిలాల సోమయాజులు ౨౬౫
౩౯ ఆంధ్రజనని (పద్యములు) : శ్రీ సాదలి రామస్వామి ౨౭౯
౪౦ శ్రీ వేదాంతదేశికకవి : శ్రీ భాగవతుల కుటుంబరావు ౨౮౦
౪౧ కవిత్రయము (పద్యములు) : శ్రీ వైడిపాటి వేంకటసుబ్బరామశాస్త్రి ౨౮౫
౪౨ ఆధునిక భారతీయ వార్తాప్రసారోద్యమం : శ్రీ పుణ్యమూర్తుల రాజశేఖరం ౨౮౬
౪౩ మా తెలుగుతల్లి (పద్యములు) : శ్రీ కస్తూరి సూర్యప్రకాశరావు ౨౯౧
౪౪ వేదాంత దర్శనము : శ్రీ కవుతా నరసింహశాస్త్రి ౨౯౨
౪౫ నాడు - నేడు (పద్యములు) : శ్రీ వైడిపాటి వేంకట సుబ్బరామశాస్త్రి ౩౦౦
౪౬ పాటలీపుత్రము : శ్రీ సత్యవోలు రాజశేఖరరావు ౩౦౧
౪౭ కుతుబుషాహీల ఆంధ్రభాషా పోషణము : శ్రీ సురవరము ప్రతాపరెడ్డి ౩౦౮
౪౮ వేసవి - చైత్ర (పద్యములు) : శ్రీ పెమ్మరాజు లక్ష్మీపతి ౩౧౨
౪౯ అమరుకము (పద్యములు) : శ్రీకూచిభొట్ల ప్రభాకరశాస్త్రి ౩౧౩
౫౦ కర్నాటక సంగీత విధానము - గాన కళాభివృద్ధికి సూచనలు : శ్రీ అరిపిరాల సత్యనారాయణమూర్తి ౩౧౬
౫౧ రాజ జామాత (గీతి నాటిక) : శ్రీ శివశంకరశాస్త్రి ౩౨౯
౫౨ గ్రంథాలయములు (పద్యములు) ౩౩౬
౫౩ జైనమత చరిత్ర : శ్రీ మొహమ్మద్ ఖాశింఖాన్ ౩౩౭
౫౪ గ్రంథాలయములు (పద్యములు) : శ్రీ రాయప్రోలు సుబ్బారావు ౩౪౩
౫౫ తిక్కన - కుమార వ్యాసుడు : శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులు ౩౪౪
౫౬ పుస్తకావాహన (పద్యములు) : శ్రీ రాయప్రోలు సుబ్బారావు ౩౫౫
౫౭ తెనుగువారి చదువు : శ్రీ మారేపల్లి రామచంద్రశాస్త్రి ౩౫౬
౫౮ గ్రంథాలయములు (పద్యములు) : శ్రీ ముట్నూరి వేంకట సుబ్బారాయుడు ౩౬౮
౫౯ సారస్వత జీవనము (పద్యము) : ఏనుగు లక్ష్మణకవి ,,
౬౦ స్త్రీ గ్రంథాలయములు : కవితావిశారద, విద్వత్కవితిలక కాంచనపల్లి కనకాంబ ౩౬౯
౬౧ గ్రంథాలయోద్యమము (పద్యములు) : సత్తెనపల్లి హనుమంతరావుగారు ౩౭౨
౬౨ కోకిల (పద్యములు) : పోతాప్రగడ శ్రీరామారావు ౩౭౩
౬౩ కళలు - దేశాభివృద్ధి : శ్రీమతి అత్తిలి స్వరాజ్యలక్ష్మి ౩౭౭
౬౪ గ్రంథభాండాగారము (పద్యములు) : శ్రీ జంధ్యాల వేంకట శివకవులు ౩౮౦
౬౫ కావ్యము : శ్రీ భట్టుమూర్తి ,,
౬౬ వసంతము : శ్రీ వేమూరి వెంకటరామనాథం ౩౮౧
౬౭ పోతన - శ్రీనాథులు బావమఱదులా? భాగవతము భూమిలో పాతిపెట్టబడియెనా? : శ్రీ చాగంటి శేషయ్య ౩౯౪
౬౮ గ్రంథాలయము (పద్యములు) : శ్రీ పిశుపాటి చిదంబరశాస్త్రి ౩౯౪
౬౯ ఏకభాష - ఏక లిపి : శ్రీ ఉన్నవ రాజగోపాలకృష్ణయ్య ౩౯౫
౭౦ కవిబ్రహ్మ - కవిత్వదీక్ష : శ్రీ కొత్త సత్యనారాయణచౌదరి ౪౦౦
౭౧ ఆంధ్రకవులు - కథాదృష్టి : శ్రీ వడ్లమూడి వేంకట రత్నము ౪౦౪
౭౨ గ్రంథాలయములు (పద్యములు) : శ్రీ మైనంపాటి హనుమంతకవి ౪౦౯
౭౩ ప్రాచీన గేయసాహిత్యము : శ్రీ బులుసు సూర్యప్రకాశ శాస్త్రి ౪౧౦
౭౪ తపస్విని (పద్యములు) : శ్రీ వట్టికొండ రంగయ్య ౪౧౩

౭౫ కర్మయోగి : శ్రీరాముల సచ్చిదానందశాస్త్రి ౪౧౫
౭౬ సంస్కృతవాఙ్మయము-మఱియిద్దరుమహారాజకవులు: శ్రీ ఈయుణ్ణివేంకటవీరరాఘవాచార్యుడు ౪౨౩
౭౭ గణిత విజ్ఞానం – మానవ జీవితం : శ్రీ కస్తూరి సూర్యప్రకాశరావు ౪౩౪
౭౮ పుస్తకములు (పద్యములు) : శ్రీ కలచవీడు వేంకటరమణాచార్యులు ౪౩౮
౭౯ గొల్ల భాగవతులు : శ్రీ దివాకర్ల రామమూర్తి ౪౩౯
౮౦ కుంతీ కుమారి (పద్యములు) : శ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రి ౪౪౫
౮౧ నవీనాంధ్ర సారస్వతము – విజ్ఞాన విప్లవము : శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావుపంతులు ౪౪౮
౮౨ ఎక్కడికి ? : శ్రీ మల్లాది అవధాని ౪౫౨
౮౩ సరస్వతీపూజ : శ్రీ పుచ్చా వెంకటరామయ్య ౪౫౪
౮౪ ఆంధ్రవాఙ్మయము – వైద్యప్రసక్తి : శ్రీ డి. వి. సుబ్బారెడ్డి ౪౬౧
౮౫ గ్రంథభాండాగారోద్యమము ౪౬౬
౮౬ బ్రాహ్మణ శాఖాభేదములు – కొన్ని నాడులు : శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మ ౪౬౭
౮౭ భరతము : శ్రీ తాండవ కృష్ణ ౪౮౩
౮౮ గ్రంథభాండాగారోద్యమము : శ్రీ మందలపర్తి ఉపేంద్రశర్మ ౪౯౧
౮౯ గ్రంథాలయోద్యమము : యం. సత్యనారాయణగారు ౪౯౬
౯౦ గ్రంథాలయములు –పద్యములు : శ్రీ కాకాని నరసింహారావుగారు ౪౯౯
౯౧ గ్రంథాలయముల యావశ్యకత : శ్రీ వెలిదండ్ల శ్రీనివాసరావుగారు ౫౦౦
౯౨ గ్రంథాలయములు – వాని ధర్మములు : శ్రీ శేషాద్రి రమణ కవులు ౫౦౨
౯౩ వాషింగ్టన్ గ్రంథాలయము ౫౦౬
౯౪ అక్షరత్వ ప్రచారమా? విజ్ఞానప్రచారమా? ఏది కావలసినది? ౫౦౭
౬౫ స్వయంపోషక సహకార విద్యాశ్రమములు : శ్రీ గోటేటి జోగిరాజుగారు ౫౧౩
౯౬ ప్రాచీన భరత ఖండమున గ్రంథప్రచారము – గ్రంథాలయములు –
శ్రీ జటావల్లభుల పురుషోత్తంగారు ౫౧౮
౯౭ గ్రంథాలయ నిర్వహణ సంఘాలు ౫౨౨
౯౮ గ్రంథాలయ సేవలోని ఒక ఆఖ్యాయిక : శ్రీ గా. హరిసర్వోత్తమరావుగారు ౫౨౫
౯౯ వయోజన విద్య : శ్రీ మంగిపూడి విశ్వప్రసాదుగారు ౫౨౭
౧౦౦ వయోజన విద్యా పద్ధతులు : శ్రీ మద్దూరి గణేశ్వరరావుగారు ౫౩౧
౧౦౧ సహకారోద్యమము – వయోజన విద్య : శ్రీ నరసింహదేవర సత్యనారాయణగారు ౫౩౭
౧౦౨ గ్రామోద్ధరణ – యువకుల కర్తవ్యము : శ్రీ ఆర్. విశ్వేశ్వరరావుగారు ౫౩౮
౧౦౩ గ్రంథాలయాలు – స్త్రీలు : శ్రీ కనుపర్తి వరలక్ష్మమ్మగారు ౫౪౦
౧౦౪ పాఠశాలలలోని గ్రంథాలయములు : శ్రీ బులుసు వేంకటరమణయ్యగారు ౫౪౨
౧౦౫ గ్రంథాలయముల ద్వారా విద్య : శ్రీపతి నరసింహారావుగారు ౫౪౪
౧౦౬ పెద్దల చదువు – కొన్ని సూచనలు : శ్రీ వడ్లమూడి వేంకటరత్నంగారు ౫౪౯
౧౦౭ గ్రంథాలయములు – వాటి ఉపయోగములు : శ్రీ పిల్లలమర్రి వేంకట హనుమంతరావుగారు ౫౫౧
౧౦౮ గ్రంథాలయము – సేవకుడు : శ్రీ పీతాంబరం వేంకట కృష్ణమాచార్యులుగారు ౫౫౩
౧౦౯ ఆంధ్రులు – గ్రంథాలయములు – గ్రంథకర్తలు : శ్రీ ఆత్మకూరి గోవిందాచార్యులుగారు ౫౫౭
౧౧౦ పోరునష్టము – పొందులాభము : శ్రీ భమిడిపాటి అయ్యప్పశాస్త్రిగారు ౫౬౧
౧౧౧ ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమము : శ్రీ మల్లెల శ్రీరామమూర్తిగారు ౫౬౪

మొదటి 33 పేజీలు స్వతంత్ర ఆర్ట్ ప్రింటర్సులోను

మిగతాది యావత్తు ఆంధ్రగ్రంథాలయ ప్రెస్‌లోను

ము ద్రిం ప బ డి న ది .

వి జ య వా డ .

ముద్రణ మొదలు 1942 సం. ముద్రణ ముగింపు 1956.

# =శి వ న తి=

చిరంజీవి

ఓం నమశ్శివాయ, ఉభయాంఘ్రికింకిణీ
కృతచరాచరాత్మవితతయే, న
మో నటేశమూర్తయే, నిశీథదివాప్ర
మేయమీలితానిమీలితాయ.

డమరుక నినాదసంబు
ద్ధమహీ! భూషణకృతాహి! ధరణీకావ్యా
త్మమహారసస్వరూపా!
ఉమామధురహాసలక్షణోదయమూర్తీ!

జనన మరణ శితదంష్ట్రా
నన కాలభుజంగ మండన జటాజూటా!
త్రినయనకృతత్రిభువనా!
మనోగుహాకుడ్యరచితమానవచరితా!

సకల ప్రాణి మయూఖ
ప్రకర సతత పూర్ణశీత భాస్కర! మాను
ష్యక ఘన భుజగ భుజగతుం
డిక! భూడోలా ప్రసుప్త డింభకమూర్తీ!

ఓంకారాశ్రియ! భూతశి
వంకర! మృత్యుంజయా! భువనతతివసనా
లంకృత శుభాంగ! జగతీ
పంకజ సూర్యావతార! పాహి మహేశా!

# ఆంధ్రభాష - గ్రాంథిక వ్యావహారికములు

శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు

[ ఓంకారస్వరూపిణి యగు విద్యాదేవి నారాధించుటకైన మూలస్థానము గ్రంథాలయము. ప్రాచీనకాలమున నాంధ్రదేశమందు నితరదేశములందు బౌద్ధులు మొదలగువారు స్థాపించిన విద్యాలయములందు లక్షలకొలది గ్రంథములు జాగ్రత్తపెట్టబడి యుండినట్లు చరిత్రకారులు చెప్పుచున్నారు. ఏ క్రొత్త యుద్యమము వచ్చినను ఆంధ్రు లద్దాని నవలంబించి ముందుకు దుముకుట కెప్పటి కప్పుడు సంసిద్ధులే. ఉద్యమోద్రేకము తగ్గిన పిదప దాని లాభములు సామాన్యముగా నితరులకు, కష్టములు ప్రారంభించిన వారికి, లభించుటయు తటస్థించుచుండుట కలదు. ఈ గ్రంథాలయోద్యమ మట్లుగాక, యాంధ్రదేశమున విద్యావ్యాప్తికి విశేషముగాఁ దోడ్పడినదై విద్యాజ్యోతిని మారుమూలల గల గ్రామములకు గూడ వ్యాపింప జేసినదని చెప్ప నొప్పును. ఈ యుద్యమము ప్రారంభింపబడినప్పటి నుండియు దానిని మీద వేసికొని యేకదీక్షతో నీ యుద్యమము నాంధ్రదేశ మందన్ని మూలలకును వ్యాపింపజేసిన మహనీయులలో శ్రీ అయ్యంకి వేంకటరమణయ్యగారొకరు. అట్లు విద్యావ్యాప్తికిఁ గారకు లగు వీరిని ఆంధ్రదేశ విద్యాధికులు గౌరవించుట విద్యాదేవిని పూజించుటయే యగును గావున నది వారి కనీస ధర్మము. శ్రీ వేంకటరమణయ్యగారును దీర్ఘాయురారోగ్యముల నొంది ద్విగుణితోత్సాహముతో చిరకాల మాంధ్ర సరస్వతిని బూజించుచుందురు గాక ! ]

గ్రంథాలయ మనునది సమస్త విధములయిన గ్రంథములకు నాకరము. అన్నివిధములగు విద్యలకు స్థానము. ప్రాచీనములు, నవీనములు అను భేదము వీని కక్కఱ లేదు. ఇంతే గాక ప్రాచీన నవీన గ్రంథ (వస్తు) సమ్మేళనమునకు గూడ నివి సహాయకారులు. అన్నియు నొక్కచోఁ జూడవచ్చును గనుక ప్రపంచమందలి ప్రతివస్తువు కాలావచ్ఛిన్నమే గావున ననవరతము మార్పునకు లోనగుచునే యుండును గావునను, ఆ యా వస్తువుల పరిణామక్రమమును గనిపెట్టగలిగినచో, నట్టి యాంతరంగికదృష్టికి ప్రాచీన నవీనభేద మంతగా బాధింపదు. వస్తుపరిణామ విధాన జ్ఞానమే యట్టి బాధను తొలగించును. గ్రంథముల విషయమగు ప్రాచీన నవీన భేదజ్ఞానమున కొక కారణము వాఙ్మయమే కావున, ప్రాచీన నవీనాంధ్రభాషా పరిణామరీతి నించుక యీ సందర్భమున దిలకింతము.

ప్రాచీనాంధ్ర మనగా నేది ? - ఎంతవరకు పోవుట అను ప్రశ్న కలుగకమానదు. ప్రాఙ్నన్నపార్యయుగము నందలి తెలుగుశాసనముల కాలమువఱకు పోగలము. అది ప్రాచీనాంధ్రమే. అప్పటి శాసనభాషకు భిన్నమగు వ్యావహారికభాష వేరుగా నున్నదో లేదో తెలియదు. కాని తరువాతి నన్నయాది కవుల గ్రంథములందలి భాషకును దీనికిని భేదము కలదు. నన్నయాది కవుల కాలమున మాత్రము వారి గ్రంథములలోని భాషకు పరిణామరూపమును, దానికంటె భిన్నము

నగు వ్యావహారికభాష యున్నట్లు తెలియుచున్నది. కేతనాదుల యాంధ్రభాషావిభాగము, అందు గ్రామ్యమునకు వారిచ్చిన యుదాహరణలే యిందులకు నిదర్శనము. అప్పటినుండి యిప్పటివరకు గ్రాంథికము వ్యావహారికము గూడ నెన్నిమార్పులు పొందినను, గ్రాంథికము, వ్యావహారికము అను భేదము మాత్రము నిలిచియున్నది. కావున స్థూలదృష్టికి ప్రాచీన శాసనభాష, గ్రాంథిక భాష, వ్యావహారికభాష యని తెలుగు మూడు తెఱగులుగ పొడగట్టుచున్న దన వచ్చును. భాషలో నీ మార్పు లెందుకు కలుగుచున్నవో పరిశీలించిన దాని పరిణామక్రమరీతులు గూడ గోచరింపగలవు.

వ్యవహారమున త్వరితోచ్చారణము మార్పున కొకకారణము. త్వరితోచ్చారణమున నొక పదమునందలి కొన్ని ధ్వనులు లోపించవచ్చు. కొన్ని యొకదానిలో నొకటి కలసిపోవచ్చును. కావున పదస్వరూపము మారును. ఉచ్చారణావయవములందలి లోపము; పదములలోని ధ్వనులను సరిగా నుచ్చరింప లేక పోవుటచే నొకదాని కొకటి వచ్చుట—లేక తడబడుట మొదలగు మార్పులు కలుగును. ఇట్టి మార్పులు భాషలో నొక్కొక్కప్పుడు వ్యాప్తి జెంది స్థిరముగా నిలిచిపోవును. పదములలోని స్వరము, ఊనిక మొదలగువానిలో గలుగు మార్పులనుబట్టి మఱికొన్ని మార్పులు గలుగును. మొత్తము మీద నీ విధముగ గలుగుమార్పులు లోపాగమవ్యత్యయాదిరూపమును జెందు నని చెప్పవచ్చును.

ప్రాచీన శాసన భాష తరువాతి భాషకంటె ననేకవిషయముల భిన్నము. ప్రాచీనముగనే కనబడును. అందు ప్రధానమగు విషయ మేమనగా నం దగపడు నొక వింతధ్వని. ఇది దక్షిణ దేశ భాషల కన్నిటికిని సమాన మగుటచే వానితో తెనుగునకు గల సంబంధమును స్థిరపరచు చున్నట్లున్నది. తమిళమున నిది యిప్పటికిని వ్యవహారములో నున్నది. కన్నడమున తెనుగునందు వలెనే చిరకాలము క్రిందటనే యంతరించినది. ఇది కన్నడమున 'ఱ' అను రీతిని వ్రాయబడి 'ష్జ' అను ధ్వని కలదిగా చెప్పబడుచున్నది. ఈ లిపియే కన్నడాంధ్రశాసనములలో గానవచ్చు చున్నది. ఈ వర్ణము నుచ్చరించుటలో గల విశేషమే యిది యీ భాషలలో ననేకవిధములుగ మారిపోవుటకు గారణమై యుండును. ప్రాచీన కన్నడమునను తమిళమునను ఇది నిలిచియున్నను తరువాతి కన్నడమున నిది 'ళ' గాను, తెనుగున 'డ' గాను మారినది. ఈ భాష లన్నిటిలో నిది ళ, ర, ల, య అను ధ్వనులుగ మారుటయు కలదు. తెనుగులో ళ;ర;డ అను ధ్వనులతోగూడి మన నిత్యవ్యవహారములో నున్న యనేకపదము లీ యక్షరముతో గూడిన ప్రాచీనభాషాపదముల పరిణామము లగుటయే మనము గమనింపవలసిన విశేషము. ప్రాచీన తెలుగు శాసనములలోని వానిలో కొన్ని - ఇతరములు కొన్ని.

| శాసనములలో | తరువాతి తెలుగున |
|---|---|
| అఱిచిన | అడిచిన |
| ఱస్సి | డయ్యు - డస్సిన |

చోటి - చోడ

మేతాంబ - మేడాంబ

కొటిల్చి - (ధా) కొజలు - cf క. త. కొఱ్ఱు - కొబ్బు - తె. క్రొవ్వు-

పటికివిషయ - ప్రిక్కి

ప్టోలు - పోలు

పటుమటి - పడుమటి

తాన్టికొండ - తాడికొన్డ

ఎఱువేలు - ఏడువేలు - త. క. ఏఱు - తు - ఏళు

కన్నడము - బాళ్ = జీవనె - బ్రదుకు

తమిళము - కన్నడము - కీఱ్ - క్రిందు - కీడు

త - కిటెంజు - చిఱుగు

త - తిగట్, పుగట్ - తెగడు - పొగడు etc.

శాసనభాషలోని 'న్ట' తరువాతి భాషలో 'న్డ' అయినది.

వాన్టు - వాణ్డు - వాండు - వాఁడు

మూన్టు - మూండు - మూఁడు

ఏళుచున్టి - ఏలుచుండి

'ఏళు' శబ్దము తరువాతి భాషలో, ఏలు అయినది. ఇంకను వెనుకకుబోయినచో తమిళము 'ఆళ్' అనునది ధాతువు, పాలించు అనియే యర్థము. పదాది 'ఆ' కారము తెనుగున 'ఏ' అగుట కలదు. త - ఆఱు - తె - ఏఱు - త - ఆఁడు - తె - ఏఁడు; త - ఆనై - తె - ఏనుగ. శాసనభాషలో "సంవత్సరంబుళ్" మొదలగు కొన్ని రూపములలో గనబడు బహువచన 'ళ' కారము తరువాత 'ల' కారముగ మారినది. 'ఏళేవారు, ఏళుబాద శమ్మార్గారికి' మొదలగు చోటుల ప్రాచీన ధాతువు లోని 'ళ' కారము కూడ నిందు నిలిచి నట్లున్నది. ఆ కాలమునకు "ఏళే" అను రూపము గ్రాంథికమో, వ్యావహారికమో, చెప్పలేముకాని, తరువాతికాలములో నిది గ్రామ్యముగా గ్రహింపబడినది. *"చూసెటివారు;చేసెటివారు" అనువానిని కేతనయు, "పాడేము,సూసేము, పైలురాగాసేము" అని పెద్దనయు, వీనిని గ్రామ్యమున కుదాహరణములుగా నిచ్చినారు. 'ఏలెడు' 'వెళ్లెడు' 'చూచెడు' మొదలగు రూపముల నుండి తుది డువర్ణలోపముచే వెనుకటి యచ్చునకు దీర్ఘమువచ్చి 'ఏలే' వెళ్లే, చూచే అను రూపములు వ్యవహారమున నేర్పడియుండును. చేయువారు - అంగీకార్యమే

* పంచాకుమయ్య తో పించాకుమయ్య, వాటీ దెచ్చుతారు మమ్మానదలంచి, cf. అన్నియు – అన్నీ – నన్నును > నన్నూ - మమ్మును > మమ్ము. యేగగొంటూ రమ్మ యేదాలు వోదాలు, తెాసెటి వారాసనేసువారు. cf.

కాని 'చేసువారు' గ్రామ్యమైనది. ఏలేటి, చూచేటి అనునవి పాడెడివారము, చూచెడువారము- అను వానినుండి ఏలె, చూచె, అనురూపముల సామ్యముచే - పాడేవారము - పాడెము, చూచేవారము చూచెము - అని యేర్పడియుండును. మువర్ణలోపముచే వెనుకటి యచ్చునకు దీర్ఘమువచ్చిన - వేసములు - వేసాలు; దోసాలు మొదలైనవి కూడ గ్రామ్యములలోనే చేర్పబడినవి- పెద్దన లక్షణమున. కాని ముత్యాలు మొదలగువానికి సాధుత్వము కల్పించినారు అర్వాచీనలాక్షణికులు. 'దానిని'- ఇకారలోపముచే 'దాన్ని' వాని(డికి)ని, > వాణ్ణి, - వలెనే వాటిని, > వాట్ణి - వాటి - సముచ్చయార్థమున - వాటీ యగును. 'తెచ్చుతారు' అనునది "తెస్తారు" అనుదానికి బూర్వరూపము. "వస్తాడా హరి సొమ్ములు తెస్తాడా?"

అని అప్పకవి దీనిని తన కాలమున గ్రామ్యమున కుదాహరణముగా నిచ్చుటచేత గ్రామ్యము కూడ కాలక్రమమున నెట్టి పరిణామమును బొందుచున్నదో తెలియవచ్చుచున్నది. కేతన కాలములో 'తెచ్చుతారు' గ్రామ్యము - యకారాంతములగు 'చెయ్' మొదలగు వానినుండి యేర్పడిన 'చేస్తాడు' అనువాని సామ్యమున గాని, లేదా తకారసాహచర్యమున గాని, తెచ్చుతారు (అజ్లోపము) తెచ్ తారు > తెస్ తారు — తెస్తారు అను రూపమేర్పడినది. తెచ్చుతారు అనునది 'తెచ్చుదురు' అనుదానినుండి 'చేయువారు' అనునట్టి రూపముల సామ్యముచే నేర్పడినది. తెచ్చుదురు - వర్ణ సమీకరణము (assimilation) మూలముగా 'తెత్తురు' అయినది. ఈ రూపమే శిష్టకవులచే - నన్న యాదులచే గ్రహింపబడుటచేత ఆ కాలమున 'తెచ్చుతారు' గ్రామ్యమైనది కాబోలు. తరువాత దానినుండి వచ్చిన 'తెస్తారు' కూడ గ్రామ్యమే. గ్రామ్యము నుండి పుట్టినది గ్రామ్యమేకదా. కాని యిట్లే చేయుదురు - నుండి 'చేతురు' 'చేసుదురు' ఉకారలోపముచే 'చేస్తురు' అను రూపము లేర్పడగా ఒకటి అసాధువు, ఒకటి గ్రామ్యమునైనది. అసలు మూలధాతువు 'తర్' అనునది తమిళకన్నడములలో నిదే రూపము - కాని అది తెలుగున 'తెర్' ఐ, తెర్ + ఉతు (ఉచు)= తెచ్చు అయినది. 'తెచ్చు' అనుదానినే మనము ధాతువనుచున్నాము. ఇన్నివిధములగు మార్పులలో వైయాకరణుడు ధర్మనియమము చేయవలసియున్నది. లోకమును బట్టి తెర్ + ఉచు = తెచ్చు, అయినట్లే - వర్ + చు=వచ్చు, మెచ్చు, పుచ్చు - ఇత్యాదులు కొర్ - బు - వు> క్రొవ్వు; తర్ గు - త్రగ్గు - తగ్గు; ఎరుదు>ఎద్దు; మొలక>మొల్క - మొక్క, వెడలు>వెళ్లు, కొలది > కొల్ ది> కొద్ది; వలదు > వల్దు > వద్దు, పెండిలి>పెండ్లి > పెళ్ళి, కన్నులు - (కణ్ + లు) > కండ్లు, > కళ్లు ఇత్యాది రూపములన్నియు అజ్లోపము, వర్ణసమీకరణాదులచే భాషలో నేర్పడుచుండును. రెండు భిన్నశబ్దములు కలసినపుడు స్వరము ఊనిక అనునవి వానియర్థమును సూచించుటకు, వానిలోని మార్పులకు గూడ కారణ మగుచుండును. గంగ + అను = గంగను అనునప్పుడు రెండవ యక్షరమువిూది యూత అర్థస్ఫురణకు గారణమగును. పుట్టినయిల్లు - పుట్టినిల్లు - పుట్టిల్లు, మావటివాడు - మావటీడు, (ఈడు ప్రత్యయమైనది) చేసిన- వాడు- చేసినాడు - (న లోపముచే) చేసి + ఆడు> చేసేడు. కొట్టినాను - కొట్టిఆను , కొట్యాను - కొట్టాను. వీనిలో సమీకరణముల మూలముగా

క్రొత్త ధ్వని బయలుదేరుటచే నివి లక్షణపరిగ్రాహ్యములు కాలేదు. శిష్టప్రయోగముచే పరిగ్రాహ్యములు కావచ్చును.

వ్యవహారములో ననేకరూపము లిట్లే కాలక్రమమున మార్పు జెందినవి. చేయవలయునని చేయవలెనని - చేయాలెనని (వకారలోపము, పూర్వాచ్చుకు దీర్ఘము) చెయ్యాల్ నని - చెయ్యాలని- ఇట్లే - ఉండవలెను - ఉండాలి; దానిలోనుండి >దానిలోనుంచి> దానిలోంచి - ఇత్యాదులు. ఇట్టి వ్యావహారికభాషారూపము లనేకములు నేడు పలువురు వ్రాయు వ్యాసములలో గానవచ్చుచు ప్రామాణికత్వమును బడయగలిగిన స్థితిని బొందుచున్నవి. శిష్టవ్యవహారమే ప్రామాణికత్వమునకు మూలముగదా. అట్టివాని పరిణామక్రమము నారసి భాషాశాస్త్రపద్ధతిని వాని స్వరూపలక్షణములను వివరించుట వైయాకరణుని, లేదా భాషాశాస్త్రజ్ఞుని పని. కాని అనంతములగు నిట్టి రూపములకు లక్షణము కల్పించుట సాధ్యమేనా? అనునది యొకప్రశ్న కలుగకమానదు. ఈ భాషలో లేదా ఈ రూపములను బ్రయోగించుచు, వస్తుగౌరవము, భావగాంభీర్యము, రసపోషణము గలిగిన రచనలు బయలుదేరినచో నీ రూపములను వద్దనువా రుందురా? ఉన్నను గ్రంథములకు, గ్రంథములతోపాటు రూపములకు, భాషకు, పోతనామాత్యుని గ్రంథమునకు,ఆముక్తమాల్యదాది గ్రంథములకు, భాషకు గలిగిన గౌరవము కలుగక పోవునా? కాలగతిని గలుగు పరిణామము నాపువారెవరు?

# లలితకళలు - కవిత్వము - విమర్శనము

శ్రీ శేట్టలూరి వేంకటరాఘవ అయ్యంగారు

**కళ :** ఈ ఒక శబ్దమును వినినవెంటనే మూడుశబ్దముల ప్రతిధ్వనులు మన హృదయములం దుదయించును. అవి యేవి? మన వేదాంతులు దానినే "సత్యము; శివము; సుందరము" అని వచింతురు. దీనినే సూత్రప్రాయముగ "సత్యం, శివం, సుందరం" అని ఉపదేశించిరి. ఈ ఒక సూత్రమున మూడు గొప్ప ప్రశ్న లున్నవి. ఈశ్వరుని చమత్కారమయమైన ఈ విశాలసృష్టిలో సత్యమేది? కల్యాణకర మేది? సుందరమేది? ఎవఁడు దానిని ప్రదర్శించి నిరూపించగలడు అని మన కొక సందియము కలుగును. ఏ సహృదయుడు దీని తత్వమును అధికాధికసరససుబోధరూపమున ప్రదర్శించునో వాడే సఫలకళాకారక గౌరవమును పొందగలడు. ఈ తథ్యమునకు రూపురేఖలను శోభాశ్రీల నొసంగి చిత్రకారులు తమ తూలికలచేత పలురంగుల నంకిత మొనరించుచున్నారు. ఈ తథ్యమునకు సాకారత నొనగూర్చుటకు మూర్తికారులు ఉపలములపై బహువిధముల చెక్కుచున్నారు. ఈ తథ్యమునకు మృదులమధురిమ చేకూర్ప గాయకులును, వాదకులును, తమ తమ సరసస్వరముల వివిధవిధముల వెలయించుచున్నారు. ఈ తథ్యమునే కల్పనాతీతభావముల నవరసభరిత మొనరించి కవికులతిలకులు ప్రవహింపజేయుచున్నారు. ఎచట సత్యము, శివము, సౌందర్యములు మూడును గూడియుండునో అచట సహృదయానందము కందళించును. ఆ రీతిగా రచింప కౌశలముగలవాడే, విశ్వవంద్యకళాకారుడు; వాడే లలితకళాతత్త్వవేది; లలితకళారహస్యోపాధ్యాయుడన వన్నెగాంచును. ఈ మూడును పరమాత్మకు ప్రకృతిసిద్ధగుణములు. వీనిని మనకు వ్యక్తపరచువాడే పరమాత్మకు ప్రతినిధియై ప్రపంచమున ప్రకాశించును. అందుచేతనే గానము, చిత్రరచనము, కవిత్వము లను లలితకళలు వారి వారి పూర్వపుణ్యావశమున నలవడును. చిరకాలాభ్యాసమున వచ్చునవి కావు. లలితకళామయమైన మన జగమును పరిపాలించు మూర్తిత్రయము, సత్యము, శివము, సుందరము - వెల్లివిరియుచున్న గానము, చిత్రరచనము, కవిత్వము నీ మూడే.

**కవి — కావ్యము :** కవిశబ్దము 'కుజ్' ధాతువువలన బుట్టుటచే 'శబ్దమును చేయువాడు' అను అర్థము నిచ్చును. ధ్వన్యాత్మకము, వర్ణాత్మక మని శబ్దము ద్వివిధము. అకారాదులు వర్ణాత్మకములు; వీణానాదాదులు ధ్వన్యాత్మకములు. అందుచే వర్ణాత్మక రమణీయశబ్దోచ్చారణ మొనరించువాడే కవి; అతని ఉత్తమకృతియే కావ్యము. వాచక, లక్షక, వ్యంజకము లను పేరుల శబ్దము త్రివిధముల జెలంగును. వాణికిని శబ్దోచ్చారణకును అత్యంతసంబంధము గలదు. మానవశరీరమున విశేష మాహాత్మ్యము గలది వాణియే; దీని మూలమున మానసికభావములు, అంతఃకరణప్రవృత్తులును వ్యక్తములై సంపూర్ణవ్యవహారమునకు సిద్ధి లభించుచున్నది. కవిత్వము, వక్తృత్వము, తర్కము, వ్యవహారము లనునవి నాలుగును వాణికి ఉపయోగస్థానములు. కవితచే ప్రసిద్ధి వృద్ధి

నొందును. వక్తృతవలన నితరుల మనముల నాకర్షించు శక్తి ప్రాప్తించును. తర్కముచే సిద్ధాంత నిశ్చయము లభించును; వ్యవహారమువలన సామాజికసంస్కారము సంభవించును. మన కిచట కావ్యసమాలోచనమే ముఖ్యాంశము, ప్రధానకర్తవ్యము. ఇంక కావ్యములందు ఉన్నతభావములు, ఉన్నత కల్పనలు, ఉన్నత విచారములతో నిండి ఉత్తమకావ్యము వెలుంగును. లోకోత్తర భావవర్ణన మొనరించువాడే కవి; అతని కృతియే కావ్యము. శక్తిరహితమైనచో కావ్యరచనము దుర్లభ మని వచించి ప్రాచ్యసాహిత్యాచార్యులు కావ్యమునకు యథారుచి, యథామతి నీ క్రింది లక్షణముల విధించిరి.

**కావ్యలక్షణము :** 'ఏ అర్థము హృదయసంవాదియై, ఏ భావము రసోద్భవమై వెలుంగునో అదియే కావ్య'మని భరతమునిచంద్రుడును; 'శబ్దార్థ సహితమే కావ్య' మని రుద్రటాదులును; 'గుణాలంకారయుక్తశబ్దార్థమే కావ్య' మని వామనుడును; 'దోషరహిత గుణాలంకార పూర్ణశబ్దార్థమే కావ్య'మని మమ్మట, ప్రభాకరులును; 'దోషశూన్య గుణాలంకారసహిత రసమయ వాక్యమే కావ్య'మని భోజదేవుడును; 'గుణాలంకార రీతి రసపూర్ణ సుందరశబ్దార్థ సందర్భమే కావ్య' మని వాగ్భటుడును, 'దోషశూన్య గుణాలంకార లక్షణరీతివృత్తిమద్వాక్యమే కావ్య'మని పీయూషవర్షుడును; 'రసాత్మకవాక్యమే కావ్య'మని శుద్ధోదన విశ్వనాథులును; 'ఇష్టార్థయుక్త పదావళియే కావ్య' మని దండ్యాచార్యుడును; 'రమణీయార్థ ప్రతిపాదకశబ్దమే కావ్య'మని పండితరాయలును; 'ధ్వన్యాత్మకవాక్యమే కావ్య' మని మోహనభట్టును; 'విశేషసుఖసాధక వాక్యమే కావ్య' మని కేశవ మిశ్రుడును రచించిరి. కొంద రాలంకారికులు శబ్దార్థములు కావ్యశరీరముగను వ్యంగ్యమే కావ్యాత్మగను దలంతురు. ఈ ప్రాచ్యసాహిత్యాచార్యుల లక్షణములవలన తేలిన విషయ మిదియే. కావ్యము శబ్దార్థసహితముగనే వెలుంగును. అలంకారరహిత రచనము కావ్యము కాదని కొందరి మతము. రసాలంకారములే కావ్యమునకు చమత్కారము గూర్చునని కొంద రందురు. ఎచట స్ఫుటరూపముగ అలంకార ముండదో, అచట రసమే చమత్కారము గలిగించును. కావ్యమునకు గుణము లత్యంతావశ్యకములు. గుణములవలననే మనుష్యులు స్వాభావికముగ ముగ్ధ లగుచుందురు. అలంకారభూషితయైనను గుణరహితయైనచో కన్యకామణి చూపరుల చిత్తము నాకర్షింపనేర దను సంగతి హృదయవేద్యమే. ఈ విధముననే కావ్యవిషయమున గూడ దలంపవలయు.

**కావ్య భేదములు :** ఇట్టి కావ్యము దృశ్యము, శ్రవ్యము అని ద్వివిధము. వీనినే రూపకాదులు, ప్రబంధము లని వ్యవహరింతురు. ఇందు పద్యము, గద్యము నన భేదద్వయము గలదు. మరియు ఉత్తమ, మధ్యమాధమము లన కావ్యము త్రివిధము. ధ్వని అన వ్యంగ్యము ఎచట నధిక చమత్కారకారియో, అచట ఉత్తమము; ఎచట వ్యంగ్యము వాచ్యమునకన్న అధిక చమత్కారకారి గాదో, అచట మధ్యమము; ఎచట వ్యంగ్యము కానరాక కేవల శబ్దము వాక్యార్థచమత్కారకారియో అచట అధమము. దేనియందు విశేషముగ కోమలములు, లలితములైన పదము లుండునో, శబ్దార్థ మెచట 'అరచాటగు ఆంధ్రవధూటి చొక్కపుం జనుగవలీల' వెలుంగునో, దేనిని

వినినంతనే, జను లవగాహనము గావించుకొన గలరో, ఏది యుక్తిపూర్ణమో, ఏది అభినయ ప్రయోగసాధ్యమో, ఏది నాటకసంధ్యంగసంయుతమో, దానినే శుభకావ్య మందురు. దీని రచించు కవికి యశోధన లాభము చేకూరును. అట్టి కావ్యమే కాంతాసమ్మిత మని సహృదయు లచే ప్రశస్తి గాంచి కవికి ప్రసిద్ధిగూర్చును.

**కావ్యాంగములు - కవిప్రభావము:** ఎవనియందు శక్తి (ప్రతిభ) గలదో, ఎవడు శాస్త్రముల చతురుడో, ఎవడు నిరంతరము కావ్యాదుల నభ్యసించునో, ఎవడు ఛందశ్శాస్త్ర భాషా జ్ఞానములు గలవాడో, ఎవడు కోశముల, కళల నిపుణుడో, ఎవడు కావ్య మర్మజ్ఞులైన గురు వర్యులయొద్ద పూర్ణశిక్షణమును బొంది సాహిత్యసారమును జవి గాంచునో, వాడే కవిత్వ రచనమునకు అధికారి. ఎవడు కవితారహస్యము, కవితాసాధనము నెరుంగడో, వా డెన్న టికిని ఉత్తమకవి కానేరడు. ఎచట విశ్వవీణాస్వరము మారుమ్రోగుచుండునో, అచట సరసకవితామతల్లి లాస్య మొనరించును. అపుడు కవీశ్వరు డీ అనంతప్రకృతియొక్క చిత్రకారుడును, గాయకుడునుగా విలసిల్లునేగాని ఉపదేశకుడు గాడు. ఆత డప్పుడప్పుడు కొన్ని కొన్ని మర్యాదల నతిక్రమించును. కొన్ని కొన్ని సీమల నుల్లంఘించును. మరియు శుద్ధ మాంస పిండమునం దంతర్హితములైన అనంతభావములకు సజీవరూపము నొసగి చిత్రవర్ణసమ్మేళనమున దాని సుస్వరూపమును కవి కాగితముపై రచించును. ప్రకృతిలో గల వస్తువులం దెల్ల నొకానొక ధ్వని పుట్టుచుండును. కవితగూడ నొకానొకధ్వనియే. ధ్వనియే కావ్యాత్మ. ఎవనికి దయార్ద్ర హృదయము లేదో, ప్రపంచమునందలి దానవత్వమును, హృదయరాహిత్యమును గాంచ నెవని డెందము వ్రక్కలు గాదో, పరులసుఖదుఃఖములను కని విని యెవడు మోదఖేదముల నొందడో, వాడు కవి కానేరడు. విశ్వసౌందర్యసర్వస్వమును ప్రదర్శించుచు, ప్రపంచమునం దంతర్హితములైన రత్నసంచయముల ప్రకాశింప జేయుచు, ప్రకృతి చిత్రవైచిత్ర్యములపై గప్పబడిన మేలి ముసుంగును దొలగించి మానవసమాజమునకు దివ్యసందర్శనలాభమును జేకూర్చి సహృదయ హృదయానందసౌఖ్యమును ప్రసాదించునదియే సరసకవిత్వము. ఇంతియే గాదు. స్వర్గీయ సంగీతమే కవిత్వము; ఆదర్శచిత్రమే కవిత్వము. అట్టి కవిత్వము మన పూర్వాచార్యుల మతమున సత్యము, శివము, సుందరములైన భావముల కూలంకషప్రవాహమైన రసామరకల్లోలినియందు సహృదయుల కవగాహనసౌఖ్యము గల్గించి, వారి కమరత్వమును జేకూర్చును. ఏది ప్రకృతి రహస్యోద్ఘాటనసమర్థమో, అదియే సత్కవిత్వము. మరియు, ఏకాంతము, క్షణానుభూతము నైన శాంతమనోనుభావనమే సరసకవిత్వము. జీవనతంత్రీస్వరమధురఝంకారమే కవిత్వము. భావజలధి నిమగ్నమై భాషామందరమథనమున బయల్పడిన ప్రకాశమానకౌస్తుభరత్నమే సత్కవిత్వము. దేనివలన హృదయము వెన్నవలె గరంగి, ఒకానొక నవీనభావ ముదయించి, మానసమునం దాహ్లాదము జనించునో అదియే సుకవిత్వము. ఏది రసపూర్ణమై, గుణాలంకారసజీవమై చదువరుల హృదయనికేతనముల నివాస మొనరించు శక్తి గలిగి యుండునో, అదియే సత్కవిత్వము.

**చిత్రకళ - కవిత్వము :** లలితకళల మూలమున సంప్రాప్తించు ఆనంద సౌందర్య సౌభాగ్యములు మన కీ విశ్వమునం గల మరి యే వస్తువులవలనగూడ లభింప వని కొందరు పల్కుదురు. చిత్రకళాకవిత్వముల రెండింటికి నత్యంతసంబంధము గలదు. వీనికి విలక్షణసాదృశ్యము గన్పట్టును. రెంటిలో కొన్ని కొన్ని భిన్నప్రకారములైన దృశ్యములును, మనోవికారములును, చిత్రింపబడును. దేనిని చిత్రకారుడు చిత్రద్వారమున వ్యక్తపరచునో, దానినే కవి కవిత్వమూలమున స్పష్టపరచును. అందుచే కవితయు నొకానొక విధమైన చిత్రమే. కవిత వినుట నానందము గలుగును; చిత్రము గనుట సంతోషము సమకూరును. పటమున గల భావమును కవితారూపమున ప్రకటన జేయ నెటుల నలౌకికానందము వృద్ధిబొందునో, కవితాగతమైన భావమునుకూడ చిత్ర రూపమున స్పష్టపరుప, నటుల లోకోత్తరానందము పెంపొందును. అట్టి పట్టుల కవిచిత్రకారు లిరువురిలో నెవరు ఉన్నతాసనము నధిష్ఠింప నర్హులో నిర్ణయింప శక్యము కాదు. చిత్రమును గాంచుటచే కన్నులు తృప్తి నొందును. కవిత వినుటచే, చదువుటచే చెవులు సంతసించి, చిత్తము ముదము జెందును. మూర్తద్రవ్యముల చేయూత గొనక, శాబ్దికసంకేతముల నాధారము నొనర్చుకొని, తన అక్షరత్వమును కర్ణపేయముగ, మనోరంజకముగ ప్రదర్శించుటచే కావ్యకళయే లలితకళలన్నిటిలో మిన్నయై వన్నె కెక్కునని కొందరి ఆశయము. అందువలననే కాబోలు, సప్తసంతానములలో నొకటిగ సత్కృతి ప్రశస్తి గాంచెను. నేత్రశ్రవణములమూలమున దీని జ్ఞానము మానసమున ప్రవేశించును. నేత్రశ్రోత్రములకు శబ్దజ్ఞానము సహజ మగుటచే, తన ప్రభావమును బుద్ధివరకు వ్యాపింపజేయుటకై కావ్యకళకు వీనికన్న వేరొండు సాధన మావశ్యకము గాదు. గుడ్డ, కుంచె, కాగితము మొదలైనవి చిత్రపటమున కాధారములు. చిత్రకారుడు పెన్సలు, కలము, కుంచె, రంగులు మొదలైన పనిముట్లతో ప్రాకృతికదృశ్యముల సజీవముగ, రూపసంయుతముగ చిత్రింపగలడు. ఆ చిత్రమున నిమ్నోన్నతసమస్థలముల, స్థూల సూక్ష్మ రూపముల, దూరనైకట్యముల చూపరుల కన్నులకు గట్టినట్లు శిల్పకారుడు కరకౌశలమున నచ్చొత్త గలడు. వాస్తవికపదార్థముల నిజసందర్శన మా చిత్రముల గానవచ్చును. ఆ చిత్రగతవస్తువుల యభిప్రాయములు చూపరుల మానసముల ప్రవేశించి, కన్నుల కానందము గొలుపును. ఆ యా చిత్రము లెంతవరకు మన కట్టెదుర గన్పట్టు నంతదనుక ఆయా భావములు మన హృదయసీమల పాదుకొని రేకెత్తుచుండును.

**చిత్రకళాకవిత్వముల తారతమ్యము :** చిత్రకారుడు విభిన్నవర్ణముల తూలికాముఖమున చిత్రకల్పనము గావించును; ఇంక కవియో విచిత్రవర్ణసమామ్నాయసంఘటనచే లేఖినీద్వారమున స్వకపోలకల్పనముల నెన్నిటినో సృష్టిజేయును. కవి చిత్రకారు లిరువురుం గూడ వర్ణిత విషయముల పాఠకదర్శకుల కట్టెదుర గనబడజేయు కరకౌశలము కలిగి వెలుంగుదురు. అందుచే కవిత్వము శబ్దమయచిత్రకళ యని కొందరిమతము; శబ్దచిత్ర మందురు. ఏ రీతిగా చిత్రకారుడు తన కుంచెతో రెండు మూడు రంగుల గీతల గీచి, ఏమియు లేని కాగితముపై, లేదా శూన్యపటముపై క్షణమాత్రమున సజీవరూపమును గల్పించి దర్శకులమానసముల నాకర్షించునో, ఆ విధముగా

కవీశ్వరుడు గూడ సుకుమారకోమలాక్షరసంఘటనమువలననే, లేదా మృదుమధురార్థసంయుత శబ్దవిన్యాసముననే, సజీవశబ్దచిత్రముల శ్రోతల మనోభిత్తికల నిర్మించి వారి నత్యంతము ముగ్ధులుగా జేయ శక్తిని గల్గియుండును. బాహ్యాంతర్గత సౌందర్యమును చిత్రించుటయే కవిత్వమునకు ప్రధాన కర్తవ్యము. బాహ్యసౌందర్యమును చిత్రించుటలో చిత్రకారునిది ప్రథమస్థానము; తరువాతి స్థానము కవీశ్వరునిది. ఏలనన - బాహ్యసౌందర్య నిర్మాణద్వారమున ప్రకృతి ననుసరించుటయే, చిత్రకళకు ముఖ్యకార్యము. పదము లెంతగ భావపరిపూర్ణములైనను బాహ్యసౌందర్యచిత్రణమున కవిత్వము చిత్రకళకు సాటిరాదు; ఇంక కవిత్వముయొక్క మహత్త్వ మన్ననో, యది అంతర్జగత్తు యొక్క సౌందర్యవర్ణనమునందే కాననగును. బాహ్యగతసౌందర్యచిత్రణమున కవిత్వము చిత్ర కళకు వెనుకబడినట్లే, అంతర్గత సౌందర్యవర్ణనమున చిత్రకళ కవిత్వమునకు వెనుకబడును. మరియు కవిత్వము నవగాహన మొనర్చుకొనుటకు చాలకాలము పట్టును. బుద్ధిని క్లేశపరచి, మనస్సునకు వ్యథ గల్గించిన గాని శబ్దచిత్రము బోధపడదు. ఈశ్రమకు తగిన ప్రతిఫల మున్నదిగాని లేక పోలేదు. వర్ణనావిశేషమున కావ్యముల నిర్మింపబడిన కల్పనలు ధారణాశక్తి యున్నంతవరకు అంతఃకరణ సమ్ముఖమునం దుపస్థితములై తనరారును. బాహ్యాంతర్గతజగముల రెంటియందును కవిత రాజ్య మును శాసించును. చిత్రరచన కేవల బాహ్యజగమునందు మాత్రమే; అంతర్జగమున దీనికి ప్రవే శము లేదు. ఒకవేళ నున్నచో నది చాల స్వల్పము. చిత్రకళయొక్క కాంతి కేవలము భూమియందే; కవిత్వముయొక్క ప్రకాశ మన్ననో, భూమ్యాకాశముల రెంటిమీద గూడ కానవచ్చును. రామ కృష్ణావతారములవలె చిత్రకళాకవిత్వములలో నొకదానియందు కానరాని విశేషములు వేరొక దానియందు కానవచ్చుచు పరిపూర్ణతను భజించును. వాచ్యార్థవ్యంగ్యార్థముల వడువున నొకదాని మించి మరొకటి రమణీయతరమై వెలుంగును. చిత్రకళ, కావ్యకళ-ఈరెండును సమానములు, అను కరణీయము లని కొందరు పాశ్చాత్యపండితులు వచించిరి. మూకకవిత్వము చిత్రమును, వాచాల చిత్రము కవిత్వముగా జెలంగు నందురు. ఇవి రెండును ప్రకృతియొక్కసేవకు, ఉపయోగమునకును పనికివచ్చును. చిత్రము, కావ్యము - ఈరెంటియొక్క ఉద్దేశము, లాభము ఆనందము లని కొంద రందురు. ఐనను కావ్యముయొక్క ప్రభావము చిత్రమునకన్న సంపూర్ణమై, విలసిల్లు నని పలువుర పాశ్చాత్యవిమర్శకుల మతము. కావ్యమే చిరస్థాయిగ నుండు నని వారి యాశయము. అందుచే చిత్ర కారుని కుంచెకన్న కవీశ్వరుని గంటమే (కలమే) మహోన్నతపద మధిష్ఠించును. "మనమున గొన్న నెవ్వగల మాన్పి" అను పద్యమున సంకుసాల నృసింహకవి కవికర్ణరసాయనమున పైభావ మును ప్రకటించెను.

**పాశ్చాత్య సాహిత్యలక్షణము :** ఇంతకుమున్ను ప్రాచ్యసాహిత్యాచార్యుల కావ్యలక్షు ణమును రచించితిమి. దానికి తులనార్థముగ పాశ్చాత్యసారస్వత నిర్మాతల కావ్యలక్షణమునకు భావార్థమును వచింతుము. "అత్యుత్తమ తత్వశాస్త్రకథనమే కవిత్వము; ప్రకృతియొక్క ప్రతి రూపము. సర్వశాస్త్రముల సారమే కావ్యము. కవి త్రికాలవేది; విజ్ఞానమునకు ఆద్యంతములే కవి

త్వము. ఆత్మవోలె నది అమర్త్యము; జనసామాన్యమునకై కవి తలంచును, భావించును, రచించును. కవులకొరకుమాత్రమే కాదు. ఉద్రేకపూరితములైన రసభావాదుల స్వేచ్ఛాప్రవాహమే కావ్య కన్యాస్వైరవిహారము. ఆనందోద్రేకముల చదువరుల కాపాదించుటయే కావ్యప్రయోజనము, సత్యవిత్వసర్వస్వమునై వెలుంగు నని వర్డ్సువర్త్ (Wordsworth) మహాకవి రచించెను. అతని సమకాలికుడైన షెల్లీ (Shelly) తా నీ క్రిందివిధమున దలంచెను. భాషారూపముం దాల్చిన కల్పనా కౌశలమే కావ్యము. సత్యప్రకాశనానుకూలమై సర్వోత్తమనాయకజీవితోపేతమై సాహిత్యము వన్నె గాంచును. కావ్యము దివ్యము; అదియే సర్వదర్శనసంగ్రహము; సకలమతముల కదియే మూలము, ఫలమునై ప్రకాశించును. అత్యుత్తమస్త్రీపురుషుల, అలౌకికానందహృదయుల, అనుపమోత్కృష్టానందసమయవర్ణితచరిత్రమే సాహిత్యము. ఒకానొక దివ్యతేజము మానవప్రకృతిలో లీనమైనట్లు ప్రకాశింపజేయునదియే సరసకావ్యము; కావుననే సాహిత్యము సౌందర్యసంపాదకము. అందుచే సృష్టి కంతకును సౌందర్యమును సంపాదించి, ప్రకృతి నంతయు ఆనందకందము గావించి, దివ్యమైన ప్రకృతిదృశ్యముల ఖిలము గాకుండ గాపాడునదియే కావ్యము. "ఇటుల వీ రిరువురును పాండిత్యప్రకటనము గావించు విధమున కావ్యలక్షణము నిర్మింప, వీరికాలమునందే పుట్టి, వీరి కన్న మున్ను గిట్టినను, వీరికన్న మిన్నగ ప్రకృతివనితాసౌందర్యసర్వస్వమును జూరగొనుటకు సత్యాన్వేషణ మొనర్చి శాశ్వతానందము ననుభవించిన కీట్సు (Keats) ముఖ్యముగ మూడు వాక్యములలో కావ్యకాంతానర్మమర్మముల మన కుపదేశించెను. కావ్యరహస్యోపనిషత్ప్రాచకము లైన ఆసూత్రము లివియే:

"అందమగు వస్తు వానందమందిరమ్ము
సత్యమే అంద, మందమే సత్య మంచు
నెరుగుదురు; దానినే మీర లెరుగవలయు"

ఈ పాశ్చాత్యవిద్వాంసుల సూత్రత్రయమే, ప్రాచ్యసాహిత్యాచార్యుల పదత్రయమై ప్రకాశించుచున్నది. "సత్యం, శివం, సుందరమ్".

**సాహిత్యము - విమర్శనము:** కళయే నాగరికుని జీవితమునందలి ప్రధానాంశము. కళా సాహిత్యములలోని మంచి చెడుగుల, బాగోగుల తులనాత్మకదృష్టితో సరిచూచుటయే విమర్శనము. సహృదయరంజకత్వమే ప్రధానసూత్రముగ విమర్శకులు గ్రహింతురు. సార్వత్రికము గాకున్నను సాధారణ ధర్మసూత్రములపై నాధారపడి విమర్శనము వెలయును. విమర్శనసూత్రముల జ్ఞానము లభించినచో చదువరులు కళాసాహిత్యములవలన గలుగు ఆనందమును పూర్తిగ ననుభవింతురు. కళాసాహిత్యములే మానవజీవితమును పరమోత్కృష్టముగ నొనర్చును. సత్ప్రవర్తనమే సాంసారికజీవనమునకు ప్రాణము. సాధుజీవనమునకు తరణోపాయమే సాహిత్యము. దీనికి సంబంధించియే విమర్శనము వెలుంగును. లలితకళలు, శిల్పము అని కళాప్రపంచము రెండు తెరంగుల జెలంగును. అందు మొదటిది మానవులకు ఆనందము గలుగజేయును. రెండవది జనులకు

సౌఖ్యము చేకూర్చును. మానవుని మానసమునకు, ఆత్మకు సంబంధించినవి లలితకళలు; నరుని శరీరమునకు, కాయమునకు సంబంధించినవి శిల్పాదులు. స్థూలముగ కళలు కొన్ని 'కంటికి' సంతోషము గూర్చునవి; మరికొన్ని 'చెవికి' మోద మొదవించునవియై చెలంగును. Hegel మహాశయుడు శిల్పమును అవరకళ (అప్రధానమైన కళ)గను, కవిత్వమును ఉత్తమకళ (ముఖ్యమైన కళ)గను పేర్కొనెను. వాస్తుశాస్త్రమే శిల్పము. ఇండ్లుకట్టుట, ఆలయనిర్మాణము మొదలయినవానికి కావలసిన సామగ్రి సులభసాధ్య మగుటచే నది అప్రధానముగ నంగీకరింపబడెను. ప్రతిమాకల్పనమునకు శిలాలోహము లుపయోగింపబడును. నిర్జీవములైన శిలలను, లోహములను గైకొని సజీవములైన ప్రతిమలను, విగ్రహములను శిల్పి కల్పింపగలడు. ఇవి మానవులకు ప్రతిరూపములై జీవకళ నుట్టిపడ జేయుచుండును. మానవులకు ప్రతిరూపమే గాదు; దేవతాస్వరూపములుగ గూడ నిర్మింపబడును గృహనిర్మాణముకన్న నెక్కువగ రాణించునది ప్రతిమానిర్మాణము. ఈ ప్రతిమానిర్మాణకౌశలమును గాంచగోరు సహృదయులు దక్షిణదేశమునందలి ఆలయములలోని విగ్రహముల గాంచినచో, అపరిమితానందము జెందక మానరు. ప్రపంచమునం దెల్ల ఖ్యాతి గన్న 'తాజమహాలు' కట్టడము నెరుంగని భారతీయుడు గానరాడు. దీనిని 'ప్రేమ శిల్పకావ్యము'గ కొందరు సహృదయులు భావింతురు.

**శిలానిర్మాణము — చిత్రరచనము :** శిలా నిర్మాణమును మించి చిత్రకళ చెలువారును. మోటుగ నుండు రాళ్లను, లోహములను మాని, సుకుమారములైన గుడ్డను, కుంచెను చిత్రకారులు చేకొనిరి. చిత్ర విచిత్రములైన రంగుల నుపయోగించి వానిమూలమున కుడ్యములపై అపూర్వములైన కథాసందర్భముల చిత్రకారులు చిత్రింతురు. ఆకార సౌష్ఠవము, వర్ణ సమ్మేళనా వైచిత్ర్యములచే చిత్రకారులు తా మూహించిన వస్తుస్వరూపమును మన స్థూలదృష్టులకు గోచరింపజేసి, దాని మూలమున ఆ మూర్తిస్వరూపమును మన మనోభిత్తికల సుస్థిరముగ నుండునట్లు జేయుశక్తిని గల్గి యుందురు. ఇటుల నివి యన్నియు కంటికి నింపుసొంపుల నింపి చూపరుల నానందవార్ధి నోలలాడించి, వారలగూడ ప్రతిమారూపులుగను, చిత్రసమానులుగను జేయ సమర్థములైన కళలు. గృహనిర్మాణముకన్న ప్రతిమాకల్పనమును దానికన్న చిత్రరచనమును వన్నె కెక్కెను. మొగలుల శిలానిర్మాణములును, బౌద్ధులచిత్రరచనములును భరతఖండమునకు ప్రఖ్యాతి నార్జించెను.

**సంగీతము - సాహిత్యము :** ఇంక శ్రవణానందకరముగ నుండు కళలు కొన్నిగలవు. అందు గాన మొకటి. శబ్దమే గానమునకు ప్రధానసాధనము. వాద్యవిశేషములు గూడ గాయకునకు తోడుపడును. అన్నిటికన్న మిన్నగ, ఆ యా స్వరసమ్మేళనమువలననే పాటకుడు వినువారి చెవుల కనేకవిధములైన శబ్దముల నుపాయన మొసంగి, దాని మూలముననే వారి వారి మానసముల ఆ యా భావముల జనింపజేయును. చిత్రకారుడు నేత్రద్వారమున జేయగల పనినే, గాయకుడు శ్రవణమూలముననే సల్పుచున్నాడు. 'శిశు ర్వేత్తి, పశు ర్వేత్తి, వేత్తి గానరసం ఫణిః'అను దానిచే గానముయొక్క వశీకరణత నెరుంగగలము. స్థూలముగ, పాములు, పశువులు, బాలకులు గూడ

గానరసము నెరుంగగలరని భావము. సూక్ష్మముగ నాలోచించినచో గానరసము నెరుగు వా
రీ ప్రపంచమున. ముగ్గురే; శిశువు, పశువు, ఫణి యనినచో కుమారస్వామి, నందికేశ్వరుడు, ఆది
శేషుడు. ఇట్టి మహిమ గల్గుటచే సంగీతమును సాహిత్యమునకు సమానముగ ప్రాచీను లంగీకరించిరి.
అంతియేగాదు "సంగీత మపి సాహిత్యమ్ సరస్వత్యాః స్తనద్వయమ్" అని చెప్పి సంగీతమును మున్నగ
గొనియాడిరి. ఈ గానముతోపాటు శ్రవణానందకరమైన లలితకళ కవిత్వము. దీనికి గూడ శబ్దమే
ముఖ్యసాధనము. కొన్ని శబ్దసంకేతముల మూలముననే, కొన్ని వర్ణముల సమ్మేళనద్వారముననే
కవీశ్వరుడు తా దలంచిన భావముల చదువరుల మదుల నుదయింపజేయును.

**నేత్రకళలు, శ్రోత్రకళలు :** చిత్రరచనాగానముల శక్తి కవిత్వకళయందు లీనమైయున్నది.
చిత్రము చూపరుల కొదవించుభావములను, సంగీతము శ్రోతలకు గలిగించు మోదమును
కవి తన కవిత్వమున సహృదయులకు జేకూర్చును. కావుననే చిత్రరచనము, గానము, కవిత్వము
అను నవి మూడుమాత్రమే లలితకళలుగ ప్రసిద్ధి గాంచెను. వీనిలో కవిత్వము ఉత్తమోత్తమమై
వెలుంగును. ఈ కళ లన్నియు కొన్ని సాధనములసాయమున మన నేత్రశ్రోత్రములకు కొన్ని భావముల
నుపదేశించి, వాని నచ్చొత్తినటుల మన మానసముల సుస్థిరమొనర్చి, మనకు అపరిమితానందమును
గల్గించును. గృహనిర్మాణము మొదలుకొని కావ్యరచనముదనుక నన్నియు సంకేతమాత్రములే.
ఒకానొక సంకేతము నాధారముగ నొనరించుకొనిననేగాని వీనికి ప్రవృత్తి లేదు. అందుచే ప్రత్యక్ష
ప్రపంచమున నున్న వస్తువును భావనాజగమున ప్రతిబింబింపజేయుటయే కళోపాసకులకు ప్రథమ
కర్తవ్యము. ఈ రహస్యము గురుతించియే 'ఆలయాదుల' సప్తసంతానములుగ పూర్వులు విను
తించిరి. కట్టడము లన్నింటిలోను మనకు కట్టెదుర గానవచ్చు దానికి ఏకభావము కల్పింపబడును.
మానసమునం దొక భావము నూహించియే దాని కనుగుణమైన రూపమును గల్పించుటకు శిల్పి
ప్రయత్నించును. ఇక చెక్కడములలో స్వరూపసౌందర్యము నిమీలితమై కన్పట్టును. ప్రత్యక్ష
వస్తువునకు పరమోత్కృష్టత చిత్రరచనయం దాపాదించబడును. చిత్రరచనము కేవలానుకరణము
గాదు. కీడును విడనాడి, మేలునుమాత్రమే చేకొని, చిత్రమునకు పొందిక గూర్చి, ఒకానొక భావ
మును చిత్రకారుడు చూపరులకు బోధించును. చక్షురింద్రియద్వారమున మనస్సును రంజింపగల
శక్తి చిత్రకారునకు గలదు; కావున వీనిని 'నేత్రకళ'లందురు. అటులనే గానకవిత్వములు
'శ్రోత్రకళ'లని పేరొందెను. గానము మానసిక ప్రపంచమును గలంచును; పిదప దానిని
గరంచును. మానసమున లీనమై యున్న భావముల మేల్కొల్పును. ఒకానొకరీతి చిత్తసంస్కా
రమును గల్గించును. ఆ వెనుక వినువారలకు భావోద్రేకము రేకెత్తును. తన్ను దా మరచు
నటుల నొనరించి వినువానిని తన యిచ్చవచ్చిన చొప్పున గాయకు డాడించును. ఆడించుటయే
గాదు; వలసినచో ఏడ్పించును. భక్తిపారవశ్యమున ముంచును; తేల్చును. వేయేల ? మనల బానిస
లుగ నొనరించి వైచును. శ్రీ త్యాగరాయలకృతులను, జయదేవునిగీతగోవిందము నాలకించిన
వారి కీ గానమాహాత్మ్యము తేటపడును. శ్రీకృష్ణదేవరాయల ఆముక్తమాల్యదలోని చండాల

బ్రహ్మరక్షస్సంవాదమే ప్రబలనిదర్శనము. "యో మే ప్రగాయతే గీతం...స్వర్గలోకే మహీయతే" అనియు, "అహో గీతప్రభావో... మహాతపాః" అనియు వరాహపురాణము వచించును. అక్బరు చక్రవర్తి కాలమునాటి తానసేనమహాశయుడే మనకు సాక్షి. ఎప్పటిమాటలో ఏల? నేడు గూడ యుద్ధరంగమున ప్రాణముల గోల్పోవుటకు గూడ నొక మారణోపాయముగ గానము పనికివచ్చును. ఈ వీరగానమును పాశ్చాత్యులు వినినంతనే మైమరచి మారణకర్మలకు సాహసింతురు. పశువులు గూడ గానమును విని పాల నెక్కుడుగ నిచ్చునని పత్రికలలో చదివియున్నాము. అట్టిచో శ్రీకృష్ణుని వేణుగానమహిమమునకు మన మచ్చెరువొంద నక్కరలేదు. జోలపాట విని నంతనే శిశువు ఏడ్పు మాని నిద్రించుట మన కనుభవమే. బొబ్బిలిపాటలను, పల్నాటివీరుల కథల వినినంత నొడలు జలదరించనివారు గలరా? కావున గానము నుపయోగించి గాయకుడు శ్రోతల మానసముల ఆ యా రసముల నుదయింపజేయ శక్తి గల్గి యుండును.

**కవిత్వము - ప్రకృతిద్వైవిధ్యము:** ఈ కళ లన్నిటికన్న కవిత్వమునకు సాధనములు చాల స్వల్పములు. కేవలపదములమూలముననే చదువరుల మదుల గరగించు నేర్పు కవికి గలదు. అక్షరములవలననే, శబ్దములచేతనే, కవి తన కావ్యమునందు చిత్రరచనము, వర్ణవిన్యాసమును ప్రకటించును. తన భావములకు భాషారూపము నొసంగి స్వహృదయమును సహృదయులకు కవీశ్వరు డెఱుకపరచును. ప్రకృతి వైచిత్ర్యములను జీవితాదర్శములను చదువరుల మది కెక్కునటుల కవి చేయగల్గుటచే కవిత్వము కళ లన్నిటిలో అగ్రస్థానము వహించెను. కవిత్వము ముఖ్యముగ భావోద్రేకము గూర్చును. ప్రకృతియందలి ప్రత్యక్షఘట్టముల ప్రదర్శించు కవీశ్వరునకు సాధన సంపద సంకుచితముగ నుండును. బాహ్యవస్తువుల భావకత్వముమీద నాతని వర్ణన మంతయు నాధారపడును. మనకు గానవచ్చు ప్రకృతి యంతయు రెండు తెరంగులుగ పాశ్చాత్యకవులచే తిలకింపబడెను. ఇదియే కవిత్వమునందు బాహ్యవస్తు వర్ణనముగను ( Objective ), ఆభ్యంతరవస్తువర్ణనముగను (Subjective) సామాన్యముగ పేర్కొనబడును. ఒకానొక వస్తువుయొక్క ఆకారస్వరూపప్రదర్శనము స్థూలదృష్టికి దోచునటుల సల్పుటయు, ఆ వస్తువుయొక్క ఆంతరంగిక వికాసవర్ణనమును మనోనేత్రమునకు గన్పట్టురీతి జేయుటయు, నీ రెండువిధములలోని భేదము; రెండవదానిలో కవికి స్వాతంత్ర్యము మెండు; ఆతని నిరంకుశత్వ మిందు గానవచ్చును. సాధారణముగ కళలన్నియు బాహ్యరూపవర్ణనమునకే ప్రయత్నించును. ఆయా వస్తువుల ఆంతరంగిక వికాసనోన్మీలనములకు తగినంత యవకాశము కానరాదు. ఒక్క కవిత్వము తప్ప మిగిలిన కళలన్నియు మనకు కట్టెదుర గన్పట్టు ప్రకృతిలోని బాహ్యవస్తువులనే యాధారముగ గైకొని మన కానందము గూర్చును. ఇంక కవిత్వమునం దన్ననో, ఛందము, యమకము అనుప్రాసముల దూర మొనరించినచో బాహ్యవస్తువులపై నాధారపడదు. ప్రకృతి యొక్క ఆంతరంగిక రహస్యముల వెలిబుచ్చుటయే సాహిత్యము యొక్క సారము. జగదంతరాత్మ యొక్క మర్మోద్ఘాటనమే కవిత్వమునకు జీవనప్రాయము. బాహ్యసౌందర్యము చంచలము; దాని ప్రభావము క్షణపరిమితము. ఆంతరంగిక రామణీ

యక మన్నచో అక్షరము; దాని మాహాత్మ్యము కల్పాంతస్థాయిగ నుండును. ఇదియే రెండింటికి గల తారతమ్యము. ప్రకృతి యందలి బాహ్యవస్తుసముదాయము మహాత్ముల మానసికప్రపంచము నందు గలుగజేయు భావనావికాసముల ప్రతిబింబమే ప్రబంధములలో ప్రతిఫలించును. చిరతరానుభవమున సంపాదితమైన జీవనధర్మసూత్రములు కావ్యములలో పొందుపరుపబడును. ఆ యా యుగప్రవర్తకులైన మహాపురుషుల జీవితముల కాదర్శమై సాహిత్యము చెలువారును. సాహిత్యసమాలోచనము వలన ప్రాచీననవీనయుగచర్యలకును, ధర్మములకును, సమన్వయము సంభవించును ఈ సాహిత్యమువలననే ప్రాచీనులు గూడ నవీనులకు సమకాలికు లగుదురు. అందు చేతనే "ఆదిరాజ యశోబింబ మాదర్శం ప్రాప్యవాఙ్మయమ్" అని దండికవి కావ్యాదర్శముననను, "పృథ్వీపతేః సంతి న యస్య పార్శ్వే, కవీశ్వరాః తస్య కుతో యశాంసి'' అని బిల్హణకవి విక్రమాంకదేవచరితముననను రచించిరి.

**సారస్వత సహృదయత్వములు :** ఆభ్యంతర విచారమున కాలవాలమై సాహిత్యము వెలుంగును. ఐనను కవిత్వమునందు బాహ్యాభ్యంతరముల కన్యోన్యసంబంధము చెలంగును. సాహిత్య పర్యాలోచనము వలన ప్రకృతితత్వమును పరిపూర్ణముగ గ్రహించుటకు మన కవకాశము గలుగును. ప్రకృతి తత్వపరిజ్ఞానము వలన భావసంపద సంపూర్ణత వహించి హృదయమునం దపరిమితానందము లభించును. అంత కళాకౌశలమును ప్రకృతిసౌందర్యమును భావించుటకై చిత్తముర్విళులూరును. ఈ విధమున సర్వదా సాహిత్యసేవ సలుపుట వలన విమర్శన మొనరించుటకు సముచితమైన విజ్ఞానము చదువరులకు సంభవించును. ఈ సందర్భమును గమనించియే ప్రాచీనవిమర్శకు డొకడు "కవితారస సౌఖ్యము కవికన్న రసజ్ఞు డెరుగు"నని వచించెను. అంత నా కవీశ్వరు డీ యాక్షేపణమునకు గినిసి "గూఢార్థము కవియెరుగును, మూఢుం డే మెరుగు''నని సమాధాన మొసంగెను. సమాధానమున కేమి గాని, విమర్శకుని పలుకులలో సత్యమున్నదని మన మంగీకరింపక తప్పదు. సహృదయత్వము నభిలషించువారలు సారస్వతపరిచర్య సంతతము సలుపవలెను. అప్పుడే వారు సహృదయు లగుదురు. "కావ్యానుశీలనాభ్యాసవశాత్ విశదీభూతే మనోముకురే, వర్ణనీయ తన్మయీభవనయోగ్యతాపన్నాఏవ హృదయసంవాదభాజః సహృదయాః'' అని అభినవగుప్తుడు లక్షణము విధించి "సరస్వత్యాః తత్వం కవిసహృదయాఖ్యం విజయతామ్" అని వినుతించెను. మానవమానస ప్రదర్శనమే సారస్వతసారము కావున విజ్ఞానవంతులు కాగోరు విద్యార్థులును, సహృదయవతంసులు కాగోరు సారస్వతసేవాపరాయణులును సర్వకాలమును వాఙ్మయపాదారవిందపావనామృతపానవిశేషమత్తచిత్తులు గావలెను. సాహిత్యచింతనమును విద్యార్థులును, విద్వాంసులును విమర్శనదృష్టితో సలుపవలెను. ఈదృష్టితో ప్రాచీన ప్రబంధముల పఠింపనిచో, వాని ప్రాశస్త్యము మనకు గోచరింపదు.

**విమర్శన సూత్రద్వయము - ఇతివృత్తము; పాత్రపోషణము :** సాధారణముగ నొకా నొక గ్రంథము యొక్క ప్రాశస్త్యము నెరుంగుటకు పాశ్చాత్యపండితులు రెండు ప్రమాణ

సూత్రముల నుపయోగింతురు. గ్రంథములోని ప్రత్యక్షప్రయోజనాంశము లెన్ని? ఆ ప్రయోజనాంశములు చదువరుల మదుల కే విధమున బోధింప బడినవి? మొదటి ప్రశ్నమువలన జీవితాంశములు, లేక జీవనధర్మములు గ్రంథమునం దెన్ని గలవో తెలియును. రెండవ ప్రశ్నముచేత జీవిత వర్ణనములు, లేక జీవనచిత్రరచనములు ప్రబంధమునం దెన్ని గలవో బోధపడును. కొన్ని గ్రంథములు కేవలము మానవవిధ్యుక్త ధర్మములను మాత్రమే బోధించును. మరికొన్ని ఆ యా పాత్రల చిత్ర విచిత్రములైన చిత్తప్రవృత్తులను క్షణక్షణప్రవర్ధమానములైన భావపరివర్తనములను సహృదయహృదయరంజకముగ వర్ణించును. దీనినే వస్తుకల్పనము, లేక కథాసంవిధానకము; పాత్రపోషణము లేక రచనాకౌశలముగా పేర్కొందురు. వస్తురచనములును, ఇతివృత్తపాత్రపోషణములును ప్రతిప్రబంధమున నుండును. వాని వాని ప్రాధాన్యము ననుసరించి ఆ యా తరగతులలో ఆ యా గ్రంథములు గణుతిగాంచును. ఒకానొక గ్రంథమునందు వస్తువునకు ప్రాధాన్యమా లేక రచనకు ప్రాధాన్యమా యను దృష్టితో చదివినచో, రచనకు లేక పాత్రపోషణకు ప్రాధాన్యమున్నచో, ఆ ప్రబంధము ప్రథమగణ్యత గాంచును. కావ్యపరిశీలన మొనర్చి, ఉత్తమ, మధ్యమ, అధమ విచక్షణ సల్పుటయే విమర్శకుని కర్తవ్యము: అప్పుడే సహృదయత్వలాభము చేకూరును. అట్టివాడే సహృదయుడు, రసజ్ఞుడు. చిత్రవిచిత్రములైన పాత్రల గల్పించి, ఆ యా పాత్రల చిత్తవికాసములను, భావసంఘర్షణములను, చదువరుల మనోనేత్రముల కెదుర ప్రదర్శించు రచనాకౌశలము గలవాడే, వాగనుశాసనుడు, కవిబ్రహ్మ, సకలవిద్యాసనాథుడు, కవితాపితామహుడు నన ప్రఖ్యాతి గాంచును. వాని ప్రబంధము పరిపూర్ణభావభాసురంబై ప్రసిద్ధి కెక్కును. అట్టి మహామహిమ గలవారే పారములేని కావ్యసంసారమునకు వాణీరమణీమనోహరులు. మిగిలినవారు ప్రజాపతులు మాత్రమే. కవికులతిలకుల కావ్యములు సప్తసంతానములలో ప్రశస్తి గాంచి ఖిలము గాకుండును. అందుచేతనే, పినవీరభద్రుడు 'ఏ పొల్లుంబోనిది కీర్తికిం గృతియపో భూమండలిం దానికిన్ దెల్లం బిప్పుడు రామభారతకథాధీనప్రబంధావళుల్' అని రచించెను. ఇటుల 'శిరీషకుసుమపేశలసుధామయోక్తులం' జెలువ మలరు కావ్యము చతుర్వర్గఫల సంపాదకమై చెలంగును. భాషాసంప్రదాయము, వస్తువిశేషము ననుసరించి కావ్య మనేకవిధముల విభజింపబడెను భాషను ప్రమాణముగ గైకొనినచో, గద్యము, పద్యము, గద్యపద్యోభయ మని మూడురీతులు. ఉపదేశవైఖరి గమనించినచో, ప్రభుసమ్మితములు, మిత్రసమ్మితములు, కాంతాసమ్మితములు అని మూడు తెరంగులు. వీనినే వేద, పురాణ, కావ్యము లందురు. ఇది గాక ప్రాచ్యమతమున, కథ, ఆఖ్యాయిక, ఇతిహాసములే గాక కావ్య మను నాల్గవ భేదము గలదు. నేత్ర శ్రోత్రముల రంజకత్వప్రాధాన్యము ననుసరించి దృశ్యము, శ్రవ్యము నన కావ్యము ద్వివిధము. ఇంక పాశ్చాత్యుల మతమున, వేదాంతము, దేశచరిత్రము, జీవితచరిత్రము, వ్యాసము, నవల, కవిత్వములను భేదముల సారస్వతము వెలయును. ఈ విధము లన్నింటిలో, దేనియందు కవి స్వీయభావోన్మీలనవికాసముల వెదజల్లి రచనావిశేషము వెలుంగ జేయునో, దానికే ప్రాశస్త్యము. స్వీయహృదయమర్మప్రకాశనమే కావ్యమున కమూల్యరత్నము. కొందరు సాహిత్యాచార్యుల మతమున

ఆత్మగోపనమును, మరి కొందరి మతమున ఆత్మప్రకాశనమును సహృదయులకు పరమానందము గూర్చి వారిని పరవశుల జేయును. ఆత్మప్రదర్శనమే అత్యంతావశ్యక మని పలువుర మతము. ఇందువలన వస్తువు, రచనము, ఆనందములు మూడును కావ్యకాంచనామూల్యత నిశ్చయించుటకు గీటురాళ్లని తేటపడును.

**విమర్శనము-ప్రాక్ప్రతీచులు:** విమర్శనము తొలుత పాశ్చాత్యదేశమున ప్రాదుర్భావ మందెను. సాహిత్య సమాలోచన మొనర్చినవారిలో ప్లేటో (Plato) విమర్శకాగ్రేసరుడు; ధర్మసూత్రములు లేక సాధువర్తన మాతని నెక్కువగ నాకర్షించెను. అతని మతమున ధర్మోపదేశమే సారస్వతమునకు ప్రధానసూత్రము. భక్తిబోధకము, పరమార్థోపదేశకమునై కవిత్వము మొదలైన కళలు మానవజీవితమును సఫలము సారవంతముగ జేయవలయును. భారతసంహితయందు రచింపబడిన రీతిని "ఏయది హృద్య......యక్కథయె వినగ నిష్టము మాకును". "ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని యధ్యాత్మవిదులు వేదాంతమనియు" కవిత్వ కళ వెలుంగవలయు. అంతియేగాని నన్నయ భట్టారకుని సీసపద్యములోని ఉదారాశయములు ప్లేటో యొక్క విమర్శనమున లేవు. సంకుసాల నృసింహకవి యొక్క కావ్యలక్షణమునందలి 'కథాముఖంబున హితాహితబోధ నొనర్తు' రను నంతవరకే పాశ్చాత్యవిమర్శకాగ్రేసరుడు స్వీకరించెను. దీనినే ప్రధానప్రమాణసూత్రముగ మన మంగీకరించినచో సారస్వతమునుండి చాల గ్రంథములు బహిష్కృతములు గావలసివచ్చును. ప్లేటోయొక్క విమర్శనము చాల సంకుచితము. ప్రకృతిసత్యము, భావసౌందర్యముల కాతడు తావొసంగలేదు. మన ప్రాచీనులు విశాలహృదయులు, కావుననే 'నీతివిచక్షణుల్ నీతిశాస్త్రంబని - కవివృషభులు మహాకావ్య'మని వాగనుశాసనుడును, "పరమజ్ఞాన లతాలవాలము......నిర్వాణ భవ్య రసాస్వాద రసాయనం బనిన కావ్యం బెన్న సామాన్యమే" అని విన్నకోట పెద్దయ మహాకవియు వచించిరి. పాశ్చాత్యులలో పిదప విమర్శనము నొనర్చిన మహామహిమాన్వితుడు అరిస్టాటలు (Aristotle). ఇతని విమర్శనసూత్రములే సర్వాంకషములు. ఇతనికి కళావివేచనము మెండు. ఇతడు సాహిత్యమును లలితకళావిశేషముగ నంగీకరించి, కావ్యమును కళాదృష్టితో విమర్శించిన సహృదయవతంసుడు. ఇతని సూత్రములే నవీనవిమర్శనమునకు బీజములు. దీనివలననే కావ్య మహావృక్షము క్రమక్రమముగా పెంపొంది పూవులు పూచి కావ్యసౌరభముల నలుదెసల వెదజల్లి రసాస్వాదానందఫలమును సహృదయుల కుపాయన మొసంగెనని చెప్ప నొప్పును. ఇతని మతమున కళలు జీవనప్రదములును, ఆనందసంధాయకములును నై వెలుంగును. ప్రకృతి ననుసరించుటయే గాక, ప్రకృతిని నూతనముగ సృష్టించుటగూడ కవిధర్మమును కవికర్మయునునై విలసిల్లును. మానవచిత్తవృత్తులే కావ్యవస్తువును, ఆ యా పాత్రల మానసోన్మీలనవికాసములే కావ్యరచనా కౌశలమును నై ప్రకాశించును. అప్పుడే కావ్యము సహృదయానందదాయకము. అటుల రచింపబడినపుడే కావ్యము మమ్మటాచార్యుడు చెప్పినట్లు 'నియతికృతనియమరహితాం......ఆదధతీ భారతీ కవేః జయతి' అగుచు వెలుగొందును.

**నన్నయ తిక్కనలు :** పాశ్చాత్య పండితులైన ప్లేటో, అరిస్టాటలు మహాశయులకు గల తార తమ్యజ్ఞానమే వాగనుశాసనకవిబ్రహ్మల కళాదృక్పథమునందు గలదన వచ్చును. 'కృష్ణద్వైపా యను డర్థిలోకహితనిష్ఠం బూని'' కావించిన "ధర్మాద్వైతస్థితి భారతాఖ్యమగు లేఖ్యంబైన యా మ్నాయము'' గురించి తిక్కనార్యుడు 'వేదములకు... మోక్షస్థితికిన్' అని నుడివెను. ఇటుల భారత జాతి కంఠకును పంచమవేదమైన భారతసంహితను గైకొని, 'ఆదరణీయసార వివిధార్థగతి...... నన్నయభట్టు దక్షతన్' అని వచించెను. నన్నయ భట్టారకుని ఆంధ్రీకరణదక్షత యెట్టిదన్నచో, 'ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని' రచించిన సీసపద్యమున నాతడే తన రచనాప్రకారమును దెలియ జేసెను. వేదవ్యాసు డవలంబించిన విధానముననే వాగనుశాసనుడు రచించెను. అందువలన భారతము నందలి మూడుపర్వముల నాలోచించినచో భారత మొక ఆమ్నాయము, ధర్మశాస్త్రము, నీతిశా స్త్రము, పురాణము, ఇతిహాసము గా నుండుటకు నన్నయ సంకల్పించెను. ప్లేటో విమర్శనసూత్రము ప్రకారముగ నిట్టిదే కావ్యము. ఇంక అరిస్టాటలు పండితుని లక్షణము నంగీకరించినచో నీమూడు పర్వములును సమగ్రకావ్యము గాదు. అది ఏకదేశవర్తి కావ్యమేగాని తిక్కన సోమయాజియొక్క విరాటోద్యోగాదులవలె సర్వాంగసుందరకావ్యము గానేరదు. ఈ నా నిర్ణయమునకు అరిస్టాటలు మహాశయుని విమర్శన సూత్రములే గాక, 'భావరసప్రపంచమున......విద్యావిధి గానిపించుటగదా చతురత్వమనంగ మేదినిన్'అను విన్నకోట పెద్దన మహాకవియొక్క విమర్శనవాక్యములును, 'వేదం బుల్ నృపశాసనంబులు......కావ్యమహిమల్ వర్ణింపగాశక్యమే' అను భట్టుమూర్తియొక్క వచన ములును ప్రబలప్రమాణములు. నన్నయయొక్క సీసమందలి 'కవివృషభులు మహాకావ్యమనియు, విశ్వజనీనమై పరగుచుండ జేసె భారతంబు' అనుమాటలు తిక్కన సోమయాజియొక్క రచనమునకు సముచితములు. ఇందుకు నిదర్శనముగ గ్రంథాదిని:

మ. హృదయాహ్లాది చతుర్థ మూర్జితకథోపేతంబు నానారసా
భ్యుదయోల్లాసి విరాటపర్వ మట నుద్యోగాదులుం గూడగా
బదునేనింటి దెనుంగుబాస జనసంప్రార్థ్యంబులై పెంపునన్
దుదిముట్టంగ రచించు టొప్పు బుధసంతోషంబు నిండారగన్.

అని వర్ణించి, 'రచనాకౌతుకమున మన మలరగ'ననియు తిక్కన సోమయాజి వచించెను. ఇచట '(1) హృదయాహ్లాది (2) ఊర్జితకథోపేతంబు (3) నానారసాభ్యుదయోల్లాసి' అనుటచే క్రమముగ (1) అలంకారము (2) వస్తువు (3) రసమును సూచింపబడినవి. 'సౌందర్య మలంకారః' అని వామ నాచార్యుడు వచించినట్లు అలంకారము సౌందర్యపర్యాయవాచకముగను, రసము ఆనందసంధా యక మగుటచే రసమునకు బదులుగ ఆనందమును మనము గ్రహించినచో, కథాసంవిధానము అందముగ నున్నచో కావ్యము చదువరులకు ఆనందము గూర్చునని భావము. కావున కావ్యము నకు మూడు మంచిగుణము లుండవలయును: (1) అందము, సౌందర్యము లేక అలంకారము; దీనినే గుణాలంకార రీతిరచనాదులైన కావ్యాంగములందురు (2) ఇతివృత్తము, వస్తుకల్పనము లేక పాత్ర

పోషణము; దీనినే వస్తుకథాదులైన కావ్యశరీరము లేక కావ్యదేహముగా దలంతురు (3) వ్యంగ్యార్థ విశేషము, రసాస్వాదానందానుభవము లేక చర్వణసౌఖ్యము. దీనినే ఆనందానుభవము, పరబ్రహ్మానంద సబ్రహ్మచారి సౌఖ్యమునైన కావ్యాత్మగ నంగీకరించిరి. దీనినే మన సంస్కృతాలంకారికులును, గీర్వాణసాహిత్యాచార్యులును, అలంకారధ్వని, వస్తుధ్వని, రసధ్వని యని ధ్వనివిశేషాంశములుగ నిరూపించి, రసధ్వనియే—కావ్యాత్మయనియు, ధ్వనికావ్యమే ఉత్తమకావ్యమనియు సిద్ధాంత మొనరించిరి. ఈ ఉత్తమకావ్యలక్షణము లన్నియు తిక్కన సోమయాజి కవిత్వమునందు గలవు. కావుననే ఆతడు కవిబ్రహ్మ యన గణుతిగాంచెను. తన కావ్యకామనీయక మాతనికి కరతలామలకము; స్వహృదయసంవేద్యము. అందువలననే, 'కావున భారతామృతము కర్ణపుటంబుల నారగ్రోలి యాంధ్రావలి మోదముంబొరయు నట్లుగ......పద్యముల గద్యములన్ రచియించెదన్ గృతుల్' అని కంకణము గట్టుకొని కావ్యరచనకు సోమయాజి దీక్ష వహించెను.

**విమర్శన తత్త్వము :** ఇచట సహృదయ లోక విశేషమును గమనింపవలయు. లలితకళల నుత్తమోత్తమముగ బరిగణింపబడినకవిత్వమునకు మూడు ముఖ్యాంశములు కవిబ్రహ్మమతమున గలవు. అందు ప్రథమగణ్యము,నానారసాభ్యుదయోల్లాసిత;పిదప నెన్నదగినది, 'ఉర్జిత కథోపేతత్వము' తరువాత లెక్కింపదగినది, 'హృదయాహ్లాదకత' యను విశేషములే. బహుళాంధ్రోక్తిమయ ప్రపంచము నందు వెలుగొందు మూర్తిత్రయ మీ రసవస్త్వలంకారములే. ధ్వన్యాచార్యులమతమున గన్పట్టు ఈ రసము, వస్తువు అలంకారము లను ధ్వనిత్రియము, వామనుని మతమున రీతి, గుణము, అలంకారములుగ జెలువొందెను. పాశ్చాత్యుల విమర్శనము ననుసరించినచో నివియే, ఆనందము, సత్యము, సౌందర్యము లను లక్షణత్రితయముగ పరివర్తనము గాంచును. వాగనుశాసనుడు సత్యసౌందర్యముల మిన్నగ కావ్యమున ప్రదర్శింప, కవిబ్రహ్మ కావ్యకళారహస్యోపనిషత్సదృశమైన రసాస్వాదానంద సౌఖ్యమును సహృదయులకు ప్రసాదించెను. మరియు 'రసాత్మక వాక్యమే కావ్య'మను సాహిత్యదర్పణకారుని లక్షణమును, 'రమణీయార్థప్రతిపాదకశబ్దమే కావ్య' మను రసగంగాధర కారుని లక్షణమును గూడ తిక్కన రచనలకు సమన్వయించును. ఈ సంగతి నెరింగియే 'రచించు టొప్పు బుధసంతోషంబు నిండారగన్' అను శాసనమును కవిబ్రహ్మ విధించెను. ఇచట బుధులన కావ్య తత్త్వవిదులని తాత్పర్యమేగాని,శబ్దార్థశాసనజ్ఞానమాత్రులనిగాదు.ఏలనన,కావ్యార్థతత్త్వజ్ఞులే సహృదయు లని ఆలంకారికసమయము. కావ్యమర్మము నామూలముగ నెరింగి రచించు కౌశలము గలవా డగుటనే 'మహాకవిత్వదీక్షావిధి నొంది' కవిబ్రహ్మ 'భారతామృతము కర్ణపుటంబుల నారగ్రోలి మోదము బొందుడని, ఆంధ్రావళిని హెచ్చరించెను. మరియొకనోట వెలువడినచో ఈ పద్యము కేవలము ఉత్తరకుమారప్రజ్ఞగ పరిణమించును గాని, మహాప్రతిభాశాలియైన తిక్కనార్యునియం దిది పార్థపరాక్రమవిజృంభణవాక్యములే యని సహృదయులకు తోచక మానదు. ధర్మబుద్ధియు, శాస్త్రసమ్మతియు, పారమార్థిక చింతయు నన్నయరచనల దీపింప, పాత్రపోషణము, భావప్రకాశనము, కళారహస్యవేదిత్వమును తిక్కనరచనల ప్రకాశించును. వీరిలో

గల విభేదమునకు వారి వారల దృక్పథములును, దేశకాలపాత్రల మార్పులును కారణములు. ఒక కావ్యమును మఱొక కావ్యముతో బోల్చుటయు, ఒక కవిరచనల నింకొక కవిరచనలతో తుల దూచుటయు విమర్శకులకు విధాయక కృత్యము. దీనినే తులనాత్మకవిమర్శన మందురు. ఇట్టుల విమర్శించుటచే సారస్వతాభివృద్ధియు; వాఙ్మయాభ్యుదయమును పెంపొంది, ప్రాచీన నవీనసాహిత్యములకు సమన్వయము లభించును. ఇట్టి విమర్శనమునం దెట్టి ధీమంతులకైన ఒకప్రమాదము సంభవించును. విమర్శకుని కాలమునందలి ప్రమాణసూత్రములతో పూర్వగ్రంథముల సమాలోచన మొనర్చుటయు, అతని ప్రత్యేకవ్యక్తిత్వమును, ఇష్టానిష్టములును, దృక్పథమును గలంచుటయు తటస్థించును. ఈ లోపములకు లోనుగాక ప్రమాణసూత్రముల తారుమారొనర్పక, దేశకాలాది పరిస్థితుల గమనించి, ఆయాగ్రంథకారులు నిర్వచించిన లక్షణములయందు వారు లక్ష్యము నిల్పి రచించిరా లేదా యని కావ్యవివేచన మొనర్చినచో, విమర్శకు లాయాగ్రంథములకు ప్రాశస్త్యమును, ఆ యా కవులకు ప్రఖ్యాతియు నార్జించి, సహృదయులై వన్నె కెక్కుదురు. దీనికి దృష్టాంతముగ నన్నయతిక్కన రచనల విమర్శించుచో, వారివారల ఆదర్శముల ఆశయముల మనము మానసమందుంచుకొని విమర్శించవలెనేగాని, అభిమానము, ఆవేశము నూని వా రెక్కువ వీరు తక్కువ యని నిర్ణయింపరాదు. పురాణపురుషుల పవిత్రచరిత్రముల వర్ణించి హితాహితబోధ నొనరించి, చదువరుల సాధువర్తనుల గావించి, వారికి పారమార్థికబుద్ధి గల్గించి వారికి పరమానందము గూర్చుటయే నన్నయముఖ్యోద్దేశము. ఆ యా పాత్రల చిత్తవృత్తుల చిత్రించి, సముచితరసపరిపోషణము గావించి, వారి వారి హృదయాంతర్గతభావవిభావాదుల విప్పిచెప్పి సహృదయులకు అలౌకికానందమును సంపాదించుటయే తిక్కన ఆశయము. విమర్శకు డీ విధమున తిలకింపనిచో అది విమర్శనాభాసమును, విపరీతవిమర్శనము నగును. సోమయాజి యొక్క ప్రతిజ్ఞాపద్యమునం దొక విశేషాంశము గానవచ్చును. 'మహాకవిత్వదీక్షావిధి నొంది పద్యముల గద్యములఁ రచియించెదఁ గృతుల్' అని సమయ మొనర్చెను. దీనిచే గద్యములకు గూడ కవిత్వలాభము సంభవించెను. గద్యరచనము కవిత్వము గాదను ప్రతీతి సత్యదూరము. సత్యము, సౌందర్యము, ఆనందము లను మూడే కవిత్వవిశేషాంశము లని తిక్కనార్యుని పద్యము వచించెను. ఈ మూడు లక్షణములు గల్గినచో, పద్యముగాని, గద్యముగాని, దానినే కవిత్వ మనవలయు. ఛందోబద్ధమైనదే కవిత్వ మనినచో వాస్తు, గజ, గణిత, వైద్యశాస్త్రాదులు కావ్యము లనవలయును. ఇటుల మన ప్రాచీనాలంకారికులుగాని, పాశ్చాత్యవిమర్శకులుగాని తలంపరైరి. ఇంతియేగాక, పద్యముకన్న గద్యమే మిన్నగ బల్కిరి. అపూర్వగ్రంథముల గద్యమయముగ రచించిరి. హర్షచరిత, కాదంబరి, దశకుమారచరిత్ర, వాసవదత్తాదులే సాక్షులు. మరియు 'గద్యం కవీనాం నికషం వదంతి' యని ప్రసిద్ధి గనెను. ఈ సత్యము నారసియే కవిబ్రహ్మయు 'గద్యములఁ రచియించెదఁ గృతుల్' అని నుడివెను. దీనికి నిదర్శనముగ గ్రంథాదిని తండ్రి యానతియు, హరిహరనాథునకు తా నొనర్చిన ప్రణామాది సత్కారము దెలుపు స్థలముల హృద్యములగు గద్య

ములనే సోమయాజి రచించెను. ఇంకను రసవంతము లగు పట్టుల వచన రచనాకౌశలమును గన బరచి గద్యకవిత్వమును గూడ తిక్కన గౌరవించెను.

ఈ సమాలోచనమువలన మనకు రెండుసంగతులు నిశ్చయములైనవి. వాఙ్మయ మనేకభేదముల విలసిల్లు ననియు, సారస్వతమున మూడు ముఖ్యలక్షణములు గలవనియు తేటపడెను. గద్యమును, పద్యమును, దృశ్యమును శ్రావ్యమునునైన కావ్యమున సత్యసౌందర్యముల సాంగత్యము సంభవించి నపుడే సహృదయుల కానందము నది సంపాదింపగలదు. ఇదియే సాహిత్యవిమర్శనమునకు మూల సూత్రము; దీని ననుసరించి కావ్యవిమర్శనమునకు గడంగినపుడా సహృదయుని వచనరచనము గూడ కావ్యమై చదువరుల కత్యంతానందము గూర్చును.

# విభ్రాంతామరుకము

శ్రీ పి. గణపతిశాస్త్రి

[ఈ క్రింది వృత్తాలు నేను రచించిన "విభ్రాంతామరుకము" అనే పద్యకావ్యంలోనివి. ఇతివృత్తము శ్రీమదాచార్యశంకరుల పరకాయప్రవేశానికి సంబంధించినది. శంకరులు, మండనమిశ్రుని భార్యతో వివదించి విజితులైన పిమ్మట, కామకళారహస్యజ్ఞానంకొరకు, అమరుకమహారాజు శరీరంలో పరకాయవిద్యవల్ల ప్రవేశించడం జరిగింది. మృతుడైన అమరుకుని శరీరంలో ప్రవేశించిన పిమ్మట కొంతకాలం శంకరులు మహారాజు బహుళాంతఃపురంలో సమస్తభోగాలను అనుభవించారు. ఆ పరిస్థితిలో కొంతకాలం ఆదరింపబడి, పిమ్మట నిరాకృత ఐన "కింశుకప్రభ" అనే ఒక విలాసిని, అర్ధరాత్రివేళ అమరుకహర్మ్యంలో తన దీనవృత్తాంతం అమరుకునితో నివేదించుకొనడం ఈ క్రింది భాగంలోని విషయము.]

క్రమముగ నా తమస్విని సుకమ్మగు నిద్దురఁ దూలి, మందమం
దము లగు జృంభణమ్ముల విధమ్మున దెమ్మెర లూర్చునంత, నా
యమరుకరాజహర్మ్య శయనాలయసీమఁ గపోతకంఠనా
దమిళితమై ధ్వనించెఁ బ్రమదామృదుభాషణ మివ్విధంబునన్.

తమి బిగికౌగిలింతల వృథా సడలించి, లతాంతలోలుప
భ్రమరకుమారలీల మధుపానమదమ్మునఁ జొక్కి ముగ్ధ మీ
రమణిహృదంతరమ్ము విధుర మ్మొనరించితి రంతెగాని, ఓ
అమరుకనాథ! తా మెరుగరైతిరి ప్రేమగభీరవేదనల్.

తీరనికాంక్ష వారయువతీమృదులాధరనవ్యనవ్యమం
దారమధూళికై, బహువిధమ్ములఁ బర్విడు మీ హృదంతర
ద్వారమునందె వేచి వసివాడిన దీ ప్రణయార్ద్రదీనక
ల్హారము; దీని కెన్నటికి నైన నిరాదరమేకదా! ప్రభూ!

ఆ మన రాగముగ్ధహృదయమ్ముల కోర్కుల పాలపొంగు లా
శామధురమ్ములై మది నొసంగిన శాంతిసుఖమ్ముగాని, యే
దో మదిలో స్ఫురించిన మహోదయతూర్యలవమ్ముగాని లే
దే! మఱి నేడు దాసి యిది యేమని యింక వచించునో ప్రభూ!

మీ కమలాంకశయ్య దరమీలితలోచననై ప్రవాళవి
ణాకృతిఁ బవ్వళించి మధురానుభవమ్మున మున్గనంతఁ దా
మే, కరుణావిహీనత వహించి ననుం దిగనాడి పోయినా
రే! కలదో సుఖస్మృతివిహీనకు నేయెడ నింత నీడయున్!

ఏటికొ! నా మనమ్మున నొకేగతి ఘోషలు వెట్టు నేడు వ్వా
నాటి మధుప్రభాతకృతనాట్యకళాభ్యసనమ్ము లెల్ల ము
న్నీటి మహాభ్రమిం బడి మునింగి నశించు విధాన గాని యే
నాటికి నైన మీకు నయనమ్మున నిల్చెనె! బాష్పలేశమున్.

ఊరకె నేను మాత్ర మెపుడో! హృదయ మ్మొకఁ బ్రేమ సుందరా
శారథరూఢమై సుఖవశమ్మున నిద్దుర మున్గిపోవు; రా
నేరని యా మహోత్సవమె నే డిదె నా కయి వచ్చె నంచు నీ
తీరున నే యిఁకెన్నటికిఁ దీరని యాశలకై కృశించెదన్!

మీ హృదయమ్ములో నొకనిమేషతళత్తళదాభనూత్నకాం
తాహుతి యై గతించినది యా ప్రణయాంకురముగ్ధగాథ బా
ధాహతజీవితమ్మునకునై యిటు శాంతి యొకింత లేక నే
నో! హృదగాధవేదనల నూరక యీగతిఁ ద్రవ్విపోయుదున్.

నాటి మనోజ్ఞకాంక్షితము నాకయి రాదుగదా మ రింక మి
మ్మేటికి మాటిమాటి కిటు లింతలు గాథలు త్రవ్వియూర కా
రాటము సేయుదాన; మదిరాపరతం దమ నేత్రిపాళి యా
పాటలశోభ నే స్మరణభారములో దిగబారునో కదా!

వేళ యతిక్రమించెఁ బృథివీపరమేశ్వర! రేయి నిద్రకుం
దాళని మీ కనుంగవ మదమ్మునఁ దూలెను బక్ష్మశయ్య న
గ్ధాలసమై; మ రేమి తమకై వచియింతును; పోవుదాన శ
య్యాలయ మం దసంతవిరహానుభవమ్ముల వేగిపోవగన్.

# వాఙ్మయ విశేషములు

## శ్రీ నిడుదవోలు వేంకటరావు

౧

మహిమ్నము, మల్హణము, బిల్హణము, అనామయము, హాలాయుధము అను నైదు సంస్కృత స్తవములును, నందు తొలి మూఁడింటికి తెలుఁగు పద్యములు, గల గ్రంథ మొకటి ముద్రితమై వెలయుచున్నది (1891 మార్చి, కాకినాడ: పాఁడి వేంకటస్వామిగారి శ్రీ కళానిధి ముద్రాక్షరశాల). ఈ స్తవములు సంస్కృతాంధ్రములలో నెవ్వరెవ్వరిచే రచియింపఁబడినవో తెలిసికొనుటకు వాని వివరణము నీ క్రింద తెలుపుచున్నాను.

1 మహిమ్నము: పుష్పదంత విరచితము. 45 శ్లోకములు. శ్రీ పన్నాల సీతారామబ్రహ్మశాస్త్రిగారి తెలుఁగు పద్యములు.

2. మల్హణము: మల్హణ కవి విరచితము. 37 శ్లోకములు. శ్రీ దేవులపల్లి సుబ్బారాయశాస్త్రుల వారి తెలుఁగు పద్యములు.

3. బిల్హణము: బిల్హణకవి. 36 శ్లోకములు. శ్రీ వింజమూరి లచ్చారాయకవి తెలుఁగు పద్యములు.

4. అనామయము: దండి విరచితము. పద్యములు లేవు. 35 శ్లోకములు.

5. హాలాయుధము: హాలాయుధకృతము. 65 శ్లోకములు. తెలుఁగుపద్యములు లేవు.

పైని వివరించినవియే 'శివపంచస్తవము లని వాడుకలోనున్నట్లు గ్రంథమునందీ క్రింది విజ్ఞాపనమువలనఁ దెలియుచున్నది. "మహిమ్నము, మల్హణము, బిల్హణము, అనామయము, హాలాయుధము నను నీ యైదు స్తవములు శివపంచ స్తవము లని పేర్కొనఁబడుచున్నవి."

ఏఁబదియేండ్లకు ముందిట్టి వాడుకయున్నను ప్రాచీనకాలమున నీ స్తుతి పంచకమున 'బిల్హణము' కనుపట్టుటలేదు. క్రీ. శ. 1520 సంవత్సరప్రాంతమునఁ గొండవీటిని బరిపాలించిన నాదిండ్ల గోప మంత్రి సచివుఁడు యూర దేచమంత్రి 'మహిమస్తుతిపంచిక' కొక దానికి సంస్కృతమున వ్యాఖ్యానము రచియించినాఁడు. దేచమంత్రి మహావిద్వాంసుఁ డగు లొల్ల లక్ష్మీధరుని శిష్యుఁడు; తెనాలి రామలింగకవిప్రణీత మగు నుద్భటారాధ్య చరిత్రమునకుఁ గృతిపతి. దేచమంత్రి ప్రతి స్తవాంతమునను లక్ష్మీధరుని కటాక్షముచేఁ దాని వ్యాఖ్య రచియించినట్లీ విధముగఁ జెప్పియున్నాఁడు.

శ్లో. లక్ష్మీధరకటాక్షేణ దేచయామాత్య శేఖరః
అకరో ద్దాకరో వాచాం మహిమ్నస్తుతిపంచికామ్. —మహిమ్నము.

అకరో దాకరో వాచాం మల్హాణ స్తుతిపంచికామ్
లక్ష్మీధరకటాక్షేణ దేచయామాత్యశేఖరః. —మల్హాణము.

నీలకంఠ స్తుతే ష్టీకాం యూర దేచయమంత్రిరాట్
లక్ష్మీధరకటాక్షేణ కురు తే గురు తేజసా. —నీలకంఠ స్తవము

అనామయకృతే ష్టీకా మకరో దాకరో గిరాం
లక్ష్మీధరకటాక్షేణ యూర దేచయమంత్రిరాట్. —అనామయము

హలాయుధ కృతే ష్టీకాం యూర దేచయ మంత్రిరాట్
లక్ష్మీధరకటాక్షేణ కురు తే గురు తేజసా. —హలాయుధము.

ఈ స్తవముల దేచమంత్రి నిరంతరముఁ జదివించుచున్నట్లు రామలింగకవి యుద్భటారాధ్యచరిత్రమున నిట్లు వ్రాసియున్నాఁడు.

శా. ధీవిస్ఫూర్తిపయోజసంభవ భవానీశ స్తవోచ్చారణ
ప్రావీణ్యాక్షమభావ భావభవదూరస్వాంతరాజీవ. (1-205)

క. శ్రీ స్తన పాళీశరధిప, దాస్తోక ప్రదరదళితహరిహయరిపు శం
భు స్తుతిపఠనధురీణ సుధీస్తుత్యా! యన్నమంత్రి దేచామాత్యా! (3-1)

పండ్రెండవ శతాబ్దమునఁ బాల్కురికి సోమనాథుఁడు పండితారాధ్యచరిత్రమున రెండు పట్టుల నీ స్తవములఁ జేర్కొనినాఁడు. అందును బిల్హాణము లేదు.

1. పండితుని లింగార్చనాసమయమున :

"హరలీల దేలుచు హరలీలఁ దనర, హరలీల యను కృతి హరలీలఁ బొగడు
మహిఁ జెప్పఁబడు మహిమ స్తవంబునను, మహిమాకరుని మహామహిమఁ గీర్తించు
మలహరణంబగు మలహణంబునను, మలహణప్రియునిఁ ద్రిమలదూరుఁ బొగడు
శ్రీమయంబైన యనామయంబున ని, రామయుఁడగు కరుణామయుఁ బొగడు
ఆయతప్రీతి హలాయుధంబున హ, లాయుధప్రియు త్రిశూలాయుధుఁ బొగడు."

2. పర్వతప్రకరణమున శ్రీశైలయాత్ర శివరాత్ర్యుత్సవసందర్భమున:

"అంచిత బాణగద్యాక్షరగద్య, పంచగద్యాదులు బహుగణాడంబ,
రంబు గణాడంబరంబు వ్యాసాష్ట, కంబును శ్రీనీలకంఠ స్తవంబు
శ్రీరుద్రకవచంబు శారభంబును మ,యూర స్తవము హలాయుధ మనామయము
మలహణంబును మహిమ్నంబను స్తవము, మలయరాజీయంబు మానిదండకము
* * * * * *
హరలీలరుద్ర సహస్రనామాదు, లరుదొందఁ జదువుచు నంకించువారు."

ఈ స్తవములలో నీలకంఠ స్తవముకూడ చాల ప్రఖ్యాతమైనదిగాఁ దెలియవచ్చుచున్నది. శ్రీనాథమహాకవి హరవిలాసమున, (2-72)

ఉ. హస్తగృహీత పుస్తకమునందు లిఖించినయట్టి నీలకంఠ స్తవమున్ బఠించుచు' అనియు

(4-11 లో) పార్వతి తపస్సున,

"సీ. బొమ్మపెండిలిపాట పొద్దుపుచ్చు నెలుంగు, నీలకంఠస్తోత్రనియతిఁ గూర్చె"

అనియును నీ స్తవమును బేర్కొనినాఁడు.

బిల్హణ స్తవ మంత ప్రసిద్ధిలేకపోయినను శ్రీనాథుఁ డెఱుఁగు నని హరవిలాసమున నీ క్రింది పద్యము వలనఁ దెలియుచున్నది:

శా. పంచబ్రహ్మషడంగబీజముఖరప్రాసాదపంచాక్షరీ
చంచన్మంత్రపరంపరాపరమనిష్ఠాతత్పరత్వంబునన్
మంచుంగొండయనుంగుపెండ్లికొడుకు న్మధ్యాహ్నకాలంబు సే
వించుక్ నిర్జరరాజసూనుఁడు మనోవీథీసదాధ్యాసితన్. (7-33)

పై పద్యములోఁ దొలిపాదము బిల్హణ స్తవములోని యీ క్రింది శ్లోకమునఁ గలదు.

శా. పంచబ్రహ్మషడంగబీజముఖరప్రాసాదపంచాక్షరీ
వ్యోమవ్యాపి పురస్సరేషు మనుషు ప్రోఢిః కుతో మాదృశాం
ఓంకారాదినమోంత ముద్రిత భువన్నామావళీకల్పితం
సర్వం మంత్రతయా ప్రభో పరిణమ త్యంతర్బహిర్యోగయోః. (3 వ శ్లోకము)

ప్రాచీనాంధ్ర శైవ వాఙ్మయమును బరిశీలించిన నీ స్తవములు విపులప్రచారములో నున్నట్లు నిదర్శనములు కలవు. నన్నెచోడమహాకవి కుమారసంభవమున మహిమ్నస్తుతి యనువాదము కలదు.

చ. తనర క్రియాతిదక్షుఁ డగు దక్షుఁడు తత్క్రతువల్లభుండు, స
న్మునితతి ఋత్విజుల్, సురసమూహసదస్యులు (?) తత్ఫలంబు లిం
దనిశము నిచ్చు నీ వడచి తట్టె మఖం బది కర్తృభక్తిమైఁ
దనరని యజ్ఞమైనఁ దుదిఁ దా నభిచారము గాకపోవునే? (కుమారసంభవము, 2-235)

మహిమ్నము. 21 శ్లోకము.

క్రియాదక్షో దక్షః క్రతుపతి రధీశ స్తనుభృతా, మృషీణా మార్త్విజ్యం శరణద!సదస్యాస్సురగణాః
క్రతుభ్రేష స్త్వత్తః క్రతుషుఫలదానవ్యసనినో, ధ్రువం కర్తుః శ్రద్ధావిధురమభిచారాయహి మఖాః

యథావాక్కుల యన్నమయ్య సర్వేశ్వరశతకమున నీ శివపంచస్తవము నుండి పెక్కు భావము లను వదించినాఁడు - ఉదాహరణముగా నొక్కటి చూపుదును: (ఈ శతక రచనాకాలము, క్రీ. శ. 1242)

శ్లో. బహులరజసే విశ్వోత్పత్తౌ భవాయ నమోనమః
జనసుఖకృతే సత్త్వోద్రిక్తే మృడాయ నమోనమః
ప్రబలతమసే తత్సంహారే హరాయ నమోనమః
ప్రమహసి పదే నిస్త్రైగుణ్యే శివాయ నమోనమః.

మ. భువనోత్పత్తి విధించుచో నభవుఁడై పొల్పొందగా దాని ను
త్సవలీలం బ్రభవించుచో మృడుడవై, సర్వంబు కల్పాంత భై
రవ సంక్షోభ నటించుచో హరుఁడవై, త్రైగుణ్యశక్తిం దుదిఁ
శివనామాంకముఁ దాల్చు నీ మహిమ దాఁ జిత్రింబు సర్వేశ్వరా!

మహిమ్నములోని భావములు నీ శతకమున 3, 17, 18, 96, 97, 99, 100, 105, 133 పద్యముల వెలయుచున్నవి. గ్రంథవిస్తరభీతి నుదాహరింపనైతిని.

సర్వేశ్వర శతకమున :

శా. ఆడంబోయిన చోట బాలురు వినోదార్థంబు పాషాణముల్
గూడంబెట్టి శివాలయం బనుచు పేర్కొన్నంతటంజేసి వా
రాడం బోయి సురాంగనాకలితదివ్యారామచంద్రోపల
క్రీడాశైలవిహారు లౌదురు మిముం గీర్తింప సర్వేశ్వరా!

అను పద్యము భావమున కొంతమార్పుతో మల్హణస్తవములోని యీక్రింది శ్లోకము ననుసరించినది.

శ్లో. క్రీడాప్రపంచరచనా శ్శిశవో భవంత, మారాధయంతి భువి పుష్పజలైః తృణాద్యైః
దేవాదిదేవ! సురదివ్యవిమానగానాం, తేఽపి ప్రియత్వ ముదయంతి సురాంగనానామ్.
17 వ శ్లోకము.

సర్వేశ్వర శతకమున :

మ. సకలాధీశ్వర పట్టభద్రుఁడవు భిక్షాగామి వత్యంతశాం
తకళాత్ముండవు రౌద్రమూర్తి వతిసౌందర్యాంబికాసంగమా
ధికలోలుండవు దివ్యయోగివి మదిం దెల్లంబుగా నెట్టివా
రికిఁ దా శక్యమె నీ నిజం బెఱిఁగి వర్ణింపంగ సర్వేశ్వరా!

అను పద్యము అనామయస్తవమున నీ క్రింది శ్లోకమున కనువాదము:

శ్లో. యోగీ భోగీ, విషభు గమృత శ్శస్త్రపాణీ తపస్వీ,
శాంతః క్రూర శ్శమితవిషయ శ్శైలకన్యాసహాయః

భిక్షావృత్తి స్త్రిభువనపతి శ్శుద్ధిమా నస్థిమాలీ
శక్యో జ్ఞాతుం కథ మివ శివ త్వం విరుద్ధస్వభావ.

నాగులూటి శేషనారాధ్యుని పర్వతపురాణమున షష్ఠాశ్వాసమున నీ క్రింది పద్యము:

క. మలహరుగుడి గోమయమున, నలికిన మర్త్యుండు నలుకు నట కస్తూరీ
మలయజపంకము దివిష, జ్జలజాయతలోచనాకుచద్వయవీథిన్.

హాలాయుధ స్తవమునందు:

యేషాం యుష్మత్ప్రతికృతిగృహం లిప్తతాం పాణయో త్వ
ద్భక్తానాం సలిలలులితై ర్గోమయై స్సంప్రలిప్తాః
తేషా మీశ త్రిదశనగరీనాయకత్వం గతానాం
తే లిప్యంతే మృగమదరసైః ఖేచరీణాం కుచేషు.

అను శ్లోకమున కాంధ్రీకరణము.

నరసభూపాలీయమునఁ బ్రథమాశ్వాసాంతమున:

చ. అరయఁ బయోధి పాత్రము నంజనశైలము కజ్జలంబు త
త్సురతరుశాఖ లేఖిని వసుంధర పత్రముగా నొనర్చి వా
క్సరసిజనేత్రి వ్రాయ గుణసారము పారము నొంద దార మా
నరసనృపాలమౌళి సుజన స్తవ సద్గుణ సంప్రదాయముల్.

అను పద్యము మహిమ్నమునందలి

అసితగిరిసమం స్యాత్ కజ్జలం సింధుపాత్రే, సురతరువరశాఖా లేఖినీ పత్ర ముర్వీ
లిఖతి యది గృహీత్వా శారదా సర్వకాలం, తదపి తవ గుణానా మీశ! పారం న యాతి.

అను శ్లోకమునకుఁ దెలుగు. ఈశ్వరునకు బదులుగా నరసనాయకుని పేరు కలదు. దీనికి మూల మగు ప్రతాపరుద్రీయమున నీ భావము గల శ్లోకము లేదు.

ఎడపాటి యెఱ్ఱన రచించిన మల్హణచరిత్రమున మల్హణ స్తవము తొలి శ్లోకమునకుఁ దప్ప తక్కిన స్తవమునకు భాషాంతరీకరణము లేదు.

సంస్కృతవాఙ్మయమున మల్హణుఁడు కవిగాఁ బేర్కొనబడకున్నను శ్రీనాథమహాకవి సంస్కృత శైవవాఙ్మయవిశారదుఁ డగుటచే సంస్కృతకవిస్తుతి యందు మల్హణునికూడఁ బేర్కొని యున్నాఁడు. భీమఖండము సంస్కృతకవిస్తుతి—

"మాఘుభారవి బిల్హణ మల్హణులకు
భట్టి చిత్తప కవిదండి పండితులకుఁ,
గేలుకొలుపుదు నొసలిపై కేలుదోయి."

బిల్హణము హలాయుధము సంస్కృత వాఙ్మయచరిత్రకారులకుఁ దెలిసినను దండి యనామయ స్తవముఁగూర్చి తెలిసినట్లులేదు. ఇట్లే మయూర మహాకవి రచిత శివ స్తవముకూడ. ఇది మయూర కవికృతులలో నొకటి యని వేఱొకచోఁ దెలియఁబఱచితిని. దేచమంత్రి సంస్కృతవ్యాఖ్యఁ బ్రక టించిన నందు విశేషములు పెక్కులు తెలియఁగలవు.

౨

తెలుఁగుదేశపుసంస్కృతకవులలోఁ బ్రసిద్ధుఁడగు శాకల్యమల్లుభట్టునకు చతుర్భాషా కవితా పితామహుఁ డను బిరుద మున్న ట్లాతని యవ్యయ సంగ్రహ నిఘంటునుండి తెలియవచ్చుచున్నది. అందు ఏకాక్షర, ద్వ్యక్షర, త్ర్యక్షర, చతురక్షరాధ్యాయములు కలవు. అధ్యాయాంతగద్య యిట్లున్నది.

"ఇతి చతుర్భాషా కవితాపితామహాంక శాకల్యమల్లభట్టవిరచితావ్యయసంగ్రహనిఘంటుః సమాప్తః.

గ్రంథాదిని:

శ్లో॥ ప్రణమ్య శిరసా దేవం భద్రాద్రినిలయం హరిమ్
యథావ్యయాని కతిచి త్సంగృహ్యంతే యథాశ్రితమ్.

అనుశ్లోకమువలన నీతఁడు భద్రాచలనివాసి కాఁదగును.

భాస్కరరామాయణమున యుద్ధకాండశేషమును రచించిన యయ్యలార్యున కీతఁడు పెదతండ్రి. ఉదారరాఘవ మను కావ్యము - ఈతని కృత్యంతరము కలదు. ఈతఁడు ద్వితీయప్రతాపరుద్రుని కాలమునను, హరిహరరాయల కాలమునను వెలసినవాఁడు కాన క్రీ. శ. 1340 ప్రాంతమువాఁడు కాఁదగును. అప్పకవి యీతనిఁ బేర్కొనినాఁడు.

౩

కావ్యప్రకాశమునకు భట్టగోపాలుఁడు రచియించిన సాహిత్యచూడామణివ్యాఖ్యావతారిక యందలి శ్లోకములలో సరస్వతీస్తుతిని శ్రీనాథమహాకవి కాశీఖండమున నిట్లు కూర్చినాఁడు.

శ్లో॥ ప్రణౌమి క్వణదోంకారమణిఘంటావిభూషితామ్
కవిలోకకుటుంబస్య కామధేనుమ్ సరస్వతీమ్.

గీ. కంఠపీఠిక నోంకారఘంట మెఱయఁ, జెలఁగుఁగావుత మన్మనఃక్షేత్రసీమ
కవికుటుంబంబుపాలిటి దివిజసురభి, జలజసంభవుబోఁటి భాషావధూటి.

—(కాశీఖండకృత్యాది)

భట్టగోపాలునిఁ బొల్కూరికి సోమనాథుఁడు పేర్కొన్న కతన నాతఁడు పండ్రెండవ శతాబ్దమునకు బూర్వుఁడు.

౪

తెలుఁగున యాదవరాఘవ పాండవీయము రచించిన నెల్లూరి వీరరాఘవకవి సంస్కృతమున కవియై విశేషణరామాయణ మనుపేర రామాయణమును రచించియున్నాఁడు.

శ్లో. శ్రీమత్కాశ్యప గోత్రపూతమహితాపస్తంబసూత్రస్యచ
శ్రీమన్నెల్లురి రంగమంత్రి సుధియః పౌత్రస్య విద్యానిధేః
శ్రీమత్పూజిత వీణ వేంకటపతేః పుత్రస్య రామాయణం
కావ్యం స్వీకురు వీరరాఘవకవేః శ్రీరామ మే వాఙ్మయమ్.

శ్లో. శ్రీరామాంఘ్రిసరోరుహాంకిత మిదం శ్రీరాఘవాఖ్యావతా
ప్రోక్తం, చారుతరం విశేషణమహారామాయణం వా నవమ్
శ్రీమచ్చాటుకథాశుకావ్యరచనాచాతుర్యవాగ్వైఖరీ
శ్రీవైచిత్ర్యధురంధరేణ కవినాచంద్రార్కతారం వసేత్.

గద్య: ఇతి శ్రీమద్విశేషణరామాయణే వీరరాఘవీయే ఉత్తరకాండ స్సమాప్తః.

వీరరాఘవ కవి, తా నీ విశేషణ రామాయణము రచించినట్లు తన వసుంధరాపరిణయమున నీ విధముగఁ జెప్పియున్నాఁడు.

సీ. సప్తకాండమ్ములు సప్తవిధ క్తులు, హరి కర్థము విశేషణాప్తిఁదనర
రమణ విశేషణ రామాయణంబునాఁ, గృతి రచించితి చమత్కృతి రహింప
కృష్ణభుజంగంబు కృష్ణలీలామృతం, బుఁద్రిపురాదండకమును రచించి
యలర స్తంభోద్భవం బాదిగాఁ దత్కథ, గద్యకావ్యంబుగా ఘటనఁజేసి

గీ. ఎంచ రసమంజరిని తెనిగించి నీతి, సర్వలోకేశశతకంబు సంఘటించి
మంత్రిపాద స్తవంబును మఱియుఁ గృతులు, ఘటనఁ జేసితి వీరరాఘవకవీంద్ర.

ఈతని తాత రంగమంత్రి, వేంకటపతిరాయలచే సమ్మానితుఁడు. తండ్రి వేంకటపతి "అబ్దుల్ హసన్" అను నవాబుచే సమ్మానింపఁబడెను. కామకళానిధి రచించిన నెల్లూరి శివరామకవి యీతని పుత్రుఁడు. పైని పేర్కొనబడిన వానిలో సంస్కృత కృష్ణభుజంగస్తోత్రము వసుంధరాపరిణయమునఁ గలదు. విశేషణరామాయణమునం దేడుకాండలు కలవు. గ్రంథ మముద్రితము. తెలుఁగు గ్రంథములు రెండును నెల్లూరిలో నముద్రితగ్రంథచింతామణి యందు ముద్రణము నందినవి. ఈతని కాలము క్రీ. శ. 1700 ప్రాంతము.

ప్రాచీనాంధ్రకవులలో క్షేమేంద్రుఁ డను కవిని మన మెఱుఁగుదుము. భట్టభాణుఁ డను కవికూడ కల డని యీ క్రింది యాంధ్రకవి స్తుతివలనఁ దెలియుచున్నది.

చ. వినుతు లొనర్తు నాంధ్రసుకవిప్రభు నన్నయభట్టుఁ దిక్కయ
జ్వను శివదేవు భాస్కరుని జక్కన నాచనసోము సర్వదే
వుని భవదూరు వేము నలపోతన బిల్లలమఱ్ఱివీరభ
ద్రుని శరభాంకు వీరకవి ధూర్జటిఁ గేతన భట్టబాణునిన్.

—ఎడపాటి యెఱ్ఱన మల్హణచరిత్ర (1-9)

మల్హణచరిత్రమున నీ పద్యమునకు ముందు సంస్కృతకవిస్తుతి యుండుటచే నాంధ్రకవిస్తుతి యందలి భట్టబాణుఁడు తెలుఁగుకవి కాఁదగును.

భాస్కర రామాయణమున నయోధ్యాకాండము రచియించిన మారయ కుమారుఁడు కుమార రుద్రదేవునికి సారస్వతభట్టబాణుఁ డను బిరుద మున్నట్లాతని గద్యవలనఁ దెలియుచున్నది.
"సకల కళావిశారద శారదాముఖ ముకురాయమాణ సారస్వత భట్టబాణ, నిశ్శంక వీరమారయ కుమార, కుమారరుద్రదేవప్రణీతంబైన...యయోధ్యాకాండము...."

పైని కవిస్తుతియందలి భట్టబాణుఁడు కుమారరుద్రదేవుఁడై యుండు నని తలంచుచున్నాఁడను.
సంస్కృతమున ఉషాపరిణయ మను నాటకము రుద్రదేవునిది కలదు. అది పరిశీలించిన నీ కవిఁ గూర్చి కొన్ని విషయములు తెలియఁదగు ననుకొందును.

౬

'సకలనీతిసమ్మతము'న 'ముద్రామాత్యము'లోని దని యుదాహరింపఁబడిన యీ క్రింది పద్యము:

చ. మునుకొని దేశకాలబలముం దగ దైవబలంబు గల్గఁగా
మొనసి విశేషమూలబలము న్నిజబాహుబలమ్ము నచ్చి పైఁ
జని రిపులం జయింతు రని శత్రుల కిన్నియుఁ గల్గియున్నచోఁ
జెనయక దానమానములఁజేసి జయింతురు నీతికోవిదుల్.  (పుట 89. 785 పద్యము)

నన్నెచోడుని కుమారసంభవము దశమాశ్వాసము 553 పద్యముగా నున్నది. నాల్గవపాదమున 'జెనయక సామదానములఁజేసి జయింతురు నీతివిత్తముల్' అను పాఠము కానవచ్చుచున్నది.

౭

కస్తురి భద్రిరాజు కొట్టియ శంకరేశునిఁగూర్చి చెప్పిన దీ క్రిందిపద్య మొకటి కాననగుచున్నది.

ఉ. వేర్చిన భక్తిసొమ్ముల నపేతకళంకుఁడు కాటకోటఁ డ
భ్యర్చనసేయ వాని కెడబాపితి నన్న......కండనా

నేర్చిన మేలు గీడరయనేరని వేల్పుల నెల్లఁ బట్టిప
ల్లార్చు నెవాఁడు దుర్భవగజాంకుశ! కొట్టియ శంకరేశ్వరా!

కొట్టియ (కొల్యుదొాన, కొాణిదెన) శంకరేశ్వరలింగము ప్రఖ్యాతమైనది. ప్రాచీనాంధ్రవాఙ్మయమున నచ్చటచ్చట పేర్కొనఁబడినది. త్రిపురాంతకోదాహరణటీకలో (1912) కస్తూరి భట్టురాజు కొట్టియ శంకరేశ్వరునిపద్య మొకటి యుదాహరింపఁబడినది. ఆ పద్యము నిదియును గూడ నాతఁడు రచియించిన శంకరేశ్వరశతకమునందలివై యుండవచ్చును. ఈ కవి గౌరీకల్యాణము నుండి యొకపద్యము కుమారసంభవటిప్పణిలో నుదాహృతమైనది. భట్టురాజు పేరు భద్రిరాజు కాఁదగును. ఇరువురును నొక్కరే.

ఱ

హరవిలాసము సప్తమాశ్వాసమునఁ గిరాతార్జునకథయందు సార్వవిభక్తికస్తవము కలదు. కాని యందు సప్తమీ విభక్తి లేదు. పూర్వాపూర్వతర ముద్రణముల లేకుండుటచే దీని నిట్లే శ్రీనాథ మహాకవి వ్రాసియుండవచ్చును. ఇది 'విద్దళి' అను నుదాహరణగ్రంథభేద మని యెన్నవగును. అప్పకవీయమున దీని లక్షణ మిట్లున్నది:

సీ. సంబుద్ధి యెడలించి సప్తవిభక్తులు పలికిన భక్తి 'సద్దళి'యనంగ
సంబుద్ధితోఁగూడ సప్తవిభక్తులు పలుక నొప్పారు 'బద్దళి'యనంగ
సంబుద్ధితోడ విషమ విభక్తులతోడఁ బలికిన కృతియు 'విద్దళి'యనంగ
గళిక లుత్కళికలు గమకింపఁ బలికిన కావ్యంబు నుత్ఫుల్లకంబు ననఁగ
గీ. నవనిఁ జాటుప్రబంధంబులందు మిగుల, నాటుకొని యొప్పుచుండు నీ నాల్గు దెగలుఁ
గానఁబడు నుదాహరణముల్ గానలోల, కామెపల్లీశ వల్లవీకామ కృష్ణ. (4-310)

పైని నాలుగు తెగలలో హరవిలాసమున సంబుద్ధితోఁగూడ విషమ విభక్తు లుండుటచే నిది విద్దళి యన నొప్పును.

# నాటకము : నాట్యము

శ్రీ జమ్మలమడక మాధవ రామశర్మ
(ఉపాధ్యాయుడు : సంస్కృత కళాశాల, తెనాలి.)

నాటకపదానికి సంస్కృతభాషలో పరిమితమైన అర్థము వ్యవస్థ చేయబడుతున్నది. అయిదు అంకాలకు అధికంగా పది అంకాలకు మించకుండావుండి ప్రసిద్ధకథ, ప్రసిద్ధనాయకుడూ ఉంటే-వీరశృంగారములు ముఖ్యముగా ఉంటే (-) ఇతరరసాలుకూడా ముఖ్యము లయితే కావచ్చు-నాటకమవుతుంది అని ఆలంకారికుల నిశ్చయము. నాటకపదము రూపకభేదాల నన్నిటినీ చెప్పుతుందని వా రంగీకరించినట్లు కనబడదు. అయినా కొందరు కవులు, అల్పసంఖ్యాకులు, సర్వరూపకములను ఇది తెలియచేస్తుందని భావించినట్లు తలచటానికి అవకాశము కనబడుతున్నది. నాటకము సర్వరూపకప్రకృతి. అది ప్రధానంగా అన్నిటినీ గ్రహించాలి. ఈ ఉద్దేశంతోనే వా రా విధంగా వ్యవహరించి ఉంటారు. ఆంధ్రులు మొదట నాటకాలను మాత్రమే తెలుసుకోవటము మూలాన తరువాత ఇతరరూపకాలను గుర్తించినప్పటికీ, నాటకపదవ్యవహారమునే ముఖ్యంగా స్వీకరించారు. అన్నిటినీ నాటకమనే వ్యవహరించారు, వ్యవహరించుతున్నారు. ఇకముందు ఔచిత్యానుసారంగా వ్యవహరించటము బాగుంటుంది. ఇప్పటికి నాటక మంటే సర్వవిధరూపకాలూ, నిఖిలోపరూపకాలూ అనే అర్థమునే గ్రహించవలసియున్నది. కాబట్టి వాటి నన్నిటినీ గ్రహించాలి.

## రసాశ్రయ రూపకములు

నాటకము రూపకాలలో ఒకటి. రూపకములు పదరకాలుగా ఉన్నవి. రసనాయక వస్తువులనుబట్టి ఆ భేదము సిద్ధమయింది. ఆ రూపకముల పేరుకూడా ఆ అర్థమును విశదము చేస్తున్నది. మొత్తానికి ఈ రూపకాలన్నీ రసమును ఆధారముగా చేసుకొని బయలుదేరినవి శృంగారాది నవరసాలకూ ఈ రూపకాలలో ఆ యా ఔచిత్యానుసారముగా సన్నివేశ ముంటుంది.

ఒక రసము ప్రధానమైతే ఇతరరసాలు అంగము లవుతూ ఉంటవి. రసనిబంధనమే రూపకాలలో ముఖ్యము. రసాంగములలోని ఏ సన్నివేశమయినా నిరూపించదలచిన, ప్రధానరసమును పోషించేదిగానే ఉండాలి. కాకపోతే అది బొప్పి, అది కణితి.

## భావాశ్రయోప రూపకములు

భావనిబంధనమును ప్రధానముగా చేసికొని బయలుదేరిన రూపకాలకు ఉపరూపకము లని పేరు. భావములు అనంతముగా ఉన్నవి. అయినా వాటికి ముప్పదిమూడని సంఖ్యావ్యవస్థ చేసారు. ఇటువంటి భావనిబంధనలోపరూపకాలు అష్టాదశవిధాలుగా ఉన్నవని కొందరు, ముప్పయి విధాలనీ

కొందరూ చెప్పుతున్నారు. ఇంకా అధికభేదాలనుగూడా పరిగణించవచ్చునేమో అనిపించుతుంది. ఈ ఉపరూపకాలలో ఔచిత్యానుసారముగా భావాల సమావేశము ఉంటుంది. ఒక ప్రధాన భావానికి అంగభూతములుగా ఇతరభావాలు నిరూపించబడాలి. అంతరంగంలో ఉత్పన్నమయిన స్పందానికి భావము అని పేరు. అది బాగా ప్రరూఢము అయితే రస మవుతుంది. అట్లా కానప్పుడు భావ మనే పేరు. ఉపరూపకాలకు భావాశ్రయణము ముఖ్యము. భావప్రతిపాదనముఖంగా ఉపరూపకాల వ్యవస్థితి లేనప్పుడు రూపకధర్మములే నశించిపోతవి. అటువంటి రూపకాలకు ఏవిధమయిన ప్రయోజనము ఉండదు. కళాసృష్టికూడా శూన్య మవుతుంది. కాగా నాటకపదమువల్ల రూపకోపరూపకాలను గ్రహించాలని తాత్పర్యము.

## నా ట్య ము — ప రి ష్కా ర ము

నాట్యము అనే పదముయొక్క అర్థనిర్వచనములో మతభేదము లున్నవి. అభినవగుప్తుడు అనేక వాదములను తన అభినవభారతిలో వ్రాసినాడు. తుదకు సిద్ధాంతమును స్పష్టపరచినాడు. రస నాట్యములు భిన్నములు కావు. "రస ఏవ నాట్యం" అని అభినవసిద్ధాంతము. దీనిని తరువాత నిరూపించుతాము.

౧

నాట్యము అనేది గ్రంథపరము. నటవృత్తమును శాసించి చెప్పే గ్రంథానికి శాసనోపాయముగా ఉండేదానికి నాట్యమని పేరు. ఇది ఒకమతము. దీనిలో నాట్యముకంటె నటునకే ప్రాధాన్యం ఉన్నట్లు స్పష్టమవుతుంది. నటుడు అనేవాడు సిద్ధప్రాయుడై ఉంటే ఆతనిలో కూడుకొన్న వర్తనమును నిరూపించేది నాట్య మవుతుందన్నమాట. ఈ నిర్వచనము ఇప్పటి నటులవిషయములో చెల్లదు. అసలు నటు డంటే మహానటుడైన పరశివుడే నటుడు. ఆతడు చేసిన దంతా నాట్యమే. దాన్ని నిరూపించే గ్రంథము నాట్య మన్నమాట. ఇప్పు డున్న నటులు పరశివులు కారు. అందువల్ల ఈ నిర్వచనం కుదరదు,

> జగ్రాహ పాఠ్యం ఋగ్వేదాత్ సామభ్యో గీత మేవ చ
> యజుర్వేదా దభినయాన్ రసా నాథర్వణా దపి.

అనే వచనములు నాట్యమును గ్రంథపరంగా సమన్వయించితే కుదరవు. ఈ విషయంలో ఇంకా అనుపపత్తులు చాలా ఉన్నవి. కాబట్టి ఈ పక్షం మంచిది కాదు.

౨

నాట్యము వేదమే. నాట్య విషయాలన్నీ వేదాలనుంచి గ్రహింపబడుతున్నందువలన నాట్యమును వేదము అనే అనాలి అని వేరొక వాదము. ఈ విషయంలో దీనిని విమర్శించాలి. వేద మంటే శబ్దాత్మకము. ఈ శబ్దాత్మతావ్యతిరేకముగా వేదానికి ప్రవచన మనేది లేదు. నాట్యము

అంతేనా? నాట్యము శబ్దాత్మికము కాదే. వేదము ఇతరములను వేదనము చేస్తున్నందువలన వేదమయినట్లు నాట్యవిషయముల వేదనమును నాట్యము సంపాదించుతున్నందువలన వేదత్వము చెప్పట ఏదో కుదురుతుంది. కాని చాదస్తంగా ఉంటుంది.

౩

దశవిధరూపకాలు నటనీయములు. అవి అన్నీకూడా లోకవృత్తానుకారములుగా ఉంటవి. కాబట్టి నాట్యమంటే దశరూపకమే. అందువలన నాట్యమనేది దశరూపకస్వరూపనిరూపణమును చేసేది అవుతుందని గ్రహించాలి. ఈ పక్షంలో రసాలుకూడా నాట్యమే అని ఒక వాదము. విపులార్థముకలిగిన నాట్యమును దశవిధరూపకపరంగానే అర్థము చేయటము సంకుచితదృష్టి. రూపకాలకంటె అన్యములయినవి అన్నీకూడా నాట్యపదంచేత గ్రహింపబడాలి. అప్పుడే నాట్యపదం సుందరమవుతుంది.

౪

భట్టనాయకుడు ప్రముఖనాట్యవిదుడు. ఆతడు ఈవిధముగా తలుస్తాడు. నిస్సారపదార్థాలకంటే సారవత్పదార్థాలకు భేదమును గ్రహించి ప్రవర్తించినప్పుడే మానవప్రవృత్తి బాగుపడుతుంది. నిస్సారభేదాగ్రహమును సంపాదించేది నాట్యము. దీని సారమంతా కల్పనామాత్రమే. ఇది అంతా అవిద్యావిరచితము కాబట్టి, ఒకరూపం అనేది ఇందులో వ్యవస్థితమై ఉండదు. నాట్యము ఒకక్షణంలోనే కల్పనాశతసహస్రమును సహించుతుంది. అనంతకల్పనలున్నా ఇది స్వప్నము కాదు. చక్కగా సహృదయులు తమ హృదయాలతో దీన్ని గ్రహించవచ్చు. ఈ నాట్యము స్వరూపాలంబనమును ఏమీ విడిచిపెట్టదు. నటోపరచితమైన రామరావణాది చేష్టితమంతా ఏదో అభూతాద్భుతవిధంగా భాసించుతుంది. ఇది యిట్లాభాసనామాత్రసారమయినా పుమర్థోపయోగి అవుతుంది. స్వరూపాలంబనమును విడిచిపెట్టుకోకుండా బ్రహ్మకల్పుడైన నటుడు నటనీయముగా చేసిన విశ్వవిశ్వమంతా పరమపుమర్థప్రాపకమవుతుంది. ఇదే నాట్యము. లోకోత్తర పరమ పురుషార్థమును సూచించే ఇది శాంతరసాన్ని ముఖ్యంగా ఉపక్షేపించుతుంది. తక్కిన రసాలన్నీ ఈ శాంతమునే అనుసరించి బయలుదేరుతవి. కాబట్టి నాట్యము పారమార్థిక ప్రయోజనమును సంపాదించేది అవుతుందని సారాంశము అని ఈ నిర్వచనం వేదాంత సోపానాలను ఎక్కించుతున్నది. ఇది సత్యమే కాని ప్రథమభూమికలలో కొంత స్వరూపవివేచనము చేసుకోకపోతే ఏమీ గ్రాహ్యము కాదు.

నమస్త్రైలోక్యనిర్మాణకవయే శంభవే యతః
ప్రతిక్షణం జగన్నాట్యప్రయోగరసికో జనః.

అని భట్టనాయకుడు అంటుంటే మొదటి పాదులు తెలియని మనము నాట్యానికి ఒక నమస్కారము పెట్టవలసి వస్తుంది. నటోపరచితము నాట్యము అని భట్టనాయకుడు అన్నాడంటే, అత్యక్త

స్వాలంబనబ్రిహ్మకల్పు డయితేనే నటుడు అని కూడ ఆయన అన్నమాటను గుర్తుపెట్టుకోవాలి. ఇందులో ఇంకా స్పందతత్త్వానికి సంబంధించిన తత్త్వము చాలాఉంది. మహా నాట్యమును స్వరూప గతము చేసికొనే వా డయితేనే నటు డట. మనమో!

౨

నాట్య మనేది లౌకికపదార్థాలకంటే వ్యతిరిక్తము. ఇతరవిధానాలు అన్నిటికంటెకూడా ఇది విలక్షణము. నాట్యాన్ని సరిగా గ్రహించిన వానికి సమ్యగ్ జ్ఞానము కలుగుతుంది. స్వరూప సంవేదన యోగ్యమయిన రసస్వభావమే నాట్యము. నాట్య మనేది లోకోత్తర రసప్రమాణకము. దీనిలో హృదయసంవాదము కలుగుతుంది. చిత్తవృత్తి నిమగ్నాకార మవుతుంది. ప్రీతిసహృదయునకూ ప్రత్యక్షసాక్షాత్కారకల్పమైన ధీవృత్తి ఉదయించుతుంది. పురాణశ్రవణాదులలో ఉన్నట్లుగా నాట్యంలో "నా కిక్కడ పారమార్థిక ప్రయోజనము కలుగుతుంది'' అనే అభిసంధిసంస్కార ముండదు. ఒక్క అపూర్వమైన అభిసంధిసంస్కారము మట్టుకు నాట్యంలో కలుగుతుంది. ఈసంస్కారము ఏమాత్రమూ పర్యంతవిరసముకాదు. సర్వపరిషత్సారమైన ప్రమోదసారము దీనిలో ఉంటుంది. ఈ సంస్కారమువలన ''లోకోత్తరదర్శన శ్రవణయోగి''ని అవుతానని సహృదయుడు భావించగల్గుతాడు. ఆ యా విధానాలకు తగిన ఆతోద్యవిధానాలు ఉంటవికాబట్టి వాని చర్వణ వలన సకలసాంసారికభావాలను విస్మరించుతాము.

హృదయము విమలముకురకల్ప మవుతుంది. నానావిధాభినయావలోకనము వల్ల ప్రమోద లోకాది తన్మయీభావము బాగా ఉద్భిన్న మవుతుంది. వాద్యాకర్ణనము పాత్రాంతర ప్రవేశమువలన ఒక చిత్రవిచిత్రమైన మహాధ్యవసాయము కలుగుతుంది. ఇది దేశకాలవిశేషావిశేషము లకు ఏమాత్రమూ సంబంధించదు. సమ్యగ్జ్ఞానము మిథ్యాజ్ఞానము సంశయజ్ఞానము సాదృశ్య జ్ఞానము మొదలయిన జ్ఞానములు ఏవీ కూడా ఇక్కడ పనిచేయవు. ఇటువంటి సంస్కారము అను వృత్త మవుతూఉంటే దానికి తోడు హృద్యమైన వస్తువు, రూపము, గీతము, ఆతోద్యము మొద లయినవానివలన మహానుభూతి మేళనము పొందుతుంది. నాగా అనిర్వచనీయ రామాద్యధ్యవ సాయము ఉత్పన్న మవుతుంది. అప్పుడు సహృదయుడు రామాదిచరితములో స్వాత్మసమా వేశము పొందుతాడు. తన ఆత్మద్వారాగానే విశ్వము నంతా చూస్తాడు. ఇక్కడ దేశకాలవిశే షణపరామర్శ ఏమీ ఉండదు. ఇది వీరిది, ఇది వారిది అనికూడా భావించడు. అంతా సంవిజ్ఞా తీయముగానే చూస్తాడు. ప్రాణప్రియాప్రతిమమైన రసాస్వాదమును అనుభవించుతాడు. సహచర రమ్యగీతాతోద్యాది సంస్కారరసానుభవవశమువలన హృదయాభ్యంతరనిఖాతమైన స్వాత్మసంవేద నాత్మక మగు స్వరూపసాక్షాత్కారమును పొందుతాడు. ఇట్టి అనుభూతిని సంపాదించేది నాట్య మవుతుంది.

"సుఖదుఃఖాద్యాకార తత్తచ్చిత్తవృత్తి రూషిత నిజసంవిదానందప్రకాశమయః; అతఏవ విచిత్రః; రసనా - ఆస్వాదన - చమత్కార - చర్వణా - నిర్వేశ - భోగాద్యపరపర్యాయః తత్రి యదవభాసతే వస్తు తన్నాట్యం. (అభినవభారతి 38 పేజి)అని అభినవగుప్తుని సిద్ధాంత నిర్వచనము.

ఈ నిర్వచనములో ఆతోద్యాదులకు అపార్థకల్పన మేమీ లేదు. హృద్యగీతాదులన్నీ కూడా దీనిలో అనుస్యూతము లవుతవి. సామాన్యమైన స్వరూపప్రచ్ఛాదనం కలిగినా అభినయచతుష్టయమువలన హృదయానుప్రవేశయోగ్యత కలుగుతుంది. నటుని విజ్ఞానసంస్కారము దీనిలో సాచివ్యము పొందుతుంది. సామాజికుడు రంజకసామగ్రీమధ్యానుప్రవిష్టు డవుతాడు. నటజ్ఞానసంస్కారము సహాయంగా ఉంటుంది. కాబట్టి హృదయసంవాదము తన్మయీభవనములను కూడా సహకారులనుగా చేసికొని సహృదయుడు అనువ్యవసాయమును పొందుతాడు.

"తస్మా దనువ్యవసాయాత్మకం కీర్తనం రూషితకల్పసంవేదనం నాట్యం."

అంతేకాని నాట్యము అంటే కేవలమూ రామాదుల అవస్థానుకరణముమాత్రము కాదు. మామూలుగా లోకప్రసిద్ధము లయిన సాధనములతో అనుకరణముచేయడములో రామాద్యవస్థలను అనుసరించడమూ ఉంటున్నట్లు కనబడుతున్నది. కాబట్టి నాట్యము అనుకరణాత్మక మంటున్నారు. అట్లు గౌణంగా అనుకరణ మంటే దోషము లేదు. వాస్తవంగా అనుకరణంకంటే భేదము ఉన్నదని అంగీకరించితే శబ్దమాత్రప్రవృత్తి వివాదాస్పదంకాదు.

నాతాప్రస్తుత లేఖనేన ఆత్మనః దర్శనాంతరకథాపరిచయప్రకటనఫలేన ప్రకృతవస్తు(నాట్య)ని రూపణవిఘ్న మాచరంతః సహృదయాన్ ఖేదయామః.

అయినా ఈ విషయానికి సంబంధించిన ఈ మాట చెప్పవలసియున్నది. నటునిలో కూడుకొనిన అభినయపరిభావమువల్ల నిశ్చలమైన ఏకమానసంతో తెలియదగిన అపూర్వసంవేదనము నాట్యమవుతున్నది. ఇది సాక్షాత్కారాయమాణైకఘనము. ఈ ఏకచిత్తవృత్తికూడా నాట్యములో నిరూపింపబడుతూఉండే గేయపదము లాస్యాంగము ఆహార్యము గీతము వాద్యము మొదలయిన వాని యొక్క ప్రయోగమాలాభ్యాసవిశేషముల ఆశ్రయమునుంచి క్రమంగా తొలగిపోతుంది. స్వాత్మరూపంగా సామాజికసమావేశము పొందుతుంది. ఇది ఇతరచిత్తవృత్తులకంటే అత్యంతమూ విలక్షణము. చర్వణాసమయములో వేరొక భావాన్ని ఉత్పన్నం కానివ్వదు. అందువలన:

నిర్విఘ్నస్వసంవేద నాత్మకవిశ్రాంతి లక్షణేన రసనాపర
పర్యాయేణ వ్యాపారేణ గృహ్యమాణత్వాత్ రసశబ్దేనాభిధీయతే. 269

రసమే నాట్యము. రసనాట్యములు భిన్నములు కావు. నాట్యమువలననే అసంవ్యక్తి కలుగుతుంది. నహిరసాదృతే కశ్చనార్థః అని భరతుడు బజాయించి చెప్పుతున్నాడు. మొదట చెప్పినట్లుగా

అవస్థానుకృతి నాట్య మవుతుంది. ఇది సామాన్యలక్షణము. "రామాదితాదాత్మ్యాపత్తిర్నటే యా నాట్య ముచ్యతే" అని శారదాతనయుడు వ్రాస్తున్నాడు. నాట్యానికే రూపక మని ప్రేక్షణీయక మని కూడా పేరు. నాటకాది దశకము రసాశ్రయము.

## నాట్యపదవ్యుత్పత్తి

నటుని ధర్మము నాట్యము. నాట్యము కలవాడు నటుడు. ఈ విధముగా చెప్పుకుంటే నటనాట్య పదాల అర్థము తేలదు. తేలకనూ పోదు. నటుడు అంటే మహానటుడైన పరశివుడే నటుడు అని మొదట అంగీకరించాలి. ఆతడు శక్తిచక్రమును అనుసరించి ఉన్మేషనిమేషములతో తనయందున్న జగత్తుకు సృష్టివినాశములను సంపాదించు తున్నాడు. ప్రకాశ విమర్శాత్మకమైన ఆతని కరణేశ్వరీ విలాసమంతా, ఆతని, ఆ మహానటుని, ఆ పరశివుని ధర్మమేకాబట్టి నాట్యమే అవుతుంది. ఇప్పుడీ విధంగా నాట్యపదానికి అర్థము తేలినట్లే. ఈ ప్రపంచంలో జీవభావంతో ఉన్న ఎవరూ కూడా సిద్ధనటులు కారు. వీరందరు సిద్ధభావాస్పదమైన సిద్ధనాట్యాన్ని అనుసరించు తున్నందు వలననే నటు లవుతారు. కాబట్టి ఇప్పటి నటుడికి నాట్యాన్ని అనుసరించితేనే స్వరూపలాభం వున్నది. వ్యాకరణాన్ని బట్టి 'నటస్వభావః నాట్యం' అంటే అనవచ్చు. కాని పై అర్థాన్ని గుర్తు పెట్టుకోవాలి. కాకపోతే స్వరూపహాని కలుగుతుంది. 'నట - అవస్పందనే' అని ధాతువు. కించిచ్చలనము అని తదర్థము. కించిచ్చలన మనేది స్తంభప్రళయ రోమాంచాది సాత్త్వికభావాలలో ఉంటుంది. నటధాతువునుంచి నాట్యపదము వ్యుత్పన్న మవుతున్నది. సాత్త్వికభావ బాహుళ్యము ఉంటే నాట్యమన్న మాట. స్పందశక్తి ఉంటే నాట్య మని పరమార్థము.

## సాత్త్వికములు

సాత్త్వికభావాలు చక్కగా రసభావములను సూచించుతవి. అంతర్గత స్వరూప రసభావములను సూచించడానికి స్పందస్వభావము కలిగిన సాత్త్వికములే సమర్థము లవుతవి. రసభావముద్రలు బాహ్యశరీరంలో ఏమీ గోచరములు కావు. సూక్ష్మశరీరంలో అవి అవభాసము పొందుతూ ఉంటవి. సాత్త్వికాలకు సూక్ష్మశరీరంతోటే సంబంధం ఉన్నది. పరగతసుఖదుఃఖాలను భావించినప్పుడు అంతఃకరణము భావితమైతే సత్త్వ మనబడుతుంది. ఆ సత్త్వమువల్ల ఉత్పన్నము లవుతూఉంటే సాత్త్వికములు అని పేరు. మనోభూమిలోఉన్న పంచభూతాలకూ రసభావకృతంగా స్పందం కలిగితే దానిలోని తరతమభావాన్నిబట్టి స్తంభాదిసాత్త్వికాలు ఉత్పన్నము లవుతున్నవి. ఈ విషయము మా రసభారతిలో విస్తృతంగా ఉన్నది. సాత్త్వికాలు రసానికి సన్నిధానంలో ఉంటవి. రసాలను అభివ్యంజనం చేయాలంటే సాత్త్వికాలే ఉండాలి కాబట్టి సాత్త్వికముఖంగా నాట్యము కలుగుతుంది అని అంగీకరించాలి. నాట్యము అంటే రస మని నిరుక్తార్థమే.

## నాట్య భేదములు

మహానాట్యము ఏకవిధమే. మహారసము ఒక్కటే అయినా వ్యావహారికతాసిద్ధికి అవాంతరంగా భేదము అంగీకరించాలి. రసమును ఆధారంగా చేసుకొని రూపకాలు ఉత్పన్నము లవుతున్నవి. రసభేదమును బట్టి రూపకములలో భేదము సిద్ధము అవుతున్నది. అవాంతరదృష్టి ననుసరించి నాట్యములో భేదమును అంగీకరించాలి. అందువల్ల నాట్యము అనేకరూపములను పొందుతుంది. రసాత్మకమైన నాట్యము వాక్యార్థాభినయాత్మకముగా ఉంటుంది. అనేక పదార్థాలు కలిసి ఒక వాక్యార్థ మవుతున్నది. భావా లన్నీ కూడా పదార్థాత్మకములు కాబట్టి పదార్థస్థానములో ఉండదగిన రసముయొక్క అభినయము నాట్యము అని గ్రహించాలి. కాగా నాట్యములో ఏ అవాంతర విభాగాలు ఉన్నవో అవి అన్నీ పదార్థాత్మకము లని, నాట్యము వాక్యార్థాత్మకము అని పరమార్థము. ఈ భావమును:—

యద్యద్రసాత్మకం తత్త ద్వాక్యార్థాభినయాత్మకం
యద్యద్భావాశ్రియం తత్తత్పదార్థాభినయాత్మకం.

అని భావప్రకాశములో శారదాతనయుడు అంటున్నాడు.

## నృత్యము — నృత్తము

రసమును విభాగదృష్టితో గ్రహించితే శృంగారవీరాదిభేదములు గోచరము లవుతవి. వాటిని కూడా అవాంతరంగా విభాగించుకొంటే భావములు భాసించుతవి. ఆ విధముగానే నాట్యమును విభాగదృష్టితో గ్రహించితే కొన్ని భేదాలు సిద్ధము లవుతవి. వానిని కూడా అవాంతరంగా విభాగించుకొంటే నృత్యము నృత్తము సిద్ధము లవుతవి. నాట్యములో స్వగతభేదాలు చాలా ఉన్నట్లు నృత్యములోనూ నృత్తములోనూ చాలాభేదాలు వస్తవి. వాటిప్రస్తారమును వేరొకచోట చూడాలి. 'నృత్-గాత్రవిక్షేపే' అను ధాతువును అనుసరించి నృత్యశబ్దము వ్యుత్పన్న మవుతున్నది. గాత్రవిక్షేపంఅంటే అంగచాలనము అని అర్థంకాగా, ఆంగికాభినయ బాహుల్యము ఉంటే నృత్యము అన్నమాట. ఆంగికాభినయములు అంటే అంగప్రత్యంగములకు సంబంధించిన అభినయాలేకాక ఇవి ఉపలక్షణంగా నానావిధభేదప్రభేదాలతో ఉన్న కరణాంగహారాదులనుకూడా స్వీకరించాలి. కాగా ఇటువంటి ఆంగికములయిన అభినయములు బహుళంగా ఉన్నప్పుడే నృత్య మనే వ్యవహారము ఉచితమవుతుంది. మొత్తానికి ఆంగికములన్నీ బాహిరాభినయాలు. ఇవి అనుకృతిని మాత్రము సంపాదించుతవి. కాని హార్దవికాసమును ఈయజాలవు. సాత్త్వికములు అట్లాకాదు. సాత్త్వికములు హృదయవికాస సంపాదకములు. ఆంగికాభినయములను ప్రదర్శించటానికి పూర్వము అత్యావసరంగా రూపభావన చేయవలసి ఉంటుంది. తద్రూపగతము లయిన అంగప్రత్యంగములచాలనమును భావించవలసియున్నది. అందువలననే ఆంగికములు బహిరంగములు అవుతున్నవి. ఇంకా ఇవి రసాంగములయిన భావాలనే సూచించుతవి కాని రసాలను సూచించలేవు. సాత్త్వికములలో ప్రత్యే

కముగా రూపభావన యక్కరలేదు. స్వాత్మసమావేశము పొందిన రసమే అక్కడ సాత్త్వికభావాలను నిర్వర్తింప చేస్తున్నది. ఆంగికములయిన అభినయాలకు భావసంబంధము ఉన్నది. విభావానుభావవ్యభిచారిభావాలను భావపదంతో గ్రహించాలి. భావాలన్నీ చిత్తవృత్త్యాత్మకములే అయినా అవి స్థూలశరీరానుగతము లవుతవి. ఈ విధముగా స్థూలశరీరానుబింబనము పొందిఉండే భావాలను ఆంగికములు విశదము చేస్తున్నవి. అందువలన నృత్యము భావాశ్రయ మవుతున్నది. నాట్యమును అనుసరించే వారికి నటులు అనేపేరు ప్రసిద్ధ మయినట్లు నృత్తమును అనుసరించే వారికి నర్తకులు అని పేరు. నృత్తము తాళలయలను అనుసరించి ఉంటుంది. దీనిలో వాక్యార్థాభినయము కాని, పదార్థాభినయముకాని ఉండదు. గీతవాద్యాలకు సంబంధించిన తాళలయగతులే దీనిలో ప్రధానముగా ఉంటవి. శారదాతనయుడు నృత్తము రసాశ్రయ మని అంటున్నాడు. అది ఆతని మతము. అందువలన :

> నృత్యం భావాశ్రయం నృత్తం రసాశ్రయ ముదాహృతమ్
>
> నృత్యనృత్తవిభాగశ్చ బహుభి ర్బహుమోదితః.

అని భావప్రకాశంలో అంటున్నాడు. భావాశ్రయ మయిన నృత్యమును తాళలయాశ్రయమయిన నృత్తమును అనుసరించి పుట్టిన రూపకాలకు ఉపరూపకము లనిపేరు. ఇవి నానాభేదాలుగా ఉన్నవి. అనేకులు అనేకధా పరిగణించినారు. నృత్తములో తాళలయానుశ్రుతి ఉంటుంది; కాబట్టి ధ్వని ప్రాధాన్యతను ఊహించాలి. అందువలననే ఇతరవాద్యముల ఆవశ్యకత ఉన్నది. నాట్యనృత్యాదులలో వాద్యావశ్యకత్వము లేకపోలేదు. అయినా నృత్తములో వానికి అత్యంతావశ్యకత్వము ఉన్నదని ఊహించాలి. కాబట్టి నృత్తము అత్యంతమూ బహిరంగ మన్నమాట. తాళలయలను బట్టి చారి మహాచారి మండలాదులు, నృత్తములో అవకాశము పొందుతున్నవి. తాళాదులు అనంతసంఖ్యముగా ఉన్నవి. అందువలననే తదనుసారి నృత్తముకూడా అనంతభేదాలను పొందుతున్నది. ఇవన్నీకూడా నాటకాదులకు బహుధా ఉపకరించుతవి.

> తద్ద్వయం నాటకాదీనాం భూయసా హ్యుపకారకం
>
> నృత్తం గీతంచ వాద్యంచ నాటకాభ్యుపకారకం.

అని శారదాతనయుడు స్పష్టము చేస్తున్నాడు. ఇది వీని విషయము.

## నా ట క ము

నాటకములు ఈ చెప్పిన నాట్య నృత్యనృత్తాలకు సంబంధించిఉండాలి. నాటకము అనే పదమువలననే వీని సంబంధము గోచర మవుతున్నది. అంతేగాని నాటకము అంటే కేవలమూ నాటకము కాదు. ఈ విధముగా చెప్పక నాటకశబ్దానికి సంకోచరూపమయిన అర్థాన్ని చెప్పుట సముచితము కాదు. సామాన్యంగా కొంద రనుకుంటారు-రంగస్థలానికి ఎగబ్రాకినది-అయితేనే నాటకమని. అది పొరపాటు. ఇప్పటికి ఏదోవిధముగా రంగ మెక్కేవి చాలా ఉన్నవి. అవి అన్నీ నాటకాలని అన

లేము. రంగ మెక్కనివి ఎన్నో ఉన్నవి. అవి నాటకాలు కాకనూపోవు. నాటకస్వరూపానుసారంగా ఇది నాటకమవునా, కాదా అని నిరూపించుకొని నిశ్చయించుకోవాలి. కాని ఏదోదృష్టితో రంగానికి లాగికొనివచ్చినవాటిని నాటకము అని అనటము భావ్యముకాదు. నాటకాలు అనబడేవానిని నటులు అవి అనుకొనేవాళ్ళు తమ తాహతుకు అనుగుణంగా తమచిత్తవృత్త్యనుసారంగా మార్పించి మార్చి లాగి రంగంమీదపెట్టారు. అందువల్ల ఆ నాటకాలు తమస్వరూపమును తమ కళామయత్వమును తమ జీవమునూ విడిచిపెట్టుకోవలసివచ్చింది. ఇప్పటికే ఇంత అయింది. ఇట్లాగే చేస్తే ఇక ముందు ఏమవుతుందో మనం ఊహించవచ్చు. నాటకత్వంతో కూడుకొన్న నాటక మనేది సకల నాటకసాధారణము. అసలు రూపకవిజ్ఞానానికి ఏమేమి ప్రయోజనా లున్నవో ఆ ప్రయోజనాలనన్నిటినీ నాటకము (రూపకము) సంపాదించేదిగా ఉండాలి. ఈ కాలానికి ఇదే తగును, ఈ దేశానికి ఇదేతగును చాలు అని ఏ కవీ అనుకోరాదు. ఏ నటుడూ తలచరాదు. ఏ ప్రేక్షకుడూ భావించరాదు. ఆ విధముగా అనుకొని కవినటభావకులు ప్రవర్తించితే నాటకకళ నశించిపోతుంది. ఏ కాలంలోనైనా ఏ దేశములోనైనా సరే, అన్నివిధాల ప్రయోజనాలను ఆశించేవారూ ఉంటారు. వారిని ఎవరూ హతమార్చలేరు. అది కళాపరిషత్తులకు ఉచితము కాదు.

ఇప్పటికాలంలో ప్రచారంలో ఉన్న నాటకాలు ఏవో కొన్ని ఉద్దేశాలతో ఉన్నవి. వాటిది పరిమితమైన సంకుచితదృష్టి. అందువలననే రూపకకళ అభివృద్ధి పొందటంలేదు. ఏ యే నాటకాలు ఈ విధముగా ఉన్నవో తత్కవినటభావకులు దీనికి కారణము అంటే వారు కోపించరాదు. వారు తమ అభిప్రాయమును సవరించుకోవాలి. నాటకాలు అనేక వివిధ విషయాలతో ఉండటము అవసరము. అప్పుడే నాటకకళ అభివృద్ధి పొందుతుంది. ఇటువంటి అభివృద్ధికి కవినటభావకులు సంస్కృతహృదయులై ప్రవర్తించి పాటుపడాలి. నాటకాలలో ఆధ్యాత్మికములు, ధార్మికములు, నైతికములు, వైజ్ఞానికములు, సాంఘికములు, ఔదరికములు, కామికములు, దూషకములు, నిర్మాపకములు ఇంకా ఎన్నో ఉండవలసి ఉన్నది. ప్రస్తుతకాలంలోమట్టుకు కేవలమూ సాంఘికములు, కామికములు ఎక్కువగా ఉన్నవి. నిర్మాపకనాటకాలు లేవు. విషయం తెలిసినా తెలియకపోయినా దూషక నాటకాలు ఎక్కువైనవి. అన్నిరకాల నాటకాలకూ వ్యాపారదృష్టి ఎక్కువ అయింది. ఆర్థికంగానే అన్నీ సమన్వయించబడుతున్నవి. నాటకకళ ఇంతగా హ్రస్వీకృతము కావడములో నటులు నాటకాలను తమకు అనుకూలంగా ఉండేటట్లు చేసికొనడమే కారణము. నాటకాలవలన సాధింపదగిన ఫలము ఆర్థికము ఒక్కటే అయినట్లయితే, అందరకూ అర్థమే ప్రధానంగా కావలసి ఉన్నట్లయితే, నాటకాలు నటులనే అనుసరించాలి.

## నాటకఫలము

కాని నాటకఫలము అంతేనా? నాటకాలకు అనేకప్రయోజనా లున్నవని నటులే ప్రసంగాలలో గోష్ఠీబంధములలో ఉపన్యాసములలో చెప్పుతున్నారు. ఇంతకాలమునుంచీ అభినయిస్తున్న నాట

కాలవలన అమాయిక ప్రజలదగ్గరనుండి ఆర్థిక ప్రయోజనం పొందటంకంటె అన్యంగా ఇతర ప్రయోజనమును కవినటభావకులు పొందగలిగినారా? అని ప్రశ్నించితే ఇతర ప్రయోజనాలు కలగటము లేదని విజ్ఞులయినవాళ్ళందరూ అంగీకరించుతున్నారు. నాటకప్రయోజనాలు ఏవి?

ఇత్థముక్త ప్రమోపేతం నాట్యం[?] రసాశ్రయం,
ప్రేక్షకస్య ప్రయోక్తుశ్చ[?] స్యాద్భుక్తిముక్తిదం.

అని భావప్రకాశము అంటున్నది. నాట్యానికి కేవలభుక్తిగాని కేవలముక్తిగాని ప్రయోజనంకాదు. ముక్తికి అనుకూలమయిన భుక్తిని ఫలముగా గ్రహించాలి. భుక్తిని బాధించకుండా ఉంటే ముక్తిని ఫలముగా గ్రహించాలి అని శారదాతనయభావము. అసలు నాటకీయగోష్ఠి అంతా కూడా భోగమోక్షప్రద మని సిద్ధాంతము. అందుకొరకే మునులు నాట్యమును అవతరింపచేశారు. 'గేయసాధ్యం హి ధర్మార్థకామమోక్షచతుష్టయం'అని శారదాతనయుడే అంటున్నాడు. భోగం ఉన్నచోట మోక్షం లేదు. మోక్షం ఉన్నచోట భోగం లేదు. నాట్యగోష్ఠిలో భోగమోక్షాలు రెండూ ఉన్నవి, అని నాట్యధర్మముయొక్క పరమ సిద్ధాంతము. సాహిత్యశాస్త్రంలో ప్రత్యభిజ్ఞా సమన్వయం ఉన్నట్లే సాహిత్యశాస్త్రముకంటె అతిరిక్తముకాని నాట్యములో ప్రత్యభిజ్ఞాదర్శన సమన్వయము ఉన్నదని గ్రహించాలి. అందువలననే భావప్రకాశములో శారదాతనయుడు సప్తమాధికారములో షట్త్రింశత్తత్త్వాలను చెప్పుతూ ప్రత్యభిజ్ఞాదర్శనతత్త్వములను సమన్వయించాడు. ఈ విషయము మా ఉపేక్షికలో స్పష్టము. కాగా ప్రస్తుతము ముక్తిని విడిచిన భుక్తికి నాట్యమును అనుకూలంగా చేస్తున్నారంటే నటులే కారణము. ఈ విధానమువలన నాట్యఫలమును వారు సంకోచపరచినట్లయింది. అసలు నాట్యధర్మ పరమోద్దేశమును వారు ధ్వంసంచేసినట్లయింది. ఇటువంటి సర్వనాశంలో కవులు నటులు భావకులూ అందరూ హేతువయినారు. అగ్నికి వాయువు తోడయింది. భరతుడు తన నాట్యశాస్త్రంలో నాట్యఫలాలను ఇట్లా ఏకరువు పెట్టుతున్నాడు:

ధర్మ్య మర్థ్యం యశస్యంచ సోపదేశం ససంగ్రహం
భవిష్యతశ్చ లోకస్య సర్వకర్మానుదర్శకమ్. 1-14
సర్వశాస్త్రార్థసంపన్నం సర్వశిల్పప్రదర్శకం
నాట్యసంజ్ఞ మిమం వేదం సేతిహాసం కరోమ్యహం. 1-15
అలం వో మన్యునా దైత్యా విషాదం త్యజతానఘాః
భవతాం దైవతానాంచ శుభాశుభవికల్పకః. 1-102
కర్మభావాన్వయాపేక్షో నాట్యవేదో మయా కృతః
నైకాంతతోత్రభవతాం దేవానాం చాత్ర భావనం. 1-103
త్రైలోక్యస్యాస్య సర్వస్య నాట్యం భావానుకీర్తనం.

సర్వలోక సర్వోచితభావా లన్నికూడా నాట్యంలో నిబంధింపబడిఉన్నవని భరతుని భావము.

నాటకకళ అనేది ఒక మహాయజ్ఞము. దీనిలో పశువు పట్టటంలేదు. కాని కొందరు దీన్ని భావించక లోకమును పశువుగా చేస్తున్నారు. గుక్క త్రిప్పుకోకుండా భరతు డీవిధంగా అంటున్నాడు :

క్వచిద్ధర్మః క్వచిత్క్రీడా క్వచిదర్థః క్వచిచ్ఛ్రమః
క్వచిద్ధాస్యం క్వచిద్యుద్ధం క్వచిత్కామః క్వచిద్వధః. 104

నవరసాలకూ నాట్యంలో అనుప్రవేశం ఉన్నది. ఆ విధముగానే నాట్యాన్ని అభినయించాలి కూడాను. అదే క్రియాచాతుర్యము.

ధర్మో ధర్మప్రవృత్తానాం కామః కామోపసేవినాం
నిగ్రహో దుర్వినీతానాం వినీతానాం దమక్రియా. 105
క్లీబానాం ధార్ష్ట్యకరణ ముత్సాహః శూరమానినాం
అబుధానాం విబోధశ్చ వైదుష్యం విదుషామపి. 106
ఈశ్వరాణాం విలాసశ్చ స్థైర్యం దుఃఖార్దితస్యచ
అర్థోపజీవినా మర్థో వృత్తి రుద్విగ్నచేతసాం. 107

నానాభావాలు కలిగిన మానవులకు నానాప్రయోజనసంపాదకంగా నాట్యం ఉంటుం దని చెప్పుతుంటే "ఈశ్వరాణాం విలాసః" అనేది ఒకటే ప్రయోజన మని కొందరు భావించటము నాటక కళకు ముప్పు. నాట్యాభిమానులు ఈ కాలంలోకూడా ఆ ఒక్కదానినే అనుసరించటము ఉచితము కాదు అని బాగా గ్రహించాలి.

నానాభావోపసంపన్నం నానావస్థాంతరాత్మకం
లోకవృత్తానుకరణం నాట్య మేత న్మయా కృతం
ఉత్తమాధమమధ్యానాం నరాణాం కర్మసంశ్రయః.
హితోపదేశజననం,
రసేషు భావేషు సర్వకర్మక్రియాసు చ
సర్వోపదేశ జననం,
దుఃఖార్తానాం శ్రమార్తానాం శోకార్తానాం తపస్వినాం
విశ్రామజననం - లోకోపదేశ జననం.

ఒక్కొక్క ప్రయోజనమును చెప్పి దాని చివర మాటిమాటికిని "నాట్య మేతత్ భవిష్యతి" అని భరతుడు ముక్తాయింపు ఇస్తున్నాడు. నాట్యప్రయోజనమును పొందవలసిన వారిలో భరతునిచే చెప్పబడక మిగిలిపోయినవారు ఎవరును కనబడరు:

న తత్ జ్ఞానం న తత్ శిల్పం నసా విద్యా నసా కలా
న స యోగో న తత్ కర్మ నాట్యేస్మిన్ య న్న దృశ్యతే.

నాట్యప్రయోజనాలను గుదిగుచ్చి చెప్పడానికి ఈ శ్లోకము ఒక్కటే చాలు. సప్తద్వీపానుకరణమూ నాట్యములో ప్రతిష్ఠితమై ఉంటుంది. నాట్యము శ్రుతిస్మృతిసదాచారపరిశేషార్థ కల్పనాత్మక మైనా వినోదజననము చేస్తుంది. ఇంకా ఇంకా ప్రయోజనాలు నిరూపించబడినవి. సాధారణంగా ఏవి ఏవి ప్రయోజనాలుగా ఉండతగు నని మనము ఊహించుతామో వానిని అన్నిటినీ కూడా భరతముని నిరూపించినాడు.

యా గతి ర్వేదవిదుషాం యా గతి ర్యజ్ఞయాజినామ్
యా గతి ర్దానశీలానాం తాం గతిం ప్రాప్నుయా న్నరః.

ఈ వచనమును అర్థవాదంగా తలచరాదు. నాట్యము పవిత్రకర్మ. ఉన్మేషనిమేషాంతరములో ఉన్న మహాకరణేశ్వరి నాట్యములో ఉపాసింపబడుతున్నది. నాట్యము మహాయజ్ఞము. దీనిని యథావిధిగా ఆరాధించిన వానికి ఆ ఫలము ఎందుకు రాదు ?

## న టు డు

పరశివుడే నటుడు. ఆతడు నటుడేకాదు, మహానటుడు. ప్రపంచంలోనివారు అంతాకూడా ఆతని నాట్యానుకర్తలు. అందువలన నాట్యముకలవారు నటు లని అర్థము. నాట్యము భేదప్రభేదాలుపొంది నృత్యనృత్తము లయినట్లు, నటుడు నర్తకుడు అవుతాడు. నృత్తకారి అవుతాడు. నటుని లక్షణాలు సవిశేషంగా నిరూపింపబడిఉన్నవి. ఆత డొక నాట్యోపాసన చేసే కళాయోగి. మానవుడు గతి నీతి గీతి మతి కలవాడయితేనే నటుడు అవుతాడు. ఈ నాల్గింటిలో ఏది లోపించినా నటత్వము సరిగా రాదు. కాయవాఙ్మనఃపుష్టి చక్కగా ఉండాలి. ఏ ఒక్కటో ఉన్నంతమాత్రాన ప్రయోజనం లేదు. నటత్వానికి తగిన అర్హత జన్మజన్మాలలో వడపోతపోసిన తరువాతగాని రాదు. నటుడు కాదగినవానికి దేహము జన్మసిద్ధమే. చక్కనివాక్కు, యోగ్యమయిన మనస్సు, అన్నీకూడా పూర్వజన్మాపేక్షములే. నటత్వము అనేది సిద్ధధర్మము. ఒకమానవుడు ఏవో భావాలు మనస్సులో చెలరేగితే కదలికపొంది నటసంఘంలో చేరినంతమాత్రాన నటుడుకాలేడు. నటుడై పుట్టాలికాని, పుట్టి నటుడుకావడమనేది దుస్సాధము. కొంద రనుకుంటున్నట్లుగా నటన మనేది సులువైనదిగాదు. నటనము ఒకయోగము. అయినప్పటికీ శిక్షాభ్యాసపాటవము లేనిదీ ఆ నటత్వము ఉద్బుద్ధముకాదు. సూక్ష్మదేహానుగతమై ఉన్న నటత్వము శిక్షాభ్యాసము లున్నప్పుడే భౌతికదేహంలో వ్యక్తిని పొందుతుంది. అవి ఆతనికి వివేకవికాసముల నిచ్చి నాట్యానుగతుని చేయగలవు. నటుడు రసానికి ఆహర్త. భావకుల హృదయసీమలో రసధారను నింపుతాడు. రసమే అమృతము. భావకుడు అనుభవిత. నటుడు సుధాపాత్రి. దానికి సుధామధురత తెలియదు. నటునకు రసాశ్రయత్వము లేదు.

నాటకానికి కవి స్వరూపసంపాదకుడు. కవితాసమాధిలో భాసించిన సిద్ధవిషయాలను కవి నిబంధించుతాడు. కవి అయినా తన సిద్ధకవితాభావమును అనుసరించుతాడు. కాని తన కవిత

తనను అనుసరించేటట్లు చేయడు. ఆ విధంగాచేస్తే అది కవితయేకాదు. కవిత్వము హృదయధర్మము. మానవుని ఇచ్ఛారాగాదులు మనోధర్మాలు. మనోధర్మములు హృదయధర్మాలను అనుసరించాలి. కాని హృదయధర్మాలు మనోధర్మాలను అనుసరించరాదు. నటుడు సిద్ధస్వరూపప్రకాశకుడు. కవి కవితాసమాధిలోనుండి తెచ్చి నాటకంలో నిబంధించిన నాట్యధర్మాలను ఉపదేశరూపంగా తెలుసుకొన్న నటుడు ప్రకాశింప చెయ్యాలి. అంతేగాని సిద్ధానుసరణంలో స్వాతంత్ర్యము ఉండరాదు. తన స్వాతంత్ర్యమును కలిపితే సిద్ధభావాలకు సిద్ధత్వమే పోతుంది. నాట్యరూపములయిన రసభావములు ఎప్పుడూ కూడా సాధ్యరూపములు కావు. నటుడు తన విశేషమును నాట్యాభినయంలో కలుపరాదు. కవిధర్మము వేరు. నటధర్మము వేరు. కవి నిబంధించిన దానినే నటుడు ప్రదర్శించాలి. కవి నిబంధించినది ఒకవిధంగా ఉండగా నటుడు వేరొకవిధంగా తనకు అనుకూలం చేసికొని అభినయించితే సహృదయసామాజికులు ఉద్విగ్నపడుతారు. ఆవిధముగా ఉద్వేగమును పొందాలి కూడాను. నాటకము నటుని అనుసరించినది అయిందంటే, కవి నటుని అనుసరింపవలసి వచ్చింది అన్నమాట. ఇట్లా అయినప్పుడు ఉత్తరోత్తరము ప్రామాణ్యమును బట్టి—నటుడు సామాజికులను అనుసరించాలి కాని, సామాజికులు నటుని అనుసరించరాదు అనికూడా అనవలసివస్తుంది. ఆ విధంగా కావడమును నటులు అంగీకరించుతారా? ఎవరో కొందరు ఆవిధంగా చేస్తే అందరూ అభినందించుతారా? నటుడు సామాజికుని అనుసరించితే ఇక రంగస్థలంమీద ఉండనక్కరలేదు. భావించండి ఏమవుతుందో.

కవిత్వము వేరు. నటత్వము వేరు. ఒకమానవుడు కవి కావచ్చు, నటుడూ కావచ్చు. కాని ఆ రెండూ ఏకకాలికములు కావు. కవి అయినవాడు నటుడు కావచ్చు, నటుడు అయినవాడు కవి కావచ్చు. రెండిటినీ సమసమయంలో జోడించుకొంటే అనర్థం వాటిల్లుతుంది. ఒక కవి వ్రాసివ్రాసి కొన్నాళ్ళకు నటుడైనాడు. తరువాత నాటకమును వ్రాయగా తాను ఏ పాత్రాభినయము చేస్తాడో ఆపాత్రకు ఆ నాటకంలో అప్రాధానత వున్నా బలవంతాన ప్రాధాన్యం తెచ్చి అంటగట్టినట్లు వున్నదని భావకులు భావించారు. ఒక నటుడు కొన్నాళ్లు కవి అయి నాటకము వ్రాసి సర్వవిశేషాలూ, తనకే గుచ్చుకొన్నాడు. తక్కినదంతా దూదిపింజ అయింది. నాటకం పేలవం అయింది. కాబట్టి నటుడు నాటకమునే అనుసరించాలి. దానివలన రసభావస్ఫూర్తి ఉంటుంది. అంతమాత్రాన నటులు తమ వ్యక్తిత్వమును నటనాకౌశలమును చంపుకోవాలి అని అభిప్రాయం కాదు. నటనవిషయంలో నటునకు స్వేచ్ఛ లేకపోలేదు. భరతుడు అభినయించే విషయంలో ఔచిత్యానుసారంగా నటులు స్వాతంత్ర్యం వహించవచ్చు అని అభ్యనుజ్ఞ ఇస్తున్నాడు. వ్యుత్పన్నుడైన నటుడు అభినయవిషయంలో ఉచితమైన స్వాతంత్ర్యము స్వీకరించవచ్చు. కాని నాటకంలో ఉన్న సన్నివేశాలను అటూ ఇటూ తారుమారు చేయడానికి నటుడు పూనుకోరాదు. ఆ నటుల అనుగ్రహమును సంపాదించాలనే భావంతో కవికూడా తన నాటకము నటుని అనుసరించటము అంగీకరించరాదు. కవి ఏమో ఆశతో నటానుసరణమును ఒప్పుకున్నప్పుడు నటుడు ప్రబోధించి మాన్పించాలి. నటుడంటే;

అతీతం లోకవృత్తాంతం రసభావసమన్వితం, సంభావయ న్నాటయతి యత స్తస్మాన్నటః స్మృతః.
అని భావప్రకాశము లక్షణము చెప్పుచున్నది.

నటః గీతేన వాద్యేన వృత్తే నాభినయేనచ, రంగే రామాద్యవస్థాభిః అనుకార్యాభి రంజసా,
రామాదితాదాత్మ్యాప త్తేః ప్రేక్షకా న్రసయిష్యతి.

ఈవిధముగా నటధర్మాలు నిర్దేశింపబడుతున్నవి. అంతేగాని నాటకమును తనకు అనుసరించే దానినిగా చేసుకోవటము నటకృత్య మని తెలిసినవారు ఎవరూ అనడములేదు. నటుడే నాటకమును అనుసరించాలి అని నిశ్చయించడమే సరసముగా ఉంటుంది.

నాటకము నటుని అనుసరించితే అనర్థము కల్గుతుంది. నాట్యనృత్య నృత్తస్వరూప స్వభావములన్నీ నశించిపోతవి. అందులోనూ నేటికాలములో ఆభాసమాత్రనటులు అధికంగా ఉన్నారు. నాటకమును రచింపగలిగిన కవులూ కొద్దిమందే. ఆ నాటకమును అభినయింపగలిగిన నటులూ కొద్దిమందే ఉన్నారు. ఆభాసకవులకు ఆభాసనటు లున్నారు. ఇటువంటివారు ప్రేక్షకులను మోసగించుతున్నారు. ప్రేక్షకుడు అంటే టికట్టు కొనేవాడే అనే అభిప్రాయము పోవాలి. ప్రేక్షకులలో ఉండే విశిష్టార్హతను నటులు భావించితే తాము నాటకాలను అనుసరించుతారు.

నటులు నానావిధంగా ఉన్నారు. అన్ని అభినయాలనూ అందరు నటులూ చేయలేరు. కొందరు ఏకాభినయసమర్థులే. సర్వరసములనూ అభినయించలేరు. సర్వభావములనూ ప్రదర్శించలేరు. ఇటువంటివారిని నాటకములు అనుసరించితే సర్వాభినయాలతో సర్వరసాలతో సర్వభావాలతో ఉండతగిన నాటకానికి నాటకత్వవ్యాహతి కలుగుతుంది. ఈ నటులు తమ తమ అభినయాలకే ప్రాముఖ్యం ఇచ్చుకుంటారు. తమకు అభిమతమైన రసమునే నిబంధింపజేసుకుంటారు. నాట్యఫలముఖంగా వారు ప్రవర్తించరు. ఎక్కడనయినా ఒక్కొక్క వ్యుత్పన్నుడయిన నటుడు సర్వాభినయాలకూ ప్రాధాన్యమును చూపినా, మొత్తానికి అభినయానికే ప్రాముఖ్యమును ఇస్తాడు కాని రసభావాలకు ప్రాధాన్యం ఇవ్వలేదు. ఇష్టం వచ్చినట్లుగా నాటకాన్ని మార్చుకొని ఒక్కొక్క నటుడు గుక్కపట్టి కూతపట్టి గింగురు మనేటట్లు తనకు అప్పుడు జ్ఞాపకం వచ్చిన రాగాల నన్నిటినీ వరుసవరుసగా విసరడంవల్ల ప్రేక్షకహృదయాలలో ఎటువంటివైరస్యం కల్గుతున్నదో ఆతడు గ్రహించడంలేదు. ఇప్పట్లో కొన్ని నాటకాలు నటున్ని అనుసరించడము మూలాన సమర్థభావకలోకంలో నాటకగోష్ఠిపై విరసభావము పుట్టుతున్నది. సిద్ధసహృదయుల పవిత్రాశీర్వాదాలను పుచ్చుకోలేని నాటకకళకు అభివృద్ధి ఉంటుందా? మళ్లా రూపకకళకు యోగ్యస్థితి కలుగవలెనంటే నటులు నాటకాలను అనుసరించాలి. అప్పుడు సహృదయలోకం ఆదరించుతుంది. విజ్ఞులయినవారి మెప్పుదల కలుగుతుంది.

# శ్రీ దాసు శ్రీరామ మహాకవి

శ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి, శతావధాని.

ఏ గతి రచియించిరేని సమకాలము వారలు మెచ్చరే కదా !

అన్నాడు చేమకూర. ఈ మాట వ్రాసిన మహాకవి సామాన్యుఁడు కాఁడు. వసుచరిత్రాదులు కూడ జంకడానికి తగ్గ సరసకవిత్వం చెప్పిన రసవత్కవితాధూర్వహుఁడు. అట్టి చేమకూర సమకాలీనుల తెల్వితక్కువ కుశ్శంకలకు యేవగించుకొని పైమాట వ్రాసి వుంటాడని వేఱే వ్యాకరించవలసి వుండదు. శీర్షికలో వున్న

దాసు మహాకవి

నాకన్న వయోవృద్ధైనను మే మిద్దఱమూ సమకాలికులమే కాబట్టి ఆయన్ని నేనుగాని, నన్ను ఆయనగాని మెచ్చుకోకుండా వుండడమే పై మాటనుబట్టి యుక్తంగా వుంటుంది గాని, యే కారణం చేతో మేము దానికి భిన్నంగానే ప్రవర్తిస్తూ వచ్చాం. ఇంకొక కవియందు (నిజంగా వుంటేనే) వుండే గుణగణాలు మెచ్చుకోవడంవల్ల తన గౌరవానికి భంగం వస్తుందని తలచేవారు సహృదయులు కారు. కాని లోకంలో చాలామంది యీ తరగతికి చెందినవారే. మిత్రత్వ శత్రుత్వాలు కూడా సహృదయులకు అడ్డు తగులవు. గుణమే ప్రధానం. దాసువారి దేవీభాగవతానికి, గ్రంథకర్త గారి జ్యేష్ఠకుమారుడు కేశవరావుగారి కోరిక ననుసరించి నేను సుమా రిప్పటికి 14 యేండ్లనాఁడు పీఠిక వ్రాసి యిచ్చివున్నాను. అందులో శ్రీరామపండితుని కవితనుగూర్చి హృదయం విప్పి సూత్రప్రాయముగా వ్యాకరించి వున్నాను. కాని అంతమాత్రమున నాకు సంతుష్టి గలగలేదు. ఈ శ్రీరామకవిచంద్రుని నేను రెండవ శ్రీనాథునిగా నా మనస్సులో అనుకొందును. ఈయన్ని మాత్రమే కాదు-

కీ॥ శే॥ ఆదిపూడి ప్రభాకరరావు గారిని

కూడా యీ విధంగానే సమ్మానిస్తాను. వీ రిద్దరినీ తప్ప నే నెఱిఁగినంతలో మఱొకరిని శ్రీనాథునితో పోల్చడానికి నా మనస్సు వొప్పుకోదు. అయితే శ్రీనాథుఁడు సంస్కృతంలో ప్రత్యేకించి కృషి చేసినవాఁడు. ఆ కృషికూడా సామాన్య మయింది కాదు. "గౌడడిండిమభట్టు" కంచుఢక్కాను పగులఁగొట్టించిన మహావిద్వాంసుఁడుకదా శ్రీనాథుఁడంటే? అట్టి పాండిత్యం యీ కవిద్వితయమందు మీరు సమర్థింపఁగలరా? అంటే వినండి. ప్రభాకరరాయని కవిత్వధార సర్వాత్మనా శ్రీనాథుని కవిత్వాన్ని మఱపిస్తుంది; కాని ఆయనకున్న పాండిత్యంలో యెన్నోవంతున్నూ సంస్కృతంలో యీయనకు లేదు. అంటే యేమన్నమాట? శ్రీనాథుఁడు పని పడితే వ్యాకరణాదిశాస్త్రాలు

శిష్యులకు తూ - చా - తప్పకుండా పాఠం చెప్పఁగలవాడై వుంటాఁడు. అంతే కాదు, వాదోప వాదాలు ('మయి జల్పతి కల్పనాధినాథే' చూ.)చేసి ప్రతిపక్షులను ఓడబుచ్చఁగలవాఁడు. ఆలాటి వాఁడు కాకపోతే మహావిద్వత్సభలో తెలుఁగంటే యేమిటో తెలియని కేవలసంస్కృతపండితుణ్ణి, గౌడడిండిమభట్టుని జయించడం సంభవించదుగదా? కవిత్వం చాలామంది చెప్తారు. కాని ఆ చెప్పేవారిలో యే కొందఱిదో జీవకవిత్వంగా వుంటుంది. ప్రభాకరరాయని కవిత్వం జీవకవిత్వం. ఉదాహరిస్తాను కొంచెం:

ఉ. పెండిలి సేయఁగాఁ దనకుఁ బెద్దలు లేమి వయస్సు మీఱినన్
రండలఁ గూడఁగా మనసు రాక తిరుండయి యుండ, నందఱున్
షండుఁ డటంచుఁ బల్కి; రొకసారసగంధిని గూడినంత జా
రుం డని పేరు వచ్చెను; బరుండిన లేచినఁ దప్పె శ్రీహరీ.

సీ. శృంగారరసము వర్ణించిన గాంగేయుఁ డంబవెంబడి నంగలార్పవలయు
వీరరసం బింత సారింప నైరాటి యొక్కఁడే కురుసేనఁ జెక్కవలయు
కరుణారసం బెత్తి కఱఁగఁబోసిన ద్రౌణి పూని ధృష్టద్యుమ్నుఁ బ్రోవవలయు
రౌద్రరసంబు వర్ణన సేయ బలరాముఁ డా సేనలో శివాలాడవలయు

తే గీ. నప్ప! యిటు సెప్ప నేర్చుఁ బ్రభాకరాఖ్య, కవివరుఁ డటన్న హేళన గాదు సుండు
కాల మొకరీతి నున్నది గాకయున్నఁ, దిక్కనకుఁ దిక్క విడిపించు తెలివి కలదు.

ఆ యీ పద్యద్వయమువలన ధారాశుద్ధి మాత్రమే కాదు; పోయే పోకడకూడా తెలియఁగలదు. సీసగీతిలో నున్న

ప్ర భా క ర శ బ్ద ము

నందు (ప్రభాం కరోతి అనిగాని, ప్రభాయాః ఆకరః అని వ్యాఖ్యాతలు వ్రాయలేదు) స్వరయతి చింత్యము. మఱేన్ని నవరసములలో నుండురసము,

క రు ణ ర స ము

గాని కరుణా (కృపా)రసము గాదు. ఇవి కవి పండితుఁడు (గురుశుశ్రూషాపూర్వకంగా చదువుకున్న వాఁడు) కాఁడన్నంతవఱకే బోధించునుగాని కవితాస్వారస్యానికి భంజకాలు కావు. నేను ప్రభా కరరాయణ్ణి శ్రీనాథుఁ డనడం కవిత్వపోలికను బట్టియ్యేవే, పాండిత్యాన్నిపట్టి కాదు. ప్రకృతం వ్రాయఁదలఁచుకొన్నది శ్రీరామకవిగారినిగూర్చి. వీరికి సంస్కృతాంధ్రములయందు మంచి పాండిత్యం కలదు. గురువులు నిమిత్తమాత్రంగా కొంద ఱున్నను శ్రీరామపండితుని

పాం డి త్యం

"ప్రపేదిరే ప్రాక్తనజన్మవిద్యాః" అను కాళిదాసోక్తికి ప్రథమలక్ష్యంగా పేర్కొఁదగి వుంటుంది. ఈయన,

జి ల్లా కో ర్టు వ కీ లు

గా పని చేసిన లౌకికప్రజ్ఞాధురంధరుఁడుకదా! ఆ యీ ప్రజ్ఞకూడా నేఁటి వకీళ్ళవలె గురుశుశ్రూష చేసి ఆర్జించినది కాదు. సుళువుగా సంపాదించుకున్నదే. ఇట్టి పండితులు యేకాలమందున్నూ కొందఱు వుండడంవల్లనే అనుకుంటాను పాణిని

త ద ధీ తే త ద్వే ద

అని రెండువిధములుగా అధికారసూత్రాన్ని వికల్పించవలసి వచ్చింది. శాస్త్రం తల్లకిందుగా చదివినవారి కవిత్వాలు శబ్దదోషభూయిష్ఠాలుగా,వుండడమూ నే నెఱుఁగుదును. శాస్త్రమంటే యేమిటో యెఱుఁగనివారి కవిత్వాలు నిర్దుష్టాలుగా లేదా నిర్దుష్టప్రాయాలుగా వుండడమూ నే నెఱుఁగుదును. ఈ విషయంలో నా బాల్యం మొదలుకొని యిప్పటిదాఁకా వున్న (73 వత్సరాలు ప్రస్తుతం నా వయస్సు) నా అనుభవాన్ని వ్రాయవలసి వస్తే చాలా పెరుఁగుతుంది కనక ఆజోలి పెట్టుకొనేది లేదు. కొందఱు శాస్త్రగ్రంథాలపేర్లుకూడా కనీవినీ యెఱుఁగకుండానే శాస్త్రం చదివినట్టు నటిస్తారు. వీరినిగూర్చికూడా యిక్కడ వ్రాసేది లేదు. కవికి ముఖ్యంగా వుండతగ్గది లక్ష్యజ్ఞానం. ఇది లేని లక్షణజ్ఞానం యెందుకూ పనికిరాదు. (వితయగుఁగాదె? లక్షణ వివేకము- చూ.) లక్ష్యజ్ఞానమే వుండి లక్షణజ్ఞానం కొంచెంకూడా లేకపోయే పక్షంలో——

శ ర్వా ణి

వుందిగదా అని శంకరాణి, శివాని లేదా శకార్ణి అని కూడా ప్రయోగించడం సంభవిస్తే సంభవించనివ్వండి. అంతమాత్రంతో రచన జీవం కలదే అయితే వచ్చే హాని లేశమూ - వుండదు. కాళిదాసు శాస్త్రజ్ఞుఁడా? కాఁడా? అతని ప్రయోగం——

అ వై హి

అనేది ఆక్షేపించఁబడిందా, లేదా? కవిత్వాని క్కావలసింది రసం. అది వుంటే యతిప్రాసలలోఁగాని యితరవిషయాలలోఁగాని యత్కించిత్తు లోపం వున్నా చెడేది లేదు. కనకనే——

మ. యతియుఁ బ్రాసయుఁ గూర్చుమాత్రఁ గవియే? ఆ మాత్రపుంబజ్ఞ యీ
క్షితి యంబ్రహ్మల కుండ దెందఱికి (గీరతం—చూ)

అనవలసి వచ్చింది. వట్టి యతిప్రాసలుగాని గణాలుగాని యెంత బాగా గుదిగూర్చినా ప్రయోజనం లేదని తెలుసుకోవడం అత్యావసరం. 'సాధ్యోహి రసో యథాతథం కవిభిః.' శ్రీరామకవిగారు వెఱ్ఱివెఱ్ఱి కుళ్ళంకలు చేసేవారిని యేమన్నారో? చూడండి——

సీ. ......శబ్దరత్నాకరస్థములైన పదములే, పదములంచును సారెఁ బలుకుచుంద్రు
తే. గీ. వళులఁ బ్రాసంబులను గట్టివార మేమ, యప్పకవి యొప్పఁడని చాలఁ జెప్పికొండ్రు
అర్థసందర్భము లెఱుంగ కాడికొండ్రు, నలుసు గెలకు కవులకు దండంబు లిడుదు.

శ్రీరాములుగారి జీవితకాలంలో శబ్దరత్నాకరాన్ని దగ్గిఱ పెట్టుకొని అందులో లేని పదాన్ని

యేకవివతంసుఁడేనా వాడుకుంటే ఆక్షేపించడమే వుండే దనుకుంటాను. అదిన్నీ శోచ్యమే. కాని ఇటీవలిసంగతి మరీ అర్థాన్నమై పోయింది. శబ్దరత్నాకరంలో విస్పష్టంగా వ్రాయఁబడివున్న పదాలు కూడా శ్రద్ధగా చూచే వోపిక లేక (నిస్సారా పృథివీ) ఆక్షేపించడం బయలుదేరింది—"నడునెత్తి పగులఁగా నడిచి పాశుపతంబు" అన్నచోట రెండుతప్పులు నిరూపించడం యెందుకు వచ్చిందంటారు? పై కారణం చేతనే కదా?

**"నడినెత్తి - నడునెత్తి"**

అనే రూపద్వయమున్నూ సాధువే (శ. ర. చూ). ఇఁక అడిచి అనేది అడఁచి అని వుండవలసి వుంటుందని దిద్దుబాటును వుపదేశించడానికి కొంత వ్యాకరించాలి. సాంబమూర్తి శిరస్సును అర్జునుఁడు అడిచినాఁడు (తాడించినాఁడు) గాని, అడఁచ (అణఁచ = అణఁగఁగొట్ట) లేదు. కనక ఆయీ దిద్దుబాటు శోచ్యం. యింకా యిలాటి వుదాహరణాలు (నిఘంటుకూడా సరిగా చూడకుండా చేసే ఆక్షేపణలకు) వున్నాయి. విస్తరభీతిచే స్పృశించి విడిచాను. శబ్దరత్నాకరం దిఙ్మాత్రంగా తెలుఁగుపుస్తకాలలో వుండే శబ్దాలను చూపిస్తుంది. అంతేకాని కర్మం చాలక దానిలో వుదాహరించకపోతే ఆ శబ్దం అసలు (పంచాంగంలో లేకపోతే—చూ.) ప్రపంచకంలోనే లేదనుకోవడం కన్న శోచ్యస్థితి వుంటుందా? పోనీ అందుకూ వొప్పుకుందామంటే అదికూడా బాగా చూడడానికి నోచుకోకపోతే గతేమిటి? శాంతం పాపం! శ్రీరామకవిగారికి శబ్ద రత్నాకర మాత్ర ప్రజ్ఞాధురంధరులబాధ కొంత ప్రాప్తించినట్లు పైని వుదాహరించిన సీసపాదంవల్ల మనం తెల్సుకున్నాం. ఇఁక యతిప్రాసలలో గట్టివార మనుకొనేవారినిగూర్చి శ్రీరామపండితులు నొక్కి వ్రాసిన కారణం యేలాటిదో విచారిద్దాం. చదరంగం బాగా ఆడడం కష్టంగాని ఆటకు సంబంధించిన నడకలు నేర్చుకోవడానికి అయిదు నిమిషాలకంటె యెక్కువ టయిము పట్టదు. ఆలాగే గురు లఘు భేదమున్నూ గణాలున్నూ తెలుసుకోవడానికిన్నీ యెంతో కాలం పట్టదు. ఏదోవిధంగా రచనకూడా సాఁగించడమూ అంత చిక్కులోది కాదు. కాని ఆరచన రసజ్ఞలోకాన్ని అలరించి-

**"లోకుల రసనలె యాకులుగా"**

నుండతగినది కావడం మాత్రం దృశ్యాదృశ్యం. నాకు యీ శ్రీరామకవిగారి పద్యాలు చాలా భాగం నోటికి వస్తాయి. విద్యార్థిదశనాఁడు వీరిని తఱచు సందర్శించడం (యేలూరులో) వుండేది. అప్పటికి మేమూ కవులుగా వుండేవాళ్లం. మా పద్యాలు శ్రీరాములుగారికి వినిపించడం వుండేది. వారు మాకూ వినిపించేవారు. మావి వారికి కంఠతః వచ్చినట్లు లేదు. కాని వారివి మాకు కంఠతః వచ్చేవి. దీనికి కారణం రసత్వనీరసత్వాలే అని మే మనుకొనేవాళ్లం. అప్పటికి శ్రీరాములు గారు 42 సంవత్సరముల వయస్సువారై యున్నారు. మేము (తి. వెం.) పుట్టివున్నాము. కాని విద్యార్థులం. వీరిని దర్శించేనాఁటికి సుమారు పద్దెనిమిదేళ్ళ వయస్సులో వున్నాం. వారో కౌమార వయస్సు (42 సం.)లో వున్నారు. కవిత్వంకూడా వారిది కౌమారవయస్సులోనే వుంటుందని చెప్ప నక్కఱలేదు. మాకవిత్వమో వయస్సుకు తగ్గట్టుగానే

వారికి నచ్చక పోయినా తప్పు లేదు గాని వారి దేవీభాగవతములో వా రుదాహరించిన పద్యాన్ని బట్టి చూస్తే మేం పొరఁబడ్డట్టు యిటీవల తోచింది—

"ఆత్మన్య ప్రత్యయం చేతః"

భవతు. మేము కవిత్వానికి ఆరంభదశలో వుండేనాఁటికే శ్రీరామకవిగారు ప్రౌఢకవులుగా ఉన్నా రన్నది నిర్వివాదము- వారి— తెలుఁగునాఁడు
ఆ కౌమార వయస్సులో రచించినదే. అది అచ్చుపడక పూర్వమే వారి ముఖతః మేము విన్నాం. ధారణ పట్టినాం. ఇప్పటికీ ఆధారణ పోనేలేదు :

ఉ. లేవరు లెండు లెండనిన లేచినవారయినం దటాలునన్
బోవరు పొండుపొండనినఁ బోదుము పోదుము త్రోయకుం డటం
చీవరు సందు గేస్తు నలయింతురు పెండిలిలో సదస్యసం
భావనవేళఁ జూడవలె బాపనసాముల సాము లన్నియున్.

ఈ పద్యంలో వర్ణ్యం సదస్యసంభావననాఁటి బ్రాహ్మణులు- శారదాబిల్లు రాకపూర్వమే అయితే దీన్ని వ్యాఖ్యానించ నక్కఱ లేదు గాని యిప్పుడు దీన్ని వ్యాఖ్యానిస్తేనే కాని చాలామందికి తెలియదు. శ్రీరామకవిగారికి- ఇంచుమించు

"అష్టపుత్ర బహుధనమస్తు"

అనే భాగ్యం పట్టినది. ఆ కొమాళ్ల పెళ్లిళ్ల సదస్యంలో అనుభూతమైన విషయాన్ని యీపద్యంలో చక్కఁగా చిత్రించారు కవిగారు; నిజమైనకవి దేనిమీఁద పడితే దానిమీఁదనే రచన సాఁగిస్తాడు, లోకాన్ని మెప్పిస్తాఁడు. ఇతరుఁడో—అట్టి రచనాసామర్థ్యం కలిగి వుండఁడు. దేనిమీఁదపడితే దానిమీఁద రచించే నేర్పు గల కవులు చాలా అరుదుగా వుంటారు. శ్రీరామకవిగారు వారిలో అగ్రగణ్యులు. వీరి తెలుఁగునాఁడు శ్రీనాథుని వీథీనాటకాన్ని జ్ఞప్తికి తెస్తూ వుంటుంది- అట్లని దానికే యిది అనుకరణం గాదు. అది ధారాశుద్ధి కలదే అయినా పాకం సభ్యంగా వుండదు. వానిలో వున్నపద్యాలన్నీ శ్రీనాథునివి కావు, కొన్ని (గేదఁగి గంగివర్గాలకు సంబంధించినవి మూఁడు) తురగా రామకవిగారివి. దీనితపిసీలు తెల్పడానికి వేఱే వ్యాసం వ్రాయాలి. ఇఁక ప్రకృతం. ఈవిషయం, అంటే సభ్యం కాదన్నది, దానిమీఁద వచ్చిన కేసునుబట్టియే ప్రాజ్ఞలోకానికి స్పష్టం. శ్రీరాములుగారి పాకం సభ్యం. ఒక్క అక్షరంకూడా నిషేధించతగ్గది దీనిలో లేదు. యెందఱు కవులు సదస్యాలు (చేయక పోయినా) చూచి వుండరు? వొకరేనా యిట్టిపద్యాన్ని వ్రాయఁగలిగినారా? దీన్నిబట్టే నేను ఈయన్ని—

అపర శ్రీనాథుఁడు

గా భావిస్తాను. అయితే శ్రీనాథునిమాదిరిగా ఋణగ్రస్తత్వం లోనైనధర్మాలు ఈయనకు లేవఁటారా? వాట్లపల్ల శ్రీనాథునితో పోలిక వస్తుందా? మనకు కావలసింది దేన్ని పడితే దాన్ని "పుఁసివా కొమ్మకు... అన్యైకదంతుఁడు ఆడఁదొడఁగె" అన్నమాదిరిలో వుంటుంది. ఈ కవిత్వం

ప్రధానంగా పెట్టుకొని రచన సాఁగించి దానిచేత లోకాన్ని మెప్పించడం. శ్రీనాథునికి ఆలాటి శక్తి వున్నట్టు ఆయన (పల్నాటిసీమవగ్రైరా) పద్యాలు సాక్ష్యం యిస్తాయి. మళ్లా ఆలాటిపద్యాలు శ్రీరాములుగారి తెలుఁగునాడులో కుప్పతిప్పలుగా వున్నాయి. వుదాహరించవలసి వస్తే పుస్తక మంతా వుదాహరించాలి. కావలసినవారు చూచుకోండి :

(1) "సీ. మెలివెట్టి నిలిపిన మీసాలపై గొప్ప నిమ్మకాయలు రెండు నిలుపవచ్చు...
బళిర యనవచ్చు లౌకిక బ్రాహ్మణులను.

(2) ఉ. నమ్మిన నమ్మకున్న నది నా వశమా?

(3) శా. ఆస్నే చూస్నివషే వొషే చెముడషే అష్లాగషే యేమిషే

(4) చ. విడువకురా? ఉతోతఇషవే నమ రా? అది దుడ్డురా? ముణాఃకొడక

(5) చ. వసుధ నియోగిబాలిక"

ఇత్యాదులు. ఇంత జాతీయంగా కవిత్వం చెప్పే కవి మాసమకాలికులలోనే కాదు—ఇతరులకాలంలో కూడా మృగ్యుఁడే అనుకుంటాను. అయితే సదస్యపద్యంలో "యీవరు సందు" అనే ప్రయోగం సాధువేనా అని రంధ్రాన్వేషులు ప్రశ్నిస్తా రనుకుంటాను. వాద మెందుకు, అసాధువే కానివ్వండి. అంతమాత్రంచేత పోయే దేమిటి? ఈ తెలుఁగుభాషకు వొకతోవా తెన్నూ లేదు, యెవరికి తోచి నట్లు వారు ప్రయోగిస్తూ వచ్చారు. తప్పన్నది తప్పు కాకా పోవచ్చు, తప్పు కా దన్నది తప్పూ కావచ్చు. పండిత కవివతంసుఁడైన దాసుమహాకవికి యింత మాత్రమూ తెలియదా? తెలిసివుండఁ బట్టే దేవీభాగవత పీఠికలో యీ క్రిందివిధంగా వ్రాసివున్నారు.

"ఇప్పటికవులలోఁ గొందఱు ఏకైకమతావలంబులును బహుగ్రంథదర్శులు కానివారును......
...తమ ప్రావీణ్యంబు పలువురు కొనియాడుదురో యని యడియాసం జిక్కి యాక్షేపింప దొరం కొనువారు కలరు. కావున వారల కెందు నామార్గం బిట్టిది యని చెప్పి నాజోలికి వచ్చుట క్షేమము కాదని తొలంగించుకొనుట యుక్తం బని యెంచితిని."

శ్రీరామకవిగారు పైవిధంగా పండితంమన్యులబారినుండి తప్పుకోఁ దలంచిరికాని అంతమాత్రంచేత కుశ్శంకలబాధ తప్పుతుం దనుకోవడానికి అవకాశం లేదు. ఆయీప్రకరణంలో లాక్షణికసమయాలు శ్రీరామకవిగారు బోలెఁడువ్రాసియున్నారు. వాటివలన ఆయనపాండిత్య మెట్టిదో విజ్ఞులు తెలిసి కొందురు. (అవి దేవీభాగవతంలో మొట్టమొదట వుదాహరించి వున్నారు.) చక్కనిపాండిత్య మంటూ వొకటి వుంటే వెఱ్ఱివెఱ్ఱి ఆక్షేపణలకు దిగ రనిన్నీ, అట్టిశంకలకు దిగడమే పాండిత్య దారి ద్ర్యానికి కారణమనిన్ని కవిగారి తాత్పర్యం. శ్రీరామకవిగారు యీవిషయంలో వ్రాసిన యంశము లన్నీ యుక్తియుక్తములున్నూ బహుమహాకవిసమ్మతములున్నూ అని నేను విశ్వసిస్తున్నాను. ఒక్క-

చోటమాత్రం నేను వ్రాయఁదగ్గది కొంచెం వుంది. ముందుగా వారు వ్రాసినమాట లుదాహరించి నా వాక్యాలు తరవాత వ్రాస్తాను-

చ. మహోదరమున నుగ్రమైన వికృతాకృతి.

ఉదరపదమున రెండుపదములు లేవు. గురుబాలప్రబోధిక చూడుఁడు.

ఈ వాక్యములు శ్రీరామకవిగా రేసందర్భంలో వ్రాశారంటే - అఖండయతి భారతకవులకు కూడా సమ్మతమే అని తెల్పడానికి వ్రాశారు. ఉత్ + అర అని విఱిగితే తప్ప యీ స్థలంలో ప్రాదియతి అనడానికి అవకాశం వుండదని పంతులుగారి అభిప్రాయం. గురుబాలప్రబోధిక (అమర వ్యాఖ్యానాలలో యిది వొకటి. మన దేశంలో బాగా దీనికే వ్యాప్తి) వారికి అనుకూలంగానే వున్నది. కనక

"వి కృ తా కృ తి"

అనే పదంలో వున్న తా అనేది దవర్ణమునకు యతి చెల్లవలసి వుంటే యేవిధమైన అవాంతరాలు లేని అఖండయతిని వొప్పుకుంటేనే గాని భారతప్రయోగం సంరక్షింపఁబడ దని పంతులుగారి అభిప్రాయం. నేనుకూడా కొంతకాలం యిట్టి అభిప్రాయాన్నే పొంది వుండేవాణ్ణి. మా పాండవాశ్వమేధంలో యేలా దొర్లిందోగాని వొకచోట

మ. దురో, దరమా! నీదగుపే రెఱింగియును గట్టా! మోసపోతింజుమీ.

అని దొర్లింది. యతి పోయినట్టు అనుమానంకూడా తట్టడం లేనేలేదు. కాని ఉదారపదం ఉభయ యతికి పనికి వచ్చి ఉదరపదం పనికి రాకపోతుందా? అని మాత్రం వూహ కలిగింది. గురుబాల ప్రబోధికను పట్టి చూస్తే శ్రీరామకవిగారు చెప్పినట్లు

ఉదరపదం - ఉత్ + అర

అని రెండు పదాలుగా విఱుగనిమాట సత్యమే. నేను దీనిలో తప్పక రెండుపదాలు వుండి తీరతాయనిన్నీ- ఉదారపదం యేలాటి శబ్దసంఘటనవల్ల నిష్పన్న మయిందో యిదిన్నీ ఆలాగే నిష్పన్నమై వుండాలనిన్నీ అనుమానించి అమరవ్యాఖ్యానాలు మఱికొన్ని తిరగేశాటప్పటికి- సుధ అనే వ్యాఖ్యానంలో నేను అనుకొన్న వ్యుత్పత్తి కనపడింది. ఈ గందరగోళం నాలో నేను పడిందే గాని యెవరో శంకిస్తే పడిందికాదు. ప్రస్తుతం వక్తవ్యాంశం యేమిటంటే? యేదేనా వొక శబ్దాన్ని గూర్చి తప్పని గాని వొప్పనిగాని అనవలసివస్తే యెంతో పరిశీలించి అనాలిగాని చట్టన అనఁగూడదనియ్యేవే. ఒకరు వొకవిధంగా అభిప్రాయపడితే యింకొకరు యింకోవిధంగా అభిప్రాయపడి వ్యాఖ్యానించడం వుంటుంది. అట్టి సందర్భంలో మనకు వుభయులున్నూ అనుసరించతగ్గవారే అని శ్రీరామకవిగారి తాత్పర్య మైనట్టు లోఁగడ వుదాహరించిన-

ఏ కై క మ తా వ లం బు లు

అనేపదం వ్యాఖ్యానిస్తూ వుంది. యెవరుగాని ప్రాచీనులలో ప్రసిద్ధులు అంగీకరించినట్టయితే అది మనకు వుపాదేయమే అని శ్రీరామకవిగారిమార్గం స్ఫుటపఱుచుచున్నది. ఇచ్ఛుధాతువుకు యకారం

చేరడానిక్కారణం 'బలిమి నీయని' అనే నన్నయ్యగారిప్రయోగం. కొందఱు ఇయ్యని అనిప్రయోగించారు ప్రాసస్థానంలో; కొందఱు ఇవ్వని అనివాడినవారున్నూ వున్నారు. దాన్ని బట్టి ఈవరుసాధువు, శ్రీరాములుగారు స్వతంత్రులు. నిరంకుశాః కవయః. యతిప్రాసలు లేకుండా రచనసాగించుకుంటామనేవారిని గూర్చి కూడా శ్రీరామకవిగారు కొంత అంగీకారాన్ని సూచించివున్నారు——

తే. గీ. వారిపద్ధతి మన మేల వదలవలయు, నట్టివే యగుఁగాక యిం దకరణమునఁ
గరణమునఁ బ్రత్యవాయముల్ గానరావు, కానఁ గరణంబె చేకొనం గడు సుఖమ్ము.

సంస్కృతకవిత్వమునందుఁగూడా యతిప్రాసము లుంచి రచించిన రచన కొంత శ్రీమద్భాగవతాదులలో కనబడుతుంది. కాని తెలుఁగులోవలె నిర్బంధం మాత్రం లేదు—— ఆయీయతిప్రాసలు ఆలంకారికులు అధమకవిత్వంగా పరిగణించిన కవిత్వానికి వుండే వికారాలలో వొకభాగంలోకి వస్తాయి. కవిత్వానికి అధమత్వాన్ని ఆపాదించే యీసామగ్రికోసం యెంతో పాటుపడడం శోచ్యమని ఆలంకారికమర్యాద నెఱిఁగిన ప్రతిసహృదయుఁడున్నూ అంగీకరించేదే కదా? యింకొకటి యేకవియేనా తనకు వున్న శక్తిని వినియోగించి తనరచనకు వుత్తమత్వాన్ని సంపాదించుకోవడానికి ప్రయత్నించడం యుక్తియుక్తం గాని అధమత్వాన్ని సంపాదించుకోవడానికి యత్నించడం యుక్తియుక్తం కాదు. అయినప్పటికీ ఆంధ్రకవు లందఱూ నియతంగా పద్యాలలో వీట్లని అలంకరిస్తున్నారు. వారిఆచారాన్ని మనం యేలమానాలి? కనక కరణాకరణపక్షములలో కరణపక్షాన్నే అవలంబించడం సుఖమని తేల్చినారు. తేల్చి లేనిపోని శషభిషలు పెట్టుకోక ప్రాచీనకవులు వాడిన యతిభేదాలన్నిటినీ అంగీకరించి నేను రచన సాఁగిస్తాను. మీ కిష్టం లేకపోతే లేకపోవుగాక! నాజోలికి మీరు రావద్దని యెలుఁగెత్తి చెప్పిన యీ మహాకవిని నేను అభినందిస్తూన్నాను. (బుధనేతవిధాన వృథా వివాదముల్ పెంచకుఁడు- చూ.) భారతం మొదలు సుమతీశతకందాఁకా రచనలు పరిశీలిస్తే యెక్కడో వొకచోట ప్రతీకవిన్నీ——

## రేఫ శకటరేఫలకు

యతిప్రాసలలో చుట్టఱికాన్ని కలుపుతూనే వున్నాఁడు. అట్టిదానికోసం నేఁటికవులు శిఖపట్లగోత్రానికి వుపక్రమించడంకూడా తెలివితక్కువే అని శ్రీరామకవిగారు తెల్పివున్నారు. కవికి స్వాతంత్ర్యం వుండాలి. అది లేనిదే రచన శోభించదు. సహృదయరంజకత్వం చూచుకోవాలి గాని ఆయీ తన మార్గం ప్రాచీనులు వెళ్లినదా? కాదా? అనుకోకూడదు. యెంతో రచన సాఁగించి నప్పటికి తుదకు కవికి మిగిలేది యేకొంచెమో వుంటుంది. తక్కినదంతా బుట్టదాఖలు కావలసిందే. అట్లని రచన మానకూడదు. తోఁచినదాన్నల్లా వ్రాస్తూనే వుండాలి. అందులో యేదో పనికివస్తే పనికివస్తుంది. ఋషు లేమన్నారు?

శ్లో॥ యేష్టవ్యా బహవః పుత్రా యద్యేకోఽపి గయాం వ్రజేత్.

అన్నారు. వ్రాసిన వ్రాతంతాకూడా లోకరంజకం కాకపోవడమూ వుంటుంది. ఆపక్షంలో కూడా కవి వూరుకోఁడు, యేదో వ్రాస్తూనే వుంటాఁడు——

"పలువురు సత్కవిత్వ మది పొల్పడకుండినఁ గొన్ని పుస్తక
మ్ములు రచియించి...సుతులఁ గాంచక యుండునె? రూపహీనుఁడున్"

శ్రీరామకవిగారు యీ దేవీభాగవతానువాదములో చాలవఱకు పురాణపాకంగానే రచన సాగించినా అక్కడక్కడ ప్రబంధపోకిళ్ళుకూడా వున్నాయి :

"సీ॥ కస్తూరికలయంపి గమగమల్ వాఁకిళ్ళఁ దమ్మిగంబురపొళ్ళతావి నోళ్ళ......
తే॥ గీ॥ ......ఎఱిఁగి స్మరియింపఁ జప్పళ్ళ నెత్తుగుళ్ళ.''

ఆ యీ సీసమంతా ళకారద్వయాంత్యప్రాసంతోనే ముగించఁబడినందుకు యీ చెళ్ళపిళ్ళ సంతసించుతున్నాఁడు. యింకా యిట్టివి చాలా ప్రబంధపోకిళ్ళున్నాయి. విజ్ఞులు పరిశీలింతురు గాక! అయితే యీమాదిరిరచనకూడా కవిత్వానికి ఆవశ్యకమేనా అంటారేమో. యీలాప్రశ్నించేవారు వృద్ధులు. తదితరులకోసం ఇదికూడా కొంతవఱకు ఆవశ్యకమే అనక తప్పదు. యీయన యెంతటి ఆశుధారా కవియో తెలిసికొనుటకు యీ గ్రంథం అయిదుమాసాలలో ముగించుటయే చాలును. ఆశుధారా కవులు నేఁడున్నూ పూర్వమున్నూ, పలువు రున్నప్పటికి యింతటి మహాగ్రంథమును తదేకదీక్షతో యింతటి స్వల్పకాలంలో ముగించినవారు లేరనియే చెప్పవచ్చును. శీఘ్రరచన కవిత్వానికి కలిగించే విశేష మేమీ లేకున్నను ఆశ్చర్యాన్ని కలిగింపక పోదు. ఇంత శీఘ్రకాలంలో రచించఁబడ్డదే అయినా యీ కవిత్వం ఆలోచించి రచించినట్లే యున్నదని చెప్పుటకు సంశయింప నక్కఱ లేదు. ఆశుగా రచించే శక్తి వొకటి వుండాలిగాని అదంటూ లభిస్తే యితరులు ఆలోచించి రచిస్తే యేలా వుంటుందో రచన ఆశుకవులు త్వరలో రచించినా ఆలాగే వుంటుంది (చ॥ ఇతరకవుల్ ప్రియాసపడి...చక్కఁగనుండు నసంశయమ్ముగన్॥ నానారాజ. లేదా శతావధానసారం చూ.) ఈకాలంలోకూడా మంచిరసవంతమైన కవిత్వం చెప్పఁగలవారున్నారని మనం గర్వించడానికి శ్రీరామకవిగారి రచన చాలా సహాయం చేస్తుంది. ఇప్పుడు కూడ మంచి రసవంతమైన కవిత్వం చెప్పేవారిని వొకరిని నేను నిన్నమొన్న బెజవాడలో సందర్శించి యున్నాను. ఆయన శ్రీయుతులు కీ. శే. అక్కిరాజు ఉమాకాంతకవిశేఖరులకు పెత్తండ్రి కుమారుఁడు; పేరు చంద్రమౌళి. వీరిపద్యం నేను విని ధారణ పట్టింది: యిక్కడ వుదాహరిస్తాను:

ఉ. తిన్నది జీర్ణమౌను; బలుదిక్కుల కేఁగ బనేమి? కూటికా?
యున్నది; వండి పెట్టఁ గలయోపిక యున్నది భార్య; కింకఁ జే
లున్నవి తోట దొడ్డి పసు లున్నవి; అన్నిటికన్న మిన్నగా;
నున్నవి నీ పదాంబుజము 'లోడకు' మంచు మహేంద్రవందితా!

భగవంతుఁ డనుగ్రహించి యిస్తే యీలాటి కవిత్వంతో దేన్ని వ్రాసినా అది లోకంలో చిరస్థా

యిగా వుంటుంది. కాసుల పురుషోత్తమకవి రచించిన శ్రీకాకుళాంధ్రదేవశతకమూ మానస బోధ శతకమూ చూడండి. యింకో కవి (సమయానికి పేరు బాగా జ్ఞాపకం వచ్చిందికాదు.) గోకుల పాటి కూర్మకవి అనుకుంటాను. ఈయన రచించిన సింహాద్రి నారసింహశతకమూ మృత్యుంజయ విలాసమూ చూడండి! వాట్లకి అవే సాటి! వీట్లముందు నిలిచే కవిత్వం నూటనాట యెక్కడో గాని వుండదు. యిట్టిధార కాని పద్ధతిని యెన్ని వ్యాకరణాలు యెన్ని తర్కాలు యెన్ని మీమాంసలు చదువుకొని కవిత్వం చెప్పినా అది తద్దినపుమంత్రంలా వుంటుంది. దాన్ని మనం కొంత లంచమిచ్చి చదవవలసిందని ప్రార్థించినా చదివేవా రుండరు. పూర్వకాలంలోనైతే అట్టి కవిత్వాలు పైకి రావడానికి అవకాశం లేక తాటాకులలోనే పడి వుండి అంతరించేవి.

చ. మునుపు మహాకవీంద్రులు సమున్నతరీతి రచించు కబ్బముల్
వినుతికి నెక్కఁగాని యవివేకుల కూఁతలు తాటియాకులం
దునె నశియించె. (శతావధాన సారం-చూ)

యిప్పుడు అచ్చువేయడం మట్టుకు జరుగుతూ వుంది కాని పర్యవసానం డిటోగానే జరుగుతూ వుంది. యిప్పుడు నేను వుదాహరించిన చంద్రమౌళి కవిగారి పద్యంవంటి పద్యాలు శ్రీరామకవిగారి తెలుఁగు నాడునిండా వున్నాయి.

"సుకవితా యద్యస్తి రాజ్యేన కిమ్"

అనే భర్తృహరివాక్యంకూడా ప్రతి కవిత్వానికి సమన్వయించేది కాదన్న రహస్యం అందులో వున్న "సు" అనే విశేషణంవల్ల స్పష్టంగా తెలుస్తూనే వుంది. కనక విస్తరించేది లేదు. ఈ దేవీ భాగవతానికి శ్రీరామకవిగారు వ్రాసిన కృత్యాదిరచన కొత్త పోకడగా నున్నది. అందులో చాలా విశేషా లున్నాయి. అందులో వారి పూర్వనివాస మగు

అల్లూరు నుగూర్చి

వ్రాసిన సీసపద్యాలకు వెల చెప్పవలసి వస్తే అక్షరలక్షలకన్నా మించుతుంది. ఆ ఘట్టంలోనే వున్న గద్యలుకూడా ఆరీతిగానే వున్నవి. చదువరులు శ్రద్ధగా పరికింతురుగాక. వంశవర్ణనలో తలిదండ్రు లనుగూర్చి రచించిన స్వభావోక్తిసీసం చదివి తీరవలసిందే!

సీ॥ కన్నయ్య పండింపఁ గామమ్మ వండింప లేచిన విస్తళ్లు లెక్క లేదు ...

తే॥ గీ॥ ...అట్టి నా తల్లిదండ్రుల నాత్మఁ దలఁతు.

ఆపుణ్యదంపతుల కిట్టి మహానుభావుఁ డుదయించుట యుక్తమే. యీశ్రీరామకవిగారుకూడా పూర్వులపోలికిగానే గార్హస్థ్యమును జరుపుకున్నారు. యీయనకొమాళ్ళలో నారాయణరావుగారు ద్వితీయులు. ఈయన ఆంగ్లభాషలో కృషిచేసినవారే గాని తండ్రిగారివలె కవితావ్యాసంగంకూడా చేసి కొన్ని పాత్రములు రచించినవారని నే నెఱుఁగుదును. ఈయన కొమరులలో మాత్రమే

కాదు—కవిత స్త్రీసంతానమునందుఁగూడా ప్రవేశించి యీమహాకవికి యిహానందాన్ని పెంపొందించింది. కవిత్వంలో కొడుకు లందఱికీ ప్రవేశం లేకపోయినా విద్యావిషయంలో అందఱూ ప్రాజ్ఞులే. వీరిసంతానంలో విద్యావిషయములో కొంత తగ్గుగా చెప్పఁదగ్గవారు జ్యేష్ఠపుత్రులు కేశవరావుగారే, కాని ప్రయోజకత్వంలోమాత్రం కేశవరావుగారు—

"పుత్రాదిచ్ఛేత్పరాజయమ్"

అనే మహాగౌరవాన్ని తండ్రిగారికి కల్గించినారని లోక మెఱిఁగినవిషయమే. ఇది విషయాంతరం. మనం ప్రస్తుతం ముఖ్యంగా ముచ్చటించుకోతగ్గది కవిత్వంకదా? నే నింతకు ముం దుదాహరించిన సీసపాదంలో—

"లేచిన విస్తళ్ల లెక్క లేదు"

అనే వాక్యాన్ని కొంచెం విమర్శించి చూపుతాను. యీస్థలంలో రసజ్ఞత్వం లేనివారు చేసే శంకలు యీవిధంగా వుంటాయి—విస్తళ్లు లేవడ మేమిటి? విస్తరిలో నిండుగా పదార్థం వుంటే విస్తరి లేవదు కదా? కనక వారి అన్నదానం(అర్థాకలిగా పెట్టేదని ధ్వనిస్తూ వుంది) వర్ణనీయం కాదని వొకశంక. యింతే కాదు, విస్తరి అచేతనం—కనక లేవడం తటస్థించదని యింకొక శంక; విస్తళ్లు లెక్క లేదు అనేచోట క్రియాకారకాన్వయం యేలాగ? విస్తళ్లు బహువచనం కనుక క్రియాపదం బహువచనంలోనే (లేవు) వుండాలి అని మఱోశంక. యీలాటిశంకలు చేసేవారిని గూర్చి శ్రీనాథుఁడు చక్కఁగా వ్యాఖ్యానించి వున్నాఁడు—

శా. హంసీయానకు...ప్రధ్వంసాభావము ప్రాగభావ మనుచుఁ దర్కింతు రెక్కాలముఁ. చూ.)

ఆయనకంటె అధికంగా వారిని మనం గౌరవించఁజాలం. కనక ఆ మహాకవికి నమోవాకాలు సమర్పించి ప్రకృత ముపక్రమింతముగాక. అయితే శ్రీనాథుఁడు వర్ణించినవర్ణన శుష్కతార్కికులకు సంబంధించినది. వారికి కవితాస్వారస్యం తెలియకపోవచ్చును గాని శాస్త్రంలో ప్రజ్ఞ లేక పోలేదు. వారు సూత్రాలను వ్యాఖ్యానించినట్టు కవిత్వాన్ని వ్యాఖ్యానించడానికి వుపక్రమిస్తే లోకజ్ఞానం లేని వారి పాండిత్యాన్ని చూచి శ్రీనాథుఁడు పైవిధంగా మందలించాఁడు.యిప్పుడు శంకించే శంకలు శాస్త్రప్రజ్ఞ వున్నవి కావు.కవిత్వానుభవం (ఏదోరచన సాఁగించినంతలో అనుభవం వున్నట్టు కాదు) వున్నవి కావు. న న్నడిగితే పైమాదిరి శంకలు చేసేవారికి మాత్రమే కవిత్వరసజ్ఞత్వం లేదని చెప్పి వూరుకోనేది లేదు.

"దశపూర్వేషాం దశాపరేషామ్"

అని చెపుతాను. "తేభ్యో మహద్భ్యో నమః". శ్రీరామకవిగారు సంస్కృతంలోకూడా నిశితమైన సాహిత్యం కలవారే ఐనను కవిత్వాన్ని తత్సమపదభూయిష్ఠంగా నడిపించక తఱచు తెలుఁగు పదాలతోనూ తత్తుల్యంగా వుండే తత్సమపదాలతోనూ నడిపి వున్నారు. (ఆ॥ వె॥ తెలుఁగదేల యన్న దేశంబు తెలుఁగు చూ.) కొంచెం మచ్చుచూపుతాను.

ఉ॥ తాఁకినతాఁకునం బడి వితాకున బండ్లికిలించి రక్కసుల్
మూఁకలు మూఁకలై పఱవ ముట్టి నఖక్రకచాళి గీరినన్
వాఁకలు గట్టి నెత్తురులు వాఱఁ "గుయో? మొఱో!" యంచు వేదనన్
గేకలు వెట్ట నాత్మఁ బరికించి వడిన్ దనుజేంద్రుఁ డుగ్రుఁడై. (పంచమస్కంధము)

సంస్కృతపదజటిలంగా వుండే రచనకూడా కొంచెం చూపితేనే కాని చదువరులకు తృప్తి కలుగదు-

సీ॥ గరుదంచదురుమరుద్ధతపటాపటపటాపటు-తాపతితపాదపవ్రజంబు

*   *   *   *   *

తే॥ గీ॥ ...పోషణంబగు తార్క్ష్యవిభూషణంబు.

(సంస్కృతంబు పచరించినపట్టున భారతీవధూటీ......చూ) దీన్ని నేను వెదికివెదికి వుదాహరించ లేదు. యెక్కడ పడితే అక్కడ యిట్టి సంస్కృతపదజటిలాలూ దొరుకుతాయి. అట్టి తెలుఁగు పదాలవీ దొరుకుతాయి. మూరుమూలపదాలు యేరి కూర్చడం కొందఱు కవులకు పరిపాటి, కొందఱు ఆలా కాక సమయానికి స్ఫురించిన పదాలతోనే రచన సాగిస్తారు. నాకు ఆలాటి రచనే హృదయంగమంగా కనపడుతుంది. మాఱుమూల పదాలు యేరియేరి కూర్చినరచనను గూర్చి మొల్ల-

"మూఁక చెవిటివారి ముచ్చ టదియు"

అనేసింది. కవి తన భావాన్ని యెంత సులభశైలిలో వివరిస్తే అంత శ్లాఘ్యుఁడు. శ్రీరామకవిగారు చాలాచోట్ల మూలాన్ని అతిక్రమించి కొంత స్వంతంగా రచిస్తూ వచ్చారు:

తే. గీ. నిప్పు దా జొన్నచొప్పయు నీరపతియు, గడ్డి యముఁడు తవుడు పెద్దగాలి చిట్టు
సూర్యచంద్రులు గుగ్గిళ్ళు చూడ నాకు, నమలివేయనె! గడియలో నమరపతిని.

బహుశః పై పద్యంలో వున్న మేటరు మూలంలో లేదనే నాకు జ్ఞాపకం. మహిషాసురుఁడు కదా? వాఁడు వానికి భక్ష్యమైన పదార్థాలుగా శత్రువులను వాఁడు వక్కాణించుట మూలంలో లేక పోయినా అనువాదకులు గ్రహించుటలో తప్పేమి?—

శ్లో॥ అవసరపతితా వాణీ గుణగణరహితాఽపి శోభతే.

కదా? దిఙ్మాత్రమ్ముదాహరించితిని. ఇట్టి స్వకపోలకల్పనలు ప్రతి స్కంధమునందూ వున్నవి.— షష్ఠస్కంధంలో హైహయులు పురోహితులను ధనలోభంచేత పీడించినఘట్టం యావత్తూ కవి గారి స్వకపోలకల్పితమే. పోతరాజుగారు శ్రీ కృష్ణుని బాల్యచేష్టలు వర్ణించినట్లే ఈ ఘట్టంలో శ్రీరాములుగారు కల్పించినారు. ప్రకృతం యింకొక పద్యం వుదాహరిస్తాను.

"ఆ. వె. చేతిదండ మేమి చేయు నీపట్టున, నెక్కినట్టి దున్న నెచటఁ దోలఁ?
గాఱుదున్న లిన్ని కడలెల్లఁ గ్రమ్మెను, దాఁటగలనె యంచు ధర్ముఁ డేడ్చె."

యీ పద్యంలో వున్న మేటరుకూడా మూలంలో వున్నట్టు నాకు జ్ఞాపకం లేదు. మా తెలిగింపు యిప్పటికి దాదాపు యేభైయేళ్ళనాఁటిది. మళ్లా సంస్కృతాన్ని చూస్తేనేకాని యేమాటా రూఢిగా చెప్పలేను. కాని తఱచుగా స్వకపోలకల్పితాలు వుండడంవల్ల యిదికూడా ఆలాటిదే అనుకున్నాను. చదువరులు పరిశీలింతురుగాక. యీ మహిషాసుర యుద్ధఘట్టంలో యింకా యీలాటివి చాలా వున్నాయి. వీట్లని మూలాతిక్రమణంగా సహృదయుఁ డెవ్వఁడూ భావించఁడు.

"ఉ॥ ఒక్క యెడన్ సమానముగ నొక్కొకచోట విశేషరీతిగా
నొక్కెడఁ దగ్గుగా మఱియు నొక్కెడ వేఱొకరీతి దోఁపఁగాఁ
జక్కఁగఁ జేసి రెల్ల కవిసత్తములు." (శ్రీనివాస విలాసం—చూ.)

యీయన కవిత్వంలో వున్న విశేషాలు చాలా వ్రాయవలసినవున్నా వార్ధక్యదోషం చేత యేర్పడ్డ శక్తిలోపం అడ్డు తగిలింది. ఈయన సాక్షాత్తూ శ్రీనాథుని అవతారమే అంటే ప్రతి చెప్పేవారుండరని నా విశ్వాసం. శ్రీనాథుని కంటేకూడా యీయన జీవితం మిక్కిలి ధన్యం. కవిగృహస్థులలో నిట్టి యదృష్టాలు పట్టినవారు మృగ్యులని కాని, అసలే లేరనికాని నిస్సంశయంగా చెప్పవచ్చు. ఇతర కవులతో కంటే నాకు యిమ్మహాకవితో చుట్టరికం కొంత సన్నిహితం. దేవీభాగవతాంధ్రీకరణ కవులలో నేనుగూడ నొకఁడనుగదా? అందుచే మేము సోదరప్రాయులం. అన్యోన్యం గురవో విప్రాః.-

"శ్లో॥ కవిః కరోతి కావ్యాని లాలయ త్యుత్తమో జనః
తరుః ప్రసూతే పుష్పాణి మరు ద్వహతి సౌరభమ్."

గ్రంథకర్త "తన మార్గం యిట్టిది. నేను వీలయినంతలో భాషకు వుండే అనావశ్యకపు సంకెళ్ళను తొలఁగించడానికే ప్రయత్నిస్తాను గాని మఱికొన్ని సంకెళ్లు తగిలించడానికి ప్రయత్నించేది లేదు, నాజోలికి మీ రెవరూ రావద్దు."

అని కంఠోక్తిగా చెప్పడానికి తాత్పర్యం విచారిస్తే తేలే సారాంశం యేమిటంటే? చాలామందికి—

"సూఁదిబెజ్జ మంత నోరూ, ఆకాశమంత ఆఁకలి"

అన్నట్టు ప్రజ్ఞ తక్కువా, ప్రతిష్ఠాకామిత్వం యెక్కువగానూ వుండి ఆతరగతివారు తదర్థమై కొంత వ్యర్థమైన కోలాహలం చేస్తూ వుంటారనిన్నీ అట్టివారికి జవాబులు వ్రాస్తూ నాకాలాన్ని వ్యర్థ పుచ్చేది లేదనిన్నీ వక్కాణించినట్టు తేలుతుంది. అంతేకాని నేను లక్షణవిరుద్ధంగా రచన సాగిస్తాను, నాయిష్టం నాది, నన్నడగడానికి మీ రెవ్వరు అనేది కాదు. అందుచేతనేకదా? యెందఱో మహాకవులను అథార్టీ చూపవలసి వచ్చింది. యేకవిగాని తనకవిత్వాన్ని—

ఉ. "ఆదిని శబ్దశాసనమహాకవి చెప్పిన భారతంబులో, నేది వచింపఁగాఁ బడియె..."

అన్న కవిరాక్షసుఁడుగారి నియమాన్ని పాటించినట్లు లేదు.

ఉ. కాలముఁ బట్టి దేశమును గాంచి ప్రభుత్వము నెంచి...

అన్నమాదిరిగానే రచన సాఁగించినట్లు కనపడుతుంది. యెవరిదాఁకానో యెందుకు? తిక్కన్న శంభుదాసులుకూడా పైనియమాన్ని అంతో యింతో (పాయ తిన్నా కంపే, గడ్డ తిన్నా కంపేగదా) అతిక్రమించినవారే. అంటే యిఁక శ్రీనాథాదులనుగూర్చి చెప్పవలసి వుంటుందా? యీరహస్యాన్ని యెఱిఁగిన ప్రతికవిన్నీ తనకాలంనాఁటికి ప్రపంచకంలో కలిగినమార్పులలో యుక్తమైనవాటిని (ఫిడేళ్లు, రైళ్లు, బాంబులు, ప్యారచూట్లు వగైరా) తనకవిత్వంలో శబ్దవిషయంలోనూ అర్థవిషయం లోనూ పరిగ్రహించడంలో లేశమూ దోషంకాదని శ్రీరాములుగారి తాత్పర్యమైనట్లు వ్యంగ్య మర్యాదచేత స్పష్టంగా గోచరిస్తూవుంది. యిదియే లోకాదరాన్ని పొందవలసినకవికి అనుసరణీయ మని నే ననుకుంటాను. కాదు, కవిరాక్షసుఁడుగారి శాసనప్రకారమే మేము నడుస్తామంటారా (వట్టి మాటలేకాని క్రియ శూన్యమే) మి మ్మెవళ్లు వద్దంటారు? మీరు అలాగే నడవండి అనేదే జవాబు. శ్రీరామకవిగారిరోజులకు అప్పుడే పాశ్చాత్యభాషావ్యాప్తి మనదేశంలో కొంత కలిగింది ఆకారణం చేత తెలుఁగుకవులలో చాలమందికి తమకవిత్వాన్ని పండితులద్వారా సంస్కరించుకోవలసిన అవస్థ ఘటించింది. ఈ దురవస్థ శ్రీరామకవిగారికి ఘటింపలేదు. అందులో ఈ భాగవత రచన నాఁటికి, అట్టిప్రసక్తికి బొత్తిగా అవకాశం లేదు. మూలాన్ని యీయన వ్యాఖ్యానాపేక్ష లేకుండానే సమన్వయించుకున్నారు. ఈయన విద్వత్కవి.

శ్లో. "విద్వత్కవయః కవయః, కేవలకవయస్తు కేవలం కవయః"

నామతంలో కేవలకవిగూడా సమ్మాన్యుఁడే. నేను ప్రధానంగా చూచేది రసమే. అది లేనిపద్ధతిని ఆపాకం 'స్వహస్తపాకమే'. యీయన సరసకవి, విద్వత్కవి, స్వతంత్రకవి, ఆశుకవి, దాత, నేత. ఇన్ని యోగాలు పట్టినవారు యేకాలంలోనూ కవులలో మృగ్యులే. షష్ఠస్కంధంలోని స్వకపోలకల్పిత భాగం పురోహితులను వెక్కిరించినట్లు కనుపడుతుందిగాని అది బుద్ధిపూర్వకం కాదని నే ననుకుంటాను. సహృదయాః ప్రమాణమ్.

# కర్మవీరుఁడు

[ఏకాంకనాటిక]

శ్రీ విశ్వనాథ వేంకటేశ్వరులు

## అంకితము

కలఁ డన్నిట, లేఁడన్నిట
ఫలపాకోన్నేయ కార్యపరతంత్రుఁడు ని
ర్మలుఁ డయ్యంకికులాఢ్యుం
డల వేంకటరమణమంత్రి కంకిత మిదియున్.

Δ

## మొదటి రంగము

వాణి—(ప్రవేశము)

క. ధర్మాపరావతారులు, కర్మిష్ఠులు, వారి హృదయకమలములందున్
ధర్మావిరుద్ధఫలభా, క్సర్మదమౌ క్రియ వెలుంగు సత్త్వాఖనినై.

చ. వినుతఫలాభిసంధిపదవీసుదవీయసినైన సత్క్రియా
ప్రణుతమహానుభూతిఁబడి పారములేని మహోద్వయత్వభా
గనుపమతత్త్వసిద్ధిఁ గనునట్టిరు యోగులు; తత్సుధామయో
న్మనికళ వెల్గు విశ్వగణమంగళదీపిక యౌచు నిచ్చలున్.

క. ఆద్యంతరహిత ముద్య, ద్విద్యామయమూర్తి నిగమవిజ్ఞానకళా
విద్యోతితాత్మవస్తూ, త్పాద్యప్రభమౌచుఁ గ్రియ విభాసిలు జగతిన్.

ఇది ప్రస్తావన.

కర్మవీరుఁడు, ఫలదేవత - ప్రవేశము

కర్మవీ—.

క. పదివేల విశ్వజిత్తులు, పదివేల్సత్రములు కోటి వాజియజనముల్
తుదినొంది తృప్తి లేదే, సదా క్రియానుభవరక్తి సక్తత నాకున్.

ఇది యంతములేని యజ్ఞము. దీనికి నేన యజమానుఁడను. శాంతతపస్స్వరూపిణి, యస్మదర్ధాంగి

శ్రీమతి క్రియావధూటి. జీవాత్మపరమాత్మల సంయోగ బీజమైన చిన్మయావస్థామాత్ర స్వరూపిణియైన యీ క్రియాదేవితోఁ గ్రీడించుచు నే నిత్యతృప్తుడనై యుందును. ఈ విశ్వమంతయు యజ్ఞవేదిక. సూర్యచంద్రులు స్రుక్స్రువంబులు. సృష్టిస్థితిలయాత్మకమైన యీ యజ్ఞ మిట్లు సాగిపోవలసినదే.

ఫలదేవత—కాదు. ఇది యిట్లు సాగిపోనక్కరలేదు.

కర్మవీ—(వినిపించుకొనక)

గీ. నేను గ్రియయును గ్రియయును నేను గాగ, నిర్వ్యరము నొక్కటే; భేద మేమి లేదు
క్రియయుఁ గర్తయు నేకమై కేవలముగ, సత్త్వ మొక్కఁడె మిగులు విశ్వంబు నిండి.

ఫల—కాదు; నేనుగూడ నున్నాను.

కర్మ—నీ వెవరు?

ఫల—నేనా? నీ క్రియకు ఫలమను.

కర్మ—నా క్రియకు ఫలమవా? నిన్ను నే నెఱుఁగనే?

ఫల—ఎఱుగవు; ఎట్లెఱుగుదువు? వెఱ్ఱివాఁడు తన క్రియకు ఫల మెఱుంగునా?

కర్మ—సరి - ఇప్పు డేమి చేయుమందువు?

ఫల—ఏమి చేయుమందును? ఫల మనుభవింపు మందును.

కర్మ—సీ, సీ. ఇదివఱకే నే ననుభవించుచుంటిని.

ఫల—అది వేఱు, ఇది వేఱు; క్రియ ననుభవించుటకును, ఫల మనుభవించుటకును భేద మున్నది. అది పూర్వభావి. ఇది యనంతర భావి.

కర్మ—వెఱ్ఱిదానా! భోక్తకు భూతభవిష్యత్తులలో భేదప్రతిపత్తి లేదు. కాలత్రయమునందును భుక్తి భుక్తియే.

ఫల—ఓయీ కాలాతీతుఁడా! ఘటప్రాగ్భావమునందు ఘటత్వము లేదు. ఉత్పాదనక్షణానంతరకాలభావియే ఘటత్వము.

కర్మ—కాదు ఘటత్వము భ్రాంతి. అది కర్తృహృదయ కుహరమునఁ దత్పూర్వమే యంకితమై బీజావస్థలో నున్నది.

ఫల—బీజావస్థ యేమి? పరిణతమైన వృక్షావస్థలోనే యనంతమైన ఫలానుభూతి యమరుచుండుఁగదా?

కర్మ—ఇది కేవల దేహాత్మవాదము.

ఫల—దేహము ధర్మసాధనముల కాద్యముగదా?

చ. నిను వినువీధి కెత్తెదను నీవచనంబులు వేదసూక్తులై
తనరఁగఁజేయుదున్ దెసలఁ దారిన త్వద్ఘనకీర్తివల్లికల్
పెనఁగి ప్రపంచ మెల్లెడల విన్నను వొప్పు వితానజాలమై
ఘనతఁ జెలంగఁజేయుదును, కైబిగియింపుము నా వలగ్నమున్.

ఉ. నా కనుసన్నఁ దీర్చిన యనంతవిలాసమనోజ్ఞచంద్రికా
శ్రీకరరోచిరుజ్జ్వలిత సేవధులన్ సుమనోవిలాసమా
లాకిలికించితంబులఁ జలల్లవలీమృదుగాత్రఖేలనా
స్తోకరసోల్బణత్వములఁ దోఁగఁగఁ జేసి సుఖాబ్ధి నూఁచెదన్.

కర్మ—కర్మస్వరూపుఁడనైన నేను గ్రియాదేవత కధిష్ఠానమను. క్రియాతపస్స్వరూపిణియైన యామె నా కధిష్ఠానము. నేను గ్రియాభ్యర్చనము సేత క్రియాప్రాప్తికొఱకే. వేఱొకఫల మాశించి కాదు. మఱి యీయామె యెవ్వరో?

రాజు—(ప్రవేశించి)

తే. స్వస్తి ఫలదేవతకు సదా స్వస్తి యగుత, కత్తిమొనఁ జీల్చినట్టి యీ కాశ్యపియును
రత్నరాసులు పండి తా రత్నగర్భ, యనెడు దివ్యాంకమున నిత్య మలరుగాక!

వణిజుఁడు—(ప్రవేశించి)

క. తులనడిమికొనను ముల్లై, తులకించుచు ధాన్యలక్ష్మి త్రుళ్ళింతలుగా
వెలసెడు ఫలదేవత మా, యిలువేలుపు కంటికొసల నెసగుత లక్ష్మల్.

రయతు—(ప్రవేశించి)

క. నాగేటికఱ్ఱుకొసతో, వ్రేఁగగు గర్భంబుఁ జీల్చి పృథ్వీభాగ్య
శ్రీగరిమ మొదుచు ఫలభా, గ్యాగమరూపిణికి నివియె యంజలిపుటముల్.

స్త్రీ—(ప్రవేశించి)

శా. ఏ సౌందర్యము సృష్టికిన్ ఫలమొ సర్వేచ్ఛావిధాత్రీకలా
భ్యాస ప్రాగ్రియసృష్టిసార మెదియో, వైజాత్య సాజాత్య మి
థ్యానూత్నమ్ముల కంద కెయ్యది రసవ్యాపారితం బొల్చునో
యా సౌందర్యము, సత్ఫలాభిధము, నిత్యశ్రీ విభాసిల్లుతన్.

పురుషుడు—(ప్రవేశించి)

తే. పుట్టువొందిన మొదలుఁ దా గిట్టువఱకుఁ, గల మహాసంసృతిఝురంబు కదలిపోవఁ
దీర మెక్కిన ఫలరత్నవారములును, ద్యుతులఁ జిమ్మి యనశ్వరస్థితి వహించు.

కర్మ—ఓహో! జగ మంతయు నేతన్మయముగా నున్నదే! ఎంత త్రవ్వుకొనినను నీమె యాకృతి నాకు స్ఫురించుట లేదు.

వేదాంతి—(ప్రవేశించి)

తే. సోమయాగంబునకు స్వర్గధామ ఫలము, బ్రహ్మసృష్టికి సత్త్వంబు ఫలమ నూహ
హేతుఫలయుక్తిఁ గార్య ముద్యోతితమగు, బ్రహ్మసాక్షాత్కృతికిమాత్ర ఫలము లేదు.

తే. ఆత్మ నాత్మార్థము యజించునట్టివారు, కలవుగా, ఫలార్థము యాత్మ గాంచుచుంద్రు
ఈ యుపాధి పంజరబద్ధహేమశుకము, ఫలసమనుభూతి పొందక పడదు తృప్తి.

కర్మ——ఇతని దొక్కనిది మాత్ర మరణ్యారోదనమువలె నున్నది.

గీ. అనుగతక్రియమైన నా యాత్మయందు, క్రియ వినా యనుభూతి వే ఱెదియు లేదు
కర్తృతాహంకృతియు లేని కార్యమందు, ఫలముఁగూర్చిన యభిసంధి పరఁగునెట్లు?

(స్మృతి నభినయించి) ఓహో! యిదియా! అహంతలేని వట్టి యనుభూతియా యిది - ఈ ఫలదేవత యహంతాధిష్ఠాత్రి గావలయును.

ఫలదేవత——

ఉ. కూడ దహంతతో మమత, కోర్కులు సాగిన గాని మానసా
బ్జేడితనంద ముబ్బదు, సదీహలు వల్లులు´ గట్టి పూవులై
మోడిన మాధునిర్ఘరుల నొచ్చెములేని మదాళిఝుంకృతి
క్ష్వేడము లొప్ప స్వైరసుఖవీథులఁ గ్రుమ్మరవచ్చు నొంటిమై.

శా. ఏలా శూన్యతలున్ భజించెదవు నీ వీహావిహీనాకృతిన్
హేలాలోలకురంగదృఙ్మకరికాహేవాకవిన్యాసలీ
లాలాలిత్యము లేవగింపు లగునే? లాక్షారసోన్మిశ్రిత
ద్భాలాపజ్జలజాంకవీక్షణమహేప్సామోదముల్ మాటలే!

ఉ. స్వస్థత యున్నదే మునికి? సర్వజగంబులు లోన గిఱ్ఱునన్
దుస్థితిమై తడంబడగ? ధూర్వహతన్ సహజస్వభావ ని
త్యస్థితి మాన్పఁగాఁ దరమె? దారికి రమ్ము, త్వదీయబాహుయు
గ్మస్థగితోరుపీనకుచమండలనై సుఖియింపఁ జేసెదన్. (స్పృశించును)

కర్మ——ఇది యేదో యింద్రజాలమువలెనున్నది...... నేనొక క్రొత్తమానిసి నగుచుంటినా?...... ఈ లోకమే క్రొత్తగా నున్నది......ఓహో! ఏమి భవనములు, ఏమి నగరములు, ఏమి సురవిమానములు, ఏమి భోగములు, ఏమి యధికారము! నా యొడలు నాకే తెలియక పోవుచున్నది!

ఉ. కామఠవృత్తిఁ బూని నను గానక నేన హరించుకొంటి మి
థ్యామునిపై ఖరిన్ జెడితి నైహికవృత్తికి మోక్షరక్తికిన్
గామితముల్ జనింప వటఁ గార్శ్యము నొందవు మున్ను; నే డిఁకన్
ధీముషితంపు భోగములఁ దేలెద వ్రాలెద ముక్తివాటులన్.

క్రియా—తండ్రీ! నీవు న న్నిప్పటికైన గుర్తించుకొంటివా ?

యజ్ఞ—తల్లీ! ఈ శరీరమునందలి ప్రతిపరమాణువును నీ నుండి సముద్భూతము. నే నిప్పుడ పోయి కర్మవీరుని మన యింటికిఁ దెత్తును. (నిష్క్రమణము)

క్రియా—శ్రద్ధా! ఈ యకాండతాండవమునకు మూల మేది ?

శ్రద్ధ—ఏ మున్నదమ్మా! నిన్నును నన్నును గాదన్నారు.

మ. అలసుల్ శ్రద్ధ యెఱుంగనట్టి రట నిత్యానిత్యవిజ్ఞానశూ
న్యులు కావేయము నొంది శీఘ్రఫలధుగ్యూత్నాగమాభ్యాసులై
తలపం బోరట స్వస్వరూపమహిమాంతర్ధానయోగంబు దు
ర్విలసద్భాతికశక్తికల్పితమహోద్వేలప్రభాకృష్టిచే.

నీవు కొంచెమాత్త యోపికపట్టినచో వీరిపస లెల్లఁ జక్కనగును. (పరిక్రమింతురు)

ప్రవేశము—ఫలదేవత, కర్మవీరుఁడు.

ఫల—

గీ. శుష్కభావసమాధిలో స్రుక్కిపోక, కంటి కొంటికి నమరిన క్రమమైన
పుడమి సంపద యెల్లను బుడికికొన్న, శ్రీఫలాకారసత్క్రియాశీలి వగుము.

మ. ఇవిగో భోగము లియ్యవే నగరముల్ హేలాసభుల్ సంపదల్
పవిధార్యార్జితమై భవంబు లివిగో భర్మప్రభాడోలికల్
చవి యొప్పారు నవామృతంపురుషుకు లీ చాయఁ దోలంకాడు ని
య్యవి సౌవర్గమహార్హసౌఖ్యరమనిత్యావాసముల్ నెచ్చెలీ !

క. కోరుము సంకల్పింపుము, ఘోరమ్ముగ పోరు సల్పి కొట్లాడుము స
ర్వారంభంబులు నీవై, యారాధించును జగంబు లన్నియు నిన్నున్.

క. ఒకక్షణ మూరకయుండకు, మకలంకనిదాఘభానుననైల్ జగముల్
తుకతుకలాడగ జేయుము, వికలుని తూష్ణింకృతాత్ము వేడరు జనముల్.

క. సుడిగాలివలెను బ్రావృట్టడిత్త్వతి పయోధరాళి తనువున నుద్య
జ్జడనిధి యుప్పెన వడువున,గుడుసువడన్ జగము నేటికో ల్తలఁ జనుమా ?

కర్మవీరుడు—

మనోహారిణీ! నీవు నిక్కము వచించితివి.

క. పారావారం బటు స,ర్వారంభంబుల హఠాత్సమావృతి గందున్
సైవ్వరోద్వృత్తమహాశ,క్త్యారభటిన్ లోక మెల్ల నడికింతుఁ దమిన్.

గీ. నేను కేంద్రంబనై లోకనియతి యెల్ల, నాకుఁ బరివేష మాచు వర్ణనముసేయ
పృథ్వీసారం బదెల్లను బిప్పిచేసి, యాహరింతు నే నొకఁడ నాపోశనముగ.

మ. క్రియయే లేక సమస్తదివ్యఫలభాక్ప్రిమూర్తినై భూతసం
చయముల్ దద్దరిలంగ సంద్రముల నాచ్ఛాదించి వైహాయసా
ద్వయకేళీపరిశోభితుండ నయి భూధ్రస్తోమ నిర్భేదనా
త్యయమూర్తిన్ జగదంతరాళమును విద్రావింతు వీర్యప్రభన్.

క. వృత్రుడనై కప్పెదను ధ, రిత్రిని దీవ్యత్ప్రభావరింఛోళిని లో
కత్రయము హృషీకగణము, చిత్రింబాగతిని జొచ్చి చెండెద సృష్టిన్.

Δ

## మూడవరంగము.

వాణి—(ప్రవేశించి)

గీ. తన్నుఁ దనయందె చూచినఁ దానె యగును, దన్ను వెలిజూచి యుబ్బిన దనుజుఁ డగును
తరణి వెల్వడి వచ్చిన కిరణరేఖ, చెట్టుచేమయి తుది వట్టి మట్టి కాదె.

సీ. పశుపతి యొసఁగిన భవ్యాస్త్రమునఁ బార్థు, డరిసేనఁ గాల్చెనే కరుణ విడచి
బ్రహ్మాస్త్రమునేసి పడటుచేసెనె లంక, రామచంద్రుండు నిర్వక్రగరిమ
తన పదియవనాటి యనిలోన భీష్ముండు, వేటాడఁబూనెనే విపులపతుల
తన మహిమం బెల్ల వినియోగపఱచెనే, హనుమ దైత్యక్షోభణావహేల

గీ. కర్మయోగులు వారలు కార్యగతికి, వలసినంత శక్తిని వెలిపఱచి చనిరి
బ్రహ్మ మొక పాదమేకాదె బయలు గనుట, సర్వశక్తిబహిష్కృతి జడగుణంబు.

గీ. ఆత్మహననంబు చేసిన యట్టివాఁడు, పెక్కురూపులు గను జగత్పీడకొఱకు
చచ్చి కుళ్ళిన జీవి వర్ష్మమ్ము నుండి, పుట్టవే కీటములు వేలు పుట్ట లగుచు.

గీ. అంతమే లేని సంసరణాబ్ధిలోన, దుమికి రత్నగవేషణాతురత నొందు
నట్టి దురదృష్టజీవి మహాంధకార, గర్తమున జిక్కుఁగాని మోక్షమ్ముఁ గనఁడు.

క. కలదే కామపు వల్లికి, తొలి తుది యను నియతి దోషధూర్వహ మది యా
నలువయిలు వెలలి హాలా, హలిగా నరకంపుగొనల నందును ద్రేఁగై. (నిష్క్ర)

ధనలక్ష్మి—(ప్రవేశించి) కర్మవీరునకు స్వస్తి; ఫలదేవతకు స్వస్తి. సాక్షాద్విష్ణువక్షస్స్థలగత యఁట! క్షీరాబ్ధిసంజాత యఁట! పరాశక్తి యఁట! — ఈ లక్ష్మి నా కెదురా? అన్నిటఁ బైమెఱుఁగులు తనవి. బ్రహ్మవిదునియందలి బ్రహ్మతేజస్సు తా నఁట - వాగ్మియందలి వాక్కు తా నఁట — సర్వపదార్థతేజస్సు తా నట! అగుగాక! నేను లేనిది యిది ప్రకాశించునా?

క. కుణపమును మహాజ్యోతి, ఘృణిమంతంబుగ నొనర్తుఁ గేవల జడునిన్
ఫణిరాజరాజుఁ జేసెద, నణతున్ రాజ్యముల గోటియందుఁ జిదుముచున్.

క. ఉపమానరహిత నే నీ, ప్రపంచసారఫలరూపపరిణామాంగిన్
గృప లోక ముద్ధరింపగఁ, గపర్ది త్రాగిన గరమ్ము కణమును నేనే.

ఓహో! నామాయఁ జిక్కిన యీ భూతమ్ము లేమి హింసాకర్మమునకు డీకొనుచున్నవి! నా పరివారమైన రణహింసాదిదేవత లందరు జయజయనినాదములతో ఫలదేవతారాధకుఁడైన కర్మవీరు నుపాసించుచున్నారు. బ్రహ్మ గావించిన సృష్టికి మే మొక క్రొత్తరూపము తేఁబోవుచున్నాము. (పరిక్రమించును.)

హింస—(ప్రవేశించి)

గీ. రాతిరాతిసందున బెట్టి రాచిపెట్టి, యొడిచి రక్తమ్ము ప్రాణమ్ము లుక్కబట్టి
నలినలిగఁ జేసి బొమికలు కలగుడువడ, జగము నువ్వెత్తుగా మిన్నిఁగి చప్పరింతు.

నా కీ కర్మవీరుఁడు చేసిన మహోత్సవము నేమని వర్ణింతును? అల్పజీవుల మహాజీవులకు భక్ష్యముగాఁ జేసిన ధాత నియమ ముల్లంఘించి, నడుమ వచ్చిన యీ ముదివగ్గు లహింసను గొండ నెక్కించినారు. సాక్షాత్కృష్ణదేవునిచే నారాధింపఁబడిన నేను—

గీ. లోకముల బారిసమరెదఁ గాకులట్టు, లాహవాంగణసీమ యుద్ధాభిమాన
దేవతాబాహుపరిగూహనావృతనయి, చండవీరవిహారమ్ము సలుపుచుండి.

అహింసయఁట, ఆముష్మికఫల మఁట! సన్మాత్రావస్థితియందుఁ గ్రియాపరత్వమఁట. ఏమి వెఱ్ఱి!

గీ. ఒకనిఁ బీడింపకుండ ఫలోదయంబు, నొకని బాధింపకుండఁ గర్మోత్సవంబు
గలదె భువి? లోక మెల్లఁ జీకాకుచేసి, గాని నరుఁ డొందునే యిష్టకామ్యఫలము
నే నిదే ఫలదేవతాకర్మ వీరుల జయము నుద్ఘాటించెదను. (పరిక్రమించును)

యుద్ధదేవత—(ప్రవేశించి)

గీ. కత్తిమొన నోడు నెత్తురుకాల్వలోన, ముకురమునఁబోలి తన నవమూర్తిఁ జూచి
మురిసిపోవుచు నున్నది ముగ్ధ యగుచు, ఫలమహాదేవతామణి భాగ్యశీల!

గీ. నిత్యసంఘట్టనార్భటీసీతసర్వ, రాజ్యవైరానుబంధ సంరక్తిఁ బొడమి
తాండవించెద నే సముద్దామచటుల,యుద్ధభేరీనినాదసముద్ధతిమెయి.

సృష్టి యను మహాక్రియాకాండకు విలయమే మహాఫలము. ప్రలయస్వరూపిణినైన నేనే తత్ఫలాకృతిఁ గాంచి జగత్కర్త్రభీష్టమునకు సర్వధా తోడ్పడుచుంటిని.

గీ. అబలు రసమర్థు లనదలు నైన జీవు, లవని ఫలభోగమునకు సమర్థు లెట్లు?
కండబలమును నెత్తురు గౌరవంబు, గలుగు నాతఁడె మేటి రాక్షసుఁడుగాక.

హింసాధనలక్ష్మీ ప్రముఖులైన చెలికత్తెలును, క్షామజరారోగాది పరిచారికాగణమ్మును గొలువ నేనే సర్వలోకరాజ్ఞినై కర్మవీరునకుఁ ద్రిలోకరాజ్యపట్టముఁ గట్టెదఁగాక! నా ప్రియదుహితయైన దారిద్ర్యదేవత చాలదా యీ నరకీటముల రాచివేయుటకు? (పరిక్రమించును)

దారిద్ర్యదేవత—(ప్రవేశించి)

బళిబళి! కర్మవీరుఁడా! సర్వలోకప్రాణముల నుగ్గబట్టి సమస్తఫలసారమును బీల్చివేయుము. తపస్సులని, బ్రహ్మపదార్థమని, మోక్షమని, జగద్బ్రహ్మస్వరూపసిద్ధాంత మని క్షుద్రసిద్ధాంతములు పెట్టి నాకు నిలువ నీడలేకుండఁజేసిన యనాథలకు నిత్యమంగళ మగుఁగాక. సదసత్తులనఁబరగు జగదూర్ధ్వపద్వయమున నసత్స్వరూపిణినై యభావమూర్తినైన నన్నీ తత్త్వవేత్తలు పరిగణించనే పరిగణించరు. పురుషోత్తముఁడైన కర్మవీరుఁడు తాను వినా సమస్తజగము నభావరూపమునఁ బరిగణించుటఁజేసి నాకుఁ బునర్జీవము వోసి యుద్ధరించినాఁడు. సన్మూర్తినే క్రియామూర్తిగ నభ్యాసించువానికి జగ మంతయు సద్భావరూపమై స్వపరభేదశూన్యత్వము గలుగునఁట. అప్పు డిక భోగావస్థ యేమున్నదో! భోక్తృతలేని పురుషత్వము కాల్పనా?

గీ. ఉన్న దనుచోట లేమి తా నుండుగాదె, లేమి లేదనునట్టి దుష్కీ-బబుద్ధి
యుండునో తాను నిత్యంబు? నుండి యేమి, ప్రాముకొను సర్వ మున్న నిర్భరజగాన?

లేమియందేగదా కలిమికి గొప్ప? జగత్తంతయుఁ గలిమియైనప్పుడు కలిమిగలవాని కలిమి గొప్ప యేమి ? ఈ దుష్టుల కలిమి నన్నాశ్రయించినదే యైనను గృతఘ్నులగు వీరికి లేమినైన నా కలిమి గోచరింపదు. అయినను నా కేమిలోటు? అహంతాపూర్ణులగు నిట్టి కర్మవీరులు పదిమంది పుట్టినచో,

చ. పునుకలపేరు గల్లుమని బొబ్బురునాదము సేయ నాఁకటన్
మునుగుచు దప్పిదప్పి యని మూల్గులుజనంబుల గుండెలందు రే
గిన పెనునిప్పుకల్ దెసలఁ గేరి యెడారులు సేయ, లోక మె
ల్ల నటిమి నుగ్గునూచముగ లాస్య మొనర్తును పోటుకత్తెనై. (పరిక్రమించును)

(ప్రవేశము - ఫలదేవతాకర్మవీరులు)

కర్మ—(తేటి పాఱఁజూచి) చెలీ! నీ మోమున ముడుతలు కానవచ్చుచున్న వేమి? ఈ యకాల జర నీ కెట్లు సంభవించెనో!

ఫల—జర భోగలక్షణము. అదియు నా స్వరూపమే. నీకు భోగ్యపదార్థములలో నదియు నొక్కటి.

కర్మ—అయిన నీ భోగము సాంతమే యగునా?

ఫల—సాంతమైన దానియందే భోగజిజ్ఞాస. అనంతమైనదానియందు భోగవాంఛ లేదుగదా !
శ్రద్ధ—(ప్రవేశించి) కావుననే యనంతమైనదానికి జరయు లేదు.
యజ్ఞుడు—(ప్రవేశించి) భోగ్యమైనదానికి నిత్యతయు లేదు.
సంకల్ప దేవత—(ప్రవేశించి కర్మవీరుని కనులలోఁ గనులు పెట్టి చూచుచు)

గీ. భోగవాంఛాబ్ధిఁ దోఁగెడు పురుషునకును, నిత్యము ననిత్య మనునట్టి నియతి యేల ?
సూర్యకిరణపరావృత్తి శోభ నొందు, వర్తకూడదది శాశ్వతప్రభలు గనునె ?

ఇన్నాళ్లును నా చాటున బ్రదికిన యీ ఫలదేవత యిప్పు డిట్లు స్వైరవిహారిణియై క్రియాదేవతా స్వరూపమును గట్టి నిన్నుఁ గికురించినది. దానికిఁ బుట్టిన బిడ్డలైన యీ ధనలక్ష్మీ యుద్ధ క్షామ దేవతలు, చూచితివా, జగమునం దంతట నెట్లు వికటతాండవ మొనర్చుచున్నారో! ఇంకను మహామార్యాది పరిచారిక లెందరో యున్నారు. వీ రెల్లరును నీ యనుగ్రహావశమున లోకముపైఁ బడిరి. నీవు కర్మవీరుఁడవు. నిన్నుఁ గా దనుట కెవ్వరి కాస్కార మున్నది ?

గీ. తతమహాయజ్ఞరూపవిద్యాభిరామ, శ్రీ క్రియాదేవి సన్మూర్తి చెల్లనాడి
మాయకుచ్చుల బొంత యీ మందుకత్తె, వెంట నంటితి విది జగద్విద్వరాంగి.

ఫలదేవత—ఊరకున్న కొలది నోటికి వచ్చినట్లు ప్రేలుచుంటివి. నీవు మాత్రము సుద్దమా ! ఈ జగత్తునందలి కల్లోలమున కంతకు నీవకదా కారణము ? నీ తప్పు లన్నియు నాపై రుద్దఁ గడఁగకుము.

సంక—ఓసీ ! నేను శ్రద్ధాక్రియా దేవతలయనుపాజ్ఞలలోఁ బెరిగినదానను. నీవు స్వేచ్ఛావిహారిణివి.
ఫల—ఆ శ్రద్ధాక్రియా దేవతలను నే నెఱుగుదును. వారును నిన్నుఁ బట్టియే రూపాంతరముల నొందుచుందురు.

యజ్ఞుఁడు—క్రియా దేవత రూపాంతరముల నొందదు. త్రిగుణావిష్టు లగు జీవుల భ్రాంతివలన నామె రూపాంతరము లొందినట్లు కన్పడును గాని యామె నిత్యస్వరూపిణి.
ఫల—నిష్ఫలయు, నీరూపిణియు నైన యామె యున్న నేమి ? చన్న నేమి ?
యజ్ఞ—నీవుమాత్ర ముంటి వను నిశ్చయ మున్నదా ?
ఫల—కర్మవీరుఁడా ! నీవు తూష్ణీంభావము వహింతు వేల ? నే నుంటినా లేదా ?
కర్మ—ఉంటివి; త్వగాదీంద్రియములలో నుంటివి; పృథ్వ్యాదిభూతములలో నుంటివి. పరమార్థమున లేవు.
ఫల—పరమార్థ మొక్కటే సత్యమా ? జగత్తునకు వ్యావహారికసత్యత్వము లేదా ?
యజ్ఞ—వ్యావహారికసత్యత్వ మంగీకరించినను పరమార్థదశలో నత్యంతాసత్త్వ మొప్పికొనక తప్పదు.
ఫల—అంతవఱకు నేనులేక తీరదు.
కర్మ—అయిన నీ యందు సంగము కూడదుగదా !
ఫల—అయిన నేను లేకనే పోవుదుగాక !                (నిష్క్రమించును)

కర్మ—ఓహో! ఇది యేదో శూన్యావస్థ ప్రాప్తించినది. ఈమెను మఱల నాహ్వానించితినా, యీామె పరివారము తిరిగి జగత్తు పైఁ బడి పీకుకొని తినును. జగద్విద్వారరూపమైన యీా కర్మవీరత్వ మేటికి?

మ. గుణదూరామల కేవలాంతర క్రియాగోష్ఠీధృతిఁ భోగవ
ద్ఘనవై రాజ్యసుఖంబు లేదు, ఫలభోగం బెన్న దుఃఖప్రతా
రణ రేఖాస్పద మై వెలుంగు; నుభయప్రత్యర్థితఁ నిశ్చితిఁ
గనలేకుంటి నిదంసమిద్ధ మితి సత్ఖ్యాతిఁ గనఁ లేమిచే.

శ్రద్ధ—త్రివిధాహంకృతిలోఁ బృథక్త్వభ్రాంతి గలిగిన యహంకారము చెడ్డది. దానిని బోనాడి నచో మిగిలిన రెండహం కారములు నున్నతస్థితి హేతుకములు.

యజ్ఞ—సర్వమునందుఁ దాను, దనయందు సర్వము నున్నదను నాత్మాధ్యాస సర్వకిల్బిషచ్ఛేదకము.

కర్మ—అప్పుడు మాత్రి మీాఫలవికారబాధ లేదా?

సంకల్ప—దానియందు ఫలభోగకాంక్షాస్థితియే లేదు.

కర్మ—

క. లేనిది లే నట్లుండదు, తానై తా నుండ ఫలవిధానము కలదే?
మానునె సంసృతి యందును, గానైనది యగుచు నుండ, గతిమెయ్యదియో?

(నిష్క్రమింతురు)

Δ

## నాల్గవ రంగము.

వాణి—ప్రవేశము:

శా. తానే సర్వము నంట నిక్క, మది బోధస్ఫూర్తిమై మోక్షల
క్ష్మీసన్నిత్యోత్సవమౌఁ; బృథక్త్వమట పోమింపఁ మహాసంసృతి
వ్యాసద్ధుండగు జీవుఁ డున్మదమనోవ్యాపారతఃక్లిష్టబుద్ధై
యానందచ్యుతిఁ బొంది యంధతమసావ్యక్తాబ్ధి నోలాడుచుఁ.

గీ. కర్మయోగులు ఫలమును గాంతురదియుఁ, గామవిద్ధంబు గాకుంటఁ గాదు బంధ
మమర నిష్కామి యున్నతికైన ఫలమె, యగు సకామికి సంసృతినిగళ రేఖ.

గీ. ఫలము క్రియయందుఁ గ్రియఁ గర్తృభావమందు, లయము నొందింప సన్మయోల్లసిత రీతి
కర్త యొక్కండ మిగులు నఖండబోధ,వన్మహానందజలధిసంప్లవన మొంది.

గీ. సఫలతానిష్ఫలత్వ విశ్లథత లేని, కేవలక్రియ శూన్య మఁ భావ ముడిగి
వట్టి యనుభవరూపసద్వస్తువైన, క్రియను బొందును యోగి నిశ్చయసమాధి.

చ. అనుభవగమ్యమైన దగు నయ్యసమాన క్రియానుభూతిచే
జనుము, పృథక్స్వరూప పరిసర్పితమా భ్రమ వీడి ప్రత్యగం
బునిధివిలోలహంసమయి బుద్ధిగతాంతరదివ్యదీప్తిభా
గనుపమ తత్త్వమై వెలుఁగు నంతయుఁ దానును దానె యంతయై.

(ఇది చూళిక)

కర్మవీరుఁడు—(ప్రవేశించి) నేఁ జేసిన సృష్టి యంతయు క్షణములోఁ బటాపంచలై పోయినది. దేని కొఱకు నాతప మంతయు ధారవోసితినో, దేని యప్రధృష్యసౌందర్యవిలాసములచే నాకృష్టుఁడనై దిగంతములవఱకుఁ బాఱి మృగతృష్ణ వెంబడిఁబాఱు మృగము కైవడి భగ్నాశుఁడనై మఱలివచ్చితినో యది నశ్వరమని క్షణికమని నిశ్చయమైనది. ఏది శూన్య మనుకొంటినో యది పూర్ణమై, యేది నిష్క్రియ మనుకొంటినో యది క్రియాసత్తా రూపిణియై, యేది నీరూప మనుకొంటినో యది సర్వరూపాతీతమై మహానందదాయకమై మనోనేత్రంబు నెదుట సాక్షాత్కరించుచున్నది. ఓహో! ఎంతలో నెంత పరివర్తనము!

మ. ఫలనామం బగు మాయలేడి నెయిదన్ బర్యాప్తకాముండనై
విలసద్ద్యోపథమందుఁ బాఱితి మహావేగభ్రమద్గోళ మ
ట్టులు, తదోగముచే జనించె వికటాటోపక్రియాధూర్తముల్
తులనాతీతమహాఘపూర్ణపిశితాంధోరూపముల్ దుర్గతుల్.

నానాపిశాచావిష్టుఁడై బాధపడు మర్త్యునిబోలి నే నీ దుర్గతిరూపదుష్ఫలసంగంబుచే స్వస్వరూపముఁ గోల్పడి యనిర్వచనీయమైన యవస్థ నొందితిని.

గీ. పెరిగిపెరిగి బ్రహ్మాండమ్ము లోరసిపెరిగి, యాత లేమున్నదని ప్రశ్న యడిగికొంటి
నడిగిన జవాబు నీయగా నచట నెవరు?, వచ్చె నాప్రశ్నయే ప్రతిధ్వనిగ మఱల.

గీ. అనృతముననుండి యనృతంబె జనన మొందు, ననృతపారంపరీభూతమైన జగము
ననృతపర్యవసన్నమై యడఁగు దీన, ఫలము నర్థించు నెవఁడు నిష్ఫలుఁడుగాక!

అవ్యక్త మహదహంకారములు గడ్డగా, తన్మాత్రలు వేళ్లుగా, మహాభూతమ్ములు కాండముగా మనస్సు ప్రాణరసముగా, షడ్భావవికారములు శాఖలుగాఁ, గామాద్యరిషట్కము పత్రములుగా వెలుంగు నీ సంసారవృక్ష మెక్కి రూపజాతిగుణక్రియలు లేక యిదమిత్థ మని నిర్ణయించుటకు శక్యముగాక యనిర్వచనీయమైన ఫల మందఁగోరు జీవుఁ డను కపినై చెడితి. ఇంకఁ జాలును.

గీ. క్రియయు ఫలమును నాయందె కెరలుచుండు, భోక్తృభోగ్యంబులును నేన బుద్ధి నేన
నేన యీ సర్వ మనుసత్తి నెఱి యెఱింగి, నేను నాలోన నుందుఁదు నిశ్చలాత్మ.

క్రియాదేవి—(ప్రవేశించి)

జయము జయ మార్యులకు సర్వజయము జయము, కర్మవీరుల కెల్లను ఘనజయమ్ము
ఆదిశేషావతారులై యవని భరము, మోయు కర్మిష్ఠతతికి నమోఘజయము.

కర్మవీరుఁడా! నీ విప్పుడు పరమానంద స్వరూపమున భాసిల్లుచుంటివి. పులుగడిగిన ముత్తియము వలె నీ రూప మిప్పుడు దివ్యప్రభల నీనుచు నా యాత్మముకురమున నెంతయు హత్తుకొని యున్నది.

శా. నీవే నేను, ఫలంబు నీవ, మఱి నేనే సత్క్రియన్, నీకునై
భావంబొందితి నేను, భావకుఁడవై పాలింపుమా నన్నికన్ !
శ్రీవల్లీవృతిమై జగంబులు రమాశ్లేషప్రసాదోదయ
ప్రావీణ్యంబును బొందు శాంతరససంభారంబు వఱ్ఱోడఁగన్.

కర్మ—క్రియాదేవతా! ఇటు రమ్ము - నన్ను గాఢాశ్లేష మొనరింపుము.

శ్లో. నితాంత మేషా జయతాత్ క్రియాశ్రీ, రతీంద్రియజ్ఞానరసామృతాకృతిః
సతాం మనోజ్ఞే ష్వనుభూతిమాత్రతః, కృతాగమా శ్రౌతమహార్థధారిణీ.

ఇతి శమ్.

# తిక్కన: వీరరసము

## అభిమన్యు పాత్రపోషణము

శ్రీ బులుసు వేంకటేశ్వర్లు

ఆంధ్రసారస్వతాకాశమున ననంతకోటిరవిప్రకాశముతో నప్రతిమానముగా వెలుఁగొందు తిక్కనకవివతంసుని గుఱించిన స్తుతివాక్యములు—

> " To guild refined gold, to paint the lily,
> To throw a perfume on the violet,
> To smooth the ice, or add another line
> Unto the rainbow, or with taper light
> To seek the beauteous eye of heaven to garnish."

అను నాంగ్లోక్తుల కనుగుణములే యగును. అయిన నిట్టి ప్రయత్నము లా మహనీయుని యశస్సంవర్ధకములు, నాతని యెడఁగల భక్తి పురస్కృతములు నగుట నొకవిధముగా క్షంతవ్యములే.

తిక్కన మహాకవి, సర్వజ్ఞుఁడు, నవరసపరిపూర్ణుఁడు. ఈతఁడు పోషించిన రసములలోఁ బ్రధానము వీరరసము. భారతేతిహాసమునఁ బ్రధానరసమే వీరరసము. ఈ యితిహాసమునఁ దిక్కన వీరరసపరిపోషణము గావించినరీతి యప్రతిమానము.

వీరరస మొక్క యున్నత సంపద్విశిష్టము. సృష్టిస్థితి లయకారులలో నీశ్వరునకు లయప్రియత్వము మెండు. ఈతని ప్రళయతాండవమే యాపని నిర్వర్తించును. ఈశ్వర ప్రళయనృత్యమున నావిర్భవించునదే వీరరసము. అగుట నీశ్వరుఁడు వీరరసప్రియుఁ డనఁ జెల్లును. భారతేతిహాసమున శిష్టులగు పాండవుల సంరక్షణకై దుష్టులగు కౌరవులు లయ మొనరింపఁబడవలసినవా రైరి. కౌరవవినాశనమే భారతప్రధానవిషయ మగుట, నిందు వీరరసమే ప్రధానము.

తిక్కనకుఁ బూర్వము కాని, తరువాత కాని యుద్ధపంచకమున విలసిల్లిన వీరరసపరిపోషణ మెచ్చట జరగియుండలేదను టతిశయోక్తి కాదు. వీరరసము విలసిల్లు నిచ్చోటఁ దిక్కన తన యప్రతిమాననైపుణ్యముతో దానిని బోషించినాఁడు. అందు తద్రసపోషణౌన్నత్యమున కుదాహరణముగా నభిమన్యుపాత్ర దిక్ప్రదర్శనమాత్రపరిశీలనము కొంత యుపకరించును.

అభిమన్యుపాత్రనిర్వహణమునఁ దిక్కన చూపిన కళాపాటవ మద్భుతము; రసోదంచితపదజాల మనర్గళము. పద్మవ్యూహమును భేదించి శత్రువులఁ జెండాడినది తిక్కనయే. వీరరసావేశమునఁ దానే

యభిమన్యుఁడై వీరవిహార మొనర్చినాడు. సంస్కృతమునకన్న మిన్నఁగ రసము చిప్పిలునట్లు ఈ పాత్రఁ బోషించెనన్న నిర్వివాదాంశమే యగును.

అభిమన్యుఁడు మహావీరపురుషుఁడు; మహావీరుని సుపుత్రుఁడు; హరి మేనల్లుఁడు. అగుట నీతఁ డుత్తమనాయకుఁడు. పద్మవ్యూహభేదన మొనర్చి, శత్రువులఁ జెండాడి—

"ఇదె యొక పిన్నవాఁ డడరి యెక్కుడుమూఁకల క్రందు దోలెడుం,
గదుపుల వెల్చు గోపకునికైవడి నంచు జనుల్ నుతింపఁ"

జేయుటయుఁ, దన్ను "పెంచిన గరువంపుఁదండ్రులకుఁ జిత్త మెలర్ప ఋణంబుఁ" దీర్చుటయు మున్నుగా గల యుత్సాహశక్తియే స్థాయిభావము. భీష్మ ద్రోణ కర్ణ కృపాది వీరలోక మాలంబనవిభావము. వ్యూహభేదన, శత్రుమారణములు ఉద్దీపనవిభావములు. అగుట వీరరసము చక్కగా భాసమాన మగుచున్నది.

మహోత్సాహశక్తిసంపన్నత్వమునఁ గనుమూసి తెఱచునంతలో భారద్వాజప్రముఖయోధుల నెదిర్చి-

"మెఱుఁగు మెఱచినట్లు మెఱయంగ నరదంబు, కర్ణికార కేతుకాంతి వెలుఁగ
నంపగముల గురుని నలయించి కడచి యింద్రజునికొడుకు మొగ్గరంబు సొచ్చె."

ఈ విద్యుద్వేగముతో నిజముగా తిక్కనయే మొగ్గరము జొచ్చినది. ఇఁక నాతని వీరవిహారము మిన్నుముట్టుచున్నది. ఈ పద్య మాతని మహావీరపూజ కంకురార్పణము. ఇది "స కర్ణికారప్రవరోచ్ఛ్రితధ్వజ, స్సువర్ణవర్మార్జుని రర్జునావరః" ఆదిగాగల మూలమునకు మెఱుఁగుసేత.

క్షణమాత్రమున ననన్యసాధ్యమగు వ్యూహమును భేదించి రౌద్రరసోల్లసితమూర్తియై "మహార్ణవంబునం దిరుగు మందరనగంబుచందంబునం గాననంబునం జరియించు తీవ్రానలంబు తెఱంగునం, గాల పక్వజనసమాజసంహరణక్రీడనంబు సల్పు శూలిపోలిక" కౌరవవ్యూహమును "త్రిప్పి కొలిపియుఁ, బొడిసేసియు, రూపుమాపియు" ప్రళయతాండవముగావింపఁగా గౌరవసైన్యమును "చిక్కువడియును సుడివడియును గలంగియుఁ దొలంగియు వెఱచఱచియు విచ్చిపఱచియు" దీనదశకు వచ్చినది. సంస్కృతమున నిట్టి పదజాలము, మహోద్వేగము తెలుఁగుకన్నులకుఁ గానరావేమో!

రౌద్రరసమూర్తియగు వీరాభిమన్యుని 'పేరాఁకలితోనున్న హరిని దేఁకువసెడి చేరు కరిగతి' దుర్యోధనుఁడు సమీపింపఁగా, ద్రోణాచార్యుఁడు భయపడి కౌరవయోధుల నందఱ నొక్కుమ్మడిఁ బురికొల్పినాఁడు. అందఱ నన్నిసాయకములఁ గర్ణు నొక్క బాణమునఁ దెరలఁ జేయఁగా, ద్రోణుఁడు తాను ముందై భయకంపితు లగు కౌరవయోధులు వెనుక రాఁగా మరల నాతని నెదుర్కొని నంతనే, 'సురలును సిద్ధులు విద్యాధరులు' చేయు నుతివాదములు అంబరధరణీమధ్యభాగ భరితములు కాఁగా, వారి నందఱ నల్గడలకుఁ బాఱఁ జేసినాఁడు.

మఱియొకపరి ద్రోణాది ప్రముఖయోధవరులు 'రథనేమి గజఘంటా తురంగకింకిణీస్వన మేదుర రోదోంతరరౌద్రంబుగా' నభిమన్యుఁ జుట్టుముట్ట, నాతఁడు 'లాఘవలక్ష్యశుద్ధి చిత్రత్వ దృఢత్వంబులు మెఱయ' పోరుచున్నతఱి 'కిరణస్ఫురణ దుర్నిరీక్షుండగు తపనురీతి, విలయకాలవలాహంబు విడంబించి' ద్రోణాదుల వెగడుపఱచి వీరశిఖామణియై విలసిల్ల, విచ్చిన వాహినుల నిలువరింపనేరక ఆచార్యుఁడు నివ్వెఱపడి చూచుచు, నాతని నభినందింపఁ జొచ్చినాఁడు. ఇది దుర్యోధనాదులు సహింపఁజాలకపోయిరి.

ఒక్కబాలుఁ డట్లు పలుతెఱఁగులఁ దమ్మునొంచుట దుర్యోధన దుశ్శాసనాదుల కీర్ష్యాద్వేషములఁ గొనితెచ్చినది. "ఇనుఁ గబళించు రాహుక్రియ నే నొకరుండన పోయి పార్థపుత్రునిఁ బరిమార్తు" నని పోయిన దుశ్శాసనుఁడు విల్లు విఱుఁగ, మేను స్రుక్క నొక్కవాలమ్మున "త్రెళ్ళి యెన్నఁడో చచ్చినయట్లు రథంబుమీఁదఁ జేడ్పడి"యుండఁగా, సారథి తొలంగఁ దోలికొని పోయినాఁడు.

వీరాభిమన్యునిధాటి కాఁగఁజాలక పారిపోవు కర్ణ కృప సౌబలాది మహాయోధుల :

"నిలునిలు కర్ణ! యో కృపుఁడ! నీ విటులేల కడంకఁదక్క? సౌ
బల! ధృతి దూల నేమిటికి? బాహ్లిక! యిత్తఱిఁ గౌరవేంద్ర! నీ
బలముఁ జలంబుఁ జూపి నిలువందగు"

నని యెన్నివిధములనో ద్రోణాచార్యుఁడు పురికొల్పినాఁడు. ఒక్కఁడును వెనుదిరిగి మాత్రము రాలేదు. అభిమన్యుకుమార కంఠీరవుఁడు సింహనాదముచేసి, శంఖము పూరించి, గుణము సారించి, "అనికిం దనివిసనక వెనుకందవిలి వట్టి యడవి ముట్టి యేర్చు కార్చిచ్చుచందమున, చతురంగబలంబుల బారిసమరిన" సంగరాంగణము నానాబీభత్సము నాయెను. గగనమధ్యభాగమందలి ద్వితీయమార్తాండుఁడై అభిమన్యుఁడు గనుపట్టెను.

కొంతసరికి కుంభసంభవప్రయత్నవిశేషంబునఁ గౌరవవాహిని మగుడ నభిమన్యుఁ దాకినది. ఇదే సమయ మని వృషసేనుఁడు పటుశరము లేయఁగా నభిమన్యుఁడు :

"...సూతుఁ ద్రుంచి విల్, ద్రుంచి తురంగ వక్త్రములఁ దూపులు నించి యలంచి మేను నొప్పించిన, "తేరితోడ నఱవీనుఁగు నీడిచి కొంచుఁ బాఱె సేనాంచల భూమికిం బెలుచ నత్తురగంబులు విహ్వలంబులై". వృషసేనునిగతి యిట్లు కాఁగా వసాతిక్ష్మాపతి యెదుర్కొని యొక్క బాణముతో "గూలి పెలుచఁ దన్నికొనుచుఁ జచ్చి"నాఁడు. అభిమన్యు పరాక్రమానలమున కాహుతియై కౌరవయోధ శలభము లంత నొందుచుండిరి. ఈరీతిఁ జూడ, 'పెనుజోఱు మొగంబునం బడిన చిఱుచేప తండములచందంబున దావానలంబు దఱియం బాఱిన మృగకులంబు చాడ్పున, సముద్రంబు జొచ్చిన యేఱుల చందంబున నతనియందడింపుపడుట స్పష్టమైనది.

సహస్రభానుసన్నిభుఁడై యట్లున్న నభిమన్యు: "...నే, వచ్చితిఁ బట్టి తెచ్చెద నవారణఁ బెట్టు

పెనంగెనేనియుం, జచ్చు మదీయభూరిభుజశక్తి గనుంగొనుఁ" డని. శల్యనందనుఁడు రుక్మరథుఁడు తలపడి తల తెగ నేలపైఁ బడి మడిసినాఁడు. పిమ్మట నభిమన్యుకుమారుఁడు గాంధర్వమాయఁ బరఁగించినాఁడు. దీనివలన కౌరవనాయకుల యాలోకనమునకుఁ బెక్కు రథికులు తమపై బడి శస్త్రాస్త్రములఁ బొడుపుచున్నట్లు తోఁచినది. విభ్రమచేతస్కులైన వారి మహాకాలాశుగముల స్తంభింపఁ జేసినాఁడు. అభిమన్యుపరాక్రమానలజ్వాలలు తమ్ము మాడ్చివేయుచుండఁగా "మేనులు సెమర్చ మొగంబులు వెలువెలంబాఱ, నోళ్ళెండఁ, గాళ్ళు వడంక నలుదిక్కులు చూచుచు ధృతి సెడిగిపోయిన వెఱచఱచి" కురుసైన్యము గగ్గోలు వడినది.

దుర్యోధనపుత్రుఁడు లక్ష్మణుం డభిమన్యుఁ దాఁక "పులికొదమను సింగంపుఁ గొదమ గొదగొనులీల" త్రుటిమాత్రమున వీరస్వర్గ మొసఁగినాఁడు. వేయేల? ఈ బాలవీరుఁడు విజృంభించి గురుని గురుతనయుఁ గృతవర్మను గర్ణుని కృపుని మఱియోధు లెల్లర బహునిశితసాయకముల నొప్పించియుఁ జిక్కు వఱచియు, పరాభవించినాఁడు. మగధపతికొడు కశ్వంతుఁడు దాఁక నాతని సూతుతల, అశ్వముల తలలు నాతనితలతో నొక్కుమ్మనఁ గూల్చి సింహనాద మొనర్చిన యభిమన్యుఁడు ప్రళయ కాలరుద్రునిఁ బోలి దుర్నిరీక్ష్యుఁడుగా నుండెను.

ఈ వీరమూర్తిని గాంచి 'ధనువు బట్టిన వారికి నెల్ల నొజ్జ'యగు ద్రోణాచార్యుఁడే "అభిమన్యుఁడు నర్జునుఁడును నని నొక్కరూప" యనియు, "చూడం బిన్నవాఁడు కాని యలంతులం బోరెడు వాఁడు కాఁ" డనియుఁ బ్రశంసింపదొడఁగినాఁడు. ఔను "నరుఁడున్ సుభద్రయుం, దనయుని గాంచి సంతసముఁ దాల్చుట యంతయు రిత్తఁబుత్తునే" యన్న యభిమన్యుని క్రియాకలాప మింకొక విధముగ నుండునా ?

కర్ణాదు లగు మహాయోధులు గురునుపదేశము ననుసరించి వంచనచే విరథుంజేసి యనేకు లొక్కుమ్మడి నాతనిపైఁబడి చిక్కువఱుపఁగా :

"వాలును బలకయుఁ గొని య,బ్బాలుఁడు రయమార గగనభాగంబున కున్మీలిత ధృతిసారుండై" యెగసిపోఁగా నె ల్లైవరిమీఁద నఱికి హతమార్చునో యని కౌరవయోధులు భయపడఁ జొచ్చిరి. ఇంతవఱకుఁ దిక్కన తన శేముషీవిశేషముతో నభిమన్యు నవక్రవిక్రమవిరాజితుఁ జేసి వీర విహారముఁ జేయించినాఁడు. ఇఁకముందు మహావీరాభిమన్యుని యస్తమయసమయ మాసన్నమగు తఱి నభిమన్యునిపైఁ జదువరుల హృదయముల నేర్చి గుండెలు నీరగునట్లు ఆతని వీరవ్రతారాధనతో మన హృదయములఁ గొంపోయి దాక్షిణ్యరసభావముల నూరించుట కాననగును. ఆ సమయమున నున్న యభిమన్యునివర్ణన మద్భుతము; అప్రతిమానమును :

> "నెత్తుటఁ జొత్తిల్లి నెరసిన యలుక నుగ్రంబైన వదనంబుకాంతి పరఁగఁ,
> గౌరవసైనికోత్కరమున కతిభయదంబగు సింహనాదంబు సెలఁగ,

నింగికి నిగుడు రథాంగరోచులు మణికంకణద్యుతులతోఁగలసి వెలుఁగ
స్సిల్లుసూపిన గంధసింధురం బనురేఖఁ దలఁపించుపటుగతి చెలువు మెఱయఁ
గుంభసంభవుఁడున్న దిక్కునకుఁ గవిసి, యడ్డుపడుసేనఁ జించిచెండాడు నక్కు
మారవరు మేనియొప్పును మగతనంబుఁ, జలము బలముఁ గీర్తించె నిర్జరగణంబు."

అభిమన్యువీరుని తిక్కన మహాకవికంటె నెక్కుడుగాఁ గీర్తించిరా నిర్జరు లని సందేహము.

ఇట్టి స్థితిలో నున్నను నధైర్యమన్న దభిమన్యునియొక్క రోమకూపమున నైనను లేదు. పైగా, "గదగొని యశ్వత్థామను గదియఁగా నాతఁడు కడు బెదరి రథము దిగి" పరుగిడఁజొచ్చినాఁడు. ఇంక నభిమన్యుఁ డేమి చేయఁగలఁడు? ఆతని సారథిని రథ్యములను జదియమోది యశ్వత్థామకుఁ దెల్పుకొను మన్నాఁడు. తన్ను మార్కొనువారల "నేనుంగులతోడన బీనుంగులు గావించి" కేకయ సప్తకమును రథసహితంబు నగ్గలికల నుగ్గునేసి డస్సి తూఁగాడుచుఁ దొలంగిన యోధుల నుల్లసం బాడుచు నతిమినవారి నుఱుమాడుచు వీరవ్రతంబు ధీరత్వనిష్ఠం జలుపుచుండె." అభిమన్యుని వీర వ్రతమాహాత్మ్య మెట్టిదో తిక్కన వీరారాధనపరత్వమును బొంగులుదేరు ధోరణిలో నట్టిదిగా విశదమగుచున్నది.

తుదకు దుశ్శాసనసుతుతోఁ బోరుచుండఁగా, "వనగజ మంబుజాకర మవారణఁ జొచ్చి కలంచి యాడఁగా, మనమునఁ గొంకులేక కృపమాలిన బోయలు ముట్టి చంపు చాడ్పున" కౌరవ సైన్యము చుట్టుముట్టి యనేకులు గూడి యాతని 'నిర్దయ విధంబునఁ' జంపిరి. ఇందు కౌరవుల ద్రోహబుద్ధి, యభిమన్యుని నిరుపమాన వీరవ్రతనిష్ఠ, తిక్కన చూపిన సానుభూతి కనుఁగొన నగును. ఈ విధముగా నేలఁగూలిన యభిమన్యుఁడు:

"జగము లన్నియును దేజంబున వెలిఁగించి యపరాద్రి సేరిన తపనుమాడ్కిఁ,
దఱచైన కానలు దరికొని నివుఱుగఁ జేసి యాఱిన దవశిఖివిధమున,
గగనంబుతో రాయుకరడులు గల జలం బివురఁబాఱిన మహార్ణవముకరణి,
నున్నతగతి సెడి యుర్విపైఁ గడు విన్ననై పడియున్న సుధాంశుభంగి
బీరమునఁ దమవారికిఁ బెంపొనర్చి, యరుల సమయించి వస మఱి యనువుదప్పి,
తెగియుఁ జూడ్కికిఁ జాల వ్రేఁగగుచుఁ బొలిచె."

కాన, నీతఁ డమృతమయుఁడే.

అభిమన్యునకు జరగిన యన్యాయమునకు భూతసంచయములు: "పెక్కండ్రు గూడి యిమ్మెయి, నొక్కని జంపుట యధర్మమోహో"యని దిక్కులు మార్మ్రోగునట్లు పల్కి తమసానుభూతిఁ జూపినవి. ఈవిధముగా శౌర్యసారసంపాదితరౌద్రుఁడై పడిన యభిమన్యునిగూర్చి విచారించుట పాడిగాదని తిక్కనయే యుధిష్ఠిరునోట నిట్లు పల్కించుచున్నాఁడు:

"మార్బలంబులు సొచ్చి మాతంగములఁ గూల్చి రథరాజిఁ గలఁచి తురంగమములఁ
దు్రించి పదాతులఁ దునుమాడి పెక్కండ్రు సైనిక ప్రవరుల సమయఁజూచి
మూఁకల విరియించి వీఁక నాచార్యాదియోధుల నెల్లను నొక్కదెసకు
వెలిచి వియచ్చరుల్ వినుతింప నాకంబు చూఱగొన్నట్టి యర్జున తనూజుఁ
జూచి మనకు నేల శోకింప"

ఈ సాంత్వన వాక్యములు అభిమన్యుని జీవితసార్థకతను వేనోళ్ళఁ జాటుచునేయున్నవి.

నిజమునకు "పుడమిధనంబు నాకము విభూతియుఁ జేరెనయేని నల్లన,వ్వాడు నభిమన్యు నెమ్మొగము వేయగు పాలును బోలనేర్చునే" యన్న యుధిష్ఠిరు వాక్యము లెంతసత్యములో ఆంధ్రసారస్వతమున వీరరసపాత్రపోషకు లగు కవు లందఱ నైపుణ్యమును గలిపినను, దిక్కన అభిమన్యు పాత్రపోషణమునఁ జూపిన విశిష్టనైపుణ్యమును బోల దనుటయు నంత సత్యమే.

# కావ్యసృష్టి

శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి

సూర్యకిరణమునుండి అద్భుతసృష్టి తల సూపును. భాస్కరమయూఖము మహిమోపేతసృష్టికి కన్నతండ్రి కాగలిగినపుడు భాస్కరుని సృజించిన జగదీశునిసృష్టిశక్తి ఎంత యద్భుత మైనదో ఊహింపుడు. ఒక్క సూర్యునిగాక పెక్కు సూర్యులను, ఒక్క లోకమునుగాక అశేషలోకములను సృజించినశక్తిని తలచినపుడు భావనాశక్తిచే కోటికోటి దివ్యచక్షులను సంపాదించి, అనంతాకాశమున— అనంతకాలమున నిండియుండు తేజమును కొంత కాంచినపుడు శరీరపంజరమున కట్టుబడియున్నను, మనుష్యాత్మ కొంత దేవశక్తి నంది తీరును.

వియత్తలమున విహంగ మెగసిన కొలది దాని దృగ్జాలమున నూతన దృశ్యములు పడు వడువున సౌందర్యముపై కన్నుంచు కళోపాసకుని ఊహాశక్తి ఘనతరమైన కొలది బ్రహ్మాండమందలి బహుళాద్భుత దృశ్యములు వాని దృక్కులందు జవోపేతముగ ప్రవేశించి, తోడన వాని హృదయ బృందావనమున విడియును. బ్రహ్మచర్యముకతన నియమబద్ధజీవితమువలన తేజస్సు నంతరంగమున నింపి, ఓజస్సును మనస్సున నిలుపుకొని, మునిముఖ్యు లీశ్వరశక్తిని కొంత నంది, అనూనమైన సృష్టిశక్తిని చూపజాలిరి. సాగరతీరమున శారదయామిని నొంటరియై మానవుడు నలువలంకులను విలోకించినపుడు దివ్యదీప్తుల జిందుచు, దిగ్వలయముచుట్టు జూపట్టును. దిశావలయ మొక పెద్ద గిన్నెయంచువలె నుండును. గిన్నెలో వెన్నెల తొనకుచుండును వెన్నెల కరళ్ళ కొనలందు బుడగలవలె నందందు కొన్ని చుక్కలు తేలును. సచేతనముల ట్లగపడుచు మునిగిమునుగని కొండలు మరందమున నీదులాడు తుమ్మెదలవలె తోచును. పాలపై పడిన పచ్చనిపొడిపగిది, మంచుపై రాలినఆకుమూకలవలె కౌముదీవీచికలపై నా యర్ధశర్వరీముహూర్తమున పుడమిగల యడవులు గోచరింపవా? పాలవెల్లిపై తేలియాడు విష్ణుదేవునిచందమున సౌందర్యసముద్భాసితప్రకృతి అత్తఱి వెన్నెలవెల్లిపై తేలియాడును. ఈ గిన్నెలోని సౌందర్యమును వర్ణింపగల మానవమాత్రు డేడి? తపసుచేసిన హృదయ మీ గిన్నె బోలున దని వచింతును. తనగుండె నిట్టిగిన్నె గావించుకొనిన తపశ్శాలి తన శక్తిని తానే వర్ణింపజాలడు కాని, యనిర్వచనీయసృష్టిని (అసాధ్యములను సుసాధ్యము లొనరించువాడు కావున) తన కలమునుండి తన రసనమునుండి వ్యక్తీకరించి తా నెఱుగని, తా నూహింపజాలని సౌందర్యము తన రచనమం దెట్లు విరాజిల్లుచున్నదో యని మిక్కిలి యక్కజపడి, తనయెడలం బ్రసన్నుడై తన రచనమును బ్రహ్మాండమును చేసికొని అందు కాపురమున్న జగదీశునకు ప్రణమిల్లడా?

ఎట్టిచిత్రమో యోజింపుడు— కనులు మూసి అంతరంగమును పరిశీలించినపుడును కనులు తెఱచి ఆత్మరచనమును పరికించినపుడును ఈత డొకే తెఱగు దివ్యదృశ్యమును పొడగాంచును. మానస

రా

నేత్రముప్రోల నిట్టిదృశ్యమును ప్రదర్శించు రచనమును విలోకించినపుడు దానికర్తతపశ్శాలి యని తప్పక గుర్తింతుము. పొదుపుకొండచెంత నిలిచిన గాజుకుప్పెలో ననంతకాంతులు విడిది నేర్పఱచుకొనులీల ఈశ్వరసమక్షమున నిలిచిన వీనిహృదయమున ననంతశక్తులు వసించె నని గ్రహింతుము. భ్రమరముపై కన్నిడినకీటకము భ్రమరమే యగులీల బ్రహ్మాండముపై దృష్టినిలిపిన వీఁడుగుండె బ్రహ్మాండ మయినదని గుర్తింతుము. ఈతనిమనసు వనమాలివంశీరవమునకు నెచ్చెలియై, ఎల్లకడలందు విహరించినదని, పోయిపోయి చుక్కతలుపులను తట్టి, లోపల జొచ్చి లోపల జొచ్చి అందలి వింతలను విలోకించి మురిసినదని, శ్రావణమేఘములను పిండి, అందలి శీతలబిందువులను మెఱపులను గుటకలు వేసినదని, ప్రకృతిసంయోగముకతన పండు తలపులను కనినదని, నందనవనమందలి ననపోవులను తన వశ మొనరించుకొనిన దని, కల్పకతలమందలి సౌందర్యలక్ష్మికి జాగి మ్రొక్కి అవిరళవరముల నందిన దని, దేవనర్తకీబృందమున మసలి మసలి దివ్యగీతికాకళల నాలాపింప నేర్చినదని, భృంగియై రమాపతి చరణకమల పీయూషమును తనివార గ్రోలినదని, భావనము కనియిచ్చిన సౌందర్యతిలకను తనదాని గావించుకొని, కవుంగిలిని జేర్చుకొని, చక్కని బెళ్కుల గాంతిలు చెక్కిళులనుండి చంద్రవంకకు వంకలుచెప్పు నొసలునుండి మధురోక్తికి మార్గమిచ్చు నధరోష్ఠములనుండి మక్కువతో గూడిన సిగ్గునుజూపు చూపుగములనుండి బాలచికురపిహితఫాలతలము నుండి మొనలేని కవితావిభూతిని కైకొనినదని, విందుగూర్చు మంగళముహూర్తములందు భావభువనములను చక్కెరగోళీలట్లు దిగమ్రింగిన దని గ్రహింతుము. వ్రతమునకు, ఏకాగ్రదృష్టికి, ధ్యానమునకు తపమునకు అసాధ్యమైన దేద్ది? ఇవెట్టి సుందరదృశ్యములను, ఎట్టి దివ్యమూర్తులను సృష్టించుకొన లేవు? ఒకరూపము నూహించుటకు వీని మ్రోల నొక విగ్రహమును నిలుపనక్కఱలేదు. దేహధారి యొక్కండు ప్రత్యక్షము కానక్కఱలేదు. నిమిత్త మెద్దియు పురోభాగమున నిలువనక్కఱలేదు. 'అది"యని, 'బ్రహ్మ"'అని, "సర్వాంతర్యామి"యని జగదీశు నుద్దేశించి శ్రీశంకరుడు వచించినాడు కాని సామాన్యులకీ 'అది"యెద్దియో బోధపడలేదు. పామరులయెడల ననురక్తుడైయుండిన మహాత్ముడు రామానుజాచార్యుడు జనసామాన్యమున కద్వైతముకాక విశిష్టాద్వైతమే సుబోధకము కదా యని సగుణబ్రహ్మను, రూపసహితుని నిర్దేశించినాడు. "ఇందుగలఁ డందు లేఁడని సందేహము వల"'దని చక్రిఁగూర్చి ప్రహ్లాదుడు పలికి శంకరసిద్ధాంతమునకు దారిజూపినాడు. భాగవతరచయితయే బ్రహ్మసూత్రములను రచించి శంకరాదులభాష్యములకు నవకాశమిచ్చినాడుకదా! "ఎందెందు వెదకిచూచిన నందందే'' కలడని తనయు డనినపుడు హిరణ్యకశిపునకు చక్రియస్తిత్వమును గూర్చి సందేహమే యుండెను. కాని స్తంభమునుండి రూపసహితుడై భగవంతుడు గోచరించినపుడు, దానవాగ్రణి కంతయు బోధపడినది. ఆ ముహూర్తమందలి ప్రత్యక్షతీవ్రానుభవముకతన ప్రహ్లాదప్రబోధమందలి సత్య మెట్టిదో మఱింత బాగుగ గ్రహించినాడు. భాగవతమందలి ఈ కథను విమర్శకదృష్టితో పరిశీలించితి మేని, శంకరరామానుజసిద్ధాంతముల ప్రత్యేకప్రాముఖ్యమును గుర్తింతుము.

సాహిత్యమును, తత్త్వశాస్త్రమును, మతశాస్త్రమును సైదోడులని తెలుపుచుందును. నక్షత్రముల దోసిట గొని సర్వేశుడు విశాలనీలాకాశమున వెదజల్లునట్లే శాస్త్రములు భావ్యదాశయములను ఉత్కృష్టసత్యములను సాహితీవియత్తలమున వెదజల్లు నంతదనుక సైదోడులే! భావవ్యక్తీకరణమునకు నక్కరైన ఇంద్రియముల నివి మూలదోయుచో సాహితికి పనికిరావని వచింతును. పంచాగ్నులలో నింద్రియములను చిటచిట లాడించుకొనువారిని జూచి కళోపాసకుడు కనులెఱ్ఱజేయును.

"తదీయవదన కమల మధుపానమును నిజనేత్రాంజలుల గ్రోలి" రనికదా, వ్యాసు ననుసరించిన పోతనామాత్యుడు శ్రీకృష్ణుని విలోకించిన భక్తప్రవరులను గుఱించి తెలిపినాడు! దివ్యనేత్రము లొసగికదా విశ్వరూపసందర్శనభాగ్యము జగదీశుడు గుడ్డిరాజున కొసగినాడు! మానవుని కన్నులు మూతలు పడిన ముహూర్తమున జగతియందలి సౌందర్యలక్ష్మి నిర్వాసిత; యభాగినివలె పొగులును. మనుజుల చెవులు మూతలుపడిననాడు సంగీతము చచ్చి స్వర్గమున చేరుకొనుట మేలు. ఒక్కొక లలితకళ కొక్కొక యింద్రియము ప్రాపను నంశమును పాఠకులు మఱువరాదు. బాహ్యేంద్రియములకు వెన్కనే అంతరంగేంద్రియములు కలవు. అంతరంగమున జనించి పెరిగి పెంపొందిన భావము బాహ్యేంద్రియకవాటమునుండియే ఆత్మప్రకాశము గావించుకొనును. రసనము తెగిపడిననాడు సగము చచ్చితి నని గోలపెట్టి, ఇది కలమును చేబట్టును. కాని నాల్కనాడింపగల ప్రతిమానవుడు కలమును పట్టగలడని తలచుట తప్పు. భావగ్రహణమును, భావప్రకాశమును కర్తవ్యములుగా గల సాహిత్యోపాసకుడు తన యింద్రియములకు సీళ్ళు వేసికొన నొల్లడు. వివిధానుభవములను తా నందును. తన పఠితలలో తన్ను బోలు వా రట్టి యనుభవముల నందుట తిలకించి మఱియును. తాను కులుకును, వారిని కులికించును. తా నేడ్చును, వారి నేడ్పించును. తాను కోపించును, వారిని కోపింపచేయును. ఈ విద్యయం దారితేరినవాడే తన రచనమున నవరసములను కురియించును. ఈ విద్య నెఱుగనివాడు రసరహితుడు. తన రచనములందు రసస్రవంతుల నీత డెట్లుప్పతిలజేయగలడు? ఈతని రచనము సుజలయుతసుఫలసమన్వితశ్యామలసస్యసందీపిత సుందరతరుసుశోభితమహోద్యానమువలె నుండదు. అది రాళ్ల గుట్టవలె, ఇటుకలయామువలె పెంకుల ప్రోవువలె, కట్టెల మోపువలె, బొగ్గుల గుంపువలె, కచికల రాసివలె నుండును. ఈ సరకులకు కావ్యజగతియందు చోటు లేదు. రసరహితపదార్థమునకును, సౌందర్యసందీప్తముగాని వస్తువునకును కావ్యజగతిలో తా వుండదు. లలితహృదయులకే పైన దెలిపినవిద్య యవలీలగ నలవడును. భావప్రకాశ మక్కఱలేక, సంఘసంపర్క మక్కఱలేక ఏమూలనో ముక్కుమూసికొని యుండువాని నటుంచుడు. ఈతడు మానియగుచో నమస్కరింతును. మాని సంయమి. తనగుండెను పిడికిట బట్టినవాడు. ఇంద్రియహయములను స్వాధీన మొనరించుకొనిన విక్రమశాలి. కఠినుడు వేఱు. రాతి గుండె కలవాడు.

ఎట్టి యనుభూతికి హృదయము నొడ్డక, ఎద్దువలె తిని, మొద్దువలె పడియుండువాడు, మోదమునకు అన్నగా రనిపించుకొనువాడు కలమునుగాని, కుంచెనుగాని, పట్టుట కర్హుడు కాడు. ఈ తీరు మనుజుని నమ్మరాదని నొక్కి వక్కాణింతును. "అత డించుకైన కోప మెఱుగడు. చాలమంచివాఁడని ఒక్కొక మానవుని గుఱించి కొందరు కొందరు వచింతురు. తోడన యిది వేదవాక్కని నేను గ్రహింపను. వెంటనే ఆ వ్యక్తిని బోనులో నిలిపి తీవ్రవిమర్శకు గుఱిజేతును. అతడు సంయమియో, దుర్మార్గులందు దుర్మతియో యను సంశయము నెఱుగునంతదనుక ఒరుల యభిప్రాయములకు "భళాభళి" యనను. సూక్ష్మదృష్టిని, తీవ్రవిమర్శనమును ఎఱుగనివారు "సాధారణముగా కోపించువారిలో మంచివారధికులై యుండుటయు, కోపమెఱుగని వారిలో చెడ్డవా రధికసంఖ్యాకులై యుంటయు అసత్యముకాదను సంశయమును జ్ఞప్తియందుంచుకొనవలెనని నామనవి. పాషండు లందఱు శాంతిమంతులే! వీరు మనుష్యరూపులందు గోచరించు పాషాణములు. "అయ్యో!" అని యనవలసిన సమయమున మాకు గాదని వీర లూరకొందురు. "జాలి" యనుపదమును వీరు తమ నిఘంటువుల నుండి తుడిచిపాఱవైచి యుందురు. వీరికి కరుణరస మెక్కడిది? శోకరస మేది? వీరు నవ్వరు; తుళ్లరు. వీరికి హాస్యరస మెక్కడిది? ఇట్టి యయ్యలు కావ్యములు రచింతురా? రసపూరిత కావ్యమహత్త్వమును గ్రహింతురా?

చక్కని కావ్యమును చూచి, (ఈ కావ్యము తన శత్రువు రచించినదైన నేమి) మెచ్చువాడు మహోదారుడనియు, దానిని దుర్విమర్శకు నెరగావించు నాతడు అజ్ఞానియో దుర్మతియో యనియు, గ్రహించుటొప్పు. సహృదయుని సహజగుణము ప్రశంస. క్షుద్రహృదయుని నైసర్గికగుణము దూషణము. ఎట్లయిన మంచిగోనము కనుగొనవలెనని, మంచిమాట యాడవలెనని మొదటివా డాతురపడును. రెండవ వానిది ప్రతికూల పంథ. ప్రశంసింపగలవాడే ప్రశంస నందును, దూషింపజాలువాడే దూషణమును కట్నముగా పడయును. ప్రశంస సదాశకు సంబంధించినది. కావ్యమందలిజఠరము సదాశ. నిరాశనుండి, నిట్టూర్పునుండి, నిద్దురనుండి, అజ్ఞానాంధకారమునుండి మానవు నుద్ధరించునది యిదియే! మానవ సముద్ధరణమునకు, లోకకళ్యాణమునకు హేతువగు కళను సృష్టించుటకు వలసిన శక్తి నందుటకు, తన రచనమును భావభాస్వన్మరీచికలచే తళ్కొత్తించుటకు సదాశను తన పూజాపీఠమందలి దీపిక గావించుకొని మొదటివ్యక్తి దానికి జేజేలు పాడును, ప్రార్థన సలుపును. ప్రార్థనపంథనుండియే ఆరాధ్యదైవతము (అది సత్య మనుడు, సౌందర్య మనుడు, శివ మనుడు) మనుష్యహృదయమున ప్రవేశించి, అందు నిత్యశృంగారమును నిలుపును. పచ్చతోరణమును గట్టును. ఈ దివ్యశోభ కావ్యమున ప్రతిఫలించి అందపూర్వసృష్టిని ప్రదర్శించును. ప్రార్థనమున చేకుఱు అభ్యుదయము ఊహాతీతము. కావుననే టెన్నిసన్ మహాకవి ప్రార్థనమహత్త్వమును బహుభంగుల బ్రస్తుతించినాడు. ("For more things are wrought by prayer than this world dreams of...... Vide Idyls of the King.") పైన నే దెలిపిన ప్రశంస ప్రార్థనమునకు సైదోడు. ఈ మహద్గుణముల నలవఱుచుకొనువాడే కావ్యసామ్రాజ్యమున పట్టాభిషిక్తుడై పరార్థ

జీవియై తనరుననని, వీని నెఱుగనివాడు అందుండి నిర్వాసితు డగుట కర్హుడని తెలుపుట నా యాశయము.

గుణమణిహారముచే నాత్మజీవితము నలంకరింపజేసికొనువాడే కావ్యసామ్రాజ్యమున పట్టాభిషిక్తు డగుట కర్హుడని వచించితిని. ఈశ్వరచరిత్ర యను అనంతగుణఖనినుండి ఈతడీ మణులను సంగ్రహించును. కావున భారతీయు లీత డీశ్వరాంశసంభూతు డని వచింతురు. అంతియకాదు. ఈత డీశ్వరావతారమని వేనోళ్ళుల జాటి, ఈతని నారాధింతురు. కావ్యకర్త లీతని కావ్యఋషి గావించిరి. ఇట్టివీరుని సృష్టించిన కావ్యకర్తను ప్రజలు సమాశ్రిట్టని, ఇలువేలుపని ప్రస్తుతించిరి. ఈశ్వరగుణమైన ప్రతిభను తన రచనమున నీతడు ప్రదర్శింపగలుగుటచే ఈశ్వరాంశసంభూతుడని, పరార్థజీవి యని లోకము లెఱుగుతీరున నీతడు ప్రవర్తించుటచే ఇట్టి దివ్యపదవి నందినాడు. పాశ్చాత్యులందు హోమ రిట్టివాడు డాంటే, వర్జిల్, గెటే, షేక్స్పియరు లిట్టివారు. భారతీయులందు వ్యాస వాల్మీకి కాళిదాసప్రభృతు లిట్టివారు.

ఒరులకై పాగిలి, పోరి, ఒరులతో నానందించి, నిజజీవనములం దద్భుతగుణములను కోటివత్తులు గావించుకొనినవారియందు భారతీయు లీశ్వరాంశమునుగాంచి రనుటకు బహుళతార్కాణములను పేర్కొనవక్కరలేదు. అట్టి మహనీయులను వీరు సూర్యదేవుని సంతతివారని చంద్రవంశజులని వచించిరి. చెప్పనేల? వారు దేవసము లని దృష్టాంతీకరించుటకు స్వర్గములోనికి వారికై రాజమార్గముల నేర్పఱచిరి. దేవపతి సింహాసనము నధిష్ఠించి, ప్రత్యక్షముగ నీశ్వరునికడనుండి వరములు గైకొని పరమార్థమును చేబట్టి ధనంజయుడై, మహాయాత్రికుడై విజయుడైన నరుడు వీరిదృష్టియం డెట్లు వృద్ధినందినాడో యెఱుగమా ? కావ్యకర్త వీరి ప్రతినిధినుడీ !

తా నెఱుగని ప్రతిభను ఒకడు మఱియొకని కాపాదింపనేరడు. కావ్యకర్త తొలుత తాను విజయుడై తాను ధనంజయుడై, మరొక విజయుని, ధనంజయుని సృష్టింపజాలు నను ముఖ్యాంశమును చదువరులు మఱువరాదు. అర్జును డెవ్వరో, కృష్ణు డెవ్వరో, రాము డెవ్వరో ఎఱుగగోరువారు ఈ మహావీరులను కావ్యప్రపంచమున సృష్టించిన మహావ్యక్తి ఎవ్వరో తొలుత కనుగొనవలెను. నాటకకర్త తన పాత్రములందు ప్రవేశింపడని; ఆతనికిని ఆతడు సృష్టించిన పాత్రములకును ఎట్టి సంబంధము ఉండదని ప్రకృతిమోల మకురమును నిలిపి సత్యసంధీప్తమైన దృష్టితో మనుష్యచరిత్రను చిత్రించు టాతనికర్తవ్య మని వచింతుము. నిక్కమే ! రంగస్థలి బ్రదర్శించుటకు నక్కరైన కావ్యమున వేర్వేరు పాత్రముల వ్యక్తిగతప్రాముఖ్యమును వ్యక్తపరచుట కిట్టి సిద్ధాంతము అనివార్యమైనది. ప్రబోధ మాచార్యుని పనిగాని నాటకకర్తది కాదు. జగదీశునివలె నీతడు వెనక నుండవలెను. కాని "జగదీశుడు తాను సృష్టించిన మానవులందుగూడ గలడు" ("God is both immanent and transcendent") అని తత్త్వశాస్త్రము వచించుచున్నదికదా ! కావ్యకర్త కూడ నిట్టివాడే ! ఈతని యుత్కృష్టపాత్రములం దీతని కనుగొనవచ్చును. వీని మానస కైలాసమున నుదయించిన భావగంగాధార వీని యుదాత్తరచనలందు పాయపాయలై

రాక

ప్రవహించి అద్భుతసౌందర్యసృష్టిని పాఠకలోకము కన్నులకు కట్టును. వీని హృదయ దిగ్వలయమున తళ్కొత్తిన సదాశ ఈతడు సృష్టించిన ఉదారపాత్రముల చరిత్రలందు మినుకు లీనుట నిస్సంశయము. సృష్టిచిత్రములందు సృష్టికర్తను కనుగొనిన కన్నులు లేవా? షేక్స్పియర్‌ను ప్రాస్పెరో, హేమ్‌లెట్, ఫాల్‌స్టేఫ్‌లతో పోల్చిన ఆంగ్లవిమర్శకులు లేరా! నన్నడిగితిరా రామకృష్ణులందు అర్జునయుధిష్ఠిరులందు వాల్మీకివ్యాసు లున్నారని తెలిపి, అట్లని ఋజువొనరించుటకై రామాయణ భారత భాగవతములనుండి బహుళదృష్టాంతములను పేర్కొనగలను. చూడుడు! వ్యాసుడు శ్రీవిష్ణువుయొక్క అవతార మని మన గ్రంథములే తెలుపుచున్నవి రాముడును, కృష్ణుడును అవతారపూరుషులేకదా? వ్యాసుడు శ్రీవిష్ణువు కావున కృష్ణునందు శ్రీవిష్ణువును జూపజాలె నని నొక్కి వచింతును. కిరాతుడే యయ్యు, తపసు కతన శ్రీశంకరునకు ముందే "సోహమ్" అని పలికి భగవానుడే యై వాల్మీకి రామచంద్రభగవానుని కావ్యజగతియందు ప్రత్యక్ష మొనరించినాడు. తాను సాహితీసమ్రాట్టు కావున ముల్లోకములకు సమ్రాట్టు కాజాలిన మహాపాత్రమును కడుంగడు చక్కగ సృష్టించినాడు.

విధిసృష్టికి కవిసృష్టి తీసిపోదు. కావున కవికి బ్రహ్మయని నామాంతరము కలదు.

సజీవమైన దృశ్యమునే ఇవ్వలిచూడ్కి మోగ్రిలనో; ఆంతరంగిక దృష్టిసమక్షమందో నిలుపుచే సృష్టికౌశలము. నామరూపములందు సృష్టి ప్రకాశ మగును. కావ్యవీథులందు నడువ నేర్చిన మనసు ఎన్నెన్ని దృశ్యములనో, ఎంద రెందరు వ్యక్తులనో కాంచును. దైనికానుభవమున కలుగు సంబంధములును, సంపర్కములును కావ్యవసుమతియందును గోచరించును. అం దివి మఱింత గాఢముగ నున్నట్లుండును. గుణయుతులును, రూపసహితులును వివిధానురాగసూత్రములచే (ఆలుమగలట్లు తండ్రికొడుకులట్లు) బంధింపబడిన వారును అందు మసలుదురు. "అది"యను నిర్గుణబ్రహ్మకాక కమలభవనర్తనుడు కావ్యరంగస్థలిఁ బ్రత్యక్షమగును. రక్తమాంసములందు 'బ్రహ్మ' రామకృష్ణులట్లు దృగ్గోచరమైనపుడే అష్టాదశపురాణములును, మహాకావ్యములును ఉద్భవించినవి. అసంఖ్యాకుల హృదయములందు రసస్రవంతులను పొంగించినవి.

పాఠకులారా! కావ్యసృష్టి ఎట్టి కళాసృష్టియో గమనించితిరా?

# దౌత్యము *

శ్రీ ధూళిపాళ శ్రీరామమూర్తి

**నాయకుడు భృంగము — నాయిక మాలతి.**

ఏచిన వేడ్కఁ దమ్మిపువ్వుటీరము తీరముపొంత చల్లగా
వీచికఁ దోఁగు గాడ్పు పసిబిడ్డల తియ్యని గీతిడోలలో
నూఁచెడు నీటుకాడ విదిగో విను మొక్కటి నీదు రాకకై
కాచుక యున్నదోయి పువుకన్నియ తా వలవంత వేగుచున్.

చిలిపి మెఱుంగు సంజ విరజిమ్మిన తుంపురు వెల్గు జల్లులో
జలకములాడి పల్లవలసత్పరిధానవసానయై రహిన్
గలకల నాడు నా యలరుకన్నియ సిగ్గులుదేరు చూపులన్
వలపులపంట వీ వటుల వత్తువా యంచును తొంగిచూచెడున్.

చిక్కని పాలవెల్లి జిగి చిందిన తియ్యని లేతబుగ్గలో
క్రిక్కిసలాడు సౌరభ మొకించుక తాయము వెట్టి వేడు నా
దిక్కున నాటలాడుకొను తెమ్మెర పిల్లల ముద్దు ముద్దుగా
చక్కని చుక్కపల్లవుని జాడ గనుంగొనఁగోరి సిగ్గునన్.

వా తెఱ చింది తేనియలు వాఁకలుగాఁ బరువెత్తునట్టి సం
గీతములో జగత్తు గిలిగింతలు పుత్తువు తన్మయుండవై
లేఁత పసందుటాకుపొదరింట భవచ్ఛుభదర్శనార్థమై
యాతురదృష్టులన్ బఱపురా! మృదులాంగి, రయమ్ము రమ్మురా!

మిలమిల నింద్రనీలముల మొత్తని వెల్గులు వెల్లి గొల్పుచున్
బిలపిల ఱెక్కలార్చి పరువెత్తెద వూరక నిట్టునట్టు నా
పిలుపు నొకించుకేని చెవిబెట్టవురా మధుపాయి! యింత చం
చలుడ వటంచు మున్నెఱుఁగఁ జాలమురా జగదేకసుందరా!

---

* ఈ భాగము మధుకల్య యను ఖండకావ్య సంపుటినుండి యుద్ధృతము.

తియ్యని పచ్చితేనియలు తేర్చెనురా! యెద వెండిగిన్నెలో
నెయ్యెడ నీవు వత్తు వని నీ కొఱకై క్షణ మొక్క యేడుగా
తొయ్యలి వెళ్ళబుచ్చెను మధువ్రతమా! భవదర్థమైన రా
వయ్య ప్రభూ! ..............................

ఓ రసలుబ్ధజీవి! వినవోయి! క్షణమ్ము త్వదీయ మాధురీ
తారవ ముజ్జగించి విరహాతురయై చివురాకుపాన్పునన్
శ్రీ రుచిరాంగకమ్ములను జేరిచి కన్నియ యేమి విన్న నీ
వే! రహి వచ్చి తంచుఁ గనువిచ్చి కనుంగొని వెచ్చ నూర్చెదున్.

చిన్ని యెడంద తియ్యములు చిందిన రాగరసమ్ము వెల్లువై
మున్నుగ జాగిపోవునెడఁ బుక్కిలిబంటిగ నూనినట్టి యా
క్రొన్నన కన్నె సోగకనుఁగోనల జేగురువారుచూపులన్
తెన్నులు ముంచి వేసరి మదిం దురపిల్లెడురా! కృపాభరా!

ఈసరి కా సుమాంగి యసలే చిటువేడిమి గ్రుమ్మరించు నీ
వాసనగాలి కే మగునొ! పాలసముద్రము పొంగిపోయెడున్
మోసము వచ్చునేమొ! పదమోయి! త్వరంపడుమోయి! కన్నులన్
మూసియు విప్పునంతటనె ముద్దియఁ జేరగదోయి భృంగమా!

నీవు కుమారభృంగమవు నిర్మలగానరసప్రసిక్తస
ర్వావనిమండలుండవు, సుహాసిని పర్వసువాసినీశిరో
భావితమూర్తి, మాలతి, ధ్రువమ్ముగ నిర్వురఁ గూర్చుటన్ గదా
యా వలరాచవాఁ డతనుఁ డయ్యు జగమ్ముల నెల్ల గెల్చుటల్.

# శ్రీ గోస్వామి తులసీదాసు

## శ్రీ వారణాసి రామమూర్తి

ప్రాతఃస్మరణీయులగు శ్రీ గోస్వామి తులసీదాసుగారు హిందీ భక్తకవిసమాజమున కంఠకుఁ దల మానికము వంటివారు. హిందీ సాహిత్యాకాశమును దమకవితాదీధితులచే ప్రకాశమానము చేసి యద్వితీయప్రతిభచే వెలుగొందు కవిమార్తాండులు; విజ్ఞానమూర్తులు. వారి కవితయం దెచ్చట జూచినను లోకసంగ్రహభావము స్ఫుటముగ గోచరించును. సర్వమానవకళ్యాణమునే తమజీవిత పరమావధిగ నెంచుకొని కవిలోకమునకును భక్తసమాజమునకు నాదర్శప్రాయమగు జీవితము గడపి యమరత్వముఁ బొందిన ధన్యులు.

అట్టి మహానుభావుని జీవితమును గావ్యపటిమను గురించి తెలిసికొనుటకు బూర్వము వారు జీవించి యున్న సమయమును దత్కాలీనపరిస్థితిని గమనించవలసియున్నది.

తులసీదాసుగారు తమరచనలం దెచ్చటను తమజన్మతిథి విషయమై ప్రస్తావించియుండలేదు. సుప్రసిద్ధగ్రంథమగు తన 'రామచరితమానసము' నం దద్దాని రచనాకాలము విక్రమార్కశకము *1631 సంవత్సరమని వ్రాసియున్నారు.

"సంవతసోరహ సై యికతీసా - కరౌఁకథా హరిపద ధరిసీసా."

ఇదిగాక తన 'కవితావళీ రామాయణము', 'గీతావళీ రామాయణము' మొదలగు వానిలో రచనాకాలము నొసఁగినను నవి యన్నియు రామాయణమునకుఁ దరువాత వ్రాయబడినవే కనుక జనశ్రుతులు, అనుమానములు దప్ప వారి జన్మతిథి నిర్ణయించుటకు మరెట్టి గ్రంథాధారములులేవు. శివసింహసేంగ రను నాయన తన 'శివ సింహసరోజ్' అను గ్రంథమున వి॥ శ॥ 1583 వ సంవత్సరమున గోస్వామిగారు పుట్టియుందు రని జనశ్రుతిని నాధారముగ గొని వ్రాసెను. అదియే సరియని నమ్మిచో 'రామచరిత మానసము'ను కవి తన 44 వ యేటఁ బ్రారంభించియుండవలయును. 'మానస మయంక మను గ్రంథమును వ్రాసిన శివలాల్ పాఠక్ వి॥ శ॥ 1554 లో తులసీదాసుగారు పుట్టి యుండిరని వ్రాసెను. ఇదియే నిజమగుచో రామచరితమానసమును రచించునాటికే కవి 77 సంవత్సరముల వృద్ధుఁడై యుండవలెను. కాని సుప్రసిద్ధ హిందీభాషాతత్వవేత్తలు, సాహిత్యజ్ఞులు నగు గ్రియర్సన్, పండిత రాంగులాం ద్వివేది, రామచంద్ర శుక్ల మొదలగువారు వి॥ శ॥ 1589 గోస్వామి గారి జన్మతిథి యని యభిప్రాయపడుచున్నారు. శివసింహసేంగర్ గారి మతమునకు వీరి యభిప్రాయమునకుఁ దేడా 6 సంవత్సరములు మాత్రమే. ఒక్కొక్క సమయమున జనశ్రుతియే నిజము

* విక్రమార్కశక సంవత్సరమునుండి 57 సంవత్సరములు తీసివేయుచో క్రైస్తవశక సంవత్సరము రాగలదు.

గావచ్చును. కాని నమ్మఁదగిన ప్రమాణములు లభింపనంతవరకు నిదమిత్థమని చెప్పజాలము. కనుక వి॥ శ॥ 1583—89 సంవత్సరముల మధ్య నెప్పుడో శ్రీతులసీదాసుగారు జన్మించియుందురని యనుకొనవచ్చును.

తమ నిర్యాణసమయముఁ గూర్చి కవిగారు స్వయముగనే చెప్పికొనియున్నారు.

> "సంవతసోరహస్సై అసీ - అసీ గంగ కే తీర్
> శ్రావణశుక్లా సప్తమీ - తులసీ తజెవు శరీర్"

అనగా వి॥ శ॥ 1680 సంవత్సరము శ్రావణ శుద్ధ సప్తమినాడు అసీనదీతీరమున తులసీదాసు దేహమును చాలించెను. దీనినిఁబట్టి యీ మహాకవి దాదాపు 97 సంవత్సరములు పూర్ణాయుర్దాయము ననుభవించి పరమపదించిరని తెలియుచున్నది.

పై విషయములఁబట్టి గోస్వామిగారు క్రీ॥ శ॥ 1526 మొదలు 1623 వరకు జీవించియుండిరని తెలియుచున్నది. ఆ కాలమునందలి దేశపరిస్థితులు గూడ కొంచెము గమనించవలయును.

హిందీ సాహిత్య చరిత్రలో క్రీ॥ శ॥ 1318 మొదలు 1643 వరకు భక్తియుగముగ నెన్నబడుచున్నది. అంతకు పూర్వము వీరగాథల (Ballads) కాలపు సాహిత్యము లభించుచున్నను నిజమునకీ కాలముననే భక్తకవులద్వారా చిరస్థాయి యగు సాహిత్యసౌధనిర్మాణము జరిగియుండెను. వీరగాథలలో మునిగి తేలుచుండిన ప్రజలదృక్పథము భక్తిరసపూరితము లగు కావ్యము లాకర్షించుటకుఁ గారణ మా కాలపు దేశపరిస్థితులే. ఉత్తరహిందూస్థానమునం దంతటను మహమ్మదీయుల ప్రభుత్వము నెలకొనియుండెను. మహమ్మద్ గజినీ, మహాబుద్దీన్, గోరీ మొదలగువారి దండయాత్రల వలనను, దేశీయ రాజులలో నైకమత్యము లేనందునను, హిందూరాజులు తమ రాజ్యాధికారములఁ గోల్పోయి మహమ్మదీయులకు దాసోహ మ్మనిరి. ఢిల్లీ సింహాసనము శత్రువశమాయెను. సుప్రసిద్ధక్షత్రియవీరుఁ డగు హమ్మీర్ దేవుని యనంతర మా మహమ్మదీయ వాహిని నరికట్టఁజాలిన వీరులు లేకుండిరి. హిందువులమొఱ లాలకించు ప్రభువు లెవ్వరు లేకుండుటచే నా జాతియందు నిరుత్సాహము, నిరాశ యధికమై వారు—"అనన్యా శ్చింతయన్తో మాం, యే జనాః పర్యుపాసతే, తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహ" మ్మని ఘంటాపథముగ నుద్ఘోషించిన భగవానుని లోకకళ్యాణకరమును ధర్మరక్షణనిరతము నగు మూర్తి నాశ్రయించిరి. సనాతనమగు హిందూధర్మ మా మహమ్మదీయుల తాకిడులను లక్ష్యపెట్టక నేటికిని సుస్థిరముగ నిత్యనూతనశోభలతో వెలుఁగొందుచుండుటకుఁ గారణ మా లోకోత్తరచరితుఁడును పురుషోత్తముఁడు నగు కోదండరాముని శరణు జొచ్చుటయే. అట్టి ప్రమాదపరిస్థితులలో శ్రీగోస్వామిగారు, భక్తసూరదాస్, మీరాబాయి మొదలగు వారు తమ కావ్యామృతధారలచే నిర్జీవమగు హిందూజాతియందు పునఃప్రాణప్రతిష్ఠ జేసియుండిరి. వాస్తవమునకు హిందీసాహిత్యమున స్వర్ణయుగ మదియే.

జన్మతిథివలెనే గోస్వామిగారి జన్మస్థానము గూడ కొంతవరకు వివాదాంశముగనే యున్నది కొందరు రాజాపురమనియు, కొందరు హాజీపురమనియు నింక గొందరు 'సోరోఁ' 'తారీ' లను ప్రదేశము లనియు పలువిధములఁ జెప్పియున్నారు. తమ వాదముల నిలబెట్టుకొనుటకై ప్రతివారును కొన్నికొన్ని ప్రమాణముల జూపినను 'సోరోఁ' (సూకరక్షేత్రము) అనునది తులసీదాసు పుట్టిన చోటని నమ్మదగియున్నది. తులసీదా సతిబాల్యావస్థయందే 'సోరోఁ' లో బిచ్చమెత్తుకొనుచుండె నని తన రచనలం దచ్చటచ్చట జెప్పుకొనియున్నాడు. నేటికిని 'సోరోఁ' గ్రామస్థులు నా పరిసర ములలోని వారును తులసీజన్మస్థాన మదియే యనియు నచ్చట నొక కసాయి వీధిలో నాయన కుటీర ముండెననియు చెప్పుచున్నారు. గోస్వామిగారు కూడ తన యిల్లు కసాయివీథిలో నుండెనని చెప్పుకొని యున్నారు.

" తులసీ తేరీ ఝూోపడీ గలకటియోం కేపాస్
జౌనకరై సోయీ భరై తూ కత హోత ఉదాస్."

ఇందు 'గలకటియా' (గొంతు కోయువారు) యను శబ్దమును బట్టి చూడ నీ వాదము నిజమని తోచు చున్నది. కాని గ్రియర్సన్, రామగులాం ద్వివేది, రామచంద్రశుక్ల మొదలగు పండితులు రాజాపురమే కవిగారి జన్మస్థాన మనియు, నేటికి నచ్చట వారి మందిర మున్న దనియు నెంచు చున్నారు.

శ్రీ గోస్వామిగారు సరయూపారీణబ్రాహ్మణులు. వీరి తండ్రి 'ఆత్మారామ్ దూబే, తల్లిపేరు 'హులసీ'; ఒకానొకచోట తులసీ.

"తను జన్యో కుటిల కీటజ్యోంత జ్యోమాతు పితాహూఁ" అనియు కవితావళియందు, "మాతుపితా జగజాయితజ్యో" యనియు వ్రాసికొనియుండుటచే నాయన జన్మించినవెంటనే మాతాపితృహీను లై రని తెలియుచున్నది. తులసీదాసుగారి మొదటిపే రది గాదనియు శ్రీరామచంద్రుఁడే తనకు 'రామబోలా' యని నామకరణ మొనర్చియుండెననియు నాయన వ్రాసికొనియున్నారు. "రామకో గులామ్, నామరామ బోలా రాఖ్యో రామ్" కాని తులసీదాసను పేరెప్పటినుండి యెందులకు వచ్చెనో రూఢిగ తెలియదు. బాల్యముననే తలిదండ్రుల గోల్పోయి తులసీదాసు మధు కరవృత్తిచే నుదరపోషణ మొనర్చుకొనుచుండ బాబా నరహరిదాసను నాయన యతనిఁ జేరదీసి విద్యాదాన మొనర్చెను.

"మైఁపుని నిజగురు ససనునీ, కథాజో సూకరఖేత్."

రామకథ తులసీదాసునకు బ్రప్రథమమున నెరిగించిన దీ నరహరిదాసే. గురువువెంట కొంత కాలము నకు కాశీ చని, యందు పంచగంగాఘట్టమున శేషసనాతను లను పండితునియొద్ద శుశ్రూష జేసి వేదవేదాంగములందును దర్శనేతిహాసపురాణములందును ప్రావీణ్యము నొందిరి. తర్వాత యమునా తీరవాసి యగు బ్రాహ్మణుఁ డొక డీయన వినయసౌశీల్యాదిసుగుణసంపత్తికి మెచ్చికొని తన

కుమార్తె నిచ్చి వివాహ మొనర్చెను. జనశ్రుతినిబట్టి చూడ నీభార్య సదోపదేశవల్లనే తులసీదాసు భక్తుఁడయ్యెనని తెలియుచున్నది.

ఒకనాడు తులసీదా సింట లేనివేళ పుట్టినింటివా రామెను పిలుచుకొనివెళ్ళగా నాయన తిరిగివచ్చి జరిగిన సమాచారము నెరిగి మోహాతిరేకమున రాత్రి యని శంకింపక వెల్లువలతో నున్న నదీప్రవాహము నీది భార్యయుండు గ్రామమునకు బోయెనట. ఆమె తనభర్త యవివేకమునకు విషయలోలుపత్వమునకు మిగుల నొచ్చుకొని యాతని జూచి— 'అస్థిచర్మమయమును క్షణభంగురము నగు నా దేహముపైనున్న ప్రీతి మీకు శ్రీరామచంద్రునిపై నుండుచో భవభీతి లేకుండునుగదా. మీ రింత లజ్జాహీనులై యేల వచ్చితి'రని యధిక్షేపించె నట. భార్యపలుకులు హృదయమున ములుకులై నాటి వేధింప జ్ఞానోదయ మయి సంసారమును ద్యజించి కాశీ చేరి తులసి శ్రీరామునకాంతరంగికభక్తుడయ్యెను.

కాశీలో కొంతకాల ముండినతర్వాత తులసీదాసుగారు 19 సంవత్సరముల కాలము భారతదేశ సంచార మొనర్చి రామేశ్వరము మొదలు మానససరస్సువరకు గల పుణ్యతీర్థములు సేవించిరి. తీర్థరాజమగు ప్రయాగయు చిత్రకూటము నాయన కత్యంతప్రీతికర మగు స్థానములు. చిత్రకూటమున నుండగా సమకాలికుఁడగు భక్తసూరదా సాయనను దర్శించియుండెను. ఆ సమయముననే గోస్వామి 'గీతావళీ, కృష్ణగీతావళి' యను గ్రంథముల రచించియుండెను. తన ప్రసిద్ధగ్రంథమగు రామచరితమానసమునందలి బాల, అయోధ్యా,అరణ్యకాండముల నయోధ్యయందును, కిష్కింధాకాండమును కాశిలో నున్న కాలమునను రచించియుండిరి. రామాయణమును రచించుటతో తులసీదాసుగారి యశశ్చంద్రికలు నలుదిక్కుల వ్యాపించి దేశ మంతయు వారిని పూజింపసాగెను. రామనామ మందలి తన యనన్యసామాన్యవిశ్వాసమువలన దేశమున ననేకవిధము లగు చమత్కారములఁ జూపి ప్రజల నాకర్షించె నని జనశ్రుతులవలన దెలియుచున్నది.

ఆకాలమున కాశీలో శివభక్తుఁడు మధుసూదనసరస్వతి యను గొప్ప పండితుఁ డుండెను. ఒకనాడాయన తులసీదాసుతో శాస్త్రచర్చ చేసి సంతోషించి యీ క్రింది శ్లోకరూపమున దన యభిప్రాయ మొసఁగియుండెను.

> ఆనందకాననే హ్యస్మిన్ జంగమ స్తులసీతరుః
> కవితామంజరీ యస్య రామభ్రమరభూషితా.

"భక్తమాల"రచించిన నాభాదాసు, సూరదాసు, మీరాబాయి మొదలగు భక్తులు వీరికి సమకాలీనులు. పరమభక్తురాలగు మీరాబాయి యింటివారలచే బాధించఁబడి యేమియుఁ దోచక సలహా గోరుచు తులసీదాసుగారికి జాబు వ్రాయుటయు నా భక్తుఁ డందుకు జవాబుగ—"సీతారాముల నిష్టదైవములుగాఁ గొలువ దగ్గరబంధువులనైనను త్యజించవలసినదే" యను నాశయము నొసగు గీతము వ్రాసి పంపుటయుఁ జరిత్రప్రసిద్ధములు.

వీరికి హనుమంతునిద్వారా రామదర్శనము లభించెనని యీ క్రింది జనశ్రుతిగలదు. తులసీదాసు రామనామమహిమవలన నొక ప్రేతమును తృప్తిపరుప, నది యాయన నేదైన కోరుకొను మనెనట. అంతట శ్రీరామదర్శనము కల్గింపవలె నని దాసుగారు కోరగా నాప్రేత మక్కార్యము తన కసాధ్యమయినను తన యోపినంత సాయపడెదనని యెంచి, హనుమంతుడు ప్రతిదినము నొక వికలాంగుని రూపమున రామాయణశ్రవణమునకై కాశిలో నొక బ్రాహ్మణుని యింటికి వచ్చు చుండుటఁ దెలిపి యమ్మహాత్ముని నాశ్రయించుచో నతని కోర్కె కొనసాగు నని చెప్పెనట. అట్లే యాతఁడును కుష్ఠువానిరూపమున నున్న హనుమంతుని గుర్తించి తన కోర్కె వినిపింప నాయన చిత్రకూటమున రామదర్శనము చేయించెద ననె నట. వెంటనే చిత్రకూటముఁ జేరి తులసీదాసుగా రొకనాడు ధ్యానమగ్నులైయుండ సుందరుఁడగు రాజకుమారుఁ డొకఁ డరుదెంచి చందనము కావలయు నని యడుగగా నత డది యరుగదీసి యిచ్చెనట. అంతలో గగనమార్గమున హనుమంతుఁ డొక పక్షిరూపమున నీ క్రింది శ్లోకమును చదివి యారాజకుమారుఁడే రామచంద్రు డని సూచించె నఁట.

> "చిత్రకూటకే ఘాటపర్ - భయిసంతనకీ భీడ్
> తులసిదాస చందన ఘుసెవు - తిలకకరై రఘువీర్!"

వెంటనే ఆ రాకుమారుని జూచి 'రామా! రామా!'యని భక్తివిహ్వలుఁడై యరచుచు నా యదృష్ట శాలి మూర్ఛ నొందెనట! ఇంతేగాక కాశిలో వసించు దినములలో చోరుల బారినుండి, రామ లక్ష్మణులు ధనుర్బాణసహితులై గోస్వామిగారి కుటీరమును కాపాడుచుండి రని కింవదంతి గలదు. ఇంతవరకు గోస్వామిగారి జీవితచరిత్రమును సంక్షేపముగ దెలిసికొంటిమి. ఇక నామహానుభావుని స్వభావమును బ్రకృతినిగూర్చి కొంత తెలిసికొందము. నిజమగు భక్తుఁడగుటచే నీయనయం దహం భావము, ఆత్మస్తుతి, పరనింద, స్వోత్కర్ష మొదలగునవి మచ్చునకైనఁ గానరావు. సృష్టిలో తానే లఘుతమ మగు జీవి యని యాయననమ్మకము. ఆయన వ్రాసిన "వినయపత్రిక"యను గ్రంథము ప్రారంభమునుండియు చివరవరకు తన లఘుత్వనివేదనము, భగవన్మహాత్వప్రదర్శ నముఁ దప్ప మరేమియు గానరాదు.

> "రామసోఁ బడోహై కోన మోసోఁ కౌన ఛోటో"
> "వంచక భగత కహాయి రామకే, కింకరకంచన కోహా కామకే
> తిన్హమహఁ ప్రథమ రేఖ జగమోరీ, ధిగ ధర్మధ్వజధంధర కధోరీ."
> జౌ అపనే అవగునసబ్ కహా ఊఁ, బాఢయి కథాపారనహిఁలహావూఁ"

భక్తులు రెండు తెగలు. అందొకరు కేవలము తమ వ్యక్తిగతమగు ముక్తికొరకై యేకాంతభజన సల్పుచుందురు. అట్టి వారికి బాహ్యప్రపంచముతోఁ బనియే యుండదు. వా రేకాంతసాధకులు. రెండవరకపు భక్తుఁ డాత్మోద్ధరణకై యంతగా పాటుపడక లోకకళ్యాణమునే పరమావధిగ నెంచు కొని యందులకై భగవానుని లోకరక్షక—దుష్టశిక్షక, శిష్టరక్షక — స్వరూపముననే చర్మచక్షు

వులకు గోచరించు బాహ్యప్రపంచమునఁ బ్రతిష్ఠించి యుపాసించుచుండును. శ్రీతులసీదాసుగారీ రెండవ శ్రేణికిఁ జెందినవారు. ఆయన దురంతకులు, అనాచారులు, కర్మభ్రష్టులు, కర్తవ్యదూరులు, నీతిబాహ్యులు పాపంకులతో నిండియున్న యీ సమాజమును జూచి తటస్థుఁడై యుండజాలఁడు. సమాజమును సమూలముగ నాశనముజేయు నా విషసర్పముల బారినుండి మానవజాతిని కాపాడునంతవరకు నాయనకు మనశ్శాంతి యుండదు. అందుకై తన గ్రంథములలో నడుగడుగునకు నట్టి కుమార్గీయుల ఖండనము, వర్ణాశ్రమధర్మసదాచారముల ప్రతిపాదనము నొనర్చుచు ప్రజలదృష్టి నావైపున కాకర్షించుచుండును. ధర్మహాని సహింపఁజాలక వామమార్గీయు లవలంబించు విధానముల నిందించియుండెనేగాని వ్యక్తిగతముగ వారియెడ నాయనకెట్టి ద్వేషమును లేదు.

గోస్వామి తులసీదాసుగా రత్యంతసరళస్వభావులు. నిరభిమానులు; నిరభిమానులన నాత్మగౌరవశూన్యులని భావముగాదు. భయమువలనగాని లోభమువలనగాని తన దైన్యమును బ్రకటించునట్టి ప్రకృతి యాయనదిగాదు. ధనలోభమునకు గురియై తన యమూల్యమగు వాణి నమ్ముకొనుటయు స్వార్థాంధులగు మానవులఁ బ్రశంసించుటయు నాయన కెంతమాత్రము నిష్టములేదు. తన గ్రంథముల లోకకళ్యాణమునకై పరమేశ్వరప్రీత్యర్థము రచించెనేగాని మానవమాత్రున కెవ్వనికిని కృతి యొసగి యుండలేదు. ఈ విషయమున నీయన తెలుఁగు భక్తకవి శిరోమణి యగు శ్రీ పోతన్నగారిని బోలినారు. తన కత్యంతప్రియమిత్రుఁడగు 'రాజా టోడర్' అను నాయన మరణవార్త వినినపుడుమాత్ర మాతని సుగుణసంపత్తిని స్నేహపాత్రతను గొనియాడెను.

పుణ్యభూమి యగు భారతావనియందు జన్మించుట గొప్ప పూర్వపుణ్యమువలననే గలుగునని యాయన భావము.

"భవి భారతభూమి, భలేకుల జన్మసమాజ సరీర భలోలహికై
జోభజే భగవాన్ సయాన సోయీ, తులసీ హాఠ్ చాతకజ్యోం లహికై.

శ్రీ తులసీదాసుగారి కావ్యకౌశల మెఱుంగుటకు బూర్వ మాయన యేయే విషయములను దృక్పథమున నుంచుకొని గ్రంథరచనకుఁ గడంగెనో చూతము. గోస్వామిగా రుదారస్వభావులనియు సర్వమానవకళ్యాణమునకు పాటుపడుటయే యాయనస్వభావ మనియు జూచియుంటిమి. సమాజమున వేదసమ్మతమగు లోకధర్మము ప్రతిష్ఠింపఁబడిననే గాని మానవజీవితము నిర్దుష్టమై పరిపూర్ణత్వముఁ బడయజాలదని యాయనసమ్మకము. అందులకై లోకధర్మప్రతిష్ఠాపనకే తన రచనలందు బ్రాధాన్య మొసగియుండెను.

కర్మకాండ, జ్ఞానకాండ, ఉపాసనాకాండ లను నీ మూడును శ్రుతిసమ్మతమగు లోకధర్మమున కంగములు. ఈ మూడును సమముగ సమాజమున ననుష్ఠింపబడునంతకాలము మానవజీవితము సుగమ మగు మార్గమున నడచుచుండును. అట్లుకాక యిందేయొక్క యవయవమైనను దానుండ

వలసిన పరిమితిని మించియున్నను లేక తగ్గియున్నను సమాజమున సమత్వము నశించి ప్రజలలో నశాంతియు ధిక్కారమును విజృంభించును. అట్టి పరిస్థితులలో సత్యోన్నతి నరికట్టియు లేక క్షీణించిన యంగము నుద్ధరించియు మరల సమత్వమును స్థాపించుటకై భగవానుని పంపున నెవరో మహాత్ము లవతరించుచుందురు. దేశమున కర్మకాండ ప్రబలి యజ్ఞయాగాదులందు పశుబలు లెక్కువ కాగా, బుద్ధభగవానుఁ డవతరించి యద్దాని నిరోధించుటయు, మరల కొంతకాలమునకు బౌద్ధపాషండమతప్రచారకులు దేశము నాపరించగా, నాదిశంకరు లవతరించి వైదిక ధర్మస్థాపన మొనర్చుటయు చరిత్రప్రసిద్ధములు.

ఇట్లే శ్రీ గోస్వామిగా రవతరించుసరికి గూడ దేశమున మతసంబంధమగు విషమస్థితి ప్రబలియుండెను. శైవ, వైష్ణవ, బౌద్ధ, శాక్తేయ, పాషండమార్గములు విజృంభించి, ఆయా మతాచార్యు లందరు స్వమత ప్రశంస, పరమతనిందాద్వేషము లొనర్చుచు బరస్పరము గలహించుకొనుచుండిరి. సామాన్యజనుల కేమార్గము వేదవిహితమై యనుకరణీయమో తెలియక తికమక పడుచుండిరి. దక్షిణాపథమున నీ యశాంతి పెచ్చుపెరిగి శివకంచి, విష్ణుకంచి యనునవి యేర్పడెను. ఉత్తరదేశమున ముసల్మానుల యధికారమునకు లోబడి ప్రజలబుద్ధి, పురుషార్థమును గోల్పోయి కర్మజ్ఞాన ఉపాసనామార్గముల వదలి నిర్వీర్యమయ్యెను. వేదశాస్త్ర దూషణము వర్ణాశ్రమధర్మనిరాదరణయు ప్రబలము కాజొచ్చెను. పెద్దలయెడ భక్తిశ్రద్ధలు లేకుండుట, దుష్టుల మదమణచు వీరుల గౌరవించకపోవుట, పండితుల సన్మానించకుండుట మొదలగు దురాచారములఁ జూచి గోస్వామిగారి యాత్మ సహింపలేక పోయెను. ఆ మహామహుడు తన యమృతవాణిద్వారా వేదశాస్త్రసమ్మత మగు కర్మజ్ఞానములను వర్ణాశ్రమధర్మములను భక్తితో సమన్వయ మొనర్చి సమాజమునందలి వైషమ్యమును పారద్రోలి దాని కొక నూతన జీవ మొసంగెను. తనయాదర్శముల కనుకూలముగ నుండుటకై లోకోత్తరచరిత్రుఁ డగు రామచంద్రుని చరిత్రను గాన మొనర్చెను. లోకప్రవృత్తి నెరింగినవాఁ డగుటచే శుష్కోపన్యాసముల నొసగుటకన్న రాముని సర్వమంగళగుణసంపన్నము, శీలబలసౌందర్య సంయుతము నగు నాదర్శస్వరూపమును ప్రజల మనోమందిరముల జిత్రించి వారల నాకర్షించుట సులభమని యట్లొనర్చెను. రామలీలలందే ప్రాపంచిక వ్యవహారములను, ప్రాపంచిక వ్యాపారములందే రామలీలల సమన్వయించి, శ్రీరాముఁడు లౌకికవ్యాపారముల నిర్లిప్తుడై యుండు మానవ మాత్రుఁడే యని చూపుటతో ప్రజలు తమంతట దామె యాకర్షించబడిరి. రామచరిత్రవలన సమాజమున 'రామత్వ' 'రావణత్వ' నిరూపణ మేర్పడి ప్రజలలో రామత్వమునెడల శ్రద్ధా భక్తి ప్రేమలును, రావణత్వ మనిన జుగుప్స, ద్వేషము, నిరసనభావములు గల్గెను. ఇది గోస్వామి గారి లౌకికదృష్టికోణము. కాని పారమార్థిక బుద్ధితోఁ జూచిన నాయన కీచరాచరసృష్టి యంతయు 'సియారామమయ'మగుటవలన పూజనీయము.

'సియా రామ మయ సబ్ జగజానీ - కరౌఁప్రనామ జోరి జుగపానీ'

ప్రజలలోని శైవ వైష్ణవ ద్వేషభావములఁ బారద్రోలి పరమతసహిష్ణుత్వము నెలకొల్పెను. ఆదర్శపురుషుఁడగు రామచంద్రుడే—

'శివద్రోహీ మమదాసక హావై - సోనరసపనేహు మోహీ నఖావై'

యని చాటిచెప్పి ప్రజలలో సౌమనస్యము పెంపొందించెను. ఇట్లంధకారావృత మగు లౌకికజీవిత మున ధర్మజ్యోతి వెలిగించి మానవసమాజమునకు మహోపకార మొనర్చెను.

ఇక తులసీదాసుగారి భక్తిమార్గ మంతటి జనామోదము నేల పొందెనో చూతము. గోస్వామి తమ భక్తిభావమున కాలంబనముగ నాదర్శపురుషోత్తము నెన్నుకొని, యనంత సౌందర్య, బల, శీలము లనెడి శక్తుల మేళనముచే నాయనజీవితమును మహాచుంబకముగ నొనర్చెను. శుష్కము లగు జ్ఞానోపదేశముల నొసంగక భగవానుని లోకరక్షకరూపమును లౌకికక్షేత్రమునఁ బ్రతిష్ఠించి, యాతఁడు తమ కష్టములఁ బోగొట్టగల సమర్థుఁ డనెడి నమ్మకము,విశ్వాసము ప్రజలలో వ్యాపింప జేయుట, భక్తుల ధ్యేయము. అందు వారు సఫలు లగుచో భక్తి తనంత నదియే వ్యాపించగలదు. రాముఁడు లక్ష్మణునితో మిథిలానగరవీథుల సంచరించునపు డాయనసౌందర్య మందలివారల మోహాబ్ధి ముంచివైచినది.

"కహహిఁ పరస్పర వచన సప్రీతీ, సఖియిన్హ కోటికామ ఛవి జీతీ"
"హియహరషహిఁ బరషహిఁ సుమన సుముఖి సులోచన వృంద
జాహిఁ జహాఁ జహాఁ బంధుదోవు - తహాఁ తహాఁ పరమానంద."

నాగరకు లగు మిథిలావాసులనే గాక శ్రీరామచంద్రుఁడు నారచీరలు ధరించి యరణ్యమునకు బోవుచు మార్గమునందలి యాటవికులనైతము తన సహజసౌందర్యముచే ముగ్ధుల జేసెను. వారు కన్నుల కరవుదీర నా "కోటి మనోజలజావహారే—" దివ్యమంగళ విగ్రహమును జూచుటకై యోజనములపర్యంతము వెంటనంటి వెళ్ళిరి.

సీతాస్వయంవరమున రావణాదియోధులకు గూడ కదల్పరాని మహాదేవుని ధనుస్సును నిమిష మాత్రమున చేతగొని 'యిషువు దొడుగుట దివుచుటయు నెరుగ రాకుండ రెండు ఖండము లొనర్చి భూరినాదముతో సభాసీనుల దిగ్భ్రాంతుల' జేసిన రాముని బలపౌరుషముల జూచి యంతకు పూర్వమే యాతని సౌందర్యామృతమును చూరగొనుచున్న ప్రజలు ప్రేమవివ్హలు లగుట కాశ్చర్య మేమున్నది? పోనుపో నిరువదియొక్కమారు రాజలోకము నెల్ల గడ గడ లాడించిన భార్గవరాముని లోగొనుట, తన బలపౌరుషములఁ రావణాది లోకకంటకుల నాశార్థము వినియో గించుటవలన నాయనయందు వారి కనన్యమగు భక్తి యేర్పడినది.

ఇక జనుల నాకర్షించునట్టి మూడవవిషయము సచ్ఛీలము. గోస్వామిగారు శ్రీరామపాత్రియం దిశీలనిరూపణ మత్యంత మనోహరముగ జేసి యున్నారు. శ్రీరాముఁడు బాల్యమునుండియు సచ్ఛీల మునకు వినయమునకు నిధి యని పేరు బడసెను.

"సుని సీతాపతి సీల సుభావు
మోదనమన, తనుపులక, నయనజల, సోనర ఖేహరఖావు

ఖేలత సంగ అనుజ బాలకనిత జు గవత అనట ఉపావు
జీతిహారి చుచుకారి దులారత దేతదివావత దాఉ.

తల్లిదండ్రి గురువులందు శ్రద్ధాభక్తులు, సేవకులయెడ క్షమాగుణము, నాటలలో దాను గెలిచి యితరు లోడుచో వారు మనోవేదన బొందుదు రని తలచి, మరల దా నోడి వారి గెలిపించి వారు మనస్సు చిన్నబుచ్చుకొనకుండ జేయుట, అహల్యాశాపవిముక్తి నొనర్చి తన పాద మామె పవిత్ర శరీరమును దాకి మహాపరాధ మొనర్చె నే యని పరితపించుట, తన యరణ్యావాసమునకుఁ గారకురాలై నందుకు బినతల్లి పొందిన పశ్చాత్తాపమును గ్రహించి యనేకవిధముల నామె మనోవ్యథను బోగొట్ట యత్నించుట, పాదుకాప్రదానసమయమున రాజ్యాభిషేకవిఘాతకురా లగు కైకేయి కుమారుఁడు భరతుని భ్రాతృప్రేమను ప్రశంసించి యతనికి మనశ్శాంతి జేకూర్చుట, సీతాన్వేషణ మొనర్చిన హనుమంతునియెడ కృతజ్ఞతాప్రదర్శనము, శరణాగతు లగు సుగ్రీవవిభీషణుల రక్షించి ప్రతిజ్ఞాపాలన మొనర్చుట భక్తులకు దా నొనర్చిన యుపకారముల వారు ప్రశంసించుచుండ నాత్మప్రశంసను విని లజ్జించుట, తన యేకపత్నీవ్రతత్వమును బరీక్షింప మాయాసీతారూపమున నేతెంచిన దేవిని జూచి మనశ్చాంచల్యము బొందక తన నిష్కళంకశీలప్రదర్శన మొనర్చుట మొదలగు ఘట్టము లనేకములు "రామచరిత్రము"న నున్నవి. మర్మజ్ఞులు, జిజ్ఞాసువులు నగు వారు 'రామచరిత మానస' సాగరమున గ్రుంకు లిడి వెదకుచో నట్టి రత్నము లనేకములు లభింపగలవు.

ఇట్లనంత సౌందర్యబలములకు, సువర్ణమునకు సుగంధ మబ్బినట్లు, మందాకినీపవిత్రాంబువులవలె నమలినమగు శీలసాహచర్యము లభించుటఁ జేసి శ్రీరాముని లోకోత్తరచరిత్రము భక్తుల హృదయపటలములందు సుస్థిరముగ నాటుకొనియెను. లోకకళ్యాణమును కాంక్షించువారిభక్తిప్రేమల కనంత సౌందర్యబలశీలగుణాభిరాముఁ డగు రాముని స్వరూపముకన్న ప్రశస్తమగు నాలంబన మేమి యుండగలదు?

జ్ఞాన, భక్తిమార్గములు రెంటి చరమ లక్ష్యమును భగవత్సాక్షాత్కార మగుటవలన వానికి నామ మాత్రభేదము తప్ప రెండును నొకటియే యని శ్రీగోస్వామి యుద్దేశ్యము. కాని జ్ఞానమార్గము కృపాణధారవలె సున్నితమై, భక్తి యట్లుగాక భగవంతుని జేరుటకు ఫలపుష్పసమన్వితములగు వృక్షములతో గూడిన రాజమార్గ మగుటచే తాను భక్తికే ప్రాధాన్య మొసగితి నని యాయన వ్రాసియుండెను.

"జ్ఞానహిఁ, చగతిహిఁ నహిఁ కఛుభేదా - ఉభయ హరహిఁ భవసంభవఖేదా"
"జ్ఞానపంథ్ కృపానకై ధారా - పరత, ఖగేశహోయినహిచారా"
"గురు కహహ్యో రామభజననీకో - మోహిలాగత రాజడగరోసా"

మరొకచో నాయన భక్తి, భక్తుఁడు వల దనుచున్నను నతనికి మోక్షమును సమకూర్చిపెట్టునని

వ్రాసెను. అట్టి కామధేనువువంటి భక్తికి సగుణబ్రహ్మమే యాలంబనము కనుక సగుణోపాసనయే శ్రేష్ఠమని తన యభిప్రాయము నీక్రింది విధమున సమర్థించెను.

"గ్యానకహై అగ్యానబిను - తమ బినుకహై ప్రకాస్
నిరగున కహై జొసగున బిను - సోగురుతులసీదాస్!"

ప్రకాశము గలదని నిరూపించుట కంధకార ముండు టవసరము. అజ్ఞానము లేనిది జ్ఞాన ముండజాలదు. అట్లే నిర్గుణోపాసనకు బూర్వము సగుణోపాసన యత్యావసరము. ఇట్లనంత సౌందర్య, బల, శీల, జ్ఞానములతో సమన్వయ మొనర్చిన భక్తిని తులసీదాసు గా రెట్లు సాధించిరో చూతము.

తులసీదాసు తనది చాతకపక్షి భక్తి యనియు, నా పక్షియే తన కాదర్శమనియు చెప్పికొనియున్నాడు. చాతకపక్షి భూమిపై బడిన నీటిని ద్రాగదు. అది దాని కులధర్మము, వ్రతము, స్వాతియందలి మేఘజలముతోనే దాహము తీర్చుకొనవలెనని దాని ప్రతిజ్ఞ. అందుకై పండ్రెండు మాసముల కాలము తదేకనిష్ఠతో నది మేఘములఁ దనకు స్వాతిబిందువు బ్రసాదించుటకై వేడుకొనును. మేఘములు దానిపైఁ బిడుగులు రాళ్లు కురిపించినను సరియే, నది వాని యం దెంతమాత్రము నీర్ష్యా క్రోధములఁ బూనదు. వానిని వదలి యితరుల యాచింపదు. ఆవిధముగ ద్విగుణీకృతముగ వానిని బ్రేమించుటకు కారణము వానియందున్న లోకసంగ్రహప్రవృత్తియే. మేఘములు స్వాతికార్తె యందు వర్షించనిచో సస్యములు ఫలింపనేరవు. సస్యోపజీవులగు ప్రజ లట్టి పరిస్థితిలో మాడి చావవలసినదే. అట్టి ప్రజాక్షయము నాపుటకై చాతకము జనసమాజమున కంతకుఁ బ్రతినిధియై మొగిళ్ల నారాధించుచుండును. దాని ప్రేమను బరీక్షించుటకై యపు డపుడు జలదములు పిడుగులు రాళ్లు వర్షించినను వానిని సరకుగొనక నాప్రేమైకజీవి పుటము బెట్టిన బంగారమువలె మరింత ప్రకాశించునేగాని తన నియమమును వీడదు; జలము నర్థించి మేఘముల బ్రార్థించు ననినంత మాత్రమున దాని ప్రేమ ఫలాపేక్షారహితము గాకుండుటచే యాదర్శము గాదనుకొనుట పొరబాటు. పడియనీరు ద్రావినను చాతకమునకు దాహము దీరును. అట్లు కాదనుచో పోనీ, మేఘము నీరైనను నది స్వాతికార్తెయందే యేల కోరవలెను? మేఘములు తదితరసమయములలోగూడ వర్షించుచుండునుగదా! కారణము స్పష్టము. దేశము సుభిక్షముగ నుండవలె ననిన స్వాతివర్ష మత్యంతావశ్యకము, అది లేనినాడు దేశమున దుర్భిక్షమే! నిరంతరలోకకళ్యాణమునే కాంక్షించు పక్షిరాజ మట్టి స్థితి జూచి ఎట్లు సహింపగలదు!

శ్రీగోస్వామి తులసీదాసువంటి సర్వమానవప్రతినిధి యగు నిష్కామభక్తునకు చాతకపక్షికన్న సుందరము నుపయుక్తమునగు నాదర్శ మేమి యుండగలదు? మేఘశ్యాముఁ డగు రాముఁ డా భక్త చాతకము వేడికోలునకు ద్రవించి తన కృపారసమును భక్తలోకముపై వర్షింప జేయు నన్నచో నం దతిశయోక్తి యే ముండును? పథభ్రష్టులగు మానవులు మరల దమ వేదమాతయండ జేరి యామెను సుస్థిరముగ నిలబెట్టి రనుటలో వింత యేమి యుండును?

శ్రీతులసీదాసు 'తులసీ సతసయీ' (తులసీ సప్తశతీ) యను గ్రంథమును వి॥ శ॥ 1642 సంవత్సరమున రచించిరి. అందు 34 దోహా(ద్విపద)లలో కేవలము చాతకభక్తిని వర్ణించియున్నారు. దానిని 'చాతక చౌంతీసా' యందురు. ఆ దోహా లత్యంతప్రభావోత్కరములై కంఠస్థ మొనర్చుటకు వీలుగా నున్నవి. కొన్నిమాత్రమే యిం దుదాహరింపబడినవి.

> 'బ్యాధాబధె వుపపీహరా - పరెవు గంగ జలజాయి
> చోంచ్ మూంది పీవేనహీఁ - ధిగ్ పీవన పనజాయి'

వేటకాని దెబ్బ దిని గంగాజలమున బడినను వ్రతము చెడు నను భయముతో చాతకము ముక్కుమూసికొనియే యుండును.

> "తులసీ చాతక దేత సిఖ - సుత హిఁ బారహీంబార్
> తాత! నతరపన కీ జియో - బినావారిధరధార్"

చాతకము తన మరణానంతరము తన కుత్తరక్రియలు స్వాతిజలముతోనే యొసగుమని కుమారునకు బోధించుచున్నది.

> "ఉపల బరఖి, గరజిత తరజి డారత కులిసకఠోర్
> చితవకి చాతక జలదతజి, కబహుఁ ఆనకీ వోర్."

మేఘములు రాళ్ళు పిడుగులు వర్షించుచున్నను చాతకము వానిని వదలి యన్యుల నాశ్రయించదు.

> "మానరా ఖచో మాంవిబో పియసోఁ సహజనసేహు
> తులసీ తీనోఁతబ్ ఫబైజబ్ చాతకమత వేహు."

యాచకవృత్తి నవలంబించియు నాత్మగౌరవమును రక్షించుకొని యారాధ్యదేవుని బ్రేమించుచుండవలె ననుచో చాతకపద్ధతి నవలంబింపవలెను. సాధారణముగా యాచకవృత్తికి బాల్పడిన వార లాత్మగౌరవము నిలబెట్టుకొన గల్గియుండు టరుదు. కాని చాతకపద్ధతి ననుకరించుచో మానవుడు యాచకవృత్తి, యాత్మగౌరవము, ప్రియునియెడ నక్షుద్రమగు ప్రేమ అను నీమూటిని రక్షించుగొన గల్గును. చాతకపుయాచనయందు లోకసంగ్రహభావ మిమిడియుండుటచే నది నింద్యమును, దీనత్వ ప్రదర్శనమును గానేరదు. పైగా నాకారణమున దాని పేరు ప్రతిష్ఠలు, మానమర్యాద హెచ్చగును. హరిజనోద్ధరణకై గాంధిమహాత్ముఁ డవలంబించు యాచకవృత్తియు, కాశీ హిందూ విశ్వవిద్యాలయస్థాపనకై శ్రీమదనమోహన మాలవ్యాగారు చందాలకు దిరుగుటయు నా కీర్తిశాలుర గౌరవప్రతిష్ఠల పెంపొందించునే గాని తగ్గింపజాలవు. ఇట్టి చాతకభక్తి నాదర్శముగ నుంచుకొని గోస్వామిగారు సర్వమానవప్రతినిధియై లోకమందలి దుస్థితిని భగవానునకు నివేదించి తన దయారసవృష్టివలన నద్దానిఁ బాపఁ బ్రార్థించెను. స్వాతిజలము రఘునాథుని దయ యనియు తాను చాతక మనియు దన కంతకంటె మరొకరిప్రాపు వలదనియు నాయన చెప్పికొని యున్నాడు.

"యేక్ భరోసో యేక్ జల యేక్ ఆస విశ్వాస్
స్వాతి సలిల రఘునాధ బర, చాతక తులసీదాస్."

ఉత్తమశ్రేణికి చెందిన కవి కగాధమగు హృదయము, మానవప్రకృతిని నిరీక్షింపగల సునిశితమగు దృష్టియు నత్యంతావశ్యకములు. ఈ రెండును లేనినాడు కవి తన రచనలందు సఫలత పొంద జాలఁడు. అట్టి గ్రంథములు లక్షణగ్రంథములలో జెప్పబడిన ఛందోలంకారపద్ధతుల నన్నింటిని గల్గియుండియు నిష్ప్రాణమగు బొమ్మలవలె నిరుపయోగము లగును. కవి మానవప్రకృతియందలి ప్రత్యేకసన్నివేశమును గుర్తించవలెను. తాను ప్రతివ్యక్తి హృదయమున ప్రవేశించి యం దదృశ్యరూపమున నున్న భావరత్నముల వెదకి గ్రహించవలెను. బాహ్యప్రకృతిలోని దృశ్యములఁ జూచుట చర్మచక్షువులకు సాధ్యమగును గాని మానవుని యంతర్జగత్తును దర్శించి ప్రదర్శించ గల శక్తి భావగాంభీర్యము గల కవులందే యుండును. కావ్యదృష్టి యొక సమయమున మానవ క్షేత్రమునను వేరొక సమయమున మనుష్యేతరమగు బాహ్యసృష్టియందును మరొక సమయమున నా రెంటి సమిష్టియగు నీ చరాచరమునను రమించి పనిజేయుచుండును. ఈ మూటియందును కవి మానవక్షేత్రముననే తరచుగ ప్రవేశించి తన యనుభూతివలన నందలి మనోహరములై మర్మ ముల స్పృశించునట్టి ఘట్టముల నేరి వర్ణించుచుండును ఒక్కొక్కపుడు సాధారణజనానుభవమున కందుబాటులో నుండని మారుమూలలందలి విషయములగూడ దన ప్రతిభవలన 'బహిర్గత మొనర్చి రసజ్ఞుల పొగడ్తల నందుచుండును. గోస్వామిగారు కేవలము భక్తులు మాత్రమే గాక యుత్కృష్ట మైన కవిహృదయముగలవారు. తాను గానమొనర్చిన 'రామచరిత మానసము'న ప్రభావోత్పాద కములగు స్థలముల వెదకి విపులముగ వర్ణించినారు. ఆయన వ్రాసిన 'గీతావళీ' 'వినయపత్రిక' లందు గూడ గోస్వామి గారి గంభీరహృదయసాగరమున విహరించు ప్రేమ, విరహము, వాత్స ల్యము, ఆత్మ సమర్పణము, ఆశ్చర్యము, పశ్చాత్తాపము, మహత్త్వాకాంక్ష, మనోవేదన, ఆశ, నిరాశ, దైన్యభావము, విరక్తి, సందేహము, మానవప్రపంచమున కంతకు నవీనసందేశము మొద లగు భావతరంగముల దర్శించగలము.

వివాహమునకు పూర్వము వధూవరుల కన్యోన్యానురాగ మున్నచో వారి దాంపత్యజీవితము ప్రేమపూరితమై సుఖావహము కాగలదు. ఈ తథ్యమును గ్రహించియే తులసీదాసుగారు వాల్మీకి రామాయణమున లేని, పుష్పోద్యానమున శ్రీ సీతారాముల యాకస్మికసమావేశమును తన "మానస" మున జేర్చి ధనుర్భంగమునకుఁ బూర్వమే వారలకు పరస్పరానురాగము గలదని సూచించెను. రామచంద్రుని త్రిలోకమోహజనక మగు రూపముచే నాకర్షింపబడి, హరధనుర్భంగ మొనర్చి భార్గవరామునిఁ బరిభవింపఁజాలిన బలసామర్థ్యముల చూచి, మరింత నా మహానుభావు నకు సన్నిహితురాలై, పితృవాక్పరిపాలనము, భ్రాతృవాత్సల్యము, మాతృప్రేమ గురువులయెడ శ్రద్ధాభక్తులు మొదలగు శీలసంపత్తి దర్శించి యాయన పాదముల కడ దనయాత్మ సమర్పణము జేసి ధన్యురాలైన దా మహాదేవి!

ఇక శ్రీరాముని పితృభక్తిఁ జూడుడు.

"నిజకరఖాల ఖైంచి యాతను తేఁ జోపితు పగపానహీం కరావౌఁ
హూవున ఉ ఋణపితా దసరథ తే - కైసే తాకే వచనమేటి పతిపావౌఁ."

తన చర్మముతో జేసిన పాదరక్షలు తండ్రికి సమర్పించియు తాను పితౄణమునుండి విముక్తిబొంద జాలఁడట! అట్టి విధేయుఁ డగు పుత్రుని పంపు నవసరమున పితృహృదయ మెంతటి వేదనల బొందునో చూడుడు.

"తిలక కోబోల్యోది యోబన చౌగునో చితచావు
హృదయ దాడిమ జ్యోంనవి దర్యోసముఝి సీల సుభావు
దాస తులసీ నతరుమోకోమరన అమియపియావు"

తన పాషాణసదృశమగు హృదయ మట్టి పుత్ర వియోగమున బ్రద్దలు కాకుండుట చూచి మృత్యువను నమృతమున కాశించుట దశరథునకు యుక్తమే.

రాముఁడు తన సద్గుణములచే మనుష్యులనే గాక పశుపక్షులను గూడ ముగ్ధము చేసెను. రాముఁడు వనముకు వెళ్ళినతర్వాత నాయన యశ్వముల పరిస్థితిని జూడుడు.

'లోచనసజల, సదాసోవత సే, ఖానపాన బిసరాయే,
చితవత చౌంకినామ సుని సోచత రామసురతి ఉరఆయే-'

అశ్వములు మేత నీరు మాని కండ్లనీరు గార్చుచు 'రామ'శబ్దము వినినంతనే యులికిపడి నలువైపులకు చెవులు నిక్కించి చూచుచున్నవి.

అరణ్యమార్గమున జనుచున్న రామునకు స్వభావముచేతనే క్రూరులగు నాటవికులు సైతము తమ గృహకార్యముల వదలి వెంట జని సపర్యలు జరుపసాగిరి. దివ్యసౌందర్యగుణములతో నొప్పు నా మిథునము నెంతకాలము రెప్పలిడక జూచుచున్నను వారికి దనివియుండెడిదిగాదు. నిష్ప్రాణములగు మేఘములు సైతము సూర్యుని వేడిమి కడ్డముగ నిల్చి వారికి వెళ్లినంత మేరనీడ గల్పించి సౌఖ్యావహము లైనవి.

ఇక నయోధ్యాకాండమున వచ్చు పాత్రలన్నింటిలోను శ్రీగోస్వామిగారు భరతుని స్వభావవర్ణన మత్యంతాకర్షణీయముగ నొనర్చియున్నారు. రామవనవాసవృత్తాంతము వినినంతనే వ్యాకులపాటు జెందిన భరతుఁడు తనతల్లియే యీ యనర్థమునకు గారణమని వినినపుడు పొందిన మనోవేదన, సంతాపము వర్ణనాతీతములు. ఆయన హృదయసంతాపము నివారింపజాలిన దొక్క రామచంద్రుఁడే. ఈసంగతి నెరిగి భరతుఁ డొక క్షణమైన నాలసించక త్రికూటమునకు సపరివారముగ నరిగెను. మొదట దన హృదయావేదన నంతయు నన్నకు నివేదించి, రాజ్యమును మరల స్వీకరింపుమని

ప్రార్థించును, గాని రాముని యాదర్శమునందలి నైర్మల్యపవిత్రతల ప్రత్యక్షముగ గాంచినంతనే తన యావేశము నంతయు నణచికొని ధర్మసూత్రములకు గట్టుబడి వాని యాజ్ఞలకై వేచియుండును.

భరతుని ప్రకృతి నెరిఁగిన రాఘవుఁ డాయన హృదయమును గలచివేయుచున్న పశ్చాత్తాపాను తాపమిశ్రితమగు ఝంఝూవాతమును జూచి కలవరము జెందెను. భరతుఁడు తాను కోరిచేసిన తప్పిద మేమియు లేదని యెరిగియున్నను లోకుల మనస్సులు దనయెడ దాను కైకపుత్త్రుఁడై నకారణమున కలుషితములగుట జూచి యట్టి మిథ్యాశంకల నిర్మూలన మొనర్పనిదే తాను తలయెత్తి తిరుగుటకు వీలులేదని యెంచెను. పరేంగితావగాహి యగు శ్రీరాముఁ డిది యెరిగి స్వర్గంగాతోయమువలె స్వచ్ఛమును బవిత్రము నగు భరతుని స్వభావమును బ్రపంచమునకు జాటి చెప్పి సోదరప్రేమ కొక మహాదర్శము స్థాపించెను. భరతుఁడు చిత్రకూటమును జేరుటకు పూర్వము రాముఁడు లక్ష్మణునితో నతనిగూర్చి యిట్లు చెప్పెను.

> "భరతహిఁ హోయిన రాజమద, విధి హరి హర పదపాయి
> కబహుఁకి కాంజీ శీకరని, ఛీరసింధు వినసాయి-"

విధి, హరి, హరుల పదవి లభించినను భరతునకు రాజ్యమదము గలుగనేరదు. పవిత్రమగు భరతుని స్వభావ మను పాలసంద్రమును రాజ్యకాంక్ష యను గంజి బిందువు విరుగదీయజాలదు. లోకోత్తర చరిత్రుఁ డగు రాముని హృదయమున నిట్టి యఖండవిశ్వాసమును సంపాదింపఁజాలిన భరతుఁ డెంత ధన్యుఁడు! ఇదిగాక చిత్రకూటమున సమావేశమైన సభలో పుణ్యశ్లోకుఁడగు భరతుని పవిత్రనామము సకలపాపహర మని శ్రీరాముఁడే మేఘగంభీరస్వరమున చాటిచెప్పెను.

> "మిటిహహిఁ పాపప్రపంచసబ్ - అఖిల అమంగలభార్
> లోకసుయశ; పరలోక సుఖ - సుమిరత నామ తుమ్హార్."

భరతునిలో లోకాపనిందయెడ వెఱపు, భ్రాతృప్రేమ, కర్తవ్యపాలనము, గురువులయెడ భక్తి లోకధర్మకులాచారము లనిన విధేయత మొదలగు సుగుణములు పుంజీభవించి యున్నవి. అన్న యెడ నంతటి యగాధమగు భక్తి వినయములు భరతునిలోను, తమ్మునిపై నంతటి నమ్మకము వాత్సల్యము రామునియందును, మనోహరముగ జిత్రించి శ్రీ గోస్వామిగారవిశ్వాస తిరస్కార భావములతో నిండి నిబిడీకృతమై యున్న భ్రాతృలోకమునకు మహోపకార మొనర్చిరి.

చిత్రకూటమున సమావేశమైన యా మహాసభకు శ్రీ తులసీదాసుగా రత్యంత ప్రాధాన్య మొసగి నారు. ఆర్యధర్మపుటంగము లన్నియు నందు వశిష్ఠాదిమహాజ్ఞానులచే జర్చింపబడి యందలి తీర్మాన ములే యనుష్ఠించఁబడినవి. చిత్రకూటపువాతావరణ మంతయు నా సమావేశమువలన బవిత్రమై ధన్యత నొందెను. 'రామచరిత మానస' గ్రంథమునం దా ధర్మసభ యొక యపూర్వమైన యాధ్యా

త్మిక సంఘటనము. సమాజమునందలి తరగతులకు చెందిన వ్యక్తుల పరస్పర సంబంధములు కర్తవ్యాంశములు మొదలగునవి విశదముగ జర్చింపబడి నిర్ణయింపఁబడెను. వైదిక సంస్కృతి, శిష్టాచరణముల కనుగుణముగ సభలలో నెట్లు మెలగవలసినదియు, నెట్టి కట్టుదిట్టములతో మాటాడవలసినదియు, నెవరియెడ నెట్లు నడుచుకొనవలసినది మొదలగు నియమము లన్నియు నందు పాలింపబడెను. రామచంద్రుఁడు తిరిగి యయోధ్యకు రావలె ననెడి ప్రబలకాంక్ష సాధారణప్రజలు మొదలు వశిష్ఠుఁడు, శతానందుఁడు మొదలగు వారివరకు నందర మనస్సులలోను గలదు. కాని సభలో కూర్చుండి ధర్మశాస్త్రచర్చకుఁ గడంగినతర్వాత ధర్మసూత్రము లనుల్లంఘనీయము లగుటచే వానిని గౌరవించి యనుష్ఠించవలె నను కర్తవ్యజ్ఞాన ముదయించుటతో, వారందరును తమ వ్యక్తిగతములగు కోరికల నణచుకొని ధర్మసూక్ష్మత నెఱిగినవారి యాజ్ఞలకుఁ బద్ధులైరి. పితృవాక్యపరిపాలనమే కరణీయ మని నిశ్చయించబడెను. వృద్ధులు జ్ఞానులు నగువారి యెదుట తమయభిప్రాయముల నొసగుట వాచాలత్వప్రదర్శనముగ నెంచబడు నను భయమున రామభరతులు సైతము మౌనము వహించియుండిరి.

ఈ సభాకార్యక్రమమునఁ బడి గోస్వామిగారు పశ్చాత్తాపముతో దగ్ధమౌచున్న యా కైకేయిని మరువలేదు. సీతారామలక్ష్మణుల హృదయనైర్మల్యము జూచి యామె తన జీవితమే భారముగ దోపఁ బంచభూతముల మృత్యువు నొసగ బ్రార్థించుచున్నది.

"లఖిసియ సహిత సరలదోవు భాయీ - కుటిలరాని పఛతాని అఘాయీ
అవనిజమహిజాచతి కైకేయీ - మహిసబీచు విధిమీచున దేయీ"

శీలమూర్తియగు రాముఁ డది చూచియే ప్రథమమున కైకేయిని కలిసికొని తర్వాత కౌసల్యాది మాతల దర్శించెను. అంతేగాక కైకేయి జీవించి యున్నంతవరకు తన తల్లికన్న నామెనే యెక్కువగా సంభావించెడు వాఁడు.

"కైకేయీజౌలౌఁ జియతిరహీఁ, మానీ రామ అధిక జననీ తేఁ జననిహుఁగఁసనగహీ".

జనకుఁడు పతితోడిదే గతి యని నమ్మికొనియున్న కుమార్తె సుగుణసంపదకు మెచ్చుకొనెను. తండ్రి శిబిరమున మాటలాడుచున్న సీత ప్రొద్దుగ్రుంకి రాత్రి కాగా చూచి తనభర్త పర్ణశాలయందు నేలబడి యుండ తా నా రాత్రి యచట బర్యంకములపై నిద్రించుట తగ దని యెంచి మాటాడుచున్న తండ్రితో నావిషయము చెప్ప సాహసించ లేక కలవర పడును.

"కహతన సీయసకుచి మనమాహీఁ - యిహాఁ బసబరజినీ భలనాహీఁ"

కౌసల్య కైకేయి సుమిత్రలు చిత్రకూటమున నున్నంత కాలము సీత వారికి సపర్య లొనర్చుటయందే కాలము గడిపి భారతీయస్త్రీలోకమున కంతకు నాదర్శప్రాయురాలయ్యెను.

సీతాదేవిని విడిపించుటకై రావణునితో బోరాడి ప్రాణముల గోల్పోవుచున్న జటాయువుం జూచి కృతజ్ఞతచే గాద్గద్యము జెందిన కంఠముతో శ్రీరాముఁడు పలుకు వాక్యము జూడుఁడు.

"మేరేజాఁ తాతక ఛూఁదిన జీజై, దేఖియ ఆపును వనసేవాసుఖ-మొహిపితుకోసుఖదీజై.
కొంత కాలము జీవించి జటాయువును పుత్రసేవయందలి సౌఖ్యము ననుభవించు మనియు దనకు పితృవాత్సల్యమునందలి సౌఖ్యము నొసగు మనియు రాముని యాచన !

అట్టి లోకోత్తరచరిత్రుఁడగు రాముఁడు, లక్ష్మణుడు శక్తి దగిలి మూర్ఛిల్లినపుడు శోకాధిక్యముచే నోడలు తెలియని పరిస్థితిలో 'భ్రాతృవియోగము గల్గునని ముందుగా దెలిసి యున్నచో పితృవాక్యమును గూడ దిరస్కరించియుండెడివాడనే' యని క్షణకాలమైనను అనుకొనుట యాతని మాయామానుషత్వమునకుఁ బ్రబలమగు నిదర్శనము.

"జౌఁ జనతోఁ్యం వన బంధుబి భోహూ - పితావచన మనతోఁ్యంనహి ఓహూ"
"హైహై హైకహా విభీషణకీగతి, రహీసోచ్ భరిఛాతీ."

వెంటనే యాత్మహత్య నొనర్చుకొని లక్ష్మణుని జేర నిశ్చయించియు విభీషణునకు దా నొసంగిన ప్రతిన జ్ఞాపకమునకు రాగా దన వెనుక నాతనిగతి యేమగునో యని చింతించును. అట్టి యెడలు దెలియని పరిస్థితిలోగూడ కర్తవ్యమును మరువక శరణాగతరక్షణమునం దాసక్తి జూపియున్నాడు. లోకాచారముల నాదరించు మాయామానుషవిగ్రహుఁ డగుటచే జనాపవాదమునకు వెరచి నిర్దోషురాలగు భార్యనుసైతము వదలి ప్రజల కాదర్శప్రాయుఁ డయ్యెను. ప్రజల విశ్వాసమును గోల్పోయిన రాజు సింహాసనమున కనర్హుఁడని యాయన యుద్దేశ్యము. ఈ క్రింది గుణములు గలవాఁడే రాజ్యపదవి కర్హుఁడని చెప్పియున్నాఁడు.

"బరఖత హరఖతలోగసబ్ కరఖతల ఖైనకోయ్
తులసీభూపతి భానుసమ ప్రజాభాగ తే హోయ్."

సూర్యుఁడు పృథివినుండి రసము నే సమయమున నెట్లు లాగునో ప్రత్యక్షముగ నెవ్వరు చూడజాలరు. కాని పృథ్వినుండి యాకర్షింపఁబడిన జలమే మరల వర్షరూపమున భూమిపైఁ బడగా ప్రజలు హర్షింతురు. ఇట్లే ఆదర్శప్రాయుఁడగు రాజు ప్రజలనుండి పన్నుల వారికి తెలియకుండగనే— అనగా విశేషకష్టము గలిగించక—రాబట్టుకొనుచు మరల నా ధనము నంతను ప్రత్యక్షముగ వారి యుపయోగార్థమే ఖర్చుబెట్టుచు వారి మన్ననల నందుచుండవలెను. అట్లు తమ కిష్టుఁడుగాని వానిని ప్రజలు నిర్భయముగ పదచ్యుతు నొనర్చవచ్చుననిగూడ సలహా నొసఁగియున్నాడు.

"జౌ అనీతిక ఛుభాఖాఁ భాయీ-తౌ మెహిఁబర జెహుభయబిసరాయీ"

ఈ విధమగు రామరాజ్యభావముఁ బ్రజలలో దన రామాయణముద్వారా 16-వ శతాబ్దినాటికే తులసిదాసుగారు వ్యాపింపజేసిరి.

ఇంతవరకు శ్రీరాముఁడు, భరతుడు, సీత, యీ మూడుపాత్రల దృష్టిలో నుంచుకొని శ్రీ గోస్వామి గారి మానవప్రకృతివర్ణనలను భావగాంభీర్యమును చూచియుంటిమి. ఇట్టి వాయన రచనలం దెన్నియో గలవు.

బాహ్యప్రకృతివర్ణనలందు సఫలుఁ డగుటకు కవి దానిని ప్రేమించువాఁడుగ నుండవలెను. ప్రకృతి యం దనురాగము లేనినాఁడాతఁడా సౌందర్యమున లీనుఁడై తన్నుదా మరువజాలఁడు. ప్రకృతియం దట్టి తాదాత్మ్యములేని కవియొనర్చు వర్ణనలు జడప్రతిమలవలె శోభావిహీనములు, నరుచికరములు నగును. వానియందు కేవలము తన పాండిత్యప్రకర్షము, శబ్దాడంబరము దప్ప మానవహృదయమును స్పృశించు శక్తి యుండదు. ఇట్లు దమ యనురాగమునకు బాహ్యప్రకృతి నాలంబనముఁగ జేసికొని యుత్తమములగు వర్ణనలు జేసిన కవిపుంగవులు హిందీసాహిత్యమున లేరనియే చెప్ప వచ్చును. కవికి సూక్ష్మమగు ప్రకృతిపరిశీలనశక్తి యున్నచో నతఁడద్దానిని తన యనురాగమున కాధారము జేసికొనఁగలఁడు. మహాకవి కాళిదాసు భావగాంభీర్యమునకు నెలవైన భవభూతి, వాల్మీకి మొదలగు సంస్కృతకవులు ప్రకృతి సౌందర్యమున లీనులై సుప్రసిద్ధములగు హిమాలయ వర్ణన, దండకారణ్యవర్ణన, హేమంతఋతువర్ణన మొదలగునవి గావించిరి.

గోస్వామిగారి పాత్రలకు ప్రకృతి సౌందర్యమునం దెట్టి యాకర్షణమును లేదు, 'సియారామమయ' మగుటవలన ప్రకృతి తులసీదాసుగారికి ప్రియమైనదే కాని, తనసౌందర్యవిభూతివలన నాయన దృష్టి నాకర్షించియుండలేదు. అట్లయ్యును దన కత్యంతప్రియపాత్రమగు చిత్రకూటమును మాత్రము తులసీదాసుగారతిరమ్యముగ వర్ణించిరి.

ఒక్కొక్క సమయమున నీకవి తన భావముల ప్రజల మనోవీథుల నాటునట్లు చేయుటకై బాహ్య ప్రకృతియందలి వ్యాపారముల నుదాహరణములుగను దృష్టాంతములుగా నుపయోగించుచుండును. ఒక యుదాహరణము:

'హృదయన విదరెవు పంకజిమి, బిఛురత ప్రీతమనీర్'

బురదమట్టియందలి తడియారునంతనే యది బీటలువారును. మిత్రుఁడగు నీటివిరహమును సహింపఁ జాలక బురదమన్ను హృదయము బ్రద్దలయ్యెనని కవి యాప్రకృతివ్యాపారము నుత్ప్రేక్షించి, రామచంద్రునరణ్యమున వదలి తిరిగి వచ్చిన సుమంత్రునినోట నావిషయము బలికించినాఁడు. బహిః ప్రాణమగు రామునితో వియోగము సంభవించినతర్వాతగూడ నింకను విదీర్ణముగాని తన మొండి హృదయము కన్న, నికృష్టమగు నా బురదమన్ను మనుగడయే ధన్యమని సుమంత్రుఁడు తనహృదయ క్షోభమును వెల్లడించెను. ఇట్లే మరొక సుందరమగు నుదాహరణ ద్వారా రాముని యందొకే విధమగు ప్రేమ నెల్లపుడు చూపవలెనని సూచించియున్నాఁడు.

"తులసీ రామసనేహకరు, త్యాగి సకల ఉపచార్
జైసే ఘటతన అంకనా, నౌకే లిఖత పహార్.''

మనము చిన్నతనమున 9వ ఎక్కము వీథిబడిలో నేర్చికొని యున్నాముగాని యందున్న చమత్కారము గమనించియుండము. తొమ్మిదిని, పదిలోపున గల యే యొక అంకెచేత గుణించినను వచ్చిన ఫలితమునందలి యంకెలకూడిక మొత్తము తొమ్మిదియే యగును.

(ఉదా:— 9×2=18. 1+8=9; 9×6=54, 5+4=9) ఈ శ్లోకముద్వారా కవిభక్తునకు దన లక్ష్యప్రాప్తి యగునంతవరకు నిరుత్సాహము జెందక ప్రయత్నించుచునే యుండవలెననియు మొదట నపజయములు సంభవించినను పట్టుదల వీడనిచో చివరకు సంపూర్ణజయము చేకూరి భగవత్సాక్షాత్కారము లభించుననియు ప్రబోధించియున్నాడు. ప్రథమమున భక్తునకు సాధనామార్గమున జయాపజయములు (9×2=18) 1:8 అను నిష్పత్తిలో నున్నవనుకొనుడు. కేవల మొకపాలు మాత్రమే జయము, నెనిమిదిపాళ్లపజయము గలిగెనని నిరాశ జెందక సాధకుఁ డింకను ప్రయత్నించుచో (3×9=27) రెండుపాళ్లు జయము లభించి యపజయ మేడుపాళ్లే మిగులును. ఇట్లే భక్తి నల్పుచుండుచో చివరకు తనమార్గమునందలి యాటంకములు (10×9=90) నశించి సంపూర్ణజయము లభించగలదు. ఈ శ్లోకమునకు మరొకవిధమగు భావముగూడ వచ్చును. ప్రహ్లాదుఁడు చెప్పిన, "తనుహృద్భాషల సఖ్యముర్, శ్రవణముర్" మొదలగు నవవిధభక్తులలోనే మార్గము (అనగా ఎన్నవ యంకెగల మార్గము) నవలంబించినను లక్ష్యప్రాప్తి యగునుగాన నందులకై, యే మార్గము మంచిదను మీమాంసలో దిగక రాముని భజించుచో ముక్తి సులభముగ లభించును. ఇంతదనుక గోస్వామిగారి భావగాంభీర్యము, కవితాసౌందర్యము జూచియుంటిమి. ఇంక నాయన భాషాపటిమ గూడ కొంచెము గమనింతము. కావ్యమునకాత్మ భావ మగుచో శరీరము, భాష యగును. ఏ కవికృతి యైనను సర్వజనామోదము బొందవలె నన్నచో నందు భావగాంభీర్యభాషాసౌష్ఠవములు రెండు నుండవలెను. చతురుఁడగు శిల్పకారునిశిల్పమువలె భాష, భావముల నుద్దీపింప జేయునదిగ నుండవలెను. ఇందేయొక్కటి తరుగైనను కావ్యసౌందర్యము చెడి దానికి పూర్ణత్వము సిద్ధింపనేరదు.

శ్రీ తులసీదాసువంటి ప్రతిభాశాలి రచనలందు భాషా, భావముల మనోహరమగు సమ్మేళనము గలదనుటలో నతిశయోక్తి యేమియు లేదు. ఆయన 'అవధి' ('అయోధ్య' లక్నో పరిసరము లందలి ప్రజాసామాన్యపుభాష) వ్రజభాష (నేటి మథురా బృందావనమునందలి వాడుకభాష) ఈ రెంటియం దసమానమగు పాండిత్యము నధికారము గలిగియుండిరి. భక్తకవులలో మరెవ్వరికిని పై రెండుభాషలందును సమానమగుపాండిత్యము లేదు. 'రామచరిత మానస'ము నవధిభాషయందును 'కవితావళీ' 'గీతావళీ' రామాయణములు సరళమగు వ్రజభాష యందును రచించియుండిరి. ఇవిగాక 'బుందేల్ ఖండీ' (ఝాన్సీ, గ్వాలియర్ పరిసరము లందలి దేశ్యము) 'భోజపురీ' (కాశీగోరక్ పూర్ చుట్టుపట్ల వాడుకలో నున్నది) మొదలగు భాషలలోగూడ నాయనకు మంచి ప్రవేశము గల్గియుండెను. ఈ కవి రచనలం దరబ్బీ పార్సీ శబ్దములుగూడ ననేకములు గలవు. ఇందుకు గారణ మాకాలపురాజభాష లవి యగుటయే. ఇట్లు పండితపామరజనమున

కంతకు నందుబాటులో నుండు దేశభాషలో నుండుటవలననే రామచరిత మానసమున కంతటి ప్రసిద్ధి గలిగినది.

వీరి రచన లన్నియు దేశభాషలో నున్న వనినంతమాత్రమున నాయనకు సంస్కృతభాషాగంధమే లేదనుకొనుట పొరబాటు. ఆ భాషయం దాయనకు గల పాండిత్యము మరే హిందీకవికిని లేదు. తన కృతులకు గావలసిన కథావస్తువు నంతయు నాయన సంస్కృతసాహిత్యభండారమునుండియే గైకొనెను. రామచరితమునందలి దోహా, చౌపాయీ, సోరఠాలకు మూలము లనేకసంస్కృత గ్రంథములలో గన్పించుచున్నవి. సంస్కృతనందనోద్యానమున నీ కవిభ్రమరము విహరించి ప్రతిపుష్పమునందలి మకరందమును తన ప్రతిభ యను పట్టునందు సేకరించి నిర్వీర్యమైన భారత లోకమున కంతకు 'రామచరిత' మను మధువు ననుగ్రహించెను. తులసీరామాయణమునకు సంస్కృతమందలి వాల్మీకి రామాయణము, అధ్యాత్మరామాయణము, ప్రసన్నరాఘవము, భాగవతము, హనుమన్నాటకము ముఖ్యమైన యాధారగ్రంథములు. ఇవిగాక భగవద్గీత, యుత్తర రామచరిత్రము, జైమిని సంహిత, భర్తృహరి శతకము, యాజ్ఞవల్క్యరామాయణము, కపిల సంహిత మొదలగాగల సుమారు నూరు గ్రంథములందలి శ్లోకముల భాషాంతరీకరణముగూడ నీ కవిరచనలందు గన్పించుచున్నది.

ఇన్నిభాషలం దసమాన మగు ప్రజ్ఞ గలిగియుండియు నీ కవి కేవలపాండిత్యప్రదర్శనమునకై యెందును కఠినశబ్దజాలము నుపయోగించి యుండలేదు. లోకసేవనే పరమావధిగ నెంచికొనినవా డగుటచే సంస్కృతమున గ్రంథరచన జేయగల సామర్థ్యము గల్గియుండియు జనసామాన్యమున కందుబాటులో నున్న యవధీభాషమూలముననే భక్తిసందేశము నింటింట వ్యాపింపజేసెను.

గోస్వామి తన గ్రంథములలో దోహా, సోరఠా, చౌపాయీ, ఛంద్, కవిత్త, సవైయా అను వృత్తములను గీతముల నుపయోగించెను. భాష అలంకారములు, సూక్తులు లోకోక్తులు గలిగి ద్రాక్షాపాకమును గల్గి సులభశైలిలో నుండును. ఈ కవిగారి యుపదేశములు, సూక్తులు వందల కొలదిగ నేటికిని సంయుక్తప్రాంతములు, బీహారు రాష్ట్రములందలి ప్రజాసామాన్యము జిహ్వాగ్రముల విరాజిల్లుచు తమ లోకప్రియత్వమును వెల్లడించుచున్నవి. సాధుజనుల స్వభావముఁ దెలుపు నీ సూక్తి యొకటి మచ్చునకుఁ జూడుడు.

> "జడచె తన గుణదోషమయ విశ్వకీన్హ కరతార్
> సంతహంస గునగహహిఁ పయపరిహరి వారివికార్"

హంసలఁ బోలు సాధువులు గుణదోషములతో నిండిన యీ చరాచరప్రపంచమున విహరించుచు సుగుణము లను క్షీరములనే గ్రహించి దోషము లను నీటిని పరిత్యజించవలెను.

ఇట్టి సూక్తులేగాక, "మాంగికై ఖైబో, మసీత్ కోసోయిబోయిబో లై బోకోఁ ఏక్‌న దై బోకో

దోవూ,'' (సత్రపు భోజనము మఠపునిద్ర యను తెనుఁగుసామెతను బోలినది) మొదలగు లోకో క్తులుగూడ ననేకములు వీరి రచనలందు గాననగును.

వీరిభాషయం దెల్లెడల ప్రసాద, మాధుర్యగుణములే యధికముగ గన్పించును. యుద్ధవర్ణనలు హిందీ కవితాసంప్రదాయము ననుసరించి ఓజోగుణప్రధానములుగ నుండును. వీరి యలంకారము కల్పనభావములఁ బోషించి రసనిష్పత్తికి దోడ్పడునట్టిదే కాని కవితాకన్యకకు భారమాత్రము గాదు. రసపుష్టికి దోహద మొసగుటయేగాక తమ సాహచర్యమువలన వర్ణింపవలసిన వస్తువుల రూపములకు గుణములకు వ్యాపారములకు తీవ్రత్వము నొసగి పాఠకుల యనుభూతికి సహకార మొసగుటకే గోస్వామిగా రలంకారములకు దమ కృతులందు తా వొసంగిరి. కావ్యాత్మ రస మగుటవలన దానికి పరిపూర్ణ వికాసము నొసగునట్టి రకరకములగు నుద్దీపన విభావానుభావసంచారి భావములతో బాటియలంకారవిధానముగూడ నొకసాధనము మాత్రమే కాని ముఖ్యమగు సాధ్యవిషయము గాదు.

ఈ క్రింది యుపమాలంకారము సీతాస్వయంవరమున కరుదెంచిన రాకుమారుల మనస్సులందలి 'లజ్జా'భావము నెట్లు పోషించినదో చూడుడు.

'జనకవచనఛుఎ, విరవాలజారూకేసే, బిరరహే సకల సకుచిసిరనాయికై.'

జనకుని తిరస్కారవచనములు హృదయములకు ములుకులై నాట రాజలోక మంతయు స్పృశించ బడిన 'అత్తపత్తి' (Touch-me-not) యాకులవలె సిగ్గుతో ముడుచుకొని పోయి రట.

మరొక యుత్ప్రేక్షద్వారా రామలక్ష్మణులరూపసౌందర్య మినుమడించినది. చూడుడు—

> "లతాభవన తే ప్రగటభయే తేహి అవసర దోవుభాయి
> నికసేజను జుగవిమలవిధు, జలదపటల బిలగాయి."

లతాగృహమునుండి వెడలి బయటకువచ్చు రామలక్ష్మణులను కవి మేఘములమాటునుండి వెలు వడు చంద్రద్వయమని యుత్ప్రేక్షించి, యా కుమారులరూపమందుగూడ నేత్రములకు శీత లత్వము నాహ్లాదము నొసగు శక్తిగలదని కవి నిరూపించినాడు.

ఈ క్రింది యుపమద్వారా తులసీ ధూర్తజనుల వినయవిధేయత లతిభయంకరపరిణామముల నొసగునని వర్ణించెను.

"నవనినీచకై అతిదుఖదాయీా, జిమిఅంకుస, ధను, ఉరగ, బిలాయీా.''

అంకుశము, ధనుస్సు, సర్పము, ఆడుపిల్లి వీనియాకృతులందలి వక్రత్వమువలె నీచులు ప్రదర్శించు వినయవిధేయతలు గూడ నపాయకరములు. నీచుల వ్యాపారములందలి క్రౌర్య మీయలంకారము ద్వారా మరింత భయంకరముగ వర్ణించబడినది.

సాధువులకు దుష్టులకు గల భేదము నిరూపించు నీ వ్యాఘాతాలంకారము వస్తువుల గుణోద్దీపనమున కెంత సాయపడునో గమనించ నగును.

"బందౌఁ సంత అసజ్జన చరణా - దుఃఖప్రద ఉభయ బీచికఛు బరనా
మిలతఏక్ దారున దుఖ దేహీ - బిఛురతఏక్ ప్రాణహరిలేహీ"

దుర్జనులు కలియునపుడును, సజ్జనులు వదలి పోవునపుడును జనులకు దుఃఖము గల్గింతురు. ఇట్లు వీరిరచనయందుపమ, యుత్ప్రేక్ష, రూపకాలంకారములు హెచ్చు. శ్లేష, పరిసంఖ్య, యమకము మొదలైన వానియందు రసపోషకత్వము కన్న కృత్రిమ మగు చమత్కారమే ప్రధాన మగుటచే నట్టివాని నెక్కువగ నుపయోగింపలేదు.

ఈ విధముగ భక్తతులసీదాసుగారు తమ రచనలందుపపాదించిన భక్తిమార్గముద్వారా జనసమాజమున కొనర్చిన మహోపకారములతో బాటు హిందీ సాహిత్యలోకమునకు జేసిన యుత్కృష్టసేవల సంక్షేపముగఁ దెలిపియుంటిని. ఆ మహాకవి యుత్కృష్టరచన యగు మానసమునకు భారతవర్షమెట్టి విలువ నొసగెనో చెప్పి యీ వ్యాసమును ముగింతును.

హిందీ సాహిత్యలోకమునకు 'మానస'ము తులసీదాసుగా రొసగిన యమూల్యమగు రత్నము. అట్టి గ్రంథరాజము పెక్కు భారతీయభాషలలోని కనువదింపబడుటయే దాని ప్రసిద్ధికి బ్రబల నిదర్శనము. ఈ గ్రంథమును సంస్కృతభాషలోనికి సాక్షాత్ శంకరుఁడే యనువదించి పార్వతికి దెలిపియుండెనని యిందలి సర్గాంతవాక్యమువలన దెలియుచున్నది. "ఇతి శ్రీమద్రామాయణే రామచరితమానసే మహాకావ్యే సకలకలుషవిధ్వంసిని ఉమామహేశ్వరసంవాదే కాండ - సర్గః" యని యుండును. ఒక యుదాహరణము జూడుడు.

"మేరే హృదయప్రీతిఅసహోయీ - కీతుమ హరిదాసనమహఁకోయీ."

శ్లో. "అవశ్యం హరిభక్తేషు త్వంకోపి ఇతి నిశ్చితమ్, త్వయిప్రీతి ర్మమహృది, ప్రతీతి రితి జాయతే." ఇందలి యరణ్య సుందరకాండములు మాత్రము పండిత బలభద్రప్రసాద్ శుక్ల, పండిత్ రామనారాయణ మున్సరిమ్‌గారలు సంపాదించి ముద్రించియుండిరి.

ఓఢ్రభాషయందీ రామచరిత మానసమునకు నాలుగు భాషాంతరీకరణములును, వంగభాషయందు మూడును, గుజరాతీయందు టీకయు గలవు. క్రీ॥ శ॥ 1873 సంవత్సరమున గోవిందసాహు అను నాయన ఓఢ్రమునందు వ్రాసిన 'గోవింద రామాయణము" మదనమోహన చౌదరి యను నాయన వంగభాషయందు చేసిన యనువాదమును ప్రసిద్ధికెక్కినవి. రాజభాష యగు నాంగ్లమున గూడ F. S. Grouse తులసీరామాయణము ననువదించెను. క్రీ॥ శ॥ 1875 సంవత్సరమున కిది యారవ ముద్రణము నొందెను. ఉదా:—

"ముఖ యామఖసో॰ చాహియే, ఖానపానకో ఏక్
పాలయి పోసయి సకల అంగ్, తులసీ సహితవివేక్."

A Chief should be like the mouth, which alone (says Tulasi) does all the eating and drinking, and yet supports and nourishes to a nicety each separate member of the body.'

ఇట్లు దేశ, విదేశభాషలలోని కనువదింపబడిన తులసీదాసుగారి గ్రంథరత్నము నేటికిని శ్రద్ధాభక్తులతో దరిద్రుల కుటీరములు మొదలు రాజప్రాసాదములవరకు ప్రతియింట ధర్మగ్రంథమువలె పూజించి పఠింపబడుచున్నది. ప్రసిద్ధిజెందిన చరిత్రకారుఁడగు విన్సెంట్‌స్మిత్, తమ సమకాలీను లందరిలోను తులసీదాసుగారు గొప్పవారనియు నాకాలమున నాయనవంటి సాహిత్యవేత్త మరొకఁడు లేడనియు వ్రాసియుండెను. హిందీభాష కపరిమిత మగు సేవ జేసిన గ్రియర్సన్ రామాయణమును గూర్చి యిట్లు వ్రాసెను.—'రామచరిత మానసము' కవి సర్వోత్కృష్ట మగు రచన. అది 9కోట్ల ప్రజలకు బైబిలువంటిది. ఉత్తరదేశపు ప్రతిహిందువునకు నీ గ్రంథమునుగూర్చి తెలిసినంత మధ్యశ్రేణికి జెందిన యాంగ్లేయునకు బైబిలునుగురించి తెలియదు.

మహాత్మాగాంధిగారి యభిప్రాయము జూడుఁడు:

"ఒకానొక గ్రంథము సర్వోత్తమ మైనదని చెప్పునపు డందొక్క దోషముగూడ లేదని యనుకొనరాదు. కాని రామచరితమానసమువలన లక్షలకొలది స్త్రీ పురుషులకు మనశ్శాంతి లభించిన దనుటలో సందేహము లేదు. ఈశ్వరునిపట్ల విముఖత్వము జూపిన వారందరు నీశ్వరభక్తులైరి. అట్లు నేటికిని యనేకులహృదయపరివర్తనము జరుగుచున్నది. 'మానసము'నందలి ప్రతి పంక్తియు భక్తిరసపూరితము. 'మానస' మనుభవజ్ఞానమునకు నిధి."

ఇట్లు లౌకిక, పారమార్థిక, కవితాక్షేత్రము లన్నింటికి నొక నూతనజీవముఁ బోసి భారతీయుల హృదయాకాశముల నధిష్ఠించి పరిపాలించు భక్త కవిసమ్రాట్ యశస్సు చిరస్థాయిగ నిలుచుగాక!

# అజ్ఞాతసుందరి

శ్రీ ఊటుకూరు సత్యనారాయణరావు

చెప్పలేనే మనసు
విప్పుకొని విహాగాల
రెక్కయంచుల గాలి
పక్కగా, పక్కగా
పరుగులిడుచున్న దే.

అలము రాతిరి కొసల
కలసగములో - నవ్వ
కనులతో మేల్కొన్న
విరజాజి కన్నె, నా
వేపు చూచినది.

చిలుపగా, సోనగా
చిరుమువ్వరుతులతో
సెలయేటి పడుచు, తా
కులుకుచూ, నడచి - ఎట
కోను సాగినది.

అళికుమారుడు పెట్టు
చిలిపిముద్దుల తేనె
చిందించి మురియుచూ
చిన్నారి పూవులూ
చేరి యాడినవి.

పొడుపుమల, బంగారు
పూత పూసిందేమొ
నులివెచ్చ కిరణాల
నలమి, భానుడు దెసల
నలము కొన్నాడు.

ఎన్నో వసంతాలు
ఎన్నో శరత్తులు
ఇట్టె నా ముందుగా
యెన్ని పోయినవో-? నే
నెరుగనే యెరుగ.

కాని - యీ జీవితమె
కరగించి - మరగించి
తొలివసంతమ్మైన
దో యేమొ - ఈ వేళ
తుందుడుకులోన.

బంగారు కిరణాలు
ప్రాకి వచ్చెను గదికి
అవి ప్రతిచ్ఛాయగా
అలము కొన్నవో - వాని
తొలిరాకలోన.

ఏనాటి నేస్తమ్మొ
ఏ జన్మవాసనో
కాని - చూపులతుదల
కలసె నేమో పూర్వ
కథల పరిచయము.

ఏ పూర్వజన్మలో
రాపాడి ప్రేమమ్మొ
నా వెంటనే నడచి
నా తలపు మలపుకొనె
నా యేమొ - ఇదియేమొ!.

మనసు మాటాడింప
తొణికిసలు పడె వాడు
పదిలపడలేని నా
మదికి కూడా ఒక్క
మాటైన పెకలదే.

దయసేయ వచ్చునని
తలుపోరగా తీయ
తెలుపుచో పరిచయము
తీయ తేనియ తెనుగు
పాయ కదిలింది.

మాట నుడికారమ్ము
పాటై - ప్రబంధమై
చల్లగా - జాలుగా
సాగి వాని వచస్సు
సందడులు చేసినది.

కవిమాత్ర మత డౌను
గాయకుం డగునేమొ-?
కాకున్న నేమాయె
కవిత గానముకాద
కల లల్లుకొను బ్రతుకు.

"ఇపుడు పాడినపాట
ఏదేది ఒకమాటు
పాడవా-? కపురంపు
పలుకు లొలుకున" యంచు
తలపు లూరించె.

మోమోటపడి, కంఠ
సీమ సుప్తంబైన
ఏరాగతనమొ సెల
యేరై పరుగులెత్తి
తేరుకొనెనేమో—

నీ మనసు మాటు, సం
ధ్యామరుత్తులు రేగి
నీ పాట కొసల, శం
పాపల్లవము లూగి
పరవశములై పోయె.

పసిపాప నవ్వుకొన
పరుగునా జను తల్లి
యుబుకు వక్షమ్ములో
నొకచోట హాయిగా
నున్నదీ పాట.

రాచకన్నియ కులుకు
రాణించు పాదాల
మంజీరముల రుతులు
మలచి నటులున్నదీ
మహితగానమ్ము.

నా ప్రణయ జలధిలో
నాయికను, తెరచాప
కుదుపులో - నా యూత
గొనినట్టు లున్నదీ
వినుత రాగమ్ము.

అనుచు నించుక జరిగి
అదియేమొ - యేమనెనో
తలిరాకు కేలి చ
క్కిలిగింత వలె మేను
జలదరించినది.

అడియాసపడి, కంఠ
మాచుకొని - తీయనా
నుడులతో వలపుసం
దడులతో నడచెనా
గడుసుతన మంతా.

నా యౌవనప్రకాంతి
పాయమైన సరస్సు
అతడు రాయంచగా
నంగీకరించునా—
హా! భ్రాంతియేమొ?

ఇది శరద్రాత్రి సం
పదనేలు శుద్ధాంత
మతడు సుధాంశుడో
టంగీకరించునా-?
హా! భ్రాంతియేమొ.

కలవోలె క్రమ్మెనో
కళ్లు తెరతును గదా
అతని బాహులమధ్య
నదుముకొను నేనె, నా
కై సిగిలితి చెలీ...
"చెప్పలేనే"

ఆపుకోలేక, తా
నై వచ్చె నొకమాట
"హృదయేశ్వరా" యన్న
పదము - అతని కనుల
బాష్పముల్ తిరిగె—

ఏ మహాయిల్లాలు
హృదయేశ్వరా యంచు
బడలికలు తీరు నా
బాహుబంధము మైల
పరచినానేమొ...?

ఏ చిన్ని వస్తాదు
రాచుకొని పైని బడి
పట్టీలు గొట్టిన
బాహుబంధము మైల
పరచినానేమొ...?

గంగ

కలతపడె కుచ్చెళ్లు
చలియించె ముంగురులు
నడక తడబాటులో
సుడివడ్డ నెన్నడుము
చూచినాడేమొ...?

ఆహరించిన మనసు
నాచుకొని - నిట్టూర్పు
వక్షమ్ము సవరించు
వరకె, తన ప్రక్కగది
కరగినా డతడు.

ఆ నాడు పగలంత
అన్నమే తినలేదు
కను మూసుకుంటేను
కలలు - ఏ పొద్దుకూ
తెలవారలేదు.

పక్కలో బడి పూలు
పకపకా నవ్వినవి
బల్లపై వేగించు
బత్తాయి లీనుగొని
పసిబట్టి చూసినవి.

చరచరా గదివంక
జని, తలుపు మలపులో
నిలచి చూతునుగదా
నిదుర సొక్కుల కనుల
నదుముకొను చేమేమొ.

జాలిగా - తలపోత
వోలె - గానము వోలె
నా - మనసు లోతులో
నా యొడలి సిగ్గులో
నను మెరపులై ప్రాకె.

*

"ఆపలేక మనసు - నాపైన
నవసెనో-? కృశియించి
సమసెనో...?

పడుచులేడీ కళ్లు
పరవశతచే ప్రేమ
భావాల యొరపులో
వలపు చిగురించగా...ఆపలేక...

పరులెరుంగని, కన్నె
సిరుల నునువంపులో
మసక వెన్నెల నీడ
మరగి పోలేదనీ...ఆపలేక...

మాటికీ తొణికిపడె
మహిత వీణాఫలము
చిన్నతన మాయెనో
చెలియోరగా చూచె...ఆపలేక...

ప్రేమ లేదో, నాథ
యని, వేయి గొంతులూ
చెరవాపుకొనుచు, ప్ర-
శ్నించె నాయెడదలో...ఆపలేక...

*

ఇంకెక్కడికి పోవు
ఇది బకధ్యానమ్మొ
చిక్కెనా డిక రాచ
సిరి ఠీవి తులకించు
శేముషీధనుడు.

చలువఖద్దరు జిలుగు
వలువజీరాడ, పై
వలెవాటుతో పోవు
వాడింత రసికుండు
కాడేమొ అనిపించె.

ఏమైన నేమాయె—
నేమమే గద యింక
పారాయణము యాచు
పలుకరించితి, మేలు
తొలకరించినది.

నా నున్న చెక్కిళ్ల
నానించి తనచెంప
ఏమి వచియింపగా
నెంచెనో — ఒకమాట
యేని రాలేదు.

అది మొదలుగా నేనె
అతడు - అతడై నేను
రేయిపగలై - పగలు
రేయి యాటను తెలియ
లేమైతి మింత.

మూన్నాళ్ళ యనుభవము
మూణ్ణెల్లు - మూడబ్ద
ములు - శకాంతమ్ములై
మూడు నిముసాలుగా
మురిపించి పోయినవి.

తలదువ్వుకొను వేళ
దాచి అద్దము - "ఏది
రా" యన్న తనచెంప
నా కడ్డముగ ద్రిప్పి
నవ్వించినాడు.

"సాలీడు ప్రాకె, మై
జారుపై" నని—కొంటె
తన మబ్బ? వెనుదిరుగ
మనసు పట్టగరాని
తన మాచుకొనుచుండె.

తెలియనట్టే నన్ను
గిలిగింతలకు దార్చి,
నే కికాకిక నవ్వ
సోకు చిరుగుంటలట్ల
చూపుసుళ్లుగ త్రిప్పె.

మగవాని వాసనే
పగగొన్న నా వలపు
నగమై, సురిగి నీదు
చరణ సీమలయందు
నొరిగి పోయినది.

వేవేలు త్రోసి, నా
రారాపు వయసు ము-
మ్మరపు నీరాజనము
నరచేత బట్టినా
నందుకొనుమోయి.

అనుతాపమున వేడు
నంత సేపూ నాదు
శిరసుపై బాష్పాభి
షేకమ్ము ధారగా
సేయుచూ నిటు పల్కె.

సతి కలదు నా ప్రియా!
సంఘాని కెదు రీత
ఈ యభాగ్యున కింతె
వ్రాయగా బడె నేమొ
భవదీయ ప్రేమ.

పయనమ్ము సాగింప
వలయునో నా ప్రియా
మరచి పొమ్మో ప్రియా!
తెరువులే దింక......

అనుచు ఇంకేమైన
అన్నాడొ - నా కింక
అసలీ జగమె శూన్య
మైపోయి నట్లయ్యె.
..................

మావిగున్నల శాఖ
మాధవీలతప్రాకు
నేరమా - ఆ ప్రేమ
భారమై పోవునా
భావుకుడవే నాథ!

గిరిరాజు పాదాల
కెరగ కిన్నెరసాని
నేరమా - ఆ ప్రేమ
భారమై పోవునా
భావుకుడవే నాథ!

ప్రకృతి కాంతనె ప్రేమ
భావడోలా కేళి
తేలించుకొను కవికి
ఈలేత ముద్దరా
లెంత ఓహో నాథ!

ఎదురుగా నిలచి, నా
హృదయమ్ము నానుకొని
కండ్లలో తనచూపు
గలిపి చెంతకు లాగి
తల నదుముకుంటూ.

ఈ ప్రేమ నామీద
ఇది భౌతికమ్మైన
మన ముందు జన్మలో
నను కలసుకొందాము
నా యౌవన తపస్వినీ.

జాళువా పసిడియం
దాల తరగలు లేచి
పడియుబుకు వయసు దం
దడిముందు జన్మకై
దాచుంచడా ప్రభువు

తన నీలమేఘాల
పెనగొన్న సిరి దాచి
నీ కైశికమ్ములో
పాలించి తనివైన
భావించడా ప్రభువు.

విశ్వమ్ములో ప్రేమ
ప్రేమలో విశ్వమ్ము
సంధించి ప్రేమిమై
సామగానము కలరు
స్వామి లేడా ప్రియా!

అనుచు, జడలో పూల
నలరించు నాచేయి-
అనుచు నా కళ్ళలో
కనుపు తనరూప మ్ము
దటులే నిలిపిపోయె

ఓనాధ! ఓనాధ!!
ఓనాధ......యని మనసు
ఏ భావలోకాల
కే స్వర్గసీమాంత
మేలుకొన బోయెనో.

దిగిరాదు - దిగిరాదు
సగమైతి, ఆ మూర్తి
పగలు రాతిరి గూడ
నగుమొగముతో నెపుడు
నా చెంతనే తిరుగు.

తనుసౌఖ్యమున భ్రాంతి
తనిసి పోయిన శాంతి
ఇది తపస్సై, వాని
పదసరోజస్పర్శ
కెదురెదురుగా పోయి.

క్రొత్త భావాలతో
క్రొత్త చైతన్యమున
పరువంపు నా స్వామి
మరుజన్మలో—నవ్వు
కురియుచూ చనుదేర.

వలపొక్క మాటగా
వయసొక్క పాటగా
ఈ శరీరోద్యాన
మేలింతు—ఆ నాడె
చాలింతు నీ తనువు.

...చెప్ప లేనే...

# సత్య సౌందర్యము

## శకుంతల — సీత

శ్రీ కాకర్ల వేంకటరామ నరసింహము

౧

జయంతి తే సుకృతినో రససిద్ధాః కవీశ్వరాః
నాస్తి యేషాం యశఃకాయే జరామరణజం భయమ్.

జగదానంద సంధాయకమును, జగల్లీలాప్రకాశకమును నగు కవిజనవాగ్విలాసమునకు నమోవాకములు. పరబ్రహ్మమునకు విశ్వమును, కవిబ్రహ్మకు వాఙ్మయమును లీలాపర్యటనస్థానములు. ప్రకృత్యతీతములైన తన ధర్మములను ప్రకృతిమూలముననే ప్రతిభాసింపజేయు పరమాత్మవోలె వాగతీతములైన భావనాపరంపరలనుగూడ, వాఙ్మయమూలముననే సూచించువాడు కవిబ్రహ్మ. సాకారోపాసనాబలమున, నిరాకారమును, నిర్లిప్తమును నగు నానందస్థానమును జూరగొన్న మహాభక్తునివోలె, మహాకవియును సగుణమగు ప్రకృతిదేవతోపాసనము నాశ్రయించియే నిర్గుణమగు రసబ్రహ్మసాయుజ్యపదవి నలంకరింపగలడు. కాని భక్తుని యానందము భక్తునియందే లీనమగును. కవి యానంద మన్ననో, కావ్యపఠనావసరమున సహృదయునకుగూడ సంక్రమించును.

కవులు ప్రకృత్యుపాసకులు. కవిజనప్రతిభాప్రకటితములు ప్రకృతిధర్మములు. మానవప్రకృతియు మానవేతర విశ్వప్రకృతియుఁ గావ్యపరికరములే. నిజమాలోచింపగా ఈ రెండిటికిని అంగాంగిభావసంకలనము గలదు. మానవప్రకృతిలేని విశ్వప్రకృతి కళాహీనము; విశ్వప్రకృతిలేని మానవప్రకృతి నిరాధారము. బ్రహ్మకల్పమునకు కావ్య మొక ప్రతిసృష్టి గావున పై ధర్మద్వయ మిందు యథోచితస్థానము నాక్రమించిననేకాని, కావ్యము సర్వథా సార్థకము కాజాలదు. ప్రకృతిచిత్రణమువలనఁ గలియుఁ గవివర్ణనమువలన బ్రకృతియు భాసించుటనే సూచింపుచు ఒక కవి:

"చందురు దభ్రముల్ దివము సైకతముల్ నదులున్ నదంబులున్
గందరముల్ కొలంకులు నగంబులు మున్నగు రమ్యవస్తువుల్
జెందుఁ గృతార్థతన్ గవులచేతన; వారును లోకవిశ్రుతిన్
గందురు వీనిచే; నిదియగాదె యొసంగుట పుచ్చుకొంటయున్."

అను పద్యమున వ్రాసియున్నాడు.

విశ్వసౌందర్య విలోకనమున ముగ్ధుడగుట మానవునకు సహజసిద్ధమైన ధర్మము. ప్రకృత్యాహ్వానమునకు మానవహృదయము ప్రతిధ్వని లీనును. ఆనందానుభవ మందఱకును సామాన్యమేయయ్యు భావితమైన భావుకహృదయము మాత్రమే భావనావిశిష్టమై తదానందమున దన్మయత్వము నందగలదు. సుందరసుకుమారకుసుమగుచ్ఛముల సౌరభము నాస్వాదించునాడును, పల్లవిత పుష్పిత వల్లీమతల్లికా పరివేష్టిత తరుప్రకాండముల దర్శించువేళను, శరచ్చంద్రచంద్రికాధవళితంబును, స్వచ్ఛతారకాగణసంశోభితంబును నగు విహాయసవీథిని విలోకించునప్పుడును, ప్రశాంతములైన ప్రత్యూషారుణప్రభాపుంజమును దిలకించుతఱిని,—మానవహృదయ మానందోత్ఫుల్లమై పరిమితములైన సర్వావస్థలను గడిచి విగళితవేద్యాంతరమును, జిన్మయానందనిదానమును నగు ననంత సత్యమున నంతర్లీన మగును. అధికారి హృదయవికాసమునుబట్టి ఈ యనుభవమునకు తరతమ భేదము లేర్పడును.

కవిత్వము దైవదత్త మగు నొక దివ్యశక్తి. అందులకే కవిత్వం దుర్లభం లోకే, శక్తి స్తత్రాపి దుర్లభా" అను నార్యోక్తి ప్రత్యక్షరసార్థకము. కవితాశక్తి అనుపమానము. అది జడత్వమునకు చైతన్యమును, చైతన్యమునకు దివ్యత్వమును బ్రసాదింపగలదు. నశ్వరము లగు నీ విశ్వప్రకృతుల కమృతత్వము నొసంగు నా మాహాత్మ్యము కవికలమునకే కలదు. సర్వకాలసర్వావస్థల యందును, కవితాలేఖినికి గల ప్రతిభ యనిర్వచనీయము. సర్వజంతుసంతానహృదయబాధానివారణ కారణం బగు నొక మహత్తరసమ్మోహనశక్తి కవితాపదార్థమునందు గలదు.

విశ్వవ్యాప్తమును, అనంతమును, అనిర్వచనీయమును, శాశ్వతమును, అగు నొక చైతన్యశక్తి గలదు. అందు, హృదయానందదాయకం బగు నొక సత్యసౌందర్యము ప్రద్యోత మగుచుండును. ఈ సత్యసౌందర్యమునందు లీనమగుటకే మానవహృదయము లువ్విళులూరుచుండును. ఆ సత్యానందమును జూరగొనుట—ఆ యనంతత్వమున నేకత్వము గాంచుట ఆ హృదయసమ్మోహనదివ్యశక్తి నాకర్షించుట—ఇదియే మానవ హృదయావేదనము — ఇదియే మానవ హృదయైకాశయము. ఇదియే మానవుడు కాంక్షించు మాంగళ్యమునకు పరమావధి. 'సత్యం శివం సుందరమ్'' అను మహావాక్యము ఈ యర్థమునే ప్రస్ఫుటము గావించును. ఈ సత్యసౌందర్యపిపాస మానవునకు సృష్ట్యాదినుండియు గలదు. యుగయుగాంతముల నుండి వచ్చుచున్న, జన్మజన్మాంతరముల నుండి వచ్చుచున్న, ఈ సౌందర్యకాంక్ష మానవహృదయ వీథిని నిత్యసంచారము గావింపుచునే యుండును. తన్మాహాత్మ్యముననే, మానవహృదయాకాశమున, జన్మజన్మాంతరసంస్కారభానూదయమై, తామసాహంకారతమఃపటలమును దూరదూరముగా పటాపంచలు గావించును. కవికులగురు డగు కాళిదాసు డీ పరమార్థమునే,

> ''రమ్యాణి వీక్ష్య మధురాంశ్చ నిశమ్య శబ్దాన్, పర్యుత్సుకీ భవతి యత్సుఖితోఽపి జంతుః
> తచ్చేతసా స్మరతి నూన మబోధపూర్వమ్, భావస్థిరాణి జననాంతరసౌహృదాని."

అను శ్లోకమున వ్యక్తము చేసియున్నాడు. రామకథారూపమున నీ సత్యసౌందర్యపరమావధినే

వాల్మీకిభగవానుడు సువ్యక్తము చేసియున్నాడు. ఆ సత్యసౌందర్యమూర్తుల పవిత్రప్రణయ లహరిలో, మునిగి తేలి, యోగిజనము కూడ పావను లగుచున్నారు. ఆ దివ్యదంపతుల అతిలోక పరిణయమాహాత్మ్యమునే భవభూతి యుత్తరరామచరితము గానము సేయుచున్నది.

ప్రకృతిగతసర్వవస్తువులును గావ్యపరికరములే యను నాంగ్లమత మొకటి యున్నను, ప్రాచ్యమత మద్దాని నంగీకరింపదు. ప్రకృతియందు ద్వైధీభావము బహుళము. సత్యసౌందర్యము లొక్కచోట సంభవించుట యరుదు. సత్యము లన్నియు సుందరములు కాజాలవు—విజ్ఞానచక్షువుతో ఈ విశ్వ రూపము నొక్క చూపుననే అవగాహనము చేసికొని, అందలి పరమసత్యమునకు సౌందర్యా పాదనము గావించి, తన వాగమృతరససేచనమున, నా సత్యసౌందర్యకల్పవల్లీమతల్లికను పెంచి, తన్మధురఫలదానముచే మర్త్యుల కమరత్వము నొసంగువాడే మహాకవి. భగవాను డగు ప్రాచేతసుడు రామకథాగానమునఁ జొక్కి తన్మయుడైనాడు. రామకథామరనదీస్నాన మాచ రించి భువనత్రయమును పునీతమైనది. ప్రాచేతసుని రామగానము పలువురు మహాకవులహృదయ తంత్రుల బ్రతిధ్వను లీనినది. అందులకే మురారి:

> "యది క్షుణ్ణం పూర్వై రితి జహతి రామస్య చరితం
> గుణై రేతావద్భి ర్జగతి పున రన్యో జయతి కః
> స్వ మాత్మానం తత్తద్గుణగరిమగంభీరమధుర
> స్ఫురద్వాగ్బ్రహ్మాణః కథ ముపకరిష్యంతి కవయః.

అని తన అనర్ఘరాఘవమున తానుగూడ రామచరితమునే గ్రహించుటకు గారణములను దెల్పి యున్నాడు.

కవితాకల్పకమునకు సౌందర్యము బీజ మని నుడివియున్నాము. ఆ సౌందర్యము విశ్వచైతన్యమున నొక యంగమై సర్వతోవ్యాప్తమై యుండును. బాహిరప్రకృతియు నాంతరంగికప్రవృత్తియు తత్సౌందర్యసమన్వితములే. బాహిరప్రకృతివర్ణనమాత్రమునగూడ కవి యగుటకు సందియము లేదు. కాని మహాకవికి జగదాచార్యకత్వముగూడ విడువరాని గుణము. ఆంతరప్రకృతిని మన కన్నులకు గట్టినట్లు చూపిననేకాని యాతడు మహాకవి యనిపించుకొనజాలడు.

మహాకవు లందరును విశ్వలీలారహస్యమును గరతలామలకముగా జేసికొన్నవారే. ద్వంద్వభావ విశిష్ట మగు నీ మానవజీవితమున నొక సత్యానందసమన్విత మగు నేకత్వము నూహించినవారే. జగద్బాహిరసౌందర్యమునకు జగదంతరసౌందర్యమునకు, ఎడతెగని మహత్తరసంబంధము గలదు. జంతుసంతానము లన్నియు బాహిరసౌందర్యమును జూచి యానందించగలవు. మానవు డొక్కడే ఆంతరసౌందర్యమును గమనించగల నేర్పరి. అమృతకిరణుని జూచి యానందోన్మత్తుడై సముద్రు డుప్పొంగును. ఇది చర్మచక్షువునకు గోచరింపని జడత్వమునందలి చైతన్యమున కుదాహరణము. జలదమాలికలఁ జూచి మయూరము నృత్య మొనర్చును. వసంతాగమము కాగానే కోయిల పంచమస్వరమున పాడును. చందనతరుసౌరభమునకు పాములు పడగ లెత్తును. బాల

భానుని యరుణకిరణజాలస్పర్శకు నెత్తమ్మిమొగ్గలు నిద్రమేల్కాంచును. ఇది యంతయు ప్రకృతి యందలి ప్రణయదేవతాప్రభావము. తత్ప్రభావమున జడములే చైతన్యయుక్తములు కాగా, నిక మానవునిమాట వేఱ చెప్పవలయునా? "There is a tongue in every leaf" అని యొక మహాకవి నుడివిన వాక్యములయందీ యనంతసత్యమే యిమిడియున్నది. బాహిరప్రకృతియు నాంతరప్రకృతియుఁగూడ నశ్వరములే కాని ఈ నశ్వరప్రకృతిలో నంతర్లీనముగా నొక యనంతత్వము సుస్థిరమై, సుందరమై యున్నది. తన విశ్వమోహనకవితాప్రభావమున జీవలోకము నా యనంతత్వమున నేకము గావించునాడే కవి జగదాచార్యకత్వమున కర్హుఁడగును.

౨

కాళిదాసభవభూతులిర్వురును ఈయనంతమగు సత్యసౌందర్యమును దమ నాటకములందు ప్రతిఫలింప జేసిరి. జడప్రకృతికి మానవత్వము, మానవత్వమునకు దివ్యత్వమును గల్పించినాడు మహాకవి కాళిదాసు. ప్రణయదివ్యస్వరూపమునే పరిస్ఫుటము గావించినాడు భవభూతి. కాళిదాసుని మహాప్రతిభకు అభిజ్ఞానశాకుంతలము నికషప్రాయము. "శక్తిర్నవనవోన్మేషశాలినీ ప్రతిభా" అను సూత్రమిచ్చట స్మరణీయము. "క్షణేక్షణే యన్నవతా ముపైతి, తదేవరూపం రమణీయతాయాః" అని మాఘుడు పల్కిన పల్కులకు, కాళిదాసునిశాకుంతల మొక చక్కని యుదాహరణము. అది ఆశ్రమోపాంతము. ప్రశాంతమును నిర్మలమును నగు నా తపోవనప్రకృతి, మానవహృదయ కుహరములందు స్థిరనివాస మేర్పఱచుకొనియున్న మలీమసభావసముదయమును క్షాళిత మొనర్చి, వానిని సత్త్వోన్ముఖుని గావించును. అంతటి ఆ ప్రశాంతత్వమును భేదించుకొని, మధురవిపంచీకలస్వనము భంగి హృదయంగమముగా, "ఇత ఇతః సఖ్యౌ (చెలులారా! ఇటు ఇటు) అను నొకకంఠస్వరము వీనులవిందు చేయును. చూచుచుండగనే ముగ్వురు మునికన్నియలు, బాలపాదపములకు జలసేచన మొనర్చుచు కానుపింతురు. ఎంత మధురదృశ్యము! శకుంతలను గాంచినంతనే "అహో మధుర మాసాం" దర్శనమ్మని, దుష్యంతునితో మనముగూడ ముక్తకంఠమున బలుకమా! మానవ కల్పితమగు సౌందర్యము, నిసర్గప్రకృతిసౌందర్యమునకు న్యూనమే. "దూరీకృతాఃఖలు గుణై రుద్యానలతా వనలతాభిః" అను పరమసత్యమును రాజప్పుడే ప్రత్యక్షీకరించుకొనినాడు. ఇట్టి మనోహరదృశ్యమును వీడి . రాజు పోవుట యసంగతముకదా! మానవమాత్రులకే కాదు, దివ్యులకును అది దుస్సాధము. ఇంతవరకు కవి బాహిరజగత్సౌందర్యమును చిత్రించినాడు. ఈ మూలభిత్తిక నాధారముగాఁ గొని ఇక నాంతరసౌందర్యమును సువ్యక్తము సేయును.

అనసూయా—"సఖి శకుంతలే! త్వత్తోఽపి తాతకాశ్యపస్య ఆశ్రమవృక్షః ప్రియతర ఇతి తర్కయామి, యన్నవమాలికాకుసుమపేశలా త్వ మప్యేతేషా మాలవాలసేచనే నియుక్తా" (సఖి! శకుంతలా! తండ్రిగారైన కాశ్యపులకు నీ కంటె నీ యాశ్రమవృక్షములే ప్రియతరము లని నే నెంచుచున్నాను.

నవమాలికాకుసుమసుకుమారి వయిన నిన్నుగూడ వీని పాదులను దడుప నియోగించినాడుకదా!)
శకుంతల— న కేవలం తాతనియోగః, అస్తి మమాపి సోదరస్నేహ ఏతేషు.

(ఇది కేవలము తండ్రిగారి నియోగమే కాదు. నాకును వీనియెడల సోదరస్నేహము కలదు.)

ఆహా! ఏమి మధురకోమలహృదయము! వృక్షలతాదులయందుగూడ సోదరస్నేహము జూపుట జగదీశ్వరుని కరుణామయత్వమున కొక నూతనవ్యాఖ్యానము నొనర్చుటకదా! "ప్రశాంత రమణీయమైన ఆ తపోవనభూమియందు అనసూయాప్రియంవద లామె సఖులు, వృక్షలతాదులు సోదరులు; ఆమె ఆ తపోవనమున కధిష్ఠాత్రియైన దేవి."

ఇంతలో వాతేరితపల్లవాంగుళులతో బాలసహకారవృక్షము శకుంతల నాహ్వానించినది. ఇక దానిని సంభావింపక తిరునా? శకుంతల వెంటనే తత్తరుసమీపమున కేగి ఒక కొమ్మనాని నిలచినది.

అంతట అనసూయ:
"సఖి! శకుంతలే! ఇయం స్వయంవరవధూ ర్బాలసహకారస్య త్వయా కృతనామధేయా వనజ్యోత్స్నేతి నవమాలికా ఖలు? ఏనాం విస్మృతాసి?
(వనజ్యోత్స్న స్వయంవరమున గున్నమావి నాశ్రయించెను. నీవు దానిని మఱచితివా?) అని ప్రశ్నించెను, అంతట శకుంతల:

"తథా యది ఆత్మానమపి విస్మరిష్యామి.

(అట్లే అయిన నన్ను నేను మఱచినట్లే) అని ప్రత్యుత్తర మొసంగును. ఏమి సరళభావము! ఏమి మాధుర్యము! ఇది ప్రణయమాహాత్మ్యమునకు చరమావధి. కణ్వుడే వాత్సల్యనిధిని వీడలేక వీడినాడు. కన్నుల నీరు క్రమ్మినది. కంఠము గాద్గద్యము వహించినది. వనదేవతలను తపోవనతరువులను సంబోధించినాడు.

"భోభో స్సన్నిహితవనదేవతా స్తపోవనతరవః!
పాతుం న ప్రథమం వ్యవస్యతి జలం యుష్మా స్వపీతేషు యా
నాదత్తే ప్రియమండనాపి భవతాం స్నేహేన యా పల్లవమ్
ఆద్యే వః కుసుమప్రసూతిసమయే యస్యా భవ త్యుత్సవః
సేయం యాతి శకుంతలా పతిగృహం సర్వై రనుజ్ఞాయతామ్.

అని తన చిన్నారి ముద్దుకూతునకు అనుజ్ఞను దయసేయ కణ్వుడు వనదేవతలను తరుజాలమును ప్రార్థించినాడు. ఇచ్చట కాళిదాసుని యమృతలేఖిని దివ్యప్రణయమాధురీమహిమను సర్వతోముఖముగ నుద్ఘోషించినది. ''తత్ర శ్లోకచతుష్టయమ్'' అను పూర్వపండితవాక్యము సర్వథా సార్థకము. శకుంతల తన చెలులయొద్ద ననుజ్ఞ గొనునప్పు డామె మనము వ్యాకులత నందును. ఆమెకు నడవ కాళ్ళాడలేదు. తపోవనమే దుఃఖాకుల మైనది. శకుంతల యనిన నచ్చటి స్థావరజంగమ ప్రకృతి కంత మమకారము.

ఆమె యచ్చటి హరిణశాబకముల పెంచి పెద్దచేసినది. ముద్దుమురిపెములు దీర్చినది. వాని యానందమే తన యుత్సవముగా జూచుకొన్నది. అట్టి మాతృవాత్సల్యమును, అట్టి సోదరస్నేహమును అవి వీడియుండ జాలవు. లేడి వేడికన్నీరు కార్చినది. మయూరము నర్తనము మానినది. లతావితానము కన్నీటిబొట్టులకరణి పండుటాకులను రాల్చినవి. ఎంత సంతాపము! ఎంతటి ఆవేదనము!

"ఉద్గళితదర్భకబలా మృగాః, పరిత్యక్తనర్తనా మయూరాః
అపసృతపాండుపత్రా ముంచం త్యశ్రూణి వనలతాః."

శకుంతల మాధవీలత నక్కున జేర్చి యాదరించును. తల్లాలనపాలనాదులను కణ్వుని యధీనము గావించును. మావిగున్న నాశ్రయించిన మాధవీలతను చెలుల కప్పగింపగా వారు "మ మ్మెవరి కప్పగించెద"వని కన్నుల నీరు నింతురు. కణ్వముని వారి నందఱ ననునయించి శకుంతలాప్రయాణమును సత్వరము గావింప నుత్సహించును. కాని అంతలో శకుంతల పెంచినలేడి గర్భభారాలస యయ్యు మెలమెల్లగా శకుంతల యున్నచోటికి వచ్చును. శకుంతల ఆ లేడి ననునయించి అది సుఖప్రసవ కాగానే తనకు వార్త నంపుమని తండ్రిని వేడుకొనును. ఎంతటి హృదయంగమమగు దృశ్యము! ఇట్టిదికదా ప్రణయదేవతాసత్యస్వరూపము. స్థావరజంగమప్రకృతి యంతయు ప్రణయస్వరూపమే. "ఆత్మన త్సర్వభూతాని యః పశ్యతి స పశ్యతి" అను గీతావాక్య మీ పరమార్థము నేకదా యుగ్గడించుచున్నది.

ఇంకొక లేడి శకుంతల చీర పట్టి యామెను నిల్పును.

"యస్య త్వయా వ్రణవిరోపణ మింగుదీనాం
తైలం న్యషిచ్యత ముఖే కుశసూచివిద్ధే
శ్యామాకముష్టిపరివర్ధితకో జహాతి
సోయం న పుత్రకృతకః పదవీం మృగ స్తే"

ఆ లేడి ముఖముపై నొక దర్భాంకురము గ్రుచ్చుకొనగా, శకుంతల గారనూనె మెలమెల్లగ రాచి, దాని యా బాధను మాంపినది. చేతఁ జామ లుంచుకొని యాహరిణపోతమును మేపినది. ఆమెను వెంబడింపక ఊరకుండగలదా యది? శకుంతల దాని ననునయించినది.

"వత్స! కిం సహవాస పరిత్యాగినీం మా మనుసరసి? అచిరప్రసూతయా జనన్యా వినా వివర్ధిత ఏవ; ఇదానీమపి మయా విరహితం త్వాం తాత శ్చింతయిష్యతి. నివర్తస్వ తావత్.

(బిడ్డా! సహవాసులను వదలుకొనుచున్న న న్నేల వెంబడింతువు? పురిటిలోనే కన్నతల్లి నీకు గరవైనను గారాబమున నిన్ను నేను పెంచితినిగదా! అట్టి నేనును ఇప్పుడు నిన్ను విడుచుచున్నాను. అయినను నీకు కొదువ లేదు. నాయనగారే నిన్ను విచారింతురు. ఇక వెనుకకు మఱలుము.)

ఇట్టి మధురమోహనదృశ్య మెవ్వరి నానందోన్మత్తుల గావింపదు? శకుంతల అందర ననునయించినది. అందఱును శోకగద్గదస్వరములతో ననుజ్ఞ యిడినారు. ఇక కులపతి కణ్వు డున్నాడు. శకుంతల

కాతడు తల్లియుఁ దండ్రియునే కాక, గురుడును దైవమును గూడ. అట్టి వాత్సల్యపూరితహృద యుని, శకుంతల వీడగలదా! కణ్వునివక్షముపై శిర ముంచి ఆమె యిట్లు వాపోయినది:

''కథ మిదానీం తాతస్యాంకాత్ పరిభ్రష్టా, మలయతటోన్మీలితా చందనలతేవ, దేశాంతరే జీవితం ధారయిష్యామి?

(మలయతటోన్మీలితమైన చందనలతవలె, మీ యుత్సంగమునుండి పరిభ్రష్టనై దేశాంతరమున నెట్లు జీవితమును ధరియింపగలను?) అంత కణ్వునిపాదముల కామె మ్రొక్కి ''తండ్రీ! ఇదే వందనము'' అనునపుడు శోకావేగము నాపుకొనలేక కణ్వు డిట్లనును:

''శమ మేష్యతి మమ శోకః, కథం ను వత్సే! త్వయా రచితపూర్వమ్
ఉటజద్వారవిరూఢం, నీవారబలిం విలోకయతః''

(నీ వుటజద్వారమున నిడిన నీవారబలి యిప్పుడు మొలక లెత్తినది. అది కనుగొనుచుండ, నామది నుదయించినశోకము, తల్లీ! యె ట్లుపశమిల్లును?) ఇట్టి వాత్సల్యకరుణాపూరితము లగు చిత్రముల జిత్రించుట మహాకవియగు కాళిదాసునకే చెల్లినది.

ఇట్టి యమృతకోమలహృదయయైన శకుంతలామూర్తిని సర్వాంగసుందరముగా, మధురాతిమధురముగా జిత్రించినాడు మహాకవి. వల్కలధారిణియయ్యు నామె సుందరసుకుమారరూపిణియే. ఆమె ప్రథమసందర్శనముననే, దుష్యంతుడు ముగ్ధుఁడై, ''అహో మధుర మాసాం దర్శనమ్''అని ముక్త కంఠమునఁ బలికినాడు.

మధురమనోహరమూర్తుల కెద్దియైన నలంకారమే యగును. దుష్యంతు డీ పరమసత్యమున కుదాహరణములు ప్రకృతియందును గలవని యెత్తి చూపినాడు:

''సరసిజ మనువిద్ధం శైవలేనాపి రమ్యం, మలినమపి హిమాంశో ర్లక్ష్మ లక్ష్మీం తనోతి
ఇయ మధికమనోజ్ఞా వల్కలేనాపి తన్వీ, కిమివ హి మధురాణాం మండనం నాకృతీనామ్.

ముద్దుమొగము వైచుకొని ఈ రాజున కిదియేమి వెఱ్ఱి యని విచారించు విదూషకునితో కూడ రాజు,

''అనాఘ్రాతం పుష్పం కిసలయ మలూనం కరరుహై
రనావిద్ధం రత్నం మధు నవ మనాస్వాదితరసమ్
అఖండం పుణ్యానాం ఫలమివచ త ద్రూప మనఘమ్
న జానే భోక్తారం కమిహ సముపస్థాస్యతి విధిః.''

(ఉ. వాసన జూడనట్టి ప్రసవంబు, నఖంబుల దున్మిపనట్టి నూ
త్నాసమపల్లవంబు, బరు లానని క్రొవ్విరి తేనె, సూచి వి
న్యాసములేని రత్నము, మహోత్తతపుణ్యఫలంబు బోలు నీ
భాసురగాత్రి సోయగ మెవండు భుజింప విరించి వ్రాసెనో?)

అని శకుంతలాసౌకుమార్యసౌందర్యశోభల నభివర్ణించినాడు. కాని ఈ సౌందర్యసౌకుమార్యములు

శాశ్వతములా! భౌతికప్రకృతులకు శాశ్వతత్వ మన్నది లేనేలేదు. శారీరకమగు సౌందర్యము క్షణికము. తత్సౌందర్యోపాసనయందే మగ్నుడగువాడు మోహావిభ్రాంతుడై సంసారసాగరమున మునిగిపోవును. సత్యమగు సౌందర్య మాత్మావిర్భూతము. అదియే శాశ్వతము.

ప్రథమాంకమున దుష్యంతుడు కాముకుడు. అతని దృష్టి నాయికాశారీరక సౌందర్యము పైననే ప్రసరించినది. భౌతికరూపతృష్ణ ఆతని హృదయ ముల్లోలకల్లోలము గావించినది. శకుంతలయు నవనవోన్మేషతారుణ్యప్రభాశాలిని, అనాఘ్రాత మగు పుష్పము. మత్తభ్రమర మామె ముఖమును జూచి సరోజమని భ్రమించినది. దుష్యంతు డా లావణ్యరాశిని తన హృదయభిత్తికపై చిత్రించుకొన్నాడు. ప్రథమసందర్శనముననే శకుంతలాహృదయమున వలపుపూవులు పూచినవి. తత్సౌరభాఘ్రాణమునకై రాజుహృదయ ముర్విళ్ళు లూరినది. ఇందు శకుంతల లావణ్యమయి, రాజు రసికుడు; ఆమె చంద్రిక, రాజు చకోరము; ఆమె దరవికసితసరోజము, రాజు మధుమత్తభ్రమరము; ఆమె ముగ్ధయగు వనబాల, రాజు నారీజన హృదయపశ్యతోహారుడగు వలపుకాడు. శకుంతల 'మహితలావణ్య మన్మథ మన్మథు' డగు దుష్యంతుని వీడలేక వీడలేక వీడినది. కాని చూపు లా వంకకే, భావములు నా వంకకే పర్వులువెట్టుచున్నవి. ఈ మధురరస భావనిర్మగ్నమై యా ముగ్ధహృదయము కరగిపోయినది. దర్భాంకురము చరణమున గ్రుచ్చుకొనిన దను మిషపై దుష్యంతుని వలపుజూపుల జూచినది. తరుశాఖకు వల్కలము తవులుకొనిన దను నెపమున నవకుంఠనము దీసివైచినది. ఆమె లేతహృదయమున రా జామె సౌందర్యమును జూచి మెచ్చుకొనవలయు నను నూహాంకురము పొడచూపినది. అది విషఫల మొసంగునో, మధురఫల మొసంగునో తెలిసికొనకుండగనే ఆమె పరవశయై, దుష్యంతునకు తన హృదయసర్వస్వము నర్పించినది. కాని ఈ యనురాగము స్వచ్ఛప్రణయ సంభవము కాదు. ఇది కామదోషదూషితము. కామకళంకితము లగు నీ దంపతుల భావములు, తపోదీక్షాక్షాళితములు కావలయును. అప్పుడే శకుంతలాసత్యసౌందర్యము ప్రస్ఫుట మగును. శకుంతలాస్వయంవరము కామిజనకార్యమనియే కవిహృదయము. అదియే శార్ఙ్గరవునినోట నిట్లు పలికించినాడు:— "ఇత్థ మాత్మకృతం దోష మాత్మాన మప్రతిహతం దహతి." కాని పతితిరస్కరణానంతరము శకుంతలాహృదయమున కామపంకక్షాళన మైనది. సప్తమాంకమున నామె సత్యసౌందర్యము నిట్లు వర్ణించినాడు కవి!

"వసనే పరిధూసరే వసానా, నియమక్షామముఖీ ధృతైకవేణిః
అతినిష్కరుణస్య శుద్ధశీలా, మమ దీర్ఘం విరహవ్రతం బిభర్తి"

కాళిదాసుని యభిజ్ఞానశాకుంతలమున మానవప్రకృతి ఆద్యంతముగా జూపబడినది. హృదయక్షీరజలధిని మథించి, మథించి, ప్రణయామృతరసమును ప్రపంచమున కనుగ్రహించినాడు.

౩

భవభూతి కీ చిక్కు లేమియు లేవు. అతని నాయికానాయకులు దివ్యులు. ఆతని గమనము వియద్గమనము. ఆతని ప్రేమ దివ్యము. కామకళంకితముగాక, నిత్యనిర్మలమైయున్న ఆ ప్రేమా

మృతరససేచనముచే, అతడు మానవహృదయక్షేత్రములందు నందనారామవాటిని నాటినాడు. ఆతని హృదయవిహంగము, విహాయసవీథీవిహారమును మఱిగి భూమిపైగల మిఱ్ఱుపల్లముల మాటయే మఱచిపోయినది. రాముడు సీత నిట్లు వర్ణించును:

"ఇయం గేహే లక్ష్మీ రియ మమృతవర్తి ర్నయనయో
రసా వస్యాః స్పర్శో వపుషి బహుళ శ్చందనరసః
అయం కంఠే బాహుః శిశిరమసృణో మౌక్తికసరః
కిమస్యా న ప్రేయో యది పున రసహ్యో న విరహః."

రామునకు సీత గృహలక్ష్మి. ఆతని నేత్రముల కామె అమృతవర్తి; ఆమె స్పృశించినంతనే ఆతనికి మెయిని చందనసారము పూసిన ట్లుండును. కంఠము నాశ్లేషించియున్న యామె బాహు వాతనికి శిశిరమసృణమైన మౌక్తికసరము. సీతాసంబంధములైన సర్వవస్తువులును నాతనికి ప్రియతమములే. ఆమెవలని విరహముమాత్రమే సహింపరానిది. ఇట రాముడు సీతాశారీరకసౌందర్యమును వర్ణింపలేదు. అట్టి గృహలక్ష్మివిరహవ్యథ భరింప శక్యమా యని ఆతని యాలోచన. ఇంకొకచో:

"మ్లానస్య జీవకుసుమస్య వికాసనాని, సంతర్పణాని సకలేంద్రియమోహనాని
ఏతాని తే సువచనాని సరోరుహాక్షి, కర్ణామృతాని మనసశ్చ రసాయనాని."

ఆమె సంభాషణములు వాడిపోయిన జీవకుసుమమునకు వికాసమును కల్పించును. అవి సకలేంద్రియమోహనములు; సంతృప్తిదములు; అవి శ్రవణమునకును మదికిని రసాయనములు.

ఇంకొకచో ఆమె స్పర్శ నిట్లు వర్ణించును:

"ప్రశ్చ్యోతనం ను హరిచందనపల్లవానాం, నిష్పీడితేందుకరకందళజోను సేకః
ఆతప్తజీవితతరోః పరితర్పణో మే, సంజీవనౌషధిరసో ను హృది ప్రసిక్తః"

(చందనాశ్చ్యోతమో, పీడితేందుకిరణకందళాసేకమో; యిది కాక యుడికియున్న ప్రాణమ్ము వెండియు నుల్లసిల్ల సంతరించిన జీవనౌషధిరసంబొ.)

ఆమె సరసగా నుండ రామునకు,

"వినిశ్చేతుం శక్యో న సుఖ మితి వా దుఃఖ మితి వా
ప్రబోధో నిద్రా వా కిము విషవిసర్పః కిము మదః
తవ స్పర్శే స్పర్శే మమ హి పరిమూఢేంద్రియగణో
వికార శ్చైతన్యం భ్రమయతి సమున్మీలయతి చ"

"ప్రసాద ఇవ మూర్త స్తే స్పర్శః స్నేహార్ద్రశీతలః
అద్యా ప్యేవార్ద్రయతి మాం త్వం పునః క్వాసి నందిని.

సీతాస్పర్శమువలన రామునకు కల్గినది సుఖమో, దుఃఖమో, నిదురయో, తెల్వియో, మోహమో, మదవిషములో నిశ్చయింప రానిది. అది మది వికారము వాడమ భ్రమ కలిగించును. ఉన్మీ

లనమును ఒనర్చును. ఆమె స్పర్శము రామునకు మూర్తిమంత మగు ప్రసాదము. అది స్నేహార్ద్ర శీతలము. కావుననే చలువలు కూర్చి తాప మార్చును.

సీత గుణము లెట్టివి? ఆమె సౌందర్య మెట్టిది? అను సంశయమున ప్రశ్నించుటకే మన కధికారము లేదని భవభూతి యభిప్రాయము. అందులకే,

"ఉత్పత్తిపరిపూతాయాః, కి మస్యాః పావనాంతరైః
తీర్థోదకం చ వహ్నిశ్చ, నాన్యతః శుద్ధి మర్హతి.
(జననపరిపూతయగు భూ,తనయ కితర పావనములఁ దలపగనేలా?
ఘనతీర్థోదక మగ్నియు, ననువుగ వేఱొకట శుద్ధి కర్హము లగునే?)

అని లోకమును ప్రశ్నింపు చున్నాడు కవి. ఇట్టి మహాసాధ్వి శరీరవర్ణనము సేయుట జగన్మాతను కాముకదృష్టితో జూచుట. అందులకే భవభూతికి సీతాసౌందర్య వర్ణనము సేయ నవసరము లేక పోయినది. ఆమె జగన్మాత. ఆమె గుణ సంపదయే లోకుల కాదర్శము. కవి కామెయెడ మాతృ భావమే కలదు. తనయుడు తల్లి రూపసౌందర్యమును గొనియాడ జనునా?

౪

కాళిదాసున కట్టి వర్ణన మావశ్యక మైనది. దుష్యంతుడు కాముకుడు. ఆతని హృదయము నాకర్షించినది శకుంతలాజగన్మోహనరూపమే. అతని మానసిక వ్యవస్థను వ్యక్తము చేయవలయు నన్నచో శకుంతలారూపమును వర్ణింపక తీరదు. నాటక ప్రణాళిక కది విడువరాని ధర్మము. అందులకే కాళిదాసు.

"ఇద ముపహిత సూక్ష్మగ్రంథినా స్కంధదేశే
స్తనయుగపరిణాహాచ్ఛాదినా వల్కలేన
వపు రభినవ మస్యాః పుష్యతి స్వాం న శోభాం
కుసుమ మివ పినద్ధం పాండుపత్రోదరేణ"

(మూపునను చిన్న ముడిగల్గి మొలకచన్ను,గవ విరివి గప్పుచున్న వల్కలము కతన
తనచెలువు తెల్ప దీమె క్రొందళుకుమేను, పాండుపత్రాంతరిత మైన ప్రసవ మట్లు.)

"అథవా కామ మనురూప మస్యా వపుషో వల్కలం న పున రలంకారశ్రియం న పుష్యతి."

(ఈమె శరీరమునకు వల్కల మెంతమాత్రము తగినది కాకపోయినా అలంకార శోభను మాత్రము పోషింపక పోలేదు.)

ఎంత వర్ణించినను ఆమె రూపమే. తద్రూపసందర్శనమున రాజెంత మోహపరవశుడయ్యెనో కవి చూపగల్గెను. రాజు యనురాగరసపానమున మత్తుఁడైనాడు. కావుననే చెలికాని యెదుటగూడ నామె సౌందర్యమును వర్ణించినాడు. వర్ణనము మాత్రము మితిమీరలేదు. అంగప్రత్యంగ వర్ణనకు పోలేదు. మహాకవి తన సౌందర్యపిపాస యను సైంధవమును బుద్ధియను కళ్లెముతో

లాగిపట్టియే యున్నాడు. పంచమాంకమునగూడ రాజుదృష్టి శకుంతలారూపము వంక పర్వులు వెట్టును. కాని వెంటనే దాని నాతడు మరలించి సన్మార్గమునకు ద్రిప్పినాడు.

కాంతారూపవర్ణనమునందు కాళిదాసభవభూతులు భిన్నమార్గగాములు. కాళిదాసునకు బాహిర రూపవర్ణనమునం దమితమగు ప్రీతి. భవభూతి కంత స్తత్త్వమును వర్ణించుట యం దమితమగు ప్రీతి. కాళిదాసునకు ప్రీతి గొల్పు నంగన,

"తన్వీ శ్యామా శిఖరిదశనా పక్వబింబాధరోష్ఠీ
మధ్యేక్షామా చకితహరిణీప్రేక్షణా నిమ్ననాభిః
శ్రోణీభారా దలసగమనా" అయియుండవలయును......భవభూతి కిట్టి రూపతృష్ణ లేదు.

అతని స్త్రీ గృహలక్ష్మి. అతని కామెపల్కులు కర్ణామృతములు; ఆమె స్పర్శ చందనశీతలము. ఆమె యాలింగనము, 'వినిశ్చేతుం శక్యో న సుఖమితి వా దుఃఖమితి వా' అన్నట్లుండవలెను. కాళిదాసునకు స్త్రీ భోగ్యవస్తువు. భవభూతి కామె పూజనీయ. ఇట్టి లక్షణభేదము పాత్రానుగుణ్యముగానే వచ్చినను కవి యంతఃకరణప్రవృత్తులుకూడ నట్టివే కాకున్నచో అంతటి ఆదర్శపాత్రలను సృష్టించి పతనము లేకుండ నడపుట యసాధ్యము. కాళిదాసుని మార్గము ప్రమాదభరితము. అట్టియెడకూడ నాతడు భ్రాంతుడు కాలేదు. నాటకమున కెంత యావశ్యకమో అంతే వర్ణించినాడు. హృదయావేశము జవనాశ్వమువంటిది. దానిని బుద్ధి యను సారథి సక్రమమార్గమున నడుపనిచో, నది రథమునే చూర్ణము నొనర్చుచు వక్రపథమున బడిపోవును. బుద్ధియోగముచే హృదయావేగము నడచువారిలో కాళిదా సగ్రగణ్యుడు.

విషమమార్గమున బోనిచ్చియు నిజకల్పనారథమున కెట్టి ప్రమాదమును రానీకుండ కాపాడినాడు మహాకవి. భవభూతి యిట్టి యెదుదుడుకు త్రోవలు త్రొక్కనేలేదు. దివ్యమగు ప్రణయసామ్రాజ్యమును గల్పించి, అందు సీతారాములఁ బ్రతిష్ఠించి తద్దివ్యదంపతుల ప్రణయమునే ముక్తకంఠమున గానముచేసినాడు. భవభూతి యుత్తర రామచరితమందు ప్రథమాంకముననే ప్రేమ పరిమితి నందినది. స్వచ్ఛమగు నా ప్రణయసుధ నాస్వాదించి మానవలోకమేకాక అమరలోకము కూడ ధన్యమైనది. హృదయమథనమువలనగాని సత్యమగు, నకళంకమగు నాత్మసౌందర్యము గోచరింప దని కాళిదాసు వ్యక్తము చేసినాడు. పరిణతమైన ఆ సత్యసౌందర్యానుభూతి అవస్థాంతరము లందుగాని, వియోగమునందుగాని, పతనము నందదని భవభూతి ఋజువుచేసినాడు. ప్రణయామరతరుఫలమును జెందవలయునన్న, నెట్టి కష్టపరంపరలకు గురికావలయునో కాళిదాసు చూపినాడు. పొందిన యా ఫలముయొక్క, అమృతమాధుర్యమాహాత్మ్యములను, భవభూతి సువ్యక్తము చేసినాడు. ఇరువురును మహాకవులు. ఇరువురును ప్రణయసౌందర్యము నెఱిగిన మహనీయులు. సత్యప్రణయసౌందర్యమాధుర్యమును దమ తమ కావ్యామృతరసప్రభావముచే లోకమున కెఱుగజేసిన యమ్మహాకవులకు భక్త్యంజలి.

# రాసలీల

## (సంకీర్ణ నాట్యము)

తల్లావఝ్ఝల కృత్తివాస తీర్థులు
(నవ్య సాహిత్య పరిషత్)

Δ

వర్గము :

చంద్రావళి; బృంద; సుగంధ; విరజ;

అత్తమామలు; గోపకులు; శ్రీకృష్ణుడు.

Δ

### * ప్రథమరంగము *

(గొల్లపల్లె. బృంద తలుపు ఓరవాకిలి వేసి అరుగుమీదికి వచ్చి మళ్ళీ తలుపు కేసి చూస్తుంది, భర్త నిద్ర లేచాడేమో నని అనుమానంతో. మెల్లిగా మెట్లు దిగుతూ ఉండగా అందెలసవ్వడితో ప్రవేశిస్తుంది సుగంధ. సమయం శరద్రాత్రి. సన్నగా దూరాన మురళీరవం.)

సుగంధ

బృందా! తలుపు దగ్గిరసా వేసి చల్లగా వస్తున్నావుటే! (పకపక నవ్వు)

బృంద

గట్టిగా మాట్లాడకే సుగంధా! ముందు నీ అందెలనోళ్ళు మూయించు. ఇశ్శ్! మావారికి మెళకువ వచ్చిందంటే నన్నింట్లో పెట్టి తాళం వేస్తారే. (కొంతదూరం నడచి నిలుస్తుంది).

సుగంధ

మీ ఆయనను పడుకోబెట్టి ఎంచక్కా చిచ్చి కొట్టి మత్తులో పడేసి వస్తున్నావుటే, బృందా!

బృంద

అవు నమ్మా, నీకులాగ అనుకూలు డయిన భర్త ఇంట్లో వుంటే ఇబ్బంది లేదు గాని, మా ఆయన చెడ్డ పెంకిమనిషి!

సుగంధ

మరే పాపం! మావారు నాకోసం గదిలో ఎదురు చూస్తూ కళ్ళు మూస్తూ తెరుస్తూ పరున్నారు. వంటింట్లో పాలు తోడెట్టి వచ్చేస్తా నని చెప్పి మెల్లిగా జారానే!

బృంద

గడుసు పిల్లవ్!

సుగంధ

అలాగే అంటావు. చేతిలో పాలకుండను,

మురళిపాట వినడంతోనే జారవిడిచానే !
అదేమిటో పరధ్యానం! ఏం చెప్పనే !

బృంద

మన గోపికల కందరికీ పరధ్యానం ఎప్పుడూ!

సుగంధ

అవునే! పరధ్యానంవల్ల భర్తల్ని వదిలేస్తున్నామే !

బృంద

పాలకుండ బద్దలయితే మీఆయన లేచి రాలేదు. ఏటే రెండు తగిలించడానికి? మరిచిపోయాను. నీ కేమమ్మా ? మీఆయన నువ్వు చెప్పినట్టు వింటాడుగా!

సుగంధ

ఏం చిత్రమే మరీని! ఈకాలంలో భార్యలు చెప్పినట్టు భర్తలు వినకపోతే భర్తలు చెప్పినట్టు భార్యలు వింటారే? ఎలా జారానో పిల్లిలా జారాను!

బృంద

మాఆయన పక్కలో తలగడా ఉంచి దుప్పటీ కప్పి వచ్చాను.

సుగంధ

అమ్మ బాబోయ్ గడుసుదానివే! నువ్వు మాత్రం ఏం తక్కువ తిన్నావమ్మా!

బృంద

గొల్లభామలు గడుసువాళ్ళు. అందుకే భర్తల్ని నిద్దరోనిచ్చి పారిపోతున్నారు.

సుగంధ

మనకు కృష్ణయ్య నేర్పాడే గడుసుతనం. లోకంలో గొల్లలు అమాయకు లని ప్రతీతి. అయితేనేం ? మాయల్లో పడేసి పోతున్నాం.

బృంద

మొగాళ్ళు మాయతోనే ఆటలాడి చిక్కిపోతారే.

సుగంధ

కృష్ణయ్య మన మాయలకు లొంగేరకంకాదే.

బృంద

మన మనస్సులకు కళ్ళాలు బిగించి తన దగ్గిరికి లాక్కుంటాడే!

సుగంధ

అడుగులకు మడుగు లొత్తుతూ మొగాళ్ళ మాట వినలేం. చంటివాళ్ళమీద వాత్సల్యం కూడా పోయింది, మురళి వినేసరికి.

బృంద

అదుగో, చంద్రావళి పరుగెత్తు కొస్తున్నది. కలహంస కూజితాలవలె గలగల మనుకుంటూ, అందెల రవళితో అందాలతో పరుగెత్తు కొస్తున్నది.

చంద్రావళి

(పకపక నవ్వుచూ) బృందా......వొసే సుగంధా...(నవ్వు పట్టలేక వొంగి చప్పట్లు) రావే రావే పోదాం పోదాం. వాయిస్తున్నాడే మురళి! (నడుస్తూ)

గీతం

కెంజిగురు చాయ నీ
కెంబెదవికిని దాసి!
కంజమై భవము నీ
కన్గవ కంతేవాసి!

బృంద

మురళీ మాధురి ఏమిటో హృదయాన్ని... ఇట్టే... కలచి వేస్తున్నదే.

చంద్రావళి

మోడయిన హృదయాలనుకూడా మోగిస్తాడే ప్రభువు.

సుగంధ

యమునదగ్గర ఇసుకతిన్నెలమీద పాలవెన్నెల్లో మనకోసం ఎదురు చూస్తూఉంటాడే.

చంద్రావళి

అదుగో బాబోయ్, మా అత్తగారు పరుగెత్తుకొస్తున్నారు. అదుగో మామగారు... (దూరాన్నుంచి కేకలు.మగగొంతు-"చంద్రా! చంద్రా! వెళ్ళకే" ఆడగొంతు. "కోడలా! కోడలా!") ("సుగంధా! ఏమే!" మగగొంతు)

సుగంధ

బాబోయ్ మావారు!

అత్త

(తెరలోంచి) వినిపించుకోవే చంద్రా! పువ్వుల్లో ఉంచి నిన్ను పూజించుకుంటాం కోడలా!

మామ

కోడలా, పనిపాటలు చెయ్యవద్దులే.

అత్త

(ప్రాధేయపడుతూ) వోసే నీకడుపున పుడతానే.

చంద్రావళి

బాబోయ్! ఇంకోజన్మానికయినా వద్దు.

మామ

పరుగెత్తకే.

చంద్రావళి

నడిచే పోతాం.

తక్కిన గోపికలు

మాతో దూరం రాలేరు. వెళ్ళండి.

భర్త

నేను నీకు పతిని కాదుటే?

సుగంధ

కావచ్చు గాని సర్వలోకాధిపతి ఒకడే!

భర్త

బరి మీరిపోయిన దాంతో నే నేం కాపరం చేస్తాను? (నిష్క్రమణ)

గోపకులు

(ప్రవేశించి) గొల్లపల్లె అల్లకల్లోలం చేస్తున్నారు. మా నిద్ర పాడు చేశారు!

గోపికలు

ఉండండి, ఇంకా నిద్రమత్తులో మీకు మెళుకువ లేదు.

గోపకులు

మానం లేదు మీకు.

గోపికలు

అభిమానవంతులు ఇళ్ళల్లో ఉండండి.

గోపకులు

మిమ్మల్ని చిలకల్లాగ చూచుకొంటాం.

గోపికలు

మాకు మీరూ, ఇళ్ళూ పంజరాలు. (విసుక్కుంటూ గోపకులూ, పకపకా నవ్వుతూ గోపికలూ నిష్క్రమిస్తారు.)

Δ

## * ద్వితీయరంగము *

(బృందావని. గోపికాంగనలు తత్తరపాటుతో తమాల వృక్షాల వైపు, కదంబవనవాటి వెతుకు తున్నారు.)

చంద్రావళి

మురళిపాటే వినపడదేమే? బృందా!

బృంద
ఇల్లూ వాకిలీ పట్టుకు కూర్చుంటే పాట విన పడదు.

విరజ
ఎక్కడ దాగాడో కృష్ణయ్య! ఆకాశవర్ణంతో మెరిసిపోయి యమునలో దాగాడా?

సుగంధ
చీకటి కానుగుల గుంపులో కలిశాడేమో!

విరజ
ఎన్నాళ్ళో ఈ దాగుడుమూతలు?

చంద్రావళి
దొంగలాగ విశ్వంలో ఎక్క డెక్కడో దాగుతాడు.

గీతము
ఓ నాథ! నీ చేత నున్నయది నాబ్రతుకు
నా యెడద కుములురా నానాథ నీ కొరకు.

సుగంధ
నాయెడద కుములురా నానాథ! నీకొరకు-

బృంద
నీమోవి చిగురుతేనియలు గ్రోలెడియాశ-

విరజ
నీ మృదుకపోలసన్నిధిని మోమిడు నాశ-

సుగంధ
నీ మొలకనవ్వు వెన్నెల చలువగొను నాశ-

చంద్రావళి
నీ మనోహరమూర్తితో నైక్య మగునాశ-
(అందరూ పాడుతారు)

చంద్రావళి
బంధనాలు బాసిపోవ
బాధ లెల్ల సమసిపోవ

బృంద గీతి
మురళి వాయింపవా!
ఎడద మోయింపవా!

బృంద
తిమిర జీవన మిహిక
తేజమై దీపింప
మురళి వాయింపవా!
ఎడద మోయింపవా!

విరజ
దిశ లెల్ల పులకింప
వల పెల్ల దీపింప
మురళి వాయింపవా!
ఎడద మోయింపవా!

సుగంధ
అలరుతావుల దేల
వలపుతీపిని సోల
మురళి వాయింపవా!
ఎడద మోయింపవా!

బృంద గీతి
విధురజీవనములో
మధురిమమ్మె పొంగ
మురళి వాయింపవా!
ఎడద మోయింపవా!

చంద్రావళి
(నాట్యము)
ఎద లాగివేశాడే! ఎంత టక్కరివాడే!
మొలకనవ్వులవాడే! ముద్దుమాటలవాడే!

బృంద
తలిరాకుజిగి దెగడ, తగుమోవి గలవాడే!
మొలకనవ్వులవాడె, ముద్దుమాటలవాడె!
(నాట్యం)

సుగంధ

చిరుతప్రాయమువాడె! చెలువొందు విదియచం-
దురు గేరు నొసలచే, మెరయువాడె!

(నాట్యం)

విరజ

చెఱకువిల్తుని గన్నదొరవోలె నున్నాడె!
మెరుగు చామనచాయ మే నమరువాడే!

(నాట్యం)

= చంద్రావళి, తక్కినవా రంతా =

(నాట్యం)

పాదలు కెందామరల, పాదవు పదములవాడే!
కొదమసింగపునడుము, కొమ రమరువాడే!
మొలకనవ్వులవాడె, ముద్దుమాటలవాడె!
ఎద లాగివేశాడె! ఎంతటక్కరివాడె!

= అందరూ =

(బృందగీతి)

ఎద లదరిపోయెనే
ఎగసి పడిపోయెనే?
వన మేమి పల్కదే!
యమున మాటాడదే!
కరుణ లేదాయెనే!
కాంతునకు మనపైని!

చంద్రావళి

గీతము

తప్పినాను తోవ స్వామి
తత్తరపడిపోతి నోయి!
అందరాని నీకోసమె!
అశ్రులు రాల్చితిని నాథ!

సుగంధ

మిణుగురు దీపమునే గొని
మిణుకు మిణుకు తారల గని
తిరిగితి నీకై నిశిలో
తూలిపోతిరా నాథా!

బృంద

ఎద పగిలిపోయెరా
వ్యథలబ్రతుకేలరా?
నిను పొందగా లేక
నిలువలేదీ దాసి!

విరజ

హోరుహోరున యమున
ఈరేయి ఘోషిల్లు
ఎద పొంగులై పారు
సొదలతో రొదలతో!

చంద్రావళి

మురళీరవ మాధురిలో
ముగ్ధనైతినే చెలీ!

సుగంధ

విడలేని మమతతో
ఎడబాటు సైపనే!

బృంద

పరకీయ భావాన
పరవశ మ్మాయెనే!

విరజ

వినపువెన్నెల సెగల
వినలేనె గీతమ్ము!

= అందరూ కలిసి =

నిలుపలే మీ వలపు!
నిలుపలే మీ తలపు!

కనలి మాయెడదలే !
కడలిగా పొంగెనే!

చంద్రావళి

వగవగల ఘనసార
వాసనల సైపనే !

బృంద

కాటుకల కన్నీరు
గట్లు తెగి పారెనే!

సుగంధ

అడుగిడగలేనే!
తడఒడితినే సఖీ!

విరజ

అయ్యయో వెన్నెలల
దారి గన రాదేమొ!

= చంద్రావళి, తదితరులు =

నిలుపలే మీ వలపు!
నిలుపలే మీ తలపు!
కనలి మా యెడదలే!
కడలిగా పొంగెనే!

బృంద

మగవారి నెపుడయిన
నమ్మగా వచ్చునే?

సుగంధ

నవనీతమో కాక
పాషాణహృదయమో!

అందరూ

నిలుపలే మీ వలపు!
నిలుపలే మీ తలపు!
కనలి మాయెడదలే!
కడలిగా పొంగెనే!

బృందగీతి

జారా! తరుణీమానసచోరా!
ఈ రాగానలమాలాకీలల
ఏలాగున భరియింతుమురా!

చంద్రావళి

తారుణ్యానలహేతిసంహతుల
దగ్ధం బైతిని శలభమునై!

బృంద

ఎద నీరాజన మెత్తనీయవా?
సొదలే వింజామరలు వేయగా!

సుగంధ

తాపభారమున తాళలేమురా!
ఆపజాల మీ ఆర్తజీవనము!

విరజ

జడులై కురిసెడి, వడికన్నీరే
శోకములో దిగమింగెనురా!

చంద్రావళి

మధురాలింగన నిర్వృతిలో మా
జీవనములనే తేల్చుమురా!

= అంతా కలిసి =

జారా! తరుణీమానసచోరా!
ఈ రాగానల మాలా కీలల
ఏలాగున భరియింతుమురా!

△

## * తృతీయ రంగము *

(కృష్ణభావము పొందుతున్న గోపికాంగనలు)

స్వరమేళ

ఎంత చక్కనివాడో! ఎంత చల్లనివాడో!
మధురాధినాథుడు మధురమే! మధురమే!

చంద్రావళి

తావులే పులకించె, దారులే పులకించె
రేయెల్ల విరిసెనే, హాసదీధితు లెల్ల!

బృం ద

భర మాయెనే వలపు వర మౌను నీరేయి
దావాగ్నియై చెలగె తాపమ్ము కీలలై.

సు గ ం ధ

పొగ లౌను చీకటుల సెగలౌను నీరేయి
వేదనానలముతో వెన్నెలలు కుమిలినవి.

వి ర జ

వాకలై కన్నీరు వాహినై పొంగెనే!
సొదలతో ఎదలెల్ల సోలెనే తూలెనే!

స్వ ర మే ళ

ఏదారి బోయెనే?
ఏదెసల బోయెనే?
శ్రీకృష్ణ మేఘమ్ము
చిద్విలాసమ్ముగా
శీర్ణ హృదయానంద
శీకరిణి కాదే!
ఆశలే తావులై
ఆశాశలను సోకి
పిలుపులై విరిసినవి
మెఱపులై మెరసినవి
దాహమ్ము తీరదే
తాపమ్ము తీరదే
తప్త జీవన చాత
కాంబుదము రాదే?
నీలాల వక్షమ్ము
నేడు కన్పడ దేమి?
ఆశలే మోడులై
ఆకాంక్షతో నిల్చి
నింగి చూచునె నాథు
నీలాల చూపులకు
నీలిమబ్బులు గాంచి
నీడు తన వని యెంచి
ఆశలే పురివిప్ప
ఆడెనే యెదలెల్ల!

(అభినయం)

= బృ ం ద =

నేనె కృష్ణుండనే
నేనె కృష్ణుండనే
నేనె గోపాంగనా
మానాపహారినే!
నవనీత హారినే!

(అభినయం)

రండు గోపికలార
రండు గోపికలార
రమణీయతరభుజా
రమ్యోపగూహమున
తాపానల శిఖా
దీపార్చులను నార్పి,
అధర శీధువు నిచ్చి
ఆనంద రసపూర
సారాంబుధిని దేల్తు.
(గోపికలను కౌగలించు కొంటుంది)

= సు గ ం ధ =

ఏమే బృందా? ఏమే బృందా!
నన్ను చూడవే నన్ను చూడవే!
బాలఘాతినే, పూతననే!

= చ ం ద్రా వ ళి =

నీవు పూతన వైన
నేను కృష్ణుండనే
పా లీయవే భామ!
పా లీయవే నాకు!

= వి ర జ =

నవనీతచోరుడౌ నవమోహనాంగుడనే—

బృం ద

నేనె నీ మాతనే శ్రీయశోదమ్మనే—

సు గం ధ

(పైట నెత్తి పరవశంతో నాట్యం)

రండు గోపికలార! రండు గోపికలార!

గొడుగు గాను పట్టినట్టి గోవర్ధనగిరిధారిని!

వి ర జ

బృందా! సుగంధా! చంద్రా! ఎక్కడ చూచినా కృష్ణస్వామిహాసం పాలసముద్రపు నురుగులాగ, పాలపొంగులా వెల్లి విరుస్తు న్నదే! ఓహో!

బృం ద

విరజా! ఈ శరదాకాశము నిర్మలమై ముక్త పురుషుని అంతరంగంవలె ఉన్నదేమే!

చ ం ద్రా వ ళి

చీకటికానుగులకాంతులు ఆ వల్లభుని గంభీర నేత్రదీప్తివలె ఉన్నదే! యమునానీరంలో వెన్నెల మిలమిలా మెరుస్తూ కరుణార్ద్రము లైన దివ్యనేత్రాలు జ్ఞాపకం చేస్తున్నదే!

గీ త ము

దిశ లెల్ల మధురమై
నిశ లెల్ల మధురమై
నీ యఖిల రూపాన
నిండుగా వెలిగినవి.

(నాట్యరభసంలో జడలు కొప్పులు వీడి పోతాయి. పారవశ్యం. పకపక నవ్వుతూ శ్రీకృష్ణుడు ప్రవేశిస్తాడు.)

చ ం ద్రా వ ళి

వచ్చాడే మనోనాథుడు! ఇడుగో! ఇడుగో!

బృం ద

ఏడీ! ఏడీ!

(అతన్ని పట్టుకోబోతారు. గోపికలు ఎంద రుంటే, అందరు కృష్ణులు గోపికల కౌగిళ్ళలో ఉంటారు.)

కృ ష్ణు డు

నన్నిలా బంధించేస్తారా వ్రజాంగనలు?

చ ం ద్రా వ ళి

మా బాహుబంధాలకు చిక్కుతావోయి?

వి ర జ

ఎన్నాళ్ళోయ్ ఈదాగుడుమూతలు?

బృం ద

మమ్మల్ని దొంగల్ని చేసి ఎంతకాలం దాక్కుంటావోయ్?

కృ ష్ణు డు

మీరు కారు దొంగలు. నేనే—

చ ం ద్రా వ ళి

మా హృదయనవనీతం దొంగిలిస్తావోయ్.

కృ ష్ణు డు

అరెరే! ఎంత తప్పు చేశారు? (టక్కరినవ్వు)

సు గం ధ

తప్పు లన్నీ నీకే అంటకడతాం కృష్ణా!

కృ ష్ణు డు

నే నేం తప్పులు చేస్తున్నాను! ఇళ్ళూ వాకిలీ వదిలి అర్ధరాత్రి నేనే కాబోలు పారిపోయి వచ్చింది?

గో పి క లు

ఏమి దెప్పిపొడుపులు కృష్ణా! ఏమిటి నీ ఇంద్రజాలం. మనస్సుకు దొరుకుతావు. దొరి కిన ట్టుంటావు! చేతులకు అందవు. మంచులో

రంగుల్లో రేఖల్లో దాక్కుంటావు. పాటతో పాటు పాటపాడే నువ్వు కావాలి?

= స్వ ర మే ళ =

హాస్యంబు నీయవా?
ఆస్యమధు వీయవా?
ఏపొత్తు వలదోయి!
ఏ సొత్తు వలదోయి!
మగవారు మగువలకు
మగపంతముల దీర్చి
ముద్దు చెల్లింపరా
మురిపెంబు మీరగా
పడలేమురా బాధ
పొగుల జాలము నాథ
బిగి కౌగిలింపరా
పిరిదులగా కంచుకము!
నిశియేమొ సగ మాయె
నిలువజాలము నాథ!
వలపు తీపిని రగిలి
మనలేము మాబ్రతుకు!

కృ ష్ణ డు

బంధువుల్ని భర్తల్ని వదలి రాకూడదు. గోపికల్లారా!

గో పి క లు

సర్వస్వం నీవే, నీకోసం మా జీవితం గడుపు తున్నాం. నువ్వు లేనిదే బతకలేం కృష్ణా!

కృ ష్ణ డు

నేను లేకుండా ఉండను. అన్నిచోట్లా ఉన్నాను. అవును గాని మీ వ్యవహారం శ్రుతి మించి రాగాన పడిందే?

గో పి క లు

నీ వ్యవహారం శ్రుతిస్మృతులనే మించింది.

కృ ష్ణ డు

మీ ఇళ్ళల్లో మీ రుండి నన్ను ప్రేమించండి.

గో పి క లు

ఆ పంజరాలు మాకు అక్కర్లేదు.

కృ ష్ణ డు

నే నింతమంది బాహుపంజరాల్లో చిక్కిపోతే ఎవరితో చెప్పుకోను?

గో పి క లు

అబ్బ! ఏమి టక్కరిమాటలు! బంధాలలో వున్నట్టున్నా సర్వబంధాలకు అతీతుడవోయ్, కృష్ణా!

కృ ష్ణ డు

పతివ్రతలు గృహిణీత్వం వదలకూడ దని శ్రుతిస్మృతులు చెప్తున్నవి.

గో పి క లు

శ్రుతిస్మృతులు నిగమములు అన్నీ నీవే, పుస్త కాలతో మాకు పని లేదు. నదు లన్నీ సముద్రం చేరవు, కృష్ణా !

కృ ష్ణ డు

చేరుతాయి కాబోలు!

గో పి క లు

అబ్బ, ఏం నంగనాచికబుర్లు!

ఈ తాపం పోగొట్టవు కృష్ణా! భరించలేం ఆలంబనం లేని ప్రేమ నిలవదు ప్రేమాగ్నిలో మిడతలం!

రెక్కలన్నీ కాలిపోయాయి ! అయ్యో! నీవే దిక్కు.

=స్వ ర మే ళ=

గతి నీవెరా కృష్ణ,
గతి నీవెరా!
అలము బాధలతో
వలపు బరువున కుంగ గతి...

సొగయు నెదలతోడ
పొగిలి ఇలు వీడిన గతి...

దాహ మోర్వ్వమురా ఈ
తను
దాహ మోర్వ్వమురా గతి...

అతిదీనల గావరా, ఓకృష్ణ!
నీతినియమము లేలరా! గతి...

కృ ష్ణు డు

నీతినియమాలు లేనివాణ్ణి. లోకానికి తెలుసు. వట్టి జారశిఖామణిని. (నవ్వు)

బృ ం ద

జారుడవు కావు, తాపత్రయహరుడ వోయ్, నాధా!

చ ం ద్రా వ ళి

నీ జారభావం జగదాదరణీయం కృష్ణా!

సు గ ం ధ

నీ జారత్వం భవతాపహరం నాధా!

వి ర జ

సర్వనైతిక సాంఘిక కల్పిత బంధాలు గొడ్డలి పెట్టుతో నరికి, నీదగ్గిరికి వచ్చాం! మేము జారిణులం కృష్ణా? జారబుద్ధితో వచ్చాం కృష్ణా!

కృ ష్ణు డు

మీరు పతివ్రతలు.

గో పి క లు

అందుకే పతి వైన నిన్ను సేవించడం?

కృ ష్ణు డు

జారు చేరుట తగదు
చారుముఖులార!
పరుల భామలు మీరు
పరకీయలే కారు.

ఇలు వీడి రాతగదు
ఇల్లాండ్రుగా మీరు
పతుల సేవిచుటే
పరమధర్మము సుండు!

పాన్పుపై లేకున్న
పతి మిమ్ము కోపించు
గతి మీకు పతి గాని
ఇతడు పతియే కాడు!

గో పి క లు

పరకీయలము మేము
పరమప్రియుడ వీవు
నీవె మా ధర్మంబు
నీవె మా భాగ్యంబు
సకలంబు నీయందె
సంత్యజింతుము మేము,
గతి నీవె మా కింక
పతి నీవె మా కింక
పరకీయలము మేము!
పరమప్రియుడ వీవు!

△

## * చతుర్థరంగము *

(బృందావన సీమ. వెన్నెల రాత్రి. కలకలము అత్తమామలూ గోపకులూ వచ్చి దీనంగా కృష్ణుణి వేడుకొంటారు)

గోపకులు

= స్వరమేళ =

మా సతుల మా కీయవా?
మానధనహారీ!

భర్తలు

పాపలమ్మా యంచు
పోగిలి పోయారోయి  మా...

పాపలకు పా లీక
పరుగు లిడి వచ్చారు  మా...

పతుల గతి యే మోయి
సతుల మా దిక్కోయి!  మా...

భామినుల హృదయాలు
పట్టి లాగా వోయి!  మా...

కృష్ణుడు

సతులె మీ దిక్కయిన
సతులకే సతు లిందు
న న్నేల యడిగెదరు
మిన్నకుండక మీరు?

అత్తమామలు

దూడలకు పా అయిన
విడువ నయినా లేదు.

భర్తలు

మగల మాటలు వినక
వగలతో నీ కడకు
ఎదలు నీపై నిలిపి
ఇలు వీడి వచ్చారు.  మా...

మతులు పోగొట్టుకుని
మమతతో నీ పైని
శయ్య మెల్లన వీడి
చల్లగా వచ్చారు.  మా...

కుచయుగ్మముల్ కదల
కొప్పిమ్ముడుల్ సడలగా
కజ్జలపు కన్నీట
లజ్జయే కరగగా  మా...

ఎదలు నీపై నిల్పి
ఇలు వీడి వచ్చారు.

కృష్ణుడు

మతులు పోగొట్టుకొని
గతి నేనె యని వేడు
ఘోషాంగనలె మిన్న
పతులార మీ కన్న

గోపికలు

= స్వరమేళం =

నిన్నే నమ్మినాము
నీరజాక్ష కృష్ణా!
మనసు నీవే కాగా
మగలమాటల వినము  నిన్నే...

మగ డేల! మా మేల?
మా యాశ లీవేను  నిన్నే...

తమ్మిపూవుల మరిగి
తరలిపోవునె తేంట్లు
గంధమ్ము లేనట్టి
కర్ణికారము దెసకు  నిన్నే...

నీ విశాలాంచిత
నిర్మలవక్షంబు
వక్షోజ శిఖరాల
మనుపుమో మానాథ! నిన్నే...

(గోపకులు నిష్క్రమణ. శ్రీకృష్ణుడు గోపికాంగనల కపోలాలపై మకరికాపత్రాలు చిత్రిస్తాడు. తలల్లో పువ్వులు తురుముతాడు. అనేకమంది కృష్ణులుగా మారి ఆలింగన చుంబనాలు చేస్తాడు.)

బృంద

ఇడుగోనే కృష్ణుడు!

చంద్రావళి

ఇడుగో మనోవల్లభుడు!

(స్తనతటం క్షీరసిక్తం కావడంవల్ల సిగ్గుపడుతూంది).

సుగంధ

ఎక్కడ చూసినా ఎంతమంది కృష్ణులు!

చంద్రావళి

ఒకరూపు అన్నిచోట్లా భాసించినట్టు కృష్ణమయం! కృష్ణా! హృదయాంబుధిశీతకిరణా!

విరజ

నీ సుధాలింగనంలో అంతరంగం మహార్ణవమై తుంగభంగాలతో పొంగు లెత్తుతున్నదోయి నాథా!

శ్రీకృష్ణుడు

వ్రజాంగన లంతా రండి. నవకర్ణికా కుసుమాకారంలో వలయంగా నిలబడండి. కర్ణికార మధ్యంలో కింజల్కంవలె కేంద్రంలో ఉంటాను.

(రాసమండలి ఏర్పాటవుతుంది. పువ్వుల రేకుల్లా గోపిక లుంటారు. గోపికకూ గోపికకూ మధ్య కృష్ణుడు భాసిస్తాడు. కేసర స్థానంలో కేంద్రకంలో దివ్యమూర్తి వ్యత్యస్త పాదారవిందుడై ఉపనిషన్మురళీసుధలు చిలికిస్తాడు. నాట్యం ఆరంభ మవుతుంది. రాగమాలికాగీతంతో)

[రాసగీతం వల్లభదాసకవి గీతానికి తెలుగు]

= స్వరమేళ =

మధురాధి నాథుండు,
మధురమే మధురమే!

అధరమ్ము మధురమ్ము
వదనమ్ము మధురమ్ము
నయనమ్ము మధురమ్ము
హాసమ్ము మధురమ్ము
వేణు వే మధురమ్ము
రేణు వే మధురమ్ము

మధురాధినాథుండు,
మధురమే మధురమే!

నృత్యమ్ము మధురమ్ము
సఖ్యమ్ము మధురమ్ము
దాస్యమ్ము మధురమ్ము
రాసమ్ము మధురమ్ము
తాపమ్ము మధురమ్ము
దాహమ్ము మధురమ్ము

మధురాధి నాథుండు
మధురమే మధురమే!

జారుడే మధురమ్ము
పరకీయ మధురమ్ము
పొదరిల్లు మధురమ్ము
పుష్పాదుల్ మధురమ్ము
సైకతము మధురమ్ము
సలిలమ్ము మధురమ్ము

మంగళగీతి

= స్వరమేళ =

జయ జయ సర్వేశ!
జయ జయ ప్రాణేశ!
జయ జయ గోపీ
తాప సంహారా!
దాహ సంహారా! మంగళం...

తప్త జీవన చాత
కాంబుద రావోయి!
గోపీమానసరాజ
హంసవై రావోయి! మంగళం...

హరివిచిత్రమ
యూరి పింఛాళితో
హృదయ వీధుల నాట్య
మాడ రావోయి! మంగళం...

# నాట్యశాస్త్రము - రూపకములు

పండిత: శ్రీ చిదిరెమఠము వీరభద్రశర్మ

శ్లో. జగన్నాథౌ శివౌ వందే జగదానందనందినౌ
లాస్యతాండవనాట్యస్య యౌ వాద్యౌ సూత్రధారిణౌ.

నాట్యశాస్త్రపరిచయమునకై విశ్వవిజ్ఞాననిధియైన సంస్కృతవాఙ్మయమే శరణ్యము. కావుననే ప్రాచ్యప్రతీచ్యవిద్వాంసులు పలువురు[1] సంస్కృతవాఙ్మయసాహాయ్యమున నాట్యశాస్త్రమును గూర్చి అనేకవ్యాసముల ప్రచురించియున్నారు. వానిలో ననేకులు పరిశ్రమించి సమంజసముగా వ్రాసియున్నను, కొందరు భారతీయనాట్యరమణిని గ్రీక్ యూనానీ మిశ్రదేశసంజాతనుగా నిర్ణయింప దొడంగిరి. ఇట్టివారు భారతీయ నాగరకతను, శాస్త్రాదులను నవీనము లనియో, పరదేశానుకరణము లనియో నిరూపింపబూనుటయే కాక భారతీయార్యులుసైతము పరదేశమునుండి వచ్చినవా రనియును, వారి కిది మాతృభూమి కాదనియును ప్రచారము గావించుచున్నారు. ఇట్లు జెప్పుటలోని రహస్యమును విచక్షణు లెఱింగియే యున్నారు. పాశ్చాత్యవిద్యాధికులైన కొందరు స్వదేశ్యసోదరులును గౌరాంగుల మార్గమును అంధశ్రద్ధతో నమ్మి స్వచరిత్రసాహిత్యమున అప్రామాణికమైన సామగ్రిని నింపుచుంట మిక్కిలి యాశ్చర్యకరము. పరంపరార్థములను నిరుక్త పాణినీయాదులతో పోల్చుకొనలేక కపోలకల్పితములను స్వాగతించుట విజ్ఞులకు కూడనిపని. ప్రౌఢములైన ప్రమాణముల నన్వేషించిననాడు కదా యవి లభించుట ?

పాణినిమహర్షి ప్రోక్తమైన భ్వాదిగణములలో పఠితమగు నట్ (నృత్తౌ) అను ధాతువుతో నట, నటి, నాట్య, నాటక శబ్దములును; నృతీ (గాత్రవిక్షేపే) అను ధాతువుతో నృత్య, నర్తన, నర్తక, నర్తకి శబ్దములును నిష్పన్నమైనవి. కొందరు విదేశీయులు "నట్టో, నిత్త" అను ప్రాకృతభాష యొక్క వికృతరూపములను పొంది తరువాయి నట, నాట్యము మున్నగు భంగిని సంస్కృతశబ్ద రూపములను దాల్చె ననియును, మిక్కిలిప్రాచీనకాలమున నీ రూపములు సంస్కృతభాషలో లేవని యును ఆజ్ఞాపించినారు. దానికి ప్రమాణము గొప్పవారైన వారి వ్రాతయే !

నటులు గానము మున్నగు నాట్యసామగ్రికి సంబంధించిన శబ్దములు వేదములలో పలుమారులు ప్రయుక్తములైనవి. ఈ ప్రక్కపుటలో నుద్ధృతములైన శబ్దము లా యా వేదమందలి వని ప్రత్యేక ముగ జెప్పబనిలేదు. ఒకేవిధమైన శబ్దము అనేకపర్యాయములు వేదమున వచ్చినను ఒక్కొక రూపము నొకమారే యిట జూపితిని.

---

[1] Pole, Keith, Ridgeuay, Schroeder, Pischel, Linders, Komow, Weber, Hartel, కాణే, వైద్య, తైలంగ్, నందర్గీకర్, మున్నగువారు.

| ఋగ్వేదమున | |
|---|---|
| గాతుం | ౧-౭౧-౨ |
| గాతుమత్యాం | ౭-౫౪-౩ |
| గాతుయంతి | ౧-౧౬౯-౫ |
| గాయత | ౧-౪-౧౦ |
| గాయతి | ౮-౯౨-౨౨ |
| గాయంతః | ౮-౬౧-౮ |
| గాయంతి | ౧-౧౦-౧౦ |
| గాయసి | ౨-౪౩-౨ |
| గీయమానం | ౮-౨-౧౪ |
| గయమానాసః | ౬-౬౯-౨ |
| నట్ | ౭-౧౦౪-౨౩ |
| నర్తయన్ | ౧-౫౧-౩ |
| నృత్యతాం | ౧౦-౭౨-౬ |

| యజుర్వేదమున (శు) | |
|---|---|
| గాతుం | ౨-౨౧ |
| గాయత | ౨-౩౦ |
| గీతాయ | ౩౦-౬ |
| నృత్తాయ | ౩౦-౬ |
| శైలూషం | ౩౦-౬ |
| సూతం | ౩౦-౬ |

| సామవేదమున | | |
|---|---|---|
| గాతువిత్తమాః | పూ | ౬-౧-౪ |
| గాయత | ,, | ౨-౨-౧ |
| గాయతా | ఉ | ౧-౮-౧ |
| గాయంతః | పూ. | ౩-౩-౫ |
| గాయంతి | ,, | ౪-౮-౧ |

| అథర్వవేదమున | |
|---|---|
| గాతుం | ౨-౩౪-౨ |
| గాయత | ౧౨-౬౧-౪ |
| గాయతః | ౪-౧౫-౩ |
| గాయతి | ౯-౧౦-౨ |
| గాయత్రే | ౯-౧౫-౧ |
| గాయంతి | ౧౨-౧-౪౧ |
| గాయంతు | ౪-౧౫-౪ |
| నట్ | ౮-౪-౨౩ |
| నృత్తాని | ౧౦-౧౦-౨౪ |
| నృత్య | ౫-౨౦-౧౦ |
| నృత్యతు | ౧౦-౯-౨ |
| నృత్యంతు | ౧౨-౧-౪౧ |

ఇంకను సూక్ష్మముగ నవలోకించుచో పెక్కువిధములైన శబ్దములును ధాతువులును లభింపగలవు. ఇవి యన్నియు "ఆట, పాటలు, ఆడువారు, పాడువారు" అను నాట్యసంబంధమైన అర్థముల నిచ్చునవి యని వేరుగా జెప్పబనిలేదు.

శబ్దరూపములు వేదములలోనే కాక పాణినీయ ధాతుపాఠమునందును నాల్గు నట్ ధాతువులు ఉపలబ్ధ మగుచున్నవి. పాణిని బుద్ధునికంటె పూర్వుడై నట్లు (క్రీ. పూ ౮౦౦) విమర్శకులే నిర్ణయించినారు కదా![2] పాణినికంటె వెనుక ప్రాకృతభాషకు జెందిన 'నట్ట నిత్త' శబ్దములు ప్రయోగింపబడిన వనుటకుగాని వీనినుండియే నటనృత్యశబ్దములు పుట్టిన వనుటకు గాని ప్రమాణములు లేవు. నటశబ్దమునకు పర్యాయమైన శైలూషశబ్దమును సూతశబ్దమును యజుర్వేదమున

2 Dr. S. K. Belvalkar's 'Sytems of Sanskrit Grammar'

పలుమారులు వచ్చినవి. (నృత్తాయ సూతం, గీతాయ శైలూషం) శైలూషు డనగా శిలూష ఋషికి పుత్రుడైన నటుడను నర్థమును అమరకోశవ్యాఖ్యానమున (పు. ౨౮౨) రామాశ్రమి నిర్వచించెను. అనగా వేదకాలముననే గానమును నృత్యమును ప్రదర్శించువృత్తి గలవారు ఉండి రనుటను సులభముగ గ్రహింపవచ్చును. సామవేదమున గాయంతి యను రూపమును అథర్వ వేదమున నృత్యంతి అను ప్రయోగమును ఋగ్వేదమున నృత్యాతాం గీయమానం అనురూపము లును కలవు. ఇటులే వెదకుచో నిగమ, ఆగమ, ఉపనిషత్, ఆరణ్యక, బ్రాహ్మణ, సూత్రములను అతిప్రాచీనసాహిత్యమున నటనటనలకు సంబంధించిన విషయములు చాలగా లభింపగలవు. మనుష్యస్వభావమునకు సహజములైన నృత్యగీతవాద్యములు నాగరకులైన భారతీయులలో ననాది గనే ఉండవలెను. లేనిచో వేదకాలమున నీ నటనాటకములను విమర్శించునట్టి నాట్యశాస్త్రము పుట్టియుండదు. ఇట్టి ప్రాచీననాట్యశాస్త్రమును గూర్చిన ప్రమాణము పాణినిమహర్షిప్రోక్త మగు అష్టాధ్యాయిశాస్త్రమున స్పష్టముగా గలదు.

పారాశర్య శిలాలిభ్యాం భిక్షునటసూత్రయోః ॥౪-౩-౧౧౦॥
కర్మందకృశాశ్వా దినిః ॥౪-౩-౧౧౧॥

అను సూత్రముల పర్యాలోచనవలన 'శిలాలి' 'కృశాశ్వ' ఋషులచేత ప్రణీతము లగు నటసూత్ర (నాట్యశాస్త్రనియమ) ములను అధ్యయనముచేయు విద్యార్థు లనేకు లుండిరనియును, వారిని క్రమ ముగా 'శైలాలి, కృశాశ్వి' యని పిలుచుచుండి రనియును తెలియుచున్నది. పాణినికంటెబూర్వమే శిలాలి, కృశాశ్వ ఋషులు నాట్యశాస్త్రమును రచించినా రనినపుడు వేదకాలమునుండియు నట నాట్యనాటకముల సంప్రదాయ మున్నట్లే గ్రహింపవచ్చును. పైన నుదాహరించిన యజుర్వేదీయ శిలూషఋషి నాట్యశాస్త్రప్రవర్తకుడై యుండు ననుటకు కారణము స్పష్టమే కద! శైలూష[3] శబ్దమునకు సాయణాచార్యులవారు "తన భార్యతో వేశ్యావృత్తిని జేయించువాడు" అను నర్థమును జెప్పియున్నారు. (తైత్తిరీయ బ్రాహ్మణభాష్య, ౩-౪-౨-౧) ఇది గమనింపదగియున్నది. వీ రనేక ప్రాచీననిఘంటువుల నవలోకించియే అర్థనిర్ణయము చేసియుందురు. సాయణునికంటె వేయి సంవత్సరములకు పూర్వమున నున్న అమరసింహుడును తన నామలింగానుశాసన (అమరకోశ) మున నటశైలూషశబ్దములకు పర్యాయముగా (ద్వి.కా.శూ. ౧౨) జాయాజీవః (భార్యవలన బ్రతుకువాడు) అను స్పష్టమైన అర్థముగల శబ్దమును జూపియున్నాడు. దీనితో ప్రాచీన పరంప రార్థము గోచరింపకపోదు. ఇది సదాచారము కానందువలన గానోపు కౌషితకీ బ్రాహ్మణమున [౨౯-౫] లౌకిక నాట్యాది సంగీతము యజ్ఞాంగ మని చెప్పబడియున్నను పారస్కరాచార్యుడు తన గృహ్యసూత్ర(౨-౭-౩)మున ద్విజులకు సంగీతాదిప్రదర్శనముల నిషేధించియున్నాడు. మరియు పాణినియొక్క "ఛందోగౌక్థికయాజ్ఞిక బహ్వృచనటాఞ్ఞ్యః" అను సూత్రమువలన

(3) శిలూష కృశాశ్వ శిలాలి మున్నగు పేరులు కల ఋషులు వైదికమున పలువురు కనుపడుచున్నారు. ఇట ప్రకృతులను మాత్రమే గ్రహింపవలెను.

నటుల వేదము నాట్య మనియును (నటానా మామ్నాయో నాట్యం) "కర్మవేషా ద్యత్" అను సూత్రమువలన వేషములను వేసి సంపాదించువాడు వేష్యుఁడనబడు ననియును, గౌరాది గణమందలి నాటశబ్దము వలన నాటికయను చిన్న నాటకగ్రంథముగూడ నున్నట్లు స్ఫురించుచున్నది. కావున పాణినికాలమున నాటకములును, అందు వేషములు వేయువారును, పెద్దనాటకములే కాక చిన్న చిన్న ప్రదర్శనములకు బనికివచ్చు గ్రంథములును బాగుగ ప్రచారము నందియుండె ననుటలో సందేహము లేదు. ఇది యెల్ల పరికించిచూడగా నాట్యశాస్త్రములును, నాట్యప్రచారమును, భారతవర్షపు ప్రాచీనసంపత్తని తేలుచున్నది. శిలాలి కృశాశ్వ శైలూష ఋషుల నాట్యశాస్త్ర సంప్రదాయమును దెలుపు సూత్రగ్రంథములు మన యభాగ్యవశమున లుప్తమై యుండును. ఏమైనను భారతీయ (భరతమునిప్రోక్త) నాట్యశాస్త్రము మనకు ఈలోపుగా లభింపనిచో నీవిషయమునఁ బాశ్చాత్యుల ఉపాలంభనములకు నెన్నిసార్లు గురిగావలసి యుండెడిదో! మొద లీ గ్రంథము నిర్ణయసాగరముద్రాశాలనుండి ప్రకటితము కాగానే అనేక పాశ్చాత్యులకు ఆశ్చర్యము కలిగెను. "ఈ పుస్తకమున అనుష్టుప్ శ్లోకము లుండుట వలనను, నాట్యవిషయము మిక్కిలి విస్తృతముగ వర్ణింపబడియుండుటవలనను ఇది ప్రాచీన గ్రంథము కానేర"దని వ్రాయదొడగిరి. కాని ప్రమాణములను జూపఁ జాలరైరి. భరతుని నాట్యశాస్త్రమును గూర్చి భారతదేశపుకవిపండితు లనేకులు తమ గ్రంథములలోను, వ్యాఖ్యానములలోను చిరకాలమునుండి సూచించుచునే యున్నారు. కాని దానిని సాభిప్రాయముగనే కొందరు పెడచెవినిఁ బెట్టుచున్నారు. నాట్యశాస్త్రముయొక్క రచనాపద్ధతిని సూత్రసదృశమైన గద్యభాగమును విచారించినచో అది క్రీ. శ. పూర్వము ౩-౪ శతాబ్దముల కంటె నిటీవలిది కాదని తోచును. అనుష్టుప్‌శ్లోకములవలననే అర్వాచీనత్వము సిద్ధించుచో ఆగమసంహితలును, ఉపనిషత్తులును, భారతరామాయణాదులును నవీనములు కావలసియుండును. భరతనాట్య శాస్త్రకాలవిచారమును మరొక వ్యాసమున జర్చింప వలెను. వేదసమకాలమున దీనికి ప్రచార ముంటవలన గాబోలు భరతముని దీనిని నాట్యవేద మని వ్యవహరించినాడు. మొద లీ శాస్త్రము బ్రహ్మనిర్మితమై భరతముని కుపదేశింపబడినట్లు ప్రథమాధ్యాయము (శ్లో. ౧౬-౨౪) వలన దెలియుచున్నది. తరువాయి భరతుడును శాండిల్య, కోహల, దంతిల, జటుల, మున్నగు నూర్గురు పుత్రులద్వారా నాట్యశాస్త్రమును ప్రచారమొనర్చెను. ఈశాస్త్రమున నట, నాట్య, నాటక, నృత్య, గీత, వాద్య, రస, ఛందోలంకార, భావాభినయ, రంగశాలా, వేషరచన మున్నగు సమస్తవిషయములు సూక్ష్మముగను, విస్తారముగను వివరింపబడినవి.

ఇట్టి మహాగ్రంథము (౫౦౦ పుటలు) పుట్టుటకు పూర్వము చిన్న చిన్న ప్రబంధములును, సూత్రములును, నిబంధనలును ప్రచారము నందియుండును. ఈ నాట్యమైనను నృత్య, నృత్త, లాస్య, తాండవము లను సూక్ష్మభేదములు గలదై యున్నది. వీని నిట సంక్షేపించు చున్నాను.

నాట్యశాస్త్ర (లక్షణ) గ్రంథములు ప్రాచీనము లనుట సిద్ధాంతమైనపుడు లక్ష్యములగు నాట

కాదుల యభినయప్రదర్శనములగూర్చి విస్తరింపబనిలేదు. కాని సూచన యవసర మనుకొనియెదను. భారతీయుల నిఖిలవిద్యలును ధర్మార్థకామమోక్షము లనెడు చతుర్విధపురుషార్థములకొరకే ఉపదిష్టములై యున్న వనుట అపరోక్షము. ఆ మహోపదేశము ప్రభుసమ్మితము (నిగమాగమ స్మృతులు) సుహృత్ సమ్మితము (నీతిశాస్త్రపురాణాదులు) కాంతాసమ్మితము (కావ్యనాటకాదులు) అని త్రివిధమై యున్నది. మొదటి రెండును సామాన్యజనమున కంతగా రంజన మొనర్పజాలవు. రాజశాసనమును బలాత్కారముగను మిత్రోదేశము నౌదాసీన్యముగాను జనులు పరిపాలింతురు. కాంతాసందేశము నట్లుగాదు. అది సుందరమును, సుఖకరమును అగుటవలన రసికునిచే హృదయపూర్వకముగ సేవింప బడుచున్నది. రమణీసందేశము రమణీయముగ నుండనిచో "వాడు ఆమె చేతిలోని కీలుబొమ్మ" యను సామెత బైలుదేరదు కదా! ఈ కాంతాసమ్మితమే కావ్యమని చెప్పబడినది. ఈ కావ్యము శ్రవ్య (భారత భాగవతాదులు) మఱియును, దృశ్యమనియును ఇరుతెఱంగులుగ నున్నది. ఇదియే మన ప్రస్తుతవిషయము.

ఆంధ్రులు సామాన్యముగ నాటకము లని వ్యవహరించు కావ్యములకు సంస్కృతమున దృశ్యకావ్యము లనియును, రూపకము లనియును పేర్లుకలవు. దీనిలో కనులతో జూచి యానందింప దగు విషయ మెక్కుడుగ నుండుటవలన నిది దృశ్యకావ్య (చూడదగినబంధ) మని చెప్పబడినది. ఒకానొక సాధారణుడైన మనుష్యునకు వేషమువేసి వానిలో రాముడు, సీత మున్నగు వ్యక్తులజీవితమును ఆరోపింపజేయుటవలన రూపకము లను వ్యవహారమును (రూపకం తత్సమారోపాత్) వీనికి సమంజసముగా కలిగెను.

> "ఆనందనిష్యందిషు రూపకేషు, వ్యుత్పత్తిమాత్రం ఫల మల్పబుద్ధిః
> యోఽపీతిహాసాదివ దాహ సాధు స్తస్మై నమః స్వాదుపరాఙ్ముఖాయ. దశ. ౧-౬॥

అను ధనంజయమహాకవిసూక్తివలె రూపకము ఆనందరసనిష్యంది యనుటలో సందేహ మేది? భిన్నరుచిగలవారు సైతము నాటకము నవలోకించిన పిదప నద్రసానుగుణమైన ఆనందము ననుభవించితీరవలెను. ఇది నాటకములోని విశేషశక్తి. నిక్కముగా నిది దేవతలకు నేత్రయజ్ఞమయి యుండ నోపును.[6] యజ్ఞప్రతిపాదనకారణముననే దీనికి భరతముని వేదత్వమును ప్రకటింపజాలినాడుకదా! ఇది మనుష్యుల త్రికరణములకు ఆనందమును గలిగించు జన్నమనినను సరిపోవుచున్నది. నాటకములు తమయూర దిగినచో చూడనివా రెవరు! లోకవాసన లక్కరలేదను వారును (సన్న్యాసులు, నాయకులు) వేషాంతరములతోడనో, కార్యాంతరములతోడనో నాటకపు ప్రేక్షకులలో గలిసి యవలోకించుచుందురు. కొంప దింపుకయియే ఇళ్ళను గుల్లజేసికొనుట గాంచనగును. నాటకవేషమును వేసికొనివచ్చిన 'సినిమాలు' విజృంభించిన పిదప రంగశాలలందు ధనకనక

---

[6] మహాకవి కాళిదాసు తన మాళవికాగ్నిమిత్రనాటకమున 'దేవానా మిద' మను శ్లోకముతో నాట్యము శ్రేష్ఠతను నిక్కమక్కువలో వర్ణించినాడు.

వర్షము ఈ కరువుకాలముననూ భోరున గురియుచున్నది. నాటకప్రదర్శనము వలన ధర్మ, నీతి, సమాజశిక్షణ మొదలగు నే విషయము నైనను త్వరగా ప్రసరింపజేయవచ్చును. "నాటకములవలన ఆనంద మేమియును లే''దను యోగీశ్వరులును ఉండవచ్చును. ఇట్టివారికి ప్రత్యుత్తర మీయ నవసరము లేదు. అయితే నేడు నాటకము లను పేరిట బెరుగుచున్న పెంట గడ్డల నన్నిటిని మెచ్చుకొంటి నని భావింపజనదు. ఉదాత్తవివేకముతో పరిప్లుతములైన మృచ్ఛకటిక, శాకుంతల, వేణీసంహారాదులను బోలు నాటకములే ప్రచారార్హము లనుట సువిదితము.

ఈ రూపకములు నాటక, ప్రకరణ, భాణ, ప్రహసన, డిమ, వ్యాయోగ, సమవకార, వీథీ, అంక ఈహామృగము లని పదివిధములు. ఇవి కాక నాటిక, త్రోటక, సట్టక, రాసక మున్నగు, పదినెనిమిది యుపరూపకములును కలవు. వీని వైవిధ్యమునకు నాయకుడు, కథ, భాష, కల్పన, సంక్షేపము మొదలైన విషయములే కారణము. స్పష్టమైన కారణమునే కనుగొనవలయునన్న భారతవర్షీయనాట్యశాస్త్రముయొక్క అతిప్రాచీనతను విశ్వసించిన చాలును. మేధావులైన ప్రాచీన హైందవుల నాటికే ఇన్నితీరులరూపకములు ప్రచారము నందుట జూడ వేదకాలము నుండియు శైలూషాదులవలన ప్రచార మందియుండును గదా! ఈ రూపకములను ఉదాహరణమునకై "శాకుంతలము నాటకము, మాలతీమాధవము ప్రకరణము, ముకుందానందము భాణము, కర్ణభారము వ్యాయోగము, రత్నావళి నాటిక, కర్పూరమంజరి, సట్టకము" అని వివరింపవచ్చును. సంస్కృతవాఙ్మయమున నిట్లు దృశ్యకావ్యములు పలువిధముల నున్నను సామాన్యముగ ఆంధ్రభాషలోను, ప్రాంతీయము లగు నితరభాషలలోను వీని నన్నిటిని గలిపి నాటకము లనియే నేటి లోకవ్యవహారము. నాటకములకు సంబంధించిన యనేకవిషయములు నాట్యశాస్త్రమునందును శతాధికములైన అలంకారగ్రంథములందును మిక్కిలి విశదముగ నిరూపింపబడినవి. ఆ మహార్ణవము నిట ప్రదర్శింప వీలులేదు.

ఈ దృశ్యకావ్యములు ఆనందదాయకము లనుట ఒకవైపుండనిండు. "వీనిని విరచించి రంగమంచమున అభినయించుటను భారతీయు లెక్కడనుండి నేర్చికొనిరి. గ్రీక్ యూనాని దేశములనుండి దిగియుండును. భారత దేశమున నీ కళ పుట్టలేదు" అని ప్రసంగించువారినిగూర్చియు కొంత జెప్పవలసి యున్నది. మానవబుద్ధి కల్పనాసాగర మనుట క్రొత్తమాట గాదు. అది స్వార్థ పదార్థములకై నూతన సామగ్రిని సంపాదింప ప్రయత్నించుటయు నగోచరము గాదు. అనుకరణశక్తి మనుష్యునిలోనే ముఖ్యముగా అనాదిగా గోచరించుచున్నది. వాడు కాకి, కోతి, పిట్టల ధ్వనుల ననుకరించినటులే ( ఇమిటేషన్ నకల్ ) మానవుల స్వభావములను, ఆచారవిచారములను అనుకరించి వినోదము గలిగించుటకు సమర్థుడేకద! అందునను తర్కవ్యాకరణ మీమాంసావేదాంత సాంఖ్య యోగాయుర్వేద జ్యోతిషములంబోలు అత్యద్భుత శాస్త్రముల నావిష్కరించిన భారతీయమానవుడు సులభమనోరంజనసామగ్రియైన నాటకమును

మొదలు గనలేదనిన నమ్మదగిన విషయముగా దోచుటలేదు. మానవస్వభావసహజమైన నాటక పద్ధతి (అనుకరణము) అనాదికాలమునుండియు భారతీయునితోడనే పుట్టియుండజాల దెటులు? పురాణపురుషుడైన భారతీయునే గ్రీక్ యూనానీవారేల యనుకరించి యుండగూడదు? భారత వర్షమున నాటకాభినయము నవీనము కాదు. నాటకపు ఆది యనగా సంవాదము (కథోపకథనము) లేక ప్రశ్నోత్తరప్రత్యుత్తరములు గల ఒక సందర్భముగదా! ఋగ్వేదమున నిట్టి సూక్తము లనేకస్థలములలో గలవు. వానిలో నాటకబీజములు సూక్ష్మముగా నున్నవనుటకు సంకోచ మేమి? అగస్త్యలోపాముద్రాశిష్యసంవాదము (౧-౧౭౯) విశ్వామిత్రనదీసంవాదము (3-33) ఇంద్రాదితి వామదేవ సంవాదము (౪-౧౮) ఇంద్రవసుక్ర సంవాదము (౧౦-౨౮) యమయమీ సంవాదము (౧౦-౧౦) పురూరవోర్వశీ సంవాదము (౧౦-౯౫) ఇంద్రేంద్రాణీ వృషాకపి సంవాదము (౧౦-౮౬) మున్నగు వానిని నాటకములకు ఆదిరూపము లని గ్రహింపవచ్చును. ఇవి కేవలము సంవాదములే కాక అటనట రసవద్ఘట్టములు గలిగి నాటకానుభవమును స్మృతికి దెచ్చుచునేయుండును. మరియు సోమవిక్రయసమయమందలి అభినయమును ఒక చిన్ననాటకముగా జెప్పవచ్చును. ఈ యభినయమున నృత్యగీత వాద్యములతో లోకము నాకర్షించుటయే ఒక ముఖ్యవిధి. యజుర్వేదమున శైలూషు (నటు)డు స్పష్టముగా జెప్పబడినాడు. సామాథర్వవేదములందును అభినయానుకూల వ్యాపారము కనుపడుచున్నది. ఇటులు నాటకాభినయముల జనని వేదమాత యనవలసివచ్చుచున్నది. ఇక వేదప్రకాశనము భారతీయబ్రహ్మనుండియే కద! మహాభారతమున నొకచోట నాటకకారుల మృతావస్థయొక్క వివరణము గలదు.[7] బ్రహ్మవిరచితమైన "అమృతమంథన" మను నాటకము (సమవకారము) దేవతలయెదుట విశ్వకర్మచే నిర్మితమగు నాట్యగృహ (Theatre) మున ప్రదర్శింపబడినది. తరువాయి "త్రిపురదాహ" మను డిమప్రయోగమును శ్రీపార్వతీపరమేశ్వరులయెదుట ప్రదర్శించి భరతముని బహుమానము నందినట్లు నాట్యశాస్త్రముయొక్క చతుర్థాధ్యాయమువలన దెలియుచున్నది. ఇట్టి ప్రాచీననాటకములే కాక ధావక, సౌమిల్ల మున్నగు మహాకవుల నాటకముల యొక్కయు, మహాభాష్యకారుడైన పతంజలిచే నిరూపింపబడిన 'కంసవధ' 'బలిబంధ' నాటకములయొక్కయు, ఒక యక్షరమైనను బైలువడలేదు. ఇట్టి వెన్ని ప్రాచీననాటకములు కాలగర్భమున విలీనమైనవో? ఇటీవల మన సౌభాగ్యవశమున వెలువడిన భాసమహాకవినాటకములు క్రీ॥ శ॥ పూర్వము 3, ౪ శతాబ్దములకు జెందియుండు నను సత్యమైన వాదము సైతము కొందరికి గిట్టక వీనికి నర్వాచీనత్వము, సాధింప దొడగిరి. ఎటులైనను మాయోపాయములతో కాళిదాసునికంటె బూర్వమున (క్రీ॥ శ॥ ౨ శతాబ్ది) నాటకములును అభినయమును భారతీయులకు లేవని కృత్రిమసిద్ధాంతములను ప్రసారము జేయుచో గ్రీక్ యూనానులనుండి నాటకసామగ్రి ఇండియాకు దిగుమతి యయ్యెనని సులభముగ దోపజేయవచ్చును. ఇది యంతయు అప్రామాణికమని గట్టిగ జెప్పవచ్చును. భాసనాటకముల పరిమార్జితా

(7) వైద్యాగారి "సంస్కృత వాఙ్మయాచార తోటక ఇతిహాస" పుటలు ౧౩౪.

వస్తును గాంచుచో అంతకంటె పూర్వము చాల ప్రాచీనకాలముననే నాటకములు విరచితములై ప్రదర్శితము లగుచున్నట్లు తెలియగలము. అనగా కవి, కావ్య, నట, నాటక, నృత్య, గీత, వాద్యాది సరసమైన సామగ్రి రసికులైన భారతీయులకు వేదకాలము నుండియే సమృద్ధమైనట్లు ఈ చిన్ని వ్యాసమున సూచితము.*

"న తజ్ జ్ఞానం న తచ్ఛిల్పం, న సా విద్యా న సా కలా
న స యోగో న తత్కర్మ, నాట్యేఽస్మిన్ య న్న దృశ్యతే."

* కాశీవక్తృత్వ కళోత్తేజక పరిషత్తున భావాపాఠమందు ఉపన్యస్తము. తదనంతరము కన్నడ పత్రికలో ప్రకటితము. నా విరచ్యమాన 'నాట్యదర్పణ' మునకు ఇది సూచిక.

# కళాపూర్ణోదయము - పాత్రనామ కల్పనము

శ్రీ దువ్వూరి వేంకటరమణశాస్త్రి

సూరనార్యుఁడు దన కళాపూర్ణోదయమున సంఘటించిన పాత్రములలోఁ గొన్ని పురాణప్రసిద్ధములు, కొన్ని కల్పితములు. ఈ ప్రబంధమునఁ దుంబురు నారద వివాదవృత్తాంతము దప్పఁ దక్కిన కథాభాగములెల్ల నీ కవి నూతనముగ సృజించినవే యనఁదగును. మొత్తము కథాంశములన్నియుఁ గల్పనామాత్రసిద్ధములుగాక యీ కథ యీతీరుననే యేకాలముననో జరిగియేయుండినటులు పాఠకుల స్థూలదృష్టికి స్ఫురింపఁజేయవలయు ననుసంకల్పముచేఁ గావలయును, గల్పితకథాభాగములందు సైతము పురాణపాత్రములనుగూడఁ గొన్నిటిని సంఘటించియున్నాఁడు. ఇట్లు పాత్రములనేగాక కల్పితములైన కథాప్రదేశములతోఁ బాటు పురాతనప్రదేశములనుగూడఁ గొన్నిటిని మేళవించి కథాభాగములు నడిపించియున్నాఁడు. తొలుదొల్త ద్వారకానగరిని మన కనులకు గోచరింపఁజేసి యటనుండియే కథ నుపక్రమించుట యీ కథ యేనాఁడో జరిగినదే యను భావము మొట్టమొదటనే మన మనముల నాటుకొనఁజేయుటకా యనియు స్ఫురించుచుండును. అటులే కానియెడ నత్యద్భుతావహము లగు పెక్కిటిని గథాభాగములను నెన్నిటినో నూతనపాత్రములను సృజించిన యీతఁడు నడుమనడుమఁ బురాణపాత్రముల సంఘటించుటకుఁ గారణాంతరము గోచరింపదు.

ఇందుఁ బరామృష్టము లగు పురాణపాత్రములు—శ్రీకృష్ణుఁడు - జాంబవతి - రుక్మిణి - సత్యభామ - నారదుఁడు, తుంబురుఁడు, ఇంద్రుఁడు, బ్రహ్మ, సరస్వతి, దత్తాత్రేయులు, రంభ, నలకూబరుఁడు, శల్యాసురుఁడు - ఇత్యాదులు.

పురాతన ప్రదేశములు; ద్వారక, శ్రీశైలము, మధుర, హరిద్వారము, కాశి, అయోధ్య, కాంచి, తిరుమల, శ్రీరంగము, కుంభకోణము, అనంతశయనము, మున్నగునవి.

కల్పితపాత్రములు:—(1) సుగాత్రి, (2) శాలీనుఁడు, (3) సుముఖాసత్తి, (4) మణిస్తంభుఁడు, (5) కళాపూర్ణుఁడు, (6) కలభాషిణి, (7) మధురలాలస, (8) మణికంధరుఁడు, (9) అలఘువ్రతుఁడు, (10) అభినవకౌముది, (11) మదాశయుఁడు, (12) రూపానుభూతి, (13) స్వభావసిద్ధుఁడు, (14) ప్రథమాగమాదులు నలుగురు, (15) సుగ్రీవుఁడు, (16) సత్త్వదాత్ముఁడు - ఇత్యాదులు.

కల్పిత ప్రదేశములు:—కాసారపురము, క్రముకకంఠోత్తరపురము - ఇత్యాదులు.

పైనిఁ జూపిన పేరులను గల్పించుటలో సూరకవి మిక్కిలి కౌశలమును జూపియున్నాఁడు. అది యెట్టిదో వివరించుటయే యీ వ్యాసమునకు ముఖ్యవిషయము.

ఎచటనో తప్ప నించుమించు మన ప్రబంధము లన్నిటను గానవచ్చు పేరులకును నాయా గ్రంథముల యందలి కథాభాగములకును నించుకయు సంబంధము గోచరింపదు. ఈ గ్రంథమునం దన్నో యేపేరు దీసికొని దానియర్థము మనము విచారించినను నద్దానికి సంబంధించిన యితివృత్తము లోని ప్రధానాంశము లాపేరిలోఁ బ్రతిఫలించుచుండవలయు నని సూరకవి సంకల్పము. ఇట్టి తన సంకల్పమును బాఠకులు గ్రహించి యీ నామముల యన్వర్థతను బరిశీలింతురో లేదో యను సందియముగూడ నాతనికిఁ గలిగి యిది వెలువరించుట యెటులా యని యాలోచించియుండును; అనఁగా వీని వ్యాఖ్యానముగూడఁ గవియే చేయవలసి వచ్చిన దన్నమాట. ఆ పదముల కర్థములు దానై వివరించుట కిచ్చగింపనివాఁడాయె. ఎన్నో యుపకథలతో సముద్రమంత కథ ననవద్యముగ నతిరమణీయముగఁ గల్పించియు నం దొక్క కథాభాగమునైనఁ దానై నుడువక పాత్రముల మూలముననే వెలువరించు నేర్పుగల యీ కవితల్లజుఁడు దాను కల్పించిన పేరుల నిర్వచనములను దానే వివరించుట కెటుల సమ్మతింపఁగలఁడు? తానై వివరింపరాదు, వివరింపక విడువరాదు! ఈ సమస్యకుఁ జిక్కి యట్టివానినెల్లఁ బాత్రప్రసంగముల మూలముననే మన కెఱుకపఱచుమార్గము నవలంబించినాఁడు. ఈపద్ధతి కడుంగడు హృద్యము. అందును బాత్రములచే వివరింపఁజేయుస్థలములకుఁ గలయౌచిత్యమును గ్రహింపఁగలిగినచో మనకుఁ గలుగు విస్మయమునకు మేరయే గానరాదు. ఆ నిర్వచనములను వాని వివరణస్థలములను బరికించుటకుముందు మనము ముఖ్యముగా గమనింపఁదగినది వేఱొకయంశము గలదు. ఇందలి పాత్రములకు సంబంధించిన కథ యొక్కటే యైనచోఁ దత్పాత్రనామములను సార్థకములుగ గల్పించినంత మాత్రముననఁ గవి నంతగా మెచ్చుకొనఁ బనిలేదు. కాని యిచటి సందర్భ మంత మాత్రమేకాదు. ఒక్క కథకే గాక యీ కల్పితపాత్రములు పెక్కులు రెండు కథలకు సంబంధించియుండును. ఆ కథలైన నొకదానితో నొకటి సంబంధము లేనివి. మిక్కిలి భిన్నములు. వేయేల? ఒకటి సత్యలోకమందలిది. ఒకటి భూలోకమందలిది. పాత్రనామము లించుకయు భేదిల్లక తుల్యములై యుండును. ఆ పేరులకు రెండు కథలందును వేఱు వేఱు నిర్వచనము లుండును. అవన్నియు నందును నిందును గూడఁ గవిచేఁగాక పాత్రములచేతనే వివరింపఁబడుచుండును. వివరింపఁబడినచోట్లు పరికింతుమా, ఉభయత్ర మిక్కిలి యుచితములై యుండును. మనకొఱకుఁగాక కథకొఱకే యా వివరణములఁ జేయించినట్లు భాసిల్లుచుండును. రెండుకథలందు నే పేరిని బరికించిన నయ్యది యొక కథలో ముఖ్యమనియు, వేఱొకకథలో గౌణమనియు వివేచించుటకు వలనుపడదు. అయ్యది రెండిట నతి ప్రధానముగనే వెలయుచుండును. ఇది వింతలలో వింత. ఈ పాత్రనామకల్పనాభంగి నిన్నిదృష్టులతోఁ బరికింపఁ గలిగితిమేని సూరనార్యుని సుకుమారమగు సూక్ష్మదృక్కౌశలమును గొంత గ్రహింపఁ గలుగుదుము. ఇఁక నొక్కొక్క పాత్రముపై దృష్టి మరలింపుఁడు.

(1) సుగాత్రి, (2) శాలీనుఁడు:—వీరు ఇతివృత్తమున కాధారభూతు లగు ప్రధానదంపతులు— శాలీనుఁడు, అలంకృత యగు తన భార్య నొల్లకుండుటయు భూషణాద్యాడంబరము లేని సహజస్థితిలో

నామెను వలచుటయు వీరి యుపాఖ్యానమునఁ బ్రోక్త విషయములు. ఒల్లమికి నలంకారాడంబరమే కారణముగాని యామె సౌందర్యలోపము కారణము గాదని సూచించుటకై - చక్కని శరీరముగలది= రూపవతి, అను నర్థము స్ఫురించునట్లు "సుగాత్రి" యని యామెను బేర్కొనెను. మఱియు యుక్తవయసున భార్య నొల్లకుండుట, ఒల్లమికి హేతు వితరులకుఁ దెలియకుండుట, అత్త కోపించి యీ యిల్లటపుటల్లుని దోఁటకాఁపరిగ నియమించుట, ఆ యుద్యోగమునే యెక్కువ మక్కువతో నితఁ డామోదించుట, యిరుగుపొరుగువారెల్ల నీతఁడు మిక్కిలి యమాయికుఁ డనుకొనుట మున్నగు నంశముల కనురూపముగ నితఁడు అధృష్టుఁడు = అమాయికుఁడు= ముగ్ధుఁడు = వెఱ్ఱిబాగులవాఁడు అను నర్థము స్ఫురించునట్లు "శాలీనుఁ డని పేర్కొనఁబడెను."

కథ సాగినకొలఁది వీ రిరువురును (3) సుముఖాసత్తి (4) మణిస్తంభుఁడు - అను మారుపేరులతో వ్యవహరింపఁబడుదురు. ఈ పేరుల మార్పు, ఇతివృత్తమున మిక్కిలి యావశ్యకము. సుగాత్రియే సుముఖాసత్తిగ మాఱినది. శాలీనుఁడే మణిస్తంభుఁ డయినాఁడు. మృగేంద్రవాహనాలయమున నీ దంపతులును మణికంధర కలభాషిణులును గూడిన రంగ మొకటి యేర్పడినది. మణికంధరుఁడు తా నొకపుడు శారదాపీఠమున వినియున్న సుగాత్రీశాలీనవృత్తాంతమును బ్రసంగవశమున నపుడు ప్రతిపాదించుట తటస్థించినది. ఆ సందర్భమున భార్యాభర్తల మని యెఱుఁగకుండ నా దేవతాలయమున నెన్నాళ్లనుండియో నివసించియున్న మణిస్తంభసుముఖాసత్తులు దంపతులమని పరస్పరము తెలిసికొను ఘట్ట మేర్పడినది. అపు డీ మారుపేరులకుఁ గారణములను దమకుఁ దామే నిరూపింప నవసరము కలిగినది. అప్పట్టున "నా కపుడు సుముఖాసత్తి నామమొదవె, సుముఖుల న శాస్త్రవిదులు, నిత్యమును దత్సమీపవర్తన గలిగియే మెలఁగుచునికి" (4—42) అని సుముఖాసత్తి తన కీపేరు గలుగుట కుపపత్తిని నిరూపించినది.

4. మణిస్తంభుఁడు——ఇటులే శాలీనుఁడును మణిస్తంభుఁడను తన యిప్పటి నామమునకు నిమిత్తమును జూపవలసియుండెను. కావున నతఁడును భార్యపై నలిగి తా నుఱికిన శతతాళదఘ్న మను మడుగున స్వభావసిద్ధుఁ డను యోగీశ్వరునికరుణచే వయఃస్తంభనకారి యగు మణినిఁ బొందియున్నవాఁడగుటచే "వయఃస్తంభంబుగ మణిచేతఁగాంచుట మణిస్తంభుండు నా నొప్పితిగ" (4-150) అని తన యీ క్రొత్తనామమునకు నిమిత్తమును నిరూపించియుండెను. వీ రిరువురును భూలోకకథలోనివారు. వీరికే మన కథానాయకుఁడగు కళాపూర్ణుఁ డుదయించును.

సత్యలోకకథలో సనఁగా సరస్వతీచతుర్ముఖవిలాసకథలోఁగూడ సుముఖాసత్తి మణిస్తంభకళాపూర్ణ నామములు గలవు. చతుర్ముఖుఁడు సరస్వతీప్రణయకోపమును మాన్పుటకై కొంటెతనముతోఁ జిలుకకుఁ గథఁజెప్పు సందర్భమున సరస్వతి తనకు విముఖురాలై సరస్సునందలి మణిస్తంభమున దనముఖము ప్రతిఫలించునట్లుగా నటువైపు తిరిగినదని చెప్పుటకు బదులుగా సుముఖాసత్తివలన మణిస్తంభమునఁ గళాపూర్ణుఁ(ముఖచంద్రుఁడు)డుదయించె నని పలికియుండె.

ప్రణయకోపము చల్లారినవెనుక బ్రహ్మ పరియాచకముగా నప్పటి తమచర్యలనే కథగాఁ గల్పించి నటులు గ్రహించి దానిని సమన్వయించుతఱిని సు+ముఖ+ఆసక్తి = నిర్మలమగు ముఖము యొక్క సామీప్యమువలనఁ గొలనిలోని మణిమయస్తంభమున ముఖము ప్రతిఫలించుటగా వివరించియున్నది. ఈ సందర్భమునందీ పేరు లౌకకథలో ముఖ్యములనియు వేఱొకకథలో గౌణములనియు నిర్ణయించుట మనవలనఁ గానిపని. ఇటులే మునుముందుగూడ గ్రహించునది.

5. కళాపూర్ణుఁడు, 6. కలభాషిణి, 7. మధురలాలస:— సూరనార్యుఁడు గ్రంథాదిని సూత్రధారునివలెఁ దొలుత రంగస్థలమున మనకుఁ గానిపించి ద్వారకాపరిసరమునఁ గలభాషిణిని నారద మణికంధరులను రంభానలకూబరులను మనకుఁ బరిచితులఁ గావించి తాను రంగభూమినుండి తప్పుకొనినాఁడు. అపుడు

"కలభాషిణి యనుపేరా, వెలఁది మును వహించు సహజవిలసత్కలభా

షలకుఁ దగఁజాలదపుడది, కలికితనము చతురతయును గల పలుకులకున్" (1-128)

అని కలభాషిణి యను నామము గలుగుటకు నిమిత్తముఁ జూపియున్నాఁడు.

మధురలాలస కళాపూర్ణునికై కొంతకాలము వేచియుండిన పిదప వారికిఁ బాణిగ్రహణము జరిగినది. అప్పట్టున

"కడు గళాపూర్ణుఁ డను కీర్తి గన్న యాతఁ, డీ సతివిశేష మెఱుఁగుట యెన్నవలదె

యీ మధురవస్తువును గొన నెఱిఁగెఁగాన మధురలాలస యనుపేరు మగువ కొనరు." (7-86)

అని మధురమూర్తియగు కళాపూర్ణునిపై నాసక్తిఁ గొనుటచే మధురలాలస యను పేరు సార్థకమయ్యెనని కల్యాణవైభవముఁ జూడవచ్చిన జనులెల్లరు భావించిరఁట! పైపద్యము పూర్వార్థమునఁ గళాపూర్ణపదనిర్వచనముగూడఁ బరికింపఁదగినది. సకలకళారహస్యవేది యని యా పదమునకర్థము. విలాసకథలోని కళాపూర్ణపదమునకు షోడశకళాపూర్ణుఁ డగు చంద్రుఁడని యర్థము. తన ముఖమునే పూర్ణచంద్రునిగ భావించి చతుర్ముఖుఁ డా రీతిని నిర్దేశించినట్లు శారదయే యట వక్కాణించి యున్నది.

ఇట సూరనార్యుఁడు స్పష్టముగా వివరింపనిదియుఁ బాత్రములచేనైన వివరింపఁజేయనిదియు మఱొక యర్థవిశేషము గలదు. తొలుత సత్యలోకమున సరస్వతీచతుర్ముఖుల పెంపుడుచిలుక శాపవశమునఁ గలభాషిణిగా జన్మించినది. ఆమెయే మఱొక జన్మమున మధురలాలసయైనది. ఆ చిలుకయే యిట్టి పరిణామముల నందెనను భావముగూడ నీ పేరులయందు నిగూఢమైయున్నది. మనోహరములగు పలుకులును మధురములగు ఫలములయందాసక్తియుఁ జిలుకలకు మిక్కిలి నైసర్గికములుగదా! కావున నిపుణముగఁ బరికించినచో నీ పేరులు రెండును దొలుతటి దగు శుకజన్మమును స్మరింపఁ జేయఁజాలియున్నవి.

సత్యలోకకథయందును మధురలాలస కలదు. మధురమగు నధరమందలి యాసక్తి యను నర్థము సరస్వతిచే నట వివరింపఁబడినది.

8. మణికంధరుఁడు:—ఈ గంధర్వుఁడు దండకరూపమున శ్రీకృష్ణుని స్తుతింపఁగా మెచ్చి యొక మణిహారమును గృష్ణుఁ డీతని కొసంగెను. ఆ హారము కృష్ణుడు బాలరూపమున సాక్షాత్కరించి సుగ్రీవున కొసంగినదియుఁ గాలక్రమమునఁ బరంపరాయాతమై కృష్ణునికడ నున్నదియుఁ గావున బాలరూపమునకు సరిపడు నద్దానిని యువకుఁడగు మణికంధరుఁడు ధరించుటలో దాని నాయక మణి హృదయపర్యంతలంబి కాక కంధరమందే యుండుటచే మణికంధరుఁ డనుపేరు సార్థకమైనట్లు మధురలాలస కళాపూర్ణునితో మణిహారప్రసంగముఁ గావించుతఱిని

"దండకాకృతి సముజ్జ్వలసంస్తవలీల కెంతయున్,
ఘనముగ మెచ్చి యిచ్చె మణికంధరనామునకున్ ధరాధిపా...(8-181)
......దానిఁదగన్ ధరించె బా
లతఁ గనుపట్టు విష్ణుని కలాపముగావునఁ దద్భుజాంతర
స్థితి కిది చాల కొప్పె గళసీమన యెంతయు గుప్తమై...(8-182)

అనుపలుకులతోఁ దెలిపియున్నది.

9. అలఘువ్రతుఁడు:—ఇతఁడు దొలుత సోమశర్మపుత్త్రుఁడైన యజ్ఞశర్ముఁడు. ఇతఁడు దండి యాజ్ఞ శిరసావహించి మహాదీక్షతో నన్నదానవ్రతమును సాగించినవాఁడు. కళాపూర్ణసభలో బాలిక విచిత్రములగు వివిధకథలను వివరించుసందర్భమున

"ఆ యజ్ఞశర్ముఁడే సు,మ్మీ యలఘువ్రతుఁడు మేదినీశ్వర! యీ పే
రా యన్నదానసువ్రత, మే యెడ విడువకునికి యపు డితనికిఁ గలిగెన్." (6-93)

అని వివరించి యున్నది. అదిగాక యీతని యలఘువ్రతత్వమునకు వేఱొక విశేషఫలము గూడఁగలదు. సూక్ష్మముగ నిదానించినచోఁ గళాపూర్ణకథ భూలోకవ్యాప్తిఁజెంది మన కెల్లరకుఁ దెలియుటకు ముఖ్యసాధన మీ యమాయికుని వ్రతదీక్షయే యని తేటతెల్లమగును. తొలుత నీకథ నెఱింగినవారు బ్రహ్మసరస్వతులు, వారి చిలుక, రంభయుఁ దక్క నన్యులు లేరు. ఒకపుడు నారదుడు మాత్రము దివ్యదృష్టిమహిమచేఁ దెలిసికొనియుండెను. వీరిలో నెవ్వరును నిక్కథ నితరులకుఁ జెప్ప కుండునట్టి నియమసంవిధాన మేర్పడినది. ఈ యలఘువ్రతుఁడు రెండేండ్లు జితేంద్రియుండై మృగేంద్రవాహనాలయమ్మున జప మాచరించి తుదకుఁ దత్ఫలముగా నత్యపూర్వమై యత్యద్భుతమై యమితానందదాయకమైన యిక్కథను వినునట్టి యవకాశమును సాధించినాఁడు. ఈతని మూలమున మన కెల్లరకును నీకథ తెలియవచ్చినది. కళాపూర్ణకథాశ్రవణమునకు ఫలములుగా నిర్దేశింపఁబడిన యైశ్వర్యము, ఆయుష్యము, పుత్రపౌత్రాదిసంపద మున్నగు వాని మాట యటుండ నిచ్చి వీని యన్నిటికంటె మిన్న యనఁదగు మహానందము ననుభవించుటలో నలఘువ్రతునితో

మనము భాగస్వాములము కాఁగలిగితిమి గాన నీ ప్రబంధమున గోచరించు పాత్రము లన్నిటిలోను నీతఁడే మన కృతజ్ఞతకుఁ బాత్రము కాఁదగిన వాఁ డనుటకు సందియము లేదు.

10. అభినవకౌముది—అప్సరసలలోఁ బదునాల్గు జాతు లుండుట మన గ్రంథములందుఁ బ్రసిద్ధము. అందుఁ జంద్రకిరణములవలనఁ బుట్టిన జాతి యొకటి కలదు. ఈమె యాజాతియం దుద్భవించినది. చూ. (6-34) (7-55). ఈమె కళాపూర్ణున కగ్రమహిషి. అతఁడు మధురలాలసను వివాహ మాడఁ దలంచినపుడు దన యగ్రభార్య ననుమతింపఁజేయుటకై ప్రథమాగమాదుల నామె కడకుఁ బంపియుండెను. ఆమె వారితో :

"చల్లఁదనముతోడ నెల్ల బంధువులకుఁ, దదుచితమధురతరగుణములఁ
జిత్తరంజనంబు చేయుట నభినవ, కౌముది యనుపేరు గలిగె నాకు" (7-54)

అని పలుకుచు, 'ఇట్టినేను వరుని యభిమతం బడ్డగింతునా' యని బదులు పలికినది. మఱియు-

"చంద్రకిరణభవాప్సరోజాతిఁ బుట్టి, యట్టిపేరొంది వెలయు నే నకట యిపుడు
తగ సతుల కెల్ల సామాన్యధర్మమైన, పతిమనోనుకూలతకును బాయఁ దెసవె." (7-55)

అని కూడ నామెయే వివరించినది. కథాంశసంబద్ధ మగు నిర్వచనపద్ధతి యటుండఁగాఁ జంద్రకిరణములవల్లఁ గలిగిన జాతికిఁ జెందియున్న యీ సతీమణి యభినవకౌముది (వెన్నెల) యగుట మిక్కిలి యుచితంబును స్వారసికంబును గదా!

సత్యలోకకథలోఁ గూడ నభినవకౌముది గలదు. చతుర్ముఖుఁడు దన కథలోనిమాటలవలన నవ్వుచున్న శారదమోముఁ జూచి,

"అభినవకౌముది యను కాంతచే నంత, వరియింపఁబడియె నవ్వారవిలాసుఁడు" (5-24)

అని పలికియున్నాఁడు. అప్పట్టున సరస్వతీముఖమును గళాపరిపూర్ణుఁడగు చంద్రుఁడుగను, నామె నవ్వును లేతవెన్నెలగను భావించి యభినవకౌముదిచేఁ గళాపూర్ణుడు వరియింపఁబడె నన్నటులు శారదాంబయే వివరించినది.

11. మదాశయుఁడు:—12 రూపానుభూతి:—

ఈ దంపతులు మధురలాలసకుఁ దలిదండ్రులు. మదాశయుఁడు హైహయవంశజుండగు భూపాలుండు. ఇతఁడు దత్తాత్రేయుల యాజ్ఞచొప్పున స్వభావసిద్ధు నన్వేషించుచుఁ దిరిగి తిరిగి తుదికి శ్రీశైలమున నతనిం గాంచి యతనితోడి పరిసంగములో నాతని కసమ్మతము లగు గర్వపుమాటలాడి తన కనర్థము దెచ్చుకొన్న ప్రబుద్ధుఁడు. ఈతని పరిమత్తచిత్తతకు మదాశయుఁ డనుపేరు మిక్కిలి యనురూప మైయున్నది.

రూపానుభూతి మధురలాలసావివాహసమయమున నతివలు గొందఱు పెండ్లికూఁతును గన్నులపండువుగ నలంకరించిరి.

సీ. "ఇట్లు కై సేసి యా యింతులు తజ్జన,యిత్రిని బిల్చి నీ పుత్రిసొబగు
లెస్సగాఁ జూడు మోలేమ! మా చూపొక, లాగు నీ చూ పొకలాగు నీవు
రూపానుభూతినా రూఢికెక్కినదాన వెవ్వరు నీపాటి యెఱుఁగలేరు
రూపవిశేషంబు రూపింప....'' (7-67) అని పలికియున్నారు.

అనఁగాఁ జక్కని రూపమును దిద్దుటలో నామె మిక్కిలి నేర్పరి యన్నమాట.

సత్యలోకకథలో మదాశయరూపానుభూతి పదములు రెండుమూఁడు తావులఁ బరామృష్టములై యున్నవి. 'నాహృదయ'మను నర్థమున మదాశయపదమును, రూపానుభవముకలది = రూపమును గ్రహించునది = దృష్టి అను నర్థమున రూపానుభూతి పదమును, అందు వ్యవహరింపఁబడినవి. ఆ యర్థములతో సంబంధముగల యచటి కథాంశముల నెల్ల వివరింపఁబూనుట గ్రంథవిస్తరహేతువు. ఆ విలాసఘట్టమునఁ జదువరులే యా యా తావులఁ బరిశీలింతురుగాక.

13. స్వభావసిద్ధుఁడు, (స్వభావుఁ డను సిద్ధుడు) ఈతఁడు సుగాత్రికి జనకుఁడు. ఆమె జనించిన వెనుక సంసారవిరక్తిఁ జెంది దేశాంతరియై దత్తాత్రేయమహాముని నారాధించి తత్కృపచే యోగవిజ్ఞానము నొంది తద్యోగాభ్యాసమున:

"భావ మెప్పుడుఁ దనయందుఁ బొదుకొలుపు, చునికిఁజేసి స్వభావాఖ్య యొనరఁ దాల్చె'' (5-132)

అని కళాపూర్ణసభలో సకలబోధనిధి యగు నబ్బాలిక వివరించినది. ఈ సిద్ధుఁడే శతతాళదఘ్నమున జలస్తంభవిద్యామహితుఁడై యుండి తన కడ కేతెంచిన శాలీనుని దన యల్లునిగా నెఱింగి యాతనికి సింహవాహనంబును, అమోఘోద్యమం బగు ఖడ్గంబును వయఃస్తంభన మణిని నొసంగినవాఁడు. మఱియు నీతఁడే కళాపూర్ణునకు నొక్క యద్భుతంపుమణిని ధనుర్బాణములను నొసంగి యుండెను.

సత్యలోకకథలో "ఆతఁడు (కళాపూర్ణుఁడు = సరస్వతీముఖచంద్రుఁడు) సద్యోయౌవనుఁడై తోడన యొక స్వభావుఁ డను సిద్ధునిచే "నూతన మొక మణియు సముద్ద్యోతితశార్ఙ్గము మెఱుంగు దూఁపులుఁ బడసెన్.'' (5-20)

అని కలదు. శారదాముఖమున మణివంటి యధరంబును ధనువును బోలిన భ్రూలతయును బాణంబులఁ బోలిన వీక్షణంబులును స్వభావంబుచేతనే సిద్ధించి యున్నవి అని పై పద్యమున కర్థము సరస్వతిచే వివరింపఁబడియున్నది.

14. ప్రథమాగమాదులు:—అలఘువ్రతుని జనకుఁడు సోమశర్మ.

"కడపటి దశయం దాతఁడు, గొడుకుఁ బిలిచి యిట్టు లనియెఁ గొడండ్రి వినవె
నహువుము నీ వెట్లైనను, విడువక మన యన్నదానవిధినియమంబున్." (6-80)

"దానను జతురాగమసంతానం బుదయించు నీకు'' అను తండ్రి యాదేశంబును దృఢతాత్పర్య

మ్మున నడపుటచేఁ దుట్టతుదికి ఋగ్యజుస్సామాథర్వములే యలఘువ్రతునికిఁ బుత్రరూపమున జనియించుట తటస్థించినది. ఆ బాలుర నామకరణసమయంబున నొక్క సంయమీంద్రుఁ డా శిశువుల యనుభావంబును దనదు విజ్ఞానదృష్టిం బరికించి వీరలు మూర్తిమంతంబులైన వేదంబులని నిశ్చయించియు జన్మాగమప్రకారంబు ననుసరించియు వరుస నన్నలువురకును బ్రథమాగమ, ద్వితీయాగమ, తృతీయాగమ, తుర్యాగమములను పేళ్లు గల్పించెను.” (6-149)

సత్యలోకకథలో బ్రహ్మముఖంబులు నాలుగును ఋగ్యజుస్సామాథర్వముల ప్రాదుర్భావంబునకుఁ గారణంబు లగుటచేఁ బ్రథమాగమాది పదములతో వ్యవహరింపఁబడినట్లు సరస్వతి వ్యాఖ్యానించినది.

15. సుగ్రహాలుఁడు—సత్త్వదాత్ముఁడు:—

సుగ్రిహాలుఁడు తొలుత మహారాష్ట్రదేశాధిపతి - రూపానుభూతికి సోదరుఁడు. మధురలాలసకు మాతులుఁడు. ఇతఁడు కులీనతాభిమానమును విడువజాలక పెక్కుచిక్కులకు లోనైనవాఁడు. ఈతనిచరిత్రము మిక్కిలి జాలిగొలుపునది. మధురలాలసకుఁగల ఉభయకులశుద్ధిని నర్మసచివుండు కళాపూర్ణునికి బోధించుసందర్భమున సుగ్రహాలుని ప్రస్తావము ప్రసక్తమయినది. అపుడు—

“జని వేళయందు నురుభా
గ్యనిమిత్తము లగుచుఁ బెక్కు గ్రహము లునికి నా
తని కిడినారఁట సుగ్రిహాలుఁ
డను పేరా శాస్త్ర మేమియయ్యెనో యెఱుఁగ” (7—45)

అను నర్మసచివుని పలుకులలో సుగ్రిహా పదనిర్వచనము, మనకుఁ దేటతెల్ల మగును.

ఈ సుగ్రిహాలుఁడు యమునాతీరమున బృందావనమ్మున దేవాలయంబున నొక యతీశ్వరుని బరిహసించి, బాల్యాదిగా నప్పటి దనుక గలిగిన జ్ఞానము నంతను గోల్పోవునట్లు శపింపఁబడి యున్మత్తుని వలె నడవులఁబట్టి తిరుగఁ జొచ్చెను. అది మొదలు బాలునివలెఁ గ్రమముగ జ్ఞానము నలవఱుచుకొనవలసిన వాఁడయ్యెను. అంతట గంసారపురవాసులు తమ కొక్క పాలకు నన్వేషించుచుండ నతఁడు గానిపించెను. ఈతనిస్వరూపము వారలకు సత్త్వదాయక మగుటం బట్టి వారలీతనికి సత్త్వదాత్ముం డని పేరువెట్టి తమ కేలికగా నియమించుకొనిరి. (8-179)

ఈ రీతిని సుగ్రిహాలుఁడే సత్త్వదాత్ముఁ డయ్యెను. ఈతఁడు క్రమముగఁ గళాపూర్ణునకుఁ దన రాజ్యము సమర్పించి యాతనికిఁ బట్టముఁగట్టి తాను మంత్రి యగుటయుఁ దటస్థించినది. తమకు మంత్రియైయున్న యాతఁడు తన మేనమామయే యని యొక్కనాఁడు హఠాత్తుగ మధురలాలసమణిహారప్రభావమున గ్రహించి తన ప్రియునకుఁ గళాపూర్ణుని కెఱిఁగించు నవసరమున నీ వివరణ మంతయుఁ దన్ముఖమున వెల్లడి యయ్యెను.

ఈ సత్త్వదాత్మపదము సత్యలోకకథలోఁ గూడ నుపాత్తమై యున్నది.

సత్త్వదాత్ముఁ డంగదేశమునఁ గ్రముకకంఠోత్తరపురమునఁ గళాపూర్ణునకుఁ బట్టము గట్టె నని (5-27) చతుర్ముఖుఁడు వచియించియుండెను.

ప్రణయకోపము శమించి సరస్వతి కొలనివైపునుండి తన ముఖమును దిరిగి చతుర్ముఖునివైపు మరల్పఁగా మణిస్తంభమునందలి ప్రతిబింబము పోవుటచేఁ గళాపూర్ణుఁడు, (ముఖచంద్రుఁడు) ఇపుడు సరస్వతీకంఠోపరిభాగముననే గానవచ్చుచుండుటవలనను నట్లు మొగమును మరల్చుట శారదాదేవి యాత్మకు సమ్మతమగుటవల్లను సత్త్వదాత్ముఁడు (సత్ + త్వద్ + ఆత్మ) కళాపూర్ణునకుఁ బట్టంబు గట్టినట్లు కల్పితమయిన దని శారదయే వివరించినది.

ఈరీతిని పాత్రముల నామములకేగాక కల్పితము లగు పురనామములకుఁ గూడ వ్యుత్పత్తులను పాత్రములచేఁ జెప్పించుదాఁక సూరనార్యునికిఁ దృప్తికలుగదయ్యెను. చూడుఁడు—

"ఈ రమ్యపరిఘునఘమను, సారపుశృంగములతోడ సాలము పద్మా
కారత నొప్పఁగ నిది కా,సారపురం బండ్రు కొలనిచాడ్పున నునికిన్" (5-102)

అని సుముఖాసత్తి వర్ణనము. ఈ పురము సుముఖాసత్తి నంతగా నాకర్షింపనిచో సుముఖాసత్తి మణిస్తంభ లప్పట్టున నా పురమ్మున వసించుట పొసంగదు. వసింపనియెడఁ గథాభాగము కుంటువడును.

"..........పురముపైఁ గంఠముల్ మించియొప్పన్
..........లేఁబోఁకమ్రాకుల్ కరం బిం
పొలయంగా దానఁగాదే యొనరఁ గ్రముకకంఠోత్తరం బండ్రు దీనిన్." (7-50)

అని నర్మసచివుఁడు తమ పురసౌభాగ్యమును గూర్చి కళాపూర్ణునితోఁ జేసిన ప్రసంగముఁ బరికించి దాని యౌచిత్యమును దిలకింపుఁడు.

ఈ రీతిగాఁ గళాపూర్ణోదయమునఁ బాత్రనామకల్పనమునకు సంబంధించిన యంశములను బ్రధానము లనుకొన్నవానిని జూపి యిప్పటి కింతటితో విరమింపఁదలంచితిని. ఇంకను సూరనార్యుని వివిధములగు దృక్పథములందలి లాలిత్యమును సుదూరము పరికింపఁగలిగితిమేని యాతని ప్రతిభాచ్ఛాయలు, కడుంగడు సుకుమారములు, మనకు గోచరించి యతివిస్మితులమై నిర్భరానందము నొందుచు నాతని మెచ్చుకొనుటకు మన మాటలు చాలక—

"బళిర శిల్పికులేంద్ర ! బ్రహ్మను మీఱి తేపగిదిఁ జేసితిర యీ ప్రతిమ ననుచు"–8-(167)

నాతని పలుకులే పదేపదే స్మృతిపథమునకుఁ దెచ్చుకొనుచు నిశ్చేష్టితుల మగుదు మనుటకు సందియము లేదు.

# కళాప్రపంచము

శ్రీ విన్నకోట వేంకటరత్నశర్మ

గీ. ఇంద్రియప్రవృత్తుల నెల్ల నిట్టడించి
మానసము నొక్కచోటనే మరుగజేసి
చిత్తచలనం బణంచి సంశీల మొసగు
నేది కళగాదు? ధాత్రిలో నెంచిచూడ?

గీ. మలినవాసన లన్నిటికి మట్టుపెట్టి
సంకుచితభావముల నెల్ల సమయఁజేసి
దివ్యదృష్టి నమర్చి, సందీప్తి నొసఁగు
నేదికళ గాదు? ధాత్రిలో నెంచిచూడ?

గీ. ఒకపరి కళాప్రపంచాన నొగి హృదయము
నకు ప్రవేశమ్ము నిడిన, వెన్కకు నెవండు
దాని ద్రిప్పంగలాడు? తద్రసనిమగ్ను
లే గదా! కవుల్, సృష్టించి రాగమములు!

గీ. జాతి, మత, కుల, భేదముల్ జాఱవిడుచు
గాదె, యే కళానుభవము గల మనీషి
గాని, అపుడె దివ్యజ్ఞానియే నతండు
అతని సేవించు వేదవాక్యములు గూడ.

గీ. చిన్నచీమలో, దోమలో, చేనిలో స్ర
వంతిలో, నింటిలో, పూలబంతిలో న
సారతంబు, కళఁ జొన్ప నాట్యరాజు
నటనఁ దెలిసినవాని జన్మకు నమస్సు!

# ఉపనిషత్తులు

శ్రీమాన్ మేదేపల్లి వేంకటరమణాచార్యుఁడు

"ప్రత్యక్షేణానుమిత్యావా యస్తూపాయో న బుధ్యతే
ఏతం విదంతి వేదేన, తస్మా ద్వేదస్య వేదతా.

(ప్రత్యక్ష ప్రమాణముచేగాని అనుమాన ప్రమాణముచే గాని యే యుపాయము తెలియబడదో యట్టి యుపాయమును దీనిచేఁ దెలిసికొందురు గాన దీనికి వేద మని పేరు.)

ఇది పూర్వభాగమని, ఉత్తరభాగ మని రెండుభాగములు. వానిలో పూర్వభాగము పరమేశ్వరుని యొక్క యారాధనప్రకారమును తెలియజేయునదియై యున్నది. ఉత్తరభాగము పరబ్రహ్మ యొక్క స్వరూప రూపగుణభూతులను సమగ్రముగాఁ దెలియజేయుచున్నది. ఉత్తరభాగమునకే 'ఉపనిషత్తు'లని పేరు.

శంకరాచార్యులవా రుపనిషద్భాష్యప్రారంభమం దుపనిషచ్ఛబ్దమున కిట్లని వ్యుత్పత్తిని వ్రాసి యున్నారు.

"సదే ర్ధాతో ర్విశరణగత్యవసాదనేషు"

అను ధాతువునకు 'క్విప్' ప్రత్యయముఁ జేర్పగా 'ఉపనిషత్' అను రూపము సిద్ధించును. ఈ శబ్దమునే యీ రీతిగా నితర గ్రంథకర్తలు వివరించియున్నారు.

"ఉపనీయ త మాత్మానం బ్రహ్మాపాస్తద్వయం యతః
నిహంత విద్యాం తజ్జంచ తస్మా దుపనిష ద్భవేత్."

శ్లో. 'నిహత్యానర్థమూలం స్వావిద్యాం ప్రత్యక్తయా పదం
నయ త్యపాస్తసంభేద మతో వోపనిష ద్భవేత్"

ఉపోపసృష్టమగు సద్ధాత్వర్థమును బట్టి చూడగా నిది సరియైన యర్థముగాఁ గానరాదు. ఈ శబ్దమునకు మఱికొందఱు వ్యాఖ్యాతలు రహస్య మని యర్థముఁ జెప్పిరి. ఉపనిషద్వాక్యప్రమాణ్యమును బట్టి విచారింపగా నిదియే యీ శబ్దమునకు సమంజసమైన యర్థమని తోఁచుచున్నది. ఉప పూర్వకమగు సద్ధాతువునకు, సమీపమందు గూర్చుండుట, యని మొదటి యర్థము. సాధారణముగా నుపదేశకాలమందు శిష్యుఁడు గురుసమీపమందు గూర్చొనియుండుట యాచారము. గురువు శిష్యుని కుపదేశించునపుడు రహస్యముగ నుపదేశించును. అందువలన నీ శబ్దమునకు కాలక్రమమున రహస్య మను నర్థము కలిగెను. ఇందుకు ప్రమాణముగా నృసింహోత్తరతాపనియందు 8 ఖండములో "బ్రహ్మ భవతి య ఏవం వేద రహస్యమ్" అని నాలుఁగుస్థలముల యందు నావృత్తమై

చెప్పబడినది. "ఇతి రహస్యమ్" అను దానికి బదులుగా "ఇత్యుపనిషత్" అనియుఁ బ్రయోగింప బడినది. తైత్తిరీయోపనిషదవసానమందు "తస్మాద్బ్రహ్మణో మహిమాన మిత్యుపనిషత్" అని యున్నది. మహానారాయణోపనిషత్తులో నధ్యాయాంతరమందు రెండుస్థలములలో "పురుష స్స నారాయణో భవతీ త్యుపనిషత్", "ఇత్యుక్త్వాపి నారాయణ స్తిరోదధే తదే త్యుపనిషత్"; అనియున్నది. ఇంకను మరికొన్ని ప్రాచీనోపనిషత్తులలో "గుహ్యాదేశః" (ఛాం; 3.-5-2) "పరమం గుహ్యమ్" (కఠ) "వేదగుహ్యోపనిషత్సుగూఢమ్" (శ్వే; 6-22) "గుహ్యోత్తమమ్" (మైత్రా; 6-20) అని గుహ్యోపనిషద్రహస్య శబ్దములు మూడును పర్యాయపదములుగఁ బ్రయోగింపబడినవి. కాఁబట్టి యిది రహస్య మగుటవలననే అనధికారులైనవారికి దీనిని బ్రకాశింప జేయకూడదని నిషేధముకూడ ననేకోపనిషత్తులలో గానవచ్చుచున్నది ఎట్లనగా:

"ఇదంవా జ్యేష్ఠాయ పుత్రాయ పితా బ్రహ్మ ప్రోవాచ
ప్రణాయ్యాం తేవాసినే నాన్యస్మై కస్మైచన" (ఛాం 3.11.3)
"వేదాంతే పరమం గుహ్యం పురాకల్పప్రచోదితమ్,
నాప్రశాంతాయ దాతవ్యం నాపుత్రాయాశిష్యాయ వై పునః (శ్వే" 6-22)

"తేషా మేవైతాం బ్రహ్మవిద్యాం వదేత శిరోవ్రతం విధివ ద్యైస్తు చీర్ణమ్ (ముం) గీతాచార్యుఁడు (3-2-10) అర్జునునికి చరమశ్లోక ముపదేశించునపుడు "ఇదం తే నాతపస్కాయ నాభక్తాయ కదాచన" అని యాజ్ఞాపించెను. ఇట్లు ప్రతి యుపనిషత్తునందు జ్ఞానోపదేశము కొఱకు తన యొద్దకు వచ్చిన శిష్యుని గురువు ప్రయత్నముతోఁ బరీక్షించి వాని యోగ్యతా యోగ్యతలఁ గనుంగొని వానికి బ్రహ్మవిద్య నుపదేశించు వాడుక గానవచ్చుచున్నది. కుపితు డైన తండ్రి నచికేతస్సును యమునికడకుఁ బంపగా నా యముఁ డాతని ననేకతుచ్ఛవరప్రదాన ములచే లోభపెట్టి నిరసింపదలంచినను వినక యతడు పట్టినపట్టు విడువనివాడై యుండుటఁ జూచి తుదకు వైవస్వతుఁడు నచికేతస్సునకు బ్రహ్మవిద్య నుపదేశించె నని కఠోపనిషత్తు చెప్పుచున్నది. దివోదాసి కుమారుఁడగు ప్రతర్దనునికడకు బోయి

"త్వమేవ మే వరం వృణీష్వ యం త్వం మనుష్యాయ హితతమం మన్యసే (కౌషీ. 13 ఆ. వ్యా) అని యడుగగాఁ దొలుత నిందుఁ డతనిని బరీక్షించి పిదప బ్రహ్మము నుపదేశించెను. ఇటులనే రైక్వుఁడు జానశ్రుతుని, సత్యకాముఁ డుపకోశలుని, బ్రవాహణు డారుణిని, ప్రజాపతి యింద్ర విరోచనులను బరీక్షించిరని ఛాందోగ్యమందును, యాజ్ఞవల్క్యుఁడు జనకుని బరీక్షించెనని బృహదా రణ్యకమందును, శాకాయన్యుఁ డిక్ష్వాకువంశపు రాజగు బృహద్రథుని బరీక్షించెనని మైత్రాయణీ యోపనిషత్తునందును జెప్పబడియున్నది. బ్రహ్మనిష్ఠులగు పూర్వపు ఋషు లందరు తమ జ్ఞాన మును గూఢముగా నుంచుకొనిరనియు, దానిని బరుల కుపదేశించునపు డుపదేష్టవ్యులఁ బరీక్షించి యుపదేశించి రనియును బూర్వోక్త కథలవలన స్పష్టమగు చున్నది. కావున పైనఁజూపిన ప్రమాణ వచనములచే నుపనిషచ్ఛబ్దమునకు రహస్యోపదేశ మని యర్థముఁ జెప్పిన బాగుగా నుండును.

ప్రతివేదముతో సంబంధించిన కొన్ని యుపనిషత్తులు కలవని లోగడ వ్రాసియున్నాను. వానిసంఖ్య నూటయెనిమిది. ఇవి యన్నియు నష్టోత్తరశతోపనిషదంతర్భూతముక్తికోపనిషత్తులో నిట్లు చెప్పబడినది.

ఐతరేయ, కౌషీతకీ, నాదబిందు, ఆత్మబోధ, నిర్వాణ, ముద్గలా, అక్షయమాలికా, త్రిపురా, సౌభాగ్య, బహ్వృచము లను పదియుపనిషత్తులు ఋగ్వేదీయములు.

ఈశావాస్య, బృహదారణ్యక, జాబాల, హంస, పరమహంస, సుబాల, మంత్రికా, నిరాలంబ, త్రిశిఖి, బ్రాహ్మణ మండల, బ్రాహ్మణాద్వయ, తారక, పైంగల, భిక్షు తురీయాతీత, అధ్యాత్మ, తార, సార, యాజ్ఞవల్క్య, కాట్యాయనీ, ముక్తికోపనిషత్తులు పందొమ్మిదియును శుక్ల యజుర్వేదీయములు.

కఠవల్లి, తైత్తిరీయక, బ్రహ్మ, కైవల్య, శ్వేతాశ్వతర, గర్భ, నారాయణ, అమృతబిందు, అమృతవాద, కాలాగ్నిరుద్ర, క్షురికా సర్వసార, శుకరహస్య, తేజోబిందు, ధ్యానబిందు, బ్రహ్మవిద్యా, యోగతత్త్వ, దక్షిణామూర్తి, స్కంద, శారీరక, యోగశిఖ, ఏకాక్షర, అక్షి, అవధూత, కఠ, రుద్రహృదయ, యోగకుండలినీ, పంచబ్రహ్మ, ప్రాణాగ్నిహోత్ర, వరాహ, కవిసంతరణ, సరస్వతీ రహస్యోపనిషత్తులు ముప్పదిరెండును కృష్ణయజుర్వేదగతములు.

కేన, ఛాందోగ్య, ఆరుణి, మైత్రాయణి, మైత్రేయీ, వజ్రసూచిక, యోగచూడామణి, వాసుదేవ, మహత్సన్న్యాస, అవ్యక్త, కుండికా, సావిత్రీ, రుద్రాక్ష, జాబాలదర్శన, జాబాలోపనిషత్తులు పదునారును సామవేదగతములు.

ప్రశ్న, ముండక, మాండూక్య, అథర్వశిరో, అథర్వశిఖా, బృహజ్జాబాల, నృసింహతాపనీ, నారద, పరివ్రాజక, సీతా, శరభ, మహానారాయణ, రామరహస్య, రామతాపనీ, శాండిల్య, పరమహంస పరివ్రాజకా, అన్నపూర్ణా, సూర్యాత్మా, పాశుపత, పరబ్రహ్మ, త్రిపురా, తపన, దేవీభావనా, బస్మ, జాబాలగణపతి, మహావాక్య, గోపాల, కృష్ణ, హయగ్రీవ, దత్తాత్రేయ, గారుడోపనిషత్తులు ముప్పది యొకటి అథర్వవేదములో జేరినవి.

మన మీ యుపనిషత్తులను విమర్శనసౌలభ్యమునకై నాలుగు తరగతులుగ విభజింపవచ్చును.

(1) ఛందోబద్ధములైనవి:— కఠోపనిషత్తు, ఈశావాస్యము, శ్వేతాశ్వతరము, ముండకము, మహానారాయణము మొదలగునవి.

(2) వచనరూపముగా వ్రాయబడిన ప్రాచీనోపనిషతులు:— ఛాందోగ్యబృహదారణ్యకములు, తైత్తిరీయము, ఐతరేయము, కౌషీతకి, కైనోపనిషత్తు.

(3) వచనరూపమైనవి—నవీనోపనిషత్తులు:— ప్రశ్న మైత్రాయణీయ, మాండూక్యోపనిషత్తులు.

(4) నవీనోపనిషత్తులలో మహోపనిషత్తు, యోగశిఖ మొదలగునవి శ్లోకరూపముగా నున్నవి.

ఈ నవీనోపనిషత్తులలో బ్రహ్మవిద్య, క్షురిక, నాదబిందు, బ్రహ్మబిందు, అమృతబిందు, ధ్యాన బిందు, యోగశిఖ, యోగతత్త్వహంస మొదలగునవి యోగమును బ్రతిపాదించునవి. అథర్వ శిరస్సు, అథర్వశిఖ, నీలరుద్ర, కాలాగ్నిరుద్రకైవల్యోపనిషత్తులు రుద్రపరములు. మహానారాయణ, ఆత్మబోధ, నృసింహతాపని, రామతాపని విష్ణుపరములు; బ్రహ్మసన్న్యాస, ఆరుణేయ, కంఠశ్రుతి, పరమహంస, జాబాల, ఆశ్రమోపనిషత్తులు సన్న్యాసమును బోధించును. ముండకోపనిషత్తులోని మంత్రములు కొన్ని మహానారాయణమందును, శ్వేతాశ్వతరమంత్రములు కొన్ని ముండకోపనిషత్తునందును బఠింపబడియున్నవి. ఇందువలన నీ యుపనిషత్తులలో గొన్ని ప్రాచీనములని కొన్ని నవీనములని మన మూహించుకొనవలయును. శ్వేతాశ్వతర పంచమాధ్యాయములో నున్న

"తద్వేద గుహ్యోపనిషత్సుగూఢం, తద్బ్రహ్మ వేద తే బ్రహ్మయోనిమే
యే పూర్వదేవా ఋషయశ్చ తద్విదు,స్తేతన్మయా అమృతా వై బభూవుః".

అను మంత్రమందు వేదగుహ్యోపనిషత్తులో గూఢముగా నున్న యీ పరబ్రహ్మను పూర్వపు దేవతలు ఋషులు తెలిసికొని తన్మయులై మోక్షము నొంది రని చెప్పుటచే మన మెఱుగనివాని కంటె బ్రాచీనతరములగు కొన్ని యుపనిషత్తు లున్నట్లు తలంపవలయును.

"వేదాన్తవిజ్ఞాన సునిశ్చితార్థా, స్సన్న్యాసయోగా ద్యతయ శ్శుద్ధసత్వాః
తే బ్రహ్మలోకే తు పరాంతకాలే, పరామృతాః పరిముచ్యంతి సర్వే (ముం. 3-26)

ఈ శ్రుతి మహానారాయణోపనిషత్తులోను (10-22) కైవల్యోపనిషత్తులోను బఠితమై యున్నది. ఈ యుపనిషత్తు లన్నియుఁ బరబ్రహ్మతత్త్వమునే ప్రతిపాదించునని మైత్రాయణ్యుపనిషత్తులో ద్వితీయప్రపాఠమందు "అథ ఖల్వియం బ్రహ్మవిద్యా సర్వోపనిషద్విద్యా వా రాజ న్నస్మాకం భగవతా మైత్రేయేణ వ్యాఖ్యాతా" అని చెప్పబడినది.

ఈ యుపనిషత్తు లన్నిటిలో ఈశ, కేన, కఠ, ప్రశ్న, ముండ, మాండూక్య, తైత్తిరీయములు ఛాందోగ్య బృహదారణ్యకములు కౌషీతకి, సుబాలోపనిషత్తు, ఐతరేయము, శ్వేతాశ్వతరము నను నివి ప్రధానములు. మతత్రయ భాష్యకర్తలు వీనినే ప్రమాణముగ బరిగ్రహించి బ్రహ్మసూత్రములకు భాష్యములు వ్రాసియున్నారు. బ్రహ్మసూత్రముల కివియే విషయము. సకలోపనిషద్వాక్యజాతమును పరబ్రహ్మమందు జక్కగా సమన్వయించు నను నంశము "తత్తు సమన్వయాత్" అను సూత్రముచే చెప్పబడినది.

పూర్వోక్తములగు నూట యెనిమిది యుపనిషత్తులలోను బ్రధానముగా ఈశ, కేన, కఠ, ప్రశ్న, ముండ, మాండూక్య, తైత్తిరీయములు, ఛాందోగ్యబృహదారణ్యకములు ఐతరేయము నను నీ దశోపనిషత్తులును, శ్వేతాశ్వతరము, కౌషీతకి మొదలుగాగల మరి రెండు మూడును బ్రహ్మవిషయముగా మతత్రయసూత్రభాష్యకర్తలు వాడియున్నారు.

# శివతాండవం

శ్రీ బొడ్డు బాపిరాజు

కైలాస శైల శిఖరము
లాలో కిలకిలను నవ్వినటు, లభ్రధునీ
వేలావని నినదించెను;
నీలగళోచ్చరణకింకిణీనిక్వణముల్.

ప్రమథ ప్రౌఢ పరిక్రీడాయా మధురస్వైపథ్యానుసంధాన వి
శ్రమముల్, హైమవతీ దరస్మిత పురస్కారానుమోదా లుప
క్రమశంసత్ప్రియనందికేశ్వరమృదంగధ్వానముల్ పొల్చె చి
త్రములై ఆ మలుపచ్చిసంజ శివనృత్యారంభసంరంభముల్.

ఆ సర్వేశ జటాభరమ్ములు - వియద్వ్యాప్తమ్ము - లంత స్తప
శ్శ్రీ సంజాత శిఖాసఖమ్ము లయి వెల్గెన్; సాంధ్య కిమ్మీరశో
భాసంపృక్తము, స్వామి దేహమపు డభ్యాసించె నుద్యోతితా
శాసర్వస్వము లైన హేమహిమవచ్ఛైలాగ్రవాల్లభ్యముల్.

నర్తించెన్, త్రిపురారి విస్ఫురితచంద్రాంశుప్రపాతామృతా
వర్తమ్ముం బలె; అంత నంతరితశంపావల్లరీవిభ్రమ
స్ఫూర్తిన్, పిమ్మట నొక్క దీర్ఘతర తేజోరేఖయై తత్ప్రభా
మూర్తిప్రోజ్జ్వలితం బజాండము సితాంభోరుట్పృషత్కమ్ముగా.

అలకౌమారమయూర తాండవ రహస్యాధ్యాపకమ్మున్, ముహు
శ్చలదాభోగఫణీంద్రభోగమణి భాస్వంతమ్ము, నుద్యత్కళా
కలశాబ్ధి స్ఫుటవేలగా నిజశిరఃఖండేందు నిస్తంద్రశో
భల నర్తించె పురారి, హారిగిరిజాపాంగప్రతిస్పర్ధియై.

కలికావ్యాజమునన్, పృషచ్ఛలమునన్, కాంతివ్యళీకమ్మునన్
పులకించున్, చెమరించు, కంపమును పొందున్ మ్రాకులే; మబ్బులే
మలలే; ఒక్క మహానుభూతి నఖిలంబా చేతనాచేతన
మ్ములు మేనుల్ మఱచెన్, సబాష్పవదనమ్ముల్ శైవలాస్యమ్ములో.

ఉదితానంద విముగ్ధ పారిషద 'సాహో!' నాదమంద్రశ్రుతిన్
కెరలెన్ మన్మథవిద్విషత్పటహసిక్వాణమ్ము, లుద్భూత బు
ద్బుద లీలావలయమ్ములై - విరిసి మార్మ్రోసెన్, ద్విధా - వార్ధినీ
రదనిశ్రేణి, రసాతలత్రిదివపౌర స్తోత్రపాఠక్రియన్.

గరళగ్రీవ నటజ్జటాపటల వల్గద్గాంగ కల్లోల శీ
కర ముక్తాఫలమాల నీలజలదాకాశమ్మునన్ చిందు, సుం
దరతారావళిగా వెలింగి, సురకన్యల్ స్వామి పైఁ జల్లు క్రొ
వ్విరులన్ జారు మరంద బిందువుల సేవించెన్ మహాదేవునిన్.

అతి రమ్యమ్ములు రాజతాచల విశాలాధిత్యకల్ పార్వతీ
పతి నృత్యత్పద పారిజాతముకుళస్పర్శన్ ప్రమోదాశ్రు సం
గత రోమాంచములై చిరంతనతనూ కాఠిన్యముల్ మాసి, మా
నితపుష్పాతిమృదుత్వముం గనె భవానీజాని కక్లిష్టతన్.

చూడాలంకృతచిత్రరత్నరుచిరింఛోళిప్రథన్ తాండవ
క్రీడాకుంచిత కృత్తివాస చటు లాంఘ్రిచ్ఛాయ లంతంత పా
రాడెన్ తద్గిరిశృంగసీమ; పతి సాలప్రాంశువై వెల్గు రా
పాడ న్నిల్చెను, వజ్రనిర్మిత మహాభ్రచ్ఛత్రదండమ్ముగా.

అమృతవ్యూథమొ, రౌప్యభూమిధరమో; ఆలోల కల్పద్రుమ
క్రమమో, నాథుని నృత్యమో; నవసువర్ణాబ్జావదాతావతం
సమొ, జాబిల్లియొ; తత్కృతస్మితములో, సౌరాపగావాస్తుపా
ఠములో యేర్పడవయ్యె నంతవర కౌరా! సర్వశుక్లద్యుతిన్.

పతినృత్యాంతము నందుపో జరఠసర్పస్వామి నిట్టూర్చి, వై
ద్యుత తత్పాద నఖాగ్రి పాతనిపత ద్భ్యాభార సంస్థాపనా
నత శీర్షమ్ములు వేయియున్ నిలుపుకోనయ్యెన్; జగన్మోహనా
ద్భుత రేఖన్ గనుపట్టె ఆ స్తిమిత శంభుస్వచ్ఛసౌందర్యముల్.

అనిమేషత్వము నొంది ప్రత్యణువు దివ్యంబై తతఃపూర్వ న
ర్తనవీక్షాసుఖలుబ్ధమై తెలియలే దా తాండవం బంత ని
ల్చినకానీ, తనలోనె యెడంద విభు డట్లే యాడుచున్నట్లు కాం
చెను, మోదించెను పో మ్మ దెంతటి తపశ్శ్రీయో! రసోద్రేకమో!

ఒక విద్యున్మణిమేఖలాబ్దశకలం బుల్లాభమై స్వామిపై
ప్రకటించెన్ తనభక్తి, ఒక్కచపలాప్రస్ఫుటప్రయోవాహ మూ
రక చిల్కించిన దంబువుల్ కుసుమవర్షప్రాయముల్, లే మొయి
ళ్లోకరెం డా ప్రభుసేవకై నవి యొడల్లూగించి వింజామరల్.

మధుమందానిలముల్ సమస్త ఋతుసంపత్పుష్ప సౌరభ్య సా
రథులై వీచి శ్రమాపనోదనవిధాప్రస్ఫూర్తి రంజించె న
వ్విధుచూడామణి మానసమ్ము; దివిషద్బృందమ్ము లే పూర్వపు
న్గథలో పాడి యొనర్చు సన్నుతుల కన్నన్ మిన్నగా నర్తనిన్.

'ఆనందామృత సేకమై, సకలలోకాతీతమై వెల్గు లీ
లానృత్య న్మధురస్వరూప మిది నిల్పంగ లే, మనల్పవ్యథా
లీనం బీ హృదయంబు నం' దనుచు నార్తిన్ దేవతాశ్రేణి ఈ
శాన శ్రీనఖపంక్తులన్ చిలికె కెంజాయల్ కిరీటప్రభన్.

అటు నటనానిరీక్షణమునం దవశమ్మయియున్న డెంద ము
త్కటపటహస్వనమ్మున పదంపడి తేరుకొనన్ భవాని చెం
గట కరుదెంచి భర్తృచరణాబ్జములన్ రవణించు గజ్జె లం
తట కుతుకమ్మునన్ తనకు తానయి విప్పె నమస్క్రియామిషన్.

నిలుడంచున్ తొలి నమ్మహానటునకున్ నీరాజనం బెత్తి, సే
సలు పై జల్లిరి సప్తమాతృక లుమేశప్రీతికై నందికే
శుల కన్సన్నల చిత్రచిత్రనటనాస్తోమమ్ము కల్పించి. వా
రల నర్పించిన దంతలో ప్రమథవర్గం బుత్సవవ్యగ్రమై.

పతి కేలూత యొసంగ నున్నత వృషస్కంధమ్మునందుండి స
స్మితదృష్టిన్ దిగు పోల్కి భూధరతటీశృంగాగ్ర మందుండి సం
చిత సర్వప్రమథావృతుం డగుచు విచ్చేయంగ నచ్చో జగ
త్త్రితయమ్మున్ జయవెట్టె శంకరు నుమాదేవీసమేతమ్ముగన్.

*　　　　　　*

అని యేమో రచియించు నా కనులయం దశ్రుప్రవాహమ్ము లూ
రెను! నేనే రజతాద్రినై విభుని యంఘ్రిచ్ఛాయ నా యీ శిర
మ్మును కై వ్రాల్చిన యట్టు లయ్యె, తను వుప్పొంగెన్, ఎదో జ్యోతిలో
నను నర్తించె; వచింపలే నపుడు జ్ఞానాజ్ఞానమధ్యస్థితిన్.

ఏచిరకాల భవమ్మున
చూచినదో శివునిసాంధ్యసుందరనృత్యం
బీ చిన్ని యెడద దాగి అ
యాచితమై యిటు తనంత నాకృతి నిలిచెన్.

# ఎల్లనార్యుని రాధామాధవము

శ్రీ పిల్లలమఱ్ఱి వేంకట హనుమంతరావు

సామ్రాజ్య పీఠముతో సమానముగ సాహితీపీఠము నలంకరించి, యాంధ్రకవులఁ బోషించి, భాష కపరిమితోపకార మొనర్చి, యాంధ్రభోజుఁడని ప్రఖ్యాతిఁ గనిన శ్రీకృష్ణ దేవరాయల సమకాలికుఁడే రాధామాధవ కృతికర్త యైన చింతలపూడి యెల్లనార్యుఁడు. ఈ గ్రంథమును రచియించి రాయలవలన "రాధామాధవ కవి" యను బిరుదనామమునందిన ట్లీ పద్యమునందు గలదు:

'రాధామాధవ మచ్యుతాంకితముగాఁ బ్రౌఢక్రియం జెప్పి త
న్మాధుర్యంబునఁ గృష్ణరాయవిభుఁ గర్ణాటేశు మెప్పించి నా
నాధాత్రప్రతిమానసత్కవులలోనన్ భూషణశ్రేణితో
రాధామాధవనామ మందిన జగత్ప్రఖ్యాత చారిత్రుఁడన్.' (ఆ. 1. ప. 30.)

విష్ణుమాయానాటక తారక బ్రహ్మ రాజీయము లితని యితరగ్రంథములు. కేవల రాధామాధవమునుగూర్చియే యీ వ్యాసమునఁ బ్రసక్తి కలదు.

పురాణేతిహాస కావ్యాది గ్రంథములం దెచటఁ జూచినను రాధ పరకీయగానో, కృష్ణునిమేనత్తగానో వలఁపుగత్తెగానో కానవచ్చును. కాని, యీ రాధామాధవమందు మాత్రము రాధాకృష్ణులకు దాంపత్య సంబంధము కల్పించి, యెల్లనార్యుఁడు తన ప్రబంధమును నిర్మించినాఁడు. ఇట్టి కథ జయదేవుఁడు చెప్పినట్లు తన పద్యములో జెప్పినాఁడు:—

'నుతియింతు వాగ్విశేష
స్థితి రాధామాధవంబు చెప్పిన విద్యా
చతురాననుఁ నీలాచల
పతి హితు జయదేవ సుకవిపంచప్రదరున్.' (ఆ. 1. ప. 10.)

ఈజయదేవుఁడు గీతగోవిందకారుఁ డనుటకు వీలులేదు. ఏలయన గీతగోవిందమం దిట్టి భార్యాభర్తృ సంబంధ ముగ్గడింపఁ బడలేదు. వేఱొక సంస్కృత గ్రంథము, దీనికి మూల మనదగునది యున్నట్లు లేదు.

సామాన్యముగాఁ బూర్వకవుల గ్రంథముల నుత్తరోత్తరకవులు, శైలియందుగాని, పాత్రసృష్టియందుగాని, కథాసంవిధానమందుగాని యాదరముతో ననుసరించుట ప్రాజ్ఞలోకవిదితమే. ఈ రాధామాధవకవి యీ సూక్తికి దూరస్థుఁడు గాఁడు. ఈ కవికాలమునాఁటికిఁ బోతన కృతభాగవత మనేకస్థలములందు, సభలలోఁ బురాణమువలెఁ బఠితమగు చుండు ననుట సత్యదూరము కాదు.

నిజముగాఁ బండితులకే కాక, పామరులకు సైత మందలి కొన్ని పద్యములు కంఠస్థములై యుండు ననియుఁ దలఁపనగును.

ఆంధ్ర బాలబాలికలచే నెక్కములతో పాటుగా భాగవతమందలి రుక్మిణీకల్యాణ, గజేంద్రమోక్షములు, ముఖ్యముగా వల్లె వేయించు నాచారము నేఁటికిని వీధిబడులలో నున్నది. పోతనకు నూరు సంవత్సరముల తరువాత వచ్చిన యెల్లనార్యుఁడు సైత మావిధముగాఁ బోతనకు పరిచితుఁడై యుండుటలో సందేహము లేదు. దానికి దృష్టాంతముగా నీ రాధామాధవప్రబంధము వెలసినది. శ్రీనాథుని సమకాలికులలోఁ బోతన ప్రథముఁడు; చిత్రముగాఁ గృష్ణరాయల సమకాలికులలో నెల్లనార్యుఁడు ప్రథముఁడు.

ప్రబంధకవులు పురాణేతిహాసములలో నే యుపాఖ్యానములనో గ్రహించి, స్వకపోలకల్పనలతోఁ బెంచి వర్ణనలతోడను, పాత్రపోషణముతోడను మఱింత పొడిగించి రచనలఁ జేయుట సుస్పష్టమే నాయికానాయకులమధ్య కనుకలివలననో, వినుకలివలననో పరస్పరానురాగము జనించుట, వియోగముచే వర్ధిల్లుట, యుపనాయకు శిక్షచే నుద్దీపింపఁబడుట, తుదకు సంయోగము సంఘటిల్లుటలు ప్రబంధకన్యయొక్క యవయవములు. ప్రబంధముల కాదరణ మున్నయాదినములలో నెల్లనార్యుఁడు సైత మా మార్గమునే త్రొక్కుట యబ్బురము కాదు.

పోతనవలె నెల్లనార్యుఁడు తన గ్రంథమును మహీశ్వరున కీయక, తన యిష్టదైవ మగు మదనగోపాలున కంకిత మొనర్చెను. ఈ రాధామాధవ కథావిధాన మంతయు రుక్మిణీకల్యాణ ప్రణాలిక ననుసరించి వేసినట్లున్నది; దీని నారయుదము:—

రుక్మిణీకల్యాణములో రుక్మిణి తన తండ్రి గేహమునకుఁ జనుదెంచుచున్న యతిథిజనులవలనఁ గృష్ణుని రూప బలగుణాదులు విని యతనియం దనురక్త యగును. అట్లే రాధ ముదంబున మదనగోపాల లీలారూప లావణ్య తేజోగుణంబులు కర్ణభూషణంబులుగా బోటికత్తియలవలన విని మోహపరవశత జెందె. రుక్మిణీకల్యాణమందలి బ్రాహ్మణు రాయబారమునకు సరిగా రాధామాధవమునందు జిలుక రాయబారము నడుపును. భీష్మకుఁడు తన కూతు రుక్మిణిని గృష్ణునకీ నెంచెను గాని, పుత్రుఁడగు రుక్మి తిరస్కరించి, ప్రతిపక్షమును బూనెను. అట్లే సహస్రగోపుఁడు తన కూతు రాధను గృష్ణునకీ నిశ్చయింపఁ బుత్రుఁడగు భద్రకుఁ డడ్డగించెను. బాలిక నెత్తుకొని పోవునపుడు శత్రురాజు లెదుర్కొన్న వారి మార్కొని, బావమఱదిని భంగపఱుచుట రెంటను సమానమే. అటుపిమ్మట కల్యాణమహోత్సవము జరిగినట్లు కథాసంవిధాన మందీ రెండిటి పోలికలు కలిగియున్నవి.

ఇఁకఁ బద్యరచనయందు సైతము పోతన మఱపు రాకుండుటయు విశేషమే! చూడుఁడు:—

'మకుటోద్యన్నవరాజకందళముతో మందస్మితోదారర
మ్యకపోలస్థలదర్పణద్వయముతో మాణిక్య వీణాస్వర
ప్రకటోన్మీలితలోలపక్ష్మములతోఁ బ్రత్యక్షమై...' (1 ఆ. 35 ప.)

"జలజాయతాక్షు వక్షస్థ్సలిఁ జేర్పని
కుచములు కుచములే కోమలాంగి
నందజు సౌందర్యకందళుల్ చూడని
కన్నులు కన్నులే కలువకంటి
పద్మనాభునిపాదపద్మముల్ సోఁకని
కరములు కరములే కంబుకంఠి
దేవకీసుతుని వాతెఱ చవి చూడని
నాలుక నాలుకే నాగయాన
యచ్యుతున కెప్పుడును గొల్లలాడ నీని
జవ్వనము జవ్వనమె పూర్ణచంద్రవదన!
గోపకుల సార్వభౌముని గోష్ఠిఁ గనని
పడతి జన్మంబు జన్మమే పల్లవోష్ఠి." (2 ఆ. 75 ప.)

'వచ్చెఁ గృష్ణుఁడు నీ ప్రాణవల్లభుండు, మెచ్చె నీ మాటలకుఁ జనవిచ్చె నెలమి
నేలుకొమ్మింక నా జగదేకవరుని, బాలికాలోకచూళికాభరణమూర్తి' (ఆ. 3-158 ప.)

'పూరించెన్ హరి పాంచజన్యము జగత్పూర్ణప్రభాధన్యముజ్
ధీరధ్వానకుతారలూన దనుజస్త్రీ స్మారముద్వన్యముజ్
దూరీభూతసురేంద్రముఖ్యసురచేతోజాత దుర్దైన్యముజ్
దారాధీశసహస్రమండలమహోద్యత్కాంతి సన్మాన్యమున్' (4 ఆ. 32 ప.)

ఇట్లు రచనయందు, భావమందు నీ యెల్లనార్యుని పద్యములు పోతనార్యునిపద్యములం దలఁపించుచుండును.

పాత్రముఖములం బార్థనాపద్యముల నెన్నేని భక్త్యావేశమునందు రచించుట పోతనవలె నీతనికిని గలదు. 'వల్లకీవల్లభా' యను మకుటముతో వ్రాసిన పద్యములే యిందు కుదాహరణములు.

ఈ రాధామాధవమున నీ విధముగా, కథాప్రణాళికయందు, శైలియందు, భావములందు రుక్మిణీకల్యాణచ్ఛాయ లెక్కుడుగా గాన్పించుచున్నవి. క్వాచిత్కముగా *నితర పూర్వకవుల రచనాచ్ఛాయ లున్న నుండవచ్చును. కాని, యా ఛాయ లన్నియు నత్యంతగాఢనీలాంబువాహుని కౌగిట నణగి పోవుఁట్టివే!

---

* విమర్శాదర్శక శ్రీ నడకుదుటి వీరరాజుగారు రాధామాధవమును సూరనగారి ప్రభావతీప్రద్యుమ్నముతోఁ బోల్చిరి.

# మార్గదేశీ వస్తు కవిత్వములు

శ్రీ దివాకర్ల వేంకటావధాని

మార్గదేశీ శబ్దములు సంస్కృతభాషలో సంగీతవిభేదములుగను, నాటకోపకారకములైన నృత్యనృత్త పర్యాయములుగను గానబడుచున్నవి. కాని వాని నా భాషలో నెవ్వరును గవిత్వ విభేదములుగా వాడియుండలేదు. ఆంధ్రకవులలోఁ బ్రాచీనుఁడైన నన్నెచోడుఁడు తన కుమార సంభవమునందు మార్గదేశీకవిత్వములను బేర్కొని వానినిగూర్చి యించుక ప్రస్తావించియుండెను. ఈ కవితాభేదముల యథార్థస్వరూపమును స్పష్టముగా నెఱుంగుటకుఁ దగిన యాధారములు లక్షణ గ్రంథాదులలో లేనందున నీపదములు సంగీతపరములుగను, నృత్యనృత్తపరములుగను నే యర్థమున వాడఁబడియుండెనో యెఱింగి, యా యర్థమును గవితాపరముగఁ గూడ సమన్వయించి, నన్నెచోడుని యభిప్రాయమునకును దానికిని గల సామ్యవైషమ్యములను బరిశీలింపవలయును.

“గీతవాద్య నర్తనములు మూఁడును సంగీతమని చెప్పబడును. ఈ సంగీతము మార్గము, దేశి యని రెండువిధములు. బ్రహ్మచే నన్విష్టమై, భరతునిచే నీశ్వరసమక్షమునఁ జెప్పఁబడినదియు, విముక్తిద మైనదియు మార్గము. వివిధదేశములందుఁ దత్తద్దేశస్థమైన రీతిచే లోకమును రంజింపఁ జేయు సంగీతము దేశి[1]” అని సంగీత దర్పణమునందుఁ జెప్పబడియున్నది. దీనినిబట్టి బ్రహ్మాదిదేవతలకును భరతాదిమునీంద్రులకును నాస్వాద్యమై యేకైకరూపమై మోక్షమునకు దారిచూపు నుత్తమ సంగీతము మార్గమనియు, నా యా దేశములందలి సామాన్యజనులకుఁగూడ సుబోధమై వారిని రంజింపఁజేయు వివిధరూపకమైన సంగీతము దేశి యనియుఁ దెలియుచున్నది; అనఁగా విజ్ఞానవంతులైన విద్వాంసులకు మాత్ర మాస్వాద్యమై ముక్తియను నుత్తమప్రయోజనము లక్ష్యముగాఁ గలది మార్గము; సామాన్యజనులకుఁగూడ నాస్వాద్యమై మనోరంజనమాత్ర ప్రయోజనమైనది దేశి. వాల్మీకి రామాయణబాలకాండమునందలి చతుర్థసర్గలోని తుదిశ్లోకమునఁ గుశలవులు పితృవచఃప్రచోదితులై మార్గవిధానసంపదచే రామాయణమును బాడిరని చెప్పఁబడినది.[2] వాల్మీకి శిష్యులును సంగీతవివేకనిధులును నైన యా కుమారు లచ్చటి మునులకును రామాదులకును సుబోధమైన యుత్తమమార్గపద్ధతిని రామాయణమును గానము చేసిరని దాని భావము.

---

1. గీతం వాద్యం నర్తనంచ త్రయం సంగీత ముచ్యతే; మార్గదేశీ విభాగేన సంగీతం ద్వివిధం మతం, ద్రుహిణేన యదన్విష్టం యదుక్తం భరతేనచ, మహాదేవస్య పురత స్తన్మార్గాఖ్యం విముక్తిదం, తత్తద్దేశస్థయా రీత్యా యత్స్యాల్లోకానురంజనం, దేశే దేశేతు సంగీతం తద్దేశీత్యభిధీయతే.

2. తతస్తు తౌ రామవచః ప్రచోదితా వగాయతాం మార్గవిధానసంపదా. (రామా. బా. ౪-౩౦.)

ఇంక నాట్యవిషయమున నీ శబ్దముల ప్రయోగ మెట్లున్నదో పరిశీలింతము. ధనంజయుఁడు దశరూపకమున నాటకాద్యంగములైన నృత్యనృత్తములనుగూడఁ బ్రసంగవశమున నిర్వచించెను. నాట్య, నృత్య నృత్త శబ్దములు మూఁడును 'నృత్' ధాతువునుండి యేర్పడినవే యైనను ఆవశ్యకమని తోఁచుటచే నాతఁడు వానికి స్వల్పభేదములను సూచించెను. "భావాశ్రయమైన నృత్యము నాట్యముకంటె భిన్నమైనది. తాళలయాశ్రయము నృత్తము, పదార్థాభినయమైన మొదటిది (నృత్యము) మార్గము. రెండవది దేశి.'' యని యతఁడు చెప్పిన వాక్యములు.[3] భావనిర్భరమును, నభినయము ద్వారా పదార్థవ్యక్తి కలిగించునదియు నగు నంగవిక్షేపము మార్గాపరనామకమైన నృత్యము. పరిణతబుద్ధులైన విద్వాంసులే యిందలి యభిప్రాయమును గ్రహించి రంజిల్లుదురు. ఇది యుదాత్తమైన నాట్యపద్ధతి. దీనిని ప్రొఫెసరు హాస్ 'హై స్టైల్' (High Style) అని యాంగ్లీకరించెను. దేశీపర్యాయకమైన నృత్తము భావాశ్రయము కాదు. అది తాళలయాశ్రయము. తాళాదులయొక్కయు నంగవిక్షేపములయొక్కయు సామరస్యముచేఁ గుదురు లయ యించు రంజించును. ఇది పండితులనేకాక సామాన్యులనుగూడ రంజింపశక్తి కలది. హాస్ దీని నాంగ్లమున 'పాప్యులర్ స్టైల్' (Popular Style) అని వాక్రుచ్చెను.

ప్రతాపరుద్రీయమున విద్యానాథుఁడు నృత్యనృత్తముల నెడనెడ సమానార్థకములైన పర్యాయపదములుగనే వాడినను నాటకప్రకరణారంభమున దశరూపకము ననుసరించి వానిని వేఱువేఱుగా నిర్వచించియుండెను. రసాశ్రయమైనది నాట్య మనియు, భావాశ్రయ మైనది నృత్యమనియు, తాళలయాన్వితమైనది నృత్త మనియు నాతఁడు వాక్రుచ్చెను.[4] దీనికిఁ గుమారస్వామి రసవిషయమును సాత్త్విక బహుళమునైనది నాట్యమనియు, భావవిషయమును, నాంగికబహుళమును, మార్గాపరపర్యాయమును నైనది నృత్యమనియుఁ, దాళలయాశ్రయమును దేశ్యపరపర్యాయమును, స్వకపోలకల్పనాశూన్యమును నైనది నృత్తమనియు వ్యాఖ్యానము చేసెను. విద్యానాథుఁడు ధనంజయుని నీ విషయమున నతిసన్నిహితముగా ననుసరించి యుండుటచే మార్గదేశీపదముల విషయమున నీతఁ డిచ్చిన భిన్నవివరణ మేమియు లేదు. కాఁగా నుదాత్తమైన నాట్యపద్ధతి మార్గమనియు సామాన్యపద్ధతి దేశి యనియు నితఁడుకూడ నభిప్రాయపడి యుండెనని చెప్పవచ్చును.

మార్గదేశీ శబ్దములు సంగీతనాట్యములలో వాడఁబడిన సందర్భములనుబట్టి, యేకరూపమై పండితైకవేద్యమై యుదాత్తమైన పద్ధతి మార్గమనియు, భిన్న దేశములందు భిన్నరూపములు వహించి సులభ మగుటచే సర్వజనవేద్యమైన పద్ధతి దేశి యనియు వ్యక్తమగు చున్నది. దీనిని గవిత్వము నెడ సమన్వయించి చూచినచోఁ బండితైకవేద్యమై సర్వదేశములం దేకైకరూపముతోఁ బొల్చు

• అన్యద్భావాశ్రయం నృత్యం, నృత్తం తాళలయాశ్రయం, ఆద్యం పదార్థాభినయో మార్గో దేశీ తథాపరం.
నాట్యం రసాశ్రయం,
భావాశ్రయంతు నృత్యం స్యా న్నృత్తం తాలలయాన్వితం.

సంస్కృతకవిత మార్గకవిత యనియు, నాంధ్రతమిళాదిదేశములలో భిన్నరూపముల వెలసిన యాంధ్రతమిళకవిత్వములును సంస్కృతజన్యములైన వివిధదేశముల వివిధరూపములఁ బొందిన ప్రాకృతభాషలయందలి కవిత్వమును దేశికవిత్వ మనియుఁ దేటతెల్ల మగును.

నన్నెచోడుఁడు తన కుమారసంభవమున:

> "మును మార్గకవిత లోకంబున వెలయఁగ దేశికవిత పుట్టించి తెనుం
> గు నిలిపి రంధ్రవిషయమునఁ, జన సత్యాశ్రయునిఁ దొట్టి చాళుక్యనృపుల్"

అని యంతకు మున్ను లోకమున మార్గకవిత్వము విస్తరిల్లఁగా దేశికవిత్వమును బుట్టించి సత్యాశ్రయుఁ డాదిగాఁ జాళుక్యరాజు లాంధ్రదేశమునఁ దెనుంగు స్థాపించి రని వాక్రుచ్చెను. సంస్కృతకవిత్వము లోకమున వ్యాపించియుండఁగా సత్యాశ్రయుఁడు మొదలైన చాళుక్య రాజులు తెనుఁగుకవిత్వమును గూడ వెలయఁజేసిరని దీని కర్థము చెప్పవచ్చును. తరువాతి పద్యమున నన్నెచోడుఁడు "విస్తరమతులం బురాణకవిసంఘము నుత్తమమార్గసత్కవీశ్వరులను దేశిసత్కవులను" సంస్తుతిచేసి యుండెను. ఇందలి పురాణకవులు వ్యాసాదులనియు, మార్గకవులు కాళిదాసాదులైన సంస్కృతకావ్యకర్తలనియు, దేశికవులు నన్నెచోడునికి సమకాలికులై విస్మృతులైన శైవ కవు లనియు మన మర్థము చేసికొన్నచో పైయర్థమున కెట్టి భంగమును గలుగ నేరదు. అనఁగా నీపద్యమున నన్నెచోడుఁడు తనకుఁ బూర్వులైన సంస్కృతాంధ్రసత్కవులను నియమానుసారముగా నుగ్గడించియుండె నన్న మాట. కాని కావ్యమున నంతకుమున్నే పురాణకవులను, గావ్యకర్తలను వేరువేరుగా స్తుతించియు నాతఁడు మరల నిచ్చట వారిని నుతింపనేల యని యెవ్వరైనఁ బ్రశ్నింపవచ్చును. నన్నెచోడుఁడు తన కావ్యమున ముందు శంకరాదిదేవతలను, తరువాతఁ దన గురువైన మల్లికార్జునునిపాదములను, పిమ్మట వ్యాసవాల్మీకులను, దదుపరి కాళిదాస భారవ్యాదులను గ్రమముగా స్తుతించి యటుపై దేశికవిత ప్రస్తావము తెచ్చెను. ఈ విషయమునే యాతఁడు సంగ్రహముగా మరల నీ క్రింది పద్యమున[5] వివరించెను. అందుచే నిందలి మార్గకవులు కాళిదాసాదులకంటె భిన్నులని మనము సందేహపడ నవసరము లేదు.

ఈ పైవిధముగా దేవతాగురుపూర్వకవిస్తోత్రము కావించి నన్నెచోడుఁడు పిమ్మటఁ గుకవినింద గావించెను. అందలి తొలిపద్య మిది:

> "మార్గకు మార్గము దేశియు, మార్గము వదలంగఁ దమకు మది వదలక దు
> ర్మార్గపదవర్తు లనఁదగు, మార్గవులం దలఁచ నలఁతి మహి సుకవులకున్. (కుమా. ౧ ఆ. ౨౮)

---

5. సురవరులం గ్రమంబున వచోమణిసంహతిఁ బూజచేసి మ
ద్గురుచరణారవిందములకుం దగ సమ్మతి చేసి కొల్చి వి
స్తరమతులం బురాణకవిసంఘము నుత్తమమార్గ సత్కవీ
శ్వరులను దేశిసత్కవుల సంస్తుతి చేసి మనోముదంబునన్. (నన్నె. కుమార. ౧ ఆ. ౨౪)

ఈ పాఠము శ్రీ రామకృష్ణకవిగారు సేకరించినది. ఇందలి 'మార్గవులన్' అను పదమును 'మార్గకవుల' అని దిద్ది యీ పద్యమునకుఁ బలువురు విమర్శకులు 'మార్గకవితాపద్ధతి చెడ్డమార్గము. దేశికవితా పద్ధతియే సరియైన మార్గము. అయినను ఆ మార్గకవితను వదలిపెట్టుటకుఁ దమ మనసొప్పక దుష్టమైన యీ మార్గపద్ధతి ననుసరించుటచే దుర్మార్గపదవర్తులని చెప్పదగిన యీ మార్గకవులఁ దలపోయుట యుత్తములైన కవులకు న్యూనతాపాదక మగును'' అని యర్థము చెప్పుచున్నారు. పై పద్యముననే మార్గకవుల "మనోముదంబు''తో స్తుతించియుండిన నన్నెచోడుఁ డీ పద్యమున వారిపేరైన నెత్తకూడ దని నిందించుటయేకాక వారిని దోషగ్రాహు లగు 'కుకవివరాకుల'లోఁ జేర్చుటకుం దగిన కారణ మేమో తెలియుటలేదు. కాఁగా నిందలి మార్గకవులు పై పద్యమునందలి మార్గకవులకంటె భిన్నులు కావలయును. లేక యీ పద్యమునకు విమర్శకు లిచ్చు నర్థము సరియైనది కాకపోవలయును. అర్థము తప్పేమో యనుటకు నాకు రెండు సందియములు తోఁచుచున్నవి. పై యర్థము చెప్పినప్పుడు మార్గ, కుమార్గము అని విడఁదీయవలయును. 'మార్గవులన్' అనుపదమును 'మార్గకవుల' నని దిద్దవలయును. సంస్కృతమున మార్గశబ్దము పుంలింగముగను దేశీశబ్ద మీకారాంతస్త్రీలింగముగను నున్నవి. అకారాంత పుంలింగమైన మార్గశబ్దమునకు మార్గము అని కాక మార్గయని తత్సమరూపము చేయవచ్చునా? 'మార్గవులన్' అనుచోట నుండవలసిన సరియైన పాఠ మెద్ది? ఈ సందేహముల నటుంచి నన్నెచోడుఁడు మార్గకవితను భూషించుచునే యీ పద్యమును జెప్పె ననుటకు ననుకూలముగా నర్థాంతరము చెప్పుట యసాధ్యము. కాఁగా నిందలి మార్గకవితపై నాతఁడు పొగడిన మార్గకవుల కవిత్వముకంటెఁ దప్పక భిన్నమై యుండవలెను.

నన్నెచోడునికిఁ బూర్వుఁడైన ప్రసిద్ధాంధ్రకవి కవికులశేఖరుఁడైన నన్నయ యొక్కఁడే. ఆతఁడు తన కవిత్వమున సంస్కృతపదముల విస్తారముగా వాడెను. నన్నెచోడాది శైవకవులకు "జాను తెనుఁగు''పై ప్రీతి మెండు. అయ్యును వీరు సంస్కృతపదములను బూర్తిగా విడిచిపెట్టినవారు కారు. సాధ్యమైనంతవఱకు సంస్కృతపదములకంటెఁ దెనుఁగుపదములనే హెచ్చుగా నుపయోగించుచు జాతీయముగాఁ జెప్పు కవిత్వము జానుతెనుఁగుకవిత్వ మని వీ రభిప్రాయపడి యుందురు. అందుచే సంస్కృతభూయిష్ఠమైన యాంధ్రకవితాపద్ధతిపై నిష్టము లేకుండుటేకాక యది దుష్టమను దురభిప్రాయముకూడ నుండెనేమో! ఆ మార్గకవితాపద్ధతినే దుర్మార్గ మనియుఁ దత్కర్తలను స్మరించుటయే లాఘవాపాదక మనియు నన్నెచోడుఁడు వ్రాసియుండును. అయినచోఁ దనకుఁ బూర్వుఁడైన యాంధ్రకవిని; నన్నయ - నొక్కనిని దుర్మార్గపదవర్తిగా నీతఁడు పాటించిన నింక నీతఁడు పై పద్యమున స్తుతించియుండిన దేశికవు లెవ్వరో? బహుశః వారిప్పుడు విస్మృతులై యాతనికిఁ బూర్వులై జాను తెనుఁగుకవిత వ్రాసిన శైవకవులై యుండవలయును.

దీనినిబట్టి నన్నెచోడుఁడు ద్వివిధములైన మార్గకవితలను, ద్వివిధములైన దేశికవితలను బేర్కొనెనని చెప్పవలయును. కాళిదాసాదులు రచించినదియు స్తుత్యమైనదియునగు సంస్కృతకవిత

యొక మార్గకవిత; ఆంధ్రకవిత్వమునందే సంస్కృతప్రాయ మగుటచే దుష్టము, నింద్యము నైనది రెండవ మార్గకవిత; తమిళాంధ్రాది కవిత్వమును, ప్రాకృతకవిత్వమును నొక విధమైన దేశీకవిత. తెనుఁగు పదములతోఁగూడి జాతీయమై యార్యులకుఁ గర్ణరసాయనమై వెలుంగు జాను తెనుఁగుకవిత రెండవ విధమైన దేశికవిత.

ఇంక వస్తుకవిత యననేమో పరిశీలింతము. ఈ పదమునుగూడ నన్నెచోడుఁడే కుమారసంభవ మునఁ బూర్వకవులను స్తుతించుచోటను మఱియొక్కచోటను వాడియుండెను. ఆదికవి వాల్మీకి నతఁడు 'వస్తుకావ్యాబ్జరవి' యని శ్లాఘించెను. భారవి నాతఁడు వస్తుకవితచే జనారాధితుఁడై వరలిన యుత్తమకవి యని మన్నించెను. పిమ్మట నాతఁ డుద్భటునిఁగూర్చి చెప్పుచు నతఁడు 'సాలంకారము కుమారసంభవము గూఢవస్తుమయకావ్యముగా హరులీలఁ జెప్పి హరుని మెప్పించె' నని వాకొచ్చెను. ఇందలి వస్తుపదము వాల్మీకి భారవుల ప్రసంగమునఁ జెప్పిన వస్తువు వంటిదో తద్భిన్నమో తెలియదు. ఉద్భటరచితమైన యా కావ్యములు లభించువఱకు నీ పదముయొక్క యథార్థమైన యర్థమును నిర్ణయించుటకు వీలుచిక్కదు. పైఁగాఁ బై పద్యమున నుద్భటుఁడు సాలంకారమైన కుమారసంభవమును గూఢవస్తుమయకావ్యముగా హరులీలను జెప్పి హరు మెచ్చించె నను నర్థముకూడఁ జెప్పవచ్చును కుమారసంభవమే యా హరలీల కావచ్చును; లేదా యది తద్భిన్నమును గూఢవస్తుమయమైనదియు నగు నింకొక కావ్యము కావచ్చును. ఈ పై సందర్భము లందే కాక నన్నెచోడుఁడు వస్తుకవితాపదము నింకొక్కచోటఁగూడ వాడియుండెను. ఆతఁడు 'జంగమమల్లయవరమునందు వస్తుకవితను' గాంచెనఁట! ఈ వస్తుకవిత యనఁగా నేమి ?

వస్తుకవితను నన్నెచోడుఁడు వాల్మీకి భారవుల స్తుతించుసందర్భముననే కాని వ్యాసకాళిదాసాదుల స్తుతించు సందర్భమున నెలొకో పేర్కొనియుండలేదు. కుమారసంభవమునందలి తన కవిత్వముకూడ వస్తుకవిత్వమే యని యాతఁడు వాకొనెను. ఈ మూఁడు సందర్భములను బట్టియే మన మా పదముయొక్క యర్థమును నిర్ణయింపవలయును.

ఆంగ్లవిమర్శకులు కవిత్వమును ఆత్మాశ్రయకవిత్వము, (Subjective Poetry) పరాశ్రయకవిత్వము (Objective Poetry) అని యిరుతెఱఁగుల విభజించిరి. కవి స్వకీయవిషయములకు సంబంధించిన భావములనే వర్ణించుచు వ్రాయు కవిత యాత్మాశ్రయము. దీనినే యాంగ్లేయులు 'లిరిక్ పొయెట్రి' (Lyric Poetry) యని కూడఁ బేర్కొందురు. అట్లుగాక పరకీయ విషయములకు సంబంధించిన భావములను వర్ణించుచుఁ గవి వ్రాయు కవిత్వము పరాశ్రయము. కథేతిహాస కావ్యము లిట్టివే. వాల్మీకి, భారవి, నన్నెచోడుఁడు వ్రాసిన కవిత్వ మీ రెండవ తెగకుఁ జెందును. కావున వస్తుకవిత యనఁగా పాశ్చాత్యుల పరాశ్రయకవిత్వమే (Objective poetry) యని కొందఱు విమర్శకు లభిప్రాయపడుచున్నారు. అప్పుడు నన్నెచోడుఁడు జంగమమల్లయవరము వలనఁ బరాశ్రయకవిత్వమును బడసె నని చెప్పవలయును. అది యంత సమంజసముగాఁ దోఁపదు.

వస్తు వనఁగా నితివృత్తాదులైన యర్థములే కాక యాధ్యాత్మికము (Spiritual) కాని విషయమనియు నర్థము కలదు. వేదములందలి కవితయంతయు బాహుళ్యముమీద నాధ్యాత్మికమైనది. వైదిక కవిత్వముకంటె భిన్నమైన లౌకికకవిత్వమును బ్రప్రథమమునఁ జెప్పదొడఁగినవాఁడు వాల్మీకి. ఆతని రామాయణమునందలి కవిత్వము వైదికమువలె నాధ్యాత్మికము కాక వాస్తవమైనది (material). నన్నిచోడుఁడీ వాస్తవకవిత్వమునే వస్తుకవిత యని పేర్కొనెననియు, నందుచేతనే వాల్మీకిని వస్తుకావ్యాబ్జరవి యని శ్లాఘించెననియు నేను దలంచుచున్నాను. ఈ యర్థమును భారవి కవిత్వమునెడఁ జెప్పినను విప్రతిపత్తి యుండదు. నన్నిచోడుఁడు మల్లికార్జునివలన నాధ్యాత్మిక విజ్ఞానమునే కాక లౌకికకవితోచితమైన విజ్ఞానమును గూడఁ బొందియుండినకతముననే తాను జంగమ మల్లయ వరమునందు వస్తుకవితం గాంచితి నని చెప్పుకొని యుండును. ఇట్లు కానిచో నన్నిచోడుఁడు వస్తుకవితకు భిన్నమైన యాత్మాశ్రయకవిత్వ మేదో యప్పు డుండినట్లు, వస్తుకవితను బ్రత్యేకముగాఁ బేర్కొనుటకుఁ గారణ ముండదు. ఉద్భటుఁడు వ్రాసిన యాకావ్యము కుమారసంభవమైనను, హరలీలమైనను దాని నతఁడు గూఢమైన వస్తుకావ్యముగా, అనఁగా, నాధ్యాత్మిక గూఢార్థ గర్భితమైన వాస్తవకావ్యముగా రచించియుండును. నా యభిప్రాయము ననుసరించి మనుచరిత్రాదులందలి కవిత వస్తుకవితయు, సీతారామాంజనేయాదులయందలి కవిత తద్భిన్నమైన యాధ్యాత్మికకవితయు నగును. ఈ నా యభిప్రాయము యథార్థదూర మగుచోఁ బండితులు నన్ను మన్నింతురుగాక!

# చిరంజీవి కళాధర చక్రవర్తి

శ్రీ కర్లపాలెం కృష్ణరావు

౧

మత్పురాకృత పుణ్యసంపదలు విరియ
ఫలిత మొసగిన దీ దివ్యపర్వదినము
మామకధ్వాంత జీవితాంబరమునందు
ఒక కళాధరుఁ డీ దినం బుదయమయ్యె.

గాఢతరమైన నాదు సంకల్పలతలు
పూచి యొసలేని కొంగ్రొత్త పూవు నొసగె
ఈ సుమము పారిజాత మింకేమి కొదువ?
ఇష్టకామ్యార్థసిద్ధి ప్రాప్తించు మాకు.

ఈ సుధాకరు డమృతంబు నీయఁగలఁడు
ఈ కళాధరు సేవ తరింపఁజేయు
ఇతఁడు రతనాలపంట - మా కితఁడె వేల్పు
ఇతని జన్మదినంబు మా కతిశుభంబు.

అతిమనోహరలావణ్యయుతుఁ డితండు
ధరణివారల కెల్ల నందాలు నేర్పు
బుల్లిదొర నవ్వుపువ్వుల వెల్లివిరియు
వాసనలు బంధుజనుల వివశులఁ జేయు.

సుళ్ళుదిరిగెడు లేనవ్వు సోయగములు
అందముల ప్రోవులై మాకు హాయి నించు
ఆ వినిర్మలహాసములందుఁ దోఁచు
చంద్రికాపూరములు శరచ్చంద్రుమాడ్కి.

ఔర! ఆ బోసినోటియం దమరియున్న
వాకమహాకవి సత్కృతి నుల్లసిల్లు
రసములకు నాటపట్టులౌ పస లనేక
మిట్టి చిత్రింపుజాడ లెందేని గలవె?

తల్లిదండ్రుల యనురాగవల్లరులకు
పట్టుగొమ్మగ నీతఁడు పరిఢవిల్లు
అతిశయపగాఢ తరమునై యలరె మాదు
స్వార్థవిరహితపుత్రవాత్సల్యసరణి.

౨

"రార! నాతండ్రి!" యన్న బిరాన వచ్చు
"అందరికి ముద్దులిత్తువా! అందగాఁడ!"
అనుచుఁ బ్రశ్నింపఁ దల్లి తా నవలి కేగు,
సిగ్గుపడినా డటంచు మా చిన్నబాబు
నెత్తుకొని హత్తుకొనును మేనత్త వచ్చి.

కౌముదీభాసితంబైన గగనసీమ
దాయె,దా" యని పిల్చు "చందాయి" నితడు
శీతకరునితో స్నేహంబుఁ జేయుకొఱకొ?
గాక, వినుటకొ యాతని గాథ లెల్ల!

రజతపాత్రను దల్లి క్షీరంబు లుంచి
"ఎవరికోస్" అంచుఁ దా వాని కీయఁబోవ
ఒక్క తుటిలోన వచ్చి "నా కున్నవన్ని
తెచ్చియి"మ్మని రాగాలఁ దీయసాగు.

"చంద్రుడా!" యన్న "ఓ" యని చాచు చేయి
"నీవు గాదోయి! పొమ్మ" న, నిలిచి యల్లె
ఉరిమిచూచును కోపించుచున్న భాతి
చంద్రుడాతడె గాబోలు జగతి కెల్ల!

చిత్రములు చూడ నీతని చేష్ట లెల్ల—
ఆగ్రహించిన నొక యంద మలరుచుండు
కూనరాగాల యేడ్పులో గూడ సొగసె—
ఏపని యొనర్చినను గూడ నింపు లొలుకు.

అన్నమును ముట్టునాఁడు మా కన్నతండ్రి
ముందుగాఁ బట్టుకొన్నాఁడు పుస్తకములు—
దివ్యమణిహారములఁ గూడఁ దీసె నపుడె,
అద్భుతంబుగ నెగ్గినాఁ డా పరీక్ష.

వచ్చియును రాని యా తొక్కుపలుకు లరయ
మంజులారావమధురతామండితములు
"పాయసముకన్నఁ దీపి యా పలుకు" లనుచు
పొరుగువా రెల్లరును వీని ముద్దుగొంద్రు.

"తండ్రివలె నీవు గమ్మ సత్కవి" వటంచు
విబుధు లాశీర్వదించి రీ చిన్నవాని,
"నీవు శ్రీగల్గి కవులను బ్రోవు" మనుచు
విమలహృదయులు కవులు దీవించినారు.

3

బంగరు మువ్వల పట్టు మొలత్రా డుంచి
శ్రీకృష్ణు డితఁ డని చెప్పికొందు
శ్రీగంధమును బూసి శిఖకుఁ బింఛము జేర్చి
మురళీధరుం డని మురియుచుందు
మణిహారములు వేసి, మంజీరముల నుంచి
గోవిందుఁ డని చెప్పికొందు నితని
పాలు మీఁగడ లిచ్చి, పూల మాలల నుంచి
వనమాలి యితఁ డని పలుకుచుందు
ఇందిరాసుందరుండగు నీతఁ డనుచు
అడుగులకు మడుఁగు లొత్తుదు నప్పు డపుడు
ఆటపాటల నితనితో పాటు మేము
పొలుగొనుచుందు మదియె మా భాగ్యమనుచు.

మందు వేసంగి దినముల మంచిగంధ
మత్తరుల నింపి పూయుదు, హాయి సెంద
ఆతపము సోకునేమొ మాయయ్య కనుచు
రచనజేయుదు మల్లెల రజతశయ్య.

ఇతఁడు సుకుమారుఁ డోర్వఁ డొకింత యేని
చాలు, నైదాఘభానుఁడా! సాహసంబు,
బాలురను బాధపెట్టిన పాప మొదవు
"బాలకుల వాక్కు, వినలేదె, బ్రహ్మవాక్కు"

కన్నతల్లి కితండు చిన్నికృష్ణుడె గాని
మన్ను దినుచు నుండు మమత లేదు
మా పాలిటీతఁడు గోపాలుఁ డగుగాని
గొల్లల నేడ్పించు గుణములేదు
మా యింటి కీతఁడు మాధవుఁడే గాని
వెన్నల దోచెడు విధము లేదు
అస్మదాదుల కీత డతిమోహనుఁడెగాని
మేనత్తలను జూచి మిగులఁబోఁడు
అందముల దిద్ది తీర్చెడు సుందరుండె
గాని, కొంటెల గోపన్నగాఁ డితండు
ఇతనిమహిమలు దాచినాఁ డేమొ గాని
అన్నిటనుగూడ గోవిందుఁ డగునుగాక!

ఇతడు రాజేమొ? ఔనౌను! ఇతఁడు రాజె!
చక్రవర్తియె, వినువీథి చందమామ!
ఈ కళాధరుఁ డిట మాకు నేలి కగును
పేరునకు దగ్గ తీవియు వీని కమరె.

అతని కన్నెఱ్ఱయైన నే మడలుకొందు
మతఁడు నవ్వినఁ గలుగు మా కమితశాంతి
వాంఛితం బేమొ గ్రహియించి వాని కిత్తు
మడుగకయె, వాని యూహల ననుసరించి.

౪

తప్పటడుగులతోడఁ దడబడి పడునేమొ
భూదేవి ! యీతనిఁ బ్రోవవమ్మ
గాలిలో నెగురుచు గంతులు వేయును
అనిలకుమార ! నీ వాదుకొనుము
ఈడువారలఁ గూడి యెండలో విహరించు
సూర్యుఁడా ! చల్లగాఁ జూడవయ్య
దిక్కుదిక్కుల కేగు తెలిసియుఁ దెలియక
పాలింపు డితని దిక్పాలురార !
కోతి కొమ్మచ్చులకుఁ జెట్లుకొమ్మ లెక్కు
భూరుహములార ! రక్షింపరారె యితని ?
మా కళాధరుఁ డెంతయొ మంచివాఁడు
భార మిక నీదె! దేవ! కాపాడవయ్య!

ఉన్న మంచితనంబెల్ల ఉన్నయట్లు
చెప్పుటే గొప్ప తప్పని చెప్పుచుందు
అధికముగఁ జెప్ప దోషము లంటునేమొ!
క్షేమ మగుగాక! యింక శ్రీరామరక్ష !

కృష్ణపరమాత్మ! యితని రక్షింపు మోయి!
మనసు నిలువక చెప్పెదు మాటగాని
నీ ప్రసాదమె గద మాకు నిశ్చయముగ
బాధ్యత వహించి నీవె కాపాడగలవు.

# శతకాది బహుళసాహిత్యము

## శ్రీ కవికొండల వేంకటరావు

'శతకాది' అనడంలో నా సంకల్పం ఈ వ్యాసంలో శతకసాహిత్యంతోపాటు భజనసంకీర్తనములను, ప్రవక్తల తత్త్వాలను, మఱికొన్నింటినికూడా విమర్శిద్దాం అని—ఈ మూడింటిల్లోను ఓవిధమైన ధర్మనిర్వచనము, దైవవిచింతనము, ఐహికభోగ నిరసనము సర్వసాధారణంగా కనిపిస్తాయి. ఆధునికయుగంలోకూడా మనమధ్య తఱచు మంచిమంచి శతకాలు రచింపబడి వున్నాయి భక్తచింతామణి, కృపాంభోనిధి, సర్వమాన్య — ఇత్యాదులు. మఱి భజనసమాజములు అసంఖ్యాకములు. తత్త్వోపదేశాలు ఊరూరా! ప్రజాసామాన్యహృదయంయొక్క లో కవాటాన్ని తట్టి కలిగే వాఙ్మయ వాయుతరంగం వీటిల్లో ఉన్నట్టు మఱివేటిల్లోనూ లేదనే చెప్పొచ్చు.

ప్రతీపద్యంలోను, ప్రతీకీర్తనలో, ప్రతీతత్త్వంలోను అనన్యమైన ఏకైకపుటూహావేణి అల్లుకుపోయినట్టు అవుపిస్తుంది. ఆంగ్లేయభాషలోని "సోనెట్టు"లు కొంచెం వీటికి చేరికలేమో!

"నరసింహా నీ దివ్య నామమంత్రముచేత జలువైన పాపముల్ బాపవచ్చు"

అని ఆ పద్యం ఆ భావంతోనే అలా మెట్టెక్కుతుంది గాని ఆ మధ్యలో "లక్షాధికార్లైన లవణమన్నమెగాని మెఱుగు బంగారమ్ము మ్రింగబోడు" అనే చరణం అడ్డొచ్చి నట్టుకొట్టదు. అసలు సీసం, దానికి సంబంధించిన ఎత్తుగీతి, అంతా ఒక్క విత్తు ఒక చిత్తులాగు వుండి దేనికది భావపూర్ణిమాజ్యోత్స్నగా చూపట్టుతుంది. ఏ పద్యాని కా పద్యమే, ఏ కీర్తన కా కీర్తనే, ఏ తత్త్వాని కా తత్త్వమే ఒక రుక్కు.

"నాదబిందుకళ పాదు తెలియవలెన్, ఆనందయోగము పొందవలెన్
ఈ నరజన్మం బెత్తినందుకు, ఇహపరమును సాధించవలెన్"
"మూడురంగుల మేడమీదను, చేడెయున్నది చూడవలెన్
జోడుగూడి యెడబాయక నిరతము, గూఢమైన రతిఁ గూడవలెన్"
"నీళ్లులేని బావిలోన, వేళ్లులేని చెట్లు మొలిచే
కాళ్లులేని కోతి ... ..."

అంటూ ఊహాసమగ్రత యెక్కడికక్కడే పొందుపడి వుంటుంది. వెఱ్ఱిమొఱ్ఱిగా కలగూరగంపగా వుండవు. బాగా బాగా పరిశీలిస్తే ఒక్కొక్క భజనఘట్టమందలి పారవశ్యము ఇలా లాక్కుపోతుంది.

"రామమూర్తి మన పాలగలండు
రామమూర్తి మన జంటగలండు
రామమూర్తి మన జోడు గలండు"

రాధాకృష్ణుల కలయికయొక్క వెలలేని పోడుములు తెలుపుడు చేసే 'కతివేల్పు శతకంలో' కవి ఎంత బెట్టుగా వింత చూపిస్తాడో వినండి.

"అరకవుగిలింత, ఇనుమడి యావులింత
మై విరు పోకింత, నిద్దురమబ్బు కొంత
కలగలుపుగాగ కడువింత, చెలగె నంత !"

వేంకటేశ్వర తారావళిలోని ఎత్తిపొడుపు పద్యాలు తులలేని చోద్యాలు.

"అప్పు లొప్పుగ జేసి ముప్పు దెచ్చుటనుగా, మంగమ్మ నీ వంక మరలకుంట"

కాళహస్తిశతకంలో

"ప్రాణికి బొందికేమి ప్రీతిబాధ్యత?" అని ప్రశ్నిస్తాడు కవి.

సీతపాటలో రాముడు సీత కాధ్యాత్మం బోధిస్తూ ఇలా మనస్సు కెక్కిస్తాడు.

"మొదలు చిణిశబ్దమున మ్రోయు, చిణిచిణి యనుచు పిదప నాదించు
ఓ సీత ! ముదిత ఘంటానాదమున మ్రోయు, ప్రణవ మా పిదప హృత్కమలమున సీత !"

ఎంతటి సుబోధో యోజించండి.

ఈ బహుళ సాహిత్యముయొక్క యుపయోగవిశేష మేమిటంటే — అంతా కంఠతః వచ్చి ఒప్ప జెప్పం బనిలేదు. ఎదో ఒకనుడి నానుడిలా, ఒక పొడిముక్క వజ్రప్పొడిలా, పతితయొక్క అస్థిని పట్టుకు పోయి, దానికదే పనిచేస్తుంది. ఒక్కొక్కప్పుడు అనేవాని కర్థం కాకనూపోవచ్చు కూడాను.

ఒక ఎనిమిది తొమ్మిదేండ్ల కూలికుఱ్ఱవాడు ఒకచోట కొత్తగట్టెక్కి దిగుతూ ఇలా లోలో పాడుకుంటూ కులికాడు

"చెన్నపట్నం చేరడానికి, చీక టడిం దన్నయా!
అందులాకు ఇందులాకు, మందులేదు అన్నయా!"

ఇది వానిలో రేకెత్తిన అనురాగ మనుకోనా? విక్కవిరిసిన వైరాగ్య మనుకోనా? అయితే నేమి ఆ మాటలపొందిక ఆలా అవ్యక్తమాధుర్యాన్ని చిలికిస్తూ ఆ బాలుని పెదవులమీద తొణికిస లాడినట్లైంది.

ఈ చిద్విలాసా లన్నింటినీ ఓపిక్కకు నెట్టి పట్టుదలగా పరిస్తే ఎల్లప్పుడూ అక్కఱకు వచ్చే సిసలైన ఖిలాస మొకటి వుంది తెనుగు బాసలో. అది "మృత్యుంజయ విలాసము". వీథి నాటకం కాదు. ప్రబంధం కాదు. రెండింటిలోను గల సుగుణాలకోవ అని నా హెచ్చరిక.

"అకట నీవాడనే అన్నతంబులాడనే, పరుల నే వేడనే తరళనయన !
అలుక జాలించవే పలుకు సెల్లించవే, తలుపు తీయించవే తలిరుబోడి !
మాటాడరాదటే మతి ప్రేమ లేదటే, యెడజాలిగాదటే యిందువదన !
ఎందాక కోపమే యిదియేమి పాపమే, యింతకే మోసమే దంతిగమన !
గడియ యుగమయ్యె తీయవే గడియ పడతి!, జాగు సేయకు బంగారుతీగకాన
చలము దగునటె చిలుకలకొలికి నీకు?, వేళ మించెను రాగదే బాల నీల!"

అనేవీ కలవు. "చూచుమాత్రః భస్మీకృతుండయి" అనేవీ కలవు.

"క్రొమ్ముడి వీడ హారములు గుబ్బల బాతరలాడ మధ్య భా
గమ్ము జలింప నూరువులు గాఢతరంబుగ ముంపఁజెక్కులం
జెమ్మట జెందఁ గంకణమణిక్వణనం బిరవొంద వేలుపుం
గొమ్మ యొకర్తు శంకరునకున్ దలయంటె ననేకభంగులన్"

అనే సందర్భం ఒకచోట శంకరుణ్ణి మిక్కిలి మగవానిగా కనబరుస్తూ మఱోచోట వానిచేతనే ఏనాడో ఏవాడా నేరని అడుదాని వేషము వేయిస్తాడు కవి. అదే ఎఱుకత వయ్యారి !

"నవతనూధవళిమ నగవునబూని, కరకురంగాకృతి కడగంట నిలిపి
తరుణేందుకళ ఫాలతటిఁ గీలుకొలిపి, గళనీల చకచకల్ కచపాళినాటి
వళుల గాంగతరంగ వైఖరి మాటి, పృథివిమాహాత్మ్యంబు పిరుదుల యందు
పృథుతరసరసత హృదయంబు నందు, బంధుర తేజంబు వాతెరయందు."

అని ఇలా వియచ్చరలోకాని కెత్తేస్తూ మనుష్యులకు అందుబాటన్నట్టు లోకసామాన్యపు వస్తువులు పెట్టి చూపిస్తాడు.

"కుచ్చుల బావిలీల్ గుమ్మటీల్ గరుడ, పచ్చల బొగడలు బవిరులు గుల్క
ముక్కున బలుకెంపు ముక్కెర జెలగ, పెక్కురత్నము పూవు పేరుజెన్నొంద"

అంత మారువేషం వేసికొని వెళ్ళికూడా కోరికదీర వెంటనే ప్రియురాలి బుగ్గకొరక గలిగాడా నాయకుడు? లేదు లేదు. వెఱ్ఱిబాగులతనంగా తన యింటికి తిరిగివచ్చి "పొంచి యీ పనుల కొప్పించ నైతి" అని విరహవేదన పాలవుతాడు.

నిజంగా అప్పట్టున గొప్పకళ నెలకొల్పాడు ఘంటంపట్టిన అమ్మహాకవి !

[తాజాకలము:—ఆంధ్ర దేశంలో "కోరుకొండ మహల్" అనే సీమను శ్రీరంగపట్నం అనే గ్రామమున్నది. అక్కడ 1 జనవరి 1912వ తేదీన "గ్రామాభివర్ధనీ పుస్తక భాండాగారము" అను పేరట నొక పుస్తక భాండాగారము స్థాపింపబడినది. కడచిన వేసంగిలో నేను ఆ యూర రెండు నెల లుండుట తటస్థించినప్పుడు ఆ భాండాగారమున గల పురాతన శతకములు ఇతర పుస్తకములు కొన్ని అముద్రితములు పఠించిన సావకాశము ననుసరించి పై వ్యాసము నాచే ది16—8—42వ తేదీన రచింపబడినది.]

౧౫౨

# దూతప్రచారము

## శ్రీ శే. వేం. రాఘవ అయ్యంగార్

[ఈ 'దూతప్రచారము' గ్రంథకర్తచేఁ దెనిగింపబడిన 'యాంధ్రకామందకీయనీతిసారము'నందలిభాగము. కామందకీయ నీతిసారము కౌటిల్యుని యర్థశాస్త్రమునకు సంగ్రహ స్వరూపము. కౌటిల్యుఁడు 180 అధ్యాయములలో విస్తరించిన విషయప్రపంచమును కామందకుఁడు 36 ప్రకరణములలో సంగ్రహించెను. నీతిసారకర్త కామందకుడా, లేక, కామందకియా యను సంశయము కొందఱ కున్నది. కాని మనదేశములో నీతిసారకర్త పురుషుఁడే యని యనూచానముగా నొక యభిప్రాయము స్థిరమై యున్నది. ఈతఁడు భవభూతికిఁ బూర్వకాలీనుడు. అనఁగా క్రీ॥శ॥ ఏడవశతాబ్దికిఁ బూర్వుఁ డన్నమాట. నీతిసారమునకు శంకరార్యుఁడు 'జయమంగళ'మను పేర వ్యాఖ్య రచించెను.

నీతిసారమునందు పూర్వభారతదేశమునందలి రాష్ట్రతంత్ర మభివర్ణింపఁబడి యున్నది. ఇంద్రియ నిగ్రహము, రాష్ట్రప్రకృతులు, శత్రుమిత్ర తటస్థాదుల విభేదములు, మండల నిర్ణయము, యానాసనద్వైధీభావసమాశ్రయములు, దూతప్రచారము, వేగులు, ఉత్సాహప్రభుమంత్రశక్తులు, సామదానభేద దండోపాయములు, చతురంగబలములు, సైన్యవ్యూహభేదములు మున్నగునవి యిందలి విషయ ప్రణాలిక. చతుర్విధపురుషార్థములలోఁ దక్కిన మూడు పురుషార్థములును నర్థమూలము లని నీతిశాస్త్రవేత్తల మతము. కాని యేలొకో యీ శాస్త్రమున కధునాతనకాలములోఁ బ్రాధాన్య మీయఁబడుటలేదు. దీనికి సంబంధించిన గ్రంథములను జదివినవారే కాదాచిత్కముగఁ గనబడు చున్నారు. ప్రస్తుతము ప్రపంచమునం దంతటను మహామారివలెఁ జుట్టుకొన్న మహాసంగ్రామవేళ నైనను నీ శాస్త్రమును బఠించినచో భారతీయుల యర్థశాస్త్ర నైపుణ్యము తెలియుటయేగాక ప్రకృతకాలోపయోగికూడ కాగలదు. ఈ దూతప్రచారము, నీతిసారములోని రాజోపదేశమునందలి 13వ సర్గములోనిది.]

పరులగుట్టుల చేదెడువాఁడు, లెస్స
గా రహస్యంబుల నెఱుంగగా సమర్థు
డై, సచివ సమ్మతుండు, దూత్యాభిమాని
యైన మంత్రిని 'దూతగ' ననుప నగును.

వాగ్మి, స్మృతిమంతుఁడు, ప్రగల్భవంతు, డఖిల
శస్త్రశాస్త్రనిష్ణాతుఁడు, సకల దూత్య
కర్మసంవేదినే, దూతగ నియమింప
వలె; అమాత్యస్వరూపుడై వెలయు దూత.



గూ౨

అల '[1]నిసృష్టార్థుడు,' '[2]పరిమితార్థుడు,' మఱి
'[3]శాసనహారుం'డన క్రమానుసారముగను
పాదగుణహీనులై 'రాయబారు' లిలను
దనరుచుందురు, 'మూడువిధాల' వరుస.

అధిపుశాసనమున నిసృష్టార్థదూత
పోవ వలె శాత్రవుం జేరబోవుటకును
ముందుగ, స్వవాక్య పరవాక్యములను లెస్స
గా, మనంబునఁ జింతింపగా వలయును.

స్వబలసిద్ధికిగా, జలస్థలపథముల,
గూఢమార్గంబుల నెఱుంగఁగోరి దూత,
ఆటవికజనుల, జనపదాంతపాల
కులను, మిత్రులఁగా సల్పుకొనగఁదగును.

అరిసభలకు దుర్గములకు
పురములకును నెఱుకలేక పోరాదు; మదిన్
తఱివేచి కార్యసిద్ధిం
బరిగొననా; శత్రుచే వివర్జితు డగుచున్.

శత్రురాష్ట్ర దుర్గబల కోశముల గల్గు
గుట్టుమట్టుల, లోలోని కోపములను,
హెచ్చుతగ్గులనున్, బొరపొచ్చెములను,
తెలియగా 'రాయబారి' యత్నింపవలయు.

నరుకంగ కత్తి నెత్తినఁ
బిరుతివియక శాసనంబె పేర్కొనవలయున్
గురుతింప నగును రాగా
పరాగముల, దృష్టి వక్త్రవైఖరిఁ గనుటన్.

బెడిదముల సైచి, యొంటిగఁ
బడుకొనుచున్, క్రోధకామవర్జితుఁడై, తా
వెడలుపడనీక భావం,
బొడికంబున నొరుల గుట్టు నూహింపనగున్.

ఇలపతికిన్ బ్రకృతులకున్,
గల రాగవిరాగములను గని, చాటుగ నే
ర్పొలయంగ వేఱుపరుపన్
వలె, లుబ్ధక కుపిత భీతవర్గము నెల్లన్.

ప్రాణంబు పోవు పట్టున
నైనన్ వెలిబుచ్చగూడ దధిపతి నెరసుల్
మానితపు నుడుల పల్కం
గానగు, "మీకు సకలంబు కరగత"మంచున్.

'[1]కులము' ను, '[2]పేరు' ను, '[3]ద్రవ్యము'
లలి '[4]కర్మల' గొప్పదనములన్ బేర్కొనుచున్
"నలుదెఱఁగులఁ" బొగడంగా
వలె; 'దూత' స్వపక్ష శత్రుపక్షాధిపులన్.

ఉభయవేతనముం బొందుచుండి సతము
శిల్పవిద్యాపదేశముచేత 'దూత'
కృత్యపక్షోపజాపార్థ మెడద నెంచి
విద్విషవిచేష్టితంబుల వెదుకవలయు.

శాస్త్రవిజ్ఞానసంగ్రహసాధనముగ,
పుణ్యతీర్థాశ్రమామరభూములందు
తాపసవ్యంజనయుతుఁడై, తాఁ జరింప
జను, స్వచారుల గూడి ప్రచారమునకు.

అలసత లేమియు, త్యాగము,
కుల, ముత్సాహము, ప్రతాపగుణ, సంపదలన్
గల భూనాయకుఁడని, భే
ద్యులతోఁ గీర్తింపవలయు, దూత సతంబున్.

మదిరా నిద్రా మదముల
మది వెడలుచునుండు గుట్టుమట్టులు; కానన్
ముదితా మధుపానంబుల
వదలుచు, నొంటరిగ 'దూత' పన్నుండవలెన్.

'కాలంబు గడచనేగా' యని చింతింప
రాదు ; మేధావి స్వార్థంబు గోరి
సంధి విగ్రహసిద్ధి సమయంబు వీక్షింప
వలయు, నానావిలోభనము లరసి
స్వామిహితము 'రాయబారి' చేకూర్పనౌ;
వ్యసనంబు రాఁ, గాంచి, స్వయముగాఁగ
దానిని వారింపఁదగు ప్రయత్నము సల్ప
నగును; సామంతుల నాటవికులఁ

బొడము కయ్యంబులం దీర్చి, పొందుగూర్చు
శక్తినిం గల్గి, మంత్ర్యాదిసచివకోటిఁ
బుట్టు, నంతఃకలహముల మట్టుపెట్టు
నీతినిపుణుండుగావలె, 'దూత' యండ్రు.

సస్యాది సంగ్రహ సంపాదనము సల్ప
వలయు, క్షీణపురాణ భక్త మవల
నగృహీతనవభక్త మార్జింపఁదగు; దుర్గ
సత్క్రియ లొనరింపఁ జనును, స్ఫుటిత
మై భిన్నమైన దుర్గాది సంస్కారము
లాచరించుచు, స్వపక్షాభ్యుదయముఁ
గాంక్షించి, దేశంబు కాలంబు వీక్షింప
నగు, జైత్రయాత్ర వ్యాయామయోగ్య
మై చెలంగెడి, దేశకాలాదు లరసి,
శత్రుసైన్యబలాదులఁ జక్క నెరిగి
కార్యకాలాతిపాతంబు గలుగనీక,
వార్త లన్నిటిఁ దెలుపఁగావలయు పతికి.

రిపునృపు శత్రుపరిచ్ఛేద, మాతని
బలదుర్గ కోశాది వస్తుచయము,
బంధుమిత్ర విభేదభావము, కృత్యోప
క్షేపసంగ్రహము, యుద్ధాపసార
భూజ్ఞానము, తటస్థభూపాలకుల నాత్మ
సాత్కరణము, 'దూతచర్య' లెల్ల

విజిగీష ధారుణీవిభుడు, దూతామాత్య
 ముఖమునసే, శతుృభూమిపాలు
జతన మెఱిఁగి, విమర్శన సల్పవలయు
నితరు లరిమండలమునకు నేగ కుంట;
పరుడు, విజిగీషుమండలవాసియైన
రాయబారి మూలమున సర్వము నెఱుంగు.

## దూతచర వికల్ప ప్రకరణము

స్మృతిమంతుండుఁ, తర్కేం
గితజ్ఞ వేది, చతురుండు, క్లేశాయాస
ప్రతికూలసహుఁడు, 'చారుడు'
ప్రతిభావంతుడు, మృదు లఘు పరిగమనుఁ డగుఁ.

'చారుఁడు' పరాతిసంధానచతురుఁ డగుచు,
శిల్పపణ్యోపజీవియై చెలఁగుచుండి,
తాపసవ్యంజనంబులఁ దాల్చి, జనుల
హృదయములలోని భావంబు లెఱుఁగనగును.

సర్వవార్తావిదుండగు 'చారుఁ'డవని
పాలుని, సకాశముం జేరి ప్రతిదినంబు,
వచ్చిపోవుచు నుండఁగావలయు సుమ్ము;
'చారుఁడే' రాజునకు దూరచక్షు వరయ.

సూక్ష్మసూత్ర ప్రచారము సూటి నెరుగఁ
జను నరాతివిచేష్టల 'చారుఁ'డెపుడు,
చారచక్షువై మెలఁగెడి జనవిభుండు
పండుకొన్నను మేల్కొన్నపగిది సుమ్ము.

పవనునివలె చేష్టితముల,
వివస్వతునిపోలె కాంతివిక్రమములచే
భువిలోకసమ్మతుండై
రవణించును 'ప్రణిధి' కతన రాజు సతమ్ముఁ.

చారచక్షువుగాక, భూజాని మాంస
చక్షువులనమ్ముకొని ధర సంచరింప
లోకతత్త్వ పరిజ్ఞాన లోకనావి
రహితుఁడై, చీఁకువలెఁ గానరాడు పథము.

వైరినృప చేష్టితములతో పాటు, రాజు
స్వీయసచివసంపత్సముదాయగరిమ,
ఆయమానవ్యయంబుల నహరహంబు
'వేగువారల' ముఖమున వినఁగవలయు.

'అపరికాళ' 'పరికాళు'లటంచు చరులు
'ద్వివిధరూపము' లం బొంది వెలయుచుందురి;
మారువేషములం బూని 'చారు' డరుగు,
'దూత' నాగ పరికాశుఁడై ఖ్యాతిఁ జెందు.

సంధివిగ్రహ సంధానశాలి 'దూత'
'చారుడు' పరపరిచారవిజ్ఞానచతురుఁ
డగుట, ఋత్విజు నధ్వరమందు వోలె
వారి నియమింపవలయును వారి పనుల.

చారుల కార్యసమృద్ధికి
ధారుణి సంస్థలను నిల్పఁదగు భూపతియుర్
వా రా వేషము వృత్తుల
తో రంజిలి సేవ నల్పదొరకొనవలయుర్.

వాణిజక, కాపటిక, గృహపతిక, భిక్షు,
తాపస వ్యంజనముల సంస్థానములను
చార సంస్థితికై సుఖాశయములైన
వృత్తులను రాజు పెక్కు కల్పింపవలయు.

పరపక్షమ్ము, స్వపక్షము
వరుసం దెలియంగ 'వేగువారలు' గుమ్మలై,
సరగఁ కార్యవివక్షకు
నరిగి, మనంబు నెరుగ నడయాడుదు రచటర్.

[1]ప్రవ్రజితుఁడు, [2]తీక్ష్ణుఁడు, [3]సత్త్రి, [4]రసదు లనఁగఁ
జనెడువారు 'పరిధానసంచారు' లరయ
వీరి తమ్ము తా నెఱుఁగని విధముగాఁగ
'గూఢచారులు'గ పతి గైకొనగజెల్లు.

తనపక్షము పరపక్షము
మనమున గురుతింపలేని మానవనాథుం
డనయంబు పెద్దనిద్దుర
మునుఁగు; మరల మేల్కొనంగఁ బోవఁడు సుమ్మా.

మారువేషధారుల, వేగువారివలన
కుపితు లగువారలఁ దెలిసికొనఁగవలయు,
కారణము లేక కోపించు ఖలుల నెల్ల
పృథివిపతి గుట్టుగా మట్టుపెట్టనగును.

కారణం బున్నచోఁ గోపకారణమ్ము
శూన్య మొనరించి, జనుల వశ్యులుగ సల్పి
దానసమ్మానములను ఛిద్రింపుముఖము
గప్పి, నరపతి సుఖనిద్రఁ గాంచఁ దగును.

కంటకావళికి ముఖభంగంబు సల్పి
రాజ్యమునకును శాంతిఁ గూర్పంగ నగును
భీతతతి సామమున, లుబ్ధవితతి దాన
మునను, సంతుష్టులుగఁ జేయఁ జను నృపుండు.

ఛిద్రము రవంత యని యుపేక్షించునెడల
పడవలో నీరు జేరిన పగిది, రిపుడు
పరికృతి దోష మూఁత గొని, లోపలకుఁ జొచ్చి
సర్వనాశము సేయు రాజ్యంబు నెల్ల.

బధిర మూకాంధక వామన పాషండ
భిక్షుక కాపాల వేషధార,
కారవవర్ధకచారణదాసి మా
లాకార లలిత కళాకుశలులు,
చామర భృంగార ఛత్రి వాహనయాన
ధరులుగ, పరులకు నెరుకపడని
సరణిని రాణివాస రహస్యముల 'వేగు
వారలు' గొంచురావలయు, మఱియు

కరితురగరథారోహ శిక్షకులుగాగ,
భక్త సూపక గాత్రి సంవాహకులుగ,
తల్ప సుమగంధ తాంబూలదాయకులుగ,
రిపుసమీపవర్తనులై చరింపవలయు.

పూర్వసంకేత సంజ్ఞల, ముఖ నయన వి
కారముల, గూఢలేఖ, లాకారచేష్టి
తముల, నవ్యక్తభాషలఁ దమకుఁ దాము
సావధానులై 'చారులు' చనగ నగును.

లలిత కళాప్రవీణులుగ లాంఛనముల్ ధరియించి, సర్వవి
ద్యలఁ గుశలత్వముఱ్ఱ గలుగు నట్టివియైన విధాల వేష భా
షలఁ బచరించి, నీరములఁ జండమయూఖునిరీతి భూజనం
బుల మదిలోని మర్మముల పోకడలెల్ల గ్రహింతురి 'వేగరుల్.'

తాపసభిక్షుకాది వివిధప్రణిధాన వినోదరూప స
ల్లాపముఖాది లక్షణములఱ్ఱ జెలువొంది పరేంగితంబులఱ్ఱ
దాపటికంపుభావముల నాచికొనంగఁ దలంత్రుతు? శత్రుభూ
మీపతి 'చారు' లా కపటమిత్రులి గుట్టు లెరుంగగావలెఱ్ఱ.

# నవ్య సాహిత్యము

## రొమాంటిసిజము

### శ్రీ నండూరి వేంకట రామకృష్ణమాచార్యులు

నవ్య యుగములో ఆంధ్ర సరస్వతి సరిక్రొత్త రూపముల ధరించుచున్నది. సంప్రదాయవిరుద్ధముగా రోజున కొక వేషము వేయుచు, పూట కొక ఆభరణము మార్చుచు, విశృంఖల విహారము చేయుచున్నదని ప్రాచీన సాహితీ తత్పరుల మనస్సునకు బాధ కలుగుచున్నది. ప్రాచీన కావ్య మర్యాదల పాటింపక పోవుట, ఛందోఽలంకారాది వ్యతిక్రమము చేయుట, కవిసమయముల నుల్లంఘించుట మున్నగు నిందల నెన్నిటినో లక్షణవేత్తలు నవ్యుల కారోపించుచున్నారు. నవ్యభారతి లక్ష్య మేదియును లేక దారి తెన్నులు గానక పోరాని త్రోవల బట్టి తిరుగాడుచున్నదా? లేక, తిన్నని బాట ననుసరించియే పోవుచున్నదా? పోయెడిబాట యెట్టిది? నేటికాలపు రచనల అంతస్తత్త్వమును పరిశీలించి, వాని కేమైన సమానధర్మము లున్నచో నిరూపించి, ఆ రచనల కంతర్వాహినిగను ప్రేరేపకముగ నున్న శక్తిని పరిశోధించు టవసరము.

కావ్యము నిత్యనూతనము. సారస్వతప్రపంచములో ప్రాచీనకాలమున, ఒక విలక్షణమైన రూపము గల కావ్యసృష్టి జరిగిన కొంతకాలమునకు మరికొన్ని ప్రత్యేకలక్షణములతో అర్వాచీన కావ్య కల్పనములు బయలుదేరుట సహజము. వాఙ్మయమున, ఆదికావ్యపద్ధతిని పురస్కరించుకొని ఆలంకారికచ్ఛందోవ్యాకరణాది లక్షణగ్రంథములు వెలువడును. ఆ లక్షణగ్రంథములు ప్రాచీన సాహితీస్వరూప నిరూపణమునకు తోడ్పడి, దాని కొక వైలక్షణ్య మొనగూర్చును. అట్టి ప్రాచీన కావ్యజాతికి "మార్గకవిత" (Classical Poetry) అని పేరు. ఇంకను రచనలు సాగుచుండుటచే నీ జాతి సాహిత్యమున కివి లక్షణము లని నిష్కర్షగా చెప్పుటకు వీలులేని అర్వాచీన కవిప్రకృతులకు "రొమాంటిసిజ"మని స్థూలముగా పేరిడవచ్చును. కాని, యూరపు వాఙ్మయములలో కొన్ని ప్రత్యేకమైన పోకడలకు రొమాంటిసిజ మని వాడుచున్నారు. ఈ "రొమాంటిసిజ"మను పదమునకు నిష్కర్షగా అర్థముచెప్పుట దుర్ఘటము అయినను, రొమాంటికు కవు లెవరో, వారి రచన లెట్టివో నిర్ణయింపనగును.

సారస్వత లోకమున, కొలది కాలము క్రిందట జర్మనీ, ఫ్రాన్సు మొదలగు యూరపుఖండ దేశములలో విరివిగా వ్యాపించిన రొమాంటికు ఉద్యమములోని ప్రధానలక్షణము లన్నియు, అధునాతనాంధ్రవాఙ్మయమునందు బహుళముగా వ్యక్తము లగుచున్నవి. ఆ యా దేశములలోని వాఙ్మయచరిత్రమే మన వాఙ్మయమున పునరావృత్త మగుచున్నది.

నవ్యయుగమున మానవసంసారమున అపూర్వమైన పరివర్తన గలిగినది. రైళ్లు, పొగయోడలు, విమానములు, రేడియోలు, విద్యుచ్ఛక్తి, దైనందినజీవనమును తారుమారు చేసినవి. భౌతిక ప్రపంచమున మానవుడు సంపాదించిన శక్తులు, వివిధశాస్త్ర పరిజ్ఞానమును, మానవుడు సర్వధా, 'పురోగామి' యను విశ్వాసము నంకురింపజేసినవి. ఈ పరివర్తనము, పాశ్చాత్యదేశములలో మన దేశమునకంటె పూర్వమే జరిగినది. ప్రకృతిశాస్త్రవేత్త యగు డార్విను మహాశయుడు పరిణామ సిద్ధాంతమును ప్రతిపాదించెను. ఫ్రెంచిదేశీయుడు, సాంఘిక రాజకీయవేత్తయు నగు రూసో మనీషి వ్యక్తిస్వాతంత్ర్యమును ప్రబోధించెను. వ్యావహారిక ప్రపంచమున దైనందినజీవితములో గలిగిన మార్పునకును, డార్విను, రూసో ప్రభృతులు భావప్రపంచమున గలిగించిన పరివర్తనమునకును అనుగుణముగ సారస్వత ప్రపంచమున రొమాంటికుతత్త్వము పొడసూపినది. ఈ ఉద్యమము ప్రప్రథమమున జర్మను దేశములో విరివిగా వ్యాపించినది. కవులును తత్త్వవేత్తలును నైన షిల్లరు, షెల్లింగు అనువారలు ఈ మతప్రోక్తలై, యీ తత్త్వమును మానవ జీవితములోని వివిధ శాఖలలోనికిం గొంపోవ కృషి సల్పిరి.

రొమాంటిసిజము ప్రాచీన కావ్య మర్యాదల నతిక్రమించుట తోడను, ఛందోవ్యాకరణ వ్యతిక్రమముతోడను ఆరంభించెను. స్వేచ్ఛాప్రవృత్తి, నిర్భరమైన భావావేశము, సంఘముమీద తిరుగుబాటును పురికొల్పుట, అపరిష్కృతమును అగమ్యమునైన ప్రకృతిని వర్ణించుట, కులటలను, పతితులను, అపరాధులను కావ్యవస్తువులుగా గ్రహించుట, వింత వింత ప్రణయ వృత్తములు వర్ణించుట, భిన్నరసములను మిశ్రముచేయుట, రసాభాసము నుపాసించుట, కవిత్వము నాత్మాశ్రయముగ, ఉత్తమపురుషలో రచించుట, ఈ రొమాంటికు కవితకు ముఖ్యలక్షణములు.

అద్యతనాంధ్రకవితాప్రపంచమునను రొమాంటికుశ్రేణికి జెందిన కవులు వెలసిరి. విశృంఖల విహారము చేయు నీ కవికుమారుల స్వాతంత్ర్యపిపాస ఒక క్రొత్తరకమైన కావ్యకల్పనద్వారా అభివ్యక్త మయ్యెను. దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి కవిత్వము సంపూర్ణముగా నీ శ్రేణికి చెందిన దని చెప్పవచ్చును. కవి, నిర్భరమైన భావావేశమునకు వశుడై "అర్థమ్ముగాని భావగీతము"లల్లుట తటస్థించినది. అం దేదియో, అపూర్వశక్తి, మధురిమ, స్ఫురించును. కేవలము శబ్దలాలిత్యమును, రచనామాధుర్యమును, కవు లుపాసించుట సంభవించినది. ఈ కవిత్వమున భావపరిప్లుతి యెక్కుడుగా నుండుటచే కథాకథనమునకు ప్రాధాన్యము లేదు. ఈ కవులు స్వీయభావ పరంపరను వ్యక్తము చేయుటవలన రచన లాత్మాశ్రయములై, ఉత్తమ పురుషలో నుండుట తటస్థించినది. భావోద్వేగమునకు వశులై సంఘముమీద తిరుగుబాటును పురికొల్పుచు, ఆత్మాశ్రయముగా చెప్పిన కవిత్వ మెంతయో జర్మనువాఙ్మయమునందు గలదు.

నేటి తెలుగు కవిత్వములో:

"జగమునిండ స్వేచ్ఛాగానఝరుల నింతు"

అనియు,

"నేను స్వేచ్ఛాకుమారుడ నేను గగనపథవిహారవిహంగమపతిని నేను
మోహనవినీలజలధరమూర్తి నేను, ప్రళయఝంఝూప్రభంజనస్వామి నేను"

అనియు గానవచ్చుచున్నది.

ఒక్కొక్కప్పుడు ఏదో భావపరంపరను వ్యక్తము చేయదలచుకొన్న, ప్రాచీనకావ్యములందలి దీర్ఘవృత్తములును, పద్యములును భావవ్యక్తీకరణమునకు ప్రతిబంధకములుగా కవికి గోచరించు వచ్చును. ఆత్మాశ్రయమైన ఒక భావమును వెల్లడింపవలసిన, ఏ శార్దూలమునో, చంపకమాలనో వ్రాయుట నవ్యులలో కొందరికి సరిపడదు. గాయకుడు అప్పుడప్పుడు అలవోకగా కూనిరాగములు తీయునట్లు లోకవృత్తముల దర్శించునప్పుడు, కవి భావాంతరస్థితిని గోచరించు తలపులను అప్రయత్నముగా, గేయరూపమున,

"నేను సైతం విశ్వసృష్టికి, అశ్రువొక్కటి ధారవోశాను"
"నేను సైతం ప్రపంచాగ్నికి,సమిధ నొక్కటి ఆహుతిచ్చాను"

అని పాడుకొనుచున్నాడు.

ఇట్లు, కవి భావావేశమునకు వశుడై తెప్పరిల్లుకో లేకపోవుట జూచి యూరప్ ఖండములో రొమాంటికు కవిత్వమును భావజాడ్య మని, రొమాంటికు వ్యథ (Romantic Agony) అనియు వేళాకోళము చేసిరి. మన దేశములోగూడ శ్రీ పండిత ఉమాకాంత విద్యాశేఖరులు తమ "నేటి కాలపు కవిత్వము"లో దీనిని "దుర్నివార కవిత్వ"మనిరి. "పులుముడు, శబ్దవాచ్యత, అయోమయం" మున్నగు దోషములను వీరు నవ్యకవిత్వమున కారోపించిరి.

ప్రతికవియు, మొదట తాను భావోద్వేగమునకు వశుడగు ననుమాట సత్యము. కాని, పిమ్మట కవి ఆ భావమును సమాధిస్థితియందు తన వశము చేసికొనవలెను.

"అనుభవించిన భావోద్వేగమును అనుస్మరణపూర్వకముగా వ్రాసినదే కవిత్వ మని మహానుభావుడు వర్డ్సువర్తు కవి ప్రవచించెను.

(Emotion, recollected in tranquillity is poetry"—Wordsworth)

భావనాలోల్యమునకు వశులై, తెప్పరిల్లుకోలేక పోయి ఉన్మత్తులైన పాశ్చాత్య కవులు కొందరు గలరు.

వాస్తవ లోకాతిక్రమణము రొమాంటికుకవుల భావశబలతకు ప్రధాన లక్షణము (Escapist tendency). ఈ ప్రపంచముతో సంబంధము లేక వాయుమండలమందు నిర్మించిన కల్పిత జగత్తును గురించి వీరు స్వప్నములను గాంచుచుందురు. బసవరాజు అప్పారావుగారి "లోకముతో పనికేటికి లోలాక్షీ"అను గేయ ముదాహరింప దగినది......ప్రతికూల పరివేష్టనమున జిక్కుకొని జీవివలె నిరంతరము ఉద్వేగమున ప్రజ్వరిల్లుచుండి, స్థిరత్వము, సామంజస్యము, శాంతియు లేని ఉన్మత్తత వీరి కవిత్వమందలి విశిష్టత. ఉదాహరణముగా శ్రీరంగం శ్రీనివాసరావుగారి

"మరో ప్రపంచం మరో ప్రపంచం, మరో ప్రపంచం పిలిచింది

* * *

దారి పొడుగునా గుండె నెత్తురులు, తర్పణచేస్తూ పదండి ముందుకు

* * *

ఎముకలు కుళ్ళిన వయస్సు మళ్ళిన, సోమరులారా చావండీ
కనపడదా మరో ప్రపంచపు, కణకణలాడే త్రేతాగ్ని

* * *

దయ్యాలట్లూ తాచులవలెనూ, ధనంజయునిలాగ సాగండీ"

వాస్తవలోకమును విడిచి, ఎక్కడకో ఎగిరిపోవ సంకల్పించి, శూన్య ప్రదేశములో రెక్కల నాడించుచు పరిభ్రమించు, తిరుగుబాటుప్రవృత్తి రొమాంటికు కవుల మనోగోళము నావరించి యుండు నని ఒక ఆంగ్లేయ విమర్శకుడు వ్రాక్రుచ్చెను.

(It is a centrifugal flight from reality, a beating of revolutionary wings in the nebulous void in vain.)

భావశబలత ఉత్తమకవితకు ముఖ్యలక్షణము. కాని, ఆ ఊష్మలతకు కవి వశుడుగాక, కవియే దానిని వశము జేసికొనుట ఉత్తమకళాసంప్రదాయము. రాజశేఖరుడు 'కావ్యమీమాంస'లో కావ్యహేతు వగు ప్రతిభను భావయిత్రి యనియు కారయిత్రి యనియు విభజించినాడు.

ప్రకృతి యందలి సౌందర్యమును కవి ఏ శక్తిచే దర్శించుచున్నాడో ఆ శక్తియే భావయిత్రి తాను దర్శించిన సౌందర్యమును ప్రదర్శించు శక్తియే కారయిత్రి. భావయిత్రి, కారయిత్రి ఈ రెండు శక్తులును ఒకేసారి అవ్యవహితముగా జరుగవు. కవి భావించుచుండగనే ప్రదర్శింపజాలడుగదా! అనగా కవి దర్శనము భావయిత్రికి, కారయిత్రికి మధ్య "సమాధి" గతమై యుండును ఈ సమాధి స్థితిలో భావన జారిపోకుండ, పునఃసృష్టి జరుగుపర్యంతము కవి కాపాడుకొనవలెను

దర్శించిన వెంటనే ప్రదర్శనము క్వాచిత్కముగ జరుగును. కాని, ఆ క్షణములో పొంగును పట్ట లేక కవి నోటివెంట రెండుమాటలు వెలువడినను అవి సమగ్రమైన కావ్యసృష్టి కానేరదు. భావనాగమ్యమైన వస్తుదర్శనము సుస్పష్టముగా లేనపుడు కవికి భావనాబలము తక్కువ యనిగాని లేక వ్యక్తీకరణ సామర్థ్యము లేదనికాని, అనరాదు. సమాధి బలవత్తరముగా లేకపోవుటయే దీనికి బలవత్తరమైన కారణము గావచ్చును. రాజశేఖరుని భావమునే ఒక ఆంగ్లవిమర్శకుడు "క్లైవు బెల్" వెల్లడించినాడు.

"Between the moment of perspective and the finished work of art there is a room for many a slip. Feeble or defective emotion is at best only one explanation of unsatisfactory form. But you cannot be sure, because the forms are bad, the state of the mind of the artist is also wrong. Right forms imply right feelings, but wrong forms

do not necessarily imply wrong feelings. The latter may be due to lack of concentrating his energies."

కావున కవి దర్శనము, సమాధిబద్ధమైనప్పుడే ఉత్తమకళాసిద్ధి గలుగును. ఉత్తమకవి నిగృహీతావేశుడు. ఈ అర్థమునే ప్రధానముగా గ్రహించి, ప్రాచీనాలంకారికులు కవిని ఋషిగా పేర్కొనుటయేగాక "నానృషిః కురుతే కావ్యం" అని ప్రవచించిరి. కాని నవ్యకావ్యకర్తలలో పెక్కురకు ఈ సమాధి కొరవడినది. వీరికి భావసమృద్ధి గలదు.

భావమును చెప్పుటకు వలయు శబ్దములును కొల్లలుగా గనుపించును; అనగా వీరికి భావయిత్రి, దర్శించు శక్తియు, కారయిత్రి ప్రదర్శించు శక్తియును గలవు. కాని, ఇవి సమాధిబద్ధము గాకపోవుటచే వీరిది సాకల్యమైన ప్రతిభ గాదు. కావున వీరి కావ్యకల్పనములలో ఉత్తమశిల్పసిద్ధియు కొరవడినది.

"కవి నిగృహీతావేశుడు కానక్కరలేదు. కవితావేశము ప్రవాహనైజముగ, ఉప్పొంగి, పొరలి, ప్రవహించును. చెట్లు చిగురింపవా? కోకిల గీతము లాలపింపదా? అను వాదమును గలదు. కవి తన కొరకే కావ్యమును సృజించును. వేరు ప్రయోజనము నభిలషింపడు" అని చెప్పుట కాని, ఈ వాదము నేల విడిచిన సాము.

ప్రపంచసారస్వతములోని ఉత్తమకవు లందరును పై సూత్రము నంగీకరింపరు. 'ఆంధ్రావని మోదమును బొందుటకును, ధర్మాద్వైతస్థితిని స్థాపించుటకును, తిక్కన భారతరచనకు పూనుకొనెను. మిల్టను కవీంద్రుడు పతితుడైన మానవుని పావనుని చేయుటయే తన కావ్యాదర్శ మని చాటెను. ఉత్తమకావ్యకర్తలుగా విశ్వవిఖ్యాతిని గాంచిన శిల్పులు తమ కావ్యమును విశ్వశ్రేయము నభిలషించియే వ్రాసిరి. భంగ్యంతరమున చెప్పవలసి వచ్చుచో, కళకొరకై వ్రాసి విశ్వవిఖ్యాతిని గాంచిన ప్రాచీనకావ్యకర్త లెవ్వరును లేరు. ఇది అపవాదము లేని సిద్ధాంతము. నిజమునకు కవి ఒక అప్రాకృతమూర్తి. జగచ్చక్రమును తొట్రుపాటు లేకుండ నడచునట్లు చూచుట కవికి ధర్మము. ఈ నిష్కృష్ట ధర్మమును కవి నిర్వహింపనిచో, తాను పంచుకొన్న దైవాంశమును వ్యర్థముచేసినవా డగును. కావున కవులపై, విశ్వకల్యాణమునకై, తమ కవితాశక్తిని వినియోగింపవలసిన బాధ్యత గలదు.

ఈ అర్థముననే ఆంగ్లసూక్తి కవులను అజ్ఞాతవిశ్వశాసనకర్తలుగా పేర్కొనినది: (Poets are the unrecognised legislators of the world.) కావున కవులు కావ్యములను కేవల కళారాధనకై రచించుట, తమపైగల పవిత్రధర్మమును, బాధ్యతను విస్మరించుటయే యగును. కవులు ఆత్మవిస్మృతిని జెందుట అవివేకము.

రసములను సంకరము చేసి శృంగారమును బీభత్సమును సౌందర్యమును జుగుప్సను కలగాపులగముగ వర్ణించుట రొమాంటికు కవుల ఆచారము. యూరపు దేశములలో ఈ కవులు మెడూసా సౌందర్యమును (Medusian Beauty) వర్ణించుటయం దాసక్తి జూపిరి. ఆమె దేహము అమో

మయము. ఆమె 'అలివేణి' కాదు. 'నాగవేణి'. సుందరమైన ఆమె ముఖమును జూచిన మర్త్యుడు తక్షణము హాలాహలము ద్రావును. అట్టి సుందర విగ్రహమును ఆ కవులు వర్ణనీయవస్తువుగా గ్రహించిరి. రొమాంటికు కవులు సౌందర్యమునకు వైచిత్ర్యము నాపాదించి తద్దర్శనమున చకితులై అద్భుతాయత్తచిత్తులై, ఆత్మవిస్మృతిని చెందుదురు.

మృత్యు గర్జా ప్రవాహ గంభీరమైన, విధి నిదురపోవు ప్రేమ జీవితములోన

అనియు,

మరణ దేవతవో; సుధామధుర విధుర, జీవశాంతివో, ప్రేమైక జీవకళవో
విలయ సౌందర్య ధాత్రివో; విశ్వగాన, మోహినివో యిహదుఃఖిత మౌనియతివో.

నేటి తెలుగు కవిత్వమున గానవగును.

రొమాంటిక్ కవులు పతితపావనులు. కులటలను, పతితులను, అపరాధులను కథావస్తువులుగా స్వీకరించి వారియెడ సానుభూతిని జూపుట రొమాంటికు ఆచారము. ఇది నేటి రచనలలో విరివిగా గాన్పించుచున్నది. నేటికాలపు కథానికలలో ధర్మభ్రంశమును గొప్పచేసి, వర్ణనీయవస్తువుగా గ్రహించుచున్నారు. ఇప్పుడు నెలకొనియున్న వస్తుధర్మమును భిన్నముగా ప్రదర్శించుట నవీనుల ఆశయముగా గనబడుచున్నది. రసాభాసమును అంగరసముగా వర్ణించుటకు మాత్రము మన ప్రాచీనాలంకారికులు సమ్మతింతురు. కాని, నేడు రసాభాసమే అంగిరసముగా, కావ్యములలోను కథానికలలోను కవికుమారుల కుపాదేయ మగుచున్నది.

(Love of wild Nature) అమానుషమును అపరిష్కృతమును నైన ప్రకృతిని వర్ణించుటకు యూరపు వాసులకు మార్గదర్శకులైనవాడు రూసో. దుర్గమములును గహనములునైన అరణ్యములను వర్ణించుట, సందర్భశుద్ధి గలిగి మితముగా నున్న కావ్యశోభకు సహాయకారియే యగును. భారతీయ కవితకు ఇట్టి వర్ణనలు చిరపరిచితములు. ప్రశాంతనిర్మలమునై, స్నిగ్ధ శ్యామలమునై, సరిద్గర్త కాంతార మిశ్రమునై, నీరంధ్రనీపనిచుళితమునైన శ్యామలతరులక్ష్మి, ఆదికావ్యమైన రామాయణ కాలమునుండియు భారతీయవాఙ్మయసంప్రదాయముగా గతానుగతికముగా కావ్యముల నలంకరించుచున్నది.

అధునాతన కల్పనములలో అధునాతన కల్పన, అతివాస్తవికరచన (Sur-realism). మహాసంగ్రామ సమయములలో సంక్షోభకాలములో యూరపులో ఈ రచన లుద్భవిల్లినవి. ఇవి రొమాంటిక్ ఉద్యమములో నొక శాఖగా పరిగణింపబడినవి. "వ్యక్తం చేసుకుందామని చైతన్యస్రవంతి నీది, వ్యక్తం కటబడకుండా వ్యక్తావ్యక్తంలో తలదాచుకొంటూన్న తలపులు చెప్పేందుకే ఇందులో చేసే ప్రయత్నం'' అని ఒక అతివాస్తవరచనను ప్రస్తావించుచు శ్రీరంగం నారాయణబాబు గారు చెప్పిరి. సామాన్యవస్తువులను ఒకయెడ వెరపుగొలుపు భీతావహదృశ్యములుగను, మరొక యెడ జాలి గలిగించు జుగుప్సాకరమైన విషయములుగా వర్ణించి అవ్యక్తస్థితిలోని తలపులకు రూప

కల్పన చేయుట వీరి ఆశయము. వాసనారూపమున ప్రాణికోటియందు నిద్రాణములైయున్న నిగూఢభావములు ఏవంవిధరచనలందు తమంత తాము ఆవిష్కృతము లగును. ఈ రచనలలో నిర్మాణవిధానముగాని వస్త్వైక్యముగాని యుండదు. హేతుశుద్ధి లేని స్వప్నములను, అవ్యక్తముగా మనోవీథిని పొడసూపు తలపులను చిత్రించుట వీరి పని. ఆత్మవంచనయు జగద్వంచనయు లేకుండ, ధైర్యముగ ఉన్నదాని నున్నట్లు తెలుపుటకు, ఆత్మవ్యక్తీకరణమునకు అంతవాస్తవిక రచనయే పరమసాధన మనియు వీరివాదము. కాని, ఇట్లు, వారి మనఃస్థితిని తెలుపుట, ధీరత్వము కాకపోవచ్చు ననియు, సిగ్గుమాలినతనము కావచ్చునని కొందరి అభిప్రాయము. వ్యక్తావ్యక్తములైన తలపులు కృతికర్తకే తెలిసీ తెలియని వగుటచే నొరులకు తెలుపుట కాతనికి సాధ్యము కాదని వీరి పూర్వపక్షము. అతివాస్తవికులు భావోద్వేగమున హాస్యాస్పదము లగు అతి వర్ణనలకు పాల్పడి రని పాశ్చాత్యవిమర్శకులే దూషించిరి.

The sur-realists indulged in romantic and ridiculous extravagance—Encyclo-Britain.

ఇట్టి రచనలు క్షుద్రము లనియు, హాస్యాస్పదము లనియు, కావ్యనామార్హత లేనివనియు కొందరు నిరసించిరి. 'శాలువా కప్పుకొని నా దగ్గర కొచ్చిం దో రివాల్వర్'' ఇత్యాది అసంగత మనోభావములు చదువరులకు దురవగాహ మగుచున్నవి. చూడ నిట్టి రచనలు, సంక్షోభసమయములందును, యుగసంధికాలములలోను పుట్టుచుండును. కాని మఖలోపుట్టి పుబ్బలో అస్తమించును. ఒక జాతి సారస్వతశక్తి క్షీణించి, నిర్వీర్ణమైనపుడు పెట్టు విహ్వలరావములే ఈ అవ్యక్తకవితాభాసము లని ఒక సాహిత్యవేత్త పలికెను.

ఈ అతివాస్తవికరచన, "రొమాంటికు ఉద్యమముయొక్క దుష్ఫలవిపరిణామము" అని చెప్పక తప్పదు. ప్రాచీనకావ్యమర్యాదలయెడ వైముఖ్యమును ప్రోత్సహించి, పతితుల యెడలను అపరాధుల యెడలను సానుభూతి చూపి, ధర్మభ్రంశమును గొప్పజేసి, వర్ణనీయవస్తువుగా గ్రహించినంత మాత్రమున, నవ్యులు నవధర్మమార్గమును ప్రతిపాదించి రనుకొనుట పొరపాటు. వీరి తరువాతి కవులు అనుసరింపదగిన రాచబాట వేయవలసిన బాధ్యత వీరిపై గలదు. రొమాంటికు కవుల భావనాలౌల్యము, వాచ్యత, అస్పష్టత, మున్నగు వానిని పాశ్చాత్య విమర్శకులును ఖండించిరి. పాశ్చాత్యదేశములలో సారస్వతలోకమున నీ ఉద్యమము తీవ్రతరముగ సాగినది. పశ్చిమ దేశములలో, రొమాంటికుకవుల ప్రణయవృత్తములు వింత వింత పరిణామమును దాల్చినవి. చరిత్రమునను విమర్శమునను మానవుడు గుణపాఠములను నేర్చుకొనకపోయిన, అతని యుక్తాయుక్తవిచక్షణాజ్ఞానము వృథ యగును. పాశ్చాత్యకవులలో కొందరీ లోలత్వమునకు లోబడి ఉన్మత్తులైన వారలును గలరు. కావున, ఆ ప్రవృత్తులు సయిరేము, మన కవుల మనస్తత్త్వముల నావరింపనక్కరలేదు. ఆంధ్రావని నేడు బయలుదేరుచున్న, నవనవకవులు, ఈ భావోద్వేగ ప్రవాహమున బడి కొట్టుకొనిపోక ఆత్మనియంతలై, రొమాంటిసిజములోని దొసగులను పరిహరించి,

ఒక నవధర్మమార్గమును ప్రతిష్ఠించి, ఆంధ్ర సాహితీదీపికను, విశ్వసారస్వతాంబరవీధిని క్షణక్షణ ప్రవర్ధమాన కాంతిసంపదలతో వెలుగొందునట్లు చేయుదురుగాక.

"రొమాంటిక ఉద్యమము యథార్థముగా తెలుపున దేమనిన, మనస్సు యొక్కయు, తక్కిన యింద్రియముల యొక్కయు, స్వభావగతులలోను, ప్రకృతిసిద్ధపదార్థములలోను సౌందర్యమును వైలక్షణ్యమును గోచరింపజేసి, భావనావిస్తృతిని పొందింపగల ప్రబోధము తప్ప, మరేమియును లేదు'' అని ఒక సాహితీవేత్త పలికెను.

"What is really meant by all phrases and by the name romantic movement is, simply re-awakening to a sense of beauty and strangeness in natural things and in all impulses of mind and senses."

రొమాంటిక కవితలోగూడ, ఉత్తమ, మధ్యమ, అధమ శ్రేణులకు జెందిన రచన లుండుట సహజమే కదా? ఉత్తమ రచనలనే గ్రహించిన, సారస్వతమునకు ఈ తత్త్వము మహోపకార మొనరించిన దనియే చెప్పవచ్చును.

రొమాంటికతత్త్వము మానవజీవితములోని వివిధాంగణములందును గొప్ప పరివర్తనము గలుగ జేసి మానవాభ్యుదయమునకు తోడుపడినది. అంతియేకాని, కొంతమంది విమర్శకు లని నటుల ఈ తత్త్వము దోషభూయిష్ఠమును, కేవల భావజాడ్యమును గాదు. యథార్థముగా విచారించిన, ప్రకృతిశాస్త్రములోని పరిణామవాదము సంఘజీవితములో పురోభివృద్ధి గాంచవలయు ననెడి గాఢసంకల్పము, సారస్వతములో కవితాశిల్పములు, మానవజీవితమునకు అలంకారప్రాయములే గాక, మానవప్రకృతిలో అంతర్లీనమైయున్న ఆధ్యాత్మికశక్తి లని ప్రతిపాదించినదియు నీ యుద్యమమే. అద్యతనులలో చాలమంది విజ్ఞులు మార్గరచనలకును రొమాంటికరచనలకును పోరాని విభేదము లేదనియు, మొదటిది సిద్ధమనియు, రెండవది సాధ్యమనియు, ఇట్టి పరిణామ వికాసము ప్రపంచమున సదా సాగుచునే యుండు ననియు, అది విశ్వలీలారహస్య మనియు తలంచుచున్నారు.

# నైచికి

శ్రీ పెనమకూరు వేంకట సుబ్బరాయశర్మ

యత్సూర్యజాతీరవిహారలోలం
గోగోపబృన్దైః పరివార్యమాణం
వంశీనినాదై రుపలక్ష్యమాణం
తత్ స్తౌమి కార్ష్ణ్యం స్తనయిత్నువర్ణం.

*    *    *    *

శ్రీ గోపాలకిశోరవంశవిసరజ్జేగీయమానామృత
ప్రాగారాధితమాధురీ వివశతారంగత్ఖురాఘట్టనన్
హీఁగంజేయుచు ధారిణిన్ బ్రగమనోద్వేగంబుఁ జూపించు ప్ర
ఖ్యాగోవ్యూహమునందు నైచికి వరేణ్యంబై విరాజిల్లెడిన్.

అమృతకలశ సహోద్భవప్రాప్తి నిర్జ
రాంగనాసోదరీజనుసాప్తిఁ దనరు
ధేనుమాణిక్యమునకు నాధేయమైన
చాలు గల్గిన మాయి యా సౌరభేయి.

ఇహపరసుఖోదయమ్ముల నెలమిఁ గూర్చు
మృదులపదములు గంభీరవృత్తములును
గల్గి సల్లక్షణాన్విత కవితవోలెఁ
జెలఁగుచుండును నైచికి సిరులకలిమి.

పీనోధస్స్యందిపయో
నానాజనతామనోనుసందనియౌ గో
మానిని సతతంబును దా
ద్రోణదుఘాధవళకీర్తితుందిల యగుటన్.

వాల్క-తంతువునన్ గట్టుపడినరీతి
దామబద్ధయై క్షీరముల్ తవిలి యిచ్చు
నిద్ధ మృదుల సందానసంబద్ధ యగుట
విమలధర్మానుసరణప్రవృత్తిపొంచె.

ఎవ్వాని పాపపుంజం
బవ్వాని దహించు ననెడి న్యాయమ్మును దా
నెవ్విధి సమనుగమింపదు
చివ్వకుఁ దలపడినవానిఁ జెండియె తీర్చు.

*　　*　　*　　*

కైలాస కాంచనగంగ భూమీధర
శృంగాగ్ర సునిశిత శృంగములును
తపనశిరోమణీ ధగాధగాయితమూర్ధ
వింధ్యభూధరకకుద్విస్తృతియును
స్వర్ణదీ సింధు కృష్ణా గౌతమీనదీ
కమలసుధాదివ్యగవ్యములును
వైదికౌపనిషదవాఙ్మయసృష్టిని
దానమహాయశస్తనువుఁ గల్గి
హైందవ మహమ్మదీయ మహామతీయ
పుష్పవన్నేత్రియుగ్మయై పొలుపు మివులు
నైచికీపాదములకుఁ బ్రణామ మిడుట
పూర్వభవసంచితం బగు పుణ్యరేఖ.

# ప్రాచీనాంధ్రులు - వారి పరిశ్రమలు - గుణశీలములు

శ్రీ కురుగంటి సీతారామయ్య

## I

### పూర్వరంగము

ఆంధ్రజాతి గుణశీలకథనమునకు పూర్వము వారి ప్రాచీన సన్నివేశములను కొన్నిటిని మనవి చేయవలసియున్నది. ఐతరేయబ్రాహ్మణమే యాంధ్రుల ప్రాచీనత్వమునకు ప్రమాణము.* వీరి పూర్వులు విశ్వామిత్రపుత్రులు. కాని, కారణాంతరముచే తండ్రిచేత శప్తులు. తండ్రియాజ్ఞనుల్లంఘించినవారు. విశ్వామిత్రు డార్యు డనియు తత్పుత్రులుకూడ నార్యులే కావలయు ననియు వేర చెప్ప ననావశ్యకము. ఈ యైతరేయబ్రాహ్మణవచనమువలననే వీరి యార్యత్వము స్థిర మగుచున్నది. కాని శాపానంతరము వీరికి దస్యుత్వము తటస్థించి యితరదస్యుజాతులతో సాహచర్యము కలిగినది. ఐతరేయబ్రాహ్మణమున నాంధ్రులతోఁ జేర్కొనబడిన దస్యుజాతు లన్నియు మొదట నార్యులే !♦ మనను దస్యు లనినందున మన మెట్టి యభిమానమును పొంద నవసరము లేదు. అనేక దస్యుజాతు లార్యమతములో చేర్చుకొనబడిరి. అట్లే యాంధ్రులుకూడ దస్యుత్వము విడి, తరువాత వచ్చిన యార్యులలో కలసి, చాతుర్వర్ణ్యవ్యవస్థాదికమును గ్రహించి, కోల్పోయిన యార్యత్వము నొందిరి. ఆపస్తంబబోధాయనులు వారి యార్యత్వమును గట్టిపరచిరి. వారికి నమస్కృతులు.

కొందరిటీవల నాంధ్రు లార్యులుకాక ద్రావిడజాతి యనుట పరిపాటి యైపోయినది. కాల్డ్వెల్ గారి భాషాసిద్ధాంతముతో జాతిసిద్ధాంతముకూడ తల యెత్తినది. కొందరిట్లనుటచే తెలియని

---

* "క్రీ. పూ. 3140 సంవత్సరమునకు పూర్వమునుండియు భరతఖండమున నాంధ్రదేశ మొక ప్రత్యేకరాజ్యముగ నుండెననియు, ఆంధ్రులొక ప్రత్యేక తెగ, పరిపాలకపు తెగ వారుగ నుండి ప్రఖ్యాతి వడసిరనియు స్పష్టముగ చెప్ప నొప్పుచున్నది." (ఆంధ్ర మహాసామ్రాజ్యము, 431)

శ్రీ నడింపల్లి జగన్నాథరావుగారు, భారతయుద్ధము. క్రీ. పూ. 3139 న జరిగెనని వాదించుచున్నారు.

♦ "త ఏతేంధ్రాః పుండ్రాః శబరాః పుళిందా మూతిబా ఇత్యాద్యుదంతా భవంతి" ఆర్యు లనార్యులను దస్యులని పిలిచిరి. శప్తార్యులు చాలకాల మీ దేశమున నున్న వెనుక, తరువాత వచ్చిన యార్యులు వారిని దస్యులని పిలిచిరి.

"The descendants of these (outcasted) sons of Visvamitra formed the greater bulk of the Dasyus and were variously known as Andhras, etc."

(Charmichael Lectures, D. R. Bhandarkar)

వారు దానినే గ్రహించుచున్నారు.* ఐతరేయబ్రాహ్మణవాక్య మట్టి వాదమునకు సంపూర్ణముగ సమాధాన మొసగుచున్నది. కాని విశ్వామిత్రశప్తార్యులగు నాంధ్రు లిచ్చటికి వచ్చుసరికిక్కడ నిర్మానుష్యమని మన మనుటకు వీలులేదు. కాని వీరు ఆదిమనివాసులకంటె నెక్కువ నాగరకత కలిగియుండుటచే వీరి ప్రాబల్య మెక్కువ యయ్యెను. క్రమముగా దేశమునకుకూడ వారిపేరే వచ్చెను. అప్పటినుండియే యాంధ్రదేశమనియు, వారు మాటలాడుభాష యాంధ్రమనియు నామములు కలిగెను. వారును నిచ్చటి యనార్యనివాసులును కలసిపోవుట తటస్థించెను. క్రమముగా దక్షిణదేశమునున్న ద్రావిడులయొక్కయు నాగులయొక్కయు సంపర్కము వీరికి కలిగెను. ఈ జాతు లన్నియు కలసి ప్రస్తుతాంధ్రు లయి యున్నారు. దక్షిణదేశాంధ్రుల సంపర్కము గలిగినపుడు ఆర్యాంధ్రులు మాటలాడు ప్రాకృతమునకును, ననార్యులపైశాచికిని ద్రావిడుల ద్రావిడమునకును సంబంధము కలిగి పరస్పరప్రాబల్యము కలిగెను. నాగరకులభాష ప్రాకృతముగ నుండెను. సామాన్యప్రజ లొకవిధమైన దేశభాషను వాడుకచేయుచుండిరి. సప్తశతియు, బృహత్కథయు నీ వాదమును స్థిరీకరించుచున్నవి. రాజగు హాలుని భాష ప్రాకృత మగుటచే నాయన సప్తశతిని ప్రాకృతభాషలో రచియించెను. గుణాఢ్యుడు తన గ్రంథము ప్రజాసామాన్యమున కుద్దేశించుటచే పైశాచిభాషలో వ్రాసెను. క్రమముగా నీ పైశాచియు వైయాకరణులచే నొక ప్రాకృతముగా గ్రహింపబడినది. మొదట నెట్లున్నను నీ పైశాచము శాతవాహన కాలమున సాక్షరభాషయై గ్రంథరచన చేయుటకు సమర్థమైయుండెను. మనకు జాత్యభిమానము మిక్కుటమై, హైందవస్వరాజ్యము కావలయు నను నీ కాలమున రెడ్ఇండియన్లనియు (Red Indians) ఇండియన్ఇంకు (Indian Ink) అను పదములు లజ్జాకరములు కానప్పుడు పైశాచి యనుపద మట్లగుననుట సమంజసము కాదు.

మనము కొన్ని జాతులు కలసినవార మన్నందున మనము సంకరుల మని సిగ్గుపడ నవసరములేదు. ఇప్పుడు ప్రపంచమున దాదాపు అన్నిజాతులును సంకరములుగనే యున్నవి. హిందూదేశములో సంకరముకాని జాతి లేదని చారిత్రకులు తెల్పుచున్నారు. రిస్లీ (Risely) ద్రావిడరక్తముగాని యార్యరక్తముగాని లేనిజాతి హిందూదేశమున లేదని సోపపత్తికముగా నిరూపించినాడు § కావున భాషాసాంకర్యముగాని జాతిసాంకర్యముగాని మన యిప్పటి పార్థక్యమునకు ప్రతిబంధకములు కావు.

ఈ యాంధ్రు లీ దేశమున కే మార్గమున వచ్చిరి అను ప్రశ్నము మనకు చాల నవసరమైయున్నది. పి. టి. శ్రీనివాసయ్యంగారు మొదలగు పరిశోధకులు పూర్వపుటాంధ్రులకును, నిప్పటి తెలుగు

---

* "The earliest rulers of the Deccan known to history were the Andhras, a Dravidian people, now represented by the large population speaking the Telugu Language and occupying the Deltas of the Godavari and Kristna rivers" —(Some aspects of Hyderabad)
ఇట్లు చాలమంది వ్రాసియున్నారు.

§ "Neither the Dravidian nor the Aryan blood is confined to any Caste."

—(Hindu 5-1-1941)

లకును నెట్టి సంబంధమును లేదనియు, మరియు నీ యాంధ్రులు పశ్చిమమునుండి తూర్పునకు వ్యాపించి రనియు చెప్పుచున్నారు. ఈ వాదములను సాంతముగా విమర్శించుట కిచ్చట తావు చాలదు. కాని రెండుమూడుసంగతులను మనవిచేతును. మొదటి ప్రశ్నమునకు శ్రీ సోమశేఖరశర్మగారు కొంత సమాధానము చెప్పియున్నారు.♦ నన్నయభట్టుకాలమునకు చాలపూర్వమే యాంధ్ర తెలుగుశబ్దములు సమానార్థకములైనవి. నన్నయ తన వ్యాకరణమున కాంధ్రశబ్దచింతామణి యని పేరిడెను. ఈ వాద మిప్పుడు సమసిపోయినట్లే భావింపవలయును. చారిత్రకు లందరును పూర్వాంధ్రులే యిప్పటి తెలుగువారని నిర్ణయించినట్లు గ్రహింపనగును.

ఇక వారు వచ్చిన మార్గమును గూర్చి ముచ్చటింతును. రాముడు దక్షిణాపథము* వచ్చిన మార్గ మును కొంచెము పరిశీలించినప్పుడు "పంచవటి" యొక్క ప్రశంస కలుగుచున్నది. మహారాష్ట్రులు పంచవటి నాసికాత్ర్యంబకమువద్ద నున్నదని కొన్ని కారణముల నిచ్చుచున్నారు. మొదట నీవాదము చేసినవాడు భండార్కరు. కాని, యాయన చెప్పినకారణజాతము నంతను ఖండించి శ్రీ కొమ ర్రాజు లక్ష్మణరావుగారును, 'చరిత్రచతురానన' శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారును పంచవటి గోదావరీతీరమే యనియు దండకారణ్య మాంధ్రదేశభాగ మనియు నిరూపించి యున్నారు.‡ వారు చెప్పిన కారణములేగాక నేనొక యుపపత్తిని మనవిచేయుచున్నాను. ఒక్కమా రైతరేయబ్రాహ్మణ భాగమును గమనింపుడు. అం దీజాతు లెట్లు వ్యాపించినది చెప్పబడియున్నది. అందలి జాతుల వరుస మనకు చాల యవసరము. వేదార్థనిర్ణయము చేయుటలో శ్రుత్యాదు లగు కొన్ని సూత్రములు చాల ముఖ్యములు. వానిలో "స్థాన" మొకటి. స్థానమనగా నొకవాక్యమునం దుండు పదము లున్న స్థలము. ఐతరేయబ్రాహ్మణవాక్యమునందలి పదముల స్థానములనుబట్టి యా యా జాతు లే వరుసను వ్యాపించెనో తెలియగలదు. "ఆంధ్రులు, పుండ్రులు, శబరులు, పుళిందులు, మూతి బాలు"—ఇది వరుస. పంచవటీనిర్ణయము వారి మార్గమును స్పష్టపరచినది. అనగా వారు వింధ్య

---

♦ ప్రాచీనశాసనముల నాంధ్రు లాంధ్రులుగనే పరిగణింపబడిరి. పురాణములలో నాంధ్రు లనియే యున్నది. 5, 6 శతా బ్దమునకు పూర్వపు ప్రాకృత శాసనములలోను గ్రంథములలోను నాంధ్రులు అంధులనియు నంధకు లనియు వ్యవహరింప బడుచున్నారు. (ప్రాకృతమున నాంధ్రశబ్ద 'మంధ'మగును.) అంధకు లని యాంధ్రదేశములోని బౌద్ధులు పిలువబడు చున్నారు. శాసనములలో 10–వ శతాబ్దములోపల తెనుగుపదము కానరాదు. అప్పటికే యాంధ్ర తెలుగు శబ్దములు సమానార్థకములైనవి. —(ఆంధ్రపత్రిక వృష ఉగాదిసంచిక.)

"It follows that Andhra and Telugu denoted the same territorial unit from the earliest time though there does not seem any etymological connection between the two words"
—(Budhistic remains in Andhra Desa.)

* "The term Deccan, a convenient and familiar corruption of the Sanskrit word (Dakshina) meaning the south, may be, and sometimes is extended so as to cover the whole of India south of the Narmada; but is actually understood as designating a more limited territory–the whole region occupied by Telugu speaking population as well as the Maharashtra."—(V. A. Smith, 439)

‡ ఆంధ్రుల చరిత్రము – 2 ప్రకరణము. హిందూమహాయుగము (1910) పే. 21, 22; ఆంధ్రపత్రిక 16–3–41.

Beginnings of South Indian History, P. 10

పర్వతమును చుట్టివచ్చి తూర్పు సముద్రతీరము వెంబడి వచ్చి, పైవరుసను వ్యాపించిరి. అందరికంటె తూర్పున నాంధ్రులును, వారికి పశ్చిమమున వరుసగా పుండ్రాదులును వ్యాపించినట్లు తెలిసికొనవలెను.* మరియు నాంధ్రులు ప్రథమమున పేర్కొనబడినవా రగుటచే నందరికంటె వారి కగ్రస్థాన మున్నటుల గ్రహింపవలయును. ఇప్పటికిని నీ పట్టికయందలి యన్నిజాతులకంటె నాంధ్రులే సంఖ్య యందును, నాగరకతయందును నగ్రస్థానము నాక్రమించియున్నారు. వీ రాక్రమించిన దేశభాగము కృష్ణాగోదావరీ మధ్య ప్రదేశమై తూర్పుసముద్రతీరమువరకు వ్యాపించియున్నది. ఇతరు లాక్రమించిన భూము లన్నిటికంటె ఫలవంతము. దక్షిణమునకు వచ్చినతరువాత వీరి కిదియే స్థిరనివాసము. ఇచ్చటినుండియే కొంతకాలమునకు సరిగ పశ్చిమమునకు వ్యాపించి పశ్చిమసముద్ర తీరము నంటిరి.♦ శాతవాహన సామ్రాజ్యకాలమున గోదావరీతీరమునందలి పైఠను (ప్రతిష్ఠాన)నగరము వీరి కొక రాజధానిగా నుండెను. శాతవాహనుల శాసనము లన్నియు పశ్చిమ దేశముననే లభించినవి. ఆ కాలమున పాటలీపుత్రము ముఖ్యరాజధానియై యమరావతీ ప్రతిష్ఠానపురములు రాజప్రతినిధుల నివాసము లయ్యెను. హాలుడు తాను తండ్రికాలమున నమరావతిలో రాజప్రతినిధిగా నున్నందున తనకాలమున నా పట్టణమునే సామ్రాజ్యరాజధానిగా చేసుకొనెను. ఒకకాలమున దక్షిణాపథమునంతను నాంధ్రులును మహారాష్ట్రులును నాక్రమించుకొనిరి. తుదకు సామ్రాజ్యాంతకాలమునకు ప్రథమనివాస మగు కృష్ణా గోదావరీ మధ్య ప్రదేశమునకు వచ్చి చేరిరి.❡ వ్యాపించినపుడు పశ్చిమమునకు కృష్ణా, గోదావరీ తీరముల వెంబడినే విసనకఱ్ఱవలె వ్యాపించిరి. ఇప్పటికిని హైదరాబాదు మధ్యగా జేసి యుత్తరదక్షిణముల కొక సమరేఖ గీచినయెడల, నా గీతకు తూర్పు భాగమంతయు నాంధ్రదేశము. ఇప్పటి నైజాంరాష్ట్రములో సగ మాంధ్రదేశభాగము. ఇచ్చటనే కాకతీయ సామ్రాజ్యము పుట్టి పెరిగినశించినది. ఇప్పటికీ క్రింది విషయములు నిర్ధారణచేయబడినవి.

1. ఆంధ్రులు ద్రావిడజాతివారు కారు. దస్యులై తరువాత నార్యులలో చేర్చుకొనబడినవారు.
2. వీరే తెలుగు లనబడువారు.
3. వీరు తూర్పు సముద్రతీరము వెంబడి వచ్చి తూర్పున స్థాన మేర్పరచుకొని క్రమముగా పశ్చిమమునకు వ్యాపించిరి.
4. వీరిభాషకు ప్రాకృతము, పాలీ, పైశాచము, ద్రావిడము, మొదలగు భాషల ప్రోద్బలము కలిగెను.

---

* పుండ్రులనగా గోండులు; శబరు లనగా సవరలు; పుళిందులు నర్మదాతీరవాసులు. ఈ జాతులు గోదావరి, విశాఖపట్టణము జిల్లాలలో పశ్చిమభాగములందు నివసించుచు మధ్యపరగణాలలోని కొంతభాగమును నర్మదానదివరకు నాక్రమించియున్నారు.

♦ "The Andhra state between the Kristna and the Godavari was among the earliest defections, and rapidly grew into a powerful kingdom, stretching right across India.''—(V. A. Smith, P. 204) ఆకాలమున విదర్భమును, కళింగమును, నాంధ్రదేశ భాగములే! బౌద్ధజాతక కథలలో పరామర్శింపబడిన ముళక, అశ్మక దేశములును నాంధ్రదేశభాగములే! —(Charmichael. Lectures, D.R. Bhandarkar)

❡ "Guided by discretion, valour-failing, the successors of Yagnasri confined themselves to Andhra home."—(Budhistic India, P, 67)

## II

## పరిసరములు - ప్రోద్బలములు

ఇట్టి యాంధ్రజాతియొక్క గుణశీలవృత్తములను తెలుసుకొనవలె నన్న వా రాక్రమించినగాని, వ్యాపించినగాని దేశముయొక్కయు, దాని శీతోష్ణస్థితులయొక్కయు, భౌతికసన్నివేశముల యొక్కయు జ్ఞాన మవసరము. ఏదేశ మాక్రమించిరో యెట్లు వ్యాపించిరో వెనుక కొంచెము తెలుసుకొనినాము. వా రాక్రమించిన దేశమునకు ఉత్తరపుటెల్ల గోదావరీనది. దక్షిణపు టెల్ల కృష్ణానది. తూర్పుపడమరల సముద్ర మున్నది. తూర్పుసముద్రము, వారు దక్షిణమునకు వచ్చినప్పటినుండియు వారికి విదితమే! పశ్చిమసముద్రముమాత్రము కొంతకాల మైనవెనుక తెలిసికొనిరి. శాతవాహనకాలమున నాంధ్రులు పశ్చిమసముద్రము ద్వారమున ఖండాంతరములకు వర్తకము సాగించిరి. ఈ యెల్లలమధ్య నుండు దేశములోని కొంతభాగ మతిభయంకరమైన దండ కారణ్యము. పర్వత పంక్తులచేతను, క్రూరమృగములచేతను, దట్టమైన వృక్షతతిచేతను నిండి యుండెను.* మరియు నీదక్షిణాపథము సువర్ణఖనులను రత్నఖనులను కలిగియుండెను. ఈ దండకారణ్యమే శ్రీరామునికి స్వాగత మిచ్చినది! ఈ యరణ్యముననే రావణుడు తన జనస్థాన మేర్పరచినది! అప్పటి కింకను నీ దండకారణ్యమున సంపూర్ణముగ నాంధ్రులు వ్యాపింపక పోవుటచే రావణునకు తావు దొరకెను. రామసహాయముతో నాంధ్రు లీ రాక్షసులను తమ దేశమునుండి వెడలగొట్టిరి. భవభూతి యీ దండకారణ్యమును గోదావరిని మిక్కిలి రమ్యముగా వర్ణించియున్నాడు. అగస్త్యుడుకూడ వింధ్యకు దక్షిణముననున్న యీ దండకారణ్యముననే తన యాశ్రమమును స్థాపించుకొనెను. విదర్భదేశము (బీరారు, బీదరులు) వింధ్యపర్వతమునకు దక్షిణముననే యున్నది. కొంతకాలమున కాంధ్రులు వీనినిగూడ నాక్రమించి మధ్యపరగణాలవరకు వ్యాపించిరి. కావున నీ దేశముయొక్క భౌతికసన్నివేశము వీరి వృత్తులపైనను, వీరి గుణ శీలములపైనను ప్రోద్బలము చేయక తప్పదు. మొత్తముమీద నాంధ్రదేశము మధ్యభాగ మెక్కు వగ నరణ్యాకీర్ణమై చుట్టును ఫలవంతమగు నదీతీరప్రాంతములచేతను, తూర్పు పశ్చిమ కనుమలకును సముద్రములకును మధ్యనుండు ఫలవత్ప్రదేశములచేతను నిండియుండెను. ఇట్టి స్థితిలో సుకుమారు లగు నదీసముద్రతీరప్రాంతవాసులు వృత్తులయందును గుణశీలములయందును, పర్వతారణ్యవాసు లగు శరీరపాటవము గల మధ్యదేశవాసులకంటె భిన్నులై యుండుట తప్పదు. అట్టిభేద మిప్పటికిని హైదరాబా దాంధ్రులకును, పర్వతప్రాంతవాసు లగు నాంధ్రులకును, తూర్పుజిల్లాలవారికిని చూడ గలము. నాగరకతలోను కొంత భిన్నత్వ ముండక తప్పదు. సువర్ణరత్నఖనిజములు మొద లైనవి కూడ నిట్టి మధ్యదేశముననే యుండెను.

---

* ఇప్పుడు నిజాంరాష్ట్రమునందలి సింగరేణి బొగ్గగను లీ నిబిడదండకారణ్యభాగమే! మౌర్యవ్యాపనకాలము వరకును నీ యరణ్యము కొంతవర కభేద్యముగనే యుండెనని తెలియును.

--(Beginnings of South Indian History, P. 101.)

తరువాత శీతోష్ణస్థితులను పరిశీలింతము. ఈ దేశము ముఖ్యముగ వర్షమునకై మేఘవాయువులపై (Monsoon Winds) నాధారపడియున్నది. ఇవి సంవత్సరమునకు రెండుమార్లు, ఒకమారీశాన్యము నుండియు, రెండవమారు నైరృతిమూలనుండియు వచ్చును. వీని గమనమును చూచిన వర్షపాతమునుగూర్చి మనకు తెలియగలదు. ఈశాన్యమునుండి వచ్చు మేఘములు మొదటనే తూర్పు పర్వతప్రాంతముల తమబరువు చాలవరకు తగ్గించుకొనును. నైఋతిమూలనుండి వచ్చు మేఘములు మధ్యప్రదేశమునందలి యరణ్యప్రాంతమున కొంచెముగ వర్షించిపోయి తూర్పుపర్వతపంక్తిచే నరికట్టబడి మిగిలిన యావత్తు వర్షమును నా ప్రాంతమున విడచును. అందుచే మధ్యప్రదేశమున మిక్కుటమగు వర్షము లుండవు. మరియు కృష్ణాగోదావరీనదులు పూర్వప్రవాహములకంటె నంత్యప్రవాహములు వ్యవసాయమునకును నౌకాయానమునకును ననుకూలములుగా నున్నవి. ఇంకను దేశము పశ్చిమమునుండి తూర్పునకు క్రమముగా నేటవాలుగా నున్నట్లు నదీపాతములే విశదము చేయుచున్నవి. అందుచే మధ్యప్రదేశమున నచ్చటచ్చట నుండు చెరువులలోతప్ప నీరుండుటకూడ కష్టము. ఈ కారణజాత మంతయు మొత్తమున పరీక్షించిన మధ్యప్రదేశముకంటె తూర్పు ప్రదేశము ఫలవత్తరమనియు మధ్యప్రదేశమున మెట్టపంటలకేగాని నీరు కావలసిన పంటలకు సౌకర్యము లేదనియు తెలియగలదు. ఈ మధ్యప్రదేశములు ఖనిజము లుండు స్థానము లయ్యెను. వానిలో రత్నములును సువర్ణమును ముఖ్యములు. దండకారణ్యము ఏనుగులు మొదలగుజంతువుల కాకరమైయుండెను కేవలము కృష్ణాగోదావరీనదులేగాక వాని యుపనదులును వీనిమధ్యనే కలవు. ఈ యుపనదీప్రాంతము కొంచెము మెరుగైన నేల కలది.

ఈ యాంధ్రులవలస యెప్పుడను ప్రశ్నము రావచ్చును. ఋగ్వేదకాలమును పలువురు పలువిధముల తెల్పుచున్నారు. మాక్సుముల్లరు పండితుడు చెప్పిన దానికంటె నా కాలము పరిశోధనములచే వెనుకకు వెడలుచున్నది. హిందూదేశమునకు సంబంధించిన పురాతనసిద్ధాంతము లన్నియు తప్పులని తర్వాత పరిశోధనలవలన తేలుచున్నది. కాబట్టి ఋగ్వేదకాలము క్రీ. పూ. 3500 వరకు వెనుకకు నెట్టినను తప్పు కానేరదు. ఋగ్వేదబ్రాహ్మణమగు నైతరేయమునకు వెనుకటికంటె 500 సంవత్సరముల యర్వాచీనత కల్పింపవచ్చును; అనగా 3000 సంవత్సరములు. ఆంధ్రుల కథ యిందుండుట కది యింతకు పూర్వమే జరిగియుండవలెను. పరిశీలించిన నీ కాలము శ్రీ నడింపల్లి జగన్నాథరావుగారి యూహవద్దకు వచ్చుచున్నది.† అంత ప్రాచీనకాలమునుండి యాంధ్రులీప్రాంతమునకు వచ్చి యిచ్చటి యాదిమనివాసులతో కలసిపోయినారు. అనగా వీ రిచ్చటికి వచ్చి షుమారు 5000 సంవత్సరము లగును. మొహెంజోదారో నాగరకత ద్రావిడ మని శ్రీహీరాసుగారు తెల్పుచున్నారు. దానితో మా ద్రావిడ సోదరులు సంతసించుచున్నారు. మొహెంజోదారో నాగరకత యున్న కాలమున దక్షిణాపథమున నాంధ్రు లున్నట్లు నమ్మవలెను. వారే కొందరు చెప్పినట్లు ద్రావిడులైన, మొహెంజోదారోనాగరకతలో వారికి పాలున్నదిగదా? అట్లు కాకపోయినను నాంధ్రు లింతకు పూర్వమే యిచ్చట కొంత నాగర

† Vide foot note on page 203 of this Volume.

కతతో నున్నట్లును, వారికిని మొహెంజోదారోకును కొంత సంబంధ మున్నట్లును సాక్ష్యము కలదు. నిజాం గవర్నమెంటువారి ప్రాచీనవస్తురక్షణశాఖాధ్యక్షు డగు గులాం యజ్దానీగా రిట్లనుచున్నారు.

"The pottery shows a highly developed industry, being wheel turned and having fine polish......Some of the vessels bear marks which have not been identified as yet and they may perhaps be the earlier forms of Mohenjo Daro and Harappa marks."

"I have noticed that in the case of Harappa tombs you have given 2000 B. C as their approximate date. We also on the basis of the cultural activities of the Historic period of the Deccan as well as from the evidence provided by the gold industry, which was in full swing during the Mouryan period, and even much earlier, have come to the conclusion that the Iron age of the Deccan goes back to 3000 B.C. ఈకాలము నేను వెనుక చెప్పిన కాలమునకు సరిపోవుచున్నది. "Sir John Marshall in his volumes on Mohenjo Daro has observed that the Gold of Mohenjo Daro might have come from the South. If this view is correct then some of the precious stones such as rubies and lapis-lazuli might have been given in return to the people of the Deccan for the gold obtained from them." (Extracts from the Presidential address to the Indian History Congress, Lahore 1940) పై యభిప్రాయమును బట్టి మొహెంజోదారోలో ద్రావిడ నాగరకతకు 1000 సంవత్సరములకు పూర్వమే యార్యులు దక్షిణాపథమున తమ నాగరకతను వ్యాప్తము చేసినట్లును, నిచ్చటి పరిశ్రమల నభివృద్ధి పరచినట్లు గ్రహింపవలెను. బంగారుపని, కుంభకారత్వము నను వృత్తులు పైన నుల్లేఖింపబడినవి.

ఆ కాలముననే యాంధ్రులు పశ్చిమమునుండి తూర్పున కేకనాగరకతను స్థాపించినట్లు కన్పడును. "Our roughly finished hoary specimens may go back to several thousand years B. C perhaps touching the Palaeolithic period, but so far we have not found any specimens of that period, although in the Indian Museum, Calcutta there is a Palaeolithic found at Paithan and another discovered near Paloncha (పాలవంచ) both places being in the Nizam's Dominions." (Ibid). దీనివలన పశ్చిమ గోదావరీతీరమునుండి తూర్పున కృష్ణాతీరమువరకు నొకే నాగరకత యున్నట్లు స్పష్టము. ఈ కాలము భారతరామాయణకాలమునకు వెనుకనై యుండునని తోచును. ఏలన భారతరామాయణములలో నాంధ్రులరాజ్యప్రశంస కలదు. అప్పటి కింకను నుత్తరదక్షిణహిందూస్థానముల కెక్కువ సంబంధము లేకుండెను. అట్టి సంబంధము బౌద్ధమతవ్యాపనముచే హెచ్చెను. బుద్ధునికాలముననే యార్యమతము దక్షిణాపథమున వ్యాప్తమై వర్ణవ్యవస్థ యములులో నుండెను.* ఆ కాలముననే యూపస్తంభాదులు వీనిని స్థిరీకరించుటకు యత్నించిరి. అప్పటికే యాంధ్రులు యావద్దక్షిణాపథమును వ్యాపించిరి. అశోకుని కాలమున దక్షిణాపథములోని సువర్ణగిరియందు రాజప్రతినిధి యొక దుండి యా

---

* చూ. బావరీ జాతకము.

ప్రాంతము నేలుచుండెను.♦ అప్పుడు వృత్తులును నాగరకతయు, లలితకళలును మునుపటికంటె నెక్కువగా పరిశ్రమ చేయబడెను. కాని, కొన్ని పరిశ్రమలును, కళలును, నింతకు పూర్వమే యచ్చట నున్నవనుట స్పష్టము.*

ఉత్తరమునుండి వచ్చిన యాంధ్రులయొక్కయు నిచ్చటి స్థానికుల యొక్కయు నాగరకతలకును, మతములకును, నాచారవ్యవహారములకును సమ్మేళనము కలిగెను. ఆంధ్రులుత్తరమునుండి గొప్ప కళాదృష్టి తెచ్చి నాటిరి. అది వస్తువులలో కన్పట్టుచుండెను. రాళ్లు చెక్కుటయందును, వ్యవసాయోపకరణములు తయారు చేయుటయందును, నీ కళాదృష్టి వ్యక్త మగుచుండెను.

"I may also remark that the shape and finish of some of those tools show the fondness of the early Deccan man for beauty of form and perfection of finish, which qualities are essential for the beginning and development of art among every race"
(Ibid)

ఈ కళాదృష్టి తరువాత యెల్లోరా, అజంతా చిత్రములలోను, అమరావతి, భట్టిప్రోలు మొదలగు స్తూపములలోనుండు చిత్రములలోను వ్యక్తమైనట్లు గ్రహింపవలెను. ఈ యభివృద్ధి యంతయు శాతవాహనకాలమునుండియు, తరువాతకూడ ననువృత్త మయ్యెను. అశోకుని కాలము తరువాత క్రమముగా శాతవాహనులు విజృంభించిరి. ఈ శాతవాహనసామ్రాజ్య మవిచ్ఛిన్నముగ దాదాపు 600 సంవత్సరములు వ్యాప్తమయ్యెను. ఈ కాలమున నాంధ్రుల జాతీయజీవనము హాలుని సప్తశతియందును గుణాఢ్యుని బృహత్కథయందును ప్రతిబింబితములై యున్నవి. ఈ పుస్తకముల గొప్పదనము చెప్పుటకు ప్రత్యేకవ్యాసము కావలయును. శాతవాహనుల తరువాత వలసలన్నియు పశ్చిమమునుండి తూర్పునకు వచ్చెను.‡ సామ్రాజ్యవిస్తీర్ణము తగ్గెను. క్రమముగా నాంధ్రదేశము నిక్ష్వాకులు బృహత్ఫలాయనులును శాలంకాయనులును విష్ణుకుండినులును నేలిన వెనుక చాళుక్యులు తమ సామ్రాజ్యమును స్థాపించిరి. అప్పటినుండి యాంధ్రులవాఙ్మయజీవనము వృద్ధియగుట ప్రారంభించెను కాకతీయసామ్రాజ్యమున నది వఱలి తరువాత రెడ్డివెలమ ప్రభువుల

♦ ఇది మస్కియని కొందరి యభిప్రాయము. ఏలన హట్టి యనుస్థలమున నిప్పటికి సువర్ణము లభించును.

* "Some of the specimens (of pottery) are similar in some respects to the North Indian pottery of the Mouryan period, but here I may utter a word of caution regarding the use of Mouryan or Gupta in respect of Deccan or South Indian antiquities, **because in architecture painting and sculpture and even in crafts like ivory and wood-carving or weaving, the Deccan and South India had attained very high standards long before North Indian religious and political ideas affected this part of the country."** ( Ibid )

"According to our researches the Deccan defied the political and artistic superiority of the North until 3rd century, A. D. — (Presidential address of the 11th Oriental Conference, 1941)

‡ వీనిని చూచియే కావచ్చును పి. టి. శ్రీనివాసయ్యంగారు ఆంధ్రులవలస పశ్చిమమునుండి తూర్పునకు వ్యాపించెనని చెప్పిరి.

ప్రాపున నీ నాగరకతే యనువృత్తమై తుదకు విజయనగరసామ్రాజ్యమున సమ్మేళనము నందెను. అంతతో ప్రాభవము తగ్గుట తటస్థించెను. తరువాత కొంతకాలము తంజావూరున నీ నాగరకత ప్రతిఫలించెను.

## III పరిశ్రమలు—వృత్తులు

వెనుకనే స్వర్ణకారిత్వ కుంభకారిత్వమును మనవిచేసియున్నాను. మరియు నినుము రాయిపరిశ్రమలను స్పృశించియున్నాను. ఇనుమును కరగించిన కొలుము లీ దేశమున ననేకస్థలముల దొరికినవి. ఆంధ్రులకు వ్యవసాయము ముఖ్యవృత్తి. మెరకనేల పల్లపునేల వ్యవసాయములు రెండును వారికి తెలియును.

ఆంధ్రు లెప్పుడును తృణకాష్ఠజలసమృద్ధి గల ప్రదేశములను కోరుచుండిరి. అందుచే విడిసినప్పుడు రెండునదులకు మధ్య ప్రదేశమున వాని యుపనదీతీరములను విడిసిరి. వ్యాపించినప్పుడుకూడ నదీతీరముల వెంబడే వ్యాపించిరి. నీటికి నదులును, కట్టెల కడవులును, పశువులమేతకు బయళ్ళును కలిగిన ప్రాంతమున వా రెక్కువగా వ్యాపించిరి. వెనుక వర్షము కురియు విధములను పేర్కొని యున్నాను. ఆ రెండువిధములు రెండు కాలములు. మొదటిది జ్యేష్ఠాషాఢవర్షకాలము. రెండవది చిత్తస్వాతి విశాఖకార్తెల వర్షకాలము. ఈ రెండుకాలములు నాంధ్రులకు ముఖ్య వ్యవసాయ కాలములు. అందుచే నీరెండుకాలములును వీరికి పండువుకాలము లయ్యెను. మొదటికాలపు పండువు ఏర్వాకపున్నమి.*

ఇది రయితుల వ్యవసాయమునకు పునాదిపండుగ. ప్రథమవర్షము కురిసినదిగాన నిక వ్యవసాయ ప్రారంభము చేయ నగునని తెల్పునది. ఈ దినమున రైతులు తమ నాగళ్ళను నెడ్లను నలంకరించి వర్జ్యములేనికాలముగా చూచి యింటివద్దనుండి బయలుదేరి పొలమున నాగలి సంస్కారము చేయుదురు. ఈ దినముననే పనివాండ్రు ఉద్యోగము ప్రారంభము. ప్రాత పనివాండ్రు నుంచుటో క్రొత్తపనివాండ్రను పెట్టుటో యీ దినముననే జరుగును. ఈ దినముననే పనివాండ్రు కిచ్చు జీతము లిచ్చివేయబడును.♦ ఇది రైతులకు ముఖ్యమగు పండుగ. రెండవది సంక్రాంతి (బొమ్మల) పండుగ. ఇది రెండవ వర్షకాలాంతమున కొలది దినములకు వచ్చును. దీనిని మకరసంక్రాంతి పండుగని యందురు. సంక్రాంతి యనుపద మార్యులది. కాని యది మామూలు మాటలలో నాంధ్రదేశమునం దంతటను బొమ్మల పండుగ యని యందురు. బొమ్మలపరిశ్రమ యాంధ్రదేశమున ననాదిసిద్ధము. బొమ్మలు మనసుకు సంతసముగొల్పునవి కావున బొమ్మలపండుగ యాంధ్రుల సంతోషసూచక మగునది. స్వాతి విశాఖకార్తెలలో కురిసిన కొలది వర్షములచే సస్యముల కంకు

* ఏఱు + వాక = ఏఱువాక: ఇందలి రెండు పదములును దేశ్యములు. ఏరు = పెద్దనది, వాక = చిన్నవాగు, ఆంధ్రదేశమునందలి నదు లీ రెండు విధములు. ఈ రెండింటివలన వ్యవసాయ మగును గాన నీపండుగ కీ పేరు వచ్చినది.

♦ వీరశైవమందుకూడ నీ యాచారమే కలదు.

లభివృద్ధియై ఫలింపగా రయితు సస్యములను కోసుకొని, ధాన్య మింట చేర్చి యావత్సంవత్సరమునకు నిలువ యుంచుకొని జరుపు పండుగ యిది. ఈ కాలముననే యాంధ్రదేశమున ముఖ్యపంటలలో నొకటియగు మిరప ఫలించును. బంతిపూవులు పూచును. కూరగాయలు విరివిగా కాయును. ఇవి యన్నియు "పాలవెల్లి'' లో గ్రుచ్చి కట్టుదురు. ఈ రెండు పండువులును నదీమాతృకలును దేవ మాతృకలును నగు ప్రదేశములగూడ జరుపబడుచున్నవి. జ్యేష్ఠమాసముననే మొదట మెరక పంట నాటుదురు. కొన్ని పంటలు సంక్రాంతికాలమున ఫలించును. ఈ ప్రకారముగ నీ రెండు పండుగలును నాంధ్రుల ప్రత్యేకస్వములు వరిపంట యాంధ్రదేశమున ననాదిగా నున్నది. ఆనకట్టలతో రాలేదు. ఆనకట్టలకు పూర్వపు వరిపండు భూముల నిప్పుడు "మామూలు పల్లము'' లని పిలుతురు. చెరువులక్రిందకూడ వరిపంట కలదు.

> "పండి తెల్లబారు వరిచేనులను జూచి, యేల మొగము వంచి యేడ్చెదమ్మ
> చూడు జనుపచేను సొగసయ్యె నరదళం, బలదికొన్న యాటవెలదిబోలె."
>
> —(గాథాసప్తశతి)

ఈ చెరువులక్రింద పంట యాంధ్రదేశమున నెక్కువగా నున్నది. ఏర్వాకతో వ్యవసాయము ప్రారంభమై సంక్రాంతితో నంత మొందును. తరువాత మరల భూమి బలపరచుకాలము. వెనుక పండించుకొన్న పంటలను తెలుగురైతు సంవత్సరము నంతయు ననుభవించును. మిగిలియున్న పండుగలును నార్యానార్యసంపర్కమువలన వచ్చినవి. ఇవి రెండుమాత్రము దేశముయొక్క భౌతికసన్నివేశములపై నాధారపడియున్నవి.

ఇచ్చట పూర్వులు పాతిపెట్టబడిన సమాధులు కలవు. ఆంధ్రులవలనకు పూర్వము పాతిపెట్టు నాచార మిచ్చట నుండి యుండును. మరల బౌద్ధులకాలమున నా యాచారము వరలెను. ఈ సమాధులలో వ్యవసాయపుపనిముట్లు దాచబడియున్నవి. కొడవలి, కత్తి మొదలగు పనిముట్లు వీనిలో ముఖ్యములు. రాతిపలకలను చెక్కుటకూడ చేయబడు చుండెను. మధ్యదేశపుటడవులలో నేనుగు లుండెను. కాన దంతపుపనియు, పూసలపరిశ్రమయు నా యా ప్రాంతముల విరివిగా నుండెను. ఇప్పటికిని నిజాంరాష్ట్రమున కొన్ని యరణ్యప్రాంతములలో లంబాడీలు కలరు. వా రాంధ్రము మాటలాడుదురు. వారు తమచేతులకు దంతములతో చేయబడిన కడియములను పదులను ధరించుట కలదు. పూసలపరిశ్రమ చాల విరివిగా నుండెను. ఇటీవలివరకు నీ పరిశ్రమ వాడుకలో నుండి యొకకాలమున నిచ్చటి పూసలు మలయాప్రాంతమున కెగుమతియగుచుండెను.* బొమ్మలుచేయు పరిశ్రమ చాలా విరివిగా నుండెను; ఏలన బొమ్మలపండుగ యాంధ్రుల ముఖ్యపండుగ. ఇప్పటికిని

*"The bead industry in the Deccan continued to quite a late time, and recently the excavations that have been made by an expert under the auspices of the Royal Asiatic Society of Great Britain in the Malaya Peninsula prove that the Deccan was exporting beads to that region and to islands in the neighbourhood as late as the 7th Century A. D." —(Ibid)

కొండపల్లి బొమ్మలపరిశ్రమ యావద్భారత ప్రశస్తిని పొందియున్నది. ఆంధ్రుల నౌకాపరిశ్రమ వెనుక సుల్లేఖించియున్నాను. తూర్పుతీరమున మొదట నీ పరిశ్రమ యెక్కువగా నుండెను. శాతవాహనకాలమున నాంధ్రులు భరుకచ్ఛాది పశ్చిమ సముద్రతీరప్రాంతములనుండి విరివియైన నౌకావర్తకము సాగించుచుండిరి.* క్రీ. పూ. నుండియే సింహళమునకును నాంధ్రదేశమునకును వర్తకసంబంధమున్నట్లు చరిత్రాధారములుకలవు.♦ శాతవాహనసామ్రాజ్య మంతరించినవెనుక నాంధ్రులు తమ స్వస్థానమునకు వచ్చిచేరిన తరువాత వేంగిపురము ప్రాముఖ్యమునకు వచ్చెను. ఇక్ష్వాకు లాంధ్రులవలసలకు సాయ మొసర్చిరి. ఈకాలమున నాంధ్రులు విదేశవలసలు సాగించి తమ నాగరకతను పసిఫిక్ మహాసముద్రద్వీపముల వ్యాపింపజేసిరి.‡ వేంగిపట్టణము వర్తక కేంద్రమైపోయెను. మోటుపల్లి మొదలగు సుప్రసిద్ధ రేవుపట్టణములు వర్ధిల్లెను. కళింగదేశముకూడ నీ నౌకాయానమున ప్రశస్తిని పొందెను. ఆంధ్రదేశమున నీ నౌకాయానము కాకతీయసామ్రాజ్యమువరకును వ్యాపించియుండెను. గణపతిదేవ రుద్రాంబలకాలమున వర్తకసుంకము లుండినట్లును, సముద్రపుదొంగలనుండి రేవుపట్టణములను రక్షించుటకు గట్టియత్నములు చేయబడినట్లును చారిత్రకులు చెప్పుచున్నారు.❡ ఆంధ్రు లెన్నివలసలు పోయినను, పోయినచోట స్థిరనివాస మేర్పరచుకొని యచ్చటి వారితో కలసి పోయినారేగాని యైరోపీయులవలె నచ్చట ధనార్జన మొనరించి స్వస్థానములకు చేరుకొనలేదు. ఇది వారియందున్న యొక విశిష్టగుణము. చర్మకారవృత్తి చండాలురయందుండెను. ఆంధ్రులు పాదరక్షల నుపయోగించినట్లు చిత్రములలో తార్కాణములు కలవు. మత్స్యముల ననేకవిధములుగ నిల్వయుంచి యది యొక పరిశ్రమగా చేసిరి. ఇది సముద్రతీరముననే యెక్కువగా వరలెను. నేతపరిశ్రమ మిక్కిలి ప్రశస్తి గాంచెను. ఇంతియేగాక యీ బట్టలకు చక్కని రంగులను వేయు రంగుల పరిశ్రమ యుండెను. ఈ సన్నని బట్టలును, రంగుల బట్టలును విదేశీయులు విరివిగా కొనుచుండిరి.

---

* కొండలు శాతవాహనుల నాణెములపై ఓడముద్ర కలదు.

♦The settlement of Rakshasas on the lower Godavari valley called Janasthana, formed part of Ravana's realm and there must have been intercourse between Ceylon and Janasthana by sea."
—(Dravidian India P. 15)

‡ అరకాను (Arakhan) ముఖ్యపట్టణము త్రిలింగము. సయాము (Siam)లో కాకుళ ముండెను.
Burma = బ్రహ్మదేశము, Indo-China = చంపదేశము
Singapore = సింహపురము, Sumatra = Kataha

❡ ప్రాచీనాంధ్ర నౌకాజీవన-చరిత్రము.
"The Andhras seem to us a glorious race. To them we owe the school of Amaravathi sculpture, the philosophical school of Nagarjuna, and it is probably from the Andhra parts that the vessels which have civilised Indo-China, Java and Sumatra have started"
—(Dubreuil)

రోమున కెక్కువగా నెగుమతియగు చుండెను.* ఇప్పటికిని చీరాల, మచిలీపట్టణము మొదలగు ప్రదేశములలో నీ పరిశ్రమలు విరివిగా సాగుచునే యున్నవి. ఇతరవృత్తులును ప్రచారములోనే యుండెను. ఆపస్తంబునికాలమునాటికే జన్మవల్ల జాతినిర్ణయ మున్నట్లు కానవగును. వృత్తి వ్యత్యయమును ననులోమవిలోమ వివాహములును జరుగుచున్నట్లు తెల్లమగుచున్నది. దేశము పట్టణమయముగాక జనపదమయముగా నుండెను. వ్యవసాయము ముఖ్యవృత్తిగా నున్నందున నిది సమంజసమే ! వ్యవసాయముతోబాటు క్రయవిక్రయముకూడ నొక ముఖ్యవృత్తిగ నుండెను. ఇనుము బంగారమేగాక యింకను కొన్ని యితరఖనిజము లున్నట్లు చెప్పుచున్నారు. ఆ పరిశ్రమ లన్నియు మంచి ప్రచారములో నుండెను.♦

# IV

## గుణశీలములు ‡

### స్వాతంత్ర్య ప్రియులు :

ఐతరేయ బ్రాహ్మణగాథ వలననే యీ గుణము స్పష్టపడుచున్నది. తమ స్వాతంత్ర్యమునకు భంగము గలిగినపుడు తల్లిదండ్రులనైనను విడనాడుటకు వెనుదీయలేదు. దేశాంతరమునకుకూడ వెడలిపోయిరి. అయినను తమ సోదరులగు నార్యుల కెట్టి యొత్తిడి కలిగింపరైరి. సోదరులకు కష్టము కలిగినపుడు సానుభూతిని చూపుట వీరి సహజగుణము. సరిహద్దులలోనుండి సోదరార్యుల యాశ్రమములను కాపాడుచుండిరి. స్వార్థము నొకప్పుడు పరులకొరకు మరతురు. ఈగుణ మిప్ప టికి ననువృత్త మగుచున్నదని చెప్పనగును. ద్రావిడప్రాబల్యముగల మద్రాసురాష్ట్రమున నుండుట యార్థికముగ తమగు నష్టకరమని తెలిసి 30 సంవత్సరములనుండి ప్రచారము చేయుచున్న

---

* ఈ విషయమును టీసియస్ (Ctesias) అను గ్రీకుచరిత్రకారుడు చెప్పియున్నాడు. "మన దేశమున తయారుచేయబడు చుండిన సన్నబట్టలు, రంగుగుడ్డలును పాశ్చాత్యదేశములో విరివిగ ధరింపబడుచుండెడివి. అందుమూలమున పెక్కు శతాబ్దముల కాలము విదేశములనుండి యాంధ్రదేశమునకు బంగారపు నదులు ప్రవహించుచుండెడివి."

—(Dr. M. RamaRao in Andhra Patrika, D/ 28-3-41)

మఛిలీపట్నము = Masolas, మన్నేరు = Manarpha

కొత్తపట్నము = Kottis, ఘంటసాల = Konta-Kosyala

గూడూరు = Kindur

♦ "The diamond mines of Parityala (Kistna District,) the Copper mines of Vinukonda (Guntur District) the lead mines of Palnad (Guntur Dist.) and the marble quarries of Sattenapalli (Guntur Dist.) ware worked in early times."

—(Buddistic Remains, P. 133)

‡ "స్వాతంత్ర్యప్రియత్వమును, కళాభిరతియు, విజ్ఞానవ్యాపకత్వమును ఆంధ్రుల విశిష్టలక్షణములు."

—(Dr. M. RamaRao, Andhra Patrika D/ 28-3-41)

యాంధ్రరాష్ట్రోద్యమమును వదలి సకలహైందవకల్యాణమునకై గాంధిమహాత్ము ననుసరించిరి. ఈ విషయము వారి సహజౌదార్యమును చాటుచున్నది.

**హృదయ వైశాల్యము :**

పైన తెల్పిన కొన్ని విషయము లీ గుణమునకు తార్కాణములుగ నున్నవి. తా మార్యసంతతి వారయ్యు, ననార్యమధ్యమునకు వెడలగొట్టబడియు, తాము గొప్పజాతివార మను గర్వము గాని యహంకారముగాని లేకుండ తమ యితర సోదరులవలె నీ నూతనజాతిపై తమ యధికార మును చూపక, వారితో కలసిమెలసిపోవుటకంటె నింకేమికావలయు? జాత్యభిమానము గర్వ కారణమును నసహనకారణమును కాలేదు. ఆర్యు లెచ్చటికి వెడలినను వారి నాగరికతను భాషను నితరులపై బలవంతముగ నంటగట్టుట సహజము. ఆంధ్రు లట్లుగాక వారి సమ్మతితో నాగరికతను వ్యాపింపజేసిరి. భాషావిషయమునగూడ సాంకర్యమున కొప్పుకొనిరి. ద్రావిడులతోను, నాగుల తోను, తుదకు రాక్షసులతోకూడ కొంతవరకు మైత్రితోనే మెలగిరి. ఆపస్తంబాశ్వలాయనులుకూడ బౌద్ధమతవిషయమున చూపిన యసహనము ననార్యమతములయెడ చూపరైరి.

**మతసహనము :**

ఇది యాంధ్రుల ముఖ్యగుణములలో నొకటి. వారి స్వమతాభిమానము మతద్వేషమును ప్రేరే పింపలేదు. తా మార్యులయ్యు ననార్యులమతమును ద్వేషింపకపోవుటయేగాక వారి మతమునందలి కొన్ని యాచారములను తాము గ్రహించిరి. మరియు వారితో నంతర్వివాహాదిసంబంధములను నిర్వర్తించిరి. ఈ యాచారములను కొన్నింటి నాపస్తంబాదులుకూడ తమ సూత్రములలో చేర్చ వలసివచ్చెను ఆయనకాలములోనే యనులోమవివాహాదులును వృత్తివ్యత్యయాదులును జరిగినట్లు దృష్టాంతము లున్నవి. ఈ మతసహన మను గుణ మిప్పటికిని చాలవర కనువృత్తమైయున్నట్లు చూడగలము. క్రైస్తవమతము, బ్రహ్మసమాజము మొదలగు నూతనమతము లుద్భవిల్లిన ప్రథమ దినములలో కొంత వైముఖ్య మున్నను కాలక్రమమున నది సమసిపోయెను. ఆర్యుల వైదికమత మును, ననార్యుల భక్తిమతములును, జైన బౌద్ధములును మొదలగు ననేకమతములు ప్రక్క ప్రక్కలనే వరలుచున్నవి. ఒక కాలమున బౌద్ధమత మితరులను నొత్తిడిచేయునపుడు వారి కాంధ్ర దేశము పోషణ మిచ్చినట్లు "బావరిను" జాతకకథవలన తెలియుచున్నది. ఈ గుణమువలననే జస్టిసుపక్షము ద్రావిడదేశమున కల్గించినంత వైషమ్య మాంధ్రదేశమున కలిగించలేదు. ఇటీవల రాధాస్వామి, హరనాథభక్త సిద్ధాంతములు చాల ప్రచారములో నున్నవి.

**మైత్రి :**

ఇది కూడ ఆంధ్రుల సహజగుణములలో నొకటి యని పైన చెప్పిన విషయములవలననే బోధపడి యుండును. ఏ నాడు రామునితో సంబంధము కల్గెనో యాయన మనకు మిత్రుడై, దైవమై, వరలు చున్నాడు. ఆయన సాయముచే జనస్థానమునుండి రాక్షసులను వెడలగొట్టినాము. ఆ విషయమునకు

శాశ్వతముగ కృతజ్ఞులమై యున్నాము. పంచవటిలో శ్రీరాముని నిల్పి యాదంపతులను సేవించి నాము. రావణుడు సీత నపహరించినప్పు డాయనకు సానుభూతిని చూపినాము. మన దేశ మంతయు నా యమ్మకొరకై వెతకినాము. తుద కా దంపతులకు మన హృదయములలో శాశ్వతస్థానము నొసగి నాము. ఆంధ్రులకు రామాయణముపై నున్నప్రీతి భారతముపై లేదు. రామాయణాంధ్రీకరణము లున్నన్ని భారతాంధ్రీకరణములు లేవు. గ్రంథబాహుళ్య మొక్క గొప్ప యభ్యంతరము కాదు. తుదకు యావదాంధ్రదేశమునందును వివాహాదిమహోత్సవములందు వారి నామములను తలచు చున్నాము. ఈ మైత్రి యిప్పటికిని ననువృత్తమై యున్నది.

**ఉ దే్ర క ము :**

ఇది యొక గుణమని చెప్పుటకు నా యాంధ్రసోదరులు నన్ను మన్నింతురుగాక! నూతనవిషయ ముగూర్చి వీరు ప్రథమో దే్రకమును చూపుదురు. ఈ గుణ మిప్పటికిని వీరియం దనువృత్తమై యున్నదని వేఱ చెప్పనవసరములేదు. 1921 సంవత్సరమునుండి వచ్చిన ప్రతిసత్యాగ్రహసమర మునను వీ రుదే్రకమును చూపుచునేయున్నారు. ఒక్కటిమాత్రము చెప్పుట యవసరము. కార్యోత్సాహ మున్నను నా ప్రయత్నమును తుదనెగ్గించు పట్టుదల కొంచెము తక్కువ యని మాత్రము చెప్పవలెను.

**క ళా ప్రి య త్వ ము :**

ఇది వీరి కనాదిసిద్ధమైన గుణము. లోహయుగమునుంచికూడ వీరివద్ద నీ గుణము కలదు. వెనుక యజ్దానీగారి వాక్యములలో నొక వాక్యము ననువదింతును.

"I may also remark that the shape and finish of these tools shows the fondness of the early Deccan man for beauty of form and perfection of finish. ............................"

మన చేతలలోను, మాటలలోను, దుస్తులలోను నీ గుణము స్పష్టమగుచున్నది. మన భావను చూచిన మొదటి పైశాచి ప్రాకృతమును, తజ్జన్యమగు తెనుగుకూడ నజాతములై యున్నవి. దక్కను పీఠభూమియందలి చిత్రములేగాక యజంతా చిత్రములును, నమరావతీత్యాదిస్తూపము లందలి చిత్రములును నాంధ్రులకళాప్రియత్వమును వేనోళ్ళ చాటుచున్నవి. ఈ కళాప్రీతి యిప్ప టికిని వీరియందు కలదు. పురుషుల కాప్రింగులును, స్త్రీల నేపథ్యాదికమును నిచ్చుట సాక్ష్యము నియ్యగలవు. సినిమాకళను తీసుకున్న మన మెవ్వరికిని వెనుదీయలేదు. ఒక్క యీ కళయందే కాదు——మన సారస్వతాదిసర్వవిషయములయందును మన మీ కళాప్రియత్వగుణమును చాటుచునే యున్నాము. మన సారస్వతమును, మన గానమును, మన నాట్యమును నీ కళాప్రియత్వము నఖిల భారతదేశమునకు చాటినవి. ప్రసంగవశమున నొక్క విషయమును ముచ్చటించుట ప్రస్తుతము. నాట్యకళ కిప్పుడు చాల ప్రాముఖ్య మొసగబడుచున్నది. చతుర్విధనాట్యము లగు సాత్వికాంగి కాహార్యవాచకములలో మిగిలిన మణిపురాదినాట్యసంప్రదాయములు మొదటి మూడింటినే యాదరించినవి. మొత్తమున చతుర్విధముల నాదరించిన నాట్యసంప్రదాయ మొక్క కూచిపూడిదే

యని నేను సగర్వముగా చెప్పుచున్నాను. ఉదయశంకరునివద్దనుండి గోపీనాథునివరకు నందరును మూగవారేకాని నోరు తెరచి వారి వాగ్గ్రంథమును గ్రుమ్మరింపరు. అందుచే నవి బొత్తుగ సంజ్ఞలే కాని వానిని సంపూర్ణనాట్యసంప్రదాయము లనుటకు వలనుపడదు. ఈ విషయము ముఖ్యముగ గమనింపదగినది. ఈ కళాప్రియత్వము శ్రీ త్యాగరాయలవారు తమ యపూర్వ సంగీత శాస్త్రాభిరుచియందు భక్తితో సమ్మేళనము చేసినారు. పూర్వమునుండి మన యిండ్లలికి ముగ్గులు పెట్టుకొను నాచారము కలదు. అందు శుచియు కళాప్రియత్వమును వెల్లడియగును. పాశ్చాత్య నాగరకత గృహనిర్మాణమునం దనేకమార్పులను తెచ్చిపెట్టినది. వానియందు కళాసౌందర్యములు మృగ్యములు.

**లో పా భా స ము లు :**

నిజము చెప్పుకొనవలె నన్న కొన్నివిషయములు విమర్శింపవలెను. మనయందు వెనుకటి సద్గుణములతోపాటు కొన్ని మార్చుకొనవలసినవి కూడ నున్నవి. అందు మొదటిది అనుకరణము. కొంత కాలముక్రిందట శ్రీ తలిశెట్టి రామారావుగారు భారతిలో నొక హాస్యచిత్రమును ప్రకటించినారు. అందు బంగాళీవా డొకడు నాగస్వర మూదుచున్నాడు, అరవసోదరు డొకడు మృదంగమును వాయించుచున్నాడు, ఆంధ్రుడు నాట్య మాడుచున్నాడు. ఇందు కొంత సత్య మున్నది. ఈ యనుకరణము జుట్టువిషయమున క్రాపింగులలోను, నేపథ్యమును సూటు హాటు లుంగీ పైజామాలలోను, సంగీతమున సినిమాపాటలలోను, చిత్రలేఖనమున బంగాళా సంప్రదాయమునను, సారస్వతమున నాంగ్ల బంగాళ మహారాష్ట్ర నవలానాటకానుకరణములలోను, నాహారవిషయమున కాఫ్యాది పానీయములలోను నింకను ననేకవిధముల కన్నులకు కట్టుచున్నది. ఇంతమాత్రముచే మనకు ప్రజ్ఞ లేదని నా యాశయము కాదు. భాషాప్రయుక్తరాష్ట్రవిభజనసూత్రమును మనమే కనిపెట్టినాము. శ్రీ గాంధీమహాత్మునికి ఉప్పుసత్యాగ్రహ మను విషయమును సూచించినది మన నాయకుడగు డాక్టరు పట్టాభి గారను ప్రతీతి కలదు.

మనకు పెద్దలయెడ భక్తిప్రపత్తులు చాల తక్కువ. మన రాష్ట్రమున కందరిచేత గౌరవము పొందు నాయకుడు లేడు. సంయుక్తరాష్ట్రమున జవాహర్లా లున్నట్లుగాని, గుజరాతున వల్లభాయి పటేలున్నట్లుగాని, బీహారమున రాజేంద్రబా బున్నట్లుగాని సర్వజనులచే నంగీకృతు డగు నాయకు డున్నాడా? ఉన్నను నట్టివానియందు మనము నెరసులనే వెదకుదుముగాని యాయన నాయకత్వము నొప్పుకొనము. ఒకమారు గాంధీమహాత్ము డాంధ్రదేశమున నందరును నాయకులేననియు, ననుయాయులే లేరనియు నుడివియున్నాడు. ఇది యొక గుణము. దీనితోపాటు మనలో సంఘీభావము చాల తక్కువగా నున్నట్లు చెప్పనగును. కక్ష లెక్కువ. గర్భశైత్యము లెక్కువ. మనకు నిఖిల భారతమున గౌరవ మంతగా లేదు. దాదాపు 60 సంవత్సరముల కాంగ్రెసు చరిత్రలో నొక్కమారు మన రాష్ట్రమున మహాసభ జరిగినది. ఒక్కరైనను రాష్ట్రపతి కాలేదు. అందుకు తగిన వ్యక్తి

లేకయా? ప్రతినాయకుడును తానే రాష్ట్రపతిత్వమునకు తగుదనను నహంప్రత్యయముతో నున్నాడు.

శాతవాహన సామ్రాజ్యాంతమున నాంధ్రులు సుఖలోలు రైరి. ఈ విషయమును వారిశృంగార ప్రియత్వమున తెలుసుకొనవచ్చును. ఒక్కమారు సప్తశతి చదివిన నప్పటి సంఘస్థితి తెలియ గలదు. ఈ గ్రంథము చాల సుప్రసిద్ధమై కాళిదాసాదుల గ్రంథరచనమునకుకూడ మూలాధార మని చారిత్రకు లనుచున్నారు. అప్పటి యాంధ్రులు సుఖలోలు రైనారు. ఈ సుఖలోలత్వము పతనమున కొక కారణము. రోమకసామ్రాజ్యముకూడ నీ కారణముచేతనే పడిపోయెను. ఈ సుఖలోలత్వము మన యాంధ్రుల చరిత్రమున ప్రతిసామ్రాజ్యాంతమున చూడనగును. మత సహనాభావముకూడ నిట్టిదే యననగును. కాకతీయ సామ్రాజ్యాంతమున నీ సుఖలోలత్వ ముండెను. క్రీడాభిరామము చదివిన తెలియగలదు. విజయనగర సామ్రాజ్యాంతమున మరల నిది తల యెత్తెను. వెలమ రెడ్ల సుఖలోలత్వమునకు శ్రీనాథునిగ్రంథములే సాక్ష్యములు. సుఖలోలత్వము జాతియొక్క సాహసమును పోగొట్టును. విజయరాఘవుని సుఖలోలత్వమే తంజావూరు రాజ్య పతనమునకు హేతువు.

పైన నిర్దేశించిన స్వల్పలోపములు సవరించుకొనిన నాంధ్రజాతి యితర యే జాతులకును నెందును తీసిపోదు. ఇప్పటికిని జాత్యభిమానమున కెట్టి లోటును కలుగలేదు. విశాలాంధ్ర వ్యాపనకాల మున వారికున్న సాహసము, కార్యదీక్ష మరల మనము తెచ్చుకొనవలసియున్నది. మన పార్థ క్యము నెప్పటికిని కోలుపోవకూడదు. మనభాష నభివృద్ధిపరచి దానిని సోదరభాషలలో నున్నతికి తేవలెను. అట్టి సన్నివేశములు కల్గి రాజకీయదాస్య, భావదాస్యవిముక్తులమై మరల మనపూర్వుల యౌన్నత్యమును పొందెద మని యాశించుచున్నాను.

# పూర్వశాతవాహనులు - ఆంధ్రదేశము

డా. మారేమండ రామారావు, ఎం. ఏ., పిహెచ్. డి.

ఆంధ్రదేశము నేలిన రాజవంశములలో శాతవాహనరాజవంశము మొదటిది. శాసనములు, నాణెములు మున్నగువానివలన దెలియవచ్చు నీ శాతవాహనవంశజులే పురాణములలోఁ బేర్కొనబడిన ఆంధ్రరాజవంశీయులని పండితులు నిర్ణయించియున్నారు. ఆంధ్రులు నివసించు దేశ మగుటవలననే ఈ దేశమున కాంధ్రదేశ మనియు, ఆంధ్రులలో నొక కుటుంబమునకు చెందినవా రగుటవలననే శాతవాహనుల కాంధ్రులనియు గల నామములు సార్థకము లగుచున్నవి. ఈ యాంధ్రరాజులు ముప్పదిమంది పరిపాలించినట్లును, వారి పరిపాలనము సుమారు నాలుగు శతాబ్దములకాలము సాగినట్లును పురాణములలో చెప్పబడియున్నది. శాసనాద్యాధారములు నీ విషయమును బల పరచు చున్నవి. ఇంతవరకును ఆంధ్రదేశచరిత్రము ఈ యాంధ్రరాజుల పరిపాలనముతోనే ప్రారంభమయ్యెనని యెంచబడుచున్నది. అచ్చటచ్చట కొందరు ఈ భావమునకు వ్యతిరేకులుగ నుండిరి. ఇటీవల నీ వ్యతిరేకభావ మొక వాదరూపమును దాల్చినది. ఈ శాతవాహనాంధ్ర రాజు లందరికిని, అందు ముఖ్యముగ పూర్వరాజులకు ఆంధ్రదేశముతో సంబంధము లేకుండెననియు, వారిలో నిరువదినాల్గవవాడగు వాసిష్ఠీపుత్రపులోమావియు నతనితరువాత వారును మాత్రమే ఆంధ్రదేశము నేలిరనియు నీ వాదముయొక్క సారాంశము.* ఇదియే సహేతుకమును, విశ్వసనీయము నగుచో ఆంధ్రదేశముయొక్క సక్రమమగు చరిత్రమును ఇప్పటివలె క్రీ. పూ. 3-వ శతాబ్దినుండికాక క్రీ. శ. 2-వ శతాబ్దినుండి ప్రారంభింపవలసివచ్చును. అందువలన నీవాదము విమర్శనీయము.

## ౧

శాతవాహనాంధ్రరాజులలో కడపటి యేడ్గురు మాత్రమే ఆంధ్రదేశము నేలిరని చెప్పుటకు ఈ క్రింది కారణములు ముఖ్యముగ పేర్కొనబడుచున్నవి.

1. శాతవాహన వంశజులలో♦ పులోమావికి పూర్వముండిన రాజుల శాసనములును, కట్టడములును మహారాష్ట్రదేశముననే గన్పించుచున్నవి. ఆంధ్రదేశమున లేవు.
2. మహారాష్ట్రమునందలి శాసనములలో నెచ్చటను ఆంధ్రదేశప్రశంస లేదు.

---

* Dr. K. Gopalachari -- Early History of the Andhra Country pp. 4—28.

♦ ఈ వంశీయులవి ఇంతవరకును 25 శాసనములు లభించినవి. వీనిలో 18 మహారాష్ట్రమునను 1 సాంచీలోను దొరకినవి. మిగిలినవానిలో 1 బళ్ళారి మండలమునను, 5 ఆంధ్రదేశమునను దొరకినవి.

3. పూర్వరాజుల నాణెములైనను ఆంధ్రదేశమున దొరకలేదు. మూడు నాణెములు మూడవ రాజగు శాతకర్ణివిగ పరిగణింపబడినవి. కాని అది సరియగు నిర్ణయము కాదు. అందు "విర" లేక "ఖిర"తో అంతమగు శాసనముగల రెండునాణెములు♦ భట్టిప్రోలు కుభిరకునివి.* మిగిలిన నాణెము శాతకర్ణిదే అని అనినను అది ప్రమాదవశమున ఆంధ్రదేశమునకు వచ్చియుండ వచ్చును.

4. అమరావతి, భట్టిప్రోలు మున్నగుచోట్ల క్రీ.పూ.3,2 శతాబ్దులనాటి స్తూపములుండినను వాటిలో గన్పించిన శాసనములయం దెచ్చటను ఆ కాలపుశాతవాహనరాజుల ప్రశంస లేదు.

5. ఈ రాజులలో మూడవవాడగు మొదటి శాతకర్ణికి "దక్షిణాపథపతి" అనుబిరుద ముండెను. కాని, యీ దక్షిణాపథము మహారాష్ట్రమే యగును.

6. గౌతమీ బాలశ్రీ యనురాణి యొక నాసికశాసనములో తన కుమారుడును ఇరువది మూడవ శాతవాహనరాజు నగు గౌతమీపుత్రశాతకర్ణి విజయములను, అతని యేలుబడిలో నుండిన స్థలములను పేర్కొనినది. వానియం దెచ్చటను ఆంధ్రదేశము ప్రశంసింపబడలేదు.

7. ఒక నాసిక శాసనములో "ధనకట సమినెహి" అనుభాగము గలదు. ఇది గౌతమీ పుత్రునిది. ఈ భాగమును సమన్వయించుచు నీరాజు ధనకటము లేక ధాన్యకటకమునకు రాజని నిర్ణయింప బడినది. ఈ భాగముయొక్క పాఠమును, ఈ నిర్ణయమును సరియైనవి కావు. ఈ శాసన భాగమును "ధనకట సమనెహి" అని చదివి, దీనికి "ధనకట శ్రమణులచేత" అను నర్థమును చెప్పవలెను.

8. గోదావరీతీరమునందున్న పైఠాన్ లేక ప్రతిష్ఠానపురము పూర్వశాతవాహనుల రాజధానిగ నుండెనుగాని ఆంధ్రదేశమునందలి యే నగరమును గాదు.

9. శాతకర్ణికి సమకాలికుడుగ ఖారవేలుడను రాజు కళింగమును పరిపాలించుచుండెను. ఈ ఖారవేలుడు శాతకర్ణిని లక్ష్యముచేయక పడమటి దిక్కునకు రెండుసార్లు తన సేనలను పంపితి నని యొక శాసనమున చెప్పుకొనినాడు. దీనిని బట్టి శాతకర్ణి పడమటగానున్న భూమికి రాజని యేర్పడును. ఆంధ్రదేశము కళింగమునకు పడమటగగాక దక్షిణముగ నున్నది. అందువలన శాతకర్ణి ఆంధ్రదేశమునకు రాజుగ నుండలేదని చెప్పవలెను.

౨

పూర్వశాతవాహనులకును ఆంధ్రదేశమునకును సంబంధము లేదనుటకు పైన పేర్కొనబడిన ప్రతి కారణమును విమర్శనీయమే. వీనిలో ముందుగ గౌతమీపుత్రునికిని, శాతకర్ణికిని సంబంధించిన కారణములను విమర్శింతము.

---

♦ Rapson — Catalogue of Andhra Coins. pp. 2, — 28.

* ఈ నాణెములు కుభిరకునివి అనునది గోపాలాచార్యులుగారి యూహ.

**శాతకర్ణి:**——ఈ రాజు శాతవాహనవంశపురాజులలో మూడవవాడు. ఈ వంశీయుల పరిపాలనము ప్రారంభింపబడిన 42 వ సంవత్సరమున సింహాసన మెక్కి* క్రీ. పూ. 2 వ శతాబ్ది కడపటిపాదమున రాజ్యము చేసెను. ఇతనికి "దక్షిణాపథపతి" అను బిరుద ముండెను.† క్రీ. శ. 1 వ శతాబ్దిలో వ్రాయబడిన పెరిప్లస్ అను గ్రీకు గ్రంథమునందు కల్యాణ, టగర మున్నగు రేవులు దక్షిణాపథపు రేవులుగ పేర్కొనబడినవట! అందువలన అంతకు రెండువందల యేండ్లకు బూర్వ ముండిన శాతకర్ణినాటి దక్షిణాపథమును పై రేవుపట్టణములు గల మహారాష్ట్రదేశమే యగును గాని దక్కను పీఠభూమి యంతయు గాజాలదట! ఈ నిర్ణయము మిక్కిలి విపరీతముగ నున్నది. హిందూ వాఙ్మయమునం దెచ్చట చూచినను వింధ్యపర్వతములకు దక్షిణమునను, ప్రాక్పశ్చిమ సముద్రములవరకును వ్యాపించియున్న భాగ మంతయు దక్షిణాపథ మని చెప్పబడియున్నది. అంతియగాక నీ శాతకర్ణి రెండశ్వమేధములను, ఒక రాజసూయమును, అనేకములగు నితరయాగములను చేసి వేలకొలది స్వర్ణనాణెములను దక్షిణగ నిచ్చెను. సంకుచిత మగు మహారాష్ట్రమును మాత్రమే యేలినవాని కింత ద్రవ్య ముండుట సంభవము కానేరదు. దక్షిణాపథ మంతటికిని నేలికయగు వానికే అంతటి వైభవప్రాభవము లుండియుండును. ఇది ఒక యంశము. ఈశాతకర్ణికి సమకాలికు డగు ఖారవేలు డను కళింగదేశపురాజు "పడమటిదిశకు శాతకర్ణిని లక్ష్యము చేయక నా సైన్యములను పంపితిని" అని యొక శాసనమున చెప్పుకొనెను.♦ ఇందుమూలమున శాతకర్ణి కళింగమునకు పడమటనున్న మహారాష్ట్రమునకే రాజుగాని కళింగమునకు దక్షిణముననున్న ఆంధ్రదేశమునకు ఏలిక కాజాల డట. ఈ యూహయు సమంజసమైనది కాదు. దక్షిణాపథము యొక్క పటమును పరిశీలించినచో ఆంధ్రదేశమునందలి బహుభాగము కళింగమునకు పడమటగ నున్నట్లు స్పష్టము కాగలదు. నేటి ఆంధ్రదేశమునగూడ గోదావరిజిల్లావారు విశాఖపట్టణ మండలమువారిని, గుంటూరుజిల్లావారు కృష్ణా గోదావరి జిల్లాలవారిని "తూర్పువారు" అనియే చెప్పుదురు. కొండవీటిరెడ్డి రాజగు కుమారగిరిరెడ్డి తామ్రశాసన మొకదానిలో‡ కళింగరాజులు తూర్పుదిక్కు రాజులనియే చెప్పబడియున్నది. అదియునుగాక శాతకర్ణిని లక్ష్యము చేయక ఖారవేలుడు పంపిన సైన్యములలో నొకటి పడమటగా బోయి కృష్ణవేణీనదిని జేరి మూషికనగరమును అలజడిపరచెను. రెండవది పిథుండనగరముమీదుగా బోయి ద్రవిడరాజులతో

---

* శ్రీముఖుడు 23 ఏండ్లును, పిమ్మట నతని తమ్ముడగు కృష్ణుఁడు 18 ఏండ్లును పరిపాలించిరి. తరువాత శ్రీముఖుని కుమారు డగు నీ శాతకర్ణి రాజయ్యెను.

† శాతకర్ణి భార్య నాగానిక నానాఘాట్‌లో నొక శాసనము వేయించెను. అం దీ రాజు వైభవము వర్ణింపబడినది. ఈ బిరుద మీ శాసనమున గలదు. (Ep. Ind. X, Luder's list No. 1112).

♦ చూ. ఖారవేలుని హాథిగుంఫ శాసనము. Ep Ind. XX pp. 71-89.

‡ కుమారగిరి అనపర్తి తామ్ర శాసనము JAHRS XI pp. 191—205.

పోరెను.* ఈ మూషికపిథుండ నగరములతో శాతకర్ణి కే విధమగు సంబంధమును లేనిచో నీ సందర్భమునం దతని ప్రశంస అనుచితమే యగునుగదా! ఖారవేలుడు తన యుద్ధయాత్రలనే వర్ణించుచుండినచో తన సైన్యములు పడమటిదిశ నా యా ప్రదేశములను జయించెనని చెప్పు కొనిన జాలునుగదా! అతని సైన్యములు కృష్ణానదిని చేరుటకు శాతకర్ణిని నిర్లక్ష్యము చేయవలసి వచ్చె నను నంశము స్పష్టమగుచున్నదిగదా! అనగా శాతకర్ణి ఆంధ్రదేశమునందున్న కృష్ణా మూసీనదుల ప్రాంతమునకును, పిథుండనగరమునకును ఏలికయనియు, నితనిని ధిక్కరించియే ఖారవేలుడు తన సైన్యముల నీ ప్రాంతములకు బంపె ననియు నిస్సందేహముగ జెప్పవచ్చును. నాణెములనుబట్టి యీ శాతకర్ణి శుంగరాజులవద్దనుండి మాళవమును జయించెనని యూహింప నగును. ఆ సందర్భముననే అత డొక యశ్వమేధమును చేసి యుండును. రెండవ యశ్వ మేధమును ఖారవేలుని రెండు దండయాత్రలును ముగిసిన పిమ్మట నీ యాంధ్రభాగమును తిరిగి వశపరచుకొనిన పిమ్మటనే యీ రాజు చేసియుండును. అటుపైన దక్షిణాపథ మంతటి కిని అప్రతిహతాధికారియై యితడు రాజసూయమును చేసియుండును. ఇది రెండవ యంశము. ఆంధ్రదేశమున గోదావరిమండలమున మూడు ప్రాచీనము లగు నాణెములు దొరకినవి. అందు ఒకదాని కొకవైపున సింహముబొమ్మ గలదు. ఇది చతురస్రమగు నాణెముపై ఒక వలయములో నున్నది. ఇది మాలవములో పోతపోయబడిన దనియు, శాతకర్ణి దనియు స్పష్టమగుచున్నది. మరి రెండు నాణెములమీద నొకవైపున నేమియు లేదు. రెండవవైపున సింహమును, దానిచుట్టును "రణో— —వి (భి) రస" అను శాసనమును గలదు. ఈ రెండునాణెములును సింహగోష్ఠియుడగు భట్టిప్రోలు కుభిరకుని వట. ఈ సమన్వయము సమంజసము కాదు. శాసనములోని "భిరస" అను నక్షరములకు ముందు "కు" అను నొక యక్షరమును జేర్చినచో పైయూహప్రకారము "కుభిరస" అని యగును గాని "రణో" కును ఈ "కుభిరస" కును నడుమ మరియొక యక్షరస్థానము మిగిలి పోవును. అందువలన నీ యూహ సరియైనది కాదని స్పష్టమగుచున్నది. "భిరస" అను భాగమునకు ముందుగల రెండు ఖాళీలను ఇంకొక విధమున పూరింపవచ్చును. శ్రీ శాతకర్ణి అనేకయజ్ఞము లను చేసినవాడేగాక "శూరః", "వీరః" అని ప్రసిద్ధికెక్కినవాడు. ఇట్లే యితనిసంతతిలోని గౌతమీపుత్రుడును "శాతవాహనవంశయశఃప్రతిష్ఠాపనకరః" అనియు "ఏకవీరః" అనియు ప్రఖ్యాతుడుగ నుండెను.‡ శాతవాహన రాజులలో కొందరికి "శాతకర్ణి" యను బిరుదము

---

* ఈ పిథుండ నగరము పూర్వరాజులచే కట్టబడె నని హథిగుంఫశాసనమున చెప్పబడినది. క్రీ. శ. 2వ శతాబ్దినాటి టాలెమీ అను యవనుడు ఈ పిథుండనగరము కృష్ణామహానదీ ముఖద్వారములకు నడుమ, రెండిటికిని సమానమగు దూరముననను, వరంగల్లుకంటెను తీరమునకు దగ్గరగను ఉన్నదని వ్రాసియున్నాడు. ఎట్లు చూచినను ఇది ఆంధ్ర దేశముననే ఉండును. ఖారవేలుని సైన్యములు దానిని ధ్వంసము చేసెను. ఇది శాతకర్ణి నగరమే యగుచో నీరాజు ఖారవేలునితో నేల పోరాడలేదని గోపాలాచార్యులుగారి ప్రశ్న. ఈ సమయమున శాతకర్ణి శుంగులతో పోరు చుండెననియు, నటుపై నత డీ నగరమును తిరిగి వశపరచుకొని యీ శుంగులతోడను, కళింగులతోడను పోరి సంపా దించిన విజయములకు సూచనగ శాతకర్ణి రెండశ్వమేధములను చేసెననియు నా సమాధానము.

‡ గౌతమీ బాలశ్రీ నాసికశాసనము, Luders' List. No 1123.

గలదు. ఈ బిరుదము నాణెములమీద "శత" లేక "సద" అని హ్రస్వరూపమున నుండును. ఈ యంశములను బట్టి పై రెండు నాణెములమీది శాసనభాగమును "రణోసదవిరస" అని సంస్కరింపవచ్చును. అప్పుడు దానికి "వీరు డగు శాతకర్ణియను రాజుది" అను నర్థము వచ్చును. ఈ నాణెము లాంధ్రదేశముననే దొరకుటవలన* వీని కీ రాజు యేలిక యని చెప్పవచ్చును.

గౌతమీపుత్రుడు:—ఈ రాజు నాసికశాసనములో♦ నొకభాగమును "ధఞ్ఞకటసమినెహి" లేక "ధాన్యకటస్వామినాహి"అని చదువక "ధఞ్ఞకటశ్రమణైః"అను నర్థ మిచ్చునట్లు "ధఞ్ఞ కటసమనెహి" అని చదువవలెనట. అప్పుడు ధాన్యకటమునందలి శ్రమణులచేత మహారాష్ట్రమునం దొక గ్రామములోని భూమి ధర్మము చేయబడె నను నర్థ మేర్పడును. దానికి రెండు అభ్యంతరములు గలవు. (1) బౌద్ధసన్యాసులను దెల్పుటకు "శ్రమణ" శబ్ద మీ మహారాష్ట్ర శాసనములలో నెచటను వాడబడలేదు.‡ (2) ధాన్యకటకము గౌతమీపుత్రుని యేలుబడిలో లేనియెడల నానగర వాసులగు భిక్షువులు ఆ రాజురాజ్యములోని గ్రామము నొకదానిని ధర్మముచేయుట పొసగనేరదు. కావున నా శాసనము ధాన్యకటకస్వామి యగు గౌతమీపుత్రుని గ్రామదానమును తెలుపునని చెప్పుటయే సమంజసముగ నుండును. ఇది యొక యంశము. ఈ రాజు తల్లి గౌతమి శాసనములో నితని విజయములలోగాని, యేలుబడిలోనుండిన ప్రదేశములలోగాని ఆంధ్రదేశప్రశంస లేదట. ఇతడు ఆంధ్రదేశమును జయింపకుండుటచే విజయములలో నీ దేశప్రశంస లేదు. ఇక నిత డేలిన భాగములలో ఆంధ్రభాగము గలదని ప్రత్యక్షముగ గాకున్న మరియొకవిధమున నిస్సందేహముగ గాంచనగుచున్నది. ఈ రాజు పాలనము గల విభాగములలో అశ్మక, ములక యనునవి గలవు. ఇందు ములక యనునది పైఠాన్ ప్రాంత మనియు అశ్మకయనునది దానికి దక్షిణముగ గోదావరి వెంబడి వ్యాపించియుండెననియు పండితుల నిర్ణయము.† ఈ భాగములు నేటి తెలింగానాలోని యుత్తరభాగమునకు సరియగుచున్నవి.

ములక యను భాగము ఆంధ్రదేశమునందలి మురికినాడును కావచ్చును. ఈ గౌతమీపుత్రుని యేలుబడిలోనున్న పర్వతములలో "మహేంద్ర చకోర సిరిఠన"యనునవి గూడ గలవని పై నాసిక శాసనమునం దున్నది. మహేంద్ర యనునది ఆంధ్రదేశమున సుప్రసిద్ధమైన మహేంద్రగిరి. సిరిఠన యనునది శ్రీశైలము లేక శ్రీపర్వతమని పండితుల నిర్ణయము. గుంటూరుజిల్లాలోని

---

* ఇవి గోదావరిజిల్లా ఏజన్సీ ప్రాంతములో చిట్టలి అను బేచిరాకు గ్రామమున దొరకినవి.

♦ ఈ శాసనము ద్వారా గౌతమీపుత్రుడు తన 18వ రాజ్యకాలసంవత్సరమున అంతవరకును ఉషవదత్తుని భోగమునందున్న, పశ్చిమ కఖడి గ్రామమునందలి 200 నివర్తనముల భూమిని పెకిరసి కొండమీది భిక్షువులకు దానము చేసెను. Luders' list 1125. ఇందలి "ధనకట సమినెహి" అను పాఠమును భగవాన్‌లాల్, బూలరు, సెనార్ట్ అను పండితులు ఉపపాదించిరి.

‡ R. S. Bhandarkar — Early History of the Deccan p. 18. n. 2.

† Dr. Bhandarkar — Dekkana of Satavahana finds in Ind. Ant. 47 p. 150.

నాగార్జునకొండకును శ్రీపర్వతమని పేరు గలదు. దీనిని బట్టి తూర్పు కనుమలలోని యుత్తర భాగమునకు మహేంద్రగిరికొండ లనియు, దక్షిణభాగమునకు శ్రీపర్వతగిరు లనియు పేరు గలదని యూహింపవచ్చును. పురాణములలో శ్రీగిరి చకోరపర్వతములు కలిపి పేర్కొనబడినవి. దీనిని బట్టి తూర్పు కనుమలలోని మధ్యభాగపుకొండలు చకోరగిరికొండ లని పేర్కొన బడియుండునని యూహింపవచ్చును. అప్పుడు "మహేంద్ర చకోరసిరిత న'' అనినప్పుడు కొంచె మెంచుమించుగ తూర్పు కనుమ లన్నియు చెప్పబడినట్లేగదా! గౌతమీపుత్రుడు కేవలము నీ కొండలనే పాలించి యుండడుగదా! అందువలన తూర్పుకనుమల కిరువంకలను గల భాగ మాతని యేలుబడిలో నుండె నని చెప్పవచ్చును. ఈ కొండలకు తూర్పు పడమరలనే ఉన్న ఆంధ్ర దేశ మా రాజుపరిపాలన మున గల దని ఇందువలన స్పష్ట మగుచున్నది.

పై చర్చవలన శాతవాహనవంశమునందు ఇరువది మూడవవాడగు గౌతమీపుత్రుడును, మూడవ వాడగు శ్రీ శాతకర్ణియు ఆంధ్రదేశము నేలి రని స్పష్టమగుచున్నది. ఇక మిగిలినవి రెండు ముఖ్య ములైన అంశములు. మహారాష్ట్రమున దొరకిన శాసనములయందు ఆంధ్రదేశప్రశంస ఏల లేదు? అనునది యిందు ఒకటి. "ఆంధ్రదేశము'' అను మాటకు ఆంధ్రపథము'' అను పదము మాతృక. ఈ ఆంధ్రపథము క్రీ. శ. 3 వ శతాబ్దినాటి యొక పల్లవశాసనమున గలదు.♦ అప్పటి కీ ఆంధ్ర శాతవాహనుల పరిపాలనము ముగిసి ‡ ఒక శతాబ్దము దాటిపోయెను. అమరావతీ ప్రాంతమున కీ పేరుండెను. ప్రాచీనబౌద్ధవాఙ్మయమున అంధకగణ, అంధకవిణ్ణ, అంధక అను పదములు గలవు.* ఇవన్నియు ఆంధ్రజాతిని సూచించునవిగనే గన్పించుచున్నవి గాని యొక దేశమును సూచించునవి కావు. దేశసూచకమైన అంధ లేక ఆంధ్రపదము పై పల్లవశాసనముననే మొదటి సారి గాంచనగుచున్నది. దీనినిబట్టి ఆంధ్రజాతీయులైన రాజులు పాలించినప్రదేశ మగుటనుబట్టి యీ ప్రదేశమున కాపేరు ఆ రాజులు గతించినవెనుకనే వచ్చెనని యూహింపవచ్చును. అగుచో, వారి యనంతరము, వారినిబట్టి యేర్పడిన దేశనామము వారి శాసనములలో గన్పింపనేరదుకదా! ఇక మిగిలిన యంశము పూర్వశాతవాహనులు మహారాష్ట్రమును మాత్రమే పాలించియుండనిచో వారి శాసనాదికములు ఆంధ్రదేశమునం దెచ్చటను లేక ఒక్క మహారాష్ట్రమున మాత్రమే యేల గన్పింపవలెను? అనునది. పురాణములలో శ్రీముఖు డను ఆంధ్రుడు తన సజాతీయులతో గలిసి భూమిని సంపాదించునని చెప్పబడినది.† ఇతని విగ్రహమును, ఇతని సంతతివారి శాసనాదికములును మహారాష్ట్రమున గన్పించుచుండుటచే నితడును సజాతీయులును

---

♦ శివస్కందవర్మ మైదవోలు శాసనము. Ep. Ind. VI pp. 84–89. ఇది క్రీ. శ. 3వ శతాబ్ది మొదటిపాదము నాటిది.

‡ శాతవాహనుల పరిపాలనము క్రీ. శ. 3వ శతాబ్ది మొదటిపాదమున ముగిసెను.

* Cowell and Thomas – The Jatakas I, pp. 203, 12; V. p, 10, 138.

† శిశుకోంధ్రస్య జాతీయః ప్రాప్స్యతీమాం వసుంధరాం.

సంపాదించినభూమి మహారాష్ట్రమని స్పష్టమగుచున్నది. ఇది అశోకచక్రవర్తి మరణించిన కొద్ది కాలముననే జరిగె నని పండితులు నిర్ణయించినారు. ఇదే సమయమున నుత్తరదేశమునందలి మౌర్యసామ్రాజ్యభాగము శుంగరాజుల వశమయ్యెను. మాలవము శుంగుల స్వాధీనమునందుండినను ఆంధ్రశాతవాహనులచే జయింపబడె నని నాణెములును, శాసనములును తెలుపుచున్నవి. అదియునుగాక యీ కాలమున యవనులు పంజాబును మధ్యదేశమును వశపరచుకొని శుంగరాజ్యముపై దండెత్తిరి. అందువలన శ్రీముఖుని సంతతివారు తాము క్రొత్తగ జయించిన మహారాష్ట్రమునకు యవనులవలనను, శుంగులవలనను ప్రమాదమురాకుండ చూచుకొనుచు నా దేశముననే యుండవలసి వచ్చెను. అటుపైన శుంగుల యధికారము క్షీణించుకొలదిని వీరు విదిశ విదర్భలలోనికి జొచ్చుకొని పోయి రాజ్యమును విస్తరించుకొనుచు ఆంధ్రదేశపు టుత్తరదిశను జాగ్రత్తపరచుకొనిరి. ఈ అవసర కార్యములు శాతవాహనవంశమునందు కొన్ని తరములవారిని ఈ ప్రాంతములనే నిలిపివేసెను. వారును అచటనే దానధర్మములను చేయుటవలన వారి శాసనము లచటనే లభించినవి. ఇక మరియొక యంశము మిగిలినది. అది భట్టిప్రోలు, అమరావతీస్తూపములు క్రీ॥ పూ॥ 3-వ శతాబ్దినుండియు నున్నను, అందెన్నియో శాసనము లుండినను వానిలో నేదియు పూర్వశాతవాహన రాజులను ఏల పేర్కొనుటలేదు? అనునది. రాజులు వేయించిన దానశాసనములలో వారి పేర్లను, రాజ్యకాల సంవత్సరములు నుండును. సామంతులు నుద్యోగులును వేయించిన శాసనములలో కొన్నిటియం దానాటిరాజుల ప్రశంస యుండును, కొన్నిటిలో నుండదు. సామంతులును, ఉద్యోగులును గాని వారు దానధర్మములను జేయుచు వేయించినశాసనములలో రాజులయొక్కయు, వారి రాజ్యకాల సంవత్సరములయొక్కయు ప్రశంస ప్రాయికముగ నుండదు. శాతవాహనరాజుల శాసనములు గల నాసిక, కార్లే మున్నగు చోట్లనే యీ రాజుల ప్రశంస లేని శాసనము లెన్నియో గలవు. అదేవిధమున నాంధ్రదేశమున శాతవాహనరాజులును, వారి యాశ్రితులును వేయించిన శాసనములు పులోమునికి తరువాతవే యగుటచే వానిలో మాత్రమే మీరాజుల ప్రశంస గలదు. అంతకు బూర్వ ముండిన దాతలు సామాన్యపౌరులగుటచే వారి శాసనములలో నీరాజులపేర్లు లేవు.

## 3

పూర్వశాతవాహనులకాలమునం దాంధ్రదేశము వారిపరిపాలనమున లేదను వాదమునకు గల కారణములను విమర్శించి అవి యసమంజసము లని యింతవరకును నిరూపించితిమి.

మొదటినుండియు ఆంధ్రదేశ మీ రాజుల పాలనమునం దుండెననుట కీ క్రింది కారణములనుగూడ పేర్కొనవచ్చును.

1. పురాణములనుబట్టియు, ప్రాచీన బౌద్ధవాఙ్మయమును బట్టియు ప్రాక్తీరము ఆంధ్రులనివాస స్థానమని చెప్పవలసి యుండును. ఆంధ్రజాతి చంద్రగుప్త మౌర్యుని నాటికే మౌర్యులకు బిమ్మట ప్రబలమైనజాతి. ఈ యాంధ్రుల కప్పటికే 30 పరిఖావృతములైన నగరములును,

పెద్దసైన్యమును గలవు.* అశోకుని కాలమున ఆంధ్రులు పుళిందశబరరాష్ట్రికపెటనక భోజకులతోపాటు మౌర్యసామ్రాజ్యపు సరిహద్దులలో నుండిరి. రాష్ట్రికులు నేటి మహారాష్ట్రమునను, భోజకులు బేరారులోను, పెటనికులు పైఠాన్ ప్రాంతమునను, పుళిందాదులు వింధ్య దక్షిణభాగమునను ఉండిరి. ఆంధ్రులకు పైన చోళపాండ్యాది ద్రవిడ రాజ్యము లుండెడివి. దీనినిబట్టి అశోకుని కాలమున ద్రవిడదేశమున కుత్తరమునను, మహారాష్ట్రమునకు తూర్పునను, గోదావరికి దక్షిణమునను గల దక్షిణాపథభాగ మంతయు ఆంధ్రజాతి స్వాధీనమునం దుండెనని స్పష్టమగుచున్నది. అశోకునికాలమునందు ఆంధ్రులలో రాజులు లేరు. ఆంధ్రజాతియంతయు కొన్ని కుటుంబములుగ నుండి యొక్కొకవంశము కొంతకొంత భాగము నేలు చుండెనేమో! శాతవాహనకుటుంబ మిట్టివానిలో నొకటి. ఈ వంశీకుడైన శ్రీముఖు డొక్కడే మహారాష్ట్రమును జయింపలేదు. అతని నాయకత్వమున ఆంధ్రజాతి యంతయు గలసి యీ విజయమును సంపాదించెను. అంతటినుండియు శ్రీముఖుడు, నతని సంతతివారు నాంధ్రజాతి కంతటికిని, ఆజాతియొక్క భూము లన్నిటికిని నాయకులు లేక రాజులు అయియుందురు. అందు వలననే మూడవరాజగు శాతకర్ణి "మహారాష్ట్రపతి" యనిగాక "దక్షిణాపథపతి" యను బిరుదమును వహించెను. అట్లే గౌతమీపుత్రుడును నీ బిరుదమును వహించెను. కావున నీ దక్షిణాపథపతిత్వమే శాతవాహనరాజుల అఖిలాంధ్రపతిత్వసూచక మని నిస్సందేహముగ చెప్పవచ్చును.

2. గౌతమీపుత్ర శాతకర్ణి మహారాష్ట్రమును శకరాజులనుండి జయించెను. ఇతడు తన 18 వ రాజ్యసంవత్సరమున అంతవరకును శకరాజగు ఉషవదత్తునియధీనమునం దుండిన గ్రామము నొకదానిని దానము చేసెను. ఇతని 14 వ రాజ్యకాలపుశాసన మొకటి మహారాష్ట్రమున గలదు.† కావున నీత డీదేశము నా ప్రాంతముననే జయించియుండవలెను. అగుచో నీ రాజు అంతకు పూర్వ మెచ్చట నుండెను? ఇత డాంధ్రదేశమును జయింపలేదు. ఆంధ్రదేశ మితని పరిపాలనమునం దుండెనని యితని తల్లి శాసనము తెలుపుచున్నది. దీనినిబట్టి శకరాజులు మహారాష్ట్రమును వశపరచుకొనినపిమ్మట శాతవాహనరాజు లాంధ్రదేశమును మాత్రమే యేలుచుండిరనియు, గౌతమీపుత్రు డిచట 13 ఏండ్లు పరిపాలించి యటుపై శకులను జయించి మహారాష్ట్రమును స్వాధీనపరచుకొనె ననియు చెప్పవచ్చును.

3. అమరావతీ స్తూపములో "గౌతమి నమో" అను శాసనముగల ఒక విగ్రహము దొరకినది. ఇది గౌతమీపుత్రుని తల్లియగు గౌతమీబాలశ్రీ ప్రతిమ యని పండితు లూహించిరి.♦ ఈ యమరావతీప్రాంత మీ రాజు పరిపాలనలో లేనిచో నితని తల్లి విగ్రహ మిచట నెట్లుండును?

* Mc. Crindle — Megasthenes, Ch. II.

† Luders' List No. 1105.

♦ Gopalachary — Early Hist. of Andhra P. 15 N. 69.

4. శాతవాహనరాజులలో 17 వ వాడగు హాలునికి సప్తగోదావరీ తటాకమును భీమేశ్వర సాన్నిధ్యమును గల దాక్షారామముతో సంబంధ ముండెనని తెలియనగుచున్నది.

5. గౌతమీపుత్రుని పూర్వులలో చకోర, కుంతల అను నిర్వురు రాజు లుండిరి. కుంతలము మహారాష్ట్రములోని భాగము. చకోరపర్వతప్రాంత మాంధ్రదేశములోనిది. బహుశః ఈ యిర్వురు రాజులును ఆ యా ప్రాంతముల జన్మించుటవలననో, లేక సింహాసనమునకు రాక పూర్వము వానికి రాజప్రతినిధులుగ నుండుటవలననో వారి కా దేశనామములే వచ్చెనని యూహింపవచ్చును.

పై చర్చనుబట్టి శాతవాహనవంశీయులకు నాంధ్రదేశమునకును గల సంబంధము నీ విధమున నిర్ణయింపవచ్చును. ఆంధ్రులు అశోకుని నాటికి దక్షిణాపథమునందలి ప్రాఙ్మధ్యభాగముల నుండిరి. ఆ చక్రవర్తి మరణించినవెనుక వారు శ్రీముఖుని నాయకత్వమున మహారాష్ట్రమును జయించిరి. అంతటినుండియు శ్రీముఖుని సంతతివారగు శాతవాహనవంశజులు ఆంధ్రులకు రాజులైరి. తాత్కాలిక రాజకీయపరిస్థితుల ననుసరించి యీ రాజులు సుమారు రెండుశతాబ్దముల కాలము పశ్చిమముననే నిలచిపోయి అటనుండియే దక్షిణాపథమును పాలించుచుండిరి. శకులు దండెత్తి వచ్చి మహారాష్ట్రమును జయింపగా శాతవాహనరాజులు మొదటిలోవలెనే దక్షిణాపథప్రాఙ్మధ్య భాగములను, అనగా సువిశాలాంధ్రదేశమును మాత్రమే పరిపాలింపసాగిరి. పిమ్మట నీయాంధ్రదేశమునుండి బయల్వెడలి గౌతమీపుత్రుడు క్షహరాటులను నిర్మూలించి మహారాష్ట్రమును జయించి దక్షిణాపథ మంతటికిని ఏలిక అయ్యెను. అతని సంతతివారును ఉజ్జయినీ శకవంశీయులతో ప్రత్యర్థిత్వమును సాగించుచు, వీలగునంతవరకును మహారాష్ట్ర విదర్భ దేశములను, ఆంధ్రదేశమును గూడ పరిపాలించుచునే యుండిరి. ఇందువలన మొదటినుండియు ఆంధ్రదేశము శాతవాహనాంధ్రరాజుల పాలనమునం దుండెనని నిస్సందేహముగ జెప్పవచ్చును.

# శ్రీనాథుని కనకాభిషేకకాలము

శ్రీ బండారు తమ్మయ్య

సుప్రసిద్ధాంధ్రకవిసార్వభౌముఁ డగు శ్రీనాథుని జీవితమునందలి యుత్కృష్ట విషయములలోఁ గర్ణాటక భూపాలాస్థానమున నాతఁ డొందిన కనకాభిషేకసత్కార మొకటి. యశోభిలాషియగు నీ కవివతంసుఁడు నిజజీవితములోఁ దనకుఁ గలిగిన వైభవప్రాభవములను దన గ్రంథములందేమి, చాటుపద్యములందేమి సాధారణముగ నెప్పటి కప్పుడు ప్రకటించుకొనెడి స్వభావము కలవాఁడు. మన కింతవఱకు దొరకినట్టియు, దొరకకున్నను శ్రీనాథునిచేఁ దద్రచితములుగ నుదాహరింపఁబడినట్టియుఁ గృతులను బరీక్షించినచో వాని పౌర్వాపర్యము నీ క్రిందివిధమున మనము సులభముగ నిర్ణయింపవచ్చును. (1) మరుత్తరాట్చరిత్ర (2) శాలివాహన సప్తశతి (3) పండితారాధ్యచరిత్రము (4) శృంగారనైషధము (5) హరవిలాసము (6) భీమఖండ మనఁబడు భీమేశ్వరపురాణము (7) కాశీఖండము (8) శివరాత్రి మాహాత్మ్యము. శ్రీనాథుఁడు కర్ణాటకాస్థానము నందలి విద్వత్కవిసార్వభౌముఁడు, అష్టదిగ్జయయశోవష్టంభుఁడు నగు గౌడడిండిమభట్టారకునిఁ దన కవితాపాండిత్య శౌండీర్యమున నోడించిన పిమ్మటనే కవిసార్వభౌమబిరుదమును గైకొని యథేచ్ఛముగ వాడుకొనుచుండినట్టులు శ్రీనాథకృత మని నిర్వివాదముగ నంగీకరింపఁబడు నీ క్రింది చాటుపద్యమువలన వ్యక్తము కాఁగలదు.

సీ. దీనారటంకాలఁ దీర్థ మాడించితి, దక్షిణాధీశు ముత్యాలశాలఁ
బగులగొట్టించి తుద్భటవివాదప్రౌఢి, గౌడ డిండిమభట్టు కంచుఢక్క
చంద్రభూష (శేఖర) క్రియాశక్తి రాయలమొద్దఁ, బాదుకొల్పితి సార్వభౌమబిరుదు
పలుకుతోడై తాంధ్రభాషామహాకావ్య, నైషధగ్రంథ సందర్భమునను
గీ. ఎటులు మెప్పించెదో నన్ను నింకమీఁద, రావు సింగమహీపాలు ధీవిశాలు
నిండుకొలువున నెలకొనియుండు నీవు, సరససద్గుణనికురంబ! శారదాంబ!

ఈ కవిసార్వభౌమబిరుదము శ్రీనాథునికృతులలో మనకుఁ గాశీఖండ, శివరాత్రి మాహాత్మ్యములందు మాత్రమే కాననగును. తత్పూర్వరచిత గ్రంథములలో నాతఁ డెచ్చటను దానినిఁ బేర్కొనలేదు. మఱియు గర్ణాటకాస్థానమునఁ దా నొనరించిన విబుధరంజనమును, గైకొనిన కనకాభిషేక సత్కారమును ముక్తకంఠముగ నాతఁడు కాశీఖండమందలి యీ క్రింది పద్యములందు మాత్రమే ప్రకటించియున్నాఁడు.

సీ. చిన్నారిపొన్నారి చిఱుతకూకటినాఁడు, రచియించితి మరుత్తరాట్చరిత్ర
నూనూఁగుమీసాల నూత్నయౌవనమున, శాలివాహనసప్తశతి నొడివితి

సంతరించితి నిండు జవ్వనంబునయందు, హర్షనైషధకావ్య మాంధ్రభాష
ప్రౌఢనిర్భరవయఃపరిపాకమునఁ గొని,యాడితి భీమనాయకుని మహిమ
గీ. ప్రాయ మింతకు మిగులఁ గైవ్రాలకుండఁ, గాశికాఖండ మను మహాగ్రంథ మేను
దెనుఁగుఁ గావింతుఁ గర్ణాట దేశకటక, పద్మవనహేళి శ్రీనాథభట్టమాళి.*

శా. కర్ణాట క్షితిపాల మౌక్తిక సభాగారాంతరావర్తిత
స్వర్ణస్నాన జగత్ప్రసిద్ధ కవిరాట్సంస్తుత్య చారిత్ర! దు
గ్ధార్ణోరాశిగభీర! ప్రాహ్ణముఖమధ్యాహ్నాపరాహ్ణార్చితా
పర్ణావల్లభ! రాజశేఖరమణీ! పంటాన్వయగ్రామణీ!

ఇట్టి జగత్ప్రసిద్ధ విషయము భీమఖండరచనమునకు ముందే జరగియున్నచోఁ దత్కృతిపతి యగు బెండపూడి యన్నమంత్రి శ్రీనాథునిఁ బ్రశంసించినట్లుగా నందుఁ జెప్పఁబడిన,

సీ. వినిపించినాఁడవు వేమభూపాలున కఖిలపురాణవిద్యాగమములు
కల్పించినాఁడవు గాఢపాకంబైన హర్షనైషధకావ్య మాంధ్రభాష
భాషించినాఁడవు బహుదేశబుధులతో విద్యాపరీక్షణ వేళలందు
వెదఁజల్లినాఁడవు విశదకీర్తిస్ఫూర్తి కర్పూరములు దిశాంగణములందు
గీ. పాకనాటింటివాఁడవు బాంధవుఁడవు, కమలనాభుని మనుమఁడ వమలమతివి
నాకుఁ గృపసేయు మొక ప్రబంధంబు నీవు, కలితగుణగణ్య! శ్రీనాథకవివరేణ్య!

అను పద్యములో నిది తప్పక యుదాహరింపఁబడియే యుండును. దీని నందు విస్మరించుటకుఁ దగిన కారణము కానరాదు. కావున శ్రీనాథుఁడు కర్ణాటకాస్థానమున కేఁగి డిండిమభట్టు నోడించి కవిసార్వభౌమ బిరుదమును బాదుకొలిపినది భీమఖండరచనమునకుఁ బిమ్మటను, కాశీఖండ రచనమునకుఁ బూర్వమును జరగియుండు నని స్థూలదృష్టివలననే సులభముగ నిర్ణయింపవచ్చును. శ్రీనాథుని భీమఖండమునఁ దత్కృతిపతి యగు బెండపూడి యన్నామాత్యుఁడు దాక్షారామ భీమేశ్వరాలయమున నంతకు మున్నొనర్చిన గోపురమండప నిర్మాణము లీ క్రింది పద్యమునఁ బేర్కొనఁబడినవి.

సీ. ..................................................

దక్షవాటికయందుఁ దరుణేందుమౌళికి మొగలివాకిట ధామమును రచించె
గీ. ప్రాగ్దిశావప్రగోపుర ప్రాంగణమున, సప్తమునిసింధు సోపాన సరణి కెలనఁ
దీర్చె భవనంబు భీమయ దేవునగర మంత్రిదేవయ యన్నయామాత్యవరుఁడు.

ఈ నిర్మాణములు క్రీ॥ శ॥ 1428లో జరగినట్లు భీమేశ్వరాలయమున అన్నమంత్రి శాసనము కలదు.

---

* "భట్టసుకవి" యనెడి ముద్రిత ప్రతులలోని పాఠము సరియైనదిగఁ గాన్పింపదు. చిన్నయసూరిగారు సేకరించిన వ్రాఁత ప్రతులలోని పాఠము "భట్టమాళి" యనియే.

శ్లో. శాకే పుష్కర బాణ విశ్వ గణితే సంవత్సరే కీలకే (1350)
కార్తిక్యాం శనివాసరే సుకృతధీ శ్రీయన్నమంత్రీశ్వరః
దక్షారామజ భీమలింగపురత శ్శ్రీసప్తగోదాతటే
ప్రాచీ గోపురమండపం సమకరో ద్రమ్యం శిలానిర్మితమ్''

దీనినిబట్టి భీమఖండరచనము క్రీ. శ. 1430 ప్రాంతమున జరగియుండు ననుట విస్పష్ట మగును.

వినుకొండ దుర్గమునఁ గర్ణాటకాధీశ్వరుల భాండాగారాధ్యక్షుఁడుగా నుండిన వల్లభామాత్యుఁడు రచించినట్లుగాఁ గానవచ్చు క్రీడాభిరామ మను వీథినాటకము శ్రీనాథకృతమే యని కొందఱు, వల్లభరాయకృత మని మఱికొందఱు వివదించుచున్నారు. ఆ వివాదములతో మన కిచ్చటఁ బ్రసక్తి లేదు. శ్రీనాథుడు భీమఖండ రచనానంతరము డిండిమభట్టు నోడించుటకయి కర్ణాటకాస్థానమున కేఁగునపుడు మధ్యేమార్గమున వినుకొండలో గర్ణాటాధీశ్వరుల యుద్యోగి యగు వల్లభామాత్యుని దర్శించి యప్పుడే క్రీడాభిరామరచనమున దనచేయికూడ వైచి యాతని కా గ్రంథరచనమున దోడ్పడె నని నాయభిప్రాయము. ఏది యెట్లున్నను శ్రీనాథునిభీమఖండమున మూలశ్లోకానుగుణముగ నాంధ్రీకరింపఁబడిన,

గీ. గార్గ్యసిద్ధాంతమత ముషఃకాలకలన, శకున మూనుట యది బృహస్పతి మతంబు,
విప్రజన వాక్య మరయంగ విష్ణుమతము, సర్వసిద్ధాంత మభిజిత్తు సమ్మతమగు.

అను పద్య ముచితమగు మార్పులతో సందర్భానుగుణముగఁ గ్రీడాభిరామమున నీ క్రింది విధముగఁ గైకొనఁబడినది.

గీ. గార్గ్యసిద్ధాంతమత ముషఃకాలకలన, శకున మూనుట యది బృహస్పతిమతంబు
వ్యాసమతము మనఃప్రసాదాతిశయము, విప్రజనవాక్య మరయంగ విష్ణుమతము.

ఇది శ్రీనాథుని పనియే యని సహృదయులకుఁ దోఁపకపోదు.*

దీనినిబట్టి క్రీడాభిరామ రచనము, శ్రీనాథుని వల్లభరాయ సందర్శనము, భీమఖండ రచనానంతరమే జరగి యుండునని స్పష్టము కాఁగలదు. కాశీఖండకృతిపతి యగు వీరభద్రారెడ్డి రాజ్యపాలనము రాజమహేంద్రవరమున క్రీ. శ. 1445 ప్రాంతము నాఁటికే యంతరించినది. అందుచేఁ 'బ్రాయ మింతకు మిగులఁ గైవ్రాలకుండ' శ్రీనాథుఁడు కూర్చిన యీగ్రంథము భీమఖండరచనము జరిగిన నాలుగైదు సంవత్సరములలోపుననే క్రీ. శ. 1435 ప్రాంతమున రచింపఁబడె ననుట విశదముకాఁగలదు. ఈవిషయముల నెల్ల విమర్శించినచో శ్రీనాథుఁడు కర్ణాటకాస్థానమున డిండిమభట్టు నోడించి కనకాభిషేక సత్కారమును కవిసార్వభౌమబిరుదు స్వీకారము నొందినది, కర్ణాటరాజధాని యగు విజయనగరము నుండి రాజమహేంద్ర వరమునకుఁ దిరిగి వచ్చునపుడు రావుసింగభూపాలుని సందర్శించినది, క్రీ శ. 1430 - 1435 సంవత్సరముల మధ్య జరగియుండు నని సహృదయులకుఁ దోఁపఁగల దని నాయభిప్రాయము. పలువు రిట్లే తలచుచున్నారు.

* ఇందుఁగూర్చిన సవిమర్శక చర్చ నా శృంగారశ్రీనాథవిమర్శనమునఁ జూడఁదగును.

ఈసందర్భము లిట్లుండగా శ్రీడాక్టర్ నేలటూరి వేంకట రమణయ్య, యమ్. ఏ. గారు శ్రీవావిళ్లవారి సన్మాన సంపుటములో రచించిన "కవిసార్వభౌముఁడు - కనకాభిషేకము" అనువ్యాసమున శ్రీనాథుని కనకాభిషేకసత్కారము ప్రౌఢదేవరాయలని సర్వసాధారణముగ వ్యవహరింపఁబడు రెండవ దేవరాయల (క్రీ. శ. 1422 — 1446) కాలమునఁగాక, అతని తాతయగు మొదటి దేవరాయల రాజ్యారంభకాలమున క్రీ. శ. 1406 ప్రాంతమున రచింపఁబడె నని నిర్ణయింపఁ బ్రయత్నించియున్నారు. వీరి వ్యాసమును దిలకించినవారికి శ్రీ ప్రభాకరశాస్త్రిగారివలెగాక వీరు శ్రీనాథుని జన్మకాలము క్రీ. శ. 1365-1370 ప్రాంతమయియుండుననియు అతఁడు కుమారగిరిరెడ్డి కొండవీటి సామ్రాజ్యమును పెదకోమటి వేమన కైవసమొనర్చుకొనకపూర్వము పితృపైతామహకమగు రెడ్డి రాజ్యాంతర్భాగమును వేఱొకచోఁ బరిపాలించుచుండినకాలమున నాతని మంత్రి మామిడి సింగన కంకితముగా క్రీ. శ. 1398 ప్రాంతమున శృంగారనైషధమును, అటుతరువాతఁ గొలదికాలమునకే గోమరగిరి జీవితకాలముననే క్రీ. శ. 1400 ప్రాంతమున హరవిలాసమును రచించి యుండుననెడి యస్మదాదులవాదము నంగీకరించినట్లు స్పష్టముగ గోచరించును. అట్టి పరిస్థితులలో వీరు చెప్పినట్లు శ్రీనాథుఁడు కర్ణాటకాస్థానమునఁ గనకాభిషేకసత్కారమును బడసినది మొదటి దేవరాయలపాలనమున క్రీ. శ. 1406 ప్రాంత మన్నచో నది శ్రీనాథుఁడు పెదకోమటి వేమన కొండవీటిరాజ్యాస్థానమున విద్యాధికారిగా నూతనముగఁ బ్రవేశించినకాలమన్నమాట. ఉపలబ్ధము లయిన పెదకోమటి వేమారెడ్డి శాసనములను దిలకించిన శ్రీనాథు డాతని యాస్థానమున క్రీ. శ. 1404 సంవత్సరమునుండిమాత్రము విద్యాధికారిగా గుదిరినట్లు గోచరించును. శ్రీ వేంకటరమణయ్యగా రంగీకరించిన శ్రీనాథునిజన్మకాలమునుబట్టి చూచినచో నప్పటికి శ్రీనాథునివయస్సు రమారమి నలుబదిసంవత్సరములు మాత్రమే యయి యుండును. (శ్రీ ప్రభాకరశాస్త్రిగారి నిర్ణయప్రకారము శ్రీనాథుని జన్మకాలము క్రీ శ. 1385 ప్రాంత మన్నచో, 1406 నాఁటికి శ్రీనాథుఁడు 21 సంవత్సరములు మాత్రమే వయస్సు గలిగియుండును.) ఇట్టి వయస్సులో శ్రీనాథుఁడు ఎంతటి ప్రతిభాశాలి యయ్యును, అష్టదిగ్జయయశోవష్టంభుఁడగు డిండిమ భట్టారకునిపై దాడివెడలునంతటి ధైర్యసాహసములు గలిగియుండుననుట యంత సంగతముగాఁ దోఁపదు. ఇంతకుఁ బెదకోమటి వేమన యాస్థానములో విద్యాధికారిగానున్న కాలములో, శ్రీనాథుఁడు దేశాంతరముల కేఁగు నవకాశములు గూడ నుండనేరవు. కావునఁ బ్రౌఢనిర్భర వయోవిద్యానుభవ పరిపాకములు కలిగిన ప్రాయమున, నన‍ఁగా నలువదియేండ్లు నిండినతరువాత నాతఁ డిట్టి యుద్యమమునకుఁ గడంగియుండునని తలచుటయే సంగతముగా నుండును. సాధారణముగ జనులు దీర్ఘాయుష్మంతులుగ నుండిన యా దినములలో శ్రీనాథునివంటివాని కలువదియేండ్లప్రాయమున నేటి మనబోంట్లకువలె ముదిమిగా గణింప నవకాశములేదు. వైదుష్యదర్ప మప్పుడే యాతనికి పండువారి యుండును.

ఇఁక శ్రీవేంకటరమణయ్యగారు తమ నిర్ణయమున కాధారముగాఁ గైకొనిన ముఖ్యవిషయములను గూర్చి విచారింతము.

చంద్రభూషక్రియాశక్తి యొడయరను శైవగురువునకు శ్రీ వీరబుక్కరాయలు శాలివాహనశకము 1292 (క్రీ. శ. 1360) ప్రాంతమున కొండూరుగ్రామమును దాన మొసంగినట్లుగ గానవచ్చు శాసనమే మన డాక్టరుగారి వాదమున కెల్ల మూలాధారము. అది మెకంజి దొరగారును, వారి యుద్యోగులును క్రీ. శ. 1850 ప్రాంతమున సేకరించిన రికార్డులలో నుదాహరింపఁబడిన తామ్రశాసనము యొక్క నకలు. అసలుశాసనము మెకంజి దొరగారికే దొరకలేదు. "రాయదత్తం అయిన తామ్రశాసనము హాలిస్థలములో హాజరులేనందున అన్యస్థలమందు జాగ్రత్త చేసియున్నామని చెప్పినందున అందుల నకలుగా అగ్రహారికులయిన రాయపెద్ది కృష్ణశాస్త్రులు మొదలయినవారివద్ద కాగితముపైన లిఖించివున్న దానినకలు" అని దొరగారి యుద్యోగులు వ్రాసిన వ్రాఁతలే యీ సంగతి నిరూపించును. కావున డాక్టరుగారు ప్రమాణముగాఁ గొన్న యీ శాసనప్రతి అసలుశాసనముయొక్క ప్రతిక్రియొక్క ప్రతిక్రియని తెలుచున్నది. ఈ శాసనములోని భాగములను శ్రీ ప్రభాకరశాస్త్రిగారుకూడఁ దమ శృంగారశ్రీనాథమున అనుబంధములోఁ జూపియే యున్నారు. కాని వీరు దీని సంతగా ప్రమాణముగాఁ గైకొనక యందలి చంద్రభూషక్రియాశక్తి శ్రీనాథునికాలమునకు సరిపడని కారణమున నట్టిపేరుగల శైవగురువు క్రియాశక్తి గురుపరంపరలో రెండవదేవరాయలకాలమునఁగూడ శ్రీనాథుని కనకాభిషేక కాలమునకు మఱియొకఁడుండ వచ్చునని సమాధానము నొందిరి. సుసంగతము లగు ననేకవిషయములకు విరోధము కానవచ్చు చున్నప్పు డిట్టి శాసనములను బ్రమాణముగా గొని శ్రీనాథునికనకాభిషేకకాలమును నిర్ణయించుట సరికాదని నాయభిప్రాయము. ఇంతకు శాసనమందలి యసంగతములఁగూడఁ దిలకింపుఁడు. వీరబుక్క రాయలు తన దిగ్విజయమునుండి మరలి వచ్చినపుడు చంద్రభూష క్రియాశక్తి గురునకు మురికినాటి యందలి కొండూరు గ్రామమును దాన మివ్వఁగా మరల నాతఁడు తన గురువరుండగు దేవేశక్రియాశక్తి నామమునుబట్టి యాగ్రామమునకు దేవేశపుర మను పేరుపెట్టి యాతని యిరువది రెండవయాబ్దిక పర్వమున దానిని 52 భాగములు చేసి, యేబది యిద్దరు బ్రాహ్మణుల కగ్రహారముగా నొసంగె ననునది యిందలి విషయము. శాసనమందలి ముఖ్యభాగముల నీక్రింద నుదాహరించుచున్నాను.

"..........కించ చంద్రభూషణాచార్య పదపంకజయోః తదా గ్రామం కొండూరు నామానం బుక్కక్ష్మాపతి రర్పయత్. అథ నిజతపోరాజ్యే జగత్ క్షేమంకరే జాగ్రతి తదా కలికాలే ఏక సప్తత్యధికద్విశతాధిక సహస్రాబ్ద పరిమితే గతే సంవత్సరే పర్యాయస్య ద్వావింశత్యావర్తే సాధారణనామ సంవత్సరే వర్తమానే శ్రావణమాసే కృష్ణపక్షే చతుర్దశ్యా మిందువాసరే యతీంద్రస్య క్రియాశక్తిగురోః పర్వణి తస్యేదం ప్రీతయే శ్రీచంద్రభూషణాచార్యో ద్విపంచాశద్భాగ పరికల్పితం నిధినిక్షేపజలపాషాణ అక్షీణ్యాగామి సిద్ధసాధ్య రూపాష్టవిధభోగజుష్టం మురికినాడు మండలమధ్యవర్తి సంప్రసాదిత చతుస్సీమానం కొండూరునామానం గ్రామం ద్విపంచాశ

ద్బ్రాహ్మణేభ్యః ధారాపూర్వకం ప్రాదాత్. శ్రీక్రియాశక్తిగురోః దేవేశఇతి నామైవ, తస్య గ్రామస్య దేవేశపుర మితి నామ కృతవాన్.

శ్రీదేవరాయరవప్పం శ్రీత్రియంబక హరిహర మహారాయరవప్పం
శ్రీవిరూపాక్ష శ్రీబుక్కదేవరాయలవారి వరాహముద్ర.

పయిపంక్తుల నున్నది యున్నట్లుగా నర్థము చేసికొను వారికి శాసనకాలము కలియుగమానమున 1271 సంవత్సరమనియు, అదియే పర్యాయముగ (In other words) దేవేశక్రియాశక్తి యిరువది రెండవ యాబ్దికపర్వ మనియు, అందుచే నా గురువరుని నిర్యాణకాలము కలిసంవత్సరము 1249 అయి యుండు ననియు గోచరించును. కాని కలియుగపరిమాణము మేధాతిథి నిర్ణయమునుబట్టి పంచాంగములలోఁ బేర్కొనఁబడునదిగాని, కుల్లూకభట్టు నిర్ణయము ననుసరించి నేఁడు నూతనముగ వెలువడిన చేతావని యనుగ్రంథములో గైకొనఁబడినదిగాని, ఏది ప్రమాణముగ స్వీకరించినను కలియుగాబ్దము 1271 బుక్కరాయల కాలమునకు సరిపడఁజాలదు. అది యిప్పటికి కొన్ని వేల సంవత్సరముల క్రిందట గతించినది. కావున "కలికాలే"అను శాసనములోని వ్రాత "శకకాలే" అనుటకుఁ బొరపాటు పడియుండు నని శ్రీ వేంకట రమణయ్యగారు సవరణను ప్రతిపాదించిరి. శక సంవత్సరమును సూచించునపుడు గూడ "శాకాబ్దే"యనియు, "శాకే"యనియు వ్రాయుట పరిపాటిగాని "శకకాలే"యని వ్రాయుట యంతగాఁ గానరాదు. ఏది యెట్లున్నను శాసనమం దుద్దేశింపఁబడినది శాలివాహనశకమే యని యంగీకరింతము. అప్పుడయినను శక సం॥ 1271 విరోధి సంవత్సర మగును గాని శాసనములో నుదాహరింపఁబడిన సాధారణ సంవత్సరము కాఁజాలదు. 1292 సంవత్సర మయినచో సాధారణవత్సరమునకు సరిపడుననియు, నందుచే శాసనకాలముగాఁ జెప్పఁబడిన 1271 దేవేశక్రియాశక్తి నిర్యాణకాల మయియుండుననియు, దాని తరువాత 21 సంవత్సరములకుఁ జంద్రభూషక్రియాశక్తి కొండూరు గ్రామమును వీరబుక్కరాయలవలనఁ బడసి శాలివాహనశకము (1292 క్రీ. శ. 1360) లో బ్రాహ్మణులకు అగ్రహారముగ నిచ్చియుండు ననియు మఱియొక నిర్ణయమునకు డాక్టరుగారు పూనుకొనియున్నారు. ఇట్టి యూహల కేల పాల్పడవలెను? ఇన్ని యవకతవకలతో నిండియున్న యీ శాసనపు నకలునుబట్టి యేల ప్రాకులాడవలెను! శాసనమందలివాక్యములను బట్టియేమి, క్రమమునుబట్టి యేమి, యందుఁ జెప్పఁబడిన సంవత్సరసంఖ్యకు దేవేశక్రియాశక్తినిర్యాణకాలమునకు సంబంధము ముడివెట్టుట కెంత మాత్రము నవకాశము లేదు. శాసనకాలముగా నందుఁ బేర్కొనఁబడిన సంవత్సరమునకు 22 ఏండ్లు ముందుగనే దేవేశక్రియాశక్తి సిద్ధిపొందియుండు ననుటయే యందువలన వ్యక్తము కాఁగలదు. కావున సాధారణ సంవత్సరమునకు సరిపోవలెనన్నచో "ఏకసప్తత్యధిక ద్విశతాధిక సహస్రాబ్ద పరిమితే గతే సంవత్సరే" అన్నచోట "ఏకసప్తత్యధిక" అనుటకు మాఱు "ఏకనవత్యధిక" అని పాఠమును మార్చి యదియే సరియైనపాఠ మయి యుండునని తలంచుట సమంజసముగా నుండును. శకవర్షము 1291 గతింపగా శాసనకాలమునకుఁ బ్రవర్తించుచున్నది 1292 అయి సాధారణసంవత్సరమునకు సరిపోవును.

ఇట్టు లేదోవిధముగ సరిపుచ్చుకొని క్రీ. శ. 1360 నాఁడు వీరబుక్కరాయల కాలమున కొండూరు గ్రామమును ఒడసి మరల దానిని బ్రాహ్మణులకు ధారవోసిన చంద్రభూషక్రియాశక్తి రెండవ దేవరాయలకాలములో క్రీ. శ. 1430 ప్రాంతమువఱకు నుండి యుండె ననుట యసంభవము గావున నాతఁడు మొదటి దేవరాయల రాజ్యారంభకాలము క్రీ. శ. 1406 నాఁటికి వృద్ధుఁడయి జీవించియుండు ననుట యసంగతము కానేరదు. కావున శ్రీనాథుని కనకాభిషేకమపుడే జరగి యుండునని తలంపవలె నని శ్రీ వేంకటరమణయ్యగారి ప్రతిపాదనము. ఇంతవఱకు దొరకిన యాధారములనుబట్టి చూడ క్రియాశక్తి పరంపరలో మఱియొక చంద్రభూష క్రియాశక్తి కానవచ్చుటలేదు. కావున నీ శాసనమందలి చంద్రభూషుఁడే శ్రీనాథునికనకాభిషేకకాలమున నున్నవాఁడని గ్రహింపవలె నని వీరి వాదము. ఇంత మాత్రముననే ప్రౌఢదేవరాయ లనఁబడు రెండవ దేవరాయలకాలమున మఱియొక చంద్రభూష (లేక చంద్రశేఖర) క్రియాశక్తి లేఁడని మన మెట్లు నిర్ణయింపగలము? ఇప్పటికి దొరకిన యాధారములనుబట్టి వానిని మనము గుర్తింపలేనంతమాత్రముననే యా పేరిటివాఁడు మఱియొకఁడు తరువాత నుండఁజాలఁడని చెప్పుట యెట్లు? అట్టివానిని బయల్పఱచు నాధారములు ముందుముందు దొరకఁగూడదా? కావున వీరు గైకొనినమార్గము సరియైనదిగాఁ గాన్పింపదు. క్రీ. శ. 1430 ప్రాంతమున రెండవ దేవరాయలకాలమున మఱియొక చంద్రభూషక్రియాశక్తి యుండియుండు నని తలంచుటయే సమంజసముగా నుండును. కాదని గట్టివాదము చేసెడిచో కొండూరుశాసనమునందలి యీ చంద్రభూష క్రియాశక్తియే నిజతపశ్శక్తివలనఁ గాయసిద్ధివడసి దీర్ఘాయుష్మంతుఁడయి ప్రౌఢదేవరాయల కాలమున క్రీ. శ. 1430 ప్రాంతమువఱకు సజీవుఁ డయియుండె నని కూడ నీ క్రిందివిధముగ సమర్థింప వచ్చును. పీఠస్థుఁడగు నాచార్యునిసిద్ధికాలమునకు మరల నా పీఠము నలంకరింపఁదగిన సమర్థుఁడు సిద్ధముగ లభింపనిచోఁ బూర్వాచార్యునివంశమునకుఁ జెందిన పిన్నవయస్సుగలవానికిఁ గూడ గారణ (దీక్ష) మొనర్చి యా పీఠాచార్యునిగా నిర్ణయించుట యిప్పటికిఁగూడఁ గొన్ని శైవాచార్యపీఠములలో నాచారముగ నున్నది. అట్లే చంద్రభూషక్రియాశక్తి దేవేశక్రియాశక్తి నిర్యాణకాలమున కే పది, పదిరెండేండ్లవాఁడో యైయుండి క్రియాశక్తిపీఠమునకుఁ గారణమొంది వీరబుక్కరాయలకాలమున క్రీ. శ. 1360 నాఁటికి 30 — 35 వత్సరముల ప్రాయము కలిగి, ప్రౌఢదేవరాయలకాలమున సంపూర్ణాయుష్మంతుఁడయి జీవించియుండునని తలంచుటలో నంతగా నసంగతి యుండనేరదు. ఆ నాఁడు లౌకికవ్యాపారధురీణు లయియుండిన శ్రీనాథుఁడు, అవచి తిప్పయసెట్టి, సర్వజ్ఞసింగభూపతి మున్నగువారే దీర్ఘాయుష్మంతు లయి ఒహుసంవత్సరములు జీవించినట్టు లాధారములు గానవచ్చుచుండఁగాఁ దపోరాజ్యమును నెఱపు చంద్రభూషక్రియాశక్తి మున్నగు వారి కాయసిద్ధిని, జిరజీవనమును మన మేల శంకింపవలెను? ఈ కాలమునఁగూడఁ గాయసిద్ధికలిమిచే నూఱుసంవత్సరములు పైఁబడిన యాయుర్దాయము గలవారు గొందరైన సం దందుఁ గానవచ్చుటలేదా!

ఏది యెట్లున్నను శ్రీ వేంకటరమణయ్యగా రాధారముగఁ గైకొనిన కొండూరుశాసనమునుబట్టి శ్రీనాథుఁడు క్రీ. శ. 1406 ప్రాంతముననే కర్ణాటకాస్థానమున కేఁగి డిండిమభట్టు నోడించి కనకాభి

షేకసత్కారమును బడసె నని తలంచుట సమంజసము కాదు భీమఖండ రచనానంతరమే యాతఁ డిది యొనర్చె ననుట సర్వవిధముల సంగతముగా నుండఁగల దని నా యభిప్రాయము.

కర్ణాటకాధీశ్వరులలో దేవరాయనామాంకితులు పలువు రున్నట్లే శ్రీనాథుఁడు సందర్శించినట్లు వినవచ్చు రాచకొండ వెలమరాజులలోఁగూడ నిరువురు మూవురు సింగభూపాలురు కలరు. వారిలో శ్రీనాథుఁ డెవరిని దర్శించె ననెడి విషయముగూడ వివాదగ్రస్తముగనే యున్నది. విద్వత్కవియై, రసార్ణవసుధాకరకర్తయై, విశ్వేశ్వర కవిచంద్రాదుల కాశ్రయుఁడయి సర్వజ్ఞబిరుదాంకితుఁ డగు రెండవ సింగభూపాలునే క్రీ॥ శ॥ 1432 ప్రాంతమునఁ గర్ణాటకాస్థానమునుండి తిరిగి వచ్చునపుడు మధ్యేమార్గమున దర్శించియుండు నని నా యభిప్రాయము. అందుచేతనే యాతని దర్శించినప్పుడు "దీనారటంకాల" అను పద్యములో నంతకుముందు నూతనముగ ఘటిల్లిన తన ప్రాభవమును మొదటి మూఁడుపాదములలో నుగ్గడించినాఁడు. రసార్ణవ సుధాకరకర్త యగు నీ సింగభూపాలునకు సర్వజ్ఞబిరుదము లేదను భ్రమచే శ్రీ ప్రభాకరశాస్త్రిగారు శృంగారశ్రీనాథములో శ్రీనాథుఁడు దర్శించిన సింగభూపతి యీతని మనుమఁడయి యుండునని వ్రాసినవిషయము సరికాదు. రసార్ణవ సుధాకరకర్తకు సర్వజ్ఞబిరుద మున్నట్టు లనేకాధారములు లభించినవి. రేచెర్లవంశ్యు లగు సింగభూపాలురలో వాస్తవముగ నీతఁడే మహాపండితుఁడయి యట్టి బిరుదమునకుఁ దగినవాఁడుగ గోచరించును. ఈతనితండ్రి అనపోతనాయని శాసనములు క్రీ॥ శ॥ 1380 ప్రాంతమువఱకు దొరకు చున్నవి. ఈ సింగభూపతి చిరజీవి యని రసార్ణవసుధాకరావతారికలోని "అథ శ్రీ సింగభూపాలో। దీర్ఘాయు ర్వసుధా మిమాం। నిజాంసపీఠే నిర్వ్యాజం। కురు తే సుప్రతిష్ఠితామ్" అను శ్లోకమువలనఁ గ్రహింపఁదగును. ఇతని కార్వురు కొమరులు. అతని జీవితకాలమున వారుగూడ రాజ్యమందలి యితరప్రదేశములలోఁ బాలన మొనర్చుచు శాసనముల నెలకొలుపుచుండిరి.

కావున సర్వజ్ఞసింగభూపతి క్రీ॥ శ॥ 1435 ప్రాంతమువఱకు జీవించి యుండె ననుట కెట్టి యాటంకములును లేవు.

శ్రీ వేంకటరమణయ్యగారు తమ వ్యాసములోఁ బ్రసక్తానుప్రసక్తముగ శృంగారనైషధ కృతిపతి యగు మామిడి సింగనామాత్యుని గురువు గురుశంకరస్వామియు, ఎఱ్ఱాప్రెగ్గడ గురుఁడగు శంకర స్వామియు నొక్కఁడే యని తెలిపిరి. అందుకు వా రెట్టి యాధారములను జూపలేదు. ఇది సరికాదని నా మనవి. ఎఱ్ఱాప్రెగ్గడయు, నాతనిగురువు శంకరస్వామియు శ్రీనాథునికిముందే మరణించియుందురు. వారికిని మామిడి సింగనగురువు గురుశంకరస్వామికి నెట్టి సంబంధమును లేదు. ఈ గురుశంకరా రాధ్యునకు పెదకోమటి వేమన శ్రీశైలక్షేత్రమున మహాశివరాత్రి పుణ్యసమయమున పినపాడు గ్రామమును క్రీ॥ శ॥ 1405 సంవత్సరమున నగ్రహారముగ నిచ్చియున్నాఁడు. ఆ శాసనమునకుఁ గర్త శ్రీనాథుఁడే. శాసనమందలి యీ క్రింది శ్లోకములఁ జూడుఁడు.

శ్లో॥ దాతా కోమటివేమనామనృపతిః పాత్రం గురు శ్శంకరః
స్థానంచే త్పినపాడు రత్రితు కవి శ్శ్రీనాథభట్టారకః

కాలశ్చే చ్ఛివరాత్రిపుణ్యసమయ స్సాక్షీ మహాన్ శ్రీగిరిః
శ్రేయః కిం నతు వర్ణ్యతే సుకవిభి శ్శృణ్వంతు తచ్ఛాసనమ్.

శ్లో॥ శాకాబ్దే గిరినేత్రమూర్తి విధుకే సంవత్సరే పార్థివే
మాఘేస్మిన్ శివరాత్రిపుణ్యదివసే శ్రీవీరనారాయణః
తస్మై శంకరదేశికాయ విదుషే భద్రానదీప్రాక్తటే
గ్రామం శ్రీపినపాడు ముత్తమ మదా దాచంద్ర మాతారకమ్.

— (శృంగార శ్రీనాథము. పుట 119)

మఱియు శ్రీ వేంకటరమణయ్యగారు శ్రీనాథుని శృంగారనైషధ రచనానంతరము పెదకోటి వేమన కొండవీడు పాలించునపుడు వెలయించిన శాసనములలో మంత్రియగు మామిడి సింగన ప్రస్తావము కానరానందున నప్పటి కాతఁడు వేమభూపాలుని మంత్రిగా లేఁడేమో యను సందియమునుగూడఁ బ్రకటించిరి. ఇదికూడ సరియైనదికాదు. శాసనములలో దాతలు, ప్రతిగ్రహీతలు, శాసనకర్తలు చెక్కిన శిల్పులు, వీరల పేరులకేగాని యితరుల నామముల నందులో నుదాహరించుటకుఁ బ్రసక్తి యేల కలుగును? దాన మొసంగు రాజుల మంత్రుల పేరు లం దుగ్గడించుట కేమి యవసరము? పెదకోమటివేమన కొమరగిరిరెడ్డి జీవితకాలములో వేఱొకచోటఁ దన తండ్రి తాతలనుండి సంక్రమించిన రెడ్డి రాజ్యాంతర్భాగమును బరిపాలించుచుండినను గొమరగిరి మృతినొందినప్పుడు మాత్రము కొండవీటి సామ్రాజ్యము నాక్రమించి దానిని క్రీ. శ. 1400 ప్రాంతమునుండి 1420 వఱకుఁ బరిపాలించినట్లు లాతని శాసనాదికములవలనఁ గాననగును. శాసనములలో నుదాహృతుఁడు కానంతమాత్రమున మామిడి సింగనగాక యాతని కప్పటికి మఱియొకమంత్రి యుండె నని తలంప రాదు. సింగనామాత్యుఁడు సోమసిద్ధాంతమను జ్యోతిషగ్రంథమునకు వ్యాఖ్యానము రచించి దానిని క్రీ. శ. 1418 సంవత్సరమున గూర్చినట్లు లందుఁ బేర్కొనినాఁడుట. ఆ గ్రంథావతారికలోఁ దన వృత్తాంతమును జెప్పికొనుచు "పెదకోమటి వేమేంద్ర, మంత్రిణా తేన ధీమతా। జ్యోతిర్విద్యా నిరాఘాట, సరస్వత్పారదృశ్వనా। సింగయామాత్యరత్నేన, భువిలోకహితైషిణా। క్రియతే సోమ సిద్ధాంత, వ్యాఖ్యా గూఢార్థదీపికా"అని లిఖించినాఁడు. —(శృంగార శ్రీనాథము పుట 81)

దీనినిబట్టి యప్పటికిఁగూడ నాతఁడు పెదకోమటి వేమన మంత్రిగా నుండినట్లు స్పష్టమగుచున్నది కదా ! పెదకోమటివేమన యెచ్చట నెప్పుడు రాజ్య మొనర్చినను సింగనామాత్యుఁడే యాతని మంత్రిగా నుండెనని తలంచుట కెట్టి యభ్యంతరములును లేవు.

# ప్రాచీన హిందూదేశమునందలి వైద్యులు : ఆతురాలయములు

డాక్టరు: శ్రీ ఆచంట లక్ష్మీపతి

హిందూమహాయుగమున వైద్యుల చరిత్రయందలి కొన్ని పేర్లు మనకు తెలిసియున్నను వానిని గూర్చి వివరములు ఇప్పు డంతగా తెలియరావు. కాని రెండు సాంప్రదాయములు పరంపరగ వచ్చుచున్నవి.

౧. ఆత్రేయ సాంప్రదాయము:—ఇందలి ముఖ్యులు అశ్వినీదేవతలు, భారద్వాజులు, అగ్నివేశులు, చరకుడు, భేడుడు, వృద్ధజీవకుడు, హారీతుడు మొదలగువారు.

౨. ధన్వంతరి సాంప్రదాయము:—ఇందలిముఖ్యులు కాశీరాజగు దివోదాసనుధన్వంతరి, సుశ్రుతుడు, అగస్త్యులు, నవనాధసిద్ధులు మొదలగువారు.

ఈ వైదికయుగములో ఆయుర్వేదము ప్రతివిద్యార్థియు ఏడవ సంవత్సరమునుండి విధాయకముగా ఇతరవిషయములతోబాటు నేర్చుకొనవలసియుండెను. వయసు వచ్చినతర్వాత ప్రత్యేకము వైద్యుడుగా తయారగుటకు నిర్ణయింపబడినవానికి రెండవ సారికూడ ఉపనయనము చేయుచుండిరి. ద్విజులలో తిరిగి ద్విజత్వము పొందినగాని వైద్యార్హత లేకయుండెను.* ఈ వృత్తియందు ప్రవేశించుటకు అర్హులగు వారు చక్కని ముక్కు, పెదవులు, కండ్లు, పండ్లు, గలిగి సుందరమైన ముఖవర్చస్సు గలిగియుండవలెను. మంచి వాగ్ధోరణి గలిగి యుండవలెను. గోళ్లు చక్కగా కత్తిరించుకొని నిర్మల వస్త్రములు ధరించి వినయ వంతుడై, బుద్ధిమంతుడై చక్కని జ్ఞాపకశక్తియు, ఓర్పును, ధైర్యమును గలిగి, మనోవాక్కాయశౌచములతో ఎల్లప్పుడును శ్రీమల కోర్చుకొనువాడుగా నుండవలెను. "నాత్మార్థం నాపికామార్థ మథభూతదయాం ప్రతి" అని భూతచింతయే ఆదర్శముగా గలిగి చికిత్స చేయవలెనుగాని స్వార్థపరుడై చికిత్స చేయకూడదు. బీదవారలకు, స్నేహితులకు, బంధువులకు ఎల్లపుడును ఉచితముగా చికిత్స చేయవలెను.

కర్మపథమునందును శాస్త్రజ్ఞానమునందును సమానప్రజ్ఞ గలిగి యుండవలెను. లేనియెడల ఒకటే రెక్కగల పక్షివలె పడిపోవును.

అప్పటి వైద్యులజ్ఞానము ఆకాలమునాటి చరకసుశ్రుతాదిగ్రంథముల ఉత్కృష్టతను బట్టి తెలియ గలదు. కాని బౌద్ధయుగమునాటి వైద్యులచరిత్ర జాతకకథలనుండియు, చైనాదేశ విద్యార్థులును భారతదేశ మంతటను ప్రయాణము చేసి గ్రంథములు వ్రాసిన చైనాదేశయాత్రికులు హ్యూను త్సాంగ్, ఇత్సింగ్ మొదలగు వారి చరిత్రలను బట్టి కండ్లకు కట్టినట్లు తెలియగలదు. ఆ కాలమున బౌద్ధవిహారములలో ఉపయోగింపబడిన మందులు మొదలైనవాని పట్టికలు ఇంకను గలవు.

---

* సుశ్రుత, సూత్రస్థాన, అధ్యాయము 2

క్రీ. పూ. ఆరవశతాబ్దమునాటి జీవకుడు అను వైద్యునిచరిత్ర మనకు ఆశ్చర్యము గొలుపక మానదు. ఇతడు గౌతమబుద్ధుని సమకాలికుడు. ఆయనకు చికిత్స చేసెను. ఇతడు 'కుమార భచ్చ' అనగా బిడ్డల చికిత్సయందు మిక్కిలి చతురత గలవా డను బిరుదమును గలిగి యుండెను. ఇంతే కాదు. ఇతడు కాయచికిత్సయందును, శస్త్రచికిత్సయందును గొప్పప్రజ్ఞ గలవాడని చారిత్రికనిదర్శనములు గలవు. ఇతడు మగధరాజ్యమునకు ముఖ్యపట్టణ మగు రాజగృహనగరమునుండి బింబిసార చక్రవర్తియొక్క కుమారుడగు అభయునిచే అప్పటికే ప్రసిద్ధిజెందియుండిన తక్షశిలానగరమునందలి వైద్యవిశ్వవిద్యాలయమునకు పంపబడెను. ఆ కాలమున రమారమి వేయిమైళ్ల దూరము వైద్యవిద్యా సంపాదననిమిత్తమై పోయియుండె ననిన ఆశ్చర్యపడ నవసరము లేదు. ఇచ్చట నతడు ఏడు సంవత్సరములు విద్యాభ్యాసముచేసి గురువువద్ద సెలవుతీసుకొనునప్పుడు గురువు అతనిని ఈవిధముగా పరీక్షించెను. ఈ గడ్డపార తీసుకొని తక్షశిలానగరమునకు చుట్టును యోజనము దూరములో పరీక్షించి చూచి వైద్యమునకు పనికిరాని మూలికలు తెమ్మని పంపించెను. ఆతడు తిరిగితిరిగి ఏదో ఒకవిధమున చికిత్సకుగాని ఆహారముగగాని పనికిరాని వస్తువు లేదవి "నహి కించిత్ జగత్యనౌషధం" అని చెప్పెననియు, అందుపైని గురువు అతనికి ప్రయాణపుఖర్చులకు కొంత ధనమిచ్చి వీడ్కొల్పెననియు వ్రాసియున్నారు. జీవకుడు సాకేతనగరమునకు వచ్చునరికి ప్రయాణపు ఖర్చులకు లేకపోయెను. అచ్చట కొన్నిదినము లుండవలసివచ్చెను. ఆ నగరమున ఒక ధనికు డగు సెట్టిగారి భార్య ఏడు సంవత్సరములనుండి ఏదో తలలో బాధపడుచు ఎందరు వైద్యము చేసినను కుదరక కష్టపడుచుండెను. జీవకునిసమాచారము విని వారు ఇతనిని ఆహ్వానింపగా ఇతడు కొన్నిమూలికలు సంపాదించి వానితో నొక ఘృతము తయారుచేసి నస్యము చేయించెను. ఈ చికిత్సామహిమచే ఆమె రోగము నివృత్తి అయ్యెను. వైద్యదక్షిణగా 16,000—0—0 రూపాయలును, నౌకరులను, ఒక గుఱ్ఱపుబండిని ఆయనకు సమర్పించిరి. దీనితో అతడు రాజగృహము చేరి తన పోషకు డగు అభయునకు తనకు సహాయము చేసిన ధనమును తిరిగి ఇచ్చివేసెను. పిమ్మట బింబిసార చక్రవర్తికే కొన్ని లేపముల సహాయముతో భగందరచికిత్స చేసి కుదిర్చెను. అంతట జీవకుడు రాజవైద్యుడుగా నియమింపబడెను. తరువాత గౌతమబుద్ధునకును, బౌద్ధసంఘమునకును వైద్యు డాయెను.

జీవకుడు చికిత్సచేసిన అత్యద్భుతచికిత్సలలో కొన్ని బౌద్ధగ్రంథములలో వర్ణింపబడినవి. రాజగృహనగరమునందు ఒక వైశ్యశిఖామణి కుమారుడు మితిమీరిన తలనొప్పితో అనేకసంవత్సరములనుండి బాధపడుచుండెను. శస్త్రచికిత్సచే తలలో నొక భాగము చీల్చి రెండు పురుగులను తీసివేసి, దాని నెప్పటివలె కుట్టి, ఏదో ఒక లేపమును పూసి, కట్టుకట్టెను. ఇందువలన తలనొప్పి నిర్మూల మాయెను. పిమ్మట కాశీపట్టణమున ఒక ధనవంతుడైన వైశ్యుని కుమారుడు వ్యాయామము చేయుచుండగా పేగులలో మెలిబడి ఆహారము జీర్ణించుకోలేక మలబద్ధము గలిగి రక్తహీనుడై శల్యావశిష్టుడై యుండెను. అంతట వారు జీవకునకు చెప్పి పంపగా ఇతడు శస్త్రచికిత్సచే

ఉదరపాటనముచేసి మెలిబడిన ప్రేగులను రోగిభార్యకు చూపి, యా మెలి విడగొట్టి, తిరిగి దానిని ఎప్పటివలె ఉదరకుహరమున స్వస్థానమున నిలిపి, చర్మము కుట్టి, ఏదో ఒక లేపము పూసి మాన్పెను. అతనికి ఆ కాలమున వైద్యదక్షిణగా 16,000-0-0 రూపాయలు సమర్పించిరి. తరువాత జీవకుడు కుదిర్చిన గొప్ప వ్యాధి మరొకటి కలదు. ఉజ్జయిని నేలిన 'పజ్జోత' (ప్రద్యోత) మహా రాజు కామిలా (కామెర్లు) వ్యాధితో బాధపడుచున్నందున ఆఖరువైద్యముగా బింబిసార చక్ర వర్తివద్దకు ఆతని సంస్థానవైద్యు డగు జీవకుని పంపగోరి ఆహ్వానము పంపెను. రోగముకంటె రోగి మొండివాడని జీవకుడు తెలుసుకొనెను. ఆ వ్యాధికి ఘృతపానము చేయింపవలసియుండెను. ఘృతము పేరు చెప్పగానే రోగికి వాంతి వచ్చునట్లుండెను. అందుచేత ఘృతము పనికిరాదని రాజు శాసిం చెను. జీవకుడు ఎట్లెట్లో కష్టపడి ఘృతముయొక్క రంగు, వాసన, రుచి అన్నియు మారునట్లు ఒక ఔషధమును తయారుచేసి, ఒకవేళ వమనమైన యెడల అందు ఘృతమును కనిపెట్టి మహారాజు తనకు ఏమి దండనవిధించునో అను శంకచేత జీవకుడు ఒక యుక్తిని పన్నెను. అదేమనగా, ఈ మందు లోపలికి ఇవ్వగానే తాను ఒక పచ్చి మూలికను సంపాదించి వెంటనే విరుగుడుగా ఇవ్వవలె ననియు, అందు నిమిత్తమై వేగముగ పరుగెత్తగల వాహనమును తయారుచేసి వీథిలో సిద్ధముగ నుంచవలె ననియు, ఏర్పాటు చేయించెను. పిమ్మట ఔషధ ప్రయోగమును జేసి ఉపచార విధా నాదుల నొనర్చుటకు తగువారలను నియమించి వీథిలో తయారుగా నున్న అతివేగముతో పోవు ఏనుగు నెక్కి నగరము విడిచి పోయెను. పిమ్మట మహారాజునకు రోగనివృత్తి అయ్యెను. కాని వైద్యుడు కనుపించలేదు. పిదప రాజు విషయము నంతను తెలిసికొని జీవకునకు చేరవలసిన బహు మానమును బింబిసారునిరాజధానికి పంపివేసెను. ఇట్లు కఠినమైన రోగములనే గాక బుద్ధసంఘము నందు అనేకచికిత్సలు జీవకుడు చేయుచుండె నని క్షుల్లవర్గము (5–14–1) అను గ్రంథమునందు గలదు. ఒకసారి బుద్ధునికే ఆరోగ్యము తప్పిపోయెను. అప్పుడు విరేచనౌషధము ఇవ్వవలసి వచ్చెను. భక్తిగౌరవములతో పూజింపవలసిన పవిత్రుడైన ఆ మునీశ్వరులకు లోపలికి తీసికొనుటకు అహితము లైన మందులను ఇచ్చుటకు జీవకునకు ఇష్టములేక పోయెను. అందుచేత విరేచనౌషధమును తామర పద్మములో నిమిడ్చి వాసన చూచుటకు బుద్ధుని కిచ్చిరనియు, అందుచే సుఖముగ విరేచనము లయ్యె ననియు, పిమ్మట వేడినీళ్లలో ఆ మహామునిని స్నానముచేయించి సంపూర్ణముగ ఆరోగ్యము గలుగు వఱకు ద్రవపదార్థములను ఆహారముగా నిచ్చుచుండి రనియు వ్రాయబడియున్నది. మఱియొకసారి ఎవరో ఒక భక్తురాలు విందుచేసినప్పుడు బౌద్ధసంఘమునందు అందరికిని అజీర్ణము పుట్టి దోష ప్రకోపముచే బాధలు పడుచుండ జీవకుడు వారి కందరకును చికిత్స చేసె నని కలదు.

ఇందుచే (1) తక్షశిలానగరమునందు క్రీ.పూ. ఆరవశతాబ్దము నాటికే వైద్యవిశ్వవిద్యాలయము గల దనియు, (2) వైద్యశాస్త్రమున నుత్తీర్ణు డగుటకు 7 సం॥ కాలము పట్టెడిదనియు (3) వైద్యుడు చికి త్సకు ప్రారంభించక పూర్వము తగు పరీక్షలు ఉండెడివనియు, (4) ఓషధీవిజ్ఞానము అప్పటికే చక్కగ అభివృద్ధిలోనుండి మూలికలయొక్క ప్రభావము బాగుగ తెలిసియుండెననియు, (5) సాకేత, కాశీ,

రాజగృహ, ఉజ్జయినీ, మొదలగు రాజధానులయందు ప్రసిద్ధవైద్యులకు ఈ కాలమునందు కంటె హెచ్చు బహుమానములు జరుగుచుండెననియు, (6) ఆ కాలమునాటికే ఉదరమును చీల్చి చికిత్సలు చేయు నేర్పు వైద్యులకు ఉండె ననియు, (7) వ్రణములు మాన్పు ఔషధములకు ఏ విధమైన లోటును లేక యుండె ననియు, (8) అప్పటికే జీవకునివలె ప్రసిద్ధినొందిన వైద్యులు ఒక రాష్ట్రము నుండి మరియొక రాష్ట్రమునకు చికిత్సార్థమై పోవలసి వచ్చుటచేత నిరంతరము విరామము లేక యుండి రనియు దృఢపడుచున్నది.

## ఆ తు రా ల య ము లు

బౌద్ధయుగమునకు పూర్వమే యుండిన ఆతురాలయములు, ప్రసూతిశాలలు, కుమారాగారములు అనుపేర బరగు చికిత్సాశాలలను గురించియు, వైద్యుడు, పరిచారకుడు, ఔషధము, రోగి, అను చతుష్పాదముయొక్క సంపత్తినిగూర్చియు చక్కని వివరములు చరకసుశ్రుతముల ద్వారా మనకు తెలియుచున్నవి.

చరకసూత్రస్థానము 15వ అధ్యాయమునందు "దృఢం నివాతం ప్రవాతైకదేశం" అను వాక్యములతో ఆతురాలయముల వర్ణనలు కనిపించుచున్నవి. దృఢముగ పెనుగాడ్పులు వీచనట్టియు, సుఖముగా నుండుటకై ఎంతకావలెనో అంతటి ప్రశస్తమైన గాలి వీచునట్టియు, ఇటునటు సంచరించుటకు అడ్డములు లేనట్టియు, వెలుతురును అడ్డగించు ఎత్తయిన కట్టడములు లేనట్టియు, అనారోగ్యకరములగు పొగ, ఎండ, తడి, దుమ్ము, ప్రవేశింపనట్టియు, అనిష్టమగు శబ్దస్పర్శరూపరసగంధములు లేనట్టియు, అవశ్యములగు ఉపకరణములు అన్నియు గలిగిననట్టియు, వంటశాల, స్నానభూమి, వర్చస్థాన (మరుగుదొడ్డి) వీనిఅన్నిటితో రోగి చికిత్సకు ప్రారంభింపకముందే సిద్ధముగానుండవలసినట్టియు ఆతురాలయమును వర్ణించియున్నాడు. వైద్యశాల నంటి సమృద్ధిగా పాలిచ్చునదియు, సాధువైనదియు, రోగములేనిదియు, దానికి కలిగిన దూడలన్నియు బ్రదికియుండునదియు, నిర్దుష్టమైన నీళ్ళతోను మేతతోను మేపబడి చక్కగా పోషింపబడినదియు నగు శీలవతియగు గోవును పరిశుభ్రమైన కట్టడమునందు కట్టియుంచవలెను అని చెప్పబడి యున్నది. ఇకను చిత్రమేమనగా ఈ కాలమున సర్వసంపూర్ణ చికిత్సలుగల ఆతురాలయములలో గూడ ఆచరణములోలేని విషయము మరొకటికలదు. మానసిక వైద్యముగా రోగులకు గాత్రయంత్రములతో సంగీతము పాడువారును, మనసున కుల్లాసముగ సంభాషించగలిగి పురాణ, ఇతిహాసముల వినిపించు వారును, దేశకాలానుగుణముగ రోగుల ఇంగితము నెరింగి నడచుకొనువారలును ఆనాడు ఆతురాలయసంస్థలలో చేరియుండిరని తెలియుచున్నది.

ఐతే గోవు అని ఏకవచనమును ఉపయోగించుటచేతను, చికిత్సాలయమున నుండు సంభారసంభరణములను చూచి ఆలోచింపగా ధనవంతు డగు ఒక్కొక్క రోగికే ఈ ఆతురాలయములందు చికిత్స చేయుచుండి రని తోచుచున్నది. కాని, క్రీ. వె. ఐదవ శతాబ్దమునందు తన కండ్లతో చూచినది చూచినట్లుగా వర్ణించిన "పాహియాన్" అను చైనాయాత్రికుడు రెండవ చంద్రగుప్త

డను గుప్తచక్రవర్తికాలమున గ్రామపెద్దలును ధనవంతులును ధర్మార్థచికిత్సలకుగాను రాజధాని పట్టణములలో ఆతురాలయములను నిర్మించుచుండిరనియు, అందు బీదరోగులు తలిదండ్రులు లేని పిల్లలు కడువృద్ధులు నివసించుటకు తగిన వసతులు ఉండెడివనియు, వైద్యులు వారలకు తగిన ఆహారములను మందులను ఇచ్చి పోషించి వారలను రోగవిముక్తులైన తర్వాత వారి ఇండ్లకు పంపుచుండిరనియు చెప్పియున్నాడు. తక్షశిల మొదలు రామేశ్వరమువఱకు నలుదిక్కులకు వ్యాపించి యుండిన రాజమార్గములనంటి అరక్రోసునకు, అనగా ఒకమైలు రెండుఫర్లాంగులకు ఒకటి చొప్పున రోడ్డుప్రక్కలను ఉండు సత్రములు, ఆతురాలయములలో ఆసనములు, మంచములు, అన్నపానీయములు బాటసారుల నిమిత్తము ధనికులు ఒకరిని మించి ఒకరు ధర్మార్థము కైంకర్యములు చేయుచుండి రని ఈ బౌద్ధయాత్రికుల చరిత్రములందు గలదు.

దక్షిణాపథమున చెన్నపట్టణమునకు సమీపమున ఈ రస్తాలలో చాకలివానిసత్ర మనియు, తెలికలవాని సత్రమనియు, రాయల సత్రమనియు, బోగముదాని సత్రమనియు వేరు వేరు పేర్లతో రస్తాలమీద గ్రామములు గలవు. ఈ గ్రామములు అన్నియు అప్పటినుండియు ఏవిధమగు సర్కారు పన్నులు ఇయ్యనక్కరలేని యినాముగ్రామములుగా నుండినవి. ఇట్టి మకాము స్థలములలో అనేక విధము లగు వృక్షములుగల తోపులను, కోనేళ్ళను, దేవాలయములను ఇప్పటికిని చూడనగును.

అశోక చక్రవర్తి తన రెండవ శిలాశాసనమునందు ఈ ప్రకారము ప్రకటించియున్నాడు. "నేను మానవులకేగాక పశువులకుగూడ ఆతురాలయములను రాష్ట్రము పొడుగునను స్థాపించి యున్నాను. ఇందులకై సర్కారు తరఫున ఔషధములు తయారుచేయుటకుగాను మూలికలు ఫలములు మొదలగు సర్వసంభారములను సేకరించుటకు మూలికోద్యానవనములను స్థాపించి యున్నాను."

భారతదేశమున లభ్యముగాని మూలికలను ఖండాంతరములనుండి తెప్పించి సర్కారు ఉద్యానవనములలో తొట్టెలలో పెట్టి అధికములగు ఎండవానలు తగులకుండ ఆయా ఋతువులకు తగినట్లు ప్రత్యేకము నిర్మింపబడిన ఇండ్లలో పెంచుచుండిరని వ్రాయబడియున్నది. రాజులేగాక ధనికులగు ప్రజలుకూడ ప్రసూత్యాలయములను ధర్మార్థము నిర్మించుచుండి రని తెలియుచున్నది. సుశ్రుతమునందు ప్రసూతిగృహము ఈ ప్రకారముగా వర్ణింపబడియున్నది. "సర్వాగారం యథాసంజ్ఞం తన్మయ పర్యంక ముపలిప్తభిత్తిం సువిభక్తపరిచ్ఛదం ప్రాగ్ద్వారం దక్షిణద్వారం వాష్టహస్తాయతం చతుర్హస్తవిస్తృతం రక్షామంగళసమ్పన్నం విధేయమ్" అవసరమైన సామానులు మాత్రము గలిగి చక్కగ అలంకరింపబడిన గోడలు, తెరలుగలదై నిర్మలమైనగాలి, వెలుతురు వచ్చుటకుగాను తూర్పునను, దక్షిణమునను ద్వారముగలదై ఎనిమిదిహస్తముల (16 అడుగులు) పొడుగును నాలుగు హస్తములు (8 అడుగులు) వెడలుపును తక్కువ గాకుండా మంగళకర మగు అగారము ప్రసూతినిమిత్తమై నిర్ణయింపవలెను. ఇట్లే శిశుపోషణ ప్రత్యేక

ముగ ఆ యా ఋతువులకు తగినట్లుండుటకై అగారములు సుఖకరములగు మంచములు, పడకలు తివాసులు, దుప్పట్లు, చాపలు మొదలగునవి గలిగి రమ్యమైన చక్కని వెలుతురు గాలివచ్చునవిగా నుండవలె నని కుమారాగారములను గూర్చి విధింపబడినది. ఇప్పటికిని చెంగల్పట్టుజిల్లాలోని తిరుముక్కూడల్ అను గ్రామమునందు ఆతురాలయమునుగూర్చియు, గుంటూరు మండలమున కృష్ణాతీరమున మల్కాపురము గ్రామము నందుండిన ప్రసూత్యాలయములను గూర్చియు దెలిసికొనుటకు శిలాశాసనములను చూడనగును. ఆతురాలయముల యందున్న మందులపట్టీలు సహా ఈ శాసనములలో చెప్పబడియున్నవి. అందు వాసాహారీతకీ, గోమూత్ర హారీతకీ, భల్లాతక హారీతకీ, బిల్వాదిఘృత, కల్యాణలవణ, లశునాద్యేరండ తైలము, ఇత్యాదిమందులు నేటికిని ఉపయోగములో నున్నవి గలవు.

భారతీయ విజ్ఞానము ఆయుర్వేదమునకును - ఆయుర్వేదము భారతీయ విజ్ఞానమునకును ఎట్లు తోడ్పడెనో ఇందువలన తెలియగలదు. ఆయుర్వేదము శాస్త్రమే కాదనియు, దేశమున సర్కారు సొమ్ము ఆయుర్వేద ప్రోత్సాహమునకై వ్యర్థపరచగూడదనియు అని చెప్పువారి దృక్పథమును మారగల దని అభిలషించుచున్నాము. *

---

* ఈ వ్యాసము "ఆయుర్వేదశిక్ష" అను నేను ప్రచురింపబోవు గ్రంథము నుండి ఎత్తి వ్రాయబడినది. —ఆ. ల.

# ఐనవోలు మైలారు దేవుఁడు

శ్రీ దూపాటి సుందర వరదాచార్యులు

కాకతీయరాజులు పూజించిన వేలుపులలో మైలారు దేవుఁడు ముఖ్యగణనీయుఁడు. స్థానిక చరిత్రము నందును క్రీడాభిరామమునందును మైలారు దేవుని ప్రశంస విశేషించి కలదు. మైలారు దేవుని వీర భటులు గావించు భక్తిప్రదర్శనము లనఁదగు సాహసకార్యములు క్రీడాభిరామమునఁ జదువునపుడు మేను పులకించును. ఈ గ్రామమునకుఁ బ్రాచీననామము అయ్యనవోలు. దీనిని జనసామాన్యము ఐలోని యని వ్యవహరించుచున్నారు. ఐనవోలు ఓరుగంటికి దక్షిణముగ దాదాపుగ ఆఱుక్రోసుల దూరమున నున్నది. రుద్రమదేవి తన పుత్రికల శుభప్రాప్తికై మైలారు దేవునకు మ్రొక్కుకొని యీయాలయమును బెంపులోనికిఁ దెచ్చినటుల స్థానికచరిత్రము చెప్పుచున్నది. ఇచ్చటఁ గల విశేష ములు చారిత్రికవిశేషములు విచారించి తెలిసికొనిన అమూల్యాంశముల నిట నుదహరింతును.

ఐనవోలు మొదటఁ బశ్చిమ చాళుక్యరాజుల కాలమునఁ బేరొందెను. వారలు నెలకొల్పిన దేవా లయ ప్రాకారము, విగ్రహశకలములు, శాసనఖండములు గ్రామసమీపమునందుఁ గల తటాకతీరమున నేటికిని గోచరించుచున్నవి. త్రైలోక్యమల్లుని శాసనఖండ మొకటి తటాకపుతూముపై బిగింపఁబడినది. శాసనప్రయోజనము గుర్తింప రాకున్నను జెంత గల పున్నవోలులో నీ లిపితో నిట్టి వ్రాతతో ముగింపఁబడిన శాసనశిల నింతకు ముందు శోధించిన కతన త్రైలోక్యమల్లునితోఁ జారిత్రిక సంబంధము కొంతవఱకుఁ గలదని ధ్రువపడినది. సమీప మునఁ గల శిలాస్తంభములు రెండును గుట్టపై గల మూడు దేవాలయములు నిర్మాణక్రమమున జాళుక్య దేవాలయములఁ బోలియున్నవి. విలువఁ గల శాసనములు కోటగోడలయందును జెఱువుల లోఁదట్టునను ఖండములుగ నొనర్పబడి దుర్వినియోగము జేయఁబడుటచే వలసిన చరిత్రము గడింప వీలులేకపోయినది. ఈ ప్రాచీనక్షేత్రము సర్వవిధముల సావకాశముగఁ బరిశోధింపఁ దగినది. ఐనవోలు లోని మైలారు దేవుని గుడి చాళుక్యనిర్మాణ మని తోఁచును. ఆలయము నేఁడు గ్రామ మునకు మూఁడు ఫర్లాంగుల దూరమున నున్నను, బూర్వ మది గ్రామమధ్యభాగ మనుటకుఁ దార్కాణము గలదు. విశాలావరణమునందు నిర్మింపబడిన, యీ యాలయమునకు బహిఃప్రాకార మొకటి గలదు. ఆ ప్రాకారము పూర్తిగ రూపు మాసినది.

ప్రాకారములోనుండి యాలయావరణమున కేగుటకు నిర్మించిన శిలాద్వారములు మహోన్నతము లైనవి మూఁడు గలవు. ఇది సర్వవిధముల ఓరుగంటి కోటలోని ద్వారములను బోలియున్నవి. పని తనమునందును, ఉన్నతియందును, లతాదికల్పనము లందును బోలిక గలదు. సిద్ధహస్తుఁ డగు నొక శిల్పియే తొలుత అయ్యనవోలు ద్వారముల నిర్మించి గడించిన హస్తకౌశలముతో నంతకంటె

శోభాయమానముగ ఓరుగంటి ద్వారములు నిర్మించె నని తోఁచును. ఇవి కాకతిరుద్రాంబ తీర్చిన వని స్థానికులయొక్కయు స్థానికచరిత్రముయొక్కయు నభిప్రాయము. ప్రకృత మీ ద్వారములు మూఁడింటిలోఁ గుడివైపునఁగల ద్వారము కూలిపడినది. మిగిలిన రెండుద్వారములును సురక్షిత ముగ నున్నవి. కూలినద్వారములఁ బరిశోధించినచో స్థిరతరముగ ద్వారము లుండుటకుఁ జేసిన కాకతీయశిల్పుల ప్రయత్నములు గోచరించును.

ప్రాకారావరణము దాటఁగనే యున్నతమును విశాలము నగు వేఱొక ప్రాకారము గోచరించును. వెడల్పును లావును గల రాళ్లతో నీప్రాకారము ఱాతికోటవలె నిర్మింపఁబడినది. గోడలపయి రావి యాకువంటి యాకృతితో కోటకొమ్మలు శిలలతో దీర్పఁబడినవి. మొదటి ప్రాకారమునకును రెండవప్రాకారమునకును మధ్యగా నొకశిలామండపము, రెండవ ప్రాకారము ఆలయమునకు మధ్యగా వేఱొక మండపము గలవు. అవి శిథిలావస్థలోనికి వచ్చుచున్నవి. బాగుచేయు ప్రయ త్నములే లేవు.

ఆలయము చాల దృఢమైనది. శిలలపయి శిల్పములు లేవు. ఆలయము చుట్టును బ్రదక్షిణము గావించుటకు ననుకూలముగ నొకవసారా ఆలయమునంటి నిర్మింపఁబడినది. దీని నంటి విశాలవేదిక చుట్టును దిరిగి వచ్చినది.

గర్భాలయములోఁ గల చిత్రములు గమనింపఁదగినవి. ఆలయమునందు మిగుల నున్నతమైన యొక పురుషవిగ్రహము గలదు. తొలుత నది శిలావిగ్రహము కానోపు. ప్రతిసంవత్సర మా విగ్రహము నకు లక్కరంగులు పూసి యలంకరింతురు. ఈపురుషవిగ్రహము భీకరముగనుండి చతుర్హస్తములతో నలరి దైవమానవరూపముల సమ్మేళనముగ నున్నది. చేత నొక ఖడ్గము మానవశిరము గలవు. ఈ విగ్రహమునే మైలారుదేవుఁడు, ఖండేరావు అని రెండు పేరులతో వ్యవహరింతురు. ఈ విగ్రహ మున కిరువైపులలో నెడమపార్శ్వమున గొల్లకేతమ్మ, కుడివైపు మేళమ్మ యను నిరువురు పత్నులు గలరు. చూడఁ జూడ మైలారుదేవుఁడు వీరపురుషుఁ డని ముఖ లక్షణములు, ఆయుధ ధారణము, ఆసీన పద్ధతులను బట్టి గుర్తింపవచ్చును. ఈ మైలారుదేవునియొక్కయుఁ దత్పత్నుల యొక్కయు జీవితచరిత్రములు తెలియరావు. మాఘమాసమునందుఁ బ్రతివారము ఆలయ మున నుత్సవములు జరుగుచున్నవి. తమ యింటి యాఁడుబిడ్డకు మగఁ డను గౌరవభావముతో గొల్లవారు ఆ యుత్సవములలోఁ బాల్గొని అహోరాత్రములు వీరగానములు నృత్యములు వీరా వేశములు ప్రదర్శించుచుందురు. ఆలయమున నొకచిన్న లింగము, నంది యిటీవలఁ జేర్పబడినవి. మొత్తముమీఁద మైలారుదేవుఁడు ఆంధ్రులు చిరకాలమునుండి సేవించు వీరపురుషుఁ డనియే మా విశ్వాసము.

ఆలయమునకు భక్తులవలన సంవత్సరమునకు ఏ డెనిమిదివేల రూపికలు కానుకలమూలమున లభించుచున్నవి. నైజాము దొరతనమువారి ధనము దుర్వినియోగము కాకుండ ఆలయాభివృద్ధి కొఱకు వినియోగింప నొకకమిటీ నేర్పఱచియున్నారు. వారే యాలయమును జూచుచున్నారు.

ఆలయమున నొక శిలాశాసనము గలదు. అది రెండు ఖండములుగ విరిగినది. ఈ మధ్యకాలమున గచ్చుతో అతుకఁబడినది. ఈ శాసనమువలనఁ గొన్ని చరిత్రాంశములు గమనింప నవకాశము చిక్కుచున్నది. అందలి చరిత్రాంశములను గ్రింద నుదాహరించుచున్నారము.

ఉర్వీ ముద్ధరతే బిభర్తిచ కృతామ్నాయస్థితి ర్వైరిహ్ర
ద్భేదీ విశ్రుతవిక్రమో హృతరిపుక్షత్రాన్వయ స్సేతుమాన్
గోవాళత్వ ముపైతి మారవిజయే భేత్తా కలేః కల్మషం
ప్రఖ్యాతః స్ఫుట మన్నపోతనృపతిః తత్ఖడ్గనారాయణః

ఖడ్గేన స్ఫుట మన్నపోత నృపతే ర్భిన్నై రరాతివ్రజై
ర్భిన్నం సంప్రతి శూన్యమేవ సవితుర్బింబం దివి ప్రేంఖతి
లక్ష్మీస్త్ర రస్య గృహం శ్రియే ద్విజవరా నశ్వావళీమందురా
మధ్యాస్తే రిపుసుభ్రువాంతు హృదయా న్యత్యుల్బణ స్సంజ్వరః.

ముని రజని పరశురామః, స్థానే వినియుజ్య వైష్ణవం తేజః
సోమకుల పరశురామే, ధరా మవ త్యన్నపోత భూపాలే॥

మల్లారి మేన మ్మునయః స్తువంతి, మైలారదేవంచ మహాప్రభావం
వందారు బృందారక వర్గమాళి, మాణిక్య నీరాజిత పాదపద్మమ్॥

స్వస్తిశ్రీమన్మహామండలేశ్వర రేచర్లగోత్ర చింతామణి గజదళ విఫాళ భుజబలభీమ ఖడ్గనారాయణ చేకోలుగండగాయ గోవాళ పాండ్య రాజగజదళవిభాళ చలమర్తిగండధరణివరాహ దుష్టరాజగజాంకుశ ప్రతికూలరాయ భయంకర ప్రతిగండ భైరవరాయ మీనజాలరాయ దేవేంద్ర వల్లభ జాణరాయకుల గురుసమరమహేశ్వర ఇనుమర్తి గండగోవాళ కేళాదిరాయ జగనొబ్బ గండ రాయగండ భేరుండ రాయబందీ విమోచక రాయబిరుదవిఫాళ శరణాగతవజ్ర పంజర బల్లర గండ వివేకనారాయణ సమస్త సమరవిజయలక్ష్మీ సమాగమసముచిత పల్లవతోరణావళీప్రకాశిత నిత్యకల్యాణ సత్యప్రతిజ్ఞ సోమకుల పరశురామాది జగత్ప్రసిద్ధ బిరుదనామధేయ ప్రశస్త సహితులైన శ్రీసింగమనాయని అనపోతనాయనింగారు ఓరుగల్లు శ్రీభువనగిరి రాజుకొండ సింగపురము మొదలైన తెలుంగుదేశ మాచంద్రతారక ముత్తరోత్తరాభివృద్ధిగాను ధర్మరాజ్యము చేయుచును దిగ్విజయయాత్రాప్రసంగానను ఓరుగంటి దక్షిణాన అయ్యనవోలి తీర్థస్వామియైన శ్రీమైలారు దేవరను దర్శించి ఆ అయ్యనవోలు అనెడి గ్రామము శ్రీ మైలారు దేవరకు అంగరంగ భోగాది సకల సమారాధన సామాగ్రి యెల్లవేళలందున్ను సమకూరునట్లుగాను శకవర్షంబులు ౧౨౮౧ అగుచున్న సౌమ్యసంవత్సర శ్రావణ శుద్ధపంచదశీ శనివారము నాండు.

ఉదాహృతశాసనభాగములవలన స్థాపకుఁ డగు అనపోతనాయకుఁడు క్షత్రియవంశ నాశకుఁడనియు, రాజగోవాళ, ఖడ్గనారాయణ బిరుదములు గలవాడనియు శత్రువుల సంపదలు గైకొనిన

వాఁడనియు దెలియుచున్నది. ఈ అనపోత భూపాలుఁడు సోమకుల పరశురాముఁ డను బిరుదుగల వాఁడు. పరశురాముఁడే అనపోతనాయకుఁడుగ జన్మించెను. మైలారుదేవుని మల్లారుదేవుఁ డనిగూడ మునులు కొనియాడుచున్నారు అనునది శ్లోకములసారము. ఉదాహృతవచనభాగముల సింగమ నాయఁడు వహించిన బిరుదములవలన ఆతని పరాక్రమజీవితము సువ్యక్త మగుచున్నది. జైత్రయాత్రల సందర్భమున ననపోతనాయఁడు అయినవోలులోని మైలారుదేవుని దర్శించి పెక్కుదానములు గావించినాఁడు. *

క్రీడాభిరామములో గొన్ని తావులలో అయనవోలు మైలారుదేవునిప్రశంస గలదు. మైలారు భటుల సాహసకార్యములు అందు బేర్కొనబడినవి:—

"సీ. ఊవ ఊవ మండు నెఱ్ఱని చండ్రమల్లెలఁ, జోద్యంపు గుండాలు చొచ్చువారు
కరవాడి యలుగుల కనరుపాతరలలో, నట్టిచేరులు గోసి యుఱుకువారు
గాలంపుగొంకిఁ గంకాళచర్మము గ్రుచ్చి, యుడువీథి నుయ్యేల లూగువారు
కటికి యొగ్గాళంపు గండకత్తెర వట్టి, మిసిమింతులునుగాక మ్రింగువారు

గీ. సందులను నారసంబులు సలుపువారు, నెడమ గుడిచేత నారతు లిచ్చువారు
సాహసము మూర్తి గైకొన్న సరణివారు, ధీరహృదయులు మైలారువీరభటులు."

ప్రకృతము జరుగు నుత్సవములందు ఈ కార్యక్రమము గోచరించుచున్నది. గొల్లవారలు మాత్రము ఈ యుత్సవములందు మిగుల భక్తిప్రపత్తులతో బాల్గొనుచుందురు. జగ్గు అను వింత వాద్యముతో వీరగానము గావింతురు. కార్తికమాసమునుండి ఈ యుత్సవము మహార్భాటముతో గడుచును. మైలారువాండ్రును, వీరముష్టివాండ్రును, బొలసంతువాండ్రును ఈ యుత్సవములో నెక్కువ పాల్గొందురు. ఆంధ్రవీరులలో ముఖ్యుఁడగు మైలారుదేవుని వైభవము చూడదగినది. క్రీడాభిరామమున ఈ మైలారుదేవుని మహత్వము ఈ విధముగా జెప్పబడినది.

"సీ. శనివారసిద్ధి సజ్జనపారిజాతంబు, వరదాత యాదిత్యవారభోగి
మాధవీరమణుండు మాయావినోదుండు, మాళవీప్రియభర్త మహితయశుఁడు
పల్లెంబ నాయకుం డెల్ల వేల్పులరాజు, కనపవేటల వేట్కకాండ్ర భర్త
కత్రశాలాస్వామి కరుణాపయోరాశి, పుణ్యకీర్తనుఁడైన ప్రోలియయ్య

తే. మంచుకుంచాల గొలువంగ మాయలేళ్లఁ, బట్టి కట్టంగనేర్చిన బానవెల్లి
భైరవునితోడి జోడు మైలారుదేవు, డోరుగంటినివాసి మే లొసఁగుగాత."

---

* అనపోతనాయకుని సోమకులపరశురామబిరుదముగూర్చియు, అయినవోలు ప్రాచీనవైభవముగూర్చియు, నా పితృపాదులగు శ్రీ శేషాద్రిరమణకవులు లోగడ ఆంధ్రపత్రిక సంవత్సరాదిసంచికలో నొక వ్యాసము వ్రాసి యున్నారు. విషయము లం దరయదగును.

# చాకిరేవు

## ఏకాంక నాటిక

## శ్రీ వింజమూరి శివరామరావు

*

సరసహృదయులు, సారస్వతప్రియులు

**శ్రీ రాజా వేణుగోపాల అప్పారాయులకు**

**అంకితం**

*

పాత్రలు : లచ్చి, కోటిగాడు, రామరాజు, తిమ్మరుసు.

[శ్రీ కృష్ణదేవరాయల కాలం. విజయనగరం. తుంగభద్రానదీతీరాన్ని చాకిరేవు. సాయంసమయం. చాకళ్లు పని ముగించుకుని ఇళ్ళకు బయలుదేరే సందడి. కొంచెం దూరంగ పూలపొదలమాటున ఒంటిగా కూర్చునిఉంటుంది లచ్చి.]

లచ్చి : [పాట] నాగుండెలోనుండి రేగు రాగమ్మో
ఈ సంజ వెలుగాయె కొల్లగా నల్లగా ... నా ...

నిలువెల్ల మెలమెల్ల పులకించు ప్రేమమో
ఈ లేత చివురాయె నింతగా వింతగా ... నా ...

రేయనక పవలనక మ్రోయు నా ప్రణయమో
ఈ యేటి తరగాయె రంగుగా పొంగుగా ... నా ...

కోటి : [దూరాన్నుంచి] లచ్చీ! ... ఓ లచ్చీ!

లచ్చి : అబ్బా! ఒక్క గడియేనా ఒక్కర్తెనీ కూర్చోనియ్యడుగదా! కాస్త కనుచాటైతే చాలు, ఒకటే గోల.

కోటి : [ఇంకా దగ్గరగా] లచ్చీ!

లచ్చి : అదుగో, వెతుక్కుంటూ ఇలాగే వస్తున్నాడు.

కోటి : ఇక్కడున్నావా, లచ్చీ ?

లచ్చి : అవును. ఇక్కడే ఉన్నాను. ఏం ?

కోటి : అలా పొదలకేసీ మబ్బుల్లోకీ సూత్తో కూకోకపోతే, పొద్దుటికాణ్ణుంచి రేవులో కొట్టుకు సత్తున్నానుగందా, కూంత సాయం సేత్తే అరిగిపోతావా ?

లచ్చి : నే నీ పాడుపని చెయ్యనని ఎన్నిసార్లు చెప్పేది?

కోటి : అయితే కులవృత్తి చేసుకోటం పాడుపనా?

లచ్చి : పాడో గీడో, నే నీ పని చెయ్యలేను.

కోటి : సెయ్యనేవు, పాపం! సోగ్గా తిరగ్గలవేం, రాణీ గోరునాగ?

లచ్చి : ఆ, రాణీనే! కాకపోతే నాకేం?

కోటి : అవును మరి. ఆ పెబువు కన్నెశాక...

లచ్చి : ఛీ. ఊరుకో. అనవసరంగా మాట్టాడక...

కోటి : నిజ మాడితే నిట్టూరమేగా!

లచ్చి : ఎన్నిసార్లు చెప్పాను, ఆ గొడవ ఎత్తవద్దని?

కోటి : లచ్చీ! ఎంత సదూకున్న దానివైనా కట్టుకున్న మొగుణ్ణిలా యేడిపించటం బాగునేదు. నే నేం కులం తక్కువోణ్ణా? రాజుగారి బట్ట లుతికే గొప్పింటోణ్ణి...

లచ్చి : అయితే యేమంటా విప్పుడు?

కోటి : రేవులో ఆడోళ్లంతా, నాను కూంత నవ్వితే శాన, పడి సత్తారుగందా....

లచ్చి : అయ్యో! పాపం ! ఆట్టే నవ్వకు.

కోటి : నే నంటేనే యెటకారం నీకు. నాగాడిద ల్నైనా సనువు సేత్తావుగాని, నన్ను నీ దరిమేనా రానియ్యవే! నాను సేసిన పాప వేంటి సెప్పు ?

లచ్చి : నువ్వు చేసిన పాప మేమో నే నెలా చెప్పగలను?

కోటి : సూడు లచ్చీ! మనపేటలో మొగుడూపెళ్లాలంతా సిలకా గోరొంకల్లాగ ఎంతోముచ్చటగా ఉంటారే! ఆళ్ళనిసూత్తే పెళ్లంటే సొరగం అనిపిస్తాదిగందా? నీ కెందు కీ సెడుబుద్ది?

లచ్చి : నా కేమీ చెడుబుద్ధి లేదే!

కోటి : నేకపోతే ఆ రాజుగో రల్లుడిగోరికోసం యేంటంట ఆ తిరగటం, ఆ మొరగటం...

లచ్చి : నీ కేమైనా మతిపోయిందా?

కోటి : అవుసరం తీరిందాకానేగాని, ఒలేయి! ఎంత పెబువులైనా తరవాతసచ్చినా మన వూసెత్తరు. తెలుసా?

లచ్చి : నాకు తెలుసు. నువ్వు చెప్పనక్కరలేదు.

కోటి : నీకు తెల్దు. నన్ను సెప్పనీవు. ఎక్కడ సచ్చేసావొచ్చిందిరా దేవుడా! ఈ యెవ్వారం నలుగురూ యింటే పరువు దక్కదు. రాజుగారు యింటే పాణాలే దక్కవు...

లచ్చి : ఎంతసే మీ ఉపన్యాసం?
కోటి : అయిందిగాని...
లచ్చి : అయితే ఇంక వెళ్లు.
కోటి : నువ్వుకూడా నెగు; పోదారి.
లచ్చి : నే నప్పుడే రాను.
కోటి : రావూ? ఏం?
లచ్చి : వెన్నెల్లో కొంచంసేపు తిరిగి వస్తాను.
కోటి : అలాగా?...రామరాజుగోరుగానే వత్తా వన్నారా?
లచ్చి : అవును. వస్తా నన్నారు...సరేనా?
కోటి : లచ్చీ! ఎందు కేడిపిత్తావు? నువ్వంటే నా కెంతో యిది. అందుకనే యిల్లా బతిమలాడు కుంటున్నాను.
లచ్చి : పోనీ పోట్లాడు.
కోటి : అదేం బెమ్మాండమా? మొగుడు సచ్చినోణ్ణిగందా రవ్వెందుకు లెమ్మని, నువ్వెన్నాట్లాణ్ణా, కడుపులో దాసుకుని సరుదుకు పోతూన్న కొద్దీ మరీ తెగసాగుతున్నావేం... పద కొంపకి. ...[నెట్టబోతాడు]
లచ్చి : ఏమిటీ ఆగడం! మీాదికి రాకు.
కోటి : ఒలేయ్! తిన్నగా వత్తావా, యీాడిపించ మన్నావా? ఓ రప్పిగా! యెల్లీ? మావో! సూడండాఁ, ఈ నాయాలి...
లచ్చి : అందరినీ పిలుస్తే నా కేమి భయ మనుకున్నావా? రానీ, వాళ్లచేతే నీకు తగినట్లు చీవాట్లు పెట్టిస్తాను.
కోటి : సివాట్టెట్టిత్తావు! యెట్టించవు?... ఎన్నెత్తులూ సేతకాకపోతే ఈ యెవ్వారంలోకి దిగుతావా?... ఇంకా గుడ్లు మిటకరిత్తూ సూత్తావు, నడవ్వేం?
లచ్చి : ఇదిగో! నా ఒంటిమీాద చెయ్యి పడిందంటేనా — జాగర్త. తిమ్మరుసయ్యగారితో చెప్పి...
కోటి : ఆరితో నానూ సెప్తాను.
లచ్చి : చెప్పుకో, చేతనైతే.
కోటి : అంతేనేగాని, నామా టినవు?
లచ్చి : అబ్బా! ఇంక మాట్టాడించక వెళ్లు.
కోటి : సదువుకున్నదాన్ని సేసుకోంట వేంటి, నా సచ్చుబుద్ది కాకపోతే!... నవ్వు, నవ్వు... ఇదిగో మంతిరి గోరి దగ్గిరి కెల్తున్నానుగా — ఆ యికిలించట వేంటో, ఆ సకిలించట మేంటో తేలుత్తా నుండు. [వెడతాడు]
లచ్చి : అమ్మయ్యా, ఇప్పటికి వదిలాడు ... ఆహా? ఈ వెన్నెల ఎంత హాయిగా ఉంది!...

ఇంకా నా రామరాజు రాలేదే ? ... నా తొందరేకాని వారు వచ్చేవేళ దాటలేదు ...
నాకులాగే ఈ ప్రకృతికికూడా ఎంత ప్రేమపిపాస! [పాడుతుంది]

[పాట] గగనాంగ నాలింగ నోత్సాహి నగరాజు
పల్లవమ్ములుగ పుష్పములుగా పులకించె ... XX ...
దెసల మోముల మబ్బు ముసుగు లొత్తిలినంత
పరువాలు వెన్నెలలు చిరునవ్వొ జాబిల్లి ... XX ...
చిగురు లొత్తుగ పరచి మగనికై కోకిలము
బరువు నిద్దుర కన్ను లర తెరచి పరికించె ... XX ...

రామ : [దూరంగా] లక్ష్మీ !
లచ్చి : ఎవరు వారు ? ... ఓహో, నా వలపులేలే రామరాజులా ? ... [రామరాజు వస్తాడు]
దాసి నమస్కరిస్తూంది.
రామ : దాసి వెందు కయినావు లక్ష్మీ! నా ప్రణయేశ్వరివి.
లచ్చి : ప్రభూ! సార్వభౌముని జామాతలు తమరు; సేవాజీవికను నేను.
రామ : ప్రేమ కులాన్నీ, వృత్తినీ పరిగణించదు.
లచ్చి : లోకం వాటినేగా పాటించేది ?
రామ : అలాంటి పాడులోకంతో మనకి ప్రసక్తి వద్దు.
లచ్చి : అది సాధ్యమా ? సకలాంధ్రసామ్రాజ్యానికి అధిపతులు కాబోతూన్న తమకు ...
రామ : ప్రణయసామ్రాజ్యానికి మాత్రం అర్హత లేదా ?
లచ్చి : ప్రభువులకు ప్రత్యుత్తరం చెప్పగలనా ? అజ్ఞురాలిని ...
రామ : అజ్ఞురాలి వన్నావంటే నీ గురువులైన తిమ్మరుసుగారిని అగౌరవపరచినట్టే సుమీ!
లచ్చి : స్వామీ! నా దొక మనవి.
రామ : నీకు నాదగ్గర మనవా? ఏమి కావాలో చెప్పు.
లచ్చి : నాకు భయంగా ఉంది...
రామ : భయమా? ఈ రామరాజు కంటి నీడల్లో ఇల్లు కట్టుకున్న నీకు భయమా? శాత్రవశోణి తారుణితమైన నా కుఠారధార మొక్కవోలేదే!
లచ్చి : లేదు; నే నెరుగుదును. అంత చిన్నతనంలో కొండవీటివద్ద తాము చూపిన సాహసపరాక్రమాలు తిమ్మరుసుగారు వర్ణిస్తూండగా విన్నాను.
రామ : వినికూడా భయ మెందుకు?
లచ్చి : ఎంత విదిలించుకుందామన్నా ఈ వలపు పగబట్టిన పాములాగ నన్ను విడవకుండా తరుముతూంది.
రామ : నా ప్రేమ అంత బాధాకరమా?

లచ్చి : కాదుకాదు. అంత ఉన్నతమైన తమ ప్రేమని ఈ నీచహృదయం భరించగలదా?... లోకం సహిస్తుందా?

రామ : అబ్బా! లోకం మాటెందుకు?

లచ్చి : సార్వభౌములకు తెలుస్తేనో?

రామ : ఎట్లా తెలుస్తుంది?

లచ్చి : వేయికళ్ళతో సమస్తమూ కనిపెడుతూ ఆంధ్రసామ్రాజ్యాన్ని ఆశాంతాలకు ప్రసరింప జేసిన ఆ రాజేంద్రుని కన్నులు మూయడం అంత తేలికపని కాదు.

రామ : అదా నీ భయం?

లచ్చి : నన్ను గురించి కాదు; తమ మనోహరప్రణయంలో నా జీవితం వాసించింది; ఇంక ప్రళయానికైనా వెరవను. కాని తమరు...

రామ : నేను మాత్రం నీ కోసం కష్టపడలేనా?

లచ్చి : వద్దు వద్దు. తాము కష్టపడుతూంటే స్వర్గంకూడా నాకు వద్దు. తమ సుఖంకోసం నరకానైనా సహిస్తాను.

రామ : లక్ష్మీ! నీ ప్రేమసన్నిధిలో నా వలపు సిగ్గుపడుతూంది.

లచ్చి : ఎంతమాట! తమ వలపే లేనిదే నాకు బ్రతుకే లేదు. తమకోసం కాకపోతే నాకు వలపే లేదు. ...కాని...దీనివల్ల కలగబోయే చిక్కులు....

రామ : చిక్కులా? ఎన్ని చిక్కులైనాసరే నా వలపు విప్పగలదు; ఎన్ని అడ్డంకులైనా సరే దాటగలదు. నీవు దిగులుపడకు...ఐనా యేమిటా చిక్కులు?

లచ్చి : మన ప్రేమరహస్యం ఇంక దాగదు.

రామ : ఎందుచేత?

లచ్చి : ఇంతకుముందే నా భర్త పెద్ద తగువుపెట్టి వెళ్ళాడు. తిమ్మరుసయ్యగారితో చెప్పి నా పని చక్కబెడతాట్ట!

రామ : అలానా?...తిమ్మరుసుగారు దయార్ద్రుడే కాని, న్యాయపరిపాలనలో మహాకఠినుడు.

లచ్చి : మన ప్రేమ అన్యాయం కాదుగా!

రామ : అంతా అలా అనుకోవద్దా?...అయితే ఇప్పు డేమి చేయదలచుకున్నావు?

లచ్చి : తమ ఆనతిగాక నే నేమి చేయగలను?

రామ : లక్ష్మీ! నే నంటే నీకు నమ్మకమేనా?

లచ్చి : తమరుగాక నా కిం కెవరు దిక్కు?

రామ : ఇంక దిగులుపడకు. రామరాజు తన వలపు నిలుపుకోలేనంత చేతకానివాడు కాదు. లక్ష్మీ! ఇదే కడసారి చెపుతున్నాను - నా జీవితానికి నీ ప్రేమే సర్వస్వమున్నా. నీ ప్రేమే లేకపోతే సౌఖ్యమే లేదు నాకు.

లచ్చి : నా జీవితం ధన్యమయింది.

రామ : నా గౌరవాన్ని, అధికారాన్ని, సామ్రాజ్యాన్ని కూడా నీ ప్రేమకోసం త్యజించగలను. నీవు నన్ను ప్రేమించు, అంతే.

లచ్చి : సహస్రజన్మల నా తపస్సు ఈక్షణంలో ఫలించింది.

రామ : లక్ష్మీ! నాలుగునెలల క్రిందట మంత్రిగారి మందిరోద్యానవనంలో ఆ సువర్ణసంధ్యా సమయం జ్ఞాపక ముందా?

లచ్చి : నాబ్రతుక్కి వెలుగునిచ్చిం దదేగా! ఏనాటికైనా మరవగలనా?

రామ : వనలక్ష్మిలాగ విహరిస్తూ కోకిలకంఠంతో గానాలాపన చేసే నిన్ను మొదటిసారి చూసిన ఆ గడియలోనే నా హృదయేశ్వరినిగా స్వీకరించాను.

లచ్చి : ఆ మహత్తరముహూర్తంలోనే తమ ప్రేమహృదయానికి ఈ జీవితం అంకిత మయి పోయింది. తమ అడుగు జాడల్లో నా వలపు మొలక లెత్తింది.

రామ : ఆ నాటి నీ పాట తెరిపిలేకుండా నా గుండె గూడుల్లో మారుమ్రోగుతూంది. ఇప్పుడు, ఈ హాయిలో, ఆ పాట మళ్ళీ వినా లనిపిస్తూంది నాకు.

లచ్చి : నాకూ పాడాలనే ఉంది; వినండి.

[పాట]

ఇంతగాడ్పులో నడచివచ్చినా
అంతదూరమా ఓ దేవా!
ఎండు బ్రతుకు నీ గుండె నీడలో
పండనీయవా నా దేవా!! ...ఇంత...

ఇంత చీకులో వెదకి వచ్చినా
అంత దాగుటా ఓ స్వామీ!
బడలు వలపు నీ యడుగు జాడలో
విడిల నీయవా నా స్వామీ !!...ఇంత...

ఇంత కోరి నీ కొరకు వచ్చినా
అంత నిరసనా ఓ నాథా !
కొలుచు నన్ను నీ తలపుతోడుగా
నిలువనీయవా నా నాథా!! ...ఇంత...

తిమ్మ : [దూరం నుంచి] ఎవ రక్కడ ?

రామ : ఎవరు వారు ?

లచ్చి : తిమ్మరుసు మంత్రిగారి గొంతులాగుంది.

రామ : అవును, వారే, ఇలాగే వస్తున్నారు.

లచ్చి : అమ్మయ్యో! ఎందారి?
రామ : నే నున్నానుగా! నువ్వు నా ప్రక్కనే నిలబడు; చాలు,
తిమ్మ : [వచ్చి] నాయనా, రామరాజూ!
రామ : మహామంత్రులకు నమస్కారం.
తిమ్మ : దిగ్విజయోస్తు...ఓహో! లచ్చికూడా ఇక్కడే ఉందే.. ఏమి లచ్చీ! కులాసాగా ఉంటున్నావా?
లచ్చి : చిత్తం. తమ దయవల్ల.
తిమ్మ : ఎక్కడా కనిపించడమే లేదు లచ్చి, నువ్వు?
లచ్చి : క్షమించాలి, ఏదో పనితొందరలో...
తిమ్మ : పనా నీకు?...రామరాజూ! నువ్వూ కనిపించడంలేదు; నీకూ పని తొందరేనా?
రామ : తాతగారూ! మీరు సర్వజ్ఞులు.
తిమ్మ : ముసలితనం వచ్చిపడుతూంది నాయనా!
రామ : ఎంత పెరిగినా మానికి చేవ తరుగుతుందా?
తిమ్మ : ఏదీ, అలాగని నామీద పెత్తన ముంచావా?
రామ : ఎంత యత్నించినా నాకు సాధ్యం కావడంలేదు.
తిమ్మ : ఎలా సాధ్య మవుతుంది? పడుచు నెత్తురు...
రామ : తాతగారూ! మీరుకూడా ఒకప్పుడు యువకులే.
తిమ్మ : యువకుణ్ణే. కాని నా ధర్మాన్ని విస్మరించేటంత ఉన్మత్తుణ్ణి మాత్రం కాలేదు.
రామ : మహామంత్రులకు ప్రత్యుత్తరం చెప్పగలనా? కాని...
తిమ్మ : బలశాలివి; ప్రతిభాశాలివి! రాజ్యతంత్రాని కభ్యంతరమైన ఈ వ్యామోహ మెందుకు నాయనా!
రామ : పూర్ణిమనాడు సముద్రాని కా పొంగెందుకు స్వామీ!
తిమ్మ : లచ్చీ! ఏమీ మాట్లాడకుండానే ఉన్నావే!
లచ్చి : మన్నించాలి. ఏమి సెలవు?
తిమ్మ : ఇంతకుముందే కోటిగాడు నా దగ్గిరికి వచ్చాడు.
లచ్చి : స్వామీ! పత్నీధర్మానికీ ప్రణయాదేశానికీ నా హృదయంలో క్షణక్షణమూ సంఘర్షణే.
తిమ్మ : విద్య కిదా ఫలం?
రామ : ఆర్యా! నా దోక మన్నవి.
తిమ్మ : స్వతంత్రులు; మనవు లెందుకు? సెలవియ్యండి.
రామ : ఈ లక్ష్మిని నేను మనసార ప్రేమించాను.
తిమ్మ : సరే! ఈమె నిన్ను మనసార ప్రేమించింది. ఔనా లచ్చీ?
రామ : ఒకరి నొకరము గడియేనా విడిచి ఉండలేం.

తిమ్మ : అలాగేం, పాపం! ఎక్కువగా కావ్యాలు చదువుతూన్నట్టున్నావే? నిగమశర్మోపాఖ్యానం పఠించావా?

లచ్చి : స్వామీ! అలా అనకండి. మాది పవిత్రప్రణయమే కాని తుచ్ఛ వ్యామోహం కాదు.

తిమ్మ : అంటే నాకు తెలియడం లేదు.

లచ్చి : మోహం సుఖాల నాశిస్తుంది; ప్రేమ నిష్కామంగా వాసిస్తుంది. ఒకటి పైశాచికం; రెండవది ఈశ్వరత్వం.

తిమ్మ : భేష్! కావ్యాలూ బుక్కులూ పలుకుతున్నావు. విన్నావా రామరాజూ! నీ వలపు కూడా అంతేగా?

రామ : చిత్తం.

తిమ్మ : అంత నిష్కామప్రేమే అయితే ఒకరి నొకరు గడియేనా విడిచి ఉండలేక పోవడ మేమిటయ్యా? తుచ్ఛవ్యామోహానికే కాని, పవిత్రప్రణయానికి ఈ విరహావేదన లెందుకు? ఈ సహవాసాభిలాష లెందుకు?...

రామ : భక్తి ప్రకటించడానికి విగ్రహాన్ని ప్రత్యక్షంగా ఆరాధిస్తున్నాము కాదూ! ప్రణయోపాసనకి కూడా అలాగే ఒక రూపలక్ష్యం అవసరం.

తిమ్మ : ఓహో! తర్కం ప్రారంభించావే?

రామ : మీ ముందా? మీతో వాదించడం లేదు. మమ్మల్ని అనుగ్రహించమని వేడుకుంటున్నాము.

తిమ్మ : రామరాజూ! విను. లచ్చీ! నువ్వుకూడా. నేను పెద్దవాణ్ణి. మీ బాగు కోరేవాణ్ణి, చెపుతున్నాను. ఇంకనైనా ఈ వ్యామోహాన్ని వదిలిపెట్టండి. దీనివల్ల ఎన్నో ఇబ్బందులు...శ్రీవారికి తెలిస్తే మంచిదికాదు. లచ్చీ! కోటిగాడు ఊరుకోడు. "ఈవేళ లచ్చి అయింది; రేపు మరొకర్తె అవుతుంది. ఈ రామరాజుగారి ఆగడాన్ని సహించడమేనా" అని చాకళ్లంతా సమ్మెకట్టబోతున్నారు.

రామ : సమ్మెకడతారా? చేతకాని చవటలు! కట్ట మనండి చూస్తాం. ఒక్కొక్కణ్ణి ఏనుగు కాలి క్రింద తొక్కించి...

తిమ్మ : ఎంతమందినని తొక్కిస్తావు నాయనా? ఇదేనా రాజనీతి? నీవు చేసిన తప్పువల్ల వాళ్ళు నలిగి చావాలా?

రామ : తాతగారూ! తొందరపడినందుకు సిగ్గుపడుతున్నాను. మీకు నా మీద అపారమైన దయ; నాకు తెలుసు. మీ కృపవల్లనే కాకపోతే నేను రాజుగారి అల్లుణ్ణే అయేవాణ్ణికాను. అది మరవలేదు. నాటిదయ నేడుకూడా చూపించండి. లక్ష్మిని నాకు ప్రసాదించండి.

తిమ్మ : నీ పురోభివృద్ధికి ఈ మార్గం ఎంత భంగకరమో యోజించావా? ఇది ఎంత అసాధ్యమో...

రామ : మీ సామర్థ్యానికీ అనుగ్రహానికీ అసాధ్య ముంటుందా?

లచ్చి : స్వామీ! తల్లీ తండ్రీ లేనిలోటు కనబడనీయక చిన్నతనంనుంచీ మీరే పెంచారు నన్ను; చదువు చెప్పించారు...

తిమ్మ : వెనకటి వన్నీ యెందుకులే ! ఇప్పు డేమి చేయమంటావు ?

లచ్చి : నన్ను చంపండి. ఈ వలపు నా నెత్తురులో నెత్తురై ఉడుకెత్తుతూంది; నా బ్రతుకునే విడవకుండా పట్టింది; నాతోగాని చావదు...నన్ను నా రాజు అడుగు నీడల్లో బ్రతక నియ్యండి; లేదా ఆ గంగలో త్రోసివేయండి. స్వామీ! ప్రేమానుభవం లేని జీవితం వృథా.

తిమ్మ : రామరాజూ ! ను వ్వేమి ఆలోచించావు ?

రామ : తాతగారూ! నా కీమె ప్రేమ వినా ప్రపంచమే శూన్యం. మీరు కనికరిస్తారా ఇలాగే కలిసిఉంటాము. లేదా ఏ అడవులకో పోయి వలపు లేలుకుంటాము.

తిమ్మ : ఇది మీ నిశ్చయమా?

రామ : మీ ఆనతి కెదురుచూస్తున్నాము.

తిమ్మ : [ఇటునటు తిరుగుతూ] ఇది కఠినసమస్య...రాజగౌరవమూ, రాజ్యప్రశాంతీ పాలించవలసిన విధి నాది. నా మంత్రిత్వం మీ ప్రేమ నంగీకరించలేదు.

రామ : మీరు మంత్రులేకాదు; మానవులుకూడా.

తిమ్మ : అందుకనే మీ ప్రేమప్రవాహానికి సేతువును కాలేకపోతున్నాను.

రామ : ప్రేమ పాషాణాన్నికూడా ద్రవింపజేస్తుంది.

తిమ్మ : కాని ఆవంక రాజపుత్రిక - ఈవంక కోటిగాడు - తలుచుకుంటే నా మంత్రిత్వం ప్రబలి, నేను హంతకుణ్ణి అవుతానేమో నని భయపడుతున్నాను.

లచ్చి : స్వామీ! నన్ను చంపండి. పరమసంతోషం. భావిజన్మలోనైనా మా ప్రేమ ఫలింపజేయమని భగవంతుణ్ణి ప్రార్థిస్తూ, నా ప్రణయమూర్తిని స్మరిస్తూ నిశ్చింతగా మరణిస్తాను.

తిమ్మ : ఔను...నీవు చావవలసిందే...ఇంకొకదారి లేదు...

రామ : ఆ!...ఏమన్నారు?

తిమ్మ : తొందరపడకు నాయనా! నా సలహా విను. ఈ గడియనుంచి లచ్చి బ్రతికిలేదు.

రామ : అంటే?

తిమ్మ : ప్రపంచానికి ఈమె మరణించింది. నీ కొక్కడికిమాత్రం జీవించిఉంటుంది.

లచ్చి : స్వామీ ! మీ రన్నదేమో తెలియడంలేదు.

తిమ్మ : నాగులాపురంలో నా పూలతోట ఉంది; నడిమినే పెద్దమేడ. నా ఆజ్ఞలేనిదే ఏ ప్రాణీ ప్రవేశించరాని ఆ ఆరామసౌధమే ఈ లక్ష్మికి ప్రపంచం. అరవై ఘడియలూ గుమ్మం వద్ద నా నమ్మకమైనబంటు కాపలా. రామరా జొక్కడికే ఆ తలుపు విడుతుంది...

రామ : మహామంత్రీ ! కృతజ్ఞతకి ఈ హృదయం సంకుచితమైపోయింది.

లచ్చి : నేను బ్రతికి ఉన్నానా ?...ఇది కలకాదుగదా !

తిమ్మ : [దూరంగా అలికిడి విని] అదుగో, కోటిగాడు కాబోలు నా కోసం వెతుక్కుంటూ వస్తాన్నాడు. మీరీ పొద వెనక నిలబడండి. నేను వీణ్ణి నెమ్మదిగా పంపి వస్తాను ........

త్వరగా వెళ్ళండి...[ఇద్దరు వెడతారు] ఈ కోటిగాణ్ణి చూస్తే జాలివేస్తూంది,ఏం చేయను...
పాపం! తగని మనువు; ఎలా పోసుగుతుంది?...

కోటి : [వచ్చి] దణ్ణాలు మంతిరి మారాజా!

తిమ్మ : కోటిగా! నువ్వు దురదృష్టవంతుడివిరా!

కోటి : అదేంటి బాబయ్యా, అలా సెలవిత్తారు?

తిమ్మ : కాకపోతే, రత్నంలాంటి భార్య...

కోటి : ఏం రత్తనం బాబూ! పానాలు తీత్తోంటే...

తిమ్మ : అది కాదురా! నేను వద్దని వెనక్కి లాగుతూనే ఉన్నాను.

కోటి : ఏంటి బాబూ నాగడం?

తిమ్మ : లచ్చినిరా, వినిపించుకోందే! ఈ యెత్తునుంచి ఒకటే దూకు - ఏట్లోకి -

కోటి : వోరు? నా లచ్చే?

తిమ్మ : అవునురా! ఆ సుడిగుండంలో పడి అలాగే మునిగిపోయింది.

కోటి : [ఏడుపు] అయ్యో లచ్చో! నా లచ్చో! ఎంతపనిసేసినావే వో లచ్చీ? మల్లీ కనబడవు గందా నా లచ్చీ!

తిమ్మ : ఊరుకోరా కోటిగా! ఊరుకో! దైవాజ్ఞ అట్లా ఉంది. ఎవరు తప్పిస్తారు?

కోటి : నా కొంప తీశావే నా లచ్చీ! నా కింక కూడొండి పెట్టేవోళ్ళైనా లేరు మా రాజా! అయ్యో, నా లచ్చీ!

తిమ్మ : ఎంత యేడిచినా పోయినవాళ్ళు మళ్ళీ వస్తారా? ఊరుకో. అదీగాక చేతులారా చంపుకుని, ఈ యేడు పెందుకు?

కోటి : నానా సంపింది?

తిమ్మ : నీ మూలాన్నే- పాపం ఎంత అమాయికురాలురా? ఎంత మంచి మనిషి? నేను వచ్చి కనుక్కున్నాను. చదువుకుందామనే సరదా కొద్దీ రామరాజుతో స్నేహం చేసిందిగాని, నువ్వంటే యెంత యిదనుకున్నావు దానికి? నువ్వు లేనిపోని అనుమానాలు పెట్టుకున్నావని రోషంవచ్చి, యేడుస్తూ ఏట్లో కురికింది?

కోటి : అయ్యో దేవుడా! ఎంతపని సేసావురా? సేతులారా నా లచ్చిని గంగలో కలుపుకున్నానురా! దేవుడా! యెదవబుద్ది? నా నెలా బతికేదిరా బాబూ!

తిమ్మ : ఒరేయి, ఏడుపుమాని లే.

కోటి : ఏం నెగిసేది? మరీ నాకు పెల్లికూడా కాదు మారాజా!

తిమ్మ : పెళ్లికోసం ఏడుపెందుకురా! త్వరలో మంచి పిల్లని చూసి ముడివేయిస్తాను. అదెంతపని?

కోటి : నిజమేనా మారాజా?

తిమ్మ : నే నబద్ధమాడతానురా! ఇంటికి వెళ్లు.

కోటి : మరి పెళ్ళి?

తిమ్మ : పదిహేనురోజులు పోయాక కనిపించు. ఇంక పో. [కోటిగాడు వెడతాడు] పాపం వెర్రి వాడు...ఏదో మంచిపనిచేసినట్టు మనస్సుకి ప్రశాంతి కలిగింది ..లచ్చీ!

[రామరాజుతో లచ్చి పాడుతూ వస్తుంది]

[పాట] శరన్నిశాంత ప్రశాంతవేళా
మరు దంకురములు తోచెనులే
వసంతమల్లీ వల్లీపాళీ
లసద్వాసనలు వీచెనులే ...శర...

శతసహస్రి జన్మార్జించిత పుణ్య
వ్రిత సంతతులే పండెనుగా
మదీశ్వర ప్రిణయామృత రస మీ
హృదయపాత్రిలో నిండెనుగా ...శర...

[తెర]



# రసానుభూతి

శ్రీ కర్లపాలెం కృష్ణారావు.

౧

ఆవు లగుచును లేగలై యాడుకొనుచు, జలధరంబులు వినువీధి సంచరింప,
అచట నీ వుందు వను భ్రాంతి నట్టెచూతు, కనులు కాయలుగాయ, నా పనులు మాని.

౨

ఊలుము ఊలిమిన యపుడెల్ల ఊహసేతు, నదియె నీ రథ మరుదెంచు ననుచు నిటకు
అచ్చెరువు దోప వీక్షింతు నాకసమును, పెన్నిధిని గోలుపోయిన పేదవోలె.

౩

అతిభయంకరముగ దోచు నర్ధరాత్రి, చీల్చి చీకట్ల, దిక్కుల కాల్చివేయు
మెఱుపుతీగెను గాంతు ఏ వెఱపులేక, అది సుదర్శన మేమో యటంచు నెంచి.

౪

అంత మెరుగని గగన సౌధాంతరముల, చూచి విసిగితి నీ జాడ తోచుననుచు,
చిక్కు ముడివీడి తెలిసెను నిక్క మిపుడు, నీవు నాలోన జ్యోతివై నిలచినట్లు.

# దివ్యజ్ఞానము

శ్రీ గుంటూరు వెంకట సుబ్బారావు

దివ్యజ్ఞానము అనుమాట మనదేశములో ఇప్పుడు 'థియోసాఫీ' అను నింగ్లీషుమాటకు పర్యాయ పదముగా నుపయోగమగుచున్నది. 'థియోసాఫీ' అనుమాట 'థియోస్' (= భగవంతుడు), సోఫియా (= జ్ఞానము) అను రెండు గ్రీకుపదములనుంచి వ్యుత్పన్నమై భగవంతునిగురించి చెప్పు విద్య అని యర్థము నిచ్చును. ప్రాచీన గ్రీకు తత్త్వజ్ఞుడగు అయాంబ్లికస్ మొదట ఈపదము నుపయోగించెను. మన పూర్వులే విద్యను యోగవిద్య, గుప్తవిద్య, రాజవిద్య, బ్రహ్మవిద్య, బ్రహ్మజ్ఞానము, దివ్యజ్ఞానము ఇత్యాదిపేర్లను పిలుచుచుండిరో ఆ విద్యనే అయాంబ్లికస్ 'థియోసాఫీ' అనెను. 1875 సం॥ములో కల్నల్ ఆల్కాటుగారు, హెలీనా పెట్రోవ్నా బ్లవాట్స్కీగారు, అమెరికాలో ప్రాచీనగుప్తవిద్యాపునరుద్ధరణము నిమిత్త మొక సమాజమును స్థాపించి, దానికి 'థియొసోఫికల్ సొసైటి' అని పేరు పెట్టిరి. వారా సమాజమునకు పెట్టిన పేరులో అయాంబ్లికస్ ఉపయోగించిన 'థియోసాఫీ' అన్నమాట నుపయోగించిరి, గాని, సమాజోద్దేశములలో గాని, నిబంధనలలోగాని 'థియోసాఫీ' అనగా నేమో నిరూపించలేదు. ఆ సమాజము 'థియోసాఫీ'ని బోధించుట కుద్దేశింపబడినది అని శాసించలేదు. ఎందుచేత ననగా, ఆ సమాజము నొక ప్రత్యేకమతముగా చేయుట యుద్దేశముకాదు. బ్రహ్మ మొక్కటే సత్యము. ఆ బ్రహ్మము ఇట్టిది అని నిరూపించుటకు సాధ్యము కాదు. ఆ సత్యమునకు ఇది మార్గము, అది కాదు అని శాసించుట సాధ్యము కాదు. ఎవరి ప్రకృతిని బట్టి వారు, ఎవరి అభిరుచినిబట్టి వారు, మార్గము నేర్పర్చుకొనిపోయి, తమ గమ్యస్థానమును చేరవలసియున్నది. స్వయంకృషిచేతను, స్వానుభవముచేతను, ఎవరు ఎంత జ్ఞానమును సంపాదించెదరో అదియే వారికి సత్యము. ఒకరు ఇది సత్యమార్గము, దీనినిబట్టి పోయినవారికి సత్యము ప్రాప్తించును అని చెప్పినచో అది యొక మత మగును. అట్టి ప్రత్యేకమతమును స్థాపించు నుద్దేశము లేక, కేవలము సత్యాన్వేషణపరుల నందర నొక వ్యవస్థగా జేర్చు నుద్దేశముతో దివ్యజ్ఞానసమాజమును స్థాపించుట చేత, స్థాపకులు 'దివ్యజ్ఞానము'ను నిరూపించలేదు.

ఆ సమాజోద్దేశములు మూడు :

1. జాతిమత స్త్రీ పురుషాదిభేదములు లేని సర్వభూతసోదరత్వమున కంకురస్థానముగా నుండుట.

2. అన్నిమతములను, తత్త్వశాస్త్రములను, శాస్త్రములను పరిశోధించి వానియందు సామాన్యముగ నున్న సత్యములను గ్రహించుట.

3. ప్రకృతి రహస్యములను మనుష్యునియందున్న రహస్యశక్తులను పరిశోధించి తెలిసికొనుట.

ఇలా

ఈ యుద్దేశములలో మొదటిది ప్రధానముగా గైకొనబడినందున సర్వసోదరత్వము సంగిరించువారు అందరు సభ్యులు కావచ్చును. తక్కినవి రెండును దానికి సహాయభూతములుగ నుండును.

పైన జెప్పిన కారణములచేత దివ్యజ్ఞానసమాజములో సభ్యులు తమ మతమును విడువవలెనని గాని ప్రత్యేకముగ నొక మతమును, ఒక అభిప్రాయమును అంగీకరించవలె నని గాని, అవలంబించవలె నని గాని నియమములేదు. ప్రతిసభ్యునకును పరిపూర్ణ అభిప్రాయస్వాతంత్ర్య మున్నది. తన యభిప్రాయములను వెల్లడిచేయవచ్చును. కాని యెవరును తన యభిప్రాయముల నితరు లంగీకరించవలె నని యనరాదు తన యభిప్రాయములను వెల్లడిచేయు నప్పు డితరులను వారి యభిప్రాయములను అగౌరవపరచరాదు. ప్రతిసభ్యుడును తన యభిప్రాయముల నెంత గౌరవించునో ఇతరుల యభిప్రాయముల నంత గౌరవించవలెను.

అయితే, ఈ సమాజసభ్యులలో కొందరు పరమగురుప్రసాదలబ్ధజ్ఞానముచే తమకు తెలిసిన ప్రకృతిరహస్యములను ప్రపంచమునకు ప్రకటించిరి. కొందరు సభ్యు లీ రహస్యములను తమ యోగశక్తిచే పరిశోధించి, ప్రత్యక్షముగా తాము చూచిన విషయములను ప్రకటించిరి. ఇట్లు ప్రకటింపబడిన సత్యసముదాయము నేడు థియొసాఫీ అని ప్రసిద్ధి గాంచియున్నది.

అనాదినుండియు ప్రజల కనేకరూపముల బోధింపబడుచున్న సత్యములు కాలక్రమమున కొన్ని ఖిలమై, కొన్ని వ్యాఖ్యానములు, మతములు, మూఢాచారములు అను పైకప్పుచే జుట్టబడి జనుల దృష్టినుంచి తిరోహితములైనవి. క్రమక్రమముగా జను లీ పై కప్పు సత్యముగాఁ బెట్టుకొని, దాని మీదనే తమ జీవితమును నిర్మించుకొనుటచేత, యథార్థము బయలుపడినప్పు డది వారికి క్రొత్తగా కనిపించుట సహజము. అందుచేత 'థియొసాఫీ' అనగా నేదో యొక క్రొత్త మత మని చాలా మంది అభిప్రాయము కాని మీద వ్రాసినట్లది యొక ప్రత్యేకమతము కాదు, సకలమతములకు సకలవిద్యలకు మూలమైన సత్యసముదాయము.

అయితే, ఆ సత్యములే యీ సమాజసభ్యులద్వారా ప్రకటింపబడుటలో, నిదివరకు ప్రజాసామాన్యమునకు వెల్లడిచేయబడక, యోగమార్గమున కొంత సాధనము చేసి కృతార్థులైన వారికి మాత్రము బోధింపబడుచుండెడు విషయములు కొన్ని జను లందరకును వెల్లడిచేయబడినవి. ఇది 'థియొసాఫీ' యందున్న క్రొత్తతనము.

చిన్నబిడ్డ చేతిలో కత్తినిగాని, నిప్పునుగాని పెట్టినయెడల, దాని యుపయోగము నెరుగని బిడ్డ తనకును ఇతరులకును గూడ హాని కలిగించును. అదే ప్రకారముగా, అజ్ఞానులు బాలిశులు అయిన జనులకు మహాసత్యములను బోధించినచో ప్రమాదించును. అందుచేత, సనాతనధర్మ మను పెన్నిధికి ధర్మకర్త లనదగిన ఋషులు పరిణామమున జను లధికజ్ఞానవంతులై, క్రొత్త సంగతులను తెలిసికొని, వానిని సద్వినియోగము చేయగల రని తోచినపుడు, వారికి ఆ సంగతులను బోధించు

చుందురు. ప్రజలయందు వారికి గల పరిపూర్ణకరుణచేతనే వా రట్లు కొంచెము కొంచెముగా సత్యబోధ చేయుదురుగాని, పక్షపాతముచేగాని, స్వప్రయోజనార్థముగాఁగాని, కాదు.

ఈ కాలమున జనులు మనోబలమును విశేషముగా వృద్ధిచేసికొని, ప్రతివిషయమును స్వాయముగా పరిశోధించి తెలిసికొను స్థితికి వచ్చియున్నారు. ప్రకృతిని పరిశోధించి అనేక రహస్యములను బయటపెట్టినారు. ఆ రహస్యములు తెలిసిన కొలదియు ప్రకృతిని జయించి, తమకు కావలసిన ట్లుపయోగించుకో గలుగుచున్నారు. కాని ఆ శక్తులను స్వార్థపరులైన జనులు, స్వప్రయోజనార్థమును, పరహింసార్థమును వినియోగింప నారంభించుటచే ప్రపంచమున ద్వేషము, వైమనస్యము, క్రౌర్యము, పీడ వృద్ధిపొంది, జనులు సత్యమార్గమునకు దూరము కాజొచ్చిరి. అందుచేత, వారిని సరియైన త్రోవకు మరల్చుటకై సనాతనధర్మమును పునః ప్రబోధము గావింప తరుణము వచ్చినది. అంతేగాక, ఇప్పటి జనులు మనోబలము, విమర్శశక్తి, పరిశోధనశక్తి గలవారై, ఇతరులు చెప్పినదానిని గుడ్డిగా నమ్మనివా రగుటచేత, వారికి తగినవిధముగ ఆ ధర్మమును ప్రకటింపవలసియుండెను. కనుక, అట్టి విమర్శనశక్తి, పరిశోధనశక్తి గల పాశ్చాత్య శరీరములలోఁ బుట్టిన తమ ఆంతరంగికశిష్యు లిద్దరిని నియోగించి, పరమబుషులు ఈ సమాజమును వారిచే స్థాపింపజేసిరి. వారుగాక, మరికొందరు పాశ్చాత్యశరీరములలోఁ బుట్టిన యోగులు, మీాద వ్రాసిన ప్రకారము తాము స్వయముగా పరిశోధనలు కూడ చేసిరి. అందుచేత, 'దివ్యజ్ఞాన' గ్రంథము లనబడు మహాగ్రంథములు అభినవ పాశ్చాత్య నాగరికతలో పెరిగిన వారికిని, యువతీయువకులకును, ఆకర్షణీయముగ నుండును.

'దివ్యజ్ఞానము' సకలమతములకును మూలమైన సనాతనధర్మ మగుటను, దానిని చక్కగా బోధపరుచుకొన్న వారు తమతమ మతములలోను, ఇతరమతములలోను, ఆచారములలోను గల అర్థమును, మహత్త్వమును తెలిసికొన్నవారై, తమ మతమును ఎప్పటికంటె నెక్కువ చక్కగా అనుష్ఠించుచు, తక్కిన మతములవారియందు సోదరభావము, గౌరవము కలిగియుందురు.

'దివ్యజ్ఞానము' ప్రకటించిన కొన్ని ముఖ్యమయిన క్రొత్త సత్యములను తెలియజేయుట ఆవశ్యకము.

1. సర్వాంతర్యామియు సర్వాతీతుడును అగు భగవంతు డను నొక శక్తి కలదు. ఈ సృష్టి యంతయు ఆ శక్తియొక్క ఆవిష్కరణస్వరూపము. ప్రతిప్రాణియు భగవంతుని స్వరూపము.

2. జీవపరిణామము భగవత్సంకల్పము. ఖనిజములు మొదలు మనుష్యునివరకు గల రూపములన్నియు జీవము పరిణామమునబొందు వికాసమునం దొక్కొక్క స్థితికి తగిన యుపాధులు. ఈ పరిణామము భగవంతుని కళయైన జీవము మొగ్గ వికసించి పూవైనట్లు, వికసించి, బీజరూపముగ నున్న భగవత్కల్యాణగుణముల నన్నిటిని పరిపూర్ణము చేసికొనుట కుద్దేశింపబడినది. పరిణామ ప్రారంభమున ప్రకృతిబద్ధుడైన యీశ్వరుడు, అంతమున భగవత్స్వరూపుడైన మనుష్యు డగును.

3. ఈ పరమావధిని పొందుటకు మనుష్యు డనేకజన్మములను పొందును. ఒక్కొక్క జన్మమున బడసిన యనుభవములచే కొంచెము కొంచె మభివృద్ధిని పొందును. మానవజాతులు, ఉపజాతులు,

జనాంగములు, కులములు, శాఖలు, వంశములు, ఇవన్నియు జీవుని వికాసమునకు కావలసిన పరిస్థితులు కలుగజేయుట కేర్పడినవి. అయితే, మనుష్యుడు స్వయంకృషిచే బహు శీఘ్రకాలములోనే ఆ పరమావధిని బొందగలడు.

4. మరణానంతరమున జీవుని పరలోకయాత్ర పూర్తిగా వివరింపబడి మరణ మనిన భయము లేకుండ చేసినది.

5. భువరాది సూక్ష్మలోకములు, అందు నివసించు జీవులయనుభవములు పూర్తిగావివరింపబడినవి.

6. ఈ పరిణామము నంతను నడిపించుచు భగవత్సంకల్పమును నెరవేర్చుచు మహీపీఠము అను పేరున బరగు ఋషిసంఘ మున్నది. ఆ ఋషిసంఘమునందలి ఆధికారికపురుషులును వారి శిష్యులును ప్రపంచమునందలి మతము లన్నిటిని స్థాపించి, విద్యల నన్నిటిని వ్యాపింప జేయుచున్నారు. మానవుని ఆధ్యాత్మికపరిణామమునకు సహాయులగు పరమగురువు లా పీఠమునందలి ఋషులే. వారికి సంసారమునందున్న మనుష్యులుకూడ సహాయము చేయగలరు. చేసి, వారి కటాక్షమును బడసినచో త్వరలో ముక్తి బడయుదురు.

7. మానవులు మరచిపోయినందున దివ్యజ్ఞానము తిరిగి వెల్లడించిన మరియొక సంగతి, మనకండ్ల కగుపించని సూక్ష్మలోకములలో నివసించుచు, మనతో కలిసి మెలిసియుండి, రూపనిర్మాణమున మనకు నిరంతరసేవజేయు దేవతాగణముల యునికి. మనుష్యుల సంకల్పములు, రాగములు, చర్యలు యుక్తముగా నున్నయెడల, ఆప్రాంతమున దేవత లుండగలరు. కనుక అచట వర్షము, సస్యములు, పాడి, ఆరోగ్యము సమృద్ధిగా నుండును; మనుష్యులలో దుర్మార్గము అధర్మము ఉన్నచోట దేవతలు నిలువజాలరు. కనుక, అచట రోగములు, కరువులు, దారిద్ర్యము ప్రబలియుండును.

'దివ్యజ్ఞాన'బోధలు మన ప్రాచీన గ్రంథములలో నున్నవి. మన కీ 'దివ్యజ్ఞానము' కూడా యెందులకని యడుగుటకలదు. మన ప్రాచీన గ్రంథములలో నీ బోధలు కొన్ని సూచింపబడియున్నవి. కొన్ని వివరముగానున్నవి. కాని, ఆగ్రంథములను చదివి, వానిని సరిగా అర్థము చేసికొనదగినవారు లేరు. వాని నర్థము చేసికొనజాలక, పాశ్చాత్యభౌతికవాదుల ననుసరించి, అవన్నియు బాలిశుల తొక్కుపలుకులని యుపేక్షించినారు. ప్రాచీనాచారము లన్నియు నిర్జీవములైనవి. కనుక వానిని తిరిగి జనులకు జ్ఞాపకముచేయుచు, క్రొత్తరీతిని బోధించుటకు ఈ 'దివ్యజ్ఞానము' కావలసియున్నది.

'దివ్యజ్ఞాన' మొక జీవితశాస్త్రము. ఒక భౌతిక శాస్త్రవేత్త యొక సేద్యగానికి భౌతిక శాస్త్రము వల్ల లోకమునకు గలిగిన మేలును వర్ణించి చెప్పుచుండెను. అది విని విని సేద్యగాడు 'నాయనా! మీరు పక్షులవలె గాలిలో నెగురుట నేర్చినారు. చేపలవలె నీటిలో నీదుట నేర్చినారు. కాని, మనుష్యులవలె భూమిపై నివసించుట నేర్వలేదు,'' అనెను. మనుష్యులవలె భూమిపై మనుటను నేర్పునది 'దివ్యజ్ఞానము'.

ఓం తత్సత్.

# పరావిద్య లేవి?

శ్రీ కామరాజు హనుమంతరావు

అపరా ఋగ్వేదో యజుర్వేదః సామవేదో౽ థర్వవేదః, శిక్షా కల్పో వ్యాకరణం నిరుక్తం ఛన్దో జ్యోతిష మితి, అథ పరా యయా తదక్షర మధిగమ్యతే. [ముండకోపనిషత్తు]

ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అథర్వవేదము — నాలుగు వేదములును, శిక్ష, కల్పము, వ్యాకరణము, నిరుక్తము, ఛన్దస్సు, జ్యోతిషము — వేదాంగములును అపరా, అనగా శ్రేష్ఠములు కాని విద్య లని, ఏ విద్యలచేత అక్షర సత్యము తెలిసికొనబడునో ఆ విద్యలు పరా అనగా శ్రేష్ఠములయిన విద్య లని ఉపనిషత్కారుడు, ఋషిసత్తముడు చెప్పుచున్నాడు. వేదములు సమస్తవిద్యలకు మూలకందము. అందు ముఖ్యముగ అక్షరసత్యము తెలుపు విద్యలు కలవని యెల్లర నమ్మకము. వస్తుజ్ఞానమునకు తోడ్పడు విద్యలు ప్రకృతివిద్య లని పరిగణింపబడు చున్నవి. వానికి నయితము బీజములు వేదములందు గలవు. ఆత్మజ్ఞానమునకు, పరమార్థ జ్ఞానమునకు సంబంధించినట్టి భావప్రధానము లయిన కవిత్వ గాన నాట్య చిత్రలేఖన శిల్పాది కళావిద్యలకు వేదములు పెన్నిధి యని ప్రసిద్ధి. ఆధ్యాత్మిక విద్యలకు ఆకరము లని చెప్పబడు వేదములు అపరావిద్య లని ఋషీశ్వరుడు నిరూపించు చున్నాడు. ఛన్దో వ్యాకరణాది శాస్త్రములు కేవల నియమములకు, సూత్రములకు సంబంధించినవి యగుటచే, అవి అపరావిద్య లనిన నంగీకరింప వచ్చును. కాని వేదము లపరావిద్య లనఁ జెల్లునా? ఆ మహావేదములు వెల్లడించిన మూలపురుషులు ఋషిపుంగవులు; మహాద్రష్టలు. వారు అక్షరసత్యమును దర్శించి ప్రకటించిరి. కవిఋషభు లననొప్పు ఋషులు నుడివిన ప్రవచనములందు, పాడిన గీతములందు పరావిద్య లేకుండునా? చాల చిత్రము! ఉపనిషత్కారుని యుద్దేశ మారయుట కర్తవ్యము.

అక్షర సత్యము భావాతీతము; ఎంత తెలిసికొనబడినను, తెలియబడ నట్లే యుండును. అది యిట్టి దని స్పష్టముగ నెరుకబడదు. దానికి రూపము, వర్ణము, హద్దులు లేవు. అది సదా దృష్టిపథమున అనంతముగ నిలుచును. మనసున కందని దానిని అవగాహన చేసికొనుటయే దుస్తరము. ఇక దానిని ప్రకటించుట యెట్లు?. ఋషులు, కవులు; గాయకులు, నటులు, లేఖకులు, శిల్పులు మంత్రముల ద్వారా, పద్యములద్వారా, గీతముల ద్వారా, నృత్యముల ద్వారా, చిత్రముల ద్వారా, విగ్రహ ములద్వారా అనంత సత్యమును సూచింప నేర్తురు. వారి ప్రకటనలు భావ ప్రకటనలు. ఆ మహాత్ముల జీవితములే అఖండసత్యముతో విరాజిల్లు చుండును. వారి వాక్కు, రచన, చేష్ట, సర్వము

దివ్యతేజముతో వెలుగుచుండును. పుణ్యాత్ముల సాంగత్యము, ఉపదేశము ఉత్తేజకరములు; అమూల్యములు. అవి లభించినవారికి శాశ్వత సత్యము గోచరింపక మానదు. సాధుపురుషులు సత్యస్వరూపులు; మహత్తర శక్తి సంపన్నులు, వారు గతించిన తరువాత కూడ వారి పవిత్రజీవితములు ఆదర్శప్రాయములు; వారి దివ్య ప్రచురణలు మార్గదర్శకములు, కాని వారి యనంతరము వారి యనుచరులు కాలక్రమమున సత్యము మీదకంటె వారిమీదనే, వారి మాటలమీదనే, వారి క్రియలమీదనే అధికతరముగ దృష్టి నిలుపుదురు. వారి సహజ ప్రవచనములకు, రచనలకు తమ సంకుచిత విషయముల జేర్చెదరు. పిమ్మట నట్లు చేర్చబడినవియే ప్రధానములై వానినడుమ సత్యము మరుగుపడును. ఆకాశగంగ స్వచ్ఛమయినదే; కాని భూమిమీద ప్రవహించి సముద్రము చేరునప్పటికి, పూర్తిగ కలుషిత మగును; పానయోగ్యమే కాకపోవును. అట్లే కవిత్వము, గానము, నాట్యము, ప్రతికళయు ప్రథమమున ప్రయోజనకరమై క్రమక్రమముగ భ్రష్టత జెందును. కళాభిజ్ఞులందరు ఋషితుల్యులే. అన్ని కళలు అద్వితీయసత్యము నెరుకపరచునవే. అయినను అవి కాలవశమున కళంకితము లగును. వానికి హృదయమునుండి వినిర్మలజ్ఞానధారలే లభించును గాని సామాన్య జనుల వాడుకవలన మాలిన్యము చేకూరును. గ్రంథస్థములై వ్యవహారములో నున్న ప్రచలితకళలు సత్యదూరములై అపరావిద్యలుగ పరిణమిల్లును. వేదములు యజ్ఞయాగాదికర్మభూయిష్ఠమై మొదటి పరిశుద్ధస్వరూపము గోల్పోవుటను బట్టియే, ఉపనిషత్కారుడు అట్లు నుడువవలసి వచ్చెను.

కళలు శాశ్వతసత్యము ప్రకటించుటకు సాధనములె యయినను, అవి విజ్ఞానుల హస్తములయందు మాత్రమే నిజస్వరూపముతో విలసిల్లుచు సార్థకము లగును. కాని పండితుల చేతులలో బడి గంభీరములు, క్లిష్టములు, కష్టసాధ్యములు అగుచు నెంత ఘనత కెక్కినను తమ సహజస్వరూపముల గోల్పోవును. ఉన్నతభావమును వ్యక్తపరుపక వట్టి శబ్దము, రూపము, చాలనము మున్నగు బాహ్య సాంకేతికములతో నిండి శుష్కము లగును; అంతియ గాదు. తుదకు క్షుద్రవాంఛల బుడికొల్పు నుపకరణములుగ వినియోగపడును. ఈ తీరున కళలు అతినికృష్టస్థితికి వచ్చును; గర్హ్యము లగును. పరమసత్యమును ప్రకటించు నప్పుడే, అవి మాననీయములు. పరావిద్య లనుట కర్హములు. మనము సామాన్యముగఁ గాంచు కళలు కృత్రిమకళలు, వికృతకళలు. తరచుగ పద్యము వెగటును, సంగీతము తలనొప్పిని, నాట్యము రోతను, చిత్రము అసూయను, విగ్రహము విద్వేషమును కలిగించుచుండుట యందరకు అనుభవసిద్ధమే.

హృద్యములయిన సహజకళలు మాత్రమే పరావిద్యలు. స్వాభావికకళలందు సత్య సౌందర్యము మూర్తీభవించును. జడజగత్తునందే సత్యమునకు దివ్యకాంతి కలదు. ఇక భావప్రపంచమునందు సత్య మెంత దీప్తితో వెలుగవలయును? సహజకళలు సత్యముతో గూడి అత్యంతసుందరములై భాసిల్లును. సత్యమును గాంచిన వారలే, వ్యక్తపరచువారలే కళాభిజ్ఞులు. ఇంద్రియములకు సత్యము గోచరింపదు. పాండిత్యముచే సత్య మెరుంగబడదు. విజ్ఞానమే సత్యమును దర్శించును. విజ్ఞానము స్థూలమందు సూక్ష్మమును, జడమునందు ఆత్మను, క్షుద్రమునందు మహత్వమును, భేదమునందు

అభేదమును, ప్రకృతియందు పురుషుని సాక్షాత్కరింప గలదు. విజ్ఞాన పురుషులే ఋషులు, కళావేత్తలు. "When man has the power to see things detached from self-interest and insistent claims of the lust of the senses, then alone can we have the true vision of the Beauty that is everywhere." ("స్వార్థచింతయొక్క ఇంద్రియవాంఛయొక్క, దట్టమయిన పొరలు వీడినప్పుడే, దృష్టి సర్వవ్యాప్తమయిన సౌందర్యమును యథార్థముగ దర్శించును)అని విశ్వకవి రవీంద్రుడు తెలుపుచున్నాడు. ఆ దివ్యదృష్టి గలవారే కళారాధకులు; కళల నుద్ధరింప గలవారు, పోషింప గలవారు. వారి కృషి ఫలితముగ కళలు పరావిద్యలై శోభిల్ల గలవు. 'పరావిద్య లేవి ?' అను ప్రశ్నకు తావు లేకపోవును.



# నా తెలుఁగు భూమి

## (మనసా గేయము)

(మాండ్ రాగము – ఝంపె తాళము)

శ్రీ సాదలి రామస్వామి

తెలుఁగు దేశము నాది
తెలుఁగు వాఁడను నేను
తెలుఁగు సుమములఁ జేర్చి
తెలుఁగు హారముఁ గూర్చి
తెలుఁగు దేవి యశమ్ము
వెలుఁగ గొలుతూ
తెలుఁగు తల్లి ఋణమ్ముఁ
దీర్చివైతూ॥ తెలుఁగు దేశము ॥పల్లవి॥

నా తెలుఁగు బాసలో
నవ్య వాఙ్మయ పుష్ప
మాలికా సౌరభము
మహి యెల్ల నిండే॥

నా తెలుఁగు వనములో
నవయుగోదయరాగ
సుమ సంతతులు విరిసి
శోభ వెదజల్లె॥

నా తెలుఁగు వెలుఁగులో
నవ్యరాష్ట్రస్థాప
నానందచంద్రికలు
నాట్య మాడే॥

నా తెలుఁగు భూమిలో
నవజీవనప్రభల
శాంతి సేవక సమితి
జయభేరి మ్రోఁగె॥ తెలుఁగు దేశము॥

ఓం శాంతి శ్శాంతిః

# ఆంధ్రులు - సంగీత నాట్యములు

శ్రీ వావిలాల సోమయాజులు

దేవానా మిద మామనంతి మునయః
కాన్తమ్ క్రతుమ్ చాక్షుషమ్:
— కాళిదాసు - మాళవికాగ్నిమిత్రము.

Music is a moral Law; it gives a soul to the Universe, wings to the mind, flight to the imagination, a charm to sadness, gaiety and life to everything. —Plato.

భారతజాతి ఎంత ప్రాచీనమైనదో భారతీయుల సంగీత నాట్యకళలును అంత ప్రాచీనమైనవి. యవనిక, సూత్రధారుడు, విట, చేట, శకారాది సామ్యము లేవో కొన్ని చూపి కొందరు పాశ్చాత్య విద్వాంసులు (Orientalists) మన సంగీత నాట్యకళలను గ్రీకుల గాంధర్వకళలతో ముడిపెట్ట ప్రయత్నిస్తారు. వాస్తవమును ఆలోచిస్తే వేదకాలంనాటికి పూర్వమే మనకు సంగీత నాట్యాలతో నిరుపమానపరిచయం ఉన్నట్లు గోచరిస్తుంది. వేదవాఙ్మయంలోని యమయమీ, ఊర్వశీ పురూరవ ఇత్యాది సంభాషణలు ప్రాచీన భారతీయుల వాకోవాక్యసంపత్తికి నిదర్శనాలు. ఈ జాతి పుట్టుకతోనే మతము పుట్టింది. మతముతోబాటు సంగీత నాట్యాది సమస్త కళాప్రపంచము పుట్టింది.

శిక్షాస్మృతులలో కొందరు దేవతలను ఆరాధించేటప్పుడు ఇంటియజమాని కులపురోహితుడితో కలిసి కొన్నిగీతలు పాడవలసినట్లు విధించారు. వారిద్దరూ గానంచేస్తున్నప్పుడు యజమానురాలు వీణాతంత్రులు మేళవించి శ్రుతి కలపవలెనట. అటువంటి వీణను పిఛోళి అని వ్యవహరించారు. దానికే ఔదుంబరవీణ అని మరొకపేరు. మనకు గోచరించేటంతలో ఇది జంత్రవాద్యములకు ప్రథమస్థితి.

సంగీత శాస్త్రంలోని స్వరాలను సామవేదంలోని 'క్రుష్ట'లలోనే మనం గుర్తుపట్టవచ్చు. ప్రస్తుత సంగీత శాస్త్రాన్ని కంతటికీ మూలరూపాలనిపించుకొనదగ్గ శుద్ధ, భిన్న, గౌడ, వేసర, సాధారణాలు అనే అయిదుగీతాలు సామవేదంలోని ప్రస్వార, ఉద్గీత, ప్రతీహార, ఉపద్రవ, నిధానాలలో నుంచి వచ్చినవే నని మన విద్వాంసులు అభిప్రాయ మిస్తున్నారు. తరువాతి కాలంలో పుట్టిన వివిధరాగాలు వీటినుంచి వచ్చినవే. ప్రస్తారం చేసిచూస్తే అన్నిరాగాలు ఈ అయిదింటిలో దేనికో ఒక దానికి చెందక తప్పదు. సామలను స్తోభ లంటారు. వాటిని ఉదాత్త, అనుదాత్త, స్వరితాలలో గానం చెయ్యటం మన కందరికీ తెలిసిన విషయమే. సంగీతముతోటి పాటిదే నాట్యంకూడాను. దేవతలనుగురించి సామగానంచేసేటప్పుడు నృత్య, గీత, వాద్యాలు మూడు కూడుకొని తౌర్యత్రికము (Symphony or Union of song, dance and instrumental music) ఏర్పడితే గాని మన ప్రాచీనులకు తృప్తి ఉండేది కాదు.

భరతశాస్త్రంమీద వ్యాఖ్యానం వ్రాసిన తిక్కాకర, అభినవగుప్తులు ఇద్దరూ భరతునకుపూర్వమే భరతశాస్త్ర గ్రంథాలు కాశ్యపవిశాఖిలులు ప్రవచించినట్లు చెప్పారు. వారిగ్రంథాలు కాలవాహినిలో కలిసిపోయిన వన్నమాట. కాని భరతుడు శాస్త్రాన్ని నిబంధించి సక్రమమైన మార్గములో ప్రచారానికి తీసుకవచ్చాడు. ఆయన కాలం నాటికే ఆంధ్రులు గాంధర్వ విద్యా ప్రవీణులుగా ప్రసిద్ధికెక్కినట్లు గోచరిస్తున్నది. భరతుడు ౧౩ వ అధ్యాయంలో నాట్యాన్ని నాలుగు రకాలుగా విభజించాడు. ౧ అవంతీ, ౨ దాక్షిణాత్య, ౩ పాంచాలీ, ౪ ఓఢ్రమాగధీ. దక్షిణదేశానికి ఎల్లలు చెప్పుతూ 'దక్షిణసముద్ర వింధ్య మధ్య దేశమ్' అన్నాడు. ఆయన మతంలో దాక్షిణాత్యులు కోసలులు, కళింగులు, ద్రావిడులు, ఆంధ్రులు, మహారాష్ట్రులు. దాక్షిణాత్యులు బహునృత్త గీతాభిమానులు, కైశికీప్రియులు, చతురమధుర లలితాంగాభినయులు అని భరతుడు.

ఆంధ్రజాతి ఏకచ్ఛత్రాధిపత్యం క్రిందికి వచ్చి కళాపరిపూర్ణమైనది, చరిత్రకు తెలిసినంతమటుకు మొదట శాతవాహనుల కిందనే. ఇంతకు పూర్వము ఆంధ్రులు అంతఃకలహాలలో నిమగ్నులై ప్రత్యేకవంశాలుగా

ఉన్నట్లు చరిత్రకారులు ఊహిస్తున్నారు. శాతవాహనులకు బాగా ప్రాచీనమైనవని నిర్ధారితములైన జగ్గయ్యపేట, భట్టిప్రోలు మొదలైన ప్రదేశాల్లోని శిల్పాలల్లో కొన్ని నాట్యభంగిమలు, వాద్య జంత్ర చిత్రణములు కనిపిస్తున్నవి. వీటినిబట్టి శాతవాహనులకు పూర్వమే ఆంధ్రులకు సంగీత నాట్య శాస్త్ర పరిచయ మున్నట్లు తలచవచ్చు.

శాతవాహనులలో మూడవరాజు కృష్ణుడు. సుప్రసిద్ధమైన సాంచీస్తూప స్తంభాలమీద కృష్ణుని శాసన మొకటి మనకు కనబడుచున్నది. కొందరు తెలుగు శిల్పులు, కారువులు అక్కడ పనిచేసినట్లు మనము భావించవచ్చును కదా. తరువాతికాలంలో ఆంధ్రులు మగధసామ్రాజ్యాన్ని కైవసంచేసుకొని యావద్భారతాన్ని పరిపాలించారు కొంత కాలంపాటు. వారిలో సుప్రసిద్ధుడు హాలమహారాజు. గాథాసప్తశతీకర్త. గుణాఢ్యపండితునికి వాత్స్యాయనునికి ఆశ్రయుడు. గాథాసప్తశతిలోని కొన్నిగాథలలో సంగీతనాట్య ప్రశంసలున్నవి. గుణాఢ్యపండితుని బృహత్కథ అగ్నిదగ్ధమైనప్పటికినీ సోమదేవసూరి కథాసరిత్సాగరం దొరుకుతున్నది కాబట్టి దాని స్వరూపం మనకు కొంతగా గోచరిస్తున్నది. కొన్ని కథలు దానిలోనివి చదివితే ఆనాడే గాంధర్వవిద్యల్లో ఆంధ్రులు ప్రజ్ఞాధురంధరులని అవగతమౌతుంది. వాత్స్యాయనుడు కామసూత్రాలల్లో సంగీతనాట్యాలకు సంబంధించిన పరిచయాలు ఎన్నోచోట్ల చేశాడు. నాగరకవృత్తంలో నాగరకులు *యక్షరాత్రి, కౌముదీజాగరము, సువసంతకము మొదలైన పండుగలు గడుపవలసిన పద్ధతిని వివరించాడు. వీటిలో సువసంతకము మదనోత్సవము. ఇది కేవలము నృత్తగీతవాద్యప్రాయమైన దన్నాడు వ్యాఖ్యాత జయమంగళుడు. ఈ పండుగదినాల్లో పండితగోష్ఠులు శాస్త్రచర్చలు విస్తారంగా జరిగేవి. సంగీతశాస్త్రజ్ఞులు 'వసంతరాగ'మనే ఒక రాగాన్ని దీనికోసంగా సృజించారు. ఈ నాగరకవృత్తంలోనే గాయక నటులకు సంబంధించిన సూత్రాలు కొన్ని కనబడుతున్నవి. వాటిలో "ప్రఖ్యాతమైన పండుగ దినాలల్లో నగరాలకు వచ్చే నటులు,సంగీతజ్ఞులు మొదటిరోజు సమస్తప్రదర్శనాలల్లో పాల్గొని మూడవరోజు క్లిష్టదానం అవుతుంది కాబట్టి రెండవరోజే వారికోసంగాను ఏర్పాటైన ప్రేక్షక మూల్యంలోనుంచి కొంతధనం బహుమానంగా పుచ్చుకోవలసిందని, దానికి ఇష్టంలేనిసందర్భంలో ప్రేమపూర్వకంగా నాగరకులు ఇచ్చిన వస్త్రాభరణాలతో తృప్తిపడి ప్రేక్షకులు జరిగిన నాటకప్రదర్శనం తిరిగి కోరినట్లయితే ప్రదర్శించవలసిందనీ నగరాలల్లో ఉండే కుశీలవులకు, నాగరకులకు, పరిషత్తులకు ఆగంతుకులుగా వచ్చిన నట గాయకాది కళాభిజ్ఞులను గౌరవించటము ధర్మ"మనీ సూత్రీకరించాడు.

కన్యలకు చతుష్షష్టికళాపరిచయము కావాలని వాత్స్యాయనుని ఆశయము. వాటిలో సంగీతనాట్యాలకు సంబంధించిన సూత్రాలు ౧౧౫. గీతమ్, వాద్యమ్, నృత్తమ్, నేపథ్యప్రయోగాః, వీణాడమరుకవాద్యాని, నాటకాఖ్యాయికాదర్శనమ్–ఈ రీతిగా పరిశీలించటము ప్రారంభిస్తే ఎన్నో సూత్రాలు కనిపిస్తవి. హాల మహారాజు కాలానికిచెందిన కౌముదీ మహోత్సవ మనే ప్రాకృత నాటకంలో సంగీతనాట్యప్రశంసలు కొన్ని కనిపిస్తున్నవి. శాతవాహనులలో గౌతమపుత్ర, వాసిష్ఠీపుత్రులు తరువాత ప్రసిద్ధికెక్కిన రాజన్యులు; అమరావతి, రామిరెడ్డిపల్లి, గుంటుపల్లి, గోలీ మొదలైన ప్రాచీన చారిత్రాత్మక క్షేత్రాల్లో దొరికే శిల్పఖండాలను పరీక్షిస్తే ఆ కాలము ఈ రెండుకళలకు వసంత కాలంగా ఉన్నట్లు అర్థమౌతుంది. ఆలీఢ ప్రత్యాలీఢాదిపాద విన్యాసాలు, పతాకాదిహస్తాలు, పరిచారికలు, రాణులు మొదలైనవారి నాట్యభంగిమలు ఎన్నో కనుపిస్తవి. జంత్ర, చర్మ, వాంశికాది వాద్యములతో ఆనాటివారు పరిచయం సంపాదించుకొన్నట్లు స్పష్టమౌతుంది.

---

* సువసంతో మదనోత్సవః, తత్ర నృత్తగీతవాద్యప్రాయః క్రీడాః ఏతా మహిమాన్యక్రీడాః – కామసూత్రములు; నాగరకవృత్తము ౧-౪-౪౨ జయమంగళ వ్యాఖ్య.

౧౯౧ పక్షస్య మాసస్యవా ప్రజ్ఞాతేఽహని సరస్వత్యాభవనే నియుక్తానాం నిత్యసమాజః ౧౯౨ కుశీలవాశ్చాగంతుకాః ప్రేక్షణక మేషాం దద్యుః ౧౯౩ ద్వితీయేఽహని తేభ్యః పూజానియతం లభేరయన్ ౧౯౪ తతో యథాశ్రద్ధ మేషాం దర్శన ముత్సర్గోవా ౧౯౫ ఆగంతుకానాం చ కృతసమవాయానాం పూజన మభ్యుపపత్తిశ్చేతి గణధర్మః — వాత్స్యాయన మూలసూత్రములు.

వీణల్లో ఒకటి, రెండు, మూడు తీగలు గలవే కాకుండా సప్తతంతువు, వెయ్యితీగలుగల గిటరను పోలిన వాద్య విశేషములు మనము చూడవచ్చును. శాతవాహనుల కాలంలో శిల్పాలే మనకు ఆనాటి సంగీత నాట్య శాస్త్రవిస్తృతి గోచరించటానికి ఉపలబ్ధమౌతున్న ఆధారాలు. మరి అన్యమైన వింతవర కేవీ లేవు.

శాతవాహనులకు పిమ్మట ఆంధ్రదేశాన్ని ఇక్ష్వాకులు, పల్లవులు, శాలంకాయనులు మొదలైన ఆంధ్రభృత్యులు పరిపాలించారు. ప్రభువులైన శాతవాహనులు చేతికిచ్చి పోయిన కళాసంపత్తిని వ్యర్థం చేయకుండా వీరు వారి మార్గాన్నే అవలంబించి పెంపొందించారు.

ఇక్ష్వాకులకు ఆదిపురుషుడు శాంతమూలుడు. మాధ్యమిక బౌద్ధవాదానికి పట్టుగొమ్మైన నాగార్జునాచార్యుడు ఈతనికి సమకాలికుడని కొందరు చరిత్రకారులు అంగీకరించారు. అది నిజమైతే ఆయన వ్రాసిన శతాధిక గ్రంథసంచయంలో సంగీతశాస్త్రం ఒకటి ఉన్నదట. కనిపించటముమాత్రము లేదు. అది దొరికినప్పుడు ఆనాటి సంగీత నాట్య సంస్కృతినిగురించి విశేషాంశాలు బయటపడవచ్చు. నాగార్జునకొండ శిల్పాలలో కొన్ని ఇతనికాలానివి. వాటిని పరిశీలించినప్పుడు మన కానాడు ఆంధ్రులు సంగీత నాట్యాలతో తులతూగుతూ ఉండేవారని ద్యోతకము కాక మానదు. ఇక్ష్వాకువంశస్థుల రాణులు - గాంధర్వవిద్యలో నిరుపమాన పాండితీవిభవ లని అడివి బాపిశ్రీ, శాంతిశ్రీలు ఊహించటము తప్పు కాదేమో!

ఇక్ష్వాకులతోపాటు పల్లవులు శాతవాహన పతనానంతరం కొంత దేశాన్ని పరిపాలించారు. పశ్చిమంనుంచి రెండవ పులకేశి వచ్చి వీరిని దక్షిణానికి తరిమేటంత వరకు అవిచ్ఛిన్నంగా ఆంధ్రదేశంలో కొంతభాగాన్ని పరిపాలించి గాంధర్వవిద్యకు సేవ చేశారు. వీరు ఆంధ్రులు. వీరినాటి శిల్పాలన్నీ భూగర్భంలోనుంచి ఇంకా పుడమిమీదికి అవతరించలేదు. ఉండవల్లి గుహాలు వీరివేనని కొందరి మతము. ఆంధ్రదేశాన్ని వదలిపెట్టి పోయినవాడు మహేంద్రవిక్రముడు. ఇతన్నే మహేంద్రవర్మ అనికూడా వ్యవహరిస్తారు. అంధ్రదేశాన్ని వదలిపెట్టి దక్షిణానికి వెళ్లేటపుడు వదాన్యుడు, కళాభిజ్ఞుడు ఐన ప్రభువుతోపాటు కొందరు విద్వాంసులు, గాయకులు, శిల్పులు దక్షిణదేశానికి వలసపోయినారు. వారిలో ప్రసిద్ధుడు రుద్రాచార్యులు. ఇతనికే మేధావిరుద్రుడని కూడా లోకంలో ప్రచారము. తన కాలంలో ప్రచారంలో ఉన్న తానాలను సరిదిద్ది నిబంధిస్తే ప్రభువు 'కుడిమియమలై' అనేచోట వాటిని శాసనోక్తం చేయించాడు. ఇక్ష్వాకుల పతనానంతరం ఆంధ్రదేశం విష్ణుకుండిన రాజుల చేతులలో పడ్డది. ఉండవల్లిగుహాలు వీరు తొలిపించినవేనని శ్రీ భావరాజు కృష్ణరావుగారు అభిప్రాయ మిచ్చారు. ఉండవల్లి గుహాలలో కొన్ని చిత్రాలల్లో వీణ మొదలైన వాద్యములు నాట్యభంగిమలలో ఉన్న అప్సరఃస్త్రీల రూపకల్పనలు కనిపిస్తున్నవి.

రాయప్రోలువారు అన్నట్లు 'అందీఅందని భావరేఖల ప్రసన్నగారతట లేతపూతట దీపారగ తీర్చిదిద్దిన' అజంతాగహ్వరశ్రేణులు వాకాటకరాజుల నాటివి. ఎల్లోరా కైలాసము, అజంతాలల్లోని శిల్పఖండాలను, భిత్తిచిత్రాలను పరికిస్తే సంగీతనాట్యాలకు ఆనాడు రాజాధిరాజు లెంత ప్రాధాన్య మిచ్చారో గోచరిస్తుంది. శివతాండవ చిత్రణంలో దేవతల చేతుల్లో వివిధజంత్ర వాద్యములు ఎల్లోరా శిల్పి నిల్పి చూపించాడు. ప్రస్తుతోపయోగంలోలేని ఎన్నోరకాల వీణలు కనిపిస్తున్నవి. ఒక భంగిమాన్ని పోలని మరొకభంగిమంతో కోటానకోట్లు ప్రతిమలను సజీవంగా చెక్కిచూపించ గలిగిన ఎల్లోరా అజంతాల శిల్పసామ్రాట్టులకు సంగీత నాట్య శాస్త్రాలతో ఎంత పరిచయం కావాలో ఆలోచించండి.

క్రీ. శ. ౬౧౦ లో రెండవ పులకేశి తూర్పుకు దండెత్తివచ్చి జయించి తమ్ముణ్ణి, కుబ్జవిష్ణువర్ధనుణ్ణి నూతన రాజ్యాధిపతిని చేసి తిరిగి వెళ్ళిపోయినాడు. తమ్ముడు అనతికాలంలో స్వాతంత్ర్యాన్ని ప్రకటించి ప్రత్యేక రాజవంశానికి కర్తైనాడు. కాని ఆ వంశస్థులు కొంత కాలం గడచినదాకా అంతఃకలహాలతో కాలం వెళ్ళబుచ్చారు. కళాపోషణానికి వారికి అదను చిక్కినది కాదు. వీరితో పాటు పశ్చిమాన్న పశ్చిమ చాళుక్యులు రాజ్యం చేస్తూనే ఉన్నారు. ఆ వంశంలో బిల్హణునికి శిష్యుడైన సోమేశ్వరుడు నాట్యశాస్త్రాభిమాని. మహారాష్ట్రదేశంనుంచి వచ్చిన ఒక గోండు కన్యకు స్వయంగా 'చరణ చారణము' చెయ్యటానికి సింహాసనము దిగి వచ్చాడట, ఆ మహారాజాధిరాజు. ఆయన నేర్పిన ఆటే తరువాత కాలంలో 'గొండ్లి' అనే పేరుతో

లోకంలో ప్రసిద్ధికి వచ్చింది. ఇది నృత్యరత్నావళిలోని క్రింది శ్లోకంవల్ల విశదమౌతున్నది.

'కళ్యాణకటకే పూర్వమ్ భూతమాతృమహోత్సవే
సోమేశః కౌతుకే కాచిద్ భిల్లవేష ముపేయుషీమ్
నృత్యంతీ మథ గాయంతీం స్వయం పొష్యమనోహరమ్
ప్రీతో నిర్మితవాన్ చిత్రగౌండిలీ మిత్యయమ్
స్వతో భిల్లీ మహారాష్ట్రీ గౌండిలీ త్యభిధీయతే.'

పశ్చిమచాళుక్యులలోని సోమేశ్వరాది కళారాధకులను చూచి కీర్తిస్పర్ధచే కొందరు పూర్వచాళుక్యులు నాట్య సంగీత శాస్త్రాలకు చేయూత నిచ్చి పోషించారు. వారిలో చెప్పుకోతగ్గవారు మొదటి చాళుక్య భీముడు, అతని మనుమడు రెండవ అమ్మరాజు.

చాళుక్య భీమునికి (క్రీ. శ. ౮౯౦-౯౧౬) గాంధర్వ విద్యాప్రవీణుడని బిరుదము. పట్టవర్ధని కులసంజాత చెల్లవ అనే నర్తకికి అత్తిలివిషయంలో రెండు ప్రదేశాలు దానం చేసినట్లు అతని అత్తిలి శాసనమువల్ల తెలుస్తున్నది. అందులో ఆమె 'నట్టువరాండ్రనే కలువలకు సూర్యకాంతి'అని వర్ణితయైనది.

రెండవ అమ్మరాజు (క్రీ. శ. ౯౮౫-౯౬౦) చాళుక్య భీమునికి మనుమడు. "కవిగాయక కల్పతరు"వాతని బిరుదనామము. కవిచక్రవర్తి, పోతనభట్టు అనేకవులిద్దరు ఇతని కీర్తిని గానం చేసినట్లు చరిత్రజ్ఞులు వ్రాసియున్నారు. చామెకాంబను, (పట్టవర్ధని కుల సంజాత) సంగీతనాట్యశాస్త్రాలల్లో నిష్ణాతను, పోషించాడు ఈ మహారాజు.

నన్నయభట్టు ౧౧ వ శతాబ్దంలోనే కవిగాయక సమితులకు భారతకృత్యాదిని నమస్కరించాడు.

రాజరాజ నరేంద్రుని కుమారుడు కులోత్తుంగ చోళదేవుడు, మాతామహ రాజ్యాన్ని పాలించటానికి పితృరాజ్యాన్ని వదలివేసి దక్షిణానికి వెళ్ళిపోయినాడు. ఆంధ్రదేశాన్ని నెల్లూరు చోళులు, నతవాడి ప్రభువులు, పొత్తపి చోళులు, కోటవంశస్థులు కాకతీయులు స్వతంత్రించి, రాజ్యస్థాపన చేసుకొని పరిపాలించటము ప్రారంభించారు. వీ రందరిలో ప్రముఖులు కాకతీయులు.

కాకతీయ మొదటి ప్రతాపరుద్రుని రాజ్యపాలన నాటికే వీరశైవము ఆంధ్రదేశంలో విశేష ప్రచారంలోనికి వచ్చింది. ఈ వీరశైవులు పారవశ్యంతో ఆరాధన చేస్తారు. భక్తి తన్మయత్వానికి తీసుకో పోవటానికి వాళ్ళు సంగీత నాట్యకళలను ఆధారం చేసుకొన్నారు. కాకతీయుల పాలనలో తెలుగునాట సంగీత నాట్యాల స్థితిగతుల తెలుసుకోటానికి పండితారాధ్య చరిత్రను, బసవపురాణము, తిక్కన భారత ప్రయోగములు, క్రీడాభిరామము, పల్నాటి వీరచరిత్రలు ముఖ్యాధారములు.

పాల్కురికి సోమన పండితారాధ్యచరిత్రలో 33 పేజీలకు మించిన నాట్యప్రసంగము చేశాడు. అందులో మార్గ, దేశి రెండు నృత్య భేదాలను పేర్కొన్నాడు. దేశీయమైన వాటిలో లాగు, వంజళము, ఢాళము, వళి, తిరుపు, బాగు, వాహిణి, సాళి కొన్ని మాత్రము. గతులు— అడ్డము, తివుటము, సన్ననమిలి, భ్రమరము, జలచరము, హంస, కోతి, గజ, సింహము, భుజంగము. బంధములు— బారణ, దొర్తు, దుర్కరము, మలపము, జల్లణము, బొల్లావణి, జొనాళి మొదలైనవి. కదలికలు— వీగుచు, లోగుచు, దంతావళుల్ నటించుచు, మరుకుచు, కేళ్ళు సూపుచు, ఉరంబుగ్గుచు, బరుడుపుచ్చుచు, మరుకటించుచు, కర్తరించుచు, బుగ్గరించుచు మొదలైనవి. చివరకు మన కీశబ్దార్థము లేమిటో కూడా తెలియనిదుస్థితికి వచ్చాము. సోమన ౨౦ రకముల వీణలను పేర్కొన్నాడు. అందులో కొన్నిటి పేర్లు వీణోత్తమము, బ్రహ్మవీణ, సారంగవీణ, రావణవీణ, గౌణవీణ, కాశ్యపవీణ, భుజంగవీణ, భోజవీణ, త్రిసరవీణ, సరస్వతీవీణ, రావణహస్తవీణ. దేశీయమైనవి. దివిరి, సకెన, వళి, విట, సాగరిక, విపంచిక, సర, మల్లరి, గోలాష్ఠి, ఘోషావతి. వాంశిక భేదములు- జాతివాస, విజాతివాస, పక్షవాస, రుద్రవాస, నిధివాస, ఋషివాస, కార్తికవాస, ఘోరవాస, త్రిపురవాస,శివశక్తివాస, భువనాధిపతివాసములు. ఆవజము, కాహళము, రుండము, తోలు, తప్పటము, కోలాట గుడియలు, తారుమద్దెలలు మొదలైన వెన్నో వాద్యవిశేషాలను పేర్కొన్నాడు. ఇక నాట్యవస్తువులను చెప్పుతూ పురముల కాల్చుట (త్రిపుర దహనము) మరుచివుర్చుట, సతి కర్ధ మిచ్చుట, యతులు కొల్వగ నుండుట, అంధకాసుర మదం బణచుట, జన్నంబు దుంచుట ఇత్యాదులు పేర్కొనినాడు.

వీరశైవులు భక్తిరసోన్మాదావస్థకు సాధనంగా సంగీత నాట్యాలను ఉపయోగించు కున్నారని పైన వ్రాసి

నాను. దాని కుదాహరణంగా బసవ పురాణంలోని క్రింది పంక్తులు సార్థకము లైనవిగా గోచరిస్తున్నవి.

"అక్క- మహాదేవి! యల్ల మద్దెలలు
జక్కొ-ల్పి వేగంబ సంధించుకొనుడు
స్వరమానమున బసవ ప్రమథవ్వ!
కర మర్థి పట్టుడు కాహళ లోలి;
సకళవ్వ! నీవును సంగళవ్వయును
నొకరీతి నిలువుడు సుకరంబుగాగ
బాలరుద్రమ! యెత్తుపట్టగ వాళె
గోల్లలు వాయింపుము గుడ్డవ్వ! నీవు
సిట్టి తాళము వట్టు శివదేవి! నీవు
సట్టన నృత్యంబు సరసం బెరింగి
సంగు దాసమ! మహేశ్వరి! వీరభద్రి
లింగవ్వ! మీరు కేళికలు సేయుండు
రమణ దుకూలాంబరమును గంచుకము
నవ రించుకొని చల్లడము బిగియించి
ఏతెమ్మ్మ నీవు పురాతమ్మ! శీఘ్ర
మాతతమ్ముగ నృత్య మాడుము గాలి
తాళము ల్వట్టుడు తాళగింపుండు
నాళత్తి వేళకు నందరు నసుచు
నవిరళంబుగ నంత నార్బటం బిచ్చి
జవనిక రప్పించి సరసమై నిలచి
పొలపగు ముఖరసంబును సౌష్ఠవమ్ము
లలియు భావంబు ధూకళియు ఝుంకళియు
మరియు శేవయు విభ్రమమును రేఖయును
నెరయంగ నీరీతి నృత్యంబు సలుప"—

బసవ పురాణములోని నాట్యనిమిత్తిండి కథలో నిక్లే గాంధర్వప్రశంస మరికొంత విపులముగా నున్నది. అది తాండవమునకు సంబంధించినది.

శ్రీశైల పర్వతారోహణము చేయు భక్తులు ఆరభటీ వృత్తిలో అంగలు వేస్తూ—

"పదములు తుమ్మెద పదముల్, ప్రభాత
పదములు, శంకర పదముల్ నివాళి
పదములు, వాలేశు పదములు, గొబ్బి
పదములు, వెన్నెల పదములు, సంజ
వర్ణన మరి గణ వర్ణనపదములు"

పాడుతూ నడిచారని విస్తారంగా ప్రస్తావిస్తాడు సోమన.

తెలుగు దేశంలో ఆనాటికే నాటకాలు, తోలుబొమ్మ లాటలు ప్రసిద్ధంగా వున్నట్లు—

"శతకంబు శివతత్వ సారంబు, దీప
కళిక, మహానాటకము, నుదాహరణ
ములు, రుద్రమహిమయు, ము క్తకావళులు"

"ప్రమథ పురాతన పటుచరిత్రములు
క్రమ మొంద బహునాటకము లాడువారు
భారతాది కథల చీరమరుగుల
నారంగ బొమ్మల నాడించువారు"

అనే సోమన వాక్యాలవల్ల అవగత మాతున్నది. ప్రచ్ఛన్న వేషములు (Fancy dress) వేసుకొని 'అధి కోత్సవం తోలుకాడేటట్లుగా నటించినట్లు సోమన ప్రకటించాడు. ఇది మధ్యదేశంలో సంగతి. మొదటి ప్రతాపరుద్రునికి సమకాలికుడైన నలగామరాజు పలనాటిలో సింహాసనము ఎక్కు-టప్పుడు ఒక నర్తకి వచ్చి శాస్త్రోక్తంగా నాట్యం చేసినట్లు పల్నాటి వీరచరిత్రలో శ్రీనాథుడు—

"ఘనవైభవంబున కామభూవిభుడు
నవ్వుచు సెలవిచ్చె నాట్యంబు సేయ
వరమృదంగము లెస్స వాయించుమేటి
కుడిభాగమందున గుమురుగా నిలిచెఁ
దాళమానజ్ఞులు దాపటి దిశను
నిలిచి యుత్సాహంబు నేరుపుమీర
ముఖవీణ వాయించు ముఖ్యు డొకండు
రాగ మాలాపించు రమణు లిద్దరును
నిండు వేడుకతోడ నిలచిరి వెనుకఁ
గంజలోచనయును ఘనమైనపాత్రి
మదను పట్టపుదంతి మంజులవాణి
భరతశాస్త్రోచిత బహురాగములను
గరిమతో నేర్చిన కంతుబాణంబు
వచ్చియు సభవారు వర్ణించి చూడ
నిలచి నాట్యమునకు నేర్పరియైన
వేత్రపాణికిఁ దన వినయంబుఁ జూపి
అత డొసంగిన గజ్జె లతిభక్తితోడఁ
బాదములం గట్టి పంచవర్ణముల
కాసె గట్టిగఁ గట్టి కడు జవం బడర
మద్దెల తాళాల మధ్య నిల్చుండి
యోరజూపున రాజు నొయ్యనఁ జూచి

సమపాదయుతమైన స్థానకస్థితిని
దాత్పర్యమున దేవతలకును మ్రొక్కి
పుష్పాంజలి యొసంగి పూని నాట్యంబు
సమకట్టి నాదంబు సభ యెల్లఁ గ్రమ్మఁ
గైకోలువిడుదలల్ ఘన కళాశైలి
కైముడి కట్నముల్ కనుపింపఁజేసి
వెలయంగఁ దొమ్మిది విధములైనట్టి
భూచారి నాట్యంబు పొందుగా సలిపి
పదు నారు విధములై పరగిన యట్టి
యా కాశచారియు నమరంగ 'నాడి
యంగహారాఖ్య గలట్టి నాట్యంబు
విదితమా తొమ్మిది విధముల నాడి
గతిచారిభేదముల్ గనుపడునట్లు
భ్రమణ సంయుత దీప్త పటిమ మీరంగఁ
బాణిభేదములను బాటించి చూపి
స్థానక సంచయ సంయుక్త మమర
ప్రేరణి దేశిని ప్రేంఖణ శుద్ధ
దండికా కుండలి తగు బాహుచారి
సప్త తాండవములు సల్పెఁ జిత్రముగ
సభవార లాశ్చర్యసంయుక్తులైరి
తరువాత నిరుమేలఁ దగు చెలు లమర
సంయుతాసంయుతాచలన సంకుచిత
నానార్థకరములు నాట్యహస్తములు
శిరమును చూపులు చెక్కిళ్ళు బొమలు
దంతోష్ఠకంఠముల్ తగు చుబుకంబు
ముఖరాగ వక్షంబు మొదలుగా నెన్న
నంగంబు లారు నుపాంగంబు లారు
ప్రత్యంగ సముదయం బారునుం గూడి
ఎనిమిది పదియగు నెసగు నంగంబు
లమరంగ నభినయం బాశ్చర్యముగను.

ఆడె నని వర్ణించియున్నాడు. ఆంధ్ర సారస్వతమున మొత్తముమీద ఇంత విపులముగా నాట్యోపక్రమోప సంహారములను విశదీకరించిన మరొకపట్టు ఎచ్చటను లేదు.

తరువాత కొద్దికాలానికే మరొక భారతగాథగా పరిణమించిన పల్నాటి వీరచరితలు విన్నవాళ్ళను ఉఱ్ఱూత లూగిస్తూ దేశమంతా ప్రాకిపోయినవి. ఏకవీరాదేవి జాతరలో వీటిని జనసామాన్యానందానుభవంకోసం పాడేవారని వినుకొండ వల్లభామాత్యుండు క్రీడాభిరామంలో—

'ద్రుతతాళంబుగ వీరగుంభితకథల్
ధుంధుం కిటాత్కార సం
గతి వాయింపుచు నాంతరాళిక యతి
గ్రామాభిరామంబుగా
యతిగూడం ద్విపదప్రబంధమున వీ
రానీకముల్ బాడె నా
కృత ప్రత్యక్షరముల్ గుమారకులు ఫే
ట్కారంబునన్ దూలఁగన్.'

కోమలి యొకతె వీరగాథలు పాడుతుంటే పొంగి పరవశులై కొందరు—

"గర్జించి యరచి జంఘా కాండ యుగళంబు
వీరసం బెట క్రోల వ్రేయు నొకడు,
ఆలీఢపాద విన్యాస మొప్పగ వ్రాలి
కుంతాభినయము గైకొను నొకండు
బిగువు కన్నుల నుబ్బు బెదరుచూపులతోడ
ఫీట్కార మొనరించు పెలుచ నొకడు
పటు భుజావష్టంభ పరిపాటి ఘటియిల్ల
ధరణి యాస్ఫోటించి దాటు నొకడు
ఉద్ది ప్రకటింప నొక్కరుండోల నాడు
బయలు గుర్రంబు భంజుళ్ళ పరపు నొకడు
కోడుము దాటింపుచును పెద్ద కొలువులోన
బడతి పల్నాటి వీరుల బాడునపుడు"

అని వల్లభరాయడు విశేషపరిశీలనాపూర్వకమైన వర్ణన చేశాడు. గుర్రపు భంజళ్ళు మహాకవి పింగళిసూరన్నను కూడా ఆకర్షించినవి. ఆయన ప్రభావతీప్రద్యుమ్నంలో ఉదాత్తనాయకుడైన ప్రద్యుమ్నునిచేత గుర్రపు భంజళ్లు త్రొక్కించాడు.

ఈరీతిగా దేశీయమైన నాట్యము, సంగీతము విస్తారంగా ఆరోజుల్లో ప్రచారంలో ఉండటము చేతనే తిక్కన దృష్టికూడా వాటిమీద నిలచింది. అర్జునుణ్ణి విరాటరాజు కొలువులో ప్రవేశపెట్టేటపుడు దేశినాట్య ప్రవర్తకుడుగా సూచించాడు.

"ఒండు పనులకు నెఱవు లేకునికి జేసి
అభ్యసించితి శైశవ మాదిగాగ

దండలాసక విధమును గుండలియును
బెక్కణంబు తెరంగును పేరణంబు"

అని అర్జునుడిచేత అనిపించాడు.

తిక్కన భారతాన్ని గణపతిదేవునికి వినిపించి అతని సహాయంతో మనుమసిద్ధికి తిరిగి రాజ్యం సంపాదించి పెట్టినట్లు సోమదేవరాజీయంవల్ల తెలుస్తున్నది. వీరశైవ మతము దేశీయమైన సమస్తవిద్యల మీదికి ఆనాటి ఆంధ్రుల దృక్పథాన్ని మార్చినట్లుగా కనిపిస్తున్నది. కాబట్టి తిక్కనకవితలో గాని ప్రాచీనులలో కాని దేశీయముద్ర విపరీతంగా గోచరిస్తున్నది. తిక్కన తననాటి తోలుబొమ్మలాటలనుంచి సూత్రధారులనుంచి ఎన్నో ఉపమానాలు గ్రహించి కావ్యాలల్లో ప్రయోగించాడు. ఉదాహరణముగా—

కీలు కా డెడలింప గెడసిన బొమ్మల
కైవడిఁ బటుతురంగవ్రజంబు - కూల -
ద్రోణపర్వము, ౩ ఆ.

చలమున దుస్ససేనుఁడును
సౌబలుఁడున్ మిముఁబట్టి యార్వబొ
మ్మల క్రియ నాడుచుండుదురు
మానక నీవు సుయోధనుండు.
— ఉద్యోగపర్వము.

గణపతిదేవ చక్రవర్తి బావమరది జాయసేనాధిపతి నృత్తరత్నావళి వ్రాసినాడు. అది యింకను అముద్రితము. కాకతీయులు వీరశైవంతోపాటు కాలాముఖ పాశుపత శైవాలకు కొంత దోహదక్రియ చేశారు. పాశుపత గోళకీ మఠానికి గుంటూరు జిల్లా మల్కాపురంలోని భూమి కొంతదానం చేస్తే ఆమఠాధిపతి కాకతీయుల మతగురువు విశ్వేశ్వర శివదేశికాచార్యులు గుడికట్టించి దానికి ఇద్దరు నర్తకులను, అయిమగురు ఆవజకాండ్రను తగిన వాద్య సంపత్తి ఇచ్చినట్లు మల్కాపుర శాసనం వల్ల తెలుస్తున్నది.

వీరి కాలంలో దేవాలయాలకు సంబంధించిన గాంధర్వ విద్యా ప్రవీణలైన దేవదాసీగా కాకుండా కళాప్రవీణలైన గణికలు అనేకమంది ఉండేవాళ్ళు. వాళ్ళ జీవితాలు లోకానికి నాటకాలుగా కూర్చి ఆడతగినట్లుగా ఉండేవని వినటానికి మన కెంతో ఆనందం వేస్తుంది. క్రీడాభిరామంలో ఒక వారాంగనవిషయము మాటల మధ్య వచ్చినప్పుడు వంచన శర్మ టిట్టిభసెట్టితో—

లెస్సగాక కిరాట! ఈ లేమచరిత
మాడుదురు నాటకంబుగ నవనిలోన"

అని చెప్పాడు.

కాకతీయ సామ్రాట్టులలో చివరవాడు ఢిల్లీ పాదుషా చేత బందీకృతుడైన ప్రతాపరుద్ర దేవుడు. పాదుషా ఇతన్ని పట్టుకో పోయిన తరువాత కొలది కాలం కాపయనాయకు డనే సేనాని వివిధ ప్రాంతాలు సామ్రాజ్యంలో నిలచి చీలిపోకుండా, సేనాధిపతులు స్వాతంత్ర్యం ప్రకటించకుండా కాపాడటానికి ప్రయత్నించాడు. కాని, అతని ప్రయత్నాలు నిష్ఫలములై పోయినవి.

క్రీ. శ. 14శతాబ్ది మధ్యభాగంలో బృహదాంధ్ర దేశము ఐదు రాజ్యాలుగా ఏర్పడి పోయింది. (౧) కొండవీడు, (౨) రాచకొండ, (౩) కోరుకొండ, (౪) పిఠాపురము, (౫) విజయనగరము. వీరందరూ కళాపోషణ విషయంలో కాకతీయుల అడుగు జాడల్లో నడిచారు. కొండవీటి రాజ్యస్థాపనాచార్యుడు ప్రోలయ వేమారెడ్డి. ఎర్రాప్రగడ హరివంశ రామాయణాల కృతిభర్త. ఎర్రాప్రగడ హరివంశంలో శ్రీకృష్ణుని జలక్రీడలు వర్ణించే సందర్భంలో—

"లలిత గగన రంగంబున
నలయక క్రొమ్మెఱుఁగు గొండ్లియై యాడెడుచో
నలవడియె మొగులు దెరలును
బొలపగు వడగండ్లగములు పుష్పాంజలులున్.
హరివంశము - పూర్వభాగము ౬ ఆ. ౧౦౯

అని నాటకపూర్వ రంగాన్ని ఉద్ఘాటించాడు. ప్రోలయ వేమారెడ్డి కుమారుడు అనవేమారెడ్డి. ఇతడు కంచి, రన్ని, పొన్ని అనే ముగ్గురు నాట్యశాస్త్రాభిజ్ఞాత లైన నట్టువరాండ్రను అగ్రహారా లిచ్చి పోషించాడట. ఈ వంశాలలో కుమారగిరిరెడ్డి వసంతరాజీవ మనే నాట్యగ్రంథ మొకటి వ్రాసి దాన్ని లకుమాదేవి ద్వారా లోకంలో ప్రచారానికి తీసుకోవచ్చాడు. ఇతని కాలంలో వసంతోత్సవాలు విపరీతంగా జరిగేవి. అవచి తిప్పయసెట్టి జావా, బోర్నియో మొదలైన విదేశాల నుంచి సుగంధాలు తెప్పించి పెటుతూ సుగంధ భాండాగారాధ్యక్ష పదవిని వహించాడు. ఆ మదనోత్సవాలల్లో సంగీత నాట్యకళకు ఉపకృతి ఎంతో జరిగి ఉండి ఉంటుందని మన మూహించవచ్చును. కొమార

గిరి రెడ్డికి అనంతరము రెడ్డిరాజ్యము రెండుగా చీలి పోయినది. ౧ కొండవీటి రెడ్డి రాజ్యము ౨ రాజమహేంద్రవరము రెడ్డిరాజ్యము. కొండవీటిరెడ్డి రాజ్యానికి కొమారగిరి తరువాత ప్రభువు పెదకోమటి వేమారెడ్డి గొప్ప విద్వాంసుడు, సర్వజ్ఞ బిరుదాంకితుడు. మతంగ దత్తిలుల మతాన్ని ఆధారంగా చేసుకొని ఒక ప్రత్యేక నాట్యశాస్త్రాన్ని వ్రాశాడు. ఇది క్రొత్తగా శాస్త్రంలో పరిచయం చేసుకుండే వాళ్ళకు సహాయకారి ఔతుం దని విద్వాంసుల అభిప్రాయము. ఇతని కుమారుడు కొలది సంవత్సరాలు రాజ్యం చేశాడు. అతనితో కొండ వీటిరెడ్డి రాజ్యం విచ్ఛిన్నమైపోయినది.

కొమారగిరిరెడ్డి బావమరది కాటయ వేమారెడ్డి. రాజ మహేంద్రవర రెడ్డిరాజ్యానికి మూలపురుషుడు. ఇతనికి పురుషసంతానం లేకపోవటమువల్ల రాజ్యం కూతురైన అనితల్లికి సంక్రమించింది. ఆమె భర్త వీరభద్రారెడ్డి. 'వీరభద్రారెడ్డి విద్వాంసు ముంజేత వియ్యమందెనుగదా పెమరుగొడియు' వీరభద్రారెడ్డి, అతనిఅన్న వేమభూపా లుడు. ఇతడు 'ఆంధ్రక్షమామండలాఖండలుండైన వేమభూపతి కృపావీక్షణంబు' వేమభూపాలుడు. ఈ రెడ్లు శివపూజాధురంధరులు. శ్రీనాథమహాకవి కొండ వీటిలో తనకు నిలువనీడ తప్పిన తర్వాత వీళ్లను ఆశ్రయించి కాశీఖండ, భీమఖండాది కృతులు చెప్పాడు. వీరు శివపూజ చేసుకుండేసమయంలో

"వల్లకిచక్కి కాహళము వంశము ఢక్కహుడుక్క
ఝుర్ఝురుల్
ఝల్లరి యాదిగా గలుగు శబ్దపరంపర తాళశబ్దమై
యుల్లసిలం బ్రబంధముల కొప్పుగ నాడుదు రగ్రవేదిపైఁ
బల్లవపాణులీశ్వరుని పంటమహీశులు పూజసేయగన్"

'హిందోళంబున బాడి రచ్చరలు భీమేశుం
ద్రిలోకాధిపు' —భీమఖండము

'పాడి రంగనల్, దేశివిధంబు మార్గమున తేటయు
నొక్కట సాళగింపఁగన్' —నైషధము

'కీర్తింతు రెడ్డాని కీర్తి గంధర్వులు
గాంధర్వమున యక్షగానసరణి"

'బెండపూడి అన్నయామాత్యుండుకట్టించిన మొగసాల వాకిటి మహోత్సవ మంటపమునందు పేరోలగంబుండి "కుండలీ, దండలాసక, ప్రేరణ, సింధు, కందుక, ధమాళి, చేలమతల్లీ, హల్లీసకాది నృత్యంబుల నవలోకింపుచు, బంతంబులవధరింపుచు, మేలంబులాలకించుచు జంపూచాటు నాటకోదాహరణ జయఘోష చక్రవాళ చతుర్భద్ర చతురాత్రిప్రబంధంబు లాకర్ణింపుచు."

భీమఖండము.

'కుండలీ నృత్యంబు కోహళాద్యాచార్య
మతభేదముల దేశి మార్గసరణి
చారి కాకరణాంగహార రేచకముల
భ్రమరి కాళుల నర్తనగతులను
చాముండి యొనరించు జంపెతాళమునకు
భృంగీశ్వరుం డాడెఁ బ్రేరణంబు

ఇత్యాది సంగీత నాట్య సంబంధములైన ప్రయోగములు శ్రీనాథునిలో యింకా ఎన్నో చూపవచ్చును.

పిఠాపురరాజ్యము ఎక్కువకాలం నిలువలేదు. కోరుకొండ రాజుల్లో ముమ్మడినాయకుని తమ్ముడు సింగమ నాయకుడు గొప్పకళాభిమానిగా కనబడుచున్నాడు.

ఒకానొక శాసనములో

'వీణా వాదన కోవిదేన విలసల్లాస్యప్రశస్యశ్రియా సారస్యాస్పద గానమాన విధినా సౌజన్యమానాత్మనా నిత్యైశ్వర్య విలాసినా నిరుపమాకారేణ కాంతాజనే నాయంకూనయభూపసింగతిలకః క్రీడన్ సదా మోదతే.

అని ఉన్నది.

కొండవీటి పెదకోమటి వేమారెడ్డితోను, విజయనగరము ప్రౌఢ దేవరాయలతోను కీర్తిస్పర్ధవల్ల సమానంగా కవితా పోషణము చేసిన సర్వజ్ఞ సింగభూపతి గాన నాట్యాలకు పోషణ మిచ్చినట్లు కనబడదు. కాని మహాకవి పోతన్న వీరభద్ర విజయము ఆయనకు అంకిత మిచ్చాడు. ఆయన రాజ్యంలో ఉన్న ఓరుగంటిలో నివాసం చేశాడు. పోతన్న భాగవతంలో,

'వినుము దేహధారి స్వతంత్రుడు కాడు. జంత్రకాని చేతిజంత్రపుబొమ్మకైవడి నీశ్వరతంత్రపరాధీనుండయి దుఃఖంబులందు నర్తనంబు సలుపు"

దశమస్కంధము ఆ ౨.

ఇక విజయనగరరాజుల గాంధర్వ విద్యా పోషణము నకు వత్తాము. ప్రతాపరుద్రుని భాండాగారాధ్యక్షులుగా ఉన్న హరిహరబుక్కరాయులు విద్యానగర రాజ్యస్థాపకులు. విద్యారణ్యులవారు వారికి మహామంత్రి. ఆయన సంగీతసార మనే శాస్త్రగ్రంథమొకటి వ్రాసిరట. అందులో ౨౬౪ రాగాలు. ప్రత్యేకంగా

సూచించిన ట్లితరగ్రంథప్రమాణాలవల్ల తెలుస్తున్నది. ఆగ్రంథం మాత్ర మిప్పుడు ఖిలమై పోయినది.

బుక్కరాయలు, మహాకవి నాచన సోమనాథునికి పెంచుకల దిన్నె గ్రామ మిచ్చి గౌరవించినట్లు మన అందరకును తెలిసిన విషయమే. సోమనాథుడు ఉత్తర హరివంశంలోను వసంతవిలాసంలోనూ సంగీత నాట్య ప్రశంసలు ఎన్నో చేశాడు.

ఉదాహృతులు:

'పడగు పన్నగ రాజు పడగలమీద స
ర్వంసహా కాంత పేరణము సూప
నుబ్బాత లూగెడు నుదయాస్త గిరులతో
న్నా కాశలక్ష్మి కోలాట మాడ
తెరలెత్తి సప్తసాగరములు పొరలంగ
వరుణుడు గొండిలి పరిఢవింప
మొకములు చాయ వేరొక చందముగ సిల్పి
కమలసంభవుడు పేరింఖణ మొనర్ప
మంగలములోని పేలాల మాడ్కిc జుక్క
లిక్కడక్కడ పడ దిక్కు లెనిమిదియును
బగుల పాతాళతలము గుబ్బటిల జెలగె
శౌరి పూరింప నపప్పంచజన్యరవము.

వసంత విలాసములో

అత్తరి విట నాగరములు
చిత్తమున వసంత కాళి చిగురొత్తంగా
మొత్తములు గట్టి తెచ్చిరి
ముత్తెపు ఝల్లరులతోడి బుట్టట బొమ్మల్.

హరి వంశములో:

'కమలముఖీ కటాక్ష కట
కాముఖపాణి నఖోప కారి వి
భ్రమమణి పుంఖ రింఖ దభి
రామరుచుల్ కరమొప్పc జెక్కులం
జెమటల పత్రభంగములు
చిందరవందర లైనc దోన సం
భ్రమమున వీరలక్ష్మి సమ
రక్రమరక్షకు వ్రాసెనో యనన్.'

'ఒక రామాతిలకంబు రత్నరుచితో
నొప్పారు మందార కో
రకమున్ కర్ణవతంసతన్ నిలుపుచున్
రాగాలతాసక్త చూ
చుక చేలాంచలయై మలంగి విడు మం
చున్ గేలుసాచెం ససా
యక మార్విం దెగ గొన్న మన్మథుని ప్ర
త్యాలీఢ పాదంబునాన్.

పుండరీకాక్షునకు శౌరి పూజ లిచ్చె
సంయములు చూడ బదరికాశ్రమమునందు
నాగ విందు మయ్యూరపుర నాటకంబు
చెవుల పడవేసి పండుగు చేయు మనఘ.

వసంతవిలాసంలో:

వీణా గానం వెన్నెల తేట
రాణమీరగా రమణుల పాట
పేదలైన పినబాహ్మణు వీట
జాణలు మెత్తురు జాజరపాట

ఈ జాజరపాటను తరువాత ఎంతో కాలానికి దామెర్ల వెంగళ భూపాలుడు బహుళాశ్వచరిత్రలో ప్రయోగించాడు.

శ్రీనాథుని 'దీనారటంకాలతో తీర్థమాడించిన' ప్రౌఢదేవరాయలు, సారంగ దేవుని సంగీతరత్నాకరానికి వ్యాఖ్య వ్రాసిన కల్లినాథుణ్ణి, సంగీత ముక్తావళి కర్తను దేవనభట్టును పోషించాడు.

సాళువ నరసరాయల కాలంలోనే మొదటి యక్ష గానం పేరు చెవిని పడుతున్నది. అదియును ప్రస్తుతము ఉపలబ్ధం కాదు. కర్త చెన్నశౌరి. నృసింహ పురాణంలో

'సౌరభిచరితంబు జక్కుల కథ జెప్పి
లాలిత నవరసాలంకృతముగ'

నారసింహ పురాణము - హరిభట్టు.

సాళువ వంశం తరువాత తుళువ వంశము రాజ్యం చేసింది. అందులో సర్వవిధముల సుప్రసిద్ధుడు శ్రీకృష్ణ దేవరాయలు. సంగీత నాట్య శిల్పాలు మూడుఅన్యోన్యాశ్రయాలై ఇతని కాలంలో విలసిల్లినవి.

చివరకు దుఃఖాన్నికూడా సంగీతదృష్ట్యా ఆలోకించారు. శిల్పంలో ''సరిగమ పధనిస స్వరవల్లకీతుల్య రవవిరోబాస్తంభ రాగఘణితి'' గమనింపతగ్గది. ప్రబంధ

నాయిక లందరిని కళాభిజ్ఞలను చేశారు కవులు. వాళ్ళ చేతుల్లో ఏదో రకమైన వీణ ఉండక తప్పదు. పెద్దన్న వరూధిని చేతిలో 'సర' మనే దేశీయవీణను నిలిపినాడు.

"తరుణాంగుళీచ్ఛాయదంతపుసరకట్ల
నింగిలీకపు వింతరంగు లీన —మనుచరిత్ర.

'కిన్నర' వీణకూడా ఆ రోజుల్లో ప్రచారమందున్న ట్లున్నది. కవితా లక్షణాలను గురించి పెద్దన్న చెప్పిన చాటువులో,

"కిన్నర మెట్ల బంతి సంగాతపు సన్నతంతు"అన్నాడు. 'నయగాపు కన్నడి, గౌళపంతు' ఇత్యాది రాగాలను తెలుసుకుంటే గాని కవితాలక్షణాలు తెలియవు.అయన కవితావిమర్శ చేస్తూ ఇవి ప్రయోగించటముచేత ఆనాటి రసికజనానికి వివిధ రాగాల్లలో విశేషపరిశ్రమ ఉన్న దని మన మూహించవచ్చును. రాయలనాటికి వీణమెట్లు ప్రస్తుతకాలంలోవలె బిగించి (Fixed) ఉన్నట్లు కన బడదు. అవి సమయాన్ని, పాటకుని గొంతు, రాగాన్ని అనుసరించి మార్చుకొనేటట్లు కనబడుతున్న ది.

మనుచరిత్రలో వరూధిని విరహవర్ణన సందర్భమున –

"వాలారుం గొనగోళ్ళ నీ వలసతన్
వాయించు,చో నాటకున్
మేలంబైన విపంచి నిన్న మొదలున్
నీ వంటమింజేసి యా
యాలాపంబె ఆవేళ పల్కెడు ప్రభా
తాయాతవాతాహతా
లోలత్తంత్రిల మేళవింప గదవే
లోలాక్షి దేశాక్షికిన్"

---

ఆనాటి జనసామాన్యానికి కూడా ఎంతపరిచయముంటే ఈవిధంగా చెప్పటమే కాకుండా "దేశాక్షి"రాగాన్ని ప్రయోగించి ఉండాలి?

పెద్దన ఒక్కడే కాదు, రాయలు కోరినాఅంకితమివ్వని రాధామాధవ కవి రాధామాధవములో

"కొలదిగ రాగభేదముల
కల్ దగుసారెలు సారెకొత్తి తం
త్రులు కొనగోళ్ల మీటుచు జ
నుంగవ దండె యమర్చి కృష్ణలీ
లలు ప్రకటించి పంచమ క
ల శ్రుతి మాకు లిగుర్ప రాధకున్
వలపులు చిల్కగన్ మధుర
వాణి ప్రవీణత౯ బాడె వీణతోన్"

అని రాధ విరహావస్థను వర్ణించాడు.

సంగీతానికి ఆరోజుల్లో ఎంత ప్రాధాన్యం లేకపోతే, అయన మనస్సులో సంగీతము ఎంతగా జీర్ణము కాక పోతే, రాయలు ఆముక్తమాల్యదలో

"వేవిన మేడపై వలభి
వేణిక ఒంటవహించి విప్పగా౯
బూవులు గోటమీటు తరి
పోయెడు తేటులమ్రోతలేమి శం
కావహమౌ౯ గృతాభ్యసన
లోటను దంతపుమెట్ల పెంబడి౯
చేవడి వీణమీటుటలు
చిక్కడలించుటలు౯ సరిబడ౯"

అన్న పద్యంలోని భావమునకు అవకాశమెంటుందో ఆలోచించవలసిన విషయము.

రాయల రాజ్యపరిపాలనాకాలంలో 'నాట్యకళ' అభివృద్ధిపొందినట్లు మనుచరిత్రలో

"చిలుకల కొల్కి కల్కియొక
చేడియ నాటకశాల మేడపై
నిలువున నాడుచుండి ధర
ణీపతి చూడ౯దలంచి యంచున౯
నిలచి రహిం గనుంగొనుచు
నెయ్యమునన్ తనువల్లియుబ్బ కం
చెల తెగబడ్డ కేతనము
చీరచెరంగున మూసె౯ జన్నులన్"

అనే పద్యమువల్ల వ్యక్తమాతున్నది. ఇక్కడ "కంచెల" అనే శబ్దానికి నాట్యం చేసేటపుడు బిగుతు కోసం తొడుగుకొనే చనుకట్టు అని వ్రాసి అర్థము చెప్పాడు. రాయలు తోలుబొమ్మలయాటలను ఒక సంస్థగా లెక్కించి దానిమీద కాళన అనే అతనిని అధికారిగా నియమించాడు. ఇతని కాలంలోనే 'కొరవంజి' కి మొదట ఆదరము దొరకిరది. రామాభ్యు దయంలో అళియరాజు—

జక్కిణి కొరవంజి వేషముల కేళిక సల్పిరి
దేవతా నటీ, మణులకు బొమ్మ పెట్టు క్రియ—

ఇక్కడ కేళిక శబ్దానికి నాట్యమని అర్థము.

పదాలను, ఏలలను, సంకీర్తనలను రాయల కాలంలో తిరుమలనుంచి తాళ్ళపాకవారు ప్రచారంలోకి తీసుకొ వచ్చారు.

“చిన్నన్న ద్విపద కెరగును
పన్నగ పెదతిరుమలయ్య పదమున కెరగున్.”

అనేచోట ఉన్న పెదతిరుమలయ్య పదకవితాపితామహుడు. వీరు వ్రాసిన వివిధకృతులు తిరుపతి దేవస్థానంలో రాగిరేకుల మీద బండ్లకు పడి ఉన్నవి. స్త్రీ జన సారస్వతానికి కూడా ఆరోజుల్లో గౌరవముండేది. పెద్దన “మధుర కిన్నరీ నిక్వాణంబుల రాణం ద్రాణ చెరచు లక్ష్మీనారాయణుల కల్యాణంబు పాటలం దీటుకొను తిన్నసిరవంబుల” అని వాటికి స్థానమిచ్చాడు.

శాస్త్రగ్రంథాలను కొన్నిటిని రాయలు పోషించాడు. లక్ష్మణభట్టు కర్ణాటరాగాలను విభజించి మళ్ళా సక్రమమైన పద్ధతిలో పెట్టి సంగీత సూర్యోదయ మనే శాస్త్ర గ్రంథం వ్రాశాడు. కామదేవవిలాస మనే సంగీత నాట్య శాస్త్రగ్రంథ మొకటి రాయల కాలంలోనే పుట్టింది.

కృష్ణరాయల అల్లుడు అళియ రామరాయలు. సంగీత కళాభిమాని. బయకారము రామయామాత్యుడు వ్రాసిన సంగీత శాస్త్రానికి కృతిభర్త.

తల్లికోట యుద్ధానంతరము విజయనగరాధిపతులు పెనుగొండ, చంద్రగిరులకు పారిపోయి రాజ్యం చెయ్యటము ప్రారంభించారు. అప్పుడు కూడా వెనుకటి నుంచీ వస్తూఉన్న కళాభిమానం వాళ్ళను వదిలిపెట్ట లేదు.

వారిలో తిరుమలరాయలు భట్టుమూర్తికి ఆశ్రయుడు. భట్టుమూర్తి కృత్యాదిలో “సద్యశ్శృతగ్రంథకల్పను సంగీతకళారహస్యనిధి పిల్వంబంచి పల్కెన్ కృపన్” అని చెప్పుకొన్న మాటలలో అతిశయోక్తి ఏమాత్రమూ లేదు. ఆయన “లలనా జనాపాంగ” ఇత్యాది సీసాలు, కొన్ని వచనాలు సంగీత విద్వాంసులు వీణమీద వాయించారట.

వసుచరిత్రలో “హారనుల్ కుఱుచలుద్రొక్క” అనే ప్రయోగ మున్నది. దీనికి శబ్దరత్నాకరకారులు ఒక నాట్యవిశేష మని వ్రాసియున్నారు. ఇది బహుశః దేశీయ నాట్యము కావచ్చును.

ఈ ప్రాంతాలలోనే గోదావరీప్రాంతనివాసి సోమనాథుడనే సంగీతశాస్త్రవేత్త ప్రమాణగ్రంథ మొకటి రచించినట్లును అది కొంతకాలము నిలిచి తరువాత ఖిలమైపోయినట్లును సంగీత సారామృతాది శాస్త్ర గ్రంథాలవల్ల తెలుస్తున్నది.

తిరుమలరాయలు గీతగోవిందంమీద ఒక వ్యాఖ్యానాన్ని అంకితం పుచ్చుకొన్నాడు.

ఈరీతిగా శాస్త్రగ్రంథాలను, నట్టువరాండ్రను, సంగీత శాస్త్రజ్ఞులను పోషించటమే కాకుండా అనేక దేవాలయ ప్రతిష్ఠలు చేసి దేవదాసీలను నిల్పి, కట్టుబడులు ఏర్పరించి సంగీతనాట్యశాస్త్రముకు సేవచేశాడు. దక్షిణదేశంలో తంజావూరు, మధుర రాజ్యాధిపతులు ఆంధ్రులు. తల్లికోట యుద్ధానికి కొంచెము ముందుగా ఈ రాజ్యస్థాపన జరిగింది. తెలుగురాజులు కావటం చేత వారు తెలుగు కవులను, గాయకులను, వాగ్గేయకారకులను, సంగీతనాట్య శాస్త్రవేత్తలను తమతో బాటు దక్షిణదేశానికి పిలుచుకొని పోయినారు.

తంజావూరును మొదట ఆంధ్రులు, తరువాత మహారాష్ట్రులు పరిపాలించారు. తంజావూరు ఆంధ్రనాయకుల్లో ప్రముఖుడు, కవి, గాయకుడు లక్షణవేత్త, పండితుడు, సర్వజ్ఞుడు అయిన రఘునాథరాయలు సంగీతము మీద సంగీతసుధ, భరతము మీద భరతసుధ, రచించాడు. సంగీతసుధ గ్రంథకర్త మొదట వ్రాసినప్పుడు ౭ అధ్యాయాలట. మనకు ప్రస్తుతము, ౪ అధ్యాయాలు మాత్రమే దొరుకుతున్నవి. ఎంతో సంగీత శాస్త్రాన్ని బాగా అవగతము చేసుకొన్నవాళ్ళుగాని, యింత ఉద్గ్రంథాన్ని వ్రాయటము అసంభవమని శాస్త్రజ్ఞుల అభిప్రాయము. రఘునాథరాయలు ౫౦ రాగాలను ౧౫ మేళకర్తలక్రింద విభజించాడు. దక్షిణ దేశంలో పుట్టిన ఉత్తమ శాస్త్ర గ్రంథాలలో ఇది ప్రథమ శ్రేణికి చెందినది. ప్రాచీనులు అన్ని రాగాలకూ అంశ, న్యాస, గ్రహాలు తప్ప ఇతర విషయాలు పేర్కొ లేదు. ఇతను శ్రుతి, స్వర, అలప్తికలనుకూడా చేర్చి

నాడు. ఈ మహాగ్రంథానికి గురువుగారైన గోవింద దీక్షితులవారు వ్యాఖ్యానం వ్రాశారు.

రఘునాథరాజు వీణా వాదనలో దిట్ట. దీక్షితులవారు :

జయంత సేనాదిమ రాగరామా
నందాది తాళాన్ రచయన్ నవీనామ్
సంగీత విద్యాంస ముపాదిశ త్స్వమ్
విపంచికావాద విచక్షణానామ్''

అని ఉల్లేఖించారు. రాయలు వీణలలో నాలుగు రకాలను సూచించి వాటి మెట్ల అమరికను కొంత చర్చించాడు. రఘునాథుడు తన పేరుమీద ప్రచారంలోకి రఘునాథమేళ అనే నూతన మేళ ఒకటి కల్పించాడు. ఇతని ఆస్థానంలో సంగీతశాస్త్రంలో నిధులు - స్త్రీ, పురుషులు అనేకమంది ఉండేవాళ్ళట. సంగీతసుధలో

"వాగ్గేయకార ప్రముఖై రనేకై
ర్విచిత్ర గీతాదికళాప్రవీణైః
తథైవ వీణాదిమ వాద విద్యా
విచక్షణైః క్వాపి నిషేవ్యమాణః" అని ఉన్నది.

ఇతనికి అనేకమంది నట్టువరాండ్రతో పరిచయముండి తీరాలి. తన కొలువులో వాళ్ళ నాట్యభంగిమల చిత్రవిచిత్రితాలు, హాసవిలాసాలు చూచినవాడు కావటంచేతనే ఇతని "శృంగార సావిత్రి" (తెలుగు ప్రబంధము)లో అశ్వపతి తపోభంగం చేయటానికి వచ్చిన అప్సరసల నాట్యవిన్యాసాల సహజంగా వర్ణించాడు. వెంకటమఖి రఘునాథరాయుని కొలువుకూటములో ఉన్న సంగీతశాస్త్రకారుల్లో ప్రముఖుడు. చతుర్దండిప్రకాశిక అనే శాస్త్రగ్రంథనిర్మాత. వీణ, శ్రుతి, స్వరము, మేళము, రాగము, ఆలాపనము, ఠాయ, గీత, ప్రబంధములు అనే ౧౦ అధ్యాయములతో నిండిన గ్రంథము చతుర్దండి ప్రకాశిక. వీణ మీద వెంకటమఖి ప్రత్యేకకృషి చేసినవాడు. రఘునాథుడు సూచించినవీణ మెట్ల పద్ధతిని అంగీకరించక సమస్తరాగాలకు సర్వకాల సర్వావస్థలలో ఒదిగేటట్లుగా మెట్లు సరస్వతీ వీణకే ఏర్పరచి వెంకటమఖి వీణకు ప్రస్తుత స్వరూపం రావటానికి కారణభూతుడైనాడు. ప్రప్రథమములో ౭౨ మేళకర్తలను ప్రవేశపెట్టినవాడు ఇతడే. వెంకటమఖి జయదేవుని గీతగోవింద మార్గాన్ని అవలంబించి ౨౪ అష్టపదులు త్యాగరాజస్వామి మీద చెప్పాడు.

కృష్ణరాయల కాలంలో కొద్దికొద్దిగా ప్రచారంలో ఉన్నట్లు కనబడుతున్న యక్షగానాలను రఘునాథరాయలు, అతని కుమారుడు విజయరాఘవరాయలు విశేషవ్యాప్తిలోనికి తెచ్చారు. ప్రజోపయోగార్థం రఘునాథరాజు నాటకశాలలను తనదేవిడీలో కట్టించినట్లుగా ఆయన అంకితం పుచ్చుకొన్న చేమకూర వెంకన్న విజయవిలాసం లోని.

"మాటల నేర్పులా, సరస
మార్గములా, కొలువుండు రీతులా
పాటలగంధులా, కళల
భాగ్యములా బహుదానలీలలా
నాటక శాలలా, యొకట
నవ్వల నెన్నిటచూడ నన్నిటన్
మేటియు కీర్తిలోలుడు జు
మీ రఘునాథనృపాలు డిమ్మహిన్
అనేపద్యం వల్ల తెలుస్తున్నది.

రఘునాథరాజు తండ్రి జీవిత చరిత్రను తీసుకొని అచ్యుతేంద్రాభ్యుదయ మనే యక్షగానం వ్రాసి తండ్రి యెదుట ఆడించి సంతోషపెట్టాడు అతని కుమారుడు విజయరాఘవరాయలు.

రఘునాథరాయలు గొప్ప విద్వాంసులదృష్టి యక్షగాన నాటకాల మీదికి త్రిప్పి వారు వ్రాసిన గ్రంథాలకు గౌరవము ప్రతిపాదించటానికి తాను అంకితము పుచ్చుకున్నాడు. ఎలకూచి బాలసరస్వతి వంటి మహోపాధ్యాయుడు ఒక వంక చంద్రికాపరిణయమువంటి ప్రౌఢ కావ్యము, నన్నయభట్టీయవ్యాఖ్య వ్రాస్తూ "కళ్యాణ కౌముదీ కందర్ప నాటకము" వ్రాసి రాయలకంకిత మిచ్చాడు. మరొక విద్వాంసుడు తాళచింతామణి వ్రాసి రాయలనే కృతిభర్తను చేశాడు. రాయల కుమారుడు విజయరాఘవరాయలు కళాపోషణం కోసమే రాజ్యాన్ని స్వీకరించినవాడు. 'సాహిత్యరాయ పెండాయుడు' 'శారదాధ్వజుడు' స్వయంగా ౨౦ యక్షగానాలు వ్రాసినవాడు. ఇతడు తండ్రి కలిసి వ్రాసి, వ్రాయించి ఆడించిన యక్షగాననాటకాలు 300 పైగా ఉన్నవి. ఈ నాటకాలు ఆడేటప్పుడు కూడా రంగులు వేసుకొని పాత్రోచితమైన వస్త్రధారణంతో ప్రజలను రంజింపచేసే వాళ్ళట. స్త్రీపాత్రలను ఈ నాటకాలల్లో స్త్రీలే ధరించేవాళ్ళు.

విజయ రాఘవరాయలు అంకితం పొందిన రాజశేఖర విలాసంలో చెంగల్వ కాళయ.

“పాపదంబులు సీత రూపవతీ కాంత
శబ్ద చూడామణి చంపకాఖ్య
చెలువగు జక్కిణి చెలువమూర్తివధూటి
కోదమ కోమలవల్లి గురునితంబ
నవపదంబులు లోకనాయికాలోలాక్షి
యల దేశి శశిరేఖికాబ్జనయన
తురు పదంబులు రత్నగిరి నితంబినియును
పేరణి విధము భాగీరథియును
మదనపద ద్యోత నవరత్న మాలికాది
బహువిధాలక్ష్య నాట్య ప్రపంచమెల్ల
ఘనత విలసిల్ల తక్కిన కాంతలెల్ల
నభినయించిరి తమ నేర్పు లతిశయిల్ల”

అని విజయరాఘవుని కాలంలో ప్రఖ్యాతి పొందిన కొందరు నట్టువరాండ్రను, వారి వారి ప్రత్యేకతలను గురించి పేర్కొనినాడు.

విజయరాఘవుని రాజ్యపరిపాలనలోనే పదకవితా చక్రవర్తి క్షేత్రయ్య మధుర భక్తిరసప్రపూర్తమైన తన జావళీలు లోకంలో ప్రచారంచేశాడు. చాలా కాలం విజయరాఘవుని ఆస్థానంలో గౌరవం పొంది తదుపరి మధుర, గోల్కొండలకు సంచారార్థం పయనమైపోయినాడు. వివిధ పుణ్యక్షేత్రాలు దర్శించాడు. ‘మేరు నిఘంటువు’ లెక్క ప్రకారము క్షేత్రయ్య పదాలు ౪౦౦౦. ప్రస్తుతము మనకు చాలా కొద్దిగా లభిస్తున్నవి. గేయ కవితాప్రపంచంలో పాత్రవైవిధ్యానికి, మానస వ్యక్తీకరణానికి, స్ఫుటరూపచిత్రణానికి క్షేత్రయ ప్రక్కనేవని నిలవగలవాడుగాని నిలుపతగ్గవాడుకాని లేడని చెప్పవచ్చు ఒకమాట. శ్రీ రాళ్ళపల్లి అనంత కృష్ణ శర్మగారు వ్రాసిన విమర్శ క్షేత్రయ్యపదాలను అవగతంచేసుకోటానికి మిక్కిలి సహాయకారి.

ఆయన ‘ఇతని పదాలల్లో మొగబొమ్మలు నేరుగా మన కంటిముందు కనబడరు. వారి నాడించు సూత్రధారిణులు స్త్రీలు. నే నెరింగినంతలో స్త్రీస్వభావము నందలి వైవిధ్యమును, అందచందాలను ఇంత సుకుమారంగా, గంభీరంగా త్రిచ్చి చూచినవాడు లేడు. ఆ కాలపు స్త్రీల వలపు, మోహము, భక్తి, త్యాగము, క్షమ, ఆశ, నిరాశ, అసూయ, ఆడంబరము, అహంకారము, కోపము, దైన్యము, ఆనందము, తృప్తి, మౌగ్ధ్యము ప్రౌఢి - ఇత్యాదుల నన్నిటిని నిష్కపట సుకుమార చిత్రములందు (ఈయన పదాలల్లో) చూడవచ్చును. స్త్రీలలో స్వీయ, పరకీయ, సామాన్య, కన్యాజాతులను నాల్గింటిని సమాన ప్రీతి గౌరవాలతో ఇందులో పొందించాడు. ఆడది యెట్టిదైనను, దాని అవస్థ యెట్టిదైనను, అలక్ష్యముతో గాని, అగౌరవముతో గాని, అత డెప్పుడూ చూడలేదు. మొత్తముమీద ఇతని సాహిత్య మంతయు ఆ కాలపు స్త్రీల ఆధ్యాత్మిక కథ యనవచ్చును. అందును దయనీయమైన కరుణకథ” అని వ్రాసినారు. ఇందులో అత్యుక్తి యేమాత్రమూ గోచరించదు. క్షేత్రయ మోహనరాగం - జంపె తాళంలో వ్రాసిన ‘మగువ ఏకాంత మందిరము వెడలెన్’ అనే దివ్యవనితా సౌందర్యనిరూపణము మొదలుకొని, ఆహిరి - చాపుతాళంలో వ్రాసిన “పచ్చి యొడలిదానరా, పాపడు నెలవాడు వచ్చి కూడుటకు వేళగాదు” అన్నంతవరకూ ఆయన లేఖినీవిహారభూమియే. మధుర విజయరంగ చొక్కనాథుడు, పుదుకోట రాయ రఘునాథ తొండైమాన్ మొదలగు రాజులు రఘునాథ విజయ రాఘవరాయలతో కీర్తిస్పర్ధ వహించి సాయశక్తులా సంగీతనాట్యకళలకు సేవ చేశారు.

మైసూరు, కాళహస్తి ప్రభువులమీద వాగ్గేయ కారులు చెప్పిన కృతులు, జావళీలు అప్పుడప్పుడు ఆంధ్రదేశంలో వినిపిస్తూ ఉంటున్నవి.

గోల్కొండ నవాబులు ప్రత్యక్షంగా పోషణచేసినట్లు కనబడక పోయినా భక్తరామదాసు తన కీర్తనలతో కొంత భక్తిప్రబోధం వీరి పాలనలో చేశాడు.

క్రీ. శ. ౧౬౭౬ లో తంజావూరు శివాజీ మహారాజు సవతి తమ్ముడు ఏకోజీ వశం చేసుకున్నాడు. అతని వంశస్థులు పూర్వము ఆంధ్రనాయకుల అడుగు జాడల్లో నడిచి ఎన్నో యక్షగాన ప్రబంధాలు స్వయంగా వ్రాసి ఆడించారు. వంశంలో షాజీ ప్రముఖుడు ఇతని వద్దనున్న వాగ్గేయకారుల్లో ‘గిరిరాజకవి’ ప్రముఖుడు. శాహేంద్రవిజయకర్త. ఈతడు త్యాగరాజస్వామి తాత అయిన గిరిరాజకవి అని కొందరు పొరపాటు పడుచున్నారు. కాని అది సమంజసమైన ఊహ కాదు. శాహేంద్రవిజయకర్త గోత్రము లోహిత గోత్రము. ఇంటిపేరు దర్భవారు. త్యాగరాజు వంశస్థులు కాకర్ల

వారు. భారద్వాజసగోత్రులు. షాజీ తరువాత రాజ్యానికి వచ్చిన తుళజ స్వయంగా ఎన్నో తెలుగు యక్షగానాలు వ్రాశాడు. ఈ వంశంలో ప్రతాపసింహుడు కళాభిమాని. రసికుడు. ముద్దుపళని రాధికాసాంత్వనము ఇతనికే అంకిత మిచ్చినది. వీరభద్రయ్య అనే సంగీత విద్వాంసునికి తన ఆస్థానంలో చోటిచ్చి గౌరవించాడు, ఈ మహారాజు. పళని విద్యాగురువు తిరుమల తాతాచార్యులు సంగీత సాహిత్యాలల్లో నిధి. పళని 'శృంగారరసప్రధాన సంగీతసాహిత్య భరత శాస్త్ర విద్యా పారంగత తిరుమల తాతాచార్య''అని చెప్పినది. పళని స్వయంగా గోదాదేవి వ్రాసిన తిరుప్పావు అనే ౩౦ పాటలను ౧౦ సప్తపదులుగా తెలుగులోనికి పరివర్తన చేసిన వాగ్గేయకారకురాలు. క్రీ. శ ౧౭౬౩-౧౮౩౨ మధ్య తంజావూరును పరిపాలించిన శరభోజి కాలములో త్యాగయ్య ''నాదధేనువును పిండి నవనీతాన్ని'' తెలుగు వారికి కానుక లిచ్చాడు. త్యాగయ్యకు సమకాలికుడు శ్యామశాస్త్రులు. కర్ణాట సంగీత ప్రపంచానికి రత్నత్రయమని పేరుపొందిన ముగ్గురిలో త్యాగయ్య, శ్యామశాస్త్రి యిద్దరూ ఆంధ్రులే. శ్యామశాస్త్రి కుమారుడు సుబ్బరామ దీక్షితులు, శిష్యులు పట్నం సుబ్రహ్మణ్యము, ముత్తుస్వామి దీక్షితులు, చిన్నస్వామి దీక్షితులు మొదలయిన దిగ్గంతుల వంటి సంగీతశాస్త్ర పారంగతు లందరూ ములికినాటి ఆంధ్రులు. ఈ సందర్భములో ఒక సావేరి రాగాన్ని ౮ గంటలు ఆలాపనచేసిన పల్లవి శేషయ్యరుగారిని పేర్కొనక తప్పదు.

కృష్ణరాయల కాలంలో నామమాత్రంగా వినబడుతున్న కొరవంజికి గౌరవ మిచ్చి మహారాష్ట్రులు ప్రచారంలోకి తీసుకొనివచ్చారు.

జనసామాన్యానికి ఆధ్యాత్మిక విద్య యక్షగానాల ద్వారా నేర్పటానికి ప్రయత్నించినట్లు ఆనాడు రచితమైన ''జీవనాటకము''అనే యక్షగానం సాక్ష్యమిస్తున్నది. ముక్తి కాంతను జీవుడు వివాహ మాడటము ఇందలి ఇతివృత్తము.

'త్యాగరాజవినోదచిత్రప్రబంధనాటక' మనే యక్షగానం ఆ రోజుల్లో పుట్టిన ఒక విచిత్రమైనగ్రంథము. ఇందులో పాత్రోచితమైన భాష విపరీత రూపాన్ని దాల్చింది. సంస్కృతము, అరవము, మహారాష్ట్రము, తెలుగు, కన్నడము — అయిదు భాషలలో పాత్రలు మాట్లాడేవారు.

స్వరసాహిత్యము, జతులు, వివిధ కీర్తనలు, జావళీలు లెక్కకు మిక్కిలిగా ఆనాడు పుట్టినవి. వాటిలో గొప్పదనాన్ని ప్రస్తుతము తంజావూరు సరస్వతీమహల్ లైబ్రరీలో చెదపురుగులు ఆస్వాదిస్తున్నవి.

ఉదాహరణంగా :

''ఇటువలె పదరుదు రటవే, కటకట కామిని కాసంత తెలియక, కలికి పలు తెరపై కాంతుని పలుకెంపు, అలరుచు కలుకుచు, గబ్బిగుబ్బల క్రొన్నెలలను జూచి, వెలది నీ జడకొద్ది వేయవమ్మా!'' ఎంత సుకుమారమైన ఊహలు! ఎంతనానుడి! 'కలికి పలు తెరపై కాంతుని పలుకెంపు' ఇత్యాది పద ప్రయోగం ఎంత భావమాధుర్యమును కైవసము చేసుకున్న కవికో కాని లొంగదు గదా!

సాహిత్యానికి ఒక ఉదాహరణ :

'మగువా,తగవా వగలు చేసేది మేరా, మగువా నాతో ఇంత నగవా, నన్నెంచేది, తగవ ఇందుకు నే వగవ, ఇంతలో బిగువ, పలుకవేల నీ కలుక, చెరకు విలుకాడు శరముల చిలుక, నాకు నులుక''

విజయనగర పతనానంతరము దక్షిణదేశానికి వలస పోకుండా ఉన్న గాయకులను, నటకులను, వాగ్గేయకారులను, శాస్త్రగ్రంథకర్తలను, వెంకటగిరి, విజయనగరము, పిఠాపురము మొదలైన సంస్థానాధీశ్వరులు పోషించారు.

కూచిపూడివారు ఆంధ్రదేశ మధ్యంలో భరతశాస్త్రానికి పెట్టినది పేరై కొన్నిశతాబ్దాలు వెలిగారు. వేములపల్లె, ధర్మవరంవారు ఒక్కొక్క ప్రత్యేకతతో యక్షగానాలు వ్రాశారు.

కంకంటి పాపరాజువంటి విద్వత్కవులు కొందరు అన్యాశ్రయం లేకుండా నిలచిపోయి కాలప్రభావం వల్ల 'విష్ణుమాయావిలాసాది' యక్షగానాలు వ్రాశారు. పాపరాజుకు నాట్య మంటే ఎంతో అభిలాష. ఉత్తర రామాయణంలో జక్కిణి, పేరణి నాట్యవిశేషాలను వర్ణించాడు. ఇతర ప్రబంధాలలో ఎక్కువవిపులంగా గోచరించని హల్లీసకాన్ని ...

"అన్యోన్యహస్త దండావృత్తు లెసగ నొం
డొరుల సామ్ముఖ్యంబు నొంది యొంది
ఈవలావల వచ్చి యితరేతరము దొల్త
నిలచిన నెలవుల నిల్చి నిల్చి
కంకణ మంజీర కాంచికల్ మ్రోయ స
వ్యాపసవ్యస్ఫూర్తి చూపిచూపి
తాళ వాద్యరవానుకూలంబుగా మంద
ద్రుత, మృదుగతులను తిరిగి తిరిగి
అనుపమ రసోదయంబున నభినవాత్తి
చిత్రనర్తనభంగుల చెలగి చెలగి
విడివడిన మన్మథోన్మదద్విరదము లన
సఖులు హల్లీసకము సల్ప సంతసిల్లి"

అని వివరించాడు. తరువాతి కాలంలో ఈ గాంధర్వ విద్యలు నానాటికీ సన్నగిల్లుతూ వచ్చి చివరకు అంత ర్వాహిను లైనవి. ఒకనాడు యావద్భారతంలో ప్రఖ్యాతి వహించిన ఆంధ్రుల సంగీతనాట్యకళాభినివేశము ఈనాడు మందుకు కూడా కనబడకపోవటము చిత్రమే. మళ్ళీ ఏనాటికి తలయెత్తి ప్రాచీనాన్నత్యాన్ని పొందు తుందో!

△

# ఆంధ్ర జనని

## శ్రీ పాదరి రామస్వామి

సీ. పాదుపాకనుమూయు ప్రతిభగల్గిన, యుగంధరు సాటి మంత్రి యిద్ధరణిఁగలడె
మాధవాచార్యుల మాడ్కి స్వాతంత్ర్య ధుర్యుండగు మంత్రీశ్వరుండు కలఁడె
విజయ సంపదఁ దెచ్చి విభునికొసంగు తిమ్మరుసుఁ బోలిన మహామంత్రి కలఁడె
అక్కన్న మాదన్న వ్యవహారపటిమకుఁ, దులఁదూగు మంత్రు లీ యిలను గలరె
గీ. యనెడు శంకల కాలయాపన మదేల?, భవసుతులయట్టి ధీయుతుల్ పల్వు రుండ
నుద్ధరింపుము మమ్ము మహోద్యమముగ, నమలచారిత్రి! మముఁగన్న యాంధ్రజనని.

సీ. ఉదయాద్రి దుర్గంబు లుద్ధతి సాధింపఁ, జాలిన యాంధ్రుల శౌర్యపటిమ
కొండవీ డగలింప గురుఘిరంగులఁ బ్రోల్చు, వీరులౌ నాంధ్రుల విక్రమంబు
ముదిగల్లు రాచూరు భూమీశ్వరుల గర్వ, మణగించు నాంధ్రుల యధికబలము
శివసముద్రపుకోటఁ జెదరగొట్టెడు నవు, డాంధ్రులు చూపు సాహస జవమ్ము
గీ. సమసిపోనీక మాతృదేశాభిమాన, కార్యదీక్షాపరత్వ మైక్యమును బెంచి
యుద్ధరింపుము మమ్ము మహోద్యమమున, నమలచారిత్రి! మముఁగన్న యాంధ్రజనని!

# శ్రీ వేదాన్త దేశికకవి

శ్రీ భాగవతుల కుటుంబరావు

## జననము

క్రీస్తుశకము 1267 సంII ము అనన్తసూరి, తోతరాంబ అను పుణ్యదంపతులు కాంచీపురమున కాపురముఁ జేయుచుండిరి. తోతరాంబ తిరుపతికి వెళ్ళెను. తిరుపతి దేవాలయమునందు రాక్షసనివారణార్థమై బ్రహ్మదేవునిచే నుంచబడిన గంటను తా మ్రింగిన ట్లామె కలఁ గనెను. అనన్తసూరియు నదే స్వప్నముఁ గాంచెను. మరునాడే తిరుపతి దేవాలయమున నున్న గంట మాయమైనది. అర్చకు లా ఘంట నపహరించి రని యపవాద ముద్భవించినది. శ్రీ వేంకటేశ్వరుడు దేవస్థానపు జియ్యరుగారికి కలయందు గన్పడి "నేనే యా ఘంట నపహరించితిని, అర్చకులు నిర్దోషులు, వేఱొక ఘంట నుంచవలదు" అని చెప్పెను. నేటివఱకును తిరుపతి దేవాలయమున దేవసన్నిధిలో ఘంట యుండదు. తోతరాంబ గర్భవతి యయ్యెను. 1268 సంవత్సరము సెప్టెంబరునెలలో నామె కొక కుమారు డుదయించెను. వేంకటేశ్వరప్రసాదలబ్ధోదయు డగుటచే నీతనికి [1] వేంకటనాథుడని నామకరణముఁజేసిరి. [2] ఈతనికే శ్రీరంగమున వేదాన్తదేశికు డని నామ మొసగఁబడినది. అప్పటి నుండియు నీతడు వేదాన్తదేశికుఁ డను నామముననే విఖ్యాతిని గడించెను. ఇట్లు తన జన్మవృత్తాన్తమును గుఱించి ఈ కవియే చెప్పియున్నాడు.

## జీవిత సంగ్రహము

రామానుజ అప్పుల్లార్ అను నామము గల పితృవ్యునియొద్ద విద్య నభ్యసించి ఈ వేంకటనాథు డిరువది సంవత్సరముల ప్రాయముననే యన్ని విద్యలయందును వైదుష్యము నలవర్చుకొని విశ్వవిఖ్యాత పండితుడయ్యెను. తరువాత వైదిక కుటుంబము నందలి కన్యను వివాహమాడి కడలూరుదగ్గరనున్న తిరువహీన్ద్రపురమున కొంతకాల ముండెను. అప్పటి కీతడు సర్వతన్త్ర స్వతన్త్ర బిరుదము నొంది యుండెను. బిరుదార్హతను పరీక్షింపనెంచిన స్థపతి యొక డీతని నొక నూతిని నిర్మింపుమనెను. వేదాన్తదేశికుడును వల్లె యని యొక నూతిని నిర్మించెను. ఆ నూయి నేటికిని తిరువహీన్ద్రపురమున నున్నదట. కొంతకాల మైనపిదప నీతడు శ్రీరంగమునకేగి యచ్చటనే స్థిరనివాస మేర్పరచుకొనెను. మహమ్మదీయు లా నగరమును 1310 సంవత్సరమున కొల్లగొట్టి మనుష్యుల నందఱను

---

1 "విత్రాసినీ విబుధవైరివరూథినీనాం, పద్మాసనేన పరిచారవిధౌ ప్రయుక్తా
ఉత్ప్రేక్ష్యతే బుధజనై రుపపత్తిభూమ్నా, ఘంటా హరేః సమజనిష్ఠ యదాత్మనేతి."

2 శ్రీరంగరాజ దివ్యాజ్ఞా లబ్ధ వేదాన్తాచార్యపదః.

—(సంకల్ప సూర్యోదయము)

చంపినప్పు డీతడు మైసూరు సంస్థానములోని "సత్యకలము" అను గ్రామమునకు వెళ్ళి 1365 సంవత్సరమున మహమ్మదీయులందఱు నోడింపఁబడి దక్షిణ దేశము మరల హిందువులచే స్వాధీనముచేసికొనఁబడినప్పుడు, శ్రీరంగము తురుష్కుల బారినుండి విడిపింపబడిన దని విని తిరిగి శ్రీరంగమునకువచ్చి మహమ్మదీయపరిపాలన కాలమున తిరుపతి మొదలగు స్థలములయందున్న వేంకటేశ్వర విగ్రహమును తిరిగి శ్రీరంగమునందు ప్రతిష్ఠింపఁజేసెను. ఈతడు తన జీవితమునంతయు శ్రీభాష్యమును పాఠములు చెప్పుటయందును మతగ్రంథముల వ్రాయుటయందును గడపి తన 102-వ ఏట 1369-వ సంవత్సరమున వైకుంఠమున కేగెను.

శ్రీ వేంకటనాథుని జీవిత మాదర్శప్రాయ మనుటలో నేరికిని విప్రతిపత్తి లేదు. విత్తసంచయమునం దేమాత్రమును చిత్తము నుంచక, యుంఛవృత్తిచే జీవించుచు విద్యానగరమునందలి విద్యారణ్యుని యాహ్వానమునుగూడ నంగీకరింపక "తృణమపి వయం సాయంసంఫుల్లమల్లిమతల్లికాపరిమలముచా వాచా యాచామహే న మహేశ్వరాన్" అని తిరస్కారభావమును చూపిన యీ దేశికాచార్యుడు విరాగి యని చెప్పుటలో నావంతయు సంశయము లేదు. ఇట్లు విరాగి కావుననే యీతనికేమియు ధనము మిగులలేదు. తన పేదఱికము విషయమై యీతడు చెప్పిన యీ క్రింది శ్లోకము చాల సొంపుగా నున్నది.

"నాస్తి పిత్రార్జితం కించి, న్నమయా కించి దార్జితమ్
అస్తి మే హస్తిశైలాగ్రే, వస్తు పైతామహం ధనమ్."

కాంచిలోనున్న వరదరాజే యీతని ధన మట.

వాదిమత్తేభమై కవితార్కికసింహబిరుదము నార్జించిన యీతడు వైష్ణవులయెడ మూర్తీభవించిన వినయ మట. ఈతని వినయమును పరీక్షింపనెంచి యొక వైష్ణవు డీతనిని తన గృహమున కాహ్వానించి తలవాకిట నాతని పాదరక్షల గట్టియుంచినాడట. శ్రీ వేంకటనాథు డా పాదుకలను తన శిరసున నిడికొని

"కర్మావలంబకాః కేచిత్, కేచిత్ జ్ఞానావలంబకాః,
వయంతు హరిదాసానాం, పాదరక్షావలంబకాః"

అని యనినా డట.

ఈత డనేక ఉద్గ్రంథములను వైష్ణవమత ప్రచారమునకై వ్రాసినాడు. కొందఱు రాజులు వైష్ణవమత సిద్ధాన్తములను, తేలికగా నందఱకు తెలియునట్లు వ్రాయ మని ప్రార్థించగా తమిళమునందు కూడ కొన్ని గ్రంథములను వ్రాసియిచ్చినాడు. శ్రీరంగమున మూడు గంటల కాలములో రంగనాథుని పాదుకలమీద వేయి శ్లోకములను జెప్పి తన యాశుకవితాశక్తిని వివరించినాడు.

## గ్రంథములు

ఈత డనేక ఉద్గ్రంథములను వ్రాసియున్నాడు. అందుఁ బేర్కొనదగిన గ్రంథములు కొన్ని మాత్ర మిచ్చుట నిర్దేశింపబడుచున్నవి.

అగ

(1) తత్త్వముక్తాకలాపము, (2) అధికరణ సారావళి, (3) సేశ్వరమీమాంస (4) తత్త్వటీక, (5) తాత్పర్యచంద్రిక, (6) మీమాంసాపాదుక, (7) నిక్షేపరక్ష, (8) శతదూషణి, (9) న్యాయ పరిశుద్ధి, (10) న్యాయసిద్ధాంజనము, (11) సుభాషితనీవి, (12) రహస్యత్రియసారము, (తమిళము) (13) యాదవాభ్యుదయము, (14) హంససందేశము, (15) సంకల్పసూర్యోదయము, (16) పాదుకా సహస్రము, (17) వరదరాజ పంచాశత్, (18) దయాశతకము.........

## కవిత్వము

వేంకటనాథుని మతమున రసభావాలంకారగుణోపేత మగు కైత నల్లగల కవికిని, స్రష్టకును భేదమే లేదు. ఈ విషయమై యాతడు తన యాదవాభ్యుదయమునఁ జెప్పిన శ్లోకము భావగర్భితమై యున్నది.

"స కవిః కథ్యతే స్రష్టా రమతే యత్ర భారతీ, రసభావగుణీభూతై రలంకారై ర్గుణోదయైః." ఇందు కవిత్వమున కుండవలసిన లక్షణము లన్నియు స్పష్టముగా సూచింపఁబడినవి.

## యాదవాభ్యుదయము

ఈతడు వ్రాసిన కావ్యములలో యాదవాభ్యుదయ మొక యుత్తమకావ్యము. అద్వైతమత ప్రవర్తకు డగు నప్పయ్యదీక్షితులవారీ కావ్యమునకు వ్యాఖ్యానము చేయుట చేతనే దేశికునియొక్క గొప్పతనము వ్యక్తమగుచున్నది.

అప్పయ్య దీక్షితులవారు

"క్రీడాతూలికయా స్వస్మిన్ కృపారూపితయా స్వయమ్
ఏకో విశ్వ మిదం చిత్రం విభు శ్శ్రీమా నజీజనత్" —అను శ్లోకమును వివరించి,

"ఇత్థం విచిన్త్యా స్సర్వత్ర భావా స్సన్తి పదే పదే, కవితార్కిక సింహస్య కావ్యేషు లలితేష్వపి" యని చెప్పిన ప్రశంసావాక్య మీ దేశికాచార్యుని కవిత ధ్వనిప్రధానమౌటను బాగుగా వ్యక్తము చేయుచున్నది. పై శ్లోకమునందు ప్రతిపదమును గంభీరార్థగర్భితమై యుండుటయేగాక, వైష్ణవ మతసిద్ధాన్త మంతయు స్పష్టముగాఁ జెప్పబడియున్నది.

ఈకవియొక్క యుత్ప్రేక్షలు నిరుపమములై యీతని యుత్ప్రేక్షాప్రియతను ప్రకటించును. ఉత్ప్రేక్షాప్రియుఁడన్న మాత్రమున నితరాలంకారముల నుపయోగించడనికాదు. యాదవాభ్యుదయమున చాలవఱకు త్ప్రేక్షాలంకారములే మెండుగా నున్నవి. ఉపమాలంకారములు గూడ నున్నను కాళిదాసుని యుపమయందలి రామణీయకత యీ యుపమలయందంతగా కానరాదు. ఈతని భావౌన్నత్యమును ప్రకటించుటకై మచ్చున కొకటి రెండు శ్లోకములు చాలును.

"భుక్తా పురా యేన వసున్ధరా సా, స విశ్వభోక్తా మమ గర్భభూతః
ఇతి ధ్రువం సూచన మాచరన్తీ, తత్తాదృశం నాటితకం తతాన.

యశోద, గర్భవతిగా నున్నప్పుడు మన్ను తినుటచే వసున్ధరాభోక్తయగు విష్ణువు నాగర్భమందున్నాడని సూచించినదట.

ఈ క్రింది శ్లోకములలో సాయంసమయమున సూర్యాస్తమయము చమత్కారజనకముగా వర్ణింపఁబడినది.

"స్ఫురత్ప్రభా కేసర మర్కబింబం, మమజ్జ సిన్ధౌ మకరన్దతామ్రమ్
సన్ధ్యా కుమార్యా గగనాంబురాశేః, క్రీడాహృతం క్షిప్తమి వారవిందమ్.
"నిమజ్జతా వారినిధౌ సవిత్రా, కో నామ జాయేత కరగ్రహీతా
తదేతి సంభావనయైవ నూనం, దూరా దుదక్షేపి కరాగ్ర ముచ్చైః.
అభృంగనాదప్రతిపన్నమానా, నిమేషభాజో నియతం వనస్థాః
దూరం గతే స్వామిని పుష్కరిణ్యా, స్తత్ప్రాప్తిలాభాయ తపో వితేనుః.

ఇట్టి యపూర్వకల్పనాప్రదర్శకము లగు శ్లోకము లింక నెన్నియో కలవు. ఈ క్రిందిశ్లోకమున సమాసోక్తి సరసముగా నున్నది.

"ప్రాయేణ హంసై రవధూతసంగా, చారుస్మితా సంభృతభృంగనాదా
సర్వోపభోగ్యే సమయే ప్రసుప్తం, కుముద్వతీ కోకనదం జహాస".

ఈ క్రింది శ్లోకమునందలి శ్లేషసంకీర్ణరూపకము చక్కగా నున్నది.

"విశోధితా ద్విష్ణుపదాత్ క్షరంతీ, విష్వఙ్ముఖీ సాగరవృద్ధిహేతోః
తమోమయీం సూర్యసుతాం నిగీర్య, జ్యోత్స్నానదీ శోణమపి వ్యముంచత్."

యాదవాభ్యుదయమునందలి ప్రథమసర్గయందు భక్తిభావము బాగుగా పోషింపఁబడినది. ఇందలి శ్లోకములు కొన్ని యుపనిషద్వాక్యగర్భితములు కూడ నైయున్నవి.

"సంసార మరుకాన్తారే పరిశ్రాన్తస్య దేహినః, త్వద్భక్త్యమృతవాహిన్యా మాదిష్ట మవగాహనం. యదేకమక్షరం బ్రహ్మ సర్వామ్నాయ సమన్వితమ్, తారకం సర్వజన్తూనాం తత్త్వం తవచ వాచకమ్." ఈ క్రింది శ్లోకములో ప్రపత్తిభావన బాగుగా వివరింపబడినది.

"అనస్యరక్షావ్రతినం, చాతకవ్రతచారిణః
భవన్త మవలంబన్తే, నిరాలంబనభావనమ్."

ఈ క్రింది శ్లోకమున సృష్టివిషయమై దేశికుని యభిప్రాయము వివరింపబడినది.

"బ్రహ్మాది స్తంబపర్యన్త విచిత్రాంకురశాలినామ్, సలిలం కర్మ కన్దానాం క్రీడైవ తవ కేవలమ్"

ఇట్లు విమర్శించిన కొలదియు నెన్నియో విశేషము లీ కవివర్యుని వ్రాతలయందు కానవగును.

## శైలి

సామాన్యముగా నీతడు వైదర్భీప్రియుడే యైనను, గౌడీపాంచాలీశైలులను కూడ నీత డక్కడక్కడ నుపయోగించియున్నాడు. కొన్నిచోట్ల నేకాక్షర, ద్వ్యక్షరాది కవితలను, బంధకవిత్వమునుగూడ

ప్రకటించియున్నాడు. తాను గౌడవైదర్భీ పాంచాలీరీతులయం దన్నిటియందును నిపుణుడ నని తానే చెప్పికొనియున్నాడు. "గౌడవైదర్భపాంచాలమాలాకారాం సరస్వతీం, యస్య నిత్యం ప్రశంసన్తి వాచం సౌరభవేదినః."

## పోలికలు

ఈతనికి కాళిదాసన్న నెక్కుడు గౌరవము. అనేకస్థలములయం దాతని ననుకరించి యున్నాడు. కాళిదాసుని మేఘసన్దేశమునకు ప్రతిగా హంససన్దేశ మను నొక కావ్యమును వ్రాసియున్నాడు.

## విద్యారణ్యులు, దేశికాచార్యులు

ఈ సందర్భమున నొక విషయము ముచ్చటింప నగును. ఈతడును, విద్యారణ్యులును సమకాలికులు, మిత్రులు గూడనై యుండిరి. విద్యారణ్యుడు వ్రాసిన శంకరదిగ్విజయకావ్యము నందును, యాదవాభ్యుదయమునందును సదృశభావప్రదర్శకము లగు శ్లోకములు చాలగలవు. ఈ భావములు వీరికే సహజము గాకుండుట చేతను, కాళిదాసు నొద్దనుండియు వచ్చుచుండుట చేతను, ఈ సాదృశ్యములో పరస్పర ముత్తమర్ణాధమర్ణసంబంధము లేకున్నను, భావసాదృశ్యమును పరికించు నుద్దేశ్యముతో చూచినచో నౌత్సుక్యమును కలిగించును.

"గర్భాలసా భగవతీ గతిమాన్ద్యమీష, దాపేది నాద్భుతమిదం ధరతే శివం యా
యో విష్టపాని బిభృతే హి చతుర్దశాపి, యస్యాపి మూర్తయ ఇమా వసుధా జలాద్యాః"

—శంకర దిగ్విజయము.

"మయి స్థితే విశ్వగురౌ మహీయాన్, మాభూ ద్భువో భార ఇతీవ మత్వా
సఖీజనానా మవలంబ్య హస్తాన్, సంచారలీలాం శనకై శ్చచార."

—యాదవాభ్యుదయము.

ఉష్ణా నిసర్గధవలేన మహీయసా సా, స్వాత్మాన మైక్షత సమూహ ముపాత్తనిద్రా
సంగీయమానమపి గీతవిశారదాద్యై, ర్విద్యాధరప్రభృతిభి ర్వినయోపయాతైః.

— శంకర దిగ్విజయము.

శేషే శయానాం గరుడేన యాన్తీం, పద్మే నిషణ్ణా మథిరత్నపీఠమ్
హయాననై రాశ్రితవన్దికృత్యాం, స్వా మాకృతిం స్వప్నదృశా దదర్శ.

—యాదవాభ్యుదయము.

ఈ కవివర్యునిచే రచింపబడిన సంకల్పసూర్యోదయ మ్మొక యుత్తమనాటకము. అద్వైతమత ప్రతిపాదకమగు ప్రబోధచంద్రోదయ మను నాటకమునకు ప్రతిగా, శ్రీరామానుజమత ప్రబోధకమగు నీ నాటకము నీ కవి మృదుమధురశైలిలో వ్రాసియున్నాడు. నాటకకళయం దీతనికిఁగల యభిమాన మీ క్రింది శ్లోకమునుండి తెలియఁగలదు.

విర

"న త చ్ఛాస్త్రం న సా విద్యా న త చ్ఛిల్పం న తాః కలాః
నాసౌ యోగో న తత్ జ్ఞానం నాటకే య న్న దృశ్యతే."

శాన్తరసమును పూర్వకవులు తమ నాటకములయందేల వర్ణింపలేదనుటకు దేశికాచార్యులీ క్రింది శ్లోకములో సమాధానముచెప్పి మరియొకచోట శాన్తరసముయొక్క ప్రాముఖ్యమును వివరించినారు. మిగిలిన రసము లుద్రేకము నిచ్చి, చిత్తసంచలనము కలుగఁజేయును. కాని శాన్తరసము మనఃఖేదమును పోనడపి ప్రశాంతతను ప్రసాదించును. కాన నా రసమే ప్రధానమైన దని యీ కవివర్యుని భావము.

"అథవా తాదృశాన్సభ్యా న్మత్వా జగతి దుర్లభాన్, శంకే శాన్తరసోల్లాస మశక్య మభిమేనిరే"

"శమస్తు పరిశిష్యతే శమిత చిత్తఖేదో రసః"

శాన్తరసము రససంఖ్యలో తొమ్మిదవదై నను, మిగిలినవానికన్న నేవిధముగ గూడ తక్కువకాదు.

"అనవ మగుణో యస్మిన్నాట్యే రసో నవమః స్థితః"

ఈ నాటకముయొక్క సంపూర్ణ విమర్శ కిది తావుగాదు. కాన నింక విరమించుటయైనది.

ఇట్లీ కవివర్యుడు కావ్యములను వ్రాయుటచేత నేగాక, వైష్ణవమతప్రతిపాదకము లగు గ్రంథములను గూడ లిఖించి యా మతమున కెంతయో యుపకృతిఁ జేసెను.

ఓం శాన్తి శ్శాన్తి శ్శాన్తిః.

---

# క వి త్ర య ము

## శ్రీ పైడిపాటి వేంకటసుబ్బరామశాస్త్రి

లాస్య దుత్తుంగ గాంగనిర్ఘరము - వేద, కామధేనుస్రుతార్ష దుగ్ధమ్ము - ముక్తి
కామినీసమాశ్లేష ప్రకంపితాధ,రామృతము నన్నయార్యమహస్వి కవిత.

* * *

చల్లగా సాగు సెలయేటి జాలువోలె, తేటతేట తానె యొలుకు పూదేనెవోలె
నాతి క్రీగంటి వలపు పానకమువోలె, కైతఁ జిందినవాడు తిక్కన యశస్వి.

* * *

పృథుల గంభీరసాగరప్రియుని జేర, పరుగు నురుగుల సెలయేటి తెఱవ తరలి
పొరలి పొంగెత్తి కౌగిటఁ ముఱిసినట్లు, రసరహస్సుల నిల్చె నెఱ్ఱన తపస్వి.

తయారు జేసేటందుకు వడ్రింగులను నియమించాడు. ప్రజలకొఅకు ముద్రణ సౌకర్యముల నేర్పాటు జేసితి నని ప్రకటించాడు. పండ్రెండేండ్లక్రిందట ప్రచారంచేసిన బోల్ట్సుగారి వార్తాప్రసారోద్యమం 1780 జనవరి 29-వ తేదీనాడు వెలువడిన హిక్కీగారి 'బెంగాల్ గెజెట్'తో ఫలోన్ముఖానికి వచ్చింది.

## "బెంగాల్ గెజెట్"

మొట్టమొదట ఆ పత్రిక రాజకీయ, వాణిజ్య పత్రికగా వెలువడింది. 12 అంగుళములు పొడవు, 8 అంగుళముల వెడల్పు కలిగిన రెండుటావులమీద పుటకు మూడు వరుసలచొప్పున అచ్చు అయేది. దూరప్రాంతాలవారు, స్థానికులుకూడ వార్తలు, వ్యాసాలు పంపేవారు. అప్పుడే చేరిన నాలుగు నెలలక్రిందటి ఇంగ్లాండులోనివార్తలు అప్పుడప్పుడా పత్రికలో వెలువడేవి. ఆ పత్రిక కుపయోగించే కాగితం, అచ్చుకూడ అంత బాగుండేవి కావు. అయితే ఆ పత్రిక వార్తాప్రసారోద్యమారంభదినములనాటి దనియు, వార్తాప్రసారోద్యమపుతొలిపంట యనియు ఇదంతయు 150 సంవత్సరముల క్రిందటిసంగతి యనియు మరువరాదు.

## పత్రిక ప్రచారము

ఆ పత్రిక ముఖ్యంగా అప్పటి కలకత్తారాష్ట్రంలోను, పరిసరప్రాంతాలలోను మాత్రమే ప్రచారంలో ఉండేది. సామాన్య వర్తకులకు, గొప్పవ్యాపారస్థులకు, ఉద్యోగేతర యూరోపియనులకు కావలసిన అంశములు ఆ పత్రికలో ముఖ్యంగా ఉండేవి. ఆ పత్రికలోని ప్రచారప్రకటనలు యూరోపియనులకు కావలసిన వాణిజ్యవిషయములతోను, గృహసంబంధమైన గొడవలతోను నిండి ఉండేవి. భారతీయు లెక్కువగా ఆ పత్రిక నుపయోగించినట్టు తోచదు—ఆ రోజులలో నెక్కువగా నాంగ్లము నభ్యసించినవారు లేకపోవడ మొక ముఖ్యమైన కారణం; మరొక సంగతి — పత్రికా సంపాదకులు భారతీయులవిషయాలకు ప్రాముఖ్యం చూపకపోవడమే కాకుండా, ప్రభువులగు ఆంగ్లేయుల ప్రయోజనములయెడలనే గాఢమైన అభిమానం చూపడం, వాటిముందు భారతీయుల ప్రయోజనముల నప్రధానంగా గణించడం జరిగేది; సంపాదకీయాలు ఆంగ్లవర్తకులకు, హేస్టింగ్సు మొదలగు ప్రభువులకు కడులాభకారిగా ఉండేవి. అయితే హిక్కీ తన ప్రభువులను సంతోషపెట్టటందుకే యిట్లు వ్రాసేవాడనేటందుకు వీలు లేదు. ప్రభుత్వప్రతీకారాని కెంత మాత్రం భయపడేవాడు కాడు. చివరిరోజులలో హిక్కీని శిక్షించడానికి హేస్టింగ్సుప్రభువే ఎట్లు కారకు డయ్యాడో తెలుసుకుంటే, హిక్కీ అభిప్రాయా లెంత స్వతంత్రభావపూరితములో గ్రహింపవచ్చు.

## పత్రికలోని సారస్వతపు పుట.

బెంగాల్ గెజెట్టులో సారస్వతానికి కూడ తా వుండేది. విద్యావంతులు, కవులు తమ భావముల నా పత్రికద్వారా వెల్లడించుకొనేవారు. అయితే సారస్వతభాగంలోని రచన లంత గంభీరంగా ఉండేవి కావు. శృంగారరసంతోను హాస్యంతోను నిండియుండేవి.

బెంగాల్ గెజెట్టులో ప్రకటింపబడిన

## ఒక ప్రవల్లిక

"O Lovely Sue,
How sweet art thou,
Than Sugar thou art sweeter,
Though dost as far
Excel Sugar
As Sugar does saltpetre."

కవినామరహిత మగు ఈచిన్నిపద్యములోని రసము చదువరులే గ్రహించాలి. సారస్వతకన్యను ఆ నాటి కలకత్తా కంకరరోడ్లమీద కీడ్చుకొచ్చేటందుకు ప్రయత్నం చేసిన కొందరు కవినామ ధేయులు బెంగాల్ గెజెట్టులో తమ పాండిత్యప్రదర్శనాని కేర్పాటు చేసినస్థలం సరిపోదని వాపోయే వారట.

## ఇతర విషయాలు

ఆరోగ్యాశ్రియము లెక్కడెక్కడ ఉన్నదీ, ప్రేక్షకులకు రోగులకు ఆయా ఆశ్రియములం దెట్టి సదు పాయము లున్నదీ హిక్కీ గెజెట్టులో ప్రకటించేవాడు. వేసగిలో గొప్ప విరామస్థలంగా ఉండే 'బెర్హాంపూరు' లోని సదుపాయములను గూర్చి ఒక ప్రత్యేక విలేఖరి బెంగాల్ గెజెట్టుకు వ్రాసే వాడు. మచ్చు కీ క్రింద పొందుపరుపబడిన ప్రకటనను చదివితే తెలుస్తుంది.

"ఆరోగ్యంకోసం, బెర్హాంపూరు చేపలకోసం ఈ క్రింద నుడివిన ప్రసిద్ధపురుషులు బెర్హాంపూరుకు రానున్నారని తెలియుచున్నది—'హెనీగ్రాంటు'గారు.........పై జెప్పిన ప్రముఖులు ప్రశంస నీయమగు బెర్హాంపూరునందలి ప్రశస్తవాతావరణమున అమూల్యమగు లాభమును పొందిరని చెప్పుట కెంతయు సంతసించుచున్నాము. ఇచ్చటికి వచ్చుప్రముఖు లుండుటకు తగిన భవనములను నిర్మించు నిమిత్తము కావలసిన ఏర్పాటులు జరుగుచున్నవి. ఇక్కడి సముద్రపుటొడ్డున బళ్లు పోవు టకు ఆగుటకు మంచి వీలుగా నున్నది. సొరమీనాలు మొదలగు హానికర మగు జలచరము లీ యొడ్డున లేవు. పీతలు మాత్ర ముండును. ప్రపంచములో కల్లా ఈసముద్రపుటొడ్డు అందమైనదని చెప్పవలసి యుంటుంది."

బెంగాల్ గెజెట్టు ఏప్రతియందు చూచినను 'రంభము' కన్య పేరు కనబడుతుంది. అప్పటి సమాజంలో ఆమెకు పెద్దపే రుండేదట. అతిథుల నాహ్వానించి విందు లివ్వడం, తాను విందులకు పోవడంలోను గడిపింది ఆమె జీవిత మంతాను. ఆంగ్లేయులు, భారతీయప్రముఖులుకూడ చాలమంది ఆమె నెఱు గుదురట.

'ఇంటెలిజన్సు ఎక్స్ట్రార్డినరీ' అనే శీర్షికక్రింద గొప్పవారిండ్ల వివాహాలనుగూడ హిక్కీ ప్రకటించే వాడు. ఈ క్రింది విషయ మటువంటిదే.

'మదరాసులో రిఛర్డు న్యూలాండుగారు కద్బర్టు కన్యను వివాహ మాడారు. ఆమె ద్వారా 4000 సిక్కా పగోడాలూ, కద్బర్టుగారి స్నేహమూ, కద్బర్టుగారి కిదివరలో ఫెర్గసన్‌గారితో నున్న బియ్యపు కంట్రాక్టూ లభించాయి. కద్బర్టుకన్య సర్వవిధముల నైపుణ్యము సంపాదించిన యువతి.'

### బెంగాల్ గెజెట్టు పతన మార్గం పట్టింది

బెంగాల్ గెజెట్టు కొన్నాళ్ళయేటప్పటికి నీతిబాహ్యమగు రుచులకు తావొసంగ మొదలిడింది. రానురాను నీతినియమముల విడిచి దోషభూయిష్ఠమై పతనమార్గం పట్టింది. ప్రజాబాహుళ్యం తర్కించరాని వ్రాత లా పత్రికలలో వెలువడుతు వచ్చాయి. 'కాలగతి - ముఖ్యంగా మన స్త్రీల పోకిరీనడత' మొదలుగాగల వార్తలే పత్రికలలో ప్రాధాన్యం వహించేవి. 1780 నాటి యూరోపియను వర్తకుల కవి రుచించెడివేమొ! లజ్జారహితములై, గౌరవహీనములై, అసహ్యాకరమై ఏఆధునిక పత్రికానిర్వాచనం చేసేటందుకైనా సాహసించుట కర్హము కానట్టి విషయము లనేకములు ఈ పత్రికలలో ప్రకటనకు వచ్చేవి.

### క్రొత్త పత్రిక — 'ది ఇండియా గెజెట్టు'

హిక్కీగారి గెజెట్టుకు ఒక సంవత్సరం నిండేటప్పటికి 'ది ఇండియా గెజెట్టు' అను మరొక పత్రిక వార్తారంగంలోనికి దిగింది. దానితో హిక్కీగారి అసహ్యాకర మగు వ్రాతలు మరింత మకిలితో వెలువడడం ప్రారంభించాయి. పత్రికంతా హేయమైన దూషణవాక్యాలతో నిండిపోయింది. 'ఇండియాగెజెట్టు' మేలైన కాగితంమీద చక్కగా ముద్రింపింపబడిన నాలుగు పుటల పత్రిక. పీటరు రీడు, బి. మెస్సినిక్కు ఈ పత్రికకు సంపాదకులు. ప్రభుత్వం ఆ పత్రికకు తపాలారేట్లలో సౌకర్య మొసగారు. ఇవన్నీ చూచేటప్పటికి హిక్కీకి అసూయ, ఆగ్రహం, అంకురించాయి. హిక్కీ ఈ పత్రికను విమర్శిస్తూ ఈ విధంగా వ్రాశాడు.

'హేస్టింగ్సు ప్రభువు భార్యను వేడికొని ఉంటే నేనూ నా పత్రికకు తపాలాసౌకర్యములను సంపాదించేవాడిని. ఆమె అటువంటి వేడికోలుకు లొంగేమనిషి యని నాకు తెలియును. కాని గౌరవప్రవృత్తులు కలిగిన నేను అట్టి నీచపుపనికి పూనుకొనుట కిష్టపడలేదు. భర్త కామెపైనున్న అవ్యాజ ప్రేమను పురస్కరించుకొని, ఆ సుమనోజ్ఞ మాటకత డెదురాడడు గదా యని, ఆ ఉదాత్తురాలినుండి బలవంతంగా వాగ్దానం తీసికోవడం నీచం, రాజద్రోహం!' ఇదంతా అప్పు డధికారంలో ఉన్న గవర్నరుగారినిగూర్చి, ఆయన భార్యను గురించీను! ఈ వ్రాతల ఫలితంగా 1780 నవంబరు 14 వ తేదీని పోర్టు విలియంనుంచి శ్రీముఖం వచ్చింది.

"జె. ఎ. హిక్కీగారిచే ముద్రింపబడుచున్న 'బెంగాల్‌గెజెట్టు' అను వారపత్రికలో ఈ మధ్య ప్రకటింపబడుచున్న అశ్లీలములు, దూషణలు, వలసరాజ్యశాంతికి భంగకరమగు భాషణములు నిషేధనీయము లగుటచే ఇంతటినుండి ఈ పత్రికను జనరలు పోస్టాఫీసుద్వారా పంపుటకు వీలు లేదు.''

౨౮౯

ఈ దెబ్బతో ఇతరప్రాంతాలనుండి బెంగాల్ గెజెట్టుకు చందాదారులు లేకుండాపోయారు. ఇదివరకే కొనఊపిరితో కొట్టుకుంటూన్న ఈ వార్తాపత్రిక తలవనితలంపుగా వచ్చిపడిన ఈ దెబ్బకు తట్టుకొనడం కష్టమైపోయింది. కాని హిక్కీ అధైర్యపడలేదు. ఈ ప్రభుత్వచర్యను సామాన్యమైనదిగా గణించాడు. ఆగ్రహపరవశత్వంలో ఇలా వ్రాశాడు.

'నిరంకుశాధికారుల ప్రాపకం సంపాదించుకోనందుకు నా వార్తాపత్రిక నమ్ముకొనుటను నిరోధించి నచో హోమరులాగ పాటలు, పదాలు వ్రాసికొని కలకత్తా వీథులలో అమ్ముకుంటాను. నేను నష్ట పడేదల్లా మూడు విషయాలలో—మర్యాద, స్వేచ్ఛ, ప్రాణాలు—మొదటి విషయంకోసం చివరి రెండింటిని త్యాగంచేస్తాను; పత్రికను నిలబెడతాను; నిరంకుశాధికారులపట్ల, కుట్రగాండ్రపట్ల కొరడాలా పనిచేయిస్తా. నాహక్కుల నన్యాయంగా లాక్కొని, నాస్వేచ్ఛ నరికట్టి కారాగారమందు నన్ను బంధిస్తారా, అక్కడినుంచే నాపని సాగిస్తా.'

తరువాత నతడు 'ప్రజాబాహుళ్యాని కొక విజ్ఞప్తి యని ఈ క్రింది విధంగా ప్రకటించాడు :

"నే నీ అక్రమమైన నిర్బంధానికి, నిరంకుశాధికారానికి బానిసలాగ నోరెత్తకుండ లొంగవలసినదేనా ? కాదు. నా నిజపరిస్థితులు, నా బాధలు నా పత్రికద్వారా గ్రేట్ బ్రిటనులోని సింహాసనపీఠంవద్దకు వెడతాయి. బ్రిటిషు సామ్రాజ్యంలో ప్రధాననగరమైన ఈ కలకత్తాలో నా స్వాతంత్ర్యానికి కలిగిన నిరోధం నా పత్రికద్వారా లండనునగరాధీశునకు విన్నవించుకుంటాను. ఆయన నాపట్ల న్యాయ మున్నదని గ్రహిస్తాడు. నే నే దేశంలో, ఎవరికొఱకు పాటుపడుతున్నానో అవగాహన చేసికొని నాయెడ సానుభూతి చూపుతాడు.

హిక్కీ స్వాతంత్ర్యాభిలాష, ఆత్మగౌరవమును నిలుపుకొనుటయందు పట్టుదల కొనియాడదగినవేగాని ఆయన తన పత్రికలో సాగించిన పరనింద సహింపరానిదిగా నుండేది. బెంగాల్ గెజెట్టు పరమ అసహ్యమైనటువంటిన్నీ, అవమానకరమైనటువంటిన్నీ రూపం దాల్చిందని చెప్పవచ్చు. ఎంత ఉన్నత పదవిలో నున్నానసరే—గొప్ప ఉద్యోగస్థుడుగాని, మహాఐశ్వర్యవంతుడుగానీ, సాంఘికంగా పలుకుబడిగలవారు గానీ—అపహాస్యానికి గురి అయ్యేవారు. ఇంక ప్రభుత్వం సహించలేకపోయింది. 1781 నవంబరునెలలో గవర్నరుగారి సలహామీద ప్రధానన్యాయమూర్తినుండి హిక్కీగారికి అరెస్టువారంటు వచ్చింది. మరునా డుదయముననే హిక్కీగారిని సుప్రీముకోర్టుముందు పెట్టారు; రెండు నేరాలు మోపారు; జామీను నిరాకరించారు; నిర్బంధంలో పెట్టారు. కాని పత్రిక సాగుతోనే ఉంది. పత్రికాయజమాని, సంపాదకుడు, ముద్రాపకుడు అగు హిక్కీ కారాగారమందు కడగండ్లు పడుతూన్నా వ్యక్తులమీది విమర్శలతో విప్లవాన్ని సాగించడం మానలేదు. పత్రిక ధోరణి ఎంతమాత్రం మారలేదు.

1782 మార్చి నెలలో హిక్కీ ఇలా వ్రాశాడు. "దాదాపు రెండుసంవత్సరములనుండి నడచుచున్న ఈ నిర్దాక్షిణ్య నిరంకుశత్వం హిక్కీని అప్పులపాలు జేసింది. వ్యాపారాన్ని ఎక్కువగా పాడుజేసింది.

వారను హేస్టింగ్సు ప్రభువు నానతి ననుసరించి గడచిన తొమ్మిది నెలలనుండి జైలులో బంధింపబడి కుటుంబమునుండి, స్నేహితుల నుండి ఎడబాటుచేయబడ్డాను. ఇప్పుడు వారను హేస్టింగ్సు నామీద క్రొత్తగా మరియేరు నేరముల మోపియుండుటచే ఇంకను జైలునందే ఉండవలసియుంటుంది....”

హిక్కీ తన పత్రికకు వ్రాయడాని కిదే కడపటిసారి. తరువాత ముద్రణాక్షరాలు పట్టుకొన్నారు; బెంగాల్ గెజెట్టు అకాలమరణానికి గురియైంది. పాప మా దురదృష్టవంతుడు హిక్కీ జడ్జీల కెన్నో పిటీషనులను బంపుకొన్నాడు. కాని ఉపయోగం లేకపోయింది. హిక్కీకి అసలు విముక్తి కలిగిందో లేదో చెప్పటందుకు ఆధార మేమీ లేదు. ఆతడు మరేదేని క్రొత్తవ్యాపారాన్నే సాగించాడో, ప్రభుత్వచర్యలకు విసిగి వేసారి మాతృదేశానికే వెళ్లిపోయాడో చెప్పలేము. ఏది యెట్లైనను, ఎంతటి తప్పులు చేసినను హిక్కీ ఆధునిక భారతీయ వార్తాప్రసారోద్యమం సాగించడంలో ముందంజ వేసిన వాడనీ, క్రమమార్గమున వెలువడిన ప్రథమపత్రిక బెంగాల్ గెజెట్టనీ శాశ్వతంగా ఉండిపోతుంది.

# మా తెనుఁగు తల్లి

## శ్రీ కస్తూరి సూర్యప్రకాశరావు

తెలుఁగు మాగాణిలోఁ దొలిపంట నన్నయ్య, పండించె గీర్వాణవాణిఁ జల్లి  
రసవేత్త యర్ణగీర్తి రాజిల్లఁ దిక్కన్న, నీటుగా చక్కని తోఁటవేసె  
నన్నయ భట్టాంశ తన్నుఁ జెందిన పొంగి, యెఱ్ఱన్న యమృతంబు జుర్రి తేర్చె  
శ్రీరామభక్తితో శ్రీకృష్ణభక్తితోఁ, సహజపాండిత్యుఁ డుత్సాహియయ్యె  
నవరసికనాథుఁ డయ్యె శ్రీనాథ సుకవి, భీమ, భాస్కర, సూరన, సోమనలును,  
ఆంధ్రరాయలు, పెద్దనాద్యష్ట దిగ్గజములు పాడిరి మా తెల్గుజనని మురియ.  
విజయ విలాసాన వెల్గొందు శ్రీచేమకూర కవీంద్రు శృంగార రసము  
సీతమ్మ కష్టాలు చెవిసోఁకగాఁజెప్పు, కంకంటిపాపని కరుణరసము  
వికటకవియశస్సు విరజిమ్మ లింగని, యాంధ్రజాతీయోక్తిహాస్యరసము  
ప్రతియింట నొక్కొక్క ప్రతియేని లభ్యమౌ, శతకాల నుండెడి శాంతరసము  
దండకంబులలో నున్న తక్కురసము, లొక్కచోఁగూర్చి బిడ్డల మక్కువగను  
నవరసమ్ములు తగుపాళు లమరఁబోసి, కలిపి యమృతంబు దినిపించుఁ దెలుఁగుతల్లి.  
ఆంధ్రశిల్పం బజంతాద్రిగహ్వరముల, వెలిఁగి దిక్కులఁజిమ్మె తెలుఁగుకీర్తి  
పాడి రాముని దెచ్చి భద్రాద్రి గోపన్న, కొలిచి జగతిఁ జూపు తెలుఁగుభక్తి  
గాయకబ్రహ్మ త్యాగయ్య మ్రోగించును, దేశదేశాల మా తెనుఁగుసూక్తి  
ఆటవెలందుల నోటఁ జాటించును, వేమన తెలుఁగు వివేకశక్తి  
కవులు శిల్పులు భక్తులు గాయకులును, పరమవేదాంతవిదులును బలసికొలువ  
కలిత శుభవల్లి సద్గుణకల్పవల్లి, తెలుఁగుజగ మేలు తల్లి మా తెలుఁగుతల్లి.

# వేదాంతదర్శనము

శ్రీ కవుతా నరసింహశాస్త్రి

"పాణినే ర్జైమినేశ్చైవ వ్యాసస్య కపిలస్యచ, కణాద స్యాక్షపాదస్య దర్శనాని షడేవ హి."

పాణినిమహర్షి చేతఁ జేయబడిన వ్యాకరణమును, జైమినిమహర్షి చేఁ జేయబడిన పూర్వమీమాంసయును, వ్యాసమహర్షి విరచించిన ఉత్తరమీమాంసయును, కపిలమహర్షి రచించిన సాంఖ్యమును, కణాద, అక్షపాద మహర్షులు చేసిన న్యాయ, వైశేషిక తర్కములును గలసి దర్శనము లాఱు గలవు. అందు వ్యాసకృత మగు వేదాన్తదర్శనము ఉత్తరమీమాంసాశాస్త్ర మని గూడ వ్యవహరింపఁబడుచున్నది. ఆ దర్శనము సూత్రగర్భితమై నాలుగధ్యాయములతో నిండి ప్రతిఅధ్యాయమును నాలుగుపాదములతోఁ గూడియున్నది. అట్టి గ్రంథమునకు నూటతొంబదియొక్క యధికరణములతో సూత్రభాష్య మనుపేర శ్రీ శంకరాచార్యభగవత్పాదులు వ్యాఖ్యను రచించిరి. 'దృశిర్-ప్రేక్షణే'అను ధాతువుకంటె 'ల్యుట్' ప్రత్యయము చేరగా దర్శన మను రూపము నిష్పన్నమగును. చూచుట యని దీని యర్థము. ఈ దర్శనసూత్రములకు శ్రీ మధ్వాచార్యులు ద్వైతమతమును, శ్రీ రామానుజాచార్యులు విశిష్టాద్వైతమతమునుగూడ వివరించియుండిరి. శ్రీ శంకరభగవత్పాదాచార్యులు అభేదమతమును, అనగా అద్వైతమును, ప్రకృతసూత్రములచే నిరూపించి నిర్గుణబ్రహ్మప్రధానపరములుగా వ్యాఖ్యానముఁ జేసిరి. మఱియు నాలుగు వేదములకు సంబంధించిన కొన్ని యుపనిషత్తులను, మఱికొన్ని పురాణేతిహాసమధ్యభాగములను గైకొని అద్వైతపరముగా భాష్యాదులఁ గావించిరి.

లోకమున సమస్తమగు ప్రాణిజాతము ఇష్టమగు స్వర్గాదిసుఖములను, అనిష్టమగు దుఃఖపరిహారమును స్వభావముగనే కోరుచుండును. అట్టి యిష్టప్రాప్త్యనిష్టపరిహారము వేదమందుఁ గాననగును. ఆ వేదము ఋగ్యజుస్సామాథర్వభేదములచే భిన్న మగుటయే కాక ప్రతివేదము మంత్ర, బ్రాహ్మణ, ఆరణ్యక, ఉపనిషదాది భేదములచేత ననేకవిధములుగా విభజింపఁబడినది. తిరిగి ప్రతివేదమందు గల విషయమును సులభముగా బోధించుటకు కర్మ, ఉపాసన, జ్ఞాన, కాండము లను మూఁడు విభాగములు చేయబడెను. అందు కర్మోపాసనాకాండములు జ్ఞానకాండకు సాధనములుగా నుండి తుట్టతుదకు జేయఁబడిన యుపనిషద్భాగమే జ్ఞానముఁ గలుగజేయునదియు మోక్షమును ప్రతిపాదించునదియు నగు గ్రంథముగ నున్నది. మోక్ష మనగా విడిచిపెట్టుట యని యర్థము. దేనియొక్క యను నాకాంక్షయందు సంసారముయొక్క విడిచిపెట్టుట యని విచారణవలన నేర్పడును.

వేదాంతదర్శనమున ఆత్మవిచారము ముఖ్యము. ఆ యాత్మ భిన్నమా, (అనగా ననేకమా), అభిన్నమా అను సంశయముచే మతభేదము ననుసరించి విచారమున కవకాశము గలుగుచున్నది.

నిర్గుణబ్రహ్మప్రధానవాది యగు శ్రీ శంకరులమతమున పరమార్థముగా సచ్చిదానందబ్రహ్మయే అభిన్నమగు తత్త్వముగా నిరూపింపఁబడెను. అట్టి తత్త్వజ్ఞానమే మోక్షసాధనమా ? లేక కర్మాచరణమే మోక్షసాధనమా? లేక కర్మజ్ఞానసముదాయము మోక్షసాధనమా? అను సంశయమునకు వేదమందుఁ జెప్పబడిన 'యజేత' అనగా కర్మల నాచరించవలె ననియు, "త్యాగే నైకే అమృతత్వ మానశుః'' కర్మములను వదలుటచే మోక్షము సంభవించుననియు, నిరూపించిన వాక్యములే హేతువు లగుచున్నవి. కాని ఆకాశమందు పక్షిసంచారమునకు రెండు రెక్కలు నెల్లు సాధనములో నట్లే జ్ఞానకర్మ సముచ్చయము మోక్షమునకు ముఖ్యము. ఆత్మయే బ్రహ్మ యను పేర వ్యవహరింపఁబడుచున్నది. "బృహత్వాత్ బ్రహ్మ'' యను వ్యుత్పత్తిచే నంతటను వ్యాపించినది; అనగా బ్రహ్మాండమునకు వెలుపలను, లోపలను మహాకాశన్యాయమున పరిపూర్ణ చైతన్యపదార్థమునకు బ్రహ్మ యనిపేరు. "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ'' అను శ్రుతిచే బ్రహ్మ పదార్థము సత్యజ్ఞానానంతరూపలక్షణము గల దని చెప్పఁబడినది. ఈ వివరణముచే అద్వైతబోధ సులభముగా నేర్పడును.

## అ ధి కా రి

ఈ వేదాంతదర్శనమును తెలిసికొనుటకు దగినయధికారి యుండవలెను. వానినే ముముక్షు వని యందురు. వాడు జ్ఞానియా ? అజ్ఞానియా ? యను సంశయము గలిగి విచారించగా జ్ఞాని యధికారి గానేరడు. వాడు కృతకృత్యు డగుటచే సంశయ ముండదు గనుక ఈ దర్శనవిచారమున కవకాశ ముండదు. అజ్ఞానికి దేహాదులందు నే నను దృఢవిశ్వాస ముండుటచే మోక్షేచ్ఛ యుండదు గాన నధికారి కాడు. ఒకవేళ అజ్ఞానికే విషయదోషములచేతను, జనన మరణాదిదుఃఖదర్శనములచేతను, వైరాగ్య ముదయించి యధికారి కావచ్చు ననినచో నట్లును గాదు. అజ్ఞానికి స్వల్పవిషయము ననుభవించిన పిమ్మట గొప్పవిషయము ననుభవింపవలె నను కోరిక యుండును గాని, వైరాగ్య మెన్నడు నుదయించదు గనుక అజ్ఞాని యధికారి కానేరడు. ఈ విధమున నీ దర్శనమున సంపూర్ణమగు నజ్ఞానియు, సంపూర్ణజ్ఞానియు, నధికారి గాడు. మఱి యధికారి యెవ డన్నచో నే నీ సంసారమందు బద్ధుడనై అనాదికాలమునుండి కారాగారబద్ధుని వలె జన్మజరామరణాదులను, దుఃఖముల ననుభవించుచుంటిని. అశాశ్వతదుఃఖముల దాటుట యందు ఆత్మజ్ఞానమే యుపాయము. ఈ విషయమై వేద మిట్లు చెప్పుచున్నది. "తరతి శోక మాత్మ విత్.'' అనగా ఆత్మవేత్త దుఃఖమును దాటుచున్నాఁడు అని. ఆయాత్మజ్ఞానముచేత నేను దుఃఖము నుండి విముక్తుడ నౌదునుగాక యను మిక్కిలి కోరికతోఁ గూడిన నిశ్చయ మెవ్వరికిగలదో వాఁడు వినయాదు లను కానుకలచే గురువును సమీపించిన ఈవేదాంతదర్శనమం దధికారి యగును. పిమ్మట గురునను గ్రహముచే జ్ఞానోదయము గల్గి కృతకృత్యు డగును. గురు వనఁగా —

"గు శబ్ద స్త్వంధకార స్స్యాత్ రు శబ్ద స్తన్నిరోధకః
అంధకారనిరోధత్వాత్ గురు రిత్యభిధీయతే ''

అనగా గు శబ్దమునకు చీకటి యని యర్థము. రు శబ్దమునకు పోఁగొట్టుట యని యర్థము. చీఁకటిని పోగొట్టువాఁడు, అనగా, అజ్ఞానమును బోఁగొట్టి జ్ఞానమును గలుగ జేయువాడు గురు వనఁబడును. కనుక అజ్ఞానియై సంసారబంధమునందుండి ఈ బంధముఁ బోఁగొట్టుకొనఁ దలచినవాఁడు వేదాంత దర్శనమం దధికారి యగును.

వేదాంతదర్శనమున ఆత్మపదార్థము చైతన్య మనియు వ్యవహరింపఁబడును. ఆ చైతన్యము మాయా విశిష్టచైతన్యమనియు, శుద్ధచైతన్య మనియు రెండువిధములు. లోకమున మాయావి యగు పురుషుఁడు తనమాయచే వస్తూత్పత్తిఁ జేసి మఱల నెట్లు తనయం దుపసంహారముఁ జేసికొనునో అట్లే చైతన్యముకూడ మాయచే సమస్తమైన జగత్తును సత్త్వరజస్తమస్సులను త్రిగుణములచే నిర్మించి తనయందే లయము చేసికొనుచుండును. దీనినే జగదుత్పత్తియందు మాయావిశిష్టచైతన్య మనియు లయకాల మందు శుద్ధచైతన్య మనియు వ్యవహరింతురు.

## మా య

మాయ యనగా ప్రకృతి యని యర్థము. దీనిచేతనే సమస్తమగు జగత్తు సృజింపబడుచున్నది. అజ్ఞానరూప మగు నీ మాయ స్వయముగనే ఆత్మయం దధ్యస్తమైయున్నది. అనగా కల్పితమై యున్నది. ఆ మాయ అనాదిగా ఉత్పత్తివిరహిత మగుటచే దేనివలనను నుత్పన్నము గాదు. ఏల ననగా శుద్ధచైతన్యమువలన నీ మాయ యుత్పన్న మనిన మోక్షదశయందుఁగూడ మాయ పునరుత్పన్నమై మోక్షమే సిద్ధింపదు. ఇంతేగాక ఆ మాయ ఏకము, సాంతము, సదసద్విలక్షణముగూడ నగును. అది యెట్లనఁగా మాయకు వేఱుగా మఱియొక మాయ లేనందున నేక మగును. జ్ఞానముచే మాయ నశించును గనుక సాంత మగును. అట్లే భూతభవిష్యద్వర్తమానకాలములందు మఱియొక పదార్థముచే బాధింపఁబడనివస్తువు "సత్" అనబడును. అట్టిది సత్య, జ్ఞాన, అనంతరూపమగు ఆత్మపదార్థము. దేని జ్ఞానము త్రికాలములందుఁ గాదో అట్టి శశశృంగవంధ్యాపుత్రాదులను 'అసత్' అందురు. బ్రహ్మజ్ఞానముకంటె పూర్వము జగత్తుతోఁ గూడిన మాయ తెలియబడుచున్నదిగాన 'అసత్' కాదు. అది యేలా గనఁగా జాగ్రదవస్థయందు 'అహ మజ్ఞః' అనఁగా నే నజ్ఞాని నను ప్రతీతిచేత మాయ ప్రత్యక్ష మగుచున్నది. అట్లే స్వప్నమందు స్వాప్నికపదార్థముల జ్ఞానమునకు ముఖ్యకారణము మాయయే యగుచున్నది. అటులనే సుషుప్త్యవస్థయందును సుషుప్త్యనంతరజాగృతిచేత "సుఖ మహ మస్వాప్సమ్ నకించి దవేదిషమ్" అనఁగా నేను బాగుగా నిద్రించితిని. ఏమియు నెఱుగ నను స్మృతి గలుగుచున్నది. అందుచే సుషుప్తియందలి మాయ స్మృతిచే దెలియఁబడుచున్నది గాన నీ యవస్థాత్రయమందును మాయయుండుటవలన 'అసత్' అనుటకు వీలు లేదు. ఈ మాయ కల్పిత మగుటచే 'సత్'ను గాదు గనుక సదసద్విలక్షణ మనుటలో సంశయము లేదు. ఈమాయ శుద్ధచైతన్యము నాశ్రయించుకొని దానినే యావరించి యున్నది.

## ఈశ్వరుడు

శుద్ధసత్త్వగుణప్రధాన మగు చైతన్యము, మాయ, మాయయందు ప్రతిఫలించిన చైతన్యముఁగలసి ఈశ్వరశబ్దముచేఁ జెప్పఁబడును. అట్టి యీశ్వరుఁడు సర్వజ్ఞుఁడు, సర్వశక్తిమంతుఁడునై యున్నాడు. ఆ యీశ్వరునివలననే సమస్తభూతములకు నుత్పత్తి, స్థితి, లయములు సంభవించుచున్నవి. ఇందులకు శ్రుతియు నిట్లు వక్కాణించుచున్నది. "యతో వా ఇమాని భూతాని జాయన్తే, యేన జాతాని జీవన్తి యత్ప్రయన్త్యభిసంవిశన్తి." అనఁగా ఈ సమస్తభూతములు నెవరివలన నుద్భవించుచున్నవో యెవనిచేత పుట్టింపఁబడి జీవించుచున్నవో, యెవనియందు లయముఁ బొందుచున్నవో యనియర్థము. ఈ శ్రుతియందు 'యతః' అనుశబ్దము సర్వజగత్తునకుఁ గారణ మగుటను సూచించుచున్నది. ఆ కారణము నీ వేదాన్తదర్శనమున వివర్తోపాదానకారణ మని వ్యవహరింతురు. ఈ వివర్తోపాదాన కారణ మెట్లు సంభవించు ననఁగా రూపాంతరము నొందుట వివర్తము. ఏ వస్తువు లేక వస్తూత్పత్తి గలుగదో ఆవస్తు వుపాదానము. మృత్తు లేక ఘటము సంభవించనిరీతిగ పరమాత్మ లేక జగత్తు సంభవింపదు. ఇందుకు వేదమందును ప్రమాణముగలదు. 'తత్సృష్ట్వా; తదేవానుప్రావిశత్' అనగా జగత్తును సృష్టించి తా నందుఁ బ్రవేశించెను. ఇట్లు చెప్పుటచే జగత్తునకు పరమాత్మ వివర్తోపాదాన కారణ మనుట సిద్ధము. పరమాత్మయే సత్త్వగుణముతోఁ జేరి సగుణమున నీశ్వరశబ్దముచే జెప్పఁబడును. ఈశ్వరునే అనేకు లనేకవిధములుగా వ్యవహరింతురు. వైష్ణవులు విష్ణువనియు, శైవులు శివుఁడనియు, శాక్తేయులు శక్తియనియు, గాణాపత్యులు గణపతి యనియు, తమతమ మతముల ననుసరించి తమయిష్టదైవముగా వ్యవహరింతురు. ఎవరైనను సర్వజ్ఞుడనియు, సర్వశక్తిమంతుఁడనియు, అవాఙ్మానసగోచరుఁడనియు, నిట్లే యనేకము లగు లోకాతీతములగు సుగుణములకు స్థాన మని యేకగ్రీవముగా నంగీకరింతురు. లోకమునఁ గల అనేకు లగు శిల్పనిపుణుల నొకచోఁ జేర్చి యొక్క యంకురమును తయారుచేయు డనిన వారివలన నాపని నెఱవేరదు. అట్లు నెరవేర్చినను దానియందు జీవకళ యుట్టిపడ దనుట నిస్సంశయము. కనుక జగత్సృష్టి యీశ్వరునివలన నని యంగీకరింపక తప్పదు. ఆయీశ్వరునకు జీవకోటియందు ద్వేషరాగాదికము లేక వారికర్మలకుం దగిన ఫలభోగముల నిచ్చుచుండును.

## జీవుఁడు

మలినసత్త్వగుణప్రధాన మగు కల్పితచైతన్యము, అజ్ఞానము, అజ్ఞానమునకు నధిష్ఠాన మగు కూటస్థుడు గలసి జీవుఁ డనబడును. పృథివ్యప్తేజోవాయ్వాకాశముల కలయికచే దేహాకార మేర్పడుచున్నది. తాంబూలమందుఁ గొన్నిటి కలయికచే మదశక్తి పుట్టినట్లు భూతముల కలయికచే దేహాకారమందు చైతన్య మేర్పడుచున్నది. ఈ చైతన్యమునే జీవు డందురు. ఈ పంచభూతమయ మగు దేహము నశించినవెనుక ఘటనాశముచే నందలి యాకాశము మహాకాశమున లీన మగురీతిని జీవాత్మ పరమాత్మయందుఁ గలియుచున్నది.

ఇందుచేత దేహమే ఆత్మ యనువాదము నిరసింపబడినది. నా దేహ మను బుద్ధి దేహమం దహంకారముచే నేర్పడుచున్నది. ఈ జీవులు పుణ్యాపాపకర్మల నాచరింతురు. పరమకృపాళు వగు పరమాత్మ

తాను

ఆ యా కర్మల ననుసరించినజన్మల నిచ్చుచున్నాఁడు. ఈ విషయమై వేదము "య ఇహ రమణీయ చరణా రమణీయాం యోని మాపద్యంతే బ్రాహ్మణయోనింవా, క్షత్రియయోనింవా వైశ్యయోనింవా య ఇహ కపూయచరణాః కపూయాం యోని మాపద్యంతే శ్వయోనింవా సూకరయోనిం వా చండాలయోనింవా" అనగా యోగ్యకర్మాచరణము గలవారు యోగ్యమగు బ్రాహ్మణ, క్షత్రియ వైశ్య జన్మల నెత్తుదురు. నింద్యాచరణము గలవారు నింద్యములగు కుక్క, పంది, చండాలాది జన్మల నెత్తుదురు అని చెప్పుచున్నది. కనుక జీవుఁడు శుభాశుభకర్మలకు కర్తయు, ఆ కర్మఫలములగు సుఖదుఃఖములకు భోక్తయు నని చెప్పవచ్చును. జీవసంబంధమగు శుభాశుభకర్మభోగమునకే జగత్తు సృష్టింపబడుచున్నది.

ఈశ్వరేచ్ఛవలన మాయ తమోగుణప్రధాన మగుచున్నది. ఆ మాయవలన ఆకాశము, వాయువు తేజస్సు, జలము, భూమియను పంచభూతములు రచింపబడుచున్నవి. ఈ పంచభూతములందును క్రమముగా శబ్దము, స్పర్శము, రూపము, రసము, గంధము, అను నయిదు గుణములు గలవు. పంచభూతముల సత్త్వగుణాంశములు చేరి అంతఃకరణముగా మారుచున్నవి. అంతఃకరణపరిణామమే వృత్తి యనఁబడును. ఆ వృత్తి నాలుగు విధములుగా మారును. (1) పదార్థముల స్వరూపమును నిర్ణయించు వృత్తిని బుద్ధి యందురు. (2) సంకల్పవికల్పాత్మక మగు వృత్తిని మనస్సందురు. (3) చింతించు వృత్తిని చిత్త మందురు. (4) అహమ్ అను అభిమానవృత్తిని అహంకార మందురు. పంచభూతముల రజోగుణాంశములవలన ప్రాణోత్పత్తి యగుచున్నది. ఆ ప్రాణము స్థానభేదముచే అయిదు విధములుగా మారుచున్నది. (1) హృదయము స్థానముగా గలదానికి ప్రాణ మనియు, (2) గుదము స్థానముగా గలదానికి అపాన మనియు, (3) నాభి స్థానముగా గలదానికి సమాన మనియు, (4) కంఠము స్థానముగా గలదానికి ఉదాన మనియు, (5) సర్వశరీరవ్యాపకమగు దానికి వ్యాన మనియు పేర్లతో లోకమున వ్యవహారము. మఱియు ఒక్కొక్క భూతముయొక్క వేఱు వేఱు సత్త్వగుణాంశములవలన పంచజ్ఞానేంద్రియములును రజోగుణాంశమువలన పంచకర్మేంద్రియములు రచింపఁబడినవి. అవియే త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణేన్ద్రియములును, వాక్పాణిపాదపాయూపస్థములును చేరి పది యగుచున్నవి. పంచమహాభూతములును, వీనివలన గలిగిన అంతఃకరణము, పంచప్రాణములు, పంచజ్ఞానేంద్రియములు, పంచకర్మేంద్రియములు, ఈ యిరువదియొక్క తత్త్వములుఁ జేరి సూక్ష్మసృష్టి యనఁబడును. సూక్ష్మసృష్ట్యనంతరము ఈశ్వరేచ్ఛవలన స్థూలసృష్టికొఱకు భూతముల పంచీకరణము (అనఁగా నొండొంటితో కలయిక) జేయఁబడినది. పంచీకృతభూతములవలన ఇంద్రియవిషయ మగు స్థూలబ్రహ్మాండము పుట్టినది. ఆ బ్రహ్మాండములోపల భూరాదిలోకములు పదునాలు గేర్పడినవి. ఈశ్వరుఁ డను సముద్రమందు శివవిష్ణ్వాది దేవతలును, ఇతరజీవులును, తరంగస్థానీయులు. తరంగము లెట్లు సముద్రముకంటె వేరు గావో, అట్లే దేవతలును జీవులును ఈశ్వరునికంటె వేఱు కారు. ఈ విషయమును తెలిసికొనుటకైన కోరికయే జిజ్ఞాస యనఁబడును.

## జిజ్ఞాస

పంచభూతసత్త్వగుణాంశరూప మగు అంతఃకరణమునకు మూఁడు దోషములు కలవు. అందు మొదటిది మలదోషము, రెండవది విక్షేపదోషము, మూఁడవది ఆవరణదోషము అని చెప్పుదురు. ఇంతేగాక జన్మాంతరపాపమే మలదోష మనియు, అది నిష్కామకర్మమువలన నశించుననియు మానససంచలనమే విక్షేప మనియు నది యుపాసనాదులవలన నశించుననియు, స్వరూపమును కప్పివేయుటయే ఆవరణదోష మనియు, నది జ్ఞానమువలన నశించుననియు నిర్ణయము. ఏ పురుషుడు పూర్వజన్మములందు నిష్కామకర్మమువలనను, ఉపాసనలవలనను మలవిక్షేపదోషములను బోఁగొట్టుకొనునో యట్టివానికి జిజ్ఞాసాపూర్వక వేదాంతదర్శనవిచారమువలన జ్ఞానముద్భవించును. జిజ్ఞాస యనగా దెలిసికొనుటకైన కోరిక. ఆ జిజ్ఞాస గలవారు ముముక్షువు లనఁబడుదురు; అనగా మోక్షమం దిచ్ఛగలవారని యర్థము. ఆజిజ్ఞాసారూప మగు మోక్షేచ్ఛ ప్రతి మనుజునకు దా నంతట నదియే సులభముగ గలుగదు. మ రెట్లు కలుగుననిన సాధనచతుష్టయసంపత్తి వలన పురుషున కది సులభము. సాధనచతుష్టయ మనగా (1) నిత్యానిత్యవస్తువివేకము, (2) ఇహాముత్రార్థ భోగవిరాగము, శమాదిసాధనసంపత్తి, (4) ముముక్షుత్వము. అందు మొదటి దగు నిత్యానిత్యవస్తువివేక మనఁగా నిత్యవస్తువు బ్రహ్మమనియు, అనిత్యవస్తువులు స్వర్గాదులనియు తెలిసికొనుట. ఇందుకు వేదమందుఁగూడ "తత్సత్య మతోఽన్య దార్తమ్" అని కలదు; అనఁగా ఆ బ్రహ్మవస్తువు సత్యమనియు, ఇతర మనిత్య మనియుఁ జెప్పుచున్నది. రెండవదియగు ఇహాముత్రార్థ భోగవిరాగ మనఁగా ఇహార్థఫలము లగు దారాపత్యపశుధనాద్యుపభోగమును, అముత్రార్థకఫలము లగు స్వర్గమందలి రంభాసంభోగాదిభోగములను విడిచిపెట్టుట, మూఁడవది యగు శమాదిసాధన సంపత్తి యనఁగా, అంతరింద్రియనిగ్రహరూప మగు శమము, బహిరింద్రియనిగ్రహరూప మగు దమము. చిత్తవిక్షేపరాహిత్య మను ఉపరతియు, లేక సన్న్యాసము, శీతోష్ణసుఖదుఃఖాదు లను ద్వంద్వముల సహన మను తితిక్షయు, దైవము గలఁ డను ఆస్తిక్యబుద్ధిరూప మగు శ్రద్ధయు, తెలిసికొనఁ దగిన వస్తువునందు చిత్త ముంచుట యను సమాధానము - ఈ ఆరింటిసంపదయే యని చెప్పుదురు. నాల్గవది యగు ముముక్షుత్వ మనఁగా మోక్షేచ్ఛ యని వివరింపఁబడినది. వేదమందు——

"శాంతో దాంత ఉపరత స్తితిక్షు స్సమాహిత శ్శ్రద్ధావిత్తో భూత్వాఽత్మన్యేవాత్మానం పశ్యేత్"

అనఁగా శమాదిసంపత్తు కలవాఁడై ఆత్మయందే, అనఁగా తన స్వరూపమందు ఆత్మను చూడవలసినదని చెప్పఁబడినది. బ్రహ్మజ్ఞానముకొఱకు వేదాంతవిచారముఁ జేయవలె ననుటలో

"ఆత్మావారే ద్రష్టవ్య శ్శ్రోతవ్యో మన్తవ్యో నిదిధ్యాసితవ్యః"

అనఁగా ఆత్మ చూడవలయును, వినవలయును, మననము జేయవలయును, నిశ్చయజ్ఞానము నొందవలయును అని శ్రుతిప్రమాణము. ప్రస్తుతమగు వేదాంతదర్శనవిచారమునకు బ్రహ్మజ్ఞానము ఫల మనియు ఆ బ్రహ్మజ్ఞానమునకు బ్రహ్మప్రాప్తిరూప మగు మోక్షమను పరమపురుషార్థము

ఫల మనియు నిర్ణయము. ఇందు "బ్రహ్మవి దాప్నోతి పరమ్" అనఁగా బ్రహ్మవేత్త పరమపురుషార్థముఁ బొందునని శ్రుతిప్రమాణము. బ్రహ్మప్రాప్తి యనగా బ్రహ్మసాయుజ్యముఁ బొంది బ్రహ్మాభిన్నమగు బ్రహ్మభావమును పొందుట. ఈవిషయమున "బ్రహ్మవి ద్బ్రహ్మైవ భవతి" - బ్రహ్మవేత్త బ్రహ్మయే యగును; "అయ మాత్మా బ్రహ్మ" ఈ జీవాత్మ బ్రహ్మస్వరూపము; "ఏకో దేవ స్సర్వభూ తేషు గూఢః"—ప్రకాశస్వరూపుఁ డగు నొకఁడే సమస్తభూతములందు గుప్తముగ నుండె ననియు అనేకము లగు శ్రుతులు కలవు. ఆ బ్రహ్మజ్ఞానేచ్ఛయే జిజ్ఞాస యనఁబడును. జిజ్ఞాసతోఁగూడిన విచారమే వేదాంతదర్శనమున విషయము. ఆ విచార మీ క్రింద స్థాలీపులాకన్యాయమునఁ జూపఁబడును.

## వే దా ం త ద ర్శ న  వి చా ర ము

ఛాన్దోగ్యశ్రుతియందు తత్త్వమసి యను వాక్యము గలదు. ఆ వాక్యము శ్వేతకేతువునకు ఉద్దాలక మహర్షిచే నుపదేశింపఁబడిన అద్వితీయబ్రహ్మవబోధకవాక్యమై యున్నది. ఆ వాక్యమునకుఁ బూర్వము "స దేవ సోమ్యేద మగ్ర ఆసీత్, ఏకమేవాద్వితీయమ్" అను వాక్య ముపదేశింపబడినది; అనఁగా సజాతీయవిజాతీయస్వగతభేదము లేని నామరూపరహితమగు ఏసత్ అను వస్తువు గలదో అది సృష్టికిపూర్వము గల దని యర్థము. ఈ శ్రుతియందు, "ఏకమేవాద్వితీయమ్"అనుటచే పై యర్థమందు చూపిన సజాతీయాదిభేదరహిత మను నర్థము చేకూరును. సజాతీయభేద మనఁగా ఒక వృక్షమునకు మఱియొక వృక్షమునకు నగు భేదము. విజాతీయభేద మనఁగా వృక్షమునకు శిలాదులకు గలభేదము. స్వగతభేద మనగా వృక్షమునకు, పత్రపుష్ప ఫలాదులకు గల భేదము. ఈ త్రివిధమగు భేదము లేనిది "సత్" అనఁగా బ్రహ్మపదార్థము అగును. ఎట్లనఁగా ఆ బ్రహ్మపదార్థము ఎల్లపుడు వికారము లేనిదియు, నొకే రూపము గలదియు నగుట వలన స్వగతభేదము లేదు. ఆత్మయందు ద్వైత మంతయు కల్పితము గనుక విజాతీయభేదము లేదు. బ్రహ్మపదార్థమునకు సజాతీయ మగు మఱియొక బ్రహ్మపదార్థము లేదు గనుక సజాతీయభేదమును లేదు. ఆ భేదశూన్యమగు బ్రహ్మపదార్థమే "సత్" అను పదముచే వ్యవహరింపఁబడుచున్నది. ప్రకృతము "తత్త్వమసి"యను వాక్యమందలి "తత్"అను పదముచే పూర్వ ముపదేశించినవాక్యమందలి "సత్"పదార్థ మూహింపఁబడుచున్నది. "త్వమ్" అను పదముచే శ్రవణ, మనన, నిదిధ్యాసము లను వ్యాపారముల నుపయోగించి యాత్మజ్ఞానేచ్ఛగల జిజ్ఞాసువు చెప్పబడును. శ్రవణ మనఁగా వినుట, మనన మనఁగా యుక్తులచే మనసునందు చింతించుట, నిదిధ్యాస మనఁగా విజాతీయజ్ఞానముతోఁ జేరని సజాతీయజ్ఞానపరంపర యని యర్థము. అనఁగా బ్రహ్మభేదజ్ఞానము వదలి సర్వము బ్రహ్మయే యను నిశ్చయజ్ఞానము గలిగి యుండుట యని భావము. ఈ యర్థములుగల 'తత్త్వమ్' పదములకు "అసి" అను పదసామానాధికరణ్యముచేత ఐక్యము చెప్పఁబడుచున్నది. అనఁగా "తత్, త్వమ్" పదములకు వాచ్యార్థమును వదలి 'అసి' యను పదసంబంధమున లక్షణావృత్తిచేత లక్ష్యార్థముఁ జెప్పవలయునని భావము. లక్ష్యార్థ మనఁగా ఆ యా సంబంధముచేత నూహింపఁబడు నర్థము. ఆ యర్థము ప్రకృతమున "తత్త్వమసి" యను వాక్యోపదేశమునకు పూర్వ ముపదేశింపఁబడిన "సదేవ సోమ్యేద మగ్ర ఆసీత్"

అను వాక్యమందలి సత్పదార్థమే "తత్, త్వమ్" పదములచే బోధింపఁబడి బ్రహ్మాత్మైకత్వ జ్ఞానము శ్వేతకేతువునకు ఉద్దాలకమహర్షిచేత నుపదేశింపఁబడుచున్నది.

మఱియు నీ వేదాంతదర్శనమున శ్రీ శంకరాచార్య భగవత్పాదులచే అధ్యాసవాద మంగీకరింపఁ బడినది. అధ్యాస మనఁగా ఒక ఆధారమందున్న ఉనికికంటె వేఱగు జ్ఞానము. దానిని లోకమందు భ్రాంతి యని వ్యవహరింతురు. ఆయా ఇంద్రియదోషమువలన శుక్తియందు రజతభ్రాంతియు, దూరదోషమున మరుస్థలమున జలభ్రాంతియు, అంధకారాదిదోషములవలన రజ్జ్వాదులందు సర్పాది భ్రాంతియు లోకమున ప్రసిద్ధము. ఇదియే భ్రాంతి యనియు అధ్యాస మనియు వ్యవహరింపఁబడునని చెప్పియుంటిమి. వేదాంతదర్శనమున నీ యధ్యాసవాదమునకు మిక్కిలి ప్రాధాన్యము గలదు. ఎట్లనగా "తత్త్వమసి" అను వాక్యమందు సర్వజ్ఞత్వాదిధర్మములతోఁ గూడిన "తత్" అను పదమునకు అల్పజ్ఞత్వాదిధర్మములతోఁ గూడిన "త్వమ్" పదమునకు తమఃప్రకాశములవలె ఏకత్వము ఘటిల్లదు గనుక ఆ ఏకత్వము సంభవించుటకై అధ్యాసవాదము నీ విషయమున నంగీకరించిరి. ఎట్లనగా "త్వమ్" పదార్థమందు యథార్థముగ లేని అల్పజ్ఞత్వాదిధర్మములు భ్రాంతికల్పితములు గనుక వేదాంతదర్శనవిచారమువలన జ్ఞానోదయమై యట్టి భ్రాంతి నశించి "అహం బ్రహ్మాస్మి" 'నేనే బ్రహ్మను' అను సర్వజ్ఞత్వ సర్వశక్తిమత్త్వాదిధర్మములతోఁ గూడిన బ్రహ్మాత్మైకత్వ జ్ఞానము సిద్ధించును. భ్రాంతి గలుగుటకు విషయము మిథ్యావస్తువు. అనఁగా లేనివస్తువని యర్థము. ఆ లేనివస్తువు, భ్రాంతి యీ రెండును జేరి అధ్యాస మనఁబడును. అల్పజ్ఞత్వాదిధర్మములు సర్వజ్ఞత్వాదిధర్మవిశిష్టుఁ డగు ఆత్మయం దధ్యస్తములని చెప్పియుంటిమి గనుక వాస్తవములు కావు. ఇట్లు అధ్యాసవాదము నంగీకరించుటచేత ఆత్మస్వరూపముకంటె వేరు పదార్థము వాస్తవమున లేదని తేలును గనుక "తత్త్వమసి" వాక్యముచేత ఆత్మైకత్వజ్ఞాన ముపదేశింపఁబడినదని నిర్ణయము.

అట్లే "ప్రజ్ఞానమ్ బ్రహ్మ" అను మహావాక్యమందును ప్రజ్ఞానశబ్దమునకు అర్థవిచారణ జేసిన నీక్రింది విధమున నిర్ణయము గలుగును. మనుజుఁడు లోకమునఁగల వస్తుసముదాయమును తన చక్షురింద్రియద్వారమున బయలుదేరిన అంతఃకరణవృత్తితోఁ గూడిన జ్ఞానముచేఁ జూచుచున్నాఁడు. అట్లే శ్రోత్ర, ఘ్రాణ, వాక్, రసనేంద్రియముల ద్వారమున బయలుదేరిన ఆయా వృత్తిజ్ఞానములచేఁ గ్రమముగ శబ్దసమూహమును వినుట, గంధము నాఘ్రాణించుట, శబ్దముల వ్యవహరించుట, రుచుల నెఱుఁగుట సంభవించుచున్నది. అట్లే ఇతరేంద్రియములందును నాయా వృత్తిభేదములచేఁ గలిగిన యే చైతన్యము గలదో యదియే ప్రజ్ఞానశబ్దమున కర్థము. ఆ ప్రజ్ఞానమే బ్రహ్మ యని "ప్రజ్ఞానమ్ బ్రహ్మ" యను శ్రుతిచే ప్రజ్ఞానబ్రహ్మైకత్వము బోధింపఁబడినది.

అట్లే "అహం బ్రహ్మాస్మి" అను మహావాక్యమువలన మాయాకల్పిత మగు జగత్తునందు శమాదిసాధనసంపన్నుఁ డగు పురుషుఁడు తన దేహమందు బుద్ధిచే కల్పిత మగు సూక్ష్మశరీరమునకు సాక్షిగా ప్రకాశించునట్టియు, శ్రవణ, మనన, నిదిధ్యాసములచే నిర్ణయింపఁబడినట్టియు

పదార్థమే "అహమ్" అను పదమున కర్థము. అట్టి నేనే బ్రహ్మ ననుశ్రుతిచేత జీవబ్రహ్మైక్యము సిద్ధము.

అట్లు "అయమాత్మా బ్రహ్మ" అను మహావాక్యమందును "అయమ్" అనుపదముచే అత్యంత సన్నిహితపదార్థము జెప్పఁబడుచున్నది. "ఆత్మ" అను పదముచే అనృత, జడ, దుఃఖాది విలక్షణమై ప్రత్యగధిష్ఠానమై సాక్షియై స్వయంప్రకాశమగు ఆత్మ చెప్పఁబడుచున్నది. ఆ సన్నిహితమగు ఆత్మస్వరూపమే బ్రహ్మ మని చెప్పుటచే జీవబ్రహ్మైక్యము సిద్ధము.

ఇట్లు అనేకశ్రుతులచే జీవబ్రహ్మైక్య మను పరమపురుషార్థము బోధింపఁబడుచున్నది. "నేహ నానా స్తి కించన" అనగా నిచ్చట అనేకవిధములుగా నే కొంచెమును లేదు. "ఆత్మైవేదం సర్వమ్" అనఁగా ప్రత్యక్షముగాఁ జూడఁబడు నీ సన్నిహితపదార్థసముదాయ మంతయు ఆత్మ స్వరూపమే కాని వేఱుగా దని ఏవకారముచేత వేదము నొక్కి చెప్పుచున్నది. "నాన్యః పన్థా విద్యతేఽయనాయ" అనఁగా ఆత్మజ్ఞానముకంటె మోక్షమునకు వేఱుపాయము లేదు. ఇట్లనేకవిధములుగా మోక్ష మను పరమపురుషార్థమునకు ఆత్మజ్ఞానము ముఖ్య మని వేదమందు గలదు. ఆ ఆత్మజ్ఞానము వేదాంతదర్శనవిచారమువలన సుసాధ్యము.



# నాడు — నేడు

శ్రీ పైడిపాటి వేంకటసుబ్బరామశాస్త్రి

చెంగు మని యెక్కచూపుతోఁ జేరవచ్చి, గళముఁ బెనవైచి రెండుచేతులను చాపి
పండెనో-చూడు గోరింట-బావ యనుచు, చిలిపి నవ్వుల నొలికెడి చెలియ - నాడు.

ఎటులొ చూచియు చూడని యటుల జూచి, ఏ తలుపుచాటుననో నక్కి లేత యెడద
నేదియో దాచుకొన్నట్టు లిట్టునట్టు, పెదవి మెదపుచు పలుకని సుదతి — నేడు.

ముచ్చటగ నున్న పసిరిక మొగ్గ - నాడు, తావులం జిమ్ము మవ్వపుంబూవు - నేడు
పెండి లగునన్న బొమ్మలపెండ్లి - నాడు, పెండిలో యన్న అచ్చపుంబెండ్లి - నేడు.

# పాటలీపుత్రము

## శ్రీ సత్యవోలు రాజశేఖరరావు

పూర్వకాలంబున వర్షోపాధ్యాయు డను భూసురోత్తముడు గలడు. ఆ మహనీయుడు పరిలబ్ధనిగమ విద్యాధురంధరుడై నెగడుచుండెను. ఇట్లుండుతఱి నొక్క శుభదివసంబున, మువ్వురు శిష్యు లరుదెంచి, వర్షోపాధ్యాయునికి సాష్టాంగనమస్కారశతంబు లర్పించి నిగమవిద్యోపదేశంబు గావింప వేడిరి. అంత నా మువ్వురకును, శిష్యవాత్సల్యంబు పెంపున దద్వేదంబులు గఱప మొదలిడియెను. వేదాధ్యయన మొనర్చుచుండిన సమయమున వర్షోపాధ్యాయుని గాంచి, "అనఘాత్మా! గురువర్యులగు తమనివాసనగర మెంతో యనుపమశోభాశ్రీయమై విరాజిల్లుచు, వింతగా శోభిల్లుచున్నయది. ఇప్పురీవరంబునకు "పాటలీపుత్ర"మను పే రెట్లుగలిగినదియు విన వేడుక పడుచున్నవార" మని శిష్యులు వేడుకొనిరి. అంత నా గురువర్యుం డత్యాదరమున వారలం గని, "వత్సలారా! మీకు తత్కథ నంతయు దెల్పెద, సావధానచిత్తులరై యాలకింపు"డని యిట్లు చెప్పదొడంగెను.

"గంగాతరంగిణీద్వార దేశమందు, లోకప్రసిద్ధమయినదై యతిపవిత్రమైనదై గనఖల మను నొక పుణ్యతీర్థ మొప్పారుచుండెను. అట్టి పవిత్రతీర్థమందు గిరులను భేదించుకొని, గంగ యిలాతలమున కరుదెంచుటచే, సత్యంతపావనక్షేత్రంబై యది విరాజిల్లుచున్నయది. ఆ స్థలమున దక్షిణాత్యుండను మహీసురుండు సత్యవాక్యపరిపాలకుడై, ధర్మతత్పరబుద్ధి గలవాడై, భక్తితత్పరుడై, నిజదారసమేతుడై, వసించుచుండ నతనికి మువ్వురు తనయు లుద్భవించిరి. కొంతకాలమున కా బ్రాహ్మణదంపతులు దివ మలంకరింప, నా విప్రకుమారు లనాథులై యచ్చోటు వాసి, రాజగృహ మను నగరమును జేరి యచట గొంత విద్యార్జన మొనర్చి, దిక్కులేమికి మిగుల వగచి, యటనుండి దక్షిణముగా నేగి, చించిని యను పురమునకు జనిరి. అప్పురవరంబును బ్రవేశించి, భోజకుండను విప్రునిగృహమున కరిగి, యాతని యనుమతి నొంది యట వసించుచుండిరి. ఆద్విజోత్తమునకు బురుషసంతతిలేని కతంబునను, వయోవృద్ధు డగుటంజేసియు, వైరాగ్యముతో వనంబుల కరిగి తపం బాచరింపదలంచి, యా భూసురకుమారులం జూచి, సద్భావముతో తనకుగల సర్వస్వమును, మువ్వురు పుత్రికారత్నములను వారల కొసంగి, తప మాచరింప గంగాతీరమున కేగెను. భోజకుడు వనముల కేగినపిదప, నా భూసురకుమారులు మువ్వురు కుమారికలను క్రమమున బరిణయమై యిష్టోపభోగములతో గొంతకాలము వెళ్లించిరి. వా రట్లు సంతోషస్వాంతులై సౌఖ్యమొందుచుండ, భీకరక్షామబాధచే జనులు పీడితులగుచుండిరి. మామగా రిచ్చిన విత్తమంతయు వ్యయమైపోవ నాత్మరక్షణార్థమై భార్యలను వీడి యా మువ్వురు సోదరులు నెటకో పోయిరి. కటా! సమస్తసద్గుణోపేతలు, పతివ్రతలునయిన ప్రియభార్యల పై ననురాగ మెట్లు వీడిరో కదా! ఆకటిచిచ్చు నట్టిదే గదా! కాల మెల్ల నొక్క రీతిగా బోవునా? అనురాగవిహీనులగు నాబ్రాహ్మణులు, తమ భార్యలను వీడి వెడలునపుడు, విప్రపత్నులలో మధ్యమురాలు గర్భవతియైయుండెను. ఆ సోదరీమణులు మువ్వురును పతులకై విలపించుచు, కాననములలో

దిరిగి విసిగి వేసారి, సహాయశూన్యలై యొంటరిగా జీవయాత్ర గడపుట కష్టమని తలచి, తమతండ్రి ప్రియమిత్రుడగు యజ్ఞదత్తు డను విప్రముఖ్యుని గృహమునకుం జేరిరి. ఆ వనిత లాతనితో జనకుని వైరాగ్యమును, నిజేశ్వరులపలాయనమును, నెరుకపరచిరి. ఆ భూసురోత్తముడు, వారలను ప్రియతనయలవలెనే ప్రేమించి పోషించుచుండెను ఆ నారీరత్నములును హృదయములందు వెతనొందుచు,జీవితేశ్వరుల దలంచుకొనుచు దైన్యముతోనుండిరి. "ఆపదలందుసైతము కులకాంతలు ధర్మపథము దాటరుగదా!" "విపత్తులందు ధైర్యము నొందుటే ఘనమైనది." ఇట్లు కొంతకాల మైన తరువాత రెండవపడతి కొక శుభదినమున నొక పుత్రు డుదయించెను. ఆ ముప్వురు సోదరులును, ఆ పసి నిసుగును గాంచి, మహాప్రేమతో బెంచికొనుచు, నాబాలుడే దిక్కనియు, గతి యనియు, దలంచుకొనుచు మహానందభరితులై యుండిరి.

ఇట్లుండ నొక్కతఱి, పార్వతీపరమేశ్వరు లంతరిక్షమున విహరించుచుండ, పార్వతీదేవి యామె దృక్కులను క్రిందకి బరపి, ముప్వురుతల్లుల ముద్దుబిడ్డ నరసి, ప్రాణవిభుడగు నీశ్వరునకు జూపి "నాధా! పసిపాపను, వానిని ముద్దాడు తల్లులను గాంచితివా? 'ఆ పసిపాపయే త మ్మెప్పుడో పెద్దయై రక్షింప నోపు'నని యాస్త్రీలు గంపెడాశతోనుండి పెంచుకొనుచున్నారు. కావున పాప మాతల్లుల కోర్కెదీర్చి, వారి నుద్ధరించి, పసిపాపను రక్షింప కటాక్షింపవలెను.'' అని పార్వతీదేవి పరిపూర్ణకరుణారసతరంగితాంతఃకరణయై పలికెను. భక్తలోకాభీష్టవరప్రదాతయగు నా శంభుడు పార్వతితో "దేవీ! ఆ బాలకుడు నా యాంతరంగికభక్తుడు. నేను వాని నిదివరలోనే యెరుంగుదును. ఆతడు తొల్లి భక్తవరు డగుటచే, నిప్పు డుర్విలో భాగ్యభోగము లనుభవింప, పూర్వపుణ్యామహిమచే ని ట్లుద్భవించెను. తల్లుల మూవురకును మోదము గూర్చి, సుఖాంబునిధి నోలలాడి, యచిరకాలములోనే భాగ్యవంతుఁ డగును. ఇదివరలో వీనిభార్య మహేంద్రవర్మకుమార్తె యగు పాటలి. ఆ బాలికామణియే యీజన్మమందును సతి యగును. ఈబాలకునికై సందేహము వలదు. నా యనుగ్రహమునకు బాత్రుడు" అని పల్కెను. శంకరు డా నాటిరాత్రి మూవురుపడతులకు స్వప్నములో సాక్షాత్కరించి, సంతస మొదవ నిట్లు నుడివెను. 'ఓవనితలారా! మీ కుమారుడు పుత్రకు డనుపేరం బరగును. నిత్య మాత డుదయంబున నిద్రలేచు లోపల, దలక్రింద లక్షవరా లుండును. క్రమమున నాత డొక నృపాలకుడై విలసిల్ల గల''డని పల్కి యంతర్హితు డయ్యెను. అంత నాస్త్రీలు మేలు కాంచి, స్వప్నవృత్తాంతము లొండొరులు ముచ్చటించుకొని, ముద మందిరి. ఒకనాడు సూర్యోదయసమయమున పుత్రకుడు నిద్దుర మేల్కొనగనే, లక్షవరాలు తలక్రింద గని యా వనితలు ప్రమోద మందిరి. ఈ యావద్వృత్తాంతమును, నిజజనకునిభాతి నున్న పోషకుడగు యజ్ఞదత్తున కెఱిగించిరి. పుత్రకుడును, దినదినప్రవర్ధమాను డగుచుండెను. అనుదినంబును పెరిగెడు పైడివరాలు పెద్దరాసులై యుండెను. అతడు అచిరకాలములో రాజ్యాధిపతియై సిరులతో భాసిల్లుచుండెను.

ఇట్లా పుత్రకుడు మహైశ్వర్యసంపన్నుడై యుండ యజ్ఞదత్తుఁ డతనితో రహస్యముగా నిట్లుపలికెను. "ప్రియపుత్రకా! ఓరాజా! అనావృష్టివలన, మహాక్షామము సంభవింప, సతుల నెడబ్రాసి, తమయాత్మ

రక్షణమునకై నీతండ్రులు లేటకో పోయిరి. నాటినుండి నేటివరకును వారిజాడ తెలియకుంటచే, నీజనకులు పతివియోగదుఃఖానలముచే పరిపీడితహృదయలై యున్నారు. నీ విప్పుడు సమస్తకార్యసంఘటనా సమర్థుడవై యుండుటచే, నీ జనకుల నెవ్విధముననైన వెదకి, యిచటికి రప్పించు టెంతయు ముఖ్యము. వారియనుంగు పుత్రుడవైన నీవు మహారాజ్యపదవీస్వీకరణ మొనర్చి ప్రజాపాలనం బొనర్చుట గాంచి, మిగుల నానందింతురుగదా! నీవు దాతృత్వము గలవాడవై, పెక్కుధనరాసులు దానము జేయుము దాన జగద్విఖ్యాతిగలుగును ధనార్థులగు నీజనకులు తప్పక నిట కరుదెంతురు. కావున నీవు దాన మొనర్చు టవశ్యకర్తవ్య"మని బోధించెను. ఈ రీతిని తనకుం బ్రియమార బోధించిన యజ్ఞదత్తుని వచనముల నాలించి, యీశ్వరవరప్రసాదలబ్ధసువర్ణుడైన యాపుత్రకుడు, దానదీక్ష బూని, ధనార్థులకు హేమభూషణాదులు విరివిగా దాన మొనర్చుచుండెను పుత్రకమహీపాలుని వితరణ కీర్తిచంద్రికలు, దశదిశల ప్రకాశింప చతుస్సముద్రముద్రిత మేఖలావలయిత భూసురాఖండలు లందరును దానప్రతిగ్రహణేచ్ఛచే, నాతనిరాజధాని కరుదెంచుచుండిరి. ఆతనిజనకులు నిట్టి దాన వార్త విని యొకసమయమున ధనలాలసచే పుత్రకుని పురమున కరుదెంచి తమ్ముగుర్తించిన నిజపత్నులచే గౌరవపురస్సరముగా నాహ్వానింపబడి, మహైశ్వర్యవిభవ మనుభవించుచుండిన పుత్రుడగు పుత్రక మహారాజునుం గాంచి, మహానంద మొందుచు సుఖించుచుండిరి. ఇట్లుండ కొండొకకాలమునకు హీనులును, దుష్టబుద్ధులును, దుర్మార్గులు నగు నా కుటిలబ్రాహ్మణులు ముప్పురునుగూడ, పుత్రునిసౌఖ్యమును రాజ్యవిభవమును గాంచి యోర్వలేక, రాజ్యమును తామే యేలుద మనుకాంక్షచే, ప్రియపుత్రునిపై ప్రేమను గణింపక మహాపాపమున కొడిగట్టి కఠిన చిత్తులై యెటులైన నా పుత్రకరాజేంద్రుని వధింపజేయ సమకట్టిరి.

ఇట్టి దుశ్చింత గలవారై, యొకదినమున కొందరు హంతకులకు లంచ మిచ్చి, యొడబరచి, యొక సమీప దేవాలయమున దాగియుండ నియోగించి, యొంటరిగా వచ్చు బాలుని వధింపు డని యాన తిచ్చిరి. అటుతరువాత పుత్రకుని కుయుక్తితో దేవీదర్శన మొనర్పవలెనని దోడ్కొనిపోయి, నీ వొక్కరుడవే గర్భాలయము జొచ్చి దేవిని ప్రార్థింపు మని నుడివిరి. పితరుల వచనమందు పరిపూర్ణవిశ్వాసము గలవాడై, యా పుత్రకుడు దేవతాగృహము జొచ్చెను.

అట గర్భాలయమున కృపాణపాణులై నిర్భయముగా వధింప నుంకించు దారుణకర్ముల గాంచి భయవిస్మయముల నొంది, ధైర్యము చిక్కబట్టి వినయోక్తులతో వారిం జూచి యిట్లు నుడివెను. "ఓరీ హంతకులారా! మీ రెవ్వరు? న న్నేకారణమున నీ దేవాలయాంతర్భాగమున వధింప గడంగితిరి? ముందుగ నన్ను వధింప కారణ మెద్దియో తెలియజేసి, మఱి చంపుడు, నా ప్రాణములు పోవుటకు వెరువను. మీ క్రూరకార్యమున కడ్డు దగులువాడను కాను. కాని, కారణమెఱింగింపకయే న న్నూరక చిత్రవధ జేయుట మాత్రము తగదు. నా నేర మేమియో తెలుపుడు. మరణమునకు సంసిద్ధుడనై యున్నాను. జాతస్య మరణం ధ్రువ" మ్మనెడు నార్యోక్తిచే జన్మించిన జీవికి మరణము తప్పదు. దీని కింతగా వగచుట లేదు. కాని యకారణముగా నన్నేల వధింప దలంచితిరో నా

కేమియు స్మృతిపథమునకు రాకున్నది.'' అని పల్కెను. ఆ పుత్రికుని పలుకు లాలించి, యా హంతకు లాతని గాంచి "ఓ మహానుభావా! మేము నీ నేరమునకై వధింపదలచలేదు. నీ జనకులు మా కాసగొలిపి ధనమిచ్చియొడబరచి, నిన్ను వధింపగోరిరి. మాకు జీవుల జంపుటయే వృత్తిగాన ధనాశాపరులమై యందులకు సమ్మతించితిమే కాని, నీ యందు మా కావంతయు కినుక లేదు. నిన్ను వధింపక విడచిన మా ధనము బోవుటయే కాక, నీ జనకులచే శిక్షగూడ నొందవలసివచ్చును. ఈ క్రూరకార్య మంతయు నీ జనకులదై యున్నది.'' అని యా క్రూరచిత్తులగు హంతకులు సత్యమునే వచించిరి. అంత నా పుత్రికజనపాలుడు వారు (ముువ్వురు ద్విజులు) జనకులు గారు. తన పాలిట మృత్యుదేవత లని తలంచి యెట్లులైన నుపాయంబుచే ప్రాణమును గాపాడుకొని మృత్యువును దప్పించుకొనదలచి యా వధకులతో "ఓరీ! ధనమునకై కదా మీరు నన్ను వధించుట? అమూల్యమైన యీ హేమమయరత్నహారములను మీ కొసంగెదను. వీనితో తృప్తినొంది నన్ను విడువుడు. నేను ప్రచ్ఛన్నవేషముతో నెటకేని బోయి జీవింతును. నా జీవితరహస్య మెవ్వరికిని తెలియనీయను. మీకు హింసాదోషమును వాటిల్లదు. నా జనకులవలనగూడ విశేషద్రవ్యమును పారితోషికముగా పొందుడు.'' అని పలికిన నా హంతకులు సమ్మతించి రత్నహారముల గైకొని, పుత్రికుని విడచి, యాతని దునిమితి మని పుత్రికుని జనకులతో చెప్పి వారలవలన నొడబరచికొనిన ధనమును పారితోషికముగా గైకొనిరి. దురాశాపీడితులైన యా విప్రులు సుతుడగు పుత్రికుని రాజ్యపదవిని స్వీకరింపదలంప పుత్రికరాజన్యుని సచివు లా క్రూరు లొనర్చిన ద్రోహమునకు జింతించి, వారి ముువ్వురను చంపించివేసిరి. క్షామపీడితులై సుతులను పీడినట్టియు, దురాశాపరులై ద్రోహచింతతో ప్రియసుతుని జంప సమకట్టినట్టియు నా కృతఘ్నుల కింతకంటె తగిన సత్కార మేమైన నున్నదా!

పుత్రికమహీపాలు డట్లు హంతకులచే విడువబడి స్వబంధువిరక్తి గలవాడై తన నిజపట్టణమునకు వెడలనోపక, త న్నెవ్వరు గుర్తెరుంగకయుండులాగున గూఢముగ వర్తించుచు, మహాఘాతుమృగసమన్వితమైన వింధ్యకాంతారమున కేగి,యటునిటు దిమ్మరుచుండ నొక్కచోట మహాబాహుబలు లిద్దరు నొండొరులతో తగవులాడుకొనుచుండుటను గాంచెను. అట్టి జెట్టివారలచెంతకు జని "అయ్యా! మీ రెవ్వరు? ఎందుల కిట్లు నిష్కారణముగా నొకరి నొకరు గ్రుద్దుకొనుచు, ప్రహరించుకొనుచున్నారు? కారణ మెరిగించితిరేని నాకు తెలిసిన రీతిని తగవు పరిష్కరించెద నని పల్కెను. అంత వా రా పుత్రికునితో "మహాపురుషా! మే మొక విప్రునికుమారులము, సోదరులము. మా కీ వేత్రము, ఈ పాత్ర, యీ మహత్తరపాదుకలును మాత్రమే పితృధనము. మే మిరువురము నీ మూటిని సమముగ పంచుకొన భాగము తెగ కిట్లు పోరుచుంటిమి. మా యిరువురిలో నెవడు బలవంతుడో వాని కీ మూడు మహత్తరవస్తువులును చెందునని యొప్పుకొని పరీక్ష చేసుకొను చుంటిమని'' పల్కిరి. వారి పల్కుల నాలకించి పుత్రికుడు మందహాస మొనర్చి "అయ్యో! ఎంతటి మూర్ఖులు! జ్ఞానశూన్యులవలె నుంటిరే! ఇవనగా నెంత; వీసమైనను విలువ లేనివే? మీ రిరువురును సోదరులేగదా! ఎవ రేది గైకొన్న నేమి? మీలో నెవ్వరైన

నీసుమంత హెచ్చు సౌఖ్య మనుభవించగూడదా! ఇంత స్వల్పమునకై యిట్లు తగవులాడి ప్రాణ త్యాగ మొనర్చుట న్యాయమా? జ్ఞానులకు త్యాగమే గదా సహజలక్షణము? మీవంటి వారికి ధన లాలసత తగునా? ఎవ్వరైన వినిన నగుబాటుకాదా!'' యని మందలించెను. అంత నా ద్విజకుమా రులు ఓ యయ్యా! ఈ దివ్యవస్తువులమహిమ నీ వెరుంగవు. కావుననే యిట్లు పలుకుచున్నాడవు. ఈ దివ్యపాదుకలపై పాదము లుంచిన నాకాశగమనము కలుగును. ఈ పాత్ర, మహామహిమాన్విత మైనదై, సతతమును మంచి మంచి రుచ్యములగు పదార్థముల నన్నిటి నడిగిన తక్షణమే యొసం గును. ఈ మహత్తరదండమును గైకొని భూమిపై నేది లిఖించిన నది తోడనే సత్యమగు రూపము నొంది లభ్య మగును. మనోవాంఛ లొసంగెడు నిట్టి మహత్తరవస్తువుల నెవ్వడు విడుచును. పైవా రెన్నేని నీతులు సులభముగా నుడువవచ్చును. మా జనకుడు వీనిని ప్రాణసమానముగ నెంచుకొని సర్వకాలము తృప్తినొందెడువాడు. అట్టివస్తువులకై మేము పోరుట న్యాయముకాదా!'' అని పల్కిన పుత్రకుడు విని అట్టి పవిత్రవస్తుచయ మెట్టిశక్తిమంతములైన నగుగాక! వాటికై మీరు పోరి ప్రాణములు విడువవలెనా? మీ బలాబలముల నారయుట కిక వేరుపాయమే లేదా? మీ దివ్యవస్తువుల నిటనుంచి మీ రొక నిర్దేశప్రదేశమునకు బర్వెత్తి రాగూడదా! బలాధికుడైన వాడే ముం దరుదెంచును. ఆతడే వీనిని పొంద నర్హుడు'' అని నిరపాయంబైన యుపాయ మెరిగిం చెను. ఆతని యుక్తుల నా విప్రసోదరులు విని దివ్యవస్తువుల నట విడిచి పర్వెత్తిరి. అదె మంచి యదనని పుత్రకుడు మది నెంచి వేత్రమును, పాత్రమును గైకొని దివ్యపాదుకల దొడిగి యంబర తలమున కెగసిపోయెను. పుత్రకు డట్లు గగనపథమున విహరింపుచు కడుదూర మరిగి ఆకర్షిక యను నగరమున బ్రవేశించెను. ఆ పుటభేదనమున తనకు తగిన నివాసమునకై వెతకుచు నెచ్చటను తగిన వసతి దొరకమిచే నిర్జనంబగు నొక శిథిలగృహమును జేరి యటనే యుండుట కనుమతి నొంది యందున్న యొక పేదరాలికి కొంతధన మొసంగి యటనే ప్రచ్ఛన్నముగ నివసించుచుండెను.

ఇట్లు కొంతకాల మరిగిన పిదప నొకనా డా ముదుసలి పుత్రకుని జూచి "వత్సా! నీవు సుందరుడవైన యువనుడవు. నీ సుగుణములకు, సుందరరూపమున కనువగు నొక సౌందర్యరాశిని పత్నిగా గైకొని సుఖియింపకుండుటచే నాకు చాల చింత కలుగుచున్నది. కావున వెంటనే పరిణయప్రయత్న మొనర్పుము. నే నెంచిచూడగ నీ పురాధిపతి యగు పార్థివుని పుత్రికయగు పాటలి యను కన్య గలదు. ఆమెయే నీకు సర్వవిధముల దగియున్నది కాని యామె నీ కందరాని ఫలము. ఆమె మహారాజాం తఃపురమున భృత్యకోటిచే పరివృతయై కాపాడబడుచున్నది. కాని నీ యదృష్ట మెట్లున్నదో యా కన్యకామణికై ప్రయత్నింపుము'' అని యుద్బోధించెను. ఆ వనిత పల్కిన వడువున పుత్రకుడు మనమున దలంచి పాటలికన్యను గనుగొను కోర్కెతో దివ్యపాదుకలు దొడిగి యాకాశమార్గ మున నా పురాధిపతి మేడ దరి కేగి గవాక్షముగుండ సౌధములోని కరిగెను. అట నొక హేమ మయపర్యంకముపై సుఖముగ నిద్దుర జెందుచున్న బంగరుబొమ్మ బోలు నవయౌవనసుందరిని గాంచి తన్మయుడై యనుక్షణ మామె సౌందర్యామృతమును తన దృక్ప్రసారములచే గ్రోలుచు

30X

నానందతరంగమాలికా డోలికలలో నూగులాడుచుండెను. ఎట్లయిన నా సుందరగాత్రిని మేల్కొల్ప నూహించి యామె సుందరవదనారవిందమును ముద్దిడుకొనియెను. ఆ నీరజాక్షి యగు పాటలియు మెల్లన మేలుకాంచి దివ్యసుందరదేహుని గాంచి పరమసంతోషస్వాంతయై లజ్జాకౌతుకంబు లొక్కసారి తన్నావరింప నామె తన హృదయమున "ఈ నవమన్మథాకారుడు నా పూర్వజన్మార్జితపుణ్యవశంబుననే యప్రయత్నంబుగ నన్ను వరింప నేతెంచె" నని మిగుల నానందించెను. అంత పుత్రకుడు తన సకలవృత్తాంత మామెకు కర్ణపేయముగా వినిపించి, యామె యానతిపై నా రమణీమణిని పాణిగ్రహణ మొనర్చుకొనెను. ఆరేయెల్ల నట్లానందసాగరనిమగ్నమానసులై యుండిరి. అంత వేకువ రుదేర, పుత్రకుడా పాటలీకన్యను గాంచి "ప్రేయసీ! నే నిక బోయి వచ్చెదను. చింతిలబోకుము. నే నిటులే ప్రతిరేయియు నీదరికి వచ్చుచు బోవుచుండెదను" అని నుడివి విడువలేక యెట్టకేల కామెచెంత సెలవు గైకొని, యా వృద్ధురాలి గృహమున కరుదెంచెను. పుత్రకుడు ప్రతిరాత్రియు వేడుకతో దివ్యపాదుకల సహాయముచే పాటలిమందిరమునకు బోవుచు వచ్చుచు సుఖముగ నుండెను. ఇట్లు వా రన్యోన్యసౌఖ్యానందము లనుభవించుచు, పెక్కుదినములు వెళ్లించిరి.

ఇట్లు కొంతకాల మరిగిన తరువాత పాటలి శరీరమందలి మార్పును గాంచి పరిచారిక లామె జననీజనకులతో నీ విషయమును విన్నవించిరి. అంత నారాజు విచారించి నేర్పుగల యొక పరిచారిక నేర్పఱచి, రాత్రికాలమున పాటలిమందిరమున నుండి స్థితిగతు లరయు మని యాజ్ఞాపించెను. రాజాజ్ఞను శిరసావహించి యా చెలికత్తె పాటలిమందిరము జొచ్చి రహస్యముగ నుండ యథారీతిగా పుత్రకుడు దివ్యపాదుకల ప్రభావమువలన, నా సుందరగాత్రి హేమపర్యంకముదరి కరుదెంచి, యామెతో నిష్టోపభోగముల జెంది సౌఖ్య మొంది యామె శయ్యాతలముపై గాఢనిద్రమై పవ్వళించిన సమయమున, నా చెలికత్తె పుత్రకునిదరి కరిగి యాతని విలువగల వలువలపై నెత్తురు గురుతు లమర్చి వెడలిపోయి యా సమస్తవృత్తాంతంబును రహస్యముగా రాజున కెరింగించెను.

అంత నా జననాథుడును చారుల బంపి యా పరిచారిక యొనర్చిన గుర్తుల నెరిగించి, నవమన్మథాకారు డగు నా సౌందర్యవంతుని నన్వేషించి కైకొని రాబనిచెను. ఆ చారులును పురమున నలుదెస లందు బరికించి పురాతనగృహమందు వసియించియున్న పుత్రకుని చిహ్నములచే గుర్తించి రాజసన్నిధికిం గొంపోయిరి. ఆ సమయమున పుత్రకుడు భీతచేతస్కుడై రా జేమి యొగ్గొనర్చునో యని తలంచి, చిత్రముగ దివ్యపాదుకల దొడిగికొని గగనమున కెగసిపోయి రాజపుత్రికను గని "ఓ కన్యారత్నమా! మన రహస్యము నీ జనకునకు దెలియ నన్ను శిక్షింప నుద్యుక్తుడై నన్ను పట్టించెను. నే నెట్లో తప్పించుకొని యిట కరుదెంచితిని. కాన మన కిక నిట నుండ వలనుగాదు. నీవు నా యందలి ప్రేమ గల్గిన దాన వౌటచే వెంటనే నా వెంట రమ్ము. ఎటకేనియుం బోవుదము. "ఆలస్య మమృతం విష"మ్మనెడి సూక్తులు నీవు వినియుండలేదా?" అని పల్కెను. వెంటనే యక్కన్యకయు ప్రేమాంతరంగయై పుత్రకుని విడువనొల్లక, యాతని దివ్యపాదుకలు దొడిగి వినువీథిం బరతెంచ

రాజును ప్రజలును మిక్కిలి విస్మయ మొందిరి. అట్లు పుత్రికుడు పాటలీసమేతుడై గగనమార్గంబున బహుదూరం బరిగి గంగాపరిసరప్రాంతమున దిగి యా రాజపుత్రికను సుభోజ్యములును షడ్రసోపేతములు నైన దివ్యపాత్రసంలబ్ధ మగు నాహారాదులచే సంతోషపరచి, వినోదముగా నుండెను. అట్టితఱి నా రాజకుమారి యగు పాటలికి దివ్యపాదుకల మహిమయు వేత్రపాత్రములయొక్క శక్తినిగూర్చి వర్ణింపగా పాటలి మిక్కిలి ముద మందెను. వేత్రముయొక్క మహిమ ప్రదర్శింప నా పాటలి కోరగా, పుత్రకు డమందానందకందళితహృదయారవిందుడై యా యష్టిని గైకొని, వివిధవిచిత్రచిత్రితంబు లగు హర్మ్యంబులు మహాసౌధములు నతి రమణీయములగు భవనముల గలిగి సకలసస్యసమృద్ధియు, జనసమృద్ధియు గల నొక పురవరంబు వ్రాసెను. ఆ వెనువెంటనే దివ్యయష్టిప్రభావకలన నా పుత్రకుని లిఖిత మంతయు సత్యంబై యొక మహాపురమై కన్పట్టెను. అట్టి మహోన్నతికెక్కి సకలైశ్వర్యముల కిరవై యుండు నాపుటభేదనమునకు పుత్రకుడే ప్రభు వయ్యెను. పుత్రకమహారాజు తమ దివ్యదంపతులపేర దానికి "పాటలీపుత్ర" మని దివ్యనామధేయ మొనర్చి, సర్వప్రజ లానందింప సామంతాది రాజన్యులు గొలువ చతుస్సముద్రముద్రితమైన యీ భూవలయము నేలుచుండెను.

అట్టి దివ్యనగరమై యొప్పారుచుండిన పాటలీపుత్రనగర మిప్పటికిని గూడ నగరరాజమై యలరారుచునే యున్నది. అట్టి దివ్యనగరరాజ మెప్పుడో యతిప్రాచీనకాలములో నుత్పత్తియైనట్లు చరిత్రప్రసిద్ధమైనదై మిగుల జనసమృద్ధమై సకలైశ్వర్యముల కిరవై చిరస్థాయిగా వర్ధిల్లుచు నేటికి గూడ ప్రకాశించుచున్నది అని వర్షోపాధ్యాయుడు తన మూవురు శిష్యులతో నిట్టి వృత్తాంతమంతయు దెల్పగా వారు విని యత్యంతానందము నొందిరి.



# ఖుతుబుషాహీల ఆంధ్రభాషాపోషణము

శ్రీ సురవరము ప్రతాపరెడ్డి

గోలకొండ రాజ్యము నేలిన ఖుతుబుషాహీ ప్రభువులు గాఢమైన స్వమతాభిమానులే కాని బహమనీ సుల్తానులవలె పరమతధ్వంసకులు కారు. రాజ్యకాంక్ష బాగా కలిగినవారే కాని బహమనీలవలె రక్తపిపాసులు కారు. స్వభాషను మాత్రమే వీరు బహమనీలవలె ప్రేమించినవారు. దక్షిణ దేశమందు శిశుప్రాయమైయున్న ఉర్దూకు వీరు అవలంబన మిచ్చి పోషించిరి. ఈ ఖుతుబుషాలు స్వయముగా ఉర్దూకవన మల్లిరి. పైగా తాము విశేషముగా తెనుగుదేశమును పాలించినవారగుటచేత తెనుగును కూడా పోషించిరి. తమ సనదులను ఫార్సీలో వ్రాయించి ఇచ్చుచు ఆ విషయములనే తెలుగులోను వ్రాసియిచ్చిరి. తెలుగు మండలములలో తెనుగుద్వారానే రాజ్య వ్యవహారములను సాగించిరి.

మొదటి ఖుతుబుషా చిన్నకుమారుడును, మూడవ గోల్కొండ సుల్తానును అగు ఇబ్రహీం ఖుతుబుషా ఏడేండ్లపాటు విజయనగరసామ్రాజ్యములో తల దాచుకొని విజయనగరమందుండి తెనుగు బాగా నేర్చుకొనెను. తాను గోలకొండ సుల్తానైన తర్వాత విజయనగరమును నాశనము చేయుటకు ముఖ్యకారకు డయ్యెను. విజయనగరచక్రవర్తి యగు అళియరామరాజుకు దత్తపుత్రుడుగా స్వయముగా ఏర్పడిన అహమద్నగరు సుల్తాను అగు అలీ ఆదిల్షాయును రామరాజుచే ఏడేండ్లు స్వపుత్రునివలె రక్షింపబడిన గోలకొండ ఇబ్రహీమున్నూ రామరాజును తల్లికోట యుద్ధములో చంపి విజయనగరమును భస్మము చేసి తుంగభద్రలో కడిగివేసిరి. ప్రపంచములో కని విని యెరుగని ప్రత్యుపకారమంటే ఇదొక్కటే యుండవచ్చును! ఈ విధముగా ఇబ్రహీము ఆంధ్రులకు క్షమింపరాని అపకారము చేసినను అతని కొద్దిపాటి తిరిపపు ఆదరణమును మాత్రము ఆంధ్రులు మరువలేక పోయిరి. ఇది యింకొక విచిత్రమగు కృతజ్ఞత! ఇబ్రహీం పేరునే మార్చివేసి ఇభరాముని చేసిరి. అతడు ఆంధ్రుల కంతటి అభిరాము డయ్యెను !!

"మల్కిభరాముడు" ఆంధ్రమును బాగా ఎరిగియుండెను. సలక్షణముగా మాట్లాడుచుండెను. కవుల శ్రావ్య మగు కవితాధారాసుధారసమును కుత్తుకబంటిగా గ్రోలెను. తన్మయుడై తల ఆడించెను. ఆవేశపరుడై అడ్డాదిడ్డిగా తెనుగు కవనమును స్వయముగా అల్లెను. రమ్మురమ్మని కవులతో సరసమాడెను. అద్దంకి గంగాధరకవిని పిలిపించి తపతీసంవరణోపాఖ్యానమును వ్రాయించి కృతినందెను. అల్లాకాని, రసులల్లాకాని ఇబ్రహీం సుల్తానును రక్షించి పోషించు గాత అని అద్దంకి కవి దీవించలేదు. "శౌరి ఘనుడై కరుణారసవృష్టిచే నిరా,యాసత బ్రోచుగావుత కృపాగ్రణి మల్కిభరాము శాందిపుర్" అని దీవించెను. ఇబ్రహీము అందులకు సంతసించి గంగాధరునితో ఇట్లనెను:

"పెక్కుకృతుల్ చమత్కృతులు పెంపుగ నందితి గాని...న,
మ్యక్కృతి కన్యపై గల మమత్వము వర్తిలదు."

ఇట్లని తపతీసంవరణోపాఖ్యాన మను పౌరాణికగాథను కృతి పొందెను. సుల్తాను ఆంధ్రభాషను పోషించినది చూచి అతని సేనలో గొప్ప యధికారియై యుండిన అమీర్ఖాన్ గూడా ఒకకృతిని అందెను. పొన్నగంటి తెలగనార్యుడు యయాతిచరిత్రము అను అచ్చ తెనుగు కావ్యమును రచించి అమీన్ఖానునకు అంకిత మిచ్చెను. తెనుగు వాఙ్మయములో ఇదే మొదటి అచ్చ తెనుగుకృతి. అమీన్ఖానుగూడా మంచిసరసుడు. ఎన్నియోతరాలనుండి గోలకొండకు ౨౦ మైళ్లదూరమునన్న పొట్లచెరువులో ఆతనిపూర్వీకులు నివసించియుండిరి. అతని కుటుంబము హిందువులను ప్రేమించి ఆదరించుచుండెను. అతడు చిన్న దర్బారు చేసి "దీవు లేలు జలియుల్ రౌకుల్ మొదల్గా దనం గొలువన్ సంతసమంది కబ్బములు పేర్కొ-వించు" ఆనందించుచుండెడివాడు. అతనికి ముఖ్యసచివుడు మరింగంటి అప్పన్న అను ఆంధ్రుడు. అమీర్ఖాను ఏమాత్రమున్నూ మతద్వేష మే కోశము లోను లేనివాడు. పైగా హిందువులను తన వారివలె ప్రేమించేవాడు.

"కడక నమీనుఖానుడు జగంబు తనుం బొగడంగ, వేడ్కతో
విడువక యెప్పుడుం బుడమివేల్పుల బిడ్డలపెండ్లి చేయు"

అమీనుఖానునికి ముగ్గురు భార్యలు. అందరును ఉత్తమపతివ్రతలు. పొట్లచెరువులోని జనులందరికిని చల్లని తల్లులు. అందు బడేబీబీ అను పెద్దభార్య సాక్షాత్తు అన్నపూర్ణాదేవియే !

"అత్తవారిండ్లకు నరుగు కన్నియలకు, కట్నంబు లిచ్చుచు గారవించు
ప్రొద్దుప్రొద్దుననె యెప్పుడు లేచి వాడల, పసిబిడ్డలకు నెల్ల పాలు పోయు
ఆకొన్నవారల కద్దమరేయైన, ఆరగించగ బెట్టు నరసి యరసి
పాలు నీ రెనసిన బాగున పెనిమిటి, తలపుతో మెలకువ మెలగ నేర్చు
ఔర! తన పుట్టి నింటికి నత్త వారి, యింటికిని వన్నె దెచ్చిన తుంటవిల్తు
తల్లివంటి బడేబీబి దరమె పొగడ, తమ్మిపూవింట నెలకొన్న దంటకైన."

ఒక ముసల్మాన్ స్త్రీ ఆ కాలములో హిందువులపై ఇంతటి అభిమానము చూపుట అసామాన్యమైన విశిష్టగుణ మనవలెను. అంతకు నూరేండ్ల క్రిందటనే బహమనీ సుల్తాను, "ఒక్క ముసల్మాను ప్రాణానికి ఒక లక్ష హిందువుల ప్రాణాలను తీసుకొంటాను. ఇదే మా మతాచారము" అని చెప్పి యుండెను. మహమ్మూద్షా బహమనీ ౧ లక్షమంది హిందువులను చంపేవరకు అన్నము తినక పోయెను! అట్టి కాలములో అమీర్ఖాన్ అతని భార్యయు హిందువుల ప్రేమించినారంటే అది చాలా గొప్పవిషయము. అమీనుఖాన్ బహుభాషావేత్త. అతని తమ్ముడు

"అరబి, ఫారసి, గుజరాతి, ఆరె, అచ్చ తెనుగు, కన్నోజి మొదలుగా తెలిసి వ్రాయదారి కన్నట్టి వాడు గతాతఖాను" ఇతడు "ఆ యిభరాము శాహు చేపట్టి యనుంగుగా నడుప బాయక మూడు తరాలనుండి కన్నట్టు అమీనుఖానుడు"

ఖుతుబుషా వంశమువారు తెనుగు దేశములో చెఱువులు కట్టించిరి. అనేకగ్రామాలను నిర్మించిరి. ఇతరప్రాంతాలనుండి సమర్థులను పిలిపించి వారికి జాగీరు లిచ్చి క్రొత్త గ్రామాలను స్థాపింపజేసిరి. అట్టివారిలో దోమకొండ ప్రభువుల పూర్వీకులు ముఖ్యులు. రాజా మల్లారెడ్డి తన శివధర్మోత్తర మున నిట్లు వ్రాసికొనెను:

"ఘను డా కాచనృపాలశేఖరుడు మున్ కర్ణాటరాజ్యంబునం
దున దుర్గాధిపతిత్వ వైభవము తోడ్తో కాంచి సుల్తాను పి
ల్వున కృష్ణానది దాటి, యా మెదుకు బల్ దుర్గంబుకిందన్ జిరం
తనమా బిక్కనవోలునుండె నది యాత్రాస్థానరాజంబుగన్."

ఈ సంఘటన ఇబ్రహీం తర్వాతివాడగు మహమ్మద్ ఖుతుబ్‌షా కాలములో అనగా ౧౬౧౨ క్రీ. శ. లోనిమాట. ఆ మహమ్మద్ ఖుతుబుషా దోమకొండపూర్వప్రభువులను చాలా గౌరవించెను.

"భవ్యసులతాను మహామదుపాదుషాహా, లబ్ధభూషణలలితపల్యంకికాత
పత్రచామరసామ్రాజ్యభరితవిభవ, రమ్యగుణశాలి శ్రీకామరెడ్డిమౌళి".

రాజా మల్లారెడ్డి గొప్పకవి. సంస్కృతాంధ్రములందు అద్వితీయపాండిత్యప్రతిభను తన కవనమందు ప్రకాశింప జేసినాడు. అత డొక చాటువులో తాను కుతుబుషాప్రభువుల నాస్థానకవి నని చెప్పుకొనెను. మల్లారెడ్డి సమకాలికుడైన గణనాథకవి యనునతడు గొప్ప "సత్కవి"యనియు, అతని తండ్రి "పండితవరేణ్యు"డనియు మల్లారెడ్డి తన పద్మపురాణములో వ్రాసినాడు. అట్టి గణనాథ కవి ఖుతుబుషా (అనగా ౧౬౧౨ లో నుండిన మహమ్మద్ ఖుతుబ్‌షా) యొక్క ఆస్థానకవిగా నుండె ననియు తెలిపియున్నాడు.

"ధీనిధి సాహితీయుతు ప్రతీతయశున్ కుతుపావనీశ్వరా
స్థానమహాకవీంద్రు నిజదర్శనకౌతుకవైభవాగతున్
శ్రీనరసింహ పండితవరేణ్యకుమారు గణేశధీరు స
న్మానముతో నెదుర్కొని నమస్కృతి జేసి వసింపజేయుచున్."

ఇట్టి "మహాకవీంద్రుడైన" గణనాథకవిని గురించి మన కింతకంటె నెక్కువగా తెలియకపోవుట సంతాపకరము. అతడు "కుతుపావనీశ్వరాస్థాన మహాకవీంద్రుడు" కాని అతని గురించి మన మేమియు నెరుగజాలకున్నాము. మల్లారెడ్డి పుణ్యాన అతని పేరైనా మనకు తెలిసినది! ఇదే మహమ్మద్ ఖుతుబ్‌షా కాలములో గోలకొండ దుర్గములోనే సారంగు తమ్మయ అను గొప్ప కవి యుండెను. అతడు సుల్తాన్ ఆశ్రయము కలిగినవాడే యని తానే తన వైజయంతీవిలాసములో ఇట్లు వ్రాసుకొనెను:

"ఇనసమతేజులౌ నృపుల నెల్ల మహమ్మదుషాహి యేలు నీ
యెనుబది నాల్గుదుర్గముల నేలిన యేలిక గోలకొండ త

ఘ్న నగరస్థలిక్ కరణికం బొనరించెడు తమ్మమంత్రి యా
జనపతి రమ్ము పొమ్మన ప్రిజల్ జయ వెట్ట గృహస్థు లౌనక్.

గోలకొండ నగరానికి సారంగు తమ్మయ్య కరణము. కావున పాదుషా కతనితో పనిబడుచుండెను. అట్లున్నను తమ్మయ్య తన దైవభక్తిచే తన కావ్యాన్ని శ్రీరామార్పణము చేసెను.

కందుకూరి రుద్రకవి వంశములో చాలమంది రుద్రకవి నాము లుండి రనియు అందొక రుద్రకవి మల్కిభరాము (ఖుతుబుషా)చే ౧౪౮౦ శా. శ. లో రెంటచింతలపాలెము అను సగ్రహారమును పొందెననియు, వంగూరు సుబ్బారావుగారు శతకకవులచరిత్రలో వ్రాసినారు.

శ్రీవంగూరు సుబ్బారావుగారు అదే చరిత్రలో మరొకచోట నిట్లు వ్రాసినారు:

"ఏనుగు పెద లక్ష్మణకవి తన తుల్యామాహాత్మ్యములో తన కృతిపతి యగు వత్సవాయ తిమ్మరాజు పుత్రుడగు రాయజగపతిరాజును గూర్చి యిట్లు వ్రాసెను.

సుల్తనబ్దులుహసన్ క్షోణీశ్వరునిచేత, మాటి మాటికి బహుమాన మందె
మరియును పింగలి మాదన్న ఖానుజీ, మంత్రిజ్ఞులవలన సమ్మానమందె
అక్కన్న మొదలైన యట్టి పెద్దలచేత, మేలు భూషణములు మెప్పు లందె"

అక్కన్న మాదన్నలు సేవించినది అబ్దుల్ హసన్ పాదుషాను కాదు. వారు సేవించినది అబుల్ హసన్ తానాషాను. దీనిని బట్టి ఖుతుబ్ షాల సామంతులును తెనుగును బాగా పోషించినట్లు నిదర్శనములు కనబడుచున్నవి.

ఇంచుమించు ఈ కాలమందే వనపర్తి ప్రభువైన అష్టభాష బహిరీ గోపాలరాయలు సంస్కృతములో రచనలు చేసి ప్రఖ్యాతి కాంచెను.

కంచెర్ల గోపన్న అక్కన్న మాదన్నల మేనల్లు డని ప్రతీతి. భద్రాచల ప్రాంతమందలి నేలకొండపల్లి గ్రామనివాసి. అతడే ప్రసిద్ధ రామదాసు. అతడును గొప్పకవి. కాని అతడు రామభక్తుడు. భద్రాచల తహసీల్దారుగా నియుక్తుడై వసూలైన పన్నును దేవాలయానికి వినియోగించి బందీకృతు డయ్యెను.

ఈ విధముగా మనకు ఖుతుబుషాల కాలములో సుల్తానుల ఆదరములో వెలసిన ఆంధ్రకృతులను గురించి కొంత వరకు తెలియవచ్చినది. ఇబ్రహీం కాలమునుండి తానీషా కాలమువరకును గోలకొండ నేలిన సుల్తానులు తెనుగువారిని ఆదరించిరి. తెనుగుభాషను పోషించి తెనుగు స్త్రీలను పెండ్లాడిరి. తెనుగుస్త్రీలను ఉంపుడుగత్తెలనుగా నుంచుకొనిరి. వారిలో భాగ్యమతి ప్రేమామతి తారామతి అను వారు ప్రసిద్ధులు. భాగీరథి అను స్త్రీ ఒక సుల్తాను పట్టపు భార్యయై యుండెను.

ఖుతుబ్షాలకాలమునకు ముందు దేశభాషలపై ముసల్మాను ప్రభువుల కాదరము లేకుండెను. వారి తర్వాత ఏర్పడిన ఆసఫ్‌జాహీ వంశము వారును "ముల్కీ" భాషలకు ఏమాత్రమున్నూ ప్రోత్సాహము

కలిగించినవారు కారు. తెనుగుమంత్రులు, తెనుగుసుబేదారులు, తెనుగుసేనానులుకూడా ఖుతుబ్ షాల అనంతరము ఎక్కడకూడా లేకపోయిరి. ఇప్పుడు నిజాం రాష్ట్రములోని విద్యావిధానములో తెనుగు దిక్కులేనిదై క్షయ మొందుచున్నది. ఇట్టి పూర్వాపరసంబంధములతో పరికించిన ఖుతుబ్ షాలకు ఈ విషయములో ధన్యవాదములు సమర్పించుకొనుట కృతజ్ఞతావిధియైయున్నది.

---

# వేసవి — కైత

శ్రీ పెమ్మరాజు లక్ష్మీపతి

చిగురాకు డేరాలు చీకె పైనెత్తిన, పూల జెండాలెల్ల నేల కొరిగ
అలరు తేనియల తియ్యందనంబులు చిందు, నళికన్యకలపాట లాగిపోయె
పూదీవలు చిగిర్చి పూచి పుప్పొడి చల్లు, పూవు పాన్పియపు చాలపొంగు లడగ
ముదిసిన ఋతురాజమూర్తికి విడియాకు, లిచ్చి కోకిలసాని లేచిపోయె
ఆకసము నడికప్పు నిప్పంటుకొనియె, గాలిలో లోని పొరలకు కాక తగిలె
కవుల కలల వెన్నలుకూడ కరగిపోవు, కటిక వేసవి చింత యొక్కటి చిగిర్చె.
వలలు పన్నిన మృగయుని బారిపడిన, తల్లి గొరువంకవలె వసంతంబుపోయె
కవి హృదయశారికాశాబకంబు నేడు, మేతకై నోరు తెరచి యే మింటి నడుగు ?

లలితములైన జీవకళలన్ మొలిపించుచు నాకుమళ్ళపై
మలయుచు నాకుపచ్చ మఖమల్ కెరటా ల్దొరలించు పైరుగా
లుల నునుపట్టుపొత్తిళులలో కను విప్పి హసించు పాల బు
గ్గల పసిపాప; కైత; వడ గాడుపులన్ వసివాళ్లు వాడదే ?

తెలిచిన్కు ముత్యాలు చిలికించు నీలితొ, ల్కరి మబ్బులెందైన కదలునేమొ?
మలయునో యేమొ? కమ్మని మట్టివాసనల్, గలవానగాలు లే కడలనైన,
తెలిజిల్గు నును దోమతెర ల్లల్లు తొలివాన, జల్లు లేయెడనైన సాగునేమొ?
తొలిమబ్బు మేల్కట్టు తొలగించి యెందేని, మెరపు కన్నెగలు మెరయునేమొ?
చొప్పు పరికించి యొకమారు చెప్పుమమ్మ, పరికిణీచెంగు వెనుకకు విరిచికట్టి
కొసరి తలలూపెడు చిటారు కొమ్మనిలిచి, చింతచెట్టు చిగురుకోయు చిన్నదాన !

తేరిన పూవుదేనియల తీయని తావులగూడి, పచ్చిబం
గారపు పూలపిండి సుడిగాలులు రేగిన పువ్వు పొద్దు సిం
గారము లంతరించినవి; కట్టడి వేసవికాల మింతలో
మారగనున్న దేమొ? యొకమా రటు చూచి వచింపు బాలికా!

# అమరుకము

(సంస్కృతమునుండి)

శ్రీ కూచిభొట్ల ప్రభాకర శాస్త్రి

ఘనగుణ కృష్టిబద్ధ కటకాముఖ హస్త నటన్నఖాగ్ర రు
జ్మనిత కలమ్ము మంజరిత మంజుల పల్లవ కర్ణపూర లో
భన విధుర భ్రమద్భ్రమర వల్లభ విభ్రమభృన్మనోజ్ఞ మ
య్యనుపమ సర్వమంగళ దయామయవీక్షణ మోముతన్ మిమున్.

ఏలా! శ్రీశగిరీశధాతృముఖు లింకెవ్వేల మి మ్మేలు లీ
లాలోలోల్లులితాలకమ్ము పరినృత్యత్కుండల మ్మాత్తస్రగ్భూ
కేలివ్యత్యయతాంతమున్ మధుర ముద్గీర్ణ శ్రమాంభఃపృష
త్పాలీమృష్టవిశేషకమ్ము, ప్రియకాంతాకాంత నేత్ర మ్మొగిన్.

వల పారం గొని లోలబాహులతికాపాశానఁ గన్గో వయ
స్యలు సంకేతము జేర్చి సంజ నట దోసమ్మున్ వెలిం బుచ్చుచుం
బెలుచన్ వందురు నాపెచే స్మయము పేర్మిన్ వెండి యిట్లంచుఁ దో
ట్రిలు పల్కుంబడిఁ దాడితుండు మగవాఁడే ధన్యుఁడున్ మాన్యుఁడున్.

ఘననిర్ఘోషము భీషణమ్ము జడిలోఁ గాందారి మాందారి ప్రొ
ద్దునఁ బాంథుం డొకఁ డాలకించి వగలం దోఁకొన్న నిట్టూర్పులం
గనులన్ బాష్పము నిండ నెంచు చనఁగుం గ్రొల్గంటి బిట్టేడ్చె యా
మిని యెల్లన్; వెడలించి రూర్వసివి గ్రామీణుల్ రయం బాజడున్.

అలివేణీ! స్మితసుందరమ్ము రచిత మ్మభ్యుద్గమం బుండి ద
వ్వుల నే యానతి యానతమ్ము తలపైఁ బూనంబడెం గాన రా
దల శైథిల్యము దృష్టిమేళనమునం దంతర్నిగూఢక్రుధా
కులపాషాణమనస్క నీకత చికాకుం గూర్చి యేర్చున్ మదిన్.

లలి నాలించి నిశిన్ స్వదంపతుల సంలాపమ్ము లొక్కర్త పె
ద్దలమ్రోలన్ రస మొల్క బల్క శుకిఁ బ్రాతర్వేళ లాలించి య
ప్పలుకుల్ మానిచె నుంచి దాడిమఫలవ్యాజమ్మునన్ నోటఁ గ
ర్ణలసన్నిర్మలపద్మరాగమణిఖండం బొండు నిండం దప్రిపన్.

అలరుంబొన్నన నిర్వ్వ రవ్వాలి మొగంబై పండనై, మాని ప
ల్కుల యన్యోన్యగురుత్వగుప్తిరతి నాకూతమ్ముల్ వెల్ద్రోవకే
మెలమెల్లన్ వలనై యపాంగవలనాఽ మిశ్రీభవన్నేత్రితా
కలన మ్మాత్ర ప్రియు లూడ్చి రప్పు పొలయల్కం గుల్కు మేల్కౌఁగిలిన్.

ప్రమదాసాంద్రవిలేపన స్తనయుగప్రశ్లేషముద్రాంకిత
మ్మమరన్ ఱొమ్ము పదానతివ్యతికరవ్యాజమ్మునన్ డాఁచుకోఁ
గమకింతే! యన నేది యేది? తుడువంగాఁ బోలు నం చుగ్మలిం
దమిఁ గౌఁగింటఁ గదించి తింతి మఱచెన్ దా నద్ది యా హాయిలోన్.

తెలిసెను నీకతల్ చనుము దిగ్గనచోటిక యేటికీ వితా
పలుకులు, ని న్ననంజనునె? భాగ్యమ యోగ్యతఁ గూర్చె మా కిటుల్
చెలువుఁడ! పేర్చి యీగతికిఁ జేర్చిన నీ ప్రణయమ్ము నిమ్ముకో
లలి నచటే! స్వభావతరళ మ్మిది జీవిత మేమి మాసినన్.

మలయసమీర మీరణము మాఱె, వికాసితమల్లికాపరీ
మలభరమైన గ్రీష్మము విమానన మానఁజిపోయె, నిస్పృహుం
జెలువుని దోడితే ఘనుఁడ! చేయుదె యత్నము? గోనివర్తనా
కలన విశారదుండకద కాఁగలవాఁడు ధనంజయుండు నాన్.

నెలతా! సుప్తుఁ డితండు మేల్కొనకుమా నీ వంచు మీఁచన్న యా
వలఁ గీలించితి మోము నల్ల వల పొప్పం దన్ముఖాబ్జమ్మునం
బులకల్ నించెను మాయగాఁ డతనిద్రై పొల్పారుమే నప్పు డ
గ్గలముల్ సిగ్గులుగొంటి వింటిరె చనెంగా యవ్వి పై ధోరణిన్.

వల్లభుఁ డల్లనం గొనుఁడుఁ బయ్యెద బ్రశ్రయ మెంచి వాంచు మో
మల్లలిఁ గౌఁగిటం బొదువ నంగము లెల్ల మఱుంగు సేసికో
నెల్ల ప్రయత్నముల్ జలుపు, నే మననేరక చూచు నెచ్చెలిం
బల్లవితస్మయమ్మున నవస్నుష తొల్తఁ గృశించు సిగ్గునన్.

ప్రేమసుమమ్ము వృంతము నికృంతమయై ప్రణయోపహారసు
శ్రీ మటుమాయమైన వినివృత్తములైన సుభావభావనల్
మో మటు పెట్టి కిమ్మనక పోయిన నెయ్యుఁడు ప్రీలితూల దే
లా! మహిలా! మనమ్ము చనినట్టి దినమ్ములయిమ్ము లెంచియేన్.

ఏలా మైపువుదీవ వాడి వరు గయ్యెం? పాండుగండస్థలం
బేలా బేల! మొగమ్మున్నం చదుగఁ బ్రాణేశుండు నైజమ్ము లీ
జాలుల్ వొమ్మని గ్రీవ యావలితగాఁ జార్వంగి నిట్టూర్పుచున్
వాలుంగన్నుకొలంకులం దొఱలు బాష్ప మ్మా దెసన్ డుల్చెఁ దాన్.

బాలా! వల్లభ! మాను మల్క యెదిగూర్పన్ దాన నేఁ జాలితిన్
జాలిన్ మా కిటు నాపరాధ్ధుఁడవు దోసం బంతయున్ నాదె కా
యేలా రాపడి మొల్గు వో వగతు వీ? వెవ్వారిదా మ్రోల? నా
మ్రోలన్ నీ కవుదాన నేది! చెలివా పోల్పొంద కేఁ గుందనే.

వలువం గైకొన దిఁతి తా భుజలతన్ ద్వారస్థలిం జేర్ప ద
ర్గల మట్టుల్ వడిదొర్లఁ బో దశాంగులం బ్రస్థాన మీ వాఁగు మం
చలతిం బల్కదు; మానివై చెఁ బయన మ్మాతేండ జీమూత ని
ష్కల మావేలఁ బదస్రకల్పితసరిత్కల్లోల ముల్లోలమై.

నీలకచా! నిసర్గరమణీయతకుం దవు తావు, తీవలన్
మేలములాడు నీతనువు మేకొని డుల్చిన భూషణాళి ని
క్కాలమునం గదున్ వెఱపు కల్పన జల్పెదుఁ జూడఁ జూడ నే
లా! లలితాంగి! క్రుంగుచు ననల్పచిరోపచితవ్యథోద్ధతిన్.

కాల మ్మంతయు ముగ్ధ ముగ్ధత విటా గాపింపఁగా నేల యి
ట్లోలం జాలుము కిన్క మున్కొను ధృతిన్ హేమింపు తత్రాప్రర్థ్యవై
యాలీలన్ సకి పల్కఁ గల్కి యనుభాషింపంగదే మెల్లగా
నాలించుంజుము మన్మనఃస్థితుఁడు వాఁ డంచున్ వెఱం బెంచుచున్.

ఈ నడిరేయి నేయెడకు నేగెదిటుల్ కరభోరు! వారకే?
ప్రాణగణాధికుండు ప్రియవల్లభుఁ డున్నెడకున్; వెఱం గొనం
గానవు త్రోవఁ బోవొకో నికామసహాయవిహీన? వెంతలే
నీ నయ మింతయే విడువ నేర్చునె సూనశరుండు వెన్నుతాన్.

# కర్నాటక సంగీతవిధానము

## గానకళాభివృద్ధికి సూచనలు

శ్రీ అరిపిరాల సత్యనారాయణమూర్తి

౧

శ్లో. బ్రహ్మగ్రంథిజమారుతానుగతినా చిత్తేన హృత్పంకజే
సూరీణా మనురంజకశ్రుతిపదం యోఽయం స్వయం రాజతే,
యస్మాద్గ్రామవిభాగవర్ణరచనాలంకారజాతిక్రమో
వందే నాదతనుం త ముద్ధురజగద్గీతం ముదే శంకరం. (సం॥ ర)

అనెడి శ్లోకానుసారము సర్వమునకు ప్రధాన మగు నాదబ్రహ్మమునకు మున్ముందు వందన మొనరించి తదుపరి గానమునకు ప్రధాన మగు నాదోత్పత్తియగు విధమును గమనించుట విధి యగుచున్నది. కనుక పాఠకమహాశయు లీ కర్ణాటకసంగీతవిధానసంగ్రహమును శ్రద్ధతో పరిశీలింతురుగాక యని కోరుచున్నాను.

### నాదోత్పత్తి

యోగాధారము లారింటిలో మొదటిదైన మూలాధారస్థానమునందు గల బ్రహ్మగ్రంథి యనెడి చతుర్దశదళచక్రమునం దుండు సూక్ష్మాగ్నిచేత ప్రేరేపింపబడిన ప్రాణవాయువు ఊర్ధ్వముఖముగా నాభి, హృదయ, కంఠముల మూలముగా వెడలుటచే నాద ముత్పత్తి యగుచున్నది. అట్టియీ నాదమే వేదముల కాధారస్థాన మనియు, ఈ నాదమువల్లనే పదవాక్యకావ్యనాటకాలంకారశాస్త్రములును, స్వరవర్ణ గ్రామాద్యలంకారాదులును బుట్టుచున్న వనియు, లోకమునకు ఆదికారణమే నాద మనియు దెలియబడుచున్నది. కనుకనే అట్టి నాదోత్కృష్టతను గమనించుట విధి యగునని చెప్పుటకు కారణమైనది.

### నాదప్రాశస్త్యము

శ్లో. నాదోపాసనయా దేవ బ్రహ్మ విష్ణుమహేశ్వరాః
భవం త్యుపాసితా నూనం యస్మా దేతే తదాత్మకాః. (సం॥ ర)

అను శ్లోకప్రమాణముచే సృష్టి, స్థితి, లయకారకులైన త్రిమూర్తులగు బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు నాదస్వరూపు లగుటచే నాదమువల్లనే యుపాసింపబడుదు రని నిశ్చిత మగుచున్నది. అట్టి త్రిమూర్తిస్వరూప మగు నీ నాదముచే నేర్పడుచున్న గానప్రాశస్త్యమును పరికించుట యత్యవసర మగును.

## గానప్రాశస్త్యము

శ్లో॥ గీతిగానేన యోగ స్స్యాత్ యోగాదేవ శివైక్యతా
గీతిజ్ఞో యదియోగేన స యాతి పరమేశ్వరం. (సూ॥ సం)

అను శ్లోకప్రమాణము ననుసరించి భక్తితో చేయబడు గానము యోగమగుచున్నది. ఆ యోగము చేతనే పురుషుడు పరమాత్మైకత్వమును బొందు నని తెలియంబడుచున్నది. అదియునుంగాక "నాహం వసామి వైకుంఠే న యోగిహృదయే రవౌ, మద్భక్తా యత్ర గాయంతి తత్ర తిష్ఠామి నారద" అనెడి భగవద్వాక్యము ననుసరించి భగవంతునికి మిక్కిలి యభీష్టమగు నివాసస్థానము, వైకుంఠము, యోగుల హృదయపీఠము, సూర్యమండలమునకంటె తన భక్తుడగువాడు గాన మొనర్చునట్టి స్థానమే తన కభీష్టమగు నివాసస్థల మని తెలియుచున్నది. ఇట్టి మహాకారణము వల్లనే నారదాదిమహర్షులు సైతము ఉత్కృష్టమైన యీ గానకళోపాసన చేసియే భగవదనుగ్రహపాత్రులై యుండుట లోకవిదితము. "యద్యదాచరతి శ్రేష్ఠ స్తత్త దేవేతరో జనః" యను ప్రామాణ్యము ననుసరించి యీ కలికాలమందుగూడ సంగీతత్రిమూర్తు లగు శ్రీమత్త్యాగరాజ, దీక్షిత, శ్యామశాస్త్రులే గాక శ్రీ జయదేవ, నారాయణతీర్థ, పురందర విఠలాది మహాభక్తశిఖామణులు సయిత మీ గానకళోపాసనచేతనే దైవసాక్షాత్కారము నొంది, తరించి, ముక్తి నొందుట ప్రత్యక్షప్రమాణము లగుచున్నవి. అదియునుంగాక "శిశు ర్వేత్తి పశు ర్వేత్తి వేత్తి గానరసం ఫణిః" అను నార్యోక్తిచే శిశు, పశు, ఫణ్యాదులుసయిత మీ గానరసము గ్రోలి తన్మయత నొంది తమ సహజనైజములనుగూడ విడనాడి మహానందమున నోలలాడుచుండుటచేతను, వర్తమానకాలమున పాశ్చాత్యదేశములందలి వైద్యశాలలందు దీర్ఘకాల ఔషధసేవచే కుదురని ఆయా రోగుల శరీర రుగ్మతలకు గూడ ఆయా వాద్యములను ధ్వనింపజేసి తద్ద్వారా వివిధరుగ్మతల నివారించి రోగుల నారోగ్యవంతులుగా జేయుచున్నట్లు వార్తలు దెలుపుటచేతను మానవులకు సర్వవిధముల గానకళోపాసనకంటె ఇహపరసుఖదాయకమైన యుత్తమోత్తమ మగు సాధనము మరియొకటి లేదనుట నిర్వివాదాంశ మగును. అయితే మానవు లీ గానకళోపాసన జేయుటకు మున్ముందా శాస్త్రమునందలి లక్షణవివరము లన్నియు దెలిసికొన్ననేగాని, అందు గల లక్ష్యము ననుష్ఠానమునకు దెచ్చుట యసంభవ మగుటచే గానశాస్త్రమందలి ప్రాముఖ్యమైన శ్రుతి, స్వర, రాగ, తాళాది లక్షణ వివరముల నిందు సంగ్రహముగనైన దెలుపు టత్యావశ్యకమైయున్నది.

## శ్రుతి నిర్ణయము

నాదోత్పత్తియందు జెప్పబడినటుల ప్రాణాగ్నులసంయోగముచే నేర్పడు ప్రణవనాదము మనుష్యుని నాభి, హృదయ, కంఠము లనెడి త్రిస్థానములనుండి బయలువెడలునపుడు అతిమందము మొదలు అత్యుచ్చమునకు గల యీ నాదమును విడివిడిగా జేయుచో 66 నాదము లగును. వీటినే పూర్వాచార్యులు శ్రుతు లని వ్యవహరించి యున్నారు.

## ద్వావింశతి శ్రుతి నిర్ణయము

పై దెలిపిన 66 శ్రుతులును మంద్ర, మధ్య, తారములను త్రిస్థాయు లందు గల వగుటచే ఒక్కొక్క స్థాయికి శ్రుతులను విభజించిన 22 శ్రుతు లగును. వీటినే ద్వావింశతిశ్రుతు లని వ్యవహరించి వాటికి వరుసగా, తీవ్రా, కుముద్వతీ, మన్దా, ఛన్దోవతీ, దయావతీ, రంజనీ, రతికా, రౌద్రీ, క్రోధీ, వజ్రికా, ప్రసారిణీ, ప్రీతీ, మార్జనీ, క్షితీ, రక్తా, సన్దీపినీ, ఆలాపినీ, మదన్తీ, రోహిణీ, రమ్యా, ఉగ్రా, క్షోభిణీ మొదలగు 22 నామము లొసగియున్నారు. వీటినే మనము 1-వ శ్రుతి షడ్జముగను, 2, 3, 4, 5 శ్రుతులు ఏకశ్రుతి, ద్విశ్రుతి, త్రిశ్రుతి, చతుశ్శ్రుతి, ఋషభములుగను, 6, 7, 8, 9 శ్రుతులు, శుద్ధ, సాధారణ, అంతర, తీవ్ర, గాంధారములుగను, 10, 11, 12 శ్రుతులు శుద్ధ, తీవ్ర, ప్రతిమధ్యమము లుగను 13, 14, శ్రుతులు చ్యుతపంచమ, పంచమములుగను, 15, 16, 17, 18 శ్రుతులు ఏకశ్రుతి, ద్విశ్రుతి, త్రిశ్రుతి, చతుశ్శ్రుతి దైవతములుగను 19, 20, 21, 22 శ్రుతులు శుద్ధ, కైశికీ, కాకలీ, చ్యుతషడ్జ నిషాదములుగను వాడుకయం దుంచి యున్నటుల గమనింపదగును.

## స్వ ర ని ర్ణ య ము

పై నుదహరించిన ద్వావింశతి శ్రుతులును వ్యక్తముగా శబ్దించిన నేదియును రంజనము కలుగజేయదు. కనుక ప్రాచీనవాగ్గేయకారకు లీ యిరువదిరెండు శ్రుతులను "చతుశ్చతుశ్చతుశ్చైవ షడ్జ మధ్యమపంచమాః, ద్వే ద్వే నిషాదగాంధారౌ త్రి స్త్రీ ఋషభధైవతౌ"యను ప్రమాణమున పంచి రంజనముగల అక్షరములతో జేర్చి పలికింపబడునవే స్వరము లని చెప్పినారు. (స్వ=స్వకీయముగా, రంజయంతి = రంజింపచేయునవి.)

## స్వ ర స ప్త క వి వ ర ము

ద్వావింశతిశ్రుతులను (22 శ్రుతులను) వరుసగా 4+3+2+4+4+3+2=22 ఇటుల క్రమముగా సప్తాక్షరములకు పంచి వాటికి

"షడ్జం మయూరో వదతి గావో ఋషభభాషిణః
అజావికంతు గాంధారం క్రౌంచః క్వణతి మధ్యమమ్
పుష్పసాధారణే కాలే పికః కూజతి పంచమమ్
ధైవతం హేషతే వాజీ నిషాదం బృంహతే గజః"

అనెడి శ్లోకానుసారము సప్తస్వరములను ప్రకృతియందలి సహజధ్వనులకు పోల్చి వరుసగా షడ్జ, ఋషభ, గాంధార, మధ్యమ, పంచమ, ధైవత, నిషాదము లను సప్తనామము లేర్పరచియున్నారు.

## ద్వాదశ స్వరస్థాన నిర్ణయము

పై దెలిపిన సప్తస్వరములవల్లనే యనేకరాగము లుత్పత్తి యగుటకు వీలు లేదు గనుక వివిధ రాగముల నుత్పత్తి జేయుటకు తగినట్లును, వ్యక్తముగా శబ్దించినను రంజనము గలుగుటకు తగిన గమకము లొనర్ప గలిగినట్లును సప్తస్వరము లందలి షడ్జ, పంచమములుగాక మిగత 5 స్వరములగు

ఋషభ, గాంధార, మధ్యమ, ధైవత, నిషాదములను విభజించుటలో ఋషభములో శుద్ధ, చతుశ్శ్రుతి షట్ఛ్రుతి అను 3 ఋషభములును, గాంధారములో శుద్ధ, సాధారణ, అంతర, అను 3 గాంధారములును, మధ్యమములో శుద్ధ, ప్రతి అను 2 మధ్యమములును, ధైవతములో శుద్ధ, చతుశ్శ్రుతి, షట్ఛ్రుతి, అను 3 ధైవతములును, నిషాదములో శుద్ధ, కైశికి, కాకలి యను 3 నిషాదములును ఇటుల నేర్పరచి షడ్జపంచమముల 2తో మొత్తము 1+3+3+2+1+3+3=16 స్వరము లేర్పరచియున్నారు. అయితే ఇందులో చతుశ్శ్రుతి ఋషభస్థానములోనే శుద్ధగాంధారమును, సాధారణ గాంధారస్థానములోనే షట్ఛ్రుతి ఋషభమును, చతుశ్శ్రుతి ధైవతస్థానములోనే శుద్ధ నిషాదమును, కైశికి నిషాదస్థానములోనే షట్ఛ్రుతి ధైవతమును బుట్టున ట్లేర్పరచినందున 16 స్వరములును 12 స్వరస్థానములందు బుట్టుచున్నవి. ఇవే ద్వాదశస్వరస్థానములు లేక స్వరము లందురు.

## రాగోత్పత్తి వివరము

"యోఽయం ధ్వనివిశేషస్తు స్వరవర్ణ విభూషితః
రంజకో జనచిత్తానాం స రాగః కథితో బుధైః"

అను ప్రమాణముచే ఏది స్వరవర్ణములచే అలంకరింపబడి జనుల చిత్తమును రంజింపజేయునో అట్టి ధ్వనివిశేషమే రాగ మని చెప్పబడును. ఇట్టి వానిలో ప్రాముఖ్యము గల 72 రాగము లుత్పత్తి యగు విధమును ముష్ముందు తెలిసికొను టావశ్యక మగును.

## 72. మేళకర్త రాగోత్పత్తివివరము

లోగడ తెలిపిన పదునారుస్వరములలో షడ్జ - శు. ఋ - శు. గాం - శు. మ - పం - శు. ధై - శు. నిషాదములు 7 ను శుద్ధస్వరములనియు, చ. ఋ-ష. ఋ- సా. గాం - అం. గాం - ప్ర. మ - చ. ధై - కై. ని - కా. నిషాదములు 9 యును వికృతిస్వరములనియు చెప్పబడును. పై నుడివిన 7 శుద్ధస్వరములవల్ల మొదటి మేళము ఏర్పడుచున్నది. ఇటులనే పై శుద్ధస్వరములతో కై. నిషాద భేదమువలన 2వ మేళము, కాకలీ నిషాదభేదముచే 3వ మేళము, చ. ధైవత. కై. నిషాద భేదములచే 4వ మేళము, చ. ధైవత కా - నిషాదములచే 5వ మేళము, ష. ధైవత కా - నిషాదభేదములచే ప్రస్తరించగా 6వ మేళము ఏర్పడుచున్నది. ఈ 6 మేళకర్తలకు మొదటిచక్రము అని పేరు. పై విధము ననుసరించి పూర్వాంగమగు శు. ఋ-సా. గాంధారభేదములచే నేర్పడునవి 6 మేళములును, శు.ఋ- అం. గాంధారభేదములవల్ల 6 మేళములును, చ. ఋ- సా. గాంధార భేదములవల్ల 6 మేళములును, చ.ఋ- అం. గాంధారభేదములవల్ల 6 మేళములును ష.ఋ. అం. గాంధారభేదములవల్ల 6 మేళములును మొత్తము 6 × 6= 36 మేళకర్తలు శుద్ధ మధ్యమ ప్రస్తారముచే నేర్పడుచున్నవి. వీటిని తిరిగి ప్రతిమధ్యముచే ప్రస్తరించగా మరియొక 36 మేళము లేర్పడుచున్నవి. కనుక మొత్తము 36 + 36 = 72 మేళకర్త లేర్పడుచున్నవి. వీటికే జనకరాగము లని పేరు. ఇటుల జనకరాగప్రణాళిక నేర్పరచి వీటికి కనకాంబరి ఇత్యాది 72 నామములుకూడ శ్రీ వెంకటమఖి వా

లేర్పరచియున్నారు. కాని పూర్వీకులగు శ్రీ గోవిందాచారిగా లేర్పరచిన కనకాంగి, రత్నాంగి ఇత్యాది 72 నామములే వర్తమానకాలములో ఆచరణలో నున్నవి. ఈ 72 మేళములను చక్రము నకు 6 మేళములవంతున (72 ÷ 6 =) 12 చక్రములుగా విభజించి వాటికి ఇందు, నేత్ర, అగ్ని, వేద, బాణ, ఋతు, ఋషి, వసు, బ్రహ్మ, దిశి, రుద్ర, ఆదిత్య అను 12 నామములు పెట్టి యున్నారు. పైవిధముగ అపూర్వమైన యీ 72 మేళకర్తల రాగపథకము నేర్పరచిన పూర్వ వాగ్గేయకారకు లెంతయో చిరస్మరణీయు లనుటకు సందియము లేదు.

### జ న్య రా గ ప్ర ణా ళి క

పై దెలిపిన 72 మేళకర్తలలో ఒక్కొక జనకరాగమునకు సంపూర్ణ భేదము 1, షాడవభేదములు 6, ఔడవభేదములు 15—మొత్తము (1+6+15 =) 22 భేదములై తిరిగి సంపూర్ణ, షాడవ, ఔడవ భేదములగు 22 భేదముల నొందుటచే (22×22 =) 484 రాగములు పుట్టుచున్నవి. వీటికే జన్య రాగములని పేరు. ఇటుల ఒక్కొక్క మేళకర్తకు 484 రాగముల వంతున (72×484 =) 34848 జన్యరాగములుగాగాని, సంపూర్ణ భేదము లేనిచో (72 × 483 =) 34776 వర్జరాగములుగాగాని ఏర్పడుచున్నవి. వీటి కింకను వక్రసంబంధము గలిగినచో "అనంతా వై రాగాః" అను ప్రమాణ ముచే రాగము లనంతము లని చెప్పుటకు హేతు వగుచున్నది.

### ప ం చ ద శ గ మ క వి వ ర ము

పై నుదహరించిన రాగములకు ఈ క్రింది శ్లోకానుసారము గమకము లత్యంతప్రాముఖ్యము లగుట అనుభవైకవేద్యము.

> శ్లో॥ స్వరస్య కంపో గమకః శ్రోతృచిత్తసుఖావహః
> తస్య భేదాస్తు తిరిపః స్ఫురితః కంపిత స్తథా
> లీన ఆందోలితవళీ త్రిభిన్నకురుళాహతాః
> ఉల్లాసితః ప్లావితశ్చ గుంఫితో ముద్రిత స్తథా
> నామితో మిశ్రితః పంచదశేతి పరికీర్తితాః.

(1) తిరిపము, (2) కంపితము, (3) స్ఫురితము, (4) లీనము, (5) ఆన్దోలితము, (6) వళి, (7) త్రిభిన్నము, (8) కురుళము, (9) ఆహతము, (10) ఉల్లాసితము, (11) ప్లావితము, (12) గుంఫితము, (13) ముద్రితము, (14) నామితము, (15) మిశ్రితము లనునవి పంచదశ గమకములు. ఇవి ఒకటితో నొకటి చేరి మిశ్రగమకము లగుచున్నవి. రాగమున కిట్టి గమకము లనేకముగ నుండినగాని రాగవిస్ఫూర్తి గలుగ దని నిశ్శంకుడు మొదలగు ప్రాచీనవాగ్గేయకారులు దెలుపుట సత్య దూరము గాజాలదు. ఇటుల గమకయుక్త మగుటవలననే ఈ కర్నాటకసంగీతము తదితరసంగీత ములకంటె భిన్నమై దినదినాభివృద్ధి జెందుటయేగాక ఖండాంతరములకు సహితము ఆకర్షింపబడుటకు కారణమైనది. కర్నాటకగానకళకు ప్రాముఖ్యమైన రాగ, తాళములలో రాగప్రకరణము సంగ్రహముగా జెప్పినందున తాళప్రకరణము నీ క్రింద దెలుపుట గమనించునది.

## తా ళో త్ప త్తి వి వ ర ము

శ్లో॥ తకార శ్శంకరః ప్రోక్తో లకార శ్శక్తి రుచ్యతే
శివశక్తి సమాయోగా త్తాళ ఇత్యభిధీయతే.

అను ప్రమాణమున తకారరూపకుడగు శంకరుని యొక్కయు, లకారరూపియగు పార్వతి యొక్కయు సమాగమముచే తాళ ముత్పత్తి యగుచున్నది. అట్టి తాళము - కాలము, మార్గము, క్రియ, అంగము, గ్రహము, జాతి, కళ, లయ, యతి, ప్రస్తారములను దశప్రాణయుక్తమై వాడ బడుచున్నటుల గమనించునది.

## స ప్త తా ళ ము ల వి వ ర ము

పై దెలిపినటు లేర్పడిన తాళములు ముఖ్యముగా ఏడు. ఇవియే ధృవ, మఠ్య, రూపక, ఝంపె, త్రిపుట, అట, ఏక, తాళము లనబడును.

## 35 తా ళ ము ల వి వ ర ము

తాళనిర్ణయములో దెలిపిన సప్తతాళములను త్రిశ్ర, చతురశ్ర, ఖండ, మిశ్ర, సంకీర్ణములను పంచజాతులచే ప్రస్తరించుటచే (7 × 5=)35 తాళము లగుచున్నవి. వీనినే శ్రీకరాది ముప్పది యైదు తాళములని కర్ణాటక సంగీతమునందు ప్రాముఖ్యముగా నేటికిని వాడుచున్నారు. మరియు వీనికి త్రిశ్ర, చతురశ్ర, ఖండ, మిశ్ర, సంకీర్ణములను గతిసంయోగముకూడ కలిగిన నివి (35 × 5=) 175 తాళములుగా ఏర్పడు చున్నను, వానికి ప్రత్యేకనామములు మాత్ర మెందును గనుబడుట లేదు. వాడుకలోనున్న ఈ 35 తాళములును తాళాంగములగు షడంగములలోని సశబ్దక్రియలగు లఘు, ద్రుత, అనుద్రుతముల మూడింటివలననే యేర్పడుచున్నవి. మిగత నిశ్శబ్ద క్రియలగు గురు, ప్లుత, కాకపాద అంగములగు మూడును అమంగళకరములని వ్యవహారమువనుండి తొలగింపబడి నవి. కాని ప్రాచీనులు ఈ త్రివిధములగు నిశ్శబ్ద క్రియాంగములనుగూడ జేర్చి, అష్టోత్తర శత తాళములను 108 తాళముల నేర్పరచి వానిని చచ్చత్పుటాది నామములతో వ్యవహరించి యున్నారు. ఇవిగాక రత్నాకర గ్రంథకారుడైన శార్ఙ్గదేవుడు వింశత్యుత్తర శతతాళములని మరి 120 తాళముల నేర్పరచి వానికి ప్రత్యేక నామములుకూడా పెట్టియున్నాడు. కాని పై దెలిపిన ముప్పదియైదు తాళములుగాక మిగతతాళములన్నియు వాడుకలో లేవనియే చెప్పదగును. ఏలన సామాన్యముగా వాడుక యందున్న 35 తాళములలోనే నిర్దిష్టమైన లయతో గానము సేయుట నేటి గాయకు లనేకులకు కష్టసాధ్యమైనపుడు మిగిలిన 108 గాని, 120 గాని తాళముల ననుష్ఠానమునకు దెచ్చుట యసంభవమనుటలో, నెట్టి అతిశయోక్తియు లేదు. గనుక గానకళోపాస కులు పై దెలిపినట్లు విశిష్టమైన యీ రాగ తాళ లక్షణములను బాగుగా గుర్తెరింగియే యీ కర్ణాటక గానము నభ్యసించుట విధియగుచున్నది.

## సం గీ త వి భా గ ము

ఆదికాలములో గానకళ ఒకేవిధముగానుండి, తదుపరి కొంతకాలమునకు రెండుగా విభజింపబడి

నారదసాంప్రదాయమై నేటివరకు దక్షిణహిందూదేశీయులచే నుపాసింపబడు గానము కర్ణాటక సంగీతమనియు, హనుమత్సంప్రదాయమై నేటికిని ఔత్తరాహులచే నుపాసింపబడు గానము హిందూస్థానీ సంగీతమనియు వ్యవహరింపబడుచున్నది.

### హిందూస్థానీ సంగీతము

అయితే పై దెలిపిన ఈ రెండు గానములందుగల లక్ష్యలక్షణములకు చాలావరకు వ్యత్యాసము లున్నను, అవి ఆ యా దేశగానములకు తగినట్లు ఏర్పరచిన లక్షణముల ననుసరించియే ఆ యా లక్ష్యము లుపాసింపబడుచున్న వనుట నిస్సందేహము. అయితే "శ్రోతృచిత్త సుఖావహః" అను ప్రమాణముచే రాగతాళములకంటె సుఖమే ప్రధానముగ నెంచి ఔత్తరాహులు గానముజేయుటం బట్టి సుఖపూరితమైన వారి గానము అచ్చటనేగాక మన ఆంధ్ర, తమిళ దేశములకుగూడ వ్యాప్తి జెంది ఇచ్చటి గానకళాభిలాషులగు, నాట్యకళోపాసకులగు కొందరు నటీనటకులను, ముఖ్యముగా చలన చిత్రనిర్మాతలను నాకర్షించి వారిచే అనుష్ఠింపబడుచు వారి యభిమానమునకు పాత్రమగు చున్నది. ఇందులకు వారి మధురమైనగానము, మృదువైన వారిభాషయు కారణమన నొప్పును. కాని ఇట్టి అన్యదేశ సంగీతవ్యామోహము దేశీయకర్ణాటక సంగీతాభివృద్ధి కెంతయో యాటంక మనిన దక్షిణహిందూదేశీయు లెవ్వరు కాదన జాలరనియే నా యభిప్రాయము.

### కర్ణాటక సంగీతము

దక్షిణహిందూదేశమునందు అభ్యసించు నీ కర్ణాటక సంగీతమునందలి ఉత్కృష్టత గొంతవరకు పరిశీలించుట దేశీయపాఠకుల విధియగును. గానకళోపాసకు లిందలి లక్షణవివరములను ముఖ్యముగా పాటించి రాగతాళములను, అందుగల ధాతుమాతువులను, లక్షణసమ్మతముగా నుపాసించుటయే ప్రథమకర్తవ్యముగా నెంచుటచే కర్ణాటకగానములో సుఖమే ప్రధాన ఆశయముగా నెంచ వీలులేకున్నది. అందుచే నీ కర్ణాటక గానకళోత్కృష్టత కొందరు దేశీయుల నాకర్షింప లేకున్నను ఈ కళయందలి రాగ, తాళ, గ్రహ, జాతి, గతుల యొక్కయు, వివిధములగు గీత, వర్ణ, కృతి, పద, కీర్తనాది లక్ష్యముల యొక్కయు, రాగములందలి వివిధగమకముల యొక్కయు, మనోధర్మ సంగీతములోని భాగములగు రాగ, తాన, స్వర, పల్లవుల యొక్కయు నిర్దిష్టమైన లయ, ఆ యా తాళ అక్షరకాల నియమములను పాటించి చక్కగా గానముచేయుటయందు గల కష్టము. గుర్తెరింగి యిందుగల గానకళాప్రాశస్త్యమును గ్రహించినచో నట్టివారు ఆనంద పరవశులగుట నిస్సందేహము. గనుకనే కొందరు ఔత్తరాహగాయకులేగాక, పాశ్చాత్యగాయకులు సయితము విశిష్టమైన ఈ కర్ణాటకసంగీతవిధానమును మిక్కిలిగా కొనియాడుటకు హేతు వగు చున్నది.

### గానకళాప్రదర్శనమునందలి మార్పులు

ఇప్పటివలెగాక పూర్వము దక్షిణహిందూదేశ వాగ్గేయకారకులు గానకళను ప్రదర్శించుటలో రాగమునే విశేషముగా ఆలాపించి, తదుపరి తానముపాడి, స్వకల్పితమయిన వివిధములగు కీర్తనముల గానముచేయుటతో గానపరిసమాప్తి నొందించుటయేగాక అపారమయిన వారి పాండిత్య

మును గూడ ప్రదర్శించెడివారని తెలియుచున్నది. తదుపరి వెలసిన వాగ్గేయకారకులు వైవిధ్యముగా గానముచేయుచు జయదేవుని అష్టపదులును, రామదాసుని కీర్తనములును గూడ గానమొనర్చుచుండిరని తెలియుచున్నది. కాని రానురాను ఒకశతాబ్దమునుండి రాగము, తానము, కృతి, కీర్తన, పదము, జావళి, పల్లవి, స్వరము మొదలగు వివిధ సంగీతరచనలు గానమొనర్చుట ఆచరణలోనికి వచ్చెను. ముఖ్యముగా స్వరము, పల్లవి పాడువిధానము ఇటీవల నేర్పడిన దనియే చెప్పవచ్చును.

## గానకళాభివృద్ధి

ప్రాచీనకాలమునుండి గానకళాభివృద్ధికి పలువురు వాగ్గేయకారకులు పలువిధములగు ఉత్కృష్ట గ్రంథములను మాతృభాషలో రచించి అమూల్యమగు సేవచేసినను, 18, 19 శతాబ్దములందు జన్మించిన సంగీతత్రిమూర్తులగు శ్రీమత్త్యాగరాజ, దీక్షిత, శ్యామశాస్త్రిలును, పురందర విఠల, క్షేత్రజ్ఞ, నారాయణతీర్థాది మహావాగ్గేయకారకులును అపూర్వమగు వారి గేయకల్పనల ద్వారా గావించిన నిరుపమానమగు సేవ ఆకళను ఇంతటి అత్యున్నతస్థానమునకు తెచ్చుటయేగాక ఆసేతు హిమాచలపర్యంతము వ్యాప్తిజెందించి ప్రతిమానవునిలో నూతన అభిరుచిని రేకెత్తించినదనుట నిర్వివాదాంశము. ముఖ్యముగా వాల్మీకాంశసంభూతుడైన శ్రీ త్యాగరాజు సంగీతసాహిత్య సమర్థుడై సద్గురుకటాక్షముచే లభించిన మహాజ్ఞానముచే 96 కోట్ల తారకము జపించి దైవసాక్షాత్కారము నొంది తత్ఫలితముగ లభించిన దైవప్రేరేపణచే రామాయణకథానుసారముగా రచించిన భక్తిపూరితములగు 24,000 కీర్తనములు, వాని రాగతాళముల అమరిక, మాతువుల పొందిక, పదలాలిత్యము, అర్థమునందలి సొంపు, గంభీరమగు వేదాంతభావము, ఉత్కృష్టత, యావద్భారతదేశమునందేగాక ఖండాంతరములందు సయితము కర్ణాటకగానకళాప్రశస్తికి హేతువయినవి.

## ప్రాచీన సంగీతలక్షణగ్రంథరచన

సంగీతశాస్త్రసంబంధమగు సంస్కృతగ్రంథములన్నిటిలో చాల పురాతనమైన ప్రాముఖ్య గ్రంథము భరతాచార్యుని నాట్యశాస్త్ర మొక్కటే. ఇతడు షుమారు 1500 సంవత్సరములకు పూర్వముండెనని తెలియుచున్నది. తరువాత, మతంగుడు బృహద్దేశి, దత్తిలుడు నారదశిక్ష, నారదుడు సంగీతమకరందము అను గ్రంథములను రచించిరి. ఇప్పటికి 700 సంవత్సరములకు మునుపు శార్ఙ్గదేవుడు సంగీతరత్నాకరగ్రంథమును, తరువాత వాడయిన సోమనాథుడు రాగవిబోధమను చక్కని సంస్కృత గ్రంథమును రచించియున్నారు. ఇతడే ఇప్పటి వీణయందలి తంత్రిలకు కొలతల నేర్పరచి ఆయా స్థానములకు తగిన మెట్ల నేర్పరచి ఆయా స్వరములు పలుకునట్లు మొట్టమొదట కనిపెట్టిన మహనీయుడు. తరువాతవాడైన రామామాత్యులు స్వరమేళకళానిధి, శ్రీరఘునాథనాయకులు గోవింద దీక్షితారుని సహాయమున సంగీతసుధ, గోవిందాచార్యులు సంగ్రహచూడామణి, వెంకటమఖి చతుర్దండి ప్రకాశిక, శ్రీతుల్జాజీ సంగీతసారామృతము, మొదలగు ఉత్కృష్టసంగీతలక్షణ గ్రంథములను రచించిరి. ఇట్టి గ్రంథము లనేకముగ నెందరో రచించియుండుటవలననే కర్ణాటక సంగీత

కళ యింతవఱకైన సశాస్త్రీయముగా అభివృద్ధి జెంది చిరస్థాయిగా నుండుట కవకాశము కలిగినది. అందులకు ప్రాచీన వాగ్గేయకారకు లెంతయో చిరసంస్మరణీయులు. ఇటీవలను గూడ గాయకశిఖామణులగు కొందరు సంగీతసాంప్రదాయప్రదర్శిని ఇత్యాది ఉద్గ్రంథములను కొన్నిటిని మాత్రము రచించి గానకళాసేవ చేసియున్నను, ప్రస్తుత ప్రభుత్వ నియమిత సంగీత విద్యావిధానమునకు తగిన ట్లుపకరించు లక్ష్య లక్షణ గ్రంథము లింకను ప్రత్యేకముగను, సుబోధకముగను రచించుట యవసరమగును. అట్టివి ఏర్పడిననేగాని యీ కళ విరివిగా యావద్భారత దేశమునందును వ్యాపించుటకు సాధ్యము గాదు. అయితే యిట్టి పాఠ్య గ్రంథములు రచించుటకు తగిన యర్హతగల గాయకోత్తము లచ్చటచ్చట నేటికిని కొందరు లేక పోలేదు. కాని ఆనాటి ప్రాచీన లక్షణ గ్రంథరచయితలకు అప్పటి సంస్థానాధీశ్వరు లొసగినంత యాదరణాభిమానములు నేటి సంస్థానాధీశ్వరులుగాని, ప్రభుత్వముగాని చూపని కారణమున కొలదిగానున్న యిప్పటి లక్ష్యలక్షణ గ్రంథరచయితల గ్రంథప్రకటనా ప్రయత్నము లేమాత్రము సఫలముగాక యున్నవనుట సత్యదూరము గాజాలదు.

### గానకళాభివృద్ధికి తోడ్పడిన సంస్థానములు

మొదట మన దేశమందు కర్ణాటక సంగీతమందలి అత్యున్నతమైన పరమార్థమును గ్రహించి స్వయముగా గానకళోపాసనజేసి, గానకళను తగిన ట్లాదరించి పోషించిన సంస్థానములలో మొదటిది తంజావూరు సంస్థానమనియే చెప్పదగును. ఏలన ఆ సంస్థానాధీశ్వరుడగు రఘునాథ నాయకుని కీ గానకళయందుగల అత్యంతాభిమానమున వాగ్గేయకారకుడగు గోవింద దీక్షితారుని ప్రధానమంత్రిగ నియమించుకొని వారి సహాయముచే తమకుగల గానకళా ప్రావీణ్యమున "సంగీతసుధ" యిత్యాది ఉద్గ్రంథముల రచించుటయేగాక యనేకపండితులనుగూడ పోషించుటయే తార్కాణ మగును. రెండవది ఎట్టయాపుర సంస్థానము. ఈ సంస్థానాధీశులు ప్రకటించిన అమూల్యమైన సంగీత సాంప్రదాయ ప్రదర్శినీ గ్రంథసంపుటము లే వారి కీ గానకళాపోషణయందలి అత్యంతాభిమానమును వెల్లడించుచున్నది. కాలక్రమమున అట్టి గానకళాపోషక ధురీణములైన సంస్థానములు శిథిలావస్థ జెందుట గాయకుల దురదృష్ట మనక తప్పదు. అయితే వర్తమాన కాలములో తగు రీతి నీ గానకళ నభివృద్ధికి తెచ్చుచున్న దక్షిణదేశ సంస్థానములలో ముఖ్యముగా తిరువాన్కూరు మైసూరు, విజయనగరము లనుట యథార్థము. అందుల కీ మహారాజు లెంతయు ప్రశంసనీయులు. ఈ సంస్థానాధీశుల నాదర్శముగ నుంచుకొని తదితర సంస్థానములుగూడ తత్ప్రయత్నమునకు గడంగి తమ సహజౌదార్యమును చూపగల్గినచో మున్ముందింకను గానకళ మిక్కిలి యభివృద్ధిజెంది గాయకులు నిరంతరముచేయు కృషివల్ల ననేకులు గానకళావిశారదులై తాము తరించి, యితరులను గూడ తరింపజేయుట నిశ్చయము.

### విశ్వవిద్యాలయములు, ప్రభుత్వమువారి తోడ్పాటు

ఇటీవల కొన్ని సంవత్సరములనుండి ఇహపరసుఖదాయకమైన నీ కర్ణాటకసంగీతము మన మదరాసు

విశ్వవిద్యాలయమువారికేగాక రాష్ట్రప్రభుత్వమువారి దృష్టి నాకర్షించుట, గానకళాభివృద్ధికి సూచనయు, గానకళార్థుల యదృష్టమనక తప్పదు. ఏలన విశ్వవిద్యాలయమువారు దీని యవసరమును గుర్తించి విద్యాప్రణాళికలో దీనినిజేర్చి తదనుసారముగ లక్ష్యలక్షణములందు పరీక్షలు జరుపుచు కృతార్థులగు కళాశాల, డిప్లమోవిద్యార్థులకు టెక్నికల్ పరీక్షార్థులకు యోగ్యతాపత్రము లొసంగుచున్నారు. అందులకు రాష్ట్రప్రభుత్వము, తత్సంబంధమైన విశ్వవిద్యాలయము లెంతయు స్తవనీయములు. కాని యిప్పటివలె విద్యార్థుల యిష్టమునుబట్టిగాక నిర్బంధపఠనీయ శాస్త్రముగా కనీసము ఉన్నతప్రాథమిక పాఠశాలలుమొదలు కళాశాలల పర్యంతముగల యన్ని విద్యాశాలలలోను నేర్పరచి యర్హతగల గానకళాధ్యాపకుల నేర్పరచియు, గానకళాధురీణులచే తదితర గానకళాశాలలోగూడ గానకళోపన్యాసముల నప్పుడప్పు డిప్పించుచు గానకళను బోధించినగాని, ఇప్పటి సంగీత విద్యావిధానము పరిపూర్ణముగ సఫలీకృతమైనదని జెప్పవీలులేదనుట సర్వజనాంగీకార మగును. అదియుగాక దీర్ఘకాల పరిశ్రమ విశేషమున నీ పరీక్షయందు తీర్ణులై యోగ్యతాపత్రములొంది గాని, పొందకగాని, యున్నకొలదిమంది గానకళావిశారదుల జీవనమునకుగూడ నుపకరించునట్లు ప్రభుత్వగానకళాశాల ప్రత్యేకముగ నొకటియైన నీ రాష్ట్రమున నెలకొల్పబడకుండుట మిగుల శోచనీయము. అయితే ఇందులో కొంతవరకు ప్రభుత్వము ఇట్టి అవసరమును గుర్తించునట్లు చేయుటకు తగిన ప్రబోధము గావింపని రాష్ట్రప్రజల యుదాసీనతగూడ కొంత గలదనుట నిస్సంశయము. ఏలననగా రాష్ట్రప్రజలు గానకళకై యొనర్చిన విశేష ప్రబోధమునకు ఫలముగ ఉత్తరదేశ మందలి లక్నోనగరమున "మారీస్ మ్యూజిక్ కాలేజి" అను హిందూస్థానీ గానకళాశాలను ప్రభుత్వమువారు నెలకొల్పుటే తార్కాణము. దానిని అచ్చటి బోధనను 1941 లో నా ఉత్తరదేశ పర్యటనమునందు ప్రత్యక్షముగ జూచుటయేగాక ఆ కళాశాలాధ్యాపకుల కోరికపై కర్ణాటక సంగీత ప్రశస్త్యమును గూర్చి సంక్షిప్తముగ నుపన్యసించియున్న నేను ప్రత్యేకముగ ప్రభుత్వగానకళాశాల లేని ఈ రాష్ట్రీయుడ నగుటచే నాకీవిచారము సహజమగుట అతిశయోక్తి కాదు. గుడ్డిలో మెల్లయనునట్లు ప్రభుత్వాంగీకారము నొంది సశాస్త్రీయముగ విద్యగఱపు గానకళాశాలల స్థాపించి రాష్ట్రేతరులకుగూడ మార్గదర్శకులైన శ్రీ శ్రీ విజయనగరం మహారాజులవారును, శ్రీ రాజా అన్నామలై చెట్టియారు వారును ఎంతయు ప్రశంసార్హులు.

## ప్ర భు త్వ ము వా రి క ర్త వ్య ము

ఆసేతువింధ్యాదిపర్యంతముగల యీ దక్షిణహిందూదేశమున ఏ ఒకటి రెండు గానకళాశాలలో మహారాజులు నెలకొల్పినను ప్రభుత్వాదరణ పూర్తిగ లేని కారణమున నీ గానకళ సర్వతోముఖముగ నభివృద్ధి జెందుట దురూహ్యమగు విషయమగును. గావున ప్రభుత్వ మీక్రింది విధముగ గానకళాభివృద్ధికి తోడ్పడు టత్యవసరమైయున్నది. (1) ముఖ్యసెంటరులలో ప్రత్యేక గానకళాశాలల నేర్పరచుట. (2) అందు గీత, వాద్య, నృత్యముల బోధించు అధ్యాపకుల నేర్పరచుట. (3) తదితర ఉన్నతపాఠశాలలందుగూడ గానము నిర్బంధవిద్యగా నేర్పరచుట. (4) అందుకుతగిన లక్ష్యలక్షణ

గ్రంథములు వ్రాయించుట. (5) వాటిని ప్రకటించుట. (6) ఈకళలోని లక్షణలక్ష్యములందు తీర్ణులగు వారిచే నుపన్యాసముల నప్పుడప్పు డిప్పించుట. (7) జనబాహుళ్య మీ కళాపరిశ్రమ జేయుటకై వీలుగా అన్ని గ్రంథాలయములకు సంగీతగ్రంథము లొసగుట. (8) అన్ని గానకళాశాలలందు రేడియోసెట్లు నమర్చి లక్ష్యలక్షణములను విద్యార్థులకు అప్పుడప్పుడు మద్రాసు రేడియోస్టేషన్ ద్వారా వినిపించుట. (9) కర్ణాటక సంగీతమునకు ముఖ్యమైన తెలుగుభాషకు నిలయమై, కోట్లకొలది ఆదాయము రాగలుగుచున్న యీ విశాలాంధ్రావనిలోగూడ నొక ప్రత్యేక రేడియోస్టేషన్ నిర్మాణము జేయుట. (10) తమ పరిపాలనలోని అన్ని మ్యునిసిపల్, లోకల్ బోర్డులు, తదితర జమీందారులను తగురీతి నీకళను పోషించున ట్లుత్తర్వుల నొసంగుట ఈ మొదలగు వివిధరీతులుగా తోడ్పడినచో కర్ణాటక గానకళ యెంతయో అభివృద్ధి జెందుననుట నిశ్చయము.

## ఆంధ్రయూనివర్సిటీవారి కర్తవ్యము

ఈ సందర్భములో నిటీవలనే గానకళాభివృద్ధికై ప్రయత్నించుచున్న మనయాంధ్రయూనివర్సిటీవారు గూడ ప్రశంసనీయులు. కాని వారితోడ్పాటు ఇంకను అపేక్షింపవలసియున్నది. కర్ణాటకసంగీతమునకు మూలపురుషు డనదగిన త్యాగరాజుకు మాతృదేశమగు ఆంధ్రదేశమున నెలకొల్పబడిన యీ ఆంధ్రవిశ్వవిద్యాలయమువారే ప్రత్యేక గానకళాశాల నొకటి స్థాపించి తద్ద్వారా గానకళాభివృద్ధి చేసి పండితులను విద్యార్థులను ఆదరింపవలసిన బాధ్యత వహింపవలయును. గనుక, ఆంధ్రవిశ్వవిద్యాలయాధికారు లీసందర్భమున ఆర్థికపరిస్థితులు సరిగలేవను నెపమున ఉదాసీనత నేమాత్రము చూపక తగురీతి తోడ్పడుటకు ఆంధ్ర గానకళోపాసకు లెంతయు వాంఛించుట విదితము.

## విద్యార్థుల కర్తవ్యము

ప్రపంచములో నేదేశమునగాని ఒకకళ అత్యున్నతికి రావలెనన్న ఆ దేశీయులగు విద్యార్థులు తత్కళా పరిశ్రమకై చూపు అత్యుత్సాహమే ప్రథమ కారణమనుట నిశ్చయము. విద్యార్థులు తప్పక ఈ గానశాస్త్రముయొక్క ఉత్కృష్టతను గ్రహించి దీని నభ్యసింప తగు కృషి యొనర్చినచో ఏ ప్రభుత్వముగాని యుదాసీనత జూపజాలదు. విధిగా అట్టి కళాభివృద్ధికై తగు విధమున తోడ్పడుననుట నిశ్చయము గనుక స్త్రీ, పురుష విద్యార్థి లోకమంతయు అమూల్యమైన యీ సూచనను అంగీకరించి ప్రభుత్వమువారీ కర్ణాటక గానకళకు ప్రోత్సాహము చూపువఱకు తగిన కృషి చేయుదురుగాక యని కోరుచున్నాను.

## ఆంధ్రదేశీయుల కర్తవ్యము

ఇటుల కర్ణాటకగానకళాభివృద్ధి కొనర్చు ప్రయత్నములలో మన ఆంధ్రదేశీయులకంటె తమిళదేశీయు లెంతయు ముందంజవేయుచుండిరనిన సత్యబద్ధ మగును. అందుకు ఈ క్రిందివి నిదర్శనములు.

(1) ఆ దేశీయుల కళాభిరుచి, కళాపోషణ, కళాభిమానము, అందులకు తగిన నిరంతర కృషి వలననే వారికి మద్రాసునందేగాక తిరుచునాపల్లిలో గూడ నొక ప్రత్యేక రేడియోస్టేషన్ లభించినది. (2) ఆదేశీయుల నిరంతర గానకళాపోషణవల్లనే వారిలో ననేకులు గాయక శిఖామణు లగుభాగ్యము గలిగినది. (3) ఆదేశీయుల నిరంతర కృషి, ఉదారతల వల్లనే మన త్యాగ రాజుని వర్ధంతి మహావైభవోపేతముగ నేటికిని తిరువయ్యారులో జరుగుచున్నది. (4) ఆదేశీయుల దేశాభిమానము, దేశీయగాయకుల పోషణవల్లనే మ్యూజిక్ ఎకాడమివంటి అనేక గానసంస్థలు నేటికి స్థిరముగా నిలువగల్గినవి. (5) ఆదేశీయుల మహాత్యాగమువల్లనే అన్నామలై యూనివర్సిటీలో మ్యూజిక్ కాలేజీ నియమించుట గలిగినది. (6) ఆదేశీయులు గ్రంథప్రకటన ప్రోత్సాహమువల్లనే అనేక ఉత్కృష్ట సంగీతగ్రంథము లిదివరకే ప్రకటితములైనవి. వేయేల? ఎన్నివిధములనో ఆదేశీయులు ఈ కళాపోషణకై కృషి యొనర్చుచుండుట లోకవిదితమైన విషయము. ఈ విషయములో మాత్రము ఆంధ్రదేశీయులు వారి నాదర్శముగ నుంచుకొని నిరుత్సాహమును వీడి పై దెలిపిన ప్రయత్నముల కికనైనను గడంగుట యావశ్యకము. దేశీయులగు ఆంధ్రులు తమ కర్తవ్యమును త్వరలో నిర్వహింతురుగాకయని కోరుచున్నాను.

## పత్రికాధిపతుల కర్తవ్యము

వర్తమానకాలములో ప్రపంచములో నేదేశమునందైన ఒక కళగాని, ఒక పరిశ్రమగాని, ఒక ఉద్యమముగాని, అభివృద్ధి నొందగలిగినచో అది ఆ దేశీయ పత్రికాధిపతు లొనర్చిన బహుళ ప్రచార మనుట నిస్సందేహము. ఎటు లనగా దేశమునందలి వివిధప్రాంతములందును నిత్యము ప్రచార మొనర్పగలిగి జనబాహుళ్యమున కాయా విషయములు ధనవ్యయములేక చక్కగా నాకర్షింపగలుగునట్లు జేయగలవి వార్తాపత్రికలే యైనందున తద్విషయములు దేశీయ పత్రికాధిపతులు గమనించి మన కర్ణాటక సంగీతాభివృద్ధికి తగిన ప్రచారము దిన, వార, పక్ష, మాస, పత్రికలద్వారా జేయుదు రనియు సత్వర గానకళాభివృద్ధికి మార్గదర్శకు లగుదు రనియు మిక్కిలిగా ఆశించుచున్నాను.

## గ్రంథాలయాధిపతుల కర్తవ్యము

పై సందర్భములో గ్రంథాలయాధికారులును, నిర్మాతలును చేయదగిన మహత్కార్యము గూడ కొంత గలదని చెప్పుటకు కుతూహల మగుచున్నది. అది యెటు లనగా వారి గ్రంథాలయములందు తదితర వివిధ గ్రంథములను, పత్రికలనువలె నీ గానకళలోని వివిధ లక్ష్యలక్షణ గ్రంథములను గూడ సేకరించుటలో శ్రద్ధచూపినచో వారిసేవ చిరస్థాయిగా నుండగలదనుట నిర్వివాదాంశము.

## ఆంధ్రదేశీయ గాయకుల కర్తవ్యము

గానకళాభివృద్ధికిగాను గానకళోపాసకులు చేయవలసిన కృషిగూడ కొంతగలదు. అది య్యేదన, (1) మొట్టమొదట అఖిలాంధ్రదేశ గాయకసంఘము నొకటి స్థాపించుట, (2) గాయకుల

వాద్యకుల శాస్త్రపండితుల జాబితా నొకటి తయారుచేయుట; (3) ముఖ్యసెంటరులో నేటేట గాయక మహాసభను జరుపుట. (4) అధ్యక్షు, ఉపాధ్యక్షు, కార్యదర్శుల నెన్నుకొనుట, (5) గాయకులందరి యభిమతానుసారము సంవత్సరచందా వసూలుచేయుట. (6) కూడలిస్థానమున కార్యస్థానము నెలకొల్పుట. (7) గాయకమహాసభలో ముఖ్యతీర్మానము లుపపాదించుట. (8) గానకళాభివృద్ధికి గాయక సంఘాభివృద్ధికి తగిన ముఖ్యవిషయములను తీర్మానించి అట్టి తీర్మానములను ప్రభుత్వమునకును, పత్రికలకును పంపుట. (9) ఆంధ్రగాయక నిత్యజీవనమునకు, కళాభివృద్ధికి తోడ్పడు రేడియోస్టేషను ఆంధ్రదేశములో స్థాపించుటకు ప్రభుత్వముతో విన్నవింప సమర్థుల నెన్నుకొనుట. (10) విద్యార్థులకు శక్తికొలది సంగీతలక్షణలక్ష్యములను మర్మములేక బోధించుట. ఈ మొదలగు మహత్కార్యములకు వారు గడగినచో ప్రభుత్వముయొక్క, దేశీయులయొక్క దృష్టి నాకర్షించి ఫలితము నొందగలుగుదురని గానకళోపాసకులకు మనవిజేయుచున్నాను. గానకళాభివృద్ధి కొనర్పవలసిన సర్వప్రయత్నములను జయప్రద మొనర్చుటకు నాదస్వరూపులైన త్రిమూర్తులగు బ్రహ్మ విష్ణు మహేశ్వరులను మిక్కిలిగా ప్రార్థించుచున్నాను. (11) ఆంధ్రదేశమునందలి ప్రతి పట్టణమునందున జరుగు వివాహాది శుభకార్యములందు శ్రీ మత్త్యాగరాజ వర్థంతి నిధికిగాను నిర్ణీతమైన కొంతధనము ప్రత్యేకించు విషయమై గాయకమహాసభలో తీర్మానించి తదనుసారము ఆయా పట్టణములందలి గాయకులు అయా ధనమును వసూలుచేసి కార్యదర్శిపేర కార్యస్థానమునకు పంపునట్లు ఏర్పాటుచేయుట. (12) దక్షిణదేశమున కావేరీతీరమందలి తిరువయ్యారునందువలె ఆంధ్రదేశమున కృష్ణానదీతీరమందలి విజయవాడ నగరమందు శ్రీ త్యాగరాజ వర్థంతి గాయక మహాసభవా రందరు కలసి చేయుట. తిరువయ్యారునందువలె బెజవాడలో త్యాగరాజమందిర నిర్మాణమునకై ప్రయత్నించుట. (13) త్యాగరాజమందిరమున గాన విద్యానిలయము గూడ నొకటి స్థాపించి అందు తగిన అధ్యాపకుల నేర్పచి వారిచే గానకళను లక్ష్యలక్షణయుతముగా బోధించునట్లు ఏర్పాటుచేయుట. (14) పై వర్థంతిసందర్భమున జాతిభేదముగాని, పాండిత్యభేదముగాని పాటింపక గానకళోపాసకులగు జంత్రి, గాత్రజ్ఞులందరికి ఆయా సందర్భాను సారముగ తగిన అవకాశము కల్పించి శ్రీ స్వామివారిసేవ యొనర్చుటకు సంఘీభావమును పెంపొందింపజేయుట.

ౘ

# రా జ జా మా త

[గీ తి నా టి క]

శ్రీ శివ శంకరశాస్త్రి

△

కల్హణపండిత ప్రణీత మైన "రాజతరంగిణి" అను కాశ్మీరదేశ చరిత్ర గ్రంథములోని యొక తరంగములోని కథావేశమును గ్రహించి రచించిన నాలుగు రంగముల గీతినాటికలో నిది మూడవరంగము. రచన, జూన్ ౧౯౩౯.

| | |
|---|---|
| దుర్లభవర్ధనుడు | : కాశ్మీరరాజ జామాత |
| అనంగలేఖ | : అతని భార్య |
| సుగంధ వసంతలేఖ | : అంతఃపురపాలికలు |
| ఖంఖుడు | : ప్రధానామాత్యుడు |

△

(ప్రాసాదములో రాజపుత్రిక శయనాగారము. ద్వారము వెలుపల ఖడ్గహస్త యైన సుగంధ నిలచియుండును. ఒక ప్రక్కనుండి దుర్లభ వర్ధనుడు ప్రవేశించి లోనికిబోవ యత్నింపగా నతని నాపి)

సు గం ధ

రాజపుత్రి యీ
రాతిరి నెవ్వరి
నటు రా వల దని
యాజ్ఞాపించెను.

ఆమె శరీరం
బస్వస్థముగా
నున్నది పాపము!
ఉదయమునుండియు.

దు ర్ల భ వ ర్ధ ను డు

ఆమె కస్వస్థతా?
అయ్యో, తెలియనె లేదు!
విధిగ రాజకుమారి
వీక్షించి రావలయు.

సు గం ధ

(అడ్డముగా నిలిచి)

వలదు ప్రభూ, నేడు పోవ
వలదు ప్రభూ, ఆమెకడకు!
మీరునైత మరుగునెడల
మిగుల కోప మొందు ప్రభూ!

ఆలకించి నాప్రార్థన
మరుగవలదు ప్రభూ! నాకు
తప్ప దవల శిక్ష రాజ
తనయవలన మహాప్రభూ!

(దుర్లభవర్ధనుడు తలుపు నెట్టుకొని పోవును. ఆతురముగా ద్వితీయద్వారముకడకు బరుగెత్తి తలుపు తెరచి చూచి యెలు గెత్తి)

సు గం ధ

వసంతలేఖా,
వసంతలేఖా,
వైళముగా నిటు
వత్తువ చెలియా!

(వసంతలేఖ ప్రవేశించును)

ఖంఖామాత్యులు
గదిలో నుండగ
జామాతయు నచె
చనినా డిప్పుడె.

వ స ం త లే ఖ

నాకక్ష్యలోనుండి
కడతేరనే లేదు;
ఆద్వారదేశాన
అరుదెంచెనో యేమొ!

మరలింప వైతివా
మంచిమాటలతోడ?
నీయత్న మొకవేళ
నిష్ఫలం బాయెనా?

దు ర్ల భ వ ర్ధ ను డు
(సంరంభముతో మరలి వచ్చి)

ఖడ్గము ఖడ్గము!
ఖండ ఖండములు
కావింపగవలె
కలుషవర్తనుల!

ఉపపతికౌగిట
నున్న పుంశ్చలిని
ఖండింపగవలె!
ఖడ్గము ఖడ్గము!

(తననడుమునకు గట్టిన కత్తియొర గట్టిగా బట్టుకొని సుగంధ యిటునటు బరుగెత్తును. అతడామె వెంటనంటును. ఇంతలో వసంతలేఖ చల్లగా బోయి ద్వారము బంధించి తాళము వేయును.)

ఏకతల్పగతు
లిర్వుర నిపుడే
కౌక్షేయమునకు
కావించెద బలి!

నీకటి వ్రేలెడి
నిత్రింశమ్మును
ఒసగుమ వేగమె
ఓసి సుగంథా!

(ఇరువురు పెనగులాడుదురు. అతడు కరవాలమును లాగుకొనును. వసంతలేఖ ఆతని పాదములపై బడి గట్టిగా బట్టుకొనును.)

కాలహరణమా!
కరవాలమునకు
దాహ మార్పవలె
తక్షణమందే!

వ స ం త లే ఖ

పరమశాంతులు మహా
ప్రభువు వీక్షణమందు
ఉద్రిక్తహృదయు లై
యుంట యాశ్చర్యమ్ము!

నిష్కారణమ్ముగా
నిండుకోపము బూని
ఎవరినో వధియింప
నెంచు టన్యాయమ్ము!

దు ర్ల భ వ ర్ధ ను డు

నిష్కారణమా?
నీవే యెరుగుదు!
వదుగులు విడువకె
ఆలస్యం బగు.

(అని పెనగులాడును. సుగంధకూడ అతని పాదములు పట్టుకొని నిలుపును.)

వ స ం త లే ఖ

ప్రభువు లద్దమరేయి
భ్రమకు లోనటు యేడొ
కలవరించుచు నున్న
కరణి దోచును నాకు.

దు ర్ల భ వ ర్ధ ను డు

నిజనేత్రంబుల
నిద్రించెడి యా
కలుష వర్తనుల
గాంచితి శయ్యను.

వ స ం త లే ఖ

నిద్రించువారలను
నిస్త్రింశమునకు మీ
రెర యిచ్చు పక్షాన
ఏమిక్షాత్రము ప్రభూ!

(అతడు కత్తి క్రిందికి దింపును.)

స్త్రీహననంబును
చేయుదురా మిము
బోలు క్షత్రియులు
పొరపడి యయినను?

అయిపోయిన యొక
యనుచితకార్యము
ఖడ్గాంచలమున
క్షాళిత మగునా?

దయ ఘనమ్మ కద
దండన కన్నను:
క్షమ వహింపవలె
కరుణాసాగర!

సు గ ం ధ

బ్రహ్మహత్య యన్న మహా
పాతకంబు గదా ప్రభూ!
అట్టిపనికి సాహసించు
టనుచితమ్మ గదా ప్రభూ!

ప్రథమకోప ముజ్జగించి
పౌరుషప్రధాను లైన
దేవర యౌదార్య మూని
తితిక్ష వహియింప వలయు.

(దుర్లభవర్ధనుడు నెమ్మదిగా కత్తిమొన నేలపై మోపును.)

వ స ం త లే ఖ

ఖడ్గవాద మేమి మేలు
కాలు జారిపడిన వెనుక?
పతనమ్మే లేకుండగ
ప్రయత్నించి యుంట శుభము.

సంహరించి నంత పురుష
సమకూరెడిలాభ మేమి?
ఇంతి సమ్మతింపకున్న పురుషు
దేవిధాన దరి జేరును?

దు ర్ల భ వ ర్ధ ను డు

ప్రథమదోష మందువ యీ
భ్రష్టుల యకార్య కరణ?
మనుమానం బుండె గాని
యథార్థంబు నరయ నైతి!

సు గ ం ధ

ప్రథమదోష మెట్టు లగును?
బహుకాలమునుండి ప్రభూ,
సాగుచుండు గూఢముగా
సమావేశ ముభయులకును

(అతడు కత్తి జారవిడచును.)

వ స ం త లే ఖ

అంతఃపుర పరిచారిక
లగువా రేవేళ నైన
కాపాడుటయే ధర్మము
కదా యెట్టిరహస్యమ్ము?

వెల్లడింతుమేని నాల్క
వ్రీలిపోయి మాతనువులు
కోటగోడనుండి క్రింది
కుక్కల కెర యగును ప్రభూ!

(దుర్లభవర్ధనుని కొంచె మావలకు గొనిపోయి పీఠముపై గూరుచుండ బెట్టి వసంతలేఖ వీవ నతో విసరును. సుగంధ యాతని పాదముల కడ గూరుచుండును.)

దు ర్ల భ వ ర్ధ ను డు
(పరధ్యానముగా)

రాజకుమారికి
రాగ మన్యునెడ
కల దని మాత్రము
గ్రహింప గలిగితి,

ఖంఖామాత్యుడె
కామి యనుచు నే
నూహ సేయ లే
దొక్క నిమేషము.

ఆహా, యెంతటి
యకార్యకరణము!
విప్రోత్తముడే!
విద్వాంసుండే!

నిరుపద్రవముగ
నిఖిలరాజ్యమును
సంరక్షించెడి
సచివోత్తముడే!

ప్రభు వెల్లప్పుడు
భక్తిశ్రద్ధల
నాదరించు తన
నందరియెదుటను.

ప్రభుకుమారితో
ప్రణయమె శివ! శివ!
అంతఃపురమున
నకార్యకరణమె!

నిష్కల్మషముగ
నే నాతనియెడ
సంతతభక్తి
శ్రద్ధల మెలగుదు.

ఏమిలోక మిది!
ఎంత కృతఘ్నత!
విశ్వాసంబే
విషసంకాశము!

(నిట్టూర్పు విడుచును)

వ స ం త లే ఖ

ఖంఖామాత్యుడు
కాపురుషం డని
భావించుట ప్రభు,
భావ్యం బగునా?

ఆయన గుణగణ
మందు కళంకము
సంక్రమించె నొక
జారత్వంబే.

అదియును కేవల
మాయన దోషం

బనుట మహాప్రభు,
అసమంజసమే.

ఖంఖామాత్యుని
గనుగొని నంతనె
కాంక్ష జనింపని
కామిని యుండునె?
(నిట్టూర్పు విడుచును)

దు ర్ల భ వ ర్ధ ను డు

ఛీ ఛీ, నికృష్టంబు
స్త్రీజాతి లోకాన!
చంచలత్వమె దాని
సామాన్య లక్షణము.

వ స ం త లే ఖ

అదియు గాక మన
అనంగ దేవీ
సౌందర్యము కడు
సమ్మోహదమే;

దు ర్ల భ వ ర్ధ ను డు

"కాన్తే త్యుత్పలలోచ నేతి విపుల
శ్రోణీభరే త్యున్నమ
త్పీనోత్తుంగపయోధ రేతి సుముఖాంభో
జేతి సుభ్రూ రితి
దృష్ట్వా ముహ్యతి మోదతే భిరమతే
ప్రస్తౌతి విద్వా నపి
ప్రత్యక్షాశుచి భస్త్రికాం స్త్రియ మహో
మోహస్య దుశ్చేష్టితమ్!"

వ స ం త లే ఖ

ప్రబలుం డగు నా
బ్రాహ్మణసచివుని
విడిచి పుచ్చుటే
వివేక మగు ప్రభు!

దు ర్ల భ వ ర్ధ నుడు

ఉచిత మా క్రోధమ్ము
నుపసంహరించుకే:
బ్రహ్మహత్యామహా
పాతకము నా కేల!
వధ్యుడే యగు గాక
వదలిపెట్టితి విప్రు,

వసంతలేఖ - సుగంధ

మీ రుదారహృదయు లనియె
మే మెరుగుదు మెపుడు ప్రభూ!
నేటి మీప్రవర్తనమును
నిలింపగణం బభినుతించు!

దు ర్ల భ వ ర్ధ ను డు

అప్రతిష్ఠ ఘటిల్లి పోయిన
దస్మదన్వయమునకు నకటా!
నాగకర్కోటకుడు పిత సు
స్నాత జనయిత్రి.

వ స ం త లే ఖ

అద్భుతం! బటు లయినచో రా
జాంశమున జనియించినారే!
ఇంతకాలము మాకు దెలియదె
ఈ రహస్యమ్ము!

అపుడు గోనందాన్వవాయము
నతకరించును భవద్వంశము
పూతకర్కోటకుల కులమున
బుట్టినారె ప్రభూ!

దుర్లభవర్ధనుడు

దివ్యవంశమునకు కళంకము
దెచ్చుభార్యను ఖడ్గధారకు
బలి యొసంగిన నలముకొనునే
పాప మేనాడు!

(కత్తికొరకు లేవబోవును. పాలికలాతని పాదములు పట్టుకొని ఆపి పీఠముపై గూర్చుండబెట్టి వీవనలను తెచ్చి విసరుదురు.)

వసంతలేఖ

ఉత్తమోత్తమ మైనకులమున
నుద్భవించినవా, రుదారులు;
దయిత తప్పు క్షమించి యెటులో
దయను బ్రోవ దగున్.

దుర్లభవర్ధనుడు

"స్మృతా భవతి తాపాయ
దృష్ట్వా చోన్మాదకారిణీ
స్పృష్టా భవతి మోహాయ
సా నామ దయితా కథమ్?"

సుగంధ

ముఖ్యామాత్యుని
మోహజాలమున
జిక్కియు, మీయెడ
స్నిగ్ధయె ఆయమ.

దుర్లభవర్ధనుడు

"నాఽమృతం న విషం కించి
దేకాం ముక్త్వా నితమ్బినీమ్;
సైవామృతలతా రక్తా
విరక్తా విషవల్లరీ."

వసంతలేఖ

బింబాదేవికి మీపై
ప్రీతి మెండు; బలాదిత్య
రాజరాజేశ్వరునకు
రక్తి కలదు మీయెడలను.

రాజపురుషు లెల్ల నాద
రమ్ముతోడ వర్తింతురు.
కాశ్మీర ప్రజలు మిమ్ము
గారవింతు రధికముగా.

చిన్నతనము గాన కొంత
చిత్తచాంచల్య మున్న,
లేకపోదు శ్రీ అనంగ
లేఖకు మీయెడల ప్రీతి.

దుర్లభవర్ధనుడు

"జల్పన్తి సార్ధ మన్యేన
పశ్యన్త్యన్యం సవిభ్రమాః
హృద్గతం చిన్తయ న్త్యన్యం
ప్రియః కో నామ యోషితామ్!"

వసంతలేఖ

పాలిపోయె మీ దేహము,
బహు కృశించినారు ప్రభూ!
ఆమె మిమ్ము గాంచునేని,
అనురాగము పొంగు ప్రభూ!

దుర్లభవర్ధనుడు

"తావ దేవామృతమయీ
యావ ల్లోచన గోచరా;
చక్షుఃపథా దతీతా తు
విషా దప్యతిరిచ్యతే."

వసంతలేఖ
శ్రీ మదాంధ్రిజకుమారిక
శృంగారోదధిచంద్రిక.
శాంతి గాంచు మానస మా
సౌందర్యచ్ఛాయలోన.

దుర్లభవర్ధనుడు
"స్తనౌ మాంసగ్రంథీ కనక
కలశా వి త్యుపమితౌ,
ముఖం శ్లేష్మాగారం, త దపి చ
శశాఙ్కేన తులితమ్,
స్రవన్మూత్రక్లిన్నం, కరివర
శిరస్స్పర్థి జఘనం,
అహో నిన్ద్యం రూపం, కవిజన
విశేషై ర్గురుకృతమ్"

వసంతలేఖ

కవులమాట కేమి, అమర
కామినీ మహార్ఘరూప,
కాశ్మీర కిరీటాలం
కార మ్మర్ధాంగలక్ష్మి.

దుర్లభవర్ధనుడు

ముగ్ధత కలుగును
ముద్దుమొగమ్మును
స్ఫురదంగకముల
జూచిన యప్పుడు,

(కొంచెముండి, విరక్తితో)

"నారీ స్తన భర
నాభీదేశం
దృష్ట్వా మా గా
మోహావేశమ్,

ఏత న్మాంస
వసాది వికారం
మనసి విచిన్తయ
వారం వారమ్!"

వసంతలేఖ

అర్ధాంగిని మీ
రతకరించెదరు,
ఆదరింప దగు
నని నాప్రార్థన.

దుర్లభవర్ధనుడు

అర్ధాంగి అర్ధాంగి
అనబోకుము వసంత!
అగును దాంపత్య మ
ర్ధాంగీకృతం బగుట
ఆమె నా కర్ధాంగి!
అల మలం భార్యయా!

భాగ్యవంతు డెవండో
పడయు ననురక్తయౌ
వనిత నర్ధాంగిగా-
వంచనమ్మె ఘటిల్లె
ఎందరో పురుషులకు
నిల్లాండ్రమూలాన.

నైసర్గికమ్ముగా
నారి చంచల యగుట,
ఆనతికి లోపరచు
ఉన్న దుస్సాధంబు.

సత్యమ్ముగ వివేక
సంపన్ను డగువాడు
తన యొడలిపై మమత
త్యజియించు నన్నచో,

ఇంద్రియార్థమె తనకు
ఇం పైన తన్వంగి
యెడల మమకారమ్ము
నెటు వహింపంగలడు?

(కన్నులు మూసికొని కొంతతడవుండి, మరల నేత్రములు తెరచి)

అన్నియుద్వేగాలు
అనురాగ మూలాలు.
అనురక్తికిని భూమి
అధిక మౌ ద్వేషమ్ము.
వేళ్ళు తన్నును రాగ
వృక్షమ్ము పాతాళ
లోకపర్యంతమ్ము;

లూన మగుచో మూల
మనురాగము నశించు,
ఆమీద నఖిలాశ
లణగిపోవు, వివేక
మంకు రించును దాన.

(కొంచె మాలోచించి)

అహంకార మమకారము
లణగు గాక నామనసున!
స్వాంతమందు వెలయుగాక
శాంతం శివ మద్వైతమ్!

(అని కన్నులు మూసికొనును. అంతః పుర పాలిక లిరువురు నతని నాశ్చర్యముతో జూతురు.)

ఋ

# గ్రంథాలయములు

సీ॥ శ్రీ భారతీసతి స్థిరనివాసంబున, కాలవాలములు గ్రంథాలయములు
అజ్ఞానతిమిరంబు హరియింప విమల వి,ద్యావిలాసములు గ్రంథాలయములు
సాంఘిక మతరహస్యము లెల్ల దెల్పు స,ద్ధర్మాలయములు గ్రంథాలయములు
జాతీయగౌర వాస్పదనిరాటంక శు,భాదర్శకములు గ్రంథాలయములు
తే॥ ఇట్టి గ్రంథాలయోద్యమ మెల్లగతుల, విస్తరింపగ భాషాభివృద్ధిగాంచి
భారతీయులు తొల్లింటిభంగి మెరయ, విన్నవించెద నీ చిన్నివిన్నపంబు!

సీ॥ మన పూర్వవిజ్ఞానఖని విరాజిలుటకు, గ్రంథాలయములె సత్కారణములు
మన సనాతనధర్మ మహిమోన్నతికి సదా, గ్రంథాలయములె సత్కారణములు
మన సహోదరుల సన్మార్గాభివృద్ధికి, గ్రంథాలయములె సత్కారణములు
మనదేశ మైకమత్యనిరూఢి గనుటకు, గ్రంథాలయములె సత్కారణములు
తే॥ ఇట్టి గ్రంథాలయోద్యమ మెల్లగతుల, విస్తరింపగ భాషాభివృద్ధిగాంచి
భాగతీయులు తొల్లింటిభంగి మెరయ, విన్నవించెద నీ చిన్నివిన్నపంబు!

# జైనమత చరిత్ర

శ్రీ మొహమ్మద్ ఖాసింఖా

క్రీ. పూ. ౬వ శతాబ్దపు ఉత్తరార్ధమున భారతదేశములో పెక్కు నవీన మతోద్యమములు బయలుదేరెను. క్షత్రియులు బ్రాహ్మణమతముపై విప్లవధ్వజమెత్తిన కాలమది. ఆ విప్లవమునకు ఫలితముగ భారతదేశమున అసంఖ్యాకములగు మతములు మొలకెత్తెను. బుద్ధుని కాలములో ౬౩ మతములుండెనని ఒక బౌద్ధగ్రంథమున కలదు. జైనగ్రంథము లింకను పెద్ద సంఖ్య నిచ్చుచున్నవి. కాని ఇవన్నియు పుబ్బలో పుట్టి మఘలో మాయమైనవి. వీనిలో రెండు మతములు మాత్రము చిరస్థాయిగా నిలిచిపోయెను. ఇవి జైన బౌద్ధమతములు. ఇందులో జైనమతము చాల ప్రాచీనమైనదని జైనగ్రంథము లనుచున్నవి. వర్ధమాన మహావీరుడు జైనమతకర్త కాడనియు, అతడొక సంస్కర్తయనియు, అతనికి పూర్వము ఇరువది ముగ్గురు తీర్థంకరులు అవతరించిరనియు, వీరిలో తుది తీర్థంకరుడు పార్శ్వనామధేయుడు మహావీరునకు రెండున్నర శతాబ్దముల పూర్వముండెననియు జైనులందురు. ఈ తీర్థంకరుల వృత్తాంతము పురాణగాథలలో ప్రచ్ఛన్నమై యున్నది. ఈ గాథలు చారిత్రకముగ నిరుపయోగమైనవి. ఉదాహరణమునకు, ప్రథమతీర్థంకరుడగు ఋషభుడు భారత చక్రవర్తియనియు, అతడు తన కుమారుడగు భరతునకు పట్టము కట్టి తాను సన్యాసమును స్వీకరించి కొన్ని లక్షల ఏండ్లు తపస్సానరించెననియు, భరతుడు ప్రథమ సర్వభారత చక్రవర్తియనియు (ఋషభుడు పెక్కువందల గజముల పొడవుండెననియు) జైన పురాణములలో కలదు. బ్రాహ్మణ పురాణములలో వీరి ప్రస్తావము ఎక్కడను లేకుండుట, మరే చరిత్రాధారములును లేకుండుట ననుసరించి జైనతీర్థంకరుల ఈ చరిత్రములు చారిత్రకముగ విశ్వసనీయములు కావనియే చెప్పవచ్చును. ఇరువది మూడవ తీర్థంకరుండగు పార్శ్వుడుండవచ్చుననుట నిర్వివాదము. పార్శ్వుడే జైనమత సంస్థాపకుడని జాకొబీ పండితుని యొక్కయు, ఇంకను పల్వురు పండితులయొక్కయు అభిప్రాయము. పార్శ్వనాథుడు, క్రీ. పూ. ఎనిమిదవ శతాబ్దమున ఉండియుండనోపు; ఎందుకనగా మహావీరునకు రెండున్నర శతాబ్దముల పూర్వమితడుండినట్లు జైనగ్రంథములవల్ల తెలియుచున్నది. బుద్ధునకు పూర్వము భారత చరిత్రమున విశ్వసనీయమగు తేదీలు లేకపోవుటచే పార్శ్వనాథుని కాలనిర్ణయమునకు జైనగ్రంథముల ప్రమాణమునే స్వీకరించవలసియున్నది. పార్శ్వనాథుని జీవిత చరిత్రను గుఱించిగాని, అతని బోధలను గురించిగాని, మనకంతగా తెలియదు. బహుశః క్రీ. పూ. ౩౦౦కు పూర్వముండిన, భద్రబాహువు రచించిన కల్పసూత్రములలో పార్శ్వనాథుని గుఱించి కొంతకలదు. ఇతర తీర్థంకరులవలె పార్శ్వుడుకూడ క్షత్రియుడనియు, వారణాసీనగరమును పాలించుచుండిన అశ్వసేనుని కుమారుడనియు, అతని ధర్మపత్ని పేరు వామయనియు, పార్శ్వుడు ౩౦ ఏండ్లు భాగ్యభోగ్యములలో గడపి సన్యాసమును స్వీకరించెననియు కలదు. సన్యాసమును స్వీకరించిన తర్వాత ఎనుబది నాల్గు దినములు ఘోరమగు తపస్సొనర్చి దివ్యజ్ఞానమును బడసెననియు, అటు పిదప ౭౦ ఏండ్లు తీర్థం

కరుడై మతబోధచేయుచు తుదకు సమ్మేతపర్వతముపై నిర్వాణము పొందెననియు, ఈ గ్రంథమున కలదు.

పార్శ్వుని మతబోధకును, మహావీరుని ధర్మమునకును ఎక్కువ భేదమున్నట్లు కనుపించదు. అహింస, సత్యము, చౌర్యము చేయకుండుట, ఎట్టి ఆస్తియు ఉంచకుండుట - ఇవి పార్శ్వుడు బోధించిన ప్రధాన ధర్మములు. మహావీరుడు బ్రహ్మచర్య ప్రతిజ్ఞ నొకదానిని హెచ్చించెను. మహావీరుడు, జైనసన్యాసులు దిగంబరులై ఉండవలెనని శాసింప, పార్శ్వుడు రెండు వస్త్రములను ధరింప అనుజ్ఞ నిచ్చెను. పార్శ్వ మహావీరుల సిద్ధాంతములలో ముఖ్యభేదము లివే. ఈ భేదములను తొలగించుటకు కొన్నాళ్ళ తరువాత ప్రయత్నములు జరిగెను. మహావీరుని శిష్యుడగు గౌతముడును, పార్శ్వుని శిష్యుడగు కేశియును కలిసి ఈ రెండు విషయములను గూర్చి చర్చించి రని ఒక జైనగ్రంథమున కలదు.

జైన బౌద్ధమతములలో ఏది ప్రాచీనమైనదన్న విషయ మొకప్పుడు వివాదాస్పదమై యుండెను. కోల్‌బ్రూక్, ప్రిన్‌సెప్, స్టీవెన్‌సన్, థామస్ మున్నగు పండితులు జైనమతమే ప్రాచీనమైనదనిరి. విల్‌సన్, లాసెన్, వెబర్ పండితులు బౌద్ధమతమే ప్రాచీనమైనదనియు, జైనమతము బుద్ధుని తరువాత బయలు వెడలిన బౌద్ధమతశాఖలలో ఒకటనియు, అభిప్రాయపడిరి. ఇప్పుడీ అభిప్రాయము పొరపాటని బ్యుహ్లర్, జాకోబీ, అను ఇద్దరు జర్మను పండితులు నిర్వివాదముగ నిరూపించిరి.

వర్ధమాన మహావీరుడు విక్రమశకమునకు ౪౭౦ ఏండ్లపూర్వము అనగా క్రీ. పూ. ౫౨౭ లో మరణించెనని జైనగ్రంథముల వల్ల తెలియుచున్నది. కాని ఈ కాలనిర్ణయము సరియైనదని తోచదు; ఎందుకనగా మహావీరుడును గౌతమ బుద్ధుడును సమకాలికులని బౌద్ధగ్రంథముల వల్ల తెలియుచున్నది. గౌతమబుద్ధుడు క్రీ పూ. ౪౮౦ ప్రాంతములో నిర్వాణము చెందినట్లు ఇప్పుడు నిర్ధారింపబడినది. అట్లైనచో వీ రిద్దరు ఏబదేండ్ల భేదములో మరణించినట్లు తేలుచున్నది. గౌతమ బుద్ధుడు తన ౮౦ వ ఏట మరణించినట్లు తెలియుచున్నది. గౌతముడు తన ముప్పది ఆరవ ఏట బుద్ధు డయ్యెను. అట్లయినచో మహావీరు డప్పటికే మరణించి యుండవలెను. మహావీర బుద్ధులిరువురును మగధరాజగు అజాతశత్రువునకు సమకాలికులు. అజాతశత్రువు పరిపాలనకాలము బుద్ధునినిర్వాణమునకు ౮ ఏండ్లకు పూర్వము ప్రారంభమాయెను. మహావీరుడు క్రీ. పూ. ౫౨౭ లో మరణించియుండినచో అత డజాతశత్రుని పరిపాలనా కాలములో ఉండి యుండుట అసాధ్యము. అందుచే హేమచంద్రాచార్యుని ఆధారముపై జాకోబీ పండితుడు స్వీకరించిన క్రీ. పూ. ౪౬౭ ని మహావీరుని మరణకాలముగ గ్రహించవలెను. మహావీరుడు బుద్ధునకు పూర్వము మరణించెననుటకు బౌద్ధమత గ్రంథముల ప్రమాణములు కలవు.

విదేహరాజ్యమునకు రాజధానియగు వైశాలీనగరమునకు పరిసరములందుండిన కుండయను ఒక గ్రామములో జ్ఞాతృకు లను ఒక క్షత్రియ తెగకు నాయకుడగు సిద్ధార్థుని కుమారుడు వర్ధమానుడు.

సిద్ధార్థుడు వైశాలిని పాలించిన లిచ్ఛవీ రాజులలో సుప్రసిద్ధుడగు చేతకుని చెల్లెలగు త్రిశలను పెండ్లాడెను. ఈమె వర్ధమానునితల్లి. మగధచక్రవర్తియగు బింబిసారుడు చేతకుని కూతురగు చెల్లనను పెండ్లాడెను. ఈమె అజాతశత్రువు తల్లి. ఈవిధముగ వర్ధమానుడు అటు విదేహరాజులతోడను, ఇటు మగధచక్రవర్తులతోడను బాంధవ్యము కలిగియుండెను.

వర్ధమానుని జన్మమునుగూర్చి జైనగ్రంథమగు కల్పసూత్రము ఒక విచిత్రమగు కథను చెప్పుచున్నది. వెనుకటి జన్మమున వర్ధమానుడు పుష్పోత్తరమను ఒకదివ్య హార్మ్యమున నివసించుచుండెననియు, కుందగ్రామమందలి ఋషభదత్తుడను ఒకబ్రాహ్మణుని భార్యయగు దేవానంద గర్భమున ప్రవేశించి అవతారమెత్తగోరెననియు, వెనుక తీర్థంకరులు ఎన్నడును బ్రాహ్మణ వంశములందు పుట్టియుండలేదను కారణమున శక్రుడు దేవానంద గర్భమునుండి వర్ధమానుని త్రిశాలా గర్భమునకు మార్చెననియు, ఇందుకలదు. ఈకథను శ్వేతాంబరజైనులు మాత్రమే సత్యమని స్వీకరించిరి. దిగంబరజైనులు నమ్మరు. శ్వేతాంబర, దిగంబర, జైనులకుగల నాల్గు విషయములకు సంబంధించిన భేదములలో నిది ఒకటి.

వర్ధమానుడు యశోదాదేవిని పెండ్లాడి ఆమెవల్ల ఒకపుత్రికను బడసెననియు, ఈ కుమార్తెయే తరువాత ఒకజైనశాఖకు గురువైన జమాలిని పెండ్లాడెననియు, కల్పసూత్రమున కలదు. వర్ధమానుడు తన ముప్పదవయేట తలిదండ్రులు మరణించిన పిదప, అగ్రజుడగు నందివర్ధనుని అనుజ్ఞగొని సన్న్యాసమును స్వీకరించెను.

వర్ధమానుడు సన్న్యాసమును స్వీకరించి పండ్రెండేండ్లు ఘోరతపమొనర్చి పదమూడవయేట దివ్య జ్ఞానమునుబడసి జినుడాయెను. జైనుల ప్రథమ ధర్మగ్రంథమగు ఆచారాంగ సూత్రము వర్ధమానుడు జినుడైన విధమునిట్లు వర్ణించుచున్నది. "ఋజుపాలికానది ఉత్తరతీరమున జృంభిక గ్రామము బైట సామాగుని క్షేత్రములో ఒక పాతదేవాలయమునకును ఒక సాలవృక్షమునకు సమీపమున......... ధ్యాననిమగ్నుడై ౧౩ వ యేట వైశాఖమాసములో సువ్రత మను దినమున......... వర్ధమానుడు కేవలుడయ్యెను......... పవిత్రుడగు వర్ధమానుడు అర్హంతుడును జినుడునైన పిదప కేవలుడై సర్వజ్ఞుడయ్యెను. దేవతలయొక్కయు మానవులయొక్కయు రాక్షసులయొక్కయు భూతభవిష్యద్వర్తమాన కాలము లన్నిటిని ఎఱిగినవాడాయెను."

నాటినుండియు వర్ధమానుడు మహావీరుడనియు, జినుడనియు పిలువబడసాగినాడు. మహావీరుని అనుయాయులు నిర్గ్రంథులనబడసాగిరి. ఇప్పుడా పేరు వాడుకనుండి అంతరించిపోయి జైనులు (అనగా జినానుయాయులు) అను పేరే ప్రసిద్ధికెక్కినది. వర్ధమానుని జననీ జనకులు పార్శ్వ తీర్థంకరుని అనుయాయులై ఉండినట్లు తెలియుచున్నది. వెనుక చెప్పినట్లు వర్ధమానుని మతమునకును పార్శ్వుని మతమునకును ఎక్కువ భేదములేదు. మహావీరుని మతము పార్శ్వుని మతము యొక్క ఒకశాఖ యనియు, పోనుపోను పార్శ్వుని మతముకంటె మహావీరుని శాఖయే ఎక్కువ బలముగొని ఒక మతముగ ప్రసిద్ధికెక్కెననియు అనుకొనవచ్చును. నిర్గ్రంథులు పార్శ్వనాథుని

మతముయొక్క ఒక శాఖకు చెందినవారనుటకు తార్కాణము బౌద్ధగ్రంథములవల్ల లభించుచున్నది. బౌద్ధగ్రంథములు మహావీరుని 'నిగ్గంథఞాతిపుత్త' (నిర్గ్రంథజ్ఞాతృపుత్ర) అని పిలుచుచున్నవి.

మహావీర బుద్ధుల కాలములో బౌద్ధజైన మతములందు వివాదములు జరుగుచుండెడివి. మహావీరుని శిష్యులు పల్వురు గౌతమబుద్ధునితో వాదోపవాదములొనర్చి తుద కోడిపోయి బౌద్ధమతమును స్వీకరించినట్లు బౌద్ధగ్రంథములలో కలదు. అజాతశత్రువు మొట్టమొదట మహావీరుని అనుయాయుడై అతనివల్ల ఆధ్యాత్మిక సంతృప్తి బడయక తుదకు బుద్ధునాశ్రయించెను. రాజగృహనివాసియగు ఉపాలీ మహావీరుని సుప్రసిద్ధ శిష్యుడై బుద్ధునితో వాగ్వాదమొనర్చి తుట్టతుదకు బౌద్ధుడై ప్రసిద్ధి వహించెననియు, తరువాత ఉపాలి తన ప్రథమగురువగు మహావీరునియెడ గర్వముతో ప్రవర్తించెననియు, మహావీరుడు తన ముఖ్యశిష్యుని ఈ ప్రవర్తనమునకు ఖేదమనస్కుడై రక్తమును కక్కెననియు మర్ఝిమ నికాయమందలి ఉపాలిసుత్తమున కలదు. కాని ఇందొక్క విషయము గమనింపదగినది. జైనులకును బౌద్ధులకును మధ్య జరిగిన ఈ వాదోపవాదముల ప్రస్తావము బౌద్ధగ్రంథములందు మాత్రమే కలదు. జైనగ్రంథములం దీవిషయము స్పృశింపబడలేదు. బౌద్ధులు తమ విజయములను అతిశయోక్తులతో వ్రాసికొనిరనుట నిర్వివాదము. ఇంతేకాదు అజాతశత్రువును జైనులు జైనుడనియే అందురు. అట్లే; అంగ, విదేహ, మగధ రాజ్యముల నాటి పాలకులను బౌద్ధగ్రంథములు బౌద్ధులుగను, జైనగ్రంథములు జైనులుగను పేర్కొనుచున్నవి.

జైనబౌద్ధమతములందు పెక్కుసామ్యము లున్నట్లు పైకి కన్పించినను మూలమున ఈరెండు మతములకును విశాలమగు భేదములు కలవు. అహింసాసిద్ధాంతమునను, సన్న్యాసము విషయమునను కొంత సామ్యమున్నను కొంత భేదముకూడ లేకపోలేదు. కర్మబంధములనుండి విముక్తిబడయుటకు ఇంద్రియములను జయించి దేహమును కృశింపజేయుట అవసరమైనను ఆ విషయమున ఒకమధ్యమమార్గము నవలంబించవలెననియు, స్వదేహమును హింసించుకొనరాదనియు బుద్ధుడు బోధించెను మహావీరుడు దిగంబరత్వమును, స్వశరీరహింసను నిరాహార మరణమును నిర్వాణమునకు మార్గముగా బోధించెను. అహింస విషయమునకూడ మహావీరబుద్ధులకు కొంతభేదము లేకపోలేదు. బుద్ధుడు ఎట్టి జీవజంతువునకును ఏవిధమైన హింసనుగాని, బాధనుగాని కలిగింపరాదని బోధించెను. మహావీరుడు జంతువుల యొక్కయు, వృక్షముల యొక్కయు క్షేమమునకై మానవక్షేమమును సైతము బలియిచ్చినాడు. ఇంతేకాదు ఈ రెండుమతముల తత్త్వములందుకూడ విశాలమగు భేదము కలదు.

మహావీరునకు గోసాలుడు నిజమైన ప్రతిపక్షి. గోసాలుని సిద్ధాంతములును, అతడు బోధించిన జీవితవిధానమును దాదాపు మహావీరుని నుండియే గ్రహింపబడినవి. గోసాలుడు శ్రావస్తీ నగరమున తన ప్రధాన పీఠము నేర్పాటుచేసికొని వేలకొలది శిష్యులను సంపాదించెను. మహావీరుడు పెక్కుమారులు గోసాలునితో కలిసి వాగ్వివాదములు సలిపెను. తుదకు శ్రావస్తిలో గోసాలు

డోడిపోయెను. దీని తర్వాత ఒక వారము దినములకు గోసాలు ఉన్మాదుడై మరణించెను. ఇతని అనుయాయులను ఆజీవికులందురు. మహావీరుని అల్లుడగు జమాలియు, శిష్యుడగు 'తీసగుట్టుడు'ను కొన్ని విషయములలో మహావీరుని ప్రతిఘటించిరి. ఈ ప్రతిపక్షులు మహావీరుని పనికెక్కువ ఆటంకము కల్గింపజాలక పోయినను మరణించువరకు వారు మహావీరునకు కంటక ప్రాయులై యుండిరి.

అజాతశత్రువు పరిపాలన కాలములో మహావీరుని మతము సత్వరప్రగతి నొందెను. అజాతశత్రువు జైనుడై యుండవచ్చును. అందుచేతనే కాబోలు అజాతశత్రువు తన తండ్రియగు బింబిసారుని చంపి రాజ్యమునకు వచ్చిన వృత్తాంతమును జైనులు మరుగుపరచుటకు ప్రయత్నించిరి. మహావీరుని తరువాత జీవితవృత్తాంతము తెలిసికొనుటకు చారిత్రిక సామగ్రి లేదు. రాజగృహమునకు సమీపమున "పావా" అను చిన్న పట్టణమున హస్తిపాలరాజు లేఖకుని గృహమున ఆతడు తన ౭౨ వ ఏట మరణించెనని మాత్రము తెలియుచున్నది.

మహావీరుని ౧౧ గురు గణధరులు లేక ప్రధాన శిష్యులలో సుధర్ముడను ఒక శిష్యుడు మాత్రము అతని తరువాత బ్రతికి యుండెను. మహావీరుని తరువాత అతడే జైనమతమునకు ప్రధానాచార్యుడయ్యెను. మహావీరుని మరణానంతరము ౧౨౦ ఏండ్లవరకు జైనమతమును గురించి తెలిసికొనుటకెట్టి ఆధారములును లేవు. అజాతశత్రువు కుమారుడగు ఉదయనుడు కూడ జైనమతస్థుడై యుండెను. ఉదయనుని శత్రువొకడు జైనసన్యాసి వేషమున రాజహర్మ్యమున ప్రవేశించి ఉదయనుని వధించెనని జైనగ్రంథములందు కలదు. తరువాత మగధదేశమునేలిన నవనందులును, కళింగరాజగు ఖారవేలుడును జైనులైనట్లు నిదర్శనములు కలవు.

నవనందులకాలములో సంభూతవిజయుడు, భద్రబాహువు అను ఇద్దరు జైనాచార్యులుండిరి. భద్రబాహువు నాటి జైన ఆచార్యులలో అగ్రగణ్యుడు. పూర్వములనబడు ౧౪ జైన ధర్మగ్రంథముల నామూలాగ్రముగ నేర్చిన మహామేధావి. జైన ధర్మగ్రంథములను క్రోడీకరించుటకై పాటలీపుత్రమున జరిగిన జైనాచార్యుల పరిషత్తులో పూర్వగ్రంథపారంగతులయిన పండితులు లేకపోవుటచేత స్థూలభద్రుడు అప్పుడు తపస్సు చేయుటకై నేపాళదేశమున కేగి యుండిన భద్రబాహువు కడకు వానిని నేర్చుకొనుటకై వెళ్ళవలసి వచ్చెను. ఆ కాలమున భద్రబాహు వొకడే పూర్వగ్రంథములన్నిటిని సాంతముగ ఎఱిగియుండెనట. సంభూతవిజయుడు కూడ అట్టి పండితుడే. ఇతడు చంద్రగుప్తుడు సింహాసన మెక్కిన సంవత్సరమున మరణించెను. అదే కాలమున బంగాళమున ఒక గొప్ప క్షామము సంభవించి దేశమును పండ్రెండేండ్లపాటు మాడ్చెను. క్షామకాలమున జైనసంఘము చెడిపోవునని భయపడి భద్రబాహువు తన అనుయాయులనందరను సమావేశపరచి దక్షిణమున కర్ణాటదేశమునకు వలసపోయెను. కాని జైనులందరు భద్రబాహువు అడుగుజాడల ననుసరింపరైరి. పెక్కురు మగధదేశముననే యుండిపోయిరి. సంభూత విజయుని శిష్యుడగు స్థూలభద్రుడు మగధదేశమందుండి పోయిన జైనుల కాచార్యుడయ్యెను.

క్షామము గడచిపోయిన పిదప వలసపోయినవారు తిరిగి మగధకు మరలిరి. కాని అప్పటికి భద్రబాహువు తన ఆచార్యత్వమును వదలుకొని తపోనిష్ఠాగరిష్ఠుడై నేపాళమునకు వెళ్ళిపోయెను. స్థూలభద్రుడిప్పు డాచార్యుడాయెను. ఇది క్రీ పూ. 300 ప్రాంతమున జరిగియుండ వచ్చును.

ఈ కాలము జైనమత చరిత్రమున చాల ముఖ్యమైనది. ఇదేకాలమున జైనమతము రెండు భిన్న శాఖలుగ చీలిపోయెను. వలసపోయిన జైన సన్యాసులు కర్ణాటకమునుండి మరలి వచ్చు నప్పటికి మగధయందలి జైన సన్యాసులు దుష్ప్రవర్తకులై యుండిరి. అందుచే మగధ సన్యాసులను వీరు మతబాహ్యులని వారిని జైన సంఘమునుండి, వెలివేసిరి. అంతేకాక క్షామకాలములో జైన ధర్మము విస్మరింపబడెను అందువలన జైన పండితులు క్రీ. పూ. 303 లో పాటలీపుత్రమున ఒక పండిత పరిషత్తును సమావేశపరచిరి. చిత్రమేమన అందు వారిలో జైన ధర్మగ్రంథములను సమగ్రముగ నెఱిగిన వారెవ్వరును లేకుండిరి. అందుచే పాటలీపుత్ర పరిషత్తున నిర్ణయింపబడిన ధర్మ మసంపూర్తిగనే యుండిపోయెను. కర్ణాటకమునుండి వచ్చిన జైన పండితు లీ పరిషత్తులో నెట్టి ఐక్యము కలిగించుకొనరైరి. జైన ధర్మము పూర్తిగ నశించెనని వీరి యభిప్రాయము. శ్వేతాంబరులనబడు మగధజైనులు తాము పాటలీపుత్రమున క్రోడీకరించిన జైనధర్మమునకు "సిద్ధాంతము" అనిపేరు. ఇది ప్రక్షిప్తమనియు, దీనిని కూర్చినవాడు జినచంద్రడను పండితుడనియు విశ్వసించి కర్ణాటమునుండి వచ్చిన దిగంబర జైనులు దీనిని స్వీకరింపరు.

చంద్రగుప్తుడు తన తుది దినములలో జైనుడైనను మొత్తమునకు మౌర్య చక్రవర్తుల కాలములో మగధదేశమున జైనులకు పోషణ లేకపోయెను. దానితో మగధదేశమున జైనమతము సన్నగిల్లెను. జైనులు క్రమక్రమముగ పశ్చిమభారతమునకు, క్రీ. పూ. రెండవశతాబ్దమధ్యముననుండిన కలింగ రాజగు ఖారవేలుని రాజ్యమునకు వలసపోయిరి. ఖారవేలుడు జైనమత పోషకుడైయుండెను. ఉజ్జయినిని రాజధానిగా పరిపాలించిన అశోకచక్రవర్తి పౌత్రుడగు సంప్రతి యనునతడు సుహస్తి యను జైనాచార్యుని ప్రోద్బలమున జైనుడై జినమతమును పోషించెనని జైనగ్రంథములవల్ల తెలియుచున్నది. ఉజ్జయిని ఇతని కాలములో జైనమతమునకు ప్రధానకేంద్రమై యుండెను. క్రీ. పూ. రెండవ శతాబ్దమునుండి మధురయొకటి జైనమత కేంద్రమాయెను. మధురాపట్టణము నందు లభించిన పెక్కు శాసనములు ఈ ప్రాంతమున జైనమత ప్రాబల్యమును నిరూపించుచున్నవి. నేటివరకును జైనమత మీ ప్రాంతములందే వ్యాపించియున్నది. కాని జైనమతము భారతచరిత్ర యందు ఎన్నదగిన భాగమేదియు తర్వాత గైకొనలేదు. దాని సిద్ధాంతములందు ఎట్టిమార్పును కలుగలేదు. జైనసంఘము చిన్నదైనను నేటివరకు తన ప్రాత సిద్ధాంతముల ననుసరించుచు శాంతి మయ జీవితమును గడుపుచున్నది. బౌద్ధమతము జైనమతముకంటె ఎక్కువగ భారతదేశమున వ్యాప్తమయ్యెను. ఆసేతుహిమాచల పర్యంతము బౌద్ధభిక్షులు బుద్ధుని ధర్మమును బోధించుచు తిరిగిరి. అశోకుడు తన సామ్రాజ్యముననే కాక సామ్రాజ్యము వెలుపలనుండు దేశములకు బౌద్ధ మత ప్రచారకులను పంపుటయేకాక శాసనముల ద్వారాయును ఇతరసాధనముల ద్వారాయును

బౌద్ధమతమును వ్యాపింపజేసెను. తర్వాత హర్షవర్ధనుడు బౌద్ధమత పోషకుడాయెను. ఇట్లు పల్వురు భారతచక్రవర్తుల పోషణయుండియు బౌద్ధమతము తన జన్మభూమియందే నశించెను. జైన మతము అంత ఎక్కువగ రాజపోషణము లేకపోయినను, అంత ఎక్కువగ వ్యాప్తినొందక పోయినను భారతభూమిని నశింపక నేడు ... లక్షలమందికి మతమై విరాజిల్లుచున్నది.

శ్రీ

## గ్రంథాలయములు

శ్రీరాయప్రోలు సుబ్బారావు

యుగ యుగాంతరములఁ బ్రజాభ్యుదయ దీక్ష
దేశసేవా తపస్సుగీతికలు పాడి
చనిన మహనీయుల ప్రబోధసరళరాగ
మాలపించు వీణెలు పుస్తకాలయములు.

కరడుగట్టు సముద్రాల కడలయందుఁ
బ్రొద్దుగ్రుంకుట లెఱుఁగని భూములందుఁ
బుత్రుఁ డెందెందు మేల్కొని భుజముసాచెఁ
బుత్రి యెందెందుః ముసుఁ గెత్తి ముందు నడచె.

అందు నందెల్ల బూచి పొల్పారుచున్న
జ్ఞానసుమములు దండలు గట్టి తెచ్చి
గ్రంథముఖ వీథికలకు సింగార మిడెడి
అభ్యుదయ బాంధవంబు గ్రంథాలయంబు.

నిత్య విజ్ఞానదీపికల్ నిండి వెలుఁగు
పుస్తకాలయముల మాతృపూజ నెపుడు
సప్రదక్షిణ నియతమై సలుపు నెవఁడు
అతఁ డజ్ఞానదాస్యము నవలఁ ద్రోయు.

ధర్మపుస్తకనిలయ సంస్థాపనమ్ము
లెంతవఱ కాంధ్రదేశ మాద్యంతములను
అల్లుకొట్టి వర్ధిలఁజేయ మంతవఱకు
నాగరకులముగాఁ బో మనాగరికుల
దశల నైచ్యము నించుక దాటలేము.

# తిక్కన — కుమారవ్యాసుడు

శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులు

"కన్నడిగలు" "మావాడని" చెప్పుకొని యమితముగ మురియు వారిలో — కుమారవ్యాసుడొక్కడు. తక్కిన "రన్నడు" మొదలగు వారున్నను — వారికింత వ్యాప్తి లేదు. అసలు భారతమునే వ్రాసిన "పంపని"కిని — యింతటి పలుకుబడి లేదు. పంపనిరచన "హళగన్నడము". కుమారవ్యాసుని కవిత "హొసగన్నడము". పంపనిపదజాలము సహజముగా కొంతకఠినమైనది. అందునను "హళెగన్నడ" మీనాడు ప్రవాదమున లేదు. మరి యీతని రచన లలితము. ఆలాలిత్యమున నొక "తోజు" ఎక్కడనోదప్పక్లిష్టాన్వయము — మొదలగు కావ్యదోషములుండవు. భావములు స్పష్టములు. భాష స్పష్టతరము.

కుమారవ్యాసుని వాసస్థలము "గదగు". ఇతడు బ్రాహ్మణుడు. యోగీంద్రుడు. ఇతని యుపాసనా దైవము గదగు వీరనారాయణుడో — గణపతియో చెప్పుటకు వీలు లేదు. కాని గణపత్యుపాసకుడని కన్నడిగ లందురు. కుమారవ్యాసగణపతులను గురించి- తిక్కన గురునాథులవంటి కథయే- యొకటి కర్ణాటమున బ్రచారములో నున్నది. ఏది నిజమో చెప్పలేము. ఇంతకును కుమారవ్యాసుడే దన భారతములోని ప్రతియాశ్వాసాంతమునను "వీరనారాయణ చరణారవింద మకరంద మధుపాన పుష్టవచ ష్షట్పదీ నికాయ" యని చెప్పికొనెను.

భారతము నాదిపర్వమునందు దాను "బలపమును బట్టి వ్రాత నేర్చినవాడ" గానని కుమారవ్యాసుడు చెప్పికొన్నాడు. ఈ మాటను మన మల్లే నమ్ముటకు వీలు లేదు. తాను కొంచెముగా జదువుకొని యుండవచ్చును. అది యుపాసనాబలముచే గొంచె మెక్కువగ శోభించి యుండవచ్చును. ఆ విషయమునే- కుమారవ్యాసుడు సహజముగ నావేశిగనుక- కొంత యతిశయోక్తితో జెప్పినాడని సరిపెట్టుకొనవలెను. తాము స్వయముగ నంతయో యింతయో గృషిచేసి యుండినను - నా భారమును దమ యుపాసనా దైవములపై వేయుట మన పూర్వకవుల యాచారము. ప్రాచ్య హృదయము.

కర్ణాటసాహిత్యమున షట్పదీరచన మొక యపూర్వసుందరమైనసృష్టి. అదివారి సొంతహక్కు. ఆవృత్తవిన్యాసముననే యొక మధురతయున్నది. తెనుగునందును దేశిరచనము లేకపోలేదు. "భవికవు" లెటులున్నను — "శివకవులు" మాత్రము — దేశిరచనము — ద్విపద నెక్కువగా ప్రేమించిరి. "జాను తెనుగు"అనునుడివారు దీసికొనివచ్చినదే! ద్విపద లేగాక — యింకను "కళికలు" మొదలగునవియు దెనుగున నున్నవి. కాని వీని యన్నిటియందును లేని నాజూకుదనము షట్పదులలో నున్నదన్నచో మనకు గోపమురారాదు. ఇటీవలనే — నవకవులు కొందరు — "ముత్యాల సరము"లను పేరుతో — గన్నడములోని యావృత్తములనే దెనుగునకు దించుకొన్నారు. కాకున్న ఛందోభంగములలో గొన్నివింత పోకడలున్నను నవి మాత్రము షట్పదీవృత్తములే! ఛందస్సు

లోని క్రొత్తదనముగూడ "నేరుగా నూతన సృష్టి"యని చెప్పలేను. కారణమేమనగా మన తెనుగులోని "గేయకవిత్వము" నొకసారి జూచినపుడు కన్నడములోని షట్పదీరచనము లే- నేను మనము కల్పించితి మనుకొనుచున్న యన్ని పోకడలతో గూడ నింతకు ముందే రచింపబడినట్లు గానిపించును. కనుక నవీనులు గ్రొత్తగా జేసినది నామకరణము మాత్రమే !

కుమారవ్యాసుని రచనమునకును—షట్పదీవృత్తములకును- సుందరమగు బొత్తు గుదిరినది. ఆతడు మన శ్రీనాథునివలెనే స్వయముగ నావేశి. ధ్వనిదృష్టి యాతనికి లేదు. వాచ్యమునే దీవ్రముగా జెప్పవలెనని "కన్నడ కవి" యాశ. ఒక భావమెదుటివారి మనసులో- నిక నెన్నడును మఱచిపోరానట్లు నాటుకొనవలెను. వృత్తములు చాపుగా జేతులెత్తి పాడుట కనుకూలముగా నుండవలెను. పదములు విచ్చిన పూవులవలె- మెడలు మలచిన కోడిపుంజులవలె- బారులుదీరిన సైనికులవలె- డాబుగా- సక్రమముగా నడువవలెను. తంఘూళి- గజబిజిసిదను- అబ్బరిసి- యిట్టి "జోరు" గల పదము లాతని రచనలో వేలకొలది గలవు. అవి నోటినిండుగ పలికిననేగాని మెదుగవు. కుమారవ్యాసుడు యోగియైనను- నాతని మనస్తత్వము మాత్రము జిక్కని రాజసికవృత్తి. కవితయు రాజభోజనమే! ఆతని సామాన్యశైలి యిట్టిది. విరాటపర్వములోని కీచకుడు ద్రౌపదిని జూచి.

(1) "హుళుకనల్లాతుంబికోగిలె
గళహనల్లాశశివసంతన
బలుహుమాన్యరనిరియ దేతం
ఘూళిధార్మికనె"

పైపద్యమును జూచినపుడు శైలియందున్నంత "తోజు" భావమునందు లేదని యెవ్వరైనను గ్రంహింపగలరు. కాని చదివినప్పుడు మాత్ర మా ప్రవాహమున మనమును గొట్టుకొనిపోయి "హాయిహాయి" యందుము. సైరంధ్రివేషమున ద్రౌపది విరాటనగరమున బ్రవేశించుచు "(2) సరసిజాయతగంధమును, మోహరించుపరిమళమును దిక్కుల జల్లినదట." ఎట్లుజూచినను నిందులో సామ్యమే దప్ప - వేరుగా దొరకునదేమియు లేదు. కాని కుమారవ్యాసుని శైలిలో మాత్రముపమానోపమేయములు రెండును మోహరించి ద్వంద్వయుద్ధమునకు నిలచినవి. ధర్మరాజు మాటలచే నవ్వుకు గఱచిన భీముడు, "3 సురనికర మడ్డమునిల్చి రాసీయమని ప్రతినవట్టినను — వారి పండ్లూడబెఱికి

(1) తుమ్మెద భయపడునదేనా?
కోకిల సామాన్యమైనదా!
శశి వసంతులబలము మాన్యులనుకూడ లొంగజేయదా?
తంపుగాలి ధార్మికుడా?

(2) "సరసిజాయతగంధ వను మోహరిసి ముంచుత
పరిమళ వనం
దరని దీయుతబందు హొక్కళు
రాజమందిరవ"

(3) "సురనికర కాడి రలిమేణి
ధరణికొడె నెందిరలి-హస్తిన
పురిగె ధాళియ నిడువె నమర ర
మోర గళెలి విదు"

'హస్తిపురమునకు దాడి సాగింతునని గర్జించినాడు. ఆరసావేశమున దేవతలకును —'' హస్తిపుర మునకును సంబంధమేమో భీమునకసలే దెలియదు. మన కంతకు ముందే దెలియదు.
రసవాదులకు సాధారణముగ నౌచితి పైదృష్టి దక్కువ. రసావేశ మొకమత్తువంటిది. కాని తన్మయీభావనములేని రచనలు గుమాస్తాల "జాబితా"యే గాని వేరుగాదు. మరి యీ రెంటిని సమన్వయించుకొని — సమగ్రముగ నడపువా రెవ్వరో యరుదుగా నుందురు. ఈ రెంటి సామానాధికరణ్యము — అనంత తపస్సాధ్యమేగాని — యదవకు వచ్చు సొమ్ముగాదు. వాల్మీకి కాళిదాసులుగూడ నీ చాపల్యమును దప్పించుకొనలేకపోయిరి. కాళిదాసునకు శృంగారముపై నెక్కువ మక్కువ. వాల్మీకికి గరుణరసమన్న బ్రాణము, అందుచే నిరువురుగూడ దమ కభిమానరసములు దటస్థించినపు డితరులను లెక్కింపక-కొంచెము గనులు మూసికొనియే పోవుచుందురు. వశ్యవాక్కులగువారి స్థితియే యట్లున్నప్పుడు - మరి గుమారవ్యాసు డొక్కొకయెడ నౌచిత్యమును మీరుటలో నాశ్చర్యమేమున్నది? కుమారవ్యాసునిది రసవాదమునుగాదు. మరి యంతకన్నను కొంచెము వెగటగు నావేశము.

తిక్కనమూర్తి యట్టిదిగాదు. అతడు రసజ్ఞుడు - భావజ్ఞుడు. కవితాగుణముల నన్నింటిని మెదిపి "పదను సుధనిడి". బ్రహ్మదేవుడు సృష్టించిన ముద్ద. ఆవేశమున నౌచిత్యమును మరువడు. ఔచితిలో రసహృదయమును జంపుకొనడు. "సింగారమునకుగాక మరువులును గైదువులు మీకు మానమునకే'' యని వేడిగా మందలించు మగతన మాతనికే యున్నది. వివిధభావావేశ లంపటమై - ప్రత్యక్షకాళికవలె - ప్రళయతాండవమును సల్పెడు ద్రౌపదిని చూచి "కన్నీరు దుడువను బెన్నెరివేణి ముడువను దగువారి'' నియోగించు నౌచిత్య మాతడే యెఱుగును. తిక్కనచేతికి సంసార మొక కీలుబొమ్మ, అనుభవ మాతనికి లోబడినది. ఆతని విజ్ఞానమున కెన్నడును బొరపాటులేదు. రాజమందిరములు మొదలుకొని పూరిగుడిసెవఱకు గల - యాచారములు - ననుభవములు - మనస్తత్వములు నాతనికి గొనవ్రేళులలో నిలచినవి. వైష్ణవ సిద్ధాంతమునందువలె - తిక్కన భగవంతుని యొక వ్యూహావతారము. అంతే!

మన సోదరులగు గన్నడిగల తృప్తి కొఱకును- మన యాత్మవిశ్వాసము కొఱకును, దీని నింకను గొంత విపులీకరించి చూపుట బాగుగదా? ఒక ఘట్టమున నిరువురను బోల్చిచూతముగాక! విరాటపర్వరచనలో దిక్కన, కుమారవ్యాసులకు సంబంధమే లేదు. కుమారవ్యాసుని కీచకుడు వ్యాసుని గీచకుని కన్నను నన్యాయముగా నున్నాడు. ఆతని సైరంధ్రి తేజోవిహీన. తెనుగులోని సైరంధ్రి నెరజాణ- ఒక కోల మెఱపు మానవ హృదయపుస్తకముల నన్నిటిని జదివి- వారిని దన యిచ్చవచ్చినట్లాడింపగల సూత్రధారిణి. కాకున్న కన్నడ భారతమున "మల్లుర యుద్ధవర్ణనము'' గొంచెము విస్తరముగ వ్రాయబడియున్నది. కనుక వేరొక చిన్నిఘట్టముతో మనము దూచి చూచుట బాగు. కుమారవ్యాసుని భారతమున కర్ణుని కెక్కువ ప్రాధాన్యమని వాడుక. ఆ కర్ణుని పాత్ర మునే యెట్లు పోషించినారో యొకసా రిరువురను గొంచెముగా దిలకింతము. ఉద్యోగపర్వమున

కృష్ణుని రాయబారము విఫలమైనది. హస్తిపురమునుండి పాండవుల దరికి బోవుచున్నాడు. కాని యొక్కసారి కర్ణుని జూచి మాటలాడిపోవుద మనిపించినది. తిక్కన కృష్ణుడు భాగవతమందువలె నిర్వికారుడు గాడు. జాణ- లౌకికుడు-సంకుచితముగా నన్నచో నిజమైన కర్మయోగి.

తాను దుర్యోధనుని యాస్థానము నుండి ప్రయాణమై - మార్గమధ్యమున విదురు నింటికి వచ్చి కుంతిని మాటలాడించినాడు. అందులో మరియాదయే గాక రాజకీయముగూడ దక్కువగా లేదు. రాగల మహాభారతయుద్ధవిషయమున నామె యభిప్రాయ మెట్లుండునో గనుగొనవలెనని కృష్ణుని దలపు. తక్కువగా నున్నచో నాకొఱతను బూరింపవలెనని గూడ నాతనియాశ. కృష్ణుడు విదురు నింటికి వచ్చునపుడు "బంధుమిత్ర సహాయ సహితంబుగా గౌరవులెల్లరును దనతోడనగదలి" దన్నుసాగనంపవచ్చినారు. కృష్ణుడు వారి నందరిని నిలువుమన్నాడు. కాని వారాగలేదు. వారియందు దుర్యోధనుడుగూడ నున్నాడట. సభలో నింతవఱకును గృష్ణదుర్యోధనులకు దుడుకు మాటలు నడచినవి. కాని యంతతో వ్యక్తిమర్యాదనుగూడ గమనింపని వెడగుగాడు దుర్యోధనుడు. వ్యవహారము వేరు. బంధుత్వము — మర్యాద వేరు. దీనితో సుయోధనుని లోకజ్ఞతకు మెఱుగువెట్టిన ట్లయినది. కృష్ణుడు పురద్వారమును సమీపించి — రథారోహణంబుసేసి ధృతరాష్ట్రీయుల నిలువం బనిచినాడు. ఇక దాను గర్ణునితో మాటలాడవలసిన గోరిక బూర్తియగుటెట్లు? అపుడు గర్ణుని దెసజూచి "నన్ననిపి వత్తుగాని రమ్మని గరంబుసాచి చెయివట్టి యరదంబెక్కించుకొని"నాడట. ఈ మాటను టెంతో ముచ్చటగా — సందర్భశుద్ధముగా నున్నది. చెయివట్టి యీడ్చుటతో దనమనస్సు నొలిచి కర్ణునకుబట్టియిచ్చినటులైనది. కర్ణుడు కృష్ణుని రథము నెక్కినాడు. కృష్ణుని తమ్ముడు సాత్యకి సైగకు సైగగా వేరొక యరదము నెక్కి వెనుకన వచ్చుచున్నాడు. పురము నిర్గమించిన తరువాత కృష్ణు "డధిక సంప్రీతి దలకొన నర్కతనయు నాననంబును వీక్షించి" యన్యులెవ్వరు వినకుండ సంభాషణము నారంభించినాడు. ఇది యంతయు దిక్కన కూర్పు. మన కనులయెదుట సజీవచిత్రమువలె నా దృశ్యమును నిలువజేసినాడు. ఈ పూర్వరంగమంతయు కుమారవ్యాసుని భారతమున లేనే లేదు. ఉన్నది, సముచితముగ లేదు. ఆతని ప్రారంభ మిది. కృష్ణుడు రాయబారమున నెక్కువ బాధ్యత గల మనుష్యుడు. మొదటనుండియు- బాండవులను ధర్మముకొఱకై రేపి కార్యము నొక మహత్తర ప్రయోజనముకై సాగించుచున్నాడను టందరికిని దెలియును. కృష్ణునకును దెలియును. దుర్యోధనాదులు దన్ను గట్ట యత్నించి విఫలురైన తరువాత- గష్ట్యాంతరంబులు గడచినపుడు- ధృతరాష్ట్రుడు దాను నిరపరాధి ననియు- దన్ను మన్నింపవలె ననియు గృష్ణునకు మనవిజేసినాడు. తిక్కన కృష్ణుడు ధృతరాష్ట్రుని మూర్ఖత్వమునకును- చేతగానిదనమునకును మదిలో నొచ్చుకొని "బాహ్లిక - భీష్మ - ద్రోణ - కృప - ప్రముఖ నిఖిల విశిష్టజనంబులు" నాలోకించి,

గీ॥ "ఇప్పుడే సభబుట్టిన యింతవట్టు
మీకు దెల్లంబకాదె? యీ మేదినీ వి

భుంజు దానేమిటికిని ముఖ్యుండగాను
దప్పు దనదెస లేదని చెప్పివిడిచె.''

''కావున నాకు నీయెద దడయం బనిలేదు పోయివచ్చెద''నని సెలవు గైకొన్నాడు. కుమార వ్యాసుని కృష్ణుడు - మొదటినుండియు దంత్రమునంతయు నడపి కడకిది [4] గౌరవ పాండవుల కలహము మాకేల'' నని దిన్నగా జారుకొన్నాడు. ఈ పద్ధతి కృష్ణునకంత బాగుగా లేదు. తరువాత విదుర - ద్రోణ - భీష్మాదులును, ధృతరాష్ట్రుడును వెంటరా గుంతీగృహంబున కరిగినాడు. తిక్కన కృష్ణు డరిగి యామెకు ''వినయ భూషణుడై నమస్కరించి సంధివృత్తాంతమును - దుర్యోధనుని'' విచేష్టితమును - సూటిగ విన్నవించినాడు. కడకు పాండవుల కామె యొసగు సందేశమేమని ప్రార్థించినాడు. ఆమెకు బుత్రవాత్సల్యము - తన సుతులు బడుచున్న యలజడి - తన గోడు - యింతకుమునుపు దుర్యోధనాదులు జేసిన బన్నములు - నన్నియు నొక్కసారి యెదుట నిల్చినవి. ఈ వివిధభావములతో - కుమారులకు వేడిపిడుగులవంటి సందేశ మొసగుచు, గృష్ణునియెడిలో దన హృదయ మొక్కసారిగా గ్రుమ్మరించినది. ఆ పద్యములను నేరుగా జదివి యానందింపవలసినదే ! ఆ వాక్యములలోని దెగువకు భీష్మద్రోణాదులు ''బమ్మెరవోయి'' నారట. తరువాత నచ్యుతు డామెకు-మేనత్తకు మ్రొక్కినాడు. కుంతీమహాదేవి చల్లగా ''దీవించినది''. కుమారవ్యాసు డింతకథ బెట్టుకొననేలేదు. కుంతికి - పాపము- నమస్కారమే లేదు. సంకుచితమున- సంధినిగురించి-చెప్పిచెప్ప నట్లు జెప్పినాడు. ఇంతేగాక ''పులిమీదపుట్ర'' యన్నట్లు ''[5]నీవుబోయి నీకొడుకగు గర్ణుని వేడు కొను'' మని నియమించినాడట. ఔనుగాని అప్పుడు తనవెంటవచ్చిన ధృతరాష్ట్రాదు లెక్కడ నుండిరి? వారియెదుటనే యీ వర్తమానము జరిగియున్నచో ధృతరాష్ట్రాదులు కృష్ణు ననుమానించి యుండరా? వారిని దూరముననే నిలిపి వచ్చినా డనుట - మరియాద యేనా ? లోకజ్ఞత యేనా? ఇంతకును గృష్ణునకుమాత్ర మది యేమిన్యాయముగా నున్నది? ఎట్లును దాను గర్ణునితో మాటలాడవలెనని దొలుతనే దలచినాడు. అట్టియెడ గుంతిని మరల నియమించుటలో - ఒకవేళ దన ప్రయత్నము విఫలమైనను తల్లియగు నామె మాటలతోనైనను గర్ణుని దమవైపు లాగుకొనవలెనను దురభిప్రాయమేగాక మరేమిగలదు?

కృష్ణునివంటి వ్యక్తికీ కుత్సితరాజకీయ మంత బాగుగా లేదు. అట్లుగాక - యాంధ్రభారతమున - కృష్ణుడు బోయిన దరువాత నొకనాడు గుంతీదేవియే వంశక్షయమునకై ''బెక్కుతెఱంగుల జింతించి'' కర్ణుని దరిసి మాటలాడిన ట్లున్నది. ఇది యెంతయో బాగుగా నదికినది. వ్యాస భగవానుడు గూడ నిట్లే వ్రాసెను. కన్నడభారతమున కృష్ణుడు సందేశ మేమని కుంతి నడుగను

(4) ''ఘన సుయోధన పాణ్డు వినన౦
దన రొళాద వివాదన మనే
కెనుత రాజాలయ వన నుర
ధ్వంని హోర వంట''

(5) ''ఇందు మురిథును సంధినిన్నయ
తందకర్ణన బేడికొళు నీ
నెందు నేమిసి మరళి దనుమ్మత
రిషాలుషదలి''

లేదు. ఇత డడుగ కున్నను మాతృదేవియగు నామె చెప్పను లేదు. కృష్ణుని లోకజ్ఞత యిదియేనా? కుంతీదేవివంటి దొడ్డతల్లి మనసిట్టిదేనా? కృష్ణుడు గర్ణునితో మాటలాడుటకు తిక్కన చక్కని సాకు గల్పించినాడు. దుశ్శాసన - వికర్ణాదులు దనకన్నను జిన్నవారలు - పిల్లలు. దుర్యోధనునితో దా నిపుడు మాటలాడరాదు. తక్కిన భీష్మద్రోణాదులు మ్రొక్కులకు దగినవారేగాని. సరసములకు బనికిరారు. ధృతరాష్ట్రుడు గ్రుడ్డివాడు - రాజు - అందరికిని బెద్ద. అందుచే నించుమించు సమానవయస్కుడును - లోకమునకు దెలియకున్నను - బావగావున పరియాచకమునకు దగినవాడును నగు కర్ణుని జెయివట్టి నిలిపినాడు. తక్కిన వా రెవ్వరును ననుమానింపలేదు. వ్యాసునకీ గంభీరకళావిచ్ఛిత్తి యంటనే లేదు. కుమారవ్యాసున కసలే గాబట్టలేదు. అతని కృష్ణుడు దక్కినవారి నందరిని సాగనంపి కర్ణుని మాత్రము దన వెంట రమ్మన్నాడు. అపుడు మిగిలినవారి చిత్తవృత్తు లెటులుండును?

కృష్ణుడును గర్ణుడును- యేక రథారూఢులై బోవుచున్నారు. కృష్ణుడు తిన్నగా "నీవు వృద్ధజనోపసేవివి- ధర్మసంవేది వని" కర్ణునితో బలికి ప్రస్తావమునకు దించినాడు. వ్యాసభగవానులు కూడ సంభాషణమున కిదియే ముఖద్వారముగ నుంచుకొనెను. (6)కాని తిక్కన జేసిన పనితన మేమనగా వ్యాసుని రెండుశ్లోకములను రెండు విధేయవిశేషణములతో జోడించి పొమ్మనుట. వ్యాసభగవానుడిచట గర్ణుని "రాధేయ!" యని సంబోధించుట బాగలేదు. అందుకే దిక్కన దానిని తిన్నగా జారవిడిచెను. తరువాత నొకటే సీసపద్యమున గర్ణుని జన్మవృత్తాంతమును జెప్పివేసెను. ఇచట బురాణదృష్టితో వ్యాసుడు జేసిన ధర్మనిర్ణయము గావ్యదృష్టిగల "యుభయకవి మిత్రునకు రుచింపలేదు. కనుకనే దేలికగా దాటుకొనెను. కర్ణుడు బాండవులతో జేరినచో గలుగు వైభవమును వర్ణించుటకు వ్యాసభగవానుడు సుమారొక పదునైదు శ్లోకముల వెచ్చించెను. తిక్కన జెప్పదగినదివిడువక, యూరక బెంచక వైభవమునంతయు నొక వచనమున నెట్టివేసెను. "ద్రౌపదిగూడ నిన్ను బొందు"ననుట కృష్ణు డుపయోగించిన కడపటిబాణము. వ్యాసులుగూడ యీ బాణమును సంధించెను. (7)కాని తిక్కన దృష్టిలో నిది యన్నిటికంటెను మెఱుగైన బాణము కనుక స్పష్టముగా నెదుటివాని మనసునకు దాకున ట్లొకపద్యమున జెప్పెను. సరిగదా! దానికి గర్ణుడు లొంగలేదు. ఆంధ్ర సంస్కృత భారతములలోని గర్ణునకు దన జన్మవృత్తాంతము నిపుడు వినుట గ్రొత్తగాదు. సంస్కృత భారతమున గర్ణుడు కృష్ణునితో "సర్వం చైవాభిజానామి పాండోః పుత్రోస్మి ధర్మతః" అన్నాడు. దానికి "వెడ వెడయేను దొల్లి యిదివింటి"నని తిక్కన జేసిన యాంధ్రీకరణము - నిజముగా నొక మెఱుగు. కర్ణుడును గృష్ణునకు చాల సముచితముగ జవా

(6) "ఉపాసితాస్తే రాధేయ బ్రాహ్మణాః వేదపారగాః,
తత్త్వార్థం పరిపృష్టాశ్చ నియతే నానసూయయా,
త్వమేవ కర్ణజానాసి వేదవాదా న్సనాతనాన్,
త్వమేవ ధర్మశాస్త్రేషు సూక్ష్మేషు పరినిష్ఠితః."

(7) షష్ఠే త్వాంచ తథా కాలే ద్రౌపద్యుపగమిష్యతి.

బిచ్చినాడు. "నన్ను ధర్మసంవేది వని నీవ జెప్పితివిగదా?" అట్టి యెడ రాధయు - నతిరథుం డును నాకు జాతకర్మాది సంస్కారంబులు నిజకులోచితంబుగా నాచరించిరి. తల్లి దండ్రు లకు బుత్రకృత్యంబులు నిర్వర్తింపక వారల న్బాసి యేను వచ్చుట ధర్మం బగునే?" యనుట ధర్మదృష్టితోనేగాక లౌకికముగను చాల మెఱుగైనమాట. తరువాత సంస్కృత భారతమున కానీనుడు గృష్ణుని యెదుట జరుగబోవు మహాభారత యుద్ధమునంతయు నొక పెద్దయజ్ఞముగా వర్ణించెను. ఎదుటివారి పరాక్రమమును గర్ణు డిపు డంత విపులముగ - నావేశముగ వర్ణించుట దిక్కనకు బాగుగా గన్పడుటలేదు. కనుక దాని తత్త్వమునుమాత్ర మొక పద్యమున జెప్పి ముగించెను. ఈ యావేశకవితలో వ్యాసభగవానుడు కర్ణునిపాత్రకే కళంకము నాపాదించు వాక్యము లనుగూడ జారవిడిచెను. [8] ఔచిత్యజీవియగు దిక్కన వాని జోలికే బోలేదు. అట్లే కృష్ణుని వాక్యములనుగూడ సముచితముగ సంకుచించెను. కర్ణుడు దాను దుర్యోధనుని విడచి రాననుటతో పాటు దన జన్మవృత్తాంతమును ధర్మజునకు దెలుపవలదనిగూడ గృష్ణుని హెచ్చరించినాడు. కృష్ణునియందు భగవదంశమునుజూచి "యుద్ధమునందు జయించినచో నిహలోకమునను - లేకున్న బరలోకమునను గలిసికొందు" నని వీడ్కో లొసగినాడు. ఈ యుద్ధమునందు "మముబోం ట్లెల్లను సద్గతివడయుదు రని గర్ణుడే యన్నాడు. కనుక దన ప్రాణముల రాజభక్తికి" బలియొసగిన ధర్మ వీరు డాతడు. కడకు గృష్ణుని "గౌగిలించుకొని" [9] పనివినినాడు. ఇంతతో గర్ణకృష్ణుల సంభాషణము ముగిసినది. సంస్కృతభారతమునను కర్ణుడుధర్మవీరుడే! కాని వ్యాసభగవానున కాయింత యుద్రేకమును లేకయుండిన నింకను బాగుగా నుండెడిది. సంస్కృతమున వీరి సంవాదము సుమారు మూడధ్యాయము లున్నది. ఇంత దీనిని బొడిగించుట దిక్కనకు సరిపోలేదు. ఘంటలకొలది వీరిట మాటలాడుచున్న నట గొలువులో నున్న దుర్యోధనాదులు వీరిని సందేహింపరా? అందుచే సాధ్య మైనంత సంగ్రహించినాడు. వ్యర్థముగా బెంచిన ఘట్టములను జాలమెలకువతో దగ్గించి - తగ్గించు టయు పాత్రలకాంతి కొకమెఱుగు బెట్టుటగా యోజించినాడు. ఇంక "సోమయాజి" సంభాషణ మున బ్రవేశపెట్టిన నాటకపద్ధతులన్నియు నాతడు స్వయముగ గూర్చుకొన్నవే! ఈ కూర్పాతని రచనయందు దామూలచూడము గలదు. కనుక దాని నిచట విపులీకరించి చెప్పబనిలేదు. తిక్కన కర్ణ నకు దాను "కన్యాజాతు"డను టింతకు మునుపే దెలియును. కాని యాకొఱత యాతని నంతగా బాధింప లేదు. ఒకవేళ దాను "నీచకులుడను" సందేహ మున్నను దానిని మ్రింగికొను గొప్పతన మాతని కున్నది. కౌలీనత మానవయత్నసాధ్యము గాదని యాత డెరుగును. కాని దానికై కష్ట మెందుకు? నిజముగా కర్ణు డిష్టపడినచో దన వంశగర్వమును ప్రపంచమునకు బ్రకటించుకొనవచ్చును. కాని

---

(8) యదబ్రువ మహం కృష్ణ కటుకాని స్మ పాండవాన్,
ప్రియార్థం ధార్తరాష్ట్రస్య తేన తప్యే హ్య కర్మణా.

(9) కర్ణః పరిష్వజ్య చ పీడితం
(పని వినియొదనని గౌగిలించుకొనిన)

దాని కన్నను- ప్రపంచమున సర్వమునకన్నను కర్ణుని దృష్టియందు ధర్మము గొప్పది. అందుకే భగవంతుడగు కృష్ణుడే బోధించినను- కృష్ణుడు భగవంతుడని దా నెరిగియున్నను— నాతని వాక్యములను గూడ ధర్మవిరుద్ధములని బెడచెవిని బెట్టినాడు. వీడ్కొనునప్పుడుగూడ ధర్మమునకై గత్తిబూనిన యొక పెద్ద రాజకీయవాదివలె సమానప్రతిపత్తులతో కృష్ణుని "కౌగిలించుకొని" నిర్గమించినాడు. అఖండసామ్రాజ్యము ధర్మము నెదుట రాధేయునకు నల్లపూసయైనది. కర్ణుడు నిజముగా ధన్యజీవి. సోమయాజి కర్ణుడింకను ధన్యతరజీవి.

కన్నడకవి కర్ణుడు మన కర్ణుని వంటివాడు గాదు. అతడును ధర్మవీరుడే! కాని కుమారవ్యాసుని యావేశరచనలో నా ధర్మవీరత్వము సరిగా స్పష్టపడలేదు. పైన కొన్ని విషాదచ్ఛాయ లలమినవి. తన జన్మవృత్తాంతమును గురించి యాతని కింతకు ముందేమియు దెలియనే తెలియదు. 10 ఇపుడు కృష్ణుడు దెలిపిన వెంటనే దనతలపై బిడుగుపడిన ట్లయినది.

కన్నీరుగాలువలు గట్టి పారినవి. ఈ భేదోపాయముచే గురుపతికి గీడయ్యెనని పనవి యేడ్చినాడు. ఇంతేగాదు. దొలుతటినుండియు నాతనికి దన "కులము నీచ"మని యొక యతృప్తిగద్దు. సత్యముగ జూచినచో కర్ణునంతటి వీరున కది యొక పనికిరాని చాపల్యము. కులము దక్కువైన మాత్రము ననే దనకు గలిగెడు పెద్దనష్ట మేమి? అల్పకులమున బుట్టియు నాత్మశక్తిచే గడ్డకు వచ్చిన మహానుభావు లెందరు లేరు? అట్టి వారిలో దా నగ్రపీఠము వహింపవలసిన గర్ణునకీ యతృప్తి నిజముగా పిచ్చిగాక మరేమి?

కుమారవ్యాసుని ప్రారంభ మిది. రథములోనికి గర్ణు నాహ్వానించి- కృష్ణుడు బలవంతముగ గర్ణుని పీఠముపై గూర్చుండబెట్టినాడు. వాస్తవముగ దనకు మేనత్తకొడుకు గనుక కొంచెముగా పరియాచకముగూడ నాడినాడట. దీనిభావము కర్ణున కర్థముగాలేదు. అతడు

11 "ఎనగె నిమ్మడి గళలి సమసే
వనెయె దేవమురారి యంజువె"ననుచు వెనుకకు జరిగినాడు. కాని యంతతో

గృష్ణుడు విడువలేదు.

బలవంతముగా దానే దగ్గఱకు జరిగి తొడతొడ యానించి కూర్చున్నాడు. 12 తరువాత తిన్నగా —చెప్పి చెప్పనట్లు గర్ణుని జన్మవృత్తాంతమును సూచింప మొదలుబెట్టినాడు.

---

(10) "కౌరవే పెరె హిగ్గిదవు దృగుజల
పురవణిసి కడునొంద నకటా!
కురుపతిగె కేడాదు దెందను
తన్నమనదొళగె."

(11) నాకు మీయదుగుల దగ్గఱ సమాన గౌరవమా? నాకు భయ మగుచున్నది.

(12) "తోడె సోంకినవి సారిదు శౌరి యింతెంద"

13 "భేద విల్లెలెకర్ణ నిర్మళ
యాదవరు కౌరవరొళగె సం
పాదిసిద దన్వయద మొదలెర
డిల్ల నిన్నాణె"

ఇంతేకాక "మేదినీ పతినీను" యని యాతని రాజత్వమునుగూడ సున్నితముగ వెల్లడించినాడు. ఈధ్వనివాదము కర్ణున కర్థము గాలేదు. అతడు

14 "దానవాంతక బెసనువంశ వి
హీననను నిమ్మడిగ ళొడనె స
మానిసువరె"

అని చేతులు ముకుళించినాడు. ఇక నిట్లు బనికిరాదని కృష్ణుడు వాచ్యముగానే "యోయీ! నీవు మా కెల్లరకును సంభావనీయుడవు—సూర్యపుత్రుడవు— శ్రీరామచంద్రునితో సమానుడ వని" —[15]కౌరవసభయందు తనకొసగిన తాంబూల మాతని చేతిలో నుంచినాడు" కర్ణుని చేతిలో చేయివైచి మాటలాడ మొదలు బెట్టినాడు. తరువాత దనతో జేరినయెడ గలుగు రాజవైభవమును గురించి పొగడినాడు. "[16]ఇంతటి వైభవము కాచుకొని యుండగా దుర్యోధనుని పంచజేరి యాతని యెంగిలితాంబూలమునకు జేయి చాతు వేమయ్యా?" యని నిష్ఠురముగ మందలించినాడు. ఒకవైపు పాండవులును - వేరొకవైపు కౌరవులును - కొలువుదీర్పగా సుఖముండదగిన నీకు దుర్యోధనుని దగ్గఱ "జియ్యా హసాద ని పడియుండుట కష్టమని హృదయవాదమును" జూపిచెప్పనాడు. [17] "నీవు పట్టాభిషిక్తుడవైనచో - కౌరవపాండవుల కిర్వురకును గావలసిన వాడవేగనుక యుద్ధమే లేదని గలిగినచిక్కు నొకరీతి సవరించి యాశచూపినాడు." [18] కాని వ్యాసతిక్కనలు ప్రయోగించిన ద్రౌపదీవిషయికమైన బాణమును - కుమారవ్యాసుని కృష్ణుడు మరచినాడు. అతని యావేశమున కీ విషయము దోచలేదు. ఆవేశవాదముచే గలుగు నష్టము లిటువంటివే! ఇంత జెప్పుసరికి కర్ణుని కన్నుల నీరు దిగినది. ఆతనియెదుట తనను నమ్ముకొన్న దుర్యోధనుడు

---

(13) కర్ణా! కౌరవపాండవ వంశమూలములకు భేదములేదు. వారిరువు నొకటే.

(14) ఓ దానవాంతక! చాలు. వంశవిహీనుడైన నన్ను మీరు గౌరవింపవచ్చునా?

(15) "కళెదు కొండను వీళెయవనం, బళియలాతం గిత్తు కర్ణన
కెలకె బరసెళె దవనకర దొళు కరవతళెవిక్కి"

(16) "నినగె కెంకర వరను సంకటి
యొనిస లొల్లద నీను దురియో
ధన సభాధ్యంబులకె కైయా
నువరె హేళెంద"

(17) నదువెనీ నోలగ దొళొప్పువ
కడువిళాసవ బిడుటు కురుపతి
నుడిసెజేయ హాసాదకెంబుదు — కష్టనినగెంద.

(18) "నినగె హస్తినపురద రాజ్యద
ఘనతె యను మాడువెను పాండవ
జనవ కౌరవ జనపరోలై సువరుగద్దుగేయ"

గనుపడినాడు. గృష్ణున కేబదులును జెప్పుటకు దోచక కన్నులుమూసికొని గూర్చున్నాడు. నడుమ కృష్ణుడు "ఏనుప్పైకైకర్ణ చిత్తజ్ఞాని యావుడు" అని ప్రశ్నించినాడు. దానితో గర్ణునకు గోపాలు డొక భేదోపాయశీలిగా గనపడినాడు. తన్నును, దుర్యోధనుని స్పష్టముగా నాశనము జేయుట కెత్తిన యెత్తని యూహించుకొని [19]"విజయన గడుసు బాణకె బలియ నిక్కువ హాదనమాడిసిదె" అని కృష్ణుని మోసమును బయట బెట్టినాడు. కడకు

[20] "మరుళుమాధవ మహియరాజ్యద
సిరిగె సోలువ నల్లకొంతే
యరు సుయోధన రెనగె బెన్నకె
వల్లిమనవిల్ల."

అని తన యాత్మ నిశ్చయమును బ్రకటించినాడు.

[21] "వీరకౌరవరాయనేదా
తారనా తన హగెయె హగెకై
వారవే కై వారవు"

అని పలికి తన కఠోరధర్మములోని సాధనాపద్ధతిని వెల్లడించినాడు. "న న్నానేకరీతుల మన్నించి నాడే! నన్ను చూచి యాతనికి దృప్తిలేదు. నా బిరుదులు బాగడించి దృప్తిలేదు. నా కుపకార ములు చేసి చేసి తృప్తిలేదు. ఆతని నెటుల మఱతు"నని [22] గృష్ణుని హృదయమునకు నేరుగా ప్రశ్న వేసినాడు.

గృష్ణునిహృదయమునకు నేరుగా ప్రశ్న వేసినాడు. "కాడలాగదు కృష్ణ! ఖాతియమాదలాగదు" అని ప్రపంచమును జూపి చెప్పినాడు. "కౌరవేశ్వరుని ప్రేమదప్ప నాకీ భువనమున వేరుగా నా ప్రజనములు లేరని" [23] యుద్ఘోషించినాడు. తాను రణదీక్షితుడనై తిననియు - నికదిరుగననియు ప్రతిజ్ఞజేసినాడు. రేపు గలుగబోవు యుద్ధమున కౌరవేశ్వరుని యవసరమునకై శరీరమును [24] నూకుదునని భావికాలమును దన గన్నులతో జూచి చెప్పినాడు. ఈధర్మ నిష్ఠురతకు కృష్ణుడు మనమునందు మెచ్చినాడు. కాని తన భేదోపాయమును మానలేదు. "ఓయీ! నీ మాటలను దుర్యోధనుడు మన్నించును. కనుక నీవు బోయి దుర్యోధనునకు సముచితముగ బంచి కుడుచుట మేలని బోధింపరాదా?"యని కడసారి జెప్పినాడు. ఈమాటలకు కర్ణుడు సమ్మతింపలేదు.

---

(19) విజయుని బాణములకు నన్ను బలిజేయు నుపాయ మల్లితివి.

(20) ఓ పిచ్చికృష్ణా! మహారాజ్య గౌరవమునకు నేను సోలను. కౌరవ పాండవులు గలిసికొనుటలో నాకు మనసు లేదు.

(21) వీరుడగు దుర్యోధనుడే నాదాత! అతని పగయే నాపగ, అతని మెప్పే నా మెప్పు.

(22) నోడిదణియను బిరుదహొగళిసి హాడితణియను నిచ్చలుచితవ మాడితణియను మానవనిధియన
దెంతుమరదపెను"

(23) కౌరవేశ్వర నొలుత మెప్పిసి
భువనదొళెనె గా ప్రజనవిల్ల.

(24) తీరిసిరెయపతి యవసరక్కె శ
రీరవనునూకువెనెను.

ఆసమయము మించిపోయినది.[25] తన వీరత కది తగదని వాదించినాడు. కడకు పాండవులను - అర్జు నునిదప్ప - చంపనని కర్ణునితో ప్రతిజ్ఞ గైకొని కృష్ణుడు తృప్తిపడినాడు. కర్ణుడు - తాను బావనని యెరిగియు - నమస్కారముచేసి[26] నిర్గమించినాడు. ఇంతతో వారి వృత్తాంతము ముగిసినది. కుమారవ్యాసుని గర్ణునకు నావేశి. కృష్ణు డాతనికన్నను నావేశి. కన్నడకవి కర్ణునకా యింత విషా దమును కూడబెట్టకుండినచో పాత్రరచన బాగుగా రక్తిగట్టి యుండెడిది. సోమయాజికర్ణుని యాధ్యాత్మికదృష్టి యాతనికిలేదు.[27] కుమారవ్యాసుని కర్ణుడు కృష్ణు నొకభేదోపాయశీలిగా నర్థము జేసికొనెను. ఇతనికి మనశ్శాంతిలేదు. అందుచే మాటలు సహజముగా దారుమారైనవి. తిక్కన మెఱుగుచేత కర్ణునిలోని ధీరోదాత్తతలేదు. తాను నీచకులుడను - లేక ప్రపంచము దన్న ట్లనుకొనుచున్న దను - దుఃఖము పెద్దదై బాధించుచున్నది. ఆత్మతృప్తిలేదు. ధర్మనిర్వహణ మున సంతోషములేదు. శౌర్యమునకు వెనుక నల్లని విషాదచ్ఛాయ లావరించినవి. కాని కుమార వ్యాసునివంటి హృదయవాద మీ ఘట్టమున దిక్కన కంటలేదు. అందు కాతని రాజకీయ విజ్ఞాన మడ్డుదాకినది. తిక్కనలోని కృష్ణకర్ణుల సమాగమమును జూచినప్పుడు - నేడు మన రాజకీయ నియంతలు గలసి మాటలాడుకొను ముచ్చటలే జ్ఞప్తికివచ్చును. కాని యౌచిత్యము బాగుగా శోభించినది. ఔచిత్యముతోపాటు రసముగూడ దక్కువగాలేదు. వెగటగు నావేశము లేదంతే. ఇంకను గొంచెము జెప్పలేదే యని దోచినచో నది మన రసజ్ఞతలోని లోపమేగాని యుభయ కవి మిత్రునిది గాదు. ఆతని వాక్కు నిత్యవర్చస్విని.

కుమారవ్యాసుడు రసవాది. పాఠకుల కన్నను ముందే దానులీనుడై పోవు స్వభావ మాతనిది. ఆ మరపుందనములో నౌచిత్యము నిలువకపోవును. నిజముగా కర్ణ కృష్ణుల సంభాషణము- కుమార వ్యాసుని రచనలో- చిన్నదైనను నొక చక్కని ఘట్టము. కర్ణుని వినయము- కృష్ణుని కలుపుగోలు తనము- మన హృదయములను నేరుగా దాకును. కాని- వాని కిచట సందర్భశుద్ధిలేదు. కుమార వ్యాసుని కృష్ణపాత్రలో పవిత్రత గొంచెము దక్కువ. అర్థము జేసికొనుటయం దభిప్రాయభేద మని దీనిని సమర్థించుటకు వీలులేదు. కవియే స్వయముగా నిచటి కృష్ణునిపాత్రను గురించి "భేదదలి కురుకులవకొందను" అని సూచనయందు వ్యాఖ్యానించెను.

కర్ణాట కవిరచన చిక్కణమైనది. పదశక్తిని చక్కగా నెరిగిన సిద్ధహస్తులలో నాతడొకడు. కాని పదచాపల్యమును - నావేశమును నాతని నెక్కిరానీయవు. కొందఱకు కోపమువచ్చునేమో కాని కవిసార్వభౌముడగు శ్రీనాథుడుగూడ మన దెనుగున నిట్టివాడే! శ్రీనాథుడు కన్నడపుకవియై యున్నచో నిజముగా కుమారవ్యాసుడై యుండును. ఈభావము నాకు వీరిరువురిని జదివినవు

---

(25) "విషమవదు కట్టాళమంత్రి దొ, రెసగలాగదు తన్న వీరతె, నమాళెహుదు మూరశైరి సంధియ, నరియెనాకెంద"

(26) కళుహాచే కెంచెరగిదను కర్ణ!

(27) మనెగె బందు విశాలమతి చింతిసిద నానిరి
లోలమాడిద మంత్రమనదలి! నట్టుబేరూరి.

డంతయు జ్ఞాపకమునకు వచ్చుచుండును. కాని కవితాప్రపంచసూర్యుడగు "నుభయకవిమిత్రు" నితో శ్రీనాథునకు బోటియే లేదు. కుమారవ్యాసున కంతకుముందే లేదు. ఒకకుమారవ్యాసుడే గాదు - ప్రాచ్యకవులలో - తిక్కనతో నెవ్వరు వాదమునకు నిలచినను - "చెంగి" పోవలసినదే దప్ప వేరుమార్గములేదు. ఆతని రచనచే తెనుగుతల్లి భాగ్యముపండినది. మనమాతని రచనల చదివి యానందించి - సాటివారల కీర్తి చాటి - అతని సేవాభాగ్యమును - తెనుగుతల్లి భాగ్యమును పండింపవలసి యున్నది. అట్టికాలము నేటికిరాలేదు. రేపటికైనను వచ్చునని యాశించుచు నీవ్యాస మును ముగించుచున్నాను.

శ్రీ

# పుస్తకావాహన

## శ్రీ రాయప్రోలు సుబ్బారావు

సీ. నిండారఁబాఱు నఖండ గోదావరి దాగిన చాళుక్య నాగరికత
పాడైన పెనుకోట గోడల దీర్ఘ నిద్రిలువోవు కాకతి ప్రాభవమ్ము
పల్లె పదాల జీవము నిల్పికొన్న పల్నాటి వీరుల రక్తనాళ పటిమ
కడలేకయేడ్చు తుంగాభద్రి కెరటాల మణఁగిన పూజ్య సామ్రాజ్యభరము
గీ. హృదయములు వినఁ బలుకక చదువుచెప్పు పుస్తక తపస్విని తెలుంగు పూలపొదల
నిలచి సేవాళుకమ్ములఁ బిలచిపిలచి స్థిరత పాడించుగాత జాతీయగీతి.

సీ. ఆచారమునకు దాస్యముఁజేయుచును వంట యిల్లుదాటఁగలేని యిందుముఖుల
ఉదయాస్తమయములు నొడలి చెమ్మటఁదీసి క్షేత్రసేవలుచేయు సేద్యకాండ్రి
బ్రతికినన్నాళ్ళు తీఱని కస్తి లెక్కలు విఱిచి జీవించెడు పేదజనుల
అక్షరపంక్తులె యరయరాదనుచు దుర్గతులఁద్రోసిన చెప్పరాని వాంఛ
గీ. పూలతోనిండి కమ్మదనాలు చిమ్ము పుస్తక నికుంజ పుంజాళి పొంతఁబిలచి
'నా జనము, నాదుదేశ'మనంగఁ జాలు నింత జ్ఞానభిక్షాదానమిమ్ముతల్లి!

సీ. ఆంధ్రుల శిల్ప విన్యాసంబు చూపించు కలిమి గోపురముల గలదటంచు
ఆంధ్ర నాగరిక కళ్యాణ చిహ్నమ్ములైన గాన సాహిత్యముల్ గలవటంచు,
ఆంధ్ర భాగ్యమ్ము మోయగ గౌతమీ కృష్ణ దరులను నావలుదిరిగె ననుచు
ఆంధ్ర వీరులకు స్వర్గాతిథ్యమిచ్చి పాటలుపాడిన యుగమ్ము కలదటంచు
గీ. చెప్పి యొప్పించు పుస్తక శ్రీ కుమారి యందగింపగఁ గల యాలయములు గట్టుఁ
డాంధ్రదేశమునందెల్ల నాంధ్ర పుత్రు లాప్త మానవ సంఘసేవానురక్తి.

# తెనుఁగువారి చదువు

శ్రీ మారేపల్లి రామచంద్రశాస్త్రి

"చదువని వాఁడజ్ఞుండగు;
చదివిన సదసద్వివేక చతురత కలుగున్
చదువఁగ వలయును జనులకు;
చదివించెద నార్యులొద్ద చదువుము తండ్రీ!

అనినాఁడు కుశద్వీప * సార్వభౌముఁడగు హిరణ్యకశిపుఁడు కొడుకగు ప్రహ్లాదునితో ఎప్పుడో! ఎప్పుడో అనఁగా కొన్నివందలయేండ్లక్రిందనో, కొన్నివేల యేండ్లక్రిందనో కాదు; ఎన్నో లక్షల యేండ్లక్రింద! అట్టిచో ఇప్పుడు క్రీ. వె. ఇరువదవ శతాబ్దమున — కొన్ని స్వతంత్ర దేశములలో సుమారు నూటికి నూఱుగురును చదువుకొన్న వారున్నకాలమున — చదువక్కఱ లేదని ఎవరందురు? ఎవరనఁగలరు? ప్రభుత్వమువారును మాటవరుసకు చదువుకావలయుననియే అందురు; మొత్తముమీఁద ప్రజలును చదువుకావలయుననియే అందురు. కాని, వట్టిమాటలతో వచ్చు లాభమేమి? నిజమునకు ఎవరికిని చదువునుగూర్చి తగినంత శ్రద్ధలేదు. అందుచే క్రియసున్న. ముంజేతికంకణమునకు అద్దమేల? సుమారు నూటడెబ్బదియేండ్లనుండి ఇండియాలో పాదుకొనిన నవనాగరక బ్రిటిషుప్రభుత్వములో క్రొత్తజనాభాలెక్కలనుబట్టి చదువుకొనినవారు నూటికి ఎందఱనుకొనుచున్నారు? ఎనమండుగురు! ఆ క్రిందటిలెక్కలనుబట్టి ఏడుగురు! దీనివలన పదియేండ్లకు నూటికి ఒకరుచొప్పున హెచ్చినట్లు తేలును! బానిసలకు ఈచదువు నడక వడి చాలును! ఈవడితో చదువుబండి సాగుచో, నూటికి నూఱుగురును చదువుకొనినవారగునప్పటికి తొమ్మిదివందల యిరువది యేండ్లు పట్టును! పూర్వము పైదేశములకు జ్ఞానభిక్ష పెట్టిన భరతఖండమున చదువింత తక్కువగుటకు కారణము భారతీయులు తమలోతమకు ఐకమత్యములేక తెచ్చికొనిన బానిసతనముగాక మఱేమి? అయినదేమో అయినది పోనిండు. ఇప్పుడైనను ఆ బానిసతనము వదల్చుకొనఁగడఁగుచున్నారా మనవారందఱును? పెక్కుమంది స్వాతంత్ర్యము కావలెనని కోరుచున్నను, ఇంకను బానిసతనమే బాగుగా ఉన్నదనువారు కొందఱు లేకపోలేదు! ఇది వింతలలో వింత! భూమండలమున మఱియేదేశముననుకూడ ఇట్టివింత కానరాదు. ఇపుడు జరుగు ప్రచండప్రపంచసంగ్రామానంతరము బ్రిటిషుప్రభుత్వమువారు ఇండియాకు స్వాతంత్ర్య మిచ్చెదమని చెప్పుచున్నారు. అటు జరుగుచో బానిసతనమే బాగుగాఉన్నదనువా రపు డేమిచేయుదురో! అట్టివారి కిప్పటికైన దేశస్వాతంత్ర్యముకొఱకు తామును తోడివారితోకలసి ప్రయత్నింపవలెనను బుద్ధి పరాత్పరుఁ డనుగ్రహించుఁగాక! స్వతంత్రత రానిచో జనసామాన్యమునకు చదువురాదు; చదువులేనిచో జ్ఞానముకలుగదు. జ్ఞానముకలుగనిచో బాగుపడుటకు వీలులేదు. ఇది మనవారందఱును ఎంతత్వరలో గుర్తించిన అంతమంచిది.

---

* దీనికి ఇంగ్లీషుపేరు 'అట్లాంటిస్' ఖండము; ఇది ఇప్పుడు అట్లాంటిక్ మహాసముద్రమున మునిఁగిపోయి యున్నది.

## తెనుఁగు వచ్చిన తెనుఁగువారు

ఒకప్పుడేని వ్రాలువచ్చినవారితో కలసి - ఇండియాలో చదువుకొన్నవారు, నూటికి ఎనమండుగురని మనకు తెలియవచ్చినది. ఇఁక తెనుఁగువ్రాలొకప్పుడు వచ్చినవారితో కలిసి - తెనుఁగు చదువుకొనిన తెనుఁగువా రెందఱు? అని అరయుచో, నూటికి ఆఱుగురో! హెచ్చుగా నైకొను నెడ ఏడుగురో! చదువుకొన్నవారని లెక్కకువచ్చిన వారందఱును చదువఁగలవారు కారు. వ్రాలు మఱచిపోయినవా రెందఱో తెలియుచో ఐదుగురు మాత్రము లెక్కకువత్తురేమో!

తెనుఁగుచదివిన తెనుఁగువారిసంఖ్య తగ్గుటకు కారణము, వారు తెనుఁగు నాటనేకాక పైనాడులలోకూడ ఉండుటయే; తమిళనాటిలో సుమారు నలువది లక్షలమంది కలరు; వారిలో చదువుకొనువారు తమిళమే చదువుదురు. అందుచేత, తిన్నవెల్లిలో శ్రీసాధు వరదరాజము పంతులుగారు మాతృభాషాభిమానమునుబట్టి తాము తెనుఁగు చదువుకొని, తమ తోడివారికొఱకు తమిళ వ్రాలలో తెనుఁగుపత్రిక ప్రకటింపవలసి వచ్చినది. తెనుఁగు పట్టణమగు చెన్నపురిలో తెనుఁగు బడులు లేనిచోట్ల తెనుఁగుపిల్లలు తమిళమే చదువుచున్నారు! ఇట్లే తక్కిన దేశములలో ఉన్న తెనుఁగుపిల్లలు ఆయాదేశభాషలు చదువవలసివచ్చు చున్నది. నైజాము రాష్ట్రములో దేశభాష కాకపోయినను ప్రభుత్వభాష అగుటచే తెనుఁగుబడులు లేనిచోట్ల తెనుఁగుపిల్లలు ఉర్దూభాషయే చదువుచున్నారను కొననగు. ఇందువలన, తెనుఁగు వచ్చిన తెనుఁగువారి సంఖ్య తగ్గిపోవుట తటస్థించినది.

జనసామాన్యమునకు చదువుచెప్పించుబాధ్యత ప్రభుత్వపువారి దనుటకు సందేహము లేదు. కాన ఈ విద్యావిహీనత్వదుస్స్థితికి విదేశప్రభుత్వపు టుపేక్షయే ముఖ్యకారణ మనక తప్పదు. దానికి తోడు ప్రజల ఉపేక్షయు కొంతవఱకు కారణమే అనదగు. మనవారిలో పెక్కురకు ఇంగ్లీషుమీఁదను, కొందఱకు సంస్కృతముమీఁదను, మఱికొందఱకు హిందీమీఁదను ఉన్న మోజు తెనుఁగుమీఁద లేదు! అంతే కాదు. వీరిలో కొందఱు తల్లి పలుకును నిరసించువారును, పరీక్షలలో దానిలో తప్పిపోవువారును కలరు! చదువుకొనిన తక్కినపనులు చెడిపోవు ననువారును, మాకు చదువు అచ్చిరాదను వారును కూడ కొందఱు కలరు!

అకటా! ఈ మెఱుకలేమి పెంజీఁకటిని తొలగించుకొనుగట్టి తలంపు మన వారికి కలుగు టెప్పుడు? పై పలుకులపై ఎంతమోజున్నను, అంతకంటె హెచ్చుమోజు తల్లిపలుకుపై కలుగు టెప్పుడు? తగు చదువాదవు- ఎఱుక ప్రొద్దుపొడుచు టెప్పుడు? ఆ యెఱుకవెలుఁగులో పోలిక లెత్తు తమ కోరికలుతీర్చుకొని, తెనుఁగువారు తనివి మున్నీటి మేటికెరటంపు టుయ్యాలలో వేడుక మీఱ ఊఁగఁ గలిగి, సాటిలేని హాయి చవితేట క్రోలఁబాలు టెప్పుడు?

## తెనుఁగువారు

తెనుఁగు నాటిలో ఉండి, తెనుఁగు మాటలాడువారు తెనుఁగువారని సాధారణముగా అను కొందురు. వీరికి తెలుఁగువారు, ఆంధ్రులు- అనుపేర్లు కూడ వాడుకలో ఉన్నవి. ఆంధ్రమహాసభ

వారు తమ నియమావళిలో, "ఆంధ్రదేశ" మనగా చెన్నరాజధాని, ఒరిస్సా, మధ్యరాష్ట్రములు, హైదరాబాదు, మైసూరు మున్నగు ప్రాంతములందలి తెనుఁగు సీమలు. "ఆంధ్రులు" అనగా ఆంధ్రదేశమందు గాని, ఆంధ్రేతర ప్రాంతమున గాని, ఆంధ్రభాష మాతృభాషగ గలిగినవారును ఆంధ్రదేశమున పుట్టి లేక నివాస మేర్పఱుచుకొని ఆంధ్రభాషను వ్యవహారభాషగా వాడుకొను వారును ఆంధ్రులు అని నిర్వచించి యున్నారు. అయినను, ఇది కేవల రాజకీయనిర్వచన మని గుర్తుంచుకొనవలె. సరిగా అరయుచో, సాధారణముగా తెనుఁగువా రనుకొనువారిలోనే నిక్కపు తెనుఁగువారు, వలస తెనుఁగువారు- అను రెండు తెఱంగులవా రున్నట్లు తేలును.

నిక్కపు తెనుఁగువారు

మొదటినుండియు తెనుఁగువారనియో- తెలుఁగువారనియో పేరొందువారు నిక్కపు తెనుఁగు వారు. అట్టివారు ఇప్పటి తెలఁగాలు- రెడ్లు- కమ్మవారు- వెలమవారు మొదలగువారును, ఆది మాంధ్రుల మని యిప్పుడనుకొనువారును కానోపుదురు. నిక్కపు తెనుఁగువారు తెన్నాటితెగలో- ద్రావిడజాతిలో- చేరినవారు ద్రావిడజాతివారి తొంటిమనికిపట్టు తెన్నాడు- దక్షిణదేశము- కాన, వారిని తెన్నాటివారన నగు. వీరు సుమారు రెండులక్షల యేండ్లక్రిందటనుండి తెన్నాటిలో ఉండి, కొంతకాలమునకు తేండ్లై, మఱికొంతకాలమునకు తేతేండ్లై, తమ సామ్రాజ్యమును ఉత్తరమున కాశ్మీరమువఱకును వ్యాపింపఁజేసి, భరతఖండ మంతయు ఏలఁజాలిరి. అపుడు తొంటి ద్రావిడభాష భరతఖండపు తొలిభాష కాఁజాలె. మహెంజోదారోనగరము త్రవ్వి బయలుపఱిచి నపు డచట తేటపడిన నాగరకత పరికించి సర్ జాన్ మార్షల్ పండితుఁడు ఆది ఆర్యనాగరకతకు పూర్వపుదనియు- ద్రావిడ నాగరకత కానోపు ననియు తెలిపె. అట్టి నాగరకత గడించిన తెన్నాటి తెగలో, నిక్కపు తెనుఁగువారి పెద్దలును చేరియుండినవారే. ద్రావిడ మహాసామ్రాజ్య సమయమున వారు తేండ్లై వెలసినవారే. వారి బిడ్డలుకూడ తరువాత దొరతనము చేసినవారే.

ఆర్యదండయాత్రలవలన ఉత్తరదేశమందలి ద్రావిడ సామ్రాజ్యము నానాటికి తగ్గిపోయె. ద్రావిడులు ఘోరముగా పోరినను తుదకు ఓడిపోయి, విడిపోయిరి.

తెనుఁగు- అనఁగా దారిలోనివారు. ఈ దారి తొంటిద్రావిడ సామ్రాజ్యకాలమున ఇప్పటి తమిళ నాటినుండి పంజాబువఱకును వ్యాపించియుండినట్లు తలంప వీలుకలదు. దానిలోని దక్షిణభాగము నకే పిదప ఆర్యులు దక్షిణాపథమని పేరుపెట్టి యుందురు. స్థానబలమును బట్టి తొంటితెనుఁగు వారు పైదారి గల నాటిలో తేండ్లుగా ఉండి యుందురు. కాన, అప్పటి తెనుఁగునాడు సప్తసింధు దేశములనుండి ద్రవిడదేశమువఱకును నెఱసియుండె ననవచ్చు; అది కడు మేటి తెనుఁగునాడు; దాని ముందట ఇప్పటి తెనుఁగునాడుగాని, విశాలాంధ్ర మను మేటి తెనుఁగునాడు గాని, దివిటీముందటి దివ్వెలే. దానిలో తరువాత ఏర్పడిన శూరశేన- దశార్ణ- మాళవ- దక్షిణకోసలాది దేశములును చేరి యుండవలె. ఇది సుమారు ఇరువదివేల యేండ్లక్రిందటి ముచ్చట! అపుడే ఆర్యులిండియాకు రాఁదొడఁగుటయు ఉత్తర ద్రావిడసామ్రాజ్యము పోమొద లిడుటయుకూడ జరిగి యుండును.

అపుడే తెనుగువారు తమిళులు అను రెండుకోవలుగా తేటతెగవారు విడిపోయియుందురు. కళింగ దేశము అప్పుడును ఇప్పుడును తెనుఁగునాటిలోనిదే. కాళింగులు తెనుఁగే మాటలాడుదురు. కాన వారు నిక్కపుతెనుఁగువారని వేఱే చెప్పనక్కఱలేదు.

మొట్టమొదట తెనుఁగు ఱేండ్లుగాని, వారి మనుగడగాని తెలిసికొనుటకు ఇపుడు వెరవులు కాన రావు. కాని, భారతకథాకాలమున ఉండిన యిద్దఱుతెనుఁగుఱేండ్లనుగూర్చి భారతము కొంత తెలుపుచున్నది. వారిలో ఒకఁడు రాజపురము రాజధానిగా ఏలిన చిత్రాంగదుఁడు. అతఁడు తన కుమార్తె శుభాంగికి స్వయంవరము చాట, తక్కిన రాజులతో దుర్యోధనుఁడును వచ్చి, ఆమె తన్ను దాఁటిపోవునపుడు, ఆమెనుపట్టి - రథముమీఁద ఉంపించి, త న్నెదిరించిన ఱేండ్లను కర్ణుని సాయమున గెలిచి, తన పోలికి పోయె నఁట. రెండవఱేఁడు శ్రుతాయువు; అతని తమ్ముఁడు భానుమంతుఁడు; కొడుకు శక్రదేవుఁడు; చక్రరక్షకులు సత్యుఁడు - సత్యదేవుఁడు. ఈ ఱేఁడు వీరితోడను, చతురంగబలములుగల మహాసేనతోడను భారతయుద్ధమున దుర్యోధనునికి తోడ్పడి, అతఁడు నియోగింప భీము నెదుర్కొని పోరిన మేటిపోటరి. ఇతని దండులో ఏనుఁగులపిండు మెండుగా ఉండె. కాన, తెనుఁగునాడు కొంత ఆంధ్రులకు లోఁబడక పూర్వము తెనుఁగునాటిని నిక్కపు తెనుఁగు ఱేండ్లు బాగుగా ఏలుచుండి రనుట తేటతెల్లము. అంతేకాదు వారిలో కొందఱు, ఇప్పటి టిప్పరా-దిప్పుర - దేశములోను, బర్మాలోను, ఇండో-చీనాలోను రాజ్యములు స్థాపించినట్లు సైతము తెలియవచ్చుచున్నది. బర్మాకు పోయిన తెలుఁగువారు అచట తనైంగు లైరి. కళింగమునుండి తూర్పుదీవులకు వలసపోయినవారు క్లింగులైరి. కఱవాక తెనుఁగువారు పడవలును, ఓడలును కట్టుటలోను, వానిని నడపుటలోను, మంచి నేర్పరులు. తక్కినవారు తక్కిన పనులలో నేర్పరులై ఉండియుందు రనుటకు వెనుదీయ నక్కఱలేదు. భారతయుద్ధమందువలెనే తక్కిన పోరులందును తెనుఁగువారి తెగువయు, బంటుతనమును మింటితల్లికలై మెఱసె.

ఇట్లు తమనాటనేకాక, పెఱనాడులలోకూడ ఱేండ్లయి - ఏలనోపిన నిక్కపుతెనుఁగువారు తుద కెట్లో ఆంధ్రులకు లోఁబడిపోయిరి; తుదకు తమ్ము ఆంధ్రులనిపించుకొనిరి. అందుచేతనే "ఆంధ్రావలీ మోదముం బొరయు నట్లు" తాను భారతము తెనిఁగించెదనని తిక్కన సోమయాజి విరాటపర్వమున తెలిపె కాని ఒరులకు లోఁబడి కొన్ని వందలయేండ్లు బ్రింగుడు పడియుండి నిక్కపు తెనుఁగు వారు మరల ఓరుగంటిలో తలయెత్తి, సామ్రాజ్యముకూడ ఏలి, కొంతకాలము పెద్ద వెలుఁగు వెలిగిరి. ఆ వెలుఁగు మాటుపడిన పిమ్మట, విజయనగరము - తంజావూరు మొదలగుచోట్ల మఱొకసారి పైకివచ్చి పేరుపొందిరి. కాని, అదియు కొన్నాళ్ళ ముచ్చటయే యయ్యె.

## వలస తెనుఁగువారు

పైనాడులనుండి తెనుఁగునాటికి వలసవచ్చినవారు వలసతెనుఁగువారు. వీరిలో మొదట పేర్కొనఁదగినవారు ఆంధ్రులు. వీరు మొదట అనాగరక జాతివారుగా ఉండి నానాటికి నాగరకులై

తెనుఁగునాడు కొంత లోఁబఱుచుకొని, కృష్ణాతీరమందలి ధాన్యకటకము రాజధానిగా చేసికొని, ఏలి, కొంతకాలము మగధ సామ్రాజ్యముకూడ స్వాధీనము పఱుచుకొని పాలింపఁజాలి; సుమారు నాలుగు వందలయేండ్లు రాజులుగాను, చక్రవర్తులగాను పేరుపొందిరి. ఇట్టి వీరు పెఱుగుట విఱుగుటకొఱకే - అను మాటంబట్టి సామ్రాజ్యమునుగాక రాజ్యముకూడ పోఁగొట్టుకొని, కట్టకడకు వీరు నిక్కపు ఆంధ్రులని పైవారు చెప్పుటకుఁగాని, మేము నిక్కపు ఆంధ్రులము - అని తాము చెప్పుకొనుటకుఁగాని వీలులేని కరణిని తెనుఁగువారిలో కలసిపోయిరి. అయినను, వీరు తాము లోఁబఱుచుకొనిన తెనుఁగువారి నందఱను ఆంధ్రులుగా చేయఁజాలిరి. వారి యేలుబడి పోయినను, వారి వ్యక్తిత్వము పోయినను, వారిపేరు - ఆంధ్రపదము - తెనుఁగువారిపై రాజ్యము చేయుచున్నది. ఇది వారి అదృష్టబలమో ! దాని అదృష్టబలమో !

ఆంధ్రుల తరువాత పల్లవులు, చాళుక్యులు, చోళులు మొదలగువారువచ్చి తెనుఁగునాటిలో కొంత కొంత పట్టుతామేలిరి. వీరును తెనుఁగువారిలో కలసిపోయిరి. ద్రావిడబ్రాహ్మణులు చోళరాజులతో వచ్చిరఁట.

ఆంధ్రబ్రాహ్మణులు - క్షత్రియులు - ఆర్యవైశ్యులు; వీరెపుడు తెనుఁగునాటికి వచ్చిరో సరిగా తెలియదు. అయినను, వీరందఱును తెనుఁగునాట స్థిరపడి, తెనుఁగు వారిలోకలసి, తెనుఁగే మాటలాడుచు తెనుఁగువారైరి.

పైని పేర్కొనినవారుగాక, మఱికొందఱుకూడ పైనాడులనుండి ఎట్లో తెనుఁగునాటికివచ్చి; ఇచ్చట పాదుకొని, తెనుఁగు మాటలాడుచు తెనుఁగువారైరి.
ఇట్లు పెక్కుమంది పెక్కుపలుకులు మాటలాడువారు తెనుఁగునాటచేరి, నిక్కపు తెనుఁగువారితో కలసి, తామును ఇపుడు తెనుఁగువా రనిపించుకొనుచున్నారు. వీరందఱును నిజమునకు వలస తెనుఁగువారే.

పైని తెలిపినవారుగాక, తురుష్కులు, ఆఫ్ఘనులు, పారసీకులు, అరబ్బీలు మొదలగు మహమ్మదీయులును, డచ్చి - ఫ్రెంచి - బ్రిటిషుజాతులకుచెంది .యూరపుఖండవాసులైన క్రైస్తవులును కూడ తెనుఁగునాటికి వచ్చిరి. వారిలో మహమ్మదీయులు కొందఱు స్థిరపడిరి. హైదరాబాదు నవాబు మొదలగువారు వారి సంతతివారే. మహమ్మదీయులవలె యూరోపియనులు ఏకొందఱో కాని హెచ్చుమంది స్థిరపడలేదు. కాని వారికి ఇచ్చట తక్కువ తెగల స్త్రీలవలన కలిగిన యూరేషియనులు స్థిరపడియున్నారు. అయినను, వీరు తమభాషగాని మతముగాని వదలివేయక పోవుటను బట్టి వలస తెనుఁగు వారుగాకూడ లెక్కకురారు. తమలోతాము ప్రత్యేక భాషలు మాటలాడుకొను పాకీ, చచ్చడి, ఎఱుకుల మొదలగు తెగలవారును అట్టివారే.

ఇందువలన తేలినదేమి? మొదటినుండియుగాని, వలసవచ్చి పాదుకొనినప్పటినుండియుఁ గాని తెనుఁగే తమలోతాము మాటలాడుకొనువారే తెనుఁగువారు, తక్కినవారు తెనుఁగునాటిలో ఉండినను, రాజకీయముగా తెనుఁగువారితో లెక్కకువచ్చినను, తెనుఁగులో తాము తక్కినవారి

వలె మాటలాడుకొనక పోవుటచే తెనుఁగువారుగా – తెనుఁగుతెగకు చెందినవారుగా – లెక్కకు రారు. ఎవరే తెగకు చెందినవారో తెలుపుటలో వారు మాటలాడు పలుకే మేటి నెరవు; గీటురాయి.

## తెనుఁగు

తెనుఁగువారు తమ తలఁపు లోండోగులకు తెలుపుకొన . మాటలాడుటకే కాక, పొత్తములు మొదలగునవి వ్రాయుటకును, పత్రికలలో వాడుటకును పనికి వచ్చుచు, వారికి పేరు తెచ్చుచున్న బలితంపు పలుకుతల్లి. తెనుఁగు తన నుడుల తియ్యందనముచే వీనులవిందై, పడమటి పలుకులలో ఇటాలియనుభాష తెలిసినవారిచే ‘తూర్పిటాలియను’ అను బిరుదు పొందఁగలిగిన అట్టి పలుకుతల్లి తెనుఁగు. మహాసామ్రాజ్యమేలి, ప్రౌఢకవియై వెలసిన కృష్ణరాయ చక్రవర్తిచే “దేశభాషలందు తెలుఁగులెస్స” అని పొగడొందఁజాలిన మేటిపలుకు తల్లి తెనుఁగు. ఇట్టి తెనుఁగు మన పలుకు తల్లి అగుటకు కతము, మనము తొంటి పుట్టుకలలో చేసియుండిన మేలిపనులపంటగాక వేఱొండు కాదు. అయినను మనమామెను సరిగా మన్నించుట లేదు; ఆమెను గద్దె ఎక్కింపఁ గడంగి, అందువలన పొందవలసిన మేలు పొందుటలేదు. ఇంతకంటె తెలివిలేమి వేఱొండుగలదా ?

## వంగడము

ఇండియాలో ఎన్నికగన్న పలుకు వంగడములు **మూఁడు** :— ౧ తెన్ వంగడము; ౨ వడ వంగడము; 3 నడి వంగడము. వీనినే వరుసగా ద్రావిడభాషా కుటుంబము, ఆర్యభాషా కుటుంబము, ముండాభాషా కుటుంబము – అని వాడుచున్నారు. ఇందు మొదటి రెండును పెద్దవంగడములు. **మూఁడవది** చిన్నవంగడము. మన తెనుఁగు తెన్ వంగడములో నడిసన్న పలుకులలో ఒకటి.

**సుమారు** రెండు లక్షల యేండ్ల క్రిందట పుట్టి, పెరిఁగి, **సుమా** రిరువది వేల యేండ్లక్రితము ద్రావిడ మహాసామ్రాజ్యము కాశ్మీరమువఱకును వ్యాపించియుండిన కాలమున భరతఖండమం దంతటను నెఱసియుండి, దాని తొలిభాషయై వెలసి, ఇపుడు సంస్కృత భవములను స్థితిలోనికి వచ్చిన పలుప్రాకృతములను – ఉత్తరదేశ భాషలను – తెన్నాటిపలుకులను కని, మంచి వాఙ్మయము సామ్రాజ్యపు మేటిగద్దె ఎక్కి పెద్ద పేరుపొందఁజాలిన తొంటి, తెన్ పలుకు తల్లియే మన పలుకు తల్లికి తల్లి.

తమిళము, కన్నడము, మలయాళము, తుళవము, కుడగు, కోట, తోడకోఁదు, గోండి, కురుజు, మల్తో, కొలామీ, బ్రాహూఈ మొదలగు పలుకులు మన తెనుఁగుతోపాటు తొంటి తెన్ పలుకు నుండి ఏర్పడినవి. కాన ఇవి అన్నియు తోఁబుట్టువులు. ఇందు మొదటి నాలుగును పెంపొందినవి; వానిలో పెద్దఱికము వరుసనుబట్టియే. తెనుఁగు; తమిళము తరువాత లెక్కకువచ్చును. తొంటి తెన్ పలుకు తొలుత తమిళము, తెనుఁగు అను రెండు కొరలుగా విడిపోయెననియు, పిదప తమిళమునుండి మలయాళము మొదలగు పలుకులును, తెనుఁగునుండి కన్నడము మొదలగు పలుకులును విడివడెననియు తలంపనగును. వీనిలో మల్తో పాట్నా దగ్గఱను, కొలామి నాగపుర వాయవ్య భాగమునను, బ్రాహూఈ సింధు, బెలూచిస్థానములలోను వాడుకలో ఉండుటయే

తొంటి తెన్‌పలుకు మునుపు భరతఖండమందంతటను నెఱసియుండెననుటకు తార్కాణ. తక్కిన ఉత్తర దేశమున తేటపలుకులు వాడుకలో లేకుండుటకు కారణము అచ్చట ఆర్యభాషలు నానాఁటికి పాదుకొనుటయే.

## తెనుఁగు వ్రాగమి

తొంటి తేటపలుకులలో వ్రాగమి — వాఙ్మయము - ఉండినట్లును, అందు తమకు కావలసినది ఆర్యులు సుమారు పదుమూఁడువేల యేండ్ల క్రిందట సంగ్రహించినట్లును తెలియవచ్చుచున్నది. అందువలన దాని తొలిబిడ్డలగు తమిళములోను - తెనుఁగులోను వ్రాగమి అప్పటినుండియు ఉండెనని తలంపనగును. కాని, అది ఇపుడు కానరాదు. ఎట్లుపోయినదో తెలియదు. మతద్వేషమే దానికి కారణమని కొందఱ తలంపు. ఉన్న తెనుఁగు వ్రాగమిలో ప్రాఁతది సైతము క్రీ. వె. ఆఱవ శతాబ్దపుదే.

మేలివ్రాగమిలో మొదట ఎన్నికకు వచ్చునది పదునొకండవ శతాబ్దపు నన్నయభారతము. అప్పటికి తెనుఁగు సంస్కృతపదములతో నిండిపోయి, బ్రాహ్మణుల పెద్దరికము క్రిందికి తాను వచ్చుట చాటుచున్నది. అయినను, రాజరాజ నరేంద్రుఁడు తెనుఁగు పలుకుతల్లిని ఏదో గద్దె కెక్కింపక తప్పినదికాదు. పిదప తిక్కన భారతమువచ్చె. కాని సోమయాజి సంస్కృతాభిమానము ముఖ్యముగా జేసికొనక, తెనుఁగు పలుకుతల్లిని తగు తెఱఁగున మన్నించుట పాడిగా తలంచి, ఆమెను పెద్దగద్దెపై నిలిపె. శైవకవులును, అచ్చతెనుఁగుకవులును, ఆమె పెద్దఱికమును బాగుగా పాటించిరి. తక్కిన కవులు తమతమ అభిమానమునుబట్టి ఆదరించిరి. కృష్ణదేవరాయ సార్వభౌముఁడు తెనుఁగు కవులను మన్నించి వారిచే మహాప్రబంధములు వ్రాయించుటయేకాక తానొకటివ్రాసి, తెనుఁగు పలుకుతల్లిని సామ్రాజ్య సింహాసనాసీనురాలగునట్లుచేసె. అప్పటికి తెనుఁగున అంతకుముందు చేరిన సంస్కృత ప్రాకృత పదములకుఁ తోడు, అన్యదేశములును కొన్ని చేరె. నానాఁటికి వ్రాగమి హెచ్చె. అందు పురాణములు, ప్రబంధములు, శతకములు మొదలగునవి చేరె. పిదప, తెనుఁగు నాడు మహమ్మదీయులకును, ఆ వెనుక బ్రిటిషువారికిని లోఁబడె. అయినను వారిలో కొందఱు తెనుఁగు తేండ్లు మొదలగువారివలెనే తెనుఁగును మన్నించి, దాని పెంపుకొఱకు పాటుపడినవారు కలరు. వారు చేసినమేలు మఱవరానిది. తరువాతి వ్రాగమిలో నాటకములు, నవలలు, చరిత్రలు, ప్రకృతిశాస్త్రములు మొదలగునవి చేరినవి. కాని, ఇప్పటికిని మన వ్రాగమి లోటులేనిది గాదన జాలము. దీనికి కారణము. ప్రభుత్వమువలనఁ గాని, ప్రజాసంస్థలవలనఁ గాని, ధనికులగు వ్యక్తులవలనఁ గాని తగిన ప్రోత్సాహము లేమియే. మొత్తముమీఁద మన మంచివ్రాగమి అని చెప్పుకొనఁ దగియున్నను నిండు వ్రాగమి కాదు; కడుమేలు వ్రాగమికాదు. ఈ లోటు తీర్చుకొనుట మన పాడికాదా? బంగాళీలు, మరాటీలు, గుజరాతీలు, హిందీవారు, ఓఢ్రులు, తమిళులు, కన్నడులు మొదలగువారు తమ పలుకులను పెంపొందించుకొనుటకు ఎంతో పాటుపడుచుండ మనము చేతులు ముడుచుకొని కూర్చుండుట

తగునా ? కాన తెనుఁగుమీఁద మన్ననకలవారందఱయినను దాని కొఱఁత తీర్ప పూనుకొందురు గాక ! అందు మొదట తెనుఁగుచదువు పెంపొందింప కడంగెదరు గాక !

## చదువు

చదువుటవలన ఎఱుక సమకూర్చునది చదువు. మంచిచెడ్డలను విదితము చేయునది విద్య. లోన అణఁగియున్న తెలివిని పైకి లాగునది ఎడ్యుకేషన్.

తెనుఁగునుడులలో నాటినుండి దేశ్యము అను చదువు చదువుటవలననే ఎఱుక సమకూడునని తెలుపుచున్నది. సంస్కృత సమమగు విద్య వినుటవలన – అనికాని – చదువుటవలన – అనికాని స్పష్టముగా తెలుపక సాధారణముగా, మంచిచెడ్డలను తెలుపునదనియే చెప్పుచున్నది. ఇఁక ఇంగ్లీషు నుడి అగు ఎడ్యుకేషన్ శిష్యులలోన అణఁగియున్న తెలివిని గురువులు పైకి లాగునది అని వక్కాణించుచున్నది. ఈ మూఁడు నుడుల వ్యుత్పత్త్యర్థమునుబట్టి వచ్చిన నిర్వచనములలో తుదిదే మిక్కిలిమంచి దనియు, మొదటిది దానితరువాతి దనియు, రెండవది దానితరువాతి దనియు అన నగు. అయినను మొత్తముమీఁద మూఁడునుడులు తెలుపు తెఱంగు లన్నియు మంచి చదువు కోరువారికి కావలసినవే. ఒజ్జలు పిల్లలచే గ్రుడ్డిచదువు చదివింపక లోన అణఁగియున్న వారి తెలివి తగుప్రశ్నలువేసి, పైకివచ్చునట్లు జేయవలె. అప్పుడు వారు తెలివితో తాము చదువున దెల్ల అరయుచు చదువుదురు. అందువలన వారికి మంచి యెఱుక కలుగును. అట్లని బాగుగా చదువుకొనినవారు పైవారు చెప్పునది విననక్కఱ లేదనుకొనరాదు. ఏ పుట్టలో ఏ పాముండునో ! ఎవరిలో ఎట్టి యెఱుకఉండునో ! కాన, చదువు పెద్దలు చెప్పుఉపన్యాసములు మొదలగునవి తప్పక వినవలె. నిజమునకు ఎట్టి గొప్పచదువరి అయినను తాను అన్ని పొత్తములును చదువఁజాలడు. కాన, పైవారు చెప్పునది విననక్కఱ లేదనుకొనుట పెద్ద పొరపాటు. దీనికి చదువుకొనినవారు పెక్కురు లోనగుట యెంతయు వింత! ఇఁక చదువుకొననివారికి పైవారు చెప్పునది వినుటయే చదువు. చదువుకొనినవారిలో "చదువులలో మర్మమెల్ల చదివితి తండ్రీ !" అని చెప్పఁగలిగిన ప్రహ్లాదుని వంటివారే మిక్కిలి తగినవారు. కాని చేవ్రాలుగూడ సరిగా చేయలేనివారు కూడ చదువు కొనినవారే అని తెలుపు మన దేశస్థితిలో అట్టివా రెందఱుందురు ? ఈపట్టున మన దేశములో ఇపుడు మనవారి కెట్టి చదువు లభించుచున్నదో అది తగినదో కాదో–కానిచో నెట్లుమార్పవలెనో, తెలిసికొనుట మంచిది. కాన ది 18-11-42 తేదీని హిందూపత్రిక విద్యావిధానమును గూర్చి తన సంపాదకీయోపన్యాసములో తెలిపిన విషయములు విన్నవింపనగు. అందు ఇండియా ప్రభుత్వ వాణిజ్య సభ్యులుగా ఉండి, ఆగ్రా యూనివర్సిటీ కాన్వొకేషనులో మాటలాడుచు శ్రీ యన్. ఆర్. సర్కారుగారు చెప్పినవి కొన్ని : పత్రికాసంపాదకులు చెప్పినవి కొన్ని.

"ఇండియాలో నీ వ్యవహారములు నీవు నిర్వహించుకొనుమని చెప్పుకాలము వచ్చుచున్నను ఈ నిర్వహణభారము వహింపవలసిన యీ దేశపు యువకులును, యువతులును అది వహించుటకు సరిగా సిద్ధపఱుపఁబడియుండలేదు. మనలో సామాన్యజనులకు మిక్కిలి తక్కువ ప్రాథమికాక్షరా

స్యత సైతములేదు. అక్షరాస్యతగల హెచ్చుమంది స్త్రీ పురుషులకు అది విడిచివేసిన దుస్తువలె ఉన్నది. మాధ్యమిక విద్యాపద్ధతి ఆ విద్య నేర్చుకొనినపిదప బ్రతుకు తెరువు చూచుకొనువారికి తగినదికాని, విశ్వకళాపరిషత్తులో ప్రవేశించుటకు సరిగా సిద్ధపఱుచునదిగాని కాదు. కొన్ని కాళాశాలలును, విశ్వకళాపరిషత్తులును, విద్యావశ్యకతలను సమకూర్చునవి గాక, సాంఘిక, ఛాందస భావములనో, – స్థానిక దురభిమానమునో తృప్తిపఱుచుచున్నవి. ప్రభుత్వమువా రెప్పుడును మందిచదువును నిజముగా నమ్మియుండలేదు. జాతీయ ప్రతిభమీఁదను, ఆర్థికావశ్యకతల మీఁదను, ప్రజావాంఛితములమీఁదను ఆధారపడి యుండకపోవుటచే ఉన్నతవిద్య ఎప్పుడును నడిగాలిలోనే వ్రేలాడుచున్నది. కళాశాలలలో ఏండ్లకొలఁది చదివినను, ఏదో బ్రతుకుతెరువు చేసికొనఁజాలని బి. ఏ. లును, ఎమ్. ఏ. లును ఇండియాలో వేలకొలఁదిగా ఉన్నారు. పాఠశాలలలో చదువు ముగించినవారు అంతకంటె హెచ్చుమంది ఉన్నారు. వారి స్థితియు పైని తెలిపిన బి. ఏ., ఎమ్. ఏ. ల స్థితికంటె బాగుగా లేదు. పాఠశాల వదలి వేసినపిదప ముఖ్యముగా వర్తకములోగాని – పరిశ్రమలోఁగాని ప్రవేశించుటకు వీలులేని కారణమున, వేలకొలఁది విద్యార్థులు కళాశాలకు వెళ్ళుచున్నారు. ఈ విషయమున ఇంగ్లాండుతో పోల్చిచూచుచో అక్కడ వయస్సు వచ్చినవారిలో మూఁడువంతులమంది పదునైదేండ్ల యీడున బడి వదలివేసినను, లాభకరముగాఁ బనులలో బ్రవేశింపఁజాలుదురు. నిజమునకు బ్రిటిషువర్తకసంస్థలలో అత్యున్నత స్థితిలో ఉండి – గొప్ప జీతములు పుచ్చుకొనువారు పెక్కురు యూనివర్సిటీ బిరుదులు కలవారు కారు. ఉన్న పనులకు అర్హులుగా యువకులను సిద్ధపఱుపని తర్బీతు తర్బీతుకాదు. డిప్లొమాలతోను, యోగ్యతాపత్రికలతోను విద్యార్థి వీధులలో తిరుగనక్కఱలేకుండ చేయుటకు విద్యాదాత ముత్తెఱంగు పని చేయవలె. మొదటిది, ఉన్న అవసరములకు కావలసిన వేర్వేఱురకముల శక్తి అబ్బునట్లు విద్యావిధానము మార్చుట; రెండవది, మార్కెట్లకొఱకు వేచియుండక, వానిని ఏర్పఱుపఁగల శక్తివిశేషములను సృజించుట; మూఁడవది, తనకు కావలసిన పనివారు ఎట్టివారో తెలుపు ఆర్థిక విధానము. ఇందు తుదిపద్ధతి దేశీయప్రభుత్వమే అవలంబింపగలదు. అదే ఎట్టి అభివృద్ధికిఁగాని అత్యావశ్యకమగు నిరక్షరాస్యతాసంపూర్ణనిర్మూలనమునకు సాధనమగు పద్ధతిని జరుపఁగలదు. ఇప్పటి ప్రభుత్వమువారు అట్టి పెద్దయెత్తున జరుపువిధానమున కగు అత్యధికవ్యయము పెద్దఅడ్డుగా చూపుదురు. ఇప్పటిపద్ధతిని నిర్బంధక ప్రజావిద్యావిధాన మేర్పఱుచుట కగు వ్యయము నిరర్థకమే కావచ్చు. కాని చీనా, రష్యా పద్ధతులు మనయెదుట నున్నవి. ఇఁకముందు స్వతంత్రభరతఖండమున అతుకులసంస్కరణముగాక సంపూర్ణసంస్కరణము జరుగవలె. మనము నిరక్షరాస్యతా నిర్మూలనమునకు పెద్దదండయాత్రలు చేయవలె; దానికి స్వచ్ఛందభటులు కావలె; వారు నిరంకుశ ప్రభుత్వములోవలె పెద్దజీతములచేతను – పెద్దపదవులచేతను ఆకర్షితులుగాక, ప్రజలసాంఘికార్థిక స్థితిని బాగుపఱుచు బాహుళ్యపద్ధతి ననుసరించి – నిరక్షరాస్యతపై యుద్ధముచేయు దేశీయప్రభుత్వపు తొలిసైన్య మను జ్ఞానముచే తమరు చేయవలసినపనికి ఆకర్షితులు కావలె.

పైదానివలన మనవారి చదువు తగినదికా దనియు, అది చీనా, రష్యాపద్ధతులనుబట్టి మార్పవలె

ననియు, అది దేశీయప్రభుత్వమే చేయఁజాలు ననియు, అది సిద్ధించుటకు దేశాభిమానులగు విద్యాధికులు స్వార్థపరత్వమువదలి - దేశీయ ప్రభుత్వమునకు తోడ్పడవలెననియు తెలియవచ్చును. కాని ఇది అంతయు తేఁటి కడుపున ఇపు డిమిడియున్నది! దేశీయప్రభుత్వము మనకు చేకూరుట ఎపుడో! సంపూర్ణసంస్కరణము సాగుటెపుడో! చదువుకొనినవారు తమమేలు చూచుకొనుటమాని, తోడివారి మేలుకొఱకు పాటుపడుట ఎపుడో! మందికి తగు చదువు పట్టువడుట ఎపుడో! వారు బాగుపడుట ఎపుడో!

## తెనుఁగు చదువు

ఇప్పటి ప్రభుత్వవిద్యావిధానమును బట్టి ఏ చదువుకూడ తగు తెఱంగున లేదని తేలినపుడు, తెనుఁగు చదువు మాత్రము బాగుగా ఉండునా? బొగ్గుగనిలో మాణిక్యముండునా? కాన మనము తక్కిన చదువులమాట అటుండ నిచ్చి, తెనుఁగుచదువు మొదట మనవారికి సరిగా అబ్బునట్లు చేయవలె. అదే తెనుఁగువారి కందఱకును అబ్బును; తక్కినవి అబ్బవు. అందఱకును అబ్బుచదువే అందఱకును మేలుచేయఁ గలుగును. కొందఱకబ్బు చదువు కొందఱకే మేలుచేసి, పెక్కురకు కీడుచేయును. కాన తక్కిన చదువులకంటె నాటి చదువునకే పెద్దఱిక మీయవలె.

తెనుఁగుచదువు :- ౧ మందిచదువు, ౨ నెఱవాదిచదువు, 3 నెఱనెఱవాదిచదువు-అన్నిము త్తెఱంగుగా ఉండనగు.

## ౧ మందిచదువు

తెనుఁగు చదువుటకును - వ్రాయుటకును - వలయులెక్కలు కట్టుటకును - బతుకుతెరువు పనులను గూర్చి కొంత తెలుపుటకును తగిన తెలివికలిగించు - చదువు మందిచదు వననగు. ఇది ఇప్పటి విద్యావిధానము రాకముందు పల్లెటూరి బడులలోను - పట్టణములలోని వీధిబడులలోను కొంతవఱకు సాగుచుండెడిది. కాని, ఇప్పటి గ్రాంటుబడులలోను, బోర్డుబడులలోను ఆ పద్ధతి మాఱినది. అందువలన మంది చదువులో మునుపటివారికుండెడి దేశభాషాజ్ఞాన మిప్పటివారికి కలుగకున్నది. మునుపటి మందిచదువులో ఇప్పటి ప్రాథమికవిద్య అంతయుఁగాక, కొంతవఱకు మాధ్యమిక విద్యయు దేశభాషావిషయమున చేరియుండెడిది. ఏమన, మునుపు మందిచదువులో చదివించెడి గజేంద్రమోక్షము - ప్రహ్లాదచరిత్ర మొదలగునవి ఇప్పుడు మాధ్యమిక పాఠశాలలలోని విద్యార్థులచే చదివించుచున్నారు. మునుపటి మందిచదువులో తెనుఁగు సంస్కృతనిఘంటువులు చదివెడివారు. అందుచే వారికుండు అర్థజ్ఞానము, ఇప్పటి మాధ్యమికపాఠశాలలో చదువువారికి సైతము లభింపకున్నది. వ్యాకరణము వారికి చెప్పకున్నను, వీరికి చెప్పినను దానిజ్ఞానము మొత్తముమీఁద వారికిని, వీరికిని ఒకచందముననే ఉన్నదనవచ్చును. మునుపటి విద్యార్థులకు పావులూరి గణితమును, క్షేత్రగణితమును చెప్పెడివారు. కాన మునుపటి మందిచదువే ఇప్పటి ప్రాథమికవిద్యకంటె మేలైన దనిమాత్రము చెప్పుటకేకాక, దేశభాషాజ్ఞాన విషయమున మాధ్యమిక విద్యకంటెకూడ

మేలైనదనియే చెప్పుటకువీలగుచున్నది. అందువలన, మునుపటి మంచిచదువే వలయు చేర్పులతో మనవారికి లభించునట్లు విద్యావిధానము మార్చుటకు గట్టి ప్రయత్నము చేయవలె.

## ౨ నెఱవాదిచదువు

నెఱవాదిచదు వనఁగా పాండిత్యపు చదువు. అర్థజ్ఞానమును, వ్యాకరణజ్ఞానమును, ఛందోజ్ఞానమును అలంకారాదిజ్ఞానమును, లోకజ్ఞానమును నెఱవాదిచదువులో తప్పక అబ్బవలె. పండితులు కాఁదలచువారు మునుపటివలె ఇప్పుడును భారత భాగవత రామాయణాదులును, మనుచరిత్ర మొదలగు ప్రబంధములును, ఆంధ్రశబ్ద చింతామణి, బాలవ్యాకరణము మొదలగు వ్యాకరణములును, సులక్షణసారము, అప్పకవీయము మొదలగు ఛందోగ్రంథములును, నరసభూపాలీయము మొదలగు అలంకారగ్రంథములును, కొందఱు ఆంధ్రసంస్కృత నిఘంటువులును, సంస్కృత కావ్యవ్యాకరణాదులును చదువు చున్నారు. కాని, ఈ చదువుతో ఎవరుగాని తెనుఁగుపండితుల మనుకొనుట పొరపాటు. తెనుఁగుపాండిత్యమునకు సంస్కృతజ్ఞాన మావశ్యక మని తెలుపువారు, దానికంటె సైతము తమిళము – కన్నడము మొదలగు భాషలజ్ఞానమావశ్యమని గుర్తింపకున్నారు. దీనికి కారణము, ఆ భాషలు తెనుఁగు తోఁబుట్టువు లగుటను వారు పాటింపమియే. అయినను ఇపుడు వానిని కూర్చి తెలిసినవారు పలువు రున్నారు. కానీ, ఇఁకముందుపాండిత్యపు చదువులో తమిళ కన్నడములు కొంతవఱకు చదివించి ఆ భాషల నిఘంటువును – వ్యాకరణములును చదువుకొని, తెనుఁగులోను; వానిలోను గల పోలిక నుడులు – ప్రత్యయములు మొదలగునవి గుర్తించు తెలివి కలిగింపవలె. అటులే ప్రాకృతభాషా పరిచయమును, ఇంగ్లీషుభాషా పరిచయమును కలిగింపవలె.

ఇంగ్లీషు కళాశాలలో ఇపుడు చెప్పు చదువు నెఱవాదిచదు వన నగు. దానికి ఉత్తమపరీక్షలలో పూర్వ పాండిత్యపు చదువునకు చేర్పవలయు నవిన చదువుకూడ చేర్ప నగు.

పైని తెలిపిన దానివలన ఇప్పటి తెనుఁగు పండితుల చదువే చాలినంతది కాదని తేలును. ఇఁక ప్రాథమికపాఠశాలలో తెనుఁగు చెప్పు తక్కిన ఒజ్జలమాట వేఱే చెప్పనేల ?

## ౩ నెఱనెఱవాదిచదువు

నెఱనెఱవాదిచదు వనఁగా పరిపూర్ణ పాండిత్యపుచదువు: ఇది చెప్పఁగల వారెవరును లేరు. నెఱవాదులు స్వయంకృషిచేతనే ముఖ్యముగా ఇది గడింప కడంగవలె. మధుకరవృత్తి దీనికి కొంత తోడ్పడును. అరయికవలన నిగ్గు తేల్చుకొనవలె . ఈ చదువు గడింపఁ దొడంగువారు నెఱవాది చదువులో ఆఱితేరినవారై ఉండవలె ననుట తేటతెల్లము. వారికి ధన సాహాయ్యమేకాక, గ్రంథ సాహాయ్యమును అత్యావశ్యకము. వలయు గ్రంథము లన్నియు ఒకచోట దొరకుట దుర్లభము. వాని కొఱకు పలుచోట్లకు పోవలసియుండును. ఉన్న గ్రంథము లన్నియుకూడ సమగ్రములని తలంప వీలు లేదు. కాన గ్రంథముల పరిశోధనముతో సంతృప్తి పొందక ఆ యా భాషలలో కృషిచేసినవారివలన సాయము పొందవలె. తెనుఁగు తోఁబుట్టువలుకులు మాడలాడు పట్టులకు వెళ్ళి

అచ్చటివారితోఁ కలసి మెలసి వారివలనను వీలగునంతవఱకు నేర్చుకొన ప్రయత్నింపవలె. ఇట్లు గట్టి కృషిచేయుచోఁ దెనుఁగున ఒక తెఱఁగున నెఱనెఱవాదితన మబ్బవచ్చును. అపుడు తక్కిన వారికది అబ్బుటకు వలయు పొత్తపుసజ్జు సైతము సమకూర్చుకొనవచ్చును. అందువలన తెనుఁగు వ్రాఁగమియు కొఱఁతలు తొలఁగించుకొని, నెఱతన మందవచ్చును.

## పై చదువులు

తెనుఁగు చదువును గూర్చి కొంత ముచ్చటించుకొంటిమి. ఇఁక పై చదువులలో ఇంగ్లీషు చదువును గూర్చియు హిందూ పత్త్రికనుండి గైకొనిన విషయములను బట్టి నిగ్గు తేలియవచ్చినది. మనలో కొందఱు వృత్తికొఱకో, జ్ఞానముకొఱకో, సంస్కృతమును, హిందీయును చదువుచున్నారు. “తెనుఁగెఱుఁగక సంస్కృతంబు తెన్నే మెఱుఁగున్” అను మాటను బట్టి, పైచదు వేదైనను తెనుఁగురాక రాణింపదు. కొందఱు తమిళము, కన్నడము, ఓఢ్రము, బెంగాలి, ఉర్దూ, ఫార్సీ, ఫ్రెంచి, జర్మను మొదలగు భాషలు నేర్చుకొనుచున్నారు. ఇది వ్యవహారమునకో, వేడుకకో, కాక, తెనుఁగు పెంపునకుకూడ పనికి వచ్చునట్లుకూడ చేయుట ఎంతయు మంచిది.

## తెనుఁగు చదువు సరిగా అబ్బుట ఎపుడు?

తెనుఁగువారు తక్కిన నాడులవారితోపాటు బానిసతనమునకు లోఁబడి తమ భాషలో చదువెల్ల చదువుకొనుటకుఁగాని, అన్ని వ్యవహారములలోను తమ తల్లి పలుకు వాడుకొనుటకుగాని వీలులేని యిప్పుడు తెనుఁగుచదువు సరిగా అబ్బునని తలంచుటఎట్లు? తోడి రాష్ట్రముల వారు కొందఱు ప్రత్యేకరాష్ట్ర పరిపాలనము తెచ్చుకొని, కొంతలాభము పొందుచుండఁగా, మనవారు ఐకమత్య లోపమువలనను, కార్యదీక్ష లేమిం జేసియు, ఒండొరులపై అసూయాగ్రస్తు లగుటంబట్టియు, ప్రత్యేకాంధ్రరాష్ట్రము తెచ్చుకొనఁజాల కున్నారు. ఎల్ల తేవి కనికరపు క్రీగంటిచూపులు మన వారిపై నెలకొని, వారు కలసికట్టుతనముతోడను, ఓర్పుతోడను, తోడివారికి తోడ్పడి, తమ నాటికి రాష్ట్రస్వపరిపాలన మెప్పుడు తెచ్చుకొందురో? అపుడు తెనుఁగు చదువు సరిగాను, నిండుగాను, మనవారికి అబ్బును. ఇపుడు తెనుఁగువారికి పాటుతఱి; పోటుతఱి త్వరలో వచ్చుగాక!

## వేఁడిక

తెనుఁగు చదువుఁడు; పాండిత్యమును గడింపుఁ
డంత, పరిపూర్ణ పాండిత్య మబ్బు కొఱకు
పాటుపడుఁ; డాంధ్రరాష్ట్రము త్వరగ తెచ్చు
కొనుఁడు; సకలసుఖంబులు కనుఁడు; మనుఁడు.

---

# గ్రంథాలయము

శ్రీ ముట్నూరి వేంకట సుబ్బారాయుడు

సీ. అఖిల కాలములఁ బ్రఖ్యాతిఁగన్న మహాత్మ మంజు లాలాప సంపదయనంగ
సర్వదేశములఁ బ్రశస్తి జాటిన ధీరశేముషీ విభవ విశేషమనఁగ
కర్ణేంద్రియప్రీతిఁ గావించు కవిరాజ సత్కావ్యకల్పనా సారమనఁగ
షట్ఛాస్త్ర నిర్మాణ చణమైన పండిత ప్రజ్ఞాతిశయ విజృంభణమనంగ
గీ. రాశిఁజేసిన జ్ఞాన సర్వస్వమనఁగ, ధర్మపుస్తక నిలయంబు తనరుచుండు
నుచిత గతి దాని నెవఁ డుపయోగపరచు నతఁడె వెలలేక విజ్ఞాన మందువాఁడు.

ఉ. బాలుర విద్యలన్ దనుపు ప్రౌఢులకున్ ముదమున్ ఘటించు సు
శ్రీలఁజెలంగువారలకుఁ జెల్వొనఁగూర్చును కష్టజాలముల్
జాలఁగఁ గూరియున్న తఱి శాంతినొసంగి సతంబు మంచు గ్రం
థాలయముల్ జగంబున ననంతశుభోదయముల్ దలంపఁగన్.

సీ. అఱువదినాల్గువిద్యలు నొక్కచో నేర్వఁదగు నిలయంబు గ్రంథాలయంబు
దరిలేని దుఃఖసాగరముల నీదంగఁ దరణితుల్యంబు గ్రంథాలయంబు
బుద్ధి మదగ్రణుల్ పూర్వులొసంగిన ధననిధానంబు గ్రంథాలయంబు
అజ్ఞాన తిమిర సంహారంబుగావించు నర్కతేజంబు గ్రంథాలయంబు
గీ. యశమె కాయంబుగాఁగల ప్రాజ్ఞసుకవి బృందముల రూపములఁ బ్రదర్శించి జనులఁ
గరము సమ్ముదితాత్ములుగానొనర్చు నట్టి సన్మందిరంబు గ్రంథాలయంబు.

ఉ. దీని నిజంబెఱింగి మన దేశమునంగల పట్టణంబులన్
జాన పదంబులన్ సులభ సాధ్యములై తగ గ్రంథ మందిరాల్
మానుగ నిల్పి సర్వజన మండలి విద్యల నేర్వకున్న స
న్మానమొనర్తురే ? మనల నాగరికాగ్రణు లంచు నన్యులున్.

# సారస్వత జీవనము

ఏనుగు లక్ష్మణ కవి

ఉ. భూషలుగావు మర్త్యులకు భూరిమయాంగద తారహారముల్
భూషిత కేశపాశమృదు పుష్పసుగంధ జలాభిషేకముల్
భూషలుగావు పూరుషుని భూషితుఁజేయుఁ బవిత్రవాణి వా
గ్భూషణమే సుభూషణము భూషణముల్ నశియించు నన్నియున్.

# స్త్రీ గ్రంథాలయములు

శ్రీమతి కవితా విశారద - విద్వత్కవితిలక కాంచనపల్లి కనకాంబ

గ్రథి బంధనే; యను ధాతువునుండి గ్రంథము వచ్చినది. ముడి వేయుట కట్టుట- ఈ గ్రంథములకే త్రిలింగభాషలోఁ బ్రబంధములనిపేరు. ఆపద మందును దృఢముగా ముడివేయుట యనియే యున్నది. వేణీ గ్రథనము - కేశగ్రథనము - పుష్పగ్రథనము - మొదలగు గ్రథనము లన్నింటి యందును పురులకంటె స్త్రీల కెక్కువ కౌశలమున్న దనుట నిస్సంశయము.

గ్రంథమునకుఁ గావ్యమని యర్థము చెప్పినప్పుడు గూడ స్త్రీకి సంబంధము లేకపోలేదు. పుస్తకేషుచ యాదేవి; యనునట్లు సమస్త పుస్తకముల యొక్క స్వరూపమును ధరించి- పుస్తకమును జేత ధరించి వీణను ధరించి సకలవేదశాస్త్ర సరససాహిత్య సంగీతమున కధిదైవతమగు సరస్వతీదేవి స్త్రీ యగుటచే స్త్రీలకు గ్రంథములకు నవినాభావమగు సంబంధమున్నది.

విద్య కధిదేవత స్త్రీయైనను విద్వాంసులు, గవులు, గ్రంథములు చెప్పువారు రచించువారు ప్రాయికముగాఁ బురుషులుగా నున్నారు.

కవులు, విద్వాంసులుగూడఁ దమ తల్లుల కడుపుపంటయే. చిన్నదనమునఁ దల్లులవలనఁ బోషింపఁబడిన పండితకవులు తరుణు లయిననాడు సర్వలోక జననియగు పరాశక్తి నారాధించియే గ్రంథకర్త లగుచున్నారు. ఇందుఁ గాళిదాసు వాక్యము కలదు. "యే త్వా మంబ న శీలయంతి మనసా తేషాం కవిత్వం కుతః"

అంబా నిన్ను భజింప కెవ్వఁడు కవీంద్రాఖ్యన్ భజించున్ ధరన్.

వివేకించిన లోకమందలి స్త్రీత్వ- పుంస్త్వ- వ్యవహారం బప్రధానంబుగఁ గానంబడు. భువనేశ్వరీ దర్శనంబునఁ ద్రిమూర్తులు స్త్రీరూపములు ధరించినట్లు పురాణప్రసిద్ధము. అమృత వినియోగ సందర్భమున శ్రీమన్నారాయణమూర్తి స్త్రీ రూపమును ధరించెనుగదా! ఇంతయేల స్త్రీపురుషుల కభేదమును జెప్పుటయే శాక్తతంత్ర మందలి పరమరహస్యము. శివశక్తుల కభేదమే చెప్పఁబడినది. ఈరహస్య మెఱిఁగియే కాఁబోలు భవభూతి మహాకవి "గుణాః పూజాస్థానం గుణిషు, నచ లింగం, నచ వయః" అని వ్రాసియున్నాడు

గీ॥ ఈడు కాదది మగతన మాడుదనము
గుణములే పూజ కర్హములో గుణులయందు

ప్రకృత మనుసరింతము.

స్త్రీ గ్రంథాలయములు స్త్రీల కుపయోగించు గ్రంథాలయము లనుటయు, స్త్రీరూపమైన గ్రంథాలయము లనుటయు నీ రెండర్థములయందును విషయము విచారింపఁబడును.

గ్రంథాలయములలోఁ బ్రత్యేకస్థానము పురుష ప్రసక్తి లేకుండ నమరుట కష్టము. వీలున్నచోటుల నట్టివసతులు కల్పించుట మేలు. గృహనిర్వాహకత్వము వహించిన యిల్లాండ్రకు మగవారి కను

కూలించు కాలములలో గ్రంథభాండాగారములకు వచ్చుటకు వీలుండదు. ఉదయము సంజవేళల యందు గృహిణులకు గృహకృత్యములతో సరిపోవును.

మధ్యాహ్నము రెండు మొదలు ఐదుగంటలకు లోపుగా ఇల్లాండ్రకు తీరిక గలిగి యుండు. రాత్రి భోజనానంతర మొకగంట- రెండుగంటలు వీలు దొరకవచ్చును గాని యది యుత్తమమగు భాగవత కాలక్షేపమునకో మఱి యేయితర పురాణకాలక్షేపమునకో వినియోగపడును.

ఇంక పగలు తీరిక సమయములలోఁ బుస్తకభాండాగారములలో స్త్రీ జనోచితమగు గ్రంథములు వారల కందించుట యుక్తము. ప్రాతకాలమునాడు పురాణేతిహాసములన్నియు స్త్రీల కొఱకేర్పడినవిగాఁ గానఁబడుచున్నవి. ఈ కాలమున గీర్వాణభాషా ప్రచారము తగ్గిపోవుటచే నా మాట నిజమా యనిపించుచున్నది. సంస్కృతముమాట యటుండగా మధ్యకాలములో నన్నపార్యుఁడు మొదలుగాఁ గల యాంధ్రకవితా ధురంధరులు రచించిన యాంధ్రానువాదములు భారత భాగవత రామాయణాదులు సద్గ్రంథచయము నేడు పురుషులకేని యర్థమగుట దుర్ఘటమగు చున్నది. శుద్ధమైన యాంధ్రగ్రంథము లర్థము కాకపోవుటయేకాక నేడు కొందఱ కాగ్రంథములయందుఁ బండ్లులేనివారికిఁ జెఱుకుగడలయందువలె ననాదరము కలిగియున్నది. అది యటులుండ మునుపు లేక నేడు క్రొత్తగా వెలువడుచున్న పత్రికావాఙ్మయము సహృదయులకు, సతీమణులకు మర్యాదా భంజకముగా నున్నది. సద్గ్రంథము లర్థముకాకపోవుటచేతఁ జదువఁబడక పోవుటయు, నసద్భావంబులు చౌకప్రొత్తములలోఁ జదువఁబడుటయు రెండనర్థములు.

కావున సద్గ్రంథములు చదివి చెప్పగల విదుషీమణులద్వారా స్త్రీ శాఖలయందు గ్రంథపఠనము చేయించుటయు ముఖ్యకర్తవ్యము. అట్లే పురుషుల శాఖయందుగూడ సర్వసమర్థుఁడైన పండితుడు గాని, వీలైనచోఁ బండితులుగానియుండి యెవ్వ రేవిషయము దెలియగోరుదురో వారికా విషయ మే యే గ్రంథములలో దొరకునో సూచించుచుండవలెను.

అసత్పత్రికా ప్రచారము నసద్గ్రంథ ప్రచారమును, గ్రంథాలయములు మాన్పించవలెను. మంటలతో, దివిటీలతో సద్ధర్మ కుటీరంబులఁ దగులపెట్టు ధీరుల యుద్యమంబులను బ్రతిఘటించు బాధ్యత గ్రంథాలయంబులయం దున్నది. ముఖ్యముగా స్త్రీ గ్రంథాలయములు "చెలియలికట్ట శీలమది స్త్రీలకు గాలము కర్మమెంతఁగా గలచిన దాని దాటరు." ఆంగ్లేయ నవలా ప్రపంచమునఁ గల (Estlynes Fantine) ఈస్లీను ఫాంటీను మొదలగు స్త్రీ పాత్రముల ననర్హముగా ననుసరించుచు చెలియలికట్టలు దాటి యుప్పెనవలె స్త్రీ లోకమును ముంపగడంగుట చూచుచున్నాము.

ఇట్టి గ్రంథములను గ్రంథాలయములలోనికిఁ బ్రవేశము గలిగింపఁగూడదు. ప్రపంచములో బదార్థము లెన్నియున్నను మేధ్యామేధ్య విచారణచేసియె వివేకులు స్వీకరించినట్లు భక్ష్యజాత మెంతయుండినను సాత్వికాదిభేదములు పాలించియే శిష్టులు భుజించునట్లుగా, పథ్యాపథ్యవిచారణ చేసియే రోగులు స్వీకరించినట్లు గ్రంథము లెన్ని యున్నను మంచివిమాత్రమే గ్రహింప నగు.

"గ్రంథ పరమ ఫలంబు మోక్షంబు గాదె"

కావున గ్రంథములన్నియు భరతఖండవాసులకు బరమార్థ ప్రాపకములై యుండు. వినోదములగు సాహిత్యములు, కళలు, శిల్పములు గూడ పరంపరగా నీ దేశమున బరమార్థమును బొందించునవి గానే యున్నవి. నేటివార లిది యరయక పాశ్చాత్త్యుల దారి ననుకరించి యనుసరించి యే దారియు లేకుండఁ దత్కాల సంతోషమునకు ధనార్జనమునకు ననుకూలమగు చిన్న పొత్తములు పత్రికలు మొదలగున వెన్నియో యుసిళ్ళవలె నేడు వృద్ధిపొందించు చున్నారు.

కావున గ్రంథాలయము లీ విమర్శ తగు పండితులచేఁ జేయించి యోగ్యాయోగ్య గ్రంథవిభాగము గావించి, జిజ్ఞాసువులగు వారికిఁ దెలియపఱచుట ముఖ్యకర్తవ్యము.

అందు స్త్రీ గ్రంథాలయములలో సద్గ్రంథముల ప్రచారము చాల యవసరము. అసత్ప్రబంధముల నిషేధమంతకంటె నవసరము.

స్త్రీ గ్రంథాలయములలో గ్రంథప్రచారముతోపాటు పురాణ పఠనము చేయించుట మంచిది. ధారణ స్త్రీలలో విశేషముగ నున్నది. ప్రాచీన స్త్రీలయం దీ ధారణ వేదపండితులతో సమానముగా నున్నది. అక్షరాస్యులు కాకపోయినను సతీమణులు కావ్యములు, పురాణములు, ఇతిహాసములు, వేదాంతములు గూడ మనోహరమగు ద్విపదలుగా, రగడలుగా, యక్షగానములుగా, నానారూప గేయములుగా, పాడుటయందుఁ బ్రావీణ్యము కలిగియున్నారు.

నేటికిని విదుషీమణులు సమస్త ధర్మము లెఱింగినవారు, బోధింప గలిగినవారు. తాము ప్రత్యక్షముగ గ్రంథములు చదువలేకున్నను, తమధారణ బలముచేత వాచా ప్రచారము చేయఁ జాలినవారిని గురుతెఱిగి సన్మానించుట మంచిది.

అట్టి విదుషీమణులను మర్యాదగల కుటుంబములలోఁ బ్రవేశపెట్టి యిల్లువీడి బయటకు రాజాలని యిల్లాండ్రకుఁ దగుబోధ చేయించుట ముఖ్య కర్తవ్యము.

అదికాక స్త్రీలకుఁ బ్రత్యేకముగా నరువదినాలుగు కళలు ప్రాచీను లేర్పరచియుండినారు. అవి యేవన.

చతుష్షష్టి కళలు

1. గీతం 2. వాదిత్రం 3. నృత్తం 4. చిత్రం 5. నాట్యం 6. పుస్తకకర్మ 7. పత్రచ్ఛేద్యం 8. లిపిజ్ఞానం 9. వచనకౌశలం 10. వైలక్షణ్యం 11. మాల్యవిధిః 12. గంధయుక్తిః 13. ఆస్వాద్యవిధానం 14. అనురంజనజ్ఞానం 15. రత్నపరీక్షా 16. సీవ్యం 17. ఉపకరణక్రియా 18. ఆజీవజ్ఞానం 19. తిర్యగ్యోనిచికిత్సితం 20. మాయాకృతం 21. పాషండసమయజ్ఞానం 22. క్రీడాకౌశలం 23. సంవాహనం 24. శరీరసంస్కారకౌశలం 25. ఆయప్రాప్తిః 26. రక్షావిధానం 27. రూపసంఖ్యా 28. క్రియామార్గః 29. జీవగ్రహణం 30. నయజ్ఞానం 31. చిత్రవిధిః

32. గూఢరాశిః 33. తులావిధిః 34. క్షిప్రగ్రహణం 35. అనుప్రాప్తిః 36. లేఖా 37. స్మృత్యనుక్రమః 38. లీలావ్యాపారమోహనం 39. ఫలవ్యామోహా ఇతిపాఠాంతరం గ్రహణాదానం 40. ఉపస్థానవిధిః 41. యుద్ధం 42. తతం 43. గతం 44. స్త్రీపురుషభావగ్రహణం 45. స్వరాగప్రకాశనం 46. ప్రత్యంగదానం 47. నఖవిచారః 48. దంతవిచారః 49 నీవీస్రంసనం 50. గుహ్యాస్పర్శనలోమ్యం 51. పరమార్థకౌశలం 52. భూషణం 53. సమానార్థతా 54. ప్రోత్సాహనం 55. మృదుక్రోధప్రవర్తనం 56. కుద్ధప్రసాదనం 57. సుప్తాపరిత్యాగః 58. పరమస్వాపవిధిః 59. గుహ్యాగ్రహః 60. సాశ్రుపాతం 61. రమణస్యవీక్షణం 62. స్వయంశపథక్రియా 63. ప్రస్థితానుగమనం 64. పునర్నిరీక్షణం ఇతికలానాంచతుష్షష్టిః.

ఈ కళలు చాల భాగము ఖిలమైనవి. శేషించిన వానికిం బ్రాణముపోసి యీ కళలను వ్యాపకము చేయుట మంచిది.

ఈ వ్యాసమునందుం జేసిన సూచనలు దేశమంతట క్రమక్రమముగ వ్యాపింపంజేసి యాంధ్రదేశము నున్నతస్థితికిం దేవచ్చును. కేంద్రగ్రంథాలయములందైన నాదర్శప్రాయముగా నివి యాచరణలోం బెట్టుట యవసరము.

"వాసుదేవార్పణంబుగా గృహోచిత కృత్యముల నిర్వహింపవలయు" నని పోతన భాగవతమం దుపదేశించెను.

సంగీతము, సాహిత్యము, శిల్పకళ, వీటి ప్రావీణ్యము భగవత్ప్రీతికరముగా, నాత్మానంద ప్రదముగా సాధుజన సంతోషముగాం బరమార్థ ప్రాపకముగా నడుపుట పరమావధి. పరమార్థములో నర్థమున్నది. అర్థములోం బరమార్థము లేదు. పరమార్థపరులగు వారికి బోషణ భగవంతుండు చేయంగలండు. చేసెను. చేయుచున్నాండు. కావున వృత్తిసాంకర్యము జాతిసాంకర్యము లేకుండ, స్వధర్మాను గుణముగ నెల్లరు స్త్రీలు, విజ్ఞానమునకు వివేకమునకు నిధానములై భారత దేశధర్మమును యథాస్థితిని నిలుపుచు దామే గ్రంథభాండాగారములై యుండుటకుం దగు ప్రోత్సాహమును బురుషులును, బురుషోత్తముండును గల్పింతురుగాత.

## గ్రంథాలయోద్యమము

శ్రీ సత్తెనపల్లి హనుమంతరావు

సీ. అక్షరజ్ఞులకెల్ల యమితజ్ఞానంబిచ్చి, సతతంబు కాపాడు సంస్థయగుచు
ఐకమత్య విహీను లాంధ్రులంచను దూరు, బాపగాజేయు స్వరూపమగుచు
విలువయౌ కాలము వ్యర్థమైపోకుండ, సత్కథాలాపనల్ సలుపదగుచు
స్వీయ వైదేశిక చిత్రవార్తల దెల్పు, పత్రికాళిని జేర్ప పాత్రమగుచు
గీ. దేశమర్థింప దగిన దెద్దేనియున్న, వానినన్నింటి సమకూర్పవలయు ననుచు
స్వీయజనులకు బోధనల్ చేయుచుండు, ఆంధ్రగ్రంథాలయోద్యమం బధికమగుత.

# కోకిల

శ్రీ పోతాప్రగడ శ్రీరామారావు, బి. యే., బి. యల్.

కాకులతో గ్రిపులంగనవు గాటపు బెండలకుందపించి చీ
కాకును బొంద వెల్లపుడు కమ్మని కంఠమునెత్తి హాయిగా
లోకములెల్ల రంజిలి విలోలత నొందఁగ; పాడి పాడునం
దాకను సర్వముం మరచి ధన్యతనొందెద వీవు కోకిలా!

పాటకె పుట్టినావొ భవబంధములంటవొ నిన్ను మాదు పో
రాటము లాశలుం విడిచి నంతనెగాని రుచింపదేమొ నీ
పాటలలోని తీపి, ఒక ఫక్కినె పాడుమ ప్రేమ తత్వమున్
చాటెడు స్వేచ్ఛ సౌఖ్యముల సంపద నీయదెసుమ్మ కోకిలా!

పొంగి పాడెదొ సొదవెళ్ళబోసి కొనెదొ
నీదుభావమేది యొ కననేరమైన
భాషయెరుగ కుండిన బోధపడకయున్న
ఆత్మకునుగూడ అవ్యయానందమిత్తు.

నిత్య యౌవని నాయాత్మ నీవుగూడ
నిత్యయౌవని వందున నేస్తమబ్బె
నీవు పాడిన వెంటనే నిఖిల జగతి
మాయమగు నాకు నానంద మధురిమమున.

వత్సరంబంతయును మధుమాసమగునొ
రాదొ వానకా రేగతి నీదగలవొ
పాటలను నిండుగా "పిచ్చుపక్షిపొట్ట"?
అనెడు హితబోధకు ల్లేరొ అదియు వినవొ.

శాస్త్ర నియమాది ఘన విమర్శనలదాటి
నిత్యము నతీంద్రియము నొచు నెగడు నీదు
పాటలో హాయి తప్పులు పట్టవచ్చు
వారి హృదయాలలో జొచ్చు దారి నీది.

మార్పులెన్నివచ్చిన అభివృద్ధికొరకె
అనుచు పాడగ నేటేట నరుగుదెంతొ

మావిపండిన పూతలో మాడియున్న
నూత్న చైతన్య సందేశమునె పలికెదు.

ఈ వసంతము కటువట ఈపరభృత
గాన మది విసువట లోటు కన నెవరిది?
విశ్వ సంగీత గ్రహణ ప్రవీణమైన
లోని రేడియో నమరుచు కోను లేక-

క్రొత్తనై ఉత్సుకతగల్గి కోమలమయి
మఱువరాదంచు నీపాట మరలవింటి
యుగయుగాల సాగుచు నెడ తెగక పాఱు
ప్రేమవాహినికిని కంఠమిచ్చినావొ-

కోకిలా తీతువును కూడ కూర్చుకొమ్మ
నీదు మేళాన లేకున్న లేదుపూర్తి
జీవితపు సుఖదుఃఖ మిశ్రితపుపాట
పాడెదరుగాక శ్రుతి కల్పి భవ్యరీతి.

కాదు సుఖమాత్ర మా నీ అఖండగాన
మది సుఖాతీత మాత్మకే అందుబాటు
తీతువది పాడు వ్యర్థ జీవితపు తుదిని
ఆలపింతువు నీ వమృతాప్తకళల"

నీకు నాకును వంతెన నీదుపాట
మధురిమయు నిర్వ్యరముగూడ మాయమగుచు
తేలిపోవుచు నున్నామదేమొ పొంగి
పొరలి వికసించి వెలిగి హద్దులను దాటి.

లోకము నేడు దారుణపు రూపముదాల్చు రసాలసాల శా
ఖాకమనీయ పీఠ మది గాయకవేదిక పాడు కోకిలా
లోకకఠోర నాదములలోనికి మంజులవాణిఁ జొన్పి ప్రే
మైక రసార్ద్రగీతికలు మందు నెడందలు పల్లవింపఁగన్.

నిత్య నవీన మీజగతి నీవలె తన్మయమంది లోకమున్
నిత్యము తన్మయత్వమున నింపగలారికి ఏలరోష మిం

కన్ త్యజియింప లేవా రస గాంగఝరిన్ విరసం బొనర్చుచున్
సత్యకళా విశారదుల సంగతి నేరిచికొమ్ము కోకిలా!

నల్లనిదానవంచు నిను నవ్విన నవ్వఁగవచ్చు తెల్లవా
రల్లలితామ్ర పల్లవకళల్ భుజియించుచు నాదబ్రహ్మముఁ
గొల్లగ బాడుకొన్న నిను గుర్తెరుగం గలరే జగాలకున్
వల్లభు గొల్చు గాయకుని వైభవ మాత్రనురక్తి కోకిలా!

ఏఱుకొంటివి తరువారమ్ములో నివా
సమునకు మధుర రసాలశాఖ
పాడితి ఋతువుల పంక్తిలో నతి రస
వంతమైనట్టి వసంత వేళ
సందేశమిడితి వైషమ్య మత్సరపూరి
తావనికిని గానతత్త్వబోధ
పలుకరించితివి పల్కుల కందరానట్టి
తన్మయానంద నాదామృతంబు
ప్రకృతి ఈశ్వరమయమని పాడుకొందు
ఈశ్వరుని ప్రకృతిలోన పూజించుకొందు
భారత వసంతకోకిలా! పాడుమమ్మ
విశ్వకల్యాణబంధుర విమలగీతి.

సర్వశ్రోత్రేంద్రియంబుల పర్వజేతు
అమృతకలకంఠ తన్మయానందరసము
ఎన్ని చెవులు హృదయము కందీయగలవో?
ఎన్నిహృదయాలు ప్రతిధ్వనియింప గలవో?

ఎక్కువ తక్కువల్ మనసు కెక్కుచు ధర్మము సన్నగిల్లుచున్
మిక్కిలి శుష్కతర్కము భ్రమించెడి లోకము ప్రక్కనిల్చుచుఁ
మక్కువ గల్గు ప్రేమరసమాధురి నిండురసప్రజానికిఁ
చక్కని బాటవైచితి వసంతమునఁ కలకంఠమెత్తుచుఁ.

# కళలు - దేశాభివృద్ధి

శ్రీమతి అత్తిలి స్వరాజ్యలక్ష్మి బి. యె., బి. యి. డి

మానవుల కానందకాంక్ష సహజము. కొందరానందమును గ్రహించి యనుభవింతురు. మరికొందరు తమ మనస్సులందలి యానందమును సంగీతరూపముననో, నాట్యముచేతనో, కవిత్వద్వారముననో, శిల్పసహాయముననో, వెల్లడింపఁజేసి కొందురు. ఇటులఁ గళలద్వారా మన యానందము, సౌందర్యోపాసన, స్థిరరూప మందుచున్నవి.

కళ లొకనా డేర్పడి యటులనే యుండిపోవునవికావు. ఒక్కొక్కవ్యక్తియొక్క ప్రత్యేకశక్తియుక్తులు, నొక్కొక్క యుగమునందలి ప్రత్యేకానుభవములు, నాయావ్యక్తులయొక్కయు నాయా యుగములయొక్కయుఁ గళాప్రకటనములో చిహ్నితము లగుచుండును. శివునిమూర్తి యడవి బాపిరాజుగారు చిత్రింపవచ్చును. వరదా వేంకటరత్నముగారు లిఖించవచ్చును. మఱొక చిత్రకారుఁ డెవ్వరైన గీయవచ్చును. కాని యదే చిత్రి మాయావ్యక్తుల యనుభవమునుబట్టియు, సామర్థ్యమునుబట్టియు, భేదించుచుండును. ఇది సంగీతవిషయమున మన కింకను స్పష్టము కాఁగలదు. అయిన నొక్కొక్క వ్యక్తి చేతిలోని దొక్కొక్కకళ కాఁజాలదు. ప్రతికళకును గొన్ని సామాన్యసూత్రములుండును. కాని, యనేక సాంప్రదాయ భేదము లుండవచ్చును. నాట్యములో మణిపురి, కూచిపూడి, కథాకలి మొదలగు ప్రాదేశికసాంప్రదాయములు, రెండవశతాబ్దము నాటి నాగార్జునకొండ, యమరావతి; ఆరు, ఏడు శతాబ్దములందలి గుహాలయములు మొదలగు కాలభేదము ననుసరించిన సాంప్రదాయములు ననేకము లుండవచ్చును. ఇవన్నియు నాయా దేశముల, యాయా కాలముల నాగరికత, జనులసంస్కృతి, యాచారవ్యవహారము లాదిగాఁగల యనేకవిషయములు వెల్లడించుచుండును. ఈ విధముగాఁ గొందరు వ్యక్తులద్వారా ప్రకటితములగు కళ లప్పటి సంఘమునకు కాలమునకు నద్దమువంటి వని చెప్పవచ్చును.

అయిన నీ సాంప్రదాయభేదము లేల యుండవలెను? ప్రతియుగమువారును దమతమ కాలము నాటి యాచారాదులును, సంస్కృతియు భావియుగముల వారికిఁ బునాదిరాళ్లుగ నుండవలెనని కోరుచుందురు. అయినను దాము జరిగిపోయిన యుగమునందలి జనులకంటె నధికప్రజ్ఞ, విశేషవ్యక్తిత్వము ప్రదర్శింపవలయునుగదా! ఏ యుగమువారైన, నేయొక్క దేశమువారైన నీ మానవాభివృద్ధి నాటకములో మూకీభావము వహించుట యుచితము గాదు. తమతమ యోపినకొలఁది కళల నభివృద్ధి యొనరించి, తమ దేశమునకును గాలమునకును జేయవలసిన విధి నిర్వర్తింపవలయును. ప్రపంచగృహ నిర్మాణమున నే సమయమున నెచ్చోట నే యిటుక లోపించిన నానాఁటి గృహ నిర్మాతలకు - ఆనాటిజనులకుఁ గళంకమే యగును.

మన దేశవిషయ మాలోచించి చూచిన, వెనుకటి అమరావతి, నాగార్జునకొండ, యజంతా, యెల్లోరా, మధుర, తంజావూరు, ఢిల్లీ, ఆగ్రాల మాట తలఁచి నేడు పూర్వసాంప్రదాయములే నశించి పోవుచున్నవే యని విచారించు వా రిప్పుడిప్పు డనేకులు కాన్పించుచున్నారు. యూరప్

లోని శిల్ప సాంప్రదాయములను, కవిత్వధోరణులను బరికించి యందలి గుణములను గ్రహించుట యుచితమేకాని, మన దేశముయొక్కయు మనయొక్కయు వ్యక్తిత్వమే వదలుకొని పూర్తిగా ననుకరణ శీలుర మగుట యెన్నటికి సర్వావిషయము కాఁజాలదు. కొలఁదికాలము నుండియు నీ సంగతి గుర్తించి, యంతరించి పోవుటకు సిద్ధమగుచున్న మనపురాతన సాంప్రదాయములను - సంగీతమందేమి, చిత్రలేఖనా శిల్పరచనాదులందేమి - సముద్ధరించి యభివృద్ధిచేయవలయు నను కాంక్ష యచ్చటచ్చట తలసూపుచు, విజయవంత మగుటకై యష్టకష్టములఁ బడుచున్నది.

అదివఱకు - నలుబది, ఏబది వత్సరములకుఁ బూర్వము మన దేశీయులు సంగీత, చిత్రలేఖన, శిల్ప, నాట్యములను జాలవఱకును, గవిత్వమును గొంతవరకును విస్మరించి, లలితకళలు నేర్చువారి నవినీతిపరులని విశ్వసించుచు, నట్టి యవినీతిని గళలకే యంటఁగట్టుచు, వానియెడల విముఖభావము బ్రకటించుచు వచ్చిరి. ముఖ్యముగా స్త్రీలను గళకే దూరము గావించివైచిరి. "సంగీతము కావలె నట యీమెకు, సానియగును గాబోలు" నని పూర్వము ముక్కుమీద వ్రేలువైచికొనుట సామాన్యమైన, నిప్పటి కింకను "బాలికలకు నాట్యము నేర్పించుచున్నారట, నడువీధిని గజ్జెకట్టింతురో, సినీమాలలోఁ దెరపైఁ దెయితక్క లాడింతురో !" యను మాట లింకను – ఏ కొన్ని పట్టణములందో తప్ప - వినబడుచునేయున్నవి. కొందరెవరో దేశదార్భాగ్య వశముననో, కాల వశముననో యవినీతిపరులైనంత మాత్రమున-ఏ కొంతకాలము వరకో యుత్కృష్టమైన కళలు దేవదాసీలు కావలసియుండిన భోగమువారి చేతులలోఁ బడియుండినంత మాత్రమునఁ, గళలలోని యంతర్గతమైన యుత్కృష్టతకే భంగము వచ్చినదా?

కావునఁ గళలు సంఘనీతిని జెఱచుననుమాట కల్ల. అంతియకాదు. సరియగు నభివృద్ధికిఁ దెచ్చిన-చో నవి సంఘనీతిని, సంఘమందలి జనుల సౌఖ్యానందములను, ధీశక్తిని, మనస్సును అభివృద్ధికిఁ దేఁగలవు. మనుజులకు సహజమైన యానందసంపాదనాకాంక్ష కళలవలననే యనుభవము నందవలయును. మానవు లనుభవించిన సౌందర్యానందములు కళలద్వారముననే వ్యక్తము కావలయును. నా మనస్సున నేదేనొక సమయమున మహదానంద మనుభవించుచో నేను పాడెదను, నాట్యము చేసెదను, పద్యములు వ్రాసెదను, చిత్రము రచించెదను, విగ్రహ నిర్మాణము చేసెదను. నే నేకళ యవలంబించునదియును నా యనుభవము నందలి లోఁతునుబట్టియు, వ్యక్తీకరించుట యందలి నా సామర్థ్యమునుబట్టియు నిర్ణీతమగును. ఇందులకుఁ గావలసిన ప్రధానసామగ్రి యనుభవము, వ్యక్తీకరణ సామర్థ్యము. మనము సాధారణముగా నానందానుభవము, సౌందర్యానుభవము, పొందుచునే యుందుము. అనుభవ మధికమైనకొలఁది వ్యక్తీకరింపవలె నను కాంక్షయు నధికతర మగుచుండును. అయినఁ గాంక్షామాత్రమునఁ బ్రయోజనమేమి? వ్యక్తీకరణశక్తి యుండవలయును. అందులకు నిరంతర సాధన మావశ్యకము. నే నొకనాఁడు గోదావరి యొడ్డున నానాద్భుతవర్ణ సమ్మిశ్రితమగు సుందరసంధ్యను గాంతును. అది పైకి వెల్లడింపవలె నన్నఁ గవిత్వపు పోకడలా రావు - గళమువిడదు, చేయికదలదు. చిత్రరచనాభ్యాసము మొదలేలేదు.

నాట్యమాడిన వెట్టియెత్తినదని నలుగురు నవ్వఁబోదురేమో? సంగీతము పాటకును కవిత్వ సహాయము కావలెను - కూనిరాగము సంగీతము కాఁజాలదు. నాగతియేమి? కాంక్ష యణచుకొని చేతకాఁదని యూరకొనుటేనా? ఇటుకాక, నే నేదేనొక కళ నభ్యసించి యుండిన నా యనుభవము లిసుక యెడారిలో నంతరింప నక్కఱలేదు గదా! అయినఁ గళలు ప్రచారములో లేనిదే కళలకుఁ దగు గౌరవమును బ్రజలు గుర్తింపనిదే, నా యనుభవ వ్యక్తీకరణమునకు ఫల మేమి? వ్యక్తీకరింపక యూరకుండి, నిరాశ, నిరుత్సాహములతో నశించుట యుచితమా?

ప్రత్యేకవ్యక్తుల విషయ మటు లుండనిండు. సంఘము మొత్తముమీఁద నాలోచించినను గళల నభివృద్ధి పఱచుట తప్పని సరియే. నేఁటి కాలమున సినీమాలు సైతమొకకళగా పరిగణింపఁ బడుచున్నవి. పల్లెటూరి జనులుసైతము సినీమాలను వెఱ్ఱిగాఁ జూచుచున్నారు. ఇందుకు గారణమేమి? వినోదమే వీనికిఁ బ్రయోజన మందురు. వినోద మన నెట్టిది? సినీమాలు, నాటకములు, చిత్రలేఖనము, నాట్యము మొదలగునవి చూచుటవలనను, సంగీతము వినుటవలనను, కవిత్వము చదువుట మూలమునను మనము పొందు మానసికమైన మార్పేమి? యని యాలోచించిన, మనస్తత్త్వవేత్తలు చెప్పెడు సమాధానము మనకు గోచరము కాక మానదు. మన మనస్సెప్పుడును వివిధాలోచనాయుతముగ నుండును. అందనేకము లగు కోర్కెలుత్పన్నము లగుచుండును. ఈ కోరిక లన్నియుఁ దీరునవి కావను విషయ మందఱకు నవగతమే. కోరిక తీరనప్పుడు మనస్సునకు దుఃఖముకలుగునుగదా! అట్లైనఁ గోరికలన్నియుఁ దీరుటెట్లు? ఏదే నొక కాంక్షను మనము బలవంతముగా నణఁచి వేసినచో నది తిరిగి మఱింత వేగముతో బయటికి వెల్లివిరియ వేచియుండును. ఇందు కుపాయమేమి? ఇదే కాంక్ష నితరమార్గములలోనికిఁ బోనిచ్చి వినియోగపఱచుట యుచితము. కాని యా మార్గములు వక్రములు, నధర్మయుతములును, గాకూడదు. వానివలన నిజమగు నానంద మనుభవితము కావలెను. నాటకాదుల ముఖ్యప్రయోజన మిదియే. నాటకములోని పాత్రలను మనము చూచుచు, మనమే యాయా కష్టసుఖముల ననుభవించుచున్నట్లు భావించుచు మన మనస్సులం దేమూలనో దాగియున్న కోర్కెల కనుభవము నందఁ గల్గుదుము. (దీనినే యాధునిక మనస్తత్త్వవేత్తలు "Sublimation" అందురు). ఇదియే కళలన్నిటికి ముఖ్యప్రయోజనము. కళలను గాదని నిరసించుచు నవి సంఘమందలి యవినీతికి దోహదము చేయు ననుచుండుట, మురికి పాత్రయందలి క్షీరమును గాంచి యెల్లెడల క్షీరము వర్జ్యమని తలంచుట వంటిదే. సంఘానందకారకములైన కళలను నిరసించుట దేశాభివృద్ధికారకమైన యొక ప్రధానాంగమును ద్రుంచి వైచుటే.

అయిన నీ నిరసనమునకుఁ గారణము లేకపోలేదు. కళలను బవిత్రములైనవని గుర్తించి వాని పవిత్రతను నిలుప వలెనని వాని నభ్యసించినవారు పట్టుదల వహింపవలెను. అంతియగాని, స్వప్రయోజనార్థము, ధనసంపాదనము నిమిత్తము మాత్రమే తమ నేర్పరితనమును వినియోగించుచు, కళల ప్రధానోద్దేశమును, సంఘమునెడలఁ దమ బాధ్యతను విస్మరించు కళోపాసకులు తమకును

సంఘమునకునుగూడ కళంక మాపాదింతురు. అన్నియుఁదెలిసిన పెద్దలును, నున్నతవంశసంజాతులగు యువతీ యువకులును, లలితకళల నభ్యసించి వాని పవిత్రతను స్థాపించి, వాని నుచ్చస్థానమున నిలుపవలసి యున్నది. ఇప్పుడిప్పుడు నాట్యకళనుగూడ నిరసనముతోఁ జూచుట తగ్గుచున్నదనవచ్చును. అయినను, కళలను బునరుద్ధరించు నుద్యమమింకను వేరులు పాదుకొనలేదని నిరాఘాటముగాఁ జెప్పవచ్చును. మన యాంధ్రదేశ మొకప్పుడు సంగీతమునకు నిధియై యుండినను, నేడు మన శక్తియుక్తులు తమిళసోదరులకు ధారవోసి మనము మూకీభావము వహించి యూరకొనుచున్నాము. మన దేశమున హార్మోనియము లింకను వదలలేదు సరిగదా ? శాస్త్రయుక్తమగు సంగీతమును, మనోహరములైన జానపద గీతములను వదలి, సినీమాపాటలు ప్రతివారును బాడుచుండుట "ఫాషన్" అయిన స్థితివచ్చినది. పురాతనకళలపై మనము చూపు నభివృద్ధి యిది !

కళలు వృద్ధినొందుటకు రాజాదరణము, ప్రభుత్వాదరణము నంత యావశ్యకము గాదనుమాట యీనాఁటి సినీమాలు మొదలగు వానివలన వ్యక్తమగుచునే యున్నది. ప్రజాదరణ మున్నఁ గళ లభివృద్ధి నందఁగలవు. కళలు వృద్ధినొందినఁ బ్రజల సంస్కృతి విస్తరించును.

కళలయెడలఁ బ్రజాదరణము వృద్ధినొందుట కనేక మార్గములు కలవు. ప్రతిపట్టణమునందో, ప్రతిజిల్లా కొక్కటిగనో, కళాక్షేత్రములను, కళాసంఘములను స్థాపించి, లలితకళలను, గవిత్వమును సక్రమముగా నభ్యసింపఁజేసి, తఱచుగాఁ బ్రదర్శనములు నేర్పాటుచేయించుచుఁ బ్రజల కందుబాటులో నుండునట్లు చేయవచ్చును. మ్యూజియములు, లైబ్రరీలు స్థాపించి, కళలను గుఱించిన గ్రంథములు, నందలి శాస్త్రము నభ్యసింపఁగోరు వారి కవి సులభసాధ్యములు చేయవచ్చును. "ఆర్టుగేలరీ"లు, "ఎగ్జిబిషను"లు ఏర్పాటుచేయించి, చిత్రములను బ్రజలేదినముననైనఁ జూచుటకు వీలగునటు లేర్పాటుచేయవచ్చును. ఇట్టి వే యొకరిద్దరి వలననో జరుగునవికావు. ధనవంతులు, కళాభిజ్ఞులు, ప్రజలు, యువతీయువకులు, బాలవృద్ధులు, ఎల్లరును బ్రయత్నించి సాధింపవలసిన కార్యము. కాని, కొలదిమంది ప్రయాసలకోర్చి ప్రారంభమం దుచితమైన యేర్పాటులు గావించి, కొన్ని ప్రదేశములలోనైన కళాభివృద్ధి చేయవలసియున్నది. సకలకళల కొకనాఁడు విద్యాగురువై యుండి, నాట్యము, సంగీతము, శిల్పము మొదలగువానిని జావా, బోర్నియోలకును, తంజావూరు మధురలకును, వ్యాపింపఁజేసి యుండిన యాంధ్రదేశమున నీనాఁడు ప్రముఖ కళాస్థానములు కొఱవడి యున్నవి. బందరు, రాజమహేంద్రవరము, గుంటూరు మొదలగు ప్రదేశములలో నున్న సంస్థలు సైతము తగిన పోషణలేక వృద్ధినందఁజాల కున్నవి. ప్రముఖ నాట్య విశారదులు, చిత్రకారులు, గాయకులు, కవులు, శిల్పులును గలసి యారని జ్యోతులై యాంధ్రదేశ సౌధమును సర్వదా యలంకరించి శోభాకరముగాఁ జేయవలెనుగాని, యచ్చటచ్చట మినుకు మినుకు మను నాముదపు ప్రమిదెలుగా మాత్రము నిలిచిపోరాదు. ఇటీవల "నాంధ్రజాతీయ వారములు", "వైజ్ఞానిక, సాంస్కృతిక సభలు"ను జరుగుచుండినమాట వాస్తవమే కాని, యా సభలవలన స్థిరమగు నొక సంస్థ స్థాపితమై, యా పిమ్మట విజ్ఞానవ్యాపక కార్యము జరుగు టుచితముగదా ! ఇట్టి సంస్థలు

విరివిగా స్థాపితమై, వానివలనఁ గళాభివృద్ధి, తద్ద్వారమున దేశాభివృద్ధి సర్వతో ముఖముగ జరుగుచు మన యాంధ్రదేశమును, హిందూదేశము నందలి చరిత్రలో మన యుగమునుగూడ గొప్ప స్థాన మాక్రమింపజేయవలయును. ఇది గుర్తించి దేశాభివృద్ధికిఁ దోడ్పడుదురుగాక యనుచు నాంధ్రలోకమున కంజలి యొనర్చుచున్నాను.

△

## గ్రంథభాండాగారము

శ్రీ జంధ్యాల వేంకట శివకవులు

సీ. తులలేని జ్ఞాన వస్తువును జూపింపంగఁ దేజరిల్లెడు మహా దీపమెద్ది
సకల రాష్ట్రపు సమాచారముల్ దెలియంగ నలరెడు కరతలామలకమెద్ది
సర్వదేశముల పూజ్యతఁగాంచు భారతీదేవికి రంగ ప్రదేశమెద్ది
ఇది మంచి దిద్ది చెడ్డదియంచు నాశ్రిత జనులకుఁ దెల్పు నాచార్యుఁ డెద్ది
గీ. అట్టి పుస్తక భాండాలయమ్ము వలనఁ, గలుగు లాభముల్ వచియింపఁగాఁ దరంబె
గాన దేశమువృద్ధికిఁ బూనవలయుఁ, దప్పకెప్పుడు నాంధ్రసోదర్యులార.

ఉ. జ్ఞానముకన్న మేల్ధనము గానఁగరాదు ధరాతలంబునన్
దానికి సాధనంబయి గనంబడు విద్దియ గ్రంథ మంది రా
ధీనముగాన నాంధ్రులకు దీని యవశ్యత నచ్చఁజేసి వి
జ్ఞానముఁ గూర్చుమంబ! యనిశంబును దేశము వృద్ధిగాంచగన్.

---

## కావ్యము

శ్రీ భట్టుమూర్తి

శా. వేదంబుల్ నృపశాసనంబులు సువ్యాద్విజ్ఞాపనంబుల్ పురా
ణాది గ్రంథము లంగనాజనవిలాసాలాప లీలానమ
పాద్రిదుర్భావములౌర కావ్యములు కర్తవ్యోపదేశక్రియా
వాదప్రక్రియలెన్నఁ గావ్యమహిమల్ వర్ణింపఁగా శక్యమే?

మ. పరమజ్ఞాన లతాలవాలము, జగత్ప్రఖ్యాతవిఖ్యాతసా
గర చంద్రోదయ, మిష్టసంఘటన రేఖాదివ్య ధేనూత్తమం
బురుకారుణ్య దశానిశాదినముఖం, బుద్వేల నిర్వాణభ
వ్యరసాస్వాదరసాయనం, బనినఁ గావ్యం, బెన్న సామాన్యమే,

# వసంతము

శ్రీ వేమూరి వెంకట రామనాథం, బి. కామ్, ఆనర్సు

కోరస్

వసంతోత్సవము సల్పుదము, వసంతారుణిమ కాంచుదము.
శిశిర తుషార ప్రసార సంయుత నిశీధిని గర్భితమౌ
ఆశాజ్యోతీ లాస్య విలాసోషస్సులు వెలువడె లే—
ఉషస్సులు వెలువడె లే;
ప్రపంచ శాంతికి విపంచి రవముల తపించు ప్రేమికులారా,
ప్రపంచశోభకు నాందీతుల్యము వసంతోత్సవము సల్పుదము.
వసంతోత్సవము సల్పుదము, వసంతారుణిమ కాంచుదము.
కాళ మేఘ సంకాశిత శీతల విభావరీ దుఃఖితమౌ
నభోమండలిని ప్రభాత శోభా రేఖలు మెఱసెను లే—
రేఖలు మెఱసెను లే;
తెలివి వెలుగులో జిలుగులు చిలుకగ కులుకు యువకులారా,
ప్రశాంత వేళల నపూర్వ నూతన వసంతోత్సవము సల్పుదము.
వసంతోత్సవము సల్పుదము; వసంతారుణిమ కాంచుదము.

[మామిడితోట పరిసరంలో పాంథులు కొందరు సంచరిస్తూ ఉంటారు. కోయిల కూతలూ, పక్షుల కిలకిలలూ వినబడుతాయి.]

పాం 1: అమ్మయ్య, చలి కాస్త ఆగింది. యీ ముసలి శరీరాల ముడుతలలో జిల్లుమంటూ, ముప్పతిప్పలు పెట్టింది.

పాం 2: అబ్బ కాలు తీసి కాలుపెట్ట లేని యీ మంచునేల లన్నీ క్రొత్త వెలుగుతో నిగనిగ లాడు తున్నాయి.

పాం 3: బిగుసుకుపోయిన నావీణా తంత్రిలలో అపూర్వ మధుర సంచలనం కల్గింది నేడు. అప్రయత్నంగానే కోకిలకు పాఠం నేర్పుతున్నాయి.

[వీణాస్వనం ఒక అర నిముసం వినబడి క్రమంగా తగ్గుతూ ఉండగా ఒక పద్యం వినబడుతుంది]

కవి: పూతములైన లేనగవు పూవుల
దోసిట బట్టి యెత్తె ప్రా
భాతకుమారి; ప్రేమమయ బంధములన్
ముడివడ్డ భృంగముల్
గీతుల పాడుచున్నవి సుడీ;
తమ నూతన జీవితంపు నాం
దీ తరుణ ప్రసూక్తి నినదింప
వనంబులు మారుమ్రోయగన్.

పాం 3: (వీణ ఆపుతూ) ఎవరో కవి లా ఉన్నాడు. ఆశాసూచకంగా ఆలపిస్తున్నాడు. (దరిజేరి) అయ్యా ప్రకృతి డోలికలలో ఆశాగీతి నాలపించే స్వేచ్ఛా జీవిలా ఉన్నారు.

కవి: అవును; స్వేచ్ఛా సూచకమయిన ప్రశాంత వసంతం అరుదెంచింది. అనంతదూరంలో ఉన్న సంతతానంద స్థలాలనుంచి మత్తెక్కిన గండు గీతాలతో మన ప్రాంతాలకు వచ్చిన వసంత శకుంత సంతానం చూశారా? నిరంతర స్వేచ్ఛాజీవులూ, స్వేచ్ఛాగాములూ.

పాం 3: రాత్రి విసువెత్తి నావీణను క్రింద పారవేసి చలి తుపానులలో నిద్రపోయాను. ఉదయరక్తిమ పొడగట్టగానే నా వీణా తంత్రిలు తమంతట తామే మ్రోగటం సాగించాయి.

కవి: బహుశా రాత్రి ఏచిలిపి కోయిలో తన ముకు పుటంతో తీగెలను తాకి ఉంటుంది. ఆ వంకర ముక్కులోని సంగీతపు వంపులన్నీ మీ వీణలో మిళిత మయినాయి.

[పాంథుడు వీణ మీటుతాడు. కవి పాట నాలపిస్తాడు. కోయిలలు వెనుక పాడుతూ ఉంటాయి]

వసంతాగమన ప్రశాంత వేళల
దిశాంతముల జీవ సంయుత ధ్వని;
వికల సుప్త హృద్ వీణాతంత్రిల
విమలగాన సృష్టి మధు ధారలు.

పాంథుడు: 4 (మొదట నెమ్మదిగా, తర్వాత క్రమంగా బిగ్గరగా) అబ్బ, ఆకలి బాధ... ఆకలి బాధ. బోరున వీచిన చలిగాలితో కడుపులోని పేగులన్నీ గలగలలాడి పోయినాయి. తిందా మంటే ఒక్క కాయైనా లేదు ఏ చెట్టునా; నాలుగు రోజులుగా వెదుకుతున్నాను.

కవి: ఏయ్ అలా విచారించకు. నీవు సరిగా వెదుక లేదు, అంతే చూడు, ఆ కనిపించే మామిడిచెట్టుమీద పూతా, చిన్న చిన్న కాయలూ—

పాం: 4 (కొంచెం ఉపశమించి) ఆఁ... ఏవీ ఏవీ... (చూసి) ఆఁ... అవును ఇదివర కెన్నడూ కనబడనే లేదే.

కవి: నిజమే. ఇన్నాళ్ళూ మావి పూత అంతా మబ్బులలో మాయమయి పోయింది. నేటికి వసంత సువర్ణ ప్రసరణం కాగానే నిగ నిగ లాడే వృక్షసౌభాగ్యం నీ కళ్ళకు కడుతోంది.

పాం 3: చూశావా! ఆ ఫలాలు ...పోయితిను ఇంకా ఆకలి అంటూ భయపడకు. పో-

పాం 4: (సందేహముతో) కాని, కాని-

కవి: ఏమిటి నీ సందేహం?

పాం 4: ఆతోటలోనికి మనమెవ్వరమూ పో రాదు గదా! అక్కడ యమభటుడిలాగా ఒకముసలి మనిషి కఱ్ఱచేతిలోపెట్టుకు కాపలా ఉంటాడు బాబూ! వనంలో కాయలూ, పండ్లూ అన్నీ ఉన్నాయన్న మాటేకాని అవన్నీ ఆకాశ పుష్పసాదృశమే.

పాం 3: (సందేహంతో) నిజంలాగా తోస్తోంది...

కవి: (నవ్వుతూ) ఇప్పుడు పోయి చూడండి. ఆ తోటకాపు కనపడడు. మీరు పోయి యిచ్చ వచ్చినన్ని కాయలు కోసుకుతినండి, ఎవ్వరూ ఏమీ అనరు.

పాం 4: అంత బలిష్ఠుడైన తోటకాపు ఏమయి నాడు?

కవి: నూతన ప్రకాశానికి తాళుకోలేక పోయి నాడు. ఈ వసంత కాలములో ప్రకృతి సౌభా గ్యాన్ని అనుభవించే హక్కు అందరిదీని. ఇవన్నీ ఆకాశపుష్పాలుకావు. అరచేతికందే విరులు.

పాం 4: సరే, పోదాం రండి.

(కవి – పాం 3 – పాట)

వసంతాగమన ప్రశాంతవేళల
వనాంతరమ్మున అనంత ఫలతతి;
శిశిరహిమాచ్ఛాదిత సౌభాగ్యపు
మసృణముగ్ధమౌ పసిడి తళుకులు.

పాం 4: కాని, అదిగో ఆముసలి కాపు బదులు, చూడండి, అక్కడ నిల్చుని ఉంది...

పాం 3: అవునవును, అతని కూతురులా ఉంది.

పాం 4: చేతిలో వడిసెలలా ఉంది చూడండి.

కవి: (నవ్వుతూ) వడిసెల కాదు; పూలదండ.

పాం 4: మరి ఆమె మనలను అడ్డగించదూ? తోటమాలి అదృశ్యు డయినా డన్నారే, అతని స్థానే తన పడుచు కూతురును పెట్టి వెళ్ళాడు.

కవి: కాని, యీామె చేసేది కాపు పని కాదు.

పాం 4: ఆ చేతులు చూడండి ఎలా త్రిప్పు తోందో—

కవి: పిచ్చివాడా, వ్యథాభయస్థుడిలాఉన్నావే... ఆవేదనా మధ్యంలో అణగిపోయి సూక్ష్మ పరిశీలన చేయటం మానివేశావు. చూడు, ఆకలి వాతబడ్డ అనాథలనూ, ఆశలడుగంటిన ఆవేశవంతులనూ, నిరాశా నిద్రితులయిన తేజోనిధులనూ, ఆహ్వానిస్తూ ఆకర్షిస్తోంది వనలక్ష్మిలా. విను, పాటకూడ పాడుతోంది...

(వెనుకనుండి పాట ఫణితి విన బడుతుంది)

పాం 3: అవును, అదిగో...ఎడారి హృదయాలలో ఆశా జీవనం పోసే దివ్య జ్యోతిలా ధగధగ లాడుతోంది. ఎన్నడైనా చూశామా యీ తోటలో, ముళ్ళులేని ప్రవేశ ద్వారాలూ, ముగ్ధ మోహన మంజుల స్వనాలూ...

[పాట వెనుక నుంచి మెల్లగా, క్రమంగా బిగ్గరగా విన బడుతుంది.]

పిల్ల: తోవ యిదే వనికీ

అది ఋతూదయ సమయ ప్రాతరరుణ రక్తులలో
తోవ యిదే వనికీ
ముదిత ముగ్ధాశయ ప్రమోదిత హృద్ క్షేత్రములో
ఆర్ద్ర మధు స్పందనంపు టమర నిమేషమ్ములలో
తోవయిదే వనికీ
ఉద్వేగ ప్రోత్సాహిత హృద్వీణా తంత్రులలో
నవజీవన విన్యాసానందమయ క్షణములలో
తోవయిదే వనికీ
శృంఖల నిర్ముక్తమూ
మధుర సుధాసిక్తమూ
తోవయిదే వనికీ

కవి: (మెల్లగా) ఇప్పటికైనా నీ అనుమానం తీరిందా పిచ్చివాడా? ఆ అమర గానంలో స్నానమాడి ఆ చూతఫలం ఆస్వాదించు.

పాం 4: ఇంతకీ యీమె తండ్రి యేమయినాడో ఉదయం మొదలు సాయంత్రం చీకటి పడే వరకూ ఇదంతా తన సొమ్ములా కాస్తూ ఉండేవాడు.

పిల్ల: మా నాన్న ఉండి ఉండి నిన్నటి అమాసి చీకట్లో అదృశ్యుడయినాడు. ప్రక్కనే పడుకున్న నాకేదో మధుర స్వప్నమొకటి కలిగింది అర్ధరాత్రివేళ. ఆ అప్రాప్తస్వప్న సౌందర్యం కళ్ళకు కట్టుకుంటూ కలత నిద్రలో దొర్లుతూ ఉండగా ఒక విచిత్రం తోచింది. దట్టంగా అల్లుకుపోయిన కారు చీకటి గుబురులన్నీ పరుగు పరుగున పశ్చిమ దిశాగర్భంలోకి జారిపోవటం, ఆ గాఢ తమో డోలికలలో నిద్రిస్తూన్న నాముదుసలి తండ్రి కూడా అదృశ్యుడు కావటం, ప్రాచ్యజల గర్భంనుంచి ఎప్పుడూ చూడని అరుణ రేఖలు ప్రసరించటం, ఈ తోటబైటి బాటలలో రక్కిస పొదలు కూలి పోవటం...అబ్బ...

కవి: ఒక్కసారిగా గల్గిన యీ నూత్నానుభవం నిన్ను తలక్రిందు చేయలేదూ!

పిల్ల: లేదు. అగాధ తన్మయత్వంలో ముంచి వేసింది. నా యీ చిన్ని హృదయంలో ఎందరిమూర్తులో కనబడుతున్నాయి; ఎన్ని పూలూ, ఫలాలో మొలకలెత్తినట్లున్నాయి. అపూర్వ భావాలెన్నో రేకెత్తుతున్నాయి.

కవి: ఈ వనలక్ష్మి లాగానే నీహృదయ లక్ష్మి కూడా చిగిర్చిందన్నమాట.

పాం 4: (ముసలికంఠంతో మెచ్చుకుంటూ) అబ్బ; ఈ పిల్లనుచూస్తే ముద్దు వస్తోంది. ఈమె పలుకులే తీపి చెరుకులు. నామ్రోడైపోయిన శిశిర హృదయము కూడా చిగురుస్తోంది.

పిల్ల: (ఉత్సాహముతో పాడుతుంది)
మధురతమ స్వప్నమా
శిథిల హృద్ వసంతమా
ప్రథమ సుధా స్నాన చలిత దివ్యాధర గానమా
శిశిర శూన్య మధ్యములో ప్రసవిత విన్యాసమా
వ్యర్థ సైకత స్థలిలో భాగ్యలతా హాసమా
మధురతమ స్వప్నమా
త్యక్త శిశిర నిష్ఫలతా త్వరిత తమోదృశ్యమా
ప్రాక్తనభోవిరచిత ప్రభారేఖా లాస్యమా
మధురతమ స్వప్నమా
సుప్త భూరుహచ్ఛాయల పాపనవ్య జీవనమా
దీప్తి పరివృత దివ్య మాధవ సందర్శనమా
మధుర తమ స్వప్నమా
శిథిలహృద్ వసంతమా
ప్రథమ సుధాస్నాన చలిత దివ్యాధరగానము.

పాం 3: ఆహా... మధురస్వప్నము.

పాం 4: నీవే ఒక వనలక్ష్మిలా ఉన్నావు.

పాం 3: ఇన్నాళ్ళూ ఈ చెట్లక్రింద ఎండిపోయిన ఆకు లెన్నో తండోపతండాలుగా ఉండేవి. నే డొక్కటీ కనబడ దే.

కవి: అవును ఆ ఎండిపోయిన ఆకు లన్నిటిలోనూ ప్రాత రరుణ రేఖా పంక్తులలో మిళితంచేసి నూత్న జీవనమధువును చిల్కినాయి పైని రెమ్మలలోని క్రొన్నన లన్నీ.

పాం 3: అందుకే సజీవమైన ఆకుపచ్చని మృదు శయ్యలలా ఉన్నాయి ఈ చెట్ల కుదుళ్ళన్నీ.

కవి: అంతే కాదు.

పిల్ల: (ఉత్సాహముతో) ప్రతిపత్రం లోంచీ ఒక్కొక్క పుష్పలత ఉద్భవిస్తున్నట్లు నాకు కనిపిస్తోంది.

కవి: నిజమే హేమంత శిశిరాలలో రాలిపోయిన ప్రతిఅణువూ వసంతాగమనంతో పునర్జీవిత మయింది.

పాం 4: రాలిపోతున్న నాహృదయకుసుమంలో కూడా పసిడి కలుములు మిలమిలలాడుతాయి కాబోలు.

పిల్ల: ప్రకృతిదేవి యీవనంలో విశ్రమించింది.

కవి: ఆమె లాక్షారుణ రేఖా స్పర్శలే ఈయెండు టాకుల రొదలను అణచివేసినాయి. భోరుమని వీచే శిశిర వాయువులలోనూ, గగ్గోలు ధ్వని చేసే యీ మోడు కొమ్మలలోనూ, నిబిడ వేణువులలోనూ, యెండుటాకులలోనూ నేటికి ప్రశాంతి యేర్పడ్డది.

పాం 4: అమ్మయ్య... ఇప్పటికి గదా, యెండి పోయిన నా ఆకటికడుపు నిండి నట్లయింది. ఎటుచూసినా ఏదో క్రొత్తగా కనబడుతోంది.

పిల్ల: ఈ కొలనులో చూడండి. చిరకాలాజ్ఞాత వాసం జరిపిన తేనెటీగెలన్నీ ఝుం మంటూ పద్మగర్భాలలో వాలుతున్నాయి ఉదయం నుంచీ.

కవి: విశ్వగానం సలిపే యీ భృంగ కుమారులు కూడా వసంత శకుంతాలతోపాటు వచ్చి ఉంటాయి.

పిల్ల: ఉదయం నుంచీ నేనూ అవీ కలిసి కాలం గడుపుతున్నాం. నేను రాగం ఆలపిస్తూ 'కూ' అని దీర్ఘం తీసేసరికి న న్ననుసరిస్తూ కోయిల కూడా 'కూ' అన్నది. నేను మళ్ళీ అన్నాను. అది మళ్ళీ నన్ను వెక్కిరించినట్లుగా అన్నది. అలా నేను చాలా సార్లు అన్నాను కాని, నాకు సిగ్గు వచ్చేట్టు అది యింకా చాలా

సార్లు కూసింది. అని అని విసుగెత్తి ఊరు కున్నాను. ఇప్పటికీ మధ్యమధ్య నాదగ్గరకు వచ్చి - అదిగో, ఆ గండు కోయిలే— "కూ"అని కవ్వించి పోతుంది. ఆ చూత ఫలం మెక్కటం నన్ను "కూ"అని కవ్వించటం, ఇదే దాని పని. ఎందుకు నేర్పానా యీ"కూ"అని యిప్పుడు చిన్నపోతున్నాను.

కవి: (బిగ్గరగా నవ్వుతాడు ఆమె అమాయకత్వానికి)

పిల్ల: ఎందుకు నవ్వుతారు?... ఇంక ఆ చిలిపి చిలుక సంగతి చెప్పనే అక్కరలేదు. సగం కొరికిన మామిడి పండు నా మీదకు విసరుతుంది. దాని పళ్ళు ఎంత తీపి తేనెలున్నాయో కాని, నేను కోసుకుని తిన్న పళ్ళ కంటె ఎన్నో రెట్లు మధురంగా ఉంటుంది. ఆ కాయ. ఇదిగో తిని చూడండి, ఎంత బాగా ఉందో - (రొట్ట కోస్తూ తింటుంది)

పాం 4: (తింటూ, ఉబ్బిపోతూ) అబ్బ, ఎంత తియ్యగా ఉందమ్మా, నీ చేతి చలువని యింకా బాగుంది సుమా.

కవి; (పొగడుతూ) అవును, ప్రకృతిలో పెరిగిన వనకన్య లతాహస్తాల నుంచి జారి పడిన ప్రేమ ఫలం ఎలా ఉంటుంది?

పాం 4: అమ్మయ్య... నాకడుపు నిండినటయింది. ఇంతటి అవ్యాజానందం నేను పుట్టిన తర్వాత ఎన్నడూ ఎరగను.

కవి: నేటికైనా గ్రహించుకుని అనుభవించ గలిగావు.

పాం 3: ఉదయమే లేచి ఎవరిముఖం చూశానో కాని—

పాం 4: లేస్తూనే యీ కొలను పడమటి ఒడ్డు దగ్గరకు వచ్చాను.

పిల్ల:(అందుకొని) నేను లేస్తూనే తన్మయత్వంలో గుంపులు వేస్తూ అటే వచ్చాను. నీ కంటె ముందు, ఏ మానవమూర్తి నాకు కనిపించ లేదు. తెల్లగా నీలంగా అల్లల్లాడుతూన్న నీటి పళ్ళెరంలో సువర్ణరేఖలు వెలుగొందినట్లు కనబడ్డాయి. నా స్వప్నానికీ, యీ దృశ్యానికీ, యేదో సంబంధం ఉందనుకున్నాను. అలాగే చూస్తూ నిలబడిపోయాను. కళ్ళు తెరుచుకు గ్రుడ్డినిశ్చలత్వంతో చూస్తూ ఉండగా నాకళ్ళముందు ఒక పెద్ద గుండ్రని బంగారాన్ని మించి మెరసే ముద్దువచ్చే తేజస్సు కనిపించింది. కేంద్రీకరించిన నా దృష్టి రేఖలను పొడిగించి చూసేసరికి సరోవర గర్భంలోకూడా అలాగే తోచింది. అర్థంకాని ఉత్సాహంతో, ఏదో గ్రహించిన గంభీర గర్వంతో తల పైకెత్తేసరికి అలాంటి బింబమే తూర్పు ఆకాశంలో అందాలు విరజిమ్ముతోంది. రెండునిమిషాలలో నాకళ్ళవెంట ఆనందబాష్పాలు రాలాయి; ఆబాష్పాలు అపూర్వ నూతనంగాఉన్నాయి. అవికూడా నా దృక్కులలాగానే ఆ విశాలారుణ బింబాన్ని చేరబోయా యనుకుంటాను. నిండు హృదయంతో పాడుకొంటూ నావనికి నేను వచ్చేశాను.

కాంచితి
ప్రాచ్యనభస్సున ప్రవిమల బింబము
బ్రతుకు తోటలో ప్రాకృత దీపిక;
ఆలించితి
దిశల కొసలలో క్రొత్త గుసగుసలు
కాంతి ప్రణయానంత ప్రసరణ;
పొందితి
మాతృదేవి సౌందర్య విస్మయత
విశ్వప్రేమిక వివశ తన్మయత

3౮౫

పాం 3: (అప్రయత్నంగా వాయిస్తున్న వీణ నాపుతూ) ఆహ్ నా వీణకూడా అప్రయత్నంగా ఆలపిస్తోంది.

కవి: అవును, వసంత శకుంతాల అనంత మాధుర్యంలోనూ, తేనెటీగల తేనెజాలుల లోనూ, వసంత వంశా విమల సంచలనం లోనూ, ప్రవహించే విశ్వగానం నీ సన్నని వీణలోనూ, యీామె కోమల గాత్రంలోనూ, సెలయేళ్ళుగా పరువు లెత్తుతోంది.

పాం 4: విశాల సరోవరంలో ఉదయం విశ్వ సందర్శన మయిన తర్వాత నా కళ్ళు పడ్డది. యీ బంగారు తలే అనుకుంటాను; అదే పనిగా ఎగురుకుంటూ ఈ వనంలోకి పరువు లెత్తుతోంది.

పిల్ల: ఈ ఆకులలోనూ, రెమ్మలలోనూ, పూవుల లోనూ, ఎగురుకుంటూ, పరువులెత్తుతూ, గంతులు వేస్తూ, కాలం గడుపుతాను. పళ్ళను కోరికి నాకు విసిరే రామచిలుకలతో కూకూ ఆటలు ఆడుకుంటాను. పాడి పాడి యీ గండు కోయిలను ఏడిపిస్తాను. పళ్ళుతింటూ, పళ్ళువిసరుతూ, పూలుకోస్తూ, పూలు చల్లుతూ, ప్రాణం విడుస్తాను. ఇలాంటి వసంత శుభోదయం నే నెన్నడూ దర్శించ లేదు.

కవి: కాలపరివేషంలో వసంతం వస్తూ పోతూ ఉన్నా, మానవజీవితంలో వసంతం ఒకేసారి మోసు లెత్తుతుంది.

పిల్ల: నాలో అది నేడు విరియించింది.

కవి: అది గ్రీష్మాగ్నిలో ఎండి, శిశిర హిమంలో కృశించకుండా చేసికొనేమార్గ మొకటుంది వనకన్యా.

పిల్ల: నా మనోలత లెప్పుడూ చిగుర్చుకునే ఉంటాయి. నా హృదయ సుమం ఎన్నడూ వాడదు. సంతృప్తి పరిమళాన్ని చిప్పిలిస్తూనే ఉంటుంది. ఈర్ష్యా గ్రీష్మంలో ఎండదు, ఆశా శిశిరంలో కృశించదు.

కోరస్

అరుదెంచెను వసంతము

విరులలో వనల సరులలో చివురు సెరువులో ప్రకృతి మురుపులోన

విరియించెను వసంతము

తీవె లే మలపు మావి క్రొంజిగురు తావులీను లేబూవుపసిడి

నలరించెను వసంతము

శిశిరము చలిలో కసరు గాడ్పులలో కృశించినట్టి వన సీమలను

చివురించెను వసంతము

వన్నె విడని చిలుకన్నె లే పలుపు వెన్నెలాలయుహృదుల న్నటింప

నరుదెంచెను వసంతము

మోడైపోయిన బీడు యెదదలో వాడిపోని లే బోడిమి కోర్కుల

నింపును వసంతము

అరుదెంచెను వసంతము



# పోతన - శ్రీనాథులు బావమఱఁదులా?

## భాగవతము భూమిలోఁ బాతిపెట్టఁబడియెనా?

చాగంటి శేషయ్య

నైషధాద్యాంధ్ర ప్రబంధకర్తయగు శ్రీనాథుఁడును, ఆంధ్ర మహాభాగవత నిర్మాతయగు బమ్మెర పోతనామాత్యుఁడును బావమఱఁదులని యాంధ్ర లోకమునఁ జిరకాలానుగతమగు ప్రవాద మొకటి కలదు. భాగవత పీఠికాకారులును, ఇటీవలి చరిత్ర కారులు కొందఱు నీ బాంధవమును గ్రంథస్థ మొనర్చియున్నారు. నూతనముగ నాంధ్రదేశ మందలి చలనచిత్ర రంగమునఁ బ్రదర్శింపఁబడు చున్న నాటక కథనముచే నీ బాంధవ్యము ప్రజా సామాన్యములో దృఢముగ నాటుకొనుచున్నది. అయినను పండితు లీవిషయమున సంశయచిత్తులు గనే యున్నారు. వీరేశలింగము పంతులుగారు శ్రీనాథుఁ డీ కవికి బావమఱఁదియైనను, గాక పోయినను, అని వ్రాసి తమ సంశయమును వెలి బుచ్చియున్నారు. గురజాడ శ్రీరామమూర్తి పంతులుగారు తమ కవిజీవితములలో; 'పోతనకు శ్రీనాథుఁడు బంధువుఁడనిమాత్రమే' వ్రాసియు న్నారు. కాని బావమఱఁదియని స్పష్టపరుపలేదు. భాగవత పీఠికాకారులగు నాగపూడి కుప్పుసా మయ్యగారు "ఈ కవీశ్వరునకు సకలవిద్యాస నాథుఁడగు శ్రీనాథుఁడు బావమఱఁది యని యందురు" అని సంశయమును సూచించిరేగాని నిర్దిష్టముగా చెప్పియుండ లేదు.

పోతన కవికి శ్రీనాథుఁడెట్టి బావమఱఁది? భార్య సోదరుఁడా? సోదరీ భర్తయా? లేక వీరిరువురును మేనత్త మేనమామ బిడ్డ లగుదురా? ఈప్రశ్నల కుత్తర మొసంగు గ్రంథస్థ నిదర్శనము లేమియుఁ గానరావు. దగ్గుబల్లి దుగ్గన రచించిన "నాసికేతోపాఖ్యానములో" తాను శ్రీనాథునకు కూరిమి సేయు మఱఁదినని వ్రాసికొనియున్నాఁడు. శ్రీనాథుని భార్య దుగ్గన కవికి సోదరియని యనుచున్నారు. భాగవత పీఠికాకారులు పోతన కవి భార్య శ్రీనాథుని భగిని యని చెప్పి యున్నారు. అట్లు వ్రాయుటకు వీరికెట్టి యాధారములు దొరకెనో పీఠికలో, తెలిపియుండ లేదు. వారికిని జనశ్రుతియే యాధారమై యుండును. పోతన శ్రీనాథు లిరువురును నియోగులును సమకాలికులునే కాని బావమఱఁదులు కారని నా యభిప్రాయము.

శ్రీనాథుఁడును వారి తండ్రి తాతలును పాకనాటి వాస్తవ్యులు. పోతనార్యుని జన్మస్థానము నైజామురాష్ట్రములోని వరంగల్లుప్రాంతమందలి బమ్మెరయను గ్రామము. ఎక్కడి పాకనాఁడు! ఎక్కడి యోరుగల్లు! దీనికిని దానికిని వందలకొలఁది మైళ్లదూరమున్నది. అయోమయ మారాతి సౌకర్యములులేని యాకాలమున నాడపిల్లల నంతదూర ప్రదేశమం దిచ్చి బాంధవ్యమును జరిపినారని తలంచుట కవకాశములేదు. పోతన కవికి శ్రీనాథుఁడు భార్యా సహోదరుఁడుగాక, మేనమామ కుమారుఁడని తలంచినను, ఆ బాంధవ్యమునకుఁగూడ దూరమంతయే. పోతన శ్రీనాథులు బావమఱఁదులు కారని స్థిరపరచుటకిది యొక ప్రబలకారణము కాదని యిప్పటివారు తలంచినను, ఆకాలమునాటి యాన సౌకర్యములను, ఆకాలమువారి ప్రకృతులను, ఆలోచిం

చినచో, నదికూడ నొకకారణమేయని తోచక పోదు. అది యట్లుండనిండు.

శ్రీనాథుఁడు బహుగ్రంథనిర్మాత, ఆతనిగ్రంథములయందెచ్చటను, పోతనను స్మరించియుండలేదు. అట్లేపోతనయు, శ్రీనాథునిగాని, యాతని పితృ పితామహులనుగా స్మరించి యుండలేదు. ఇరువురును సమకాలికులగుటచే కవిస్తుతిలో ఒకరి నొకరు చెప్పుకొని యుండక పోవచ్చును. కాని వారిరువురును నిజముగా బావమఱఁదులే యగుదురేని వారిరువురలో నొక్కరైన తన గ్రంథమునం దా సంగతి నుదహరింపకయుందురా ? దుగ్గనకవి తన గ్రంథములో శ్రీనాథుని బాంధవమును గూర్చి వ్రాసి యుండెనుకదా ! పోతన శ్రీనాథులు తమ బాంధవ్యమును గూర్చి తెలుపు కొనకపోవుట కేదేని కారణముండి యుండునని యూహించినను, పోతన తరువాత నున్న వారి వంశపు కవులెవ్వరును గూడ శ్రీనాథుని బంధువునుగాఁ జెప్పికొని యుండలేదు. పోతన కుమారుని యొక్కయు, మనుమనియొక్కయు గ్రంథములు మనకు లభింపలేదు. పోతన మునిమనుమలైన కేసకవి మల్లకవి యను వారలు రచియించిన దాక్షాయణీ పరిణయములో నీ క్రింది పద్యమున శ్రీ నాథుని కవిసార్వభౌమునిగా మాత్రమే స్తుతిచేసి యుండిరి. కాని, బాంధవముమాట తలపెట్టియుండ లేదు.

చ. నెరిగుఱిగల్లు నన్నయ మ
    నీషినిఁ దిక్కన శంభుదాసునిన్
బరువడి మత్పితామహుని
    బమ్మెరపోతన భాస్కరాహ్వయున్
వరకవి సార్వభౌముని న
    వారితభక్తి నుతింతు మెప్పుడున్
గురుకరుణాఢ్యు లంధ్రకవి
    కుంజరులం దగ భూతిశోభిలన్.

ఇంతయేల ! మన మెఱిఁగియున్నంతవఱకు పోతన శ్రీనాథుల బాంధవ్యమును సూచించు రచన యెద్దియు లేదు. నిరాధారమైన జనశ్రుతి నాధారముగాఁగైకొని ఈ కవులను బావమఱఁదులను జేయుట సత్యమునకు దూరమగునని నా మనవి. పోతన శ్రీనాథులు బావమఱఁదులని లోక మను కొనుటకు పోతన రచించిన "కాటుక కంటి నీరు..." "బాలరసాలసాల..." పద్యము లాధారములని కొందఱనవచ్చును. కాని యా పద్యములయం దీబాంధవ్యమును సూచించు నక్షర మొక్కటియును లేదు. అందుచే నాపద్యములు నిందు కాధారముగాఁ దలుచుట భ్రమయగును. ఈ పద్యములుపోతన రచితములని చెప్పుట కాధారములు లేవు. శ్రీనాథుఁడు పోతన యొద్దకు స్వయముగా నేగి భాగవతమును నరాంకితము సేయుమని ప్రోత్సహించె ననుట కాధారములు లేవు. శ్రీనాథుఁడు సర్వజ్ఞసింగయ భూపాలునిఁ జూడఁబోయినది క్రీ. శ. 1425 సంవత్సరప్రాంతమై యుండుననియు, పోతనామాత్యుఁడు భోగినీ దండకమును రచించినది ఇంచుమించుగ నాకాలమే యగుననియు కీ. శే. వీరేశలింగముపంతులు గారు ఆంధ్రకవుల చరిత్రములో వ్రాసియున్నారు. భోగినీదండకము రచించిన కొంతకాలమునకుఁ గాని పోతన భాగవతరచన కారంభింపలేదు. అందుచే శ్రీనాథుఁడు పోతనను బ్రోత్సహించినది భాగవత రచనము ప్రారంభించిన కొంత కాలమునకై యుండవలయును. అప్పటికి శ్రీ

నాథుఁడు రెడ్ల యాస్థానముననుండుటచే నాతనికి కర్ణాటక నృపునితోఁగాని, సర్వజ్ఞసింగయభూపాలునితోఁ గాని సంబంధ మున్నట్లు కన్పట్టదు.

అయినను శ్రీనాథుఁడు, పోతనార్యుని దారిద్ర్యమును జూచి భాగవతమును, కర్ణాట రాజునకుఁ గృతి యిమ్మని ప్రోత్సహించినాఁడనియే యంగీకరింతము. అంతమాత్రమున వారికి బాంధవ్య మున్నదని నిశ్చయించు టెట్లు? బంధువులైననే తప్ప యట్టి సలహానీయఁగూడదా? అన్యవిధమున బాంధవము స్థిరపడియెనేని బావమఱఁదిని తన గ్రంథమును గృతి యిమ్మని ప్రోత్సహించెననిన నమ్మవచ్చును. కాని యీ ప్రోత్సాహమును బట్టి, వారి బాంధవ్యమును నిర్ణయింపఁజూచుట న్యాయము కాఁజాలదు. లోకములోనున్న ప్రవాదము తప్ప వీరిరువును బావమఱఁదులని చెప్పుట కాధార మిసుమంతయును లేదు.

అయిన నీజనశ్రుతి యూరక వచ్చినదా? దాని నూరక త్రోసిపుచ్చఁ దగునా? యని ప్రశ్నింతు రేమో! కవుల విషయమునను, రాజుల విషయమునను నిట్టి ప్రవాదము లనేకము లుండుటయు విమర్శపై నట్టివి భ్రమ ప్రమాద జనితములని స్పష్ట పడుచుండుటయు విజ్ఞులెఱుంగనిది కాదు. కాళిదాస, రామకృష్ణాది కవులపై నారోపింపఁ బడిన కథ లిందుకుఁ దార్కాణములు. పోతన శ్రీనాథులతో సంబంధించి ప్రచారములో నున్న కథలలో నౌచిత్యముగూడఁ గాన్పింపదు. శ్రీనాథునకుఁ బోతనయను నొకబావమఱఁది యుండినమాట నిజము. అతఁడు దగ్గుబల్లి దుగ్గన కగ్రజుడు. ఈక్రింది పద్యమును జూడుఁడు.

సీ. కవిసార్వభౌముఁడై కర్ణాటవిభుచేతఁ
 గనక రత్నాభిషేకములు గనిన
శ్రీనాథసుకవి కూరిమిచేయు మఱఁదివి
 దుగ్గయకవిరాజ దగ్గుపల్లి
తిప్పనార్యునకు సతీమణి యెఱ్ఱమ
 కను దనూజుడవు పోతనకునెఱ్ఱ
నామాత్యవరునకు ననుఁగు దమ్ముండవు
 శాండిల్యగోత్రుఁడౌ సరసమతివి
గీ. చెప్పనేర్తువు కృతులు సుస్థిరముగాఁగఁ
 గాననీవు రచింపఁగఁ గడఁగియున్న
నాసికేతు చరిత్రంబు నాదుపేర
 నంకితముసేయు కవిరాజు లాదరింప.

ఈపోతనను, బమ్మెర పోతనామాత్యునిగ లోకము భ్రమించి యుండవచ్చును. హాస్యమునకై శ్రీనాథుఁడీ పోతనను, మహాకవియగు పోతనామాత్యునితోఁ బోల్చి యుపహసించుచుండ వచ్చును. అందుపై భాగవతముతో సంబంధించినకథలు కల్పింపఁబడి లోకములో గతానుగతికముగా వచ్చియుండవచ్చును. అంతియేగాని బమ్మెరపోతనయు శ్రీనాథుఁడును బావమఱఁదులు కారు.

ఇఁక నేనిందుఁ జర్చింపఁదలచిన రెండవ విషయము సర్వజ్ఞసింగయ భూపాలుఁడు భాగవతమును భూమిలోఁ గొంతకాలము పాతించి యుండెనను లోక ప్రవాదమును గూర్చినదై యున్నది. సర్వజ్ఞసింగయ ప్రభువట్టి దారుణ కార్యమును జేసియుండలేదని నాయభిప్రాయము. ఇదికూడ చిరకాలానుగతమైన ప్రవాదముపై నాధారపడియున్నదియేకాని దీనిని సులభముగా త్రోసిపుచ్చుటకు వీలులేకుండ నభ్యంతరము కలిగించుచున్నవి రెండు.

మొదటిది:- కూచిమంచి తిమ్మకవిసార్వభౌముని

సర్వలక్షణసార సంగ్రహమునందలి యీ దిగువ పద్యము-

రెండవది:- పోతన రచించిన భాగవతములోఁ గొంతభాగము నశించిపోవుట, అది యితర కవులచేఁ బూరింపఁబడుట.

సీ. ఘనుఁడు పోతనమంత్రి మును భాగవతము ర
చించి చక్రికి సమర్పించు నెడల
సర్వజ్ఞ సింగయ క్ష్మావరుండడిగి తన
కిమ్మని వేఁడగా నీయకున్న
నలిగి యా పుస్తకం బవని పాతించినఁ
జివికి యందొకకొంత శిథిలమయ్యెఁ
గ్రిమ్మర నది వెలిగందల నారప్ప
రాజును మఱి బొప్పరాజు గంగ

గీ. రాజు మొదలగు కవివరుల్ తేజమెసఁగఁ
జెప్పిరా గ్రంథములయందె తప్పులొదవెఁ
గాని పోతకవీంద్రుని కవితయందు
లక్షణం బెందుఁ దప్పునా? దక్షహరణ!

ఈ పద్యము రెండువందల సంవత్సరములకుఁ బూర్వ మొక మహాకవిచే రచియింపఁబడినది. ఇదియే సర్వజ్ఞసింగభూపాలునిపై నర్పింపఁబడిన ప్రథమ నేరారోపణ పత్రము. దీనిని మన మతి జాగ్రతతోఁ బరిశీలింప వలసియున్నది.

తిమ్మకవి, ఈపద్యమునందు స్వయముగఁ జూచిన విషయమునువలె నెంతకంఠోక్తిగఁ జెప్పినను, ఆ రాజచంద్రుఁ డాగ్రంథము నవనిపాలు చేసెనను సంగతిని స్వయముగ నెఱింగిన వాఁడుకాఁడు. స్వయముగ నెఱిఁగినవాఁడు చెప్పినమాటలను వినినవాఁడును గాఁడు. ఏమనిన, ఆ హీనకార్యము జరిగినదనెడు కాలమునకును, ఈపద్య రచనా కాలమునకును నడుమ నించుమించుగ మూఁడు వందలయేండ్లు గడచిపోయినవి. లోకములోని పుక్కిటి పురాణముల మీఁద నాధారపడియో, గ్రంథ మొక కవిచే రచియింపఁబడినట్లుండక పోవుటఁ బట్టి యూహించియో, యీపద్యమును దిమ్మకవి రచించి యుండును. తిమ్మకవికిఁ బూర్వ మిట్టి జనశ్రుతి యుండెనో లేక తిమ్మకవి నాట నుండి యిది ప్రారంభమయ్యెనో నిశ్చయముగాఁ జెప్పఁజాలము. కాని తిమ్మకవివంటి మహానుభావుఁడు తన యూహామాత్రము నాధారము చేసికొని, యొక మహారాజుపైనట్టి నిందారోపణముఁ జేయ సాహసింపఁడనియు నంతకుఁ బూర్వమట్టి ప్రవాదమొకటి యుండుటవలననే యట్లు చెప్పి యుండెననియు మనము తలంచుట యుచితము. తుదకుఁ దిమ్మకవి వ్రాతకు జనశ్రుతియే యాధారమని తేలినది. అట్టి జనశ్రుతి నొక కవి గ్రంథస్థము చేసినంత మాత్రమున నా జనశ్రుతికిఁ గవికాలమునుబట్టి ప్రాచీనత సిద్ధించునేగాని సత్యత్వము సిద్ధింపదు. అందుచే, నా ప్రవాదమునందు సత్యమున్నదా? యని విమర్శచేయుటకుఁ గవిసార్వభౌముని పద్య మాటంకము గలుగఁజేయఁ జాలదు. ఇంతేకాదు. పోతనామాత్యుఁడు లాక్షణిక కవిగాఁడని కొందఱు లక్షణవేత్త లెంచి యుండుటచే, పోతనామాత్యుఁడు లాక్షణిక కవి యని సమర్థించుటకే యీ పద్యమును తిమ్మకవి రచించియుండెను. కాని, సర్వజ్ఞ భూపాలునిపై నిందారోపణము చేయుట కాపద్య ముద్దేశింపఁబడ లేదు. ఇట్లే

ఉ. బమ్మెర పోతరాజ కృత భాగవ
తంబు సలక్షణంబుగా
కిమ్మహి నేమిటం గొదవ యెంతయు
నారసిచూడఁగాను రే
ఫమ్ములు ఱాలునుంగలసి
ప్రాసములైన కతంబుసం గదా

యిమ్మహీలనాదిలాక్షణికు లెల్లరు
మాని రుదాహరింపఁగన్.

అని యప్పకవి వ్రాసిన పద్యమునకు

ఆ. వె. "కాకునూరి యప్పకవి యహోబలపతి
ముద్దరాజు రామ ముఖ్యులెల్లఁ
బోతరాజు కబ్బమున జాలు రేఫలు
గదిసెనంచుఁ జెప్పిరది హుళిక్కి."

అని తిమ్మకవి ప్రత్యుత్తరమొసంగి పోతనామాత్యుని సమర్థించి యున్నాఁడు.

పోతరాజు రచనలోనివనియెడి తప్పు లాతనివి కావని సమర్థించుటకై వ్రాసిన యీపద్య భాగము, తిమ్మకవి సత్యాన్వేషణ చేసి వ్రాసినదని భావింపరాదు. అందుచే దాని నుపేక్షించి నిజము నారయఁ బ్రయత్నింతము.

ఇఁక రెండవ యాటంకమునుగూర్చి- పోతరాజ కృత భాగవతములోని కొన్ని భాగములు శిథిలములయినంత మాత్రమున నాగ్రంథముభూమిలోఁ బాతిపెట్టఁబడియెనని తలఁచుటెట్లు? తాటాకు గ్రంథము లనేకములు శిథిలము లగుచున్నవి. శిథిలతకుఁ గారణము లనేకములు. గ్రంథము శిథిలమైనదికావున నది భూమియందుఁ బాతిపెట్టఁబడియుండవలయునని నమ్ముటగూడదు. సత్యాన్వేషణము చేయుటకు శిథిలతయు నాటంకము గల్పింపదు. శిథిలమేల యయ్యెనో తెలిసికొనవలయును కాని, భాగవతము శిథిలమైనదికావున సింగభూపాలుఁడు దోషియని నిర్ధారణ సేయవచ్చునా?

భాగవతము శిథిలమగుటకుఁ బోతరాజును, నాతని కుమారుఁడును గ్రంథరక్షణమునం దుపేక్షవహించుటయే కారణమై యుండవచ్చునని కీ. శే. వీరేశలింగము పంతులుగారు మొదలుగా పలువురభిప్రాయ పడియున్నారు. అట్లేల కాకూడదు? పోతరాజు, భాగవతమును బూర్తిగా రచియించి యుండెననుట కాధారములు లేవు. దశమస్కంధమునందలి యుత్తరభాగములోఁ జివర భాగము కొంతయును, ఏకాదశ ద్వాదశ స్కంధములును వెలిగందల నారయ రచితములు. ఈభాగమును రచింపకయే పోతన కాలధర్మము నొందెనేమో! కాదనుట కాధార మేది? ఈనారయ పోతనామాత్యునకుఁ బ్రియ శిష్యుఁడు. పోతన రచించిన భాగము శిథిల మగుటచేఁ దాని భాగమును రచించితినని యాతఁ డెచ్చట ననియుండలేదు.

ఈఖననకార్య మెప్పుడు జరిగినది?

సింగభూపాలుఁడు భాగవతమును భూమియందుఁ బాతించిన దెప్పుడో, తిరిగి బయటకుఁ దీయించిన దెప్పుడో యెవరును జెప్పలేరు. లోక ప్రవాదములోఁ గూడ నీవివరములు లేవు. పోతన జీవించియుండగనే పాతించుటయుఁ దీయించుటయుఁ జరిగియున్నచో నంతటి ప్రేమతోఁ దాను రచించిన గ్రంథములోని శిథిలభాగములను ఎంత శ్రమకోర్చియైనను మరలఁ దాను పూరించి యుండడా? ఆతని జీవితములోఁ బాతిపెట్టుట మాత్రమే జరిగియుండినచోఁ దన గ్రంథమును రాజునకుఁ గృతియొసంగుమని సూచించినంత మాత్రముననే "కాటుక కంటినీరు" అను పద్యమును జెప్పిన మహానుభావుఁడు తాను శ్రమపడి రచించిన యుద్గ్రంథమును, తన ప్రియపుత్త్రికను, తన జీవితసర్వస్వమును సమాధిచేయుచున్నప్పుడు, తన దుఃఖమును వెలిబుచ్చునట్టి, తన నిస్సహాయతను సూచించునట్టి, తన కోపమును జూపునట్టి యొక పద్యమైనను రచించి యుండడా? రచించియున్నచోఁ బై పద్యముల వలెనే ప్రచారములో నుండవా?

పోతనామాత్యుఁడే కాదు. ఆతని పుత్త్రపౌత్త్రాదులుగాని శిష్యప్రశిష్యులుగాని యెచ్చటను నీ విషయమును బ్రస్తావించియుండ లేదు.

సింగయభూపాలుఁడు గ్రంథము నణఁచివేయ వలయునన్నచో భూమిలోఁ బాతించు టేల? అగ్నిహోత్రునిపాలు చేయఁగూడదా? కొన్ని తాటాకులను నాశనముచేయుటకంత ప్రయత్నమెందుకు? భూమిలో పాతించునప్పుడు దానిని మరలఁ దీయవలయునను నుద్దేశమాతని కుండదుగదా! భూమిలో నెంతకాల ముండెనో తెలియదు. గ్రంథము శిథిలమగువఱకు శ్రీరామచంద్రమూర్తి యేలయుపేక్షించెనో తెలియదు. భూమియందుఁ బాతిపెట్టఁబడినప్పుడు భూమిలో నది యే స్థితిలో నుంచఁబడినదో యని యోచించితిమేని పంచమ షష్ఠస్కంధములు మొదలుగా అన్యకవిపూరిత భాగములుమాత్రమే శిథిలమగుట సంభవింపదని తోచును. ఈ విషయముల నాలోచించినచో నీ ఖననకథ కల్పితమని యనుకొనక తప్పదు.

పోతన మరణానంతరమున సర్వజ్ఞసింగయభూపాలుఁడీ గ్రంథమును భూస్థాపితము చేసెనన్నచో నదియును సమంజసముగాఁ గన్పట్టదు. వైరమా మరణానంతరమేకదా! పోతన క్రీ. శ. 1378 సంవత్సర ప్రాంతమున జన్మించి యుండవచ్చునని భాగవత పీఠికాకారులు వ్రాసియున్నారు. వీరేశలింగము పంతులుగారు క్రీ. శ. 1400 సంవత్సర ప్రాంతమాతని జన్మకాలమని నుడివియున్నారు. ఈ విమర్శనమునకు సింగయభూపాలుని జనన మరణ కాలములను తెలియుట కొంత యావశ్యకము. వెంకటగిరి సంస్థానాధిపతులైన వెలుగోటివారి వంశావళియును గ్రంథమును, పిఠాపుర సంస్థాన చరిత్రయుఁ జదివినచో సింగయప్రభువు కాలము దెలియునని కొందఱనిరి. కాని నాకా గ్రంథములు లభింపలేదు. ఎట్లయినను భోగినీ దండకమునుబట్టి, పోతనామాత్యుఁడును, సింగయప్రభువును సమకాలికులనియు ఇంచుమించు సమవయస్కులు ననుటకు సంశయింపఁబనిలేదు. కాని వారిరువురి మరణకాలమును దెలిసియున్నచో, మనకు నిజమును దెలిసికొనుట కుపయోగముగా నుండును.

శిథిల భాగ పూరణము

భాగవతమంతయుఁ బోతన రచించియుండెనని యంగీకరించినయెడల నందు శిథిలములయిన భాగములలోఁ బెద్దవి మూఁడు. తక్కినవి స్వల్పములు, 1. పంచమస్కంధము, 2. షష్ఠస్కంధము, 3. దశమస్కంధమందలి యుత్తరభాగములోఁగొంత నుండి ద్వాదశస్కంధము తుదివఱకును.

ఇందు మొదటిభాగమును గంగనయు, రెండవ భాగమును సింగనయు, మూఁడవభాగమును నారనయుఁ బూరించిరి. ఇందులో నారన పోతనకుఁ బ్రియశిష్యుఁడు. పోతన తరువాతఁగూడ కొంత కాలము జీవించియుండవచ్చును. తక్కిన గంగన సింగన లెప్పటివారో తెలియ లేదు. వీరి కాలమును చరిత్రకారు లెవ్వరును నిర్ణయించి యుండ లేదు. పోతనకు సమకాలికులందుమా! ఆభాగములను రచియింపుఁడని పోతనయే వారి కొసంగి యుండ వలయును. పోతనకుఁ దరువాత నున్నవారందుమా! ఎప్పటివారు? వెలిగందల నారయతో సమకాలికులా? నారయకుఁ గూడ తరువాత నున్నవారా? నారయకుఁ గూడ తరువాత వారైనచో, పంచమ, షష్ఠసంథములను నారయ రచింపక యేల విడిచిపెట్టెను? నారయతోఁ

ే సమకాలికులై శిథిలభాగములను ముప్వు
ు బంచుకొని పూరించి యుండిరా? షష్ఠ
ంథము ‍లో సింగనకవి, పూర్వకవిస్తుతిలో
ాథునిఁ బోతనామాత్యునిఁ గూడఁ బేర్కొని
ండుటచే నాతఁడు పోతనకును, నారయకును
ే తరువాతి వాఁడని తోఁచుచున్నది. నాకుఁ
ే భాగవతమును బూర్తి చేయకుండఁగనే
ిన భగవంతునితో నైక్యముఁ జెందెననియు,
లిన భాగము నాతని ప్రియశిష్యుఁడు నారయ
ంచెననియు, నేకారణముననో పంచమషష్ఠ
ంథములు భ్రష్టములుకాగా, గంగన సింగ
తరువాతఁ బూరించియుండిరనియుఁ దలంచు
ు, సమంజసముగాఁ గన్పట్టెడిని ఇదియే నిజ
ంచో, సర్వజ్ఞ సింగయభూపాలుఁడు నిర్దోషి
ుయే యెంచఁదగి యున్నది.

ర్వజ్ఞసింగయ భూపాలుఁడు స్వయముగఁ బండి
ుడు. సంస్కృతాంధ్రికవి, పండిత పోషకుఁడు.
ుభర్త. సింగభూపాలీయ మను సంస్కృత
ంథమును గృతి నందియుండెను. ఇట్టివాఁడట్టి
ంకార్యము నొనర్చునా? తననుగూర్చి
కము, పారంపర్యముగ నేమి యనుకొనునో
ు యాలోచింపకుండునంతటి మూర్ఖుఁడా
ాతఁడు? కానేరఁడు. కాఁజాలఁడు. కాఁడు.
నిపై నేరస్థాపనముఁ జేయుటకు ముందాతని
వర్తనము నాతని స్వభావమునుగూర్చి కూడ
ాలోచింప వలసియున్నది.

ిన మహాకవి నరకృతి విముఖుఁడు కావ
ును. కాని రాజులను ద్వేషించు స్వభావము
వాఁడు కాఁడు. ఆతఁడు రచించినదని చెప్పెడు

"ఇమ్మనుజేశ్వరాధముల కిచ్చి
పురంబులు వాహనంబులున్
సొమ్ములు కొన్ని పుచ్చుకొని చొక్కి-
శరీరము వాసి కాలుచే
సమ్మెట వ్రేటులంబడక సమ్మతి
శ్రీహరి కిచ్చి చెప్పె నీ
బమ్మెర పోతరాజొకఁడు భాగవతంబు
జగద్ధితంబుగన్."

అను నీ పద్యము ప్రక్షిప్తమని నా యభిప్రాయము. సరస్వతీ ప్రార్థనసందర్భమున "శారద" మొదలుగా రెండు పద్యములు ప్రక్షిప్తములని ముద్రితప్రతిలోఁ బీఠికాకారులు నుడివియున్నారు. అట్లే భాగవతమందలి యీభాగమును శ్రద్ధతోఁ జదివినవారికి "ఇమ్మనుజేశ్వరాధముల" అను పద్యమును దీని తరువాతనున్న "చేతులారంగ" అను పద్యమును "అని మఱియు" అను వచన భాగమును బ్రక్షిప్తములనియు, సందర్భానుగుణముగా లేవనియుఁ దోచునని నా యుద్దేశము. "బాలరసాలసాల నవపల్లవ" అనుపద్యము పోతన రచియించినదికాదు. కేయూరబాహు చరిత్రము నందు 'మంచన' మహాకవి రచియించినది. ఈ మంచనకవి పోతనామాత్యునికంటెఁ బ్రాచీనుఁడు. "ఇమ్మనుజేశ్వ రాధములకిచ్చి" యను పద్యములో "నీ బమ్మెర పోతరా జొకఁడు" అని ప్రథమపురుషలో నుండుటచే నాతనిఁగూర్చి రచియించిన యెవరి పద్యమునో యిటీవలివారు భాగవతమునఁ జేర్చియుందురు. పోతన,యల్పభోగముల కాసించి కృతిని నరాంకితము సేయుట కంటె, మోక్షాసక్తుఁడై భగవంతునకుఁ గృతి సేయుమని చెప్పునుగాని, నరాంకితము సేయుట, యమధర్మరాజుచే సమ్మెటవ్రేటులు పడవలసి వచ్చునంతటి మహాపాపకార్యమని నిర్ణయించునా? అదియంతటి పాపకార్యమని, యే ధర్మ

శాస్త్రములలోఁ జెప్పియున్నది? ఈ పద్యము ప్రక్షిప్తమనుట కిదియొక కారణము.

రాజద్వేషమును జూపని మహాభక్తాగ్రేసరుఁడగుపోతనకవి రచియించినయుత్తమ గ్రంథమును దనకుఁ గృతియివ్వలేదను నెపమున భూమిలోఁ బాతించునంతటి హీనునిఁగా సర్వజ్ఞ సింగయ భూపాలునిఁదలంచుటకాధారములు లేవనియును, కేవల జనశ్రుతి నాధారముగాఁ జేసికొని యాతని పైనట్టి నేరస్థాపన మొనర్పఁ దగదనియు, నా మనవి.

ఈ యపకీర్తి తిమ్మకవిచే గ్రంథస్థమై యిప్పుడు చలనచిత్రరంగమున నాట్యమొనర్చుచున్నది. ఇందుకొఱకుఁ బోతనకవి యొక్కయు, భూపాలుని యొక్కయు, నాత్మలు మిక్కులఁ బరితపించుచుండునని తలంపవలసి యున్నది.

న్యాయవిచారణకై ధర్మాసనము నధిష్ఠించి, పైనవ్రాసిన విషయముల నన్నిఁటిని బరిశీలించి సర్వజ్ఞసింగయభూపాలునిపై నారోపింపఁబడిన ఈ నేరమునుండి యాతనిని విముక్తునిఁజేయ వలయునని యాభూపాలుని పక్షమున నే నీ వినతిపత్రము నాంధ్రపండిత లోకమున కర్పించుచున్నాఁడను. సత్యాన్వేషణకై, తమకడనున్న యుక్తిసాధనములఁగనఁబఱచుచుఁ, బండిత లోకము నెదుర సాక్ష్యమొసంగఁ గుశాగ్రబుద్ధులగు సజ్జనులు ప్రయత్నింతురుగాక!*

△

## గ్రంథాలయము

శ్రీ పిఱపాటి చిదంబరశాస్త్రి

సీ. భవ పాలతాసమున్మేషకరమంబున, కాలవాలంబు గ్రంథాలయంబు
కవిజన వ్రాత కాంతపరిస్ఫూర్తికిఁ, గాళీవరంబు గ్రంథాలయంబు
సాంఘిక విద్యార్థి చాతకశ్రేణికి, నీలమేఘంబు గ్రంథాలయంబు
జాతీయ ధర్మ ప్రభాతకాలమునకు, బాలాతపంబు గ్రంథాలయంబు
గీ. సకలవేదాంత సిద్ధాంత సారబోధ, కనుపమాచార్యకంబు గ్రంథాలయంబు
ధాత్రి దేశాభివృద్ధి సంధానమునకు, లాలనీయాగమంబు గ్రంథాలయంబు.

---

* న్యాయవిచారణయందు సింగయప్రభువు నిర్దోషియని స్థిరపడియెనేని,

1 యాసత్యమును నిస్సంశయముగఁ బ్రకటించుటకును,

2 తమ యధికారమునకు లోఁబడిన విషయమగునేని చలనచిత్ర ప్రదర్శనము నాపుటకై శాశ్వతమగు నాంక్షయొసంగుటకును, బండిత లోకమును బ్రార్థించు చున్నాఁడను.

# ఏకభాష—ఏకలిపి

శ్రీ ఉన్నవ రాజగోపాలకృష్ణయ్య

జిహ్వాకొకరుచి. బుర్రకొకబుద్ధి. ఈశ్వర సృష్టిలోనే అడుగడుగుకు నీభిన్నత్వము గోచరించు చున్నది. ఈ సృష్టి యంతటిలో ఒకనికి పోలిన మనిషి మరొకడు గోచరించు చున్నాడా? ఇక ఒకడిరుచి మరొకని కెట్లు రుచించును? ఒకని బుద్ధి ఒక్కని ఆలోచనలు మరొకనితో ఎట్లు ఏకీభవించును? ఈ బాహ్యముగా గోచరించు భిన్నత్వమే ఆంతరంగిక తత్వములో గూడ గోచరించు చున్నది. అట్లని భిన్నత్వమే సృష్టియొక్క లక్షణమని నిర్ణయింతుమా? కాదు. ఈభిన్నత్వములోగూడ ఏకత్వము గోచరించు చున్నది. అందు ముఖ్యముగ మానవుడు ఏకాకిగ ఒక్క క్షణమైనను జీవింప జాలడే! మానవుని బ్రతుకంతయు పరస్పర సహకారము, సమన్వయముతోడనే కూడి యున్నదే. ఈ భిన్నత్వములోనే ఏకత్వమున్నది.

అనాది కాలమున ఆది పురుషుడు తన మనోభావమును ఒక సాంకేతిక పదమున ఒకభాషలో వ్యక్త పరచిననూ ఆభాష రానురాను కాల క్రమేణ జనసంఖ్య వృద్ధియైన కొలది దేశకాలముల భేదముతో అనేక రూపములు చెందుచూ వచ్చుచున్నది. భాషాస్వరూపమునకు ఎప్పుడును నిలకడ ఉండదు. అది అనేక రూపములు పొందుచు నూతనపదములను ఇతర భాషాపదములను గూడ తనలో చేర్చుకొనుచూ వికాసము పొందును. భాషా స్వరూపమును శైలిని ఏర్పరచువారు జనసామాన్యము గాని, పండితులు వైయ్యాకరణులు కారు. భాషాస్వరూపమును బట్టి వ్యాకరణ వేత్తలు పండితులు కొన్ని నియమములు ఏర్పరచు చుందురు. కాని ఎల్లప్పుడును గ్రాంథిక భాషకును గ్రామ్య వ్యావహారి భాషకును భేదముండును. ఈ భేదము మితిమీర నంతవరకు గ్రామ్య గ్రాంథిక భాషలకు సామంజస్యము కుదురును. వ్యావహారిక భాషా ప్రచారము ననుసరించి దాని కనుకూలముగా సాహిత్య పరులు పండితులు గ్రాంథిక భాషలో మార్పు తెచ్చిన సరియే. రెంటికిని సమన్వయము కుదురును. భాష పరిశుద్ధత చెడునని తలచి కాలాను సరణముగా వచ్చు మార్పులకు పండితులు అంగీకరించక పోయినచో గ్రాంథిక భాష జన సామాన్యముకు సంబంధము లేని భాషగా ఉండిపోయి క్రమేణ క్షీణించును. అందుకనియే ఒకప్పుడు జనసామాన్య వాడుక భాషగా ఉన్న వైదిక భాష సంస్కృత భాషలు గ్రాంథిక భాషలుగ మాత్రముగానే నిలిచి పోయినవి. ఆ భాషనుండి ఉద్భవించిన 'పాలి' మొదలగు దేశీయ భాషలు భిన్నభిన్న రూపములు పొందినవి. ఈ పరిణామము తప్పదు - జరుగవలసినదే, జరుగుచున్నది.

భారతదేశము సృష్టిలో అసమానమైన విచిత్ర దేశము. ఇది భిన్నత్వమునకు పుట్టినిల్లు. ప్రకృతి సిద్ధమగు భిన్న భిన్న ఋతువులు,, శీతోష్ణస్థితులు, వివిధములగు వృక్షసంతతి, అనేక విధములగు జంతుజాలములు గలవు. సర్వమతములకు, సంప్రదాయములకు, ఆచార వ్యవహారములకు, అనేక భాషలకు నిలయము. ఇట్టి ఈ దేశము ప్రకృతి సిద్ధముగనే ఏకఖండముగ వెలయుచున్నది. ఈ దేశము అనాదికాలము నుండి ఒకప్పుడు ధార్మిక కారణముచేత నైతేనేమి, మరొకప్పుడు రాజకీయముగ నైతేనేమి ఏకఖండముగనే వెలయుచున్నది. ప్రాచీన భార

తీయ విజ్ఞానము ఒకటియే భాషాభేదములచే అనేక ప్రాంతములుగ విభజింపబడి యున్నను, ధార్మిక బంధముచే అన్నిప్రాంతములు కట్టువడి యున్నవి. పురాణయుగమునాటి శ్రీరామ చంద్రుడు నేటికిని ఆ సేతు హిమాచల పర్యంతము ఆరాధింపబడుచున్నాడు. సీతారాములు భారతదేశీయు లందరికి ఆదర్శప్రాయులే. మూడు, నాల్గు వందల సంవత్సరముల క్రిందట జన్మించిన మహాభక్తులు, మతకర్తలు, కబీరు, నానక్, తులసీదాసు, రామదాసు, నందనార్, శంకరాచార్యులు, మధ్వాచార్యులు, రామానుజాచార్యులు, వల్లభాచార్యులు మొదలగు మహనీయులందరు భారతదేశీయులందరికి పూజనీయులే. ఇక్కడ జాతి మత విచక్షణలకు తావు లేదు. ఆ మహానుభావులను అన్ని జాతుల వారు,అన్ని ప్రాంతములవారు సమానఆదరణతో పూజించుచున్నారు. ఇక; కాశీ, రామేశ్వరము, హరిద్వారము, ద్వారక, పూరి, బదరీనారాయణ, ఈ పవిత్రతీర్థస్థానము లందరు సేవించునవియే గదా? ఈ విధముగ భాషాప్రాంత భేదము లున్నను ఒక ధార్మిక సంబంధముచే భారతీయు లందరు కట్టుబడియున్నారు. ఆ యుగములో వైదిక, సంస్కృత భాషలు పండితులకు సామాన్యభాషగ, ఏకభాషగ వెలయుచుండెడివి. ప్రస్తుతయుగములో విజ్ఞానము (సైన్సు) అభివృద్ధిచెంది విమానములు, స్టీమర్లు, రైళ్లు, మోటార్లు, తంతులు, రేడియోలు, టెలిఫోన్లు మొదలగు సాధనములచే దూరము దగ్గర అను భేదముపోయి ప్రపంచమంతటను అందు ముఖ్యముగ భారతదేశమంతటను సన్నిహిత సంబంధమేర్పడు చున్నపుడు భారతవాసు లందరకు ఏకభాష ఉండుట అత్యవసరము. సామాన్య భాషాస్థానమునకు హిందీ - హిందుస్థానియే తగియున్నదనియు నిర్ణయింపబడి దాని ప్రచారము ముఖ్యముగ దక్షిణ భారత దేశమందు విరివిగా జరుగుచుండుట ఎల్లరెరిగినదే. హిందీ - హిందూస్థానీయే ఏకభాషగా అంగీకరించుటకు అనేక కారణములు గలవు. ప్రస్తుతపు సుమారు 40 కోట్ల జనసంఖ్యలో సుమారు 18 కోట్లు మాతృభాష గలవారును 8 కోట్లు అర్థం చేసుకో గలవారును మొత్తం 26 కోట్ల మంది ఈభాషను వ్యవహరించుచున్నారు. ఉత్తర హిందూస్థానములోని బీహారు, సంయుక్త పరగణాలలో వారికి ఇదిమాతృభాష. 10 కోట్లు మహమ్మదీయులు మాట్లాడే భాష యిది. ఇతర ప్రాంతములలోగూడ నీభాష కొలదిగనో ఎక్కువగనో వాడుకలో ఉన్నది. భారతదేశములోని ఏ కుగ్రామమునకు వెళ్ళినను హిందూస్థానీ నేర్చినచో తనపని నెరవేర్చుకోవచ్చును. భారతదేశములోని ఆంధ్ర, అరవ, కర్నాటక మలయాళ, బెంగాలీ, గుజరాతీ, మహారాష్ట్రము మొదలగు ప్రాంతములలోని ఏ కుగ్రామములోనైనను కనీసము ఒకరిద్దరైన హిందూస్థానీ నేర్చినవారు లభించగలరు. కాని గుజరాతీ భాషగాని, బెంగాలీభాషగాని, మహారాష్ట్రంగాని, అరవం గాని నేర్చినవారు మన ఆంధ్రదేశములోనే ఎన్ని గ్రామములలో ఎంతమంది ఉన్నారు? లెక్కకైనా కానరారు. కాని హిందూస్థానీ నేర్చినవారు అనేకమంది అన్ని పట్టణములలోను పల్లెలలోను గలరు. ఇదేవిధముగ అన్ని ప్రాంతములలోనుగలరు. ఈభాషను నేర్చుకొనుటకూడ సులభమే. ఇన్ని కారణములచేతనే ఈభాష సామాన్యభాషగ నుండదగినదని నిర్ణయించి ప్రచారము చేయుచున్నారు.

### మాతృభాషలకు హానియా?

హిందూస్థానీ ప్రచారమువలన మాతృభాషలకు హాని కలుగునని తలంచుట భ్రమ. మాతృభాషల స్థానమున ఇది ప్రచారము చేయబడుట లేదు. ప్రథమస్థానము మాతృభాషదే. రెండవ స్థానమే సామాన్య భాషది. ప్రాంతములోని వ్యావహారిక భాష, ఆ యా ప్రాంతపు మాతృభాషయే. అంతర్ప్రాంతీయ భాషయే హిందూస్థానీభాష. మన భారతీయ నాగరికత, సాహిత్యము, విజ్ఞానము ఒక విలక్షణమైనది. భారత దేశపు వివిధ ప్రాంతములలోని నాగరికతను, సాహిత్యమును, విజ్ఞానమును, సమన్వయ పరచుట ఏకభాష లేనిదే సాధ్యము కాజాలదు. ఏకభాషవలన భారతీయ సాహిత్యము పెంపొందగలదు. ఈభాష మాధ్యమముగా ఇతర ప్రాంతములలో అభివృద్ధిచెందుచున్న సాహిత్య విజ్ఞానమును గ్రహించుటకును, దానిద్వారా తమ తమ మాతృభాషలనుకూడ పుష్టి చేసుకొనుటకును మంచి అవకాశము కలుగును. కనుక ఏక భాషా ప్రచారమువలన మాతృభాషలకు హాని లేకుండుటయేగాక చాల మేలు కలుగును. అభివృద్ధి చెందుటకు అవకాశము లభించును.

### ఏకభాషాస్వరూపము - శైలి

సామాన్యభాష రాష్ట్రభాష స్వరూపమును శైలిని నిర్ణయించుటలో భిన్నాభిప్రాయములు గలవు. ఒకప్పుడు హిందీ - ఉర్దూభాషలకు నామమాత్ర భేదముండెడిది. ఒకే భాషను హిందువులు దేవనాగరి లిపియందును, మహమ్మదీయులు ఫారసీ లిపి యందును, వ్రాయుచుండెడివారు. లిపిభేదముచేతనే హిందీ, ఉరుదూ అని పిలువబడుచుండెడిదేకాని భాష శైలిమాత్రము ఒకటే - ఈ రెండులిపులలో వ్రాయు భాషను హిందుస్థానీ యని వ్యవహరింపవచ్చును. కాని నేడు హిందూ మహమ్మదీయ భేదముతోపాటు నామమాత్రభేదముగల హిందీ - ఉరదుభాషలు భిన్నభిన్నమార్గముల నడచుచున్నవి. హిందువులు హిందీని సంస్కృత పదభూయిష్ఠముగను, మహమ్మదీయులు ఉర్దూను, ఫారసీ, అరబ్బీపద జాలముతోను నింపి జనసామాన్యమునకు అర్థము గాని నూతనశైలిని సృష్టించుచున్నారు. మూడు నాలుగు వందల సంవత్సరముల క్రిందట గూడ సుప్రసిద్ధమహమ్మదీయ కవులు మహమ్మద్ మాలిక్, జాయసీ, కబీరు, ఖానఖానా, రహీము మొదలగువారు సులభశైలిలో గ్రంథములు రచించి ఆ భాషను హిందీయనియే వ్యవహరించిరి. ఆకాలమున వ్యవహారములో ఉన్న హిందీ భాషనే మహమ్మదీయ సైనికులు ఫారసీ, అరబ్బీ శబ్దములు కలిపి మాట్లాడుటచే ఆభాషకు ఉరుదూ అను నామము వచ్చెను. ఉరుదూ అనగా సైన్య సిబిరము - సైన్య శిబిరమందు మాట్లాడ బడు భాష.

నేడు హిందీ - ఉరుదూ యందు గోచరించు ఈ విభేదము సాహిత్యమందు, గ్రంథములందు గోచరించునే గాని ఉత్తరహిందూ స్థానములో హిందూ మహమ్మదీయ జన సామాన్యము మాట్లాడు భాషయందు గోచరించదు. కాని ఒక్కొక ప్రాంతపు భాషాశైలి మరొక ప్రాంతమున ఉండదు. ఢిల్లీ, ఆగ్రా, లక్నో ప్రాంతపు శైలివేరు. కాశీ, ప్రయాగ ప్రాంతములో జన సామాన్యము మాట్లాడు శైలివేరు. ఆ యా ప్రాంతములోని హిందూ మహమ్మదీయులు సర్వసాధారణముగ ఒకే శైలిలో మాట్లాడుదురు.

మన తెలుగు భాషమాత్రము వివిధ జిల్లాలలో

వివిధరూపములను పొందలేదా? గంజాం విశాఖ పట్టణం జిల్లాలలో మాట్లాడు తెలుగుకును; అనంతపురం, బళ్ళారి జిల్లాలలో వ్యవహరించు భాషకు; నెల్లూరు, చిత్తూరు జిల్లాల భాషకును; గోదావరి కృష్ణా జిల్లాల భాషకును; ఎంతవ్యత్యాసము గలదు;- దేశకాల భేదములచే భాషలో ఈ విభేదము తప్పదు. కనుక భారత దేశ మంతటికి సంబంధించిన హిందూస్థానీ భాషా స్వరూపము శైలి అవి ఏకొలదిమంది పండితులో, కవులో నిర్ణయింప జాలరు. కాలక్రమేణ జనసామాన్యముచేతనే శైలి నిర్మాణము కావలసియున్నది. ఈభాషలో అన్ని ప్రాంతములలోని శబ్దములు చేరవలసి యున్నవి. ఒకభాషలోని శబ్దము మరొక భాషలో చేరినచో ఆ భాష పరిశుద్ధత చెడునని తలచుట భ్రమ. ఏభాష అనాది కాలమునుండి ఒకేరూపమున ఇతర భాషా శబ్దములు కలియక పరిశుద్ధముగ నున్నది? మన తెలుగు భాషలోనే ఎన్ని ఆంగ్ల, హిందుస్థాని శబ్దములు చేరినవో గమనింపుడు! ఈ శబ్దములును మన భాషలో చేరకుండ వానిని జనసామాన్యము ప్రయోగించకుండను ఎవరైనా అరికట్టగలరా? అసంభవము. పాశ్చాత్యనాగరికత, భాషతో ఏమాత్రము సంపర్కము లేని శ్రోత్రియ కుటుంబమునకు చెందిన ముసలమ్మగూడ టైముఎంత అయింది; మా అబ్బాయికి స్కూలుకు, మావారికి ఆఫీసుకు వేళఅయింది అంటున్నది. మీటింగు, కోర్టు, గ్లాసు, ఫీజు, కమీషను, పరిమిషన్, మార్కెట్టు, అరెస్టు మొదలగు అనేక ఆంగ్ల శబ్దములను ఉపయోగించుచున్నది. మనము నిత్యము ఉపయోగించు హిందుస్థానీ శబ్దములకు హద్దేలేదు. కచ్చేరీలో వ్యవహరించు శబ్దములన్నియు హిందుస్థానీ పదములే. దస్తావేజు, దస్కతు, నిశాని, ముద్దాయి, దావా, అసలు, ఫాయిదా, జరిమానా, అమానతు, జహూరు, కిస్తీ, వసూలు, సిఫాయి, జమా, బందీ, బందిఖానా, జయిలు ఖానా, చోరీ, షరీకు, పహరా, ఈనాము, నజరానా మొదలగు శబ్దజాలమంతయు హిందూస్థానీయే గదా! మనఆంధ్రులు హిందూస్థానీని బహిష్కరించవలయునన్న, టోపీ, లుంగీ, లంగా, ధోతి, జేబు, బులాకీ, బేసరి, పాంజేబు, బాజుబందు, పట్టీ, జూకాలు వదలి వేయవలెను. ఆంధ్రులెవరును, పకోడీ, బూందీ, హల్వా, జిలేబీ, చపాతీ, రోటీ, పూరీ, లడ్డూ, దోసె, మిఠాయి తినగూడదు. ఆంధ్రత్వమును కాపాడవలయు నన్నచో, గారె, బూరె, అరిసె, పెసరట్టు మాత్రమే భుజింప వలయును. సన్నాయి, డోలు, తబలా, పల్లకీ, కంజరా ఉపయోగించ కూడదు. కిటికీ, దరవాజా, కలమ్‌దాను, పాన్‌దాను, అత్తరుదాను లను బహిష్కరించవలెను. ఇక ఆంధ్రులు, దబాయించటం, టలాయించటం, ఫురమాయించటం, సతాయించటం, అటకాయించటం, బతాయించటం, జబర్దస్తీ చేయటం, హుకుం చలాయించటం, మానివేయవలెను.

భాషాశుద్ధత్వమును, ఇతర భాషాశబ్దములు కలియకుండా కాపాడవలయుననికాని, కాపాడగలుగుదు మనికాని, భావించుట పొరపాటు, ఏభాషకును శుద్ధత్వమను నదిలేదు. భాషాప్రవాహమును అరికట్టుట ఏరికిని సాధ్యముకాదు. అఖిల భారత దేశమునకు కావలసిన సామాన్య భాషా స్వరూపము కాలక్రమేణ ప్రాంతీయ భాషా శైలిభేదములతో ఏర్పడ నున్నది. ఇప్పుడుజరుగుచున్న రాష్ట్రభాషా ప్రచారము దానికి నాంది మాత్రమే.

## ఏ క లి పి

సామాన్య భాషా నామకరణమందు, భాషాస్వరూపము, శైలి విషయమందే ఇన్ని భేదాభిప్రాయములు లున్నపుడు -- ఏకలిపిని నిర్ణయించి దానిని ప్రచారములో సాఫల్యము పొందుట తేలికైన పనికాదు. మన దేశములో భాషా ప్రచారమే చాలతక్కువ. నూటికి ఎనుబది మంది నిరక్షరాస్యులే యున్నారు. వారికి ఏ లిపియును రాదు. జనసామాన్యమందరకును తమతమ మాతృభాషలకు గల లిపియును, సామాన్య భాషకు సంబంధించిన లిపియును, రెండు లిపులు నేర్చుట కష్టసాధ్యము. కష్టసాధ్యమేకాదు. అసాధ్యముకూడను. అన్ని ప్రాంతీయ భాషల లిపికి మారుగ సామాన్య భాషా లిపినే ఆ యా ప్రాంతములలో ప్రచారము చేయుచో జన సామాన్యమునకు రెండు లిపులు నేర్చుకొన వలసిన మహాభారము తొలగును. కాని ఏప్రాంతమైనను తమప్రాంతపు తమమాతృభాషకు ఉపయోగింపబడు లిపిని వదలుకొనునా? దానికి కాలము పరిపక్వము కావలయును. ప్రాంతీయాభిమానము, ప్రాంతీయ లిపి మమకారము తొలగవలెను. ఈ పరిణామము చిత్త సంస్కారము ఎప్పటికి కలుగునో ! అంతవరకు ఏకలిపి, ఏకభాష, ఐక్యతకు మధనపడవలసినదే. దేశభాషల లిపు లన్నిటిలోను దేవనాగరి లిపి ఎక్కువ ప్రచారములో నున్నది. ఈ లిపి నేర్చుకొనుటయు సులభము. ప్రాంతీయభాషల వర్ణక్రమముకూడ దేవనాగరీ లిపియొక్క అ ఆ ఇ ఈ అక్షరక్రమమున నున్నది. ఈ వర్ణక్రమము భారతీయులందరకు పరిచయమే. ఉచ్చారణ దృష్టితో చూచినచో తెలుగులిపియే అన్ని లిపులకంటె శ్రేష్ఠమైనదనుట కెట్టిసందియము లేదు. ఎ, ఒ, చ, జ, ఱ, మొదలగు అక్షరములు దేవనాగరిలిపి యందు లేవు. అయినను కొన్ని గుర్తులనుచేర్చియు, ఆ లిపిని కొంత సంస్కరించియు పరిపూర్ణమగు లిపిగా చేయవచ్చును. ఈ మహారాష్ట్రి, హిందీ, సంస్కృతభాషలు దేవనాగరి లిపి యందే వ్రాయబడుచున్నవి. బెంగాలీ, గుజరాతీ లిపులుగూడ తెలుగు, కన్నడ లిపులవలె కొలది భేదముతో దేవనాగరి లిపిని పోలి యుండును. కనుక సర్వవిధముల దేవనాగరి లిపి ఏకలిపిగా వ్యవహరించుటకు తగియున్నది. ఈలిపి టైపునకు, టెలిగ్రాములకు అచ్చుకు అంతగా అనుకూలముగా లేదు. రోమనులిపియందు గల విశేషగుణము ఇది ఒకటి మాత్రమే. రోమనులిపిలో ఉచ్చారణకు తగినన్ని అక్షరములు లేవు. అది పూర్ణమైన లిపికాదు. భారత జనసామాన్యమునకు అందు బాటులో లేదు. భారతీయ భాషల వర్ణమాలకు దీనికిని పోలికయే లేదు. కనుక భారతీయ ఏకలిపిగా అంగీకరించుటకు ఇది ఎంత మాత్రము తగినలిపి కాదు.

భారత దేశమునకు ఏకభాష, ఏకలిపి ప్రచారము అత్యవసరము. హిందుస్థానీ భాషయే సామాన్య భాషా స్థానమును అలంకరించుటకు సర్వవిధముల తగియున్నది. దేవనాగరీ లిపియే సామాన్య లిపిగా ప్రచారము చేయుటకు అనుకూలమైనది. ఈ సామాన్యభాష సామాన్యలిపి ప్రచారము వలన మాతృభాషలు, భారతీయ సాహిత్యము గూడ పెంపొందగలవు. ఈ భాషా ప్రచారము దక్షిణ దేశములో ప్రారంభమైన గత 25 సంవత్సరముల నుండి ఆంధ్రు లీ ఉద్యమ ఆవశ్యకతను గమనించి ఉద్యమ వ్యాప్తికి తోడ్పడుట చాల సంతోష కరమగు విషయము. భారత జాతీయ పునర్నిర్మాణములో ఆంధ్రులు తమ కర్తవ్యమును నెరవేర్చినారను యశస్సును సంపాదింతురుగాక.

# 'కవిబ్రహ్మ - కవిత్వదీక్ష'

శ్రీ కొత్త సత్యనారాయణ చౌదరి

'తింటే గారెలే తినవలె; వింటే భారతమే వినవలె' అన్న నానుడి తెలుఁగు నాటదిగాని యావద్భారతముది గాదని భావింతును. వేదవ్యాసుల కవితా మహిమకు లోపమారోపించుట కాదు కాని భారతము తెలుఁగు సంస్కృతములు రెండింటిని ఇరుగేలఁబట్టి అరసినచో పాత్రౌచిత్యము - స్వభావోక్తి-ఉక్తిచాతుర్యము,కవితా, కళ, మున్నగు నెన్నికగన్న కొన్నింట తెనుఁగు భారతమే మిన్నయని అన్నవారు పెక్కురు కలరు. తెలుఁగు మీఁది యభిమానమున వెలసిన అర్థవాదమే ఇది యందురేమో! ఏదీ! వాల్మీకులను తెలుఁగునాఁట ఈ నాఁటివఱకు మఱపింపఁ గలిగిన తెలుఁగు కవి యెవఁడు కానోపు! కాళిదాసుని కవితావైభవము కాదన్న వైఖరి తెలుఁగులో కలదని ఏదీచూపుఁడు! పోతన్న తెలుఁగున భక్తిరసమును పోఁతవోసెనన్నచో తెలుఁగు భాగవతమునకు వెలుగు కలుగలేదా! అందుకే కొందఱు ఈ తీరుగ తీర్పొసఁగిరి:—

'వ్యాసభారతము ఒక అమూల్యమగు బంగారు ముద్ద. అందులో అక్కఱగల ముక్కలు ఏఱి చిత్రవిచిత్రములగు నగిషీలు నాజూకుగ సంతరించి వలసిన నాణెమగు నగలుగ తెలుఁగులకు తెలుఁగు భారతమును కవిత్రియము ప్రసాదించి యిచ్చిరి, కావున తులసీదాసు రామాయణమున, పోతన భాగవతమున, కవిత్రియము భారతమున అనువాదములో 'విశిష్యతే' యని పేరుమోసిరి.

అగ్నిత్రియము లోకత్రియము గుణత్రియము మునిత్రియమువోలె తెలుఁగునాట 'కవిత్రియము' ఒక రూఢికెక్కినది. సర్వకాలము సార్వజనీనము సర్వాంగపరిపుష్టము కావుటను కవిత్రియము వారి కవిత నిత్యనూత్నము నిరంతర వికాసభాసురము అయివెలయుచున్నది. ఒకానొకరు అన్నట్లు కవిత్రియము వారి కవితా వైఖరికి కావ్యార్థసూచన ఆదిపర్వమున ఆదిపద్యములోనే ప్రోదిసేయఁబడినది.

'శ్రీ వాణీ గిరిజా శ్చిరాయ దధతో' - ఇత్యాది
అందు వాణీపతి బ్రహ్మ.

ఇందు తిక్కన కవిబ్రహ్మ. ఇతని కవితా ప్రపంచము అనంతము. ఇతని 'వాణికి' తెలుఁగుదనము మాధుర్యము దక్కినవి. వాణికి బ్రహ్మ మొగము నెలవఁట, కవిబ్రహ్మ భారతవాణికి 'విరాట' ప్రారంభము ముఖము.

వేదాల జోలికి పోరానివారికి-సంస్కృతి చక్కగా అంటనివారికి, ఉపనిషత్సారము వేదాంత భండారము ఇదియని భారతమును పూర్వులు ప్రపంచమునకుచూపిరఁట. వేదములు నాలుగింటికి వెనుక పంచమవేదము భారత మనుటలో - ఇదియే యూహ. ఆదిమునియగు వేదవ్యాసుఁడు చేసిన వేదమువంటి విశ్వజనీనమగు భారతమును తెలుగులో తెచ్చుటకు అప్పటి దేశపరిస్థితులు రాజకీయములు మతప్రవృత్తి ప్రధాన కారణములయి యుండును. నిర్వచనోత్తరరామాయణమును వ్రాసిన తిక్కన 'తిక్కశర్మ'యై 'సోమయాజి'యై భవ్యపురుషార్థ తరువునకు భారతము పక్వఫలముగా భావించి అద్దాని తెనుఁగు బాసలో వినిర్మించి వైదికమార్గనిష్ఠమగు వర్తనమే నిర్వహించినాఁడు. గీతాశాస్త్రము తెలుఁగున తెచ్చుటలో 'సోమయాజులకు' రుచింప లేదను

టకు వైదికనిష్ఠయే హేతువు కావచ్చును. అయితే కేవల వైదిక ధోరణినే అనుసరింపక తిక్కన మున్నగుడి మతములను లెక్కచేయక ‘ఉభయకవి మైత్రి’ అందుకొన్నట్లు ‘విష్ణురూపాయ నమశ్శివాయ’ అనుచు విశిష్టమార్గమున కిష్టపడినాడు. ‘సకల భువన రక్షణ ప్రభువులై యాద్యులైన హరి హర హిరణ్యగర్భ పద్మోమా వాణీపతుల’ను— ఆదికవి నన్నయభట్టారకులు అర్చించియుండ హరిహరరూపమగు ‘పరతత్త్వ’మును సోమయాజులు స్తుతించెను. భక్తిప్రపత్తులమాట యటుంచి కేవల రణరంగ గాథలకు మురిసిపోయి ‘అస్మదీయ వంశమున బ్రసిద్ధులైన పాండవేయుల చరిత్రము నాకు వినంగ నభీష్ట’మని చాళుక్యమహీపతి యానతీయ నాతనిపేర నన్నపార్యుఁడు తెలుగు సేత కుపక్రమించెను. రాజులకొలువులో రోజులు కడపువాఁడెయయ్యు తాను వ్రాయు ప్రబంధమండలికి అధినాథుఁడగు పురుషుఁడెవ్వఁడా యని కవిబ్రహ్మ ఆరాటపడెను. నిద్రలోవచ్చి జనకుఁడు వాత్సల్యము చూపుట, కర్తవ్య మిద్దిగదా యని కలుపుట తెలుఁగున కిదియొక క్రొంగొత్త. ‘ఈదృశంబులగు పుణ్యప్రబంధములు దేవసన్నిధిం బ్రశంసించుటయు నొక్క యారాధన విశేషం’బని వృత్తాంతములు ముచ్చటించుటయు కవిబ్రహ్మ జీవితమునకు ఘనత కూర్చినది.

మహితాత్ముఁడగు నన్నయభట్టును ఆంధ్రకవిత్వ విశారదుండని విద్యాదైతుండని సోమయాజులు స్తుతించినను తాను త్రొక్కిన త్రోవకు తెలుఁగు దనమును మఱువక విశిష్టతను జూపెను. నన్నపార్యుని కైతలో లాంతులు ‘అక్షర రమ్యత’ నాదరించిరన్న గీర్వాణ వాణికి మెచ్చు వచ్చినదని భావము. ఆనాఁటి కాత్రోవయే అమితమగు హితము ఆపాదించి యుండవచ్చును. కాలము గడచిన అభిరుచులు మారి తెలుఁగు కవితకు ఒక విశిష్ట యేర్పడి పలువుర మోత్రలను వన్నెచిన్నెల ప్రచరింపఁ దొడఁగెను. కేవలము ‘గీర్వాణము’ బలసి ‘తెలుఁగుబాసను’ ‘శూద్రము’గా భావించి ఉప్పుపప్పులు కూడ ‘లవణా’ దికముగ పలికిన గాని తరింపమను తలతిక్కలు ముదిరిన మానసులకు ‘తెలుఁగు మీరుట’ను జూపిన మహాకవి తిక్కన సోమయాజి. ఆయన ఉపక్రమించిన ‘కరుణారసము పొంగి త్రొరఁగెడు చాడ్పున’

శశిరేఖ నమృతంబు జాలువాఱ

గుఱియైన చెలువున నెఱసిన లోకర

క్షణ మన్నగరళంబుచాయదోఁప

..................................................

ఎలమి సన్నిధిచేసె సర్వేశ్వరుండు’

అను సర్వేశ్వరస్తుతిలోనే కవితామృతము జాలువాఱు చున్నది.

ఒక్క ‘శాంతి’లో మాట అటుండ. తక్కిన పదునాలుగు కృతులందును తిక్కనమనీషి ఒక్కొక్క ‘పాత్ర’ను తానే వహించి రసస్ఫోరకములగు ఘట్టములను సమకూర్చుచు భారత గాథను నాటక మాడించుచు నడుపును. అందలి పాత్రలు తెలుఁగు నేల యందలివే అన్నంత ,మైకము మనకు కలిగించు కవితా రమ్యత కవిబ్రహ్మ సొమ్ము. కవితా వైభవము ప్రస్ఫుటము కావలె నన్న ఆకవి కైకొన్న ‘కావ్యవస్తువు’ కూడ మూఁడువంతులు ఉపకరించుట సహజము. నన్నయ భట్టారకుని మూఁడు కృతులలో ఈ యంశము స్ఫురించు చుండును. తిక్కన కవితకు ఇతి వృత్తపు నింపుకూడ సొంపులు పొంకిరిపో జేసినది. అదే ఆయన గొప్ప ‘అదృష్టము’

భారత గాథలో మొత్తము రాజకీయ వేత్తగ చిత్రవిచిత్ర ప్రకృతిగ శ్రీకృష్ణుని చిత్రించుటలో అనువగు ఘట్టము ఉద్యోగ పర్వము కాకమరేది? మనుమసిద్ధి మహీపాలుని కొలువులో మెలగ నేర్చిన తిక్కనమనీషి తానే సంధికోసమని పాండవుల పక్షమున కౌరవులవద్దకు పంచెనా యన్నట్లు ప్రత్యక్షరము ప్రతిబింబించును. మెత్తనపులి యగు ధర్మరాజు కార్యనిర్వాహకమున ఘనుడు కావుటను నాచ మాటలలో ఉరితేరిన కృష్ణమూర్తికే 'ఓనమాలు ఉపదేశించుటలో మొనగాడు అయినట్లు

'మమ్మెఱుంగు దెదిరి నెఱుంగుము
నెమ్మి యెఱుగు సర్వసిద్ధికెత్తి నెఱుంగుదు వా
క్యమ్ముల పద్ధతి నెఱుంగుదు
పొమ్మవ్వాడ నీకు నేను బుద్ధులు చెప్పన్'

అను సోమయాజి పలుకులలో స్ఫురించుచుండును. 'తత్ర రమ్యా శకుంతలా' యన్నట్లు పదునెనిమిది పర్వములలో విరాటోద్యోగములకు గల ఇతివృత్త సౌరభము తిక్కన చేతిలో మిక్కిలి మెఱుగెక్కినది. ఆంధ్రావనిమోదముం బొరయునట్లుగ కవిత్వదీక్షావిధి కలిగి తిక్కన గద్యపద్యములు రచించి నాడనుటలో - తెలుగుదనమును వలచిన ఆంధ్రులనికాని కేవలము తెలుగు దేశములో పుట్టి పెరిగిన ఆంధ్రులని కాదు భావము___

"గర గరగా గూడు గూరలు - గోడిగ జాతులు కొదమ పెంటులు - కొత్త ముట్టునకు - తెవుల గొంటులనైన దీర్చుట - కదుపు చేర్చుట - పసికి జాల గూర్చుట - కాళ్ల యొపిద మాడుకట్టు - పెయ్యేల దామెన - నునుసెల గోలలు - అంబోతు వంచితంబు పైగాలి వీచుట - గొడ్డునకైన జాలు నిలుచుట _ ఉంగిడి _ అదురు - త్రిక్క - కదుపు కూడు పెట్టి కట్ట జీకయిచ్చి సాకుట - నేల నాలుగు చెఱగులు - నీడపున మంచి పెట్టుట - ఆడుబుట్టువులలో బుట్టుట - అచ్చుగ బెట్టుట వెఱాము పల్లగిలుట - బ్రిదుకుచవి - వాలుగ సోగలు - వాలిక చూపులు - చిత్తుముత్తాడు - చుబ్బన మాటలు - వెంబాలు - ముట్టుపాటు - నెవ్వగలు - పలుచని రొంపులు - పిసికి పిండలు పిడిచి కొనుట - గండరించుట - గుజగుజలాడుట - వఱ్ఱొత్తుట - ఆడు కూయులు - ఆలకూయులు - రాచమాట - పగపుగ బొక్కుట - అకటిప్రొద్దు - రిత్తకు రిత్త - మాపి మగండు - చాపకట్టు - పిండిలి వండు - ఏలినవాడు - వంటలవాడు - బొమ్మ పొత్తికలు - పిచ్చుల పిడుగు - చేయాత నీకుట - తీగ దిగిచిన గతి - బాడిస నరికిన భంగి - సాంబాలుగా వ్రయ్యలు - వేల్పువచ్చిన యట్ల [గణము పెరుగుట] గజిబిజి - చిందఱ వందఱ - అఱవఱలు - వఱ్ఱుపెట్టు - పచ్చడి గలపంగ - కాలువ తక్కువ నూరలు - కౌరవసేన యేడ - ఇదియొక్క పెద్దకీడున నయ్యెంగాని - పోయి రావలయు మాకు (పోవలెను) - తలయంపి దెస—"

ఇత్యాదులు లక్షోపలక్షలు తెలుగు పలుకులు తిక్కనవి తెలుగు డెందములకు విందులు కుడుపుచుండును.

నెల్లూరు మండలము నను - కొంతకు గొంత గుంటూరు పరగణాలోను 'వాడు చేయడానికి రాలేదు; చెప్పటానికి ఒప్పుకోడు' అనుమాటలలో 'చేసేదానికి; చెప్పేదానికి' అన్న ధోరణి కద్దు: ఇదే తిక్కన్న తన ప్రబంధమున బంధించి చూపినాడు___

"ఒంటి దిరుగుదాని కోర్వడు - ఒక్కడుగు నేగెడు దానికి నోర్వను - ఇప్పుడు వచ్చిన దానికిం గతం

బెయ్యది – మూర్కొనఁ జాలెడుదానికిఁ దగు
వానిని – గర్కొన ముట్టెడుదానికిం దగన్."

ఇట్టి వ్యావహారికపు సొంపులు – ఈ రచనలో అనంతములు. అన్వయక్లిష్టత దరికి రానీయక పద్య రచనము గద్యము నడపించిన ఘట్టములు సంస్కృతములో కాళిదాసునకుఁబోలె తెలుఁగున విశిష్యములు తిక్కన్నకే కలవు.

"...'అకట ! దుశ్శా
సనుండు లోనైనవారు సమసిన చందం
బును బంధుసహితముగఁ గ
ర్ణుని గీటడఁచిన విధంబునుం జూడఁడొకో'"

ఇది సోమయాజుల కవితా పాకమునఁ బడిన అందమగు కందము.

పౌరాణికుల 'మాటల మేసురులకు' నిరంతరము అనుకూలము ప్రాణదనమను మాటయే కాన రాక పద్యమేగాక గద్యముకూడ–ఒక వింతవన్నె లీనుచుండుట తిక్కన్నకే చెల్లును. యుద్ధఘట్టమే ఇంకొకరి కవనమైనచో 'కొట్టెను, చంపెను, చచ్చెను, అని పిండితార్థము తేలుచు విసుగు కలిగించుట మన మెఱుఁగుదుము. తిక్కన పచరించిన సంగ్రామ రంగమున అంపపోటరుల వాడితూపుల వేడిగుచులే గాక నడుమ నడుమ కర్ణాదవీరుల మాటలపోటులు సైతము చవులు గొలుపుచుండును. యుద్ధరంగమునఁ గథావిధానమును పరుగులెత్తింపక యాఁచి యాఁచి తూచి తూచి ప్రతివ్యక్తికి అయ్యది ఒకానొక తలంపును ఒసంగునట్లు తిక్కన్న చక్కఁగ చిత్రించును. అభిమన్యు వధానంతరము గాంతి సుభద్రల యేడ్పులుగాని కౌరవుల యిల్లాండ్రు పతివిహీనలయి అగతికలయి దురపిల్లిన ఘట్టములు గాని ఆ పలుకులు అచ్చముగ స్త్రీ ప్రకృతి నుండియే వెలువడెనా యన్నట్లు విస్మయము గొలుపునంత స్వాభావిక సౌందర్యము చూపట్టును.

తిక్కన పూనిన కవిత్వదీక్షావిధిలో ఇది యొక లవలేశపు మచ్చుతునుక. వేదాంత బోధలోఁగాని – ఇతివృత్తమును అంతర్గర్భితముగఁ జేసికొన్న సూర్యోదయాది వర్ణనాఘట్టములలోఁగాని – కవితాపరిపాకమునఁగాని – శాస్త్రము వోలె శాసించు సరణిలోఁగాని – నైతికాసికుల కింపు నింపు భావపరంపరలోఁగని – లాక్షణికులు మన్నించు సర్వలక్షణ పక్షమునఁగాని' ఇవి ఇట్టివని తిక్కన్న త్రోవలు త్రవ్వితీచూపవలయునన్న అదియొక మహాకాయముగల గ్రంథమే యగును. ఇది దిఙ్మాత్రమని భావించి ఒక మాటమాత్రము విన్నవింతును.

తిక్కనసోమయాజి కాళిదాసును పోలుచుండును. నన్నయ భట్టారకుఁడు భవభూతిని పురుడించును.



# ఆంధ్రకవులు - కథాదృష్టి

శ్రీ వడ్లమూడి వెంకటరత్నము.

కావ్యములకు కవితా శిల్పనైపుణ్య మెంతయవసరమో కథా వైచిత్రియు నంతయవసరమే. కథా చమత్కారదూరమగు శిల్పసంపదకు ఉచితమగు నాధారము దుర్లభము. అంతియ కాక శరీరమునకు వన్నెలుచిన్నెలు దిద్దుటయెట్లు శిల్పమో మనోహర కథాకల్పనయు నట్లు శిల్పమే. కనుకనే కావ్యమున కథారచనమున కంతటి ప్రాధాన్యము. అయినను, ఆంధ్రకవులు మాత్రము కథానిర్మాణమున ప్రాగన్ను వెట్టినారు. కనుకనే విమర్శకులు.

'ఆంధ్ర ప్రబంధకవులకు కథా రచనా చాతుర్యము పూజ్యము. ఇతరులు కల్పించిన కథకు పూజలు దిద్ది అందచందములు కూర్పగలరు గాని నూత్న కల్పనా శిల్పమునకు తలపెట్టరు. ఎంత సేపును అష్టాదశ వర్ణనముల బట్టుకొని ప్రాకులాడుదురు గాని స్వతంత్ర కల్పనాభిలాష నాస్తి, అందురు ఈ ప్రవాదము నిరాధారము గాదు. ఇందు సత్యము లేకపోలేదు. కాని దీనికి కారణమేమి? ప్రబంధకవులు కథా ప్రాధాన్యమును గుర్తించిరా? వారు క్రొత్త క్రొత్త పోకడల కుత్సహింతురా? కావ్యవస్తు విషయమున వారి యభిప్రాయమెట్టిది? అని యోచించుచు పరికింతము.

కవులు కావ్య నిర్మాణమును తలపెట్టుటకు కారణములు పెక్కులు. ప్రయోజనములు ననేకములు. "కావ్యంయశసేఽర్థకృతే వ్యవహారవిదే శివేతరక్షతయే ..." ఈ మొదలగు సామాన్య లాభములు మాత్రము గాక విశ్వశ్రేయము కావ్యపరమ ప్రయోజనమని పెక్కుర దృఢాభిప్రాయము. విశ్వశ్రేయః కరమైనప్పుడే కావ్య సమగ్రశక్తి వినియోగపడును. కానిచో ఆకావ్య శక్తిలోని కొంతభాగము నిరర్థకము కావలసి వచ్చును. కనుక కావ్యప్రయోజనము నవలోకించునపుడు లోకమున కిది యెంత మేలు చేయగల్గునో గమనింపవలయును. కాని 'యేది శ్రేయః కరము?' అను విషయమును నిర్ణయించుట కష్టము. అందునను సంప్రదాయములు, సామ్రాజ్యములు తలక్రిందు లగుచున్న యీసమయమున ఆ నిర్ణయము సర్వథా యసంభవమేయగును. అయినను కవివరుల యభిప్రాయము ననుసరించి యాశ్రేయమును వారుద్దేశించిన దానిని మనము కొంత వర కూహింపవచ్చును. దానినిబట్టి కథా నిర్మాణమున వారి తలంపులు మన కవగతము కాగలవు.

పూర్వకవులు కావ్యముకొఱకు కావ్యమునిర్మింప లేదు. వారి దృష్టిలో 'కళ సత్యము' సత్యము మతము. కనుక కలా మతముల కవినాభావ సంబంధ మున్నది. వారు కావ్యమును కళగా ననుభవింపక మోక్ష ప్రాప్తికి పుణ్యలోక ప్రాప్తికి పరంపరా సాధనముగ నుపయోగింప దలంచినారు. గాయకోత్తముడగు త్యాగరాజు తనగాన కలా ప్రావీణ్యమును సాహిత్యముతో మేలగించి శ్రీరామ చంద్రుని ఏకాంతోపాసనా మంత్రముగ వినియోగించినాడు. అటులనే పూర్వ కవీంద్రులు తమ కవితా ప్రాభవముతో వాచామగోచరుడగు పరమాత్మను రూపకల్పన మొనరించి దేవకీ తర్షకముగ భక్తాను యాయిగ జేసినారు. కవుల కావ్యములును శిల్పుల శిల్పము

లును కళావస్తువులు రెండును మానవుని పర నిర్వాణమునకు గొనిపోవు యానపాత్రగ నొన రింప నెంచినారు. లలితకళ పాత్రమే యానంద పర సీమల జేర్చగల యప్పుడు పుణ్యపూగుణ గుణగణ వర్ణన మాత్రోవను లెస్సగ నాకర్షిం చుటకు తోడుపడదా?

కనుకనే రాజరాజనరేంద్రుడు

"  అమల సువర్ణ శృంగ ఖుర
మై కపిలంబగు గోశతంబు ను
త్తమ బహువేద విప్రులకు
దానముచేసిన తత్ఫలంబు త
థ్యము సమకూరు భారత క
థాశ్రవణాభిరతిన్ ..."

అని భారతమును జెప్పగోరినాడు. అందునను

"అస్మదీయ వం
శమునం బ్రసిద్ధులై విమల
సద్గుణ శోభితులైనవారి

చరిత్రమనుటచే నతనికి కరము ప్రియమగుట వింతకాదు.

మఱి కవీశ్వరులో! కథా చమత్కారమును సరసార్థయుక్తిని కవితా నైపుణ్యమును, కలా పుష్టిని, శ్రేయము నభిలషింతురు. కనుకనే నన్నయ భట్టారకుడు

"సారమతిం గవీంద్రులు ప్ర
సన్నకథా కవితార్థ యుక్తిలో
నారసి మేలునా......" అనియు
"..............మహా
భారత సంహితారచన
బంధురుడయ్యె జగద్ధితంబుగన్"

అనియును జెప్పియున్నాడు.

కవులు అభిలషించు ప్రసన్నకథ యెట్టిదో భట్టా రకుడు మఱియొకతావున ప్రకటించియున్నాడు. నైమిశారణ్యమున సత్రయాగము చేయుచున్న శౌనకమహర్షి పౌరాణికుండగు రోమహర్షణితో తమకు కథ చెప్పుమని కోరుచు:—

౬. ఏయది హృద్య, మపూర్వం
బేయది, యొద్దాని వినిన నెఱుక సమగ్రం
బైయుండు, నఘ నిబర్హణ
మేయది, యక్కథయ వినగ నిష్టము మాకున్
(ఆది 1 ఆ. 29 ప) అని చెప్పెను.

దీనినిబట్టి వారి యభిప్రాయమున కథలో నుండ వలయు విశేషములు నాలుగు.

1. హృద్యత. 2. నవీనత, 3. జ్ఞానము కల్గుట, 4. పాపనాశము.

కావ్యకర్తల యాదర్శములో నింతకంటె విశా లాదర్శము గానరాదు. కథ మనోహరముగా కళాసంపదతో తూగుచు నుండవలయును. అది క్రొత్తదిగా నుండవలయును. తచ్ఛ్రవణ పఠన ములవలన జ్ఞానము గలుగవలయును. పాపము నాశమొంది పుణ్యముగలుగ వలయును.

నీతినో, ధర్మమునో బోధింపగోరి కళకు వికృతిని గలిగించునెడల 'కళకొఱకు కళను నిర్మింప వలయు, ననదగునుగాని కలాదృష్టిలో సొంపు చెడకుండ ఆ నీతిధర్మముల నుపదేశించునప్పుడు మనకేల సంకోచము! నీతియు కళయు భిన్నా శ్రయములు గావుగదా! 'నీతియున్నచోట కళ యుండదు. కళయున్నచోట నీతియుండదు' అన రాదుగదా!

మఱి నీతియేది? ధర్మమేది? అవి స్థిరములా? వానికి మార్పులు గలుగవా? అని సంఘాశ్రయ ములా సంఘతారకములా? అను ప్రశ్న పరం పరలు గలుగవచ్చునుగాని యీ విషయము మన కప్రస్తుతము.

దీనినిబట్టి కళకు లోటురాకుండ కావ్యము నీతినో, ధర్మమునో, కాంతాసమ్మితమై యుపదేశింప వచ్చునని తేలుచున్నది. అటులేయయినచో నది మఱింత సంతోషదాయక మగుట కేమి వింత? చలువగల వెన్నెలలకు మనోహర సౌగంధ్యమును, దానికితోడుగ మాధుర్యమును, నొడగూడినచో నది యత్యాదర మూలమే యగునుగదా! అట్టి కావ్యము దుర్లభము గా వచ్చును గాని సర్వథా యసంభవమగునా? కావ్యమున కుపమాన మగు కాంతారత్నము మనోహర సౌందర్యముచే మధుర వాక్యములచే ఉత్తమగుణ రత్నములచే పూజనీయు రాలగుచున్నది గదా !

మన కవీశ్వరులు కథా శరీరమున నగిషీలు దిద్దుటలో హృద్యత నారాధించినారు. కాని కథా రూపమునందలి హృద్యత అంత పరిపూర్ణత నొంద లేదనవచ్చును.

మఱి నవీనత: తెనుగునం దావఱకులేని గ్రంథములను భాషాంతరీకరణము చేయుట, నవీనత యని ఆంధ్ర కావ్యకర్తల యభిప్రాయమైనట్లు తోచును. కానిచో ఎల్లరు ఆ సంస్కృత పురాణములనే త్రవ్వనేల? రామాయణమువంటి కొలది గ్రంథములను వ్రాసినదే వ్రాయుచు కొందఱున్నను మొత్తముమీద క్రొత్త క్రొత్త కథలను గ్రహించినారనియే యనవచ్చును. అటులేయయినచో నప్పుడితర భాషలనుండి మార్చుచున్న కథలన్నియు నపూర్వములే యగును. ఇవి యాంధ్రమునకు క్రొత్తవిగావచ్చును గాని యా కావ్యకర్తల ప్రత్యేకత, వారి కల్పనా కలనము అందేమున్నది? కవుల కల్పనమున కదియొఱగల్లు కాగలుగునా? నన్నయకు భారతమే రచియింపనవసరము గల్గెను. ఏలయన రాజరాజ నరేంద్రుడు భారతమునే రచియింపగోరెను గదా! మఱి తక్కిన కవులకు పెక్కురకు పురాణమే యేల శరణ్యమయినది? వారైన నూత్న కథ కేల పూనుకోలేదు? శౌనకాది మహర్షులకే భారతకథ యపూర్వమై సూతునివలన వారు వినవలసినప్పుడు ఆంధ్రజన సామాన్యమునకు తక్కిన పురాణకథ లపూర్వములగుటలో వింతయేముండును? ఏమియు శ్రమింపకయే క్రొత్తక్రొత్త కథలు లభించుచున్నపుడు ఇక శ్రమపడి యల్లవలసిన యవసరమేమిగలదు? కనుక నవీనకథా నిర్మాణమునకు ఈ భావము కొంత వేరు పురుగువలె పని చేసి యుండవచ్చును.

మఱి మూడవలక్షణము : జ్ఞానదాయకము

"ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని
యధ్యాత్మవిదులు వేదాంత మనియు
నీతి విచక్షణుల్ నీతిశాస్త్రంబని
కొనియాడుచుండ..."

నలరునట్లు భారతము నిర్మిపబడినది. ఇదిస్థూలకాయమగుటచే నీతులు ధర్మములు ఎన్నియైన చెప్పుటకు చెప్పించుటకు నవకాశము గలదు. గాని మఱి తక్కిన కావ్య సామాన్యమునకో! ఇట్టివాని నుద్దేశించియే

"పాయక పూర్వగాథలని
ప్రత్న కవీంద్రులు నేటిదాక రా
మాయణ భారతాది కృతు
లన్నియు వ్రాసిరి త్రిప్పి త్రిప్పి యే
దో యొక కబ్బమందుదల
కొక్కటి యక్కట నూతనాంశ మే
దో యొకటేనియుం దెలుప
నోపని గ్రంథ సమూహ మేటికో!"

అని సూతపురాణము శంకించు చున్నది. పురాణముల నుండి గ్రహించిన కథ కనుక విజ్ఞానము గానరాక పోయినను కావ్యమున నేదో యొక వ్యంగ్యమును పైకిలాగి యది కాంతాసమ్మితమున బోధించు చున్న దండము.

ఇక నాలుగవ లక్షణము:— పాపనాశము.

నన్నయభట్టారకుడు సూతుని వలెనే తన భారతమునకు ఫలశ్రుతిని గంపంత చెప్పినాడు.

సీ. ఆయురర్థులకు దీర్ఘాయురవాప్తియు,
నర్థార్థులకు విపులార్థములును,
ధర్మార్థులకు సత్య ధర్మ సంప్రాప్తియు,
వినయార్థులకు మహా వినయమతియు,
పుత్త్రార్థులకు బహుపుత్త్ర సమృద్ధియు,
సంపదర్థుల కిష్టసంపదలును,
గాపించు నెప్పుడు భావించి వినుచుండు
వారల కిమ్మహా భారతంబు

ఆ. వె. భక్తియుక్తులైన భాగవతులకు శ్రీ
వల్లభుండు భక్తవత్సలుండు
భవభయంబులెల్లఁ బాపి యిష్టార్థ సం
సిద్ధిఁ గరుణతోడఁ జేయునట్లు.

భారతము తన్ను విన్నవారికిఁ జేయునట
నన్నయ యుద్దేశించెనో లేదో కాని వరార్థులు వర్షసమృద్ధికై అక్కడక్కడ భారతము చదువు చున్నట్లు మనము అప్పుడప్పుడు పత్రికలలో చదువుచున్నాము.

మఱి యింకెన్ని ఫలములున్నవో యెవరు చెప్ప గలరు?

సీ....

ఆ.వె. దానములను బహువిధక్రతుహుత జప
బ్రహ్మచర్యములను బడయఁబడిన
పుణ్యఫలము వడయఁబోలు నశేషపా
పక్షయంబునగు శుభంబు పెరుగు.

"...భారతీయ భా
రత్యమరాప గాథము, ని
రంతర సంతత పుణ్యసంపద
న్నత్యభివృద్ధి సేయు విని
నం గొనియాడిన నెల్లవారికిన్"

"కమనీయ ధర్మార్థ కామమోక్షములకు
నత్యంత సాధనం బయినదాని
వేడ్కతోఁ దవిలి తన్ వినుచున్న వారల
క మత శుభకరం బయినదాని
రాజుల కఖిల భూరాజ్యాభివృద్ధి ని
త్యాభ్యుదయ ప్రదం బయినదాని
వాఙ్మనఃకాయ ప్రవర్తితానేక జ
న్మార్జితాఘనిబర్హణం బయినదాని"

"ఆయుష్యంబితిహాస వస్తుసముదా
యంబైహికాముష్మిక
శ్రేయః ప్రాప్తినిమిత్త ముత్తమసభా
సేవ్యంబు లోకాగమ
న్యాయైకాంత గృహంబు నాఁబరగు"

నని భారతమును గూర్చి చాటియున్నాఁడు. ఇంతియ కాక ఉపాఖ్యానముల సందర్భమునను అనువగు తావులను పఠన శ్రవణ మహిమను వర్ణించి యున్నాఁడు. కోరినకోరికలు నేరవేర్చుచు కావ్యమిట్లు విశ్వశ్రేయము కావలెనని కాదు గదా నన్నయ తలంపు!

నన్నయ తనకాలమున నాంధ్రదేశమున బహుళ వ్యాప్తములైన బౌద్ధ జైన మతములను తుడిచి వైచి వైదిక మతమును పునరుద్ధరింపఁ బూనినవాడు గావున తన భారతమును చదువుటకై జన సామాన్యము నాకర్షింప దలచి ఫలశ్రుతి నింత విపులముగాఁ జెప్పియుండును.

కాని యిదియే సంప్రదాయమై ప్రతికవియు తన కావ్యము విన్నచో దీర్ఘాయు రర్థాదులు కలుగు నని నుడువుటకు దారిచూపినది. కావ్యము బహుళ ప్రచార మందుటకు జనసామాన్యము శ్రవణ పఠనములచే నాదరించుటకు నాకర్షక ముగా నీఫల శ్రుతి రచియింపబడ సాగినది. ఇదియే కావ్యపఠనాదులకు జనసామాన్యమున తావేర్పఱచి యుండును.

కనుకనే కళాపూర్ణోదయము వంటి కల్పితప్రబంధ రచనమునకు సమకట్టి

"పుణ్యవస్తువర్ణనాకర్ణ నీయంబును." అనియొక విశేషణమును ఆకవి చేర్చుకొన వలసివచ్చినది. అంతియ కాక.

సీ. "ఆకథలిట్ల జెప్పినట్టి వారును విని
నట్టివారును ధాత్రియందుఁబుత్ర
పౌత్రప్రపౌత్రాది బహుసంతతియుఁ దన
ర్పుచు జిరకాలంబు ప్రచురసంప
దభివృద్ధి శోభిత శుభసౌఖ్యములు గాంతు
రనుమాట యున్నది యాది యంద"

అని అతి ప్రౌఢముగా నొక పాత్రచేతబలికించి నాడుమఱియు "......ఆకళా
పూర్ణకథల్ వినం జదువఁ
బొల్పుగ సంతతి వైభవాది వి
స్తీర్ణశుభంబు కల్గికయు
దీవన మున్నది గల్గెఁగాన నా
నిర్ణయమార్య లెల్లమది
నిల్పి వినుండు పఠింపు డింపుతోన్
(కళా8.262)

అని భరత వాక్యము పలుకుటకు మఱి యితర కారణ మే ముండును?

ఇట్లు కావ్యపఠనమున పుణ్య లాభమును జూపుటకు పురాణకథలే యెంతయు దగినవి. కల్పిత మైనచో నెంత చక్కనిదైనను దానియందు విశ్వాసమెట్లు కుదురును? అది కావలసిన కోరి కల నెట్లీయగలదు? అట్టిది పాఠకుల పఠనమునకు, శ్రోతల శ్రవణమునకు, సమాకర్షణీయము గాలేదుగదా! కనుక కవిచంద్రులుకథాకల్పనము నకు నీరు విడిచి పురాణముల నాశ్రయింపవలసిన వారైరి.

ఈ కావ్యపఠన పుణ్యమునకు కారణక్రమమును భాగవత మిట్లు వివరించినది.

"పుణ్యశ్రవణ కీర్తనుండైన కృష్ణుండు తన కథలు వినువారి హృదయంబు లందునిలిచి శుభంబు లాచరించు, నశుభంబులు పరిహరించు, నశు భంబులు నష్టంబులయిన భాగవత సేవావిశేషం బున నిశ్చలభక్తి యుదయించు, భక్తిగలుగ రజ స్తమోగుణ ప్రభూతంబులయిన కామ లోభాదు లకు వశంబుగాక చిత్తంబు సత్వ గుణంబునఁ బ్రస న్నంబగుఁ, బ్రసన్నమనస్కుండైనను ముక్తసంగుం డగు, ముక్తసంగుండైన నీశ్వర తత్వ జ్ఞానంబు సిద్ధించు, నీశ్వరుండు గానంబడిన జి జ్జడ గ్రథన రూపంబైన యహంకారంబు భిన్నంబగు, నహం కారంబు భిన్నంబైన నసంభావనాది రూపంబు లగు సంశయంబులు విచ్ఛిన్నంబులగు, సంశయ విచ్ఛేదంబైన ననారబ్ధఫలంబులైన కర్మంబులు నిశ్శేషంబులై నశించు."

ఇంత గట్టిగ ఫలములను జెప్పినప్పుడు ఎవ్వడు కేవలరసాభిలాషియై, చమత్కారాను రక్తుండై కావ్యపఠనమునకుఁ బూనుకొనును. విశ్వశ్రేయ మగు నిట్టి కావ్యమునకుగాక కేవల రసమాత్ర ప్రయోజకమగు కావ్యరచనమునకు ఎవ్వడు తలపెట్టును?

ఇట్టి కావ్యపఠన శ్రవణఫలమునసే గాబోలు భారతీయుల 'అనారబ్ధఫలంబులైన కర్మంబులు నిశ్శేషంబులై నశించినవి.'
రామరాజ భూషణుఁడు కొంత స్వాతంత్ర్యము వహించి కొంత కల్పనకవకాశమిచ్చినను పుణ్య కథను మాత్రము విడువలేక పోయినాఁడు.

"కేవల కల్పనాకథలు
కృత్రిమరత్నము లాద్య సత్కథల్"
వావిరిఁ బుట్టు రత్నముల
వారిత సత్కవికల్పనావిభూ
షావహపూర్వవృత్తములు
సానలఁ దీరిన జాతిరత్నముల్
గావున నిట్టి పుణ్యకథ
గావలె"నని పలికినాఁడు.

ఇక స్వతంత్ర కథ యెట్లు బయల్పడగలదు ? కవుల కల్పనాచాతుర్య మెట్లు విలసిల్లగలదు ?

కల్పితకథా విరాజితమగు "కళాపూర్ణోదయ"మును రచియించిన వెనుక సూరనామాత్యుఁడు తిరిగి పురాణముల నాశ్రయించి ప్రభావతీ ప్రద్యుమ్నమును నిర్మింపఁదలంచి నప్పుడు కవుల కల్పనా శక్తి రంజిల్లుట కవకాశ మెట్లుండును ? ఒక వంక కవుల సాంప్రదాయ మిట్లుండగా లక్షణకర్తలు పుణ్యపురుష నాయకత్వము గల కావ్యములనే యెక్కువగ గౌరవింప దొడగిరి. లక్షణకర్తలు; ప్రభువులు; దేశమున పుణ్య వ్యాప్తి కింత సులభోపాయములు కనిపట్టుచుండగా, కావ్యకర్తలు పుణ్యమింత విరివిగా పంచిపెట్టుచుండగా, ప్రజలు వలచిన వస్తువులెల్ల నింత సమృద్ధిగా సమకూరుచుండగా, కావ్యము విశ్వశ్రేయముకాక యేమగును?

Δ

# గ్రంథాలయములు

శ్రీ మైనంపాటి హనుమంతకవి

గీ. రాష్ట్రమును బాలనముసేయు రాజువోలె, గృహముపాలన మొనరించు గృహిణి వోలె
గ్రంథభాండార పాలనాక్రమము నెఱుగు,వాఁడు భాండారకుఁడొకండె వసుధయందు.
సీ. వివిధజాతుల గ్రంథవితతి వేర్వేరుగా, జాబితాలను మీరు సల్పుడయ్య
చదువంగ నేతెంచు జనముల కా గ్రంథ, సమితి నోపికతో నొసంగుడయ్య
చదువలేనట్టి యజ్ఞానులకా పొత్తముల యర్థముల లెస్సదెలుపుఁడయ్య
గ్రంథాలయోప యోగము నెరుంగనివారి, కభిరుచి కలిగింప నరయుడయ్య
గీ. బాలురకు స్త్రీలకును గ్రంథపఠనమందు, ఘనతరాసక్తి గలిగింపఁ గడగుడయ్య
జ్ఞానభిక్షను జనుల కొసంగుడయ్య, ఆంధ్ర సోదరులార మహాత్ములార!
సీ. పఠన మందిరములఁ బటు సమర్థతతోడ, నెలకొల్పి పెంపఁగాఁ దలపరయ్య
ఘన సమాజముల మీ గ్రంథాలయములలో, స్థాపించి చర్చల సలుపరయ్య
ఆంధ్ర ముఖ్యుల జ్ఞాపకార్థమా బహుమాన, సమితి ప్రోత్సాహంబు సల్పరయ్య
పురుషులకును బోలెఁ దరుణీమణులకును జ్ఞానమీయఁగ శ్రమ సలుపరయ్య
గీ. వేరు కార్యంబులఁ బ్రసక్తి విడువరయ్య, చేఁబూనిన కార్యంబు శీఘ్రగతిని
జయమునందింప యత్నముల్ సలుపరయ్య, ఆంధ్ర సోదరులార మహాత్ములార!

# ప్రాచీన గేయ సాహిత్యము

శ్రీ బులుసు సూర్యప్రకాశశాస్త్రి.

గేయ శబ్దార్థమును సాహిత్యవేత్తలు, గేయ విచక్షణులు వివిధముగ నిర్వచించినారు. వృత్త నృత్య తాళ లయానుగుణమగునదియే గేయమని నాట్య శాస్త్రకారుని యభిప్రాయము. గేయ స్వరూప విభజన ప్రకరణమున దాని ప్రాశస్త్యము స్వరూపాదులు నిర్వచింపఁబడినవి. మానవుని హృదయ భావాధిక్యముచే అప్రయత్నముగా వెలువడు మధురమయమగు ధ్వనియే గేయమన్నారు మరికొందరు. చిలుకలపలుకులలో, కోయిలల కంఠధ్వనిలో, ఆవుల అంబా యను అరుపులలో, గల మధుర ధ్వనికూడ గేయమనినారు మరికొందరు. ఇంకనూ పలుతెరంగులు గేయ శబ్దార్థము ప్రతిపాదింపఁబడినది. ప్రాణికోటినుండి భావావేశమున వెలువడు పై ధ్వనులకు తరతమ భావములు కల్పించినారు. ఉదాత్త అనుదాత్త మధ్యమము లనియు, ప్రథమ ద్వితీయ తృతీయ తురీయ కాలములనియు భేదములను నిర్వచించిరి. "శిశుర్వేత్తి పశుర్వేత్తి వేత్తి గానరసం ఫణిః" అన్నారు విజ్ఞులు. గాన మాధుర్యమునకు లోబడనిపదార్థమే లేదు. కేవలధ్వనిరూపమగు గేయమే ప్రాణికోటుల సర్వేంద్రియములకు చలనము సంతృప్తి కలిగించుచుండ సాహిత్యముతోఁగూడిన గేయవిషయమున నుడువనవసరము కానరాదు. అందులో ఆయాకాలానుగుణముగా ఉదాత్త సాహిత్య ప్రతిపాదితగేయము సర్వత్ర ఆదరణీయమె. అట్టి గేయ సాహిత్య శోభ. "హేమ్నః పరమామోదః" అన్నటుల ద్విగుణీకృతము త్రిగుణీకృతము కాగలదనుట నిర్వివాదము.

సాహిత్యములో భేదము లనంతములు. గద్య; పద్య; ఉభయాత్మకము; మధురశబ్దజాలము. నవరస సమ్మిశ్రితకథ; మొదలగు రీతులు కలిగియుండును; ఈసాహిత్యము పరిశుద్ధమగు మానవ హృదయములందు ప్రకాశవంతము. పామర హృదయజనిత సాహిత్యమునకు విజ్ఞుల హృదయగత సాహిత్యమునకు భేదబాహుళ్య మనంతము. వాని స్వరూపసందర్శన మాత్రమునసే అద్దాని సత్యస్వరూపము ప్రత్యక్షము కాగలదు. ప్రాపంచిక విజ్ఞానమంతయు సాహిత్యంలో ఇమిడియుంది. లోకముయొక్క మనోభావముల నన్నిటిని సువ్యక్తముచేయునది సాహిత్యము. సాహిత్యమునకు లోకమునకు అవినాభావసంబంధము కలదని గ్రహించవలయును. మానవ జీవితాన్ని పరిష్కరించేది సాహిత్యం. సాహిత్యము వలని లాభము లోకానికి ఇట్టిదని నిర్వచించుట యెవరికిని సాధ్యముకాదు. అన్నివిధములగు సాహిత్యము లోకానికి ఆదరణీయమె.

గేయరూపముగా నున్న సాహిత్యమును పామర జనం ప్రేమించుతుంది. నీతి మతములను గురించిన ప్రచార మంతయు పూర్వకాలమున గేయరూపము దాల్చినది. అందుకు ప్రథమ గణ్యులు శివకవులు. వారి గేయకవిత్వము సర్వసామాన్యముగా లోకాన కంతటికి అందుబాటులోనున్నది. పామరులకు తగు సాహిత్య గేయములుకూడ వారు విరచించిరి. ఆనాటి నుండి నేటి వరకుగూడ తుమ్మెద పదములు; చెంచెత పాటలు; గుబ్బెత పాటలు; తత్వములు; యక్ష గానములు; జంగంకథలు; హైందవ గృహములందలి అన్ని విధముల పాటలుకూడ నందరిచే

నాదరింపబడు చున్నవి. కాని "కాలము మారిన నంతయు మారు"నను విషయము మరువకూడదు. "అంతయు కాలాధీనమె"యని వేదాంతము పనికి రాదు. ప్రాచీన గేయముల యందలి కొన్నిటి యర్థము సత్యదృక్కులతో చూచు లోకము ఈ నాడు కరువైంది. నేడు ప్రాచీన గేయ సాహిత్యంలో కొంత భాగమును త్రోసిరాజంటున్నది లోకము. నేటి నవనాగరికపు గేయసాహిత్యంలో దానికి ప్రవేశము పూర్తిగా లేదు.

ఆనాటి పాటలు నేటికిని మన పెద్దలవలన విను చున్నాము. సామాన్యముగా ఈ పాటలుకూడ మన మతబోధకములగు గ్రంథములకు తాత్పర్య భూతములె. పురాణకథలు గేయరూపముదాల్చి పామరులకు సయితము నీతిదాయకములుగా ఉన్నాయి. ఈ క్రింది గల గేయముల యందలి సాహిత్యార్థము ఎంత చక్కగా విపులీకరింపం బడినదో మనకు వ్యక్తము కాగలదు.

అత్తగారవమ్మ
ఆరడిచేయకమ్మ
వత్తులువత్తకమ్మ
వత్తిగిలియుండవమ్మ.
... ... ... ... ...

సామాన్యముగా నిట్టి పాటలు ఏవిచూచినను సలక్షణముగా నుండును. ప్రాస విరామములు తప్పక యుండును. విరామములేని గేయము లయానుగుణముగా గానముచేయుటకువీలు లేదు. పై పాట అన్నిలక్షణములు కలిగియున్నది. అంత్య ప్రాస వాడినారు. మిగతాపాటంతయు ఇదే ధాటిగా విలసితము. ఆ పాటలో పరమార్థము చూచిన లోకము విస్మితము కాగలదు. స్త్రీ జీవిత పరిష్కారమంతయు అందునిబద్ధము. స్త్రీకి గల స్వాతంత్ర్యము ఎంతవరకు వర్తించు నను విషయము వ్యంగ్యంగా గోచరించుచున్నది. లోకాన అత్తకోడల్ల మధ్యగల పొత్తు అధికార ములు సంసార యాత్రలోగల పరస్పర అధి కారములు వీటి నా పాట సూచించుచున్నది.

పామరగేయ సాహిత్యంలో ఉదాత్త సాహిత్యం ఉంది. కాని అట్టి ఉత్తమ సాహిత్య భావము గ్రహించ గలిగినవారు తక్కువ అయినను ఇట్టి ఉత్తమ సాహిత్య ప్రతిపాదితగేయ సాహిత్యం వాళ్ల నోళ్లలో కూడ నృత్యంచేసింది.

అత్త వెళ్లి కోడలికి దండంబు పెడితే
తిరిగి దండంబు పెట్ట తీరదత్తయ్యా
నీ కొడుకు చల్లంగ వేయ్యేళ్లు బ్రతక
నీవు పోయి స్వర్గాన యేకుల్లు వడక
అత్తింటి కోడలు అలిగిపడుకొంది
అలకాలు తీర్చావె ములకాల కట్టి
అట్లు తిని అన్నయ్యా అలిగిపడుకొంటె
తిట్లు తిని మావదిన తీపులందింది.

పూర్వకాలమున ఇట్టి గేయములు తఱచు పామ రులు దంపుసమయమున, పిండి విసురు సమయ మున, చక్కగ గానము చేసేవారు. పై గేయము జంటలు కూడి పాడినప్పుడు వినవలయు; నెంత మధురముగనుండునో! పై పాటలో అత్త కోడల్ని యెకసక్కెము లాడుట; దానివలన నొక విధ మగు నీతియు సువ్యక్త మగునటుల ప్రతి పాదితము.

వరుసగాని దాని వరుసలాడేవు
పాపిష్ఠి నీ శిరసు భగ్నమైపోను
తెల్లన్న తెల్లన్న తెల్లన్న యేమి
వరుస తప్పినవాని వలికితెల్లన్న
గుడుములాపిండని గుద్దుకోకండి

యిరుగు పొరుగుల్లార యిది ముగ్గుపిండి
చవితి చవితంటేను సంబరాల్ పడితి
నా సవతిగాదమ్మ నాగుల్ల చవితి
బాపనారక్కలకు ఏమేమి సొమ్ము
అడుగడుగు స్నానాలు తడిబట్టసొమ్ము
కోమటారక్కలకు ఏమేమిసొమ్ము
వడ్లగింజాసొమ్ము వళ్ళంత దుమ్ము

ఇందు వళ్ళు తెలియని పురుషులు స్త్రీలను చూచు తేలిక చూపులకు నెంత చక్కగా నీతిని స్త్రీ ముఖముద్వారా పలికించినారో! లోకమున సవతి వలన సంసారములో గల రహస్యము వ్యక్తీకృతము. బ్రాహ్మణులు వైశ్యులు వాళ్ళ ఆచార వ్యవహారములు మనసుకు నొప్పి కలగకుండ ముద్దుగా పలికించినారు.

ఊరు ముందర చేను వేయబోకన్న
ఊళ్లోను వియ్యంబు చేయబోకన్న
ఊరుముందర చేను కాకుల్లపాలు
ఊళ్లోను వియ్యంబు కయ్యాలపాలు
అందలము కోరింది పచ్చన్ని కుచ్చు
అతి భోగి కోరాడు అత్తవారిల్లు
పల్లకీ కోరింది పచ్చన్నికుచ్చు
పరదేశి కోరాడు పంచటరుగుల్లు

ఇందు కర్షకుని జీవితపరిష్కారం వియ్యంబు పొందు మానవుని జీవితపరమావధి విశదీకృతము. ఉపమాన సాదృశ్య ప్రతిపాదన పూర్వకంబుగా ప్రతిపాదితము. ఊళ్ళో వియ్యంబు ఎంత కయ్యంబో ఎంత సుఖమో పొందిన వారలకె యెరుక; పిల్లనిచ్చి వివాహము చేసిన ఆ దంపతుల ఆనందము, పరదేశమునందుంటె పిల్లనిచ్చినవానికి పరమానందము. ఇచట భావి జీవిత పరిష్కారమంతయు వివరించినాడు. అంతయు భావించవలసినదే.

ఇక భోగపురుషుఁడుకాని; సామాన్యుఁడుకాని; అత్తింటి భోగంబు ఎంతఘనంబుగా నెంచునో వానికి అచట జరుగు అల్లుడి మర్యాదల గొప్పతనము, దీర్ఘకాలముండిన జరుగు గౌరవముకూడ సుస్పష్టముగా ప్రతిపాదితములు.

కాశీకి పోయాను రామాహరి
కాశితీర్థము తెచ్చాను రామాహరి
కాశీకి పోలేదు రామాహరి
ఊరికాలవలో నీళ్లండి రామాహరి
కాశీకి పోయాను రామాహరి
కాశివిభూతి తెచ్చాను రామాహరి
కాశీకి పోలేదు రామాహరి
పీడికాష్ఠంలో బూడిదండి రామాహరి
పంచేంద్రియములు రామాహరి
నేను బంధించి యున్నాను రామాహరి
కొంచేము నమ్మిన రామాహరి
కొంప, ముంచివేస్తాడండి రామాహరి
ఆలుబిడ్డలు లేరు రామాహరి
నేను ఆత్మయోగినండి రామాహరి
ఆలుబిడ్డలెల్ల రామాహరి
పీని కాయూర నున్నారు రామాహరి

ఇందు నిందాగౌరవములు సమముగా ప్రతిపాదితములు. కాశియందలి ఘనత అందలి వస్తుసంచయమువలన కలుగు లాభము- ముష్టివాడు పొట్టకూటికయి పడు కష్టము "ఎన్నిపాట్లయినా-యీ పొట్టకూటికె యొ" యను సామ్యము మొదలగు విషయ వివేచనము మనోహరముగా ప్రతిపాదితము.

చూడరె బావగారు
షోకుగా కూర్చున్నారు
గాడిద గళము వారు
గానము పాడేవారు

మాటలు ఎంతో నత్తి
మగువరో బట్టనెత్తి
కూటికి లేని శక్తి
గుంటన ద్రోచే యుక్తి

ఈపాట భావ,తాళ,లయానుగుణముగా గానము చేయువేళల పాఠకుల హృదయములు కూడ నాట్యముచేయును. ఆ పాట గానము చేయుతరి హృదయముకూడ తాండవించునటు లుండును. హాస్యమునకు అంతేలేదు. ఛందోలక్షణముగాని నాట్య లక్షణములకుగాని ఇంచుకయు కొరత లేదు. సంఖ్యామాత్ర అక్షర నియామకము కలిగి కూర్చబడినది. ఇట్టి పాట లనంతములుగా కలవు. వీటిలోగల యర్థము సాహిత్యవేత్తల హృదయములకు, విజ్ఞుల అంతరంగములకే ఎరుక.

అంగానామణిరోయేమె రంగనిరీతిగా నాతో
దొంగ మాటలాడే వెంత నంగనాచివె
సంగతీమీరగ సిగ్గుశృంగారములెల్ల విడచి
ముంగమూరి వారిచేలో కుంగివంగిపోయినావట

ఇట్టి పాటలు అనంతములుగా కలవు. ఈ గేయము లన్నియు గ్రంథస్థములు కాలేదు. అయినచో కొన్ని వాల్యూములు తయారగును. ఇట్టి నీతి నిబద్ధములగు గేయములు కొన్ని నేటికి నశించి పోయినవి.

నేటి కాలానుగుణమగు గేయ సాహిత్యము ఈ నాడు లోకానికి కావాలి. భావబోధకమయి గేయానుకూలముగా, తాళ లయానుసారముగా నుండు గేయ సాహిత్యాన్ని కోరుచున్నది ప్రపంచకం.



# తపస్విని

### శ్రీ వట్టికొండ రంగయ్య

ఉన్నవి నాకు రత్నఖచితోజ్జ్వలకాంచన భూషణమ్ము, ల
భ్యున్నత సౌధరాజము,ల మూల్యఫలోద్గత సారవత్ సుసం
పన్నవనమ్ము, లున్మిషిత భావసమన్విత సత్కవీశర
జ్యన్నవ కావ్యమాలిక, లనర్ఘ మహాధనధాన్య ధామముల్.
చక్కనిదాన, క్రొవ్విరుల జవ్వనముం గలదాన, ఆంధ్రస
మ్యక్కవిరాజ కల్పితములైన ప్రబంధములం బఠించి పెం
పెక్కిన జ్ఞానసారము గ్రహించినదాన, సమస్తముండి నే
నిక్కరణిన్ గృశించుటకు హేతువు లోకము చింతసేయునా?
ఎన్నిలభించినన్ హృదయ మేగతి శాంతివహించు? ప్రేమమై
సన్నిధిఁజేర్చి భర్త సరసమ్ములు వల్కుచుఁ బువ్వు నవ్వులన్
నన్ను కవుంగిలించు కొనునా? హతజీవిని కంతభాగ్యమా?
కన్నుల గారవమ్మయిన కల్గున? అట్టి యదృష్ట మబ్బునా?
ఎన్నిదినమ్ము లీగతి సహింతు వియోగమటంచు నెట్టులో
విన్నదనమ్ము దోపఁగనిపించిన చూడడు, ధైర్యమూని నే

స్విన్నముఖాబ్జ మెత్తి దరిఁజేరిన చీ యను, మందభాగ్యయా
కన్నియ జీవిత మ్మడవి గాసిన వెన్నెల పోల్కియే కదా!

చెందిర కావిపూత గయిసేసిన నోర్వఁడు, పట్టుచీరలై
నం దనివార గట్టుకొనినన్ మొగ మావల ద్రిప్పు; భూషణ
స్పందముచూచి నొచ్చుకొను, సైపడు పూసరమున్ ధరించినన్
చందన వృక్షమంచు జనినన్ స్ఫురియించె విషద్రుమంబుగా!

లేవికనాకు జన్మమున లేనగవుల్ దొలుకాడ భర్తృ సం
భావితనై దినాంత సహవాస విహారములున్, వసంతశో
భావిలసల్లతాంత మధువాసిత మంజు నికుంజవాసముల్
శైవలినీ ప్రసూన మృదు సైకతసీమ నిశా ప్రచారముల్.

ఎరుగను నే మదీయ హృదయేశ మనోజ్ఞ కటాక్షమాలికల్
సరసవచశ్చమత్కృతులు, శారద చంద్రమయూఖశీత సుం
దరదరహాసముల్, మృదుసుధా మధురాధర చుంబనక్రియల్
గురుతర సౌఖ్యవార్ధి పరిలోల కవోష్ణ కుచోపగూహముల్.

కవులు రసజ్ఞ శేఖరులు, కావ్యకళా ప్రతిభాప్రియాళువుల్
వివిధమనోహర ప్రణయ వృత్తములన్ రచియింతుర; తద్గతా
నవరసమాని మై మరతు సత్కవికావ్య జగత్తులో పురా
భవసుకృతమ్ముగాక కవి భార్యగ బుట్టు నదృష్టమబ్బునే?

గానము చేయనేర్చితిని, కమ్మనికైత వచింపనేర్చితిన్
స్వానుభవమ్ము లెన్నొ కరుణామయ గీతులుగా రచించి నే
వీణియ మేళవించి వినిపించిన రాలు గరంగు గాని నా
ప్రాణవిభుం గరంచుకొను భాగ్యము మాత్రము పట్టదాయెగా!

మామక జీవిత మ్మిటులు మారు నటంచు దలంచలేదు; నే
నే మపరాధ మెప్పు డొనరించితినో తొలిజన్మమందు; ఈ
ప్రేమ నిరస్త జీవితపరీవృత నాటికలోన; నెన్ని చిం
తామయరంగ భంగము లనంతముగా నిటువచ్చుచుండునో!

పొలతిగ బుట్టుకంటె మరిపుట్టుక లేమియె మేలు; భగ్నవాం
ఛలుగల నాకు జీవితమునన్ తుదికోరిక మాత్ర మొక్కటే
అలసట దీర్చుచున్నది—'మహాకవయిత్రి నటంచు మెచ్చ లో
కుల కెరిగింతు కాంతల నిగూఢ మనోవ్యథ లల్లి కావ్యముల్.'

Δ

# కర్మయోగి

శ్రీ శ్రీరాముల సచ్చిదానందశాస్త్రి

"కాండద్వయోపపాద్యాయ కర్మబ్రహ్మస్వరూపిణే
స్వర్గాపవర్గరూపాయ యజ్ఞేశాయ నమోనమః"

"కర్మణా బధ్యతే జంతుః"

కర్మచేతనే జంతువులకు బంధమేర్పడును.

"కర్మణైవహి సంసిద్ధి మాస్థితా జనకాదయః"

కర్మచేతనే జనకాదులు మోక్షము నందగల్గిరి. అనుపై వాక్యములు కర్మయే బంధమోక్షహేతువని చెప్పుట వలన ఇయ్యవి విరుద్ధార్థబోధకములుగా నుండి వీరికి సమన్వయ మెట్లు కాగలదను సంశయము సామాన్యముగ ప్రతివారికి కలుగక మానదు. భగవద్గీతయందు

"యోగః కర్మసు కౌశలం"

అని భగవాను డర్జునునకు కర్మయోగ స్వరూపమును దెలిపి యున్నాడు. ఇచట "కౌశలం" అన నేమి యను విషయమును శ్రీశంకర భగవత్పూజ్యపాదు లీ విధముగ వివరించిరి.

"తద్ధి కౌశలం బంధక స్వభావాన్యపి,
కర్మాణి సమత్వ బుద్ధ్యా స్వభావా న్నివర్తంతే,
తస్మాత్ త్వం బుద్ధి యుక్తో భవ"

నేర్పరితనమన నది. బంధక స్వభావము కలవియైనను కర్మలు ఫలభావనలేక ఈశ్వరార్పణబుద్ధితో చేయబడి సహజమైన బంధక స్వభావమునుండి మరలింపబడుచున్నవి. "ఆ హేతువుచే కర్మఫలసిద్ధియందు సమత్వబుద్ధికలిగి కర్మలు చేయుము" అని చెప్పుటచేత పైవిషయముల విమర్శించుకుని కర్మయోగమును దేల్చుకొనుట మనకవసరమని తోచుచున్నది. ఆ విషయములనే ఇంచుక విచారించుకొందము.

1. ఈ సంసారమను మరీచికలో సమస్తజీవులు, తామెల్లప్రుడు సుస్థిరులై యుండవలెననియు, నిరుపమాన ప్రభా విభాస్వరులై వెలుగొందుచుండవలెననియు తమకెంతయు నిత్యనిరతిశయానందము కలుగుచుండవలెననియు, ఇతోధికాభివృద్ధికై, సుఖానుభూతికై యత్నించుచు, భగవదారాధనలు చేయుటయు, సత్కర్మల నాచరించుటయు, పెద్దలకు మ్రొక్కుటయు మొదలగునవి చేయుచుందురు. ఆ యా సత్కార్యాచరణమూలమున "మానవులు మహారాజ్యపదవీ విభూషితులయ్యును నిరుపమాన ప్రభాశాలురు కానేరకుండుటయు శతాధిక వర్షజీవనులయ్యును జీవితాశ తీరనివారగుటయు, అతులితైశ్వర్య సంపన్నులయ్యును భోగేచ్ఛ సడలకుండుటయు, తా మభిలషించిన నిరతిశయానందమును పొందనేరకుండుటయు, దుఃఖానుబంధము తప్పకుండుటయు, ప్రాణిమాత్రమునకు అనుభవదూరము కాని విషయము". సుకృత దుష్కృతములు, ధర్మాధర్మములు మొదలగువిరుద్ధభావసమిష్టిరూపమగు నీసృష్టియందు సుఖానుభూతికై జీవుడు ప్రయత్నించుట ఎండమావులలో బిపాసను శమింపచేయుదలచుటవంటిది కాకపోదు.

2. కాన జననమరణాత్మకమును, దుఃఖమయమును, విచారశూన్యము నగు నీ సంసారమున ధన, కనక, వస్తు, వాహనాది వైషయిక సుఖానుభూతి జీవులకు గగన కుసుమాయమానమగుటకు సందియముండనేరదు.

3. ఇట్టి సుఖదుఃఖమయమగు నీసంసారంబున సుఖమన నేమి? దుఃఖమన నేమి? ఇవి ఎట్లు జీవికి అనుభవనీయములగును? అను విషయము నించుక విచారింతము. పరస్పర విరుద్ధములగు సుఖదుఃఖములకు, స్థితిగతులకు వలెనే సహావస్థితి అసంభవము గాన, ఒకదానియొక్క అభావమే రెండవదానియొక్క భావము. (అనగా దుఃఖాభావము సుఖము, సుఖాభావము దుఃఖము) ఇట్టిసుఖదుఃఖములయందు దేశకాల విశేషముల ననుసరించి జీవికి ఆభిముఖ్య, వైముఖ్యములు కలుగుచుండునేగాని వాస్తవిక సుఖ దుఃఖానుభూతి ఎన్నటికిని సంభవించనేరదు. కాగా నీ సుఖదుఃఖములు కేవలమనుజ పరికల్పితములై, పారమార్థిక సత్తాశూన్యములై జీవికి అనుభవనీయము లగుచుండును. సుఖదుఃఖములు కాల్పనికములైయుండ, జీవి సుఖమునే కల్పించుకొని ఏల తదనుభూతినే పొందకూడ దనిన, సుఖాభిలాషియగు నాతడు ప్రయత్నపూర్వకముగ నొక్కఫలము సాధించి తదనుభూతివేళ ఫలాంతరము గొప్పదిగ దోచుటయు, దానికై దీనిని అనుభవింపకయే విసర్జించుటయు, ఇట్లు ఎన్ని ఫలములు చేజిక్కినను ఉన్నతోన్నత సుఖాభిలాషచే నిరంతరము వ్యాకులపడుటయు, ఎచ్చటను స్థిమితము, శాంతి, ఆనందము, అనుభవింపనేరక విషయాభిలాషపరంపరా తరంగములచే నిరంతరము ఉత్తమాధమ స్థితుల నొందుటచే తన జీవితమును సుఖాభిలాషచే దుఃఖమయముగ నొనర్చుకొనుచు ప్రతివాడును ఆనందమునకు దూరదూరముగ నుండుటయే తటస్థించుచున్నది.

కాన ఆకాంక్షాసామాన్య మెల్ల దుఃఖరూపమగుటచే నైహికాముష్మిక సుఖశాలురకెల్లరకు దుఃఖానుబంధము ప్రతినియత మను విషయము యుక్త్యనుభవసిద్ధము. అందుచే

"నాల్పే సుఖ మస్తి"

అని శ్రుతి నుడువుచున్నది. ఏలనన

"ద్వా సువర్ణా సయుజౌ సఖాయా సమానం
వృక్షం పరిషస్వజాతే,అనశ్నన్నన్యోఽభిచాకశీతి,
తయో రన్యః పిప్పలం స్వాద్వత్తి"

అని శ్రుతిమూలమున, మంచి ఱెక్కలు కలిగి సమాన స్థితినిబొంది దేహవృక్షము నాశ్రయించి, మైత్రిచే ప్రవర్తించు రెండు పక్షులలో నొకటి కర్మఫల మనుభవించుచుండెననియు, వేరొకటి ఏమియుదినక యూరక చూచుచుండెననియు, చెప్పుటచేత ఈశ్వరుఁడన దగినవాడయినను; జీవి యనాదియగు అవిద్యకు వశుడై భోక్తృత్వమూలమగు జీవత్వమునొంది తన్మూలమున కులాలచక్రమువలె నెడతెగక తిరుగు సంసారచక్రభ్రమణమునబడి నామరూపాత్మకమై విచారశూన్యమగు ప్రపంచమే సత్యమని సంచరించుటచేతఁ దా నభిలషించు సచ్చిదానందరూపము నందలేక నిరంతరావేదనలఁ బొల్పడుట వ్యక్తిమాత్రసామాన్య మైనదని తలపవలసియున్నది. కనుకనే

"లోకం శోక హతంచ సమస్తం"

అని శంకరభగవత్పూజ్యపాదులును

"క్షణంబాలోభూత్వాక్షణమపియువాకామరసికః
క్షణం విత్తైః హీనః క్షణమపిచ సంపూర్ణవిభవః
జరాజీర్ణై రంగైః నటఇవ వలీమండిత తనుః
నరస్సంసారాం తేవిశతియమధానీ యవనికాం"

అని భర్తృహరియును పైవిషయమునే చెప్పిరి. కావున ముల్లు దీయుటకు ముల్లే సాధనమయినట్లు కర్మమూలకమగు సంసారమును నశింపజేయుటకు కర్మయే సమర్థము కాగలదు

"ఈశ్వర స్సర్వభూతానాంహృద్దేశేర్జున తిష్ఠతి"

అను గీతావాక్యము ననుసరించి, బుద్ధివృత్తియే హృదయాంతర్యామియగు నీశ్వరుని నన్వేషించుచు విద్యయనియు,చక్షురాదీంద్రియముల ద్వారా లోకము నన్వేషించుచు, అవిద్య యనియు, "విద్యాచావిద్యాచేతి" అని రెండు నామములు ధరించినట్లు కర్మకూడ లోకవ్యాపారవిషయమున అసత్కర్మ యనియు, ఈశ్వరానుగ్రహమును గోరి చేయబడుచు సత్కర్మయనియు, రెండువిధములు. ఇట్టి సదసత్కర్మ విభాగము, వేదమూలకముగనే తెలియవలసి యున్నది.

"ప్రత్యక్షే ణానుమిత్యా వా
య స్తూపాయో న బుధ్యతే
ఏతం విందంతి వేదేన తస్మాద్వేదస్య వేదతా"

అను ప్రమాణముచే మానవబుద్ధి కగోచరములై ప్రత్యక్షానుమానములచే తెలియరాని విషయములన్నియు వేదములవలనే తెలియబడుచుండును. అందుచేతనే "వేదయతీతి వేదః" అనుమాట సార్థక మగుచున్నది.

కాన శ్రుతులును, తదర్థ ప్రతిపాదకములగు స్మృతులును, తదుపబృంహకములగు పురాణేతిహాసములును, ఇంతయేల? శ్రుత్యుక్తధర్మ ప్రతిపాదకమగు వాఙ్మయమంతయు, ధర్మార్థ కామమోక్షములను, దెలియజేయుచు, ఆర్యావర్త సౌధమున కలంకారభూతమై, అజ్ఞానాంధకార మడంచు విజ్ఞానమణిదీపమై, వెలుగొందు చుండు ననుటకు సందియ ముండనేరదు.

"శ్రుతి స్మృతీ మమైవాజ్ఞే యస్తే ఉల్లంఘ్యవర్తతే
ఆజ్ఞాచ్ఛేదీ, మమద్రోహీ మద్భక్తోపి నవైష్ణవః"

అనుపరమేశ్వర శాసనమును మనము స్మరింపవలసి యున్నది. ఇంతియేగాక,

"తస్మా చ్ఛాస్త్రం ప్రమాణం తే,
కార్యాకార్య వ్యవస్థితౌ"

అను ప్రమాణముచే లోకాలోక విజ్ఞానప్రబోధకములగు వేద శాస్త్రాదులవలననే భారతీయులు తమ కర్తవ్యమును తామెరుంగవలయునుగాని, యితర ప్రమాణము లభిలషణీయములు కాజాలవు.

ఇట్టి పరమ ప్రమాణమగు వేదముచేతను, తదర్థ ప్రతిపాదకములగు పురాణేతిహాసములచేతను నిషేధింపబడిన

"నానృతం వదేత్, న కలంజం భక్షయేత్,
న పరదారాన్ గచ్ఛేత్"

ఇత్యాది నిషిద్ధకర్మలు, అసత్కర్మలనియు,

"స్వాధ్యాయోధ్యేతవ్యః,
సత్యంవద, ధర్మంచర"

వేదవిహిత కర్మలు, సత్కర్మలనియు, శ్రుతిమూల సత్కర్మాऽసత్కర్మ విభాగము, తెలియదగినది. త్కర్మలు, కామ్యములు, (ఫలాభిసంధిసహితములు) .మములు (ఫలాభిసంధి రహితములు) అని రెండు ు.

తిష్టోమేన స్వర్గకామో యజేత,
హ్మణేన నిష్కారణేన,
గో వేదోऽధ్యేతవ్యః జ్ఞే యశ్చ
ం కురు కర్మత్వం కర్మజ్యాయో హ్యకర్మణః
యాత్రాపిచ తే న ప్రసిధ్యే దకర్మణః
యజ్ఞాః ప్రజాఃసృష్ట్వాపురోऽవాచ ప్రజాపతిః
ప్రసవిష్యధ్వం ఏషవో స్త్విష్టకామధుక్
న్ భావయతానేన తేదేవా భావయంతు వః
రం భావయంతః శ్రేయః పరమవాప్స్యథ''

ప్రమాణములచే యజ్ఞములుచేసి, హావిర్భాగముల మీరు దేవతల నభివృద్ధి నొందించవలయును. మీ భాగములచే దృప్తులై యభివృద్ధిని గన్న దేవతలు, వృష్ట్యాదులచే తృప్తినొందించగలరు. ఇట్లు దేవత మీరును అన్యోన్య మాదరించుకొనవలయును. అట్లు మీకు మిక్కిలి శ్రేయస్సు కలుగును- అని తెలియు ు.

న్న ద్భవంతి భూతాని పర్జన్యా దన్న సంభవః
ద్భవతి పర్జన్యః యజ్ఞః కర్మసముద్భవః''
బ్రహ్మోద్భవం విద్ధి,
మ్రాऽక్షర సముద్భవం,
త్సర్వగతం బ్రహ్మ నిత్యం యజ్ఞే ప్రతిష్ఠితం
ప్రవర్తితం చక్రం నానువర్తయతీహ యః
యు రింద్రియారామో
ఘం పార్థ స జీవతి''

ముగ ఎవడు కర్మను చేయదగిన అధికారియయ్యును, యజ్ఞపూర్వకముగ జగచ్చక్రము ననువర్తింపడో ప పాపమును భుజించువాడగును. అనగా పాపజీవ యుంద్రియములచేతనే సదా క్రీడించువాడై వనితాది సుఖముల ననుభవించువాడై వ్యర్థజీవనుడగుచున్నాడు. విధివిహితములగు మన మన వర్ణాశ్రమాచార పద్ధతుల ననుసరించి ఇహపరముల సాధింప వలసియున్నది. ఈవిధమున శ్రుతిమాత జీవులను నిషిద్ధకర్మ విముఖులుగను చేసి, యజ్ఞయాగాది సత్కర్మాచరణముచే ఐహిక ఆముష్మిక సుఖాసక్తులుగ జేయును. కాని-

"వాయవ్యగ్ శ్వేత మాలభేత భూతికామః''

ఇత్యాది విశేషవిధుల ననుసరించి తత్తదనుకూల కర్మాచరణముచే అతులితైశ్వర్యవంతులై ఐహిక సుఖసంపన్నులయినను, చయనాది క్రత్వనుష్ఠానములచే, బ్రహ్మలోకావాసము సంభవించినను, శతాధికాశ్వమేధాదులచే స్వర్గాధిపత్య పదవీ విభూషితులైనను, తామభిలషించు స్థిరత్వమున అఖండ ప్రభా విభాసురత్వము నిరతిశయానందానుభవము కలుగుటలేదు. జనన మరణ ప్రవాహరూపమగు సంసారమరికట్ట బడుటలేదు. కనుకనే,

''కర్మణా బధ్యతే జంతుః''

అని కర్మచేత జంతువులకు బంధమేర్పడుట నిశ్చయమని మన మెరుంగవలసి యున్నది.

"పరీక్ష్య లోకాన్ కర్మచితాన్, బ్రాహ్మణో
నిర్వేద మాయాత్, నాస్త్యకృతః కృతేన''

బ్రాహ్మణుడు కష్టించి యాగాదులొనర్చి తత్ఫలమగు స్వర్గమున కేతెంచి అందు వసించినను న్యూనాధిక భావములు, ఈర్ష్యాసూయలు మొదలగునవి వదలకుండుటయు, నిరతిశయానంద ప్రాప్తి కలుగకుండుటయు జూచి "స్వర్గమునకువచ్చినను ఏకులువడుకుట తప్పలేదనుసామెత'' యనుభవమునకు వచ్చుచున్నది.

"తద్యథేహ కర్మచితో లోకః క్షీయతే,
ఏవమే వాముత్ర పుణ్యచితో లోకః క్షీయతే''

ఈ లోకమందు మనము కాయక్లేశాదులు పడి, పెంచి, పెద్దచేసిన సస్యాదిక మే విధముగ కోయబడుచున్నదో, ఆవిధముగనే మనకర్మలచే లభించిన కర్మఫలముకూడ హరింపబడుచున్నది. కనుకనే

"క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి''

అని పుణ్యము క్షీణింప మనుష్యుడు మర్త్యలోకమును పొందుచున్నాడు. పైనజూపిన శ్రుతిస్మృతీతిహాస వాక్యములు దేహేంద్రియములు. తత్సుఖసాధనములైన దారాపుత్ర క్షేత్ర మంది రారామాదులు నిత్యమని నమ్మి, జీవులకు

"మూర్ఖం ఛందానురోధేన''

అనినట్లు మానవుడా! ఇహసుఖముకన్న స్వర్గ సుఖ మమేయము. దానికై ప్రయత్నింపుము. ఆ స్వర్గ మతిరమణీయము. ఆ నందన వన విహారము, ఆ యమృతపానము, ఆ రంభాద్యప్సరసల విలాసములు, అసమానములు. అత్యంతానంద సంధాయకములని చెప్పి, శ్రుతిమాత మానవుల స్వర్గ సుఖాసక్తులగావించుట యథార్థము. కాని దీనిచేత మనుజుని కొక మహత్తర లాభ మొనగూడుచున్నది. ఏమన అవిద్యామూలమున అనేక జన్మలనుండి వచ్చుచున్న దేహమే సత్యము, విషయాద్యుప భోగములే నిత్యములు. పుణ్యాపాపములు, నామమాత్రములు అను నమ్మికతో బ్రవర్తించు వారికి "కొబ్బరి బొండమునకు డొక్కవలె" స్వర్గసుఖముద్వారా దేహాత్మ విశ్వాసము వదలించి చార్వాకభావమును సంస్కరించుట కవకాశము కలుగుచున్నది. స్వర్గాపేక్షతో మానవులకు దేహేంద్రియ సుఖాపేక్ష తాత్కాలిక లాభమునకై ప్రవర్తించు దుష్ప్రవర్తనము సమూలముగ తొలగిపోవుచున్న దనుటయే కాక స్థూలదేహాతిరిక్త స్వాత్మ నిశ్చయముకూడ ఘటించుచుండుటమాత్రముగొప్పలాభదాయకమనుట నిర్వివాదాంశము. ఇదియొక కక్ష్యాభేదమున స్వర్గమన సుఖాధిక్య మనుభవింపజేయు నొక యుత్తమస్థానమేగాని జనన మరణ ప్రవాహ మరికట్టుచు,

"యోవై భూమా తదమృతం"

అని నిత్య నిరతిశయాఖండాద్వితీయానందానుభూతిని గలిగించు మోక్ష మనదగిన మహత్తర భూమానంద స్థానము మాత్రము కానేరదు.

ఇదియే సత్యము కానేరకున్న కొబ్బరికాయను బగులగొట్టి సంపూర్తిగ నంకురశక్తినిగూడ నశింపజేసినట్లు స్వర్గాద్యుత్తమ లోకగమన మొనరించు లింగశరీరభంగ మనదగిన నిష్కామ కర్మానుష్ఠానమును భగవానుడు శ్రీకృష్ణుడు అర్జునున కేల యుపదేశించును. ఆవిషయమే మన మించుక విమర్శించి చూచిన పై సందేహనివారణము కాకమానదు. కాన నిష్కామకర్మానుష్ఠాన ప్రాశస్త్యమించుక విచారించి చూతము.

అర్జునుడు "కురుక్షేత్రయుద్ధప్రారంభమున ఉభయసేనల మధ్య రథోపవిష్టుడై భీష్మాదులనుజూచి; వీరెల్లరు గురువులు, బంధువులు, మిత్రులు, పెద్దలు, పిన్నలు వీరినెల్లర నొక్కపెట్టున యుద్ధభూమికి బలియిచ్చి యనుభవించు రాజ్యభోగముకన్న భిక్షాజీవనమే యుక్తమని తలంచి మహావీరుడైనను యుద్ధము క్షత్రియోచితధర్మమని ఎరింగినవాడైనను శోకమోహపరీతమానసుడై"

"నయోత్స్యఇతి గోవింద
ముక్త్వా తూష్ణీం బభూవహ"

అని కృష్ణునితో చెప్పి యూరకున్న, అర్జునుని స్థితి భగవానుడాలోకించి దేహాత్మభ్రాంతిచే శోకమోహపరీతమానసుడై దేహసంబంధుల కొఱకు దుఃఖించుచు స్వధర్మమును గూడ వీడి భిక్షాజీవనమునకు గడంగెదననుచున్నవాడు పార్థుడు. లోకమిట్టిదియే గదా!

"సర్వ ప్రాణినాం శోకమోహాది దోషావిష్ట
చేతసాం, స్వభావత ఏవ స్వధర్మత్యాగః
ప్రతిషిద్ధ సేవాచ స్యాత్,
ఇత్యత స్సంసారబీజౌ శోకమోహౌ"

ఈవిధమున శ్రీ శంకరభగవత్పూజ్యపాదులు భాష్యమొనర్చిరి. భగవద్గీతలో ద్వితీయాధ్యాయమున 11 వ శ్లోకము మొదలు 38 వ శ్లోకము వఱకు భగవానుడర్జుననకు సాంఖ్యతత్వము నుపదేశించెను,

"ఏషా త్వేఽభి హితా సాంఖ్యే
బుద్ధి ర్యోగే త్విమాం శ్రుణు
బుధ్యా యుక్తో యయా పార్థ
కర్మబంధం ప్రహాస్యసి"

అర్జునా! నీకు పరమార్థవస్తు వివేక విషయమగు జ్ఞానము నుపదేశించితిని. నీవిక కర్మయోగవిషయమైన విశేషమును వినవలెను. ఇది విని దీని ననుష్ఠించినయెడల నీశ్వరప్రసాద నిమిత్తమగు జ్ఞానసంపద లభించి దానిచే అనివార్యమగు కర్మబంధమంతయు వదలగలదు.

"కర్మణ్యే వాధికార స్తే మా ఫలేషు కదాచన
మాకర్మ ఫల హేతు ర్భూఃమా తేసంగో స్త్వకర్మణి
యోగస్థః కురుకర్మాణి సంగం త్యక్త్వా ధనంజయ
సిధ్యసిధ్యో స్సమో భూత్వ
సమత్వం యోగ ఉచ్యతే
దూరేణ హ్యావరం కర్మ బుద్ధియోగా ద్ధనంజయ!
బుద్ధౌ శరణ మన్విచ్ఛ కృపణాః ఫలహేతవః"

అర్జునా! బుద్ధి యోగముకంటె (నిష్కామ కర్మయోగమున కంటె) కర్మయోగము (ఫలాభిలాషతోగూడిన కర్మయోగము) చాలా తక్కువైనది. అధమ మైనది. (జనన మరణ బాధల నొందించునదిగావున) అందుచే సమత్వబుద్ధియందు శరణము నొందుము, ఇట్టి నిష్కామకర్మయోగమే సమ్యగ్దర్శన పర్యవసాయి. (అపరోక్ష బ్రహ్మతత్వప్రతిపత్తి పర్యవసానమగుటచే)

"సర్వం కర్మాఽఖిలం పార్థ జ్ఞానే పరిసమాప్యతే"

అని భగవదుక్తి ననుసరించి ఈకర్మయోగమే పరమపురుషార్థ సాధనమని భాష్యమూలమున దెలియుచున్నది.

అట్టి సమ్యగ్దర్శన లాభమును పొందనివాడు మానవత్వమును గోలుపోయినట్లే యని

"యో వా తదక్షరం గార్గ్య విదిత్వాఽ స్మాల్లోకాత్ప్రైతి సకృపణః"

ఓగార్గీ! అక్షరస్వరూపమైన పరమాత్మను దెలిసికొనక ఎవ డీలోకమునుండి పోవునో, వాడు కృపణుడనిబృహదారణ్యకశ్రుతి నుడువుచున్నది. గాన ఫలసిద్ధి యగుచున్నదో లేదో తెలిసికొనక కర్మల నాచరించువాడు ఎట్టి ఫలమును బొందుచున్నాడో అది వినవలెను.

"బుద్ధియుక్తో జహాతీహ ఉభౌసుకృత దుష్కృతే తస్మా ద్యోగాయ యుజ్యస్వ యోగః కర్మసు కౌశలం"

కర్మఫలసిద్ధికై విచారింపక సత్కర్మల నాచరించువాడు సుకృత దుష్కృతముల రెండింటిని వదలువాడగుచున్నాడు. అందుచే యోగముకొఱకు, బుద్ధి యోగముకొఱకు యత్నింపుము.

యోగమే (ఫలప్రాప్తి త్యప్రాప్తి దృష్టి లేక సత్కర్మ చేయడమే) కర్మలయందు నేర్పరితనము

"తద్ధికౌశలం బంధక స్వభావా న్యపి కర్మాణి సమత్వబుధ్యా స్వభావా న్నివర్తంతే తస్మాత్సమత్వ బుద్ధియుక్తో భవ"

నేర్పరితనమన నది. బంధకస్వభావము కలవియైనను కర్మలు ఫలభావన లేక ఈశ్వరార్పణబుద్ధిచే జేయబడి బంధక స్వభావమునుండి మరలింపబడుచున్నవి,

గాన ఫలాభిసంధి లేక చేయు సత్కర్మానుష్ఠానమే మానవులను అనృత జడ దుఃఖాత్మకమగు సంసారబంధమునుండి తొలగించి శుద్ధబుద్ధముక్తస్వభావమగు నిత్య నిరతిశయానంద మోక్ష సామ్రాజ్యపదవి నధిష్ఠింపజేయు [illegible] నిశ్చయింపవలసియున్నది. ఇంతచెప్పినను [illegible] సంశయము కలుగకపోదు. మోక్షమన [illegible] యానంద స్థితిగదా

"యత్రత్వస్య సర్వ మాత్మైవాభూత్, తత్కేన కం పశ్యేత్ తత్కేన కం విజానీయాత్"

అని బ్రహ్మాండములు, సూర్యచంద్రులు సర్వము [illegible] ముగ నుండునని, ఇంక జూచునదిగాని, [illegible] నేరదని దృగ్దృశ్య వ్యవహారమే యంతరించునని [illegible] చెప్పుచుండ వర్ణాశ్రమ వయోవస్థాది [illegible] పూర్వకముగ అనుష్ఠింపదగిన కర్మయోగము. [illegible] తాత్మదర్శన కారణము ఎట్లు కాగలదు! "[illegible] ఘటాదులయందువలె" కర్మయోగ ధర్మములు [illegible] మందు కానబడుటలేదుగదా! కాన నీ రెండింటికిని [illegible] కారణ భావమెట్లు పొసగగలదు! ఫలమొక్కటి లేనంత మాత్రమున, తనను వేరు, ఈశ్వరుని వేరుగ, హవిస్సు, మొదలగువానిని భిన్నములుగ జూచుచు,బహువిధ విశేష విభావనలచే జేయు,కర్మచేత నిరవశేషమై, యద్వితీయమై, అనన్యమగు ఏకాత్మ ప్రతిపత్తి లభించునని చెప్పుట యుక్త్యనుభవ విరుద్ధముగ నుండక మానదని కొందరు తలంపవచ్చును. అయిన నివి ఎట్లు కలుగనేర్చునో ఇంచుక విచారింతము.

"జ్యోతిష్టోమేన స్వర్గకామో యజేత"

ఇత్యాది శాస్త్రముల ననుసరించి సమిత్కుశపురోడాశాది లౌకికవస్తు నిష్పాద్యమగు కర్మచేత ఆ ముష్మికములగు స్వర్గాది ఫలములు, ప్రత్యక్షానుమానాగోచరములైనను లభించునని ఆస్తికులకెల్లరకెట్లు విశ్వసనీయములగుచున్నవో ఆట్లే -

"త మేతం వేదాను వచనేన బ్రాహ్మణా వివిదిషంతి యజ్ఞేన దానేన తపసా నాశకేన"

ఇత్యాది శాస్త్రమువలన కర్మయోగము సమ్యగ్దర్శన సాధనమనుటకూడ విశ్వసనీయమనుటకు విప్రతిపత్తి యుండ గూడదు. మరియు "విజాతీయ మనోజ [illegible] లచే నొప్పియున్న గులాబి పుష్పమునకు తద్విపరీత స్వభావము కలదియై కంటకాకీర్ణమగు గులాబిచెట్టు కారణముగుటజూడ" మన యుక్తి లోకానుభవముననే వ్యర్థమగుచుండ శాస్త్రీక

సమధిగమ్యములగు నలౌకికార్థముల నిర్ణయించుటకు జాల నేరవని వేరుగ చెప్పనక్కఱలేదు. కావుననే,

"అచింత్యాః ఖలు యే భావాః,
న తాం స్తర్కేషు యోజయేత్,"

అను నార్యోక్తి శరణ్యము గాకతప్పదు. ఇట్లు చెప్పినంత మాత్రమున శ్రుతివిహితములైన యర్థములలో ఉపపత్తి, అనగా (యుక్తి) యుండదని మాత్రము భ్రమింపరాదు. మనయుక్తుల కగోచరములగు శాస్త్రార్థములను నిరాకరించ రాదని మాత్రమే పై వచనమునకు మన మెరుగదగిన సూక్ష్మాభిప్రాయము. కావుననే,

"శ్రుతి మత స్తర్కోఽను సంధీయతాం"

అని శ్రీమద్భగవత్పాదోక్తికూడ మన మెరుంగఁదగియున్నది. ప్రకృతము నిష్కామ కర్మానుష్ఠాన సమ్యగ్దర్శనములకు, శాస్త్రీయమగు హేతు హేతుమద్భావము సూక్ష్మముగ విచారించిన సోపపత్తికముగనే యున్నది. చూడుడు — ఈ విచారములో కర్మలనగా వాఙ్మనఃకాయాత్మములగు త్రికరణములచే జేయఁబడు శాస్త్రీయములగు వ్యాపారములు. ప్రతి కర్మయు ఈ త్రికరణ సంబంధముతో నడచును. కాని ఈ మూటిలో మానసిక వ్యాపారమునకే ప్రాధాన్య ముండకతప్పదు. ఒకప్పుడు కేవలము మానసిక కర్మ యుండునుగాని మనోవ్యాపార పూర్వకముగా నట్టి వాక్కాయ వ్యాపారములుమాత్ర ముండనేరవు. కావుననే శారీరముకన్న వాచికము, దానికంటె మానసికము, ఉత్తరోత్తరము శత గుణాధికములని శాస్త్రములు చెప్పుచున్నవి. మరియు నట్టి మానసిక వ్యాపారపారిశుద్ధ్యమే ద్వైవిధములగు వాక్కాయ వ్యాపారములకు ముఖ్యఫలమని గూడ కర్మయోగసారాంశమై యున్నది. వాక్కాయవ్యాపారములు ఒకే విధమగు యజ్ఞమందు దేవదత్త యజ్ఞదత్తులకు సమానములుగ లోకులకు గోచరించినను, దేవదత్తుడు స్వర్గఫలాకాంక్షి యగుట వలన నా యజ్ఞము కామ్యమై యనిత్య స్వర్గమాత్ర ఫలక మనియు, యజ్ఞదత్తుడు ఫలాకాంక్షా విరహితుడై

"యతః ప్రవృత్తి ర్భూతానాం
యేన సర్వ మిదం తతం
స్వకర్మణా త మభ్యర్చ్య సిద్ధిం విందతి మానవః"

అనెడి భగవదుక్తి ననుసరించి, యజ్ఞఫలము, కేవల భగవదర్పణము చేయుచు వాడగుటవలన, ఆ యజ్ఞము నిత్యకర్మయై, చిత్తశుద్ధి ద్వారా సమ్యగ్దర్శన సాధనమై, నిత్యాపవర్గ పర్యవసానమని భగవదుక్తి భగవద్పాదోక్తులవలన దెలియుచున్నది. ఇచట దేవదత్త యజ్ఞదత్త కర్తృకములైన యజ్ఞములలో భేదము బాహ్యదృష్టి కణుమాత్రము గోచరింపక పోయినను ఆ రెండింటిలో నొకటి కామ్యమై, యనిత్య స్వర్గఫలక మగుటయు, రెండవది నిత్యకర్మయై, సమ్యగ్దర్శన సాధనమై, నిత్యాపవర్గపర్యవసాయి యగుటయు, జూడ; కేవలకర్మకును, కర్మయోగమునకును, ఫలాపేక్షా తదుపేక్షా రూపములగు మనోవ్యాపారభేద మాత్రముననే ఇంతటి మహత్తరమగు ఫలభేదము సంభవించుటచే వాక్కాయ వ్యాపారములు గౌణములనియు, మానసికవ్యాపారము మాత్రమే ప్రధానమనియు, అదియే ముఖ్యమగు కర్మశబ్దార్థమనియు, వ్యక్తమగుచున్నది. ఇట్టిస్థితిలో సమ్యగ్దర్శన కర్మయోగములకు లోగడచెప్పినట్లు "గులాబిచెట్టునకు దాని పుష్పమునకువలెగూడ" స్వరూపస్వభావములచే వైజాత్యము లేదనియు, "మృద్ఘటములకువలె" సాజాత్యము కలదనియు, దృఢముగ వ్యక్తమగును. ఎట్లనిన నిష్కామకర్మయోగమునఁ బర్యవసానమున స్వర్గాదిఫల తృణీకారపూర్వకమగు సర్వాత్మక పరమాత్మాయత్తచిత్తత్వమనియు, సమ్యగ్దర్శనమనగా

"సర్వవిశేష ప్రతిషేధపూర్వక
నిర్విశేష ప్రత్యగభిన్న
బ్రహ్మాకారాకారి తాఽపరోక్షాంతఃకరణవృత్తి"

యనిగదా తేలినది. అనగా కర్మయోగములోని

"స్వర్గం మే నస్యాత్, పరమేశ్వ రార్పణ మస్తు"

అనెడి యంశద్వయమునకు "మృత్తు ఘటమునకువలె" ఉపాదానకారణమని సూక్ష్మతమోపపత్తులచే గాననగును. అది ఎట్లన;

ఏకర్మయోగి స్వకృతయజ్ఞాదులకు ఫలముగ స్వర్గాదిప్రభూత ఫల ముపభోగ్యముగ సంప్రాప్తమగుచున్నను, అద్దానిని తృణీకరించుటచే స్వర్గఫలతృణీకారముతోపాటు తదుపభోగార్హమగు దివ్యదేహతృణీకారమును తదుభయ తృణీకారములచే "కైముతిక న్యాయమున" ఐహికఫల తదుపభోగ సాధనీభూత భౌతికదేహతృణీకారములును సిద్ధించుట వలన ఐహికాముష్మిక సుఖసర్వస్వ ప్రతిషేధము ఘటించుటయు, ప్రాణిసామాన్యసాధారణమగు దుఃఖ తత్సాధన ప్రతిషేధము స్వాభావికమేయగుటయు, జూడ సమ్యగ్దర్శన స్థితియందువలె సర్వవిశేషప్రతిషేధస్వభావము కర్మయోగికి

కర్మయోగకాలముననే యంకురించి క్రమముగ ప్రవృద్ధమై సర్వవిశేషప్రతిషేధాంశమున సమ్యగ్దర్శనస్వభావము నొందుచున్నట్లు, ఈయుపపత్తివలన స్పష్టమగుచున్నది.

ఇక రెండవయంశము – కర్మయోగములోని పరమేశ్వరార్పణబుద్ధి యిదియే. సమ్యగ్దర్శనములోని నిర్విశేషప్రత్యగభిన్నబ్రహ్మాకారాంతఃకరణవృత్తిగా పరిణమించుటగూడ యుక్తిసహముగనే యున్నది. భిన్నాత్మభావుడగుకర్మయోగి వాడెడి పరమేశ్వరశబ్దమునకు పరోక్షరూపమగు స్వవ్యతిరిక్తేశ్వరతత్త్వమే యర్థమగును గాని, సమ్యగ్దర్శనమందువలె సర్వాత్మకప్రత్యగభిన్నబ్రహ్మతత్త్వమెట్లుఅర్థముగానేర్చును అని శంకపొడమునుగాని, కర్మయోగి యథగతబ్రహ్మాత్మభావుడు నేడు గాకుండినను,

"యతః ప్రవృత్తి ర్భూతానాం
యేన సర్వమిదం తతమ్
అయమాత్మా గుడాకేశ! సర్వభూతాశయస్థితః
ఈశ్వర స్సర్వ భూతానాం హృద్దేశేర్జున తిష్ఠతి"

ఇత్యాది భగవదుక్తుల ననుసరించి సర్వాత్మకుడనియు, ప్రత్యగభిన్నుడనియు, సర్వ హృదయాంతర్యామియనియు, పరోక్షముగ నిర్ధరించి సమ్యగ్దర్శిచే ఏ తత్త్వ మవలోకింపబడుచుండెనో, ఆ తత్త్వమునే కర్మయోగి యగు తాను నిరతిశయ ప్రేమచే నారాధించుచుండెనుగాని యితడు మరియొక ఈశ్వరుడుగాడు. సర్వహృదయాంతర్యామియగు చైతన్యమే నాస్వరూపమని భగవంతుడు చైతన్యమాత్రాత్మనిశ్చయముచే చెప్పుచున్నాడు. సమ్యగ్దర్శనస్థితిలో నీ కర్మయోగికూడా అట్టి నిశ్చయమునే పొందుచున్నాడు.

ఇట్లగుటచేతనే –

"జ్ఞానత్వాత్మైవ మేమతం"

అని భగవానుడీయర్థమునే స్పష్టపరచెను. నేడట్టి సాక్ష్యాత్మనిశ్చయము తనకు ఘటించలేదనెడి కొరతయే తప్ప సర్వాత్మకమగునే సాక్షి చైతన్యమును పరమేశ్వరశబ్దముతో బిలుచుచుండెనో, ఆ చైతన్యముకన్న తానువేరట బుద్ధిసాక్షియగు చైతన్యాంతరము శ్రుతియుక్త్యనుభవములతో నెంత విచారించినను మఱియొకటి కనుబడనేరదు. కావుననే

"అహమస్మీతి విజానన్
బ్రహ్మైవాసౌ స్వయం విజానాతి"

యని భగవత్పాదులును,

"జ్ఞానీచాత్మైవ మే మతం"

అని భగవానుడును చెప్పిరి. కావున కర్మయోగిచే నారాధితుడగు నీశ్వరుడు ప్రత్యగభిన్నమగు పరమాత్మ స్వరూపమే. అట్లగుటచేతనే వస్తుస్థానమును, మార్గక్రమమును గుర్తించి, సగుణోపాసన చేసెడి కర్మయోగికి, తెరచాటుననున్నవస్తువును భజించువానికి, ఆ వస్తువు తెరతీసి గోచరించునట్లును, స్వభ్రాంతి విలసితమగు "రజ్జుసర్పమును," రజ్జువు అని భావించువానికి సర్పభూమికవదలి, రజ్జుసాక్షాత్కారమైన చందమునను, దశముడు మృతుడయ్యెనని తనను మరచి యన్యుల లెక్కించి దుఃఖించువానికి దశమాత్మత్వ ప్రతిపత్తిచే. స్వస్వరూప స్థితి కలిగినట్లును,

"వశీకృతే మనస్యేషాం సగుణబ్రహ్మశీలనాత్
తదేవావిర్భవేత్సాక్షా దపేతోపాధికల్పనం"

అని చెప్పినట్లు కర్మయోగకాలమున తనచే నర్చింపబడు యజ్ఞేశ్వరుడే సర్వాత్మకుడగు ప్రత్యగభిన్న పరమాత్మస్వరూపముగ పర్యవసానము నొందునని తెలియదగియున్నది. కావుననే "పరమేశ్వరార్పణమస్తు" అనెడి కర్మయోగ ద్వితీయాంశమగు బుద్ధియే, సమ్యగ్దర్శనమున నిర్విశేష ప్రత్యగభిన్న బ్రహ్మాకారాకారిత ధీవృత్తి రూపముగ 'మృత్తుఘటమువలెను, మొగ్గ పూవువలెను' పరిణమించుననుట సోపపత్తికముగ నున్నదనుటలో సంశయ ముండనేరదు. కర్మయోగ మిట్టిదగుటచేతనే

"సర్వం కర్మాఖిలం పార్థ! జ్ఞానే పరిసమాప్యతే"

అను విలువను మనము గుర్తింపవలసియున్నది.

'కాండద్వయోపపాద్యాయకర్మబ్రహ్మస్వరూపిణే
స్వర్గాపవర్గరూపాయ యజ్ఞేశాయ నమోనమః'

అని శ్రౌతసిద్ధాంత సర్వస్వముగ సాధన ఫలైకత్వ మీవిధమున ప్రతి కర్మయోగియు, యజ్ఞేశ్వర స్తుతిరూపమున వ్యక్తీకరించుచున్నాడు. కనుకనే,

"కర్మణైవహి సంసిద్ధి మాస్థితా జనకాదయః"

అను గీతావాక్యము సార్థకమగును. ఇట్టి నిష్కామ కర్మానుష్ఠాన ప్రాభవమును దెలుపజాలి, కొన్ని శతాబ్దులనుండి ఆబాలగోపాల మాంధ్రులకు పఠన పాఠనాదులలోనుండిన తృణీకృత స్వర్గ వైభవుడగు ఒక ధీరవరేణ్యుని పవిత్ర చరిత్రము నుదాహరణముగ జూపుచున్నాడను.

ఆంధ్రభోజుండని ప్రసిద్ధివహించిన శ్రీకృష్ణదేవరాయాస్థాన మందలి అష్టదిగ్గజములలో ఆంధ్ర కవితాపితామహుండని

ప్రసిద్ధి పడసిన 'అల్లసాని పెద్దన కవీంద్రుడు' తన అనన్య సాధారణమగు ప్రతిభకును, సర్వతోముఖ పాండిత్యమునకును, అపారలోక జ్ఞానమునకును, నికషోపలముగ ప్రవరాఖ్యపాత్రను అద్భుతరీతిని సృష్టించి అజరామరమగు కీర్తి కాయముతో నేటికిని వసుంధరయందు చిరస్మరణీయుడయ్యెను.

"దృష్టపూర్వాఅపి హ్యర్థాఃకావ్యేరసపరిగ్రహాత్
సర్వే నవ ఇవాభాంతి మధుమాస ఇవద్రుమాః"

అనురీతి ప్రవరాఖ్యుఁడు పెద్దన అపూర్వసృష్టి కాకపోయినను, అద్భుతసృష్టి యనక తప్పదు. ఈమహాకవి ప్రవరాఖ్యుని, శ్రుతిచోదిత షట్కర్మాచరణ పరాయణునిగను, అప్రతిగృహీతగను, మాతాపితృతిథి సేవాతత్పరునిగను, తృణీకృతస్వర్గసౌఖ్యునిగను

"యువాస్యాత్ సాధుయు వాధ్యాయికః
ఆశిష్ఠో దృఢిష్ఠో బలిష్ఠః"

ఇత్యాది శ్రుతి ప్రతిపాదితమగు మానుషానందమును ఆదర్శగార్హస్థ్యమును, అనన్యసాధారణమగు ప్రతిభతో అతనియందు చిత్రించి తనకుగల వైదిక ప్రవీణతను, నిష్కామ కర్మానుష్ఠాన ప్రాశస్త్యరూపమగు స్వసిద్ధాంతమును ఎట్లు ప్రవరరూపమున లోకమునకు చాటగలిగి కవి కులతిలకుడయ్యెనో ఇంచుక విచారింతము ఈ విషయమునే పై పద్యంబున సూచించెను

ఉ. ఆపురిఁబాయకుండు మక
రాంక శశాంక మనోజ్ఞమూర్తి భా
షాపర శేషభోగి వివి
ధాధ్వర నిర్మల ధర్మకర్మ దీ
క్షాపరతంత్రుఁ డంబురుహ
గర్భకులాభరణం బనారతా
ధ్యాపన తత్పరుండు ప్రవ
రాఖ్యుఁ డలేఖ్య తనూవిలాసుఁడై.

మకరాంక శశాంక మనోజ్ఞమూర్తియు, భాషాపరశేష భోగియు, వివిధాధ్వర నిర్మల ధర్మకర్మ దీక్షాపరతంత్రుడును, అనారతాధ్యాపన తత్పరుండును, అంబురుహగర్భ కులాభరణుండును, అగు ప్రవరునికి ఆర్యావర్తదేశంబున వరుణాతరంగిణీతటంబున, సకల సంపత్సమృద్ధమై,నిరతాగ్నిహోత్రులును, నిఖిల విద్యావిశారదులును నగు భూసురుల కాలవాలంబగు వరుణాస్పద పురము నివాసస్థానంబుగ నిర్మించె. ఇందు మకరాంక శశాంక మనోజ్ఞమూర్తి, భాషాపరశేషభోగి, వివిధాధ్వరనిర్మల ధర్మకర్మ దీక్షాపరతంత్రుడు, అను విశేషణ త్రయముచే పాదత్రయముచే భువనత్రయ మధిరోహించు త్రివిక్రమునిలీల ప్రవరాఖ్యుఁడు

ఉ. ఎందు వసించి ధన్యుఁడ వి
ధీంద్రము ఖామరకోటినెల్ల నిం
చుం దృణ మట్లు దేనిఁ జవిఁ
జూచుటచే రసహీన భావముం
జెందు జగత్ప్రభుత్వమును
జెప్పఁగరాని యనంత కేవలా
నందము దానియందు మది
నాటుము మానము నీచభోగముల్.

అని భర్తృహరి చెప్పినట్లు అట్టి అఖండాద్వైతీయానంద సామ్రాజ్యాధిష్ఠితుడు కాగలిగెను.

శృంఖలాక్రమమున పైవిశేషణత్రయము ప్రవరుని యందు ఎంతేని సుసంగతములై శోభిల్లెను. మహాగంభీరుండగు రత్నాకరునిసైతము నిజసందర్శనజనిత ప్రేమోన్మాద వశంబున ఎంతయో క్షోభింప అధీరుని జేసిన శశాంకునిపగిది, దివ్యాంగనలు సైతము తమంత తావలచి రాదగినట్టియు, దివ్యదుర్లభంబగు నిజరూప సంపదచే దర్శనమాత్రమున సాగర గంభీరయు, ప్రౌఢయు, త్రిభువనసుందరియు నగు వరూథిని యను నచ్చరలేమ డెందమునఁ బ్రేమవాహిని వెల్లువలై ప్రవహింపజేసి నిజరూపభావనచే "భ్రమర కీట న్యాయమున" దివ్యాంగనయగు వరూధినిచే సైతము మర్త్యత్వమాపాదింపజేసి

"ఎంత తపంబుచేసి జనియించినవారొకొ మర్త్యభామినుల్"

అని తన దివ్యత్వమును నిందింపజేసి తుదకామెను అధీరనుగా జేలనుగా చేయజాలిన మకరాంక శశాంక మనోజ్ఞమూర్తి ధీరుడు, ప్రవరుడు.

ప్రవరుని చక్కదనము మకరాంక శశాంక మనోజ్ఞమైనది గదా యనియు, పద్మభవుడు

"నేరెలేటియసల్ దెచ్చి నీరజాప్తు
సానఁబట్టిన రా పొడి చల్లిమెదపి
వదను సుధనిడి చేసెను"

గదాయనియు భ్రమసి

"...మీనకేతన ధను
ర్జ్యా ముక్తనారాచ దు
ర్దిన నమ్మూర్ఛిత మానసాంబురుహయై"

వరూథిని యాతని కామించి సాభిప్రాయముగ

"కుం దనము వంటి మేను మధ్యందినాత
పోష్మహతిఁ గందె, వడదాకె నొప్పులొలుకు
వదన మస్మద్గృహంబు పావనము చేసి
బడలికలు వాసి చనుము"

అని యాతిథ్యము గ్రహింపవేడినది కాని

"వాని చక్కఁదనము వైరాగ్యమునఁ జేసి
కాంత్ర సేయు జారకాములకు
భోగభాగ్యమయ్యెఁ "బూచిన సంపెంగ
పొలుపు మధుకరాంగనలకుఁ బోలె"

అని తనయట్టి వారలకు అందజాలని ఫలమని తెలియని బేల యయ్యెను. "ప్రథమకబళే మక్షికాపాతమనునట్లు" మకరాంక శశాంకమనోజ్ఞ మగు నాతనిరూపమును కామించుట, అయ్యది పూచినసంపెంగపొలుపువలెభోగబాహ్యమగుట, ఈరెండును నెను వెంటనే సంభవింప ఇక ముందు కథ సాగు టెట్లు? ధార్మికు డగు పెద్దన నిష్కామ కర్మానుష్ఠాన ప్రాశస్త్యమును ప్రవరముఖమున నుద్ఘోషించు టెట్లు?

ప్రవరుడు మకరాంక శశాంక మనోజ్ఞ మూర్తియే గాదు. ఇక భాషా పరశేషభోగి కదా! కనుకనే అపరాహ్ణసమయము మున "గారుడోత్కీర్ణమగు నొక దివ్యభవన ప్రాంగణము నందలి సహకారమూలమున మణి మయ వితర్దిమీద సుఖాసీనయై తన జిలిబిలి పాటను వీణాస్వనమున మేళవించి, అరమోడ్పు కనుదోయితో రతిపారవశ్య విభ్రమము దెలుప వీణ వాయించుచున్న నత్త్రిభువనైక సుందరిని గని" ఇది కులాంగన గాదని దర్శనమాత్రముననే తెలిసికొని జితేంద్రియుడగు నా ప్రవరుండు నిర్వికార చిత్తమున

"ఎవ్వతె వీవు భీత హరి
ణేక్షణ యొంటిఁజరించె దోట లే
కివ్వనభూమి భూసురుడఁ
నే ప్రవరాఖ్యుఁడఁ దోవదప్పితిం
గ్రొవ్వున నిన్నగాగ్రమమున
కుంజనుదెంచి పురంబుఁజేర నిం
కెవ్విధిఁ గాంతుఁ దెల్పఁగద
వే తెరువెద్ది శుభంబు నీ కగున్."

అని మృదుమధుర గంభీరముగ ప్రశ్నింప "భీతహరిణేక్షణ" యని బోధించి తన ఏకాంతమును గూర్చి మున్ముందు ప్రశ్నించి, పిదప తన కథ నెరిగించుటచే,

"కామీ స్వతాం పశ్యతి."

యను న్యాయమున నవ్వరూథిని యాతనిఁ దనయం దను రక్తునిగను, మనోజ్ఞ మగు రూపమున కనుగుణమగు మృదు మధుర సరస వచో విరాజితునిగను, రసికునిగను ఎరిగి భ్రమసి, తద్రూప సందర్శన సంజనితమైన ప్రేమలత, భీతహరిణేక్షణ యనునట్టి మృదుమధుర సరస వచో జలసేక ధారల వడివడి ప్రాకి పల్లవింప, నమ్మహీసుర కుమారు తారుణ్య మాధుర్యంబులం జేసి, తన వైదగ్ధ్యంబు మెరయ గలిగెనని పల్లవించు నుల్లంబుతో నెలవార నవ్వి, సవిలాసముగ,

"ఇంతలు కన్నులుండఁ దెరు
వెవ్వరి వేడెదు భూసురేంద్ర! యే
కాంతమునందు నున్న జవ
రాండ్ర నెపం బిడి పల్కరించు లా
గింతియె కాక నీ వెరుగ
వే మునువచ్చిన త్రోవ చొప్పు నీ
కింత భయంబులే కడుగ
నెల్లి దమైతిమి మాటలేటికిన్."

అని యాతని ప్రశ్నకు బ్రత్యుత్తరింపకయే తన నెఱజాణ తనమును జూపి,

"భూసుర కైతవ కుసుమ శ
రాసన! మా యింటి విందవైతివి గైకొ

మ్మా సముదంచన్మణి భవ
నాప్తీనత సేదదేరి యాతిథ్యంబున్."

అని ఆతిథ్యమియ్య,

"వ్రేలిమియున్ సురార్చనయు
విప్ర సపర్యయుఁ జిక్కె భుక్తికిన్
వేళ యతిక్రమించె జన
నీ జనకుల్ కడువృద్ధు లాకటన్
సోలుచుఁ జింతతో నెదురు
చూచుచునుండుదు రాహితాగ్ని నే
మాలు సమస్త ధర్మములు
తొయ్యలి నేడిలు సేరకుండినన్."

అని తన శ్రోత్రియత్వమును దెలియజేసెను. అంత వదనంబున విన్నబాటు దోఁప, ప్రవరు డాహితాగ్ని యగుటచే తన ఆతిథ్యమును స్వీకరింపమి తెలుసుకొని ఇంచుక విచారించి, ప్రవరునికి గల వైదిక నిష్ఠకు లోన నగుచు, యుక్తివాదముచే నతనిని నిరుత్తరునిగ జేసి, యనురక్తుని జేసికొన దలంచి,

"..........యజ్ఞకోటులం
బావను లొటకున్ ఫలము
మా కవుగిళ్ల సుఖించుటే గదా."

యనియు,

"సద్యో వినిర్భిన్న సారంగనాభికా
హ్మాతమై పిసాళించు మృగమదంబు
కసటువో బీరెండ కరగి క్రొలసంటి
గమగమ వలచు చొక్కపు జవాజి
పొరలెత్తి ఘనసార తరువులఁ దనుదానఁ
దొరగిన పచ్చకప్పురము సిరము
గొజ్జంగి పూఁబొదల్ గురియంగఁ బటికంబు
దొనల నిండిన యట్టి తుహినజలము
వివిధకుసుమ కదంబంబు దివిజ తరుజ
మృదుల పనసఫలాసవామేయ రత్న
భూషణంబులు గలవిందు"

అని స్వర్గసౌఖ్యమును బహుధా వర్ణించి అతనిని ప్రలోభ పెట్టి,

"...భోగపరుఁడ
వయి రమింపుము ననుఁగూడి యనుదినంబు"

అని ఫలీభూత స్వర్గముగ తనను గ్రహింపుమని ప్రార్థించి,

"కుశలత యే వ్రతముల నగు
నశనాయాసమున నింద్రియ నిరోధమునం
గృశుఁడవయి యాత్మ నలచుట
సశరీర స్వర్గసుఖము సమకొని యుండన్"

అని నిరశనవ్రతముల చేతను, ఇంద్రియనిరోధముచేతను, శరీరమును శుష్కింపజేసుకొని, కష్టసాధ్యమై కాలాంతరంబున దేహాంతరంబుచే బొందదగిన స్వర్గసౌఖ్యము మిము బోటి నిరతాగ్నిహోత్రులను తనంత దా శరీరధారియై వలచివచ్చిన ఈ శరీరంబుతోనే యనుభవింపనేరక నిరసించుట, "అంధుడు వెన్నెల నిరసించుట గాదా"యని పరిహసింప.

"...నీ వన్న యర్థమెల్ల
నిజము కాముకుడైనవానికి నకాముఁ
డిది గ్రహించునె జలజాక్షి...."

యని నీ చెప్పినదంతయు స్వర్గాద్యపేక్షగల ఆహితాగ్ని యగు కాముకునికి గాని (కామ్యకర్మానుష్ఠాతకు గాని) నిష్కామ కర్మానుష్ఠాత దీనిని సరకు చేయడు.

"బ్రాహ్మణుఁ డింద్రియవశగతి
జిహ్మచరణైక నిపుణ చిత్తజ నిశితా
జిహ్మగములపాలై చెడు
బ్రహ్మానందాభిరాజ్య పదవీ క్షయతుఁడై."

కాన తత్త్వవిదుడగు బ్రాహ్మణుడు ఇంద్రియ సౌఖ్యాలాలసుడగునేని బహుజన్మ సుకృతఫలంబగు నట్టియు, మహర్షులకు సైతము దుర్లభంబగునట్టియు, బ్రహ్మానందాధిరాజ్య పదవీభ్రష్టుడగుననియు, తా నకాముకుడననియు స్పష్టముగ జెప్ప నిరుత్తరయై కింకర్తవ్యతా విమూఢయై ఆతనిస్వరూపమును గనుగొననేరక బేలయై వివశయై ప్రలపించినందుకు లజ్జితయై తుదకు తెచ్చికోలు ధైర్యముతో

"పతితవనతరుకుసుమ కేసరంబులు రాల్చునెపంబునఁ బయ్యెదవిదిల్చి చక్కసవరించుచు నంతం తంబొలయు చెలులకుఁదల చూపక యుండఁ దత్తరం

బునం జేసి బొమముడిపాటుతో మగిడి మగిడి
చూచుచు జిడిముడిపాటు చూపుల నంకురించు
జంకెనల వారించుచుఁ జేరి యిట్లనియె''

"ఎందే డెందము కందళించు రహిచే
నేకాగ్రతన్ నిర్వృతిం
జెందుం గుంభగత ప్రదీపకళికా
శ్రీ దోప నెందెందుఁబో
కెందే నింద్రియముల్ సుఖంబుగను నా
యింపే పరబ్రహ్మ "మా
నందో బ్రహ్మ" యటన్న ప్రాజ్ఞుదు నం
తర్బుద్ధి నూహింపుమా''

అని యీవిధమున యుక్తివాదమున నతని నెదుర్కొనలేక శ్రుతిప్రమాణములచేఁ దన వాదమును బలపరచి అతనిచే ఒప్పింపదలచి, "ఆనందో బ్రహ్మ" యనెడి శ్రుతిని శృంగార రసానుకూలముగ సమన్వయముచేయ నప్పువరుండు

"అనుచుఁ దన్నొడఁబరచు నయ్యమరకాంత
తత్తరముఁజూచి యాత్మ నతండు దనకు
సిగ్గువెగటును బొడమ నిస్పృహత దెలుపు
నొక్క చిరునవ్వు నవ్వి యయ్యువిద కనియె''

"ఈ పాండిత్యము నీకుఁ దక్క మరియెం
దేఁగంటిమే కామశా
స్త్రోపాధ్యాయివి నావచించెదవు మే
లోహో "త్రియీధర్మముల్
పాపంబుల్ రతి పుణ్యమంచు" నికనే
లా తర్కముల్ మోక్షల
క్ష్మీపథ్యాగమ సూత్రపంక్తికివె పో
మీ సాంప్రదాయార్థముల్."

"తరుణీ! రేపును మాపు హవ్యముల చే
తన్ దృప్తుఁడౌ వహ్ని స
త్కారుణాదృష్టి నొసంగు సౌఖ్యము లెరుం
గన్ శక్యమే నీకు నా
కరణుల్ దర్భలు నగ్నులున్ బ్రియములై
నట్లన్యముల్గా వాడల్
తిరమే చెప్పకు మిట్టి తుచ్ఛ
సుఖముల్ మీసాలపై తేనియల్.''

అని "యానందో బ్రహ్మ" యటన్న శ్రుతికి ఆమె స్వమతానుసారముగ వ్యాకరించిన వైఖరినిగని, ఆచ్చెరువొంది, "ఇకనేలా తర్కముల్" అని సంవాదమునకు ఇతిశ్రీ చెప్పఁదలచి విసుగుచెంది తుదకు.

"ఇట్టితుచ్ఛసుఖముల్ మీసాలపై తేనియల్''

అని మూర్తీభవించిన శృంగారరసాధిదేవతవలె, ప్రత్యక్షాయమాణస్వర్గాధిదేవతవలె, విహ్వలయై, నిరుత్తరయై నిలచియున్న నవ్వరూథినిని ధిక్కరించి తన జితేంద్రియత్వమును, గాఢవైరాగ్యసంపదను, తన నిష్కామకర్మానుష్ఠానతత్పరతను, బ్రహ్మానంద పదవిలాలసతను, సహస్రముఖముల వ్యక్తపరచి ధీరశాంతుడగు నప్పువరుడు స్వగృహాగమనోపాయమునకై చింతించుచుండ, ఇట్లు తన యత్నము లన్నియు నిష్ఫలములైనందుకు వగచుచు, పట్టరాని తమకమున బలాత్కృతిచేనైనను అతనిని స్వాయత్తుని చేసుకో దలచి, తుదకు స్త్రీజనసహజంబగు లజ్జను సైతమువీడి, బలిమిమై నాతరుణుని జితేంద్రియత్వమున "కగ్నిపరీక్షయో" యన తన బాహువల్లరులచే నాతనిని గాఢముగ బంధించి, అధరం బాసింప, 'హా శ్రీహరీ' యంచు సశరీర స్వర్గసుఖమనందగిన నయ్యచ్చరను దోసిపుచ్చెను. పైవిషయమునే,

"కలంచునే సతులమాయల్ ధీరచిత్తంబుల్''

అని ఇట ధీరశబ్దప్రయోగంబుచే బుద్ధివృత్తిని చూడఁగలిగి చోదనము చేయగలిగి, అధీనముచేసుకోదగిన సాక్షిరూపమగు బ్రహ్మానంద సామ్రాజ్యాధిష్ఠితునకు దాస్యమొనరించు నర్తకకూడ స్వర్గసౌఖ్యమునకులేదనునట్లు నప్పువరుండు

"... ఓరమోమిడి తదీ
యాంసద్వయిం బట్టి పో
మ్మంచుందోసె..."

ఇట్లు సశరీరము లనందగు స్వర్గాపవర్గములను వరూథినీప్రవరులకు గాఢమగు ద్వంద్వయుద్ధమును గల్పించి, ఆందపవర్గముచే స్వర్గమునకు మిక్కుటమగు ధిక్కృతిని పరికల్పించి నిష్కామ కర్మానుష్ఠాన ప్రాభవమును ప్రవరరూపమున లోకమునఁ జాటగలిగి, లోకమును తత్ప్రవణముగ చేయ సంకల్పించిన పెద్దన మహాకవీంద్రుడు ఆస్తిక మహాశయులకు ప్రాతస్స్మరణీయుడు. అనంతరము:—

"......అవ్వనజ గంధి
మేని జవ్వాజిపస కదంబించు నోడలు
గడిగికొని వార్చి ప్రవరుండు గార్హపత్య
వహ్ని నిట్లని పొగడె భావమునఁ దలఁచి"
ఉ. దివిషద్వర్గము నీ ముఖంబునన దృ
ప్తింజెందు నిన్నీశుఁగా
స్తవముల్ సేయు శ్రుతుల్ సమస్త జగదం
తర్యామివిన్ నీవ యా
హవనీయంబును దక్షిణాగ్నియును నీ
యం దుద్భవించుం గ్రతూ
త్సవ సంధాయక నన్నుఁగావఁగదవే
స్వాహావధూవల్లభా!
ఉ. దాన జపాగ్ని హోత్రపర
తంత్రుఁడ నేని భవత్పదాంబుజ
ధ్యానరతుండ నేనిఁ బర
దారధనాదులు గోరనేని స
న్మానముతోడ నన్ను సద
నంబుననిల్పు మినుండు పశ్చిమాం
భోనిధి లోనఁ గ్రుఁకకయ
మున్న రయంబున హవ్యవాహనా!

అని యిట్లయ్యాహితాగ్ని యగు ప్రవరుఁడు స్తుతించి, తత్ప్రభావంబున నిజగృహంబునుజేరి సుఖంబుండె-కొలదికాలము క్రిందట అనగా సిద్ధుడిడిన పాదలేపము ప్రవరునకు హిమవత్పర్వతమునఁ గఱగిపోయిన సమయమున దిక్కుదోపక, ధైర్యమును గోలుపోయి,

"......ఇమ్మంచుకొం
డకు రాఁజెల్లునె బుద్ధిజాడ్య జనితో
న్మాదముల్ కదా శ్రోత్రియుల్"

అని తన శ్రోత్రియత్వమును సైతము నిందించుకొనుచుఁ దలిదండ్రులను గురించియు, అగ్నులను గురించియు, ఇతర గృహ వ్యాపారములను గురించియు, చింతించుచుఁ గర్మజడునివలె సామాన్య జానపదగృహస్థుని వడువు నను గానుపించిన ప్రవరుఁడు వరూథినితో మాట్లాడునపుడు తన నిష్కామకర్మానుష్ఠాన బలమును దలంచుకొని దాని సామర్థ్యమును స్మరించినంతమాత్రముననే తృణీకృత స్వర[illegible]

విభవుడును, మహాధీరుడును, ఈశ్వరానుగ్రహ సంపన్నుఁడును గాఁగలిగి గృహమునకేగి మిక్కుటమగు మహానంద మెట్లనుభవింపగలిగెనో, లోకజ్ఞాన శూన్యులుగ దోచు కార్మికులును, ఐహిక సుఖరహితులుగ గన్పడు భక్తులును జగత్తునకు పనికిరానివారివలె గనపడు తత్వవిచారపరులును ప్రవరునివలెఁ దమతమ సుకృతవిశేషములచే నీశ్వరానుగ్రహమునఁ దలవని తలంపుగ నిమేషమాత్రమున మహా మహిమోపేతులైసకలజగదారాధ్యమైనిత్యమై నిరతిశయమై యఖండమై యద్వితీయమనదగిన మోక్ష సామ్రాజ్యాధిష్ఠితులు కాఁగలరనుట కీ కథయే నిదర్శనము కాఁగలదు.

కనుకనే ప్రవరుండు –

"యంలబ్ధ్వాచాపరం లాభంమన్యతే నాధికంతతః

అనునట్టి స్థితికి రాగలిగినాడు. ఇట్టి నిష్కామకుడగు ప్రవరుడు కర్మఠుడైనను

"యోగయుక్తో విశుద్ధాత్మా
విజితాత్మా జితేంద్రియః
సర్వభూతాత్మభూతాత్మా
కుర్వన్నపి నలిప్యతే
బ్రహ్మణ్యాధాయ కర్మాణి
సంగం త్యక్త్వా కరోతి యః
లిప్యతేనసపాపేభ్యో పద్మపత్ర మి వాంభసా."

ఇత్యాది వాక్యములు కర్మచేయుచున్నను, అయ్యది బంధకముగాక సమ్యగ్దర్శనప్రాప్తిని గలిగించుటకు సమర్థములనుటకు తార్కాణములు.

కావున నిష్కర్మానుష్ఠాన బలముననే నరుడనాదియై, అనేక బ్రహ్మలను గడపిన జనన మరణ ప్రవాహ వేగమంతయును నొక్కపెట్టున నరికట్ట సమర్థుడగుచున్నాడు. నిష్కామ కర్మానుష్ఠాన ప్రాభవముననే సచ్చిదానందమయమై సర్వలోక సంసేవ్యమగు బ్రహ్మానంద సామ్రాజ్యమున పట్టభద్రుడు కాగలుగుచున్నాడు. గాన కర్మయోగి యన నిష్కామకర్మానుష్ఠాతయే. అతనికి చిత్తశుద్ధి ద్వారా లభించునది జ్ఞానము.

"జ్ఞానాగ్నిః సర్వకర్మాణిభస్మసాత్కురుతేఽర్జున
జ్ఞానవాన్ మాంప్రపద్యతే, జ్ఞానచాత్మైవ
మేమతం, విదుష ఆత్మత్వాత్"

కాబటి కర్మయోగియే జ్ఞాని. అతడే భగవానుడనుటకు భగవద్ముక్తియే ప్రమాణము.

# సంస్కృత వాఙ్మయము - మఱియిద్దఱు మహారాజకవులు

శ్రీ ఈయుణ్ణి వేంకట వీరరాఘవాచార్యుఁడు

**అవతరణిక :**

[ఇదివఱకు ౧. గోనందుఁడు ౨. ధర్మాశోకుఁడు = ధర్మాశోకదత్తుఁడు 3. వసునందుఁడు ౪. గోపాదిత్యుఁడు, అను నలుఁవురు సంస్కృత రాజకవులను గూర్చిన నా వ్యాసము 'ఆంధ్రి' యను మాసపత్త్రికలో (III సం. 10 సం. జనవరి, 1941) ప్రకటింపఁబడెను:

౫. రణాదిత్యతుంజీనుఁడు ౬. కలశుఁడు ౭. హర్ష దేవుఁడు, అను ముగ్గురు సంస్కృత కవులను గూర్చిన మదీయనిబన్ధనము 'సంస్కృత వాఙ్మయమున ముగ్గురు మహారాజకవులు' అను శీర్షికతో 'శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రి షష్టి పూర్తి సంచిక'లో (౫౦-౬౧ పు; 1941) ప్రచురింపఁబడెను.

౮. 'మహారాజకవి ముక్తాపీడుఁడు' అను సంస్కృతకవిని గూర్చిన నా వ్యాసము 'కళాప్రపూర్ణ జనమంచిశేషాద్రిశర్మగారి యభినందన సంపుటము'నఁ బ్రకటింపఁబడుచున్నది.

౯. మఱియొక సంస్కృతరాజకవిని గూర్చిన నా వ్యాసము 'సంస్కృతరాజకవి అవంతివర్మ తదాస్థానకవి మంకలి' అను శీర్షికతో "ప్రపన్నసుధ" అను మాసపత్త్రిక"లో (1 సంపుటి) ప్రకటింపఁబడుచున్నది.

ప్రస్తుతవ్యాసమున, ౧౦. కవిరాజశ్రీ సముద్రగుప్తుఁడు ౧౧. రాజకవి క్షితిపతి, అను మఱి యిరువురు విస్మృత సంస్కృత కవులను గూర్చి వ్రాయఁబడెను]

## మహారాజాధిరాజ కవిరాజ శ్రీసముద్రగుప్తుడు (క్రీ. 335-375. రాజ్యపాలనము)

గుప్తవంశచక్రవర్తి. గుప్తునికిఁబ్రపౌత్త్రుఁడు, ఘటోత్కచునికిఁ బౌత్త్రుఁడు, మొదటిచంద్రగుప్తునికిఁ గుమార దేవికిఁ బుత్త్రుఁడు. విక్రమాదిత్య బిరుదాలంకృతుఁ డగు రెండవచంద్రగుప్తునికి జనకుడు, కుమారగుప్తునికిఁ బితామహుడు, స్కన్దగుప్త విక్రమాదిత్యునికిఁ బ్రపితామహుఁడు, ప్రథమచంద్రగుప్తుఁడును; తత్తనయుఁడు సముద్రగుప్తుఁడు భారతవర్షమున గుప్తసామ్రాజ్యమును సంస్థాపించిరి. "పిస్తోలుకడుపున ఫిరంగిపుట్టినట్లు" మహారాజాధిరా జగు ప్రథమ చంద్రగుప్తునకు సార్వభౌముఁ డగు సముద్రగుప్తుఁడు తండ్రిని మఱపించు పుత్త్రుఁ డాయెను. "తియ్యమామడిపండు తన కాధార మైనపుష్పమును మఱపింపఁ జేయునట్లు" గుణాధిక్యమును చే సముద్రగుప్తుఁడు తన పితృపితామహాదుల ప్రభావమును విస్మరింపఁజేసెను. ఈయన్యాయ మొక్కటి తప్ప నితరదోషము లీ చక్రవర్తియందు లేనేలే వని చెప్పవలెను.

సముద్రగుప్తునికాలమున నొకానొక శిలాస్తంభముపై నుల్లేఖింపఁబడినశాసనము ప్రయాగనగరమున గలదు. గద్యపద్యాత్మకమగు నీసంస్కృతశాసనమును రచించినకవి ఖాద్యటపాకికవంశజుఁ డగు మహాదండనాయక ధ్రువజాతికిఁ దనయుఁ డగుహరిషేణుఁడు. ఈతఁడును సముద్రగుప్తుని యొద్ద సాంధివిగ్రహకుఁడు, కుమారామాత్యుఁడు, మహాదండనాయకుఁడుగా నుండి సార్వభౌముని సమీప పరిసర్పణానుగ్రహములచే నున్మీలితమంత్రియాయె నని శాసనోపసంహారవాక్యమునుబట్టి విశదమగుచున్నది.

ఇటువంటి ప్రచండ ప్రతిభాసంపన్నుఁడు ప్రౌఢపాండితీ మండితుఁడు నిరంకుశ కవితాధురంధరుఁడు సహృదయ శిరోమణి రచించిన గ్రంథరాజములు లభింపకపోవుట శోచనీయము.

వామనుని 'కావ్యాలంకార సూత్రవృత్తి' † లో నొకానొక శ్లోకమున 'కవిరాజ' శబ్దము గానవచ్చుచున్నది.

శ్లో. "కవిరాజ మవిజ్ఞాయ కుతః కావ్యక్రియాదరః, కవిరాజం చ విజ్ఞాయ కుతః కావ్యక్రియాదరః"

— (క. సూ. వృ. iv అధి 10 సూ. ౨3 పు.)

కవి పోషణపరాయణుఁ డగు కవిరాజు నెఱుఁగనిచోఁ గావ్యరచనయం దాదర మెట్లు కలుగును? అమేయ ప్రజ్ఞానిధి యగుకవిరాజు నెఱిఁగినచో నిఁకఁ గావ్యనిర్మాణమున నాదర మెట్లుండును. అని భావము. కావ్యనిర్మాణ పరిశ్రమజ్ఞుఁ డగు రసజ్ఞుఁడు పోషకుఁడు లేనియెడలఁ గావ్యరచనము నం దాదర మెట్లు కలుగు నని సర్వోత్కృష్ట కావ్యకల్పనమున దక్షుఁ డగుకవిరాజువంటి మహనీయుని కవితం జూచుచో నిఁక నెట్టికవివతంసున కైనను గావ్యరచనమున బుద్ధి యెట్లు ప్రసరించు ననియుఁ దాత్పర్యము. పైశ్లోకమున నుత్తరార్థము,

శ్లో. "ఆఢ్యరాజకృతోత్సాహై ర్హృదయస్థైః స్మృతైరపి, జిహ్వాన్తః కృష్యమాణేవ న కవిత్వే ప్రవర్తతే."

— (బాణుఁడు: హర్షచరితము, 18 ప.)

శ్లో. "యుక్తం కాదమ్బరీం శ్రుత్వా కవయో మౌనమాశ్రితాః" — (సోమేశ్వరదేవుఁడు: కీర్తికౌముది. 1, ౧౫.)

అనుశ్లోకముల భావమును గలిగి యున్నది.

వామనునిచే నుదాహృతుఁ డగుకవిరాజునుగూర్చి యింతకుఁబూర్వ మేచారిత్రక పరిశీలకుఁడును జర్చించి యుండలేదు. క్రీ. శ. 750-800 ప్రాంతముల నున్న వామనునికంటెఁ బూర్వులలో సముద్రగుప్తుఁడు దక్క మఱెవ్వరును కవిరాజ బిరుదాంకితు లున్నట్లు గ్రంథస్థప్రమాణ మెద్దియును లభింపలేదు. వామనునికంటెఁ బ్రాక్తనులలో రాజకవు లగు శూద్రకుఁడు, హర్షవర్ధనుఁడు మొదలగువారు కలరు గాని వా రెవ్వరికిని గవిరాజబిరుదము లేదు. కావునఁ బ్రకృతమున్న చారిత్రక పరికరములను బట్టి వామనసూచితుఁ డగు కవిరాజు మనసముద్రగుప్తుఁడే యని నిశ్చయింపనగును.

A] 'His (**Samudragupta's**) mind was acute and had received excellent training. His accomplishments as a poet and musician were great, and in both these departments he put to shame Brhaspati, and Tumburu and Narada respectively. He had establised his title as a **Kaviraja** by writing many works which would have proved the means of subsistence for learned men.
(Dr. S. K. Aiyangar : **Studies in Gupta History**, p. 26, 1927.)

B] '**Samudragupta** was a sovereign of great parts and varied accomplishments, and seems to have had a remarkable turn of mind for literature and fine arts ? (**Ibid**. p. 31.)

C] 'He set himself up as the protector of Dharma, possessed of unsullied fame, pleasing the learned, sub-duing the wicked and gaining in the World the objects worthy of attaining. He was well-versed in the path of the **Veda**. He excelled in the composition of literary works which out-distanced the most excellent performances of learned poets, and thus became the only worthy person to be thought of by those that excelled in intellectual possessions and good qualities.
(**Ibid**. p. 37.)

† Poona Oriental Book Agency Edition, [1927]

డాక్టర్, యస్. కృష్ణస్వామి అయ్యంగారు, (యం. ఏ. పి. హెచ్. డి.) సముద్రగుప్తుని ప్రతిభా పాండిత్యకవిత్వములఁ గూర్చిన వాక్యముల నుల్లేఖించెదను.

### రాజకవి క్షితిపతి (క్రీ. 11 వ శతాబ్ది)

లోహరదేశాధీశ్వరుఁడు; కాశ్మీరదేశాధీశుఁ డగు సింహరాజునకుఁ బ్రపౌత్త్రుఁడు, ఉదయరాజునకుఁ బౌత్త్రుఁడు, సంగ్రామరాజానుజుఁ డగు విగ్రహరాజునకుఁ బుత్త్రుఁడు; బహుళ సంస్కృతకృతి నిర్మాత యగు క్షేమేంద్రునకును, కథాసరిత్సాగరకర్త యగు సోమదేవునకును, నాశ్రయుఁ డగు అనంతభూపాలుని పట్టమహిషి యగు సుభటాదేవికి సోదరుఁడు; కవియై శస్త్రశాస్త్రప్రతిష్ఠ వహించి, గానకళాకోవిదుఁడై, జయాపీడ సదృశప్రభావుఁ డగు కలశునికి మేనమామ.

క్షాత్త్రతేజోనిధానము, సర్వవిద్యావిశారదుఁడు;భోజభూపాల సదృశమహిముఁడు నగు నీ లోహరాఖండలుని వదనపద్మమున వాగ్దేవి లీలాతిలకతులితయై; వక్షఃస్థిత యగు లక్ష్మి నడఁగఁద్రొక్కె నఁట ! కర్కశతర్కపరిష్కృతము లగు నీతని వాగ్గుంభములకు; నద్భుతపరిణతి నందిన యీతని పాండితికి; సాటియే లే దఁట ! ఈ మహనీయుని యనుగ్రహమునఁ బండితులకష్టములు గట్టెక్కె నఁట; ఈ విద్వత్ప్రభువు విద్వద్గృహములఁ బ్రతిష్ఠించినలక్ష్మి గల్లుగల్లున మ్రోగు లలితవనితా మంజీరనినాదములచే నిప్పటికిని నిద్రపోకున్న దని బిల్హణమహాకవి వర్ణించియున్నాఁడు. †

ఆ కాలమున నితఁడును; భోజుఁడును దానోత్కర్షచే విశ్రుతులై; పాండిత్య ప్రకర్షయందుఁ దుల్యులై; కవిబాంధవులై విఖ్యాతి నందిరని కల్హణపండితుఁడును వ్రాసియున్నాఁడు. ‡ ఇంతటి మహనీయుఁ డయ్యు క్షితిపతి గృహచ్ఛిద్రములచే హృదయము సంక్షోభము నొంద; నొకనాఁడు

౪౭ శక్రే లక్ష్మ్యాః శిరసి చరణం న్యస్య వక్షఃస్థితాయాః, ప్రాప్తా లీలాతిలకతులనాం యన్ముఖే సూక్తిదేవీ.
౪౮ యస్య ప్రాప్తాద్భుత పరిణతేః కర్కశే తర్కమార్గే, త్యాగః కాసాం విచరతి గిరాం గోచరే కాన్తకీర్తేః,
యేన న్యస్తా దలితవిపదాం కోవిదానాం గృహేషు, శ్రీర్నాద్యాపి స్వపితి లలనాభూషణానాం నినాదైః.
౪౯ గణ్డాభోగోడ్డమరవిలుఠన్బాష్పధారాశతేన, వ్యాతన్వానః కుచయుగతటీః పఙ్కిలాః సున్దరీణామ్,
యస్య క్రీడాకవల మకరో ద్రాజపుర్యాః ప్రతాపం, బాహు ర్బాహుస్థలకమలినీ రాజహంసాప్సువాహః
౫౦ శ్రోణీబద్ధే కువలయదృశాం ద్రాగవజ్ఞా రసజ్ఞైః పార్శ్వద్వన్ద్వేఽప్యతనుత సభామణ్డనం పణ్డితాలీమ్,
రత్నచ్ఛాయాచ్ఛురణసుభగస్వర్ణపత్త్రావమానీ, మానీ మేనే శ్రవసి చ కథాం వైష్ణవీం భూషణం యః."
—(విక్రమాఙ్కదేవచరితము 18 సర్గము.)

తనసోదరికిభర్త యగు ననంతభూపాలునిసన్నిధి కేఁగి తనతనయుఁ డగు భువనరాజు, తనసింహాసనము నాక్రమించుకొననున్నాఁ డనియుఁ, దనపౌత్త్రుఁ డగునీలుఁ డంతకు మునుపే రాజ్య మపహరించి, భువనరాజు నెదుర్కొని, యాతని ప్రయత్నము విఫలముచేయ నున్నాఁ డనియు, మొఱపెట్టు

† మందాక్రాన్తా. "యస్యాః భ్రాతా క్షితిపతి రితి క్షాత్త్రతేజోనిధానం,
భోజక్ష్మాభృత్సదృశమహిమా లోహరాఖణ్డలోఽభూత్,

‡ శ్లో. స చ భోజనరేన్ద్రశ్చ దానోత్కర్షేణ విశ్రుతౌ, సూరీ తస్మిన్ క్షణే తుల్యం ద్వావాస్తాం కవిబాన్ధవౌ.
— (రాజతరఙ్గిణీ. 7 ౨౫౯)

కొనెను. తుదకుఁ దనభార్య గూడఁ దన కహితయగుటచే క్షితిపతి ప్రాపంచిక సుఖముల నైహికైశ్వర్యములను ద్యజింప సమకట్టెను. పరమభాగవతశిఖామణి యగు నితనిపౌత్త్రుఁడగు నీలుఁడు పరమనీచుఁడై; భాగవతులు, పూజ్యులు, తండ్రి కిష్టులు నగువిప్రోత్తములయజ్ఞోపవీతము లూడ్చి శునకములమెడలలో వేసి, యాకుక్కల నాబ్రాహ్మణులపేరఁ బిలుచుచుండ* చిత్త సంక్షోభము నొంది, తనకు భాగినేయుఁడగు కలశునకు రామలేఖయందు జనించినయుత్కర్షుఁడను పాలపాపనికిఁ బట్టాభిషేకముచేసి తాను రాజర్షియై విద్వాంసులతోఁ గలసి తీర్థయాత్రల కరిగి, పెక్కేండ్లు శాంతచిత్తముతోఁ గాలక్షేప మొనరించి; పరమవైష్ణవుఁడై చక్రధరక్షేత్రమున విష్ణు సాయుజ్యము నొందెను.

ఈ విద్వత్కవి రచించినకృతు లేవియో తెలియదు; కాని క్షితిపతికిఁ బర్యాయపద మగుక్షితీశ నామముతో రెండుపద్యములు మాత్రము సుభాషితకోశములందు లభించినవి.

౨౫౧ శ్లో. "పుత్త్రో విగ్రహరాజస్య క్షితిరాజాభిధ స్తతః, రాజ్ఞః పితృవ్యజో భ్రాతా కదాచిత్ పార్శ్వ మాయయౌ.
౨౫౨. తస్మై న్యవేదయత్ ఖేదం స చిత్తస్యోపతాపకమ్, పుత్త్రే భువనరాజాఖ్యే రాజ్యలుబ్ధేఽభివిప్లుతే.
౨౫౩. స హి తస్యాత్మజో నీలః పురా రాజ్యం సమాశ్రితః, తద్బలైః పితురారబ్ధిం విధాతుం సోద్యమోఽభవత్.
౨౫౪. నామ భాగవతానాం చ పూజ్యానాం స్వపితుర్వ్యధాత్, దత్తయజ్ఞోపవీతానాం శునా మశూచిమానసః.
౨౫౫. క్షితిరాజః స్వవధ్వాం చ విరుద్ధాయాం విశుద్ధధీః, మనస్తాపాపహే చక్రే సర్వత్యాగామృతే స్పృహామ్.
౨౫౬. రాజ్యం కలశపుత్త్రాయ జ్యేష్ఠా నన్తరజన్మనే, రామలేఖాభిధానాయాం, రాజ్ఞ్యాం జాతాయ సత్వరమ్.
౨౫౭. దత్త్వా స్తనంధయాయాపి తథోత్కర్షాభిధాయ సః, రాజర్షి విబుధైః సార్ధం విదధే తీర్థసేవనమ్.
౨౫౮. భుక్త్వా శమసుఖం భూరీన్ వర్షాన్ పరమవైష్ణవః, స చక్రాయుధసాయుజ్యం యయౌ చక్రధరే సుధీః"

—(రాజతరంగిణి 7వ తరఙ్గము)

## పూర్ణసరః

౧. శా. "తీవ్రార్కద్యుతిదహ్యమానవపుషా దావానలస్యోష్మణా
శోషం దూర ముపాగతేన పథికక్లేశాన్ ముహుర్మూర్ఛతా
భ్రామ్యద్దీనదృశా తృషాతురతయా క్వాపీరపోఽపీచ్ఛతా
మజ్జన్తి పతత్పతత్రి సుకృతై రేతన్మయాప్తం సరః"
(సదుక్తి కర్ణామృతము IV 23. ౨ ప. ["క్షితీశస్య"] ౨౪౧ పు.)

## విరహిన్

౨. శిఖరిణీ. "హ్రియా సంసక్తాఙ్గం తదను మదనాజ్ఞాప్రశిథిలం
సనాథం మాఞ్జిష్ఠప్రసరకృశరేఖై ర్నఖపదైః
ఘనోరుప్రాగ్భారం నిధి ముఖ మి వాముద్రిత మహో!
కదా ను ద్రక్ష్యామో విగలిత దుకూలం మృగదృశః
(కవీన్ద్ర) వచనసముచ్చయము 471 ప. ౧౪౭ పు. ['క్షితీశస్య']

# అనుబంధము

## ౧. సముద్రగుప్తుని వంశవృక్షము

1. మహారాజశ్రీ గుప్తుడు
|
2. మహారాజశ్రీ ఘటోత్కచుడు
|
3. మహారాజాధిరాజశ్రీ చంద్రగుప్తుడు I + మహాదేవి కుమారదేవి
|
మహారాజాధిరాజ కవిరాజ శ్రీ సముద్రగుప్తుడు + దత్తాదేవి
|
4. (పాలనము : క్రీ. 357-413) విక్రమాదిత్య, అజితవిక్రమ, సింహవిక్రమ-చంద్రగుప్తుడు II
|
5. (క్రీ. 413-455) కుమారగుప్తుడు
|
6. (క్రీ. 455-480) స్కందగుప్తుడు

## ౨. క్షితిపతి వంశానుక్రమము

సింహరాజు



# గణిత విజ్ఞానం - మానవ జీవితం

శ్రీ కస్తూరి సూర్యప్రకాశరావు

సృష్టిపరిణామంలో మానవుడనే విచిత్రజీవికే ప్రకృతిని వశంచేసుకోడం చేతనైంది. మరి ఏ యితర జీవీ క్షుత్పిపాసా నివారణకై వస్తూత్పత్తి చేసుకోవడం కాని ప్రకృతి బాధలనుండి రక్షణలు కల్పించుకోవడం కాని ఎరగదు. చెట్టున పండి రాలితే తినడమేకాని పళ్ళకోసం చెట్లునాటే జీవి ఇంకొకటిలేదు; ఎండవేడికి చెట్టునీడని చేరే జంతువులే కాని, తరుచ్ఛాయార్థం తోపు పాదుగునా చెట్లుపెంచడం ఏజంతువుకీ చేతకాదు; గడ్డిమొలిచి ధాన్యం ఫలిస్తే మెయ్యడమేకాని, విత్తనాలు చల్లి, గడ్డి మొలిపించి, ధాన్యం పండించడం మానవునికే తెలుసు; శీతవాతాతప బాధలకి ఏ కొండగుహో చేరి తలదాచుకోడమో లేక మహాచేస్తే నాలుగు చితుకులేరుకొచ్చి ఒక గూడు నిర్మించడమో చేయగల జీవులేకాని నివాసయోగ్యమైన గృహాలు కట్టుకుని శీతకాలంలో వెచ్చగానూ, వేసవిలో చల్లగానూ, సౌఖ్యకరంగా ఉండేటట్లు చేసుకోవడం ఒక్క మానవబుద్ధికే సాధ్యం. నేటి మానవుడు ప్రకృతిలో లభించని అనేక ఆహార పదార్థాలూ, అద్వితీయ వాహనాలూ, విశిష్టవినోదాలూ, కోటానుకోట్ల భోగ్యవస్తువులూ, ఉత్పత్తి చేసేటట్లు మరి ఏ ఇతర జీవీ చెయ్యలేదు.

ఈ అద్వితీయ ప్రకృతి వశీకరణశక్తీ, అనంతకోటి వస్తు నిర్మాణశక్తీ, మనిషి మెదడులో ఉండే బుద్ధిని సక్రమంగా ఉపయోగించుకొని సేకరించుకున్న విజ్ఞానంయొక్క ఫలం. విజ్ఞానమనేది యే మహాత్ముడో కన్ను మూసుకొని ధ్యానం చెయ్యగా చెయ్యగా ఛటుక్కున గోచరించిన అద్భుత విషయం మాత్రంకాదు. యుగయుగాల నుండి సుప్రసిద్ధులూ, అప్రసిద్ధులూ ప్రకృతిని నిదానంగా పరిశీలిస్తూ, అందలి నియమాలు అవగాహన చేసుకుంటూ, నిరంతర పరిశోధన వల్ల లబ్ధమైన విజ్ఞానాన్ని అన్వేషణాపరులైన మేధావులెందరో తరతరాలుగా పునర్విమర్శన చేస్తూ, భ్రమ అనే తెరను తొలగించి కూడబెట్టిన ప్రయోగలబ్ధమైన, మూఢవిశ్వాసరహితమైన ప్రకృతి సూత్రాల సంపుటి విజ్ఞానమంటేను. విజ్ఞానం వికసించినకొద్దీ మానవునిలో పశుత్వం నశించి సభ్యతాసంస్కృతులు అలవాటుపడుతున్నాయి. ఇంకా మానవులు కొంత పశుతుల్యులుగానే వ్యవహరిస్తున్నారంటే విజ్ఞానం కావలసినంతగా వ్యాపించలేదనడానికి నిదర్శనం. ఈ అద్భుత విజ్ఞానానికంతకీ ప్రాతిపదికం గణిత విజ్ఞానం. గణిత శాస్త్రమే వృద్ధికాకపోయి ఉన్నట్లయితే ఈఅఖండ విజ్ఞానమంతా సాధ్యమయ్యేదే కాదు. గణిత శాస్త్రాభివృద్ధి విజ్ఞాన వికాసానికి అద్దం లాంటిది. ఈ శాస్త్రంలో కనిపెట్టిన ఏ క్రొత్త పోకడ చూసినా, ఏ నవ్యవిధానం తిలకించినా, ఇతర విజ్ఞానశాఖలలో కలిగిన అద్భుత పరివర్తన గోచరించక మానదు.

నేటి మానవుని నిత్యజీవితంలో గణితవిజ్ఞానం ఎంత అనివార్యమైపోయిందో తెలుసుకోడానికి ముందు ఈగణిత విజ్ఞానంయొక్క పుట్టుపూర్వోత్తరాలు తెలుసుకోవాలని బుద్ధిమంతులకు కుతూహలం పుట్టకపోదు. సృష్టి పరిణామంలో అట్టడుగు స్థితిలోని మానవునికికూడా (అంటే బుద్ధివికసించకుండా పశుప్రాయుడుగానే ఉన్న

అనాగరక స్థితిలో) ఒక సమూహంలో నుండి ఒకటి రెండు వస్తువులు తప్పించినా, ఒకటిరెండు అదనంగా చేర్చినా ఏదోమార్పు జరిగినట్లు గ్రహించేశక్తి ఉండడం శాస్త్రజ్ఞులు తెలుసుకున్నారు. కొన్ని క్రిమి పక్ష్యాదులకు కూడా ఈ ఎక్కువ తక్కువ తేడాలు గ్రహించేశక్తి సహజంగా ఉండడం గ్రహించారు. ఒకపక్షిగూటిలో ఉన్న నాలుగు గుడ్లలోనూ ఒకటి తీసేస్తే గ్రహించలేదు. రెండు తీసేస్తేమాత్రం మళ్ళీ ఆగూటి చెంతకురాదు పక్షి. ఏలాగ్రహిస్తుందో కాని రెండుగుడ్లు మూటికంటె తక్కువని తెలుసుకుంటుంది. ఇంతకంటె విచిత్రమైన విషయం జీవశాస్త్రజ్ఞులు కొన్నిరకాల కందిరీగల జీవితాలను పరిశోధించగా తేలింది. తల్లిఈగ గదులుకట్టి ఒక్కొక్కదానిలో ఒక్కొక్క గుడ్డుపెడుతుంది. అవి బిడ్డలయి పిల్లలయిన తర్వాత ఆపిల్లల ఆహారం కొరకు కొన్ని సూక్ష్మజీవులను తెచ్చి గదులలో పెడుతుంది. ఇందులో చిత్రమేమిటంటే ఒకజాతి కందిరీగ అందునిమిత్తం పెట్టే జీవులెప్పుడూ నియమిత సంఖ్య కలవిగా ఉండడం. ఈకందిరీగలలో మళ్ళీ ఐదేపెట్టే జాతివీఉన్నాయి, పన్నెండుపెట్టే జాతివీ ఉన్నాయి, ఇరవైనాలుగు పెట్టేజాతివీ ఉన్నాయి. ఆజాతి కందిరీగ ఆ నియమాన్ని అతిక్రమించక పోవడం చిత్రంకాదూ! మరో ఆశ్చర్యకరమైన విషయం. ఒక జమీందారుడు తన భూముల అజమాయిషీకై స్థలానికి మధ్యగా ఒకగోపురం కట్టుకున్నాడు. అందులో ఒక కాకి గూడుకట్టింది. దాన్ని వేటాడడానికి ప్రయత్నిస్తే ఇతను వచ్చేటప్పటికి అది పసిగట్టి గూడువిడిచి దూరంగా ఎగిరిపోయి, ఒక చెట్టు మీదినుండి కనిపెడుతూ, ఇతడు మళ్ళీ గోపురం విడిచి వెళ్ళినతర్వాత తిరిగి తనగూటికి చేరుతూ ఉండేది. ఒకనాడితడో పన్నుగడ పన్నాడు. మరొకణ్ణి వెంటబెట్టుకొని గోపురంలోకివెళ్లాడు. పక్షి మామూలుగానే ఎగిరిపోయి దూరాన్ని ఉన్న చెట్టుమీదినుండి కనిపెడుతోంది. కొంతసేపయాక తాను మామూలుగా గోపురంవిడిచి వచ్చేశాడు. పక్షి గూటిచెంతకు రాలేదు. రెండోమనిషి గోపురంలోనే ఉన్నసంగతి గ్రహించి అతనుకూడా బయటికి పోయేదాకా గూటికి చేరనేలేదు. మరొకసారి ముగ్గురా విధంగా వెళ్ళి ఇరువురు బయటికి వచ్చినప్పుడూ అలాగే గ్రహించింది; నలుగురువెళ్ళి ముగ్గురు తిరిగివచ్చినప్పుడున్నూ కనిపెట్టింది; కాని, ఐదుగురు వెళ్ళి నలుగురు తిరిగివచ్చినప్పుడుమాత్రం లెక్క తెలుసుకోలేక పోయింది.

ఇటువంటి సంఖ్యాగ్రహణశక్తి ఇతరజంతుజాలంలో ఉన్నదేమో కనుక్కోడానికి జంతుశాస్త్రవేత్తలు పరిశోధనలుచేశారు కానికొన్ని పురుగులలోనూ, పక్షులలోనూ, మనుష్యులలోనూ తప్పితే మిగిలిన కుక్కలూ, గుర్రాలూ, ఆవులూ మొదలైన పశుగణంలో ఎక్కడా ఉన్నట్టు గోచరించలేదు. చివరికి కోతులలో కూడా ఈశక్తి ద్యోతకం కాలేదు. పై పరిశోధనలవల్ల శాస్త్రజ్ఞులు కొద్దిపక్షులకూ పురుగులకూ పుట్టుకతోవచ్చిన, సహజమైన సంఖ్యాగ్రహణశక్తి ఉన్నప్పటికీ అది చాలా పరిమితమైనదనీ (అంటే అయిదారుకన్న ఎక్కువసంఖ్యలుంటే వాటిలోని తేడాను గ్రహించేశక్తిలేదనీ) అట్టి గ్రహణశక్తిగల జీవులైనా ప్రకృతిలో బహుస్వల్పమనీ, గణన చెయ్యడమనే ప్రజ్ఞ మానవుని కొక్కనికే విశిష్టలక్షణమనీ తేల్చారు. మానవుడైనా సక్రమశిక్షణ పొందినపుడే ఈ ప్రజ్ఞ సంపాదిస్తున్నాడు కాని, పుట్టుకనుండీ

సహజంగా కలిగిఉండదు. నేటికీ బుద్ధివికాసమేమీ లేకుండా అనాగరికులుగా నిలిచిపోయిన దక్షిణాఫ్రికాలో కొన్ని అడవిజాతివాళ్లూ, ఆస్ట్రేలియా ఖండంలోని అనాదిమనుష్యులూ, దక్షిణాఫ్రికాలోని అడవిమనుష్యులూ కూడా పైని ఉదహరించిన పక్షులవలెనే నాలుగైదు కంటె పెద్ద సంఖ్యలలో తేడాలు గ్రహించలేరు. ఒకటి, రెండు, మూడు, అని లెక్కపెట్టి గణితం చెయ్యడం అలవరచుకున్నకొద్దీ మానవుడు క్రమంగా నాగరకుడు కా ప్రారంభించాడు. విజ్ఞానానికంతటికీ గణిత మేవిధంగా ప్రాతి పదికమో, గణితానికి అంకెలు ఆ విధంగా మూలమైనవి. మానవ వ్యవహారాలన్నింటికీ అత్యవసరమైన ఇతర శబ్దజాలం ఉత్పన్నం కావడానికి ముందే సంఖ్యాబోధక శబ్దాలు పుట్టి ఉండాలని కొంచెం ఊహించిన వారికి తెలియకపోదు. గర్భంలోనుండి శిశువు జన్మించడానికి పూర్వమే నెలలు లెక్కపెట్టుకోవడం అలవాటై ఉంటుంది మానవ జాతికి.

చారిత్రికులు సరిగ్గా నిర్ణయింపలేని అనాది కాలంలోనే అద్వితీయ నాగరికతతో తులతూగిన భారతదేశం, చీనాదేశం, ఈజిప్టు, ఖాల్డియా, బాబిలోనియా మొదలైన ప్రాచీన దేశాల వాఙ్మయాన్ని శోధిస్తే అన్నింటనూ సంఖ్యాద్యోతక శబ్దాలు విరివిగా దొరుకుతాయి. నాటి భారతజాతియొక్క సకల వ్యవహారాలలోనూ, గణితమెంత అగత్యమైపోయి, అంకద్యోతక శబ్దాలు ఎంత పరిపాటిగా ఉపయోగించేవారో తెలుపుటకై శ్రుతి స్మృత్యాది అష్టాదశ విద్యల నుండీ దిఙ్మాత్రంగా చూపుతాను.

మన సాంప్రదాయము ప్రకారము మొదట్లో నాదమూ, బిందువూ, తదనంతరం నాలుగువేదములూ పుట్టాయని అంటారు. నాదానికి సప్త స్వరములు అనగానే సంఖ్యాశబ్దం వాడాలి. చతుర్ వేదములు అంటే నాలుగు తెలిపే అంకె. వేదములకు త్రయి అనే పేరుకూడా ఉంది. అందుచేత ఇంకో అంకశబ్దం. మహాదేవుని వ్యాకరణ సూత్రాలు చతుర్దశమ్. ఇదీ ఒక అంకే. పాణినీయ వ్యాకరణానికి "అష్టాధ్యాయి" అని అంకెతోటే పేరుపెట్టారు. నిరుక్తమంటే వేదములకు శబ్దకోశం కదా. అందులో "ఇమాని పృథివీనామాన్యేకవింశతిః" "హిరణ్యా నామా న్యుత్తరాణి పఞ్చదశ" మొదలైనవెన్నో అంకద్యోతక శబ్దాలున్నాయి. కల్పంలో, సాంఖ్యంలో, మీమాంసలో, పురాణాల్లో, ఇతిహాసాల్లో నెక్కడ చూచినా అంకబోధక శబ్దాలు దొరుకుతాయి. వాల్మీకి మహర్షి తన రామాయణం కిష్కింధాకాండంలో వానరులను లెక్కపెట్టేసందర్భంలో

శతైః శతసహస్రైశ్చ వర్తన్తే కోటిభి స్తథా
అయుతైశ్చావృతా వీర శఙ్కుభిశ్చ పరంతప
అర్బుదై రర్బుద శతై ర్మధ్యైశ్చాన్త్యైశ్చ వానరాః
సముద్రాశ్చ పరార్ధాశ్చ హరయోహరియూథపాః

కి. కాం, 38 స. 30. 31. శ్లో.

అని వ్రాశాడు. ఈవిధంగా కోటానుకోట్ల సంఖ్యలు తెలిపే శబ్దాలు ఆకాలంనాటికి ఏ వాఙ్మయంలోనూ లేవు. అంక పరిజ్ఞానం లేకుండ పై విద్యలేవీ బోధపడవు ఆ విధంగానే యజ్ఞయాగాదులలో వేదికారచనకై నిర్మించిన కల్పసూత్రాలలో సుల్వసూత్రములు భారతీయుల అఖండ రేఖాగణిత పాండితిని తెలుపుటయేకాక మతానుష్ఠానానికికూడా గణితమెంత అగత్యమో తెలుపుతాయి.

పైని వివరించినట్లు మానవ వ్యవహారాలన్నింటిలోనూ గణితం అవశ్యంగా వాడబడింది.

ఆదిలో మతానుష్ఠానానికో, జ్యోతిష విద్యా ప్రచారానికో, ఇతరవిద్యల వృద్ధికో, అంగీభూతంగా గణితం ఉపయోగించేవారు. కాని క్రమేణా గణితానికి ఆ ఆశ్రయం తప్పి స్వతంత్రంగా, సర్వతోముఖంగా అభివృద్ధి చెందింది. పాటీగణితం, (అరిత్మెటిక్) బీజగణితం (అల్జీబ్రా), భూమితి (మెన్సురేషన్), జ్యామితి (జామెట్రీ), త్రికోణమితి (ట్రిగ్నామెట్రీ), శంకుచ్ఛేదనం (కోనిక్సు), లోగరిథమ్ (లోగ్రిథమ్స్), చలన కలనం (క్యాల్కులస్) మొదలైన స్వతంత్ర శాఖలుగా (ప్యూర్ మేథమెటిక్సు) గణితవిజ్ఞానం వృద్ధి పొంది, భౌతిక విజ్ఞానం (ఫిజిక్సు), రసాయన విజ్ఞానం (కెమిస్ట్రీ), యంత్రవిద్య (ఇంజనీరింగు), నౌకా నిర్మాణవిద్య (షిప్-బిల్డింగ్), మొదలయిన శాఖలెన్నో అఖండంగా పెంపొందడానికి అవకాశమిచ్చింది.

నేడు నిత్యవ్యవహారంలో, కూర్చునేకుర్చీ, పవళించేశయ్యా, నివసించేగృహమూ, సమస్తమూ కొలతలు కొల్చి నిర్మించవలసిందేకాని ఏపనికీ గణితం అగత్యం లేకుండా పోదు. ఏశాస్త్రాభివృద్ధి కయినా, ఏవిషయ నిర్ధారణకయినా, గణితమే మూలాధారం. ఆధునిక వైజ్ఞానిక సూత్రాలన్నీ మతవిశ్వాసాల వలేనూ, ఆచార వ్యవహారాల వలేనూ, ఏకొద్దిమంది ప్రజల చేతనో, ఏప్రత్యేక దేశీయులచేతనో. ఆమోదించి అవలంబింపబడేటట్లుకాక, ప్రపంచమంతటా సర్వజనాంగీకృతం కావడానికి కారణం అవి గణితరీత్యా సిద్ధాంతీకరించబడ్డాయి అనే ధైర్యమే, "శంఖులో పోస్తేనే కాని తీర్థమే కాదన్నట్టు" గణితరీత్యా సిద్ధాంతీకరిస్తేనే తప్ప ఏసూత్రాన్నీ వైజ్ఞానికులు ఆమోదించరు. విజ్ఞానశాఖ లన్నింటిలోనూ గణితానికే అగ్రతాంబూలం. ఈవిశిష్టతను గ్రహించే క్రీ. పూ. 1780 ప్రాంతంలో వేదాంగజ్యోతిషం వ్రాసిన లగధ మహర్షి

"యథా శిఖా మయూరాణాం
నాగానాం మణయో యథా
తద్వత్ వేదాంగ శాస్త్రాణాం
గణితమ్ మూర్ధని స్థితమ్"

వేదాంగ జ్యో. శ్లో. 4.

అన్నాడు - (నెమళ్ళకు పింఛంవలెనూ, పాములకు మణులవలెనూ, శాస్త్రము లన్నింటికీ శిరోభూషణంగా గణితమున్నదని దీని తాత్పర్యం). నేడు సర్వతోముఖంగా అభివృద్ధిచెంది, వివిధ శాఖోపశాఖలు కలిగి, ఉజ్జ్వల పుష్పపల్లవ ఫలావిర్భూతిచే వైజ్ఞానికు లందరికీ కల్పతరువులా గోచరిస్తోంది గణిత విజ్ఞానం-

సత్యం, శివం, సుందరం, అనేవి కొలిచే సాధనాలు. ఇంకా కనిపెట్టకపోయినా మిగిలిన భౌతిక జగత్తంతా వైజ్ఞానికుని గణిత సాధనాలకు లొంగుబాటయింది. అనంతకోటి రూపాలతో ప్రత్యక్షమౌతూన్న దివ్యజగత్తు నంతనీ సిసలుగా కొలిచి అందలి పరమరహస్యాలు గ్రహించారు, గణితంవల్లనే. భూమిమీద రెండు పట్టణాలు కొలిచిన విధంగానే ఆకాశంలోని రెండు నక్షత్రాల దూరం కొలుస్తాడు సులభంగా. శరీరంలోని జ్వరతీవ్రతను కొలిచినట్లే చండభానుని తాపోగ్రతను లెక్కపెట్టగలడు. కొవ్వొత్తి దీపంతో పాటు నక్షత్రకాంతిని కూడా కొలుస్తాడు. ఉప్పూ, మిరపకాయ, చింతపండూ తూచి బరువుచెప్పినట్లుగా, సూర్యచంద్రాది గ్రహతారాగణముల భారం నిర్ణయించగలడు. ఆది మధ్యాంతములు లేకుండా అఖండ ప్రవాహంగా పోతూన్న కాలవాహినికి కూడా హద్దులువేసి

సూక్ష్మమాపకాలతో కొలవటం, నేర్చుకున్నాడు, సున్నితంగానూ. నిసలుగానూ, ప్రతిపదార్థానికీ పొడుగు, వైశాల్యం, ఘనపరిమాణం, భారం, సాంద్రత, ఉష్ణం, తాపక్రమం. కాంతి, ఒత్తిడి, మొదలైన భౌతికగుణాలెన్నో లెక్కవేసి నిరూపించగలుగు తున్నాడు. పరమాణువు మొదలు బ్రహ్మాండంవరకూ, గణితవిజ్ఞానం మూలంగానే ఫలానిది ఫలానా ఇంతఅని నిర్ణయించి. నిర్ధారించడంచేతనైంది.గణితవిజ్ఞానం సకలవిజ్ఞానములకూ రాణిఅని సగర్వంగా వచిస్తాడు ఆధునిక వైజ్ఞానికుడు. ఇది మానవుని నిత్యజీవితానికి అగత్యమవడమే కాకుండా మానవుని అద్భుత మేధాశక్తికి "గీటురాయి"కూడా అయింది ఇట్టి శాస్త్రంతో ఏమాత్రమూ పరిచితిలేకుండా ఉండడమే అనాగరక స్థితీ, అజ్ఞానదశా, అంటేను. గణిత విజ్ఞాన ప్రభావం వల్లనే అద్వితీయ ప్రకృతి వశీకరణ శక్తీ, అనంతకోటి వస్తునిర్మాణశక్తీ, మానవుడు సంపాదించగలిగాడు.

# పుస్తకములు

### శ్రీ కలచవీడు వేంకటరమణాచార్యులు

చ. పవనకుమారకుల్ దనువుపై నలసంబుగ వీచి దేహముం
దవిలిన తాపమాపు; నెదదాకి యలంచు మనోవికారకై
తవపథముం మరల్చి సతతమ్ము ముదావహహేతువుల్ కదా!
కవిసముదాయ మానస వికాస లసత్పరిణామ తేజముల్.

చ. కవి సముదాయ మానస వికాస లసత్పరిణామ తేజ వి
స్రవణము లుప్పతిల్లి, తిమిరమ్ములలోఁ బొరలాడుచున్న మా
నవులకు జ్ఞానదీపకలనం బథమేర్పడఁ జూపుటల్ రసా
సవపరిపూర పుస్తక ప్రచార విశిష్ట విధమ్ముగం గదా ?

మ. శ్రమచే డస్సినకాలమందు మనపజ్జం జేరి భాషాప్రసం
గమునం వీనుల విందుగొల్పి యతియోగ్యంబైన భావప్రపం
చమునం దిప్పి విశేషముల్ గఱపి మాన్యత్వంబు నీఁజాలు ను
త్తమ సంచారము లౌ విమానములు గ్రంథవ్రాతముల్ గావొకో.

శా. లీలారామ విహార యోగ్యలగు నాళీకాస్య లాత్మీయ బా
హాలంబోగ్ర నిశాత ఖడ్గముల శౌర్యస్ఫూర్తిఁ గ్రూరాళి ని
ర్మూలంబుం బొనరించి వీరయువతీరూపంబులం దాల్పమే
ల్మేలంచుంగనుగొను చిత్రితము లోలెం దోప గ్రంథంబులం.

చ. అమల మనీషులై జగమునంతయు వీడి హిమాచల ప్రదే
శముల మహీరుహంబుల ప్రశస్తపు నీడలఁ గూరుచుండి యు
త్తమ మగు దత్వముం గనుముదంబున నిశ్చలు లౌ మహర్షి తే
జములను భక్తి పూర్ణమగు స్వాంతములం గనుగొందు మచ్చటం.

# గొల్లభాగవతులు

## శ్రీ దివాకర్ల రామమూర్తి

దృశ్యకావ్యములు రూపకములు. రూపకములు దశవిధములు. ఈ దశవిధ రూపకములలోఁ బాత్రలు ధరించి యా యా నాటకవ్యక్తుల నభినటించుట యోగసాధనములలో నొకటియని శ్రీ బళ్ళారి రాఘవాచారిగారొక సభలో నుపన్యసించిరి. దీనికి తార్కాణముగా మున్ముందు నాటకములయందు వేషములు ధరించి తరువాత యోగిపుంగవుడయిన యొకానొక వ్యక్తినిగూర్చి వారు ముచ్చటించిరి. వినునప్పు డసంభవ మనిపించును కాని, యది యనుభవజ్ఞుని వాక్యమగుట సత్యసమ్మతము. పాత్రధారుల యోగసిద్ధి ననుసరించి వారభినటించు పాత్రములు సజీవములుగా నుండి సభికుల నానందింపఁ జేయును. లేనిచో నాటకాంతర్గత పాత్రమొకటి, అభినయింపఁ బూనుకొనిన వ్యక్తి వేఱొండుగా, ద్వైతసిద్ధి సంభవించును. అద్వైత మనుభూతమైనప్పుడే రససిద్ధి జనించును. అట్టి రససిద్ధియే నాటకప్రదర్శనము యొక్క ముఖ్యోద్దేశము. ఆంధ్రదేశ ప్రాచీన నటకులలో నట్టి రసోల్బణ ప్రదర్శనముల సృష్టించి యందె వేసిన చేతు లనిపించుకొనినవారు కూచిపూడి భాగవతులు. వారి జాతికి చెందిన వారే కాని, భగ్నయోగులవంటివారు గొల్ల భాగవతులు.

కూచిపూడి బ్రాహ్మణ భాగవతులకును, గొల్ల భాగవతులకును, భాగవత పదసామ్యము, వృత్తి సామ్యము, తక్క తదితర కళాశేముషీ విషయములలో సామ్యము లేనే లేదు. "ఉపమా యత్ర సాదృశ్య లక్ష్మీ రుల్లసతి ద్వయో"రనికదా! సాదృశ్యమిట నామ మాత్రమని వదలుటకంటె వృత్తిసామ్యముకూడ నుదాహరింపఁబడి యుండుటచే నది "యర్థోపమ"కానేరదని గ్రహింపవలయును. శ్రీ కూచిపూడివారు తెనుగు తల్లికి నడకలు, పాటలు, చిందులు నేర్పి యాపుణ్యమున చిర భాగస్వాములయినారు. గొల్లభాగవతులన్ననో సహజ మధురములైన తెనుఁగు నుడికారంపు సుద్దుల నేనికగున్నల గతులలో నొయ్యారము లాడించి పండితేతరజనముల యాదరణమునకు పాత్రులై స్మరణీయులయి యున్నారు.

గొల్లభాగవతులు తమ పూర్వులు కాకినాడ ప్రాంతములయం దుండెడివారని చెప్పుదురు. కొందఱు గుంటూరు మండలమున నుండి మా తాత లాంధ్రదేశంపు నలుమూలలకు వ్యాపించిరని నుడువుదురు. కొందఱు బందరు గుడివాడల మధ్య ప్రదేశము మాకు జెందినదని చెప్పుదురు. దీనినిబట్టి తెలియఁదగిన దేదియును సునిశ్చితముగ లేదు. మొత్తముమీఁద నీ వృత్తికిఁజెంది భాగవతుల మనిపించుకొనువారు మాత్ర మాంధ్రావని యందంతట నున్నారు. ఒక్కొక్క తెగవా రొక్కొక్క పరగణా నాశ్రయించుకొని అను సాంవత్సరీక వార్షికముల నేర్పరుచుకొని జీవించుచున్నారనుట బహుజనవేద్యము. వీరు సాధారణముగా సంచారమునకు సంక్రమణ దినములలోఁ బయలుదేరుదురు. పుష్యమాసము చాల వారి సంచారమున కనుకూలమైనది. పంటలు పండును. ధాన్యపురాసులు బంగారు కణికల కుప్పలవలె నెచ్చట జూచిన నచ్చట కలకలలాడుచు నుండును. ఎంతటిసామాన్యకుటుంబికైనను తదితర ఋతువులలోఁ దినుట కాహారమున్నను లేకపోయినను నీ మాసమాది నొక రెండుమాసములు గ్రాసమునకు కఱవుండదు.

అదియునుగాక వచ్చెడిది ఉత్తరాయణ మగుటచే ధర్మపరులగు శ్రీమంతులకు అన్నులపండువుగా ధాన్యరాసులు కనఁబడుచుండ యాచకబృందము లకు లేదనలేరు. మఱియు తాము శ్రమపడిన ఆరుమాసములకు సంవత్సరము సుఖముగాఁ గూర్చుండి దినుటకు వలసిన భోజనసామగ్రి యింట వచ్చిపడినది, ఇంక శేషసంవత్సరమున సుఖముగాఁ గాలము కడపవచ్చు నను సుఖలాలన ప్రతిగృహస్థునకును గలుగును. ఆ బుద్ధితోఁచుటయు, నిట్టి యాచకతతులు వచ్చి యాచించుటయు, నేకకాలమున సమాపతితము లయిన నన్యోన్యానందమున కవకాశముండును. ఆ యవకాశము పురస్కరించుకొని వీరు వత్తురు. గృహయజమానులు మానుగ వారిని సత్కరించి కళాపోషణయు, తన్మూలమున వ్యక్తిపోషణమును గావించు టాచారమైనది.

గొల్లభాగవతుల మనుపేరితో యాచన కరుగుదెంచు వారందఱును వృత్తిచే గొల్లభాగవతు లనిపించుకొనుచుండిరే కాని నిజమున నేకవర్ణులు కారు. వారిలో కొందఱు రెడ్డులు, కొందఱు కాపులు, కొందఱు చాకళ్లు, కొందఱు పెకీలు, కొందఱు గొల్లలును. మున్ముందు గొల్లలే యాచార్యులయినను నీజాతివారికి రానురాను ఏనాది రెడ్డులు కూడ నాచార్యులయి, వారుకూడ భాగవతములు కట్టుచు నాంధ్రదేశమున గొల్లభాగవతు లను సామవాయిక నామముతోడనే వ్యవహరింపఁబడు చున్నారు.

కూచిపూడి వారితో శూద్రకులజులు కాని, చాకళ్ళుగాని, గొల్లలుకాని, వచ్చుచుండువారు. వారు ప్రత్యహము బ్రాహ్మణ భాగవతులతోఁ గలసి తిరుగుట వలనను, వారి నాటకములను చూచుట వలనను, వారు పాడెడి గీతములను కీర్తనలను, నాలకించుట వలనను, వారి నృత్యములను గమనించుట వలనను, నీసేవకులలోఁ గూడ కొంతవఱకు నృత్యగాన భారతి ప్రవేశించెడిది. అభ్యాసముచేతను, చిరపరిచయముచేతను, సాధ్యముకానట్టి విద్యయుండదుగదా! ఇట్టి వారే మాత్రమైనను సహజగాత్ర శోభ కలిగినవారైనను చదువు గలిగిన వారైనను మంచి పేరుగాంచెడివారు. కూచిపూడివారి యనుగ్రహమునకు పాత్రులైన ఇట్టివారి వంశములవారే కొంతకాలము భాగవతులకు సపర్య నాచరించి తరువాత వేఱుపడి స్వతంత్రులై తామే గురువులయి, తమ విద్య వారలకు నేర్పి, యీ భాగవతవిద్య వృత్తి విద్యగా జేసికొనియుందురు. ఇట్టివారే గొల్ల భాగవతులు.

గొల్లభాగవతుల యాచారములు:—

వీరి యాచారములలో నంత ప్రత్యేకత యేదియును గాన్పింపదు. పురుషులు స్త్రీలుకూడ పాత్రధారణ చేయుదురు. పురుషులు: వెండి ముఱుగులు, వెండి మొలతాడు, వెండి కంటె, వెండి కడియము ధరింతురు. శిరోజములను స్త్రీలవలె నిండుగా బెంచి పెంపొందించు కొందురు. వీరిలో కృత్రిమశిరోజములను (అనగా విగ్గులను) ధరించు నాచారము ప్రబలలేదు.

ఈగొల్ల భాగవతుల కాలము వారిని దేశసంచార జాతులవారిగా పరిగణింపవచ్చును. వీరు జన్మించిన ప్రదేశ మాంధ్రదేశములో నేమూల నున్నను వారు సంవత్సరము మొత్తమువీద సుతకళత్రాదులతోఁ బ్రయాణములు సంచారములు చేయుచునే యుందురు. ఈ సంచారములలో వారికొక క్రమమేమియును నున్నట్లు కనిపించదు కాని, కొన్ని కొన్ని నగరములలోను

బల్లెలలోను వీరు వచ్చు కాలమొకటి నిశ్చిత మైనది యుండకపోదు. ఇది శరత్కాలము లేదా చైత్ర వైశాఖ మాసములు.

ఆకారమున మాత్రము వీరంత స్ఫురద్రూపులు కారు. పలుకుబడి గుంటూరి ప్రాంతమువారి పలుకుబడివలెనుండి గోదావరి ప్రాంతమువారికి కొంత యేసగా దోపించును.

వస్త్రధారణ మంత నాజూకునకుఁ జెందినదికాదు. ముదుకబట్టలనే ధరింతురు. ఆ బట్టలకు పెద్దపెద్ద యంచులుండును. పురుషులు తలపాగయును, చొక్కాయును, ధరింతురు. స్త్రీలు రవికెలు చీరలు ధరింతురు. వీరి స్త్రీలు కూడ నంత యందకత్తెలు గారు. వీరుకూడ పురుషులవెనుక తాళములుగాని, హార్మోనియమునుగాని ధరించి యనుపల్లవులఁ బాడుచు యాచనకు వీథులలో నరుదెంతురు. వీరి కంఠములు కూడ పురుషకంఠములవలె నంత కోమలములు గాక పరుషములుగానే యుండును. సాధారణముగా, పాటకజాతులలోఁ బొగాకు నమలుట యొకవ్యసనముగా నుండును. వీరిలో నట్టి దురభ్యాసమునకు దోడు సంతతము ఆకు చెక్క నమలుట యభ్యాసముకూడ కలదు. పురుషులును స్త్రీలును నెల్లప్పుడును నేదో నమలుచునే యుందురు.

పురుషులు స్త్రీలు పొగచుట్టలుగూడ కాల్చుచుందురు. వీరలలో కొందఱు జువ్విఆకుననో, మఱ్ఱియాకుననో పొగాకును చుట్టి కాల్చుదురు. ఈ యాకు వగరు లోనికరిగి కంఠముల బొంగురుదనము తగ్గించునని చెప్పుదురు.

"మంచముపొత్తు, కంచము పొత్తు"ల గూర్చి వీరు సాధారణముగా వివాద పడుచుందురు. మంచము పొత్తు లనఁగా వివాహసంబంధములు. కంచముపొత్తు లనగా భోజన సంబంధములు. ఈ పొత్తుల విషయములలో వారి కులపెద్దయే వారికి నియంత. అతఁడు తక్క వేఱొక యాచారము వీరిలో నగుపించదు. తప్పుచెల్లించుటయును, చెడిపోయిన సంసారములు తిరిగి పొందుఁగూర్చుకొనుటయును నెల్లరకును దెలిసినదే.

రాత్రులు వేషములు వేయవలసి వచ్చినప్పుడు మాత్రము తప్పక వీరు మద్యము సేవింతురు. స్త్రీలలో నీ యాచారమున్నదో లేదో తెలియదు. స్త్రీలు పురుషులు కలిసి రంగమున నటింపరు. స్త్రీలు వెనుక మేళముఁ గుందురు.

## నాటకములు - పగటివేషములు

గొల్లభాగవతులలో నొక్క నాటకములే ముఖ్యాధారముగా గలవారలు తక్కువ. పగటివేషములు వేసికొని జీవించువా రధికము. ఈ యిరుతెగల వారికిని తారతమ్యము విద్యాప్రవృత్తియందును, కళా సాధనమునందును తక్కువేఱులేదు. పగటివేషములలో నందెవేసిన చేతులు వీరిలో ననేకులున్నారు. వారి పాండిత్యము, ఉచ్చారణ, కళా ప్రదర్శనము పామరుల నానందింపఁజేసి వారి హృదయములందు స్థిరనివాసము చేయుటకు సమర్థము లైనవని చెప్పి యూరకొనవలయును.

## పగటి వేషములు

గొల్లభాగవతుల పగటి వేషముల కాదర్శములు కూచిపూడివారి పగటివేషములు. వీరు వారికి సేవకులుగా నున్న దినములయందే వారి పరిచయమున నందు ప్రవేశము సంపాదించుకొని తరువాత విడివడియుందురు. ఎందువలన ననఁగా గొల్లభాగవతుల వేషములు, కూచిపూడివారి పగటివేషము లొక్కటే. 1 భజనకూటములు. 2 వైశ్యులు. 3 తీర్థయాత్ర. 4 సోమయాజి, సోమిదేవి, 5 పకీరువేషము. 6 అర్ధనారీశ్వరము

వీనినే వీరిరువురును దాల్తురు. ఉభయులవేషము లామోదకరముగానే యుండును. కొందఱు గొల్లభాగవతులు; ఆ యా వేషములకు తగిన శాస్త్ర పరిభాషయందు మిక్కిలి పరిశ్రమచేసి, నిజముగా నావేషములు సత్యము లనిపించు నంతగా నభినయింతురు. సోమిదేవి సోమయాజి వేషమునందు పనసలుకూడ చదువుదురు. రాను రాను ఈపాండిత్యము వారియందు తగ్గినది.

భజన కూటములలో వీరు చూపు చిందులు, పాడు పదములు, గెంతు గెంతులు, మిక్కిలి యానందకరముగా నుండును. ఊర్ధ్వపుండ్రములను ధరించి, నెమ్మికుంచ నాడించుచు, చేగంటను మ్రోగించుచు, చేత దీపపు స్తంభమును దాల్చి, కాళ్ళకు గజ్జెలుదాల్చి, చేత చిరుతలుదాల్చి, "హరి హరీ! యని యఱచుచు బయలుదేరిన వారినిచూడ, కొంతవఱకు నిజముగా వారు హరిదాసులే"యనిపింతురు. వేషములో తమ నిజ స్వరూపమును మఱుగుబుచ్చి, తాముదాల్చిన వేషమును మూర్తీభవించునట్లు చేయుటలో గదా వేషధారి నైపుణ్యము వెల్లడియగును.

'కోమటి' వేషములు మిక్కిలి యద్భుతముగా నుండును. నల్లని రంగు, చినుగువారి, మురికి పట్టిన పెద్దకోటు, తలపాగ, కంటిమీద, సురుపిడి కాయ, గవ్వకన్ను, బొంగురుగొంతుక, చేత గోనెసంచి, కొన్ని కొలపాత్రలు — వీనితో నాయాకృతినిచూచిన పెద్దశెట్టి ధాన్యమును కొలుచుకొనుటకు వచ్చెనాయనిపించినచో నాశ్చర్యము లేదు. వీరిలో వీరు బొంగురు గొంతుకలతో వ్యర్థవివాదముల చేయుదురు. ఇరువురు చేతనున్న సామానుల నేలబెట్టి బట్ట మోకాలి పైకి ఎగకట్టి, చేతులు పైకి త్రోసికొని, "నీవురా నీవురా"యని కేకలు వైచుచు మీదఁబడిపోవు నట్లభినయింతురే కాని యెంతవఱకును వీరిద్దరును కలియఁబడరు. ఎంతవఱకును యుక్తికి బైయుక్తి పఱపుటలోగల వారియుక్తి వైచిత్ర్యము మొదలైనవి మృదువుగా హాస్యరస ప్రధానముగా వీథిలో ప్రదర్శింతురు. ఇదిగాక సరకులపేళ్ళు గ్రుక్కతప్పక చెప్పుటయందును, లెక్కపెట్టుటయందును, లాభం, ఒకటి - జయం, ఒకటి - అని కొలుచుటయందును నెక్కువ స్వాభావమాధుర్యము స్ఫురించును. అనుదినము కోమట్లు మనము చూచువారైనను, వీరిచే ననుకరింపబడ మిక్కిలి క్రొత్తగా నగుపింతురు. ఇది కళయొక్క ముఖ్యాభిప్రాయములో నొక్కటికదా!

దినమున కొక్కటి చొప్పుననో రెండుచొప్పుననో వారు వేషములు వైచెదరు. తుదకు మాత్రమర్ధనారీశ్వర వేషములు వైచెదరు. ఇందే వారి శాస్త్రజ్ఞాన మగుపించును. ఈ వేషము వైచిన మరునాఁడు వారు యాచనకు వచ్చెదరని యర్థము. ఈ వేషమునందలి శాస్త్ర పరిచయమునుబట్టియే వారికి పేరువచ్చును.

ఈ పగటి వేషములు రానురాను సన్నగిల్లినవి. కాని యొకవిధమైన పగటి వేషములు మాత్రము తగ్గలేదు. ఈదినములలో పిల్లలకు శ్రీకృష్ణవేషము వైచెదరు. తల్లి తాళమువైచును. తండ్రి హార్మోనియమును శ్రుతివేయును. 'వెన్న తిన్న చిన్నికృష్ణ నన్నుగావ వేగ రారా!' మొదలగు కీర్తనలను వారిద్దరు పాడుచుందురు. వేషమువేసిన పిల్లవాడుమాత్రము, గజ్జెలధ్వనులతో చిందులు త్రొక్కును. ఈచిందులుమాత్రము తాళమునకు, మట్టునకు సరిపోవును. కీర్తన వారేది పాడుదురో! ఈవేషమేదియో! రెండింటికిని గల సంబంధమెట్టిదో వారిలో నెవరికిని తెలియదు.

వీరిలో కొందఱు పెద్దవాండ్రు స్త్రీవేషమును ధరించి పూర్వపు 'జావళీ' పాటలను పాడుదురు. భోగమువారు పాడుకొన్ని "శృంగారగీతములను" పాడుదురు. 'హాస్యపుపాటలను' పాడుదురు. వారంద ఱేదో జీవనోపాధి కీ వృత్తిధరించినవారు. వీరియందు కళాపాటవము కనిపించదు.

వీరికి వేషమున కుచితమయిన యలంకారములు తక్కువ. ఎంతవఱకు మొగమున సర్దళము పూసికొందురు. నీలి మందు చేతికి పూసికొందురు. మారు పూసలదండలను చేతులకును మెడలోను ధరింతురు. కాగితపుట్టలను కిరీటములవలె కత్తిరించి వానికి పూసలు చుట్టి ధరింతురు. లేదా పూర్వపు పసుపు కొమ్మరగదీసి యద్దిన భుజకీర్తులను ధరింతురు.

వీరి యాటలు పాట లిప్పుడంత ఆకర్షణీయముగా లేకుండుటకు మొదటి కారణము; తగిన యలంకారములు లేకుండుట, రెండవకారణము; వీరియందు గానకళగాని, యభినయకళగాని, నృత్యకళగాని, వృద్ధిచెందకుండుట. అన్నిటికంటె ముఖ్యమయినది, జనులలో నిట్టి విషయములయం దభిరుచి తరుగుట. అందుచే నీ కళలు వెనుకబడు చున్నవి.

### నాటకములు:—

గొల్లభాగవతుల నాటకమునకుఁ బ్రతీతి తక్కువ. దీనికి కారణము లివి : ఒకటి, సాధారణముగా నీ నాటకములు గ్రామదేవతల జాతరలయందు కాపువారి వీధులలోనో, అంతకంటె జ్ఞానహీనులగు పాటవజనముల వీధులలోనో, యాడబడు చుండుట; రెండవది, పాత్రధారులు విద్యావంతులు కాకుండుట; మూఁడవది, వారి రాగములు, వేషములు, అలంకారములు, భాష — అంతమనోహరముగను, ఆకర్షకముగను, నవ్యముగను, నిర్దుష్టముగను నుండకుండుట.

వీరి నాటకపద్ధతి యిప్పటికిని ఆదికాలమునాటిదే. జనుల యభిరుచి ననుసరించి, నూతన కథానాటకములను ప్రదర్శించుటకాని, నూతన రంగములను వేషభాషలను నిర్మించు పనిగాని, వీ రెఱుంగనిది. కావున వీరికథలకు ఇపుడు పిలుపులు తక్కువ యయినవి.

వీరభినయించు నాటకమునకు శ్రుతపాండిత్యమే కాని పుస్తక పాండిత్య మవసరములేదు. కీర్తనలుగాని, గీతములు గాని, ద్విపదలుగాని, వేదమువలె కంఠస్థములై యుండి శ్రుతులవంటివై నవి. ఒకవేళ కథకుఁడు కొన్ని పాదముల మఱచిపోవుట తటస్థించినచో— ఇట్టివి చాల చోట్ల తటస్థింపక మానవు—ఏదోయొక ముక్క; నం దతికి చదువుటయో, లేదా యతుకకయే రాగములో గలిపి వేయుటయో, లేదా వెనుకనుండి తోడి పాటకుల యల్లరిలో నెగురగొట్టుటయో, జరగును.

నటుడు తాఁ బూర్వము వల్లె వేసిన యమరములోని శ్లోకములను ప్రసక్తియున్నను లేకున్నను చదువును. కొన్ని వచనములే కందపద్యములగును. చాల వచనములు కంద పద్య చతుర్థపాదములై లయలతో "విను వారి చెవులు తాళముల ధ్వనులతో గింగురుమనునట్లు" చదువఁబడును. ఎన్ని పదములు పోయినను, అపశబ్దములు తండోపతండములుగా లోన ప్రవేశించినను, వారుమాత్రము; లయను, దరువును మాత్రము పాడుచేయరు.

గొల్లభాగవతు లాడు నాటకములు ముఖ్యముగా రెండు.

ఒకటి, శ్రీనివాస విలాసము. దీనికేవారు చెంచు లక్ష్మీకథయందురు. రెండు,మార్కండేయ నాటకము.

శ్రీనివాస విలాసములో మొత్తము నల్గురు పాత్రధారులు. 1 కృష్ణుడు 2 అతని సచివుడు. 3 లక్ష్మి 4 ఆమె చెలికత్తె. లక్ష్మి విరహముతో భల్లున తెల్లవారును. నాటకము నాడించు కళా పోషకు లుండవలయునుగాని వా రా నాటకము నెన్నిదినములయిన నాడగలరు. ఒక్కనాటి నాటకముతోనే జనులకు మొగము తిరుగును. అందుచే వారిచేఁ బూర్ణముగా శ్రీలక్ష్మీ వివాహాంతము వఱకు నాటకము వేయించువార లరుదు. శ్రీనివాస కళ్యాణములోని అనఁగా చెంచులక్ష్మి కథలోని గీతములన్నియు పామరజనులకు వచ్చినవే. వారు సమూహముగా నేదైన పనిచేయుచున్నప్పుడుగాని, కోతలదినములలోగాని, కుప్పనూర్పు దినములలోగాని, కొందఱు పల్లవులందుకొన కొందఱొక్కొక్క చరణమే పాడుచుందురు. శ్రీకృష్ణుని విరహము. సచివుని హాస్యవాక్యములు వన ప్రయాణము. లక్ష్మీదేవి యుద్యాన విహారము. ఆమె కృష్ణునిచూచుట. ఇంక విరహము. చెలికత్తెల యూరడింపులు, ఉత్తరమువ్రాయుట, ఇట్టి వన్నియును మహాకావ్య సరణిలోనే యుండును. కాని; కావ్యమున కాధారమైన రసపుష్టి మాత్రము కొఱత యగును.

గొల్లభాగవతులలో నుత్తమ తరగతి వారిచే నాడబడు మార్కండేయ నాటకమును చూచితిని. వీధిలో బుక్కావర్తకులు వేయు నాటకములకంటె శత గుణములు మనోహరముగా హృదయరంజకముగనున్నది. ఆనాటకములో నంతటికిని నద్భుతమైన ఘట్టములు; యమభటులు, మార్కండేయుని తీసికొనిపోవుటకు వచ్చుట. యముఁడు పాశములను మార్కండేయుని యఱుత వేయుట, లింగమునుండి మహేశ్వరు డావిర్భవించుట. మొదలగునవి. ఈఘట్టములను ప్రదర్శించుట వారిదే స్వత్వము. నేటి సినిమాలలోఁగూడ నంతటి భయంకరమైనట్టిదియు, సభికుల మనముల నాకర్షించు ఘట్టము లిట్లుండ నేరవు.

వెదురు కఱ్ఱలతోను, రంగు కాగితపు ముక్కలతోను, మహిషాకృతి నొక్కదానిని నిర్మింతురు. మాదిగలు వేయు డప్పులు, అప్పుడే వెచ్చచేయించి మ్రోగింపఁబడుచుండును. ఒక వంద గజముల దూరమునుండి, ఆ మహిషాకృతిలో నుండి, మొండెము పయికి కన్పడుచు కాళ్ళగజ్జెలు మ్రోయ నిప్పులు క్రక్కుచు, భీకరమైన గద దాల్చి యముఁడు ఆవిర్భవించును. ఆ మాదిగ డోళ్ళు, గజ్జెలమ్రోత, మద్దెలమ్రోత, తాళముల ధ్వని; నోటినుండివచ్చు నిప్పురవ్వలు— చూచిన నిజముగా యముఁడు నరకమునుండి వచ్చె ననిపించును

లింగమునుండి ఈశ్వరు డుదయించుటయు నింత ప్రళయోత్పాతముగనే యుండును.

కొందఱి కీవిద్య స్వత్వము గాఁబోలు, లేనిచో వారంత మనోహరముగా చూపఱుల చూడ్కులు శ్రోత్రములు గుత్తకొననేల.

వీరి రంగము మిక్కిలి సులభమైనది. నాల్గు రాటలతో పందెరివేసి యిచ్చి, కూర్చుండుటకు చప్పడుచేయుటకు రెండు బల్లలిచ్చినచాలును. తెరలు వారి కవసరము లేదు. మొదట లక్ష్మీపాత్రగాని, కృష్ణపాత్రగాని, వచ్చునప్పుడు వేషము గదినుండి రంగమునకు వేషధారి మొగము కప్పుకొని వచ్చును. రంగమున నిరువురు చెరియొక ప్రక్క నిలువంబడ యొకదుప్పటి పట్టుదురు. ఆపాత్ర

ప్రధాన పాత్రమైనచో రంగమునకు వచ్చి తెర లోనుండి దైవప్రార్థన చేయుట మొదలిడును. తెరవిడిచి యావలకు వచ్చుసరికి అధమపక్ష మరగంట కాలము పట్టును. తరువాత తెరసెల్లా తీసివేయుటయు, తాళ ధ్వనులతో నా పాత్ర నృత్యముచేయ ప్రారంభించుటయు నొకేపర్యా యము జరుగును. తరువాత నంతయు నృత్యము తక్క వేఱొండుండదు.

ముగింపు

అన్నికళలను జీవవంతములుగ జేసి పేరెన్నిక కన్న యాంధ్రసీమయందు కళ లనేకము; రా జాదరణము ప్రజాదరణము లేక నశించిపోవు చున్నవి. దేశీయ కళలు తిరిగి పునరుద్ధరింపబడి దేశము కళావంతమై విలసిల్లు టెప్పుడో!

△

# కుంతీకుమారి

శ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రి.

"కరుణశ్రీ"

అది రమణీయ పుష్పవన; మా వనమం దొక మేడ; మేడపై
నదియొక మారు మూలగది; ఆ గదిలో పదునాలుగేడులో,
పదు నయిదేండ్లో, యీడుగల బాలిక; పోలిక రాచపిల్ల; జం
కొదవెడి కాళ్ళతోడ దిగుచున్నది; క్రిందికి మెట్లమీదుగన్.

కన్నియలాగె వాలకము కన్పడుచున్నది- కాదు కాదు - ఆ
చిన్ని గులాబి లేత అరచేతులలో పసిబిడ్డ డున్నయ
ట్లున్నది; ఏమి కావలయునో గద ఇర్వురు - అచ్చుగుద్దిన
ట్లున్నవి రూపురేఖ; లెవడో యనరా దత డామె బిడ్డయే.

దొరలు ఆనందబాష్పాలో, పొరలు దుఃఖ బాష్పములో, కాని అవి గుర్తుపట్టలేము
రాలుచున్నవి ఆమె నేత్రాలనుండి, బాలకుని లేత చెక్కుటద్దాలమీద.

పొత్తులలోని బిడ్డనికి పుట్టియు పుట్టకముందె ఎవ్వరో
క్రొత్తవి వజ్రపుంగవచ కుండలముల్ గయిసేసినారు, మేల్
పుత్తడి తమ్మిమొగ్గ జిగి బుగ్గల ముద్దులు మూటగట్టు నీ
నెత్తురు కందు నెత్తికొని నెచ్చెలి యెచ్చట కేగుచున్నదో!

గాలితాకున జలతారు మేలిముసుగు, జారె నొక్కింత అదిగో చిన్నారిమోము
పోల్చుకొన్నాములే కుంతిభోజుపుత్రి, స్నిగ్ధసుకుమారి ఆమె కుంతీకుమారి.

కడువేగంబున చెంగు చెంగున తరంగాల్ పొంగ; ఆతోట వెం
బడి గంగానది పారుచున్నయది బ్రహ్మాండమ్ముగా; అల్లదే
బుడుతన్ చేతులలోన బెట్టుకొని ఆపూబోడియుంగూడ ని
య్యెడకే వచ్చుచునుండె గద్గదికతో ఏమేమొ వాపోవుచున్.

"మునిమంత్రమ్ము నొసంగనేల ! నిడెబో మున్ముందు మార్తాండు ర
మ్మనినే కోరగనేల ! కోరితినిబో నాతండురానేల ! వ
చ్చెనుబో కన్నియనంచు నెంచక ననున్ చేపట్టగానేల ! ఈ
యనుగుంబిడ్డ నొసంగనేల ! ఇపుడాహా ! ఎమికావించెదన్ !"

ఏమెడ కేగుదాన ! ఇపుడీ కసుగందును జూచెనేని మా
నాయన సైచునే ! చెలులు నవ్వకపోదురె ! చుట్టపక్కముల్
'సీ' యనకుందురే ! జనులు చేతులుచూపరె ! దైవయోగమున్
ద్రోయగ వచ్చునే ! శిశువుతో ఒడిగట్టితి లోకనిందకున్.

ఈవిషాదాశ్రువులతోడ ఇంకనెంత కాల మీామేనుదాల్తు ! గంగాభవాని
కలుషహారిణి ఈ తల్లి కడుపులోన కలిసిపోయెద నా కన్నకడుపుతోడ.

అనుచు పసివాని రొమ్ములో, అదుము కొనుచు, కుంతినదిలోనికిం[illegible]గె- నంతలోన
అట్టె నట్టేటిలో నుండి పెట్టె యొకటి, కొట్టుకొని వచ్చుచుండెను గట్టుకడకు.

మందసము రాక గనెనేమొ ముందుకిడిన, కాలువెనుకకు బెట్టె బాష్పాలనెమ్మొ
గమ్ములో చిన్ని ఆశా కణమ్ము మెరయ, ఆ దెసకె చూచు, ఆమె కన్నార్పకుండ.

"ఆత్మహత్యయు, శిశుహత్య" యనక గంగ, పాలుగానున్న ఈదీను రాలిమీాద
భువన బంధునకే జాలిపుట్టెనేమొ, పెట్టెనంపించి తెరువు చూపెట్టినాడు.

"ఎటుల కానున్నదో, ఈశ్వరేచ్ఛ" యనుచు, సగము తడసిన చీరతో మగువ తిరిగి
దరికి చనుదెంచి పేటిక దరికిపోయి, మూత వెడలించె కంపించు చేతితోడ.

ఒత్తుగా పూలగుత్తుల నెత్తువెట్టి, మెత్తగా పొత్తిగుడ్డల మెత్తలునిచి
క్రొత్త నెత్తలిరాకుల కూర్చిపేర్చి, ఒత్తుకొనకుండ చేతితో ఒత్తిచూచి.

ఎట్టకేలకు మది బిగబట్టి 'ఇంక, నన్ను విడిపోదువే నాయనా' యటంచు
బాష్పముల సాము దడిసిన పక్కమీాద, చిట్టిబాబును బజ్జుండబెట్టె తల్లి.

చిన్ని పెదవుల ముత్యాలు చిందిపడగ, కలకల మటంచు నవ్వునే గాని - కన్న
యమ్మ కష్టము తన యదృష్టమ్ముకూడ, ఎరుగడింతయు ఆ అమాయికపు బిడ్డ.

చెదరు గుండియ రాయిచేసికొని పెట్టె,తలుపు మూయంగబోవును, వలపు నిలుప
లేక చెయిరాక సుతు కౌగిలించి వెక్కి వెక్కి ఏడ్చును, కన్నీరు గుక్కుకొనును.

"భోగభాగ్యాలతో తులదూగుచున్న, కుంతిభోజుని గారాబు కూతురనయి
కన్న నలుసుకు ఒకపట్టె డన్నమయిన, పెట్టుకోనోచనయితి పాపిష్ఠిదాన"

పెట్టియలోన ఒత్తిగిల బెట్టినినున్ నడిగంగలోనికిన్
నెట్టుచునుంటి తండ్రి! ఇక నీకును నాకు రుణంబు తీరె మీ
దెట్టులనున్నదో మనయదృష్టము; ఘోరము చేసినాను, "నా
పుట్టుక మాసిపోను, నిను బోలిన రత్నము నాకు దక్కునే"

"పున్నమ చందమామ సరిపోయెడి నీ వరహాల మోము నే
నెన్నటికైన చూతునె" మరే! దురదృష్టము గప్పికొన్న నా
కన్నుల కంత భాగ్యమును కల్గునె? ఏయమయైన ఇంత నీ
కన్నము వెట్టి యూయి విడినప్పటి మాటగదా! స్తనంధయా!

పాలబుగ్గల చిక్కదనాల తండ్రి!! వాలుగన్నుల చక్కదనాల తండ్రి!!
మేలి నీలిముంగురుల వరాలతండ్రి!! కాలు చెయిరాని తండ్రి నా కన్నతండ్రి!!
కన్నతండ్రి నవ్వుల పూలు గంపెడేసి! చిన్నినాన్నకు కన్నులు చేరెడేసి!
చక్కనయ్యకు నెరి కురుల్ జానెడేసి! చిట్టిబాబు మైనిగనిగల్ పెట్టెడేసి!

బాలభానుని బోలు నాబాలు నీదు గర్భమున నుంచుచుంటి గంగాభవాని!
వీని నేతల్లి చేతిలోనైన బెట్టి, మాటదక్కింపు మమ్మ! నమస్సులమ్మ!
సూర్యభగవానుడా! ప్రభూ! చూచుకొనుము, నీకుమారు నటంచు కుంతీకుమారి
మరులు రేకెత్త బిడ్డను మరల మరల, ఎత్తుకొంచు పాలిండ్లపై ఒత్తుకొంచు.

బుజ్జగింపుల మమకార ముజ్జగించి, పెట్టెలోనుంచి జోకొట్టి ఎట్టులెటులో
మనసు బిగబట్టి "హరహరా"యనుచు కనులు,మూసికొని నీటిలోనికి త్రోసె పెట్టె.

ఏటికెరటాలలో పెట్టె ఏగుచుండ, సుదతి కనుచూపు మేరకు చూచి చూచి
ఉస్సురంచును వేడి నిట్టూర్పుబుచ్చె, పైటపై రాలె వేడి కన్నీటిబొట్లు.



# నవీనాంధ్ర సారస్వతము - విజ్ఞాన విప్లవము

శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు పంతులు

సారస్వతము, వాఙ్మయము, సాహిత్యము అను నవి పర్యాయపదములుగా వాడఁబడుచున్నవి. మన ప్రస్తుతాంధ్రభాష నన్నయ భట్టారకుని సుప్రసిద్ధ పద్యకావ్యమైన మహాభారత రచనతో సుమారు వెయ్యి సంవత్సరముల క్రిందట ప్రారంభమైనదని చెప్పవచ్చును. అప్పటి నుండియు కీ॥ శే॥ కందుకూరి వీరేశలింగం పంతులుగారు సామాన్యజనులు లోఁగూడ జ్ఞానము పెంపొందుటకుఁ దేశికయగు తెలుగు గద్యమును ప్రారంభించువరకును అనగా సుమారు 70-80 సంవత్సరముల క్రిందటివరకును ఆంధ్రవాఙ్మయము సంస్కృతభూయిష్ఠ మయిన కవిత్వముతో నిండియుండెను. ఆ మధ్యకాలములోని మహాకవులందరును సుప్రసిద్ధ ప్రబంధములను గాని, సంస్కృత గ్రంథముల – ముఖ్యముగా, పురాణేతిహాసముల-భాషాంతరీకరణములనుగాని రచియించిరి. వారు రచియించిన గద్యముకూడ, సంస్కృతశబ్ద జాలముతో నిండియుండెను. అచ్చ గద్యమునే రచియించిన చిన్నయ సూరిగారుకూడ మిగుల కఠినమైన పాకములోనే వ్రాసెను. తెనుగు ప్రజలకొరకు ప్రజలభాషను సృష్టించిన మహాపురుషుడు కందుకూరి వీరేశలింగమే. రచియింపఁబడిన విషయభాగమును జూచినచో ఆయనకు పూర్వము రచియింపబడిన గ్రంథములన్నియు మతనైతికవిషయములను, ప్రబంధ కల్పనలను మాత్రమే కలిగియుండెను. ఆయనయే ప్రకృతి శాస్త్రములను గూర్చియు, రాజకీయార్థిక సాంఘిక విషయములను గూర్చియు వ్రాసెను. నవలలను, నాటకములను, ప్రహసనములను రచియించెను. ఆంగ్లేయ సంస్కృత గ్రంథములను తర్జుమాచేసెను. దేశికయగు భాషలోఁ దన భావములను ప్రజలకు దెలుపుటవలన ఆంధ్ర ప్రజలలో ముఖ్యముగా సాంఘిక విషయముల యందొక విప్లవమును గలుగఁజేసెను. స్త్రీల హక్కులు మానవసమానత్వము, అస్పృశ్యతా నివారణము, ఏకేశ్వరోపాసన, కులభేదములను తీసివేయుట మొదలగు నూతన భావములను బాగుగా వ్యాపింపఁజేసి సంఘమును తారుమారుగా జేసెను. ఆయన రచియించిన గ్రంథములు పది సంపుటములైనవి. ఆయన ప్రారంభించిన విప్లవపు పునాదులమీద ఆంధ్రదేశములో నేటి రాచకీయోద్యమము నడచుచున్న దనుటలో నతిశయోక్తి లేదు. ప్రతిసంస్కారణములోను ఆంధ్రులు నేడు ముందంజ వేయుటలో వీరేశలింగము ప్రజల భాషలో రచియించిన గద్య గ్రంథములే కారణము. అదివర కుండిన సంస్కృత భూయిష్ఠమైన కావ్యములు పండితులకు మాత్రమే అర్థమై వారిలో మాత్రమే ప్రబోధము కలిగించ గలిగెను. వీరేశలింగము యొక్కయు ఆయనకు పిమ్మట ఆయన ననుకరించి వ్రాయుచున్న గ్రంథ కర్తలయొక్కయు దేశికయగు వచన గ్రంథములు, పత్రికలు, ఆంధ్రజన సామాన్యము నంతను ఉద్రేకింపఁజేసి నూతన భావములను కలుగఁజేయు చున్నవి.

భాష భావమును తెలియఁజేయుటకు సాధనము మాత్రమేయై యున్నది. ప్రధాన మైనదిభావము. చక్కని భాషలో భావములను దెలిపిన మొదలఁ

జదువరుల కాభావములు హృదయములోనికి బాగుగా నాటును. మనస్సుకు తేలికగా పట్టును. నవీనాంధ్ర దేశప్రజలయొక్క అభివృద్ధికిఁ గావలసినసమస్త విజ్ఞానమును కలుగఁజేయునదియే నవ్యసాహిత్యమని పిలువఁదగియున్నది. కవిత్వములో మాత్రము అతిశయోక్తిలో నుండి స్వభావోక్తికి వచ్చుట ఇంక నెక్కుడు సున్నితములగు వర్ణనలు చేయుట వలన ఆంధ్రులకుఁ గావలసిన గొప్ప విజ్ఞానము లభింపనేరదు. గ్రాంథికభాషకు బదులు గ్రామ్యభాషలో వ్రాసినంత మాత్రమున విషయ ప్రాముఖ్యము లేనిది యుపయోగము లేదు. యతి ప్రాసలు వదలి ఛందస్సును మార్చినంతమాత్రమున భావశూన్యమగు దానికి విలువ యుండదు. ఇప్పుడు విజ్ఞాన విషయమున ప్రపంచములోని ఇంగ్లీషు జర్మను ఫ్రెంచి రషియను మొదలైన భాషలతోఁగాని ఆఖరుకు మన ప్రక్క నున్న బంగాళీ మహారాష్ట్ర భాషలతోఁ గాని పోల్చి చూచినచో ఆంధ్రవాఙ్మయమునందు ప్రజల కుపయోగమైన విషయములను గూర్చి వ్రాయఁబడినగ్రంథసముదాయముబహుతక్కువగ నున్నదని యొప్పుకొనక తప్పదు. వట్టి కవిత్వము తోను మతనైతిక గ్రంథములతోను పురాణ గాథలతోను మాత్రము అభివృద్ధిఁగోరు ఏజాతియు వృద్ధిపడ నేరదు. నవీనజ్ఞానమునిచ్చు సమస్త శాస్త్రముల మీదను మన భాషలో నెన్నియో గ్రంథములు కావలసియున్నవి. శాస్త్ర మనఁగా యథార్థజ్ఞానము నిచ్చునది. శాస్త్రములను ప్రకృతి శాస్త్రములని సాంఘిక శాస్త్రములని రెండు విధములుగా భాగించి యున్నారు. పదార్థవిజ్ఞాన శాస్త్రము, రసాయనశాస్త్రము, వృక్ష శాస్త్రము, భూగర్భ శాస్త్రము, శరీర శాస్త్రము, వైద్యశాస్త్రము, గణితశాస్త్రము, ఖగోళశాస్త్రము మొదలగునవి ప్రకృతిశాస్త్రములు. దేశచరిత్రలు భూగోళశాస్త్రము, ఆర్థిక శాస్త్రము, రాజకీయ శాస్త్రము, నీతిశాస్త్రము, తర్కశాస్త్రము, మానసిక శాస్త్రము, వేదాంతశాస్త్రము, సాంఘికశాస్త్రము, మొదలగునవి సాంఘికశాస్త్రములు. ముఖ్యముగా ప్రకృతిశాస్త్రజ్ఞానమును వినియోగించుటవలన పరిశ్రమలు, రైళ్ళు, పొగయోడలు, విమానములు, మోటార్లు, రేడియోలు, టెలిగ్రాములు ఇంజనీరింగు, శిల్పము మొదలగువాటి యభివృద్ధి కలుగుచు ప్రజల సంపదకును, వికాసమునకును సహాయ పడుచున్నవి. గనుక ఇట్టి శాస్త్రముల మీదను, పరిశ్రమలు మొదలగు నుపయోగకరములైన విషయముల మీదను చెప్పఁదగిన గ్రంథములు లేని మన ఆంధ్ర సారస్వతము యొక్క స్థితి యెంతహీనమైనదో చెప్పనక్కర లేదు. మన ఆంధ్రజాతిగూడ అభివృద్ధి బొందవలెనన్న, నవీనజాతులలో నగ్రగామియైన స్థానమును పొందవలెనన్న మన నవ్యసాహిత్యము ఇట్టి గ్రంథములతో నింపవలసి యున్నది. నవ్యసాహిత్యమనగా నవీనాంధ్ర జాతికి అవసరమైన వాఙ్మయమని అర్థముచేసికొనవలెనుగాని, కేవలము భావకవిత్వము యొక్క విజృంభణమని మాత్రము తలచుట పొరబాటు. నేటి ప్రపంచములో గవిత్వమునకు బహుమితమైన స్థానము మాత్రమే కలిగి జనసామాన్యముయొక్క యుపయోగము కొరకు వచనకావ్యమే అతియెక్కువగ నవలంబింపఁబడుచున్నది. లీలావతి గణితమును పద్యకావ్యములో రచియించిన రోజులు గతించినవి. గణితశాస్త్రమును దేటతెల్లమైన వచనములో వ్రాయురోజులు వచ్చినవి. 1453 సంవత్సరమునందు ఇంగ్లాండు, ఫ్రాన్సు,

స్పెయిన్ మొదలగు యూరపు ఖండజాతులలో గొప్ప మానసికవికాసము ప్రారంభమయ్యెను. అప్పటినుండియే అభివృద్ధిచెంది యూరపుఖండ జాతులు ప్రపంచమంతను ఆక్రమించుకొనిరి. ప్రకృతిశాస్త్రములు విరివిగ రచింపఁబడెను. అచ్చుకనిపెట్టఁబడెను. జనసామాన్యమునకంతకు నుపయోగకరమైన గ్రంథములు వెల్లివిరిసెను. ఆ మహోద్యమమునకు బ్రధానముగా దేలిక యగు వచనగ్రంథములనే యుపయోగించిరి. ఫ్రెంచి విప్లవమునకు గారకులైన వాల్టేరు, రూసోలు తమ వచన గ్రంథముల మూలముననే ప్రపంచములో నూతనశకమును ప్రారంభింపఁజేయఁగలిగిరి. అందులో వాల్టేరు పెక్కు విషయములనుగూర్చి యెనభైమూడు సంపుటములను వ్రాసెను. రూసో ఐదారు గ్రంథముల కన్న నెక్కుడు వ్రాయక పోయినను యూరపు, అమెరికా ఖండముల ప్రజానీకములో నెక్కువ యుద్రేకమును కలిగించిన వాడీతడే. అటులనే ప్రపంచమును కదలించుచున్న కారలు మార్క్సు, లెనిన్, స్టాలిన్, గోర్కీ, టాల్‌స్టాయి మొదలగు సుప్రసిద్ధ విప్లవకారు లెవ్వరును కవీశ్వరులుగారు. వీరందరును తేట తెల్లమగు వచనములోనే వ్రాసిరి. చీనాలో రెండు విప్లవములు నడిపిన నవీన చీనా స్థాపకుడైన డాక్టరు సన్‌యటొసేను ఆమహాజాతిలో దన పదమూడు సంపుటముల వలన గొప్ప విజ్ఞాన విప్లవము (Cultural Revolution)ను గలుగజేసెను. కఠినమైన గ్రాంథికభాషను వదలి తేలికయగు ప్రజల భాషను ప్రారంభించెను. ప్రజల కుపయుక్తమైన ప్రకృతి శాస్త్రములు చరిత్రలు రాజకీయార్థిక సాంఘిక విషయములు మొదలగు విషయముల మీద నత్యంతమగు గ్రంథసముదాయము చీనా యువజనులచే వ్రాయఁబడెను. వారుమతసైతిక గ్రంథముల తోడను గవిత్వము తోడను తృప్తి పొందక నవీన విజ్ఞానము నిచ్చు వచన గ్రంథములతో దేశము నంతయును నింపివైచిరి. ఆవిజ్ఞానమే రైతులలోనికిని కార్మికులలోనికిని గూడ వ్యాపించి నూతన చీనాజాతిని సృష్టియొనర్చినది. నూతనచైనాజాతిలో దేశభక్తి, స్వార్థత్యాగము ఐక్యత ధైర్యస్థైర్యములు పూర్తిగా నేర్పడి సంవత్సరముల కొలది దుష్టమైన జపాను సామ్రాజ్యతత్వమును ఎదుర్కొనుటకు శక్తికలిగినది. భరతవర్షములోని మనము కూడ స్వాతంత్ర్యము గలిగినట్టియు తేజోవంతమైనట్టియు ప్రపంచములోని అన్ని నాగరక జాతులతో సమాన స్థానము గలిగినట్టియు కనో నూతన భారతజాతిని నిర్మాణము గావించు మహాకార్యము నందు నిమగ్నులమై యున్నాము. అట్టి నిర్మాణమునందు మహోన్నతములైన ఆదర్శములు గలిగిన పాత పునాదులను నాశనముచేయక వాటిలోఁ బెరిగిన చెత్తచెదారముల నంతను దీసివైచి కుళ్ళిపోయిన ఆచారములను కొట్టివైచి ప్రపంచములో జరుగుచున్న క్రొత్త మార్పులనెల్లను జేర్చుకొని యొక సుందరమగు నూతన సౌధమును నిర్మించుకొన వలసియున్నది. అందుకుఁ గావలసిన విజ్ఞానము నలుబదికోట్ల భారతీయులలో వ్యాపింపఁ జేయ వలసియున్నది. గావున హిందీ, ఆంధ్రము, తమిళము, కర్నాటకము, మహారాష్ట్రము మొదలగు ప్రధాన భాషలలోనట్టి విజ్ఞామును గలుగఁజేయు నవ్యసాహిత్యమును దయారు చేయవలసియున్నది. ప్రజల భాషలో ప్రజల తేలికశైలిలో సులభమైన వచనములో విజ్ఞానమును వెదజల్ల వలసియున్నది. ఈధర్మమును మనము సదా జ్ఞాపక

ముంచుకొనవలయును. కవిత్వము సంగీతము గూడ ఈకార్య సాధనకే యుపయోగింపఁబడవలెను. శాస్త్రగ్రంథములు, దేశ చరిత్రలు మొదలగు వానిని రచియించి విజ్ఞానచంద్రికా మండలి, ఆంధ్రభాషాభి వర్ధనీ సంఘము, వేగుచుక్క గ్రంథమాల, దేశోద్ధారక గ్రంథమాల, జాతీయగ్రంథమాల, ఆదర్శ గ్రంథమండలి మొదలగునవి, ఆంధ్రలోకమునకు చేసిన సేవ చిరస్మరణీయము. ఆంధ్రప్రచారిణీ గ్రంథమాల కూడ బంకించంద్ర చటర్జి మొదలగు వారియొక్క ఉద్రేకపూరితములైన నవలలను దెనుగులోనికిఁదెచ్చి చాల ఉపకారము గావించినది. ఈసంఘములన్నియు జేసినపని ఆవంజలో నరభాగమైయున్నది. ఆంధ్రమహాజనుల దృష్టి దీనివంకకు పూర్తిగా ద్రిప్పవలసియున్నది. నేఁడు జరుపబడుచున్న నవ్యసాహిత్య సభలలో అచ్చుకవిత్వమునకేగాక పైనఁ దెల్పబడిన ప్రకారము మనజాతియొక్క యభివృద్ధికి యుపయోగకరమైన సమస్త గ్రంథరచనకును ప్రాముఖ్యమియ్యవలసియున్నది. అటువంటి గ్రంథములను రచియించిన వారిని సభలలో సన్మానించియు, బహూకరించియు ప్రోత్సాహ పరచ వలసియున్నది. నవీన కవిత్వములో గూడ మన భాషలో దేశాభిమాన పూరితమైనకావ్యములు పుట్టకుండుట శోచనీయము. తమిళ భాషలో దేశభక్తి పూరితములైన కీర్తనలను రచియించిన సుబ్రహ్మణ్య భారతి వంటి కవీశ్వరుడొక్కడును నేటివరకును ఆంధ్రదేశమున నుద్భవించకుండుట దురదృష్టము. శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణగారురచియించిన మాలపల్లితప్ప నేటి ప్రజలకష్ట నిష్ఠురములను గూర్చి వర్ణించిన స్వతంత్రనవలలు తెలుగులో నరుదుగా నుండుట విచారింపవలసినవిషయము. పేద ప్రజల యిక్కట్టులనుగూర్చి హిందీభాషలో శ్రీ॥ ప్రేమచందుగారు అనేక నవలలను రచియించెను. అట్టివి మన భాషలోఁ జాలగ కావలెను. సాహిత్య సభలలో శిల్పమునకుఁ జిత్తరువులకుగూడ దగిన స్థానముండవలెను. ఇటుల నేను వ్రాయుటవలన నవ్యసాహిత్య సభలను జరుపుచున్న నా మిత్రులను నిరసించుట యేమాత్రము నా యుద్దేశము కాదు. ఆ సభలను పై విధముగా విస్తరింపఁజేసి ఆంధ్రదేశమునకు ఎక్కువ మేలుచేకూర్చవలెననియే నా కోరిక. గ్రంథాలయముల కొకమాటచెప్పి ఈ వ్యాసమును ముగించెదను. గ్రంథాలయములు కేవలము ముష్టియెత్తితెచ్చిన పాత పనికిమాలిన పుస్తకములయొక్క సంఖ్యతో దృప్తిపొందుటవలన నెట్టి లాభమును లేదు. ప్రతి గ్రంథాలయములోను ఇంతవరకు ఆంధ్రవాఙ్మయములోఁ బుట్టిన శాస్త్రీయ గ్రంథములు మొదలైన ప్రజల యభివృద్ధికి పనికివచ్చు గ్రంథముల యొక్క ఒక్కొక్క ప్రతి నిదప్పక సంపాదించి, ప్రతిసంవత్సరము ప్రచురింపఁబడు అట్టి గ్రంథములను సేకరించు చుండవలెను. ఆదర్శగ్రంథాలయముగా నుండవలసిన రామమోహాన గ్రంథాలయమునందు అట్టి గ్రంథములనెల్లను సమకూర్చవలెను. వాటి యొక్క జాపితాను ఎప్పటికప్పుడు మిగిలిన గ్రంథాలయములకు ప్రచురించు చుండవలెను.

△

# ఎక్కడికి?

## శ్రీ మల్లాది అవధాని

ఇవాళ 'పంచ్, జాన్ ఓ' లండన్, స్ట్రాండ్, లైఫ్ అండ్ లెటర్జ్, ఏ ఇంగ్లీషు పత్రిక చూసినా యుద్ధమే కనబడుతుంది. సాహిత్యమంతా యుద్ధ వాతావరణంతో నిండిపోయిఉంది. పద్యాలుగానీ కథలుగానీ, వ్యాసాలుగానీ, హాస్యాలుగానీ రమారమి అన్నిశాఖలూ యుద్ధచర్చలే సాగిస్తున్నాయి. ప్రతివ్యక్తిలోనూ స్ఫురించే యుద్ధకణాలే సాహిత్యంగా పరిణమిస్తున్నాయి. విషాదాంతాలయినా వినోదాంతాలయినా సరే యుద్ధరచనలే; ఒక విధంగా ప్రపంచం ఎట్లా ఉందో పాశ్చాత్య సాహిత్యంగూడా అట్లానే ఉంది.

కాలంతోబాటు కదలనిది సాహిత్యంకాదు. అచలంగా అహల్యమాదిరి స్థాణులై పడిఉండే మాటలపోగును సాహిత్యమని పిలవడం ఆత్మవంచన. అహల్యకు శాపవిమోచనం సాధ్యమయినంత త్వరగా చేయడమే కర్తవ్యమయి ఉంది. మనిషికి మోస్తరే సాహిత్యానికి ప్రాణం ఉంది హృదయముంది. సాహిత్యం హృదయం స్పందిస్తున్నంత కాలమే అది బతికి ఉన్నదంటాము. మనిషి జీవితమే సాహిత్య జీవితం; మనిషికీ సాహిత్యానికీ భేదంలేదు. మనుష్యుల ఆంతర జీవితమే సాహిత్యం. సాహిత్యం సజీవ చరిత్ర. ఆ చరిత్రలో ప్రతిమనిషి జీవితమూ శిలాక్షరాలలో లిఖింపబడి ఉంటుంది.

తనకాలాన్ని కాలంలోని సంచలనాలను సంక్షోభాలను సంతోషాలను లిఖించనిది సాహిత్యంకాదు. మనుషులచర్యలకు కష్టాలకు సుఖాలకు యాతనలకు కళ్ళుమూసుకునేది సాహిత్యం కాదు. తెలుగు సాహిత్యం సంచలన శీలమైనదిగా ఉండలేదు. దేశంలోని అలజడుల చరిత్ర చూదామంటే ఇందులో గానరాదు. చారిత్రక దృక్పథానికి తెలుగుసాహిత్యం ఇంతవరకు నిలవదని చెప్పడమే న్యాయం పెను ప్రళయాలు వచ్చినా ప్రబంధాలు శృంగారాన్నే చిత్రించాయి. ఆప్రళయాల ఉదంతాలు సాహిత్యంలో కనిపించవు. భారతదేశంలో అనేక తుపానులు వచ్చాయిగాని, నిశ్చింతగా నిశ్చలంగా ప్రేమ సాహిత్యం సాగజొచ్చింది.

యుద్ధంలో నేడు ఏదేశం భాగస్వామికాదో నిర్ణయించి ఎవరూ చెప్పలేరు. మన భారతదేశం గూడా నేటి యుద్ధ వాతావరణంలోనే ఉంది. భారతీయ జీవితంలో అనుకోని మార్పు లెన్నో వచ్చాయి. వస్తున్నాయి. వీటి గురించి తెలుగు సాహిత్యం మాటాడదు. నోరు విప్పదు. ఇంకా సెక్సు గురించిన గేయాలు కథలు నవలలు నాటకాలు, ఈ కాలాన్ని యీదేశాన్ని యీ మనుషుల్ని ప్రతిబింబించని సాహిత్యంగా ఉంది తెలుగు.

సాహిత్యం అమృతం కాకుంటే కాలకూటం. దేశాన్ని చిరంజీవిగా చేయ లేని సాహిత్యం దేశాన్ని చంపితీరుతుంది. కుహనా సాహిత్యం ఉండేకంటె ఊడితేనేమేలు. తెలుగు సాహిత్యం జీవితానికి సాధ్యమైనంత ఎడంగా ఉండడానికి

ప్రయత్నించడానికి అగత్యమేమిటి కలిగింది? లక్షోపలక్షలు సమస్యల్ని ఎదుర్కో వలసిన కాలంలో 'సెక్సు' మినహా వేరే విషయం లేదా? జీవశక్తిని వినియోగించవలసిన సరి అయిన దారి ఇప్పుడు ఇంద్రియ లోలతయేనా? వీటికి తెలుగు సాహిత్యం జవాబు చెప్పదలుచుకోలేదు.

తెలుగు సాహిత్యంలో నవయుగం ఇంకా ప్రారంభం కాలేదనే చెప్పాలి. ఛాందసత్వాన్ని తెలుగు సాహిత్యం వదలలేదు. దీనికి ప్రబంధబుద్ధిపోలేదు. ప్రబంధబుద్ధి అంటే నాఅభిప్రాయం సమకాలిక జీవితాన్ని స్వీకరించే ధైర్యం లేకపోవడమని. ఇవాళ మన సాహిత్యంచూచిన యితరులెవరయినా తెలుగు ప్రిమిటివు కాలాల్లోనేడుందనుకోవడానికి అవకాశముంది. మదన కామరాజు కథలనుంచి తెలుగు ముందుకు నడవలేదనిపించుకోవడం అంతగౌరవ ప్రదమయినది మట్టుకు కాదు.

నా ఫిర్యాదు ఒక్కటే. మనసాహిత్యం తన కాలానికి వెనకబడవలసిన అగత్యమేమిటి? సమకాలికజీవితాన్ని ఎందుకుచూడదు? సమస్యలనెందుకు ఎదుర్కోదు? చరిత్రనెందుకు శిలాక్షరాలలో లిఖించదు?

మొదటినుంచి తెలుగు సాహిత్యములో ఉన్న దుర్గుణం ఈ ఛాందసత్వమే-యీసనాతనత్వమే-యీసంకుచితత్వమే.

అది నిలవ నీరు – ప్రవహించదు. అది స్థాణువు-కదలదు. కనకనే జాతీయాభిమానంగల వారు కూడా విదేశ సాహిత వ్యామోహానికి వశులు గాక తప్పకండా ఉంది.

నేటిజగత్తు – ఇవాళటి మనిషి మస్తిష్కంలోని భావాలు మనబ్రతుకులమార్గాలు మనజీవశక్తికి దారి - వీటిని తెలుసుకోవాలంటే తెలుగు సాహిత్యం ఏమయినా చెపుతోందా ?

ఇంగ్లీషు-విదేశసాహిత్యానికే పోవాలే! ఏపత్రిక చూచినా ఏపుస్తకం తీసినా యీకాలం యీ కాలపు కలతలు కర్తవ్యాలు కనబడతాయి.

కర్తవ్యంఏమిటి? కష్టమైనదిగాదు. తెలుగు సాహిత్యం చెయ్య వలసినపని ఒకటే. ఇవాళ గానీ రేపుగానీ ఎప్పుడు గానీ జీవశక్తితో చకచకమని పరిగెత్తాలంటే అది సమకాలికజీవితాన్ని చరిత్రని నాగరకతని సంచలనాలని సంక్షోభాలని సంతోషాలని సమస్యల్ని సమాధానాలని శిలాక్షరాలలో లిఖించాలి!

Δ

# సరస్వతీపూజ

శ్రీ పుచ్చా వెంకటరామయ్య

శ్లో॥ యాకుందేందు తుషార హార ధవళా
యా శుభ్ర వస్త్రాన్వితా
యా వీణావరదండమండితకరా
యా శ్వేతపద్మాసనా
యా బ్రహ్మాచ్యుత శంకర
ప్రభృతిభిః దేవైస్సదా పూజితా
సా మాం పాతు సరస్వతీ భగవతీ
నిశ్శేష జాడ్యాపహా.

చిరకాలమునుంచి శరన్నవరాత్రులలో నేమి యితరకాలములందేమి సరస్వతీ విగ్రహాన్ని పెట్టి రూపాన్ని పెట్టి పుస్తకాలనుబెట్టి షోడశోపచార విధిగ పూజచేసి శ్రీ దేవీకటాక్షమును పొందుట కద్దు. అవి అన్నియు పరోక్షపూజా విధానాలు, లేదా ప్రతినిత్యపూజా విధానాలై యున్నవి. నేను ఈ వ్యాసములో చెప్పబోయే పూజా విధానం కేవలం ప్రత్యక్షపూజా విధానం. ఫలము కూడా ప్రత్యక్షమే. సంశయానికేమీ తావు లేదు. విస్మరింపబడిన ఒక ప్రాచీన పూజా విధానం నాచే జ్ఞాపకము చేయబడుచున్నదే గాని యిది నవీన విధానమున్ను కాదు.

భారతదేశములో చిరకాలమునుండీకూడా పండితులు విద్యను ముఖస్తముగానే వుంచుకుంటూ యుండేవారు. ఇప్పటివోలె అప్పుడు ముద్రణాది సౌకర్యములు లేకపోవుటవలన అతి ప్రాముఖ్యములైన గ్రంథములేతప్ప మిగతా గ్రంథములు శాశ్వతముగా గ్రంథరూపముగా నిలిచేవి కావు. శాశ్వతముగా నిలవటానికి పనికిరాని యిప్పటి మన రైల్వే వాఙ్మయమువంటి గ్రంథములు మచ్చునకుకూడా దొరికేవికావు. అప్పుడుత్తమ గ్రంథములు సంపన్నుల యొద్దను, పండితుల యొద్దను మాత్రమే లభించేవి.

సామాన్య జనానికి శ్రుతపాండిత్యమే ఆధారముగా నుండేది. సర్వశాస్త్ర పారంగతులైన పండితులు షడ్దర్శనములను ప్రవచనము చేసేవారు. పౌరాణికులు పురాణములను చదివి త్రివర్గాలను ప్రబోధించేవారు. హరికథలు చెప్పి కృష్ణభాగవతమాడి భాగవతులు హరిభక్తిని ప్రబోధించేవారు. వీథినాటకాలు, జంగంకథలు, తోలుబొమ్మలు, పల్నాటి వీరులకథలు, విని ప్రజలు ధర్మాన్ని నీతిని నేర్చుకునేవారు. సాతానులు, దాసరులు, జంగాలు, గురువులు మొదలైన పేర్లు గలవారు చదువుకొని ప్రజలకు నీతిని నియమాన్ని బోధించుతూ వుండేవారు. వేదవేదాంగములు చదివిన పండితుడు మొదలుకొని మాలదాసరి వరకు అందరూ సంఘజీవనము నియమవంతంగాను ధార్మికముగానునడవటానికే తోడుబడేవారు. విద్యలు చదువుకొని ప్రబోధన చేసేవారందరిని ప్రజలు అన్నవస్త్రము లిచ్చి సత్కరించేవారు. అందువల్ల అక్షరాలునేర్చుకోని వారుకూడా అక్షరమైన పరబ్రహ్మాన్ని చేరటానికి వీలుండేది.

ఇప్పుడు కాలంమారింది. పరిస్థితులు మారినై. ప్రాచీనమైన సాంప్రదాయాలమీద ఏవగింపు కలిగింది. తెల్లవారేదాకా భాగవతము తోలుబొమ్మలుచూచే వోపిక ప్రజలకు తగ్గిపోయింది. సినీమాలుకూడా మూడు గంటలకంటే ఎక్కువ

శరశ

ఆడితే మోటుగా భావించుతున్నారు. పూర్వ కాలంలో ఒక భాగవతమో తోలుబొమ్మలాటో చూస్తే అందులో నిఘంటువులు వచ్చేవి. స్వప్న శాస్త్రము, సాముద్రిక శాస్త్రము, శకునశాస్త్రము యుద్ధతంత్రము, ధర్మము, నీతి, అర్థశాస్త్రము, కామశాస్త్రము, అలంకారశాస్త్రము, కవిత్వం, చిత్రలేఖనం కూడా వచ్చేవి. అప్పుడీ ప్రదర్శనాలన్నీ విద్యాపరిబోధకాలుగా వుండేవి. ఇప్పటి వలె కేవలం వేడుక ప్రధానంగా యుండేవిగావు. సంగీతం, నృత్యము, నాట్యము, అభినయం మొదలైన విద్యలకు ఎక్కువ ప్రాధాన్యం వుండేది. నిత్యపరిచయము వలన ప్రేక్షకులకు గూడా రాగము, తాళము, లయ, భావము, హావము, బాగుగా గ్రహించే సామర్థ్యముండేది. అభినయశాస్త్రంలో ఒకముద్ర ఎందుకు ప్రదర్శించుతున్నాడో సామాన్యుడుకూడా గ్రహించేవాడు. అవసరము మాలిన విద్యలు అప్పుడుండేవి కాదు.

కాలముమారింది. కనుక ఇప్పటి కాలానుగుణ్యముగా మన అలవాట్లుకూడా మారుతున్నాయి. మునపటివలెగాక యిప్పుడే గ్రంథమైనను స్వల్ప వెలకు లభించుతున్నది. ప్రజలకు కూడా అన్న వస్త్రాలు అంత కష్టపడ కుండానే లభించుతున్నవి. అందువల్ల ఎంతో తీరికకాలము దొరుకుతున్నది. ఇప్పుడు ఏ శాస్త్రమైన చదువుకోవలెనంటే శ్రద్ధగలవారు చదువుకొనుటకు వీలైన రీతిగా వ్రాసిన గ్రంథములున్నవి. ఐతే ప్రజలంతా ఆ సౌకర్యముల నుపయోగించుకొనుట లేదని మాత్రము అనుభవము మీద మనకు తెలియుచున్నది. సామాన్యముగా చూచి చదవను వ్రాయను నేర్చిన వారు భారత దేశము మొత్తముమీద నూటికి ఏడుగురి కంటేలేరు. మహానాగరికుల మని విర్రవీగే బ్రిటిషు ప్రభుత్వములోనే 40 కోట్లకు 3 కోట్ల మంది చదివిన వారు లేకపోతే యింక ఎప్పటికైనా 40 కోట్ల భారతీయులు విద్యావంతు లయ్యేదరా యని భయము కలుగుచున్నది. రష్యా, జపాను మొదలయిన దేశాలు చూస్తే మాత్రము ఆశ కలుగుచున్నది.

ప్రతి విద్యావంతుడు తన జీవిత కాలములో ఇంకో కొంత మందిని అక్షరాస్యులుగా చేయుటకు పడే పాటునకే సరస్వతీ పూజ యని పేరు. గ్రంథాలయాలు నిర్మించుట నొక విధము. అందులో వకభాగమే పూర్తియైనది కాని రెండవ భాగమట్లేయున్నది. గ్రంథాలయములోని పుస్తకములను చదువుటకు తగిన పాఠకులను సమకూర్పనిదే గ్రంథాలయముల పని పూర్తికాదు. ప్రతిపాఠకునకు తగినగ్రంథాన్ని సమకూర్చటము కూడ గ్రంథాలయము పనే యై యున్నది. గ్రంథాలయ సభ్యులందరు పాటు బడినగాని యీపని నెరవేరదు. ఇంతకన్న గ్రంథాలయాలను గురించి వ్రాయను. గ్రంథాలయ శాస్త్రమునకు సంబంధించినవారు దానిని వ్రాయుదురు. ఇది అంతా కూడా సరస్వతీపూజలోనే చేరుతుంది.

ఇంకొక నిత్య పూజా విధానమున్నది. అది వ్యక్తులకు సంబంధించినది. ప్రతివిద్యావంతుడు తాను పోయిన చోటున కెల్ల, తన వెంట కొన్ని బాల శిక్షలు, కొన్ని కథల పుస్తకములు, కొన్ని పద్యాల పుస్తకములు తన వెంట కొనిపోవును. దొరుకుట లేమిగాని కొన్ని బొమ్మల పుస్తకములున్న మరీమంచిది. తాను పోయినచోటునెల్ల బడిచదువు వదలిపెట్టినవారు కొందరును, వారిలో కొంతమంది అక్షరాలు వచ్చినవారు, కొంతమంది గుణింతమంతా

వచ్చినవారు, కొంతమంది పేర్లు చదవగలవారు, కొంతమంది కూడబలికి కథలు చదువగలవారు. కూడాయుందురు. వారు తమకు వచ్చిన చదువు వలన ఏమియు లాభములేదని నిరుత్సాహము చెందియుందురు. ఇట్టివారు మనము ప్రయత్నిం చినచో ప్రతిదినము తండోపతండములుగా లభించుదురు. వారిలో శక్తిగలవారికి మనము తీసికొనివెళ్ళిన పుస్తకములు చూపించినచో తమ తరగతికి తగినపుస్తకములు తీసికొందురు. మరీశక్తిలేనివారికి తనశక్తిననుసరించి వెలతగ్గిం చియో యుచితముగానో కొన్నిపుస్తకము లీయ వచ్చును. ఇంతటితోనే తనపని తీరిపోయినదని భావింపక నెలకొకసారియో రెండునెలల కోసా రియో ఆగ్రామమునకుపోయి ఎవరెంతవరకభి వృద్ధినొందినారో కనిపెట్టి అభివృద్ధి పొందిన వారిని ఇంకను అభివృద్ధినందుటకును ఏవిధానా అభివృద్ధిపొందని వారిని తిరిగి ప్రోత్సాహపర చియు రావలెను. మరియును అభివృద్ధిపొందిన వారి కనుగుణ్యమైన తరగతి గ్రంథములను వారికి సమకూర్చుచుండవలెను. మొదట మనము చేసిన పనియంతయు వ్యర్థమైనదని నిరుత్సా హము కలుగుతుంది. కాని అది సరస్వతీపూజ అనే దృష్టితో చేసేయెడల మనకెంత జయము కలిగేది తరువాత తెలియును.

నేనుచేసిన ఒకటి రెండు పనులిచ్చట వ్రాయు చున్నాను. దానితో మీకుగూడా కొంచెము విశ్వాసము కలుగుతుంది. మాయూరిలోనే నా కుమార్తె యీడు గలపిల్లలు ఏడెనిమిదిమంది యుండేవారు. వీరందరకుకూడా కూడబలికి చదువుట వరకే వచ్చును. బస్తీకిపోయినపుడెల్ల సి॥ కుమారస్వామినాయుడు కంపెనీవో రామా అండ్కోవో కొన్ని కథలపుస్తకములు బొమ్మ లున్నవి తెచ్చేవాడిని. అందరికి తలోపుస్తక మిచ్చేవాడిని. ఎవరుతీసుకొని వెళ్ళిన పుస్తకము వారు తిరిగియిచ్చేవారు. పుస్తకములు తిరిగి యిచ్చుటకు కాలనియమముండేదికాదు. ముందర పుస్తకాలు తిరిగియిచ్చినవారు తిరిగి ఆపుస్తక ములే ఒకరు చదివిన వింకొకరు చదివేవారు. పుస్తకాలు వాపసు చేయనివారిని ప్రతిదినము హెచ్చరించుతూ యుండేవాడిని. ఆహెచ్చ రింపులో నిందకాకుండా ప్రోత్సాహమేయుండేది. ఎవరైన పుస్తకములు పారవేసిన, తిరిగి యివ్వని యెడల వారికి శిక్షయుండేది కాదు. నేను బస్తీ నుంచి వచ్చినపుడెల్ల ఈ పిల్లలు నాచుట్టుమూగే వారు. వాసుదాసుగారి చిన్న పుస్తకాలు, శకుం తల, నలుడు, ప్రహ్లాదుడు, ఆర్యకథారత్నావళి- అవిఅన్నీ నాకు నోటికి జ్ఞాపకము లేవు. పట్టుకవచ్చి పిల్లలకిచ్చేవాడిని. ఆపిల్లలలో దాదాపు అందరు ఆపుస్తకములు చదవినారు. దీని తరువాత బందరు సరస్వతీ నికేతనము వారి సతీ సావిత్రి, అనసూయ, మల్లికాగుచ్ఛము మొదలైన కథలే గాకుండా వాల్మీకివిజయం, భక్తియోగము కూడా వారిచేత చదివించినాను. క్రమక్రమముగా వారే చెలిచులి కట్ట, ఏకవీర, వేయిపడగలు, మొదలైన పుస్తకాలు చదువుకున్నారు. ఇప్పుడు వారిలో చాల మంది ఏవచన గ్రంథమైనను సులభముగా చదువుకోగలరు. నాకుమార్తె చి॥ సౌ॥ సీతా రామమ్మ భాగవతములోని పద్యములు ధారాళ ముగా చదువుతుంది. తిరుపతి వెంకట కవుల పాండవనాటకాలు చదివి తోడి యువతులకు విని పించుతుంది. మిగిలిన పిల్లలుకూడా యింతకంటె తక్కువగా ఎవరులేరు. నేను నిమిత్తమాత్రి మైనానేగాని విద్యనేర్చు కుందామనే అభిలాష వారిలో యుండనే యున్నది. ఈ పరిశోధనలో

నేను 30,40, రూపాయలకన్న ఖర్చు పెట్టలేదు. ఈవ్యయానికి నేనెప్పుడు విచారపడలేదు. ఏమంటే విడిగా చదువు చెప్పించుటకు నకపిల్లకు కూడా యీ డబ్బుచాలదు.

ఇంకొక్క విషయముకూడా వ్రాస్తాను. మాతో బుట్టువు అత్తవారింట్లో యున్నది. ఆమెకుకూడా గుణింతము వచ్చిరాకుండా యున్నది. నేను ఇంకో తోబుట్టువు కొమారుని కొరకు కొన్ని బొమ్మలపుస్తకములు కొని వారింటికివెళ్ళినాను. ఆమె నా వద్దనున్న బొమ్మల పుస్తకములు రెండు తీసికొని కొన్నాళ్ళకు చదివి తిరిగి యిచ్చినది. అటు తరువాత నేను వారియూరునకు వెళ్ళినపుడెల్ల కొన్నిపుస్తకములు తీసుకొని వెళ్ళుతుండేవాడిని. 1911వ సంవత్సరము నుంచి నేను కొని, యాచించికూడా చాలపుస్తకములు సేకరించి యుంచినాను. ఆమెభర్తగారి వద్దకూడ ఆర్. వెంకటేశ్వర్ కంపెనీవారి వచన భారతము, వచన రామాయణము ఉండేవి. అవికూడా ఆమెనెమ్మదిగా చదివినది. యోగవాశిష్ఠము, భగవద్గీత మీద వ్రాసిన తెలుగు వ్యాఖ్యానాలు, తెనుగులో వ్రాసిన ఉపనిషత్తులు ఆమెసులభముగా చదివి అర్థము చేసికొనగలదు. దీనికి నేను ధనరూపముగా ఖర్చు పెట్టినదేమియు లేదు దీనికి ముఖ్యముగా కావలసినది శ్రద్ధ, విశ్వాసము. విశ్వాసము దేనికంటే, మన యెదుటనున్నవారు మొద్దులు కాదనీ, వారికికూడా అనుకూల పరిస్థితులు కలిగించిన యెడల వారు కూడా మన వలె విద్యావంతులగుదురనియు నమ్మికలేక పోయిన పైపనులు చేయజాలము. ఇదిఅంతా సరస్వతీపూజయే.

తెనుగు దేశములో ధనదారిద్ర్యముకన్న భావదారిద్ర్యమెక్కువగా నున్నట్లు కనపడుతుంది. ఎంతమందికీ డబ్బు రూపాయలు అణాలు పైసలలోనే యుంటుందిగాని పుస్తకాల రూపముతో ఏమియు నుండదు. అనేక ధనిక గృహాలలో ఒక్క పుస్తకముకూడా దొరకదు. ఆ ఇండ్లలో నుండే ఆడవారు కర్మము చాలక ఏదైనపుస్తకము తెమ్మన్న మొగవారికి ఎక్కడలేనికోపము వస్తుంది. ఆయిండ్లలోని స్త్రీలు పుస్తకములు లేమిడివలన విద్యాహీనులుగానే యుండిపోతారు విద్యలేని యింట్లో పుట్టినపిల్లలు చదువుకోవలసివస్తే అంతా కొత్తగానే యుంటుంది. విద్యావంతులయిండ్లలో పుట్టిన భాగ్యశాలురకు విద్యలు కూడా బాగానే వస్తవి. ధర్మార్థ కామములు సంపూర్ణసుఖప్రదముగా నుండవలెనంటే స్త్రీ విద్యావతిగా నుండుట చాలా అవసరము. పురుషుని విద్యకన్న స్త్రీవిద్య పిల్లలకు చాల అవసరమైనది. అందువలన ప్రయత్నంచేసి ప్రతి విద్యావంతుడు చదవదగిన వారికి కొన్ని పుస్తకములు లభింపజేయవలెను. ఇదిగూడ సరస్వతీ పూజయే. తీరికచేసుకొని ప్రతివిద్యావంతుడును తన చుట్టు పట్టులనుండే విద్యావిహీనులను పోగుచేసి వారికి తీరిక సమయములో కొంత కాలము రాత్రులయందు చదువు నేర్పుటయును సరస్వతీ పూజయే. ధనవంతులుగా ఉండేవారు ఉచిత పాఠశాలల నేర్పఱచి విద్యాహీనులుగా ఉండే వారికి చదువు చెప్పించుటయును సరస్వతీ పూజయే.

ఇన్నివిధాల చేసినాకూడా ప్రభుత్వము ప్రజలదై ప్రజలకు విద్యగరపుట ప్రభుత్వము వారి పరమ ధర్మము అయ్యేవరకు దేశములోని ప్రజలందరును అక్షరాస్యులు కావటము అసంభవమే. అందువలన ప్రజలు అక్షరాస్యులగువరకు వారికి విద్యరాకుండా ఉండటము కోరదగినదిగాదు.

నేను పైని వ్రాసిన విధముగా వారికి పూర్వము పాండిత్యము శ్రవణము ద్వారానే లభించేది. ఇప్పుడుకూడా ఆ సంస్థలను తిరిగి ఉద్ధరింపవలసిన ఆవశ్యకత కన్పించుచున్నది.

వేదవేదాంగవేత్తలై భాష్యత్రయ ప్రవచనము చేయగల పండితులు మన దేశములో ఇప్పటికిని అచ్చటచ్చట బీజవతుగా లభించుచున్నారు. వారిని ఆహారవస్త్రములకు లోటులేకుండా సత్కరించి వారిచేత అనుష్ఠాన వేదాంతమును ప్రవచనము చేయించుటయును సరస్వతీ పూజయే యగును. సరస్వతీరూపులైన పండితపూజ సరస్వతీపూజగాక మరేమగును.

త్రివర్గములను బోధింపగల ధర్మశాస్త్రములు, పురాణములు సాంప్రదాయకముగా చెప్పగలిగియు, అన్నవస్త్రములకు లోటుగలిగి ఆదరించువారులేక, పురాణము చెపితే వినువారున్నూ లేక, ఎందరో పండితులు మూగపోయి యున్నారు. వారిని సత్కరించుటయు, వారిచేత పురాణములు, ధర్మశాస్త్రములు చెప్పించుటయు, వినుటయును గూడ సరస్వతీ పూజక్రిందనే జమ.

ఇట్లే భాగవతులు, హరిభక్తులు, జంగం కథ చెప్పువారు, వీథినాటకము లాడువారు, తోలు బొమ్మలాటవాండ్రు, పల్నాటివీరుల కథలుచెప్పువారు, సాతానిజియ్యరులు మొదలగు ప్రాచీన సాంప్రదాయకు లెందరో పూజా పురస్కారములు లేక మూలబడి యున్నారు. ఈ సంప్రదాయముల నన్నిటిని పునరుద్ధరించి వారందరిని గౌరవించి, వారికితగినభృతిని, గౌరవము(status)ను ఒసంగి, వారి చేత సామాన్యజనములో తిరిగి విద్యను వ్యాప్తిచేయవలసియున్నది. ఈసంస్థలు యిప్పటికే శిథిలావస్థలో నున్నవి.

బీజరూపముగానున్న యీసంస్థలను, పండితులను మనము చేకొని వారివలన పొందవలసిన లాభమును పొంది సంస్థలను పెంపుచేసినయెడల మనపై సరస్వతీకటాక్షము ప్రసరించును. హరి సర్వోత్తమరావు, మానికొండ సత్యనారాయణ శాస్త్రి, భావరాజువెంకటకృష్ణారావు, మల్లంపల్లి సోమశేఖరశర్మ, దిగవల్లివెంకటశివరావు, టంగుటూరి ప్రకాశంపంతులు మొదలగు వారి చేత రాజనీతి శాస్త్రములు, చరిత్రలు, కాళీపట్నము కొండయ్య, గొబ్బూరివెంకటానందరాఘవరావు, వేమూరిశ్రీనివాసరావు, వేమూరి విశ్వనాథశర్మ మొదలగువారిచేత భౌతికశాస్త్రములు, ఆచంట లక్ష్మీపతి, మల్లాదిరామమూర్తిశాస్త్రి, వాడపల్లిమురహరిరావు మొదలగు వారిచేత ఆరోగ్య శాస్త్రము, ఈ విధముగా ఆధునికులగు పండితులచే వివిధశాస్త్రములు సులభశైలిలో ప్రజలకు వినిపించియో, బ్రాడ్‌కాస్టుచేయించియో ప్రజలను విద్యావంతులుగా చేయవలసి యున్నది. వ్యాసములో నేను పేర్కొనని యెంతో మంది పండితులు మన దేశములోనున్నారు. వ్యాసము విసుగు కలిగింపకుండా ఉండే కొరకు ఆ జాబితా అంతా వ్రాయలేదు. అంతే కాని ఆ పండితులకు ప్రాముఖ్యము లేక కాదు.

ఇప్పుడున్న యింగ్లీషు పద్ధతిని చదువు చెప్పు సంస్థలు కేవలము సర్కారు నౌకరులనుతయారుచేయుటకే యేర్పడినవి. ఇందులో చదువుకున్న పండితులు అదేవిద్యను నేర్పగలరేగాని యితర జీవితావసరములను కలిగించు విద్యను నేర్పజాలరు. జీవిత పరమార్థమును లక్ష్యమును బోధించు పాఠములు ఆ పాఠశాలలలో మనకు లభింపవు. మరియును ఆపాఠశాలలోని చదువు భాగ్యవంతులకే తప్ప పేదవారికి అందుబాటులో లేదు. ఇప్పటి విధానమే మార్పు లేకుండ అవలం-

బింపబడే యెడల కొన్నివేల సంవత్సరముల వరకు భారతీయులువిద్యాహీనులుగానే ఉంటారు కనుక చౌకమైన పూర్వవిద్యాసాంప్రదాయము లను చేపట్టి ప్రతిభారతీయుడును విద్యావంతుడు అగువరకును మనము నిరంతర పరిశ్రమ చేదాము. తప్పక సరస్వతీ కటాక్షము మనపై ప్రసరింప గలదు. భారత దేశము సరస్వతీ నాట్యరంగమై విలసిల్ల గలదు.

ఈసందర్భములో ఇంకొకవిషయముగూడ తెలుప వలసియున్నది. చిన్నపిల్లలు చదువుకునే పుస్తక ములుమనకు తగినన్నిలభించుటలేదు. 2,3 రంగు లలో పెద్దఅక్షరములతో అచ్చువేయబడి అనేక రంగులతోకూడినబొమ్మలు చేర్చినపుస్తకములు ఇంగ్లీషు భాషలో మనకెన్నో లభింపగలవు. ఒక పెద్దపుస్తకములోని విషయములు తేలికభాషతో వ్రాసిన బొమ్మలుగల చిన్న పుస్తకములున్నూ ఇంగ్లీషు భాషలో దొరక గలవు. ఒక పిల్‌గ్రిమ్స్ ప్రోగ్రెసో, ఒకగెలివర్‌స్ట్రావెల్సో కావలెనంటే అణాఖరీదులో కూడా దొరుకుతుంది; అందులో గూడా ఎన్నో బొమ్మలుంటాయి. టెంపెస్టులాం టివి చిన్నపిల్లలకు ఇచ్చేటందుకు ప్రిజంటేషన్ ఎడిషన్లు లున్నవి.

ఆవిధంగానే మనరామాయణము, భారతము, భాగవతము, శాకుంతలము, విక్రమోర్వశీయము, మాళవికాగ్నిమిత్రము, నాగానందము, మొద లగు రసవంతములగు కథలు చిన్న సచిత్రపుస్త కాలుగా వ్రాయించవలెను. ఇప్పుడు ప్రఖ్యాతు లుగా ఉన్నకథకులు వానిని వ్రాయవచ్చును. లేదా యిప్పుడు వ్రాసే రసవంతములైన కథలకు తోడుగా మంచి బొమ్మలు గూడా చేర్పింప వచ్చును. మనదేశములో ఎంతోమంది రసవం తములైన కథలు వ్రాయగల వారున్నారు. అడవి బాపిరాజు, వజ్ఝల బాబురావు, బ్రహ్మ, అ. సోమేశ్వరరావు, దామెర్ల సత్యవాణి, అం కాల సుబ్బారావు, మంత్రివాది వెంకటరత్నం మొదలయిన యెందరో చక్కని బొమ్మలు వ్రాయగలవారున్నూ ఉన్నారు. 5000 ప్రతు లకు తక్కువ లేకుండా అమ్మడు పోదగిన ఆకర్షవంతమైన చిన్న పుస్తకములు ఒక సంస్థ ద్వారా ప్రచురింప గలిగెదమేని మనము లాభ మున్నూ గడింపవచ్చును. మరియు ఎంతోమంది ఇట్టి ఆకర్షవంతమైన గ్రంథములను తమ బిడ్డ లను విద్యవంతకు తిప్పుట కుపయోగించు కొందురు. మన తెలుగులో ఇట్టి పనిచేసిన వారిలో వావిలికొలను సుబ్బారావుగారు మొదటివారు. వారి చిన్న గ్రంధములలోని చిత్రములు అనేకములు ధురంధర్‌గారు వ్రాసిరి. సరస్వతీ నికేతనము వారిట్టివి కొద్దిగా వ్రాయిం చిరి. సీరిపి ఆంజనేయులుగారు కొంత పరిశ్రమ చేసిరి. ఎంకిపాటలు అంత బాగా ఆకర్షించుటకు అందులోని బొమ్మలు యెంతయినా తోడు పడినవి. తలిశెట్టి రామారావుగారి హాస్య చిత్రాలు, వ్యంగ్య చిత్రాలు భారతికి అలం కారములైనవి.

ఇప్పుడు మన వాచకాలు పరీక్షలకు చదువ వలసిన పుస్తకాలేగాని సుఖంగా, కులాసాగా చదువుకునేందుకు పనికిరావు.

చదువులో గూడా వినోదము అనుభవిస్తే పిల్లలూ పెద్దలూ ఇంకా బాగా పుస్తకాలు చదివి బాగు పడతారు. కనుక చిన్నపిల్లకాయలకు పనికి వచ్చే రెండు మూడు రంగులలో ముద్రించిన బొమ్మల పుస్తకాలు యెన్నో మనం ప్రచురించ వలెను. ఇది అంతా లాభదాయకమైన సరస్వతీ పూజయే.

బుక్ ఆఫ్ నాలెడ్జి లాంటి ఉద్గ్రంధాలు తెలుగులో అదేవిధంగా బొమ్మలతో తేలిక భాషలో వ్రాయించి ప్రచారం చేయగలిగెదమేని వయోజనవిద్య చరితార్థం అవుతుంది. ఇవన్నీ చాలా ధనంతో కూడుకున్నవి. అంతేగాదు శ్రద్ధతోను ఉపజ్ఞతోను కూడుకున్నవి. తెలుగు దేశంలో డబ్బున్నది. ఎంతో డబ్బు ఎందుకూ పనికిరాని సంస్థలలో పెట్టుబడిపెట్టి మోసపోయినవారున్నా ఉన్నారు. య 1కి రు 2000, 3000 పెట్టి కొనే వారి తెలివిని ఏమనాలో ఊహించ లేకుండా ఉన్నాను. అందుమీద 4,5 అణాల వడ్డి గూడా రాదు. ధరలు తగ్గిపోతే భారము అవుతవి భూములు – ఎన్నో ఫ్యాక్టరీలలోను లిమిటెడ్ సంస్థలలోను డబ్బుపెట్టి నూటికి 2, 3 రూపాయలు గూడా డివిడెండు రాక మూలాన్ని పోగొట్టుకున్నవారున్నావున్నారు. వారి ధనానికి ఇది మంచి పెట్టుబడిగానుండ గలదు. కిన్నెరసాని పాటలవంటి పుస్తకాన్ని రంగులతో అచ్చువేసి అందులో 30, 40 బొమ్మలుచేర్చి 2, 3 రంగుల బొమ్మలుగూడా చేరిస్తే ఎంతో మంది కొని చదువవచ్చును. పుస్తకం వ్రాయుట దానికి బొమ్మలు వ్రాయుట, అచ్చువేయుట ప్రచురించుట, ప్రచారముచేయుట, కొనుట, చదువుట ఇవన్నీ సరస్వతీపూజా విధానాలే.

ఇంకొక పూజావిధానము శేషించి యున్నది. భాగ్యవంతుల డబ్బుకు సార్థకమైన పూజావిధానమిది. సరస్వతీదేవి అవతారము ధరించిన పండితులు, కవులు, గాయకులు హరిభక్తులు, నటకులు, చిత్రలేఖకులు, వ్యాసకర్తలు, ఉపన్యాసకులు, భౌతికాదిశాస్త్ర పండితులు, చారిత్రకులు, ఉన్నారు. అందులో లక్ష్మీకటాక్షము గలవారు చాల అరుదుగానున్నారు. ఎంతో మంది దినబత్తెములు జరుగక యున్నారు. ఎంతోమందికి వృద్ధాప్యము నరకముగా గడచుచున్నది. కొంతమంది చనిపోయిన తరువాత ఔర్ధ్వదైహిక క్రియలకు ఏమిన్నీ మిగులుట లేదు. వీరందరి యోగక్షేమము ప్రభుత్వము భరింపదగినది. కాని ప్రభుత్వము మనదిగా లేదు. అందువలన మనమే వారి పోషణ చూడవలసినది. ఇది అన్నిటికన్న గొప్ప సరస్వతీపూజ.

'ఈ పూజావిధానాలలో ఒక విధానమైనను నేను అవలంబించితినా ధన్యుడను' అని మనలో ప్రతి యొక్కరమూ భావించి పూజించి ధన్యులమయ్యెదముగాక !



# ఆంధ్రవాఙ్మయము — వైద్యప్రసక్తి

శ్రీ డి. వి. సుబ్బారెడ్డి

వైద్యప్రస్తావన వైద్యవిజ్ఞానము గల ఆంధ్రగ్రంథములలో అయ్యలరాజు నారాయణామాత్యునిచే రచియింపఁబడిన "హంసవింశతి" ఆంధ్రవైద్యులందరు పఠింపఁదగిన ప్రబంధము. తద్గ్రంథరచన కాలమున మన దేశమందలి సాంఘిక పరిస్థితులను ప్రజల జీవితమును వర్ణించి చిత్రించుట యందును ఆనాఁటి పారిభాషిక పదసముదాయమును కోడీకరించుట యందును దీనితో తుల తూగు రచన వేఱు లేదనవచ్చును.

నారాయణామాత్యుఁడు ఎప్పటివాఁడో ఏమండలమువాఁడోసరిగానిర్ణయించుట కష్టము. 18శతాబ్దము వాఁడనియు, కర్నూలు మండలము వాఁడనియు కొందరు పండితుల అభిప్రాయము.

నారాయణామాత్యునికాలమున, 72 వినియోగంబులవారు గుర్తింపఁబడుచుండిరి. అందు "నరవైద్య, గజవైద్య, అశ్వవైద్య, పశువైద్య" అనఁబడు 4 విధములగు వైద్యులుండిరి. ఇరువదవ రాత్రి కథలో ఉజ్జయిని నగరమందలి అమాత్యశేఖరుని ఆస్థానమున ఆతనిసేవించు 72 వినియోగంబులవారి పట్టికలో పైని పేర్కొనబడిన చతుర్విధవైద్యులు చెప్పఁబడియున్నారు. (ఆ.5.ప.267) గుప్తగుణాహ్వయుండను ఆంధ్రవైద్య పుంగవుని రూపవేషముల నెంత నిపుణముగ కవి చిత్రించినాఁడో క్రింది పద్యములవలన స్పష్టమగును. (ఆ. 1, ప. 233- 234)

చ. మెలపడి తీగచుట్ల జిగిమించినపాగ జినుంగు పచ్చడం
బలవడు చల్వదోవతియు యారపుగంధపు బూతదొల్లుపో
గులుమణిముద్రికల్వలపు గుల్కెడుపిన్నము చంకవట్టమున్
గ్రుల తుద ముచ్చెలుక్కె వెలయు గుప్తగుణా పశువైద్యుఁ
డొప్పుగన్

గీ. వైద్యమాత్రంబునను కాదు వఱలువట్టి
నిరుపమాకార సౌష్ఠవ స్ఫురణచేత
నాశ్వినేయులతోనైన సరిఁదువాడ
కెదిరి యోజింపకయె జవాబీయఁగలఁడు.

ఆకాలపు చికిత్సాపద్ధతులు, వైద్యు లుపయోగించు పలురకముల మందులు, వారినేర్పు, వారి విజ్ఞానము, వారి శాస్త్రపరిచయము కవి ఒక దీర్ఘవచనమున నిమిడ్చియుంచినాఁడు (ఆ11.235) అందలి ముఖ్యాంశములివి. వైద్యులి ప్రజ్ఞవిశేషము. ఇతరచూర్ణము లొనరించు నుపమయు పదిఘృతములు, పదునొకండు చూర్ణములు ఏడులేహ్యములు, పది రసాయనముల పొందిక తెరుంగు విధంబును పదుమూడు తైలములు, ఏడు అంజనములు, అనేకదివ్య రసౌషధములు. గంధకవన నాభుల లక్షణంబు లెఱింగి విఱుచు పాటవీణ్యంబును, లోహ భస్మ, తామ్రభస్మ, వంగభస్మ, సీసభస్మ, నాగభస్మ, శంఖభస్మ, సువర్ణభస్మంబులు సేయు మర్యాదయు, మాత్రలుగట్టు నవధానంబును, క్షార, ద్రావక, గుగ్గులు, పిష్ట, కషాయంబులు, మూలికలు, కైకర్ణికలు, సేయు నౌచిత్యంబును, మాత్రస్థాన శారీర నిదాన శాస్త్రంబుల పరిచితియును, డెబ్బదిరెండు నాడీభేదంబులును, వాతపైత్య శ్లేష్మంబుల నుల్బణంబులైన, త్రిశతషష్టి రోగంబులకు

* హంసవింశతి: శృంగారకావ్య గ్రంథమండలి ప్రచురణ, మచిలీపట్టణము.

దత్తచ్చికిత్సలుచేయు చాతుర్యంబును గలిగి రెండవ ధన్వంతరి యనంబరగు.

ఆ కాలమున భూతవైద్యము కూడ చాల సామాన్యముగను, లాభకరముగను నుండినట్లు తోఁచెడు. రౌద్రకర్ముఁడనఁబడు భూతవైద్యుని రూపవర్ణన చదువుఁడు. (ఆ. 3 ప. 61)

ఉ. భూతియు గావుబొట్టు మెయిఁబూనిన
మూలికల్ కన్నుకల్కముల్
చేతికడెంబు దాయెతులఁ జేర్చిన
మందులు మంత్రతంత్రకో
పేతపు నాగబెత్త మరపెట్టెలు
నొప్పఁగ రౌద్రకర్ముఁడన్
భూతచికిత్స కుండొకఁడు
పొల్పుగ నచ్చటనుండు మానినీ!

సీ. పైగాలి బాఱినబారు బిశాచక
తండంబు లెల్లను దల్లడిల్లి
పొలయుచ గనుఁగొన్నఁబోవు దయ్యంబుల
విసరము భీతిచే విస్తరిల్లి
పేరు విన్నప్పుడే దూరమై చను భూత
చయములు దిగులున సరభసిల్లి
తోడరి నిల్చినయంతఁ దొలఁగు దుష్టగ్రహ
ప్రచయముల్ భయమున బరిఢవిల్లి
గీ. యెఱుకు నా రౌద్రకర్ముని కరముసోకఁ
బ్రేతభేతాళ మోహినీ పిశితభోక్తృ
కామినీ, శాకినీ, ఢాకినీ, మదాంధ
భయకర బ్రహ్మరాక్షసు ల్వల్లటిల్లి.

క. క్రూరగ్రహ చోరగ్రహ
చారగ్రహ కూశ్మశాక చండగ్రహ కా
ఛేరి గ్రహాంతర గ్రహ
వారిగ్రహములను బోవువానిఁ దలంపన్.

క. వెలగల రావుల మఱ్ఱుల
వెలుగులబాలిండ్ల శూన్యవిపినముల నుయిన్
గలుగుల నిలువక తొలఁగును
మలయక భూతములు వాని మంత్రోద్ధతికిన్.

క. ఈలాగు మంత్రమారుత
తూలకణీకృత సమస్త దుష్టగ్రహుఁడై
యాలోకాలోకాంచిత
భూలోకఖ్యాతి నతఁడు పొలుపొందు సఖీ!

పరరాజ్యముల ప్రభువులుకూడ ఆపత్కాలముల రౌద్రకర్ముని ఆహ్వానించు వారఁట :—
(ఆ. 3 ప. 82)

చ. పరపురభూమి భర్తకుల భామిని కుగ్రములైన భూతము
ల్తిరముగఁబట్టిబాధలిడు తెంపున నుండఁగ నానిమిత్తమ
న్నరపతి పిల్వనంపఁగ ఘనంబగు వేడుక రౌద్రకర్ముఁడ
త్తరి సెరమాంత్రికుండగుట దద్దయునేగి జికిత్స సేయఁగన్.

రాణులను పట్టియుండిన పెనుభూతములను వదలించఁగా, ఆయారాజులు ఆనందించి కృతజ్ఞతాపూర్వకముగా నతని బహూకరించెడివారఁట.

తే. గీ. పరధరాధిపుభార్యను బట్టినట్టి
భూతముల వెళ్ళఁగొట్ట భూభుజుఁడు మెచ్చి
ధనపరిష్కారవస్త్రముల్దనకొసంగి
య-పకము సేయఁదనయింటి కరుగుదెంచి. (ఆ3 ప103)

ఇందు, వికటకాశ్చర్యమగు విషయమేమన నిట్టి మంత్రిగాని భార్యయయ్యును నెఱజాణయగు నితనిసతి. తనను బాధించిన భూతములకథ కల్పించి తన రంకుతనమును కప్పిపుచ్చి, తన విటులను రక్షించిన నేర్పును సమయస్ఫూర్తియును. ఆడువారు సాహసించిన అబద్ధముల నెంత చక్కఁగ నాడుదురో చూడుడు. (ఆ. 3 ప. 113-121)

చ. వినుము నిజేశ! నీవుచని వేరొకయూరికిఁబోవ నాఁటిరా
త్రిఁ నొక తెంబరుండఁగను దృష్టికిగన్పడెగొన్నిరూపముల్
కనుపడిమమ్ము నీమగడు కాలిడనీయఁడు మాస్థలంబులం
దుని మెద మేమునిన్నచుదూరినసందొకభూతమయ్యెడన్.

తే. గీ. నాతి! యీవేళకును గాచి నాము నిన్ను
నీదు మగఁడింటి కరుదెంచి నిలిచినపుడు
మా తెరువు దానురాకుండ మనవి చెప్పు
చెప్ప కుండిన నీచావు సిద్ధమనుచు.

క. పదియైదు నాల్గుభూతము
లదయత ననుఁజూచి నీనిజాధిపుఁడు మమున్
మెదలంగ నీయఁడియ్యెడ
విదలింతుము నిన్నుఁబట్టి వెలదీ! యనుచున్;

క. ఇంతకు మును దనుకను న,
న్నెంతయు బాధించె నింటి కీవిప్పుడు రాఁ
బంతము చెడి నీ భయమున,
గాంతుఁడ! యవిపాటిపోయెఁ గడువడిఁగంటే!

క. ఈరీతి నీభయంబునఁ
బాఱెడు భూతములఁజూచి భామా! వారె
వ్వారని సంశయమునను,
మారింపఁ దలంచితి హాహా మదిదయలేకన్.

ఈ చమత్కారిణి తంత్రమంత్రము భూతవైద్యుని బొమ్మవలెనాడించెను. వాడు టక్కరమాటలను నమ్మి దొంగ యేడ్పులకు మోసపోయి, కనికరించి, కౌగిలించి, ఊరడించెను. తర్వాత "భూత కావును బెట్టి, విభూతిఁబెట్టి, యంత్రములు కట్టి, వెఱవకు" మనుచుండెను. తన ప్రజ్ఞను భూతములు కూడ పొగడుటయు, తన దెబ్బకు, భార్యను శరణువేడుటయు విని భూత వైద్యుడు ఉబ్బి తబ్బిబ్బులయ్యెను. వాని భార్య మాయల మారి మాత్రమేగాక - మనశ్శాస్త్ర వేత్తియు.

ఆ కాలమునను స్త్రీలలో సంతానాపేక్ష హెచ్చు. మంజుల యను యువతి పడినపాట్లు అనేకములు. (నేఁటికిని హిందూస్త్రీల "పిచ్చి"కి మేరకలదా! దొమ్మరు లమ్ము మందులు, చెంచువాడి చిటికలు, యాత్రలు, వ్రతాలు, దేవళముల నిద్రలు, బైరాగుల పూజలు.)

క. ఆబిడ గర్భోత్పత్తికి
నై బగిసియు మాలిపతి రతాదృతి మీరన్
లోఁబొడమిన రుచిమించినఁ
బ్రాబల్యము గలుగు విటుల పాలిది యయ్యెన్.

తే. ఇత్తెరంగునఁ జిత్తజాయత్తచిత్త
వృత్తిఁగైకొని జారుల పొత్తుసలిపె
నలసటయు వేసటయు లేక యటులనయ్యుఁ
జూలు గాంచఁగ లేక యా సుదతి కుంది.

చ. తిరుమల కంచి పుష్పగిరి తీర్థములుం
జని కొంగుముళ్ళతో



వరములు దంపతుల్వడి యవారిగఁ
గాన్కలు వైచి యంతటన్
బరికలు దృష్టిదీపములు
బన్నిన గద్దెలు పెట్టి యేమిటన్
గరమగు పుత్రవాంఛఁ గడఁ
గానఁగలేక విచార ఖిన్నులై. (ఆ. 2 ప. 83,85,86)

తుదకు సుద్దులచెప్పె గొల్లలు, వీరణాల్ వాయించి, కొమ్ములూది, గంగను పొగడి, కులము పెద్దల కథలనుజెప్పి, సివము పుట్టించి, "పుత్రుల చెందఁగలరు. వీరులను గొల్వుఁడని" చెప్పిపోయిరి. తర్వాత నా యువతి భక్తి పూర్వకంబుగా,

మ. కొలిచెం గాటమ రాజుల
న్నతులు చేకూర్చెన్ మహోక్షిగ్లకుం
బొలమున్ రాజుల నెంతో భక్తి
పరతన్ బూజించె నా గంగకున్
వెలయన్ వేటలు బోనముల్
సిడులు గావించెన్ సుతోత్పత్తికై
చెలి యాలాగునసల్ప నైవము
కృపన్ సిద్ధించెఁ దద్వాంఛయున్. (అ. 2 ప. 92)

ఆ కాలమున కూడ Pregnancy Anemea కలదేమో! అంత "మోమువహించెఁ దెల్పు" అన్నాఁడు కవి.

ఆ కాలమున వలపుమందుల మీద చాల నమ్మకముండినట్లు సూచనలున్నవి. భళియుండను హాంతకారి "వలవని సతి పురుషులకును, వలపులు పుట్టించుమందు వగ పెఱిగి రతిన్ గలయఁగఁ జేయంజాలిన" వాఁడఁట. (ఆ 5. ప 184)

పరోకనిని గూర్చిన ప్రశంస వినుఁడు. "వనితా పురుషుల కియ్యన యనువున నన్యోన్యమోహ మందఁగఁజేయన్ ఘనుఁడని కొందఱు చెప్పఁగ విని, తోడ్కొని తెచ్చినాను, విభుసనుఁగూర్పన్" (ఆ5 ప. 192) ఇట్టి సంకుచిత కర్మలు చేయువారుకూడ వైద్యులుగ పేర్కొనఁబడుచుండిరి.

అత్త కోడలితో అన్నమాట "నీవిభుఁడు, పరేచ్ఛఁబూని నిను విడిచి చరించే విధము తెలిసి కాదే, యీవైద్యుని తోడితెచ్చితింటికిఁ దరుణీ॥ (ఆ 5. ప. 195) కొందరు రసికులు వలపు మందుల కోసరమై వైద్యుల సహవాసము చేయుచుండిరఁట(ఈనాఁటి ధనికులు నాగరికులు సంతాననిరోధాపేక్షతో వైద్యుల సాంగత్యము అభిలాషించునట్లు!) ఆకాలపు కాముకులు నేర్చుకొన్న

స్త్రీవశ్యౌషధముల పట్టీ యిదిగో.

తే. ఇంద్రగోపంబు రోచన మెట్టలు, వెలి
గారము జలభ్రమణములఁ నీరుగొబ్బి
విత్తనాల్పట్ట పండు రసాత్తముగను
నూరిమడుపునఁబెట్టిన నారివలచు.

సీ. నల్లేరు కణిక గంధకము తేనెయునూరి
శోషించి కూడిన లేమవలచు
కరకతాండ్ర యుసిరికలు కోష్ఠుపాలచే
నూరి పట్టించిన నారిచేరు
వెలిగారమును నెట్టవిశపూలు నిజతనూ
జములనునూరిన చానకలియు
గలిగొట్టు నీరావు కాల్మడితోనూరి
విడెములోఁదగిలింప వెలదిచిక్కు

తే. గూర్మజిల్లేడు దూదిని గోశఫలర
సమున మేదించి వత్తిగాఁ జక్కఁజేసి
కుసుమనూనెను దీపంబు పొసఁగఁబెట్టి
చూపలోనౌదు రెటువంటి సుదతులైన.

తే. జాజికాయయు జాపత్రి చారపప్పు
పెనగ లనుములు గసగసల్ మునగపూలు
మదనవిత్తులు కొబ్బెర మందపాల
నూరిత్రాగిన మదముబ్బు నూటువేళ.

క. అనుచు నిజరచితవితరణ
జనితామోదమున వైద్యజనములు దెలుపన్
వనితావశ్యౌషధములు
విని యిట్లొనరించి యింతి వెసవలపింతుఁ.

(ఆ. 5. ప. 133-136)

ఇకమందుల మాట యటుంచి మంత్రముల బలిమి వినుఁడు. మానవేతరములగు శక్తులనోడఁగూర్చు మంత్రములుగూడ, వాడుకలోనుండెను. మంత్రములలో ముఖ్యమగు మోహినీ మంత్రమును ఎట్టితరుణమున వేనియమములతో నెట్టిజపహోమములతో జరిపించిన, దేవతప్రసన్నయై కోరినకన్యను తెచ్చియెదుటపెట్టునో సరసునికథయందు (14వకథ) వర్ణింపఁబడియున్నది. చోటుచాలక వదలివేయుచున్నాను. అబలలైన స్త్రీలు మాత్రమూరకుండిరా? వారుపయోగించు బాళి మందులు వాని ప్రభావము అరయుఁడు.

సీ. గంబూరమును జాజికాయ లుమ్మెత్తవి
త్తులు మల్లమాతంగి కలువగడ్డ
పచ్చయెన్నులు కోష్టుపచ్చిక మంచేను
గమదము గుల్లసున్నము రుద్ర
జడవేరు వస, ఖురాసానివామము పుడ
కలపోదిగాడు మైగారు చెమట
నీరావు గజ్జల చేరినమష్టును
గాల్మడి రాతంటుగాను నూరి

తే. కలియ గురిగింజలం తేసి గుళికలమర
జేసి నీడనె యారించి తీసిదాచి
యున్న మందింత మడుపులో నొసఁగెనతని
కధికతరమోహమూన నాహంసయాన.

క. ఈబాళిమందు మనగొని
యాబిడతనకండ్లగట్టి నట్లుండనతం
డేబుద్ధిలేక నచ్చెలి
సోబలకే దక్కిచిక్కి చొక్కుచు దిరిగెఁ.

(ఆ. 5. ప. 156-157)

ధనచిత్తుడను బేరిఅంగడి లోని వస్తువులజాబితా చదివిన ఆకాలపు మందులంగడిసరకులు మూలికలు పాషాణములు ఖనిజములు బోధపడును. ఇది ఒక (Drug Store) ఆకాలమున నిట్టివి ప్రతిపట్టణమున నుండెను.

సీ. జాజికాయలురాస్న జాపత్రియు హరిద్ర
 నాగర గంధక నాభిరసము
లతిమధురంబు దుత్తూరకైలా శిలా
 జిత్తులు మురదారు సింగు హింగు
నన్నభేదియు వస యక్కలకర పంచ
 లవణచవ్యములు బోళము మణిశిల
పిప్పళ్ళు కోష్టువు పిప్పలీ మూలంబు
 హరిదళ నాగకేసరములింగి

తే. లీకము సదాపవేళ్ళు ధాన్యాకములును
గటుకరోహిణి పటిక జంగాలపచ్చ
కర్పురియు గారవియు రేణుక మతివసయుఁ
దాళకము మాంసి నఖము నేపాలములును.

తే. క్షారపాషాణములు నభకంబులైదు
గ్రంధితగరంబును యవానికద్వయంబు
కచ్చురములు మరాటిమొగ్గలు కులుత్థ
కుసుమములు కుందురుష్కము లెసగగలవు.

సీ. గంటుభారంగియు గంకుష్టమును మెంతి
 మంజిష్టి జిలకర్ర మానిపసుపు
విషకంటకాలమ్ల వేతసంబునునీరు
 చించలంబును బులిచించలంబు
జీవకంబును నల్లజిలకర్రపుష్కర
 మూలంబు కాంపిల్యమును సముద్ర
ఫేనంబు ధాతకీసూనంబు సాసువుల్
 గజపిప్పలైణేయకంబు చిత్ర

తే. మూలగోరోచనములు కాపోతతార్క్ష్య
యష్టి మధుకంబు జీవంతి ముష్టిగాఁడ
శైలసౌవీర రసము భాంజనములు వెలి
గారమును గల్గియుండు నచ్చేరియింట.

(ఆ. 2. ప.227-230)

ఇతర వైద్య విషయక ప్రస్తావనలలో రెండు పేర్కొనెదను (1) చదువనిష్టములేని కొంటె పిల్లవాఁడు తనపాఠశాలలో చేయు దుడుకుపనులు ఓనమాలు దిద్దుమన్నఁ గడుపునొప్పి యనుచు నేడ్చుట; దండమున గుణింతము పెట్టుమన్న అంగుళి వ్రణమాయెననుచు వెనుదీయుట.

(ఆ. 3. ప. 141)

(2) లేనిజబ్బును అభినయించుట: అన్యోన్య సరస సల్లాపంబుల గుప్తగణుండును, హేమరేఖయు సురతకేళీలోలురై యుండఁగా హేమరేఖ భర్త అసహాయుఁడు తనగృహమున కరుదెంచె—

వైద్యుఁడప్పుడు గడగడవడఁకె. కాని యాజార కామిని "వెరవకుమటంచు" విటునిలాలించి నిజ నాధునితో ఒక పెద్దబొంకు బొంకెను. అందుకు అనువగునట్లు నటించెను. అమాయకుఁడగు భర్త నమ్మి మోసపోయెను. ఆ కలలకారిమాటలు ఆటలు వినుఁడు:

చ. కడుపున శూలయెత్తి వడిగానిలిపాణము పోవనున్నయా
తోడఁబడినీవు లేమిఘనదుఃఖముచే తెతెంచియీయనపో
త్కృఁడుస్మృతినేగ గావుమనితోడ్కొని వచ్చితినీతఁడౌషధం
బిడుటను నేను జీవమువహించితిరగ్గ్యరనేమిచెప్పఁ ముఖా.

క. అనియుస్సు రుస్సురనుచును
నన్నుతోదర రోగమున క్రియాంగన పొరలన్
గని కుస్తరించి వైద్యుని
మనమును రంజిల్లఁజేసి మమతదలిర్పన్.

"నీఋణము దీర్పఁగలవాఁడనే యఁటంచు బచ్చ డంబిచ్చి బహుమానమిచ్చి వైద్యు ఁబంపి"నాఁడు ఆగృహస్తుఁడు. (ఆ. 1. ప. 254-256) ఆకాలపు ప్రజలు ఈకాలమువారి కంటె అమాయకులేగాక వైద్యులఎడల కృతజ్ఞతా పూర్ణులుగను నుండెడివారు కాబోలు!



# గ్రంథాలయ వేదము

వాయువు ఎల్లవారికి ఎట్లు స్వాధీనమైయున్నదో

జ్ఞానముకూడ అట్లు స్వాధీనము కావలయును

ఉదకము ఎల్లవారికి ఎట్లుసేవ్యమై యున్నదో

జ్ఞానముకూడ అట్లు సేవ్యమై యుండవలయును

సూర్యచంద్రమండలముల తేజస్సు ఎల్లవారికి ఎట్లు సౌఖ్యప్రదముగా నున్నదో

జ్ఞానముకూడ అట్లు సౌఖ్యప్రదము కావలయును

—చిలకమర్తి లక్ష్మీనరసింహం - **1914.**

# బ్రాహ్మణ శాఖా భేదములు : కొన్ని నాడులు

శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ

బ్రాహ్మణులలో వేగినాట్లు, వెలనాట్లు, ములికినాట్లు అని శాఖాభేదము లుండుట అందరికి దెలిసిన విషయమే. నాడులు అనుపదము జనవ్యవహారమున నాట్లయినది. శాఖాభేదములకు కారణములును తద్భేదములకు కారణభూతములైన కొన్ని నాడులనుగుఱించి యించుక తెలియజెప్పుటకే ఈ వ్యాస ముద్దేశింపబడినది.

## దేశనామములు : నాడులు

మనదేశము ఆంధ్రదేశము. ఇది జంబూద్వీపమునందలి భారతవర్షములోనిది. దీనికి త్రిలింగ మని నామాంతరము. ఈ విషయమునే ఒకశాసనకావ్య మిట్లు తెలుపుచున్నది.

భాషాసమాచారభి దావిభిన్నై ర్దేశై రనేకై ర్బహుధా విభక్తే
వర్షే చ తస్మిన్ కమనీయవాస స్త్రిలింగనామా స చకాస్తి దేశః॥
మహార్ద్ధి ర్గమ్యాణి పురాణి నద్యః పుణ్యోదకా రమ్యతరా మహీధ్రాః
వనా న్యసేవ్యా న్యతలా స్తటాకా దుర్గా ణ్యధృష్యాణి చ సంతి యత్ర॥

ప్రాచీనకాలమున మనదేశమునకు ఆంధ్రాపథ మని పేరు. క్రీస్తుశకము ప్రారంభశతాబ్దుల నాటి జనవ్యవహారమున పథము దేశనామముగ నుండెను. (ఉదా: అంధ్రాపథీయగామ – అంధ్రాపథీయగ్రామః; దక్షిణాపథః – దక్షిణాపథము, ఉత్తరాపథము, కాచుపథము మొదలైనవి క్రీస్తుశకారంభ శతాబ్దులనాటి ప్రాకృతశాసనములలో గానవచ్చు పేరులు. పైఠాణాప్రాంతదేశమునకు పైఠాణపథ మని పే..

ఆంధ్రపథమున అనేకజనపదము లుండెను. జనులు నివసించు పరిమితగ్రామముల సమూహమునకు జనపద మని పేరు. అత్యంత ప్రాచీనకాలమున జనపదమునకు ఆంధ్రదేశమున హార మని పేరు. నిక్కమునకు హార మన భిన్నము, విభాగము. అందువలన ఒకజనపదమును – దేశవిభాగమును – దెలుపుటకు హారము ప్రయుక్తమయినది. వింధ్యగిరికి దక్షిణమున మొట్టమొదట మహాసామ్రాజ్యమును నిర్మించిన శాతవాహన కులజులైన ఆంధ్రమహీపతుల రాజ్యకాలమున గోవర్ధనాహారము, కాపురాహారము, ఉజ్జయనీహారము మొదలైన జనపదము లనేకము లుండెను.

ప్రాచీనాంధ్రదేశ జనపదములలో శాతవాహనిహార మొకటి. ఈజనపదము బళ్లారి ప్రాంతపు శాసనములందు పేర్కొనబడినదగుటచేత కొందఱు చరిత్రపరిశోధకులు ఈహారము బళ్లారిప్రాంతదేశమునకు పేరని యూహించుచున్నారు. ఇట్టిదే ఆంధ్రదేశపు మఱియొకజనపదము. కుడూరహారము. కుదూరాహార మనియు దీనికి వ్యవహార ముండెను. కూడూరు గ్రామమునుబట్టి తత్పరిసరప్రాంతమునకు ఆపేరు కలిగినది. కృష్ణజిల్లా బందరుతాలూకాలోని యిప్పటి గూడూరే

కూడూరు, వందలకొలది సంవత్సరములు గడవగా గడఁగా కుదూరహారము కుద్రాహారమై, గుద్రహారమై, చివరికి గుద్రవార మయినది. హారము క్రమముగా జనవ్యవహారమున వారముగ మార్పునందుట శాసనపరిశీలనమున దెలియవచ్చు విషయము.

అంధ్రభూధవుల సామ్రాజ్యసౌధము కూలిపోయిన పిదప ప్రాగాంధ్రదేశమును కైవసము కావించుకొని పరిపాలనము నెఱపిన ఇక్ష్వాకువంశ్యులకాలమున రాష్ట్రము జనపదనామ మయినది. ఇక్ష్వాకువంశజుల శాసనములు ప్రాకృతభాషలో నుండుటచేత రాష్ట్రము ప్రాకృత రూపము రఠమే మనకు వాటిలో గన్పట్టును. కమ్మరఠ, కమ్మకరఠ, పూగిరఠములు మొట్టమొదటి సారి మనకు ఇక్ష్వాకు శాసనములవలన దెలియవచ్చిన అంధ్రజనపదములు.

వేదమతము నుద్ధరించి సంస్కృతవిద్య నాదరించిన బ్రహ్మక్షత్రవంశ్యులయిన పల్లవరాజన్యులనాడు రాష్ట్రమున కాదరము హెచ్చినది. వారిరాజ్యమునందలి దేశవిభాగము లన్నియు రాష్ట్రములే. కమ్మరాష్ట్రము, పూగిరాష్ట్రము, ముండరాష్ట్రము, హిరణ్యరాష్ట్రము మొదలైనవి పల్లవరాజ పరిపాలితములైన అంధ్రదేశజనపదములు.

పల్లవరాజన్యులకు సమకాలికులై వేంగీనగరము రాజధానిగ కృష్ణా గోదావరీప్రాంతమును బరిపాలించిన శాలంకాయనగోత్రుల కాలమున జనపదమునకు విషయమని వ్యవహరించువారు. శాలంకాయనుల రాజ్యకాలమునాటి ప్రధాన రాజపురుషులలో విషయపతులు ఒకరు. వీరు నేటి కలెక్టరులవంటివారు.

శాలంకాయనులకు బిదప పూర్వాంధ్రదేశమును బరిపాలించినవారు విష్ణుకుండి నృపతులు. వీరి రాజ్యకాలమున విషయ, రాష్ట్రపదములు రెండును దేశవాచకము లైనవి. గుద్దావది విషయము, పఞ్జకిరాష్ట్రము – ఇవి రెండును వారి శాసనములలో ఉదాహృతములైనవే; వారి రాజ్యములోనివే పఞ్జకిరాష్ట్రము కాలక్రమమున ప్రక్కిరాష్ట్ర మయినది; గుద్దావదివిషయము గుద్దవాదివిషయముగ మాఱినది.

విష్ణుకుండిభూవరులను ఓడించి పూర్వాంధ్రదేశము నాక్రమించుకొని యేలినవారు పూర్వచాళుక్యకులజులు. వీరు ఆఱువందలయేండ్లపాటు అంధ్రభూతలమున కేలికలై అంధ్రుల పురోభివృద్ధికి బాటలు వేసినారు. రాజరాజనరేంద్రుడీవంశమువాడే. వీరి పరిపాలనకాలమున ప్రాచీన హార, రాష్ట్ర, విషయములే కాక మొట్టమొదటి పర్యాయము 'నాడు' కూడ దేశవాచకమైనది. ఇంకొకవిచిత్రమేమన దేశనామమును సూచించుటకు ఒక్క నాడును మాత్రమే కాక 'నాడు' కు 'విషయము'ను గూడ జేర్చి వ్యవహరించుచువచ్చిన సందర్భములు కూడ గలవు. ఈ కారణమున చాళుక్యులకాలమునాటి దానశాసనపత్రములలో వెలనాడు, వేగినాడు, కమ్మనాడు అను రూపము లేకాక వెలనాడు విషయము, వేగినాడు విషయము, కమ్మనాడు విషయము అను రూపములును కానవచ్చును.

పూర్వచాళుక్య పరిపాలితమైన ఆంధ్రదేశమున నాడులను నిట్టి జనపదము లనేక ముండెను. పోలునాడు, పొత్తపినాడు, సకటమంతనినాడు, వేగినాడు, వెలనాడు, కమ్మనాడు, పాకనాడు (పూగిరాష్ట్రము) – ఇట్టివి ప్రాచీనాంధ్రదేశమున రమారమి మూడువందలకు మించి యున్నవి. ఈ దేశవిభాగములు ఎందువల్ల కలిగినవో, ఎట్లు కలిగినవో ఇంతవఱకు దెలియరాలేదు. ఇవి రాజకీయములైన విభాగములు మాత్రము కావు; కాని ఇవి యిప్పటి జిల్లాలవంటి, తాలూకాలవంటి దేశవిభాగములే. ఈ నాడుల కీపేర్లు ఎట్లు వచ్చినదియుగూడ దెలియరాదు. కానైతే కొందఱు మాత్రము కొన్నినాడులకు వ్యుత్పత్తులు చెప్పుదురు. వేగినా డనగా వేగిన దేశము, దగ్ధరాష్ట్రమట. పాకనా డనగా పక్వమయిన భాషాసంప్రదాయాదులు పరిపాకస్థితికి వచ్చిన దేశమట. ఇట్టి వ్యుత్పత్తులు ఎంతమాత్రమును సరియైనవి కావు. కొన్ని నాడుల విషయమున సరిగా కుదిరినట్లు కన్పట్టినను అవి బుద్ధికుశలతను దెలుపునవే కాని సత్యమును నిరూపించునవిమాత్రము కావు. అయితే కొంత పరిశోధనచేసినమీదట కొన్ని నాడుల విషయమున వ్యుత్పత్తులు సాధించుట కవకాశము కలదు. ఇదియైనను కొన్నిటి విషయముననే.

జనపదములైన ఈనాడులు సహజముగ గొన్ని చిన్నవి; కొన్ని పెద్దవి. ఎందువలన గొన్ని పెద్దవైనవో, మఱికొన్ని ఎందువలన చిన్నవైనవో మనకు దెలియదు. దేశముభౌతికస్వరూపము నందలి వ్యత్యాసములను, గుణభేదములను పురస్కరించుకొని ఈనాడులు ఏర్పడినట్లు తోచును; ఏలయన, నాడులకు పర్వతముల, నదులవంటి ప్రకృతిసిద్ధములైన భౌతికవిశేషములే హద్దులుగ నుండుట కలదు. పెన్ననదిదక్షిణతటమున నున్నదేశము రేనాడు. గోదావరినది దక్షిణతటమునందలి కొంత ప్రాంతమునకు సబ్బినా డని వ్యవహారము. శ్రీశైలము తూర్పుపాదము మొదలుకొని సముద్రతీరమువఱకు గలదేశము పాకనాడు (పూగిరాష్ట్రము). ఈయుదాహరణముల ననుసరించి తెలుగు దేశపు నాడులు సామాన్యముగ నదులు, సెలయేళ్ళు, వాగులు, గుట్టలు, కొండలు – ఇట్టి హద్దుల మధ్యస్థమయిన వనువిషయము విశదమగుచున్నది. ఇట్లే అన్నినాడులకు ఉత్తర, దక్షిణములందు కాని, ప్రాక్పశ్చిమ దిశలందుకాని సాధారణముగ ప్రకృతిసిద్ధములైన హద్దు లుండును. ఈహద్దులు మన కిపుడు కొన్ని తెలియవచ్చు, తెలియకపోవచ్చును; కాని పూర్వము జనపదము లేర్పడిన పద్ధతి అట్టిదని ప్రాచీనాంధ్ర జనపద సీమావధిపరిశీలనమున దెలియగలదు.

## శాఖాభేద ప్రాచీనత

ఆంధ్రదేశమున ప్రాచీనకాలమున నందలగొలది నాడు లుండగా శాఖాభేదములకు వీటిలో కొన్నిమాత్రమే ఏల, ఎట్లు కారణభూతములైనవో మనకు దెలియరాని విచిత్రమును, గహనమును అయినవిషయము. బ్రాహ్మణులలో మనదేశమున పోలునాటి శాఖవా రనికాని, పొత్తపినాటి శాఖవా రనికాని, అత్తిలినాటి శాఖవా రనికాని యున్నట్లు మనము వినము. అట్లయి

నచో ఈశాఖాభేద మంత ప్రాచీనము కాదేమోయన్న - ఇది చాల ప్రాచీనమైనదని ప్రాచీన తామ్ర, శిలాశాసనములవలన తెలియుచున్నది.

గుంటూరుజిల్లా అయ్యంగారిపాలె మనుగ్రామములోని క్రీస్తుశక మేడవశతాబ్దినాటిదని యూహింపబడు నొకశాసనమున కమ్మకులము పేర్కొనబడినది ఇదే యింతవఱకు ఆంధ్రదేశశాసనములలో 'కమ్మకులము'నకు దొరకిన మొట్టమొదటి ఆకరము. ఈశాసనమున జల్పేశస్వామి యాలయమును కమ్మకులజుడయిన మయిందరామ నామాంతరముగల కల్గరాభరణాచార్యు లను శిల్పి కట్టించెనని కలదు. ఆగ్రామమునందలిదే, ఆనాటిదే మఱియొకశాసనమునవిశ్వకర్మకులాభరణుడును, జల్పేశ్వరపుర ఆచార్యుడును అయిన కల్గరాభరణుని శిష్యుడు చామోజు పేర్కొనబడినాడు. వేఱొకశాసనమునగూడ కల్గరాభరణుని ప్రస్తావము కలదు. ఈశాసనము లన్నియు నొక్కయూరిలోనివి, ఒక్క కాలమునాఁటివి అయినందున వీటిలో పేర్కొనబడిన కల్గరాభరణాచార్యు డొక్కడే యనుటకు సందియము లేదు. ఆసారి, ఆచారి అనునది విశ్వకర్మకులజుల బిరుదవాచకము. కల్గరాభరణాచార్యుడు కమ్మకులజుడని పేర్కొనబడినంతమాత్రమున అతడు చతుర్థవంశమునకు చెందిన కమ్మకులజుడని యర్థముచేయుట సరికాదు. ఏకాలమునగాని కమ్మకులమువారికి ఆసారి యనికాని, ఆచారి యనికాని విశ్వకర్మవంశ్యులు ధరించు నుపపద మున్నట్లు తెలియరాదు. కమ్మకులీనులు చౌదరులు. ఈచౌదరి బిరుదమైనను వారికిటీవల వచ్చినది. అత్యంతప్రాచీనమైనది కాదు. అందువలన జల్పేశ ఆలయనిర్మాత కల్గరాభరణాచార్యులు విశ్వకర్మకులజుడే. అట్లయినచో మఱల కమ్మకులజుడని చెప్పబడుట యేమని సందియము కలుగవచ్చును. కమ్మకులజు డనగా కమ్మనాటిశాఖీయుడని యర్థము. ఆర్కియలాజికల్ సూపరింటెండెంటు గారయిన శ్రీ యన్. పి. చక్రవర్తిగారు కమ్మకులజు డనగా కమ్మకులమువా డనియు, కలగరాభరణాచారి కమ్మకులీను డనియు,కమ్మకుల మంతటి ప్రాచీనమైన దనియు వ్రాసినారు. వారు వ్రాసినది చూడగా కమ్మకుల మనగా చతుర్థ వర్ణములోని శాఖయని వారి యభిప్రాయ మయినట్లు కన్పట్టును. ఇది తప్పు. ఈ శాసనములో పేర్కొనబడిన కమ్మకులము చతుర్థవర్ణములోని శాఖ కాదు. ఈశాసనముల ననుసరించి క్రీస్తుశక మేడవశతాబ్దినాటికే విశ్వకర్మకులజులలో కమ్మనాటి శాఖీయులు కల రనియు, బ్రాహ్మణులలోనే కాకవిశ్వకర్మవంశ్యులలోగూడ ప్రాచీన కాలమున శాఖాభేదము లుండె ననియు విశదమగుచున్నది.

కమ్మకులజు డనగా కమ్మనాటి శాఖీయు డను విషయము పూర్వచాళుక్య వంశజుడయిన రెండవ అమ్మరాజ విజయాదిత్యుని దానశాసనములవలనగూడ రూఢమగుచున్నది. అమ్మరాజ విజయాదిత్యునివలననుండి అగ్రహారమును ప్రతిగ్రహించిన బ్రాహ్మణుడు ఒకడు కమ్మకులజుడు. ఆ శాసనమునందలి యీ దిగువ శ్లోకమును గమనింపుడు.

ఆసీ చ్చిమిలు వాస్తవ్యో వేదార్యో దేవసన్నిభః
భరద్వాజాన్వయః కమ్మకులజః కులవర్ధనః॥

తస్యాభవత్ సుతః శ్రీమాన్ గోవిందో గురునందనః
శ్రౌతస్మార్త క్రియాధార స్సత్తమ స్సద్విజోత్తమః॥

కమ్మకులజు డనగా కమ్మనాటిశాఖవా డనువిషయము క్రీ. శ. ౧౧౫౪-వ సంవత్సరము నాటి యొక శిలాశాసనము వలనగూడ విస్పష్ట మగుచున్నది. ఈశాసనమునందలి వన్నియు దెలుగు పద్యములు. కమ్మకుల ప్రస్తావముగల ఈక్రిందిపద్యమును జూడుడు.

రాజితకీర్తు లట్టియుకగంబునఁ గమ్మకులోద్భవుల్ భర
ద్వాజ మునీంద్రగోత్రజులు పల్వురు; వారలలోన సద్గుణ
భ్రాజితకీర్తి గండెన ప్రభావసమన్వితుఁ డుద్భవించెఁ దే
జోజయశాలి సూనృతవచోనిధి బంధుజనాశ్రయుం డనన్.

నాడుల ననుసరించి యేర్పడిన ఈశాఖాభేదము ఒక్క విశ్వకర్మ కులోద్భవులలోను బ్రాహ్మణులలోను మాత్రమే కాదు. పూర్వము వైశ్యులలోగూడ నుండె ననుట కాధారములు కలవు. వైశ్యులలోకూడ కమ్మనాటిశాఖీయులైన వైశ్యులుకూడ నుండిరి. క్రీస్తుశకము ౧౧౪౯ నాటి యొకశాసనమున దెల్పిన దానమును జేసినయతడు కమ్మవైశ్యుడు, అనగా వైశ్యులలో కమ్మనాటి శాఖీయు డని యర్థము. చతుర్వర్ణమువారిలో కమ్మకుల మేర్పడుటకును కమ్మనాడే కారణము. ఈవిధమున ప్రసిద్ధమైన ఒక్కొక్క నాడు ననుసరించి చతుర్వర్ణమువారిలో ఎట్లు ఒకరకమగు న కులభేదములు కలిగినవో ఇతరవర్ణములవారిలోను అట్లే శాఖాభేదము లుత్పన్నమయినవి. ఇందు వలననే కీర్తిశేషులైన శ్రీ కొమఱ్ఱాజు వేంకటలక్ష్మణరావు పంతులుగారు ఒకప్పుడు "వెలనాటిలోని బ్రాహ్మణులు వెలనాటిశాఖవారు, వెలనాట్లు కాగా అందలి చతుర్వర్ణమువారు వెలమలైరి; కమ్మనాటిలోని బ్రాహ్మణులు కమ్మబ్రాహ్మణులు – ప్రాయికముగ వీరు కరణకమ్మలు కావచ్చు- కాగా శూద్రులు కమ్మవా రయిరి. తెలంగాణములోని బ్రాహ్మణులు తెలగాణ్యులు కాగా అందలి శూద్రులు తెలగాలైరి" అని సరిగా ప్రవచించియున్నారు. మన కీవిధమున నుదాహరణము లిచ్చుటకు అన్నినాడులనుండియు దొరకకపోవచ్చును; కాని గుంటూరుజిల్లా అయ్యంగారి పాలెమునందలి శాసనముల యాధారమున నాడుల ననుసరించి యేర్పడిన శాఖాభేదములు ప్రాచీనకాలమునుండి యుండెనని చెప్పుటకు సంశయింపబని లేదు. అయితే, ఈశాఖాభేదములు పదుమూడువందల సంవత్సరముల క్రిందటినుండి యున్నవనిమాత్రమే చెప్పగలముకాని, అవి ఎందుకు ఎట్లు ఏర్పడినవో, అంతటి ప్రాచీనకాలమున శాఖాభేదములకు సంబంధించిన ఆచారవ్యవహారము లెట్లుండెడివో ఈ విషయములనుగుఱించి మన కేమియు దెలియదు. వందలకొలది సంవత్సరములు గడవగా గడవగా తామవలంబించిన వృత్తులవిషయమునను, సంఘాభ్యుదయము విషయమునను సామాజికులలో పరస్పర సహకారావశ్యకత ఎక్కువగుటనో యేమో వైశ్యులలోను, విశ్వకర్మవంశ్యులలోను ఈశాఖాభేదము లంతరించిపోయినవి.

ప్రాచీన శాసనాధారమున మనకు నాడులనుబట్టి యేర్పడినట్లు తెలియవచ్చిన మొట్టమొదటి శాఖ కమ్మకులము. కమ్మకులమునకు కారణభూతమైన కమ్మనాటికి కమ్మకరాష్ట్రమనియు, కర్మాంక రాష్ట్రమనియు కూడ పేరు. ఈ దేశమునకు కర్మకరాష్ట్రమని, కర్మాంకరాష్ట్రమని యేల పేరు వచ్చినదియో తెలియదు.

కృష్ణానదీ దక్షిణతీరప్రాంత మంతయు ఒకప్పుడు బౌద్ధమతావలంబకులతో కిటకిటలాడు చుండిన దేశము. ఈ బౌద్ధులు బౌద్ధమునందలి మహాసాంఘికపంథ వారు. పూర్వశైల, అపరశైల, చైత్యకాది బౌద్ధ ఆంధ్రసంప్రదాయములవారందఱు మహాసాంఘికులే. మహాసాంఘికులలో కార్మికు లను నొకసంప్రదాయము వారుకూడ నున్నట్లు చైనా, టిబెట్టు దేశములలోని బౌద్ధగ్రంథ ములవలన దెలియుచున్నది. ఈ కార్మికసంప్రదాయము వారివలన ఈ దేశమునకు కర్మాంక (కమ్మ) రాష్ట్రమని పేరు వచ్చినదేమో. ఇదివఱలో దెలిపినట్లు ఈశాఖయునికి తెలియునాటికే ఆంధ్ర దేశమున కమ్మనాడువంటి నాడు లనేకము లుండెను. ఆంధ్రమున అన్నినాడు లుండగా కులము లను- శాఖలను గల్పించిన గౌరవము ఏకొన్నిటికిమాత్రమో ఏల దక్కవలెను?

## ప్రముఖ నాడులు

ఈనాడులకు (దేశములకు) ఏదో యొకవిధమైన ప్రాముఖ్యము ప్రాచీనకాలమునుండి యుండియుండవలెను. ఆంధ్రదేశ మిప్పు డున్నవిధమునగాక ప్రాచీనకాలమున చాలభాగ మరణ్యా చ్ఛాదితమై యుండెను. వేఱు వేఱు రాజవంశములవారు నదీతీరప్రదేశములందును, నీటివసరులుకల ప్రదేశములందును దమ తమ పరిపాలనకాలములందు గొంత కొంత యరణ్యమును ఛేదించి వైచి దేశమును ప్రజానివాసయోగ్యముగను, కృషిపశుపాల్యానుకూల్యముగను గావించుచువచ్చిరి. ప్రాగాంధ్రదేశ ప్రాచీనగాథల ననుసరించి ఈవిధముగ జేసి ప్రఖ్యాతిగన్న ప్రభువు త్రిలోచనపల్లవ మహారాజు. ఈమహారాజే కృష్ణయజుశ్శాఖాధ్యాయులైన బ్రాహ్మణు లనేకులను ఉత్తరమున నుండి తీసికొనివచ్చి నేటి గుంటూరుమండలమున ఉప్పుటూరు మొదలైన అనేకాగ్రహారముల నొసంగి వారి కాశ్రయమిచ్చి గౌరవించెనని ప్రతీతి. ఈవిధముగనే పశ్చిమాంధ్రమండలములను (రాయలసీమ) ప్రజావాస యోగ్యముగను, కృషియోగ్యముగను జేసిన మహారాజు కలికాల చోళుడు. ఈతని వంశమువారే రేనాడు ములికినాడు దేశములందు స్థావర మేర్పఱచుకొని ఆదేశమును జాలకాలము పాలించియున్నారు. ఈరీతిని ఆంధ్రదేశ మంతటిలో ప్రప్రథమముగ ప్రాముఖ్యమునకు వచ్చి సుభిక్షములైనవి శాఖాభేదకారణములైన ఈనాడులై యుండును. రాజధానీనగరములు, శాఖానగరములు (ఉపరాజధానులు) కలవై రాజకీయముగను, సుప్రసిద్ధ పుణ్యక్షేత్ర, తీర్థములు కలిగి మతవిషయకముగనుగూడ ఈనాడులు ఇతరనాడులకంటె ప్రాధాన్యమును వహించి యుండవచ్చును. వేంగీనగరము చాల పురాతనమైనది. అది పెక్కురాజవంశములకు రాజధాని. రాజాశ్రయము వెదకికొనుచు వచ్చిన అనేక బ్రాహ్మణ

కుటుంబములకు తత్పరిసరప్రాంతము కాణాచియైనది. పూర్వాంధ్రదేశమును బరిపాలించిన వెక్క రాజవంశములవారి శాఖానగరములతో సంశోభితములై వెలనాడు, కమ్మనాడులుకూడ సుప్రసిద్ధములైనవి. తామ్రపురి (చేబ్రోలు), ధనకటకము (ధాన్యకటకము) మొదలైనవి ప్రాచీన పల్లవ రాజ శాఖానగరములు. పాకనాటిలోని విక్రమసింహపురము (నెల్లూరు) మొదలైన అనేక నగరములు పల్లవ, చోళ, చాళుక్య భూవరుల పరిపాలనమున గొప్ప వైభవము ననుభవించినవి. ఈ కారణమున గావచ్చు విద్యాసంపన్నములైన అనేక బ్రాహ్మణ కుటుంబములు ప్రధానముగ రాజాదరపాత్రములై ఈనాడులలో నెక్కువగ నివసించి యుండవచ్చును. రాజధానీనగరములును, శాఖానగరములు నున్నవగుటచేత ఇవి తృణ కాష్ఠ జలసమృద్ధి గలిగి ఒక్క బ్రాహ్మణులనేకాక ఇతరవర్ణముల వారినిగూడ ఆకర్షించియుండు ననుటకు సందియము లేదు. ఆయావర్ణములవారాదిలో జీవనోపాధినిమిత్తమైననేమి, రాజాశ్రయమును, రాజసేవను అన్వేషించుకొనుచునైననేమి ఇతరనాడులకంటె ఈనాడుల కధికసంఖ్యాకులుగ జేరియుందురు. ఈనాడులలోని వారికి సంఘమున నన్నివిధముల పలుకుబడి ప్రాభవము లుండియుండవచ్చును. ఈవిధములైన కారణములవలన గావచ్చును ఈనాడు లితరనాడులకంటె అధికప్రాధాన్యము కలిగి శాఖాభేదములకు కారణభూతము లైనవి.

కాలము గడవగా గడవగా చిన్ననాడులు ప్రధాననాడులలో అంతర్భూతములయియు, గలసిపోయియు రూపుమాసిపోయినవి. అందువల్ల చివరికి మిగిలినవి ప్రముఖనాడులే – వెలనాడు, వేగినాడు, కమ్మనాడు మొదలైనవి. ప్రాచీనాచారము ననుసరించి చిన్ననాడులు పదునొకండవ, పండ్రెండవ శతాబ్దులనాటి శాసనములలో పేర్కొనబడుచువచ్చినను అప్పటికె పెద్దనాడులకు గౌరవము హెచ్చి ఆనాడుపరిభాషలోనే చిన్ననాడులనుకూడ వ్యవహరించువారు. చివరికి ఈప్రధాన జనపదములే కడుప్రాచీనకాలముననుండియు ఆంధ్రదేశమంతటిలో మత, రాజకీయ, ఆర్థిక, విద్యాదివిషయముల అభివృద్ధి వికాసముల నందినప్రదేశములు.

## శా ఖా భే ద ము లు : కు ల భే ద ము లు

అత్యంతపూర్వకాలమున నుండియు ఆంధ్రులలో నాడువిభేదము లుండినను అవి యిప్పటివలె శాఖాంతరవివాహములకును కులాంతర భోజన ప్రతిభోజనములకును ఎడమీయకుండ గిరిగీచుకొని ఘనీభవించిపోయిన సంఘములుమాత్రము కావు. ఆప్రాచీనకాలమున వేదశాఖాద్యవిభేదమే కాని కులవిభేద, శాఖావిభేద, మతవిభేదము లంతప్రధానముయినవిగ నుండ లేదు. బ్రాహ్మణవర్ణమంతయు నొక్కకూటము; చతుర్వర్ణమంతయు నొక్క కూటము. ఆనాడు చతుర్వర్ణములే కాని తదంతర్గతకులభేదములును, శాఖాభేదములును లేవు. శ్రీరామానుజ, శ్రీమధ్వాచార్య ఉపజ్ఞములైన విశిష్టాద్వైత, ద్వైతమతములు ఏపండ్రెండవశతాబ్దినుంచియో వచ్చినవి; ఈమతములు క్రమముగా ఆంధ్రదేశమున బాగుగా వ్యాపించినపిదపనే శ్రీవైష్ణవ, మాధ్వాది మతవిభేదములు కలిగినవి.

వైష్ణవులలోని తెంగల, వడగల సంప్రదాయము లింకను ఇటీవలివి; అనగా పండ్రెండవశతాబ్దికి దరువాతివి. కాలక్రమమున నాడు, మతము, వృత్తి విభేదములు చతుర్వర్ణాత్మకమైన హిందూ అంధ్రసంఘమున జొరబడి కుల శాఖాభేదములకు మూలకారణములై సాంఘికులను సాంఘికులనుండి వేఱుపఱుచుచువచ్చినవి. ఈకులములును, శాఖలును శాఖాంతర్గత, శాఖాంతర వివాహములు చేయ నవిగ మాఱుటకు చాలకాలము పట్టినట్లు తోచుచున్నది. ఆదిమకాలమున వట్టివిభేదములే కాని యిప్పు డున్నరీతిని సాంఘిక నియమాచార వ్యవస్థ లుండెడివి కావు. మతములు బలిసినకొలది, వ్యాపార మభివృద్ధిమైనకొలది, ఏనాడుకానాడుకే రాజకీయముగను, ఇతరవిధములను ప్రఖ్యాతిప్రతిష్ఠ లతిశయించినకొలది ఈశాఖావిభేదములనును చైతన్యము హెచ్చినది. దీనికితోడు ఏనాడు కానాడు వారు తా మధికుల మనుకొనుట కితరకారణములును గొన్ని సహాయపడినవి.

బౌద్ధ, జైనములు ఒకప్పు డంధ్రదేశమున ముమ్మరముగ వ్యాపించిన మతములు. కొంతకాల మయినపిదప వాటికి చేవ తగ్గి జనులలో ఆదరము సన్నగిల్లినది. జనాదరమును, ప్రభు త్వాదరమును కఱవై అవి కాలక్రమమున మనదేశమున అంతరించిపోయినవి. అవి నశించిపోవు చుండిన కాలమున అంతవఱకు ఆమతముల నవలంబించినవారు ఇతరనాడులకు వెళ్ళినప్పుడు తాము హిందువులమని చెప్పి హిందూమతమున దమకు వీలైన ఉన్నతవర్ణమున జేరిపోవుచువచ్చిరి. ఈవిధ మైన మతసాంకర్యము ప్రబలిననాడు ఏనాడు కానాడువారే తాముతక్క ఇతరనాడులవారు సంకరు లని భావించి తమపవిత్రతను కాపాడుకొనుటకు ప్రయత్నించుట అసహజము కాదు. తమవిశిష్ట తను, తమశీలమును, తమపవిత్రతను కాపాడుకొనుటకు హిందూసాంఘికులు చేసిన యీప్రయత్న ములలో ఒకనాడువా రింకొకనాడువారి కెడమైరి. సాంఘికుల యీప్రయత్నములు ఆయానాడుల వారు ప్రత్యేకకులములుగ శాఖలుగ నిర్ణీతములగుటకు తోవచేసినవి.

బౌద్ధ, జైన ఉపద్రవములను మించినది మహమ్మదీయ దండయాత్రోపద్రవము. ఇదొక గొప్ప విప్లవము. ఈమహమ్మదీయ దండయాత్రావిప్లవము ఆంధ్రదేశమునకు పదునాల్గవశతాబ్దిలో సంభవించినది. ఈదండయాత్రలకాలమున మహమ్మదీయు లొనరించిన అత్యాచారము లిన్ని యన్ని కావు. స్త్రీలకు, పురుషులకు బలవంతముగ ఇస్లాముమత మిచ్చి హిందువులను మతాంతరులను కావించినారు స్త్రీలను చెఱబట్టినారు. చేయరానిపను లెన్నియో చేసినారు. యుద్ధసమయమున నిట్టి యకార్యకరణము సర్వజాతి సామాన్యము. ఈయిరువదవశతాబ్ది సంగ్రామములందుగూడ నిట్టి దుండ గములు జరుగుచున్నప్పుడు మధ్యయుగమునా డిట్టివి జరుగుట వింత కాదు. బలవంతమున మతము పుచ్చుకున్న హిందువులు తమకు వీలుచిక్కినపుడు మతాచార్యులను, హిందూనాయకులను ఆశ్ర యించి, ప్రాయశ్చిత్తము కావించుకొని మఱల హిందూమతప్రవిష్టు లగుచువచ్చిరి. మఱికొందఱు ప్రాయశ్చిత్తవిధులును లేకయే వీలయినప్పుడు చాటున మాటున హిందువులలో జేరిపోవు చుండిరి. ఎవ రెట్టివారో తెలియని పిడపకాల మది.

హిందూ ఆంధ్రసంఘము మీవిధముగా కలతబడిపోయి మహమ్మదీయ దండయాత్రల కాలమునుండి మఱియు సంకరమైనది. అందువలన తమకులపవిత్రతను కాపాడుకొనుటకు సాంఘికులు ఈనాడుభేదములను మఱింత పట్టుదలతో పాటించుచు, కొంచెమించుమించుగ దమకు దెలిసిన తమనాడువారిలోమాత్రమే సాంకర్యము తక్కువ యని యెంచుచు వచ్చిరి. వైదిక, నియోగి భేదములును, మతవిభేదములును పదునాల్గవ శతాబ్దినుండి పదునుకెక్కి ఘనీభవించి, కులములుగా బిగిసికొనిపోయినవి. ఈయుత్పత్తి,నాడు విభేదములవలన రాను రాను బ్రాహ్మణులలో బ్రాహ్మణులకు సర్వే సర్వత్ర వివాహసంబంధములు లేకపోగా, తుదకు భోజన ప్రతిభోజనములును దూరమైనవి; బ్రాహ్మణులు బ్రాహ్మణుల కపాంక్తేయులయినారు. బ్రాహ్మణవర్ణపు కూటమి చితికి, చీలికలై, వాలికలై, చిద్రుపలై ఛిన్నాభిన్నమయినది. బ్రాహ్మణవర్ణమువలెనే చతుర్థవర్ణమును బహుకులాస్పదమయినది. నేడు హిందువులలో శాఖాంతరవివాహములను, శాఖాంతర్గతవివాహములను జేయుసంఘము లనేకములుగ నున్నవి. కొన్ని తమకులమువారితోనే కాని ఇతరకులముల వారితో సంబంధములు చేయవు. కొన్ని ఇతరకులములవారితోనేకాని తమకులమువారితో చేయవు. బ్రాహ్మణవర్ణమున మొదటిరకపు కులము లెక్కువ.

బ్రాహ్మణులలో శాఖాభేదమునకు మూలకారణములైన కొన్నినాడులను గుఱించి యించుక తెలిసికొందము.

## వే గి నా డు

పశ్చిమగోదావరిజిల్లా ఏలూరుతాలూకాలోని పెదవేగి ననుసరించి తత్పరిసర ప్రాంతదేశమునకు వేగినా డని పేరు కలిగినది. ఈపెదవేగ ప్రాచీనకాలమున నొకప్పుడు శాలంకాయన వంశ్యులకు రాజధానియై మహావైభవము ననుభవించిన నగరరాజము. శాలంకాయనులకు వెనుక పూర్వాంధ్రదేశమును బరిపాలించిన విష్ణుకుండి చాళుక్య నృపతులకాలమునగూడ ఈనగరము తన ప్రాముఖ్యమును గోల్పోక ఉచ్చదశయందుండెను. ఆదిమకాలమున వేగినా డన్నది కేవల మేలూరు తాలూకాకే వర్తించినను ఆటుతరువాతి కాలమున కృష్ణా గోదావరీనదుల మధ్యనుండిన ప్రదేశమంతయు వేగినాడుగనే వ్యవహరింపబడుచువచ్చెను. పశ్చిమగోదావరిజిల్లా తణుకుతాలూకాలోని కాకరపఱ్ఱు వేగినాటిలోనిది. నాడువిభేదము లేర్పడుచుండినకాలమున ఈవేగినాట నివసించిన బ్రాహ్మణు లందఱు వేగినాటి బ్రాహ్మణులైరి. మద్రాసుజిల్లా మద్రాసురాష్ట్రము అనునట్లు వేగినాడును, వేగిదేశమునుగూడ గలవు. రాజమహేంద్రవరము రాజధానిగా పూర్వాంధ్రదేశమును బరిపాలించిన పూర్వచాళుక్య కులజుడు, రాజరాజనరేంద్రుని కాలమునాడు పూర్వాంధ్రదేశమున కంతకును వేంగీదేశము పర్యాయపదమయినది. రాజరాజ నరేంద్రుని కుమారుడు మొదటి కులోత్తుంగచోడ చక్రవర్తి కాలమున ఉత్తరమున గంజాము మండలమునందలి మహేంద్రగిరి మొదలుకొని, దక్షిణమున నెల్లూరుజిల్లాలోని మన్నేటివఱకు గల దేశము వేగిదేశ మనియే వ్యవహరింప

బడుచు వచ్చినది. ఈ కారణముననే రాజరాజనరేంద్రుని యాస్థానకవియైన నన్నయ భట్టారకులవారు "వేంగీదేశంబునకు నాయకరత్నంబునుంబోని రాజమహేంద్రవరం" బని తద్రాజధానిని సంకీర్తించియున్నారు. పూర్వోక్త దక్షిణోత్తర సీమావధీ మధ్యస్థమయినది వేంగీదేశమైనను ఆదిమ వేగినాటి బ్రాహ్మణులకే వేగినాట్లను వ్యవహారము రూఢమయినది.

## వెలనాడు

వెలనాడుకూడ చాల ప్రాచీనమైన జనపదము. మొట్టమొదటిమారు ఇది పూర్వచాళుక్య భూపతుల శాసనములలో పేర్కొనబడినది. పూర్వచాళుక్య కులజు లనేకులు వెలనాటిలోని గ్రామములను అగ్రహారములుచేసి వేదాధ్యయన సంపన్నులయిన బ్రాహ్మణుల కిచ్చియున్నారు. చాళుక్యశాసనములలో వెలనాటికి విళానాడని, వరనాడని భ్రష్టరూపము లొండు రెండు కానవచ్చును. వెలనాడు ఆఱువేలదేశ మన్నవిషయము గుంటూరుజిల్లా తెనాలితాలూకా వలివేటిలో నున్న రాజరాజనరేంద్రుని కాలమునాటి యొక శాసనమువలన దెలియుచున్నది. ఆ శాసనమున నీగ్రామము "ఆఱువేల వెలనాంటి యగ్రహారమైన వలివే"గని పరికీర్తితమైనది.

ఆఱువేల వెలనా డన్నట్లుగనే ప్రాచీనకాలమున ప్రతిజనపదమునకు నేంతో కొంత సంఖ్య చేర్చి వ్యవహరించుట ప్రాచీనాచారము. ఈసంఖ్య గ్రామసూచక మను విషయము మన ప్రాచీనాంధ్రకావ్యములవలన దెలియవచ్చుచున్నది. మంచనకవి తన కేయూరబాహు చరిత్రమునందు రాజేంద్రచోడుని మంత్రియైన కొమ్మనామాత్యుడు.

> "అరుదందర్ వెలనాటిచోడమనుజేంద్రాజ్ఞాపనంబూని దు
> స్తరశక్తిం జని యేకవింశతిసహస్రగ్రామ సంఖ్యాకమై
> ధరణిం బేర్చిన పాకనాడు నిజదోర్దండైకలగ్నంబుగా
> బరిపాలించె......... ....."

నని చెప్పినసందర్భమునుబట్టి పాకనాడు ఇరువదియొక్కవేల గ్రామముల దేశమని తెలియుచున్నది.

ఇట్లే ఇతరనాడులకు చేర్చి చెప్పబడు సంఖ్యలుకూడ గ్రామసూచకము లనుటకు సందియము లేదు. ఒక్కపాకనాటిలో ఇరువదియొక్కవేయి గ్రామములుండెడివా యని సంశయము కలుగక పోదు. జనసంఘము నివసించు నునికిపట్టులు అన్నిగ్రామము లుండుట అసంభవము. ఇప్పుడు దేశవిస్తీర్ణమును చతురపుమైళ్ళలెక్కను దెలుపునట్లే ప్రాచీనకాలమున దేశవిస్తీర్ణమును గ్రామములలెక్కను దెలుపువారని తోచుచున్నది. గ్రామము ఇతరవిషయములు నెట్లో దేశవైశాల్యమును గొలుచుటకును అట్లే ప్రాతిపదిక ఇప్పటిచతురపుమైళ్ళలెక్కను గ్రామ మెంతలెక్కకు సరిపోవునో ఇంకను తేల్చుటకు దగిన పరికరములును, ప్రమాణములును లేవు. అందువలన వెలనాడు దేశముకూడ ఆఱువేలగ్రామముల వైశాల్యముగల దేశమని మాత్రమే తెలిసికొనుటతో తృప్తి పొందవలసియున్నది.

ఈజనపదములను వాటి కేర్పడిన పేర్లతో బహుళముగను, వాటికి జేర్చుసంఖ్యావాచకములతో సకృత్తుగను వ్యవహరించుట ప్రాచీనాచారము. వేగిదేశము ఆదిలో ద్వాదశసహస్రగ్రామ దేశము. వేగినాడు ప్రమాణము మనకు దెలియదు. వెలనాడుకు వెలనా డనియు, షట్సహస్రదేశ మనియుగూడ వ్యవహారము. షట్సహస్రదేశమన ఆఱువేలదేశము. పాకనాడు ఇరువదియొక్క-వేలదేశ మయినను వ్యవహారమున అది పాకనాడే.

మొట్టమొదటిమాఱు వెలనాడు పూర్వచాళుక్యశాసనములలో పేర్కొనబడినది. నాడు మొదలుకొని విజయనగరాధీశుల పరిపాలనకాలమువఱకు వెలనాడును, తదంతర్గతగ్రామములను బేర్కొనుశాసనము లనేకములు కానవచ్చినవి. ప్రాచీన శాసనోక్తములలోని వెలనాటి గ్రామము లిప్పటికి చాలవఱ కున్నవి. ఈగ్రామముల ననుసరించి చూడగా ఈవెలనాడు బెజవాడకు దిగువను కృష్ణానది కుభయతటముల వ్యాపించిన దేశమని స్పష్టమగుచున్నది. వెలనాటిలోనివని చెప్పబడిన గ్రామము లిపుడు కృష్ణాజిల్లాలోని గుడివాడ దివితాలూకాలలోను, గుంటూరుజిల్లాలోని తెనాలి, రేపల్లెతాలూకాలలోను, ఈరెండుతాలూకాల నంటియుండు బాపట్లతాలూకాలోని స్వల్పభాగమునను గానవచ్చుచున్నవి. ఇదియే అసలు వెలనాడు. క్రీ. శ. పండ్రెండవశతాబ్దిని ధాన్యకటకము రాజధానిగ కృష్ణానదీ దక్షిణతీరదేశమును బరిపాలించిన కోటవంశపురాజుల పరిపాలనకాలమున వెలనాడు విస్తృతిజెంది, గుంటూరుజిల్లాలోని సత్తెనపల్లి, గుంటూరు తాలూకాలలోని యుత్తరభాగములనుగూడ ఆక్రమించుకొనెను. ధాన్యకటక మన్నది సత్తెనపల్లితాలూకాలోని ఇప్పటి అమరావతికి ప్రాచీననామము. కోటవంశజులు ప్రాచీనశాసనములందు కృష్ణవేణ్ణానదీ దక్షిణ షట్సహస్రావనీవల్లభులని వర్ణితులైనారు. కృష్ణ (కృష్ణవేణి)కు ప్రాచీననామము కృష్ణవేణ్ణ. అందువలన ధాన్యకటకముకూడ షట్సహస్రావని (వెలనాడు) లోనిదే యనుటకు సందియము లేదు. వెలనాడు షట్సహస్రదేశము కావున దానికి షట్సహస్రవిషయ మనియు, ఆఱువే దేశ మనియు బేర్లు. ఈకారణమున వెలనాటిశాఖబ్రాహ్మణులకు వెలనాట్లనియు, షట్సహస్రీయు లనియు, ఆఱువేలవా రనియు బేరు. వెలనాటిశాఖీయులలో వైదికులును, నియోగులునుగూడ నున్నారు. అయితే యీవైదిక, నియోగిభేదము అర్వాచీనము; పదునాల్గవ శతాబ్దినుండి కులముగా బిగిసికొనిపోయినట్లు కన్పట్టును. కడుప్రాచీనకాలమున ఆఱువేలవారిలో వైదికులును, నియోగులునుగూడ నుండినను రాను రాను ఆఱువేలవా రన్నది నియోగులకే రూఢమైనది.

షట్సహస్రదేశమునుగురించియు, ఆఱువేలవారినిగురించియు కీర్తిశేషులైన శ్రీకొమర్రాజు వేంకటలక్ష్మణరావుగారు వ్రాసినవిషయములు ఈదిగువ పొందుపఱుపబడినవి. గమనార్హములు.

“ఇక నీషట్సహస్రనాటినిబట్టియే ఆఱువేలవా రన్నపేరు వచ్చెననుటకు నీ (ఎడవల్లి తామ్ర) శాసనమునందు గొన్ని సూచన లున్నవి. వాని జూతము. ఇది శా. శ. ౧౧౬౨ కుసరియైన

క్రీ. శ. ౧౨౮౦ లో మహామండలేశ్వర (కోట) మన్మకేతరాజు (మూడవ కేతరాజు)చే నీయబడిన దానశాసనము. 300 ల ఖండుకల విస్తీర్ణముగల భూమి బ్రాహ్మణులైన షట్సహస్రీయులకును, వేంగీదేశీయులకును సమానముగ నీయబడినది. "తత్రి షట్సహస్రదేశీయానాం విప్రాణాం అర్థం, వేంగీదేశీయానాం విప్రాణా మ ప్యర్థం" అని శాసనమునందలి పదములు. ఇందువలన ఆఱువేలవారను బ్రాహ్మణులును, వేంగినాడువా రనబడు బ్రాహ్మణులును అప్పటికి ఉండిరనుట స్పష్టము. ఇంతియ కాదు. షట్సహస్రి దేశమునుబట్టియు, వేంగీదేశమునుబట్టియు వీరికి ఈ పేళ్లు వచ్చెననియు దేలుచున్నది. ఈ శాసనమునందు నింకొక విశేషము కలదు. ఇందు 300 షట్సహస్రీయుల పేళ్లును, ౧౦౦ వేంగీదేశీయుల పేళ్లును ఈయబడినవి.

"ఇట్లు ఆఱువేలనాటినిబట్టి యీ బ్రాహ్మణులకు నాఱువేలవారని యీ కాలమువఱకే పేరువచ్చినను, వీరి వైదికవృత్తి పూర్తిగ మాఱి లౌకికవృత్తి యింకను పూర్తిగ అలవడినట్లు కానరాదు. ఏలయన అర్ధోదయ కాలమందు భూదానమును గుఱించి వీరును వేఁగినాటివారును సమానముగనే చూడబడిరి. వీరి 300 ల నామములు 'ఆర్యః' అన్నబిరుదుతోగాని, ఏబిరుదు లేకగాని ఇతరులవలెనే ఉన్నవి. కాని రాజపదవాచ్యములుగ కాని, పంతులు పదవాచ్యములుగ గాని లేవు. వీరికి ఇంకను అమాత్యపదము సర్వసాధారణ మగునట్లు కానరాదు. క్రీ. శ. ౧౨౮౦ అనగా తిక్కన సోమయాజికాలము. ఈకాలమువఱకు ఆఱువేలవారు ఇతర వైదికులవలెనే తమవీలుప్రకారము వైదికవృత్తియు లౌకికవృత్తియు జేయుచుండిరి. కరిణీకములు మొదలయిన లౌకికవృత్తులను సంపాదించి వైదికవృత్తిని పూర్తిగ మాని నియోగు లనిపించుకొనుట ఈకాలమునకు దరువాతను అనంతామాత్యుని కాలమునకు(క్రీ. శ. ౧౪౩౫)బూర్వమును గడచిన మధ్యకాలమున జరిగియుండును; అనగా క్రీ. శ. ౧౨౩౦ - ౧౪౩౦ ఈరెండువందల కాలములోపల ఆఱువేలవారికి కరిణీకములు మొదలయినవి వచ్చి అమాత్యాది పదములు జాతిసూచకము లయ్యెను. ఏలయన, అనంతామాత్యుని వంశమునందు నెవ్వరును మాత్రులు కాకపోయినను అందఱిని మంత్రి చమూపతి పదములతో గౌరవించియున్నాడు"

## కమ్మనాడు

ఆంధ్రబ్రాహ్మణులలో కమ్మనాటిశాఖవారుకూడ నున్నారు. కరణకమ్మలే కమ్మనాటి శాఖవారని కొందఱి యభిప్రాయము. ఇది సరియైనది కాదు. కర్ణకమ్మలు వేరు. కమ్మనాటిశాఖయులు వేఱు. కర్ణకమ్మలనుగుఱించిగాక కమ్మనాటిశాఖీయులనుగుఱించియే యిచట దెలుపబడును.

అత్యంతప్రాచీనములైన ఆంధ్రజనపదములలో కమ్మనాడు ఒకటి. పదునాఱువందల సంవత్సరములకు పూర్వపు ఆంధ్రదేశ ప్రాకృతశాసనములలో ఇది కమ్మరఠమని, కమ్మకరఠమని సంస్కృతశాసనములలో కర్మాంకరాష్ట్రమని, కర్మరాష్ట్రమని, కమ్మరాష్ట్రమని పేర్కొనబడినది. ప్రాచీనశాసనములలో ఈదేశములోనివిగ దెలుపబడిన గ్రామములను గుర్తింపగా అవి ప్రధాన

ముగ గుంటూరుజిల్లాలోని నరసారావుపేట, బాపట్ల, ఒంగోలు తాలూకాలలోను, సత్తెనపల్లి తాలూకాలో ఆగ్నేయమున నరసారావుపేటతాలూకా నంటియుండు స్వల్పభాగమునను, పల్నాటికి దక్షిణమున గుండ్లకమ్మకు ఉత్తరమునను కర్నూలుజిల్లా మార్కాపురంతాలూకాలోని స్వల్పభాగమునను గానవచ్చినవి. ఇందువలన ఇప్పటి గుంటూరుమండలములోని దక్షిణార్ధభాగమును, కర్నూలుజిల్లా మార్కాపురముతాలూకాలోని కొద్దిభాగమును గలిసి ప్రాచీనకాలమున కమ్మనాడని వ్యవహరింపబడుచుండినట్లు తెలుచున్నది. ఆదిలో ఈకమ్మనాటికి ఉత్తరమున ఓగేరునది యును, దక్షిణమున గుండ్లకమ్మనదియు సహజసిద్ధములైన యెల్లలుగ నుండినట్లు కన్పట్టుచున్నది. గుండ్లకమ్మకు కుండిప్రభ అన్నది సంస్కృతనామము. ఈనదికి గుండ్లకమ్మ అని పేరువచ్చుటకు కారణము అది కమ్మనాటినది యగుటవలననే యనునాతలంపు. స్థానికప్రభువుల పరిపాలనమున ఈకమ్మనాడు విస్తరిల్లినకాలమున కొద్దిలెక్క గుండ్లకమ్మనది చివరిభాగమున తన్నదీ దక్షిణ తటమునగూడ వ్యాపించెననుట కాధారములు కలవు. కాని ఇది తాత్కాలికమే. గుండ్లకమ్మ కుత్తరదేశమే అసలు కమ్మనాడు. వినుకొండ తాలూకాకూడ కమ్మనాటిలోనిది కావచ్చునని యూహ. అగునని గట్టిగ చెప్పుటకు సరియైన యాధారము లింతవఱకు గానరాలేదు.

కమ్మనాటిని పండ్రెండవ పదుమూడవ శతాబ్దులలో పరిపాలించిన చోడభూమీశులకు నరసారావుపేటతాలూకాలోని కొణిదెన రాజధాని. ఇచ్చటి శా. శ. ౧౧౮౬ అనగా క్రీ.శ. ౧౨౬౪ నాటి యొకశాసనము ననుసరించి ఈకమ్మనాడుసైతము ఆఱువేలదేశమని తెలియుచున్నది. ఈశాసనమున ఓపిలిసిద్ధి యనుచోడభూవరుడు కాకతి గణపతి దేవచక్రవర్తిదయచేత ఈకమ్మనాటిని పరిపాలించెనని తెలుపుసందర్భమునగల యీదిగువ పద్యమువలన ఈవిషయము విశదమగుచున్నది.

"తననిజవృత్తిమీఁద విదితంబుగ నోపిలిసిద్ధి విన్నసి
ద్ధనకు ననుంగుఁదమ్ముఁడు ప్రతాపమునం జని కమ్మనాడు సే
కొని గణపావనీశు దయఁగూడి తదాజ్ఞ వహించి యేలెఁ బా
వనమగు నాఱువేలును నవక్రపరాక్రమవిక్రమంబునన్"

కమ్మనాడు ఆఱువేలదేశము కావుననే కమ్మనాటిశాఖీయులైన బ్రాహ్మణులకు కమ్మెలనియు ఆఱువేల కమ్మెలనియు వ్యవహారము గలదు. కమ్మనాడు కుత్తరమున నున్నదేశము వెలనాడు. కమ్మనాడు వెలనాడులు రెండునుగూడ ఆఱువేలదేశములే. కర్ణకమ్మలకుకూడ గమ్మనాటితో గొంత సంబంధ మున్నను వారికిని ఆఱువేల కమ్మెలకును సంబంధము లేదు. వారు వేఱు. వీరు వేఱు. కర్ణకమ్మలనుగుఱించి వేఱొకప్పుడు వ్రాసెదను.

## పాకనాడు

ఆంధ్రదేశమునందలి ప్రాచీనజనపదములలో పాకనాడుకూడ ఒకటి. మొట్టమొదటిమారు అది మొదటి రాజరాజచోళుని పదవశతాబ్దినాటి తమిళశాసనములలో పాక్కినా డని పేర్కొనబడి

నది. పదవశతాబ్దికి పూర్వపు చాళుక్యశాసనములు కాని, పల్లవశాసనములు కాని ఈనాడును పేర్కొనవు. కాని అమరావతీస్తూపమునందలి మొదటిశతాబ్ది, రెండవశతాబ్దినాటి ప్రాకృతశాసనములలో పూగియరఠ మని యొక దేశము పేర్కొనబడినది. పూగియరఠమే సంస్కృతమున పూగిరాష్ట్ర మయినది. ప్రాచీన సంస్కృతశాసనములలోను, తెలుగుశాసనములలోను ఈదేశము పూంగిరాష్ట్రమని, పూంగినాడని వ్యవహరింపబడినది. క్రీస్తుశకము పదునాలుగవశతాబ్దినాటి యొకశాసనము పూంగిదేశమున కిట్లు నిర్వచనము చెప్పుచున్నది.

"ఆస్తే శ్రీగిరిపూర్వపాదనికటా దాపూర్వపాథోనిధే
ర్దేశః కుండితరంగిణీ ముభయతః శ్రీపూంగినామాంకితః"

శ్రీశైలము తూర్పుపాదముదగ్గఱనుండి తూర్పుసముద్రతీరమువఱకును కుండినది యుభయతీరముల వ్యాపించిన జనపదము పూంగిదేశము అని పైశ్లోకభాగము అర్థము. కుండినది యనగా కుండిప్రభ, గుండ్లకమ్మ. గుండ్లకమ్మనది కుత్తరతీరస్థమైన దేశము కమ్మనాడని యిదివఱలో దెలుపబడినది. అట్లయిన పై శ్లోకము చెప్పుదానిని సమన్వయించుట ఎట్లన్నప్రశ్న కలుగును. ఆదిమకాలములో నేర్పడిన నాడులు స్థానిక ప్రభువుల పరిపాలన మున ఒకప్పుడు విస్తృతి చెందుటయు, వేఱొకప్పుడు మఱల యథారూపము నందుటయు చరిత్ర పరిశీలనమున దెలియవచ్చు విషయములు. పై శ్లోకమునందలి నిర్వచనము విస్తరిల్లిన పూంగిదేశమున కనువర్తించునని యెఱుంగునది. అసలు (పూంగిదేశము) గుండ్లకమ్మకు దక్షిణమున శ్రీశైలము మొదలుకొని తూర్పుసముద్రము వఱకు వ్యాపించిన జనపదము. ఈ విషయము కర్నూలుజిల్లా మార్కాపురము తాలూకాలోని త్రిపురాంతకమునందలి కాకతి గణపతిదేవచక్రవర్తి అఱువది రెండవ రాజ్యవత్సరమునాటి, అనగా క్రీ. శ. ౧౨౬౦ నాటి యొక శాసనమువలన నిర్ణయమగుచున్నది. త్రిపురాంతక దేవరకు దానమీయబడిన చెదలపాడు, (చెదలవాడ) కేడుమల్లపల్లి అను రెండు గ్రామములను గుఱించి ఆ శాసన మిట్లు తెలుపుచున్నది. "కంమనాంటిలోని గుండేటి ఉత్తరపు దిక్కున చెదలపాడు అనెడి యూరును, పూంగినాంటిలోని ముశికఱితి కేడుమల్లపల్లి అనెడి యూరును." గుండేఱు గుండ్లకమ్మ చెదలపాడు గుండేటి యుత్తరతటమున కమ్మనాటిలో నున్నట్లు స్పష్టము. అందువలన గుండేటి యుత్తరదిశను వ్యాపించినది కమ్మనాడు. ముశికఱితి కేడుమల్లపల్లి యనగా ముశినది యొడ్డుననున్న కేడుమల్లపల్లియని యర్థము. కఱు అనగా గట్టు, తీరము. కఱితి సప్తమీరూపము కఱితి. ఇప్పుడీకేడుమళ్ళపల్లి యేగ్రామ మగునో గుర్తింప గుదురుట లేదు. పూంగినాటిలోనివిగ ప్రాచీనశాసనములందు జెప్పబడిన గోనుగుంట, గుడ్లూరు, రావిపాడు - ఈ మొదలైన గ్రామము లిప్పుడు వరుసగా గుంటూరుజిల్లా ఒంగోలుతాలూకాలోను, నెల్లూరుజిల్లా కందుకూరు ఉదయగిరి తాలూకాలలోను ఉన్నవి. దీని ననుసరించి చూడగా ప్రాయికముగ ఒంగోలుతాలూకాయందలి గుండ్లకమ్మనది దక్షిణతటముననుండి, సముద్రతీరముననే పశ్చిమమున

శ్రీశైల పూర్వపాదమువఱకు వ్యాపించిన జనపదము పూంగిదేశమని తేలుచున్నది విజయనగరాధిపతియైన రెండవదేవరాయలు శాసనమువలనకూడ ఈ విషయము విదితమగుచున్నది. ఈ శాసనమున నిట్లు కలదు. "కుండిరోధసి పూంగినాంటివిషయే చేజర్ల నామాంకితం కృత్వా పోలవరప్రసిద్ధి మాదిశత్ గ్రామో ద్విజేభ్యశ్శుభం"—అనగా, రెండవ దేవరాయమహారాయలు బ్రాహ్మణులకు కుండి (గుండ్లకమ్మ) నదీతీరముననున్న పోలవరమను ప్రసిద్ధినందిన గ్రామమునకు చేజర్ల యనుపేరు పెట్టి యిచ్చెనని యర్థము. కావున గుండ్లకమ్మనది దక్షిణతటముననుండి పూంగినాడు సముద్రతీరముననే వ్యాపించె ననుటకు సందియము లేదు. ఈ జనపదములోని గ్రామములు పాకనాటిలోనివనికూడ గొన్ని చెప్పబడుటవలన పూంగినాడు, పాకనాడులు రెండు నొక్కటియే యనియు, ఒక్కటే దేశమున కవి నామాంతరము లనియు విస్పష్టమగుచున్నది. పదునొకండవశతాబ్దినాటి తమిళశాసనములలో పేర్కొనబడిన పాక్కినాడు తెలుగు పాకనాటి రూపాంతర మనుటకు కూడ సంశయము లేదు. పాకనాడు, పూంగినాడు లొక్కటియని నిర్ణయించుకొన్న పిదప ఈదేశపు దక్షిణపు సరిహద్దు తేల్చుకొనుటలో శ్రమపడనక్కఱలేదు. పాకనాటిలోనివిగ దెలుపబడిన గ్రామములు కావలి, కోవూరుతాలూకాలలోగూడ గానవచ్చినవి. అందువలన పెన్ననదికి ఉత్తరమునను గుండ్లకమ్మకు దక్షిణముననుగలదేశ మంతయు పాకనాడు (పూంగినాడు) అని నిర్ణయమగుచున్నది.

స్థానికచరిత్రములను బరిశీలింపగా పందొమ్మిదవశతాబ్ది ప్రారంభమునందు నెల్లూరుజిల్లాలోని వేంకటగిరి జమీందారి యందలి సగటూరుతాలూకాలోని సాయరులెక్కలలో ఉత్తరమున కందనూరు (కర్నూలు) మొదలుకొని దక్షిణమున కాళహస్తివఱకుగల దేశమును పాకనాడని వ్యవహరించుచుండినట్లు తెలియుచున్నది. పాకనాడు ఇదివఱలో జెప్పినట్లు ఇరువదియొక్కవేయిగ్రామముల దేశము.

ఈదేశమునకు పాకనాడు పూంగినా డనునామము లెట్లు వచ్చిన వనువిషయము విచారణీయము. ఈరెంటిలో పూంగినాడే ప్రాచీనమైన దనుటకు క్రీ. శ. ప్రారంభశతాబ్దులనాటి ప్రాకృతశాసనములలో 'పూగియరఠ' మని పేర్కొనబడుటయె తార్కాణము. ఈ'పూగియరఠ'మే తరువాతికాలమున పూంగిరాష్ట్రమని, పూగినాడని వ్యవహరింపబడినది క్రీస్తుశకము ప్రారంభశతాబ్దులలో పూగియులను ఒకతెగవా రిచట నివసించుచుండిరి. వారికి కాణాచియైనది కావుననే ఈదేశమునకు వారిపేర పూగిరాష్ట్రమని పేరువచ్చినట్లు కన్పట్టును. అటుతరువాతి శతాబ్దులలో ఈపూగియులజాడ మన కేమియు తెలియరాదు. ప్రాచీనకాలమున అంధ్రదేశమును బరిపాలించిన శాలంకాయన, బృహత్పలాయన, విష్ణుకుండి వంశములవారివలెనే వీరును ఏమైరో మనకు దెలియదు. ఆతెగవారు విస్మృతులైనను వారిదేశమునకుమాత్రము పూగినాడు, పూగిరాష్ట్రము అను పేరులుమాత్రము నిలిచిపోయినవి. పూగియు లను ఒకతెగవారు పూర్వ ముండి రనియు, వారి ననుసరించి ఆదేశమునకు పేరు వచ్చె ననియు దెలియని అటుతరువాతి శతాబ్దులవారు పూగియన

పోక గనుక పూగినాటికే పోకనా డనియు వ్యవహరించుచువచ్చిరి తమిళభాషను పోకకు పాక్క గనుక పోకనాటిని తమిళులు పక్కినాడని పేర్కొనుచుండిరి. ఈకారణముననే తమిళశాసనములలో ఈదేశము పాక్కినా డని పేర్కొనబడినది. పాక, పోక శబ్దములు చివరకి పర్యాయపదములై ఈదేశము జనవ్యవహారమున పాకనాడని, పాక్కిరాష్ట్రమని, పాకరాష్ట్రమని, పూగినాడని, పూగిరాష్ట్రమని ప్రసిద్ధమయినది.

పాకనాటి బ్రాహ్మణ శాఖీయులు పాకనాట్లు అయినారు. ఈ పాకనాటి దేశములోని శూద్రులకు పాకనాటి కాపు లని వ్యవహారము.

## ములికినాడు

ఈ దేశమునకు ములకదేశమని, ములికిదేశమనికూడ ప్రాచీనకాలమున వ్యవహారము కలదు. జనవ్యవహారమున దీనిని మురికినా డనియు, మునినాడనియు అందురు. ఇది కూడ చాల ప్రాచీనమైన అంధ్రదేశ జనపదము బౌద్ధుల పాళిగ్రంథములలో ఇది ములకదేశ మని పేర్కొనబడినది. గండికోట, ప్రొద్దుటూరు, పుష్పగిరి, సిద్ధవటము మొదలైన గ్రామములు ములికినాటి లోనివి. ఇవి యన్నియు కడపజిల్లాలో పెన్ననది కుత్తరమున నున్నవి. దీని ననుసరించి చూడగా అసలు ములినాడు పెన్ననది కుత్తరమున నున్న దేశ మని తెలుచున్నది. ఇది పెన్న కుత్తరమున నెంతవఱకు వ్యాపించియుండెనో తెలియదు. కాని కర్నూలుజిల్లాలోని చాలభాగ మీ ములికినాటిలో నిదిగనే తెలియుచున్నది. ప్రకృతి సిద్ధములైన హద్దుల ననుసరించి యీ దేశము లేర్పడినట్లు మనకు దెలియుటవలనను, కర్నూలుజిల్లాలోని చాలభాగము ములికినాటిలోని దగుటవలనను ఇది యొకవేళ ఉత్తరమున కృష్ణా తుంగభద్రానదులవఱకు వ్యాపించినను వ్యాపించి యుండవచ్చును. అయితే, ఈవిషయమును రాయి గ్రుద్దినట్లు చెప్పుటకు మాత్రి మాధారములు మృగ్యములు.

ప్రాచీనకాలమున ములికినాడు ఎంతటి వైశాల్యము కలదియో మనకు దెలియదు. మధ్యయుగము ప్రారంభకాలమునాటి శాసనములనుబట్టి ఇది మున్నూఱుదేశ మని తెలియుచున్నది. విజయనగరాధీశులకాలమున ఈదేశ మితరప్రాంతములనుకూడ గలుపుకొని విస్తరిల్లినది. అప్పు డది నాలుగువేలదేశము.

ఈదేశమున కీపేరు ఎందువలన వచ్చినదియు సరిగా తెలియదు. ములుకులవలె గ్రుచ్చు కొను రాలుగల్గిన దేశమని, ఇంక నేమేమో ఈములికి పదమునకు వ్యుత్పత్తులు చెప్పువారు కొందఱు కలరు. కాని అవి యేవియు సరియైన వ్యుత్పత్తులుగ నంగీకరించుటకు వీలు లేదు.

ములికినాటిశాఖీయులైన బ్రాహ్మణులకు ములికినాట్లని పేరు. ఈదేశము ననుసరించి చతుర్వర్ణము వారిలో నేర్పడిన కుల మేదో, దాని పే రేమో తెలియదు. ఈవిషయమును ఇంకను పరిశోధన జరుపవలసియున్నది.

---

# భరతము

శ్రీ తాండవకృష్ణ

నేటి నాట్యప్రపంచములో భరతవిద్యకు 'భరతనాట్య' మను ప్రయోగము ప్రముఖముగ ప్రచారములో నున్నది. అసలు శబ్దవిచారము చేసినచో 'భరతనాట్య' మనుట అపభ్రంశ మేమో యని తోచును. పూర్వగ్రంథములలో 'భరతశాస్త్ర' మనియు, 'భరత' మనియు, ప్రాచీనముగ ప్రచారములో 'భరతవిద్య' యనియు నున్నటుల కాన్పించెడిని. నాట్యము, నాట్యవేదము అనియు దెలియు చున్నది.

## శబ్దవిచారము: నిర్వచనము:

భకారో భావసంయుక్తో, రేఫో రాగేణ మిశ్రితః
తకార స్తాల మిత్యాహుః, భరతార్థ విచక్షణాః ॥

ఈ పైశ్లోకమునుబట్టి చూచినచో భావసంయుక్తమై, రాగరంజితమై, తాళ సమ్మిళితమైన తౌర్యత్రికవిద్య భరతమని తెలియనగును.

భరత శాస్త్రమును భరతు డను మహామునీశ్వరుడు రచించినటుల తెలియుచున్నది. భరతముని విరచిత శాస్త్రమగుటవలన 'భరతశాస్త్ర' మను పేరు వచ్చినదో; భావ, రాగ, తాళ సంయుక్తమగు విద్యయగుటచే 'భరతవిద్య' యను పేరు వచ్చినదో; భరతవర్షమున వెలయుటచే దేశ సాంబంధికముగ నీనామము వచ్చినదో; మరేకారణము వలన నీనామము ఈ శాస్త్రమునకు రూఢమైనదో వివరించుట కష్టము.

ఇంక నాట్యశబ్ద విచారమును చేతము.

'నాట్యం తన్నాటకంచైవ, పూజ్యం పూర్వకథాయుతమ్.'

అని 'అభినయ దర్పణము' న చెప్పబడియున్నది. అనగ పూర్వకథాయుత మైనది.

"నానాభావోపసంపన్నం, నానావస్థాంతరాత్మకమ్
లోకవృత్తానుకరణం నాట్య మేతన్మయా కృతమ్॥" అనియు,
"న తచ్ఛాస్త్రం, నతచ్ఛిల్పమ్, న సా విద్యా, న సా కలా,
నాసౌ యోగో, నతత్కర్మ యన్నాట్యేఽస్మిన్నదృశ్యతే॥" అనియు,
"సోఽఙ్గాద్యభినయోపేతో నాట్యమిత్యభిధీయతే
కేవలవిద్యేతిహాసానా మర్థానాం పరికల్పనమ్॥"
వినోదకరణం లోకే నాట్య మేత ద్భవిష్యతి॥" అనియు,

'భరతశాస్త్రము' న చెప్పబడియున్నది. (భరతః) । ఇంకను

"భావాఽభినయహీనస్తు నృత్తమిత్యభిధీయతే" అనియు,
"రసభావ వ్యంజనాదియుక్తం నృత్య మితీర్యతే" అనియు, "అభినయదర్పణము"న చెప్పబడియున్నది.

నాట్యము: అనగ నాట్యము పూర్వకథాప్రయోజ్యమై, నానాభావ సంపన్నమై, నానావస్థాంతరాత్మకమై, లోకవృత్తానుకరణమై, భావానుకీర్తనమై, శాస్త్రసమన్వితమై, శిల్ప శీలమై, అంగాద్యభినయోపేతమై, సర్వకళా సమ్మిశ్రితమై, విలసిల్లునది అని చెప్పవలయును.

**నృత్తము :** నృత్తమనగ శరీరావయవవిక్షేపములను లయాన్వితము చేయనెంచిన ప్రాక్తన మానవుడు మొట్టమొదట సృష్టించుకొన్న కళ. ఏ పటహ వాద్యమో నెరపుచు తత్తాళమున కనుగుణముగ లయశుద్ధి యొప్పునట్లు అతడు జరిపిన పాదవిన్యాసమే నృత్తమునకు ప్రారంభదశ. దీనియందు భావముగాని అభినయముగాని మృగ్యము. క్రమశః దానిని అన్ని తాళములకును అన్ని కాలములకు అనురూపముగ ప్రపంచించి పెంపు చేయవలెనని అతడు యత్నించెను. ఎంత యత్నించినను పాదవిన్యాసము తాళమును తుదముట్ట ననుగమింపలేదు. హస్తనాడులకు గల లాఘవము పాదనాడుల కుండదు. కనుక నృత్తవిద్య తాళముతో కొంతదూరమే నడచినది. నృత్తము చేయునపుడు పూర్వ అపర కాయములకు సమత కుదురుటకై వేరొకదశలో పాదవిక్షేపమునకు హస్తవిక్షేపము తోడైనది. ప్రారంభదశలోగాని, ఈ దశలోగాని నృత్తమునకు వాచ్యశబ్దముతోడి సంబంధము ఇంచుకయు లేదు. అనగ, నృత్తము చేయునపుడు తాళమే యపేక్షింపబడును గాని గాత్ర మపేక్షింపబడదనుట.

**నృత్యము :** ఈ గాత్రవిక్షేపవిద్య తాళ, లయాన్వితముగ నుండుటయేగాక, శబ్దార్థసూచకముగ గూడ నుండవలె ననెడి యాసతో మానవుడు కల్పించిన ప్రక్రియాంతరమే నృత్యము. నోటితో గీతము బాడుచు అందలి శబ్దముల యర్థమును చేతితో ప్రదర్శించుట దాని ప్రధానాశయము. ఆ పాడెడి గీతము తాళబద్ధముగ నుండును గనుక తాళమునకు తగినట్లు కాలితో నృత్యముచేయుట దానికొక యంగము. కావుననే నృత్యమునందు అర్థసూచకమైన హస్తవిన్యాసమేగాక, ఒక్కొక్కచో తాళాశ్రయమైన నృత్తము గూడ ప్రకటితమగుచున్నది. కృష్ణలీలాతరంగ నృత్యమును చూచునపుడు మన కది తార్కాణమగును.

**అభినయము :** దీనివలన తేలిన దేమనగా నృత్యము నృత్తముకంటె గుణాధికమై శాస్త్రనిబద్ధమైనది. మరి కొంతకాలమునకు నృత్యమున శబ్దార్థమునేకాక భావాశ్రయమైన వాక్యార్థమును సహితము ప్రదర్శించవలెనని మానవు డింకొక సంస్కారమును చేసెను. తత్ఫలముగ గాత్ర విక్షేపవిద్య కొంత యవస్థాంతరమై 'అభినయ'మను పేరు దాల్చినది.

అభినయ మను పదము 'అభి'పూర్వక 'నీఞ్' ధాతువుతో కూడినది. 'అభి' అనగ అభిముఖముగ 'ని' అనగ అందించుట. అనగ ఒక భావమును సామాజికులకు అర్థవంతముగ ప్రదర్శించుట. దీనినే సాహిత్యదర్పణ కారుడు; "భవే దభినయోఽవస్థానుకారః" అని చెప్పినాడు. అనగ, మానవుని ఆంతరంగిక భావోద్రేకములు పొంగి; అంగ,ప్రత్యంగ, గమన, విన్యాస, భంగిమా, వైఖరులుగ పరిణమించి అయ్యాది నేత్ర, ముఖ, కర, చరణాద్యవయవములకు సంబంధించిన భావమై వ్యక్తీకరింపబడుట. ఈ వ్యక్తీకరణము రసస్ఫోరకముగ నుండవలెను. అందుచేతనే ప్రముఖ వ్యాఖ్యాతయగు మల్లినాథుడు 'కిరాతార్జునీయము'ను వ్యాఖ్యానించుచు; "అభినయో రసభావాది వ్యంజకచేష్టా విశేషః" అని చెప్పినాడు.

క్షేత్రయ్య పదములు, జావళీలు, అష్టపదులు, మొదలగునవి ప్రదర్శితము లగునపుడు వాని స్వరూపమును ప్రత్యక్షముగ చూడగలము.

నా ట్య ము : భ ర త ము : ఈ నృత్త, నృత్య, అభినయములకు మీది మెట్టే నాట్యము. వ్యస్తములైన పదములను, జావళీలను మాత్రమేకాక పూర్వకథా సంయుతములైన నిబద్ధ కావ్యములగు నాటకములను గూడ నృత్త, నృత్య, అభినయ పూర్వకముగ ప్రదర్శించుటయే నాట్యము. కాగా రూపమునకు లావణ్యము ఆకర్షకము. జీవము చైతన్యవంతము. ఈ రెంటికి, లావణ్యమునకు, జీవమునకు ఇంపగునది భాషాసౌష్ఠవము. అనగ, రూపము నృత్తమైనచో, లావణ్యము నృత్యము కాగా, జీవచైతన్య భాషాసౌష్ఠవముతో కూడి సువర్ణమునకు సౌరభమబ్బినట్లు రూప, లావణ్య, జీవ యోజన మంది, తీర్చి దిద్దిన బంగారుబొమ్మ నాట్యమని చెప్పవలెను. ఈ నాట్యము భావ, రాగ, తాళ సంయోజనము. కాగా 'భరత' మైనది. అటు లనుటచే భరత మును, నాట్యమును ఏకార్థ ప్రతిపాదకములే యైనవి. అందుచే భరతనాట్యమనుట పునరుక్తి దోషమేగదా !

నా ట్య భే ద ము లు: స్థూలముగా పరికించినచో నాట్యమును ద్వివిధములుగ పరి గణింపవచ్చును. అవేమన మార్గనాట్యము (Classical) దేశీనాట్యము (Folk)

మార్గనాట్యము శాస్త్రోద్దిష్టమైనది. ఆదర్శప్రాయమైనది, దివ్యమైనది. విస్తృతమైన పారిభాషిక పదసమన్వితమైనది. అనశ్వరమైన ఆనందమును ప్రసాదించగలది.

దేశీనాట్యమన్ననో శాస్త్రసమ్మత మైనదికాదు. దేశీయులచే ప్రాంతీయ భేదములతో వారి ఇచ్చవచ్చినట్లు చేయబడు ఉల్లాస ఉద్రేకపూరితమైన అంగ ప్రత్యంగ విన్యాస గమన వైఖరి మాత్రమే. ప్రపంచమంతటను దేశీనాట్యములు విరివిగ అడవిజాతులలోను, అనాగరిక జాతుల లోను, గ్రామీణుల నృత్యవిలాస వైఖరులందును కనబడుచున్నవి.

'దశరూపకము'న ప్రథమప్రకాశమున నృత్యసంబంధమగు రెండు పదములను గూర్చి ఇట్లు వ్రాయబడినది :

> " అద్యం భావాశ్రయం నృత్యం; నృత్తం తాళలయాశ్రయం
> ఆద్యః పదార్థాభినయో మార్గో; దేశీ తదా పరమ్॥ "

అనగ భావాశ్రయ పదార్థాభినయనృత్యము మార్గమనియు, తాళలయాశ్రయమైన నృత్తము దేశియనియు అర్థము. దీనిని ఆంగ్లమున పరివర్తించిన Professor Hass అను నతడు మార్గమునకు High State అనియు, దేశికి Popular అనియు ననువాదము చేసియున్నాడు.

ఇంతేకాక 'సంగీత దర్పణము'న :

> "మార్గదేశీ విభాగేన సంగీతం ద్వివిధం మతమ్
> ద్రుహిణేన యదుద్దిష్టం యదుక్తం భరతేన చ

తస్మాన్మార్గోఽపి యయా రీత్యా యత్రాస్య లోకానురంజనమ్
దేశే దేశే తు సంగీతం తద్దేశీత్యభిధీయతే॥"

అనగ బ్రహ్మచే నుద్దిష్టమై, భరతునిచే నుక్తమైన, అనగ శాస్త్ర రీత్యా నియమితమైనది మార్గమనియు, ఆయారీతుల నాయా దేశములయందు ప్రజానురంజనము కొఱకు ఉద్దేశింపబడినది 'దేశీ' యనియూ అర్థము.

అదియునుగాక 'సంగీత రత్నాకరము'న:

"గీతం వాద్యం తథా నృత్తం త్రయం సంగీత ముచ్యతే
మార్గో దేశీతి తద్ద్వేధా తత్ర మార్గ స ఉచ్యతే
యో మార్గితో విరించాద్యైః ప్రయుక్తో భరతాదిభిః
దేవ స్యపురత శ్శంభో ర్నియతో భ్యుదయప్రదః
దేశే దేశే జనానాం యద్రుచ్య హృదయ రంజకమ్
గీతంచ వాదనం నృత్తం తద్దేశీత్యభిధీయతే॥"

సంగీతమును గుఱించియు, నృత్త నృత్యములను గుఱించియు పైన వివరించినది సమన్వయించి చూచినచో 'మార్గము' (classical) శాస్త్రబద్ధమైన ఉదారవస్తువనియు, 'దేశి' (popular) శాస్త్ర బద్ధముకాని లోకసామాన్యమైనదనియు తెలుచున్నది.

మార్గనాట్యములో అంతర్భేదములు ఇంకను గలవు. అందులో ముఖ్యమైనవి రెండు. ఒకటి తాండవము. రెండవది లాస్యము. తాండవము పురుషజనోచితమైన ఉద్ధతనాట్యము. రౌద్ర, వీర, భయానక, రసప్రదర్శన అవశ్యకత గలిగినపుడు ఇది ప్రయోజ్యము.

లాస్యమనగ స్త్రీజనోచితమగు సున్నితమైన నాట్యము. శృంగార, హాస్య, రసాదులు ప్రదర్శించుటకు అనువగునది. కాని అనుభవమున ఈ ద్వివిధ నాట్యములను నిక్కచ్చిగ విడదీసి విభజించుటకు వీలు లేదు. ప్రదర్శన సమయములందు రెండును మిశ్రీభూతము చెందుచుండును. పైని వివరించిన నృత్త, నృత్య, నాట్యములు ఈ రెండు విభాగములకు చెందునవియే. ఈ నాట్యరీతులలో అభినయము అత్యంత ప్రధానపాత్ర వహించుచున్నది. అభినయము చతుర్విధములు. ఆంగికాభినయము, సాత్వికాభినయము, వాచికాభినయము, ఆహార్యాభినయము.

ఆంగికమనగా అంగ ప్రత్యంగోపాంగ విన్యాస వైఖరీ విలాసముచే వ్యక్తీకరింపబడునది. అంగమనగా:

"అంగాని యత్ర శిరో హస్తౌ వక్షః పార్శ్వౌ కటీ తటౌ
పాదావితి షడంగాని గ్రీవామప్యపరే జగుః॥"
"ప్రత్యంగా న్యథచ స్కంధౌ బాహూ పృష్ఠం తథోదరమ్
ఊరూ జంఘే షడిత్యాహు రపరే మణిబంధకౌ॥"
"జానునీ కూర్పరావేతత్త్రయ మప్యధికం జగుః
గ్రీవాప్యథ ప్రత్యంగస్తు స్కంధ ఏవ జగుర్బుధాః॥"

(అభినయ దర్పణమ్ – 42, 43, 44.)

"దృష్టి భ్రూపుటతారాశ్చ కపోలౌ నాసికా హనూ
అధరో దశనా జిహ్వా చుబుకం వదనం తథా॥" (45)

"ఉపాంగాని ద్వాదశైవ శిరస్యంగాంతరేషుచ
పార్ష్ణి గుల్ఫౌ తథాంగుల్యః కరయోః పాదయోస్తలే॥" (46)

"ఏతాని పూర్వశాస్త్రానుసారేణోక్తాని వై మయా
నృత్యమాత్రోపయోగీని కథ్యంతే లక్ష్యైః క్రమాత్॥" (47)

"అంగానామ్ చలనాదేవ ప్రత్యంగోపాంగయోరపి
చలనం ప్రభవే త్తస్మాత్ సర్వేషాం నాత్ర లక్షణమ్॥" (48)

అనగా షడంగములు: శిరస్సు, హస్తములు, ఉరము, పార్శ్వములు, నడుము, పాదములు. ప్రత్యంగములు ఆరు—భుజములు, బాహువులు, వెన్ను, ఉదరము, ఊరువులు, పిక్కలు. వాచిక మనగా వాచ్యమైనది. 'కంఠే నాలంబయేద్గీతమ్' అని శాస్త్రము. ఒకగీతమును పాడుచు అభినయించుట వాచికాభినయ మనబడును.

నటుడు శరీరాభినయము వల్లనేకాక తన భావములను వాక్కుల వలన కూడ తెల్పును. వాచ్యమైన భావమును ధ్వని భేదములచేతను, కాకుస్వర భేదముచేతను, వాక్యమందు విరామము చేతను, తాను విస్పష్టముచేయదలచిన భావమును అభినయించును. ఒకొక్కప్పుడు వాక్యములోని సగభాగము మాత్రముచ్చరించి మిగత సగమును వినువారికి ఊహ్యాముగ వదలివేయును. అనగ, భావమును స్పష్టముగ వాచ్యముగనేకాక ధ్వనిమాత్రముగకూడ అభినయించునన్నమాట. దీనినే వాచికాభినయము, వాక్పూర్వకము, ధ్వన్యాత్మకము అని చెప్పవచ్చును.

ఇందులో ఇంకొక విభేదము కలదు. వాచికాభినయమున భాష ప్రధానము. ధ్వని అనుషంగికము. నాటకమందు రాజు, సేవకుడు మొదలైనవారికి పాత్రోచితమైన భాషయు వాచికాభినయమునకే చెందును.

ఆహార్యాభినయ మనగా దేహాలంకరణము – పాత్రోచితములై కాలానుగుణ్యములుగ దుస్తులను ధరించుట, వేషరచన, అలంకారరచన మొదలగునవి. సాత్త్వికాభినయ మనగా సాత్త్వికావస్థలను అభినయించుట. రోమాంచము, భావోద్రేకము, నైశ్చల్యము, స్వేదము, గాద్గద్యము, వణకుట, వివర్ణత, కన్నీరు, మూర్ఛ మొదలగునవి అభినయించుట.

మణిబంధములు, మోచేతులు, మోకాళ్లు కూడ మరికొందరు ప్రత్యంగములుగ భావింతురు. నేత్రములు, కనుబొమలు, గ్రుడ్లు, దవడలు, నాసిక, బుగ్గలు, పెదవులు, పలువరుస,

నాలుక, గడ్డము, ముఖము, ఇవి ఉపాంగములు. ఇవి శిరసునకు సంబంధించినవి. ఇతర అవయవములలో పీటికిలోడు మడమలు, చీలమండలు, కాలివ్రేళ్లు, చేతివ్రేళ్లు కూడ ఉపాంగములలో చేరినవే.

ఈ పైన వివరించిన అంగ, ప్రత్యంగ, ఉపాంగములు నాట్యమున ప్రవర్తితము లగును. కాని అంగము చలన మొందినపుడు ప్రత్యంగ, ఉపాంగములుకూడ చలించును. అనగ ఆంగికము అంగ, ప్రత్యంగ, ఉపాంగములచే త్రివిధమైనది.

ఇందు ఇంకను మూడు భేదములు గలవు.

> " శాఖాంగోపాంగ సంయుక్తః కృతోఽప్యభినయ స్త్వథః
> ముఖరాగ విహీనస్తు నైవ శోభాన్వితో భవేత్ ॥ "
> " శారీరాభినయోఽల్పోఽపి ముఖరాగ సమన్వితః
> ద్విగుణాం లభతే శోభాం రాత్రావివ నిశాకరః ॥ "
> " నయనాభినయోఽపి స్యా న్నానాభావ రసస్ఫుటః
> ముఖరాగాన్వితో యస్మాన్నాట్య మత్ర ప్రతిష్ఠితమ్॥"

అంగోపాంగములతో కూడుకొనియున్న శాఖా (ఆంగిక) అభినయము చక్కగా ప్రదర్శింప బడినను ముఖరాగము లేనిది శోభింపదు. శారీరాభినయము కొలదిగా నున్నప్పటికిని ముఖరాగముచే కనబడు ముఖజాభినయమున్న యెడల రాత్రిపూట చంద్రునివలె రెట్టింపు శోభ కలుగును. నేత్రాభినయము ముఖరాగముతో కూడుకొని యున్న యెడల అన్నిభావములను, రసములను అది స్పష్టపరుపగలదు. కావుననే నాట్యము దీనియందు ప్రతిష్ఠింప బడినది. (అనగ నాట్యమునకు ఇది మూలాధారము)—(నాట్యశాస్త్రము 8-149_151)

అనగ ఆంగికాభినయము శారీరము, ముఖజము, చేష్టాకృతము అని మూడువిధములు. మొగముగాక శరీరముయొక్క ఇతర భాగములవలన కానవచ్చునది శారీరము. ముఖరాగములవలన కానవచ్చునది ముఖజము. క్రియారూపముగ స్పష్టీకరింపబడునది చేష్టాకృతము. ఇందు ముఖరాగాన్వితము శ్రేష్ఠమైనది. మనస్సునందలి భావములుమారినకొలది యుముఖముమీదివికారములు (రాగములు, రంగులు) మారుచుండును. ముఖము హృదయ ప్రతిబింబమును జూపునట్టి యద్దము.

హృద్గతభావములను ముఖముమీద చూపగలిగిన నటుడు అతిశ్రేష్ఠుడు. మనస్సునందలి భావములు మారినకొలదియు ఒక్కక్షణములో ముఖరాగములను మార్చవలసియుండును. మనోంతర్గత భావక్రియావ్యక్తీకరణమే చేష్టాకృతము.




భావప్రకటనయందు అభినయ సౌలభ్యము చూపునపుడు పాత్రను బట్టియు, రసమును బట్టియు, అవస్థ ననుసరించియు, ముఖరాగములు మారుట ముఖజమని పైన చెప్పియున్నాము. ముఖజమునందు సున్నితమైన అంతర భేదములే స్వాభావికము, ప్రసన్నము, రక్తిమము, శ్యామము. స్వాభావికమనగా శాంతాదిరసములను ప్రదర్శించునపుడు ఆయారసముల స్వభావముల ననుసరించి ముఖరాగమును ప్రదర్శించుట.

అద్భుతము, హాస్యము, ప్రదర్శించునపుడు ప్రసన్నవదనముతో ఆయారసముల స్వభావమును చూపుట ప్రసన్నము అనబడును.

వీర, రౌద్ర, భయానక రసప్రదర్శనమున చూపు కండ్లెఱ్ఱజేయుట, పండ్లు గొరుకుట, ముఖమును జేగురు రంగునకు మార్చుట, కనుబొమలను ముడివేయుట, మొదలగునవి రక్తిమమును సూచించును.

కరుణాది రసములందు ముఖరాగమును శ్యామముగ మార్చుట శ్యామ మనబడును.

ఇంకను శిరోభేదములు సమ, ఉద్వాహిత, అధోముఖ, ఆలోలిత, ధుత, కంపిత, పరావృత్త, ఉత్క్షిప్త, అనునవి నవ విధములు.

సమ, ఆలోకిత, సాచి, ప్రలోకిత, నిమీలిత, ఉల్లోకిత, అనువృత్త, అవలోకిత అను అష్టవిధ దృష్టిభేదములు.

సుందరి, తిరశ్చీన, పరివృత్త, ప్రకంపిత, అను చతుర్విధ గ్రీవాభేదములు.

ఇక హస్తములు త్రివిధములు. అసంయుత, సంయుత, నృత్య హస్తములు.

ఏ భావమైనను పదజాలములతో ఎట్లు కూడుకొని యున్నదో అట్లే నాట్యసంబంధమగు భావయు హస్తవిన్యాసముతో చూపబడు 'ముద్రలు' అను పదములచే కూడుకొని యున్నది. ఈ 'ముద్ర' అను పదము బౌద్ధ ధర్మశాస్త్రములందు వాడబడియున్నది. దీనినే హైందవ నాట్యశాస్త్రమున సాంకేతికముగ 'హస్త' మని వాడిరి. కవి పదజాలసంధానముచే వాక్యములు అల్లి ఒక కథా విశేషమును ఎట్లు కావ్యమున గానముచేయునో; అట్లే నటియు నాట్యమున నాట్యసంబంధములగు పదములగు 'హస్తములు' లేక 'ముద్రలు' వీని విన్యాసములచే కవికృత కావ్య పద అర్థ భావముల కనువుగ రూపకల్పన మొనర్చి అభినయ పురస్సరంబుగ సామాజికులను రంజింపజేయును.

హస్తములు మూడువిధములుగ విభజింపబడినవని పైన చెప్పితిమి. ఈత్రివిధహస్తములలో అనేక భేదములు గలవు. ప్రస్తుతము విరివిగ ప్రచారమునందున్న భరతముని ప్రోక్తమగు 'భరత నాట్యశాస్త్రము', నందికేశ్వర ప్రోక్తమగు 'అభినయదర్పణము' లలో చెప్పబడిన ఈ హస్తముల సంఖ్యలో కొంత భేదము కన్పడును.

14 వ శతాబ్దియందు అస్సాంప్రాంతీయుడైన 'శుభంకరు' డను నొకడు సంపుటీకరించిన 'శ్రీహస్తముక్తావళి' అను నాట్యగ్రంథమునగూడ మరికొన్ని భేదములు గలవు.

ఈ సంఖ్యాభేదము ఈ క్రిందిపట్టికవలన స్పష్టమగును.

| | నాట్యశాస్త్రము | అభినయ దర్పణము | శ్రీ హస్త ముక్తావళి |
|---|---|---|---|
| అసంయుత హస్తములు | 24 | 32 | 30 |
| సంయుత హస్తములు | 13 | 23 | 14 |
| నృత్యహస్తములు | 27 | 13 | 27 |
| | 64 | 68 | 71 |

సంయుత హస్తములలో ఇంకను భేదములు గలవు. ఈ క్రింది వృక్షమువలన హస్త విశేషముల సింహావలోకనము చేయనగును.




నాట్యశాస్త్రమందు వివరించబడిన అసంయుత హస్తములు:— పతాక, త్రిపతాక, కర్తరి, అర్ధచంద్ర, అరాళ, శుకతుండ, ముష్టి, శిఖర, కపిత్థ, కటకాముఖ, శూచి, పద్మకోశ, సర్పశీర్ష, కాంగూల, అలపల్లవ, చతుర, భ్రమర, హంసాస్య, హంసపక్ష, సందంశ, ముకుళ, ఊర్ణనాభ, తామ్రచూడ, అను నిరువది నాలుగు.

అభినయ దర్పణమున చెప్పబడిన అసంయుత హస్తములు :— పతాక, త్రిపతాక, అర్ధపతాక, కర్తరీముఖ, మయూర, అర్ధచంద్ర, అరాళ, శుకతుండ, ముష్టి, శిఖర, కపిత్థ, కటకాముఖ, శూచి, చంద్రకళ, పద్మకోశ, సర్పశీర్ష, మృగశీర్ష, సింహాముఖ, కాంగూల, అలపద్మ, చతుర, భ్రమర, హంసాస్య, హంసపక్ష, సందంశ, ముకుళ, తామ్రచూడ, త్రిశూల, వ్యాఘ్ర, అర్ధసూచి, కటక, పల్లి అను ముప్పదిరెండు.

అభినయ దర్పణమున చెప్పిన అర్ధపతాక, మయూర, మృగశీర్ష, సింహాముఖ, అ: పద్మ, త్రిశూల, వ్యాఘ్ర, అర్ధసూచి, పల్లి అను దశవిధహస్తములును నాట్యశాస్త్రమున వివరింపబడలేదు. నాట్యశాస్త్రమున చెప్పబడిన ఊర్ణనాభహస్తము అభినయ దర్పణమున చెప్పబడలేదు.

నాట్యశాస్త్రమున చెప్పిన సంయుత హస్తములు :— అంజలి, కపోతక, కర్కట, స్వస్తిక, కటక, వర్ధమానక, ఉత్సంగ, నిషధ, డోల, పుష్పపుట, మకర, గజదంత, అవహిత్థ అను పదమూడు.

అభినయ దర్పణమున చెప్పిన సంయుత హస్తములు:— అంజలి, కపోత, కర్కట,

డోల, పుష్పపుట, ఉత్సంగ, శివలింగ, కటకావర్ధన, కర్తరి, స్వస్తిక, శకట, శంఖ, చక్ర, సంపుట, పాశ, కీలక, మత్స్య, కూర్మ, వరాహ, గరుడ, నాగబంధ, కట్వా, భేరుండ అను నిరువదిమూడు.

అభినయ దర్పణమందు వివరింపబడిన శివలింగ, కర్తరి, శకట, శంఖ, చక్ర, సంపుట, పాశ, కీలక, మత్స్య, కూర్మ, వరాహ, గరుడ, నాగబంధ, అను పదమూడు సంయుత హస్తవిశేషములు నాట్యశాస్త్రమునందు చెప్పబడ లేదు.

నాట్యశాస్త్రమందు చెప్పబడిన నృత్యహస్తములు:— చతుర, ఉద్వృత్త, తాళముఖ, స్వస్తిక, విప్రకీర్ణ, అరాలికా, కటకాముఖ, అవిధవక్ర, సూచీ, రేచిత, అర్ధరేచిత, ఉత్తానవంచిత, పల్లవ, నితంబ, కేశబంధ, కరిహస్త, లత, పక్షవంచిత, పక్షప్రద్యోత, గరుడపక్ష, హంసపక్ష, అర్ధమండలి, పార్శ్వమండలి, ఊరుమండలి, నలిని, పద్మకోశ, అలపద్మ, బాణ, అను ఇరువదియేడు.

అభినయ దర్పణమున చెప్పిన నృత్యహస్తములు:— పతాక, స్వస్తిక, డోల, అంజలి, కటకావర్ధన, శకట, పాశ, కీలక, కపిత్థ, శిఖర, కూర్మ, హంసాస్య అను పదమూడు.

అభినయ దర్పణమున చెప్పిన స్వస్తిక, నృత్యహస్తము. నాట్యశాస్త్రమందుకూడ నృత్యహస్తములలో చెప్పబడినది, మిగతవన్నియు ఈ రెంటను భేదములే.

ఒక్కొకచో హస్తములలో కొన్ని నామభేదములు గన్పడుచున్నను ముద్రలు ఒకరీతిగనే యుండుటయు జరుగును. వివిధ నాట్యశాస్త్రగ్రంథకారుల మతములలో హస్తభేదము లెట్లు గన్పట్టుచున్నవో యట్లే వినియోగ భేదములుకూడ కానవచ్చుచున్నవి.

భాషయందైనను పదములెట్లో అట్లే నాట్యశాస్త్రమందు హస్తములు వినియుక్తములగునని పైన చెప్పితిమి. ఒక్కొక్క పదము; అనేక అర్థములుకలిగి భాషయందు ఎట్లు వ్యవహరింపబడునో, అట్లే ఒక్కొక్క హస్తము అనేక అర్థములందు ప్రయుక్తమగుచుండును. భాషయందు ఒకేపదము మరికొన్ని కొన్నిపదములతో సంయోగింపబడినపుడు అర్థభేద మెట్లుకలుగునో అట్లే హస్తవినియోగములోకూడ ఒకేహస్తము మరికొన్ని హస్తములతో అనుసంధించినచో అర్థభేదమును, ఒకేహస్తము అది వినియోగింపబడు స్థానభేదముచే అర్థభేదమును సూచించును.

ఉదాహరణ : త్రిపతాకహస్తము కుడిచేతిచేపట్టి శిరమున గొడుగ నుంచినచో కిరీటమునకు అర్థమగును. అదేహస్తము ఎడమచేతితో పార్శ్వమున చూపింపబడిన వృక్షమున కర్థమగును. ఇరుపార్శ్వముల దక్షిణవామహస్తములచే మణిబంధములవద్ద కదల్చుచు నాభివద్ద ప్రారంభించి పైకితీసుకొని పోయినచో వృక్షములు పెరుగుటనుగాని, వృక్షముల పొడవునుగాని సూచించును. అట్లే పతాకహస్తము రెండుచేతులవలన ఉభయపార్శ్వముల చూపబడి ఊర్ధ్వదృష్టితో పరిదగ్నిక మైనచో పరితాపమునకు అర్థమిచ్చును. దేహమునకు ముందుభాగమున నాభికెదురుగ చూపి మణిబంధమువద్ద కదల్చుచు పైకి క్రిందికి ఊపినచో ఖండించుటను సూచించును. అదే ఇరుపార్శ్వములకు ఊపినచో వీవనను సూచించును. అదే హస్తము అరచేయి బోర్లగిల్లియుండునట్లు చేయిసాచి చూపినచో ఆశీర్వదించుటను సూచించును. అట్లే మోచేతివద్ద నుంచించి అరచేయి

ఎదురుగ పెట్టి హస్తమును ముందునకు వెనుకకు కొలదిగ ఊపినచో 'క్షేమమా?' అను ప్రశ్నను గాని, 'అక్కడనే, అక్కడనేయుండు' ననుటను గాని తెల్పును. అదేస్థానమున మణిబంధము కదల్చుచు ఇరుపార్శ్వముల హస్తమును కదల్చుచో వస్తునిషేధమును సూచించును.

ఈవిధముగ సంయుతాసంయుత నృత్యహస్తములు వివిధార్థ ప్రదర్శకములై ఆచార అనుభవ సంజ్ఞాత్మకములై యున్నవి.

సాధారణముగ ప్రాచ్య ప్రతీచీ నాట్య విధానములలో ఎక్కుడు తారతమ్యము గోచరించును. ప్రతీచీ నాట్యవిధానములలో అంగవిన్యాసములు, అడుగుల సంపుటులు మాత్రమే ప్రస్ఫుటముగ గాన్పించును. కేవలము లౌకికమై, దైహికప్రయోజనముమాత్రమే వాని లక్ష్యము. కాని ప్రాచ్య నాట్యములు దివ్యసందేశమును ఇచ్చి ఆధ్యాత్మికప్రయోజనము గలిగియున్నవి. మనదేశమునందలి ప్రతిశాస్త్రమువలెనే భరతశాస్త్రముకూడ దివ్యమైన ఉత్పత్తినే పొందినది.

" నాట్యవేదం దదౌ పూర్వం భరతాయ చతుర్ముఖః
తతశ్చ భరతః సార్థం గంధర్వాప్సరసాం గణైః॥ "
" నాట్యం నృత్తం తథా నృత్య మగ్రే శంభోః ప్రయుక్తవాన్
ప్రయోగ ముద్ధతం స్మృత్వా స్వప్రయుక్తం తతో హరః ॥ "
" తండునా స్వగణాగ్రణ్యా భరతాయ న్యదీదిశత్
లాస్యమస్యాగ్రతః ప్రీత్యా పార్వత్యై సమదీదిశత్ ॥
" బుద్ధ్వాఽథ తాండవమ్ తండోర్మర్త్యేభ్యో మునయోఽవదన్
పార్వతీ త్వనుశాస్తిస్మ లాస్యం బాణాత్మజాముషామ్॥ "
" తయా ద్వారవతీ గోప్య స్తాభిః సౌరాష్ట్రయోషితః
తాభిస్తు తత్తద్దేశీయా స్త ద శిష్యంత యోషితః॥ "
"ఏవం పరంపరాప్రాప్త మే తల్లోకే ప్రతిష్ఠితమ్" (అభినయ దర్పణమ్ ౨-౭)

ప్రథమమున భరతునకు బ్రహ్మ; నాట్యవేదమును సమర్పించెను. శివుని సాన్నిధ్యమున భరతుడు గంధర్వాప్సరలతో నాట్య, నృత్యముల నొనర్చెను. అప్పుడు శివునకు స్వీయ నాట్యవిషయము స్మృతికి రాగా పునః భరతునకు తన ప్రమథగణములద్వారా బోధించెను. తండుని మూలమున ఋషులు తాండవవిద్యను గ్రహించి మానవుల కందజేసిరి. పార్వతి బాణాసురుని కుమార్తెయగు ఉషాదేవికి లాస్యమును పాఠము జెప్పెను. ఉషాదేవి ద్వారకావాసులగు గోపికలకు దానిని బోధించెను. వారు సౌరాష్ట్రవాసులకు నేర్పిరి వారు వారి దేశమున ప్రచారమొనర్చిరి. ఈవిధముగ నాట్యవిద్య ప్రపంచమున వెలసెను.

త్రిమూర్తులలో నొకడగు బ్రహ్మదేవుడు—

"జగ్రాహ పాఠ్యం ఋగ్వేదాత్ సామభ్యో గీతమేవచ
యజుర్వేదా దభినయాన్ రసా నాథర్వణాదపి"

ఋగ్వేదమునుండి పాఠ్యమును (Text) సామవేదమునుండి గీతమును, యజుర్వేదమునుండి అభినయమును, అధర్వణమునుండి రసమును సంగ్రహించి నాట్యపంచమవేదమును సృజించెను.

ఈవిధముగ నాట్యవేదము దివ్యోత్పత్తిని గలిగి చతుర్విధ ఫలపురుషార్థ ప్రదముగ నిర్ణీత మైనట్లు తెలియుచున్నది.

నాట్యఫలమును—

"ఉత్తమం భరతం శాస్త్రంచ జ్ఞానవైరాగ్య సాధనమ్" అని నారదులవారును,
"ఉత్తమం భరతంశాస్త్రం భుక్తిముక్తి ఫలప్రదమ్
జ్ఞానవైరాగ్య సద్బోధ కారణం మోక్షదాయకమ్" అని రావణుడును,
"నృత్యగీతాద్యభినయై రాజానామ్ దైవతం గురుం
తోషయ ద్భరతశ్శాస్త్రి భుక్తిముక్తి ఫలప్రదమ్" అని కోహాలుడును,
"శాస్త్రాణా ముత్తమం శాస్త్రం భరతజ్ఞాన సాధనమ్
కామ వైరాగ్య సద్బోధ కారణం బుధరంజనమ్" అని ఉపాధ్యాయుడును,
"ద్రష్టవ్యే నాట్యనృత్యేచ పర్వకాలే విశేషతః
నృత్తం త్వత్ర నరేంద్రాణా మభిషేకే మహోత్సవే"
"యాత్రాయాం దేవయాత్రాయాం వివాహే ప్రియసంగమే
నగరాణా మగారాణాం ప్రవేశే పుత్రజన్మని" అని నందికేశ్వరుడును వచియించి యున్నారు.

ఈవిధముగ పైన జెప్పినవారందరు నాట్యశాస్త్రగ్రంథకారులే. నాట్యము దివ్యమైనదే కాక; దేవతలు, దేవతాగణములుకూడ నాట్యప్రదర్శనములందు పాల్గొని నాట్యోత్సవములను నెరపు చుండుట హిందూమతధర్మశాస్త్ర సంప్రదాయము. ప్రదోషస్తోత్రమున శివుడు కైలాసగిరియందు, ప్రదోషకాలమున పార్వతీసమక్షమున తన్మయుడై నిత్యము నాట్యమొనర్చునని వివరింపబడియున్నది. ఈయర్థమును సూచించు గీతము ఆంధ్రదేశమున సంధ్యాకాలమున ప్రతిగృహమున దీప వెలిగించగనే గృహిణులు ఈక్రిందివిధముగ పాడుట మనము గమనించదగును.

" శివుడు తాండవము సేయునమ్మా, కైలాసగిరిలో శివుడూ ... శి॥
శివుడు తాండవము సేయును నిత్యమూ, అవిరళముగ జగదంబముందర ... శి॥
భారతి వీణచే శ్రుతిబలుక, లయద ప్పకుండ బ్రహ్మదేవుడు తాళముసేయ
సారసగతులను సప్తతాళముల, బారము మట్టగ ప్రదోషవేళను ... శి॥
మురళి దేవేంద్రుడే పూరింప, నారాయణమూర్తి మురియుచు మద్దెలవాయింప
ధిమిధిమి తద్ధిమి ధిమిధిమి యనుచును, భరతశాస్త్రమున పద్ధతి వెలుగగ ... శి॥
ప్రమథులు చూచి మిన్నుముట్ట, నారాయణమూర్తి భ్రమయుచు ఉపాంగమే బట్ట
తద్ధిమి ధిమి తైతై యనుచును అమరులు గొలువగ అభినయించుచు ... శి॥

అట్లే రాధాకృష్ణ నాట్యమును హైందవులకు పరిచయమైనదే. బృందావనమందు గోపికా సమావృతుండై శ్రీకృష్ణపరమాత్ముడు నాట్యము సేయును. గోపికలు జీవాత్మలు. శ్రీకృష్ణుడు. పరమాత్ముడు. జీవాత్మ పరమాత్మల ఐక్య సంధానమే ఈనాట్యము ఉద్బోధించుపరమ ప్రయోజనము. శ్రీ కృష్ణుడు కాళీయమర్ధన నాట్యముకూడ నొనర్చెను. దుష్టశక్తుల నణచుటే దీని సందేశము. ఈ విధముగ శివ కృష్ణ తాండవ లాస్యములు ఆధ్యాత్మిక సందేశమును అందించుచున్నవి. ఇట్లనుటచే భారతీయ నాట్యము మన ఉల్లాస ప్రదాయినీ ప్రయోజనమాత్రమేగాక విజ్ఞానాత్మకమై, ఆధ్యాత్మిక దివ్యతాభినివేశ పూర్వకమై యున్నదనుట.

# గ్రంథభాండాగారోద్యమము

శ్రీ మందలపర్తి ఉపేంద్రశర్మ

భారతదేశమందలి జనసామాన్యమునకు విద్య నేర్పిననాడుగాని మనదేశము నాగరికదేశ మనిపించు కొనదు. ఇతరదేశములలోని జనులు విజ్ఞానాంశములను తెలిసికొని తన్ను దేశమునకు అవసరమయినప్పుడు అర్పణచేసికొని తరించుటకు మానవుడభ్యసించిన సామాన్యవిద్యయే కారణము. ఆవిద్యను ప్రసాదించగల సంస్థలు పాఠశాలలు, గ్రంథాలయములు. ప్రతివ్యక్తియు పాఠశాలలో ప్రాథమిక విద్య నేర్చుకొనును. దానితో చదువుట, వ్రాయుట బాగుగ అలవడును. తరువాత గ్రంథాలయమును నాశ్రయించి వృద్ధిచేసుకొనును.

మనదేశము నందును పాఠశాలల నంటిపెట్టుకుని చదువను వ్రాయను చేతనయినంత వరకు నేర్చుకొనెడివారు కొద్దిమంది. వారు కృషిక విద్యకో కార్మిక జీవితమునకో యింకో యితర పవిత్ర వృత్తికో తమశక్తియుక్తులను అర్పించి అందే పగలంతయు గడుపుచు పొట్టపోసి కొందురు. కాని తాము చదివిన విద్యను పాఠశాల వదలుటతోడనే "గుంటకట్టి గంటవాయింతురు." గ్రంథాలయముల స్థాపనోద్దేశము ప్రజాసామాన్యము చిన్నప్పుడు తాము నేర్చుకొనిన విద్యను వృద్ధిచేసికొని విజ్ఞానాంశములను ఎక్కువగా నేర్చుకొని విద్యావంతు డగుటకు వీళ్ళు కల్పించుటయే.

పాశ్చాత్య దేశములయందు కొద్దిచదువును పాఠశాలలనుండి నేర్చుకొని గ్రంథాలయాలలో తమ నిరంతర పరిశ్రమవల్ల పండితులైనబుద్ధిమంతులు హెక్కురున్నారు. అందుకు కారణము వారు వయోధికులయిన తర్వాత గ్రంథ భాండాగారముల నాశ్రయించుటయు, బాల్యమున విధిగ ప్రాథమికవిద్య (నిర్బంధ విద్యావిధానము ఉండుటచేత) నేర్చుటయును. ఈ గ్రంథాలయములే వయోజన విద్యకు ప్రబలాధారములు. ఆ ఉద్యమానికి ఇవి వెన్నెముక.

గ్రంథాలయాలవల్ల చదువు నేర్చినవారు నూటికి జర్మనీలో 99, జపానులో 99, డెన్మార్కులో 99, అమెరికాలో 96, ఆస్ట్రియాలో 96, ఫ్రాన్సులో 96, బ్రిటనులో 94, ఇండియా 9.4. పూర్వము మెకాలే వేసినలెక్కల ప్రకారము మనదేశములో చదువుకున్నవారు నూటికి ఐదుగురు. తరువాత హెర్టాగ్ కమిటీవారి లెక్కల ప్రకారము నూటికి ఎనమండుగురు. ఇటీవలి లెక్కల ప్రకారము నూటికి 9.4 అని తేలినది. ప్రజలలో నూతన చైతన్యము, నూతనభావోదయము కలుగవలెనని నిరక్షరాస్యత నిర్మూలనము కావలెను. 1911 సంవత్సరములో పట్టాభిషేకోత్సవమునకు ఐదవజార్జి చక్రవర్తి మనదేశమునకు వచ్చినప్పుడు భారతీయులలో చదువుకున్నవారిసంఖ్య అభివృద్ధిచేసెదమని ప్రకటన చేసియున్నారు. కాని గొఱ్ఱెకు బెత్తెడే తోక యన్నట్టు వారి సంఖ్యలో మాత్రము మార్పు రాలేదు.

రష్యాలో జారుచక్రవర్తి పరిపాలన కాలమందు నూటి కిరువది ముగ్గురు మాత్రమే చదువుకున్నవారు. సోవియట్ల ప్రభుత్వములో ఈ సంఖ్య

ఈవిధముగ నాట్యవేదము దివ్యోత్పత్తిని గలిగి చతుర్విధ ఫలపురుషార్థ ప్రదముగ నిర్ణీత మైనట్లు తెలియుచున్నది.

నాట్యఫలమును—

"ఉత్తమం భరతం శాస్త్రంచ జ్ఞానవైరాగ్య సాధనమ్" అని నారదులవారును,
"ఉత్తమం భరతంశాస్త్రం భుక్తిముక్తి ఫలప్రదమ్
జ్ఞానవైరాగ్య సద్బోధ కారణం మోక్షదాయకమ్" అని రావణుడును,
"నృత్యగీతాద్యభినయై రాజానామ్ దైవతం గురుం
తోషయ ద్భరతశ్చాత్ర భుక్తిముక్తి ఫలప్రదమ్" అని కోహలుడును,
"శాస్త్రాణా ముత్తమం శాస్త్రం భరతజ్ఞాన సాధనమ్
కామ వైరాగ్య సద్బోధ కారణం బుధరంజనమ్" అని ఉషాదేవియును,
"ద్రష్టవ్యే నాట్యనృత్యేచ పర్వకాలే విశేషతః
నృత్తం త్వత్ర నరేంద్రాణా మభిషేకే మహోత్సవే"
"యాత్రాయాం దేవయాత్రాయాం వివాహే ప్రియసంగమే
నగరాణా మగారాణాం ప్రవేశే పుత్రజన్మని" అని నందికేశ్వరుడును వచియించి యున్నారు.

ఈవిధముగ పైన జెప్పినవారందరు నాట్యశాస్త్రగ్రంథకారులే. నాట్యము దివ్యమైనదే కాక; దేవతలు, దేవతాగణములుకూడ నాట్యప్రదర్శనములందు పాల్గొని నాట్యోత్సవములను నెరపు చుండుట హిందూమతధర్మశాస్త్ర సంప్రదాయము. ప్రదోషస్తోత్రమున శివుడు కైలాసగిరియందు ప్రదోషకాలమున పార్వతీసమక్షమున తన్మయుడై నిత్యము నాట్యమొనర్చునని వివరింపబడియున్నది. ఈయర్థమును సూచించు గీతము ఆంధ్రదేశమున సంధ్యాకాలమున ప్రతిగృహమున దీప వెలిగించగనే గృహిణులు ఈక్రిందివిధముగ పాడుట మనము గమనించదగును.

" శివుడు తాండవము సేయునమ్మా, కైలాసగిరిలో శివుడూ ... శి॥
శివుడు తాండవము సేయును నిత్యము, అవిరళముగ జగదంబముందర ... శి॥
భారతి వీణచే ప్రీతిబలుక, లయదప్పకుండ బ్రహ్మదేవుడు తాళముకేయ
సారసగతులను సప్తతాళముల, బారము ముట్టగ ప్రదోషవేళను ... శి॥
మురళి దేవేంద్రుడే పూరింప, నారాయణమూర్తి మురియుచు మద్దెలవాయింప
ధిమిధిమి తద్ధిమి ధిమిధిమి యనుచును, భరతశాస్త్రమున పద్ధతి వెలుగగ ... శి॥
ప్రమథులు చూచి మిన్నుముట్ట, నారాయణమూర్తి భ్రమయుచు ఉపాంగమే బట్ట
తద్ధిమి ధిమి తైతై యనుచును అమరులు గొలువగ అభినయించుచు ... శి॥

అట్లే రాధాకృష్ణ నాట్యమును హైందవులకు పరిచయమైనదే. బృందావనమందు గోపికా సమావృతుడై శ్రీకృష్ణపరమాత్ముడు నాట్యము సేయును. గోపికలు జీవాత్మలు. శ్రీకృష్ణుడు. పరమాత్ముడు. జీవాత్మ పరమాత్మల ఐక్య సంధానమే ఈనాట్యము ఉద్బోధించుపరమ ప్రయోజనము. శ్రీకృష్ణుడు కాళీయమర్దన నాట్యముకూడ నొనర్చెను. దుష్టశక్తుల నణచుటే దీని సందేశము. ఈ విధముగ శివ కృష్ణ తాండవ లాస్యములు ఆధ్యాత్మిక సందేశమును అందించుచున్నవి. ఇట్లగుటచే భారతీయ నాట్యము మన ఉల్లాస ప్రదాయినీ ప్రయోజనమాత్రమేగాక విజ్ఞానాత్మకమై, ఆధ్యాత్మిక దివ్యతాభినివేశ పూర్వకమై యున్నదనుట.

# గ్రంథభాండాగారోద్యమము

శ్రీ మందలపర్తి ఉపేంద్రశర్మ

భారతదేశమందలి జనసామాన్యమునకు విద్య నేర్పిననాడుగాని మనదేశము నాగరికదేశ మని పించుకొనదు. ఇతరదేశములలోని జనులు విజ్ఞానాంశములను తెలిసికొని తమ్ము దేశమునకు అవసరమయినప్పుడు అర్పణచేసికొని తరించుటకు మానవుడభ్యసించిన సామాన్యవిద్యయే కారణము. ఆవిద్యను ప్రసాదించగల సంస్థలు పాఠశాలలు, గ్రంథాలయములు. ప్రతివ్యక్తియు పాఠశాలలో ప్రాథమిక విద్య నేర్చుకొనును. దానితో చదువుట, వ్రాయుట బాగుగ అలవడును. తరువాత గ్రంథాలయము నాశ్రయించి వృద్ధిచేసుకొనును.

మనదేశము నందును పాఠశాలల నంటిపెట్టుకుని చదువను వ్రాయను చేతనయినంత వరకు నేర్చుకొనెడివారు కొద్దిమంది. వారు కృషిక విద్యకో కార్మిక జీవితమునకో యింకో యితర పవిత్రవృత్తికో తమశక్తియుక్తులను అర్పించి అందే పగలంతయు గడుపుచు పొట్టపోసి కొందురు. కాని తాము చదివిన విద్యను పాఠశాల వదలుటతోడనే "గుంటకట్టి గంటవాయింతురు." గ్రంథాలయముల స్థాపనోద్దేశము ప్రజాసామాన్యము చిన్నప్పుడు తాము నేర్చుకొనిన విద్యను వృద్ధిచేసికొని విజ్ఞానాంశములను ఎక్కువగా నేర్చుకొని విద్యావంతు డగుటకు వీళ్ళు కల్పించుటయే.

పాశ్చాత్యదేశములయందు కొద్దిచదువును పాఠశాలలనుండి నేర్చుకొని గ్రంథాలయాలలో తమ నిరంతర పరిశ్రమవల్ల పండితులైనబుద్ధిమంతులు పెక్కురున్నారు. అందుకు కారణము వారు వయోధికులయిన తర్వాత గ్రంథ భాండాగారముల నాశ్రయించుటయు, బాల్యమున విధిగ ప్రాథమికవిద్య (నిర్బంధ విద్యావిధానము ఉండుటచేత) నేర్చుటయును. ఈ గ్రంథాలయములే వయోజన విద్యకు ప్రబలాధారములు. ఆ ఉద్యమానికి ఇవి వెన్నెముక.

గ్రంథాలయాలవల్ల చదువు నేర్చినవారు నూటికి జర్మనీలో 99, జపానులో 99, డెన్మార్కులో 99, అమెరికాలో 96, ఆస్ట్రియాలో 96, ఫ్రాన్సులో 96, బ్రిటనులో 94, ఇండియా 9.4. పూర్వము మెకాలే వేసినలెక్కల ప్రకారము మనదేశములో చదువుకున్నవారు నూటికి ఐదుగురు. తరువాత హెర్టాగ్ కమిటీవారి లెక్కల ప్రకారము నూటికి ఎనమండుగురు. ఇటీవలి లెక్కల ప్రకారము నూటికి 9.4 అని తేలినది. ప్రజలలో నూతన చైతన్యము, నూతనభావోదయము కలుగవలెననిం నిరక్షరాస్యత నిర్మూలనము కావలెను. 1911 సంవత్సరములో పట్టాభిషేకోత్సవమునకు ఐదవజార్జి చక్రవర్తి మన దేశమునకు వచ్చినప్పుడు భారతీయులలో చదువుకున్నవారిసంఖ్య అభివృద్ధిచేసెదమని ప్రకటన చేసియున్నారు. కాని గొర్రెకు బెత్తెడే తోక యన్నట్టు వారి సంఖ్యలో మాత్రము మార్పు రాలేదు.

రష్యాలో జారుచక్రవర్తి పరిపాలన కాలమందు నూటి కిరువది ముగ్గురు మాత్రమే చదువుకున్నవారు. సోవియట్ల ప్రభుత్వములో ఈ సంఖ్య

అద్భుతముగ పెరిగినది. దేశపురోభివృద్ధి ప్రజాభ్యుదయము మనస్సులో పెట్టుకొని పాటుపడిన లెనిన్ మొదలగువారు సంకల్పసిద్ధులు గనుక యితరనాగరిక దేశములు దిగ్భ్రమజెందు లాగున తమ దేశమందు వయోజన విద్య వ్యాపింపజేసిరి. ప్రజలలో ఉన్నతా ధర్మములను పెంపొందింపజేసిరి. పదిసంవత్సరములలో ఏబదివేల పుస్తకభాండారములు, ఏబదివేల పాఠశాలలు, ఏబదివేల సంచార గ్రంథాలయములు పదివేల కేంద్రగ్రంథాలయములు స్థాపించిరి. క్రొత్తగా కోటిమంది బాల బాలికలకు విద్యాప్రబోధము కలుగు వసతులు ఏర్పడినవి. రేడియోలు, సినిమాలు, నాటకములు చెలరేగి సేవచేయ మొదలిడినవి.

అమెరికాలో శాసనములుచేసి నిర్బంధముగా గ్రామములందు గ్రంథాలయములు స్థాపించి కోట్లకొలదిఖర్చుపెట్టి వానినిపోషించుచున్నారు. స్త్రీలకు ప్రత్యేక గ్రంథాలయములు, పిల్లలకు ప్రత్యేక గ్రంథాలయములు స్థాపింపబడినవి. గ్రంథాలయ శాస్త్రములు అమెరికాలోనే ఉద్భవించినవి. ప్రథమ గ్రంథాలయ వర్గీకరణ గ్రంథ కర్తయగు మెల్‌విల్‌డ్యూయి తన ప్రణాళికను 1872 లో అమెరికానుండి ప్రకటించెను.

విదేశీయుల విజయమునకు ముఖ్యకారణము వ్యవస్థలు, వాని నిర్మాణము. ఈ నిర్మాణమునకు ఇంగ్లాండు అమెరికాలు పెట్టినదిపేరు. అమెరికాలో ఈ శాస్త్రమునుగూర్చి నిరంతర పరిశ్రమ చేసి బహు గ్రంథములను గూర్చిన పండితులెట్లుగా నున్నారో అట్లే బ్రిటనులోకూడ శతాధిక గ్రంథములను వెలయించిన గ్రంథాలయ శాస్త్రపరిశోధకులును ఉన్నారు. ఆయా ప్రభుత్వములు వీరిని పోషించుచున్నవి. వీరి విద్యాధిక్యమును వృద్ధిచేయుటకు భాండాగారిక శిక్షణా తరగతులను స్థాపించుచున్నారు.

జపానులో గ్రంథాలయాదులవల్లనే ఈ మధ్య కాలములో గొప్పమార్పులు జరిగినవి. స్త్రీలు, పురుషులు అధికసంఖ్యాకులుగా చదువుకున్నవారైరి. జర్మనీయందును అట్లనే జరిగియుండెను. అంతకాకపోయిన కించిదూనముగానైన చిన్న చిన్న దేశాలగు స్వీడను, ఆస్ట్రియా, జెకోస్లావోకియా మొదలగునవి పదిలక్షలు, ఇరువది లక్షలు, నూటయేబది లక్షలు సాలుకు వెచ్చించుచు ఉద్యమము సాగించుచున్నవి. ప్రస్తుతము భారతీయ గ్రంథాలయోద్యమము ఉన్నతస్థితికి రాకపోవుటకు మనకు సరియైన సంఘము లేకపోవుటయే కారణము. పూర్వము మనకు బ్రహ్మాండమగు గ్రంథాలయ వ్యవస్థ ఉండినట్లు ప్రమాణములు కలవు. వేదయుగము నుండియు నీ వ్యవస్థ వర్ధిల్లినదట. అప్పుడు గోష్ఠీస్థలములును వానియందు గ్రంథదానములును ఉన్నవట. ఆ కాలమందు పండితపరిషత్తులును గ్రంథపేటికలును ఉన్నవట. పరిశోధకుల కృషివల్ల దీనిని గూర్చిన విషయములన్నియు వ్యక్తమయినవి. గ్రంథములు పారిషదులచే తీసికొని రాబడెడివట. అవి కేంద్రస్థానములనుండి శాఖాస్థానములకు కొనిపోబడెడివట. పరిషత్తుకు పుస్తకములన్నిటిని పూర్తిగా చదివిన చదువరి పాఠకులకు కల్గెడి సందేహములను తీర్చువేత్త, మతవిషయములను బోధచేయు ఉపన్యాసకుడును నై సర్వవిధముల ఆ సంఘమును (కోశాగారమును) ఉన్నతికి తేగల్గినవాడగు కోశాచార్యుడు అధ్యక్షుడట. లిపింకరుండనెడివాడు అతని ప్రతిష్ఠలను వ్రాయుచుండెడివాడట. ప్రాచీన కాలమందలి పరిస్థితులు ఇట్లుండెడివి. తరువాతి కాలములందు

డ భారతీయ గ్రంథాలయములు గొప్ప భవము నే అనుభవించినట్లు కననగును.

ందు తక్షశిల, విక్రమశిల, ఓదంతపురి, అమరా, వేంగి, కాకరపఱ్ఱు మొదలగు విశ్వవిద్యాలయ ములలో వేలకొలది వ్రాతప్రతులు భద్రపర కవారట. నలంద, తక్షశిలలలో గ్రంథాలయము ప్రత్యేక భవనము లుండెడివట. రత్నోదధి ను పేరుగల సౌధము గ్రంథాలయమునకు త్యేకింపబడినదట. ఇది నలందా విశ్వపరిషత్తు సంబంధించినది. పూర్వము ఆర్యుల దేవా యములలోను, బౌద్ధుల విహారాదులలోను, ముల స్థానములందును (ఆలయము లందును) ంథ పేటిక లుండెడివట. వాని యందలి గ్రంథ లు విద్యార్థులకును ఇతరులకును ఇచ్చి వివేకో పమును కల్పించెడి వారట. గుప్తవంశపు జుల కాలము భారత సంస్కృతికి స్వర్ణ గము. వీరి కీర్తి నంత ఉచ్ఛదశకు తెచ్చినది గ్రంథాలయోద్యమము నందున్న అస నమగు అభిమానము, విద్యాసంస్థలను ంచుటలో గల ప్రతిలేని ఔదార్యమును.

రు, హుమాయూను, వారి సామంతులును ంథాలయములను పోషించుటయందు శ్రద్ధ ంపియుండిరి. మహాక్బరు పరిపాలన కాలము యుద్యమమునకు ప్రోత్సాహము కలుగజేసి తరువాత మహమ్మదీయుల పాలనము లో ప్రోత్సాహము పరసీమ ముట్టినది.

కుక్కలు, రెడ్డిరాజులు ఈ ఉద్యమమును రుజ్జీవింపజేసినను మన గ్రంథములు కొన్ని ంములలో ప్రవాసమొనర్చుట తప్పినది కాదు. ంల దేవచోళ చాణక్యుని భాండాగారమందు ల్లిన రామాయణప్రతి నేడు జర్మనీదేశ వలి "బాన్" విశ్వవిద్యాలయమునందు భద్రపరుపబడినదట. కృష్ణదేవరాయల కాలములో దేవాలయములు, క్షేత్రస్థానములు, పంచాయతీ కూటములు, గ్రంథాలయములకు చేయూతలై ఉండెడివట. శ్రీ వారి భువనవిజయ భవనము సింహాపీఠితో అలరారుచుండెడిది. చింతామణి భవనము తదుపాంత భవనములు గ్రంథములతో ఒప్పుచుండెడివి. దక్షిణాంధ్ర నాయకుల కాలమందు, మహారాష్ట్రుల కాలమందును, గ్రంథాలయోద్యమమునకు చక్కని ప్రాపు కలిగినట్లు అక్కడి అమూల్యములగు తాళపత్ర గ్రంథాలయములే నిదర్శనములు.

అద్యతన కాలమందు అనిబిసెంటుగారి హోమ్ రూలు ప్రబోధనలవల్ల మన గ్రంథాలయోద్యమమునకు మంచి దోహదము చేకూరినది. అనంతరము అఖిలభారత ధర్మగ్రంథాలయ సంఘస్థాపన వలనను (ఆల్ ఇండియా పబ్లిక్ లైబ్రరీ అసోసియేషన్), భారతవర్షీయ గ్రంథాలయ సంఘ (ఇండియన్ లైబ్రరీ అసోసియేషన్) స్థాపనవల్లను చక్కని సేవను ఆయాసంఘముల కార్యదర్శులు శ్రీయుతులు అయ్యంకి వేంకటరమణయ్య పంతులు, అసదుల్లా సాహేబు బహద్దర్ గారలు కావించి దేశీయులకృతజ్ఞతను నొందుచున్నారు. 1914 సంవత్సరములో ఉపక్రమింపబడిన ఆంధ్ర దేశగ్రంథాలయ సంఘము దాని కార్యదర్శిగా నుండిన అయ్యంకి వేంకటరమణయ్య గారి నిరంతర దీక్ష వల్ల కొన్ని వందల గ్రంథాలయములను స్థాపించగలిగినది. ఇరువది మూడు వార్షిక మహాసభలు జరిగినవి. ఆంధ్ర రాష్ట్ర ఆందోళనకు తొలుదొల్త ప్రారంభించిన దీ సంఘమే. గ్రంథాలయ సర్వస్వమను ఉత్తమ వర్గమునకు చెందిన మాసపత్రికను నడపి కార్యదర్శులు భాషా సేవ, గ్రంథాలయ సేవ, అమోఘముగ

కావించియున్నారు. 1920, 1934 సంవత్సరము లలో భాండాగారిక శిక్షణ తరగతులు సంఘ యాజమాన్యమున ఏర్పాటు చేయబడినవి.

యువజనులు గ్రంథాలయ శిక్షణనంది పల్లెలకు చేరి అక్కడి గ్రంథాలయములను సక్రమముగ పాలించుచుండిన గ్రామపునరుద్ధరణకూడ జరుగ గలదు. ఈ యువకులే ఉద్యమమునకు అంగ బలము. ప్రజలు, ప్రభుత్వము ఇచ్చెడు చందాలు అర్థబలము. పాశ్చాత్యులీ విషయము నందు ఆదర్శపాత్రులు. వాషింగ్టన్‌లోని లైబ్రరీ ఆఫ్ కాంగ్రెసు(Library of Congress Washington) 1932-33 సంవత్సరములో సాధారణ గ్రంథాలకు పత్రికలకు మాత్రము 30000 'లా' కు సంబంధించిన గ్రంథాదులకు 50000 గుడ్డివాళ్లు ఉపయోగించుకొను గ్రంథములకు 90,000 విరాళము లీయబడినవి. ఇవి వార్షికముగవచ్చు విరాళములు. ఇవి గాక ప్రత్యేకముగా శాంక్షనగు విరాళములు నుండును. వినిమయము నకు (Exchange) వచ్చు గ్రంథములు కొన్ని వందలుండును. 1930-31 సంవత్సరము నందు వయి వాషింగ్టన్ గ్రంథాలయమునకు అమెరికాలో ప్రకటితములగు అన్నిరచనలను; వినిమయమునకుగాను పంప బడు అన్ని ప్రచురణలను మినహాయించివేసి ప్రత్యేకముగాకొన్ని గ్రంథములను ఖరీదు చేయుటకు 1500000 ప్రభుత్వము వెచ్చించియున్నారు. ప్రతిసంవత్సరము గ్రంథాలయాలకు విరాళము లింత ఉదారముగనుండుట చేతనే వానియందులక్షలాది (సంఖ్య) గ్రంథము లుండును. పై గ్రంథాలయములో 5348206లు, మాస్కో లోని లెనిన్ పబ్లిక్ లైబ్రరీలో 5000000 లు, ప్యారిస్‌లోని బిబ్లియోతిక్ నేషనేల్‌లో 46.5000 లు, ఇంగ్లండు లోని బ్రిటిషు మ్యూజియములో 4000000 లు, స్కాట్లండు లోని జాతీయగ్రంథాలయములలో 8000000లు సమకూడియున్నవి. ఇట్లే ఇతర జకోస్లేవోకియా లోని జాతీయగ్రంథా దానము లన్నింటను కలిపి

| | | | |
|---|---|---|---|
| ................... | | | 817000 లు |
| స్విట్జర్ లెండు | ,, | ,, | 600000 లు |
| వేల్సు | ,, | ,, | 500000 లు |
| ఐర్లండు | ,, | ,, | 300000 లు |

అక్కడి గ్రంథాలయములవారు సేకరింప గలిగిరి. మన దేశమందలి ఇంపీరియల్ లైబ్రరీలో కూడ మూడు నాల్గు లక్షలకు మించి గ్రంథాలుండవు ప్రభుత్వము ఆయాపాశ్చాత్య దేశములలో copy right గ్రంథాలయాలు స్థాపించి వానికి ఆయా దేశములలో ప్రకటింపబడు ప్రతి ప్రచురణను పంపితీరవలెనని శాసించుచుందురు. ఇట్టి గ్రంథభాండారములు ఫ్రాన్సు దేశమునందు 1527 లో ప్రథమముగా నిర్మింప బడినది. తరువాత ఆస్ట్రియాలో 1697 లో, ప్రష్యాలో 1699 లో, గ్రేటుబ్రిటనులో 1814 లో, యు. యస్. ఏ లో 1897 లోను వెలసినవి; ఈ జాతీయ గ్రంథాలయాలు. ఇట్లు జాతీయ గ్రంథాలయములు దృశ్యమానమైన ప్రకటనలను కలిగియుండ దాని నుండి రాష్ట్రీయగంథాలయములు, కేంద్రగ్రంథాలయములు పుస్తకములను బదులుపుచ్చుకొని, తమ వంతు వచ్చినపుడు తాము తమక్రింది జిల్లా, తాలూకా, గ్రామ గ్రంథాలయములకు ఎరువు ఇచ్చుచు గ్రంథ సమీకరణ పద్ధతిని (Regional Co-operation) అచరణలో పెట్టును.

మనదేశమునందు కాపీరైటుగ్రంథాలయములు లేవుకనుక ప్రస్తుతము విశ్వవిద్యాలయ గ్రంథా

లయములుగాని రాజధాని నగరములందలి సార్వజనిక గ్రంథాలయములుగాని ఆపని నిర్వహించి పఠితలకు అభీష్టగ్రంథముల నందజేయ వచ్చును. ప్రత్యేకశాఖలకొరకు ఏర్పడిన ఢిల్లీలోని గవర్నమెంటు ఇండియా రికార్డుఆఫీసు ఇంపీరియల్ అగ్రికల్చరల్ ఇన్‌స్టిట్యూటు డేరాడూనులోని ఇంపీరియల్ ఫారెస్టు ఇన్‌స్టిట్యూటు, బెంగుళూరులోని ఇండియన్ సైన్సుఇన్‌స్టిట్యూటు లలో ఉండే గ్రంథాలయాలు ఆయా ప్రత్యేక శాఖలలోని గ్రంథాలు ఎరవిచ్చుట కుపకరించును. మన దేశము గ్రంథాలయము నిర్మించు విషయ మందును ఒక విశిష్టమైన పద్ధతిని ఏర్పాటుచేసి అదిఅమలు లోనికి వచ్చునట్లు పాటుపడవలెను. దేవాలయ నిర్మాణములో గమనించు విశిష్టతయె దేవీ ఆలయముల నిర్మాణమునందును చూపిన యుక్తము. అట్టి గ్రంథాలయములు తప్పక చదువరుల నాకర్షించును. అప్పుడొక్కొక్కనికి కావలసిన గ్రంథములను సంపాదించు కొనవచ్చును. నార్వేలో ఒక్కొక్కనికి 3 సంపుటముల నీయగల గ్రంథసంఖ్య భాండారముల నున్నదట.

| | | |
|---|---|---|
| స్వీడనులో | 1½ | ,, |
| ఇంగ్లండులో | 1½ | ,, |
| అమెరికాలో | ½ | ,, |

వయోజన విద్యావ్యాప్తికి ఈగ్రంథాలయములు మిక్కిలిగా ఉపకరించుచున్నవి. డెన్మార్కులో 16%, స్వీడనులో 12%, ఇంగ్లండులో 12%, జర్మనీలో 2.6%. ఇండియాలో గ్రంథాలయాలిట్టి పని చేయుటకెంత సమర్థములో మన మూహించు కొనవచ్చును. మనదేశమందు కర్షక కార్మికులకు గ్రంథాలయసేవ వారుండుపొలాలదగ్గరకు ఫాక్టరీల దగ్గరకు పోయి చేయుటకు వసతు లేర్పాటు చేసిననుచాలు. ఇవిగాక గ్రంథాలయములుచేయవలసిన పనులందఱకు విదితమే. అవి ఆచరణ లోనికి రాకుండుటకు కారణము తగిన సిబ్బంది లేకపోవుట, ప్రభుత్వసాహాయ్యము లేకపోవుటయె. గ్రంథాలయ శాఖకును విద్యాశాఖవలెనె ఒక డైరక్టరు, ఇతరఉద్యోగులు నేర్పాటుచేయబడి, పంచాయతీలనుండి, సహకార సంఘములనుండి, దేవాదాయ, ధర్మాదాయముల నుండి కొంత సొమ్మువంతున ప్రత్యేకించి ఒక నిధిని ఏర్పాటు చేయబడి ప్రత్యేకశాఖ నిర్మాణమయిన నాడు గ్రంథాలయముల కార్యక్రమములో ముఖ్యమయిన ఆత్మకు త్తేజకరములైన కాలక్షేపాదుల జరిపించుట, శాసనములు, నాణెము, తాళపత్రి గ్రంథములు సేకరించుట, యాత్రలు సాగించుట, ముద్రితా ముద్రిత గ్రంథముల జాబితాల నప్పటికప్పుడు తయారుచేసికొనుట మొదలగు కార్యములను మనఃపూర్తిగా చేయవచ్చును.

భారతదేశ మందలి వ్యవసాయదారులు సుమారు ఆరునెలలు పనిపాటలు లేకుందురు. ఈ అర్థసంవత్సరము వ్యర్థముగ చాలమంది పొద్దుపుచ్చుచుందురు. భాండాగారములు ప్రతి గ్రామమందును స్థాపింపబడిన ఈ నిర్వ్యాపారత్వము దానివల్లవచ్చు నష్టములు నాశన మొందును. మన దేశమందు పూర్వము శిథిలములయిన గ్రంథములు పెక్కు. కొన్ని నాటి రాజుల ఆదరణ లేకపోయినవి. ఇతరుల కిచ్చుట కిష్టము లేక గోడలలో పూడ్చి దాచి పెట్టుటచేత నాశనమయినవి. మతావేశములచే మంటపెట్టబడినవి. చెదలపాలయినవి. ఇప్పుడు మిగిలిన గ్రంథసంపదయే కొద్ది. దానిని భద్రపఱచుటకును, ఆరోజుకారోజు అభివృద్ధియగుసారస్వతము నిక్షేపము చేయుటకును గ్రంథాలయముల పెంపు ముఖ్యము.

[illegible]

△

# గ్రంథాలయోద్యమము

శ్రీ యం. సత్యనారాయణ

గ్రంథాలయోద్యమము అనగానేమి? ఈ యుద్యమమునందు పాశ్చాత్యదేశములు, అందునను, బరోడాదేశము మరింత హెచ్చుగ అగ్రస్థానము వహించుటకును, మన దేశము దీనదశయందుండుటకును గల కారణము లెవ్వి? ఈ యుద్యమముఖ్యోద్దేశమేది? దీనిని మనదేశమందు ఎట్లు అభివృద్ధి చేయగలము? అను విషయములు చర్చింతము.

గ్రంథాలయోద్యమము అనగా వ్రాయుట చదువుట వచ్చు ప్రతిస్త్రీయు, పురుషుడును, బాలుడును, బాలికయు గ్రంథములను ఉపయోగించునటుల చేయుట; ఇంతియేగాక వ్రాయుట చదువుట రానివారికి సయితము చదువనేర్చుకొని గ్రంథములు పఠించుటకు ఉత్సాహము కలిగించుట. భగవంతుడు తనకు యిచ్చిన జ్ఞానమును మానవుడు అభివృద్ధి చేసికొనుటకును, తన యొక్క జీవితమును పవిత్రవంతముగను పురుషార్థసాధకముగను చేయుటకును ఈయుద్యమము తోడ్పడుచున్నది.

పాశ్చాత్య దేశములందు నీ యుద్యమవ్యాపకమునుగూర్చి జరిగెడి కృషి ఇంతయని చెప్పుటకు అలవికాదు. ఇందుకొరకు ఆయాయి దేశములలో ప్రఖ్యాతి వహించిన విద్యాధికులు, గొప్ప ఉద్యోగస్తులు ఘనత వహించిన వర్తక శిఖామణులు మొదలగువారు సంఘముగా ఏర్పడి ప్రత్యేక సమావేశములు జరపి ఈ గ్రంథాలయోద్యమము నెవ్విధమున దినదిన ప్రవర్ధమానము చేయగలమను విషయమును గూర్చి చర్చింతురు. దిన పత్రికల యందు గ్రంథాలయోద్యమ పాశస్త్యము గూర్చి అనేక వ్యాసములు ప్రచురింప బడుచుండును. పెద్దపెద్ద గ్రంథాలయ విశేషములను పత్రికా విలేఖకులును పండితులును పత్రికల యందు వ్రాయుచుందురు; బడిపిల్లలకు చదువుచెప్పు ఉపాధ్యాయులు ఏయే గ్రంథాలయు మందు తమ బాలుర కుపయోగకరమగు గ్రంథము లున్నవో ముందుగా తెలిసికొని ఆ గ్రంథనామములను, అవియున్న గ్రంథాలయములను వారికి దెలిపి వారు వాటిని చదువునటుల ప్రోత్సాహము చేయుచుందురు.

కూలివాండ్రు పనిచేయు కర్మాగారముల యెదుట గోడలమీద వారికి పనికివచ్చు గ్రంథముల పేర్లను, అవి దొరకు గ్రంథాలయముల పేర్లను వ్రాతురు. గ్రంథాలయముల యందుండు వేరువేరు గదులను దేశమునందు ప్రఖ్యాతివహించిన పురుషుల వశమునందుంచి ఈ విధముగా వారి యభిమానమును జూరగొందురు. ప్రతిగ్రంథాలయమునందును వివిధభాషల వార్తాపత్రికలుండును; పాఠకజనము దేశ కాల పరిస్థితులను గురించిన విశేషములను చదువుకొనుటకు వచ్చి ఆ గ్రంథాలయమునందున్న గ్రంథములను పరిశీలించి వాటిని చదువుటకు కుతూహలపడెదరు. ఇవిగాక ఎల్లచోట్లను నిర్బంధ విద్యాశిక్షణము గలదు. దీనిప్రకారము స్త్రీపురుషులుకాని, బాలబాలికలుగాని విద్యావిహీనులై యుండరాదు. విద్య ఉచితముగా గఱపబడును. ఈ శాసనమును ధిక్కరించి ఎవ్వడైనను విద్యాశిక్షణ లేకుండ

నున్నయెడల వాడు శిక్షింపబడును. గ్రంథాలయములను స్థాపించుటకు వీలులేసి స్థలములయందు ప్రత్యేకముగా తయారు చేయబడిన పెట్టెలలో పుస్తకములుపెట్టి అనేక ప్రదేశములకంపి జనసామాన్యము గ్రంథములను చదువునట్లు చేయుదురు. బడిపిల్లల కుపయుక్తమగు గ్రంథములను (చదువునట్లు చేయుదురు.) ఉపాధ్యాయుల వశమున నిత్తురు. మరియు ప్రత్యేకముగా నియమింపబడు భాండాగారి యొకడు బీదలు నివసించు కుగ్రామములకుపోయి చదువగలవారికి పుస్తకములనిచ్చియు, చదువురాని వారికి తాను స్వయముగా చదివిచెప్పియు జ్ఞానమును వెదజల్లుచుండును. పాశ్చాత్య దేశములయందీ గ్రంథాలయోద్యమము పైజెప్పిన విధమునను, ఇవియేగాక ఇంక నితరపద్ధతుల వలనను దినదినాభివృద్ధి నొందుచున్నది.

గ్రంథాలయోద్యమము బాగుగా దేశమంతటను వ్యాపింపజేయవలెనన్న కేంద్ర గ్రంథాలయ మొకటి ప్రతిష్ఠాపన చేయవలెను. బరోడా రాష్ట్రమందు గ్రంథాలయోద్యమము బాగుగా వ్యాపించినది. ఇట్టి సంస్థమూలముననే బరోడా గాయక్వార్ గారు అమెరికా ఖండమందు వర్ధిల్లుచున్న పౌరగ్రంథాలయోద్యమము (Public Library movement) చక్కగా పరిశీలించి, బార్డెను అను పండితుని అమెరికానుండి రావించి అతని యజమాన్యమున బరోడా కేంద్ర గ్రంథాలయమును స్థాపించిరి. సామాన్య గ్రంథాలయములందు దొరకని అమూల్య గ్రంథము లిందుండును. రాష్ట్రమందలి గ్రంథాలయములకు సంబంధించిన వారెవ్వరైనను ఈ కేంద్ర గ్రంథాలయమునుండి తమకు కావలసిన పుస్తకములను బడయవచ్చును. ప్రత్యేకపుస్తక భాండాగారులను కొందరిని నియమించి వారిద్వారా పుస్తకములను వివిధప్రాంతములకు పంపి జనసామాన్యమున కందజేసి విద్యాభివృద్ధికి తోడ్పడిరి. ఇది యటుండ ఆరాష్ట్రమందు ఉచ్ఛదశయందుండుటకు ముఖ్యకారణమిది. ఇంటిపన్ను, వృత్తిపన్ను, రాబడిపన్ను మొదలగు పన్నులవలె అచట గ్రంథాలయోద్యమకప్పము (Library Legislation) అనుపేరనొక పన్ను ప్రజలపై విధించి, అందువలనవచ్చు ధనమును గ్రంథాలయముల నిమిత్తము వెచ్చించెదరు.

పాశ్చాత్య దేశములతో సరిపోల్చి చూచిన యెడల ఈ యుద్యమము మనదేశమందు ఆవగింజలో అరభాగము కూడ లేదని చెప్పవచ్చును. దీనికి ముఖ్యకారణము విద్యాధికులు మనదేశమందు బహుస్వల్పముగ నుండుట. చెన్నరాష్ట్రమునందు 100కి 6 గురు మాత్రము చదువుకున్నవారు కలరు. మనదేశములో నూటికి తొంబదిమందికి పైగా పల్లెటూళ్ళలో నివసించుచున్నారు. వారిలో చాల తక్కువమందికి మాత్రము అక్షరజ్ఞానము కలదు. మిగిలినవారు అదియు లేనివారే. గ్రామములలోనుండు పాటకజనము దినమంతయు కష్టపడి పనిచేసి సాయంకాలమువచ్చి భోజనముచేసి పండుకొనుటయే గాని వారికి ఈ గ్రంథాలయములతోగాని, తదితర సంస్థలతోగాని ఏవిధమయిన జోక్యమును సంబంధమును లేదు. విద్యలేనివాడు వింతపశువు అని పెద్దలు వక్కాణింతురు.

విద్యనిగూఢగుప్తమగు
విత్తము రూపము పూరుషాళికిన్
విద్యయశస్సు భోగకరి
విద్యగురుండు విదేశ బంధుడున్

విద్యావిశిష్టదైవతము
విద్యకుసాటి ధనంబు లేదిలన్
విద్యనృపాలపూజితము
విద్యనెరుంగనివాడు మర్త్యుడే

విద్యకు అంతులేదు. ఇది అపారము. విద్యలేని అజ్ఞానులకు విద్యాదానము చేసి వారిని విజ్ఞానవంతులుగా చేయుటకంటె పుణ్యకార్యము వేరొకటి ఎందైన కలదా యోజింపుడు. తాము విద్యావంతులము, పండితులము అనుకొను వారికి కూడ గ్రంథాలయము లత్యంతావశ్యకములు. పల్లెటూరిలో చాలమంది విద్యావిహీనులై యుండుటకు కారణము నిర్బంధ శిక్షా విధానము మన దేశమందు లేకుండుటయే. గ్రంథాలయోద్యమము చక్కగా మన దేశమున సాగవలెనన్న ముందుగా గ్రామపునర్నిర్మాణమునకు (Rural reconstruction) గ్రంథాలయములు పూనుకొనవలెను. ప్రతి గ్రామ మందును గ్రంథాలయములు స్థాపించుటకై ఎల్లరును పాటుపడ వలెను. పల్లెటూళ్ళలో నివసించు పాటకపు జనమునకు సంవత్సరమునకు 6 నెలలు విరామముండును. ఈ కాలమును వృథగ వ్యయపరుప కుండుటకై వారికి విద్యనేర్పిన మిగుల శ్రేయస్కరము. మన దేశమున గ్రంథాలయోద్యమము విరివిగా సాగవలెనన్న దొరతనము వారిని, పురపాలక సంఘములను దేశకల్యాణమునకై ఈ దిగువ నుదహరించిన కార్యములు దేశమందంతటను ఆచరణలో పెట్టమని ప్రార్థించ వలెను.

1. మనదేశ మందంతటను నిర్బంధ శిక్షా విధానముకు ప్రవేశపెట్ట వలెను. ఇందు నిమిత్తము పురపాలక సంఘములకు, స్థానికసభలకు శాసనము ప్రకారము పన్ను విధించ వలసిన అవసర మేర్పడు చున్నది. దీనిని అమలులో పెట్టుటకు వారు చాలాధనము వ్యయపరుప వలసిన అవసర మేర్పడు చున్నది. అట్టి అవసరము లేకుండ ప్రారంభవిద్య నిర్బంధముగ నుంచి ఉచితముగా లేకుండ చేసిన విద్యాభివృద్ధికి తోడ్పడిన వారయ్యెదరు.

2. దొరతనమువారును, పురపాలకసంఘములును విద్యాలయములను, గ్రంథాలయములను ప్రతి గ్రామములో స్థాపించవలెను.

3. ప్రతి విద్యాలయము నందును పుస్తకభాండాగార ముండవలెను. ఈ భాండాగారములకు కావలసిన పుస్తకములు పైచెప్పిన సంస్థలే కొనవలెను. భాండాగారి వేతనము భాండాగారము లోని పుస్తకము లుపయోగించు వారే భరించవలెను. ఈ భాండాగారి వారమున కొకమారైనను విద్యాలయములు లేని గ్రామములకు బండ్లమీద పుస్తకములు కొనిపోయి ఇయ్యవలెను. సమీపముననున్న గ్రామస్థులకు వారికి దగ్గరగనున్న భాండాగారములోని గ్రంథము లుపయోగించు కొనుటకు హక్కులనియ్యవలెను.

4. ప్రారంభవిద్య నేర్పునపుడు బీదలకు వారి వృత్తులకు, సంపాదనకు ఉపయుక్తమగు విద్యను కూడ నేర్పించవలెను.

5. రాత్రులందు పాటకపు జనమునకు చదువు చెప్పు ఏర్పాట్లు చేయవలెను. దీనికిగాను వేరే ఖర్చు అవసరము లేకుండ గ్రామములలోనున్న ఉపాధ్యాయులను, విద్యావంతులను, పండితులను, గౌరవార్థముగా పనిచేయునటుల నియమించవలెను.

6. ప్రతిభాండాగారము నందును దినపత్రిక లుండవలెను. చదువురానివారికి భాండాగారి వార్తలు చదివి వినిపించుచుండవలెను. గ్రంథా

లయోద్యమమును గురించి వారికి బోధచేసి వారికి విద్యయం దాసక్తి పుట్టించవలెను.

7. దినపత్రికలను, పురాణేతిహాస భారత, భాగవత, రామాయణాది సద్గ్రంథములను పతివ్రతా చరిత్రలను వారమున కొకసారియైనను స్త్రీలకు వారిండ్లకు బంపుచుండవలెను. వీనిని కుటుంబములో నొకస్త్రీ చదివినయెడల మిగిలినవారందరును, ముఖ్యముగా బిడ్డలును జ్ఞానవంతు లగుదురు.

8. పైనిచెప్పిన సంస్థలేగాక ధనవంతులు ద్రవ్యసహాయముచేసి జనసామాన్యము విద్యాభివృద్ధికి తోడ్పడవలెను.

ఇట్లేగాక పైనిచెప్పినటుల పాశ్చాత్యదేశములలో నీ యుద్యమమును ఎట్లు వ్యాపింపజేయుచున్నారో అట్లనే మన దేశమునందు కూడా చేసిన గ్రంథాలయోద్యమము విషయమున మన దేశముకూడ ఇతరదేశములతో సరియైన స్థానము నలంకరింపగలదు.

గ్రంథాలయోద్యమమును మన దేశమున ప్రచారము చేయుటకు శ్రీ అయ్యంకి వేంకటరమణయ్యగారును మద్రాసు గ్రంథాలయ సంఘము వారును (Madras Library Association) చాల మట్టుకు కృషిచేసిన సంగతి అందరికి తెలిసినదే. మానవసేవకై పాటుపడుచున్న వీరికి పరమేశ్వరుడు ఆయురారోగ్య భాగ్యములిచ్చి రక్షించుగాక.



# గ్రంథాలయములు

శ్రీ కాకాని నరసింహారావు

స్త్రీలకు నునికిపట్టు గుణశీలమహత్త్వము కాటపట్టు; వి
ద్యాలలితానురాగ సుపథమ్ములఁ జేర్పగ నాదిమెట్టు; వి
ద్యాలయతోడఁబుట్టు; సుగుణాళి వెలింగెడి పూలచెట్టు; గ్రం
థాలయ మిట్టి దట్టిదని యాఖ్యల కే వచియింప నేటికో. 1

పొత్తము లెల్లవిల్చి జనముల్ పఠియింపగ లేరు గాన న
త్యుత్తమమైన గ్రంథముల నొక్కెడఁ జేరిచి యెల్లవారికిన్
విత్తము లేకొసంగుటను విద్య వివేకము నైకమత్యముం
జిత్తమునందు పాదుకొను చింతలడంగును సౌఖ్యమబ్బెడున్. 2

వినయ మొసంగువిద్య యని వేత్తలు చెప్పిన; పద్యపుష్పమున్
మననము సేయఁ దానఁగల మంచి మెరుంగగనౌను; విద్య దు
ర్జనులు హరింపఁజాలని యచంచలమైన ధనమ్ము; విద్యయే
కనుగవ; యద్ది రానియెడఁ గన్నులు లేని కబోదియే యగున్. 3

# గ్రంథాలయముల యావశ్యకత

శ్రీ వెలిదండ శ్రీనివాసరావు

గ్రంథాలయముల యావశ్యకతను తెలుసుకొనుటకు ముందు అందలి గ్రంథములను గురించి తెలుసుకొనవలసిన యావశ్యకత కలుగుచున్నది.

మొట్టమొదట ఆంధ్రదేశ గ్రంథ భాండాగార ప్రతినిధుల సభ శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులవారి యాధిపత్యమున 1914 వ సం॥ రం॥ ఏప్రిలు 10 వ తేదీని బెజవాడ యందు జరిగినప్పుడు, బరంపురం ఆంధ్రభాషాభివర్ధనీసమాజము తరఫున నేను ప్రతినిధిగా వెళ్లి, గ్రంథాలయోద్యమమునుగూర్చి ముఖ్యముగా, రెండు సూచనలు చేయుట తటస్థించినది. అందు మొదటిది అప్పటివరకు ప్రచురింపబడిన ఆంధ్ర గ్రంథములను అన్నిటిని తెలుసుకొని, వాటిలోని విషయములను బట్టి విభజింపబడిన గ్రంథ పట్టికను తయారు చేయవలసినది. రెండవది అప్పటికి ఆంధ్రదేశములోనున్న అన్ని గ్రంథాలయముల యొక్క పరిపాలనాది స్థితిగతులను వివరముగ తెలుసుకొనవలసినది. "మీ వీపు మీద తేలుఉన్నది'' అంటే, "మీరే తీసి పెడుదురూ'' అన్నట్లు, ఆ రెండు పనులను నిర్వహించు బాధ్యతను ఆ సభాకార్యనిర్వాహకులు నా మీదనే పెట్టిరి. అందుకుగాను కావలసిన ఆంధ్రగ్రంథముల పట్టికలను పెక్కింటిని నాకు సమకూర్చుటయందును, గ్రంథాలయ స్థితి గతులను తెలుసుకొనుటకు నే నేర్పరచిన నమూనాఫారమును అచ్చొత్తించి, ఆయా గ్రంథాలయములకుబంపి, పూర్తి వివరములను తెప్పించుటయందును, సభాకార్యదర్శిగారగు శ్రీ వేంకటరమణయ్యగారు నాకు మిగుల తోడ్పడిరి.

ఆంధ్ర గ్రంథవిక్రయాధికారుల వద్ద నుండియు, వివిధ గ్రంథాలయాధికారుల వద్ద నుండియు, అనేక పట్టికలను తెప్పించియు, గవర్నమెంటు ఆఫీసులలో అనేక సంవత్సరములుగనున్న ఫోర్టు సెంటుజార్జి గజెటులలో ప్రచురింపబడిన ఆంధ్ర గ్రంథపట్టికలను సేకరించియు, అనేక చోట్ల గల అనేక గ్రంథములను స్వయముగా పరిశీలించియు, సుమారు అయిదువేల గ్రంథనామములను సంపాదించి, వాటిలోని విషయములనుబట్టి గ్రంథములను విభజింపబూనుకొని మహారాష్ట్రగ్రంథములను విభజించిన మహాదేవ గోవిందరానడే గారియొక్కయు, ఆంగ్లేయ గ్రంథములను విభజించిన ఎడ్వర్డుదొరగారియొక్కయు పద్ధతులను కొన్ని మార్పులతో అనుసరించి, 16 ఆంధ్ర వర్గముల క్రిందను, 10 ఆంగ్లేయ వర్గముల క్రిందను, గ్రంథములనన్నిటిని విభజించి "ఆంధ్ర గ్రంథనామచంద్రిక'' యను పేర నొక పొత్తమును తయారుచేసి ఆంధ్రదేశ గ్రంథ భాండాగారాధికారులకు సమర్పించితిని. దానిని వారు 1918 సంవత్సరమున విశాఖపట్టణమున జరిగిన గ్రంథాలయ ప్రదర్శనమున ప్రదర్శించిరి. కీర్తిశేషులైన గిడుగు రామమూర్తి పంతుల వారా పొత్తమును జూచి, సంతసించి, మిగుల ప్రోత్సహించిరి. తదనంతరము, ఆంధ్రదేశ గ్రంథ భాండాగారసంఘాధికారులు, "అంతవరకు చేసిన పనిని ఇంకను ఎక్కువ సమర్థతతో నిర్వహించు

ట్టికై, దేశోద్ధారక శ్రీ కాశీనాథుని నాగేశ్వర రావుపంతులవారు పూనుకొనినందున'' వారికా పని యొప్పగించిరి. శ్రీ పంతులవారు 1929 లో ప్రచురించిన "ఆంధ్ర వాఙ్మయ సూచిక" యను 450 పేజీలు గల యుద్గ్రంథ ప్రకటనమును ప్రోత్సహించిన తొలి ప్రయత్నమదే. దీనిని బట్టి ఆంధ్రమున గల గ్రంథములను వాటిలోని విషయముల స్వభావమును కొంత వఱకు తెలిసికొన నగును. ఆ విషయములను తెలుసుకొన వలసిన యావశ్యకతను గూర్చి చర్చింతము.

జ్ఞానము పొందుట యనగా మనుజుడు నిజముగా తనయందు మరుగు బడియున్న జ్ఞానమును వ్యక్తీకరించుటయే; విద్యయనుపేర మనము ఉపయోగించు గ్రంథపఠనము మనలో మరుగు పడియున్న ఆ గ్రంథములోని విషయ సంబంధమైనజ్ఞానమును పైకిలాగుచున్నది. అటుల లాగ బడినప్పుడే మనము గ్రంథపఠనము వలన సంపాదించిన జ్ఞానము మనది అనబడుచున్నది. దీనినే 'గ్రహించుట' అనుచున్నాము. అటుల లాగ బడనంతవరకు ఆ విద్య మనది గాకయుండి మనకు ప్రయోజనకారి కాజాల కుండును. "All Knowledge is only Remembering" గ్రంథపఠనము వలన మనకు ఒకానొక విషయమును గూర్చి జ్ఞానము కలుగు చున్నదనగా ఆ విషయము మనకు నీ వరకే తెలిసియుండి మరుగుపడి తిరిగి జ్ఞాపకమునకు వచ్చుటయే కాని మనలో యీ వరకులేని క్రొత్త విషయమును బయట నుండి చొప్పించుట కాదు. ఈ సంగతి బృహదారణ్యకోపనిషత్తులో మైత్రేయీయాజ్ఞవల్క్య సంవాదమునందు విపులముగా చర్చించ బడినది. జాగ్రత్తగా పరిశీలించినచో ఈ అనుభవమును ఎవరికివారు గుర్తించు కొనగలరు. 'విద్య' అను అర్థమిచ్చు "E-ducation" అను ఆంగ్లేయ పదము "బయటికి లాగుట" అను అర్థమిచ్చు ధాతువు నుండి పుట్టినదే. ఈరహస్యమును బాగుగా గుర్తించిన యెడల బడులలో పిల్లలకు నేర్పబడు విద్యను ఆనందదాయకముగా చేయవచ్చును. ఏలననగా తనలోనున్న జ్ఞానము బయటికి వచ్చునపుడు ఒకవిధమైన ఆనందము కలుగును.

మన కందరకు సంబంధించిన మానవ సంఘ క్షేమాభివృద్ధికి జ్ఞానము అవసరమనియు, అట్టి జ్ఞానము వ్యక్తమగుటకు జ్ఞానబోధకములగు గ్రంథ పఠన మావశ్యకమనియు తెలుసుకొన్నతరువాత అట్టి గ్రంథసముదాయమును సమకూర్చు ఆలయములు అవసరమని వేరుగ చెప్పనక్కర లేదు. బడులలో జ్ఞాన బోధక ములగు గ్రంథపఠనమునకు అవకాశముండగా తిరిగి గ్రంథాలయముల అవసరమేమని కొందరడుగ వచ్చును. జ్ఞాన సంపాదనకు తృష్ణను కలిగించుటయే బడుల ఆశయముగా నుండవలెను. ఆతృష్ణను తీర్చుకొనుటకు గ్రంథాలయములు అవసరము. ముఖ్యముగా చదువను, వ్రాయను అర్థము చేసికొనగలుగుటను నేర్పుటకే బడులు ఉపయోగింపబడవలెను. తరువాత బడుల ఆవశ్యకత అంతగానుండ కూడదు. అందువలననే ఈ మధ్య భారతదేశ ప్రకృతి శాస్త్రవేత్తయగు ఆచార్య ప్రఫుల్లచంద్రరే మహాశయుడు "అన్ని విషయములను గూర్చిన గ్రంథములు విరివిగా ప్రచురింప బడుచున్న ఈ రోజులలో 'కాలేజీల' యావశ్యకత అంతగా లేదు" అని చెప్పియుండెను. బడులలో చదువుకొనుటకు అవకాశము కలిగియుండని స్త్రీపురుషులు గ్రంథాలయములలోని గ్రంథములను ఇతరులు చదివి

వినిపింపగా లేక చెప్పగా తామువిని తమలోనున్న జ్ఞానదీపమును వెలిగించు కొనగలరు. కావున ఈ కాలములో గ్రంథాలయముల ఉపయోగము సంఘక్షేమాభివృద్ధికి చాల సహకారియని స్పష్టపడు చున్నది. ఐనను ఈ ఉద్యమము వ్యాపింప కుండుటకు నిజమైన కారణము అభిమానము గల ప్రభుత్వము లేకుండుటయే; అట్టి స్థితిలో ప్రజలెంత ప్రయత్నించినను ప్రయోజనకారి గాకున్నది. "ప్రజల సర్వతో ముఖాభివృద్ధి సాధనశక్తి ప్రభుత్వము నందే ఏదేశము నందైనను కేంద్రీకరింపబడియుండును." అనుసత్యమును బాగుగా గ్రహించినగాని గత్యంతరము లేదు.

△

# గ్రంథాలయములు - వాని ధర్మములు

శ్రీ శేషాద్రి రమణ కవులు

ప్రకృతము భాషాభిమానులు గ్రంథాలయోద్యమమును విరివిగ వ్యాప్తినొందించుచున్నారు. ప్రయోజనవిద్య, ప్రపంచజ్ఞానము, పత్రికా వ్యాపకము, గ్రామ పునర్నిర్మాణము మున్నగు జనాభివృద్ధికర ప్రయత్నములన్నియు గ్రంథాలయముల వలననె జరుగుచున్నవి. కవులకు గ్రంథాలయములు చేయూత నొసంగుచున్నవి. ఇన్నిలాభములు సమకూర్చునవి గ్రంథాలయములె; గ్రంథాలయవిధులు విద్యాధికులచే గ్రంథరూపముననను పత్రికలయందును బ్రచురింపబడినవి. వానిని నడిపించుటకు మహారాజశ్రీ అయ్యంకి వేంకట రమణయ్యగారు మిగుల కృషిచేసియున్నారు. పలువురు విద్యాధికులు కేలూత యొసంగుచున్నారు. నిజాంరాష్ట్రమున గ్రంథాలయోద్యమము దాదాపుగ ముప్పది సంవత్సరముల పై కాలమునుండి నడుచుచున్నది. అచ్చటి గ్రంథాలయోద్యమమునకు ఆంధ్ర సభలుగూడ దోహద మొసంగుచున్నవి. కాని గ్రంథాలయోద్యమమునకు రాజకీయములకు సంబంధముండునేమోయని దొరతనము వారు అనుమానించుటచే విద్యాధికులగు ఉద్యోగస్థులు అభిమానము చూపజాలకున్నారు. ఇది యెంతయు శోచనీయమగు నంశము.

కుబేర పుష్పకమునందు ఎందరెక్కినను మఱికొందఱకు స్థానముండునట! అటులే గ్రంథాలయోద్యమమునందుగూడ మఱికొన్ని ఆచరణీయాంశములు గలవు. సర్వాంకషముగ భాషాసేవ యొనర్పవలయుననినచో నింకను గ్రంథాలయములు కొంతసేవ చేయవలసి యున్నది. "చెప్పుట సులభముగాని చేయుట కష్టము" అన్నట్లు చెప్పుట కెన్నియైన చెప్పవచ్చును. అది యెంతవఱకు సాధ్యమో యను నంశము గ్రంథాలయ సేవకులగు విద్యాధికులపై నాధారపడి యున్నది. ముందు మేము సూచింపబోవు గ్రంథాలయ కర్తవ్యములు విద్యాధికులు సాదరభావముతో నాలోచింప గోరెదము.

### స్థానిక చరిత్రములు

ప్రతి గ్రంథాలయమునందును తమతమగ్రామ చరిత్రములు వ్రాయించి యుంచవలయును. స్థానిక చరిత్రములవలన నెంతయేని ప్రయో

జనము గలదు. గ్రామము యొక్క ప్రాచీన నామములు ఆ గ్రామమును పరిపాలించిన ప్రముఖులు, వీరులు, కవులు, పండితులు, అమానుష కార్యముల నొనరించిన మహాత్ములు, సహగమనాదులు నొనర్చి అర్చారూపమున నున్న వీరకాంతలు మొదలగు పవిత్ర వ్యక్తుల కథలు, వాచారూపమున చెప్పుకొను పౌరులు గ్రామమునందు పలువురుందురు. వీరందరు చెప్పుచుండు కథలలో చరిత్రాంశము లమూల్యమైనవి యుండును. కావున గ్రంథాలయాధికారులు వీనిని ఉపేక్షాదృష్టితో జూడక యెప్పుడు వినిన అంశములు అప్పుడు పదిలపరుప వలెను. ఇట్టివి చరిత్రమునకు అమూల్యమగు సహాయము చేయును. అందు గొంతకల్పనమున్నను ముఖ్యాంశములు మాత్రము సత్యములై యుండును. వరంగల్లులో సీతారామాంజనేయ నిర్మాతయగు పరశురామపంతుల లింగమూర్తిగారిని గురించి చిత్రకథలు చెప్పుదురు. కంభముమెట్టులో దుర్గనిర్మాణమును గూర్చియు నచటి పాలకులను గూర్చియు వింతవింత కథలు చెప్పువారనేకులు గలరు. ఇవన్నియు గ్రంథస్థముగాని విలువగల విషయములు. ఇట్లే గద్వాల, వనపర్తి, అమరచింత, పిఠాపురము, వేంకటగిరి; కాళహస్తి మున్నగు సంస్థానములలో విలువగల స్థానిక చరిత్రము ప్రజాముఖమున గలదు. భట్టిప్రోలు, అల్లూరు, నాగార్జునకొండ, అమరావతి, నేలకొండపల్లి, గంగాపురము, ఘంటసాల మొదలగుచోట్ల బౌద్ధచిహ్నములు విరివిగ గలవు. వానినిగూర్చి అద్భుతకథలు అచటిప్రజలు చెప్పుకొనుచున్నారు. ఓరుగల్లు, కొండవీడు, వర్ధమానపురము, పూడూరు, కొలనుపాక, అల్లాదుర్గము, జోగిపేట, ధర్మపురి, వేములవాడ, కొరవి, పాలకుర్తి, ఉజ్జయిని, కొలచెలమ లోనగు నిజాము రాష్ట్రమందలి చరిత్రస్థలములలో చరిత్రముల కందని స్థానికచరిత్రము మాకు పరిశోధనకాలమున లభించినది. వీని నివేదికలు సంగ్రహరూపముగ ప్రచురింపబడియే యున్నవి. గ్రామచరిత్రములు సేకరింప నారంభించినచో ప్రతి గ్రంథాలయము భాషకెంతయేని సహాయము చేయగలదు. ఇపుడు స్థానికచరిత్రలు సేకరించు కృషి చేయకున్నచో ముందటితరము వారికి మనము చరిత్రవిషయమున ద్రోహముచేసిన వారలమగుదుము. ముఖ్యముగ గ్రామమునందలి ప్రముఖుల వంశచరిత్రములు పాడుపడిన గ్రామముల వృత్తాంతములు కూలిపోయిన కోటలు, గోడలు, ఆలయములు, విగ్రహములు మొదలగువాని సంపూర్ణవివరణములు గ్రంథరూపమున నుంచినచో వానిని సంస్కరించి యొకయాకృతి తేవలసినపని చరిత్రకారులది. పరిశోధకుడు తను గ్రామమునకు జేరినంతనే గ్రంథాలయాధికారులు స్థానిక చరిత్రము చూపినచో దనపని తాను ముగించుకొనగలడు.

### భూగర్భశోధనము

కొన్ని గ్రామములలో పాటిపెరళ్ళు విశేషముగ నుండి ప్రాచీన వస్తువులు లభించుచుండును. పూర్వులు నిక్షేపించిన ప్రాచీనములగు నాణెములు, రాగిశాసనములు గల పాత్రములు గాజుపూసలు లభించుటగలదు. తావుల అనార్యుల సమాధులగు రాకాసిగుండ్లు వందలకొలదిగ గానవచ్చును. కర్షకులు ఈ సమాధులను వ్యవసాయమునకై త్రవ్వినపుడు బహువిధములగు మృత్పాత్రములు, ఆయుధములు, శవపేటికలు, ధాతుఘటములు తఱచుగ లభించుచున్నవి. ఉపేక్షా దృష్టితో వీనిని పారవేయుట

మననెఱుఁగుదుము. నాణెములను కరిగించి రూపు మాపుచున్నాము. సత్తునాణెములు, రాగినాణెములు బిందెల కొలది లభించుటయు, వృథాగా వానిని పాడొనరించుటయు మన కనులముందు జరుగుచున్నది. తామ్రశాసనములు చరిత్రమునకు పరమప్రమాణములు. స్వల్ప లాభమునకు లోనై యీ తామ్రఫలకములను పాత్రములు చేయించుటకు వెనుదీయని వారు కూడ మనలో గలరు. గ్రంథాలయవిధులలో నీపరికరములను గాపాడుటయు, వలయుచో గొంత ధనమొసంగియేని పదిలపఱచుటయు ముఖ్యము; జనసామాన్యమునకు వీని విలువగూర్చి తఱచుగ బోధించుచు వచ్చినచో వీనిని దుర్వినియోగము చేయుట తప్పును. ఈపని గ్రంథాలయమువంటి ప్రజాసంస్థయే నిర్వహింపతగినది. వలయుచో ప్రతిఫలమొసంగియేని ప్రాచీనపరికరములను కాపాడుట గ్రంథాలయమునకు విధి.

### తాళపత్రగ్రంథములు

గ్రంథాలయములలోఁ దమయూరియందునఁ, బరిసర గ్రామములందును గల తాళపత్ర గ్రంథములను సేకరించి భద్రపఱుపవలయును. అముద్రిత గ్రంథములకు ప్రత్యంతరముల వ్రాయింపవలయును. గ్రంథస్వాములు తమకడగల లిఖిత గ్రంథముల నిచ్చుటకు అనుమతింపనిచో పట్టికయైన సిద్ధముచేసి గ్రంథాలయమందు నుంచి వార్షిక నివేదికలలో నాయంశము సూచింపవలయును. తాటాకుపుస్తకములను దాదాపు ఏబది సంవత్సరములనుండి ఉపేక్షా దృష్టితో జనులు చూచుచున్నారు. ఈతరము దాటినచో మందునకైన తాళపత్రగ్రంథము లభింపదు. ఎన్నియో గ్రంథములు ముద్రితములైనను నవి నిర్దుష్టముగ లేవు. కవి భావసిద్ధమగు పాఠమును నిర్ణయింపవలయుననిన తాళపత్ర గ్రంథములే శరణ్యములు. నన్నెచోడుని కుమారసంభవము, నాచనసోముని హరివంశము, శ్రీనాథుని శివరాత్రిమాహాత్మ్యము, మడికి సింగన సకలనీతిసమ్మతము మొదలగు గ్రంథరాజములకు ప్రత్యంతరములు లభింపవలసియున్నది. భాస్కర రామాయణమునందు ముద్రితగ్రంథమునకు, తాళపత్ర గ్రంథమునకు బొత్తు కుదురుట లేదు. సరియైన పాఠము నిర్ణయించుటకు తాళపత్ర గ్రంథ సహాయము ముఖ్యము. అథర్వణాచార్యుని భారతము, ఎఱ్ఱాప్రెగడ రామాయణము, అమరేశ్వరుని విక్రమసేనము, త్రిపురాంతకుని మదనవిజయము లోనగు గ్రంథరాజములు యే నాటికైన తాళపత్రగ్రంథముల నుండియే బయలు వెడల వలసియున్నవి; కావున తాళపత్ర గ్రంథములకు గ్రంథాలయములు కృషి చేయవలసియున్నది. స్థానికులగు ప్రాచీనకవులు వ్రాసిన గ్రంథములు లభించినచో గ్రంథాలయమున భద్రపఱుపవలయును. ఇంతయేల ! ముద్రణ గ్రంథమునకు మాతృకలును, యక్షగానములును, శతకములును, దండకములును గ్రంథాలయములు సంరక్షింపవలసియున్నది. గ్రామస్థులగు రసికులు గ్రంథస్థములుగాని చాటుపద్యములు ఎన్నియో నేర్చియుందురు. చరిత్రమునకు సంబంధము కూడ ఆ చాటువుల కుండును. వానిని నుపేక్షింపక గ్రంథాలయములు పదిలపఱచినచో వాఙ్మయమునకెంతయేని సహాయము కాగలవు. ఆధునికులగు కవుల గ్రంథములు పెక్కులు మఱుగుపడుచున్నవి. వారి వాఙ్మయ కృషి యంతయు జీర్ణ గ్రంథములలో జీకిపోవుచున్నది. ముఖ్యముగ స్థానికులు ఇట్టి కవుల జీవితము, వాఙ్మయ సేవ, గ్రంథసముదాయము భావి పరిశోధకులకై

జాగ్రత్త పడవలయును. లేకున్నచో భవిష్యత్సంతతికి భాషావిషయమున నెంతయేని కొఱత వాటిల్లగలదు.

### గేయవాఙ్మయము - జాతీయగీతములు

గ్రామములందు తరుచుగా గేయ వాఙ్మయమునకుఁ బ్రోత్సాహము ఎక్కువగనుండును. గ్రామవాసులు: తోలుబొమ్మలాటలు, వీరకథలు, పురాణకథలు వినుట కుత్సాహము కలిగియుందురు. సాతానులు, జంగములు, బైనీడివారు, పంబలవాండ్రు, గొల్లలు, బుడిగి జంగములు గేయవాఙ్మయము ముఖస్థము గావించి పాడి ప్రజాసామాన్యమునకు విజ్ఞాన భిక్ష పెట్టుచున్నారు. ఈ గేయవాఙ్మయము వృద్ధులకడ విశేషించియుండును. కొంతవరకు గ్రంథస్థమై కూడ నుండును. "యాదవులపురాణములు ఎద్దు బరువు" అని వాడుక కలదు. యాదవులకడ ఈ వాఙ్మయము సమగ్రముగ లభించును. విద్యాధికులు వీనిని పరిహాసింపక చిక్కినంతవఱకు గ్రంథస్థము గావింపవలయును. కోతలయందు, దంపుళ్ళయందు, నాటులందు, విసరుటయందు నిమ్నజాతులు మధురగేయములు పాడుట వినుచున్నాము. ఇప్పటి నాగరికులు అంతగ నభినందింపకపోయినను వృద్ధులు, అనాగరకులు వానిని ఆదరించుచున్నారు. బువ్వము బంతులపాటలు, వదునపాటలు, సవతుల గొబ్బాటపాటలు, తలుపు దగ్గరపాటలు, పురాణకథాగేయములు, వయసు దాటిన బ్రాహ్మణకాంతలు పాడుచుందురు. నవనాగరికులు వాని విలువ తెలియక పరిహాసించుచుందురు. విద్యాధికులు వారల ప్రోత్సహించి గేయములను చాలవఱకు గ్రంథస్థము గావింపనిచో పాశ్చాత్య నాగరికతచే తెనుగు మఱచుచున్న మనజాతికి ముందు ముందు ఇట్టి వాఙ్మయమే కరవైపోవును. ఇతర దేశస్థులు ఇట్టి గేయవాఙ్మయమును ఎంతయో గౌరవముగ జూచుచున్నారు. మనము దీనిని జారవిడుచుచున్నాము. ముఖ్యముగ గ్రంథాలయ వార్షికోత్సవములందు వీనికి స్థానమొసంగి ఇట్టి పాటలు పాడువారిని ఆదరించి, సన్మానించినచో జాతీయవాఙ్మయమునకు దోహదమిచ్చినవార మగుదుము. నైజాము రాష్ట్రమందు ఇట్టి వాఙ్మయము ఎంతయో గలదు. సర్వాయిపాపఁడు ఇచ్చటి వీరుఁడు. సదాశివరెడ్డి యిచటి వీరుఁడు చితాపుఖాను ఇచటి ప్రతికాపు. సోమనాద్రిరెడ్డి యిచటి ప్రభువు. బాలనాగమ్మ యిచటి యాఁడబడుచు. వీరల గూర్చిన జాతీయకథలు చెప్పువారు ఇంక కొనయూపిరితో నున్నారు. ప్రజాముఖస్థమగు ఇట్టి ఉత్సాహకరమగు జాతీయవాఙ్మయమును నిలువబెట్టవలసిన బాధ్యత గ్రంథాలయములపైననే కలదు. ఎంత త్వరగ యత్నించిన భాష కంత లాభము సమకూరగలదు.

### శిలాశాసనములు - స్థూపములు

ప్రజాసామాన్యము శిలాశాసనములపై నుపేక్షా దృష్టి ప్రసరించుచున్నది. దొరతనము వారి పరిశోధకులు దప్ప నీ శిలాశాసనముల కన్నెత్తి చూచువారు కూడ లేరు. పెక్కు శాసనములు రూపుమాపబడినవి. పెక్కు పునాదులలో జేరినవి. ఈ అజ్ఞాతవాఙ్మయముతో మనకేమి పని యని పలువురు పలుతావులలో శాసనములను దుర్వినియోగపఱచియున్నారు. ఒక్క హనుమకొండలో కృషిచేయుటవలన నిట్టి శాసనశిలలు ఇరువది ముప్పది వఱకు చెరువులలోను, పాడుగోడల మధ్యను, పెరళ్ళలోను, గడపలందును కనిపెట్టగలిగితిమి. కొన్నిటిని హనుమకొండలోని 'రాజరాజనరేంద్రాంధ్ర భాషానిలయమున' భద్రపరుప

గలిగితిమి. విధివైపరీత్యముచే మిగిలిన శాసన శిలలను ఉద్ధరింప వీలులేకపోయినది. లేకున్నచో నెంతపనియైన జరిగెడిది. స్థానిక గ్రంథాలయములు దిక్కులేని శాసనశిలలను సంగతుగార్థస్థా గ్రంథాలయములలో చేర్చి కాపాడవలెను. ఇంతియేగాక గ్రామమున దిక్కు మొక్కు లేక పడియున్న విగ్రహములు, విగ్రహశకలములు గ్రంథాలయమున సురక్షితముగా నుంపవలయును. కృష్ణామండలమందలి సిద్ధాంతాగ్రహార మను గ్రామమున నొక పెరడు త్రవ్వుచుండ బౌద్ధస్తూప చిహ్నములు మాకు గోచరించినవి. ప్రాచీన బౌద్ధశిల్పములతో గూడిన చలువరాళ్ళు కొన్ని కనబడినవి. భూస్వాముల యనాదర దృష్టిచే మేమిందు పల్గొను వీలులేకపోయినది. ఇటులే పలుతావుల బౌద్ధచిహ్నములు గోచరించినవి. పెక్కు జైనవిగ్రహములు జోగిపేటలోని యొక జైనాలయమున గలవు. ఈ విగ్రహముల క్రింద చారిత్రకాంశములతో వివరణములు కూడ గలవు. అంతియేగాక కొన్ని బౌద్ధవిగ్రహములు గూడ జైన విగ్రహ సముదాయమందు మరుగు పడి యున్నవి. ఇట్టిదృశ్యములు నిజాంరాష్ట్రమున పెక్కు తావులందు గలవు. పరిశోధకుడు అన్ని తావులందు స్వయముగ దిరుగవలయుననినచో జాలకష్టము. కావున నిట్టి అమూల్యసాధనములను గ్రంథాలయ సాహచర్యమున వారి దృక్పథ మునందు పెట్టినచో నెంతయో మేలుజరుగగలదు. ఓరుగల్లులో చాళుక్యభీముని నాటి "అమోఘ వర్షపృథ్వీవల్లభదేవుని శాసన" మొకటి కలదని చరిత్ర గ్రంథములందు చూచితిమి. కాకతీయుల ప్రాచీన చరిత్ర తెలుపు రెండవ బేతరాజు శాసనము వరంగల్లులో గలదని వింటిమి. ఈ రెండవ శాసనమును మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకాలయమున శాసన సంపుటమునందు జదివితిమి. ఈ శాసన స్థానము కొరకు ఓరుగల్లులోనున్న పది సంవత్సరములు కట్టిన గడప యంతయు గాలించితిమి. ఆ శాసనము లేమైనవో యని నిరాశ చేసికొంటిమి. పిదప ఒక మహమ్మదీయ మహాత్ముని సమాధిమందిరమున విస్మృత రూపములో నీ శాసనశిలలు ఆకస్మికముగ, సప్రయత్నముగ గోచరించినవి. ఈ శిలల మూలమున అమూల్య చరిత్రాంశములు గ్రహింప గలిగితిమి. ఇట్లే పలుతావుల శాసనశిలలు స్థానాంతరమున చేర్పబడియుండును. మన చరిత్రముతో సంబంధించిన ఈ శిలలు శోధించి పట్టిక తయారుచేయు భారము, శాసనపాఠములు జనసామాన్యమున కందుబాటులో నుంచవలసిన భారము, గ్రంథాలయముల పైననే గలదు.

---

## వాషింగ్టన్ గ్రంథాలయము

అమెరికాలోని వాషింగ్టన్ నగరము నందలి కాంగ్రెసు గ్రంథాలయమున గ్రంథములును, వ్రాత ప్రతులును, కరపత్రములును, బైండుచేసిన వార్తాపత్రికా సంపుటములును, ఛాయాపటములును, ఫోనోగ్రాఫు రికార్డులును, ఫిలింలును, ఇతరములును వెరసి దాదాపు 28 మిలియన్లు, అనగా రెండు కోట్ల యెనుబది లక్షలు కలవు. గ్రంథాలయమునందు పనిచేయు నుద్యోగుల సంఖ్య 1900.

# అక్షరత్వప్రచారమా ? విజ్ఞాన ప్రచారమా ? ఏది కావలసినది?

శ్రీ మోటూరి సత్యనారాయణ

బడికి వెళ్ళితేనేకాని చదువు రాదనే యభిప్రాయం ఇప్పుడు ప్రబలిపోయింది. క్రమంగా సంవత్సరాల తరబడి పాఠశాల, కళాశాలలలో చదువుకున్నవాడే చదువరి. తదితరులు అజ్ఞానులు అనే అభిప్రాయంకూడా సర్వసాధారణముగా కనబడుతూంది. అందువల్లనే దేశములో ప్రస్తుతము పాఠశాలలకు, కళాశాలలకు, విశ్వవిద్యాలయాలికి ప్రాముఖ్యము హెచ్చింది. ప్రజాసామాన్యానికి బళ్ళ చదువులో నున్న వ్యామోహామువల్లను, సకృత్తుగా అపుడపుడు దానివల్ల లభించే లాభమువల్లను, పాఠశాలల, కళాశాలల చదువుకు ప్రాముఖ్యముమీద పడడమేకాకుండా మానశక్తులన్ని పాఠశాల, కళాశాలలలోనే ఉపయోగపడుతూ, బయట మనం చేయగలిగినది, చేసినదీ విద్యాప్రచారం శూన్యమైపోయిందనే చెప్పవచ్చును. దీనికి కారణాలు పాశ్చాత్య భాషలో విద్యావిధానం, పాశ్చాత్య ప్రభుత్వ ప్రభావం. మన ప్రతిభను, మన అవసరాలను తెలుసుకోనంతకాలం మనస్థితి యింతే. మన కాళ్ళమీద మనం నిలబడి పని చేయడానికి ప్రయత్నం చేయకుండా ఇతరుల ననుకరించుతున్నంతకాలం మనస్థితిగతులు అభివృద్ధి పొందవు. విజ్ఞానానికి కావలసిన విత్తనాలు, మన భూమిమీదను మనం చల్లుకొని వాటి ఫలితాన్ని పొందడానికి మనం కృషి చేయనంతకాలం మన కౌన్నత్యం లేదు.

విద్యయొక్క స్వరూపాన్నిగురించి యొక విద్యాశాస్త్రవేత్త యిలా అన్నాడు. "మనుష్యుడు స్వతస్సిద్ధంగా బద్ధుడు. అజ్ఞాని. దుర్వికారాల్లో చిక్కుకున్నవాడు. క్లిష్టపరిస్థితులలో పట్టుపడినవాడు. అతనిఆత్మ అణిగిపోయింది. వికాసంపొందడాని కతని కవకాశం లేదు. ఈ బంధనాలనుంచి అతనిని విడిపించేదే సరియైన విజ్ఞానం. రోగాన్నుంచి దౌర్బల్యాన్నుంచి శరీరాన్ని కాపాడేదే, బుద్ధిని దురాలోచనలనుంచి తప్పించేదే శరీరావయవాల్ని మాంద్యములో పడకుండా కాపాడేదే. పేరాశ, భయం, నీచమైన స్వార్థం, మొదలయిన వాటినుంచి, మనుష్యునికి ముక్తి కలిగించేదే సరియైన విజ్ఞానం. హృదయాన్ని కఠోరత్వాన్నుంచి మొండి పట్టుదలనుంచి విజ్ఞానమే కాపాడాలి. మనుష్యుల్ని మనుష్యసంఘాన్ని ప్రాకృతిక, సాంఘిక, ఆర్థిక, రాజకీయ, బౌద్ధిక దాస్యాన్నుంచి రక్షించేదే విజ్ఞానం. మనస్సుని భోగవిలాసాల్లోనుంచి పరిశుద్ధరసాస్వాదనవైపుకు తిప్పేది, శక్తిని మందంగా మారకుండా చేసేది, మనుష్యు నహంకారిగా గాకుండా కాపాడేదే సరియైన విజ్ఞానం" అనగా మనుష్యుని ఆధిభౌతిక ఆధ్యాత్మిక ప్రపంచకంలో ఉత్కృష్టునిగా చేయగలిగిందే విజ్ఞానమన్నమాట. ఈ విజ్ఞానాన్ని సంపాదించడానికి మన మిప్పుడేమి చేస్తున్నాము, ఏంచేయాలన్నా మనచేత నేమీ కాకుండా యుంది. మనచేతిలో శక్తి లేదు. శరీరంలో ఉత్సాహములేదు. దృష్టిలో వికాసము లేదు. అందరు కలిసి ఏమైనా చేద్దామంటే కలిసి కట్టుతనంకూడా తక్కువ.

పరిశుద్ధమైన విజ్ఞానానికి ప్రారంభం బాలకుల్లో జరగాలా, వయస్కుల్లో జరగాలా? అది స్త్రీలలోనా, పురుషులలోనా? దానికి స్థానం స్కూళ్ళు, కాలేజీలా, విశ్వ విద్యాలయాలా? గ్రామాలా, పట్టణాలా, కోర్టులా, లేక క్లబ్బులా? గ్రంథాలయాలా లేక పఠనమందిరాలా? ప్రభుత్వమా, లేక ప్రజలా? అనేవిషయాన్నిగురించి వేరు వేరుమంది వేరు వేరభిప్రాయాల నివ్వవచ్చు. నిజమేమిటంటే పరిశుద్ధమైన ప్రయోజనకారియైన జ్ఞానం ఈ అన్ని తావులలోను ఈ అన్నిసంఘాలలోను ఉండాలి. మనుష్య సమాజముయొక్క క్రమగతమైన వికాసమే విజ్ఞానముయొక్క పరమావధి. దాని ప్రచారానికి హద్దులు లేవు. అధ ఇతులు లేవు. ఆప్రచారం నిరంతరం ఎడ తెగక పారుతూవున్న ప్రవాహంవలె, ఎక్కడా వెలితి లేని వెలుతురులాగు, విరివిగా సాగుతూ వ్యాపిస్తూ ఉండవలసినదే. దీనికి ప్రారంభమే చెప్పాలంటే అది మన బాలకులలో ప్రారంభం కావలెననీ, దానికి వయస్కులు, ముఖ్యంగా తలిదండ్రులు ఈ బాలవిజ్ఞానానికి తోడ్పడవలెనని, వివేకంతో కూడిన విజ్ఞానంకోసం వాతావరణమేర్పడడానికై నలువయిపులనుంచి ప్రయత్నాలు జరగవలెనని మన మొప్పుకు తీరాలి. సంస్కారవిహీనమైన విజ్ఞానరహితమైన కుటుంబంలో పుట్టిన కుర్రవాళ్లు పైకి రావాలంటే సంస్కారపూర్ణమయిన కుటుంబాల్లో నుండి వచ్చిన బాలకులతో పోటీకి నిలవాలంటే సాంఘిక విభేదాలు కలిగి సమరసభావం లేని మన సంఘంలో ఎంత అసంభవమో మన యనుభవమువలననే తెలుస్తుంది. దురాచారులయిన తల్లిదండ్రుల మధ్యను సంస్కార పూర్ణమయిన వాతావరణంలో సోమరులమధ్యనూ, నిర్జీవమై నిర్వీర్యులయిన సహచరులమధ్యను పుట్టి పెరిగిన బాలకుని జీవితం స్వతస్సిద్ధంగా వానిలో ఎంత ప్రతిభ యున్నను అది నిస్తేజమై, ప్రయోజనహీనమై పోతుందని తెలుసుకొనడానికి మనం ఉదాహరణాలు వెదక నక్కరలేదు. మన బాలకబృందంలోని ప్రతిభ, శక్తిసామర్థ్యాలు, చైతన్యాలు, నిష్ప్రయోజనంగా పోకుండా వుండాలంటే మనం చేయవలసిన పనులేవి? దానికి సాధన సంపత్తులేవి? అనేదే మనసమస్య.

ఏదయినా ఒకపని సాగించాలంటే ఇదంతా అయ్యేపనేనా, ప్రభుత్వసాహాయ్యం లేనిదే యిది నెరవేరుతుందా, డబ్బులేకుండా యిది సాగుతుందా, యిది చేయడానికి పదిమంది కలసి వస్తారా, అనే ప్రశ్నలే మొదట్లో బయలుదేరుతుంటాయి. ప్రభుత్వం మనదయితే ప్రజాహిత కార్యంకోసం ప్రతిమనిషి చింతించవలసిన పని లేదు. సంఘముయొక్క అన్ని అవసరాల్ని తీర్చడానికి దాని సర్వతోముఖమయిన వికాసంకోసం ప్రభుత్వం పనిచేసితీరుతుంది. రాజ్యం మనది కాదు, కాబట్టి మనపాలకులకు మన వృద్ధినిగురించి చింతలేదు కాబట్టి, చింతవున్నా అది మన ప్రాకృతికమయిన వృద్ధికి ప్రతికూలం కాబట్టి, మనకు కావలసిన విజ్ఞానంకోసం ప్రణాళికల నేర్పరుచుకొని ప్రచారం చేసుకుంటూ పైకి రావడంకంటె వేరొక గత్యంతరం మనకు లేదు.

విజ్ఞానప్రచారంకోసం చదవడం, వ్రాయడం చాలా అవసరమైనది. వాఙ్మయం అభివృద్ధిలోనికి వస్తే విజ్ఞానంకూడా పెరుగుతుందని, బడికిపోయే విద్యార్థులవిశ్వవిద్యాలయములలో, పరీక్షలలో నెగ్గే పరీక్షార్థుల సంఖ్యనుబట్టి దేశముయొక్క విద్యాభి

వృద్ధిని తెలుసుకోవచ్చునని అనడం సాధారణంగా ఆచారమయిపోయింది. పాశ్చాత్య విద్య మూలంగా మన కేర్పడిన నమ్మకాలలో ఇది యొకటి. చదవడం, వ్రాయడం నేర్చినంతనే వివేకి అనిగాని, విజ్ఞాని అనిగాని చెప్పనగునా? చదవడం వ్రాయడం నేర్వనివాడు సంస్కారియే కాడా? విజ్ఞానప్రచారం వ్రాత చదువులవల్లనే గాని ప్రారంభంకాదా? చదవని, వ్రాయని, నేర్వని వేనవేలప్రజలంతా మూర్ఖులా? మన పూర్వులు వ్రాత చదువులమీదనే ఆధారపడక వేనవేలు సంవత్సరాలు వ్యాపింపజేసిన మన దేశీయ విజ్ఞానమంతా నిష్ప్రయోజకమా? నిరక్షరాస్యుడై దక్షిణాపథాన్నంతా తనగుప్పిటిలో పెట్టుకొనడంకోసం ప్రయత్నంచేసిన టిప్పుసుల్తాను, భారతీయ సామ్రాజ్యాన్ని స్థాపించిన అక్బరుచక్రవర్తి, శ్రద్ధాభక్తులతో తనధైర్యాన్ని వివేకాన్ని పురస్కరించుకొని హిందూసామ్రాజ్యాన్ని స్థాపించిన శివాజీ, శ్రామికవర్గంలో పుట్టి వడ్రంగికొడుకై స్కూలు, కాలేజీముఖం చూడకుండా ప్రపంచాన్నంతా తనబుద్ధి ప్రాభవం చేతనూ, శక్తిసామర్థ్యాలతోనూ దహించి వేస్తున్న హిట్లరు, రెండుసార్లు ప్రవేశపరీక్ష తప్పి స్కూలు విడిచి తన స్వంతశక్తిమీద పైకి వచ్చి నేడు బ్రిటీషు సామ్రాజ్యాన్నంతటిని శాసిస్తూన్నటువంటి చర్చిలు, చదువుకున్నవాళ్ళలో లెక్కా? లేక విద్యావిహీనులయిన మూర్ఖులలో పరిగణింపబడుతారా?

ఉత్తమవిజ్ఞానమునకన్న చదువుటకు, వ్రాయుటకు నేడింత ప్రాధాన్యము రావడానికి ప్రెస్సు కారణం. చవకైనమిల్లుకాగితాలు కారణం. కాగితాల్ని, ప్రెస్సుల్ని పురస్కరించుకొని లక్షలకొలది డబ్బార్జించే గ్రంథ ప్రచురణకర్తలు కారణం. నిస్సహాయమయి తేజోవిహీనమయి వ్యాపారులచేతుల్లోబడి పుస్తకాల చదువుకు మాత్రమే ప్రాముఖ్యమిచ్చే మన యీ ప్రభుత్వం కారణం. తేలికగానూ, చవకగానూ మనకు దొరికే వార్తాపత్రికలు కారణం. ఆదర్శమున్నా లేకపోయినా వానిలాభాల్ని లెక్కచేయకుండా సంఘముయొక్క బలహీనతను స్వలాభంకోసం ఉపయోగించుకొనే అనేక పత్రికా ప్రొప్రయిటరులు కారణం. ఈ అభిప్రాయాలు చాలామందికి వింతగానూ, వెగటుగానూ, ఛాందసంగానూ, అర్థవిహీనంగానూ కనపడవచ్చు; కాని నిజమేమిటంటే ప్రెస్సు, కాగితాలు, పుస్తకాలు, గ్రంథాలయాలు— విజ్ఞానవ్యాపకానికి సాధనాలు. విజ్ఞానం కాదు. నిజమయిన విజ్ఞానం శ్రవణంవల్లను లభించవచ్చు. పఠనంవల్లను లభించవచ్చు. దృశ్యంవల్లను లభించవచ్చు. శ్రవణంవల్ల లభించే విజ్ఞానంవినిపించేవాడు సదాచారపరుడైవిజ్ఞానవేత్తయితే విన్నదానిమీద భక్తికుదురుతుంది. తత్త్వకారణమడుచుకునేక్రియాపటుత్వమబ్బుతుంది. అర్థంచేసుకొనిమననంచేసుకొనేఅవకాశంఅబ్బుతుంది. తాను స్వంతముగాకూడా ప్రచారకుడు కాగల్గే భాగ్యంలభిస్తుంది. పఠనమూలకంగా కలిగే విజ్ఞానానికినిర్జీవమయిన కాగితముసాన్నిధ్యము తప్పితే మరొకటి లేదు. చదివేవాడు తనరుచిని బట్టి పుస్తకంసంపాదించుకుంటాడు. పుస్తకంవిలువ కానీదగ్గరనుంచి,పదిరూపాయలవఱకుండవచ్చు. అతని మనోగతినిబట్టి అభిరుచి ననుసరించి, అతనివిజ్ఞానానికి విలువ కట్టవచ్చు. పుస్తకం చదివేది ప్రయివేటుగా సంపాదించుకునే విజ్ఞానం. రహస్యముగాసంకలనం చేసుకునే విషయం

ప్రియి వేటుగాను, రహస్యముగాను చేసిన పనులన్నీ నిర్దోషాలని చెప్పలేము. శ్రవణంద్వారా సంపాదించుకునే విజ్ఞానము బాహాటముగా, పబ్లికుగా చేసేపని పబ్లికుగా అలవడిన విజ్ఞానం దోషయుక్తముగా ఉండడ మరుదు. అందువల్ల విజ్ఞానసాధనాల్లో ముఖ్యమయిన శ్రవణపఠన మనోసాధనాల్లో శ్రవణానికి ప్రథమస్థానము లభిస్తుంది. వేలకొలది విషయాలు చూచి నేర్చుకొనేవికూడా ఉంటాయి. అవి ఆచరణకి సంబంధించనివి. ఆ ఆచరణ ఔన్నత్యపూర్ణమయిన సంఘంయొక్క గమనానికి ప్రతిబింబం.

ప్రెస్సు, కాగితాలు రాకపూర్వం విజ్ఞాన ప్రచారమంతా వీనియందే కేంద్రీకృతమైయుండేది. సర్వజన సామాన్యానికి కావలసిన విషయాలకు కళాశాలలు, విశ్వవిద్యాలయాలు తావరములుగా స్థిరనివాసములుగా ఒకచోట ఉండేవి కావు. అందువల్లనే మన దేశవిజ్ఞాన మనుశ్రుతంగా ఉంటూ వచ్చింది. అనుభవైక వేద్యంగా ఉంటూవచ్చింది. సర్వవిధములైన విజ్ఞానానికి అంటే ... సాంఘిక, ఆర్థిక, రాజకీయ, ధార్మిక, ఆధ్యాత్మిక అధిజ్ఞానాలికి ప్రతిగ్రామమూ కేంద్రమవుతూవచ్చింది. వీటికన్నింటికి పేటికలు మన పురాణాలు. అవే మనవిజ్ఞాన సర్వస్వములుగా ఉండేవి. అవే వ్యక్తికి సంఘానికి మార్గదర్శకాలు. వాటిద్వారానే అపుడు పరిమితంగా ఇపుడు రేడియో వార్తాపత్రికలు, పుస్తకాలు మొదలయినవాటిద్వారా జరుగుచున్న ప్రచారంవలె జరుగుతుండేది. అందులో వున్న ఆఖ్యానోపాఖ్యానాలు, వాటిమీద కలిగే వ్యాఖ్యోపవ్యాఖ్యలు, ఆరోజుల్లో జరిగే వాదప్రతివాద సభలు అన్నీ విజ్ఞానప్రచారకములే. పురాణ శ్రవణం జరిగేచోట్లే అప్పటి యుపన్యాసవేదికలు. పురాణాలలో ఇమిడియున్న సర్వవిషయ విచారణే చర్చనీయాంశం పురాణాలలోని విషయాలన్నీ విజ్ఞాన సర్వస్వాలని, అనుకరణీయములయిన, వేదవాక్యములుగా నొప్పుకొనవలయునని కాదు. వాటినేవిధంగా మన పూర్వులు విజ్ఞాన ప్రచారకములుగా ఉపయోగించారో తెల్పడమే యిక్కడ నా ఉద్దేశం. సంగీతంతోను, నృత్యంతోను అభినయంతోను, వాద్యవిశేషాలతోను, కథారూపంగాను, నాటకరూపంగాను, మనుష్యుల హృదయాలు ప్పొంగేటట్టుగాను, ఉత్సాహం, క్రియాపరత్వం వెల్లివిరిసేటట్టుగాను, శాంతి, సమరసభావాలు విరజిమ్మునట్లుగాను ఉపయోగపరచబడిన యీ సాధనాలన్నిటిని ఉత్కృష్టమైన విజ్ఞానప్రచారక సాధనములుగా మనం తెలుసుకోవాలి. కేవలం అక్షరాలమీద చదువువ్రాతలమీదనే ఆధారపడి తేలాభం లేదు. నేటి అజ్ఞానాని కంతటికి కారణం పరరాజ్యం, పరభాషా ప్రచార మనే చెప్పవచ్చు. కాని దీనికి లోబడినవారు 100 కి 8, 10 మందికూడా వుండరు. మిగతావా రందరిలోను విజ్ఞానప్రచారంకోసం మనం కొత్త పాత సాధనాలన్నిటిని ఉపయోగించవలసినదే.

మనదేశంలో 100 కి 15 మందికూడా అక్షరాస్యులు లేరు. ఈ 15 మందిలో చదువను వ్రాయను నేర్చినవారెంతమందిఉన్నారో చెప్పడం కష్టం. వీరిలో సరియైన విజ్ఞానంగలవారిని లెక్కవేస్తే మనం చాల నిరాశపడవలసివస్తుంది. 100కి ఒకరైనా మనం కావలె ననుకొనే విధంగా విజ్ఞానవంతులు తేలతారా అనేది సందేహమే. మనం కోరే విజ్ఞాన మేమిటి? దానికి కావలిసిన సాధనాలేవి? అన్నేప్రశ్న యిక్కడ విపులంగా చర్చించాలంటే కష్టం. కాని కుటుంబములోను, సంఘము

లోను స్త్రీలవద్ద పెద్దలచెంత యజమానుల దగ్గర, నౌకరులతోను సంఘములోను, సభల లోను తాను చూపవలసిన ప్రవర్తన ఒద్దికలు విజ్ఞానంలో ఒకభాగం. ఈసంస్కారాలను చదువు నుంచికాను, సంఘంసగ్గరనుండి ప్రతిబాలకుడు, వయస్కుడు నేర్చుకోవాలి. మనవయోజనవిద్యకు ఇదొక ప్రధానఅంగంగా ఉండాలి. శరీరవిజ్ఞానం, మనోవిజ్ఞానం, సంఘవిజ్ఞానం, రాజకీయవిజ్ఞానం, ప్రకృతివిజ్ఞానం, పదార్థవిజ్ఞానం, సంగీతవిజ్ఞానం మొదలైనవి అలవరచుకొనడానికి సులువైన, చవకైన సాధనాలు, సదుపాయాలు ఏర్పడాలి. ప్రతివిజ్ఞానానికి ప్రవీణుని దగ్గరనుండవలసిన భాగ మొకటి, ప్రజాసముదాయంలో ప్రచారం కావల సిన భాగమొకటి ఉండితీరాలి. ఉదాహరణకోసం మనం సంగీతం తీసుకుందాం. ఇందులో ప్రజాసము దాయానికి రుచించే సంగీతం వేరు. ప్రవీణులు పసందుచేసే సంగీతము వేరు. ఈరెంటికి వేరు వేరైన నిర్దిష్టమైన స్థానా లున్నాయి. మొదటిది మనుష్యుని హృదయభూమిమీద నివాసయోగ్య ముగా కట్టబడిన గృహమువంటిది. రెండవది బుద్ధిని ఆధారంగా చేసుకొని భోగభాగ్యాలకు అకరముగా ఆనందదాయకముగా నిర్మింపబడిన రాజమహలువంటిది. రాజమహళ్ళను కట్టడాని కందరకు వీలులేదు. అందువల్ల ప్రజాసముదాయాని కనుకూలమైన వసతులే ప్రయోజనకారులు. ఉపయోగములేని విజ్ఞానానికెంతమంచి సుక్షేత్రం దొరికినను అది ఉన్నతిలోనికిరా లేదు. అందుచేతవిజ్ఞానంప్రచారం చేయవలసినది విలాసాన్ని పురస్కరించుకొని కాదు—ఉపయోగాన్ని పురస్కరించుకొని.ఇందు చేత ప్రతి విజ్ఞానశాస్త్రాన్ని రెండు భాగాలుగా విభజించి ప్రజాహితకరమైన భాగాన్ని ప్రచారం లోనికి, అనుభవంలోనికి, అమలులోనికి తీసుకు రావడాని కోసం వేరుచేయాలి. రెండవభాగము అభివృద్ధి, పండితులికి, ప్రవీణులికి, ప్రభుత్వానికి విడిచిపెట్టాలి. ఈపని వ్రాతచదువులవల్లను పుస్త కాలవల్లను జరిగేదానికంటే, వినికిడివల్ల, ప్రత్యక్ష సంపర్కంవల్ల ఎక్కువవుతుంది. చూచి చదివిన శబ్దంకంటె మాట్లాడితే విన్నశబ్దము, అభిప్రాయం విషయము ఎక్కువ ఆకర్షకమై ప్రభావయుక్త మై యుండునని ఒప్పుకోకతీరదు. అక్షరాస్యతా ప్రచారం కూడదనికాదు. కాని దాని ప్రచారానికి ఉపయోగానికి సాధనానికి వ్యాపకానికి హద్దు లున్నాయి. కాని మాటద్వారా జరిగే ప్రచారా నికి హద్దులు లేవు.దానియుపయోగం నికరమైనదే కాకుండా దానివల్ల ప్రజామనోభావాల్లో సంచ లనం, క్రాంతి బయలుదేరితీరుతుంది. ఈసిద్ధాం తాలను గురించి ఇప్పటి కీవిశదీకరణం చాలు.

పైన పేర్కొన్న భావాలను అమలులోనికి తీసుకురావాలంటే మొట్టమొదట మనం, మన ప్రచారమును, వయోజనవిద్యాప్రచారంగాకాదు, విజ్ఞాన ప్రచారంగా మార్చాలి. అని నాయభి ప్రాయం. ఇందులో దీన్ని మూడు భాగాలుగా విభజించుట మంచిది. మొదటిది: వయోజన విజ్ఞానం, రెండవది స్త్రీవిజ్ఞానం, మూడవది బాల విజ్ఞానం. ఈకార్యాన్ని సాధించటంకోసం ఊరూర పల్లెపల్లెలలోను విజ్ఞాన ప్రచార సంఘాలు స్థాపిం చడం మంచిది. దీనికొక కేంద్రీకృతమైన సంస్థ నేర్పరచి దానికి కావలసిన ప్రణాళికను, సాధన సామగ్రిని తయారు చేసుకోవాలి. ఈ సంస్థలను నెలకొల్పడానికి, నిర్వహించు కొనడానికి దేశంలో కావలసినంతమంది విజ్ఞానవేత్తల సహాయం దొరక

గలదు. సాధనాలలో, పుస్తకాలు, రేడియో లౌడుస్పీకరుసెట్లు, హరికథలు, జంగంకథలు, నాటకాలు, ఉపన్యాసాలు, సినిమాలు, మేజిక్ లాంతరనులు, సాముదాయక యాత్రలు, ప్రదర్శనాలు మొదలైన వనేకం మనకుండనేయున్నాయి. మనకు కావలిసినది పట్టుదలకల్గి, ప్రణాలిక నర్థం చేసుకొని పాటుబడేటటువంటి 10 మంది యువకులు. ప్రవీణుల సహకారం. ప్రభుత్వంతోడ్పాటు. ఇట్టి సంఘం గనక స్థాపిస్తే సరియైనపద్ధతులమీద నడిపిస్తే 10 సంవత్సరాలలో మన దేశముయొక్క దర్జాయే చాల పైకి లేచిపోతుందని రూఢిగా చెప్పవచ్చు. మనదర్జాపైకిలేస్తే మనమెక్కువ మోతుబర్లమవుతామని, స్వదేశంలోను యితర దేశాలలోను మనకు పరపతి, పలుకుబడి హెచ్చుతుందని చెప్పవచ్చు. దీనివల్ల ఆంధ్రదేశ వ్యాపారానికి ఐశ్వర్యానికికూడా ఔన్నత్యంకలుగుతుందని, మన అంతస్థు ఎంతో హెచ్చవుతుందనికూడా మనం తెలుసుకోవచ్చును.

పైనచెప్పిన విజ్ఞానప్రచారంలోఇతరప్రాంతాలకంటె మనం తలపోస్తున్నంత వెనకబడిలేము. హిందూదేశంలోని ఇతర ప్రాంతాలనుబట్టిచూస్తే బాగుగా అభివృద్ధిలోనికివచ్చిన బెంగాలు, గుజరాతు, మహారాష్ట్రీయుల కంటే మన మెంతో వెనకబడిలే మనే చెప్పవచ్చు. ఆంధ్ర దేశమునకు నడిగడ్డయైన కృష్ణా, గోదావరీ నదీప్రాంతాలు, గంగా, నర్మదా, కావేరీ నదీతీరవాసులకంటె వెనుకబడిలేము. మనసాధారణ విజ్ఞానం వృద్ధిలోనున్నప్పటికి మనబాలబాలికల విజ్ఞానవిషయంలో మన మెంతో వెనుకబడియున్నామని చెప్పకతప్పదు.

ఈవిషయంలో బొంబాయి, కలకత్తా, పూనా, అహమదాబాదు, అలహాబాదు, బెంగుళూరు మొదలైన పట్టణాలు తమ బాలబాలికల విషయమై చూపే శ్రద్ధ మనకుకూడా ఉండాలి. ఇంతే కాక మనభాషలోకూడ బాలబాలికలకు కావలసిన విజ్ఞానాన్ని నేర్పే వాఙ్మయంకూడా చాలాతక్కువ. ఈ బాలవాఙ్మయమునకై హిందీలో సుమారు 10 మాసపత్రిక లున్నాయి. గుజరాతీలో 5, బెంగాలీ, మరాఠీ భాషల్లోకూడా కావలసినన్ని వాఙ్మయ పత్రికలున్నాయి. కన్నడ భాషలో సుమారు 90 వేలు వెచ్చించి ఒక ప్రచురణకర్త బాలవిజ్ఞానసర్వస్వాం ప్రచురింపచేశాడు. తమిళభాషలోకూడా బాల వాఙ్మయం అపురూపంకాదు. ఇక మరి తెలుగులోనో:—స్కూళ్ళకు కావలసిన పాఠ్యవిధానం ప్రకారంగా ఏర్పడిన వాఙ్మయంతప్ప తెలుగుపిల్లలకోసం ప్రత్యేకంగా తయారైన బయటికివచ్చిన వాఙ్మయం శూన్యప్రాయమనే చెప్పాలి. ఈకొరతను తీర్చవలసినకర్తవ్యం తెలుగుతల్లిదండ్రులది. కట్టుబాటుతో కూడినసంఘం నియమబద్ధంగా నిరంతరాయంగా నిరంతరంచేసేకృషి లేకపోతే యీపనిజరగడంకష్టం మనబాలబాలికల వృద్ధినిగురించి మనం నిర్లక్ష్యం చేస్తే మనజాతి భవిష్యత్తు నరికట్టినట్టు కాదా? విదేశాలల్లో బాలబాలికల బుద్ధివికాసంకోసం విజ్ఞానంకోసం చేసే ప్రయత్నాలు చూస్తే అచ్చెరువగును. పాశ్చాత్య దేశాలు ప్రపంచానికి నాయకత్వం వహించినాయంటే మన మాశ్చర్యపడవలసినదేముంది?

# స్వయంపోషక సహకార విద్యాశ్రమములు

శ్రీ గోటేటి జోగిరాజు

గ్రంథాలయోద్యమమునకును, విద్యావ్యాపకమునకును అవినాసంబంధము గలదు. చదువనేర్చిన వారిసంఖ్య తగినంతయుండినగాని యేగ్రామమున నయినను గ్రంథాలయమును నెలకొల్పి లాభములేదు. కావున గ్రంథాలయోద్యమవ్యాపకులు చదువనేర్చినవారిసంఖ్య నభివృద్ధి చేయుటయందుగూడ శ్రద్ధవహించుట యావశ్యకము.

బాలబాలికల ప్రాథమిక విద్యాభ్యాస మిపుడు ప్రభుత్వపు తనిఖీకి లోబడి చాలవరకు జిల్లాబోర్డుల యాజమాన్యమున జరుగుచున్నది. ఎప్పటికైన నీబాధ్యత ప్రభుత్వము వహించదగినదేకాని యల్పసాధన సంపత్తిమాత్రమేగల వ్యక్తులుగాని, సంస్థలుగాని నిర్వహింపదగినదిగాదు. ఐనను ఆంధ్రగ్రంథాలయసభవంటిసంస్థలు సాధ్యమైనంత తక్కువవ్యయముతో శీఘ్రముగ నెక్కువ ఫలము నిచ్చు విధానముల నారయుటలో గొంతకృషి సలుపదగును.

ప్రారంభవిద్య బాలబాలికలకు చదువను, వ్రాయను సమర్థతయు మనోవికాసమును గలిగించుటయేగాక, వారల శరీరదార్ఢ్యమును, అంగపాటవమునుగూడ నభివృద్ధిచేసి మున్ముందు వారలు స్వయంపోషకులును సంఘమునకు శ్రేయస్కరులునునగు నుత్తమపౌరులగుటకు దగిన యుత్సాహక ధోరణియు శీలమును అలవాటుచేయునదిగగూడ నుండవలెను. ఇప్పటిప్రాథమిక విద్యావిధానమున బాలురు బడియందు 5-8 యేండ్లు నీడపట్టుననుండి కొద్దిగొప్ప చదువను వ్రాయను నేర్చునరికి వార లెండలో దిరిగి తమ తల్లిదండ్రుల వృత్తియందు ముఖ్యముగ వ్యవసాయపు బనుల యందు పాల్గొనుశరీరశక్తియు నింద్రియపాటవమును గల్గియుండుటలేదు. ఇట్లు వారలు నిష్ప్రయోజకు లగుచుండుటచేతనే ఉద్యోగవాంఛతో తమపిల్లలను పై చదువును జదివింప సమర్థులగు తల్లిదండ్రులు తప్ప తక్కినవారుతమబాలురను నిప్పటి పాఠశాలలకు బంప నుత్సాహమును జూపుటలేదు.

ఇప్పటి విధానమునందలి లోపములను తొలగించుటకేర్పడిన, ప్రాజెక్టు కిండర్ గార్డెన్, మాంటెసోరీ మొదలగు పేళ్ళతో వ్యవహరింప బడుచున్న కొన్ని పాశ్చాత్యవిధానము లిదివఱకే యీదేశమునగూడ కొద్దిగొప్ప పరీక్షింపబడు చున్నవి. కాని వానిని సక్రియముగ నమలులో పెట్టదగిన యుపాధ్యాయులను దయారుచేసి వారలకుదగిన వేతనము లిచ్చినగాని ఇవి వ్యాప్తి నొందజాలవు. ఇందులకును, ఆయావిధానముల నమలులో బెట్టుటకును, వలయు సాధనసామగ్రిని సమకూర్చుటకును చాలధనము కావలసియుండును. స్వల్పజీతములపై బనిచేయునుపాధ్యాయులనైనను తగినంతమందిని నియమించి సామాన్య పాఠశాలలనే తగినన్నిటిని నెలకొల్పుటకు ధనము చాలని పరిస్థితులలో; ప్రభుత్వము వ్యయకరము లగు విధానములను ప్రోత్సహించుటకు సాహసింపదు. కావున విద్యావ్యాపకమును శీఘ్రముగ గావింపగలుగు విధానము పైనిసూచింపబడిన యుత్కృష్ట లక్షణములు గలదిగ నుండుటయేగాక సాధ్యమైనంతవరకు స్వయంపోషకముగ గూడ నుండుట యవసరము. ఈ విషయమునుగుఱించిన విధానములలో శ్రీ గాంధీమహాత్ముని ప్రేరణచే నేర్పడిన "జకరు హుసేను" సంఘమువారు నిరూపించిన "వర్ధావిధానమొకటి". ఈ విధానము

గతనాల్గుసంవత్సరములనుండియు కొన్నిచోట్ల పరీక్షింపబడుచున్నది. దీనివలనగలిగిన ఫలితము లను విమర్శించుట కీమధ్య ఢిల్లీలో జరిగిన యొక సభలో సారాంశము లిట్లు తెలుపబడెను.

"గవర్నమెంటువారిచేతను, స్థానిక సంస్థల చేతను నెలకొల్పబడిన యిట్టి నవీన పాఠశాలలలో జరిగిన పనిని గుఱించినివేదికలన్నియు, నీవిధానము వలన పిల్లల సామాన్యారోగ్యస్థితియు, వర్తనయు, బుద్ధివికాసమును చాల ప్రోత్సాహకరముగ నున్న వని కొంచెమించు మించు ఏకముఖముగ దెలుపు చున్నవి. ఈపాఠశాలలందలిపిల్లలు హెచ్చుచురుకు దనమును, ఉల్లాసమును, ఆత్మవిశ్వాసమును గల వారుగ నుండిరి. వీరికి తమభావములను వెల్లడింప గలశక్తి బాగుగ నలవాటు పడెను. వీరలకు సహ కార భావముతో బనిచేయు నలవాట్లు గలుగు చున్నవి. వీరలలో సాంఘిక దురభిమానమునశించు చున్నది."

బీహారు రాష్ట్రములోని చంపరాన్ జిల్లాలో నీ విధానము వలన గలిగిన యభివృద్ధిని గుఱించి మరియొక పరిశీలనాసంఘము వారిట్లు వ్రాసి యుండిరి:

"విద్యార్థులలో మాంద్యమును, అశ్రద్ధయు తొలగి పనిపాటులను జేయుట కుత్సాహము పెంపొందు చున్నది. రెండవతరగతి విద్యార్థు లలో నూటికి 78 మంది, తాము చేసిన పనివలన సాలుకు ఒకొక్కరు రు 3-8-0 లకు పైగా గడించిరి. మొదటితరగతి వారిలో నూటికి 71 మంది సాలున కొకొక్కరు రు 1-5-0లకు పైగా సంపాదించిరి. కొందరు రెండవతరగతి విద్యార్థులు రు 7లకు పైగా గడించి యుండిరి."

ఈమధ్య కొండెవరం గ్రామమండలి బోర్డు ప్రాథమిక పాఠశాలలో 4, 5 తరగతుల బాల బాలికలు 10 రాటములపై స్కూలుదినములలో దినమునకొక గంటలోపు (ఒక పీరియడ్) పని చేసి ప్రారంభదశలోనే నెలకు 40-50 సిలపల నూలు (సుమారు రు 3 ల విలువగలది) తీయ గలుగు చున్నారు. సగటున నొక్కొక్క బాలుడు లేక బాలిక నెలకు ఏకుల ఖరీదుపోను 3 అణాల విలువగల నూలును దీసెను. గంటకు 300 గజ ముల నూలు దీయ నభ్యసించిననాడు స్కూలు దినము లిరువదినాల్గింటిలోను నొకొక్కరు దినమున కొకగంట నూలు దీయుచో అధమము 8 సిలపలు దీయగల్గుదురు. ఏకుల ఖరీదుపోను వీని విలువ 5 అణాలు వుండును. రాటములపై నూలుదీయ నవకాశము లేనివారలు కొందరు బత్తాయి, నారింజకాయలకు గట్టు తాటియాకు బుట్టలను గంటకు సుమారు 16 చొప్పున నల్లి యొక కాని సంపాదింపగలుగు చున్నారు. ఇందు వలన నెలకొక్కొక్క బాలుడు లేక బాలిక ఆర ణాల వఱకు సంపాదింప వీలగుచున్నది కొందరు పాఠశాల ఆవరణలో కూరగాయలను, పుష్పాది కములను ప్రత్తిమొక్కలను బెంచుకృషియందుపా ధ్యాయులకు సహాయ పడుచున్నారు. ఇప్పటి విద్యానిబంధనలు బాలురచే దినమున కొక గంట కంటె నిట్టిపనులను జేయింప నియ్యకొనవు. వర్ధా విధానమునందు వలె దినమునకు సుమారు 3 గంట లిట్టిపనులను చేయుచో ప్రతి 4-5 వ తర గతి బాలుడు, లేక బాలికయు నెలకు రు 1-0-0 వఱకు సంపాదింప వీలగును. కావున తగినకృషి చేయుచో విద్యా విధానమును కొంతవరకైనను స్వయంపోషకముచేసి హెచ్చు వ్యాపకమునకు దెచ్చుట కవకాశము లేకపోలేదు. పిల్లలను

ఉదయము కొంతసేపు నూలువడకుట, బుట్టలల్లుట మొదలగు పనులందు నియోగించి సాయంకాలము వారలచే కొంతసేపు తోటపనిని జేయించినచో వారలు మొత్తముమీద దినమునకు 3 గంటలు పనిచేసినను అలిసిపోవుటగాని, విసుగు జెందుటగాని తటస్థింపదు. పైని చెప్పినట్లు దినమునకు 3 గంటలిట్టిపనులను చేయించుచు మరి మూడు గంటలు మాత్రమె పాఠముల జెప్పుచో చదువు వెనుకబడునని కొందరందురు. కాని బాలబాలికలు చేయుపనులపై నాధారపరచి వారి కక్షరములను, పదములను, పలుకను వ్రాయను లెక్కలను గట్టుటను నేర్పుట జరుగుచో నిపుడు వారలకు చదువుటలోను, వ్రాయుటలోను, లెక్కలు గట్టుటలోను వచ్చు ప్రవీణత యదేకాలములోపలనే వచ్చుననుటకు సందియము లేదు. ఒకవేళ రాకపోయినను విద్యాభ్యాసకాలమొకటి రెండు సంవత్సరములు పొడిగించినను నెబ్బరయుండదు.

చామర్లకోట, అనకాపల్లి, మొదలగు గవర్నమెంటు ఫారములలో 10–12 ఏండ్ల వయస్సు వచ్చిన బాలురకు, ఒకపూట 0–1–6 అణాలుకూలి యిచ్చి వారలకు దగినపనులను జేయించుచు, నొకపూట వారికి విద్యాభ్యాసము గావించు నేర్పాటు అమలులో నున్నది. ఇట్లు చదువను వ్రాయను నేర్చుకొనిన వాండ్రు పెద్దవాండ్రయిన తరువాత తాము స్వయముగ వ్యవసాయము చేసికొనగలుగుచున్నారు. అట్టి యవకాశము లేనివారు కూలిపని చేసికొనియే జీవింపగలుగుచున్నారు. వీరలు తాము సొమ్ము వ్యయము జేయకుండ విద్యావంతులగుట యదనపులాభముగదా!

గవర్నమెంటు ఫారములసంఖ్య చాల స్వల్పము. కావున నిట్లొకపూట చదువను నొకపూట పనిపాటలను నేర్పుసంస్థలు విరివిగ నేర్పాటు చేయుట మంచిదిగదోచును. ఉపాధ్యాయులు కూడ నొకపూట పాఠములు చెప్పి మరియొకపూట పని చేయుచో వారలు స్వయంపోషకులుగ నుండవీలగును. బాలుర సంపాదన వారలపోషణకు చాలువరకు తలిదండ్రులే లోటును పూర్తి చేయవచ్చును. మొదటకే వ్యక్తియో, నే సంస్థయో నిట్టి స్వయంపోషక విద్యాశ్రమమునకు దగినవసతులను మాత్రము ఏర్పాటుచేయుట యావశ్యకము.

నిజాం రాష్ట్రమున విద్యాభ్యాసమును స్వయంపోషకము గావించుటకు మరియొకవిధముగ యత్నము జేయబడుచున్నది. ఈ యుద్యమమును సంస్థానపు సహకారశాఖ వారును, సాంకేతిక విద్యాశాఖవారును, ఉస్మానియా విశ్వవిద్యాలయము వారును నిర్వహించుచున్నారు. రాష్ట్రవిద్యాశాఖాధికారి, రాష్ట్రసహకారశాఖాధికారి రాష్ట్రవ్యవసాయశాఖాధికారి, నవాబు బహదూర్ యార్ జంగ్ మొదలగు పదునాల్గురుద్యోగులును, అనుద్యోగులును గలయొక సంఘమేర్పరుపబడెను. కలకత్తా విశ్వవిద్యాలయమున మనదేశపు దారిద్ర్యసమస్యలను గురించి యుపన్యసించుటకు ప్రత్యేకముగ నియమింపబడి యీవిషయమై చాలా కృషి చేసియుండిన శ్రీ పటవెల్‌గారను నాయన యీ యుద్యమ కార్యనిర్వాహకులుగ బనిచేయుచున్నారు.

ఉస్మానియా విశ్వవిద్యాలయావరణలోనే యొక సహకార విద్యాశ్రమము నెలకొల్పబడెను. అందు ఉద్యానకృషి, కోళ్ళ పెంపకము, వడ్రంగము, దర్జీపని, తోలుపని మొదలగు పరిశ్రమలు నెలకొల్పబడెను. బాలురచే ప్రతిదినమును కొంతకాలము పై పరిశ్రమలను చేయించి వారలు

కొంతవరకైనను స్వయంపోషకు లగునట్లు చేసి, మరి కొంతకాలము వారల విద్యాభ్యాసమునకు వినియోగించుట యీసంస్థయొక్క యాశయము. ఆయా పనులను నిపుణతతో జేయుటకు తగిన పనిముట్ల నుపయోగమునబెట్టి సామాన్యముగ నితరులు దినమంతయు పాటుపడి యెంతపని చేయ గలుగుదురో అందు సగముకాలమున నీ యాశ్రమము నందలి విద్యార్థులచేతను వారలకు బని నేర్పువారల చేతను ఆయాపనుల జేయించుటకు యత్నించు చున్నారు. తక్కినకాలమున విద్యార్థులు పాఠములను నేర్చుకొనుట కవకాశము గలుగును. పనివారలు దినమునకు హెచ్చుపనిచేసి తమ యార్జనను పెంచుకొన గలుగుదురు. తయారగు వస్తువులు అమ్మకమునకుగాక సాధ్యమైనంతవరకు స్వోపయోగమునకైయే వినియోగింప బడుచున్నవి. స్వోపయోగమునకు పోను, మిగులునవి స్వోపయోగమునకువలయు నితరసామగ్రికి బదులుగ నిచ్చి వానిని బుచ్చుకొనుటకును వినియోగింప బడును. ఈ యత్నము జయప్రదమగుచో నిట్టిసంస్థలు పట్టణము లందును పల్లెలందును విరివిగ నెలకొల్పి విద్యార్థులకేగాక పనిలేని వారి కందరికినిగూడ పనికల్పింప వీలగునని యీ యుద్యమ నిర్వాహకుల యాశయము. తుదకు ప్రభుత్వోద్యోగులను నితర సంస్థలందు బనిచేయు వారలను గూడ తమ యుద్యోగాది కృత్యముల నొకపూట చేయుచు, రెండవపూట నిట్లు సంఘమున కావశ్యకమగు వస్తూత్పత్తికార్యములను చేయున ట్లేర్పాటు గావింపగలుగుచో రెట్టింపు మందికిట్టి యుద్యోగములు లభించును. అట్లుద్యోగములను వాంఛింపనివారు సగము దినము మాత్రము పనిచేసి తమకువలయు వస్తుసామగ్రులను కొన్నిటిని స్వయముగ నుత్పత్తి చేసికొనుట వలనను, తక్కినవాటిని తా మూత్పత్తి చేసినవస్తువులతో మార్పిడివలనను లభింప జేసికొన గలుగుచో దక్కిన కాలమును గ్రంథపఠనము, ఆటపాటలు గానాది వినోదములు మొదలగువానియందు వినియోగించి సౌఖ్యము ఆనందము పొందవచ్చును.

ఈ పద్ధతి క్రొత్తగా కనిపెట్టబడినది కాదు. తొలుత, స్విట్జర్లండులో కెల్లరుహాల్ దంపతులు దీనిని ప్రతిపాదించి పరీక్షించి యాదేశపు ప్రభుత్వమును దీని నవలంబించునట్లు జేసిరి. పనిలేని వారందరను నిట్టిసంస్థలలో జేర్చి నూటికిరువదిమంది చొప్పున నేర్పరులగు పనివారలను నియమించి, యందరును త్వరలో స్వయంపోషకు లగునట్లు చేయగలిగిరి. తమపొట్ట పోసి కొనుటయేగాక వీరలు తమపాటువలన నాయా సంస్థలకై ప్రభుత్వము చేయుచుండిన వ్యయమును, విధింపబడు పన్నులనుగూడ క్రమముగ దామే భరింపగల్గిరి.

అమెరికా సంయుక్తరాష్ట్రములందలి సెనేటు సభ్యుడగు పెప్పర్డు అను నాయన ఈ విధానము నా దేశమునగూడ ప్రవేశపెట్టుట కచటి ప్రభుత్వమును ప్రోత్సహించు చున్నారు. అందులకై యా దేశపు శాసనసభ (Senate) లో నొక చట్టమును (United Communities Bill) ప్రతిపాదించి యున్నారు. కాని యది యింకను నొకప్రత్యేక సంఘముచే పరిశీలింప బడుచున్నది. హెన్రీ ఫోర్డు గారివంటి పారిశ్రామిక ప్రముఖులుగూడ నీవిధానపు సూత్రముల నంగీకరించిరి. ఇప్పటి కర్మాగారములం దేదోయొక్క వస్తువునేగాక ఆయా ప్రాంతములందు సంఘమునకు వలయు వివిధవస్తువులను తయారుచేయునట్లు మార్పుగావించి పనివారం డ్రీ కర్మాగారములందు దినములో సగము

కాలము మాత్రమే పనిచేయునట్లేర్పాటుచేసి తక్కినకాలమున వారలు సేద్యముచేసి తమకు వలయు నాహారపు దినుసులను బండించుకొనుటకు దగినభూవసతి గల్పించుట మంచిదని యొప్పుకొను చున్నారు.

అదివరకే యీ రాష్ట్రములందలి మాడిసన్ అను గ్రామమున డాక్టరు సదర్లండు అనునాయన నొక కళాశాలను నెలకొల్పి అందు 36 రాష్ట్రములనుండియు, 9 విదేశములనుండియు వచ్చి చేరిన 300 మంది విద్యార్థులను స్వయంపోషక విధానమున ప్రకృతి శాస్త్రములందు పట్టభద్రులను జేయుచున్నారు. కళాశాలనంటి 130 యెకరముల పొలమును, తోటలును గలవు. 27 పరిశ్రమలకు కర్మాగారములు గలవు. విద్యార్థులు దినమున నైదుగంటలు విద్యాభ్యాసమునొందుచు మరి నైదుగంటలు పొలమునందును కర్మాగారము లందును పనిచేయుచున్నారు. ఒక్కొక్కరు సాలుకు సగటున 318 డాల్లర్ల విలువగల సరుకుల నుత్పత్తి చేయగలుగు చున్నారు. వీటి నమ్మడిని విక్రయించు కొనుచున్నారు.; లేక యనుభవించు చున్నారు. విద్యార్థుల ఆదాయమునుండి 72-80 డాల్లర్లవరకు కళాశాలకు జెల్లింప బడుచున్న. 60 డాలర్లు నివాసము వగైరాలకును, 90 డాలర్లు భోజనాదికములకును జెల్లించుచున్నారు. ఈ సంస్థను నెలకొల్పుటకు మాత్రము సదర్లండు గారు స్వయముగనే కొంతధనమును వ్యయము చేసిరి. ఇప్పుడది పూర్తిగ స్వయంపోషకముగ నున్నది.

ఇండియాలో నీ విధానమును కలకత్తా విశ్వవిద్యాలయమున కుపాధ్యక్షులుగ నుండిన సర్ ఆసుతోష్ ముఖర్జీగారు పరిశీలించి దానివిషయమై ప్రబోధము గలిగించుటకుగాను శ్రీ పటేలుగారి నావిశ్వవిశ్వవిద్యాలయమున ప్రత్యేకోపన్యాసకులుగనియమించి యుండిరి. కాని సర్ ముఖర్జీగారు తమ యభీష్టమును అమలులో బెట్టకముందే మన దేశపు దురదృష్టమువలన దివంగతులగుట తటస్థించెను.

ఇపుడు నిజాంరాష్ట్ర ప్రభుత్వమువా రీ విధానము నంగీకరించి పరిశీలించుచుండుట ముదావహము.

గ్రంథాలయోద్యమ నాయకులును, విద్యావ్యాపకమునం దభిమానముగల్గిన యితరులును, ఆంధ్రదేశమునగూడ నొకటి రెండు చోట్లనైనను నీ నూతన విధానమును పరీక్షించుటకు దగిన యాశ్రమముల నేర్పాటు గావించి వానియుపయుక్తతను ప్రభుత్వమునకును ప్రజలకును గోచరముచేయుట యత్నించుట సమంజసము:

ఈ విధానపు టుత్కృష్టతను ప్రభుత్వము గ్రహించునట్లుచేసి వారలచే కళాశాలలందు గాకపోయినను, గ్రామసీమలందలి ప్రాథమిక, మాధ్యమిక, ఉన్నతపాఠశాలలందైనను నీ స్వయంపోషక విధానమునములులో బెట్టింపగల్గుచో పాఠశాలలను నడుపుట కిపు డేటేట వ్యయముచేయబడు సొమ్మునందు కొంతభాగమైనను మిగిల్చి యేటేట గ్రొత్త పాఠశాలలను గొన్నింటిని వానికిదగిన వసతులతో నెలకొల్ప వీలగును. కొంతకాలమునకైనను పాఠశాలలకొరత దీరును. తమబాలురను స్వయంపోషకులుగ నొనర్పజాలు పాఠశాలలకు తమపిల్లలను బంపుటకు తలిదండ్రులును వెనుదీయరు. క్రమముగ గొన్ని యితరదేశములందువలెనే మనదేశమందును నూటికి 90 మందియైనను విద్యావంతులగుట కవకాశ మేర్పడును.

———

# ప్రాచీన భరతఖండమున గ్రంథప్రచారము, గ్రంథాలయములు

శ్రీ జటావల్లభుల పురుషోత్తము

ప్రిన్సిపాల్, సంస్కృతకళాశాల, కొవ్వూరు

ప్రపంచములోని గ్రంథము లన్నిటిలోను మొదటి గ్రంథము భారత దేశములోనే యుత్పన్నమాయెను. మానవ పుస్తకభాండాగారములో మొదటి గ్రంథము ఋగ్వేదమని మాక్సుముల్లర్ పండితుఁడు నుడివి యున్నాడు.

గ్రంథశబ్దముకూడ చిరకాలమునుండి మన దేశమున వాడుకలో నున్నది. క్రీస్తునకు పూర్వము నాలుగైదు శతాబ్దములనాడు రచింపబడినదని యాధునికులచేతఁ గూడఁ దలంపఁ బడుచున్న మనుస్మృతిలోఁ గూడ గ్రంథశబ్దమున్నది.

అజ్ఞేభ్యో గ్రంథినః శ్రేష్ఠా
గ్రంథిభ్యో ధారిణో వరాః

కాని యీ గ్రంథశబ్దమునకు గ్రంథములోని విషయమనియే యర్థమేకాని పత్రనిర్మితమైన పుస్తకమని యర్థముకాదు. గ్రంథమనగా ముడి యనియు, తాళపత్రగ్రంథములో పత్రముల నన్నిటిని కలిపి ముడి వేయుచుండెడివారనియు, కనుకనే గ్రంథమున కాపేరు కలిగెననియు మాక్డొనెల్ పండితుడు చెప్పియున్నాడు; కాని యీ నిర్వచనము సరికాదు. గ్రంథమనగా రచించుట (To Compose) యని యర్థము. గ్రంథములోని విషయము కవిచేరచింపబడినదగుటచే గ్రంథమున కాపేరు కల్గినది. కాళిదాసు శాకుంతలములో "కాళిదాస గ్రథితవస్తునా నవేన నాటకేన" అనిచెప్పుటచే నీవిషయమున సందేహమే లేదు. కావున గ్రంథశబ్దమునకు పుస్తకము అను అర్థము తరువాతనే వచ్చియుండును.

గ్రంథములు వ్రాయఁబడునాచారము భారతదేశములో నేనాడు ప్రారంభమైనదో చెప్పలేము. కాని క్రీ. పూ. కొన్ని వేల సంవత్సరములనుండియు భారతీయులకు లిపి తెలియునని యిటీవలి పరిశోధనలవలన వెల్లడియైనది. ఈనడుమ జరిగిన సింధుప్రాంత పరిశోధనల వలన క్రీ. పూ. 3000 సంవత్సరములనాడే భారత దేశములో లిపి యుండినట్లు తెలియుచున్నది. వ్యాకరణాచార్యుడైన పాణిని 'లిపి' శబ్దమును వాడియుండుటచే క్రీ.పూ. 600 ప్రాంతమునాటికే లిపి బాగుగా వాడుకలో నున్నట్లు తెలియుచున్నది. (3-2-21) పాణినికి పిమ్మట సుమారు రెండు శతాబ్దములకు వెలసి పాణిని యష్టాధ్యాయికి వార్తికములను వ్రాసిన కాత్యాయనుడు యవనుల 'లిపి'నిగూడ పేర్కొని యున్నాడు. యవనుల లిపి యనునర్థమున యవన శబ్దమునకు 'ఆనుక్' ప్రత్యయము వచ్చునని యాతఁడు చెప్పియున్నాఁడు.

'యవనా ల్లిప్యామ్'

ప్రాచీన భారతమున విజ్ఞానము లిఖిత గ్రంథముల మూలముననేగాక శైష్యోపాధ్యాయికచే మౌఖికముగనే ముఖ్యముగ వ్యాపించుటకుఁగారణము. ప్రజలు చాలమంది లిపి నెఱుఁగకుండుటయే యని తలచుట సరికాదు. అందులకు మూఁడు కారణములను పేర్కొనవచ్చును. (1) ప్రాచీన కాలమున ముఖ్యమైన యధ్యయన విషయము వేదమేయగుటచేతను, వేదము స్వరమాత్రాదులలో నీషత్తును వ్యత్యాసము లేకుండ గురుముఖమునుండి నేర్చుకొనవలసినదే యగుటచేతను,

లిఖిత ప్రతులలో తప్పులు పడుట కవకాశ ముండుటచే వానిని జూచి చదువుట వలన తప్పులు గల్గుటకు హెచ్చు నవకాశ ముండుట చేతను మౌఖికపాఠమే పుస్తకపాఠముకంటె మిన్నగ భావింపఁ బడుచుండెను. (2) విషయము పూర్తిగ జీర్ణము కావలెనన్నచో గ్రంథము నోటికి రావలెనే కాని పుస్తకాపేక్ష యుండరాదని మన ప్రాచీనులు తలచుచుండిరి. (3) గురు సన్నిధిని గొంతకాలముండి యాతని తపశ్శక్తిని, మహత్త్వమును శిష్యుడు గ్రహించుట ముఖ్యముగఁ దలంపఁ బడుచుండెను. గురుముఖముతోఁ బ్రత్యక్ష సంబంధముండిననే కాని యనిర్వాచ్యమగు గురుశక్తి శిష్యునకు సంక్రమింపఁ జాలదని భావింపఁ బడుచుండెను.

ఈ పై కారణములవలనఁ బుస్తకాపేక్ష లేకుండఁ బఠించుట ప్రశస్తమైనదిగ భావింపబడుచుండెను. వేద పఠనమునకు పుస్తకము నపేక్షించువాడు పాఠకాధముడని శిక్షలో చెప్పబడినది. ఈ శిక్ష పాణిని ప్రోక్తమని ప్రతీతి.

"గీతీ శీఘ్రీ శిరఃకంపీ తథా లిఖిత పాఠకః
అనర్థజ్ఞోఽల్పకంఠశ్చ షడేతే పాఠకాధమాః"

దీనినిబట్టి పాణినినాటికే పుస్తక పఠనముండెననియు, వేదమునకుఁగూడ నట్టి పఠనముండెననియు స్పష్టమగుచున్నది.

కాలక్రమమునఁ బండితులలో గ్రంథములు హెచ్చు వాడుకలోనికి వచ్చుటకుఁ గారణము భాష్యములు, వ్యాఖ్యానములు బయలుదేరుట యని చెప్పవలెను. అట్టివానిలో మొదటిది పతంజలి మహాభాష్యము. ఈ గ్రంథములు సూత్రములవలె సంగ్రహముగా నుండక విపులములై, ధారణకు సులభములు కాకపోవుట చేతను, వేదములకువలె వీనికి ధారణము వలన పారమార్థిక ప్రయోజనము లేకపోవుటచేతను పండితులు వీనిని కంఠస్థము చేయక పుస్తకముల సహాయముతోనే కృషి చేయుచుండిరి.

మొత్తముమీఁద బ్రాచీన కాలమున నార్య విజ్ఞానము ప్రధానముగఁ బండితుల కంఠములయందే యుండెడిదని చెప్పవచ్చును. నేడొక గ్రంథాలయములో నిముడ్చుటకు వీలైనన్ని గ్రంథములను. చతుర్వేదములను, షట్ఛాస్త్రములను, షడ్దర్శనములను, శ్రౌతసూత్రములను, గృహ్యసూత్రములను ధర్మసూత్రములను— తమబుఱ్ఱలోనే మోసికొనిపోవు పండితు లానాఁడెందరో యుండిరి. ఇది వైదేశిక పండితులుకూడ నంగీకరించిన యంశము. విల్సన్ పండితుడు "ప్రాచీన భరతఖండమున ప్రతి బ్రాహ్మణుడు సంచార గ్రంథాలయము" అని చెప్పియున్నాడు.

ఆనాడు నేటి గ్రంథాలయములను బోలినవి లేకున్న నేమి? సంచార గ్రంథాలయములని చెప్పదగిన యా పండితుడులే ప్రజల యజ్ఞానాంధకారమును బోగొట్టు జ్ఞానజ్యోతులుగ నుండిరి. గ్రంథాలయోద్యమ చరిత్రను దలచుకొనునప్పుడు మన మీ సంచార గ్రంథాలయములు భారతదేశ వైజ్ఞానికాభివృద్ధి కెంత తోడ్పడినవో గుర్తింపకపోయినచో నది సమగ్రమగు చరిత్ర కాజాలదు. ఇట్టి పండితులు తఱచుగా గలసికొనుటయు, సంప్రదించుకొనుటయు, నొకరిభావముల నొకరు తెలిసికొనుటయు, గూడ జరుగుచుండెను. ఋగ్వేదదశమమండలములోని యీ క్రిందివాక్యము లీ సందర్భమున నుల్లేఖింపదగినవి:

"సంగచ్ఛధ్వం సంవదధ్వం సంవామనాంసి జానతాం"

తాము నేర్చిన గ్రంథముల నితరులకు బోధించుట యీ పండితుల ధర్మమై యుండెను. అధ్యాపనములేని యధ్యయనమునకు శాస్త్రములు ప్రశస్తి నంగీకరింపలేదు. శ్రీహర్షుడు చెప్పినట్లు "ఆధీతి" బోధ" "ఆచరణము" "ప్రచారము" అనునవి యుత్తమపండిత లక్షణములుగ భావింపబడుచుండెను. గురుకులపద్ధతి మూలమునను, పురాణపఠనము మూలమునను, కథలమూలమునను నీవిజ్ఞాన ప్రచారము జరుగుచుండెను.

ఇట్లు ముఖ్యముగ మౌఖికముగ గ్రంథప్రచారము జరుగుచుండిన కాలములోగూడ లిపి కొన్ని కార్యముల కుపయోగింప బడుచుండెను. రాజశాసనములు, దానపట్టములు మున్నగువానికిని లిపి బహాటముగా వాడబడుచుండెను. క్రీస్తుకు పూర్వము 3000 ప్రాంతముననే శాసనములకు లిపి వాడబడుచుండెనని పైన జెప్పబడినది. అశోకుని కాలమున నెన్నియో శాసనములు శిలలపైన జెక్కబడినవి. భారతదేశ చరిత్రము, ముఖ్యముగ ఆంధ్రదేశ చరిత్రము తెలిసికొనుటలో నీ శాసనము లెట్లు తోడ్పడునో యాంధ్రు లెఱుగనిది కాదు. శిలలు, కఱ్ఱపలకలు, రాగిరేకులు, భూర్జపత్రములు, మున్నగువానిపైన లేఖనము జరుగుచుండెను. గ్రంథములు చాలవఱకు భూర్జపత్రములపైనను, తాళపత్రములపైనను లిఖింపబడుచుండెను.

గ్రంథమునకు పుస్తక మను నర్థ మిటీవల వచ్చినదే కాని మొదటలేదని పైనం జూచియుంటిమి. పుస్తకమునకుమాత్ర మిట్టియర్థము (Book అను నర్థము) మొదటినుండియు నుండెను. పుస్తక శబ్దము "పుస్తబంధాదరాదా"అను ధాతువునుండి వచ్చినది. "కట్టబడినది"(Bound) అని పుస్తకశబ్దమున కర్థము. సరస్వతి పుస్తకము హస్తమందు గలదిగావర్ణింపబడు ప్రాచీనశ్లోకములు కలవు. మహాభారతమునకు పరిశిష్టమనబడు హరివంశములో "పుస్తకపూజ" కూడ జెప్పబడినది.

"అర్చయేత యథా న్యాయం గంధమాల్యైః
పృథక్ పృథక్" సంహితా పుస్తకాన్ రాజన్
ప్రయతశ్శిష్ట సమ్మతః"

లిఖితగ్రంథములు హెచ్చువాడుక లోనికి వచ్చినపిమ్మట పుస్తకదానము కూడ విద్యాదానమువలెనే పుణ్యముగ భావింపబడుచుండెను. కొన్ని ధర్మశాస్త్ర గ్రంథములలో పుస్తకదానము ప్రశంసింపబడి యున్నది.

ఏకాలములోనైనను విద్యానిధులైన గురువుల పైనగల పఠనప్రబోధన బాధ్యతను గొంతవఱకు గ్రంథములు తగ్గించుననుట సత్యము. అట్టిగ్రంథములు విద్యనుజెప్పు గురువునకును శిష్యునకును గూడ సమముగానే యుపయోగపడును. కావుననే ప్రాచీనకాలమున మన దేశములో, గురుశిష్య సంబంధము హెచ్చుగనుండిన కాలములో గూడ ఉద్గ్రంథసముదాయమే యాచార్యునివద్ద నుండెడిదో యట్టి యాచార్యుని యొద్దకుఛాత్రులు విశేషముగా జేరుచుండిరి. "గ్రంథ భాండారము గలవాడే యాచార్యుడు"

'కోశవా నాచార్యః'

అను నానుడి యందువలననే యేర్పడినది.

సామాన్యగురువుల యొద్దకంటె గురుకులములలో గొప్ప గ్రంథభాండాగారము లుండెను. క్రీ. పూ. నాల్గవశతాబ్ది ప్రాంతమున జగత్ప్రసిద్ధి నొందియుండిన తక్షశిలా విద్యాపీఠములో వేలకొలది గ్రంథములతోగూడిన భాండాగారముండెను. కాశీలోను, పాటలీపుత్రములోను విల

సిల్లిన ప్రాచీనవిద్యాపీఠములలో గూడ బెద్ద గ్రంథాలయము లుండెను. క్రీస్తుకుఁ బిమ్మట దాదాపు నాలుగువందల సంవత్సరములకు మన దేశమునకు వచ్చిన చైనీయ యాత్రికుడగు ఫాహియన్ పాటలీపుత్రములోను, తామ్రలిప్తిలోను నుండిన విద్యాపీఠములలో గొప్ప పుస్తక భాండాగారములను తాను జూచినట్లు వ్రాసియున్నాడు. ఏడవ శతాబ్దిలో నిటకువచ్చిన హ్యూయన్ సాంగ్ అను చైనా దేశీయుడు తన దేశమునకు తిరిగిపోవునపుడు 520 కట్టల తాటాకుల పుస్తకములను తీసుకొని వెడలెను. దీనినిబట్టిచూడ నాతడు గ్రంథకోశములను గల్గిన వ్యక్తులను, గురుకులములనుదర్శించి యుండెనని తోచుచున్నది. క్రీ. శ. 7వ శతాబ్దిలో వర్ధిల్లిన నలంద విశ్వవిద్యాలయములో 'రత్నోదధి' యను పేరుగల ప్రశస్తమైన పుస్తక భాండాగారముండెను. అది యసూయాపరులగుభిక్షువులచేత తగులబెట్టబడెనని టిబెటు దేశములోనొక వదంతికలదు. బీహారులోని ఓదంతపురములో క్రీ. శ. 9 వ శతాబ్దిలో మిక్కిలి పెద్ద భాండాగార ముండెను. ఈ మహాభాండాగారము 13 వశతాబ్దిలో తురుష్కులచేత నాశనము చేయబడెను. గుజరాతు ప్రాంతములో జాలచోట్ల జైనమత గ్రంథముల కోశము లుండెను. బరోడా సంస్థానములోని పట్టన్ అను గ్రామమున 11, 12 శతాబ్దులలో 13 వేల గ్రంథములుగల గ్రంథాలయముండెను. 13 వ శతాబ్దిలో విశాలదేవుడను చాళుక్య రాజువద్ద నొక గ్రంథకోశ ముండెను. భారతీభాండాగారమని దానిపేరు. ఇట్టి భాండాగారము లెన్ని యజ్ఞాతములై యున్నవో చెప్పలేము. ముస్లిముల ప్రభువు యాదరణమున గూడ జాల గ్రంథాలయములు విలసిల్లినవి.

పూర్వము మఠపీఠాధిపతుల యొద్దను, మహారాజుల యొద్దను నుండిన గ్రంథాలయములు నేటికిని నిలిచియుండుట చెప్పదగిన విషయము. "శృంగేరీ"మున్నగు పీఠములలోను, బరోడా, మైసూరు, జయపూరు, బికనీరు మున్నగు సంస్థానములలోను నేటికి గూడ నా గ్రంథాలయములు గన్పట్టుచున్నవి. నేడు అడయారు లిఖిత గ్రంథాలయములోను, మద్రాసు మున్నగు చోట్లనున్న ప్రభుత్వమువారి లిఖితపుస్తక భాండాగారములలోను గన్పట్టు గ్రంథములు పూర్వపు భాండాగారములనుండి నిలబెట్టబడినవే. ధనమున కాశపడిన వ్యక్తు లనేకులు తమపూర్వుల భాండాగారములను ఇంగ్లండు, ఫ్రాంసు, జర్మని మున్నగు పాశ్చాత్య దేశములనుండి గ్రంథములను సంగ్రహించుటకీ దేశమునకు వచ్చినవారికమ్మివేసిరి. అట్లు గ్రంథములను సేకరించినవారికాయా పాశ్చాత్య దేశముల ప్రభుత్వములు ధనసహాయము గూడ జేయుచుండెను.

ఇతర దేశములలో వలెనే భారతదేశములో గూడ ముద్రణయంత్రము వెలయుటతో గ్రంథాలయ చరిత్రకు నూతనశకమావిర్భవించినది. నవీన విజ్ఞానమును నవీనపద్ధతులలో వ్యాపింపజేయుట యెంత యవసరమైనను, మన ప్రాచీనులు తమ యపారవైజ్ఞానికతృష్ణచే విలసిల్లజేసిన యసంఖ్యాకములగు భౌతికాధ్యాత్మికశాస్త్రములనుపునరుద్ధరించుటయు, వారు నిశ్శేష శ్రమనోర్చి వ్రాసికొని నేటివఱకును నిలువబెట్టిన గ్రంథరత్నములను నవీనయంత్ర శాణములచే నూతనోత్తేజితములగావించి ప్రచారములోనికి దెచ్చుటయు మన యందఱ విధియునై యున్నది.

# గ్రంథాలయనిర్వహణ సంఘాలు

శ్రీ పాతూరి నాగభూషణం

ఏ సంస్థగాని సక్రమంగా తన ధర్మాన్ని నెరవేర్చాలంటే దానిని నడుపు పెద్దలు దాని కార్యక్రమంపట్ల శ్రద్ధాభక్తులు గలవారుగ ఉండడం అవసరం. ప్రజలు పన్నుల రూపాన తమ గ్రంథాలయాల నిర్వహణానికి ధనాన్నిస్తున్న అమెరికా బ్రిటను మున్నగు దేశాలలోనే ఎంతో విజ్ఞానముండీకూడ—కొన్ని గ్రంథాలయాల కమిటీసభ్యుల అశ్రద్ధ, సోమరితనం మూలంగా వారి గ్రంథాలయాల అభివృద్ధికెంతో అంతరాయం కలుగుతున్నట్లు వింటాం. అయినప్పుడు డబ్బూ లేక; నిర్వాహకులు శ్రద్ధతో కృషిగూడ చేయకపోతే మనమెల్లు గ్రంథాలయాల నడపగలమో ఊహించుకోవచ్చు.

ఇప్పుడు మనదేశంలోనే పౌర గ్రంథాలయా (పబ్లిక్ లైబ్రరీ) లనేక విధాలుగా ఉన్నాయి. వీని పరిపాలనకూడ ఒక్క విధంగా లేదు; వ్యక్తుల యిష్టాయిష్టాల ననుసరించి నడచేవి కొన్ని; జిల్లా బోర్డులు; మునిసిపాలిటీలు; పంచాయితీబోర్డుల అధీనంలో నున్నవి కొన్ని—సహకార సంఘాలచే సాగింపబడేవి కొన్ని; ప్రజాసంఘాలచే నిర్వహింపబడేవి కొన్ని; గుడ్డిలో మెల్లవలె ధనలోపమున్నా పరిపాలనవిషయంలో కమిటీ (ప్రజాసంఘ) గ్రంథాలయాలపనే కొంచెం నయంగావుంది. గ్రంథాలయాలునడిపేనిమిత్తం ప్రత్యేకంగాయేర్పడ్డ కమిటీలయాశయం విస్పష్టమే. తక్కిన పై సంస్థలకార్యక్రమంలో గ్రంథాలయ నిర్వహణానికి ప్రాధాన్యత లేకపోవడం దీనికి ముఖ్యకారణం. 23వ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభలో చదివిన వ్యాసము స్వయంగా తాముచదువుకొన్నవారుగాక, విద్యయొక్క విలువను దెలియనివారు కొందఱు పైసంస్థలలో సభ్యులుగావున్న కారణంచేతను; చదువుకొని విద్యయొక్క ప్రయోజనాల నెఱిగికూడ విద్యాప్రచారము ముఖ్యమైనపని కానట్లును, గ్రంథాలయము లీపనిసంతగ నిర్వహింపజాలవన్నట్లును నిర్లక్ష్యభావముతో కాలంగడుపువారీ సంస్థలలో ఎక్కువగ నున్నందుసను, ఈసంస్థల యాజమాన్యాన నడచే గ్రంథాలయాల కార్యక్రమం సంతృప్తికరంగా వుండకంలేదు. అచ్చటచ్చట బుద్ధిమంతు లెవరైన వీనిని బాగుగా సాగింపబూనినా ప్రభుత్వంవారి ఫర్మానాలు అడుగడుగునకు వీరి కాటంకముల గల్పించు చున్నవి.

## కార్యవర్గ నిర్మాణము

పెద్ద పెద్ద కమిటీలు ఏ సంస్థనుగాని సమర్థముగ నిర్వహింపజూడడం సాధ్యముగాని పని. తమవిధుల బాగుగా నెఱిగి వానిని నెరవేర్చుటలో జాగరూకులైయుండు కొద్దిమంది కార్యకర్తల నెన్నుకొని వారిద్వారా సంఘ కార్యక్రమమును సాగించుట సులువైనపద్ధతి. కమిటీ గ్రంథాలయాలలో పాలకవర్గము నెన్నుకొనేపద్ధతి అమలునందున్నదిగాని ఈ ఎన్నిక లోకవిధానానికి లోబడి చేయబడక పోవడంతో ఇందుమూలాన కలుగవలసిన ఫలితం కలగడంలేదు. అధ్యక్షుడు, కార్యదర్శి, కోశాధిపతి, మున్నగు నుద్యోగులు లాంఛనంగా నేర్పడుచున్నారేతప్ప వీరిలో మన

న్యూస్ఫర్తిగ తమవిధుల నెఱవేర్చువారంతగ కానబడరు. స్థానికసంస్థలు, సహకార సంఘములు సహితము ఇంగ్లాండు దేశములో వలెనే తమ యధీనమందున్న గ్రంథాలయాల నిర్వహణ విషయంలో తోడ్పడటానికి కనీసం పాలనాధికారంలేని రికమండింగు కమిటీలనో, నిర్వహణ విషయంలో కొంత అధికారంతో కూడిన గవర్నింగు కమిటీలనో నియమించడం అవసరం. ఈ కమిటీలలో గ్రంథాలయాభిమానులైన వారిని, పండితులు, శాస్త్రవేత్తలు, వ్యాపారదక్షులు, గ్రంథనిర్మాణశాస్త్రజ్ఞులు మొదలైనవారిస్థానికుల నుండిన్నీ, అవసరమైన, యితరులనుండిన్నీ కూడ చేర్చడం మంచిది. పాలకవర్గాన్ని ఎన్నుకోవడంలోగాని; పైనజెప్పిన కమిటీల నియామకంలోగాని వ్యక్తుల భాగ్యభోగాలకన్నా వారిదక్షత, శ్రద్ధాభక్తులు ముఖ్యంగా చూడాలి. సమాజం యొక్క మానసిక వికాసానికి తోడ్పడాలనే భావంలేని సభ్యులీకమిటీలలో నుండదగరు.

ఇట్లెన్నుకోబడ్డ లేక నియమింపబడ్డ సభ్యులు తమధర్మాన్ని ఎట్లు నెరవేర్చాలోకూడ తెలిసికోవడం అవసరం. ఈవిధంగా ఏర్పడే కార్యవర్గానికి ముఖ్యుడు కార్యదర్శి. ఈతడు మామూలుగుమాస్తా వలె కాగితాలు తిరగేసేవాడుగా వుంటే చాలదు. తాను నడిపే సంస్థకు కన్ను, కాలు, చెయ్యి, చెవి తానే యై సర్వకాల సర్వావస్థలయందు తన శక్తులన్నింటిని దానిఅభివృద్ధినిమిత్తం వినియోగించే దీక్షాపరుడుదప్ప ఈ యుద్యోగానికి పనికిరాడు. అధ్యక్షుడు పేరుకు పెద్దగాని నిజానికి కార్యదర్శియే సంఘాన్ని నడపేవాడు. సమర్థుడైన కార్యదర్శి లేనిసంఘం కన్నులులేని కబోదివంటిది.

## కమిటీ విధులు

గ్రంథాలయమునకు ప్రాణమువంటి వాడు గ్రంథభాండాగారి. సమర్థుడగు భాండాగారిని నియమించడం కమిటీయొక్క ప్రధాన కర్తవ్యం. ఇది చాల కఠినకార్యంకూడ. ఈ పని చక్కగ నెరవేర్చ బడిందా? కమిటీ చేయవలసిన తక్కిన పనంతా సులభమే. తా మేర్పఱచుకొన్న గ్రంథపాలకుడు యోగ్యుడును, సమర్థుడును అయినట్లయితే ఇతడన్ని విధాల కమిటీవారికి తోడుపడుతూ ఉంటాడు. కమిటీకిని గ్రంథభాండాగారికిని గల సంబంధము చాలా సన్నిహితమైనది. దిగువ సంగతు లీ యుభయుల మధ్యగల అవినాభావ సంబంధమును స్పష్టపఱచగలవు.

కమిటీ తీర్మానాలు, చేస్తూవుంటే గ్రంథభాండాగారి వాని నమలు పరుస్తూ ఉంటాడు. గ్రంథాలయ కార్య విధానమును నిర్ణయించే భారం కమిటీ వహిస్తే, దాని నాచరణలో నుంచే బాధ్యత భాండాగారి వహిస్తాడు. గ్రంథాలయం తెరచి యుంచవలసిన కాలాన్ని కమిటీ నిర్ణయిస్తే, నిత్యం తెరచే సమయాన్ని భాండాగారి నిర్ణయిస్తాడు. కమిటీ గ్రంథాలయ నిబంధనల నేర్పరిస్తే, వానిని నడిపే బాధ్యతను భాండాగారి పుచ్చుకుంటాడు. గ్రంథాలయంలోని పుస్తకాల జాబితాల నచ్చు వేయాలని కమిటీ తీర్మానిస్తే, అవి అచ్చువేయవలసిన పద్ధతిని భాండాగారి నిర్ణయిస్తాడు. భవనము, సిబ్బంది, గ్రంథాలయానికి సంబంధించిన వివిధ శాఖలను కమిటీ పై నుండి పరిశీలిస్తూ ఉంటే, లోపల కార్యక్రమాని కంతటికీ భాండాగారి బాధ్యత వహిస్తాడు. భాండాగారి నియామకంతో పాటు చందా వగైరాల వసూళ్లు

శాఖాలయాలు మున్నగు వాని స్థాపన, సంఘానికిసంబంధించిన స్థిర. చరాస్తులపరిపాలన,ఆదాయ వ్యయములు మొదలైన విషయాలబాధ్యత కమిటీదైతే, భవనాన్ని అందులోని పుస్తకాల్ని ఇతర పరికరాల్ని కాపాడుతూ, సిబ్బందికి పుస్తకాలు వగైరాలకు చెల్లించవలసిన బిల్లుల నామోదిస్తూ, నివేదికలువగైరా తయారు చేస్తూ తన అధీనంలోనున్న విజ్ఞానసామగ్రిని అందరికీ అందజేసే ముఖ్య బాధ్యతను వహిస్తాడు. వీలైనంత వరకు కమిటీవారు గ్రంథభాండాగారి పనిలో కల్పించుకోక అవసరమైన సిబ్బందిని నియమించుకోవడంలోను, వారిచే పనిగొనడంలోను, గ్రంథ నిర్ణాయక కార్యములోను, గ్రంథాలయ నిత్య నిర్వహణకు సంబంధించిన అన్ని విషయములలోను అతనికి సంపూర్ణాధికారం ఇవ్వడం మంచిది. యోగ్యుడును, సమర్థుడును నగువానిని ముందుగ ఆలోచించి, పనిలోచేర్చుకొన్నతదుపరి చీటికి మాటికి కమిటీవారు భాండాగారిపై పెత్తనము చేయజూచుట పాడిగాదు. గ్రంథాలయ కార్యక్రమములో భాండాగారియొక్క స్థానమును సరిగ గ్రహించినవారెవ్వరుగాని ఇట్లు చేయజూడరు. కమిటీవిధులకు సంబంధించినమాట మరొక్కటి కలదు. రాజకీయ, సాంఘికాది విషయాలలో గ్రంథాలయముద్వారా కమిటీవారే యొక్క పక్షము (పార్టీ) నుగాని ప్రత్యేకముగ ప్రోత్సహించరాదు. నిష్పక్షపాతబుద్ధితో అన్ని కక్షలకును వీలైనంతవఱకు సమాన ప్రాతినిధ్యమును వీరు గ్రంథాలయమునకు పుస్తకాలు వగైరా సంపాదించుటలోను గ్రంథాలయ భవనంవగైరాలను అన్ని వర్గములవారిని తమ వీలునుసరించి వాడుకొననివ్వడంలోను చూపవలెను. ఈప్రత్యేక ధర్మ నిర్వహణ విషయమై భాండాగారియు కమిటీవారికి పూర్తిగ తోడుపడుచుండవలెను.

కమిటీసభ్యులు మొత్తంగా చేరి నిర్వహించవలసిన విధులను తెలిసికొన్నాము. వ్యక్తిగతంగా వీరు నెరవేర్చవలసిన బాధ్యతలుకూడ కొన్ని ఉన్నాయి. కమిటీ సమావేశాలన్నిటికీ తప్పక హాజరవుతూ,తమకు దగ్గరలోనున్న తోడిగ్రంథాలయాల దర్శిస్తూ, తమకున్నఅవకాశాలను తమ ఆశయాలను అర్థం చేసుకొని తమ ప్రాంతపు టవరాలను కోరికలను గమనిస్తూ, తమగ్రంథాలయ కార్యక్రమాన్ని అభిమానంతోను, ఉత్సాహంతోను సాగించాలనే కోరికను వీరెప్పుడూ కలిగివుండాలి.

## ఉపసంఘాలు

కార్యక్రమం ఎక్కువగావుండే పక్షంలో పని చక్కగాను, చురుకుగాను జరిగేనిమిత్తం వేరు వేరు పనుల నిర్వహణకొఱకు కమిటీ ఉపసంఘాలను నియమించుకోవడంమేలు. తమ కప్పగించబడిన పనిముగిస్తూనే ఈ ఉపసంఘాలు రద్దవుతాయి వీనిని నియమించేటప్పుడు వీనికార్యక్రమాన్ని అధికారాల్ని కమిటీవారే నిర్ణయిస్తారు. ఈఉపసంఘాలొక్కొక్కప్పుడుసలహాసంఘాలుగాను ఒక్కొక్కప్పుడు తమ కొప్పగించబడిన పనివిషయమై పూర్తి బాధ్యతనువహించు కార్యనిర్వాహక సంఘాలు గాను పనిచేస్తూ వుంటాయి.

## సర్వసభ్యసభ

ఈ వ్యాసమునందంతటను కమిటీ అనే మాట ముఖ్యంగా నిర్వహణ సంఘం అనే పదానికి బదులుగ ప్రయోగింప బడింది. ఈ నిర్వహణ సంఘానికి పాలకవర్గం, కార్యకారిణీ సమితి,

కార్యవర్గం, కార్యనిర్వాహకసంఘం అని పలువురు పలువిధాలుగా వాడుతున్నారు. ఈ పేర్లు వినబడే చోటనల్లా వీనికి మూలకారణమైన పెద్ద సంఘమొకటి ఉంటుంది. ఏడాది కొకమాటో, మూడేండ్ల కొకమాటో, శాశ్వతముగనో ఈ పెద్ద సంఘాలు తమ ఆదర్శాల్ని అమల్లో పెట్టే నిమిత్తం కార్యవర్గాలను నియమించుకోవడం, ఈకార్యవర్గాలుతమ నెన్నుకొన్నసంఘాలకుల్లోబడి పని చేస్తూ ఉండడం మామూలుగా జరుగుతుంది. ఒక్కొక్క సందర్భంలో – ముఖ్యంగా సభ్యులు తక్కువగనున్న సంస్థల్లో – సంఘ సభ్యులంతా కార్యవర్గంగా ఉండటంకూడ సంభవిస్తుంది. కార్యవర్గాలకు పరిపాలనా విషయంలో స్వేచ్ఛ యున్నప్పటికీ వీనిపై పరిశీలనాధికారము అసలు సంఘానికి ఉంటుంది. అసలు సంఘానికి చేరిన సభ్యులందఱితో కూడిన సభ సర్వసభ్యసభ యనియు, సాధారణసంఘమనియు, సామాన్య సభ యనియు పలువిధాలుగా పిలువబడుతుంది. ఇంగ్లీషులో దీనిని 'జనరల్ బాడీ' (Genaral Body) అంటారు. ఈ సర్వసభ్యసభకు – ఇది ఏ సంఘానికి చెందినదిగానీ– పాలక వర్గాన్ని ఎన్నుకోవడానికి, సంవత్సర నివేదికలను, ఆదాయ వ్యయములను, బడ్జెటులను పరిశీలించడానికి మాత్రమే కాకుండా సంఘానికి సంబంధించిన సమస్త విషయాల్లోను సర్వాధికారం ఉంటుంది. దీని కీయధికారమే లేనట్లయితే పాలకవర్గంచేసే పొరపాట్ల మూలంగా అసలు సంస్థలకే భంగం కలగడం సంభవం.

—...—

# గ్రంథాలయ సేవలోని ఒక అఖ్యాయిక

శ్రీ గా. హరిసర్వోత్తమరావు

ఒక ప్రఖ్యాత వృద్ధ గృహస్థుడు ఒకప్పుడు మద్రాసు విశ్వవిద్యాలయపు గ్రంథాలయాధికారుల కొక యుత్తరము వ్రాసెను. ఆయన సామాన్యుడు కాడు. దేశీయ మహాసభ యధ్యక్ష పదవి నలంకరించినవాడు. ఆయన వ్రాసిన యుత్తరమున నొక కోరిక యుండినది. కొలంబసు అమెరికాను కనిపెట్టడానికి ముందు ఆ దేశపు సభ్యత ఎట్టిదో వివరించే గ్రంథము లేవో సలహా చేయుడని అందలి సారము. మద్రాసు యూనివర్సిటీ లైబ్రరీవా రేవో కొన్ని పుస్తకాల పేళ్లు, కొన్ని పత్రికలలోని వ్యాసాల పేర్లు వ్రాసి పంపిరి. తుద కొక ముక్క జేర్చిరి. అమెరికా దేశపు మూల నివాసులను గురించి వ్రాసిన అనేక గ్రంథాలలో వారి సభ్యతకు సంబంధించిన సూచన లనేకములు కల వనిరి. కొన్ని నెలలయిన తరువాత అమెరికాలోని భూగోళశాస్త్ర సంఘమువారు తాము ప్రకటించిన రెండు ప్రచురణములను గుఱించి ఒక ప్రకటన వేసిరి. దానికి " క్రీ. శ. 1000 లోను క్రీ.శ- 1492 లోను కనిపెట్టిన అమెరికా ఖండము" అని శీర్షిక యిచ్చిరి. దానిప్రతి యొకటి మద్రాసు విశ్వవిద్యాలయపు గ్రంథాలయమునకు పంపగా వారు పై ప్రఖ్యాత వృద్ధ గృహస్థునికి దాని విషయము తెలియ పర్చిరి. దానికి ప్రత్యుత్తరముగా ఆయన వ్రాసినజాబు వీరికి అందిన పిదప గాని

పూర్తిగా అతని మనసులోని కోరిక యేమో వీరికి బోధపడలేదు. అనాదికాలముననే భారతీయులు ఈశాన్యముగా ఆసియాగుండా ప్రయాణము చేసి అమెరికా చేరిరనియు అచ్చట తమ సభ్యతను నాటిరనియు అందుకు తగినంత సాక్ష్యము మెక్సికోలోను, పెరులోను దొరకగల దనియు. దాని ద్వారా అమెరికను భారతీయ సభ్యతల ఐక్యము కాకపోయినా పోలికనైనను ధృవపరచనగుననియు ఈయన ఎచ్చటనో చదివి యుండిరట! దాని విషయమయి పరిశీలన చేయుట వారు పనిగా పెట్టుకొనిరట! తగిన గ్రంథమో గ్రంథాలో దొరికితే రు 100 లయినా ఇచ్చుటకు సిద్ధమట. "కొలంబసుకు ముందుకాలపు అమెరికాలోని హిందూసభ్యత" ను గురించి ఆయన వివరణ గ్రంథాలు కోరుతున్నాడనుటకు ఇట్లు మూడు నెలలు పట్టినది. అప్పుడు మద్రాసు విశ్వవిద్యాలయ గ్రంథాలయమువారు తమకు గల లక్ష గ్రంథ పరిమితితోను ఇచటి ఇతర గ్రంథాలయముల సహాయముతోను ఈ విషయమున తృప్తికరముగా ప్రత్యుత్తర మీయ లేకుండుటను తీర్మానించిరి. కాబట్టి అమెరికాలోని కాంగ్రెసుకు చెందిన గ్రంథాలయాధికారులకు వ్రాసిరి. ఈ విషయమయిన పుస్తకాలజాబితా నిచ్చుచు అందులో ఉత్తమమయినవియు, పూర్తిగా ఇటీవల సమగ్రంగా ప్రకటితమయినవియు యేవో యొకటి రెండు తెలుపుడనిరి. మూడు నెలల లోపుగా ప్రత్యుత్తరము వచ్చినది. ఆకాంగ్రెసు గ్రంథాలయములో గ్రంథాలజాబితా ముఖ్యోద్యోగి ఈ విషయమయి తయారుచేసిన నివేదిక యొకటి, అమెరికాలో ప్రాచీన మాయన్ సామ్రాజ్యానికి (మయసామ్రాజ్యమా?) సంబంధించిన పరిశోధనలను వివరించు పత్రిక కత్తిరింపు ఒకటి, కొలంబసుకు ముందటి అమెరికాలోని కళలు, మయజాతుల ప్రాచీనసభ్యత ఆచారాలు వగైరాల గ్రంథస్థ విషయసూచిక (ఇది చాల విపులమైనది) గ్రంథముల జాబితా ఇన్నిటిని పంపిరి. ఈ రెండు సూచీలు 50 పుటల గ్రంథము. అంతకుముందేదో మరియొకపనికయి సిద్ధపరచినవి. ఇందులో ఏది ఉత్తమమో తాము అధికారరీత్యా అభిప్రాయమివ్వ వీలులేదనికూడా వ్రాసిరి. ఈ సామగ్రి అంతటిని మొదట ప్రశ్న వేసిన ప్రఖ్యాతి వృద్ధ గృహస్థునికి అందివ్వటముతో ఆయన పరమానంద భరితుడైనాడని వేరుగా చెప్పవలెనా! ఏడాది అయిన పిదప కామకోటి పీఠాధీశ్వరులు శ్రీ శ్రీ జగద్గురు శంకరాచార్యులవారు మద్రాసులో ఉపన్యసించుచూ చాలా ప్రాచీనకాలములోనే భారతసభ్యత జగద్వ్యాప్తమయినది. ఆ దెబ్బలో అమెరికాలోనూ వ్యాపించింది అని చెప్పడముతో అనేకులు గ్రంథాలయంలోకి వచ్చి వివరాలు అడుగట మారంభించిరి. ఏడాదిక్రిందటి ప్రఖ్యాతి వృద్ధ గృహస్థుని ప్రేరేపణచే జరిగిన గ్రంథాలయ కృషిఫలితము వీరందరను అనుభవించి ఆనందించిరి. ఎక్కడో అమెరికాలోని వాషింగ్టనులో సిద్ధపరచిన గ్రంథములజాబితా మద్రాసులో సంవత్సరదినములు నిరంతరము వినియోగపడినది.

ఈ యాఖ్యాయిక వివరాలన్నిటినీ నేను మద్రాసు విశ్వవిద్యాలయపు లైబ్రేరియన్ శ్రీ యస్. ఆర్. రంగనాధన్ యమ్. ఏ., ఎల్. టి. గారు వ్రాసి ప్రకటించిన "రెఫరెన్సు సర్వీసు అండ్ బిబ్లియోగ్రఫీ" 1 సంపుటమునుండి గైకొన్నాను.

ఈ యాఖ్యాయికను గ్రంథాలయ సేవకులు

గమనింప దగును. చదువరులు కోరుకోరిక ఏమో జాగ్రత్తగా కనిపెట్టుట మొదటిపని. ఆకోరిక పూర్తి చేయడానికి తమరు తమ గ్రంథాలయానికి ఎంతవఱకు అవకాశమున్నదో నిర్ణయించుకొనడము రెండవపని. తమకు తగిన యవకాశము లేదని తోచినప్పుడు తమకు తోడ్పడగలరని తోచే ఇతరగ్రంథాలయాధికారులతో సంప్రతింపు చేయడము మూడవపని. తేలిన వివరణను తమ్మునుప్రశ్నించినవారికి చేర్చడమేకాక ముందు వినియోగానికయి జతపర్చిపెట్టడము నాల్గవపని. ఈ ఆఖ్యాయిక చదువునట్టి చదువరులకును ఇందులో కొంత ప్రయోజన ముండగలదు. గ్రంథాలయోద్యోగి బీరువాలోని పుస్తకాలను బయటికి తీసి తమచేతికి అందిచ్చేమాత్రపు వట్టి నౌకరు గాదు. తమకు కావలసిన వివరాలకు, కావలసిన గ్రంథసామగ్రి తనవద్దనున్న కనిపెట్టి సహాయ పడుటకు, లేకున్న శ్రమచేసి మరియొక చోటినుండి కనిపెట్టి తోడ్పడుటకు ఏర్పడిన విజ్ఞాన సాధన కార్యమున సహకారి. చదువరికిని గ్రంథాలయోద్యోగికిని ఉన్న ఈ పరస్పరమైత్రిబంధమును ఇరుపక్షములు అర్థము చేసికొనుటకే ఈ యాఖ్యాయిక నిచ్చుట నుద్ఘాటించితిని.

---

# ప్రయోజన విద్య

శ్రీ మంగిపూడి విశ్వప్రసాద్

ప్రయోజనవిద్యను గూర్చి విపులముగా విమర్శించుటకు పూర్వము ప్రయోజనవిద్య యనగా ఏది నిశ్చయముగా తలపబడుచున్నదో యొక్కింత పరిశీలించుట యుక్తము. విద్యయను శబ్దము సామాన్యముగా జ్ఞానమును స్ఫురింప జేయుచున్నది. ఐనను ఇది యక్షరాస్యతను తెల్పుటకు కూడ వాడబడుచున్నది. మూడవదగు వేదాంతార్థము నీయెడ మనము విస్మరింపవచ్చును. కాన ప్రయోజనవిద్యావ్యాప్తికై గడంగునప్పుడు అక్షరాస్యతా విజ్ఞానముల రెంటిని మనము కొంతకొంతగా పర్యాలోచింప వలసి యుండును.

అక్షరాస్యతా విజ్ఞానములలో నేది ప్రాధాన్యము వహించుచున్నదో, యెద్దానికి మనము ప్రాముఖ్య మొసంగవలయునో గూడ నిర్ణయింప వలసియున్నది. మనుష్యుని జీవిత విధానములో నతని కెక్కువగా నుపకరించునది యేదో దానికే మనము నిస్సందేహముగా ప్రాముఖ్య మొసగవలయును. ప్రాథమిక మాధ్యమిక పాఠశాలల పర్యంతము ప్రస్తుత విద్యాప్రణాలిక ప్రకారము బాలుర కొసగబడు విద్యయెల్లను అతని భావిజీవితములో నేపాటియు సాయపడక, నామమాత్ర విద్యాయుతునిగనే చేయుచుండుట మన కనుభవైకవేద్యమే. అయినచో మానవుని అక్షరాస్యునిగ జేయుటతోనే విద్యయొక్క యుద్దేశ్యము నెరవేరలేదనియు నాతని పరిపూర్ణ జ్ఞానవంతునిగ, నీ ప్రపంచములో తా నాచరింపవలసిన పనులన్నిటికిని సమర్థునిగ, తా నవలంబింపవలసిన వృత్తికి తగినవానిగ, అన్నిటికంటెను ముఖ్యముగ నతని లోకజ్ఞానయుతునిగ, చేయుట విద్యయొక్క పరమలక్ష్యమని చెప్పుపెద్దలమాట నిర్వివాదము.

## విజ్ఞానము

ఈ యర్థము ననుసరించి వయోజనవిద్యలో గూడ విద్యార్థులను సాంగోపాంగముగ విజ్ఞాన శాఖలలో ముఖ్యమైన యన్నిటిని నేర్పునట్లు చూచుట మన యాశయమై యుండవలెను. విజ్ఞానవిషయములలో వారి కత్యంత ప్రయోజన కరమైనవి వృత్తివిషయికమగునవి. ఈ యంశమున నొక్క సంశయమునకు తావున్నది. అది వృత్తిసంబంధమగు జ్ఞానములో మనకన్న నెక్కుడు వారే గడసరులనునది. దీనియందు కొంత యాథార్థ్యము లేకపోలేదు. ఒకవ్యవసాయకునివద్ద గాని వర్తకునియొద్దగాని కొంత తడవున్నచో అతని కున్న సూక్ష్మబుద్ధికై మన మాశ్చర్యము నొందవచ్చును. కాని మన సామాన్యబుద్ధికితోచు విషయము లాయనుభవశాలి కేల దోపవా యని గూడ ఒకప్పుడు చిత్రమగుచుండును. కాన సరిగా చూడగల్గినచో వారి వృత్తివిద్యలందు గూడ మనసాయమునకు చోటు కలదని గ్రహింపవచ్చును. ఇదికాక వృత్తికి సంబంధించిన సకల విషయములను వారి కెరుక పరచుటలో గూడ లాభము గలదు. పరిశ్రమలు, వానికి గావలసిన వస్తువులు, వానిఉత్పత్తి, ఎగుమతి చేయబడు దేశములు, లాభకరమగు పద్ధతులు—ఇట్టివి.

వృత్తివిద్యల తరువాత వారెరుగవలసినది వారి నిత్యజీవితములోని విషయములు లేక గృహశాస్త్రము. ఇచ్చటగూడ సంఘమువల్లను ఆచారమువల్లను నతడు నేర్చుకొన్నదెంతయో యుండును. అయినను, సక్రమమగు శాస్త్రీయ పద్ధతుల ననుసరించి సృష్టిచేయబడిన మన పూర్వనాగరికత మటుమాయమైన ఈదినములలో ఈవిషయము మన కట్టుబాటు చేయవలసిన దెంతయో గలదు. గృహశాంతి, కుటుంబప్రేమ, పెద్దలపట్ల గౌరవము, నమ్రత, అతిథులపట్ల నాదరణ, గృహస్థ ధర్మము, మొదలగునవి. ఇంటి శుచి; శుభ్రత, అలంకరణము, వస్తువులపొందిక, పారుదల, పొదుపు మొదలగున వన్నియు నిందు చేరును.

ఇట్టి సంగతులపై వారి కభిప్రాయము లుండకపోవు. ఐనను, ఇతరులు చెప్పుటలో వానికి సరియగు రూపరేఖ లమరి, సంపూర్ణములగు భావములుగ పాదుకొని వ్యక్తమై వికాసమై అట్లగుటలో నానందమును కల్గించును.

సభ్యత మూడవది:- ఇతరులపట్ల మెలగవలసిన మాట్లాడవలసిన రీతి, సమాజముపట్ల నడత, యంతయు నిందిమిడును.

అటుపిమ్మట ఆరోగ్యశాస్త్రము, శారీరశాస్త్రము, ఆర్థిక రాజకీయశాస్త్రములు, భూగోళము, దేశచరిత్ర, ప్రపంచచరిత్ర, మొదలగు నితరవిషయములన్నియు వచ్చును.

ఇట్టి విషయము లన్నియును ఉపన్యాసముల వలనను మ్యాజిక్ లాంతర్లద్వారాను ఎక్కువగా బోధించవలసినదే. సినిమా రేడియోలు గూడ ఎక్కువగా నిందు సాయపడును.

## అక్షరాస్యత

విద్యయొక్క రెండవశాఖయగు నక్షరజ్ఞానమును గూర్చి కొంతచర్చించుట ఇట నా యుద్దేశ్యము. విజ్ఞానవిషయములకున్న ప్రధానతను బట్టి అక్షరాస్యతయొక్క అవసరమును కుంచపరుప గూడదు. పూర్వము మన దేశమున నక్షరాస్యత కంత పట్టింపులేదు. అక్షరాస్యత గల్గినంతమాత్రమున మనుజుడు గొప్పవాడు కాజాలకుండెను. అదిలేనిమాత్రమున నతని విజ్ఞానమున నేలోపము లేకుండెను. అతని తెలివి, నడవడి, నీతి, మన్నన,

ఇతరులతోడి ప్రవర్తన, మొదలగునవి యన్నియు చక్కగా నారితేరిన సంప్రదాయముచే నేర్పబడు చుండెను. గృహసంబంధములగు విషయములన్నియు, నుగ్గుబాలతో నేర్చినవే. వారిలో విజ్ఞానమును వెదజల్లు మార్గములును చక్కనివి పెక్కులుండెను. ఇవి పురాణశ్రవణము, హరికథలు, వీధి నాటకములు, జంగంకథలు అనుశ్రుతముగా కంఠస్థము చేసి పాడబడుగీతములు మొదలగునవి.

నవీన యుగమున అక్షరాస్యతదే పైచేయి. అది విజ్ఞానమునకు మూలకందము. విజ్ఞాన పేటికను తెఱచు తాళపుచెవి. అదికాక ప్రపంచములో నెల్లెడల నేడు అక్షరాస్యులకు ఓటరు హక్కియబడుచుండుట వలన దానికున్న ప్రాధాన్యమినుమడించినది. ఆధునిక పరివర్తిత జీవిత కృత్యములలో నట్టడుగు నుండియు దీని యవసరము కన్పట్టుచునేయుండును. సంతకముచేయుట దగ్గరనుండి జాబువ్రాయుట, ప్రకటనపత్రములు చదివి అర్థము చేసికొనుట, అప్పు పత్రములు వ్రాయుట, వార్తాపత్రికలు మొదలగునవి చదువుట దనుక——

ఇట్టి ప్రధాన విషయమగు నక్షర జ్ఞానము ప్రజలకందరకు నందుబాటులో నుంచబడుటయే కాక వారి కందింప బడవలెననుటయు నిశ్చయము. అక్షరజ్ఞానము లేనివాడు సమాజములో వృద్ధి పొందలేడు. "విద్యావిహీనః పశుః" అను వాక్యముతో బాటు వ్రాత చదువు చేతకానివాడు శుంఠ అని కలిపి చదువవలెనని యనుచో నన్ను క్షమింతురు గాక.

## వయోజన విద్యావశ్యకత

ప్రస్తుతము భారతదేశపు జనసామాన్యము విద్యలో వెనుకబడియుండుట ఎల్ల రెరిగిన విషయమే. భారతదేశమున చదువు నేర్వనివారు 100 కి 91 మంది కలరనుట ఈ దేశమునొసట నొక పెద్ద మచ్చవలె నున్నది. మన కండ్లయెదుట మేల్కాంచిన జపానుదేశమున నేడు రెండువందలలో నొక్కడే నిరక్షరాస్యుడు. నేడింకను మన నాగరికతకు తీసిపోయిన నాగరికతగల చీనాదేశములో మూడవవంతు చదువు నేర్చినవారే. కొలది కాలము మన మింకను ఉపేక్ష చేసినయెడల విద్యావిహీనతలో మన దేశమునే మొదట నేర్కొనవలసిన దుర్గతి పట్టగలదు.

మన దేశమునకు కల్గిన ఈయజ్ఞాన దుష్కళంకమును ఏ పద్ధతులపైన త్వరలో తొలగింప సాధ్యమో తెలుసుకొనుట ఇచట మనపని. చదువరులు తక్కువగానున్న ఏ దేశముననైనను బాల బాలిక లందరును పాఠశాలలోచేరి చదువుచున్నను విద్యావిహీనులగు యువకులు మిగిలిపోవుదురు: కాన యువజన విద్యావ్యాప్తికై ప్రయత్నములు జరుగనిచో ఒక్కమారుగా 100కి 100 మందిని చదివినవారిగా చేయుట అసంభవము. ఇచ్చటనే వయోజన విద్యావ్యాప్తికై కృషి చేయవలసిన యావశ్యకత కన్పించును. ప్రతి జ్ఞానవంతుడును వయోజనుల లాభముకొఱకై పగటిపాఠశాలనో రాత్రి పాఠశాలనో పెట్టి తన యోపినకొలది శ్రద్ధవహించి చదువు నేర్పుచున్నచో కొలది కాలములోనే దేశములోని విద్యావిహీనత నశించును.

"అన్నిచదువులు గ్రంథాల నమరుకతన
గ్రంథముల కక్షరమె ప్రాణకందమగుట
నక్షరజ్ఞాన మందర కందజేయు
దీక్ష బూనుడు చదివిన దిట్టలెల్ల"

అను పద్యము చెప్పినట్లు ప్రజలలో నక్షరజ్ఞానము వ్యాపింప జేయుటకంటె చదివినదిట్టలు చేయదగు

మేలైనపని యేదియు గన్పడదు.

## వయోజనులకు విద్యగఱపుటలోని సులువు బలువులు

వయోజనులకు విద్య నేర్పుట బాలురకు విద్య నేర్పుట వంటిదే యగును. అయినను ఈ సామ్యమును పూర్తిగ గ్రహింపరాదు. కొన్ని కారణముల వలన బాలురకు చదువుచెప్పుట కష్టము. మరి కొన్నిటివలన యువజనుల కక్షరజ్ఞాన మలవరచుట దుష్కరము.

బాలురకును యువకులకును గల భేదమును పరిశీలించినచో నిది యెట్లో విశదమగును. బాలురు పిన్నలు. వారి మనస్సు మృదులము. కఠినమగు పద్ధతుల నోర్వరు. ఎంతయోసేపు ఏకాగ్రతను సహింపరు. వయోజనులు, దృఢమనస్కులు. పట్టుదల, శ్రద్ధ, ఎక్కువగా గల్గియుందురు. వారి యేకాగ్రత నిల్పుకొఱకై మన మెక్కువ కష్టపడ నవసరముండదు.

బాలురకు బొమ్మలయందు అభిరుచి మెండు. వారికి అక్షరములు చూచినంత మాత్రమున కండ్ల యెదుట పూర్ణముగ చిత్రములవలె నిల్పగలశక్తి యుండును. వారి చిత్రాపేక్ష నుపయోగించి యక్షరములు నేర్పవచ్చును. పెద్దల కీశక్తి మిక్కిలి తక్కువ. అయినను వారికి పరిశీలనాశక్తి వృద్ధి చెంది యుండును. కాన అక్షరములవంపులు, వానికితరాక్షరములతోడి పోలిక, భేదము, నిర్ణయించి వారు సులభముగా నక్షరముల నేర్వగలరు.

బాలుర పదసముదాయము మిక్కిలితక్కువ. మరి ప్రథమ వాచకమందు చదువుటకు సులభమగు మాటలను కాక వారి యనుభవములోనికి వచ్చినవస్తువుల పేర్లను, వారి ఉపయోగములోనికి వచ్చిన మాటలను, చెప్పవలసి యుండును. యువకుల కట్లుకాక వారి పదసముదాయము చాలగ పెరిగియుండుటచే చదువుటకు సులభమైన మాటలను మాత్రమే ఏరుకొనవచ్చును.

బాలుర అనుభవము కొద్దిపాటిది. వారు ఎఱిగిన సంగతులు కొంచెమే. వారేవిషయమును చదివినను దానిని తెలుసుకొనుటకు కాలము కొంత పట్టుచుండును. క్రొత్తవిషయ మొక్కసారి తెలిసినచో చాలదు. పునఃపఠనము లేకున్న అది వారి మనస్సులోనుండి తప్పించుకొనిపోవును. కాన వారి చదువునందు పునఃపఠనము. దాని వలన తప్పనిసరిగ నాలస్యము కలుగును. యువకుడట్లు కాక చాలదాక అనుభవవిషయములనే చదువుచుండును గాన నతని విద్యాభివృద్ధి త్వరగా సాగిపోవును. యువకుని దృక్ప్రమాణమును (Eye span) హెచ్చు కావున నతని చదువు త్వరితముగ నడచును.

ఉచ్చారణవిషయములో బాలురకును యువకులకునుగల భేదము అన్నిటికన్న హెచ్చు. బాలుర ఉచ్చారణావయవములు లేతవైనవి. ఎట్లు త్రిప్ప వలయు నన్న నట్లు తిరుగును. యువకుల ఉచ్చారణావయవములు గట్టిపడియుండును. కొన్నిశబ్దములను వారు తప్పుగా నుచ్చరింప నలవాటుపడియుందురు. వానిని సవరించుట కష్టమును కలుగజేయును. ఐనను, నీయవయవముల కలయికచే నీశబ్దము లుత్పన్నము లగుచున్న వని చెప్పి యట్లు చేయించుటలో కొంతలాభము కల్గవచ్చును.

## వయోజనులకు విద్య గఱపవలసిన పద్ధతులు

బాలురకును, యువకులకును గల భేదము ననుసరించి యువకులకెట్లు బోధింపవలయునో తెలుసుకొనుట యుక్తము. వ్రాతచదువులలో చదువు ముందు నేర్పవలెననుట బాలురపట్లను తరుణుల

పట్లను గూడ జెల్లును. చదువు కొంతవరకు సాగిన పిమ్మట వ్రాత నేర్పుట సులభమగును.

బాలురకును, వయోవంతులకును పైనచెప్పిన భేదములలో రెండవదానినిబట్టి అక్షరములు నేర్పుటలో వాని యాకారమును చూచి యువకులు నేర్వబూనుట యుక్తము.

ఆంధ్రము లోని యక్షరములన్నియు అనుస్వారము నుండి పుట్టినవి: వీనిలో కొన్ని స్పష్టముగా అనుస్వారరూపములుగా గన్పించును. ర, ఈ. త, ద, ల, అ, ఇట్టు లన్నియును, అనుస్వారల లేక అర్ధానుస్వారలయొక్క కూర్పు. అక్షరములు నేర్పునపుడు ఐదుబడులలోని యక్షరములు వరుసగా నేర్పుటకంటె పై సూత్రము ననుసరించి తరగతులుగా విడదీసి సులభమైనవానిని ముందునేర్పి, తోడనేవాక్యములు ప్రారంభింపవచ్చును. పిమ్మట కఠినమైన క్ష, ఐ, జ, ఋ, ఖ. మొదలైనవి నేర్పి బరులు సొంతముగా నేర్పవచ్చును. వాచకము కొంత నడచిన పిదప వ్రాత మొదలుపెట్టవలెను.

వారికి నేర్పు వాక్యములలో గల జ్ఞానమంతయును విప్పిచెప్పవచ్చును. పదములను చదువునప్పుడే ఆయావస్తువులను గురించిన సర్వవిషయములును వారికి బోధించుటలో విద్యాబోధన యొక్క రెండుశాఖ లగు అక్షరజ్ఞాన విజ్ఞానములు చాలవరకు సంబంధము కల్గి, ఒండొంటి సహకారముతో సాగిపోవును. దీనివలన నొక క్రియవలన రెండుకార్యము లను సిద్ధాంతము అమలులోనికి వచ్చి యువజనవిద్య సత్వరముగ, సంపూర్ణముగ సాగిపోగలదు.

—...—

# వయోజన విద్యాపద్ధతులు

**శ్రీ మద్దూరి గణేశ్వరరావు**

హిందూదేశమున వయోజన విద్యాసమస్య శీఘ్రముగ యోచింపదగిన ప్రధాన విషయమై యున్నది. ప్రజాయత్త పరిపాలనాభిలాష వృద్ధిమైనకొలదియు సామాన్యుడగు వయోజనుడు రాజకీయములందు ముఖ్యస్థానము నలంకరించు ననుట నిర్వివాదాంశము. శాస్త్రములు, సంఘములు విరివిగా పరిణామము చెందెడి యీకాలమున బాల్యమునం దభ్యసించిన ప్రాథమికవిద్య వయోజనులకు సరిపడదు. తల్లిదండ్రులు బాలురకు ప్రాథమిక విద్యావసరము గుర్తించకపోవుటయే హిందూదేశమున ప్రాథమిక విద్యాభివృద్ధికి భంగ కారణము. తల్లిదండ్రులు విద్యాగంధములేనివా రగుటయే దీనికి కారణము.

వయోజనుడన 15 సంవత్సరములు, అంతకు మించిన వయస్సుకలవాడు. 1931 వ సంవత్సరపు జనాభాలెక్కలు హిందూదేశమందలి విద్యావిహీనతను దెలుపుచున్నవి. వయోజనులందు పురుషులలో 77౦/౦ను, స్త్రీలలో 97౦/౦ను విద్యావిహీనులని స్పష్ట మయ్యెను. వయోజనులందు అత్యధికులు విద్యావిహీనులై యుండ ఎన్ని సంవత్సరముల కైనను ప్రశంసనీయమగు వృద్ధి ప్రజాయత్త పరిపాలనమునకుగాని స్వరాజ్య నిర్వహణమునకు గాని కలుగదనుట సత్యము. స్వరాజ్యము నభిలషించు ప్రతి పురుషుడును కనీ

సముదనపత్రికనైనను చదువగలిగి యుండవలెను. తనవోటును సర్వరాజకీయ సమస్యలందును తెలివిగా ఉపయోగించగలవాడు కావలెను.

విద్యావిహీనుడైనను విద్యావంతుడైనను వయోజనుడు విద్య నభ్యసించుచునే యుండదగును. ఇందులకు ముఖ్యకారణములు గలవు. ఆంగ్లమునందలి (King Lear)లియర్ రాజుయొక్క నాటకమును, సంస్కృతమందలి మేఘసందేశ కావ్యమును బాల్యమున చదివిన లియర్ రాజుయొక్క (Agony), ఆవేదన, యక్షుని విరహము ఏమి అర్థమగును? ఎట్లు అనుభవమగును? మానవుని తత్త్వము గ్రహించు శక్తి వయసు ననుసరించి యుండును. ఇట్టి లోపములు పోవుటకు వయోజనుడు చదివినవాడైనను తిరిగి చదువుకొనుచుండుటయే ముఖ్యము.

జర్మనీ, స్కాట్లాండ్, ఇంగ్లాండు, డెన్మార్కు దేశములు వయోజనవిద్యకై విశేష యత్నములు చేసినట్లు ఆధారములు గలవు.

యూరపు దేశములలోకంటె హిందూదేశమున వయోజన విద్యాసమస్య మిక్కిలి ముఖ్యమైనదైనను దీనికై యింతవరకు అత్యల్పమగు కృషి యేజరుగుచున్నది. (1) (Theory of filtration) థియరీ ఆఫ్ ఫిల్ట్రేషన్. అనగా విద్యావంతులు నాయకులగుచో విద్యవారినుండి సామాన్య జనసమూహమునకు వచ్చునని ఆశయము మొదట గవర్నమెంటువారికిని, ఇతరసంస్థలకును కలిగెను. ఈభావము వెలియం బెంటిక్ కాలమునుండి 1911 లో గోకేలు ప్రాథమిక విద్యాశాసనము ప్రవేశపెట్టువరకు ఉండెను. కాని ఆశించిన ఫలితము ఇట్టి భావముతో చేసిన కృషివలన కలుగలేదు. ప్రాథమికవిద్య బాలురకువలెనే వయోజనులకును నేర్పించుట అవసరమని ఇప్పుడు అందరును అంగీకరించియున్నారు.

చెన్నపురి విశ్వవిద్యాలయమువారు 1923 వ సంవత్సరమునుండి అనేక ముఖ్యస్థలములందు విశ్వవిద్యాలయ ఉపన్యాసకులచేతను, ఆయా వృత్తులందు సమర్థులగువారి చేతను ఉపన్యాసములిప్పించి వయోజనవిద్యా ప్రచారము గావించిరి. కాని యీ ప్రచారము విద్యాధికులగు వారిలోనే జరిగెనుగాని కార్మికకర్షకాది జనసామాన్యమునకు కొంచెమైనను మేలు చేయలేదు.

కొన్ని సంవత్సరముల క్రిందట ప్రభుత్వముయొక్క సంబంధము లేకయే బొంబాయియందు వయోజనవిద్యాసంఘ మేర్పడి కార్మికులవిద్యాభివృద్ధికై పరిశోధనల జేసెను. 1939 మే నెలయందు విద్యాప్రదానసంఘ మేర్పడి వయోజనులకు బొంబాయియందును పరిసరములందును 573 తరగతుల నేర్పరచెను. ఈ తరగతులకు స్త్రీలు పురుషులును, 10773మంది హాజరైరి. 1904వ సంవత్సరమున చెన్నపట్టణమున బకింగుహామ్. కర్ణాటిక్ మిల్లుల యజమానులు వయోజన కార్మికులకై ఒకరాత్రి పాఠశాలను స్థాపించిరి. ఇదియే యిప్పుడు అనేకవందల జనులను ఆకర్షించుచున్నది. అరవము తెలుగు, ఉరుదు భాషలలో విద్యను బోధించు చున్నారు.

(4) బెంగాల్ గవర్నమెంటువారింకను మంచి పద్ధతి నవలంబించిరి, 1907 మార్చి నెలయందు ఇనస్పెక్టర్ ఆఫ్ రిజిస్ట్రేషన్ సలహా ననుసరించి రూరల్ సబురిజిస్ట్రారులు వారికి తీరికగల కాలమందు వయోజన విద్యాకేంద్రములను తమ అధికారగములోనుండు అనేక గ్రామములందు నెలకొల్పుటకు నిశ్చయించిరి. ఈ కేంద్రములందు

వ్యవసాయము, పశు సంరక్షణ, రోగనిరోధ రోగ నిర్మూలనములు, సహకారసంఘస్థాపన, వ్యవసాయపు పంటల విక్రయవిధానము మొదలగు ప్రధాన విషయములను వీరు ఆయా శాఖలకు సంబంధించిన అధికారులచే బోధింపజేసిరి. అధికారులు ప్రతిఫలాపేక్ష లేకయే యీ ప్రచారమును చేసిరి. గ్రంథాలయములకు పుస్తకములు పత్రికలు కొనుటకు మాత్రమే ధనమును వెచ్చించిరి. ఈ ధనమును ఇండియా గవర్నమెంటు వారిచ్చెడి రూరల్ డెవలప్‌మెంటు గ్రాంటునుండి ఖర్చుపెట్టిరి.

వయోజన విద్యాభివృద్ధికి ప్రభుత్వమే కలుగజేసుకొనవలెనా? లేక తదితర సంస్థలు పూనుకొనవలెనా? లిన్‌లిత్‌గో అధికారవర్గము ప్రభుత్వముకంటె భిన్నమగు సంస్థ దీనినిపూనుకొనుట మేలని నిశ్చయించెను. ప్రభుత్వమునకు బాలురవిద్యావ్యాప్తికే తగిన ధనము లేనప్పుడు వయోజనుల విద్యకు ధనము ఎట్లు చేకూర్చగలదనియు, ప్రభుత్వము పైకొను శ్రద్ధకంటె, ప్రభుత్వేతర సంఘములు బాధ్యత వహించినచో అధిక ఫలితము గలుగుననియు వీరి వాదన. వయోజనవిద్యా సంఘముల స్థాపనయు, వానిపై పరీక్షాధికారము ప్రభుత్వ వశమునం దుండవలయు ననియు, వానికగుఖర్చు మాత్రము ఉదారపురుషుల ధనసహాయమున నిర్వహింపతగినది అనియు యీ సంఘముయొక్క అభిప్రాయము.

వయోజన విద్యకై విశేషమగు ధన మక్కర లేదు. ఉపాధ్యాయులు, ఆరోగ్య, వ్యవసాయ, విద్యా, సహకార సంఘాధికారులు, ఉత్సాహమును జూపిన సులభసాధ్య మగును. ఈ అధికారులు గ్రామములు పట్టణములు తిరుగుచునే యుందురు. ప్రారంభమున గ్రంథాలయములు నేర్పరచుటకు, వానికి భవనములు నిర్మించుటకు మాత్రము ధనము వ్యయమగును. ఇవియును లేనప్పుడు కేంద్రములు, ఉపన్యాసములు వ్యర్థములు.

నూటికి 92 గురు వ్రాయను చదువను నేర్వని హిందూదేశమున విద్యావ్యాపకుడు వాఙ్మయాభివృద్ధికై పాటుపడుచుంటె ననుట హాస్యాస్పదము. విద్యాహీనుల ననేకుల విద్యావంతుల చేయుటయే విద్యావ్యాపకుని ధృక్పథమైనచో అతడు వాఙ్మయ సేవ చేసినవాడగును. కేవలమువల్లె వేయు విధానమున కాక, వారికి బోధించు విషయము గ్రహించునట్లు చేసినచో వయోజనులు బాలురకంటె శీఘ్రముగా విద్య నేర్చినవారగుదురు.

ఒక్కరొక్కరుగా గాక సంఘములుగా కూడినప్పుడు వారు విశేషముగా నేర్చుకొందురు. దేశభాషలో చదువను వ్రాయను నేర్పినచో వయోజనునకు మేలు కలుగును.

హిందూదేశమందలి వయోజనునకు ఏ విషయములు నేర్పవలెను? ఇంగ్లీషు విద్యావిధానము హిందూదేశ వయోజనునకు పనికిరాదు. డెన్మార్కు చీనాదేశపు విద్యావిధానము వీనికి సరిపడును. ఎవడు చదవగలడో వాడు స్వయముగా చదువుకొనును. విద్యాగంధము లేనప్పుడు వోటువేయుట మొదలగు ప్రజాయత్త పరిపాలనా లక్షణములు వట్టి బూటకములు. చదువుట వ్రాయుట నేర్పుట వయోజన విద్యావిధానమున ముఖ్యభాగములని అందరు అంగీకరించిరి. ఆరో

గ్యాద వివిధశాఖల అధికారులచే ఉపన్యాసములు ఇప్పించి వారికి జ్ఞానము కలిగించవలెను. ప్రాథమిక పాఠశాలను వయోజనుడు విద్యనభ్యసించు కేంద్రముగా చేయవలెను. మధ్యపరగణాలు ప్రణాళిక ననుసరించి విద్యామందిరములను సాయంకాల తరగతులకు ఉపయోగింపవచ్చును. అక్కడ వ్యవసాయము వృద్ధిచేయు మార్గములు, గ్రామ పారిశుద్ధ్య ఆరోగ్యము, చదువుట, గణించుట నేర్పవలెను.

విశ్వభారతి "లోకశిక్ష సంసద్" అను నూతన శాఖను ఏర్పరచెను. మరియు గ్రామ వయోజనులకు బెంగాలీభాషలో వాఙ్మయము, హిందూ దేశ చరిత్ర, పరిపాలన విధానము లోక జ్ఞానము, గణితము, గృహనిర్వహణశాస్త్రము, పదార్థ విజ్ఞానశాస్త్రము, భూగోళము మొదలగునవి నేర్పుటకు పఠనీయ గ్రంథముల వ్రాయించెను. ఈ విశ్వభారతి ప్రతి సంవత్సరము పరీక్షల నేర్పరచి, ఆద్య, మధ్య, ఉపాధి అను యోగ్యతా పత్రములను ఇచ్చుచున్నది.

హిందూదేశపు వయోజనునకు విద్యనేర్పుట ఒక్కటే చాలదు. అతడు చేయుచున్న వృత్తి యందు తానునేర్చినదానికంటె విశేషాంశములను వానికి నేర్పవలెను. కర్షకునకు భూమియొక్క గుణములు, విత్తులు, పశువులను గూర్చియు, వ్రడంగికి కలప దానిని ఉపయోగించు మార్గములు, తాపీవానికి సిమెంటు, రాళ్ళు, ఉక్కు కట్టడముల గూర్చియు నేర్పవలెను. అవకాశమున్నచో ప్రతి పురుషునకు సహాయ వృత్తిగా తాను చేయుచున్న వృత్తిగాక వేరొకదానిని నేర్పవలెను. దానిచే తీరిక కాలమందును ఉద్యోగము పోయినప్పుడును, కరువు వచ్చినపుడును వాడు ధనార్జనచేసి జీవింప గలుగును.

పంజాబులో కొన్ని గ్రామములందు వయోజనులకు తరగతుల నేర్పరచిన తర్వాత వ్యవసాయదారుని సగటురాబడి రెట్టింపు అయ్యెను. సర్కారు వారి అగ్రికల్చర్ డిమాన్‌స్ట్రేటరుల, ఫారం ఎడ్వైజరుల సలహావలన దక్షిణహిందూదేశమున ఎరువును వ్యర్థపుచ్చుట మానిరి. జొన్న, చెఱకు, వరి పైరులు పాడుచేయు కీటకముల ఉపద్రవము తగ్గెను.

పల్లెలకంటె పట్టణములందు వయోజన విద్యను వృద్ధిచేయుట కష్టము; పట్టణమందలి వయోజనుల భిన్నరుచుల ననుసరించియు, వారి వృత్తుల ననుసరించియు, వారికి విద్యనేర్పవలెను. జంషడ్‌పూరులోని తాతా ఐరన్‌వర్క్సు వారును, చెన్నపట్టణమందలి బకింగ్‌హామ్ కర్ణాటిక్ మిల్లుల వారును, తిన్నెవెల్లి, టూటికొరన్‌లోని హార్వీ మిల్లుల యజమానులు తమ మిల్లులయందు చేయుచున్న వృత్తులనే తమ వయోజన కార్మికులకు నేర్పుచున్నారు. కావున పట్టణమందలి వయోజనులకు ఆ ప్రదేశమున ప్రబలముగా ఉన్న ముఖ్య వృత్తినే నేర్పవలెను. ఇట్లు వయోజనవిద్య ఫలవంత మగుట చూచియే మహాత్మాగాంధి యీ విధానము బాలురకును ప్రోత్సహించెను. మానసిక శాస్త్రము ననుసరించి విద్యావిధానము తెలిసినదానినుండి తెలియని దానికిని, ప్రత్యక్షము నుండి అప్రత్యక్షమునకును, అంశమునుండి సర్వతోముఖమునకును, సద్యఃఫలము నిచ్చునదియు ఉపయోగకరమునగు దానినుండి భావిని ఫలము నిచ్చునదియు ఉపయోగకర మైనదియు అయియుండవలయునుగాన దీనిని విద్యావేత్తలు అంగీకరించిరి. కావున ఈ విధానము వయోజనుడు తన

వృత్తియందు విశేషప్రజ్ఞ సంపాదించుటకు తోడ్ప డుటయే గాక ఇతర విషయములను గ్రహించు టకు ఉత్సాహవంతునిగా చేయుటకు సహాయ పడును.

హిందూ దేశచరిత్ర, పరిపాలనా పద్ధతి, పట్టణములందు పల్లెలందు విద్యనభ్యసించు వయో జనునకు అవశ్యము పఠనీయములై యున్నవి. ఏ జాతియు తమ చరిత్రను, సంస్థలనుగూర్చి తెలి యక రాజకీయముగను, సాంఘికముగను వృద్ధి నొందజాలదు. తనజాతి అభివృద్ధియందు వెనుక బడియున్నదని గ్రహించుటకును. పూర్వమున గలిగిన లోపముల సవరించుకొనుటకును, ప్రస్తుత ప్రమాదములనుండి తప్పించుకొనుటకు, భవిష్య త్తున లాభములు పొందుటకును, తన దేశచరిత్ర భూగోళశాస్త్రము తెలిసికొనుట ప్రతి హిందువు నకు అవసరము. గ్రంథాలయములు, పత్రికల సహా యమునను, ఉపన్యాసములు, బ్రాడ్ కాస్టుల వలనను, సినీమాపిలుపులు నాటకముల మూల కముగను, పాటలు, నాట్యములవలనను హిందూ దేశ చరిత్ర, హిందూ వాఙ్మయమును గూర్చి వీరికి దెలియచేయవలెను. హిందదేశపు వయో జనునకు సంపూర్ణముగ హిందూదేశపు నిజస్థితిని, సంపూర్ణమైన జాతియొక్క నిజస్వరూపమును, ఇది నా రాజధాని, ఇది నాకులము అను సంకుచిత భావము, అభిమానము, లేకుండునట్లు నేర్ప వలెను. పరిపాలనావిధానపు ముఖ్యసూత్రము లైనను వయోజనునకు తప్పక నేర్పవలెను. అనేకులు లెజస్లేటివ్ ఎసెంబ్లీ, కౌన్సిలు మొదలగువాని నిర్మాణ కార్యములు ఎరుగని వారై యున్నారు.

వయోజనునకు బాలునకువలె వ్యాయామ విద్య అవసరమై యున్నది. బాలునకు వాని అవ యవములను కండరములను వృద్ధిచేయుటకు యత్నించునట్లు వయోజనునకు వాని అవయవ ములు వాని స్వాధీనము లోనుండునట్లు వ్యాయామ విద్య నేర్పవలెను.

అవసరము ననుసరించి వయోజన విద్యావిధా నము ఇతర విషయములను గూడ జేర్పవచ్చును. శరీరశాస్త్రము; పదార్థ విజ్ఞానశాస్త్రము, రోగ నివారణోపాయములు, అంటువ్యాధులనుండి తప్పించుకొను మార్గములు, మితాహారమును గూర్చియు వీరికి నేర్పవలెను. హిందూ దేశమందలి మరణములలో మూడు వంతులు, జనసమూహా మునకు శరీర, ఆరోగ్యశాస్త్రముల బోధించినచో తగ్గిపోవును.

విద్యాభ్యాసము బాల్యమున ఉపేక్ష చేయ బడినచో వయసు వచ్చినప్పుడైనను నేర్చుకొను టకు ప్రతివానికి హక్కు కలదు. బాల్యమునకొంత విద్య నేర్చుకొనినవాడైనను తన దేశమందును ఇతర దేశములందును నిత్యము జరుగు మార్పులను అభివృద్ధులను గ్రహించుటకుగాను పత్రికలను గ్రంథములను చదువుచు విద్యావ్యాసంగమును విడువక అభివృద్ధి చెందుచుండ వలెను. ధనము లేనివానికి చదువునేర్పించు భారము సంఘముపై నున్నది.

ఇపుడు మన దేశములో అనేకులు విద్యా విహీనులై విద్యావంతులగు ఇతరులను చూచి తాము జ్ఞానహీనులమని తలచుచు నిరుత్సాహ వంతులై తమ పనులకు ఇతరులపై ఆధార పడుచున్నారు. ఇతరులు చేయు మోసము లను గ్రహింపలేక యున్నారు. అట్టి వారిని ఈ వయోజన విద్యావిధానము వలన విద్యావంతు

లుగా చేసిన, వారును విద్యావంతులై ఉత్సాహ పడుదు రనుటకు ఎంత మాత్రము సందేహము
ముగా తమ తమ కార్యనిర్వహణమందు ప్రజ్ఞా లేదు.
వంతు లగుటయేకాక దేశాభివృద్ధికిని సహాయ

---

# సహకారోద్యమము : ప్రయోజనవిద్య

శ్రీ నరసింహ దేవర సత్యనారాయణ

సహకారోద్యమము గత శతాబ్దములో పాశ్చాత్య దేశములలో ప్రజల ఆర్థిక నైతిక రాజకీయ విద్యాపురోభివృద్ధికొరకు ప్రభవించినది. ఉద్యమ సంస్థాపకులు ప్రారంభమునుంచి ఉద్యమ వ్యాప్తికి ప్రచారప్రబోధములు ఆవశ్యకములని గుర్తించి ప్రజాసముదాయములో ఉద్యమ ఆదర్శకములు, భావములు పురోభివృద్ధి కాంచుటకు వ్యాపారధనమునుంచి ప్రత్యేకముగ విద్యానిధులు ఏర్పాటుచేసి యీధనమును సభ్యులలోను, సభ్యేతరులలోను ఉద్యమ విజ్ఞానవ్యాప్తికని వినియోగించుటకు నిబంధనలు నిర్ణయము చేసిరి. జర్మనీ దేశములో పరపతి వ్యాపారము బీద రైతాంగము యొక్క పురోభివృద్ధికి వ్యాప్తిజేయుటకు కృషిసలిపిన, యుద్యమస్థాపకుడగు రైఫెసిన్ మహాశయుడు ప్రజల ఆర్థికాభివృద్ధికి తోడు నైతిక పురోభివృద్ధి అత్యావశ్యకమని గుర్తించి ప్రజా సముదాయములో ప్రయోజనవిద్య వ్యాప్తిజేయుటకు సహకారసంఘముల లాభము నుంచి ఏటేటను నూటికి 15 రూపాయిలు మించకుండగ విద్యావ్యాప్తికి ఉద్యమము ప్రచార ప్రబోధము నిమిత్తము వినియోగింపుచుండెను. జర్మనీలో స్థాపింపబడిన సహకార సంఘము లన్నియు ఈ తీరుననే తమసంఘలాభమునుంచి విద్యానిధులను ఏర్పాటుచేసి, ఈధనముతో, ఆయా ప్రాంతములలో పుస్తకభాండాగారములు, పఠనమందిరాలు, విద్యాగోష్ఠులు, రాత్రిపాఠశాలలు, ప్రయోజన విజ్ఞాన ప్రచార మండలులు స్థాపింపబడినవి. పరపతేతర వ్యాపారమున కునికిపట్టయిన ఇంగ్లాండు దేశములో కూడ ఉద్యమసంస్థాపకులు, సభ్యులలో విజ్ఞాన ప్రబోధము కలుగజేయుటకు సంస్థల వ్యాపార ధనమునుంచి నూటికి 2½ రూపాయిలు "విద్యానిధిక్రింద" కేటాయించి, యీ ధనమునుంచి ఉచిత పుస్తకభాండాగారములు, ఉచితపఠనమందిరములు శాస్త్రపరిశోధనాలయములు, విద్యార్థులకు వేతనములు ఇచ్చి ప్రోత్సహించి విద్యావ్యాపనమునకు తోడ్పడుచున్నారు. బరాంబెస్టరు పట్టణమునసహకారోద్యమమునందు తరిఫీదునొందుటకు వివిధ దేశములనుంచి విద్యార్థులను రావించి, వేతనము లిచ్చి హోలియోకు విద్యామందిరమును స్థాపించిరి. ఇగ్లెండు దేశములో సహకారులు సర్ హోరేసుప్లెంకెట్టు విద్యాసంస్థను నిర్మించి యిందువ్యవసాయిక ఆర్థిక, విద్యాపరిశోధనలు గావించుటకు ఏర్పాట్లు గావించి, అత్యుత్తమ గ్రంథాలయమును స్థాపించిరి. డెన్మార్కు దేశములో సహకారసంఘ విద్యానిధులనుంచి రైతులకు వేసవిపాఠశాలను స్థాపించి శాస్త్రజ్ఞానమును ప్రజాసముదాయములో వ్యాప్తిజేసి, ప్రజల విజ్ఞానపురోభివృద్ధికి తోడ్పడుచున్నారు. సహ

కార విద్యానిధులనుండి పాశ్చాత్య దేశములలో ఎన్నియో కళాశాలలు నిర్వహింప బడుచున్నవి. విద్యాలయములు ప్రతిష్ఠాపించబడినవి. పత్రికలు నిర్వహింపబడుచున్నవి: కరపత్రములు విజ్ఞాన వ్యాప్తికి ప్రకటింపబడుచున్నవి; పుస్తకభాండాగారములు ఆధునిక పద్ధతులపైన పెంపొందించబడుచున్నవి. ప్రచారకులు ఉపన్యాసము లిచ్చుటకు తరిఫీదు చేయబడుచున్నారు.

సహకారుల విద్యాదర్శకము జనసామాన్యమును సత్పౌరులుగ తరిఫీజు చేయుటయే! ప్రజాసామాన్యము పౌరసత్వహక్కులు కలుగవలెనన్న సద్విద్యావ్యాపకము మూలముననే పొందకలవు. ప్రజాసామాన్యము అజ్ఞానాంధకారమున మునిగియున్నచో ఎట్టి సదుద్యమము వ్యాప్తి గాంచనేరదు. నూటికి తొంభైయిద్దరుభారత దేశములో చదువను వ్రాయ నేరరు. ఇట్టిఅజ్ఞానమే ప్రజలలో సహకారోద్యమ ఉన్నతాదర్శములు భావములు సత్వరవ్యాప్తిగాంచకుండుటకును, ఉద్యమ ఫలితములు పాశ్చాత్య దేశములలోవలె జనసాముదాయక అభ్యున్నతికి తోడ్పడకుండుటకును ప్రధానహేతువు. అందుమూలముననే భారత దేశములోగూడ సహకారులు సభ్యులలోను జనసామాన్యములోను సహకార విజ్ఞానవ్యాప్తికి సంఘ నిబంధనలలో సాముదాయ ప్రయోజక నిధులను వ్యయపరచుటకు నిర్ణయించిరి. ప్రతి సహకార సంఘనిబంధనలలో నూటికి $7\frac{1}{2}$ మించకుండగ లాభమునుంచి ప్రత్యేక సాముదాయ ప్రయోజననిధి ఏర్పాటు చేసి, యీధనము ప్రజల ఆరోగ్యవిద్యాపురోభివృద్ధులకు వినియోగించుటకు ఏర్పాటు చేయబడినది. మదరాసు రాష్ట్రీయసహకారబ్యాంకువారు పదిసంవత్సరములపాటు సాముదాయ ప్రయోజననిధినుంచి గ్రామపునర్నిర్మాణ కేంద్రములను నిర్వహించి ప్రచారకుల నియమించి, వయోజనవిజ్ఞానాభివృద్ధికి దోహదమొనర్చిరి. విద్యాసంస్థల నిర్వహణమునకు విరాళముల నొసగుచున్నారు. కేంద్ర కార్యాలయ బ్యాంకువారు తమసంఘ లాభములలోనుంచి నూటికి 15 రూపాయలు సాముదాయక ప్రయోజన నిధి ఏర్పాటుచేసి యేటేటను విద్యాలయ నిర్వహణములకును గ్రంథప్రకటనములకును ప్రచార ప్రబోధములకును విరాళముల నొసగుచున్నారు. మదరాసులో క్రింది బ్రాంచీలలో ట్రిప్లికేను సహకారస్టోర్సువారు. పఠనమందిరములను నిర్వహించుచున్నారు. వివిధ సెంట్రలు బ్యాంకులు స్థానిక యూనియను అర్బనుబ్యాంకులు గ్రంథాలయములను పఠనమందిరములను, రేడియోలను నెలకొల్పి ప్రజాసామాన్యములో విజ్ఞానవ్యాప్తికి తోడ్పడుచున్నారు.

ఆలమూరు ప్రాంతములో సహకార విజ్ఞాన వ్యాప్తికి, అత్యుత్తమ గ్రంథాలయము పఠన మందిరము నిర్వహింప బడుచున్నది. డెన్మార్కులో పద్ధతిని మూడు సంవత్సరములు వయోజన విద్యాలయము నిర్వహింపబడినది. మూడు మాసములు వేసంగి పాఠశాల రూరల్ గైడ్సు తరిఫీజు నిచ్చుటకు జరుపబడినది. ఈ సహకార రూరలు బ్యాంకువారు వయోజన విద్యావ్యాప్తికి పఠనమందిరము నిర్వహించుచున్నారు. ముగ్గురు ప్రచారకులు అనుదినము ఆదిఆంధ్ర పేటలకు పోయి పత్రికా పఠనము కావింతురు. సంఘ వ్యాపారముతో బాటు వయోజన విజ్ఞాన వ్యాప్తి కూడ సైకిలు ప్రచారకులచేత కావింప బడుచున్నది; బ్యాంకు ఆవరణ

లో రేడియో పెట్టబడినది, వందలకొలది గ్రామస్థులు అనుదినము రేడియో పాటలు వినుటకు, విద్యావిషయకము లైన ప్రసంగములు వినుటకు విచ్చేయుచుందురు. సహకారోద్యమము కేవలము వడ్డీవ్యాపార నిర్వహణము నిమిత్తమై కాక ప్రజల విద్యాపురోభివృద్ధికి ఉపచరించుచున్నదనుటకు పై సంస్థల కృషి సాక్షాత్కారము. ప్రతి సహకార సంఘము తమ సంఘ సభ్యులలో విద్యాపురోభివృద్ధికి సర్వవిధముల తోడ్పడి ప్రజాసామాన్యమును ఉత్తమపౌరులుగా తరిఫీజు చేయుటయే యుద్యమాదరశ్యము. సహకారులు ఈ ఆశయమును గుర్తించి భారతదేశములో తిరిగి సద్విద్యావ్యాప్తిగావించి నిరక్షరాస్యులు లేకుండగ కృషిసలిపి ధన్యు లయ్యెదరు గాక.

---

# గ్రామోద్ధరణ : యువకుల కర్తవ్యము

## శ్రీ ఆర్. విశ్వేశ్వరరాధ.

ప్రస్తుతమున 'గ్రామోద్ధరణ' అనే మాట, విరివిగా వాడబడుచున్నదిగాని, దాని యర్థము ఎవరును పరిగణించుటలేదు. దేశములో 7 లక్షల గ్రామము లుండుటచేతను, భారతదేశమందలి జన సంఖ్యలో నూటికి 90 మంది, ఆ గ్రామములో నివసించుటచేతను, ఈ సమస్యకు ప్రత్యేకత గలదు. గ్రామస్థులు విద్య లేకుండ, పేదతనముతో అల్లాడుచున్నారు. ఇతర దేశములలోని జనులు సరాసరి 60 సంవత్సరములు జీవించుచుండ, భారతదేశములో సరాసరి జీవితము 25 సంవత్సరములు మించుటలేదు. అటులనే దేశములోని ప్రజలలో చాలామంది దరిద్రులై యున్నను, 15 కోట్ల యకరములభూమి సాగవుటకు వీలుండినను, సాగవుటలేదు. ఇంగ్లాండులో ఎకరము పొలమునుండి 2000 పౌనుల ధాన్యముపండుచుండ భారతదేశములో 650 పౌనులకు మించుటలేదు. గ్రామపరిశ్రమలా నశించినవి. జాతీయాదాయమూ తగ్గినది. గ్రామములు ఆర్థికముగా స్వయంసంపూర్ణముగా లేకుండుటచే, చాలా కష్టస్థితిలో యున్నది.

పైనవ్రాసిన దానినిబట్టి, 'గ్రామోద్ధరణ' అనే మాటకు చాలా విలువగలదనియు, జాతీయజీవితములో మార్పు తేవలయునన్నయెడల ఈ సమస్యలన్నిటిని పరిష్కరింపవలయునని మనము గమనింప వలయును, ఇట్టివి జయప్రదముగ నెరవేరుటకు; దేశములోని శాస్త్రజ్ఞులు, వ్యవసాయశాస్త్రవేత్తలు, ఉపాధ్యాయులు, యువకులు, తదితరులును తోడ్పడవలయును. ముఖ్యముగా గ్రామోద్ధరణయే, పరమావధిగ పెట్టుకొనిన యువకుల తోడ్పాటు అవసరమై యున్నది. వారికి కావలసిన సౌకర్యములు గ్రామస్థులు ఇవ్వగలరని వేరే వ్రాయనక్కరలేదు. వినోభాభావేగారు చెప్పినట్లు, నిజముగ మనము గ్రామసేవ చేయుచున్నామని గ్రామస్థులను నమ్మించినయెడల, వారు ప్రాణములను కూడ మనకై అర్పించెదరు.

పూర్వకాలమున వ్యవసాయదారులు గ్రామ సేవకులకు, (ఉపాధ్యాయులు, పురోహితులు, పనివారలు, మొదలగువారు) కుప్పలునూర్చెడు కాలములో; ధాన్యమురూపముగా, వారికి కావలసిన భృతి నిచ్చెడివారు. ఇప్పటికినిగూడ కొన్ని గ్రామములలో, చాకలి, మంగలి, మొదలగు వారలకు, సంవత్సరమునకు, ఒకసారి ధాన్యరూపముననే, కూలి యిచ్చు అలవాటు గలదు. గ్రామములు స్వయంసంపూర్ణముగా నుండుటకు ఇది గొప్ప అవకాశమనియు, వాణిజ్యపంటలు (Money Crops) పండించుటకు తక్కువఅవకాశము లుండెననియు, లాభదృష్టికి (Profit Motive) అవకాశము లేదనియు, వేఱే వ్రాయనక్కరలేదు.

## తరిఫీజుయొక్క ఆవశ్యకత

యుద్ధమువలన, రహదారి సౌకర్యములు సన్నగిలినవి గనుక ఇప్పుడు అందరునుగూడ గ్రామాభివృద్ధిని గూర్చి యాలోచించుచున్నారు. దేశములోని విద్యావేత్తలు, యువకులు, గ్రామసేవకులు కావలసినకాలము వచ్చినది. కాని ఇట్టివారలకు తరిఫీజుఉండుట ముఖ్యావసరము. యువకులకుసహితము సుమారు 6 మాసములైనను తరిఫీజుండవలయును. వార్ధాలో అఖిలభారత గ్రామోద్యోగ సంఘమువారిచే నడుపబడుచున్న గ్రామసేవక విద్యాలయము ఇందులకై విరివిగ తోడ్పడుచున్నది. ఈ రీతిని దేశములోని వివిధ ప్రాంతములలో, గ్రామసేవక విద్యాలయములు స్థాపించి యువకులకు తగుతరిఫీజు ఇవ్వవలయును. ప్రస్తుత విద్యావిధానములో విద్యార్థులు, గ్రామములన అసహ్యాభావము చూపుచున్నారు. వారిలో మార్పు కావలసి యున్నది.

## వయోజన విద్య

స్కూలుఫైనలు ప్యాసయిన ప్రతి విద్యార్థి గ్రామోద్ధరణలో కనీసకాలము ఒక సంవత్సరము గడుపవలయునని, బెంగాలు గ్రామోద్ధరణ ఆఫీసరగు యిమాసుగారు ఈమధ్య వయోజన పత్రికలో సూచించి యున్నారు. చైనా, జపాను మొదలగు దేశములలో గ్రామోద్ధరణోద్యమము జయప్రదముగా సాగుటకు, ఉపాధ్యాయులు విద్యార్థులు మిగుల తోడ్పడిరి. భారతదేశములో కూడ వయోజనవిద్య ప్రబలిన యెడల గ్రామోద్ధరణకు వీలుండును. విద్యార్థులు కూడ కనీసము ఒక సంవత్సరము గ్రామోద్ధరణ, వయోజన విద్యకు వినియోగించిన, వారు నిజమగు మనుజులుగ తయారయ్యెదరు. గ్రామాభివృద్ధికి మనుజుడు తన జీవితము నొక సంవత్సరము ఎందులకు ధారవోయలేడో తెలియదు.

నూటికి 90 మందికి విద్యలేని భారతదేశములో వయోజనవిద్య ముఖ్యావసరమై యున్నది. అందుచే పాఠశాలలలోను, కళాశాలలలోను, గ్రామోద్ధరణ, వయోజనవిద్యలనుగూర్చిబోధన చేయవలయును. ఆనాడే విద్యార్థులు గ్రామాభివృద్ధియొక్క ఆవశ్యకతను గుర్తించెదరు.

ప్రస్తుతమున ఉపాధ్యాయులుగాని, డాక్టర్లుగాని, విద్యావేత్తలుగాని, చివరకు నాలుగు ఇంగ్లీషు మాటలు వచ్చిన ఎవరుగాని, గ్రామములలో ఉండుటకు వప్పుకొనరు. ఇట్టి విధమున భారతదేశ మున్నచో దేశాభివృద్ధికి ఎంతకాలము పట్టునో తెలియదు.

ఏజాతీ, ధనము వలన ఉన్నతస్థితికి రాలేదు. దేశములోని ప్రజలు దేశాభివృద్ధికి తోడ్పడిన

నాడే దేశమునకు విముక్తి యుండును. యువకుల సహాయము లేనిదే ఏ ఉద్యమమూ జయప్రదముగ జరుగదు. దేశసేవయే పరమావధిగ పెట్టుకొని భారతదేశపు యువకులు తదితరులు గ్రామాభివృద్ధికి తోడ్పడెదరని నమ్ముచున్నాను.

---

# గ్రంథాలయాలు—స్త్రీలు

శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మ

ప్రజలలో విజ్ఞానం వ్యాపించేనిమిత్తం విద్యావారాలు జరిపి ఉత్సవాలు, ఊరేగింపులు సాగింపవచ్చును. ఉపన్యాసా లిప్పింపవచ్చును. మ్యాజిక్ లాంతర్లు చూపింపవచ్చును. కాని అవి అన్నీ తాత్కాలిక ప్రయోజనమాత్రములే. ప్రజలలో నిలుకడైన విజ్ఞానం వ్యాపింపచేయాలె నంటే గ్రంథాలయోద్యమాన్ని మించినదిగాని, తుల్యమైందిగాని వేఱొకటి లేదు. ఊరికొక్క గ్రంథాలయం ఉంటే చాలు. దానిద్వారా స్త్రీలల్లోనేమి, పురుషుల్లోనేమి, బాలబాలికల్లోనేమి యెంతో ప్రబోధం కలిగించవచ్చును. సాహిత్య పరిచయానికైతేనేమి, శాస్త్ర పరిజ్ఞానానికైతేనేమి, చరిత్ర పరిశీలనకైతేనేమి, ఆధ్యాత్మిక ప్రబోధానికైతేనేమి, కళా సాధనకైతేనేమి అన్నిటికీ గ్రంథాలయమే పాదు.

కడచిన ముప్పదేండ్లలో గ్రంథాలయోద్యమం తెలుగుసీమకు చేసిన ఉపకృతి సామాన్యం కాదు. ఆరంభంలో ఆంధ్రోద్యమాన్ని కాని, తదుపరి వెలసిన అఖలభారత జాతీయోద్యమాన్ని కాని మరే ప్రజాహితఉద్యమాన్ని! కాని ఊరూర వెలసిన గ్రంథాలయాలే ప్రజాసామాన్యమనే శరీరమునకు జీవనాడులలాగా పనిచేసి ప్రజా ప్రబోధానికి తోడ్పడినవంటే అందులో సందేహం ఏమాత్రం లేదు.

శ్రీ అయ్యంకి వేంకటరమణయ్య పంతులు గారివంటి పెద్దలు ముప్పదేళ్ళనుండి కృషి చేయగా చేయగా గ్రంథాలయోద్యమానికి యిప్పటికి ఒకవిధమైన స్థిరత్వం యేర్పడ్డది. విద్యా సంస్కారం పొందిన ప్రతి పల్లెటూరి యువకుడికీ మనవూళ్ళో ఒక ఒక లైబ్రరీ పెట్టుకుందాము, లైబ్రరీ ఉంటేనేగాని ప్రపంచ సంగతి తెలియదు, దేశసంగతి తెలియదు అనే భావం యేర్పడిపోయింది. ఇటులనే ఒకరిని చూచి ఒకరు అనుకరిస్తూ ఉన్నారు. గ్రంథాలయోద్యమం మహావృక్షమైంది. దానినుండి అసంఖ్యాకమైన అంట్లు తొక్కబడుతున్నవి. మూల మూలల నాటబడుతున్నవి. తనచే నాటబడిన మొక్క యింత బహుళవ్యాప్తి గాంచడంకంటే ఉద్యమ జనకునకు యికనేమి సన్మానం కావాలె. శ్రీ అయ్యంకి వేంకటరమణయ్య పంతులుగారు, నాళం కృష్ణారావుగారు, గాడిచర్లహరి సర్వోత్తమ రావుగారు మున్నగు పెద్దలు గ్రంథాలయోద్యమాన్ని యింతిగా అభిమానించి దేశంలో వ్యాప్తి నొందించుటచేతనే ఆంధ్రదేశంలో రాజకీయ ప్రచారంగూడా విరివిగా వ్యాపించడానికి అవకాశం కలిగింది. నేడు పల్లెటూళ్ళలో రాజకీయావబోధం బాగా కలిగిందంటే అది గ్రంథాలయాలు చేసిన సహాయమనే చెప్పాలె. గ్రంథా

లకు, వార్తాపత్రికలకు అవినాభావసంబంధం ఉన్నది. గ్రంథభాండాగారమున్న ప్రతి వూరికి వార్తాపత్రికలు తప్పకుండా వస్తాయి. వార్తాపత్రికలు వచ్చిన ప్రతిచోటా ప్రజలలో ప్రబోధం కలిగి తీరుతుంది.

అయితే గ్రంథాలయోద్యమం యీమాత్రం వ్యాప్తిపొందిందిగదా అని యింతటితో తృప్తి పొందకూడదు. లైబ్రరీలు చాలా ఉన్నట్టు గోచరిస్తున్నా లైబ్రరీలు లేని ఊళ్ళు యింకా ఎన్నో ఉండనే ఉన్నవి. ఉన్నవన్నీ బాగా పనిచేయడమూ లేదు. ఈ లోపాలన్నీ తీరి ప్రతి ఊరనూ గ్రంథాలయం యేర్పడి ప్రతి గ్రంథాలయం చక్కనిపద్ధతిలో పనిచేస్తున్ననాడే గ్రంథాలయోద్యమం బాగా వ్యాపించిందని ఆనందించడానికి అవకాశముంటుంది. ఇందుకు గ్రంథాలయోద్యమాభిమానులు ఇకముందున్నూ కష్టించి చేయవలసినదెంతో ఉన్నది.

ప్రజలు గ్రంథాలయాలను అభిమానించడంతోబాటు ప్రభుత్వంవారుగూడా వీనికి కొంత గ్రాంటులద్వారా చేయూత నిస్తూ ఉండటం ఆనందించవలసిన విషయం. అయితే యీ గ్రాంటులను మంజూరు చేయడంలోగూడా ఎన్నో చిక్కులు సంభవిస్తున్నవి. ముందు స్థానిక సంఘాలకు చెందిన గ్రంథాలయాలు యీ గ్రాంటులలో ప్రథమతాంబూలం పుచ్చుకుంటున్నవి. తరువాత రిజిష్టరైన గ్రంథాలయాలు, అవీ జిల్లా బోర్డులద్వారానే రావాలె. వానికీ ఎన్నో ఆశ్రయింపులు, సిఫారసులు, అభిమానాలు ఉంటేనే గాని ఆ కొంచెం గ్రాంటైనా రాదు. ఆ సహాయమైనా మేమొక వంద యిస్తే మీరొక వంద దానికి జతచేర్చవలెననే నియమం ఉన్నది. తామిచ్చిన విరాళం సక్రమంగా పుస్తకాలనిమిత్తమే ఖర్చుపెట్టే గట్టి యేర్పాట్లు ఉండటం లెస్సగాని తా మిచ్చినంత విరాళం గ్రంథాలయంవారిని గూడా జతచేర్చమంటే అంతటా సాధ్యమయ్యే పనికాదు. ఆదాయం తక్కువయినా ప్రజలకు యెక్కువ పనిచేసే గ్రంథాలయా లెన్నో ఉన్నవి. అది నిర్వాహకుల సేవానిరతినిబట్టి ఉంటుంది. అట్టివాటి కీనియమం చాలా నష్టం కలిగిస్తున్నది.

పెద్దపెద్ద గ్రంథాలయాలకు యెక్కువ గ్రాంటును మంజూరు చేయడం పరిపాటిగా ఉంటున్నది. కాని చిన్నవాటికే పెద్ద గ్రాంటులిస్తే అవీ పెద్ద గ్రంథాలయాలు కావడానికి అవకాశముంటుందిగదా!

ప్రభుత్వమువారేగాకుండా ప్రజలుగూడా గ్రంథాలయాలను అభిమానించి తాము చేసే ధర్మాల్లో భాగం పెట్టడం చాలా అవసరం. తమ గ్రామంలో ఉండే గ్రంథాలయానికి తమ వీలును బట్టి ఒక బల్లో, కుర్చీ, బీరువో, పుస్తకమో, వార్తాపత్రికో ఏదోఒకటి ధర్మం చేయడం తమ కర్తవ్యమనీ, సరస్వతిని ఆరాధించడమనీ, జ్ఞానభిక్ష పెట్టడమనీ ప్రతివారు భావించాలె. అప్పుడే గ్రంథాలయాలు మంచి అభివృద్ధిలోకి వచ్చి ప్రజలకు చేయవలసిన మహోపకారం చేయగలుగుతాయి.

ఆంధ్రదేశంలో గ్రంథాలయోద్యమం ఆరంభమై ముప్పదేళ్ళనుంచీ కృషిచేస్తున్నా ఆంధ్రస్త్రీలచే యీఉద్యమ ప్రయోజనం గుర్తింపబడలేదు. గుంటూరులో ఉన్న మహాలక్ష్మీ పఠనమందిరము ఆంధ్రస్త్రీలచే నిర్వహింపబడుచున్న ప్రత్యేకగ్రంథాలయం. స్త్రీ సమాజాలకు కొన్ని

టికి అనుబంధంగా అక్కడక్కడ కొన్ని పుస్తక భాండాగారాలున్నవి. కాని అవి యెన్నదగినంత అభివృద్ధిలో ఉండి స్త్రీలకు ఉపయోగపడటం లేదు. పురుషులచే నిర్వహింపబడు చున్న గ్రంథాలయాలే కొన్ని స్త్రీలకు పుస్తకముల నిండ్లకు బంపు నేర్పాటుచేయుచున్నవి. అదీ సకృతు.

గ్రంథాలయోద్యమం స్త్రీలలో వ్యాప్తి గాంచక పోవడము చాలా విచారకరమైన విషయము. స్త్రీల విద్యాభివృద్ధికి గ్రంథాలయాలను మించిన కొంగుపసిడి వేరొకటి లేదు. పురుషులు జ్ఞానాభివృద్ధిని పొందడానికి ఎన్నో అవకాశాలున్నవి. స్త్రీల కవి లేవు. అట్టివారు గ్రంథాలయాల ద్వారా విద్యాభి వృద్ధిని పొందినట్లయితే ఎంతో మేలు కలుగుతుంది, స్త్రీలకు పుస్తకాల నివ్వబడే యేర్పాటున్నచోట స్త్రీలు పుస్తకాలు అభిలాషతో చదువుచునే ఉన్నారుకాని వారు చదివే పుస్తకాలు నవలలు, నాటకాలు, కథలు తప్ప అంతకు మించిన పుస్తకాలు చదువుట లేదు. పదకొండేండ్ల గ్రంథాలయ నిర్వహణానుభవంతో చెప్పుతున్నాను. స్త్రీలు విజ్ఞానదాయకమైన పుస్తకాలు చదవటం చాలతక్కువ. మా గ్రంథాలయంలో కథలు, నవలలు స్త్రీలచే చదువబడి తుక్కుతుక్కై పోతూ ఉంటే శాస్త్ర సారస్వత చారిత్రకాది విజ్ఞానదాయక గ్రంథాలన్నీ చెక్కు చెదరకుండా ఉంటూ ఉన్నవి. తాత్కాలికానందదాయకములైన కథలు గాకుండా జ్ఞానాభివృద్ధిని గలిగించే వివిధ విజ్ఞాన వాఙ్మయము స్త్రీలు తప్పక పఠించవలసి ఉన్నది. మహిళా లోకము వివిధ విషయాల్లో పరిజ్ఞానము పొందినప్పుడే తమ బాల బాలికలకు ఆ యా విషయాల్లో పరిజ్ఞానం కలిగించ గలుగుతారు. కనుక స్త్రీల జ్ఞానాభివృద్ధియే, బాల బాలికల జ్ఞానాభి వృద్ధి. బాలబాలికల విజ్ఞానాభివృద్ధియే భావిభారతాభ్యుదయమునకు మూలకందము.

స్త్రీ పాఠకురాండ్రు విజ్ఞానప్రదాయక గ్రంథాలు చదివే అభిలాష గలవారినిగా జేసే బాధ్యత ప్రతిగ్రంథాలయంమీదా ఉన్నదని గ్రంథాలయ నిర్వాహకులు యోచింతురుగాక.

---

# పాఠశాలలలోని గ్రంథాలయములు

శ్రీ బులుసు వేంకటరమణయ్య

తక్కిన జ్ఞానముల సంగతి యెటులున్నను మానవునికి ప్రపంచజ్ఞానము ప్రధానము.

లోకజ్ఞానమునకు పెక్కు మార్గము లున్నవి. అందు దేశాటనము ప్రధానమైనది, అది ధనవ్యయైకమూలమగుటను, ఇతర కార్యములకడ్డంకి యగుటను జనసామాన్యమునకు సులభసాధ్యము కాదు. కాని అది చేయుపనిని చాలవఱకు గ్రంథాలయములు నెఱవేర్పఁగలవు.

ఔత్తరాహులకంటె దాక్షిణాత్యు లనేకవిషయములలో వెనుకపడి యుండుట మన మందర మెఱిఁగినదియే; అట్టివానిలో గ్రంథాలయోద్యమ మొకటి. ఈ యుద్యమమును స్వీయసమస్యగా

ఎంచి శ్రీ అయ్యంకి వేంకటరమణయ్యాగారు వృద్ధిలోనికి తెచ్చినవఱకును— తెలుగు దేశమున— తెలుగు దేశముననే కాదు—యావద్దక్షిణభారతమునను, ఈ యుద్యమ మనిన ఏమో ఎఱుఁగనివారు విద్యాధికులలోఁ గూడ పెక్కురుండిరనుట సాహసము కాదు. శ్రీ వారి కృషి ఫలితముగ యావద్భారత దేశమునందును తెలుగునాడు గ్రంథాలయోద్యమమున అగ్రస్థానమును వహించి యున్నది.

దేశముయొక్క భావ్యభివృద్ధి ఎక్కువగ పెద్దల కంటె పిన్నలపైననే ఆధారపడి యున్నది; ఆపిన్నలు విద్యార్థులు లోకజ్ఞు లగుటకు ఉపకరించునది గ్రంథాలయోద్యమ మొక్కటియే!

నేటి కాలమున విద్యాశాలలలో విద్యాభ్యాసముతోబాటు, వివిధవస్తుజ్ఞానమును, వ్యాయామమును ప్రాముఖ్యము వహించినవి. బాలుర లోకజ్ఞానమును వృద్ధిపఱచుటకై పాఠశాలా గ్రంథాలయములు, వాఙ్మయ సంఘములు, అప్రధాన పఠనీయ గ్రంథములు (Non-detiled texts) ఏర్పరుపబడినవి.

కాని మీఁది పద్ధతులు బాలుర లోకజ్ఞానమునకు అనుకొనినంత సాయపడలేకపోయినవి.

ఆటలపై ఆసక్తిని జూపు బాలురు గ్రంథాలయమును తగినరీతి నుపయోగించుకొన లేక పోయిరి.

పై యంశములను బాగుగ గమనించి విద్యాశాఖవారు బాలుర కుపయుక్తమగు రీతిని ప్రణాళికలో కొన్ని మార్పులు చేసిరి. అనుపయుక్తములగు నప్రధానపఠనీయములను తొలఁగించి వాని స్థానమున నిర్బంధముగ— వివిధ గ్రంథపఠనమును విధించిరి. ఈ పద్ధతి ననుసరించి ప్రతి విద్యార్థియును, వత్సరమునకు— పదునైదునుండి ఇరువదివఱకును ఉపయుక్తములగు పుస్తకములను చదివి లోకజ్ఞానమును సంపాదించవచ్చును. ఈ పద్ధతియు కొన్ని నియమములపై ఆధారపడి యుండుటవలన బాలురకు సుకరము.

బాలురకు ఏగ్రంథము ప్రయోజనకారియో ఆలోచించి ఉపాధ్యాయుఁడు వారమున కొక్కొక్క పుస్తకము నొసగుచుండును విద్యార్థి దాని నింటికి గొనిపోయి విరామ సమయములలో చదువును. తాను ఎప్పుడెప్పుడెన్నెన్ని పుటలు చదివినదియు అందుండి యేమి గ్రహించినదియు అర్థముకాని కఠినపదములను, క్రొత్తపదములను, జాతీయములను రికార్డు పుస్తకమున వ్రాసి విద్యార్థి ఉపాధ్యాయుని కొసఁగును. ఉపాధ్యాయుఁడు, అందలి మంచిచెడ్డలను, కఠినపదముల కర్థములను వివరించి, తెలియఁజేసి, వేఱొక పుస్తకము నొసఁగును. ఈరీతిని గ్రంథపఠనమును సాగించిన యెడల లోకజ్ఞత అలవడుటకు సందేహము లేదుగదా!

ఇంకొక సంగతి. ఇట్లు జ్ఞానమార్జించిన విద్యార్థుల పరీక్షకొఱకు కొన్ని పాఠశాలలలో లోకజ్ఞాన (General Knowledge) ప్రశ్న పత్రములు, బుద్ధికుశలతా (Intelligent tests) పరీక్షా పత్రములును ఈయఁబడుచున్నవి. వీని వలన విద్యార్థులయం దుత్సాహము రేకెత్తి, వా రుత్తమజ్ఞానమును సంపాదించుటకుఁ బ్రయత్నింతురు. అందుకొఱకు వారు పాఠశాలా గ్రంథాలయము నందలి పుస్తకముల నెన్నింటినేని చదివితీరవలయును. ఒక తరగతినుండి పెద్దతరగతికి మారుటకు, ఈ పరీక్షల మార్కులు లెక్కింపఁబడనందున — లోకజ్ఞానము తక్కువైన విద్యార్థులును విచారింపఁ

బని లేదు. కాని ముందు ఇట్టిపరీక్షలునిర్బంధము లయి, తక్కినపరీక్షలవలె ప్రాముఖ్యమును వహించిన యెడల విద్యార్థుల కెంతయో మేలు కలుగఁగలదు. పాఠశాలా గ్రంథాలయములు బాగు పడఁగలవు.

విద్యార్థులు లోకజ్ఞులగు భారము కేవలము వారిపైనే లేదు; ఉపాధ్యాయులపైని, పాఠశాలాధికారులపైని కూడఁ గలదు. తగిన గ్రంథములను, పత్రికలను, తరగతులవారీగా-కొనవలసిన వానిని సూచించు బాధ్యత ఉపాధ్యాయులది; వానిని కొని, తగిన జాగ్రత్తలో నుంచు బాధ్యత అధికారులది. ఎవరిబాధ్యతను వారు- అధికారులు, గురువులు, విద్యార్థులు-గుర్తించినప్పుడే ప్రయత్నము సఫలత నొందును.

విద్యార్థులకుఁ బుస్తకము లిచ్చు బాధ్యతయు, వారి రికార్డులను పరీక్షచేసి, కోరిన యంశములను తెలియఁజేయు బాధ్యతయు వహించుటకు ఉపాధ్యాయులను కాక, ప్రత్యేక గ్రంథభాండారాధికారిని నియమించుట పాఠశాలాధికారులవిధి. ఏలయన, తక్కినపాఠములను బోధించు నుపాధ్యాయులు విద్యార్థుల కొఱకుఁ గావలసిన గ్రంథముల నన్నింటిని చదివి, తరగతివారీగా నిర్ణయించుటకు వ్యవధి యుండదు. గ్రంథాలయాధికారికి, గ్రంథాలయములోని అన్నిపుస్తకముల విషయము అవగాహమై యుండుటవలనను, అతనికి వేఱొక బాధ్యత లేనందునను- అతఁ డెంతయేని విద్యార్థుల కుపకరింపఁగలఁడు.

ఇదివఱకుఁ జెప్పఁబడిన సౌకర్యములు కలిగి, ఆయాపద్ధతుల నవలంబించియున్న పాఠశాలలు లెక్కకుమిక్కిలి తక్కువగ నున్నవి. తక్కిన పాఠశాలలుకూడ మీఁదిమార్గముల ననుసరించినచో విద్యార్థుల కెంతయేని మేలొనర్చినట్టగును.

---

# గ్రంథాలయములద్వారా విద్య

శ్రీ పతి నరసింహారావు

ఒకనికి, అన్నము పెట్టినచో నది కొలది సేపటికే అరిగిపోవును. అక్షరముముక్క నేర్పినచో ఆబీజము వికసించి మానవుని విజ్ఞానవంతునిగ జేయును. అందుచేత అన్నదానముకంటె కూడ విద్యాదానమే యెక్కుడు శ్రేయస్కరమైనదని వంగదేశపు యతీశ్వరుడు "శ్రీవివేకానందస్వామి" నుడివియున్నాడు.

విద్య చోరుల కలభ్యగాని దివ్యమైనవిత్తమనియు విద్యాగంధము లేనివాఁడు పశుసమానుఁడనియు మన "భర్తృహరి" పలురీతుల ఉద్ఘోషించి యున్నాడు.

"మంచిపుస్తకములపై మనసున్నవానికి ప్రత్యేకించి విశ్వసనీయుడైన మిత్రునితోను, ఉల్లాసకారియగు తోడుతోను పనిలే"దని యూరపు సంచారము చేసివచ్చిన సుఖజీవనాన్వేషకుడగు భారతీయ ప్రముఖుడు "ఖుమీరామ్" ప్రబోధించుచున్నాడు. 'శక్తియున్నప్పటికిని పైసాను వెచ్చింపక ప్రాతచొక్కానైనను, తొడుగు కొనవచ్చును గాని, క్రొత్తపుస్తకము కొనుటమాత్రము మానవల' దనియు, 'గత్యంతరము లేనప్పుడు ఒక్కపూట దినినైనను బ్రతుకవచ్చునుగాని, సద్గ్రంథముల సేకరించుపట్టున మాత్రము వ్యయభీతిచే

నెప్పుడును లోభి కాగూడ'దని ఆ మహాశయుడు నూరిపోసినాడు.

ఇక—విద్యాపారీణులరగు, విదేశీయ ప్రముఖులు ఏమనుచున్నారో గమనింతము:—

'ప్రథమమున మంచిపుస్తకమును చదివినపుడు నేనొక క్రొత్తస్నేహితుని సంపాదించుకొనిన వాని యట్లుంటిని. అది రెండవసారి చదివినపుడు ప్రాత స్నేహితుని గలసికొనినవాని యట్లుంటిని' అని ఆంగ్లమంత్రి మాణిక్యుడు 'గ్లాడ్‌స్టన్' సెలవిచ్చి యున్నాడు.

'మంచి పుస్తకములు చదువుటకు వీలు గాని మహారాజునై యుండుటకంటె, చదువుటకు పుస్తకములు పుష్కలముగానుండు పేదకొంపలో పేదనై యుండుటకిచ్ఛగింతు' నని భారతీయులకు ఆంగ్లవిద్యాభిక్ష పెట్టిన "మెకాలే"దొర వచించి యున్నాడు.

'విద్యవలన, ఆత్మానందము కలుగును, హృదయ భారము తగ్గును, కొలది సేపయినను మానవుడు మనోవిచారములను బోనాడుకొన గలడు. కూలిపోయిన గాలిమేడలవల్లను, విషాద కరమగు భావిజీవితము వలనను ఆపాదిల్లు సంకట ములను విస్మరింపగలడు'అని—"బిర్రెల్."

'శరీరపోషణకు, మానసిక పోషణకు, మన మాహారము తీసికొనుచున్నాము. మానవ జీవి తములో ముఖ్యమయిన ఆధ్యాత్మిక పిపాసను అపనయించుకొనుటకు దగిన యనంతమైన ఆ హారము సద్గ్రంథములలో పొందుపఱుపఁబడి యున్నది'—"రస్కిన్ మహాశయుడు."

ఇట్లు జగత్తులోని మహానుభావు లందఱు విద్యాగంధము లేమిని గర్హించుచు, విద్యావశ్యక మును గుఱించి, ఉపదేశ రత్నములను వెదచల్లి యున్నారు—

విద్యావ్యాప్తికి ముఖ్యమగు సాధనములు రెండు.

మొదటిది:— పాఠశాలలద్వారా విద్య.

రెండవది:— గ్రంథాలయములద్వారా విద్య.

ఇందు మొదటిది పరిమిత ప్రయోజనకారియై కొలది మందికిమాత్రమే, అందుబాటులోనుండు నది. రెండవది, అనగా గ్రంథాలయములద్వారా పొందదగిన విద్య అపార ప్రయోజనకారియై ఇల్లు కదలని స్త్రీలకు సయితము అందుబాటులో నుండునది.

గ్రంథాలయములను రెండుతరగతులుగ విభ జింపవచ్చును.

1. స్థానిక గ్రంథాలయములు.

2. సంచార గ్రంథాలయములు.

ఇందు రెండవతరగతివి గ్రామీణులకుసయిత ము జ్ఞానోపార్జనముకు కల్పింపననుకూలములైనవి.

ఏ దేశమైనను విజ్ఞానవంతము, తేజోవంతము కావలెననిన, సద్గ్రంథజాలమును సేకరించుకొనిన గ్రంథాలయములే తదభివృద్ధికి ఉత్కృష్ట సాధన ములు. వీనిని మించినది మఱియొకటి లేదు. అందును విద్యావిషయమున నెంతో వెనుకబడి యున్న మనదేశమున—ముఖ్యముగ ఆంధ్రదేశ మున— గ్రంథాలయములు నెలకొల్ప వలసిన అవశ్యకత మిక్కుటముగ కనుపించుచున్నది—

గ్రంథాలయోద్యమము తక్కిన దేశముల యందు బహుభంగుల విజృంభించి దాని సత్ఫలి తములను ఆయా ప్రజానీకములు పొందుచుండుట మనము ప్రత్యక్షముగ చూచుచునే యున్నాము. ఈవిషయమున వెనుకబడియున్న మన దేశము

నందు "శ్రీ అయ్యంకి వేంకటరమణయ్యపంతులు" వంటి పూజనీయులు ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమ విస్తృత వ్యాప్తికై కంకణము కట్టుకొని, జీవితమునంతను ధారవోయుచున్నారు. తెలుగు లోకమునకు 'కనువిప్పు' అనదగు "గ్రంథాలయ సర్వస్వము" వంటి ఉత్తమశ్రేణికి చెందిన పత్రికారాజమును నడపుచు పుణ్యము గట్టుకొన్నారు. ఇట్టి ప్రబోధము ఇంకను నెంతయో కావలసియున్నది. ఆంధ్రులు ఇంకను, నిద్రాణము నుండి పూర్తిగ మేల్కొనవలయును. జరుప వలసిన కార్యభారము ముందే యున్నది. ఇటువంటి పవిత్రోద్యమమును నడిపింపఁగల సర్వసమర్థుడైన శ్రీ వేంకటరమణయ్య పంతులువంటి మహానాయకుడు లభించుటతో ఆంధ్రలక్ష్మినోము ఫలించినట్లే. మనము ధన్యులము. శ్రీ పంతులుగారి నిపుడీ రూపమున సన్మానించుట మనలను మనమే గౌరవించుకొనుటవంటి దగును.

## గ్రంథాలయములు—స్థానిక సంస్థల విధులు

శ్రీ యస్. శేషగిరిరావు

దేశాభివృద్ధికి, విద్యాభివృద్ధి ముఖ్యావసరము. హిందూదేశము, ఆర్థిక, రాజకీయ, సాంఘిక విషయములందు హీనస్థితియందుండుటకు, కారణము జనసామాన్యమునకు విద్యనేర్చుకొనుటకుఁ దగిన యవకాశములు లేకపోవుటయే. విద్యయొక్క విలువను, దానిని వ్యాపింపఁజేయు భారమును అనుభవమునకుఁ దెచ్చుటయే గ్రంథాలయోద్యమము యొక్క ప్రధానోద్దేశము.

ఇట్టి గ్రంథాలయములు ప్రతి గ్రామముననను, వీధివీధి నుండు నవకాశము కల్గినప్పుడే భారత దేశమునందు నిరక్షరత శూన్యత నొందగలదు.

గ్రంథాలయములు స్థాపించుటకు ముఖ్యముగా శ్రద్ధ వహింపవలసిన సంస్థలు మూఁడు.

మొదటిది ప్రభుత్వము: ప్రస్తుత పరిస్థితులలో యుద్ధప్రచారమునకు ప్రభుత్వమెంత శ్రద్ధతీసికొనుచున్నదో అట్లే గ్రంథాలయోద్యమమునకు కూడ తగిన శ్రద్ధ తీసికొనవలయును.

తఱచుగా సులభశైలిని వర్తమాన విషయములయందు పుస్తకముల నచ్చొత్తించి గ్రామములలో నుచితముగా పంచిపెట్టవలయును. ప్రతి గ్రామమునను వేతనోద్యోగిని నియమించి గ్రామస్థులకు చదివి వినిపించున ట్లేర్పాటుచేయించ వలయును. గ్రంథాలయ నిర్మాణమునకును, క్రొత్త పుస్తకములు కొనుటకును భూరి విరాళముల నిచ్చుచుండవలెను.

రెండవది స్థానిక సంస్థలు: పురపాలక సభ్యత్వమునకును జిల్లాబోర్డు సభ్యత్వమునకును ఎన్నికలు జరుగునప్పుడు గ్రంథాలయములకు సదుపాయముల జరుగునట్లుగా ప్రజలు వాగ్దానములు తీసికొనవలెను. స్థానికసంస్థ లతిసులభముగా గ్రంథాలయముల నిర్మించి వానిని పోషింపగలవు—ఇవి సాధ్యమైనంతవఱకు పురవాసులకు జ్ఞానోపదేశమును గూర్చు గ్రంథములను, తఱచుగా కొని ప్రజల కందుబాటులో నుండునట్లు చేయవలెను.

అన్నిటికంటె ముఖ్యమైనది మూడవది: "ప్రజాసహాకారము" ఎవరికి తోచినట్లు వారు భూరివిరాళముల నొసంగి సంస్థను పోషింపవలయును– ఏ గ్రంథాలయముగాని ద్రవ్యసహాయము లేనిది యభివృద్ధి చెందనేరదు. గ్రంథాలయముల పోషణ ధనవంతుల విధియై యున్నది– గ్రంథాలయముల గొప్పదనము గ్రంథముల సంఖ్యనుబట్టి యుండదు. సాధారణముగా, పెక్కు గ్రంథములుగల గ్రంథాలయములందు, మూడు వంతులు గ్రంథములుపయోగింపబడవు. కలకత్తాయందు ఇంపీరియల్ పబ్లికు లైబ్రరీలో నాల్గులక్షల పుస్తకములున్నను– వానిలో రెండులక్షలకు పైగా ప్రభుత్వమువారి ప్రచురణలే కాన్పించుచుండును. పురపాలక గ్రంథాలయములందు సగము పుస్తకములు మున్సిపల్ యెజెండాలే కాన్పించును. పైగా వీనిని గాలిగాని వెలుతురుగాని లేకుండునట్లు బీరువాలయందు భద్రపఱచి యుంచుదురు. కాన గ్రంథాలయముల ఖ్యాతి, పురజనులు చేయు నుపయోగములమీద నాధారపడి యుండవలెను.

మన దేశమందు ప్రతిఅధికారికిని గ్రంథాలయమనిన, చులకన. ఏపనికి పనికిరానివానిని, చదువురాని వానిని, అయిదు, లేక పదిరూపాయల వేతనమొసంగి లైబ్రేరియన్‌గా నియమింతురు. అట్టివానికి గ్రంథముల విలువ తెలియక, లావుపుస్తకములు మంచివనియు, ఖరీదు గల్గినవనియు దలంచి వాటి నెవ్వరికి నియ్యక జాగ్రతగా కాపాడుచుండును. చినిగిన పుస్తకములనుజూచి లైబ్రేరియన్ ఎప్పుడును విచారింపడు. బీరువాలనుండి కదలింపని పుస్తకములనుజూచి దుఃఖించును. ప్రతి పుస్తకములోని విషయమును దెలిసికొని, ఆ పుస్తకములను, లైబ్రేరియన్ ఆయా విషయములందు తృష్ణ కల్గినవారికిచ్చుటకు సమర్థుడై యుండవలెను. చదువరులకు కావలసిన పుస్తకములను కాలమును వృథాచేయక వెంటనే సమకూర్చవలెను. ఆ సామర్థ్యము గ్రంథాలయశిక్షణ పొందినవానికే తెలియును. కాబట్టి అట్టివారికే తగిన వేతనమిచ్చి లైబ్రేరియన్‌గా నియమించవలెను. లైబ్రేరియనుకిచ్చు వేతనమునుగూర్చి విచారింపగూడదు– అసంతుష్టిచేత మానవుండుత్సాహముతో పనిచేయడు. సంతుష్టితో గూడినసేవ మానవ కళ్యాణమునకు తోడుపడును.

అచ్చులోనికివచ్చు ప్రతి పుస్తకమును ఏ గ్రంథాలయమును కొనలేదు. కానివీలైనంతవఱకు ప్రతివిషయముమీద ముఖ్యమైన గ్రంథములు గ్రంథాలయమునం దుండితీరవలెను. గ్రంథముల విశేష్యత లైబ్రేరియన్‌కు తెలిసితీరవలెను.

స్థానికసంస్థలు గ్రంథాలయములను స్థాపించి ఈ రీతిని పోషింపవలయును. కేంద్రస్థానమునం దుండు నుద్యోగిగా నొక కేంద్రగ్రంథాలయముండవలెను. దానికి ఉపగ్రంథాలయములు ప్రతిగ్రామమునను, ప్రతివీధిని నుండవలెను. కేంద్రస్థానమునందు గ్రంథనిర్ణయము, వర్గీకరణము మున్నగు శాస్త్రసంబంధమైన పనిని ముగించి, కేవలము పుస్తకములను ప్రజల కిచ్చుటకే, కేంద్రస్థానమునందుండు నుద్యోగులు ఉపగ్రంథాలయములకు పంపెదరు. ప్రతి యుపగ్రంథాలయమునందును నాగ్రంథాలయపు పుస్తకాల జాబితాయేగాక, తోడి యుపగ్రంథాలయములలోని జాబితాలు గూడ నుండవలెను. ఎవరయినను దగ్గఱనున్న గ్రంథాలయమునకు బోయి ఫలాని పుస్తకము కావలయుననిన, ఆ లైబ్రేరియన్ ఆరోజులోగా ఉపగ్రంథాలయములలోని

గ్రంథములను దెప్పించియిచ్చును. ఒక పుస్తకము ఏ యుపగ్రంథాలయమునందును లేనియెడల, ఆ లైబ్రేరియన్ కేంద్ర గ్రంథాలయమునకు వ్రాయును. అచ్చటి లైబ్రేరియన్ వెంటనే ఆ గ్రంథమును కొని కోరిన యుపగ్రంథాలయమునకు పంపును. ఈ రీతిగా నేవ్యక్తియైనను ఏ ఉపగ్రంథాలయమునకు పోయినను కావలసిన పుస్తకములను బడయఁగలఁడు.

ప్రతి యుపగ్రంథాలయమునకు నారుశాఖలుండవలెను.

1. లెండింగు డిపార్టుమెంటు:— అనగా, ఇంటికి పుస్తకముల నిచ్చుశాఖ. ఈతరగతియందు సుమారు 5 వేల పుస్తకములుండవలెను. వానిలో అయిదవవంతు పుస్తకములు, నవలలు, కథలునై యుండవలెను. ఆ ప్రాంతమందున్న జనుల కందఱకును, ఉచితముగా పుస్తకములను దీసికొనుటకది యందుబాటులో నుండవలెను. బజారునకుఁబోవు కూలివాఁడు మొదలుకొని జిల్లాకలెక్టరువఱకు నా పుస్తకములను నుపయోగించుకొనుట కధికారులై యుండవలెను.

2. రిఫరెన్సుడిపార్టుమెంటు:—ఇచ్చట నవలలు నాటకములు నుండవు. అదేపనిగా చదువుకొనుటకు వీలులేని పుస్తకములు, మిక్కిలి ఖరీదుగల పుస్తకములు, పోయిన తిరిగి సంపాదించుటకు వీలులేని పుస్తకము లుండును— ఇచ్చటకు వచ్చు జనులకు విశేషాదరముజూపి, కాలము వృధాసేయక వలసిన పుస్తకములను వెంటనే యిచ్చుచుండవలెను. ఇచ్చటనుండు గ్రంథపాలకుడు మంచి విద్వాంసుడయి ప్రతి టెలిఫోను పిలుపుకు సమాధానమును వెంటనే యిచ్చుచు, వచ్చిన ప్రతి రిఫరెన్సుబుక్కును, ఛదివి, ఆ విషయములను, అవగాహనము చేసుకొనువాడై యుండును.

3. మేగజిన్ సెక్షన్:— ఇచ్చట సుమారు రెండువందల పత్రికలు అన్నివిషయములనుగూర్చి రానలెను. కేవలము వినోదార్థముప్రచురింపబడు వినోదిని, చిత్రగుప్త, మొదలుకొని స్పెషలైజ్డ అండ్ సైంటిఫిక్ పీరియాడికల్సువఱకును తెప్పించవలెను. సాధారణముగా, వ్యవసాయశాఖకు సంబంధించినవి ఎక్కువగా నుండవలెను.

4. న్యూస్‌రూమ్:— ఇందు దేశమందుగల్గిన వార్తాపత్రిక లన్నియు నుండవలెను. ఆ ప్రాంతమందుఁగల్గు పత్రికలెక్కువగా నుండవలెను. పుస్తకములు చదువుటకు, ఓపికలేనివారును, వర్తమానస్థితులను తెసికొనఁగోరువారును, పెద్దవారును, నాల్గురకముల పత్రికలను చదువగోరువారును వత్తురు. గ్రంథపాలకుఁడు ఈ గదికి తఱచుగా, వచ్చుచు, పోవుచు నుండవలయును. వార్తనుచదువువారిని, క్రమముగా, పుస్తకములను చదువుటకుప్రేరణచేసి, ముందు చిన్నచిన్నపుస్తకములను; క్రమక్రమముగా, పెద్దవిషయములు గల పెద్ద పుస్తకములను జదువువారినిగాఁ జేయుచుండవలెను.

5. పిల్లలశాఖ:— ఇచ్చట, పిల్లలకు కావలసిన బుక్కులు, చిన్న కథలపుస్తకములు నుండవలెను. ఇచ్చట స్త్రీ, గ్రంథపాలకురాలుగా నుండవలెను. పిల్లలకందఱకు స్టాకు వద్దకు పోవుటకు స్వాతంత్ర్యము నిచ్చి, ప్రతి పుస్తకముయొక్క విలువను, ఆ పుస్తకములోని సారాంశములను కథలుగా జెప్పుచుండవలెను.

6. వ్యవహార పారిశ్రామిక సంబంధపు డిపార్టుమెంటు:— ఈశాఖ ఇంకనూ పాశ్చాత్యదేశములందే క్రొత్తక్రొత్తదిగా నున్నది.

మాంచెస్టర్; గ్లాస్‌గో పట్టణములయందు దక్క మిగిలినచోట్ల ఇప్పటికిని ఈ శాఖ వ్యాపింపలేదు. పబ్లికు గ్రంథాలయము ప్రజలపన్నులచే, పోషింపబడుచున్నది. కాబట్టి యీ శాఖగూడా, ఈ విషయములయం దాసక్తికలవారికి తప్పకయుండవలసినదే. ఇది దేశక్షేమమునకుఁగూడ చాలగ నుపయోగపడునది. ఇనుము, బంగారము, రాగి మున్నగునవి యెట్లు దొరుకునవి, గుండుసూది మున్నగునవి యెట్లు తయారగునది, ఏ యే ద్రావకములు ఎట్లు తయారగునవి, వాటి ఉపయోగములు మొదలైన సమాచారములు గల్గిన గ్రంథములు ఈ శాఖయం దుండవలెను.

---

# పెద్దలచదువు—కొన్ని సూచనలు

శ్రీ వడ్లమూడి వేంకటరత్నం

“అయితే మరి లోపల కుక్కమూతివాళ్లు లేరూ?” ‘లోపల కోడికూత, రోకటిపోటు వినబడ్డవంటారే’ 1942 మే నెలలో పెద్దలడిగినప్రశ్నలలో మచ్చున కివి రెండు. వీనిని జూచినచో వీరికి యథార్థమును బోధింపవలసిన యవసరమెంత గలదో తెలియగలదు.

ప్రజాసామాన్యములో నూటికి తొంబదిమందికి మీఁజి, తమ తమ వృత్తులలో నిరంతరాభ్యాసము వలన కొంతజ్ఞానము గలవారయ్యును, సామాన్య విషయములుగూడ తెలియక, అజ్ఞానములో కొట్టుమిట్టాడుచున్నారు. స్వామి వివేకానందు డనుచున్నాడు:–

ప్రజా సామాన్యములో బలము చెల్లాచెదరుగ పడియున్నది. దీని నంతటిని ఏకముచేసి కార్యసాధనమునకు గడంగవలయును. ఈ సాంఘిక సమష్టి శక్తివలన దేశ మౌన్నత్యశిఖరము నందుకో గలుగును.

దేశమునగల దౌర్భాగ్యస్థితి దూరమయి సౌభాగ్యము పొందవలయునన్న ప్రజాసామాన్యము విజ్ఞానవంతము గావలయును, అందులకు నయోజన విద్యకంటె ముఖ్యసాధనము లేదు. అందుల కుత్సాహముతో పూనుకొనవలయును. నిరక్షరాస్యతా నిర్మూలనమునకు నడుము కట్టుకొనవలయును.

అక్షరాస్యులు కాగోరువారికి చదువువ్రాతలు నేర్పి, వారు తమంత తాము సర్వ విషయములు తెలిసికొని విద్యావంతులగుటకు తోడుపడవలయును. ఇక కొందఱు అశ్రద్ధవలననో బిడియమువలననో, మఱి యితరకారణముల వలననో చదువువ్రాతలు నేర్చుకొనుట కిచ్ఛగింపకున్నారు. అటులని వారిని విడిచివేయరాదు. చదువువ్రాతలు ఒకసాధనము లేగాని ఫలితముగాదుగదా! కనుక వారి కితర రూపముల విజ్ఞానమును సమకూర్పవలయును. అందులకు వింతదీపములు, హరికథలు, జంగముకథలు, ఉపన్యాసములు, పురాణములు మొదలగు పద్ధతు లనుకరింపవలయును.

ఈ పద్ధతులవలన ప్రబోధింపవలసిన విషయములు పెక్కులు గలవు. మానవునకు తన జీవితకాలములో అనేక విషయములతో పరిచయ

మేర్పఱచు కొనవలసి యున్నది. ఆ యన్ని విషయములందును తగినంత పరిచయము వారికి గలుగ వలయును. అందులకు యువకులు కంకణము దాల్పవలయును. ప్రతివిషయమును దానికవసరము లగు బోధనోపకరణముల ద్వారా— ఒక పాఠ్య క్రమము ననుసరించి —బోధింప వలయును. అవి కొన్ని యివి.

1. భూగోళము:— దాని ఆకార పరిమాణములు, చలనములు, సూర్యుడు, చంద్రుడు, నక్షత్రములు, గ్రహములు, దినము లెట్లేర్పడును? సంవత్సరములు, మాసము లెట్లేర్పడును?

2. శరీరము:— దాని నిర్మాణము, జీర్ణవ్యాపారము, రక్తప్రసరణము, శ్వాసక్రమము, చిన్న చిన్న వ్యాధులకు కారణములు, చికిత్సలు.

3. ఆరోగ్యము:— ఆరోగ్యమనగా నేమి? అది యేల అవసరము? ఎట్లు కాపాడుకొనవలయును? గృహారోగ్యము, గ్రామారోగ్యము.

4. చరిత్ర:— పూర్వపు యుగము, వారి పరిపాలనారీతులు, మహమ్మదీయులరాక — వారిపరిపాలన, బ్రిటిషు వారి రాక — వారి పరిపాలనరీతి.

5. స్వాతంత్ర్యము:—స్వాతంత్ర్యము — స్వరాజ్యమనగా నేమి? దాని స్వరూపము, అందులకు, జరుగుచున్న ప్రయత్నములు, స్వరాజ్య మేర్పడకుండుటకు ఇతరులు చెప్పు కారణములు, వాని సమాలోచనము.

6. పరిపాలనము:— వోటు అనగా నేమి? పంచాయతులు, జిల్లా బోర్డులు, రాష్ట్రపరిపాలన, దేశపరిపాలన.

7. అర్థము.— అర్థమనగా నేమి? దానివిలువ, మారకము—చెలామణి:ఉత్పత్తి పంపకము, నాణెములు— లాభనష్టములు, మార్పిడి.

8. సంఘము:— సంఘముఅనగా నేమి? పూర్వపు నిర్మాణరీతి, అది చెడిపోవుటకు కారణములు, సంఘమును బలపఱచుకొను మార్గములు.

9, ఆచారములు:— బాల్య, వృద్ధ వివాహములు, పునర్వివాహములు, మంచి చెడ్డలు, శుల్కములు— లాభనష్టములు, స్త్రీలు—వారిస్థితి—కులములు — వానినష్టములు, అస్పృశ్యత—

10 మతము.— మతమనగానేమి? మత ము ఆచరణము, ఇతర మతములు— హైందవమతము, మతసామరస్యము— మతము— కులములు వివాహములు— మొదలగునవి.

11. వ్యవసాయము:—ఇప్పుడు మనలోనున్న పద్ధతులు, పాశ్చాత్య పద్ధతులు, మనము సంస్కరించు కొనవలసిన ఆవశ్యకత.

12. విద్య:- విద్యయనగా నేమి? దాని అవసరమేమి? కళ యనగా నేమి? సంస్కారము.

13. గృహపరిశ్రమలు:- పరిశ్రమలవలన ప్రయోజనము, పూర్వాభివృద్ధి. మన కనుసరణీయములగు పరిశ్రమలు.

14. ప్రపంచము:- ఖండములు, దేశములు, పరిస్థితులు, ప్రస్తుతయుద్ధము, కారణములు, గ్రంథాలయములు, వార్తాపత్రికలు.

ఇట్టివిషయము లనేకములు గలవు. వీనియన్నింటిలో పరిస్థితుల ననుసరించి అచటి కనుకూలములగు మార్గములద్వారా ప్రబోధింపవలయును. ఈ పద్ధతుల ననుకరించినచో పౌరులు విద్యావంతులు కాగలరు. కాని యిట్లు విద్యనభ్యసించుటకును సామాన్యుల కవకాశము లేకగాని, అజాగ్రత్తవలన గాని, సమావేశము గాజాల కున్నారు. అట్టి పరిస్థితులలో వారి కాయవసరమును, అనుకూలమును తెలుపవలసిన యవసర మెంతేని గలదు. మహమ్మదుదగ్గఱకు కొండ కదలి రాకున్నచో మహమ్మదే కొండదగ్గఱకు పోవలయును. అందులకు యువకులు ప్రతిజ్ఞ బూనినచో దేశ మతిశీఘ్రకాలము ననే ఉన్నతి మార్గమును బట్టగలదు. అట్టి యౌన్నత్యము సాధించుటకు విద్యావంతులు కృషి చేయుదురు గాక!

---

# గ్రంథాలయములు—వాటి ఉపయోగములు

శ్రీ పిల్లలమఱ్ఱి వేంకట హనుమంతరావు

(ఈ విషయాన్నిగూర్చి నేనీనాడు వ్రాస్తున్నానంటే, దీనికి ప్రేరకులు పితృపాదులు శ్రీ అయ్యంకి వేంకటరమణయ్యగారే. వీరు నేను పుట్టకపూర్వం నుంచే గ్రంథాలయ సేవకై తమ సర్వస్వాన్ని ధారపోస్తూ వచ్చారు. తత్ఫలితంగా మన మీనాడు నేత్రపర్వంగా ఆంధ్రదేశంలో దినదినాభివృద్ధిపొందుతున్న అనేక గ్రంథాలయాల్ని చూస్తున్నాము. అట్టి గ్రంథాలయాలవలన ఎంతో ఉపకారం పొందిన నేను, శ్రీవారికి కృతజ్ఞత తెలుపు ఉద్దేశంతో ఈ వ్యాసాన్ని వ్రాయడానికి పూనుకున్నాను.)

గ్రంథాలయాలంటే, పుస్తకాలుండే మందిరాలని అర్థం. పుస్తకాన్నిగానీ, కాగితాన్నిగానీ పొరపాటున మనం తొక్కామంటే, దాన్ని కళ్ళ కద్దుకునే అభ్యాసం మనలో ఇప్పటికీ కనపడుతుంది. అందులో ఉన్న పరమార్థం ఏమిటంటే మనం ఆ పుస్తకాన్ని సరస్వతీదేవి స్వరూపంగా భావిస్తున్నాము. ఈ అర్థంలో గ్రంథాలయం సరస్వతీదేవియొక్క ఆలయం అన్నమాట! ఈ ఆలయానికి అనుదినమూ వెళ్ళి, దేవిని ఆరాధించే వాళ్ళకు విజ్ఞానఫలం లభిస్తుంది. ఆ ఫలాన్ని పొందినవాళ్లు సర్వవిధాల సంపన్నులౌతారు. మానవుడు దాన్ని సాధనంగా జేసికొని సాయుజ్యాన్ని పొందగలడు. ఇదే జ్ఞానమార్గం. ఆంధ్రులు అనాదిగా ఈ జ్ఞాన

మార్గాన్నే అనుసరించినవాళ్ళనీ, ఔత్తరాదీయులు భక్తిమార్గాన్ని అనుసరించినవాళ్ళనీ, దాక్షిణాత్యులు కర్మమార్గాన్ని అనుసరించినవాళ్ళనీ, తెలియవస్తున్నది. కాబట్టి, జ్ఞానమార్గం మనకు క్రొత్తదికాదు.

ఈ విజ్ఞానఫలాన్ని పొందడానికి గ్రంథాలయాలు ఉపకరిస్తవి అని చెప్పినాము. అయితే గ్రంథాలయప్రవేశానికికూడా తదితర దేవాలయ ప్రదేశానికి కావలసినట్లుగా మానవునికియోగ్యత ఉండాలి. దేవాలయంలోకి ఏ విధంగా కాళ్లూ చేతులు కడుక్కొని, పవిత్రభావంతో పోవడం ఆచారమో, ఆ విధంగానే గ్రంథాలయానికి కూడా పవిత్రమైన భావంతో వెళ్ళడం అవసరం. దేవాలయంలోకి టెంకాయ, కర్పూరం మొదలైన వస్తువుల్ని దేవునికి కానుకగా తీసుకువెళ్లడం ఆచారము. ఈ గ్రంథాలయంలోకి తీసుకుపోవలసిన కానుక ఏమిటంటే అక్షరజ్ఞానమున్న మనస్సును. లేకపోతే, రిక్తహస్తాలతో వెళ్ళిన మానవునిలాగా అక్షరజ్ఞానములేని మానవుడు వేరొకనిచేత అతనికిలభించినప్రసాదాన్ని అందుకోవలసి యుంటుంది. ఆ ప్రసాదం, ఆ పెట్టేవాడి చిత్తవృత్తినిబట్టి ఉంటుంది. కాబట్టి అక్షరాస్యులే గ్రంథాలయ ప్రవేశానికి యోగ్యులైనవాళ్ళు.

అయితే అక్షరాస్యులు ఆంధ్రులలో ఎన్నోవంతు ఉన్నారు? ఈ సంఖ్యను పరిశీలిస్తే, చాలా నిరుత్సాహంగా ఉంటుంది. ఇటువంటిస్థితిలో గ్రంథాలయాలు స్థాపించిన ప్రయోజనమేమిటి? గ్రంథాలయం ఉన్నఊళ్ళో యీ ప్రశ్నను ఎంతమంది వేసుకోగల్గుతున్నారు? చాల స్వల్పసంఖ్యాకులు! అంచేత ముందు, ప్రజలకు గ్రంథాలయ ప్రవేశ యోగ్యత కలుగచేయాలి. దానికి ముఖ్యంగా ప్రతిఊళ్ళో, వయోజన విద్యాభివృద్ధికోసం పాఠశాలలు రాత్రిళ్లు ఏర్పాటు చేయాలి. ఇప్పుడీవిధంగా జరుగుతూన్న పాఠశాలలలో చేయబడుతున్న కృషిచాలదు. అక్షరాస్యులు తక్కువగా ఉన్నఊళ్ళో గ్రంథాలయం ఎంతవఱకు ఉపయోగకారిగా ఉంటుంది?

ఇంక, మనహిందువులలో చాలామంది దేవాలయాలకు వివిధంగా వెళ్ళడం ఇపుడు మానేస్తున్నారో, ఆ విధంగానే గ్రంథాలయాలకు వెళ్లని వాళ్ళు చాలామంది ఉన్నారు. పోనీ, వీళ్లు ఇళ్లల్లోనైనా దేవతారాధన చేస్తున్నారా, అంటే అదీ లేదు. వాళ్ళకు భక్తిఫలమూ రాదు. వీళ్ళకు విజ్ఞానఫలమూ దక్కదు. అటు ఆలయానికీ పోక, ఇటు ఇంట్లోనూ(లేక మనసులోనూ,ఆరాధనా చేయక ఉన్నవాళ్ళు ఏ విధంగా తరిస్తారు, చెప్పండి! కాని, సనాతను లేవిధంగా ఇళ్ళల్లో పూజామందిరాల్ని ఏర్పరచుకున్నారో, అట్లాగేవిద్యావంతులు కొందరుమాత్రం తమ ఇళ్ళల్లో గ్రంథాలయాల్ని సమకూర్చుకున్నారు. వారు వాటిని ఉపయోగించుకొన్నా, ఉపయోగించుకోక పోయినా, వాళ్ళకే కాక; అతిథులకు కూడా ఉపయుక్తాలవుతూ ఉంటున్నవి. కాని, యీ అతిథులుమాత్రం గుళ్లో లింగాన్నే మాయంచేసే ఉపాయము చూడకూడదు. అట్లాంటి అతిథులు మనవాళ్ళల్లో చాలామంది ఉన్నారని చెప్పినందుకు క్షమించాలి.

గ్రంథాలయాలు విద్యావంతులకెంత ఉపయోగకాలో నేను ఎక్కువగా చెప్పనవసరంలేదు. అవి విశ్వవిజ్ఞాన నిలయాలు. అధికారులకు అన్ని భాషలలోఉన్న వెలుగుజిలుగుల్నీ, అన్నిమతాల్లో ఉన్న నీతినియమాల్నీ, ప్రపంచంలోఉన్న అనేక మానవులలో ఉండే వివిధమైన ప్రకృతుల్నీ,

వివిధాలైన ఆచార వ్యవహారాల్నీ, ఆ యా దేశాల్లో ఉత్పన్నాలవుతున్న వస్తువుల్నీ, పరిశ్రమాభివృద్ధినీ, ఇంకా ఎన్నిటినో తెలుసుకొనడానికి అవకాశం కల్పిస్తుంది గ్రంథాలయం. ఆ యా జాతివాళ్లు, వాళ్ల పూర్వపు ఔన్నత్యాన్ని తెలుసుకొనేందుకు ఎన్నో గ్రంథాలు ఉపయుక్తాలవుతవి. సోమరులుగా కూచునే వారి మనస్సులను దుర్మార్గముల పోనీయకుండా, గ్రంథాల్ని చూడడంచేత సత్పథాల్లో ప్రవేశింపజేయవచ్చు. ఇదంతా విజ్ఞానవిషయకం.

గ్రామీయులకు పారిశుద్ధ్యముగూర్చీ, ఆరోగ్య విషయాల్నిగూర్చీ, సేద్యాన్నిగూర్చీ, భవన నిర్మాణంగూర్చీ, ఇంకా అనేక విషయాల్నిగూర్చీ ఉపయోగకరములైన గ్రంథములు గ్రంథాలయాల్లో లభ్యమౌతున్నవి. ఎంతవిచారంపొందిన మనస్సునైనా గ్రంథావలోకనం చేత సుముఖం చేసుకోవచ్చు.

ఇట్టి గ్రంథాలకు నెలవులైన గ్రంథాలయాల్ని; ఊరూరా, ఇంటింటా, నెలకొల్పడానికై ముప్పై సంవత్సరాలనుంచి కృషిచేసి నేటికి కృతకృత్యులైన శ్రీ అయ్యంకివారు ఆంధ్రలోకానికి చిరస్మరణీయులు. వారికి ఆనందం ఎప్పుడు కల్గుతుందంటే ప్రతి ఆంధ్రుడూ విద్యావంతుడై, గ్రంథాలయోపయోగం తెలుసుకొని, తద్గ్రంథాలయ వ్యాప్తికై కృషి చేసినప్పుడేకాని, ఊరికే యథాప్రకారంగా ఉదాసీనంగా ఉంటే కాదు.

---

## గ్రంథాలయము—సేవకుడు

**శ్రీ పీతాంబరం వేంకట కృష్ణమాచార్యులు**

శ్లో॥ "యం శైవాః సముపాసతే శివ ఇతి
బ్రహ్మేతి వేదాంతినో
బౌద్ధా బుద్ధ ఇతి ప్రమాణపటవః
కర్తేతి నైయాయికాః
అర్హన్నిత్యథ జైన శాసనరతాః
కర్మేతి మీమాంసకాః
సోఽయం వో విదధాతు వాంఛితఫలం
త్రైలోక్యనాథో హరిః"

గ్రంథాలయము అనగా ప్రజల విశ్వవిద్యాలయము. గ్రంథాలయము నిరక్షరాస్యతను నిర్మూలించి దేశకల్యాణమునకు జ్ఞానజ్యోతులు వెలిగించు దివ్యస్థలము. ప్రతి వ్యక్తియు, బడిచదువు పూర్తియయిన పిమ్మట గ్రంథాలయమందలి పుస్తకరూపిణియగు సరస్వతిని ఆరాధించినగాని పరిపూర్ణుడు కాజాలడు.

### గ్రంథాలయ ఉద్యమము

ఈ ఉద్యమము పవిత్రమైనదని చెప్పుట అతిశయోక్తి కాజాలదు; అమెరికా కోటీశ్వరులగు శ్రీ ఆండ్రూ కార్నెజీగారు ఈ ఉద్యమముయొక్క ప్రాశస్త్యమును గమనించియే కొన్నికోట్ల రూపాయీలు ఈ ఉద్యమవ్యాప్తికి ధర్మముచేసియున్నారు. ఈ ఉద్యమమునందు స్వార్థరహితమగు త్యాగముకలదు. తోడిమానవులు చదువను వ్రాయనునేర్చుకొని;జ్ఞానవంతులు,విజ్ఞానవంతులు అయి సోమరితనమును పారద్రోలి ఆత్మగౌరవమునకు, అన్నవస్త్రములకు లోటులేని

ఇహసౌఖ్యమును,ఆనందామృతాస్వాదనారూప మగు పరసౌఖ్యమును పొందవలయు నను సంకల్పమే ఈ ఉద్యమమునకు పునాది.

## గ్రంథాలయనిర్మాణము

పవిత్రమగు గ్రంథాలయమును ప్రతి గ్రామమందును దేవాలయములవలె ఉన్నతమగు స్థలమున చూచువారికి శ్రీ సరస్వతీ దేవికి ఆటపట్టని తెలియునటుల; మంచివెలుతురు, మంచిగాలి ప్రసరించు లాగున నిర్మించవలెను. అందు పొత్తముల భద్రపరచుటకు చూచువారి మనస్సుల నాకర్షించు లాగున చక్కని అద్దపుబీరువాలను అమర్చవలెను. పూర్వము దేవాలయములె ప్రతి గ్రామమున విశ్వవిద్యాలయములుగ అన్నికళలను పోషించుచుండెడివి. ఆ రోజులలో దేవాలయ ధర్మకర్తలును సేవకులును ఆదర్శముకొఱకు, దేశకళ్యాణము కొఱకు తమ జీవితములనైన ధారపోయు త్యాగమూర్తులుగ నుండెడివారు. ఇప్పుడు దేవాలయాదర్శము కాలగర్భమున మునిగి దేవాలయములు వర్తకస్థానములైనవి. దేవాలయాధికారులకు సేవకులకుకూడ స్వార్థపరత హెచ్చినది. కారన్న ప్రకారము డబ్బిచ్చిన వారిని గౌరవించి ఆదరించుట, లేనివారిని నిరసించి పొమ్మనుట, అధికారులచే ఆలయసేవకులు బానిసలుగ చూడబడుట, అధికారులదయ సంపాదించుటకే ఆలయసేవకులు ఆదర్శమును విడనాడి అకార్యములకు లోనగుట మున్నగుపనులవలన దేవాలయాదర్శము క్షీణదశకు వచ్చినదని చెప్ప వచ్చును. అట్లు కానిచో శ్రీరంగమందుండెడి పురాతన గ్రంథాలయమును దేవాలయమువారు కొన్ని వేలకు పశ్చిమదేశవాసులకు అమ్ముట తటస్థించి యుండదు. అందుచే ఆదర్శమగు జీవితము గడుపు సుజ్ఞానుల తయారుచేయుటకు గ్రంథాలయ స్థాపనము అవసరమైనది.

## గ్రంథాలయ నిర్వహణము

గ్రంథాలయ స్థాపన ఉదారులగు గ్రామవాసుల సహాయమున చేయవచ్చును. గాని నిర్వహణము మట్టుకు చాల కష్టమైనపని. భోగలాలసులగు సుఖోపాసకులవల్ల అది సాధ్యపడునది కాదు. గ్రంథాలయసేవ కష్టపరంపరలయందు నిశ్చలమగు ఆనందమయ జీవితము గడపగలిగిన వారికే సాధ్యపడును. గ్రంథాలయమందు ఉండువారు తమజీవితపరమావధి గ్రంథాలయసేవయే యని నిశ్చయించుకొనినగాని గ్రంథాలయము అభివృద్ధిపొందజాలదు. పాలకవర్గమువారుకూడ అహంభావమును, అధికార తృష్ణను విడనాడి వేతనములు పుచ్చుకొను సేవకులకంటె అధికముగ పాటుపడిన గాని గ్రంథాలయము ఆదర్శముగ నడుపబడదు. ఎంతమంది పనిచేసినను పనిచెప్పగల సంస్థ గ్రంథాలయముగాన వేతనములు పుచ్చుకొనువారు కూడ జీతమునకే పనిచేయుచున్నాము అనేభావమును విడిచి, పొట్టగడవక జీతము పుచ్చుకొను చున్నామేగాని, మా జీవితములు గ్రంథాలయసేవకు సమర్పణ చేయుచున్నాము. అని త్రికరణయా సంకల్పించి, కాలమును పాటింపక అవకాశము ఉన్న ప్రతిక్షణమును సోమరితనమును పారద్రోలి గ్రంథాలయ సేవ చేయవలెను. అటుల సేవచేయువారల పోషించవలసిన బాధ్యత పాలకవర్గమునందును ప్రజలయందును కలదు. గ్రంథాలయ నిర్వహణము

ఆదర్శముగ నుండవలెనన్న గ్రంథభాండాగారి కడు సమర్థుడుగ నుండవలెను. అతనికి మాతృభాషయందు పాండిత్యమును; రాజభాషతోను, దేశభాషతోను, పరిసర భాషలతోను పరిచయమును కలిగి యుండవలెను. గ్రంథాలయ పాఠకులను గ్రంథభాండాగారకుడు (పుస్తక శాలాధికారి) 'గృహస్థాశ్రమ ధర్మ పరిపాలకుడు అతిథుల నాదరించునట్లు' ఆదరించి వారివారి అభిరుచుల గ్రహించి వారి బుద్ధివికాసము ఎటులున్నదో గమనించి వారికి ఎట్టి పుస్తకములు చదువుటకు ఇచ్చిన వారు క్రమవికాసము పొందగలరో అట్టి పుస్తకములే వారి కిచ్చుచు, పుస్తకపఠనమందు వారికి గాఢమగు అభిరుచి కలుగజేయుచు, వారికి తెలియని విషయములు తెలుపుచు, ఆత్మవికాసమునకు దేశకళ్యాణమునకు హేతుభూతములగు సద్గ్రంథ పఠనము చేయువటుల గ్రంథభాండాగారకుడు శ్రద్ధతీసుకొనవలెను. వేదికలపై ఉపన్యసించినంత సులువుగ యిది సాధ్యపడునది కాదు. నేను ఊరివారి ఉపాధ్యాయుడనని గ్రంథభాండాగారకుడు తలచవలెను. గ్రంథాలయము ఆదర్శ సుఖజీవనమును ప్రసాదించునదిగ నుండవలెనేగాని, ఆటలతోను, వ్యసనములతోను నిండిపోయి అమానుషత్వమునకు దారి చూపునదిగ ఉండకూడదు. అట్టి సంస్థలు ఏవిధముగ చూచినను ఆత్మోన్నతికి గాని, దేశసౌభాగ్యమునకు గాని ఉపయోగపడజాలవు. భాండాగారకుడు ప్రతి విషయమును విమర్శించి యథార్థమును తెలుసుకొని పాఠకులకు తెలుపుచుండవలెను. గ్రంథభాండాగారకునకు ఉండవలసిన సలక్షణములలో ఓర్మి ముఖ్యమైనది. 'చిన్నపిల్లలు చేయు అల్లరిని సహించి తల్లి వారి పురోభివృద్ధికి ఎటుల పాటుపడునో అట్లే భాండాగారకుడు పాఠకులు మొదటలో గ్రంథాలయ నిబంధనల ఆచరణలో పెట్టకపూర్వము) చేయు చిరుచేష్టలుసహించి వారికి హిత వొసగి వారిని సన్మార్గులనుగ చేయవలెను. భాండాగారకుని సత్సంకల్పబలమే గ్రంథాలయ పురోభివృద్ధికి మార్గముచూపు దివ్యజ్యోతి. 'శ్రీ రామకృష్ణ' మఠమువారు ప్రచారకులను తరిఫీయతు చేసి పంపుచున్న మాదిరిగ ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘమువారు ప్రతిసంవత్సరము ప్రతిజిల్లాలోను కేంద్రముల స్థాపించి వేసవిపాఠశాలల మూలకముగ ఆదర్శప్రవర్తకులగు గ్రంథభాండాగారకుల తయారుచేసినగాని గ్రంథాలయ నిర్వహణము పూర్ణత్వము పొందజాలదు. సక్రమ నిర్వహణ లేని యే సంస్థగాని, దేశమునకుగాని, దేశస్థులకుగాని ఉపకారి కాజాలదు. ఆచరణ లేని ఆర్భాటములు నిష్ప్రయోజనములు. మరియు గ్రంథాలయపఠనాలయములకువచ్చు రకరకముల మనుష్యుల సర్దుబాటు చేయగల సమర్థతకూడ గ్రంథభాండాగారకున కుండవలెను. పాఠకవర్గము వారు గ్రంథభాండాగారకుని గుమాస్తాగా వాడుకొనక అతనికి స్వేచ్ఛ కలుగజేసి, గ్రంథపఠనమొనర్చుటకు తగు అవకాశముల కల్పించి తద్వారా భాషాసేవ, గ్రంథాలయసేవ, దేశసేవ చేయగలిగిన వానినిగ తయారుచేయవలెను. మన ఆంధ్రులలో ఆరంభశూరత్వము అనుకరణ కలదు. గాని పట్టుదలతో కార్యములను సాధించగలవారు చాలా తక్కువమందియే ఉన్నారని చెప్పుట సాహసము కాజాలదు. ఏ ఉద్యమమును నడపువారు ఆ ఉద్యమమును తమ జీవితాంతమువటుకు శ్రద్ధగ నడపగలిగినచో ఆ ఉద్యమమునకు,

ఆ వ్యక్తికి సాఫల్యత కలుగునని చెప్పక తప్పదు. పైవిధానము ననుసరించియే కొన్ని దేశములలో ప్రతి ఉద్యమము ఉన్నతస్థానము నలంకరించి ఆదర్శమును వెదజల్లుచున్నది. ప్రతి ఉద్యమము నడుపుటకు ఆర్థికసహాయ మవసరము. దానిని ప్రజలే చేకూర్చి, ఉద్యమ సేవకుల ప్రోత్సహించ వలెను. పనిచేయుటకు స్థలము, ధనము, చేయు వారు అవసరము. ఇందు ఏదిలోపించినను ఉద్యమము సాఫల్యముపొందజాలదు. అన్నియు సమకూరినను యోగ్యతలేనిచో (వాటియందు పవిత్రత్వము లేనిచో) ఆదర్శరహితమగు పరిపూర్ణత్వమే గాని ఆదర్శసహితమగు పరిపూర్ణత్వము కాజాలదు. సదుద్యమముల సక్రమముగ నడపవలెనన్న నిర్వాహకులలో ఐకమత్యము ముఖ్యముగ అవసరము. సహనశక్తి, ఐకమత్యములేని నిర్వాహకులు ఏ ఉద్యమమును ప్రారంభించినను "పుబ్బలోపుట్టి – మఘలోమాడుటయే" తటస్థించును; సలక్షణులగు వారిచే నిర్వహింపబడునవి సంస్థలు). అత్యున్నతికి, దేశసౌభాగ్యమునకు మార్గదర్శకములు కాగలవు—

## సేవకుడు

గ్రంథాలయ ఉద్యమవ్యాప్తికి స్వార్థరహితమగు సేవ చేయువారందరు గ్రంథాలయసేవకులనబడుదురు. ప్రతి గ్రంథాలయసేవకుడును తన ధర్మమును తెలుసుకొని సక్రమముగ ఆచరించినచో గ్రంథాలయోద్యమము వెర్రితలలువేయక క్రమ వికాసముపొంది ప్రపంచమందు నిరక్షరాస్యతను-నిర్మూలించి ప్రజలను ఆదర్శసుఖజీవనము గడుపువారినిగ చేసి తద్వారా దేశకళ్యాణమును చేకూర్చుననుటకు సందియములేదు. ఎవరు "నేను సేవకుడ నను సద్భావముతో దేశమునకుగాని, సంఘమునకుగాని, మతమునకుగాని, ఉద్యమమునకుగాని,సంసారమునకుగాని, సేవచేయునో" అట్టి వ్యక్తియు, చేయబడినపనియు ఆచంద్రతారార్కము కీర్తి శరీరముల ధరించి యుండురు. నేను అధికారినను అహంభావముతో చేయబడిన పని తనజీవితాంతములోనే మాసి మట్టిగలియును. "తనవలన కుక్కకైనను అపకారము కలిగినచో కొన్నివేల జన్మలు ఎత్తుదునని" శ్రీ రామకృష్ణ పరమహంస చెప్పియున్నారు. గాన మానవులందరు సర్వభూత సుహృదయులుగ నుండులాగున తయారుచేయవలసిన బాధ్యత గ్రంథాలయసేవకుని యందు కలదు. ఇతరులను ఆదర్శప్రాయులుగ తయారు చేయవలెనన్నచో తను ఆదర్శప్రాయుడుగ నుండవలెను. ఆదర్శ సుఖజీవి లక్షణము లెవ్వియన (1) తన శరీరమును తానెటుల ప్రేమించుకొనునో సర్వభూతముల నటుల ప్రేమించుట, (2) పెద్దలగువారియందు విధేయత కనబరచుట, (3) పరస్త్రీని తల్లివలెను, పరధనమును చిల్లపెంకువలెను చూచుట, (4) దీనజనుల బాధలు పరిహారించుటకు కరణత్రయముతో ప్రయత్నించుట, (5) స్నేహితులను సోదరులవలె జూచుట, (6) గురువులను దైవసములుగ జూచుట, (7) సర్వకాల సర్వావస్థలయందును సత్యమునే పలుకుట, (8) పరులదుఃఖమును తన దుఃఖముగ భావించుట, (9) పరులసుఖమునే తన సుఖముగ భావించుట, (10) సేవచేయునపుడు సోమరితనమున కవకాశ మీయకుండుట. పై సుగుణములన్నియు గ్రంథాలయసేవకున కున్నచో గ్రంథాలయ ఉద్యమము త్వరలో విశ్వవ్యాప్తియై దేశకల్యాణమునకు జ్యోతులు వెలిగించును. మానవసేవయే మాధవసేవ. సేవా స్వరూపమే భగవంతుడు.

సేవాదీక్ష పొందుటయే భగవత్సాన్నిధ్యమును చేరుట గాన సేవా ఉపాసకుడే సర్వజనరక్షణకు హేతుభూతుడు కాగలడు. శ్రీ కృష్ణపరమాత్మ యేమి చెప్పి యున్నాడు. "కురు కర్మ సఖే! త్యజ కర్మఫలం" ఫలముకోరక పనిచేయుము. మహా భక్తుడగు కులశేఖరుడు ఏమి చెప్పియున్నాడు? "మజ్జన్మనః ఫలమిదం మధుకైటభారే! మత్ప్రార్థనీయ మదనుగ్రహ ఏష ఏవ, త్వద్భృత్యభృత్య పరిచారక భృత్య భృత్య భృత్యస్య భృత్య ఇతి మామ్ స్మరలోకనాథ!" ఓ సర్వేశ్వరా! నా జన్మమునకు సాఫల్యమే మన ప్రపంచ స్వరూపుడవైన నీ సేవకునకు సేవకునిగాను, నీ భక్తులకు భక్తునిగాను, నీ దాసాను దాసులకు దాసునిగాను అనుగ్రహింపుము. ఇట్లు సేవాసరత కలిగినవాడే నిజమైన సేవకుడు. వాడే అహంకార మమకార శూన్యుడు. వాడే నిజమైన భాగ్యవంతుడు. వాడే నిజమైన సుఖజీవి. వాడే ధన్యుడు. వాడే మార్గదర్శకుడు. ఇట్టి సేవకులను కలిగియున్న దివ్యసంస్థయే ప్రపంచకళ్యాణమును చేకూర్చగలదు.

"లోకాస్సమస్తా స్సుఖినో భవంతు"

---

# ఆంధ్రులు—గ్రంథాలయములు—గ్రంథకర్తలు

శ్రీ ఆత్మకూరి గోవిందాచార్యులు

"ఆంధ్రభాష—ఆంధ్రులసంఖ్య గణింప దగినది"

దేశభాషలలో తెనుగు గొప్పస్థానము వహించినది. ప్రభుత్వమువారిందువల్లనే నాణెములపై తెలుగుభాషనుగూడ ముద్రించుచుండిరి. తెలుగువారన్ననో భాషాభిమానమున వెనుకబడియుండిరా? ఏనాటి ఆంధ్రోద్యమము? ఎప్పటి ప్రత్యేక రాష్ట్రాభిమానము? "ఆంధ్రమాత శ్రీసమేత, అనుపమ ప్రపూత చరిత, అఖిలభక్త పారిజాత, అనుపమ మంగళమ్" అను ఆంధ్రుల మంగళ గీతారావ మనంతముగా దిక్కుల పిక్కటిల జేయుచునే యున్నది. విస్తీర్ణమున - పరివ్యాప్తమున - అభిమానమున - రూపలావణ్యముల ఏ వంగభాషకును తీసిపోని ఆంధ్రభాషలో గ్రంథములు వ్రాయువారి గతి యెట్లున్నది? రాజకీయ విషయమా? మత విషయమా? విద్యావిషయమా? భాషావిషయమా? కళావిషయమా? ఏవిషయమైననేమి? నాటకమా? నవలా? ప్రబంధమా? గద్యా? పద్యమా? ఏ రూపమైతేనేమి? సన్మార్గుడు వ్రాసెనా? దుర్మార్గుడు వ్రాసెనా? సిద్ధుడు వ్రాసెనా? లోలుడు వ్రాసెనా? అనామకుడు వ్రాసెనా? సుప్రసిద్ధుడు వ్రాసెనా? దేశభక్తుడు వ్రాసెనా? దేశద్రోహి వ్రాసెనా? త్యాగి వ్రాసెనా? భోగి వ్రాసెనా? పరార్థమై వ్రాసెనా? స్వార్థమై వ్రాసెనా? ఎవరు వ్రాసిననేమి? ఎందుకు వ్రాసిననేమి? లోకోపకారార్థమా? రసవంతమా? చరిత్రాత్మకమా? విజ్ఞాన ప్రదమా? ఎట్లైననేమి? అచ్చుబాగున్నదా? బైండింగు గట్టిగానున్నదా? తప్పులున్నవా? లేవా? కాగితము నునుపైనదా? పెళుసైనదా? కిమ్మతు స్వల్పమా? అధికమా?

ఈవిషయములవివరములు ఆలోచింపబడనే బడవు. ఎవరు ఏ విషయమును గూర్చి ఎంతపరిశ్రమముగ ఎంతవ్యయ ప్రయాసలకులోనై ఎట్టిసదాశయముతో తెనుగులో గ్రంథము వ్రాసినను- అందరిగతియు నాంధ్రదేశమునం దొక్కటియే.

సద్గ్రంథములు వ్రాయుట ఒకవంతు. ధనాఢ్యుల నాశ్రయించియో, అంకితమిచ్చియో; పూర్వార్జితముల నమ్మియో, స్వార్జితము వెచ్చించియో అచ్చునకైపూనుట రెండువంతులు. అచ్చుఖర్చుల సేకరించినది మొదలు, తప్పులు తడికలు గాకుండా సకాలముననే అచ్చుపూర్తిజేసి పుస్తకములను తిరిగియిచ్చు ముద్రణాలయమునకై వెతకుట మూడువంతులు. ముద్రణాలయమున అచ్చున కిచ్చినది మొదలు, కాళ్ళరిగిపోవునట్లుగ వారి కార్యాలయము చుట్టు తిరుగుచు వారి నెట్లో మంచిచేసుకొని "ముళ్ళపైబడ్డబట్టవలె" అచ్చుపుస్తకమును జాగ్రత్తగా సంగ్రహించుట నాల్గువంతులు. ఈ విధముగా పదివంతులశ్రమ పరిపాటి యగును. మిగిలిన 90 వంతులశ్రమయు నంతటి నుంచియు గ్రంథకర్త 'కుయ్ కయ్' మనకుండా భరించుచున్నాడు.

## పత్రికలు--విమర్శనము—ప్రకటనలు

ఆంధ్ర గ్రంథకర్తలలో తమ పుస్తకములను మొదటి ముద్రణము 1000 ప్రతులకంటె వేయించువా రపురూపము. రెండవ ముద్రణముగన్న పుస్తకము అపురూపమే. (పాఠశాలలో విద్యార్థులు చదువు పుస్తకములుగాక తక్కినవి) మొదటి ముద్రణ మెట్లు విడుదల యగుచున్నది? ఇదియే ప్రశ్న:—

అచ్చుఅయిన వెంటనే పత్రికాధిపతుల కభివందనములతో విమర్శనార్థ మొక్కొక్క ప్రతి బంపుట ఆచారమయినది. వారో, యీ పుస్తకములను స్వయముగా చూడజాలరు. కొందరకు తీరికయుండదు. మరికొందరకు ఇచ్ఛ యుండదు. కొందరన్ని పుస్తకముల విమర్శింపగల సమర్థులునూగారు. అయినను ఇంగ్లీషు పత్రికలవలె- విదేశములలోవలె- వివిధవిషయపరిజ్ఞానము గల విమర్శకులైనను మన తెలుగుపత్రికలకు లేరు. గ్రంథకర్తలకు గల దుర్గతియే చాలవఱకు ఆంధ్రపత్రికలకు గూడా వర్తించుచుండుటయే యిందుకు కారణముకాని, యీ సమానావస్థను పత్రికలేలనో గుర్తింపజాలకున్నవి. గ్రంథస్వీకార మను శీర్షికయే లేని పత్రికలుగూడ గలవు. గ్రంథకర్తలన్నిపత్రికలకు తమ గ్రంథముల పంపకుండుటయు నిందుకు కారణము. పంపినను అహంకారమునవో, అసమర్థతనో ప్రకటింపకుండుటయు, స్వీకారప్రకటన మొనర్చి విమర్శింపకుండుటయు, గలదు. గ్రంథకర్తయొక్క పరపతి ననుసరించి ప్రశంసాపూర్వకముగా విమర్శింపబడుచో, పాఠకలోకముయొక్క కనులు చెదరునట్లు పెద్ద అక్షరములతో విమర్శ ప్రకటించిన ఫలిత మేమి? గ్రంథకర్త స్వంతవ్యయముతో ప్రముఖుల సదభిప్రాయములతో సహా పత్రికలలో ప్రకటించుకొనుచో గలుగు ఫలిత మేమి? మరుసటిదినము నుండి యుతపాలావాని శ్రమ నిశ్చయమున హెచ్చగును. ఉత్తరములపై నుత్తరములు కుప్పతిప్పలుగ వచ్చుచుండును. వి. పి. గా పూర్తి ఖరీదునకు పంపమనేజాబు సకృత్తు. ఈజాబులలో చాలవఱకు గ్రంథాలయములనుండియే వచ్చుచుండును.

నమూనా నెం 1

ఆర్యా!

తాము చాలా గొప్ప పుస్తకమును వ్రాసినట్లు మీ ప్రకటన వలన తెలియుచున్నది. మాది జీర్ణ గ్రంథాలయము. నేనొక్కడనే దీనిని ఏదోవిధంగా లాగుకొస్తున్నాను. మీ వంటి మహాశయుల దయవల్ల చాల పుస్తకము లు గలవు. దయచేసి తమ …… ప్రతినిగూడ మాకు పంపి మా యత్నమునకు తోడ్పడ గోరెదము. తపాలాఖర్చులు మే మే భరించెదము. పుస్తకమును తాము పంపిన వెంటనే మా కృతజ్ఞతను తెలియపర్చుకొంటూ, తపాలా ఖర్చులక్రింద బిళ్లలను పంపుకోగలము.

చిత్తగించవలెను

తిలకు గ్రంథాలయము
గ్రామం.............
కార్యదర్శి

నమూనా నెం 2

మహాశయా!

మీరు మిక్కిలి వ్యయ ప్రయాసలకు లోనై పెద్ద పుస్తకమును దేశముకొఱకై వ్రాసినారని మిత్రులవలన తెలిసినది. మీవంటి దేశభక్తులు ఊరుకుంటారా? ఇటువంటి ఉత్తమ పుస్తకాలు వ్రాసి, మా వంటి వారికి తోడ్పడుతారని మాకు తెలుసును. మీకు మే మే మియ్యగలం? మా గ్రంథాలయం సంగతి మీకు తెలియదా? వెనక మీరు మా వూరు వచ్చినపుడు మీరు మంచి అభిప్రాయంకూడా వ్రాశారు. చంద్రునికో నూలుపో గన్నట్లు, మీకు సగం ఖరీదు ఇచ్చుకునేందుకు నాప్రయత్నం మీద తీర్మానం అయింది. దయచేసి, మీ …… పుస్తకాన్ని ఒక ప్రతిని మాకు పంప గోరెదము. మా కమిటీ తీర్మానాన్ని మీరు మన్నిస్తారని ఆశిస్తున్నాను. పుస్తకం మాకు చేరిన వెంటనే, సగం ఖరీదు నేను మీవూరు వచ్చినపుడు తీసుకొనివచ్చి తమకు తప్పకుండా వప్పగిస్తాను. దయచేసి వి. పి. మాత్రం చెయ్యకండి.

గాంధీ గ్రంథాలయం
ఊరు .........
మీ విధేయుడు
కార్యదర్శి

నమూనా నెం 3

దేశభక్తులైన శ్రీ ..........గారికి.

తాము ప్రారంభోత్సవము జరిపిన శ్రీ దేశోద్ధారక గ్రంథాలయం దినదినాభివృద్ధియందున్నదని మీకు తెలుపుట కెంతయు సంతోషముగ నున్నది. ఈ సంవత్సరం వార్షికోత్సవము కూడా తమచేతినే జరిపించా లనుకుంటున్నాము. మీ రిదివఱలో ..... పుస్తకాలిచ్చి మమ్ములను ప్రోత్సాహం చేశారు. ఈసారికూడ మీ పుస్తకాన్ని మాకు పంపి గ్రంథాలయోద్యమాభిమానులగు తాము మా గ్రంథాలయాన్ని ప్రోత్సహించెదరని గంపెడాశతో ఈ ఉత్తరం వ్రాశాను. తాము వేరు విధంగా అనుకొనని వారు గనుక మా వూరంతా తమకే వోట్లు వేశామనికూడా తమకు జ్ఞాపకం చేసుకుంటున్నాము.

తమఅభిమానానికి మేము పాత్రులమని విన్నపము. ఈసారి మావూరు మీరు వచ్చినపుడు మిగతా విషయము లన్నియు ముఖాముఖి మాట్లాడుదము. మీ పుస్తకాన్ని తప్పకుండా ఈ ఉత్తరం తెచ్చిన మనిషిద్వారా పంప ప్రార్థితులు.

దివ్య చిత్తమునకు తేవలెను

దేశోద్ధారక గ్రంథాలయం } క. ప.
ఊరు............

గ్రంథకర్తల పాత ఉత్తరముల కట్టలు పైకి పిల్లగించితే ఇటువంటి నమోనా ఉత్తరములు చిత్ర విచిత్రము లైనవి ఎన్నియో లభించగలవు.

ఈ ఉత్తరముల వైఖరిని గమనించుచో మన గ్రంథాలయముల దుస్థితియు, మన గ్రంథకర్తల దుర్భరావస్థయు, రెండును సుబోధకములు. ఇంతకంటె వ్యాఖ్యాన మనవసరము. అయినను గ్రంథాలయము లోక సత్యమును మరచి పోవుచున్నవి.

గ్రంథకర్త - తా నెరిగియున్న వారలందరకు ఉచితముగనో, అరవెలకో, పుస్తకముల నిచ్చుచో గ్రంథకర్త గతి ఏమి? పదిమంది చేయలేని పని యొక వ్యక్తి చేయగలడా?

పరిభుత్వ గ్రంథాలయములు

అనగా స్థానిక సంస్థలక్రిందనున్న గ్రంథాలయములు. ఇవి తమ కిష్టము వచ్చిన పుస్తకము కొనుటకే వీలు లేదు. మరియు స్థానికాధికారుల ఆగ్రహానుగ్రహముల మీద ఆధారపడి యుండును. సరియైన పుస్తకము దాని యోగ్యత పైననే ఆధారపడి, ఏ పుస్తకము గాని, ఆంధ్రమున ఖర్చుబడుచుండుట లేదు. గ్రంథకర్త పలుకుబడి ననుసరించి అతడే తన మూపుపై పుస్తకములను స్నేహితుల యిండ్లకు మోసికొనిపోయిఅమ్ముకొనుచున్నాడు. ఇట్లమ్ముకొనుటలో గ్రంథకర్త భార మెంతయో అతనికే తెలియును. మా కెందుకండీ? అనునొకడు. మీరొచ్చారు గనుక పుచ్చుకుంటాము లెండి అను నింకొకడు. ఎప్పుడూ ఎవరో ఒకరు ఏదో చందాకి వస్తూనే యున్నారండి అనును వేరొకడు. అంతేనేకాని తానిచ్చు ధనమునకు సరి అయిన ప్రతిఫలము గ్రంథ రూపకముగా ముట్టుచున్నదనే జ్ఞానముతో మాట్లాడు విద్యావంతులు విరళముగా నున్నారు.

---

# "పోరు నష్టము—పొందు లాభము"

శ్రీ భమిడిపాటి అయ్యప్పశాస్త్రి

("విద్యా వివాదాయ— ధనం మదాయ")

"...... జ్ఞానాయ—......... దానాయ"

సామాన్యముగా విద్యాధికులును ధనాధికులును మొట్టమొదట విభేదావలంబులై కష్టములను నష్టములను బొందుచున్నారు. అంతర్విభేదములు మిక్కిలి బాధించుచుండుట యెల్లరికిని విశదముకదా! గడ్డిపరకలైనను గొన్ని యొకటిగా గలిసియుండినచో నేనుగునైనను గట్టివేయుటకు వలను పడును. మనలో మనము ఏవో మితిమించిన కారణములకు లోనై విభేద దేవతనే యాశ్రయించు చున్నారము. 'పురువులు అగ్నియందుం బలె' విభేదమును జేరి పరితపించుచున్నవారము. పుట్టి బుద్ధియెఱింగినది మొదలు నింతవఱకును బ్రజలలో నేదోవిధమున హేతువు కలుగుటయును దానంజేసి ప్రశాంతముగా నున్న యొకకుటుంబములో ననుకొనని వినని భేదములు కలిగి కలిగి తుట్టతుదకు విచ్ఛిన్నమయినంగాని యవి యంతరించకుండుటయును "పునర్నవానా ముదయః" అన్నట్టు లేనోయొకటి వచ్చుచుండుటయును నంతకు నంతకు నెన్నరాని ప్రవిచారములు కలుగుటయే గాక మఱి నుఱి వివరింప శక్యము గాని ప్రకారములు విలసిల్లుచుండుటయు, నొకనాటికేని 'తల్లి పిల్లలకును, గురు శిష్యులకును, పిన్న పెద్దలకును, ప్రభు ప్రజలకును,' సామరస్యము కలుగుట కొక్కింతయేని నవకాశ ముండు నను నాలోచనకైనను తావు కానరాకుండుటయును దటస్థించుచున్నయది గాని, యొక్కింతయేనియును శాంతావకాశము కనిపించుటలేదు. ఒకయూరిలో సుమారు రు 100 లు బోడెగట్టుతగాదాకు లోబడి సోదరులిరువురు పొలము బీడుంచుకొనుటయును మిక్కిలి వ్యయప్రయాసలకు లోనగుటయును జరిగినది ఇంకొకయూరిలో నొక కూరగాయను గుఱించి; యొకరిదొడ్డిలో "పాదు" ఉన్నది. ఇంకొకరిదొడ్డిలోనికి ప్రాకియుండుటవల్ల 'కాయ' యున్నయది. దీనికోసము కొన్నివందలు నష్టపడిరి. కలహమునకు మితమే కానరాకుండెను. మనదేశము మొదటినుండియును 'రత్నగర్భ' యను నెన్నడికాంచి, మణిదీపికలచే విరాజిల్లుచుండి, సస్యశ్యామలమై మిక్కిలి యలరారుచున్నయది. ఇప్పుడును అభివృద్ధులకునొక్కింతయును లోటులేదు. కాని యనుభావము మాత్రము మృగ్యము: 'చిట్ట చివరకు' కట్టుటకుగుడ్డ, తినుటకుదిండి' కూడ లేకుండ బోవునవి. "ధనము ఉండిన ఏమియును భయములేదు, దానితో అన్నిపనులును నెరవేరుచుండును" అనుకొను రోజులు పూర్వము. ఇప్పుడా ధనమున్నవారలను గూడ నేదియో యొక నెపమున మిక్కిలిహింసించుచున్నవారలు కదా లోకులు. ఇదివఱలో నొక జాతివారలకును, ఇంకొక జాతివారలకును, నిరుగుపొరుగు కలుగుచుండుటయును, ఒకరికి వలయు పదార్థములు ఇంకొకరు సప్లయి చేయుచుండుటయును; ఇంకొకరికి గావలసినచో నొకరు తినుబండములు సమకూర్చుచుండుటయును బరస్పరము తామరతంపరలాగున నపరిమిత లాభములు పొందుచుండుటయును, కలుగుచుండెడిది. ఆ రోజులలో సహకారము 'పిన్ని, బాబు, పెరుగు,

పాలు, వంటకములు, కూరకాయలు, మొదలగు వానితో మిక్కిలి చెన్నలరారుచున్నయది. అట్టి కాలము ఇకముందు వచ్చునా? యను సందియము పొడముచున్నది: ఇప్పుడు "దిన దిన గండము — వేయ్యేండ్లు ఆయుస్సు" కాదు కాదు:— "క్షణ క్షణము గండము — మితిలేని యాయువు" — ఎవ్వరు స్నేహితులో, ఎవ్వరు విద్వేషులో తెలిసికొనుట కొక్కింతయును వలను పడకున్నయది. "ఒక యుద్ధము కడచిన, నింకొక యుద్ధము వచ్చుచున్నయది. ఒకకష్టము తప్పిన, నింకొక కష్టము వచ్చుచున్నయది" ఇట్టులే అన్నియును అపాయములుగ పరిగణింపఁబడుచున్నవి. ఒక మిక్కిలి యణురూపమగు సామాన్య పదార్థముకూడ మిక్కిలి మహాఘనకార్యము లొనరించుచున్నయది. అట్టిచో అట్టిశక్తులుకల మిక్కిలి చిన్నవియగు అణుపదార్థములు పొందిక కలసియున్నచో నెంతటి మహాఘనశక్తిమంతము లగునో యూహింపఁజాలము: దృక్పథమున నున్న, శ్రవణమార్గమునను న్న వన్నియును విభేదసూచకము లేయయియున్నయవి. ఇందును గుఱించియొక కథ జ్ఞాపకమునకు వచ్చినది. ఇద్దరు న్యాయవాది పరీక్షలలో నుత్తీర్ణులయినారు. ఒక చక్కని దాంపత్యము గల దంపతులనుజూచి వారి దాంపత్యమునకు భంగముచేయ నొకరును, నిలబెట్ట నింకొకరును ప్రయత్నములు సలిపినారు. ఒకరు "వారు ఉభయులు భార్యాభర్తలు విడిగానుండుసమయము గమనించి భార్యతో "నీ భర్త పూర్వజన్మములో ఉప్పరివాడనియును, గాలు నాకినచో నుప్పగా నుండుననియును" భర్తతో "నీ భార్య పూర్వజన్మమునందు "కుక్క"అనియును నీకాలు నాకుచుండు ననియును" బోధించెను. వానిపాచిక ఫలించినది. నిద్రించినతరువాత కాలురుచిచూచినది భార్య. నిద్రించినట్టులున్న భర్త కాలు నాకిన భార్యను కుక్కగా నమ్మినాడు. ఇంకనేమి? విరోధము వృక్షమై ఫలించినది. పిమ్మట రెండవ న్యాయవాది తన గెలుపు విత్తనమును నాటుటకు ప్రయత్నించెను.

భర్తతో "నీ యదృష్టవశమువల్ల భక్తితో నీకాలుకూడ నాకుస్వభావముగల యోగ్యురాలగు భార్య కలిగినది" అని నచ్చజెప్పి "విభేదము విడుదును" అను అష్టాక్షరీమంత్రము నుపదేశించెను. భార్యదగ్గఱకు వెళ్ళి ప్రతివారి పాదములు ఉప్పగా నుండుటను ప్రబోధించి "పతిం భజామి" అను పంచాక్షరీ మంత్రము నుపదేశించెను. ఆ దంపతులెట్టకేలకు తమయజ్ఞానమునకును, జరిగిన మైత్రీ భంగమునకును పశ్చాత్తాపపడి, మంత్ర మనన ప్రభావముచే మున్నుకంటెఁ బరస్పరానంద దాయకులై సుఖించిరి.

'పిట్టయుఁ బిట్ట పోరునెడఁ
బిల్లి వివాదము తీర్చుకట్టు లే
పట్టుననేని నొండొరులు
వైరముపూనిన; నొడ్లు పిల్లులై
గట్టిమనంబు వారలను
గాని సహింపక హింసచేసి చే
పట్టుదు రన్నిసంపదలు'
భాగ్యము పోరున నిల్వ నేర్చునే?

... ... ... ... ... ... ... ... ...

ఒప్పని వానికేని మన
సొప్పదు హింసనొనర్పనుండు లే
యప్పుడొకాని నెచ్చెలిని
న్యాయవిరుద్ధము బాసచేసి పెఁ

ముప్పుల ముంపఁజూచునెడ
మోసము తన్నెపరించు చున్నటుల్
తప్పదు పోరునష్టముగ
దారుణ ద్రోహనశించు ద్రోహితన్

కావున విభేదభావముల నిర్మూలనము చేయుటకు నెల్లరును ప్రయత్నించుచుండ వలయును. ఒక సమయమున నుండు నభిప్రాయమింకొక సమయమున నుండుట వలనుపడదు. కావున "అవివేకః పర మాపదాం పదం" అను నుడిని బట్టి వివేకము లేనిచో నాపదలు గలుగు చుండును. గావున మంచి యాలోచనలు గలిగి మంచివారి తోడనే సహవాసము చేయుచుండినచో విభేద భావ మొక్కింతయు మన మనస్సుల యందు నుండఁ జాలదు. ఎల్లప్పుడును నెల్లవారి తోడను మత జాతి కుల విభేదములు పరిగణింపక కలసి మెలసి యుండినచో నన్యోన్య లాభమే కలుగు చుండును.

పశువులుకూడ సామాన్యముగాఁ గలసియే తిర్గుచుండును. చీమల బారులుకూడ దాము ఎప్పుడును విడివిడిగా సంచరింపక యుండుట మనకు నెల్లరకును విశదమేకదా! రెండు ఎద్దులు కలసి ఒక యడవిలో మేయుచుండిన, వాని హింసింపఁబోయి సింహముకూడఁ బరాజయమును బొందిన దనినచో మానవులు కలసి మెలసి యుండినచోఁ గలుగు లాభమునకు మేరలేదు కదా!

"పాలును నీరునుఁ వలెను
బాగుగ నొండొరు లంటియున్నచో
మేలగు నేరికైన నుప
మింపఁగ నింతకు వేరు లేదికన్
బాలును బాలునున్ వలెను
బంధువులై గుమికూడి యుండుచో
లీలయగున్ సమృద్ధి. యువ
లీలఁగఁబండును నిత్య సత్యమై
బాలురు బాలికల్ కలసి
బంధుర పావన భావ బుద్ధిమై
లాలినిలీలలన్ గొని వి
లాసమెకైకొను చున్న రత్నముల్
మేలిమి పాటపాడును ద
మిన్ మణు లాటలనాడు నెల్లచో
మేలుకొనుఁ జగమ్ము సిరి
మించి వరించును సర్వకాలముఁ."
"పోరున నష్టమౌననుట
పొందున లాభము కల్గునంచు నె
వ్వారలుఁ బల్కుచుండుటయు
భావమునఁ దలపోసి సజ్జనుల్
పోరునువీడి నెమ్మదిని
బొందునె కోరుచు బోధ సేయుచున్
భారత భాగ్యదేవతకుఁ
బందువు సేయుట మేలు మేలగున్"

విభేద భావమువీడుటకు దేశ చరిత్రలు ముఖ్యములు. అవి పత్రికాముఖమునఁ దెలియఁ గలవు. ఇవి తాత్కాలికములు. శాశ్వతికములు గ్రంథాలయములవలన లభించునవి. ఇట్టిగ్రంథాలయములు ప్రతి యూరునందుననేగాక, ప్రతియింటియందును నుండుట మిక్కిలి శ్రేయోదాయకము. మనము ప్రతి ధర్మ కార్యమునందును గ్రంథాలయ ధర్మము అనునది తప్పక యాచారముగాఁ బ్రతి వ్యక్తికిని మనస్సునందు నాటుకొని యట్లు తప్పకజరుపుచుండునాడే భారతస్వతంత్రరాజ్యము వన్నెలతోఁ జిన్నెలతో నలరారు చుండును.

సీ. "పోవు నష్టము" పల్కు- పొత్తొక కొంతేని
బైకి రానిని యేర్పాటువలన
"పొందు లాభము" నుడి పొంకము నెందును
వ్యాపింపఁజేయు భాగ్యంబు వలన
భారత స్వాతంత్ర్య భాగధేయానంత
వైచిత్ర్య సాంఘిక వ్యాప్తివలన
గ్రంథాలయమ్ముల కల్పక మయ్యంకి
వేంకటరమణయ్య ప్రేమవలన
గీ. శాశ్వతైశ్వర్య సంపదల్ సాగుచుండు.
మైత్రి సర్వకాలమ్మును మనుపుచుండు.
ప్రజలు కలకలలాడుచు వఱలుచుందు.
నిత్య సత్కృతి యెల్లెడ నృత్యమొందు.

---

# ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమము

శ్రీ మల్లెల శ్రీరామమూర్తి

### గ్రంథాలయోద్యమము

ప్రజలు విజ్ఞానవంతులగుటకును, వయోజన విద్యావ్యాప్తికిని గ్రంథాలయములు సోపానములు. పాశ్చాత్యదేశములలో నీయుద్యమ ప్రాశస్త్యమును గ్రహించి ఆయాదేశపు ప్రభుత్వములే గ్రంథాలయ శాఖను ప్రభుత్వశాఖలలో ప్రత్యేకముగ నేర్పరచి, గ్రంథాలయములు- కేంద్ర గ్రంథాలయములు స్థాపించి గ్రంథాలయోద్యమము ద్వారా ప్రజలను విజ్ఞానవంతులను చేయుటలోను నిరక్షరులు లేకుండ చేయుటలోను విజయమొందినవి. ఈనాడు పాశ్చాత్యప్రజ లనుభవించుచున్న స్వాతంత్ర్యము వారికి గల విజ్ఞానమువలననే గాని వేరుగాదు.

### ఆంధ్రావనిలో గ్రంథాలయోద్యమము— తొలి గ్రంథాలయములు

ఇప్పటికి తేలిన పరిశోధనమునుబట్టి తెనుగునాట తొలి గ్రంథాలయము1886సం॥ రమునవిశాఖపురి యందు సరస్వతి గ్రంథాలయ మనుపేర స్థాపింపబడినది. 1889సం॥ రమున కడపజిల్లా పులివెందులలో సరస్వతి విలాసమందిరమను పేరను, 1890 సంవత్సరమున ఒంగోలులో సి. వి. యస్. లైబ్రరీ అనుపేరను, సింహాచలపతి గ్రంథాలయమనుపేర విజయనగరమున 1895 సం॥రములోను, పశ్చిమ గోదావరిజిల్లా భీమవరంతాలూకాకు చెందిన ఉండీలో 1895 సం॥ రమున సౌరోజీక్లబ్ అను పేరను, కుముదవల్లి గ్రామమున వీరేశలింగ సమాజమనుపేర 1897సం॥రములోను, 1899 సం॥ రములో తెనాలితాలూకా కొల్లూరు గ్రామమున కీడింగురూమను పేరను, 1900సం॥ రమున ఎంగుమెన్సు లిటరరీ అసోసియేషను అనుపేర గుంటూరులోను, అదే సంవత్సరమున వీరేశలింగం లైబ్రరీ యనుపేర రాజమండ్రిలోను- 1904 సం॥ రమున శ్రీ కృష్ణదేవరాయాంధ్రభాషా నిలయ మను పేర హైదాబాద్ (నైజాం) లోను, 1904 సం॥ రమున రాజరాజనరేంద్ర భాషానిలయమనుపేర హనుమకొండ (నైజాం) లోను గ్రంథాలయములు స్థాపనమైనవి. 1905సం॥రమునుండి ఆంధ్రావనిలో గ్రంథాలయముల సంఖ్య క్రమముగా పెరుగుటకు

ఆరంభమైనది. ఆంధ్రదేశమునకు కేంద్రస్థానమైన బెజవాడలో గ్రంథాలయమును స్థాపించుటకు కృషి జరిగి 1911 సం॥ రమున శ్రీ రామమోహన ధర్మ గ్రంథాలయ మనుపేర స్థాపింపబడినది.

బెజవాడ రామమోహన గ్రంథాలయము

బెజవాడలోని రామమోహన గ్రంథాలయ స్థాపనతో గ్రంథాలయోద్యమమును ఆంధ్ర దేశమున వ్యాప్తి చేయు సంకల్పము స్వర్గీయ సూరి వేంకట నృసింహశాస్త్రి, శ్రీ అయ్యంకి వేంకట రమణయ్య గార్లకు కలిగినది. ఈ సమయము ఆంధ్రగ్రంథాలయోద్యమమునకు శుభదినములని చెప్ప టతిశయోక్తి కాదు.

ఆంధ్రోద్యమము

ఆంధ్రోద్యమ మారంభమైన (1913) ఆ రోజులలో ఆంధ్రావనిలో గల విద్యావంతులలో ఒక అపూర్వ చైతన్యము కలిగినది. సారస్వతాభివృద్ధికై కృషిప్రారంభమైనది. ఆంధ్రోద్యమ ప్రతిఫలమే ఆంధ్ర దేశ గ్రంథాలయోద్యమమని చెప్పవలెను. ఆనాటి ఆంధ్రోద్యమ ప్రారంభ ఉత్సాహము వలననే ఆంధ్రావనిలో వివిధసంఘములు బయలుదేరినవి. అందు గ్రంథాలయోద్యమమే నాటినుండి నేటి వఱకు అవిచ్ఛిన్నముగ కృషి చేయుచూ, భారతవర్షమున గల గ్రంథాలయ సంఘములలో ప్రధాన సంఘమై విరాజిల్లుచున్నది.

ప్రథమ ఆంధ్రదేశ గ్రంథాలయ ప్రతినిధుల సభ

దాదాపు నూరుగ్రంథాలయములు మాత్రమే గల ఆ కాలమున (1914) ఆంధ్రదేశములోని గ్రంథాలయముల ప్రతినిధు లందరిని ఒక చోట చేర్చి పరస్పరాభివృద్ధికి వలయు విషయము లాలోచించిన బాగుండునని బెజవాడ రామమోహన గ్రంథాలయమువారు తలచిరి. బెజవాడ రామమోహన గ్రంథాలయ స్థాపనకు కారకులైన శ్రీ సూరి వేంకటనరసింహశాస్త్రి, అయ్యంకి వేంకట రమణయ్యగార్లు 1914 జనవరిలో ఆంధ్రపత్రికయందు ఆంధ్రదేశ గ్రంథాలయ ప్రతినిధుల సమావేశము చేయు టవసరమని విజ్ఞప్తి చేసిరి. వారిద్దరి కృషి ఫలితముగ ప్రథమ ఆంధ్రదేశ గ్రంథాలయ ప్రతినిధుల మహాసభ 1914 ఏప్రిల్ 10 వ తేదీన బెజవాడలో రామమోహన గ్రంథాలయమువారి ఆదరణ క్రింద జరిగినది. నాటి సభకు కృష్ణ, గుంటూరు, గోదావరి, విశాఖపట్టణం, గంజాం, నెల్లూరు, కడప, కర్నూలు, బళ్ళారి జిల్లాలనుంచియు, నైజాంరాష్ట్రము నుంచియు 200 మంది ప్రతినిధులు విచ్చేసిరి. ఆహ్వాన సంఘాధ్యక్షులుగ శ్రీ సూరి వేంకట నరసింహశాస్త్రిగారు ఎన్నుకోబడి గ్రంథాలయోద్యమమును గూర్చి తమ స్వాగతోపన్యాసమున గంభీరముగా నుపన్యసించిరి. ఆంధ్రావనిలో కాదు భారతావనిలో గ్రంథాలయోద్యమము నను గూర్చిన ప్రథమసభ. ప్రథమోపన్యాస మిదియని చెప్పవచ్చును. ఆ సభకు అధ్యక్షత వహించుటకు శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహంగా రాహ్వానింపబడిరి. నాటి శ్రీ లక్ష్మీనరసింహంగారి అధ్యక్షోపన్యాసము రస పూరితమై నేటికిని క్రొత్తగ నున్నది. నాటి వారి ఉపన్యాసములోని చివరిమాట లివి.

౧ వాయు వెల్లవారికి నెట్లు స్వాధీనమైనదో
జ్ఞానముకూడ నట్లు స్వాధీనము కావలెను.

2 ఉదక మెల్లవారికి నెట్లు సేవ్యమై యున్నదో జ్ఞాన మట్లు సేవ్యమై యుండవలెను.

3 సూర్య-చంద్ర మండలముల తేజస్సు ఎల్లవారికి నెట్లుసౌఖ్యప్రదముగ నున్నదో జ్ఞాన మట్లు సౌఖ్యప్రదముగ నుండవలెను.

నాడు శ్రీ లక్ష్మీనరసింహంగారు నుడివిన ఆ మూడు పదములు గ్రంథాలయ వేదమై పూజింపబడుచున్నవి.

1914సం॥రములో జరిగిన తొలి గ్రంథాలయ ప్రతినిధుల సభలో శ్రీ మంటూ్నరి వెంకటసుబ్బారాయుడు, ఇ. సుబ్బ కృష్ణయ్య, దంటు సుబ్బావధాని, వెలిదండ శ్రీనివాసరావు, శంకర కొంకటాప్రసయ్య, చివుకుల అప్పయ్యశాస్త్రి, న్యాయపతి నారాయణమూర్తి, కొడాలి శివరామకృష్ణరావు గార్లు గ్రంథాలయములు, పుస్తకములు, గ్రంథవిభజనము, సార్వజనిక పుస్తకాలయములు ఆంధ్ర గ్రంథముల వ్యాప్తి మున్నగు విషయములను గూర్చి వ్యాసములను చదివిరి. గ్రంథాలయోద్యమ వ్యాప్తికై పెక్కు తీర్మానములు గావింపబడినవి.

### ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘము

ప్రథమాంధ్రదేశ గ్రంథాలయ ప్రతినిధుల సమావేశ ఫలితముగ 1914 సం॥ రములో ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘ మేర్పడి ప్రథమాధ్యక్షులుగ ఆనరబిల్ రావు బహదూరు మోచర్ల రామచంద్రరావుగారును; ఉపాధ్యక్షులుగ శ్రీ సూరి వేంకట నరసింహశాస్త్రి, చిలకమర్తి లక్ష్మీనరసింహంగార్లును: కార్యదర్శులుగ, శ్రీ అయ్యంకి వేంకటరమణయ్య, నాళము కృష్ణారావుగార్లును; కొంతమంది కార్యవర్గసభ్యులుగను ఎన్నుకోబడిరి.

### భారతవర్షమున ప్రథమ గ్రంథాలయ సంఘము ఆంధ్ర సంఘమే

ఈరీతిగ 1914సం॥రములో ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘ మేర్పడినది. నాటికి భారత వర్షమున ఇంకెక్కడనూ గ్రంథాలయసంఘము లేదు. బరోడా సంస్థాన గ్రంథాలయము 1925సం॥రములో ఏర్పడినది. ఇప్పుడు మద్రాసు లైబ్రరి అసోసియేషను అని పిలువబడుచున్న సంస్థ ఏర్పడుటకు కూడ ఆంధ్ర గ్రంథాలయోద్యమ నాయకులగు శ్రీ అయ్యంకి వేంకట రమణయ్య గారే కారకులు. 1927 సం॥ రములో మద్రాసున జరుగనున్న అఖిలభారత కాంగ్రెస్ సందర్భమున అఖిలభారత గ్రంథాలయ మహాసభను గూడ జరుపుమని బెంగాలు గ్రంథాలయ సంఘోపాధ్యక్షులగు యం. డి. ఆర్. మహాశయోగారు ప్రకటించగా అప్పుడు మద్రాసులో ఎవ్వరూ ముందుకు రాలేదు. అప్పుడు అంతకు పూర్వమునుంచికూడ భారత గ్రంథాలయోద్యమమును నడుపుచున్న శ్రీ అయ్యంకి వేంకట రమణయ్యగారు చెన్నపురి వెళ్ళి శ్రీ కె. వి. కృష్ణస్వామి అయ్యరుగారి ఇంట్లో సమావేశము ఏర్పాటుచేసి 1927 డిశంబరులో, 5 వ అఖిలభారత గ్రంథాలయ మహాసభను మద్రాసులో జరిపించిరి. ఆ సమావేశ ఫలితముగ ఏర్పడినదే నేటి మద్రాసు లైబ్రరి అసోసియేషను. పంజాబు, బెంగాలు, మహారాష్ట్ర పుదుకోట, నైజాం గ్రంథాలయ సంఘము లన్నియు ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘము తరువాత బయలుదేరిన వే.

ఆంధ్రదేమున గ్రంథాలయముల సంఖ్య

అప్పుడు తేల్చిన లెక్కల ప్రకారము ఆంధ్ర జిల్లాలలో గ్రంథాలయముల సంఖ్య ఇట్లు కనబడుచున్నది.

| | | |
|---|---|---|
| 1914 | నాటికి | 163 |
| 1915 | ,, | 212 |
| 1918 | ,, | 474 |
| 1919 | ,, | 586 |

ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘము వారి ప్రచార కృషి ఫలితముగ ఈనాడు తెలుగుజిల్లాలలో 1000 గ్రంథాలయములకు పైగా ఏర్పడి ప్రజలలో విజ్ఞాన వ్యాప్తికి తీవ్రకృషి జరుగుచున్నది.

గ్రంథాలయ సర్వస్వము పత్రిక

ప్రథమాంధ్రదేశ గ్రంథాలయముల ప్రతినిధుల సభ జరిగిన నెలరోజులకే 10-5-1914 న సంఘమువారు సమావేశమై చేసిన 3 వ తీర్మానమిట్లున్నది.

“ఈ సంఘపక్షమున 3 నెలల కొకసారి ప్రకటింపబడు పత్రిక నొకదానిని ప్రకటించుటకు తీర్మానించుచూ ఈ దిగువవారిని సంఘముగ నియమించిరి.”

1 అయ్యంకి వేంకటరమణయ్య, 2 పెద్దిభొట్ల వీరయ్య, 3 సూరి వేంకటనరసింహశాస్త్రి, 4 చిలకమర్తి లక్ష్మీనరసింహం 5 నాళము కృష్ణారావు గార్లు.

ఇందులో పత్రికా సంపాదకులుగ అయ్యంకి వేంకటరమణయ్యగారిని ఎన్నుకొనిరి. ఈతీర్మాన ఫలితముగనే 1915 సం॥ ర మున బెజవాడనుంచి “గ్రంథాలయ సర్వస్వము” త్రైమాసిక పత్రికగా ప్రారంభింపబడి ఉద్యమవ్యాప్తికి విశేషముగ తోడ్పడినది. పిమ్మట కొన్నాళ్లు మాసపత్రికగ ప్రకటింపబడినది, మధ్యమధ్య కొంతకాల మాగినను గ్రంథాలయ సర్వస్వము పత్రిక 11 సంపుటములు వెలువడినది. ఈ పత్రికద్వారా గ్రంథాలయోద్యమ మాంధ్రదేశమున విరివిగా ప్రచారమైనది. మనదేశములోనేగాక విదేశ పత్రికలలోగూడ “గ్రంథాలయ సర్వస్వము” ప్రశస్తి నార్జించినది. ఇదిగాక కాకినాడనుంచి యాతగిరి వెంకటలక్ష్మీరమణగారు “ధర్మగ్రంథాలయ” మను మాసపత్రికను, మాజేటి రామచంద్రరావుగారు “బాలసరస్వతి” యను మాసపత్రికను కొంతకాలము నడిపిరి.

ఆంధ్రదేశ గ్రంథాలయ వార్షిక మహాసభలు

1914సం॥రములో ప్రారంభమైన ఆంధ్రదేశ గ్రంథాలయ ప్రతినిధుల వార్షిక సభలు ఇదివఱకు 24 సమావేశములు జరిగినవి. 25వ సమావేశము అనగా నాల్గవ ఆంధ్రదేశ గ్రంథాలయ సేవకుల మహాసభ 13-12-42 న శ్రీ బెజవాడ రామచంద్రారెడ్డిగారి అధ్యక్షతను జరుగుచున్నది. ఈ వార్షికసభలవలన ఆంధ్రదేశమందంతటను ఉద్యమప్రచారము విరివిగా జరిగినది. సభలు జరిగిన సంవత్సరములు, అధ్యక్షులపేర్లు అనుబంధముగా చూపబడినవి. ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభలకు అధ్యక్షత వహించిన ప్రముఖుల పేర్లను బట్టి చూచినచో ఈ ఉద్యమము ఎంతటి మహోన్నతమైనదో, ఎంతటి ప్రముఖులీ ఉద్యమమున సానుభూతి కలిగి పనిచేసిరో, ఇందరినీ ఉద్యమమున దింపి ప్రచారము చేయుటకీ సంఘ నిర్వాహకు లెంత శ్రద్ధ గైకొనిరో విశదము కాగలదు. రాజకీయ నాయకులేగాక జమీందారులు సారస్వతోపాసకులు, పండితులీ సభలలో పాల్గొని తమ

పాండిత్య ప్రకర్షను ప్రకటించి ఉద్యమమును బలపరిచి యున్నారు.

### జిల్లా, తాలూకా సభలు, గ్రంథాలయ వార్షిక సభలు

ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభలతో ఈ ఉద్యమము ఆగలేదు. 1914సం॥రము నాటినుండి నేటి వఱకు వివిధ జిల్లాలలో అనేక జిల్లా గ్రంథాలయసభలు, తాలూకాసభలు జరిగి, గ్రంథాలయ వార్షికోత్సవములు మిక్కుటముగా జరుగుచున్నవి. ఈ సభలకు జీత బత్తెములు లేకుండగనే పలువురు ఆంధ్ర గ్రంథాలయోద్యమాభిమానులగు గ్రంథాలయ సేవకులు స్వంత ఖర్చులతో వెళ్లి ఉద్యమ ప్రచారము చేయుచున్నారు. ఈ ప్రచారము పల్లెలలో బాగుగ నాటినది. పల్లెలలో గ్రంథాలయములు వెలువడ సాగినవి. ఉదారులగు ధనవంతుల సహాయము వలన అనేక గ్రంథాలయములకు స్వంత భవనము లేర్పడినవి. గ్రంథాలయోద్యమ ప్రచారము జాతీయోద్యమమున కెంతయో తోడ్పడినది. తొలుత గ్రంథాలయోద్యమమున పనిచేసినవారే తర్వాత జాతీయోద్యమమున పాల్గొనిరి. నేటి గ్రంథాలయ సేవకులలో పెక్కుమంది - జా తీ యో ద్య మ వా దు లై యున్నారు. దేశభాషా పత్రికలు వ్యాప్తి యైన కొలది జానపదులలో విజ్ఞానతృష్ణ, రాచకీయ వాంఛ ప్రారంభించినది. 1 ఆంధ్రోద్యమము, 2 ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమము 3 జాతీయోద్యమము వీనితో పల్లెప్రజలలో అపూర్వ చైతన్యము కలిగి రాజకీయ ప్రబోధము జరిగినది.

### ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘ ప్రాముఖ్యము

1914 సం॥ రములో పైసంఘ మేర్పడి కృషి జరుగుచుండెను. ఈసంఘమును కట్టుదిట్టము చేసి ప్రభుత్వ దృష్టిలోనికి తెచ్చి ఉద్యమ వ్యాప్తి తీవ్రతరముగ జేయునుద్దేశ్యముతో 14-7-1918సం॥ రమున ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘమునకు నిబంధనావళి చేయబడి అంగీకరింప బడినది. తర్వాత 1924 సం॥ రములో ఈసంఘము 1860 సం॥రము చట్టము ప్రకారం రిజిష్టరు చేయబడినది. 1914 సం॥ రము ప్రారంభమైన ఈసంఘము నేడు ఆంధ్రావనిలో అలుముకొని శాఖోపశాఖలై విజ్ఞానవ్యాప్తికి కృషి చేయుచూ పలువురు ప్రముఖులచే కొనియాడబడుచున్నది.

### అఖిలభారత గ్రంథాలయోద్యమము

మన ఆంధ్ర గ్రంథాలయ నాయకుల దృష్టి మన ఆంధ్రదేశ సరిహద్దులతో తృప్తిపడి ఆగలేదు. గ్రంథాలయోద్యమమును నిఖిల భారత వర్షమున వ్యాపింపజేయ సమకట్టిరి. ఇంతలో 1918 సం॥ రమున పంజాబు ప్రభుత్వమువారు అఖిలభారత గ్రంథాలయ సభను పిలిచిరి. అందు ప్రతినిధులుగ పాల్గొనుటకై ఆంధ్రగ్రంథాలయోద్యమ నాయకులు కోరగా పంజాబు ప్రభుత్వమువారందుల కంగీకరింపక; వచ్చినచో, చోటువున్న ప్రేక్షకులుగ రానిచ్చెదమని తెలుప ఆంధ్రనాయకులా సభకు వెళ్ళలేదు.

### అఖిలభారత గ్రంథాలయ సభలు

1918 సం॥రములో పంజాబు ప్రభుత్వ మేర్పరచిన సభానంతరం ఆంధ్ర గ్రంథాలయోద్యమ నాయకులు అఖిల భారత గ్రంథాలయ సభలను జరుప యత్నించి ప్రథమ అఖిలభారత గ్రంథాలయ ప్రతినిధుల సభను 1919సం॥రములో చెన్నపురియందు బరోడా సంస్థాన కేంద్ర గ్రంథాలయ సంఘాధ్యక్షులగు జె. యస్. కుడల్కారుగారి అధ్యక్షతను జరిపి, అఖిలభారత గ్రంథాలయ

సంఘము నేర్పాటుచేసి భారత గ్రంథాలయోద్యమమునకు కూడ నాయకత్వము వహించిరి. తర్వాత ద్వితీయసభ 1923 లో కాకినాడ నగరమున యం. ఆర్. జయకరుగారి అధ్యక్షతను 1924 లో తృతీయసభ బెల్గాంలో దేశబంధు చిత్తరంజనదాసుగారి అధ్యక్షతను, చతుర్థసభ 19 లో లాహోరు నగరమున ఆచార్య ప్రఫుల్ల చంద్రరాయిగారి అధ్యక్షతను, 1927లో పంచమసభ చెన్నపురిలో డా॥ ప్రమథనాథ బెనర్జిగారి ఆధ్వర్యమునను, ఆరవసభ కలకత్తాలో 1928 సం॥న సర్. సర్వేపల్లి రాధాకృష్ణయ్యగారి అధ్యక్షతను 1933 లో సప్తమ సభ బెజవాడ నగరమున వంగల శివరాంగారి అధ్యక్షతను, ఎనిమిదవమహాసభ చెన్నపురిలో 1934 డిశంబరు మాసమున కుమార మణీంద్రదేవుగారి అధ్యక్షతను జరిగించిరి. ఈ మహాసభలన్నియు ఆంధ్ర గ్రంథాలయోద్యమ నాయకుల కృషి తోడ్పాటు వలననే జరిగినవి. అఖిలభారత గ్రంథాలయ సంఘము కూడ రిజిస్టరు చేయబడి పని చేయుచున్నది.

ఇండియన్ లైబ్రరి జర్నలు

అఖిలభారత గ్రంథాలయోద్యమ వ్యాప్తికై బెజవాడనుంచి ఇండియన్ లైబ్రరి జర్నలు అను పేర ఆంగ్ల మాసపత్రికను ఆంధ్ర గ్రంథాలయోద్యమనాయకులు 1924సం॥రములో ప్రకటించుట ఆరంభించి ఉద్యమ వ్యాప్తి చేసిరి. కొంతకాలమున కా పత్రిక నిలిపివేయబడినది.

భారతవర్షమున ఆంధ్రనాయకుల
గ్రంథాలయోద్యమ ప్రచారము

ఆంధ్ర గ్రంథాలయోద్యమ నాయకులు భారత గ్రంథాలయ సంఘమును స్థాపించి మహాసభలు జరిపి, దారి తీసినవారై అనేక గౌరవములను పొందిరి. స్వర్గీయ సూరి వేంకటనరసింహశాస్త్రిగారు ప్రథమ కర్నాటక రాష్ట్ర గ్రంథాలయ మహాసభాధ్యక్షులుగను, 5 వ పుదుచ్చేరి సంస్థాన గ్రంథాలయ మహా సభాధ్యక్షులుగను, వరింపబడి అధ్యక్షత వహించి గౌరవింపబడిరి. శ్రీ దాసు త్రివిక్రమరావుపంతులుగారు పుదుచ్చేరి గ్రంథాలయ మహాసభాధ్యక్షత వహించి, అఖిలభారత గ్రంథాలయ సంఘ కార్యదర్శిగ నుండి భారత గ్రంథాలయోద్యమమునకు విశేషముగ పాటుపడిరి.

గ్రంథాలయ ప్రదర్శనములు

గ్రంథాలయోద్యమ ప్రచార సందర్భమున గ్రంథాలయ ప్రదర్శనములుకూడ ఏర్పాటు చేయబడినవి, విదేశ గ్రంథాలయోద్యమమునకు సంబంధించిన ముఖ్య విషయములను గూర్చి మాజిక్ లాంతరు ఉపన్యాసములద్వారా ప్రచారము గావింపబడినది. ఆంధ్ర దేశ గ్రంథాలయ సంఘ యాజమాన్యమున గ్రంథాలయ ప్రదర్శనములు 1917 సం॥ రమున బారువలోను, 1918 సం॥ రమున విశాఖపురిలోను, 1934సం॥రమున కాకినాడలోను, 1941 సం॥ రమున రాజమండ్రిలోను, 1942 సం॥ రమున పెదపాలెంలోను ఏర్పాటు చేయబడినవి.

1914 సం॥ రము నాటి స్థితిగతులు

దాదాపు ముప్పది సంవత్సరముల ప్రచారము జరిగిన ఈనాడు గ్రంథాలయములు స్థాపించుట యెన చులకనగ నున్నది. గాని 1914 ప్రాంతములలో చాల కష్టముగ నుండెడి దని తెలియుచున్నది. ఎందరెందరో విద్యావంతులగు ఆంధ్రయువకు లాఆనాటిరోజులలో గ్రంథాలయోద్యమ

మున కృషి సలిపిరి. వారి కృషి ఫలితమే నేటి ఉన్నత స్థితికి కారణమని మనము మరువరాదు.

"ప్రభుత్వ సహకారము"

ఇంత ఉత్సాహముగా ఉద్యమము ఇంతకాలమునుంచి జరుగుచున్నను ఈ ఉద్యమాభివృద్ధికై మద్రాసు ప్రభుత్వము చేసిన తోడ్పాటు అత్యల్పము. పాశ్చాత్య దేశముల పద్ధతిని చూచినచో నిజముగా ఈ ఉద్యమమును రాష్ట్రప్రభుత్వమే చేపట్టి నడుపవలసిన దై యున్నది. కాని మన దురదృష్టవశమున విదేశ పరిపాలన యగుటచే అట్టి భాగ్యము కలుగలేదు. ప్రభుత్వము సహకారము చేయకపోగా పలు కష్టములు కూడ కలిగించినది. 1914 సం॥రము నాటి రోజులలో స్థానిక సంస్థలు గ్రంథాలయములకు విరాళము లిచ్చుటయన్న మహాదోషముగా మద్రాసు ప్రభుత్వము తలచెడిది. అప్పుడు మద్రాసు ప్రభుత్వ కార్యనిర్వాహక సభ్యులుగ నున్న సర్. పి. యస్. శివస్వామి అయ్యరు గారి వద్దకు మన ఆంధ్ర గ్రంథాలయోద్యమ నాయకులు రాయబారమేగి స్థానిక సంస్థలు గ్రంథాలయములకు విరాళములీయవచ్చు నను అనుమతిని సంపాదించిరి. అప్పటినుంచియే స్థానికసంస్థలు కొద్దిగనో గొప్పగనో విరాళము లిచ్చుటకు మొదలిడినవి. మన ఆంధ్రనాయకు లంతటితో నూరకొనక మద్రాసు ప్రభుత్వమువారివలన గ్రంథాలయములకు విరాళములు పొందుటకు ప్రయత్నించిరి. అప్పుడు మద్రాసుశాసనసభ్యులుగ నున్న దేశభక్త కొండా వెంకటప్పయ్యపంతులు గారు శాసనసభలో నుపపాదించిన ప్రతి తీర్మాన ఫలముగ సాలుకు ఇరవై వేల రూపాయలు ధర్మగ్రంథాలయములకు (చెన్నరాష్ట్రమంతటికి) విరాళము లిచ్చుటకు తీర్మానించబడినది. ఆ మొత్తమును దర్మిలా తగ్గించిరి. కాంగ్రెసు మంత్రుల పరిపాలనలో గ్రంథాలయముల కిచ్చు విరాళములను రద్దు చేసిరి. ఇతరుల 1941 సం॥రమున అడ్వైజరుల పరిపాలనలో మద్రాసు గవర్నమెంటు కొంత మొత్తమును ప్రత్యేకించి ఇచ్చుచున్నారు. దాదాపు 28 సంవత్సరములనుంచి జరుపుచున్న ఈ మహోద్యమమునకు, నాయకులకు ప్రభుత్వ సహకారము పూర్తిగ నున్నచో ఈ సరికి ఇంకెంతయో విజ్ఞాన ప్రచారము సాగి, ప్రజలలో విజ్ఞాన వ్యాప్తి కలిగి యుండెడిది. ప్రభుత్వమే ఈ ఉద్యమమును చేపట్టి నడిపి యున్నచో ఈ 29 సం॥ రముల కాలమునాటికి రాష్ట్రమున నిరక్షరు డొక్కడైనను నుండెడివాడు కాడని చెప్ప సాహసించుచున్నాను.

### ప్రభుత్వ విషమ షరతులు

పైన తెలిపిన ఆ స్వల్ప విరాళము లిచ్చుటకు ప్రభుత్వము విధించిన షరతులు చాల కఠినముగ నుండి ఉద్యమమునకు దోహదమిచ్చుటకు బదులు ఉద్యమమును దిగత్రొక్కుటకా యను సందేహము కలుగక మానదు. విరాళమునుగోరు ప్రతి గ్రంథాలయము రిజిస్టరు కావలెననుట మొదటి షరతు. ప్రభుత్వ మిచ్చినంత విరాళమును గ్రంథాలయ మిచ్చుకొని రెండు కలిపిన మొత్తముతో ప్రభుత్వమువారి ఇష్టమువచ్చిన పుస్తకములే కొనవలెననుట రెండవ షరతు. ఇట్టి షరతులకు భయపడి చాలమంది విరాళములు కోరుటకే ముందుకు వచ్చుటలేదు. ఇట్టి షరతులను ప్రభుత్వమువారు తీసివేసి యుద్యమమును బలపరచు టావశ్యకము.

ఆంధ్రదేశ గ్రంథాలయముల నేటి పరిస్థితి

గ్రంథాలయోద్యమ ప్రచారము వలన, రాజకీయ ప్రబోధము వలన, దేశభాషా పత్రికల వ్యాప్తి వలన, నేడు పల్లెలలోకూడ విజ్ఞానకాంక్ష ఇనుమడించినది. ముఖ్యముగ యువకులీ ప్రచారమున కృషి చేయుచూ, గ్రంథాలయములు, పఠనాలయములు స్థాపించియు, రాత్రి పాఠశాలలు, వేసంగి పాఠశాలలు స్థాపించియు, వయోజన విద్యా వ్యాప్తికిని కృషి చేయుచున్నారు. నేడు గ్రంథాలయముల ఆవశ్యకత బాగుగ బోధపడినది. దేశభాషా పత్రికల వ్యాప్తిచే జానపదులు రాచకీయముగనేమి, సాంఘికముగనేమి, చాల ఆతురత చూపుచున్నారు. గ్రంథాలయోద్యమ వ్యాప్తికిది మంచి తరుణము. అనేక పల్లెలలో ఉదారులగు పౌరుల సహాయమున, ధనవంతుల సహాయమున, అనేక గ్రంథాలయములు నడుచు చున్నవి. అనేక గ్రంథాలయములకు స్వంత భవనములు ఏర్పడుచున్నవి. ఇంతటి ఉత్సాహము కలుగుటకు ఆంధ్ర గ్రంథాలయోద్యమ సేవకుల ప్రచారమే కారణమని సగర్వముగ చెప్పవచ్చును.

ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘము—నేడు

1914 లో ప్రారంభమైన ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘము నేటి వరకు నిలిచి విజయముగ పని చేయుచున్నది. ఇటీవల ఈ సంఘమునకొక స్వంతభవన మేర్పరచి, కేంద్ర గ్రంథాలయ మేర్పరచవలెనను సంకల్పము కార్య నిర్వాహకులకు కలిగినది. బెజవాడను అంటియున్న పటమటలంక కాపురస్థులు శ్రీ కొమ్మా సీతారామయ్యగారు స్థలమునిమిత్తము విరాళంగా వేయి రూపాయిలు ఇచ్చిరి. ఆ ధనముతోను మరి కొందరి సహాయముతోను పటమట లంకలో ఒక యకరముకు పైగా స్థలం కొనబడినది. అందు భవననిర్మాణముచేయు ప్రయత్నములు జరిగి పూర్తియైనది.

మద్రాసు ప్రభుత్వమువారీసంఘమును గుర్తించి స్థానిక సంస్థలు, పంచాయితీబోర్డులు, ఈ సంఘమున సభ్యులుగా చేరవచ్చునని అనుమతినిచ్చిరి. ఆ కారణముగ ఇప్పుడు కొన్ని జిల్లాబోర్డులు, పురపాలక సంఘములు, పంచాయితీ బోర్డులు ఈ సంఘమున సభ్యత్వమును స్వీకరించినవి. ఇంక విరివిగా స్థానికసంస్థ లన్నియు ఈ సంఘమున సభ్యత్వమును స్వీకరించి సంఘమును బలపరుచు టావశ్యకము. "ఆంధ్ర గ్రంథాలయము" అను త్రైమాసిక పత్రిక సంఘపక్షమున ప్రకటించుటకు ప్రారంభించబడి కొలది సంచికలు వెలువడి ఆపివేయబడినది.

మద్రాసు ప్రభుత్వము వద్దకు రాయబారము

కాంగ్రెసు మంత్రుల పరిపాలనా కాలమున అనగా ది 28-11-1938 న ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘ పక్షమున కొందరు ప్రముఖులు మద్రాసు ప్రభుత్వ విద్యా, స్థానికపాలనా, పరిశ్రమల మంత్రుల వద్దకు రాయబారముగ వెడలి, ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘ మేర్పడిన నాటి నుంచి చేసిన కృషి వివరములు తెలుపగల పెద్ద నివేదికను సమర్పించి సాలుకు ఒక లక్ష రూపాయిలు విరాళముగ ఆంధ్రావనిలోని గ్రంథాలయముల కీయమనియు, ప్రభుత్వ ప్రకటనలు గ్రంథాలయముల కుచితముగ నీయవలసినదనియు మున్నగు కోర్కెలను వెలిబుచ్చిరి. దానికి ఫలితము లేకపోగా అదివరకు యిచ్చెడి విరాళములను గూడ సున్న చుట్టిరి. కాంగ్రెసు మంత్రుల

పరిపాలనలోనే ఇట్లు జరుగుట బహు విమర్శ నీయమని వ్రాయ సాహసించుచున్నాడను.

గ్రంథాలయ శిక్షణ తరగతులు

ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘమువారు 1934 సం॥ రము లోను తర్వాత 1941 సం॥ రములోను గ్రంథాలయ శిక్షణ తరగతుల నేర్పరచి; పరీక్షలు జరిపి, ఉత్తీర్ణులైనవారికి యోగ్యతా పత్రము లిచ్చిరి. లోగా ఆంధ్ర విశ్వవిద్యాలయమువారు గ్రంథాలయ శిక్షణకు సంబంధించిన పరీక్షలను పెట్టగా పలువురు చేరి పరీక్షలో ఉత్తీర్ణులై పట్టముల పొందిరి. తర్వాత ఆంధ్ర విశ్వవిద్యాలయమువా రీ పరీక్షలను తగ్గించిరి. తిరిగి ఆంధ్రవిశ్వవిద్యాలయమువారా పరీక్షలను పెట్టమని గ్రంథాలయ సభలలో తీర్మానములు చేసి పంప బడుచున్నవి. విశ్వవిద్యాలయమువా రాపరీక్షలు పెట్టునట్లు ఆంధ్రులుఆందోళన సాగించ వలసి యున్నది.

గ్రంథాలయోద్యమమున

సారస్వత, సాహిత్య ప్రచారము

ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమ మారంభమైన మొదటి రోజులలో చరిత్రను పరికించినచో ఈ యుద్యమ నాయకులు ఆంధ్ర సారస్వతమునకు ఈ సంఘము ద్వారా ఎక్కువ దోహద మిచ్చి సారస్వతాభి వృద్ధికి తోడ్పడిరి. నాటి రోజులలో గ్రంథాలయో ద్యమమున శ్రీ విక్రమదేవవర్మగారు (నేడు జయపురాధీశ్వరులు) ప్రభల లక్ష్మీ నరసింహాం పంతులు, చిలకమర్తి లక్ష్మీ నృసింహాం, చెలికాని లచ్చారావు, ఆంధ్రవాల్మీకి వావిలికొలను సుబ్బారావు, రాయసం వెంకట శివుడు, మాడపాటి హనుమంతరావు [హైదాబాదు], పండిత మానేపల్లి రామచంద్రశాస్త్రి(కవి), పానుగంటి రాజా రామానారాయణం, జనమంచి శేషాద్రిశర్మ, పురాణం సూరిశాస్త్రి; చరిత్ర చతురానన చిలుకూరి వీరభద్రరావు, చెన్నాప్రగడ భానుమూర్తి, రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ, బుర్రా శేషగిరిరావుగార్లవంటి విజ్ఞానవేత్తలు సాహితీపరులు, చరిత్రకారులు, కవిసమ్రాట్టులు ఈ ఉద్యమమున చేరి కృషి చేసిరనగా నాడు సారస్వతాభివృద్ధికైకూడ ఈ సంఘము చాల కృషిచేసినవారల సహకారమున కూడ ఈ ఉద్యమమున లీనము చేసినట్లు కనబడుచున్నది. ఈ నాడట్టి సహకారము తక్కువగుటకు కారణము తెలియదు. ఆంధ్రావనిలోని పండితులు, సాహితీపరులీ ఉద్యమమున చేరి పని చేయుటకై సంఘము వారు కృషి సలుపవలసి యున్నది.

ఆంధ్రావనికి కేంద్ర గ్రంథాలయము

ఈ ఉద్యమవ్యాప్తి ఇంక తీవ్రముగ జరుగవలెనన్న ఆంధ్రావని కొక కేంద్ర గ్రంథాలయ మవసరము. కేంద్ర గ్రంథాలయ మున్నగాని ఇంకనూ ఉద్యమము వికాస మొందజాలదు: దేశీయు లీ ఉద్యమ ప్రాశస్త్యమును గుర్తించి సహాయము చేయ ప్రార్థన.

శ్రీ సూరి వేంకటనరసింహశాస్త్రిగారు

ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమ చరిత్ర వ్రాయునప్పుడు శ్రీ సూరి వేంకట నరసింహశాస్త్రిగారి పేరు ముందు స్మరించుట ధర్మము. శ్రీవారు ఈ ఉద్యమాభి వృద్ధికై చేసిన కృషి నిరుపమానము. బాల్యావస్థలో వారి కృషి ఫలితముగనే బాలారిష్ట గండములు దాటి సంఘము బయట పడినది. ఆంధ్ర భారత గ్రంథాలయోద్యమవ్యాప్తికై శాస్త్రిగారు చేసిన సేవను దేశీయు లెన్నటికిని మరువరాదు.

## శ్రీ అయ్యంకి వేంకట రమణయ్యగారు

ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘము 1914 సం॥ రములో స్థాపన యగుటకు కారకులై, నాటినుండి 25 సంవత్సరములు వరసగా సంఘ కార్యదర్శిగ నుండి వీరొనర్చిన, ఒనర్చుచున్న గ్రంథాలయోద్యమ సేవ నిరుపమానము. పైన తెలిపిన చరిత్ర అంతటిలో అనగా అనుబంధమున చూపబడిన వార్షిక సభలు జరుగుటలోగాని, భారత గ్రంథాలయ సభలు జరుపుటలోగాని భారత గ్రంథాలయ సంఘస్థాపనలో గాని తదితర ఉద్యమ వ్యాప్తిలో గాని ఈయన చేయలేని, ఈయన హాజరుకాని, ఈయన నిర్వహించని సభ లేదు. కార్యక్రమము లేదు. ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘమున కీయన సారథి. నాయకుడు. సేవకుడుగా వ్యవహరించి ఉద్యమమును దశదిశల వ్యాప్తి చేసిన వీరుడు. "గ్రంథాలయోద్ధారక" "గ్రంథాలయశాస్త్ర విశారద" యను బిరుదములను సంపాదించినారు. ఇక ఈయన తిరిగిన గ్రంథాలయసభలు, చేసిన ఉపన్యాసములు, అధ్యక్షత వహించిన వార్షికసభలు, లెక్కకు అందవు. ఆంధ్రదేశములోని గ్రంథాలయములలో ఈయన చూడని గ్రంథాలయములు తక్కువ. "గ్రంథాలయ సర్వస్వము" "ఇండియన్ లైబ్రరి జర్నలు" పత్రికల ప్రధాన సంపాదకుడు, నిర్వాహకుడు, అధిపతి వేంకటరమణయ్యగారే. ఆంధ్రదేశ గ్రంథాలయ చరిత్రలో శ్రీ వేంకటరమణయ్య గారి పేరు సువర్ణాక్షరములతో లిఖింపబడవలసిన మహావ్యక్తి. ఇట్టి గ్రంథాలయోద్యమ సేవకుని సేవను గుర్తించియే అఖిలాంధ్ర ప్రజల పక్షమున (డి 12-1942) గుంటూరుపురమున జరిగిన చతుర్థ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభా సందర్భమున సన్మానించి, వీరి గౌరవార్థము సన్మాన సంచికను ప్రకటించుటకు నిశ్చయించుట కడు సంతోషము. ఇంకనూ వీరు నిరంతరము గ్రంథాలయోద్యమాభివృద్ధికై కృషి చేయునట్లు శ్రీ భగవానుడను గ్రహించుగాక!

## ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమ ప్రశంస

ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమ కృషిని పలువురు భారత ప్రముఖులేగాక అమెరికా పత్రికలు కూడ శ్లాఘించినవి. ఉదాహరణకు కొందరి ప్రముఖుల అభిప్రాయములనూ, అమెరికా పత్రిక అభిప్రాయమునూ దిగువ నుదహరించుచున్నాను. 1929 సం॥ రము జూలై నెలలో గుంటూరులో జరిగిన 13 వ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభాధ్యక్షత వహించిన శ్రీ చన్నాప్రగడ భానుమూర్తిగారి అధ్యక్షోపన్యాసమును గూర్చి "లైబ్రరి జర్నలు" అను న్యూయార్కు పత్రిక ఇట్లు అభిప్రాయ మిచ్చినది.

The Library Journal, New York:-

" The addresses at the recent meeting [Andhra Desa Library Conference held at Guntur]. Parallel very closely what might have been said at similar meetings in this country] America], and that these were made by the natives of India tells in itself a great story."

ఇప్పుడు మద్రాసు లైబ్రరి అసోసియేషను అధ్యక్షులుగనున్న రావుబహదూరు కె. వి. కృష్ణస్వామిఅయ్యరుగారి అభిప్రాయము.

Rao Bahadur K. V. Krishnaswami Iyer, now President, Madras Library Association, said as Chairman of the Reception Committee of All India Public Library Cninference.

" It is gratifying however to note that the Andhra Desa has made great

strides in this direction. and given the -ead to others. The successful organisation of free public Libraries in the Andhra Desa, due to the untiring exertions of stalwart patriots in that part of the country, has demonstrated the many beneficient results that flow from the institution, both from what may be termed the strictly national point of view, and from the point of view of the encouragement and growth of the vernacular language. If by any organisation the Andhras have proved their claim to have an Andhra Province and their fitness for Swarej, the efficient working of the library movement furn ishes the credence

రైటు ఆనరబిల్ వి. యస్. శ్రీనివాసశాస్త్రి గారి యభిప్రాయము.

Rt. Hon' ble V. Srinivasa Sastri in a speech at Bezwada on 22-4-1933:-

"All India would look up to Bezwada as the fountain source of inspiration in the cause of the Library Movement, and the benefits of the Library Movement have been realised here to some extent."

మద్రాసులోని కన్నెమరా గ్రంథాలయ గ్రంథ భాండారి ఆర్. జనార్దనం నాయుడు గారి అభిప్రాయము.

R. Janardanam Naidu, Librarian, Connemara Library, Madras:-

" Bezwada town which was responsible for the spread of the Library Movement, would be a source of inspiration for others in future and work for the enlightenment of the masses."

శ్రీ కె. వెంకటస్వామినాయుడు బి. ఎ., బి. యల్. మద్రాసు మాజీ మేయరు, మద్రాసు శాసనసభా ఉపాధ్యక్షులు వారి అభిప్రాయము.

Mr. K. Venkatramani B. A. B. L., High Court Vakil, Madras:-

" Bezwada is the fountain head o Library Movement in Andhra Desa."

బొంబాయి విశ్వవిద్యాలయ ప్రొఫెసరు యస్. యన్. ఫేర్వాని, యం. ఏ. గారి అభిప్రాయము.

S. N. Pherwani, M. A. Professor of Sociology, Bombay University:

' Grounded on the enthusiasm and noble devotion of it s workers, the Andhra Library Movement has shown how to make the Library a centre of Social Life, a centre of Learning as well as of love. By greater and better service, it has endeared itself to the people and shown what they can do for themselves by co-operative effort. The zeal of the workers has travelled its way to sublime results without any State aid, without an imported expert."

మద్రాస్ హిందూపత్రికా సంపాదకులు శ్రీమాన్ కస్తూరి రంగయ్యంగారి యభిప్రాయము.

Sreeman Kasturi Ranga Iyangar, Editor, the " Hindu " Madras:-

" The best example of a purely popular movement for the organisation of free public Libraries in this country is afforded by the efforts made by the Andhra Desa Library Association. The originators of this truly patriotic movement and those who are engaged in carrying it on progressive lines deserve to be congratulated on the excellence of their aims and spirit and on the success which has so far attended their labours. "

Dr. B. Pattabhiseetaramayya, B. A., M. B. & C. M., now President of The Andhra Provincial Congress Committee, wrote thus of the movement:-

"Well may we repeat........the ejaculations of Robert Low in the sixties of last century and say, 'educate our masters,' aye, that is the duty, paradoxical as it

may seem, that lies before every individul who has had the privilege of education and enlightenment for himself. ........Unto this end, what better agency, what more potent instrument can we devise than the village library with its annexe—the reading room, its night school, its coo-perative bank, and its arbitration court.........There is little doubt, that the library movement in the Andhra Desa which has had a most natural, healthy and spontaneous growth in the villages is calculated to help in the maintenance of the age long communlal life and consciousness and revivifynational ideals. Under its fostering care, the sister graces of education, sanitation, and co-operation in particular, are destined to receive an added impetus and an ever-increasing stimulus to orderly, well-balanced and many-sided progress leading to the enlightenment, prosperity and happiness of the Indian Nation."

బెంగాల్ లైబ్రరి అసోసియేషను కార్యదర్శి శ్రీ టి. సి. దత్తాగారు ఆంధ్ర దేశ గ్రంథాలయోద్యమమును గూర్చి బహు ప్రశంసించిరి.

### బెజవాడ ప్రశంస

ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమమునకు కేంద్రస్థానము బెజవాడ. బెజవాడనుంచియే పైన తెలిపిన ఆంధ్ర దేశ గ్రంథాలయోద్యమ వ్యాప్తి జరిగినది. గాన బెజవాడ ఈ యుద్యమమునకు ప్రాముఖ్యము వహించినది. బెజవాడ శ్రీ రామమోహన గ్రంథాలయ నిర్మాణ ఫలితముగనే, ఆంధ్ర గ్రంథాలయోద్యమమును నడుపుటకు బెజవాడ నాయకులు సూరి వేంకటనరసింహ శాస్త్రి, అయ్యంకి వేంకట రమణయ్యగార్లు పూనుకొనిరి. ఈనాడు బెజవాడలో మొత్తం 21 గ్రంథాలయములు గలవు. ఇందు 18 గ్రంథాలయములకు స్వంత భవనములు గలవు. ఇన్ని గ్రంథాలయములు ఆంధ్రజిల్లాలలో ఏ పట్టణమునను లేవు. దీనినిబట్టి కూడ గ్రంథాలయోద్యమమునకు బెజవాడ కేంద్రస్థానమని చెప్పవచ్చును.

### ఇంతవరకు జరిగిన పని

1914 సం॥ రము నుంచి నేటివరకు జరిగిన ఈ ఉద్యమ ప్రచార మంతయు నాయకుల పట్టుదలచే ప్రజల సహకారముచే జరిగినది. కాని ప్రభుత్వ సహాయ మెంతమాత్రములేదు. ప్రభుత్వము చేబట్టి నడుపవలసిన ఈ ఉద్యమమును, ఉత్సాహాభిమానులైన నాయకులు చేబట్టి ప్రజల చేయూతతో, ఉదారుల ధన సహకారముచే ఉద్యమము చల్లారిపోకుండ ఇంతకాలము నడపినారన్న వారి శక్తి సామర్థ్యములను గమనించదగును. ఈ ఉద్యమమున ఈనాడు వివిధ జిల్లాలలో అనేకమంది యువకులు పని చేయుచున్నారు. ఇదివర కనేకమంది పనిచేసినారు. ఇందు పని చేయు ప్రచారకులందరు చేతిడబ్బుతో తిరుగువారే గాని జీతాలు పుచ్చుకొని పనిచేయువారు లేరు. అనేకమంది ఈ యుద్యమమున విశేష కృషి సలిపినవారు కలరు. వారందరి పేర్లిచ్చుట లిఖించుట కష్టసాధ్యము. ప్రతిఫలము కోరని సేవకుల కృషి ఫలితమువల్లనే 30 సంవత్సరముల కాలమునుంచి ఈ ఉద్యమము నడచుచున్నది. ఇందులకు తోడ్పడిన, తోడ్పడుచున్న ప్రజలకు, ధనవంతులకు, సేవకులకు దేశము కృతజ్ఞత చూపవలెను. ఈనాడిట్టి ఉద్యమము లన్నియు ప్రజల సహకారము మీదనే ఆధారపడి యున్నవి. ప్రభుత్వదృష్టి ఎట్లున్నను ప్రజలీయుద్యమ

గొప్పను గ్రహించి ఉద్యమాభిమానులకు, ప్రచారకులకు, గ్రంథాలయముల వారికి, గ్రంథాలయ సంఘములకు తోడ్పడి. వయోజన విద్యావ్యాప్తికి నిరక్షరత్వ నిర్మూలనమునకు తోడ్పడవలెను. మన నాయకులు జాగ్రత్తగ పెంచి పోషించిన ఈఉద్యమమను వృక్షమును ఈనాటి గ్రంథాలయ సేవకులందరు ఏక మనస్కులై బాగుగ పెంచి పుష్పించి కాయలు పండ్లు లభించునట్లు చేయ ప్రార్థించుచున్నాను.

## ముగింపు

ఇంతవరకు ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమ చరిత్రను సంక్షిప్తముగ వివరించితిని. త్వరలో ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమ సమగ్ర చరిత్ర గ్రంథరూపమున ప్రకటించు యత్నములు జరుగుచున్నవి. ఉద్యమ మేమున్నదని కొందరు పైవారు చప్పరించవచ్చును. ఈ రంగమునదిగి పనిచేయు వారికి ఇందలి కష్టసుఖములు తెలియును. ప్రభుత్వ సహకారము లేని స్థితిలో ఇంతకాలము ఈ ఉద్యమమును నడుపుటే గొప్పతనము. ఇందు పనిచేసిన చేయుచున్న వారందరు స్వార్థత్యాగులని పైన మనవి చేసియున్నాను.

ఇందు పాల్గొన్నవారు భిన్న భిన్న ప్రకృతులు గలవారయ్యు, ఉద్యమ తత్త్వమును గ్రహించి ఏకమై పని చేసిరి. చేయుచున్నారు. ఇంకను చేయగలరు. ఇప్పటికి ఆంధ్రదేశమే గ్రంథాలయోద్యమమున [ఇండియాలో] ప్రధానస్థాన మాక్రమించి యున్నది.

అనేకమంది యువక నాయకులుత్పన్నమై తీవ్రకృషి చేయుచున్న ఈ రోజులలో అందరు ఏక దృష్టితో, పరస్పరస్పర్ధలు, అంతఃకలహములు, అహంకారములు విడనాడి అందరినీ గౌరవించుచు పరస్పర సహకారములతో ఉద్యమమును ద్విగుణీకృతముగ నడపి, ఆంధ్ర గ్రంథాలయోద్యమము తారామండలమునకు గొంపోయి భారతావని కెల్ల ప్రధానస్థాన మాక్రమించునట్లు కృషి చేయ ఉద్యమమున పని చేయుచున్నవారందరిని సవినయముగ ప్రార్థించుచున్నాను.

1944 సం॥ రము లో సింగరేణిలో జరిగిన గ్రంథాలయ మహాసభ నాటినుంచి తెలంగాణా ప్రాంతముతో ఆంధ్ర గ్రంథాలయోద్యమమునకు ఎక్కువ సంబంధ మేర్పడినది. తర్వాత 1946 మార్చిలో క్యాతూరులోనూ, తిరిగి 1950 ఏప్రిల్ లో సూర్యాపేటలోను ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభలు జరుగుటతో తెలంగాణములో గ్రంథాలయోద్యమముయొక్క వ్యాప్తి హెచ్చినది. ఈనాడు తెలంగాణము కూడ స్వతంత్రమును పొంది ప్రజా ప్రతినిధుల పరిపాలనలోనికి వచ్చినది. వయోజనవిద్యా వ్యాప్తికి, నైజాం రాష్ట్రంలో కృషి బాగా జరుగుచున్నది. ఆంధ్ర భాషాభివృద్ధికి నైజాంరాష్ట్ర ఆంధ్ర సారస్వత పరిషత్తువారు చేయుచున్న కృషి ప్రశంసనీయముగ నున్నది. ఆంధ్ర సారస్వత పరిషత్తు నైజాం రాష్ట్రములో శాఖోప శాఖలను నెలకొల్పి వేలకొలది విద్యార్థులను పరీక్షలలో తయారు చేయుచున్నది. వయోజన విద్యావ్యాప్తికికూడ నిజాం ఆంధ్ర సారస్వత పరిషత్తు పని చేయుచున్నది.

## గ్రంథాలయ శాసనము

చిరకాలమునుంచి గ్రంథాలయోద్యమాభిమానులు చేయుచున్న, చేసిన తీవ్రకృషి ఫలితముగా చెన్నపురి ప్రభుత్వమువారు గ్రంథాలయ శాసనమును చేసి అమలులోనికి తెచ్చినారు. ఇప్పుడిప్పుడే నూతన శాసనరీత్యా జిల్లా, రాష్ట్ర సంఘ

ములుఏర్పడుచున్నవి. ఈనాటిశాసనము పరిపూర్ణమైనది కాకపోయినను, గ్రంథాలయ శాసనము కూడ ఏర్పడి నందులకు సంతోషించ దగును. ఈశాసనము ఎట్లు ఉద్యమాభివృద్ధికి తోడ్పడునో ఇప్పుడు చెప్పుట సాధ్యము కాదు.

కొంత ఓపికపట్టి చూడవలెను.

మొత్తముమీద 1914 లో కొందరితో ప్రారంభమైన ఈ ఉద్యమము దినదినాభివృద్ధి గాంచి, 1950 నాటికి ప్రభుత్వ దృష్టిలోనికి వచ్చి శాసన రూపములోనికి వచ్చినది. అనుభవము మీద ఈ శాసనమును సవరించుకొని, అభ్యుదయ భావముతో గ్రంథాలయోద్యమమును ఇంకను ద్విగుణీకృతముగ నడుపుటకు గ్రంథాలయోద్యమాభిమానులు కృషిచేయవలసి యున్నది. ఈ ఉద్యమము అభివృద్ధి కావలెనన్న ప్రభుత్వము వారు ఈ ఉద్యమమున కృషి చేయుచున్న బయటవారి సహాయసలహాలను తీసుకొనుటావశ్యకమని మనవి చేయుచూ విరమించు చున్నాను.

అనుబంధము ౧

ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభల వివరములు.

వరుససంఖ్య స్థలము సంవత్సరము అధ్యక్షునిపేరు

1 . బెజవాడ —1914 ఏప్రిల్ శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహంపంతులుగారు.

2 . రాజమండ్రి—1915 ఏప్రిల్ శ్రీ పానుగంటి రామారాయణంగారు ఎం. ఏ. (పానుగలురాజా)

3 . నెల్లూరు —1916 ఏప్రిల్ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు.

4 . బారువ — 1917 అన్నెం పరుశురామ (గంజాంజిల్లా) పాత్రోగారు, బి. ఏ, బి. యల్,

5 . విశాఖపట్టణము– 1918 జూన్ 22 శ్రీ రాజా కొచ్చెర్లకోట వెంకటకృష్ణారావుగారు.

6 . చెన్నపురి 1919 నవంబరు 16 శ్రీమూరి వేంకట నరసింహశాస్త్రిగారు బి. ఏ,

7 . మహానంది 1920 మే 18 శ్రీ చిలుకూరు వీర (కర్నూలుజిల్లా) భద్రరావు పంతులుగారు.

8 . పమిడిపాడు 1923 మే 1, 2, 3 తేదీలు శ్రీ (గుంటూరుజిల్లా) దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు ఎం. ఏ.

9 . బందరు 1925 శ్రీ గద్దె రంగయ్యానాయుడు గారు

10. పెదచెరుకూరు 1926 శ్రీ వేమవరపు రామ (గుంటూరుజిల్లా) దాసుపంతులుగారు బి. ఏ., బి. ఎల్. వకీలు

11. ఏలూరు 1926 నవంబరు 30 శ్రీ నాళము కృష్ణారావుగారు.

12. అనంతపురం 1927 శ్రీమాన్ రాళ్లపల్లి అనంత కృష్ణశర్మగారు.

13. గుంటూరు 1928 జూలై 28 శ్రీ చెన్నాప్రగడ భానుమూర్తిగారు బి.ఏ., యల్. టి.

14. గుంటూరు 1931 శ్రీ బుర్రా శేషగిరిరావు పంతులుగారు ఎం. ఏ.

15. బెజవాడ 1933 ఆగస్టు 10 శ్రీ భూపతిరాజు సీతారామరాజుగారు (బారిష్టరు)

16. బెజవాడ 1933 ఆగస్టు 11, 12 శ్రీ చట్టి (రజతోత్సవసభ) నరసింహారావుగారు

17. కాకినాడ 1934 జనవరి 21, 22 శ్రీ వేమవరపు రామదాసుపంతులుగారు బి. ఏ., బి. ఎల్

18. కాకినాడ 1934 శ్రీమతి బొడ్డపాటి సీతా (1 వ సేవకమహాసభ) బాయమ్మగారు.

19. చెన్నపురి 1934 డిశంబరు 24, 25 శ్రీ దాసు త్రివిక్రమరావుగారు.

20. విశాఖపట్నం 1935 నవంబరు 25 శ్రీ శరణు (2 వ సేవక మహాసభ) రామస్వామిచౌదరిగారు.
21. బెజవాడ 1937 అక్టోబరు 26 శ్రీ వావిళ్ల వెంకటేశ్వరశాస్త్రిగారు.
22. రాజమండ్రి 1941 జనవరి 15 శ్రీ పండిత మారేపల్లిరామచంద్రశాస్త్రి (కవి) గారు.
23. చెన్నపురితాంబరంలో 1941 డిశంబరు25,26 (3 సేవక మహాసభ) శ్రీమాగంటిబాపినీడుగారు.
24. పెదపాలెం 1942 మే 27, 28 శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారు. బి. ఏ., బి. ఎల్.
25. గుంటూరు 1942 డిశంబరు 13 శ్రీ బెజవాడ (4 వ సేవకమహాసభ) రామచంద్రారెడ్డిగారు బి. ఏ. సి. బి. యి.
26. హిందూపురం 1942 డిశంబరు 29 30 31 శ్రీ యం. లక్ష్మీనారాయణరావుగారు, ఎం. ఏ., ఎల్. టి.
27. సింగరేణి కాలరీస్ (నైజామ్) 1944 ఆగస్టు 24 25 26 శ్రీ బూర్గుల రామకృష్ణారావు గారు, బి. ఏ., ఎల్. ఎల్.బి.
28. బెజవాడ 1914 డిశంబరు 11 12 శ్రీ మారే (5 వ సేవక మహాసభ) పల్లి రామచంద్ర కవిగారు.
29. ఏలూరు 1945 డిశంబరు 27 28 శ్రీ కొద్దం (6 వ సేవక మహాసభ) రాజారావుగారు బి. ఏ., బి. ఎల్.
30. క్యాతూరు 1946 మార్చి 1 2 3 శ్రీరాజా (తెలంగాణం)బహదూరు వెంకటా్రమారెడ్డిగారు,
31. అనకాపల్లి 1947 మే 22 శ్రీ మంగిపూడి [7 వ సేవక మహాసభ] కామయ్యపంతులుగారు.
32. సూర్యాపేట 1950 ఏప్రిల్ 7 8 9 ఆచార్య [తెలంగాణము] శ్రీ ప్రతాపగిరి రామమూర్తి గారు.

## అనుబంధము ౨

ఆంధ్రగ్రంథాలయోద్యమ నాయకులచే నిర్వహింపబడి జరిగిన అఖిలభారత గ్రంథాలయ మహాసభలు.

1. చెన్నపురి—1919 శ్రీ జె. కుడల్‌కారుగారు.
2. కాకినాడ—1923 శ్రీ యం. ఆర్. జయకరు గారు.
3. బెల్గాం —1924 శ్రీ దేశబంధుచిత్తరంజన్ దాసుగారు.
4. లాహోరు—19 శ్రీ ఆచార్య ప్రపుల్లచంద్ర రాయిగారు.
5. చెన్నపురి—1927 శ్రీ డా॥ ప్రమథనాథ బెనర్జి గారు.
6. కలకత్తా—1928 శ్రీ సర్. సర్వేపల్లి రాధాకృష్ణయ్యగారు.
7. బెజవాడ—1933 శ్రీ వంగల శివరాంగారు.
8. చెన్నపురి—1934 డిశంబరు శ్రీ కుమార మణీంద్రదేవుగారు.